అనువాద వాఙ్మయం—38
సాహిత్యం

# భారతీయ సాహిత్య సంకలనం



సంపాదకత్వం

శ్రీ కె. సంతానం

అధ్యక్షుడు, గాంధీ శతజయంత్యుత్సవ
జాతీయ సమైక్యోప సంఘం.

తెలుగు అనువాద పరిష్కర్త

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం.







తెలుగు అకాడమి
హైదరాబాదు
1979

# పరిస్తావన

కళాశాల స్థాయిలో పఠన పాఠన గ్రంథాలే కాక, వివిధ శాస్త్రవిషయాలకు సంబంధించి ప్రామాణికమైన అనువాదాలు, నిఘంటువులు, పదకోశాలు, జనరంజకగ్రంథావళి, మోనోగ్రాఫులు, బులెటిన్లూకూడా తెలుగు అకాడమీ వెలువరించ తలపెట్టి, తెలుగు భాషా సాహిత్యాల వికాసంకోసం కృషి చేస్తున్నది. ఈ సందర్భంగా తెలుగు భాషా సారస్వతాలకు సంబంధించి ఛందః పదకోశం, సాహిత్య పదకోశం, వ్యాకరణ పదకోశాలు ప్రచురించడం జరిగింది. మహాభాష్యం, వాక్యపదీయాల ప్రచురణ జరుగుతున్నది.

గాంధీ మహాత్ముని శతజయంత్యుత్సవం పురస్కరించుకొని గాంధీశాంతి ప్రతిష్ఠాపనకేంద్రంవారు, భారతీయ విద్యాభవన్ వారు సంయుక్తంగా వెలువరించిన భారతీయ సాహిత్యసంకలనాన్ని ఇప్పుడు వెలువరించడానికి అకాడమీ చాలా ఆనందిస్తున్నది. భారత దేశంలో విలసిల్లిన, విలసిల్లుతున్న అతి ప్రాచీనమైనభాష సంస్కృతంతో ప్రారంభించి, అత్యంతాధునికంగా నెలకొన్న ఇంగ్లీషుతోసహా, భాషా సారస్వతాలలో అత్యంత ప్రాధాన్యం వహించిన మరి పధ్నాలుగు భాషల పుట్టు పూర్వోత్తరాలు, సాహిత్యరీతులు, సమీక్షాత్మకంగా ఈ సంకలనంలో ఉన్నాయి. ఇంతేకాకుండా ఆయా భాషా సాహిత్యాల యుగయుగాల ప్రశస్త రచనలుకూడా కొన్ని మచ్చుకు ఏర్చి కూర్చి, చారిత్రక సమీక్షల అనుబంధంగా ఇవ్వడం జరిగింది.

భారత దేశ సమైక్య సంస్కృతియే గాంధీ మహాత్ముని ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా ఆయన భావించేవారు. ఆయన శతజయంత్యుత్సవ నిర్వాహక సంఘంవారు, భారత దేశంలోని విభిన్న ప్రాంతాల విభిన్న భాషాసాహిత్యాల తీరుతెన్నులను ఒకచోట దర్శింపచేసే కార్యక్రమం చేపట్టడం చాలా శ్లాఘనీయం. మొదట ఈ సంకలన గ్రంథం ఇంగ్లీషులోను, హిందీలోను ప్రచురించి అటుతరవాత ప్రాంతీయ భాషలన్నిటిలోనూ ప్రచురించాలని ఉత్సవ సంఘం వారు నిర్ణయించారు. ఆ నిర్ణయంమేరకు తెలుగు అకాడమీ వారిని శతజయంత్యుత్సవ నిర్వాహక సంఘంవారు తెలుగు అనువాదం ప్రచురించ వలసిందిగా కోరారు. తెలుగు అకాడమీ ఇందుకు ఆమోదించి ఆయా భాషాసాహిత్య విభాగాలను, సమర్థులైన విద్వాంసులచే అనువదింపజేసి గ్రంథరూపంగా ప్రకటించడం జరిగింది. ఈ గ్రంథానికి పరిష్కర్తలుగా ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు అనువాదకులకు తగిన సూచనలిచ్చి గ్రంథ ప్రచురణను నిర్దుష్టమొనర్చినారు. వారికి మాకృతజ్ఞతలు.

అనివార్యంగా ఏవైనాలోపాలు దొర్లివుంటే మలి ముద్రణంలో వాటిని సవరించ గలమని మనవి చేస్తున్నాము. సహృదయులు అటువంటి లోపాలను మాదృష్టికి తీసుకొని రావలసిందిగా ప్రార్థిస్తున్నాము.

# ఉపోద్ఘాతం

నానాత్వంలో ఏకత్వమే భారతప్రజల చరిత్ర, సంస్కృతి, నాగరకతల అంత స్సూత్రం అని పదేపదే భావించడం చూస్తూఉన్నాం. జవహర్‌లాల్ నెహ్రూ తన భారత దర్శనంలో ఈ విషయాన్ని నొక్కిచెప్పాడు. ఆయన భారత దర్శనంలో (పు. 53, 57, పునర్ముద్రణం 1946) అంటాడు. ''బాహిరంగా చూస్తే భిన్నత్వం కనపడుతుంది. ప్రజా జీవనంలో అనంతమైన వైవిధ్యం కనబడుతుంది. అయినా అత్యంత దృఢమైన ఏకత్వం కూడా కనబడుతుంది అంతటా. ఏ రకమైన రాచరికపు వ్యవస్థను, దురదృష్టకర సన్నివేశాలను మనం అనుభవించవలసి వచ్చినా యుగయుగాల గతమంతా ఈ ఏకత్వమే మనను కలిపివుంచింది. భారతదేశపు ఏకత్వమనేది మేధాజనితమైన ఊహ మాత్రమే అనుకోవడం పొరబాటు. నా విషయంలో ఈ ఊహ భావోద్విగ్నతను కలిగించే గొప్ప అనుభూతి. ఈ భావన నన్ను పూర్తిగా పరవశుణ్ణి చేస్తుంది. తరతరాలుగా కలిపివుంచిన ఈ ఆవశ్యకమైన ఏకత్వం ఎంత దృఢంగా కొనసాగుతున్నదంటే రాజకీయమైన విభజనకాని, ఏ రకమైన విపత్తులు, ఆపదలుకాని దానిని విచ్ఛిన్నం చేయలేనంత దృఢంగా వుంది.''

''భారతదేశంలోనే పుట్టి విస్తరిల్లిన మతానికికాక వేరే మతానికి చెందినవారు కూడా ఇక్కడకు వచ్చి స్థిరపడిన తర్వాత కొన్ని తరాలలోనే స్పష్టమైన ముద్రతో భారతీయులే అయిపోతారు. క్రైస్తవులు, యూదులు, పార్శీలు, ముస్లిములు ఇందుకు నిదర్శనం. భారతీయ క్రైస్తవుడెవరైనా భారతీయుడుగానే పరిగణనం పొందుతాడు ఏదేశమేగినా. ఇదే విధంగాటర్కీలోకాని, అరేబియాలోకాని, లేదా ఇరాన్‌లోకాని ఆ మాటకువస్తే మరి ఏ ఇతర ఇస్లామ్ మతపాలిత రాజ్యాలలో వేటిలోకాని భారతీయ ముస్లిం భారతీయుడుగా మాత్రమే పరిగణనం పొందుతాడు.

గడచిన ఐదువేల సంవత్సరాలలోను విభిన్న జాతులకు చెందినవారు, విభిన్న భౌగోళిక ప్రాంతీయ సమూహాలవారు భారతదేశంలోకి తండోపతండాలుగా చొచ్చుకొని వచ్చి భారతదేశాన్ని తమ నివాసభూమిగా, అటుతరవాత మాతృభూమిగా చేసుకొన్నారు. అయితే ఏం అమెరికా సంయుక్త రాష్ట్రాలలో మాదిరిగా ఇప్పుడు భారతదేశంలో జాతిసమస్యలు లేనేలేవు. లక్షలాది ప్రజలు వేరువేరు విశ్వాసాలకు కట్టుబడివున్నా, విభిన్నమైన నమ్మకాలనే వ్యక్తం చేస్తున్నా, తరతరాలుగా సహజీవనం చేస్తూనేవున్నారు. అయినప్పటికీ మతపరమైన హింసాపరత్వం, బహిష్కరణలు, దహనకాండలు భారతచరిత్రలో సంభవించిన దాఖలాలు లేవు. అన్ని విశ్వాసాలు, నమ్మకాలుకూడా ప్రకృతి సంకేతాలను, నదులు, విగ్రహాలు, ప్రతీకలు పూజించే సంప్రదాయం మొదలుకొని నిరంజనుడు, నిర్గుణుడు, విశ్వాతీతుడు అయిన ఒక మహత్వ పరిపూర్ణ వ్యక్తిత్వపు ఆరాధనవరకు, ఏకాండి శిలవంటి భారతదేశ

సాంఘిక మతస్వరూపంలో అంతర్భూతంగా చోటుచేసుకున్నాయి. దీనినే నేడు హిందూత్వ మంటున్నాము. సంప్రదాయిక కర్మకాండకు సంబంధించిందిగా, స్థిరమైన విశ్వాసం, సిద్ధాంతపరమైన మతదృష్టితో కూడుకొని ఉన్నదిగా భావించడంకన్నా హిందూత్వ మనేదాన్ని ఆధ్యాత్మిక సాంస్కృతిక సంప్రదాయ స్వరూపంగా భావించడం సముచితం. హిందూత్వ ప్రాతిపదిక సిద్ధాంతాలు, దాని మూలాలు ఆధ్యాత్మికమైనవి, విశాల దృక్పథం కలవి అనేది స్పష్టం. అగ్నిదేవుడికి అర్పించే హోమాలు, బలులు క్రమంగా అడుగంటి వేదకాలంలో హిందువులు పూజించిన దేవతలందరి స్థానంలో పురాణ దేవతల పూజ ప్రారంభమైంది. అటు తరవాత అదే కొనసాగుతూ వచ్చింది. ఈ విధమైన తీవ్రమైన మార్పులకు గురిఅయినా హిందూత్వం ఇంకా సుప్రతిష్ఠితమై కొనసాగుతూనే వున్నది. ఎన్నెన్నో తాత్త్విక చింతనలు, ఆలోచనా వ్యవస్థలూ భారతదేశంలో ప్రభవించి కాలూని వికసించినవి. ఏకేశ్వరారాధన, బహుదేవతారాధన, అద్వైత దృక్పథం మొదలుకొని చార్వాకుల కేవల ఐహిక భోగాభినివేశం వరకు, భారతదేశంలో పుట్టి పెరిగి అభివృద్ధిని సాధించాయి. కాని ఆధ్యాత్మిక విద్యకు సంబంధించిన పంచవిధ యోగవ్యవస్థ ఆత్మోన్నతిని సాధించే సాధనంగా అందరూ అంగీకరించారు.

ఈ విధమైన భిన్నత్వంలో స్థూలమైన అంతస్సూత్రితమైన ఏకత్వం, భారతీయ సర్వసంస్కృతిలోను నాగరకతలోను దర్శించవచ్చు. ఈ ఏకత్వానుభూతి వల్లనే భారతదేశంలోని ఇన్నిరకాల వైవిధ్యాల మధ్య, భారతదేశపు ఆత్మస్వరూపము ఒకటిగానే భారతీయులు భావించడం జరుగుతున్నది. విశాలమైనా విభిన్నమైనా భారతదేశపు ఉనికికి అంతస్సూత్రం ఏకత్వమనే విదేశీయ పరిశీలకులుగూడా ఇందువల్లనే భావించడం జరుగుతున్నది.

రాజకీయంగాను, పాలనాపరంగాను భారతదేశం అదృష్ట దురదృష్టాల ఆటుపోటుల కెన్నిటికో గురిఅయింది. కాని క్రీస్తుకు పూర్వం అశోకుడుకాని, క్రీస్తు తర్వాత గుప్తరాజులు కాని, మధ్యయుగాలలో అక్బరు రాజ్యపాలనా కాలంలోగాని ఆధునిక కాలంలో బ్రిటిషు వారుకాని, పాలనాపరంగా రాజకీయంగా సమస్త భారతదేశంలో, ఉపఖండంగాకూడా వ్యవహృతమయ్యే యీ దేశంలో సమైక్యతను చేకూర్చడానికి ప్రయత్నం చేశారు. అనేక సందర్భాలలో రాజకీకపు భవితవ్యం ఇటువైపుకు అటువైపుకు ఊగిసలాడినప్పటికీ సాంస్కృతిక ఏకత మాత్రం ఛిన్నభిన్నం కాలేదు.

సాహిత్యం, భాష అనేవి స్వచ్ఛందంగా ప్రజల ఆత్మాభివ్యక్తికి ప్రధాన సాధనాలనడంలో సందేహం లేదు. ఒక తరంనుంచి ఇంకొక తరానికి అవి సంస్కృతిని అందిస్తున్నాయి. ప్రసారం చేస్తున్నాయి. ప్రజల పురోభివృద్ధిలో భవితవ్య పథంలో ముందు ముందు తరాలవారికి అందించుకొంటూ పోయే దివిటీ యీ సంస్కృతి ప్రసారం.

ఇతర విషయాలన్నిటి మాదిరిగానే భారతదేశంలో భాషావైవిధ్యం వుంది. ఇందులో పదిహేను భాషలు గుర్తింపుపొంది భారత రాజ్యాంగంలో చేరినవి. అయితే ఈ వివిధభాషల విషయికంగా కూడా భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శిస్తాము. వస్తువులోను, ఆకృతిలోను, వ్యాకృతిలోను, శైలిలోను, చివరకు లిపి విషయికంగా కూడా కనిపించే భిన్నత్వమంతా

భారతదేశపు విభిన్న భాషాప్రయుక్త రాష్ట్రాల భాషా సాహిత్యాలలో కనబడుతూనే వుంది. అయితే సారభూతమైన భావైక్యత, వస్తు విన్యాసం మాత్రం కోలుపోవడం జరగలేదు.

భిన్నత్వంలో ఏకత్వం అనే ఈ సూక్తి అనేక కారణాలవల్ల కొంత వైషమ్య స్థితిగతులను కూడా ఎదుర్కొనవలసి వస్తున్నది. ఆలోచనాపరులైన, దేశభక్తి ప్రపూరితులైన భారతీయులంతా సమైక్యతా కేంద్రాభిముఖంగా, కేంద్రాపముఖంగా ప్రవర్తించే బలాలన్నిటినీ సంతులితం గావించాలనే ప్రయత్నం చేస్తూనేవచ్చారు. ఈ రకమైన విరుద్ధ శక్తులు సంకుచితమైన, స్థానికమైన ప్రయోజనాలకు వశులైపోయిన వాళ్ళవల్ల ఘర్షించడం జరుగుతుంది. ప్రజలు, ప్రభుత్వము కూడా మౌలికమైన ఈ ఐకమత్యాన్ని విచ్ఛినం కాకుండా చూసే ప్రయత్నం చేస్తూనేఉంటారు. ఈమధ్య స్వాతంత్ర్య భారతదేశంలో జాతీయ సమైక్య మహాసభలు జరిగాయి (1961, 62, 68 లలో). ఉన్నతస్థాయి సమైక్యతాసంఘంకూడా పనిచేస్తూనే ఉన్నది.

గాంధీ మహాత్ముని శతజయంతిని జరుపుకోవాలని నిశ్చయించి భారత రాష్ట్రపతి అధ్యక్షుడుగా ఒక జాతీయ సన్నాహక సంఘం ఏర్పాటు చేసినప్పుడు, శతజయంత్యుత్సవ వత్సర కాలంలో ఒక ఉపసంఘం రూపొంది జాతీయైక్యాన్ని గూర్చి ప్రత్యేకించి కృషిచేయాలని నిశ్చయించడం జరిగింది. ఈ ఉపసంఘంవారు తలపెట్టిన ముఖ్య కార్యక్రమాలలో ఒకటి స్థిరంగా పది కాలాలపాటు నిలిచిపోయే భారతీయ భాషాసాహిత్యాల సంకలనాన్ని ఒకదాన్ని ప్రచురించాలని సంకల్పించడం.

జాతీయ సమైక్య సంఘంవారు ఏర్పాటుచేసిన ఉపసంఘం వారి కృషివల్ల ఇప్పుడీ సంకలనం వెలువడుతున్నది. గాంధీ మహాత్ముని శతజయంతి సందర్భంగా జాతీయ సంఘం ఏర్పాటుచేసిన పన్నెండు ఉపసంఘాలలో ఈ కార్యక్రమాన్ని చేపట్టిన ఈ ఉపసంఘం కూడా ఒకటి.

ఈ భాషాసాహిత్య సంకలనాన్ని ఈ విధంగా రూపొందించి అందిస్తున్న ఈ ఉపసంఘం అధ్యక్షులైన శ్రీ కె. సంతానం, మద్రాసు గారిని నేను అభినందించాల్సి వుంది. ఇది ఎంతో ఉపయోగకరమైన గ్రంథం. ఈ గ్రంథం భారతీయాత్మను ఆవిష్కరిస్తున్నది. పరిణతి సాధించిన ఈ భాషలన్నీ తమ సాహిత్యంద్వారా భారతీయాత్మ స్వరూపాన్ని ఆవిష్కృతం చేస్తున్నాయి.

సంస్కృత భాషాసాహిత్యాలు అత్యంత ప్రాచీనమైన ఉజ్జ్వల చరిత్ర గలవి. ఇంచుమించుగా మూడు వేలనుంచి ఐదువేల సంవత్సరాల ప్రాచీనత ఈ సంస్కృతానికున్నది. సంస్కృతం తర్వాత ప్రాచీనమైనది తమిళం. తమిళంకూడా సంస్కృతంనుంచి అంతో ఇంతో స్వీకరించింది. దక్షిణ భారతదేశంలోని ఇతర భాషలు ద్రావిడభాషా కుటుంబానికి చెందినవి. 5వ శతాబ్ది కాలంనుంచీ కూడా ఈ భాషలలో సాహిత్యం ఉన్నది. అయితే ఈ భాషలుకూడా సంస్కృతంనుంచి వస్తువు, శైలి, పదజాలం చెప్పుకోదగినంతగా స్వీకరించాయి. భారతదేశంలోని ఇతర భాషలుకూడా సంస్కృతంనుంచి పుట్టినవే అనడంలో

సందేహం లేదు. కాని తర్వాత తర్వాత అవి తమ గొప్ప సాహిత్యాలను వికసింపచేసుకొని పరిపుష్టములైనవి. భారతీయ భాషలలో అనేక భాషలపై పర్షియన్, ఆరబిక్ భాషల ప్రభావంకూడా స్పష్టంగా కనపడుతుంది. తరవాత కాలంలో బ్రిటిషువారి పరిపాలనలో ఇంగ్లీషుభాషా సారస్వతాలు భారతీయ భాషలన్నిటినీ, వస్తువు, ఆకృతి, రెండింటి విషయికంగా కూడా ప్రభావితం చేశాయి.

భారతీయ భాషా సాహిత్యాల క్రమపరిణామ వికాసంలో అవి ప్రభావితమైన తీరు తెన్నుల్లో ఒక ఏకత కనపడుతుంది. అందువల్ల సంస్కృతంకాని, దాని జన్యభాషలు కాని, ఆరబిక్, పర్షియన్ భాషలుకాని, వాటి జన్యాలుకాని ఇంకా ఇంగ్లీషు, దాని సుసంపన్నమైన వైవిధ్య విలసితమైన సాహిత్యము. వివిధ శాఖలు, భారతీయ భాషలను ప్రభావితం చేయ డంలో ఒక ఏకత్వం కనపడుతూనే ఉంది.

భారత జాతీయ భాషల సంకలనం ఇటువంటిది కూర్చి వెలువరించడమనేది నిస్సందేహంగా ఘనమైన ప్రయత్నం. బహుశా గుర్తింపుపొందిన భారతీయ భాషల భావ సంపన్నతకు ప్రాతినిధ్యం వహించగల సంకలనం వెలువరించడం ఇదే ప్రథమ ప్రయత్నం కావచ్చు. కాబట్టి ఈ ప్రయత్నంలో తొందరవల్ల కలిగే పొరపాట్లు కొన్ని చోటుచేసుకొని ఉండవచ్చు. పాఠకులు, విమర్శకులు ఉదారంగా ఇందులోని తప్పులు మన్నించి, ముందు ముందు నిర్దుష్టంగా ఇటువంటి ప్రయత్నాలు చేయగలందులకు కావలసిన ప్రోత్సాహాన్ని కలగ జేయగలరని కోరుతున్నాము. గాంధీజీ శతజయంత్యుత్సవ సందర్భంగా, భారతదేశ సమైక్యాన్ని ఆయన ప్రాణానిలంగా భావించేవాడు కాబట్టి—ప్రథమ ప్రయత్నంగా ఈ గ్రంథం మెప్పు సంపాదించవచ్చు. తరవాత ముద్రణలలో మరింత మెరుగులుదిద్దే యత్నానికి సలహా లందించ వలసిందిగా అర్థిస్తున్నాము.

ఈ సంపుటం వెలువరించే ప్రణాళిక చాలా సరళంగా రూపకల్పనం చేశాము. ఒక్కొక్క భాషా సాహిత్య సంక్షిప్త సమీక్షితోపాటుగా, ప్రతి భాషాసాహిత్యానికి ప్రాతి నిధ్యం వహించే కొన్ని పద్య గద్యరచనలు ఎంచుకొని వాటి ఆంగ్లానువాదాలు ఇవ్వడం జరిగింది. ఈ గ్రంథానికి హిందీ అనువాదం అత్యంతావశ్యకమని మాకు తెలుసు. తరవాత వివిధ భాషల్లోకూడా ఈ గ్రంథం వెలువడవలసిన అగత్యముంది. అయితే ఈ ఉపసంఘం వారే అందుకు పూనుకోగల అవకాశం లేదనడం విస్పష్టమే. జాతీయ సంఘం ఎంతకాలం పనిచేస్తుందో అంతవరకే ఉపసంఘపు అస్తిత్వం వుంటుంది. దానితోపాటే ఇదీ అంతర్హిత మవుతుంది. విత్తనం నాటడం అయింది. అది సారవంతమైన భూమిలోనే పడిందని ఆశించవచ్చు.

న్యూఢిల్లీ, ఆర్. ఆర్. దివాకర్

అక్టోబర్ 2, 1969.

# పరివేశిక

1967 మార్చి 24వ తేదీన గాంధీ మహాత్ముని శతజయంత్యుత్సవ సన్నాహక జాతీయ సమైక్యతా సంఘం వారేర్పాటుచేసిన ఉపసంఘంవారి సమావేశంలో ఈ తీర్మానం ఆమోదించడం జరిగింది.

''సంఘాధ్యక్షులు ప్రతిపాదించిన భారతీయ సాహిత్య సంకలన గ్రంథ ప్రచురణను ఉపసంఘం వారు అంగీకరించారు. వెంటనే ఈ సంకలనాన్ని ఆంగ్లంలోను, హిందీలోను వెలువరించాలని, అటుతర్వాత దీని అనువాదం ఇతర భారతీయ భాషల్లోనూ వెలువరించే ఆలోచన చేయవచ్చుననీ నిశ్చయించడమైంది.''

గాంధీజీ శతజయంత్యుత్సవ జాతీయ సంఘపు కార్యదర్శి డా॥ ఆర్. ఆర్. దివాకర్ సూచన ననుసరించి ప్రతి భాషలోనుంచి ఎన్నికచేసిన రచనలతో పాటుగా చారిత్రక సమీక్షనుకూడా చేర్చాలని నిశ్చయించారు. దాని కనుగుణంగా ఈ సంపుటంలో 16 భాగాలున్నాయి. భారతదేశంలోని అత్యంత ప్రాచీనభాష అయిన సంస్కృతంతో ప్రారంభించి, ఇటీవల మనదిగా స్వీకరించిన అత్యంత నవీనమైన ఇంగ్లీషుభాషతో ఈ సంపుటం ముగుస్తున్నది. ఈ రెండింటిమధ్య అకారాది క్రమాన్ని అనుసరించి ఆయా భాషలనుగూర్చి పద్నాలుగు అధ్యాయాలు చేర్చడం జరిగింది. ప్రతి భాషాధ్యాయంలోను రెండు ఉపవిభాగాలున్నాయి. (1) చారిత్రక సమీక్ష (2) రచనలు.

మొదటి విభాగంలో సంగ్రహంగా ఆయా భాషా సాహిత్యాల వికాసాన్ని గూర్చిన చారిత్రక సమీక్ష ఉంటుంది. తొలినాళ్ళ నుంచి వర్తమానకాలం వరకు ఏ విధంగా ఆయా సాహిత్యం వర్ధిల్లుతూ వచ్చిందో ఈ భాగంలో సమీక్షితమవుతుంది. రెండో విభాగంలో ఆయా సాహిత్యం నుంచి ప్రాతినిధ్యం వహించ గల వనుకొన్న కొన్ని ఖండికలను, పద్య గద్య కృతుల రెండింటినుంచీ కూడా, ప్రాచీనా నవీన విభాగాల నుంచికూడా ఎన్నుకొని, వాటిని ఆంగ్లంలోకి అనువదింపజేసి అనుబంధంగా చేర్చడం జరిగింది

ఈ పనిని అప్పగించడానికి విద్వాంసులను ఎన్నిక చేయడంలో ప్రొఫెసర్ కె. స్వామినాథన్, డా॥ ఆర్. ఆర్. దివాకర్, డా॥ కె. ఎమ్. మున్షీ, ఇంకా ఇతరుల సలహాసంప్రదింపులను పాటించడం జరిగింది. కొన్ని భాషల విషయంలో విశ్వవిద్యాలయోపాధ్యక్షులు, అనువాదకుల ఎన్నికలో మాకు సాయపడ్డారు.

సాధారణంగా చారిత్రక సమీక్షను కూర్చిన రచయితే ఆ భాషకు సంబంధించిన ప్రాతినిధ్య గద్య పద్య రచనలను, ఎన్నికచేసి, ఆంగ్లానువాదాన్ని కూర్చడం జరిగింది. అయితే కొన్ని భాషల విషయంలో మేము ఎన్నిక చేసుకొన్న విద్వాంసులు తమ సహచరుల

సాహాయ్యం పొందినారు. సింధీ, భాషావిషయికంగా ప్రొ॥ మల్కానీ, ఒక జట్టును కూర్చుకొని వారి సహాయంతో ఆ పని నిర్వహించారు. ఈ విధంగా సహాయ సహకారాలందజేసిన విద్వాంసులందరి పేర్లు ఈ ప్రస్తావన తర్వాత పొందుపరచడం జరిగింది.

ప్రాథమిక హక్కులు, చట్టము, రక్షణ, సాంఘికన్యాయం, మొదలైన కొన్ని విషయాలలో జాతి, మతము, భాష, ప్రాంతము, మొదలైనవాటి ప్రసక్తి ఎంత మాత్రమూ లేకుండా అవి అందరికీ సమానంగా వర్తించాలనడం సర్వులూ అంగీకరించినదే. అదే విధంగానే భాషాక్షేత్రంలో, సంస్కృతి విషయాలలో, మతం. సంప్రదాయాల విషయికంగా జాతీయసమైక్యదృష్టిని పరస్పర సహనభావంతో అవగాహనతో గౌరవంతో సాధించుకోవలసి ఉంది అనడం సుస్పష్టం. సుసంపన్నమైన సంస్కృతికి, శతాబ్దాల నుంచి వస్తున్న ఆచార సంప్రదాయాలకు, భారతదేశ వివిధ భాషా సాహిత్యాలే ముఖ్యమైన ఆలంబనాలు, ఆధారాలు.

మహాపురుషులు, తత్త్వవేత్తలు, మహాకవులు, వివిధ భాషా సాహిత్యాల ద్వారా ప్రబోధించిన మహత్తరమైన విషయాలను అర్థం చేసుకొని ప్రతి భారతీయుడూ కూడా ఆనందించడమనేది తన విధ్యుక్త ధర్మమని అంగీకరించినప్పటికీ సాధారణంగా తన మాతృభాషా సాహిత్యాలకు సంబంధించీ, ఏ కొంచెమో సంస్కృత సాహిత్యానికి సంబంధించీ మాత్రమే అతడు తెలుసుకొంటాడు. ఈ తెలిసినది కూడా అతడివిషయంలోచాలా పరిమితమే. ఇంగ్లీషు సాహిత్యాన్ని గురించి, ఇంకా, ఒక్కొక్కప్పుడు యూరోపుదేశాల సాహిత్యం గూర్చి భారతీయులు ఇంగ్లీషు అనువాదాల ద్వారా తెలుసుకుంటున్నారు. కాని భారతీయభాషల గూర్చి ఈ అవకాశం కూడా లేదు. అందువల్ల ఈ రకమైన అజ్ఞానాన్ని, నిర్లక్ష్యవైఖరిని భారతీయులలో తొలగించకపోతే భారతదేశపు వివిధ ప్రాంతీయ భాషా సాంస్కృతిక విషయికమై ప్రజలలో భావసమైక్యాన్ని సాధించలేము.

భారతదేశానికి మూడువేల సంవత్సరాల పైబడిన చరిత్ర ఉన్నది. ఈ కాలవ్యవధిలో వివిధ ప్రాంతాలు తమ తమ భాషాసాహిత్యాలను సంప్రదాయాలను వికసింపచేసుకొన్నాయి. ప్రతి ప్రాంతం వారు కూడా ఈ వారసత్వ సంపదను అవినాశిగాను, అమూల్యమైనదిగానూ ఎంచుకొని, దానిని జాగ్రత్తగా పరిరక్షించుకుంటూ, వికసింపచేసుకోవాలనుకోవడం కూడా జరుగుతున్నది. ఈ భాషలనుకాని, ఆచారవ్యవహారాలను కాని చిన్న బుచ్చడం, తోసివేయడం, అనూహ్యం.

అందువల్ల జాతీయ సమైక్యమంటే భారతదేశంలోని ప్రతి ప్రాంతపు సుసంపన్నమైన వారసత్వాన్ని సహానుభూతితో అవగాహనచేసుకొని, ఆదరణపూర్వకంగా ప్రస్తుతించడమే నన్న మాట.

ఈ సంకలనం సంక్షేపంగానే అయినా సర్వతోముఖంగా తర తరాల భారతీయ భాషా సాహిత్యాల దర్శనం సాధిస్తున్నది. ఈ సంకలన గ్రంథాన్ని త్వరిత గతిని కూర్చవలసి రావడం, విద్వాంసులను తొందరపెట్టి రాయించడం జరిగినందున, ఎక్కడైనా లోపాలు దొర్లి ఉండవచ్చు. ఈ గ్రంథంలో దోషాలేమీలేవు అని చెప్పే అవకాశం లేదు. కొన్ని భాషలకు

చెందిన ఇంగ్లీషు అనువాదం మరికొన్నిటికన్నా మెరుగ్గా ఉండి ఉండవచ్చు. అత్యుత్తమాను వాదం కూడా మూలంలోని అందాన్ని అంతాను; జీవశక్తినంతాను తీసుకొని రాలేదు అని చెప్పవలసిన పని లేదు కదా.

ఈ రకమైన చిన్న చిన్న లోపాలున్నప్పటికీ కూడా ఈ సంకలనం భారతదేశం లోని వివిధ ప్రాంతాలను విడదీస్తున్న అజ్ఞాన, నిర్లక్ష్య అఘాతాన్ని కలిపి వేసే వారధిగా పని చేయగలదని సవినయంగా విన్నవిస్తున్నాము. ముందు ముందు ఇంతకన్నా సమగ్రమైన ఉత్తమమైన, సంకలనాలు, వెలువరించే విపుల యత్నాలు జరగగలవని ప్రగాఢంగా ఆశిస్తు న్నాము. ఈ లోపున జాతీయ సమైక్యాన్ని ఆకాంక్షించే వారంతా ఈ పథ నిర్దేశక ప్రయత్నా నికి స్వాగతం చెప్పగలరని ఆశిస్తున్నాను. ముందు ముందు భారతదేశంలో ప్రతి పట్టభద్రుడు కూడా, అతడు విద్యనేర్చుకొనే మాధ్యం ఏదైనా కానీ, ప్రముఖ భారతీయ భాషలలోని ఉద్గ్రం థాలు గూర్చి, గ్రంథకర్తలను గూర్చి, కనీస పరిజ్ఞానం సంపాదించుకోవాల్సిన ఆవశ్యకత అపరిహార్యమై తీరుతుందని, ఈ విషయం తప్పనిసరిగా అతడు భావిస్తాడనీ, ఆశిస్తున్నాను.

ఈ సంకలనంలో ఎక్కువ భాగం రచనలు పూర్వకావ్యాల నుంచి సేకరించడం జరిగింది. వీటికి కాపీరైటు (గ్రంథస్వామ్య హక్కు) ప్రసక్తి లేదు. అయితే ప్రతి భాషా విభా గంలోను ఆధునిక రచయితల రచనల నుంచి, కూడా కొన్నిటిని తీసుకొన్నాము. ఆయా రచ యితల నుంచి, ప్రచురణకర్తల నుంచి, ఆయా రచనలు ఈ గ్రంథంలో చేర్చుకోవడానికి లాంఛనంగానే అయినా అనుమతి పొంది ఉండవలసినది, అయితే అట్లాచేయడానికి మాకు తగి నంత వ్యవధి లేకపోయింది. అందరి వద్దనుంచి వారి వారి సమ్మతులు పొందటానికి చాలా సమయం పట్టవచ్చునను కొన్నాము. అట్లాచేయవలసి వచ్చినట్లైతే ప్రచురించ వలెననుకొన్న సమయానికి అంటే 1969 అక్టోబర్ 2, గాంధీజీ శత జయంతి నాటికి ఈ గ్రంథాన్ని వెలువ రించలేక పోయి ఉండేవాళ్ళము. ఈ గ్రంథంలో ఆయారచయితల రచనలు చేర్చడంలో ఉద్దేశం వారిని, వారి రచనలను జాతీయ, అంతర్జాతీయ పరిచితికి తీసుకొనిరావడమే. కాబట్టి ఆయా రచయితలు, ప్రచురణకర్తలు, మేమీ విధంగా వారి అనుమతిని పొందలేక పోవడాన్ని మన్నించ గలరని, ఈ గ్రంథంలో వారి రచనలుచేరి ఉండడాన్ని ఆమోదించ గలరని ఆశి స్తున్నాము.

శ్రమసాధ్యమైన ఈ ప్రయత్నంలో తమతో సహకరించిన విద్వాంసులందరి పట్ల ఉపసంఘం వారు ఎంతగానో కృతజ్ఞతాబద్ధులై ఉన్నారు. మేము వారికి టైపు ఖర్చులు, వ్రాత సాధనాలు అందజేసి నామ మాత్రపు ప్రతి ఫలాన్ని మాత్రమే ఇవ్వగలిగాము. ప్రధానంగా అందరూ కూడా మహాత్మ గాంధీ శత జయంతి సందర్భంగా ఆయన సంస్మరణోత్సవాలకు చేయూతనిస్తున్నామనే తలంపుతోనే ఇతోధికంగా శ్రమించారు.

మద్రాసు　　　　　　　　　　　　　　　　కె. సంతానం

అక్టోబర్ 2, 1969.

# రచయితలు

1. సంస్కృతం — డా॥ వి. రాఘవన్, ప్రొఫెసర్:
సంస్కృత శాఖ, మద్రాసు విశ్వవిద్యాలయం.

2. అస్సామీ — డా॥ మహేశ్వరనాగ్,
జవహర్లాల్ నెహ్రూ ప్రొఫెసర్, గౌహతీ విశ్వవిద్యాలయం.

3. బెంగాలీ — డా॥ ఆర్. కె. దాస్ గుప్తా,
నవీన భారతీయ భాషా విభాగాధ్యక్షులు, ఢిల్లీ విశ్వవిద్యాలయం.

4. గుజరాతీ — ప్రొ॥ చంద్రకాంత మెహతా, ప్రొఫెసర్,
గుజరాతీ శాఖాధ్యక్షులు, ఢిల్లీ విశ్వవిద్యాలయం.

5. హిందీ — డా॥ నగేంద్ర.
హిందీ శాఖాధ్యక్షులు, ఢిల్లీ విశ్వవిద్యాలయం.

6. కన్నడం — ప్రొ॥ ఆర్. ఎస్. ముగలి.
కన్నడ శాఖాధ్యక్షులు, బెంగుళూరు విశ్వవిద్యాలయం.
అను॥ సి: హెచ్. ప్రహ్లాదరావు

7. కాశ్మీరి — ప్రొ॥ జె. ఎల్. కౌల్, శ్రీనగర్.

8. మలయాళం — శ్రీ. కె. కె. నాయర్,
సంపాదకుడు ఇండియన్ అండ్ ఫారిన్ రెవ్యూ,
(చారిత్రక సమీక్ష).
ప్రొ॥ పి: కె. నారాయణ పిళ్ళై
మలయాళ శాఖాధ్యక్షులు, డీన్, ఫాకల్టీ ఆఫ్ ఓరియంటల్ స్టడీస్, త్రివేంద్రం.

9. మరాఠీ — డా॥ డి. వి. పట్వర్ధన్,
మరాఠీ శాఖాధ్యక్షులు, భవన్స్ ఎమ్. ఎమ్. కాలేజి ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్.

10. ఒరియా — ప్రొ॥ వేణుధరరౌత్.
ఒరియా శాఖాధ్యక్షులు, బి. జె. బి. కాలేజి, భువనేశ్వర్.

| | |
|---|---|
| **11.** పంజాబీ | శ్రీ కృపాల్ సింగ్ నారంగ్. |
| | పంజాబ్ విశ్వవిద్యాలయం-ఉపాధ్యక్షులు నియామకం చేసిన ఒక సంఘం, చారిత్రక సమీక్ష పరిచయం రాసిన వారు |
| | డా॥ దర్శన్ సింగ్ మైని, ప్రొఫెసర్, |
| | ఇంగ్లీషు శాఖాధ్యక్షులు, పంజాబ్ విశ్వవిద్యాలయం, పాటియాల, |
| **12.** సింధీ | శ్రీ ఎన్. ఆర్. మల్కాని. |
| | సర్వెంట్స్ ఆఫ్ ది పీపుల్ సొసైటీ, ఢిల్లీ. |
| **13.** తమిళం | వివిధ రచనల ఎన్నిక |
| | డా॥ టి. పి. మీనాక్షీ సుందరం. |
| | ఉపాధ్యక్షులు, మధురై విశ్వవిద్యాలయం, |
| | చారిత్రక సమీక్ష అనువాదం. |
| | శ్రీ ఆర్. రంగాచారి. |
| **14.** తెలుగు | డా॥ డి. వెంకటావధాని |
| | తెలుగు శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు. |
| **15.** ఉర్దూ | ప్రొ॥ జియా. యల్ హసన్ ఫరుఖి —ప్రిన్సిపాల్. |
| | జమియత్ కాలేజి. ఢిల్లీ. |
| **16.** ఇంగ్లీషు | ప్రొ॥ కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్ |
| | పూర్వోపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయం, |
| | వాల్టేర్. |

# విషయసూచిక



## తెలుగు అనువాదాలు

# సంస్కృతము

మూలం :
డా. వి. రాఘవన్

అనువాదం :
డా. పి. శ్రీరామచంద్రుడు
శ్రీ ఎన్. సి. ఎస్. వేంకటాచార్యులు

## చారిత్రకసమీక్ష

అతి విస్తృతం ఐన ఇండోయూరపియన్ భాషా కుటుంబానికి చెందిన భాషల్లో సంస్కృతభాష మిక్కిలి తూర్పునఉన్న భాష. తూర్పు ప్రాంతంలో దీనికి చాలా దగ్గరగా ఉన్న భాషాసోదరి ఇరానియన్ భాష. సంస్కృత భాష ఇండో యూరపియన్ భాషాకుటుంబానికి చెందిన ప్రాచీనరూపమునూ, వ్యాకరణమునూ, వాక్యనిర్మాణమునూ, వాఙ్మయమునూ, చాలా చక్కగా పరిరక్షించుకుంది. అందుచేతనే ఆధునిక యుగంలో తొలిసారిగా ఈ భాషను కనుగొన్న కొందరు పాశ్చాత్య విద్వాంసులు దీని సహాయంతో తులనాత్మక భాషాశాస్త్రము (Comparative philology) అనే కొత్త శాస్త్రానికి పునాదులు వేసుకొని ఇండో యూరపియన్ (లేదా ఇండో ఆర్యన్ లేదా ఇండో జర్మానిక్) భాషాకుటుంబం అనే భాషాకుటుంబం ఒకటి ఏర్పరుచుకోకలిగినారు. ఈ కారణంచేత సంస్కృతం ఈ భాషాకుటుంబంలో ప్రముఖ స్థానం ఆక్రమించుకున్నది. ఇంతే కాకుండా ఈ భాషా కుటుంబానికిచెందిన భాషల్లోకెల్లా అతిప్రాచీనమూ, బహువిస్తృతమూ అయిన వాఙ్మయం సంస్కృతభాషలో పరిరక్షితమై ఉంది. ఏశియా మైనర్ ప్రాంతంలో లభించిన పురావస్తు శాస్త్ర సాక్ష్యాధారంగా ఈవాఙ్మయం క్రీస్తుకుపూర్వం రెండవ సహస్రాబ్ది మధ్యభాగం కంటె పూర్వం ఉండేదని చెప్పడానికి వీలు ఉంది. ఖగోళశాస్త్రానికి సంబంధించిన కొన్ని ఆంతరంగిక ప్రమాణాలు పట్టి ఈ వాఙ్మయం లోని కొన్ని భాగాలు క్రీస్తుకు పూర్వం చతుర్థ సహస్రాబ్దికిచెంది ఉండాలని చెప్పడానికి కూడా అవకాశము కనిపిస్తూంది.

అతి ప్రాచీన కాలంనుంచి నేటివరకూ సంస్కృతభాషా మహానది అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తూ, దినదినాభివృద్ధి పొందుతూ యావద్భారతాన్నీ ప్రభావితం చేయడమే కాకుండా ఈ భరతఖండానికంతకీ ఒకవిధమైన ఐకమత్యం కూడా ప్రసాదిస్తూ వచ్చింది. సంస్కృత భాషలో ప్రప్రథమంగా వెలువడిన వాఙ్మయం వైదిక వాఙ్మయం. ఈ వాఙ్మయంలో సంస్కృతభాషకు సంబంధించిన ఎన్నో మాండలిక విభేదాలు మనకు గోచరిస్తాయి. వేదాల తరవాత క్రీస్తుకుపూర్వం ఎనిమిదో శతాబ్ది మొదలు నాలుగో శతాబ్దివరకూ గల కాలంలో బయలుదేరిన వాఙ్మయంలోనూ, ఇతిహాసాది వాఙ్మయంలోనూ, ఈ భాష క్రమక్రమంగా ఒక ప్రామాణిక రూపం సంతరించుకుంది. ఈ విధంగా ఒక నిశ్చితరూపం దాల్చడానికి ఎందరో

మహా వైయాకరణుల సహాయం ఈ భాషకు అనాది కాలంనుంచీ లభిస్తూనేవచ్చింది. ఈ వైయాకరణులు రచించిన వ్యాకరణాలన్నింటిలోకి పాణినీయ వ్యాకరణంసమగ్రత్వంలోనూ సంక్షిప్తత్వంలోనూ దానికదే సాటి అని చెప్పడంలో అతిశయోక్తిలేదు. ఈ విధంగా ఒక ప్రామాణిక రూపందాల్చిన సంస్కృత భాషలో ఎందరో మహాకవులు కావ్యాలు రచించినారు, రూపకాలు వెలయించినారు, ఎందరో వైజ్ఞానికులు విజ్ఞానశాస్త్ర గ్రంథరచన సాగించినారు. 'సంస్కృతము' అనే పేరులో రెండు అర్థాలు ఇమిడి ఉన్నాయి - 'సుసంస్కృతమై సుందరమైనది' అనేదిఒక అర్థం, 'సునిశ్చితమైన వ్యాకరణ ప్రక్రియచే నిర్దుష్టమైన రూపం కలది' అని రెండో అర్థం.

జనసామాన్యం మాటలాడే భాష మాత్రం వివిధ ప్రాంతాల్లో విభిన్న లక్షణాలు, సహజమైన స్వేచ్ఛకలిగి ఆయా భేదాలకు లోనవుతూ 'ప్రాకృతము' అనే పేరుతో బహుముఖంగా విస్తరిస్తూనే వచ్చింది. ఈ ప్రాకృత భాషలోని ఉప భాషలకు దిక్కులను పట్టి 'ప్రాచి' (తూర్పుది) మొదలగు పేర్లురాగా, ఆయా ప్రాంతాల్లోని జనులను పట్టి 'శౌరసేని' 'మహారాష్ట్రి' వంటి పేర్లు కలిగినాయి. సంస్కృత రూపకాల్లో విస్తృతంగా ఉపయోగించిన ప్రాకృతం శౌరసేని. మహారాష్ట్రికి గీతికావ్యాల్లో ఎక్కువగా ప్రవేశం లభించింది. 'మాగధి', 'అర్ధమాగధి' వంటి పేర్లు ఆయా ప్రాంతాలు ఆధారంగా చేసుకొని వచ్చినాయి. బౌద్ధ జైన మతప్రతిష్ఠాపకులు పై రెండు భాషల్లోనే గ్రంథాలు రచించి తమ మతప్రచారం సాగించినారు. ఏ భాష జీవితమైనా, సాధారణంగా, సామాన్యజనుల స్వతంత్రప్రయోగమూ, పండితుల నియమ నిబంధనలూ ప్రామాణికీకరణ ప్రయత్నాలు, వీటి నడుమ ఊగులాడుతూ ఉంటుంది. రూపకాలలోనూ, పద్యకావ్యాల్లోనూ, ఉపయుక్తమైన ప్రాకృతాల విషయంలోకూడా వైయాకరణులు జోక్యం కలిగించుకోవడంతో వాటికికూడా ఒక విధమైన నిశ్చితరూపం ఏర్పడింది. కొన్ని శతాబ్దాల తరవాత ఈ ప్రాకృత భాషల్లో నుంచి 'అపభ్రంశములు' అనే సర్వజన సాధారణమైన కొన్ని మాండలికాలు (dialects) బయలుదేరినాయి. ఇవి ప్రస్తుతం ఉత్తరదేశంలో వ్యవహారంలో ఉన్న ఇండోఆర్యన్ భాషల పూర్వరూపాలు.

క్రీస్తు వెనుక దాదాపు వెయ్యి సంవత్సరాల ప్రాంతంలో అపభ్రంశభాషల్లోనుంచి ఆధునిక భారతీయ భాషలు బయలుదేరినాయి. ఈ కాలాన్ని సంస్కృతభాషా-వాఙ్మయాల ఇతిహాసంలో ఒక ప్రధానయుగంగా పరిగణించవచ్చు. దీని తరవాత జరిగిన సృజనాత్మక కార్యక్రమం అంతా చాలా వరకు ఈ ప్రాంతీయభాషల మూలకంగానే నడిచింది. ఐతే సంస్కృతభాషలో కూడా సృజనాత్మక వాఙ్మయనిర్మాణం సాగుతూనే వచ్చింది. ఇంతేకాక ఎన్నో వైజ్ఞానిక గ్రంథములూ, శాస్త్రీయరచనలూ, ఎంతో పాండిత్యకృషీ, ప్రాచ్యప్రాంతంలో జయదేవుడు రచించిన గీతాగోవిందం వంటి అభ్యర్హిత సౌందర్యరచనలూ, కాశ్మీరుకు చెందిన కల్హణునివంటి ఐతిహాసికుల గ్రంథములూ, కనౌజుకు చెందిన శ్రీహర్షునిచే రచితమై పంచ మహాకావ్యాల్లో ఒకటిగా ప్రసిద్ధి పొందిన నైషధీయచరిత మహాకావ్యమూ, మాలవదేశాధీశుడైన భోజుడు రచించిన విమర్శన గ్రంథములూ, తమ నూతన సిద్ధాంతాలూ, వాదప్రక్రియా, వీటిచేత భారతీయ తాత్త్వికగ్రంథ సరణినే పూర్తిగా మార్చివేసి, బహుగ్రంథ నిర్మాతలైన గంగేశోపాధ్యాయుడు వంటి మిథిలాప్రాంతంలోని నవ్యనైయాయికులు రచించిన వాద గ్రంథములూ, దక్షిణదేశానికి చెందిన రామానుజాచార్యాదులు రచించిన ఆధ్యాత్మిక గ్రంథములూ

ధర్మశాస్త్రానికి సంబంధించిన రాశీభూతమైన నిబంధాలూ - వాటి వ్యాఖ్యానాలూ, ఎందరో రాజులకీ - వారి రాజ్యాలకీ సంబంధించిన దైనందిన విషయాలు తెలిపే తామ్రశిలా శాసనాదులూ, వీటి అన్నింటి నిర్మాణమూ కూడా అవిచ్ఛిన్నంగా సంస్కృత భాషలోనే కొనసాగింది. పండిత పరిషత్తుల్లో సంస్కృత భాషలోనే వ్యవహరించటంచేత ఇది సంధానభాష (Link Language) గా ఉపయోగించేది.

ద్రావిడ భాషాకుటుంబానికి చెంది, దక్షిణదేశంలో మాటలాడే భాషల్లో ఒకటయి, అతిప్రాచీన వాఙ్మయంకల తమిళంవంటి భాషల అభివృద్ధి విషయంలో కూడా సంస్కృత ప్రముఖపాత్ర వహించింది. సాహిత్యమూ, ఆధ్యాత్మికవిచారమూ, మతవిషయాలూ - వీటి అభివృద్ధికి సంస్కృత భాషయే సముత్తేజకంగాను, మార్గదర్శకంగాను నిలిచింది. ఈ దాక్షిణాత్య భాషలకు సంస్కృతంతో ఎంతటి ఘనిష్ఠ సంబంధం ఏర్పడిందనగా - ద్రావిడ భాషాకుటుంబానికి చెందిన తెలుగు మళయాళ భాషలు సంస్కృత పదభూయిష్ఠాలై భాషాద్వయ సమావేశమా అనిపించేటట్లుగా రూపొందినాయి.

తననుంచి జన్మించిన భాషలతో నేమి, ఇతర కుటుంబాలకు చెందిన భాషలతో నేమి సంబంధం శతాబ్దుల కొలది కొనసాగింది. ఈ భాష ఆయా ప్రాంతాలకు చెందిన, భాషలలిపులను స్వీకరించి ఆ భాషల్లోను, వాఙ్మయాల్లోను ఉండే సౌందర్యాన్ని, ఇతర వైశిష్ట్యాలనూకూడా తనలో ఇముడ్చుకుంది. తనలో ఉండే, అనుస్యూతంగా వస్తూన్న సద్గుణాలన్నీ ఆ భాషా వాఙ్మయాలకు ప్రసాదించింది. ఈ విధంగా చూస్తే, పూర్వం సంస్కృతానికి ప్రాకృతభాషా వాఙ్మయాలతో ఎట్టి సంబంధం ఉండేదో అట్టి సంబంధమే ఆధునిక ప్రాంతీయ (భారతీయ) భాషలతో ఏర్పడి ఉందని చెప్పవచ్చు.

నాలుగువేల సంవత్సరాల సుదీర్ఘకాలంలో, సంస్కృతభాషలో అత్యద్భుతమైన వాఙ్మయ సృష్టి అవిచ్ఛిన్నంగానూ, సర్వతోముఖంగానూ జరిగింది. అతి విశాలమైన దీని వాఙ్మయశరీరం చూస్తేనే ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది. ఇందులోని వివిధశాఖలు,వాటిలోని వినూత్న ప్రక్రియలు చూస్తే చెప్పవలసిన పనేలేదు. భారతీయ ఆలోచనాసరణికి జీవన విధానానికీ కూడా ఒకవిధమైన వైశిష్ట్యం కూర్చి పెట్టిన మత ఆధ్యాత్మికవిషయాల్లో ఎన్నో ప్రక్రియలు వివేచనావిధానాలూ రూపొందందడంతో అనేకమైన ప్రస్థానాలు (Schools of thought) బయలుదేరినాయి. అతిదీర్ఘాలూ, వర్ణనాభూయిష్ఠాలూ అయిన గ్రంథాలు మొదలు చిన్నచిన్న కథలవరకూ ఎన్నో గద్య గ్రంథాలు ఆవిర్భవించినాయి. పద్యకావ్యాల్లో అతి దీర్ఘ ప్రమాణం కలవి మొదలు అత్యల్ప సంఖ్యాకశ్లోకాలు కలవీ, చివరికి ఒక్క శ్లోకం గల ముక్తకాలూ కుడా రచితమై ఉన్నాయి. రూపకాల్లో దశాంకాలు కలవి మొదలుకొని ఏకాంకికల వరకూ గల ఎన్నో భేదాలూ, ఏకపాత్రసంభాషణ, మరి ఎన్నో ఇతర ప్రక్రియలూ గోచరిస్తాయి. ఎన్నో వైజ్ఞానిక గ్రంథములూ, ఆర్థికవైజ్ఞానిక గ్రంథములూకూడా బయలుదేరినాయి. వ్యాకరణము, శిక్షాశాస్త్రము లేక ధ్వనిశాస్త్రము (phonetics) శబ్దవ్యుత్పత్తి, నిఘంటువులు, ఖగోళశాస్త్రము, వివిధశాఖా సంపన్నమైన గణితము, జ్యోతిషము, నిమిత్తశాస్త్రము, సాంఘిక శాస్త్రము, కామశాస్త్రము, రాజనీతి, ధనుర్వేదము,శిల్పశాస్త్రము,అలంకారశాస్త్రము- ఈ విధంగా చతుష్షష్టికళలనే పేరుతో ప్రసిద్ధమై, వేటిజ్ఞానంచేత జీవితం సుసంపన్నమూ అనుభోగ్యమూ అవుతుందో అట్టి ఎన్నో విషయాలపై గ్రంథాలు ఈ భాషలో లభిస్తాయి. వాత్స్యా-

యనుడు రచించిన కామసూత్రంలోనూ, దాని వ్యాఖ్యానాల్లోనూ పేర్కొనబడ్డ ఈ చతుష్షష్టి కళలను పరిశీలిస్తే ఆ నాటి భారతీయ విద్యావిధానం ఎంత విస్తృతమైనదో, ఎంత సమగ్రమైనదో స్పష్టం అవుతుంది— "గాత్రసంగీతము, వాద్యసంగీతము, నాట్యము, వర్ణచిత్రము, పత్రరచన (ఆకులను అందమైన ఆకారాల్లో కత్తిరించుట లేదా లలాటాదులపై అలంకారమునకై నమూనాలు కూర్చుట), బియ్యపుగింజలు, పిండి, పువ్వులు మొదలగు వాటితో గృహదేవాలయాదుల్లో ముగ్గులు పెట్టుట; రకరకాలైన కుట్టుపని నగిషీలు, నేర్పుతోను అభిరుచితోను పుష్పముల విన్యాసము; పెదవులకు ఇతర అవయవాలకు రంగులు పూసుకొనుట, కొన్ని ప్రత్యేకమైన శిలలతో చల్లగాఉండే కుట్టిమాలు నిర్మించుకొనుట, ఆయా ఋతువులకూ మానసికావస్థలకూ అనుగుణంగా శయ్యలు ఏర్పాటుచేయుట; జలక్రీడలలో నీటిమీద మృదంగ ధ్వని వంటి ధ్వని కల్పించుట, తన శరీరసౌందర్యము, బలమూ వృద్ధిపొందిచుటకు అనువైన ఓషధ్యాదుల జ్ఞానము, మాల్యగ్రథనము, పుష్పాలతో శిరోభూషణ కేశ భూషణాదుల నిర్మాణము, మానసికస్థితికీ, సన్నివేశానికీ, ఋతువుకీ అనుగుణంగా నేపథ్యమునూ కేశసంస్కారమునూ సవరించడము, కంచు, దంతము మొదలగువాటితో శ్రవణాలంకారాదులు నిర్మించుట, సుభగంకరణద్రవ్య సంపాదనము, భూషణాదులు చెయ్యడం, కనికట్టు, దంపతుల మధ్య సౌమనస్య సాధనకు మందు మాకులు, హస్తలాఘవము, పాకప్రావీణ్యము, వివిధ పానీయాలను తయారుచేయడం, కుట్టుపని, అల్లిక, నేత-వీటిలో నేర్పు, తాళ్ళు, దారములు మొదలైన వాటితో చేసే వినోదకరాలైన కౌశల్యములు (ఇవి కాలక్షేపంకోసమూ వినోదంకోసమూ చేసేవి.), వీణ మొదలైన తంత్రీవాద్యాలు, డమరు మొదలైన ప్రహరిణీయ వాద్యాలు అభ్యసించుట, వినోదానికీ, ఎదుటివారిని ఓడించడానికీ ఉపయోగించే ప్రహేళికలు మొదలైన భాషకు సంబంధించే చిక్కుప్రశ్నలు వేయుట, శ్రోతలకొరకై గ్రంథములను చదివి వినిపించే సామర్థ్యము, రూపక ఆఖ్యానాదులను అభినందించగల్గిన శక్తి, సమస్యాపూరణము (ఆశుకవిత్వంలో భాగంగా పద్యంలో ఒకపాదం ఇవ్వగా తక్కిన మూడు పాదాలు పూరించడం) వేపబెత్తంతో కుర్చీలు, మంచాలు, బుట్టలు మొదలైనవి అల్లుట, కర్రతో చిన్నవస్తువులూ పెద్దవస్తువులూ చేసే నేర్పరితనము గృహనిర్మాణము, (స్థాపత్యము), నాణెముల విజ్ఞానము రత్నపరీక్ష, ధాతుజ్ఞానము, వృక్షాదిసంవర్ధనము, కుక్కుటయుద్ధ మేషయుద్ధాదులవంటి వినోదక్రీడల్లో ప్రావీణ్యము, చిలుకలకు గోరింకలకు మాటలు నేర్పుట; సంవాహకక్రియ-కేశరచన మొదలైన వాటిలో నేర్పు; గూఢార్థసంభాషణజ్ఞానము; ఆటవికభాషల జ్ఞానము; ఇతర ప్రాంతీయ భాషల జ్ఞానము, సోది చెప్పుట; మానవతుల్య యంత్రనిర్మాణము; ఇతర క్షుద్ర యంత్రజ్ఞానము; వివిధ సాహిత్య ప్రక్రియలు కంఠస్థం చేసుకోవడం, అపరిచిత పూర్వమైన గ్రంథం చదువుతూన్న వారితో చేరి దానిని గూర్చి ముచ్చటించే శక్తి, బిందుచ్యుతక మాత్రాచ్యుతకాది జ్ఞానము (పూర్తిగా వ్రాయక చుక్కలుంచిన పద్యాలలో ఆ చుక్కలున్న స్థలం అక్షరాలతో పూరించుట), కవిత్వము, సాహిత్యప్రావీణ్యము, సాహిత్యజ్ఞానానికి కావలసిన ఛందోలంకార నిఘంట్వాది ఇతర అంగాల జ్ఞానము, భ్రాంతిజనకాలైన మాటల చేత ఎదుటి వారిని కంగారు పెట్టగల్గుట, జూదంలో రహస్యగోపనము, ప్రాణిద్యూతము, అప్రాణిద్యూతము, చిన్న పిల్లలకై బంతులు బొమ్మలు మొదలైన ఆటవస్తువులు తయారుచేసివారిని ఆడించడం, గ్రంథజ్ఞానము, ఆత్మసంయమనోపయుక్తమైన సదాచార

జ్ఞానము, అశ్వారోహణము, గజారోహణము మొదలైన కసరత్తులు, యుద్ధంలో విజయం సంపాదించుటకై సంగ్రామశాస్త్రజ్ఞానము, ఆయుధవిజ్ఞానమే కాక వివిధమారణ హోమాదుల జ్ఞానము, వేట మొదలైన క్రీడలు" (మొదలైనవి చతుష్షష్టి విద్యలు). జయమంగళుడు తన వ్యాఖ్యానంలో "లిపిజ్ఞానము, సంభాషణ చాతుర్యము' నాటికాదుల్లో వినియోగానికై కొన్ని ముఖావరణాలు (ప్రతి శీర్షకములు) తయారుచేయుట, కొలతలు, తూనికలు మొదలైన వాటి జ్ఞానము, వివిధ వృత్తుల పరిచయము, పశువైద్యము, నాస్తికమతములతోను, వంచకుల తెగకు చెందిన వారితోను పరిచయము, వివిధ వినోదక్రీడాప్రావీణ్యము, లోకవ్యవహార జ్ఞానము, ఏరకమైన పనిచేయడానికైనా సామర్థ్యం కల్గి సిద్ధంగా ఉండడం" అనే వాటిని కూడా ఈ కళలలో చేర్చినాడు.

పైన చూపించిన విషయాలన్నీ సంప్రదాయసిద్ధంగా ఆచరణలో ఉండడమే కాకుండా, ఒక్కొక్క విషయాన్నిగూర్చి ఎన్నెన్నో గ్రంథాలు సంస్కృతభాషలో రచితమై ఉన్నాయి. దీనినిపట్టి సంస్కృతవాఙ్మయంలోఉన్న వైవిధ్యమూ, దాని ప్రాధాన్యమూ, దానిమీద అభిరుచి స్పష్టం అవుతాయి. నిజానికి సంస్కృతవాఙ్మయంలో నిక్షిప్తమైఉన్న వివిధ విజ్ఞానశాఖలు ఎంత విస్తృతమైనవనగా-వీటి సంక్షిప్తజ్ఞానం కోసం కాలక్రమంలో ఎన్నో సంకలన గ్రంథాలూ, విజ్ఞానకోశాలూ విరచితములైనాయి.విద్యాకరుని (క్రీ.శ. 1100) సుభాషిత రత్నకోశము, శ్రీధరదాసుని (క్రీ.శ. 1205) సదుక్తికర్ణామృతము, వల్లభదేవుని సుభాషితావలి, జల్హణుని (క్రీ.శ. 1247) సూక్తిముక్తావళి, శార్ఙ్గధరుని (క్రీ.శ. 1363) పద్ధతి మొదలైనవి వివిధగ్రంథసంగ్రహరూపాలు. క్రీ.శ. 1131 ప్రాంతంలో చాళుక్య చక్రవర్తి ఐన సోమేశ్వరుడు సంగ్రహించిన, అభిలషితార్థ చింతామణి అనే నామాంతరంకల మాన సోల్లాసము, క్రీ.శ. 1709-10 ప్రాంతంలో ఇక్కేరి కేలడి రాజైన బసవనాయకుడు కూర్చిన శివతత్త్వరత్నాకరము, మొదలైన గ్రంథాలు రెండో తెగకి చెందుతాయి. ఒక పద్ధతిని అనుసరించి రచించిన ఈ సంగ్రహగ్రంథాలలో, అతివిస్తృతం ఐన ఈ వాఙ్మయానికి సంబంధించిన కొంతభాగం మాత్రమే చూపించడానికి వీలయింది. ఐతే ఈ సంగ్రహగ్రంథాల సంకలనం చేసినవారు, ఒకపక్క మొత్తం వాఙ్మయానికంతకీ మూలధారంవంటివైన ఉత్తమా దర్శాలూ, ఆలోచనాపద్ధతీ, సంస్కృతీ మొదలైన భారతీయ జీవనవిధానమూలసూత్రాలనూ, మరొకపక్క సంస్కృతం సాధించిన అత్యుత్తమ ప్రయోజనాలనూ తమ గ్రంథాలలో చూప డానికి సఫలప్రయత్నం చేసినారు.

సంస్కృత వాఙ్మయానికంతకీ పునాదులు వేదాలు. పద్యమూ, గద్యమూ మొద లైన వివిధ సాహిత్య ప్రక్రియలకూ, అందలి ఆలోచనారీతులకూ, కాలక్రమంలో అభివృద్ధి చెందిన ఇతర విజ్ఞానశాఖలకూ కూడా వేదాలే మూలకందాలు. అందమైన కవిత్వంతో నిండి, వివిధ ఛందస్సుల్లో వ్రాసిన సూక్తాల సంగ్రహమే ఋగ్వేదం. ఇందులో కొన్ని సూక్తాల్లో వివిధ దేవతల స్తోత్రాలు, కొన్నింటిలో లౌకిక విషయాలూ; కొన్నింటిలో సృష్టి, సర్వదేవతా స్వరూపుడైన పరమాత్మ స్వరూపమూవంటి గంభీరవిషయాల వర్ణనలూ ఉన్నాయి. దేవతా స్తోత్రాలు యజ్ఞయాగాదల్లో ప్రయోగానికి ఉపయుక్తమైనవి. ఈ విధంగా సంస్కృత వాఙ్మయంలో అతిప్రాచీనమైన ఈ ఋగ్వేదంలో కూడా ఒకపక్క- యజ్ఞయాగాదికర్మలూ,

ఆచారకాండా, మరోపక్క బుద్ధికి పని కల్పించే తత్త్వవిచారమూ, అమూర్తపదార్థచింతనమూ ఈ రెండూ కూడా కనబడుతున్నాయి. వీటి తరవాత వచ్చిన వివరణ గ్రంథాలు బ్రాహ్మణాలు. ఇవి వేదాల ఉత్తరభాగాలు. చాలావరకు గద్యంలో ఉన్నాయి. వీటి చివరి భాగాలే ఆరణ్యకాలు. భారతీయ తత్త్వశాస్త్రానికి మూలాధారాలైన ఉపనిషత్తులు. ఈ ఆరణ్యకాల అంతర్భాగమే.

దేవతాస్తోత్రరూపాలైన ఋగ్వేదసూక్తాలు యజ్ఞాల్లో సంగీతయుక్తంగా పాడడం కూడా జరిగేది. ఈ విధంగా సంగీతంతో పాడిన ఋగ్వేదభాగాలకే సామవేదం అనిపేరు. ఈ సామవేదంనుంచే భారతీయసంగీత సంప్రదాయం బయలుదేరింది. యజుర్వేదం ఎక్కువగా యజ్ఞంలోని కర్మకాండకు సంబంధించిన వేదం. ఇందులోకృష్ణ యజుర్వేదం, శుక్ల యజుర్వేదం అని రెండు శాఖలు ఉన్నాయి. నాల్గవ వేదం ఐన అథర్వ వేదంలో ప్రాపంచికాలైన సర్వసాధారణ విషయాలెన్నో ప్రయోగానుగుణంగా ప్రతిపాదితములై ఉన్నాయి. దీనిలో జానపద జీవితానికి సంబంధించిన అంశాలు విస్తారంగా ఉన్నాయి. ఇతరుల సౌహార్దాన్నీ సౌమనస్యాన్నీ సంపాదించడానికీ, వ్యవసాయంలో సాఫల్యం పొందడానికీ, యుద్ధాల్లో విజయానికీ, రోగాలు తొలగిపోవడానికీ-ఈలాంటి విషయాలకు సంబంధించే సూక్తాలు ఎన్నో ఈ వేదంలో ఉన్నాయి.

వేదాలు సంరక్షించడానికీ, వాటిని అర్థం చేసుకోవడానికీ ఉపయోగించే కొన్ని గ్రంథాలు కాలక్రమేణ బయలుదేరినాయి. వీటికి వేదాంగాలు అనిపేరు. శిక్ష (వర్ణోచ్చారణ నియమాలు), వ్యాకరణము, నిరుక్తము (పదాల వ్యుత్పత్తి), ఛందస్సు, కల్పము (యజ్ఞ యాగాదులుచేసే విధానము), జ్యోతిషము (ఖగోళశాస్త్రము) అని ఈ వేదాంగాలు ఆరు. సంస్కృతంలో తరవాత బయలుదేరి వైజ్ఞానిక వాఙ్మయానికి ఇవి మూలగ్రంథలాని చెప్పవచ్చు. పాణిని రచించిన వ్యాకరణంలో అతిసూక్ష్మమూ, పరిపూర్ణమూ అయిన భాషా వివరణం గోచరిస్తుంది. ఈ వ్యాకరణంద్వారా చాలా సహాయాన్ని పొంది, భాషాశాస్త్రం అనే విభాగాన్ని సృష్టించుకొన్న ఆధునిక భాషాశాస్త్రవేత్తలు దీన్ని (పాణిని వ్యాకరణాన్ని) చూచి ఆశ్చర్యపరవశులవుతున్నారు. వైదిక కర్మలకు ఉపయోగించే వేదికలనిర్మాణాన్ని ప్రతిపాదించే శుల్బసూత్రాల్లో ఆనాటి రేఖాగణిత (geometry) జ్ఞానం మనకు స్పష్టంగా గోచరిస్తుంది. చాలాకాలం తరవాత పైథాగరస్ అనే పండితుడు ప్రతిపాదించిన సిద్ధాంతం కూడా (పైథాగరస్ సిద్ధాంతం) ఈ సూత్రాల్లో ఆనాడే చెప్పబడిఉంది. సంఖ్యలూ, స్థానాన్నిపట్టి వాటి విలువలో కలిగే మార్పులూ, దశాంకపద్ధతీ, ఇవన్నీ గణితశాస్త్రంలో భారతీయులు తొలిసారిగా కనుగొన్న అపూర్వ విషయాలు.

ధర్మసూత్రాలూ, ధర్మశాస్త్రాలూ అనేపేరుతో కొన్ని గ్రంథాలు వివిధశాఖలకూ చెందిన కల్పసూత్రాలకు అనుబంధాలుగా నిర్మించబడ్డాయి. మతసంబంధమైన విషయాలు, సాంఘిక రాజకీయనియమాలు, వ్యవహార న్యాయమూ, ఆచారాలు ఇవన్నీ ఈ ధర్మశాస్త్రాల్లో ప్రతిపాదితములై ఉన్నాయి. వాటిలో మనుస్మృతి యాజ్ఞవల్క్యస్మృతులు చాల ప్రసిద్ధమైనవి. ఇవే కాకుండా ఆయాఋషుల పేర్లతో కూడిన ఇంకా ఎన్నో స్మృతులు కూడా లభ్యం అవుతున్నాయి. ప్రాచీనవాఙ్మయం అంతా స్థూలంగా శ్రుతులూ, స్మృతులూ అని రెండు శాఖలుగా విభజించవచ్చును. శ్రుతికే ఆగమమనీ, వేదమనీ (జ్ఞానము) అనికూడా పేర్లు. శ్రుతుల్లు

ఒకరు రచించినవి కావు. స్వతః ప్రకాశములు. అవి శిష్యాచార్యుల అధ్యయనాధ్యాపన క్రమంతో అనాదికాలంనుంచి నేటిదాకా వినికిడిద్వారా వచ్చినాయి కనక శ్రుతులైనాయి. స్మృతి అనగా స్మరించుట అని అర్థం. ఋషులు కొన్ని విషయాలు స్మరించి గ్రంథరూపంలో రచించి ఉండడంచేత అట్టి గ్రంథాలకు స్మృతులు అనేపేరు వచ్చింది. ఈ విధంగా శ్రుతుల్లో నిక్షిప్తమైఉన్న జ్ఞానము, ఉపదేశాలూ వీటినే స్మృతులు క్రోడీకరించినాయి. భారతీయుల జీవితవిధానమూ, జీవితం విషయంలో వారి ఆలోచనాపద్ధతీ, పూర్తిగా స్మృతి వాఙ్మయం మీద ఆధారపడి ఉన్నాయి. భారతీయుల జీవితవిధానాన్ని సంక్షిప్తంగా చెప్పాలంటే-వీరి ప్రధానమైన జీవితలక్ష్యాలు నాలుగు-ధర్మము, అర్థము, కామము, మోక్షము. వర్ణాలు నాలుగు-విద్యలు సంరక్షించెడివాడు, (యోధుడు) పరిపాలకుడు, వ్యాపారంచేసేవాడు, సేవాధర్మం నిర్వర్తించేవాడు. జీవితంలో మెట్లు (ఆశ్రమములు) నాలుగు-బ్రహ్మచర్యాశ్రమం, గృహస్థాశ్రమం, వానప్రస్థాశ్రమం, సన్యాసాశ్రమం.

సంప్రదాయం ప్రకారంగా పురాణగాథలూ, సృష్టి. ప్రలయమూ, దేవఋష్యాదుల వంశాలూ, మన్వంతరాలూ, ప్రాచీన చక్రవర్తులూ వీటి అన్నిటికీ సంబంధించిన కథలుకూడా ఈ స్మృతి వాఙ్మయంలోనే చేరుతాయి. పైన చెప్పిన విషయాలన్నీ చాలా వరకూ పురాణాల్లోనూ ఇతిహాసాల్లోనూ లభిస్తాయి. రెండు ఇతిహాసాల్లో మొదటిదైన రామాయణం సూర్య వంశానికి చెందిన రాముని చరిత్రను వర్ణించగా రెండోదైన మహాభారతం చంద్రవంశానికి చెందిన కౌరవ పాండవుల చరిత్ర వర్ణిస్తూంది.

ఇతిహాసాలకీ, పురాణాలకీ, కావ్యాలకీ కూడా బీజాలు వేదవాఙ్మయంలోనే లభిస్తాయి. రామాయణం మహాకావ్యం అని ప్రసిద్ధి. మహాభారతం కూడా కావ్యంగానే పేరు పొందింది ఈ రెండు ఇతిహాసగ్రంథాలూ కూడా తరవాత వచ్చిన సంస్కృతకావ్యాలన్నింటికీ ఆదర్శంగానూ మార్గదర్శకంగానూ నిలిచినాయి. వేదం బోధించిన ధర్మాలు, ప్రధానంగా మతమూ, నీతి, ఆధ్యాత్మికదృష్టి- ఈ విషయాల్లో స్త్రీ పురుషులు అనుసరించవలసిన ఉన్నతాదర్శాలు, వీటిని ప్రతిపాదిస్తూ, వేదాలకి ఉపష్టంభకంగా ఉండడమే ఈ ఇతిహాసగ్రంథాల పరమలక్ష్యం. అనాది కాలంనుంచీ ఈ గ్రంథాలు భారతదేశానికి నేత్రాలవలె ఉంటూ, శ్రీరామ యుధిష్ఠిరాదుల సత్యవ్రతం మొదలైన ధార్మికత్వాన్నీ, సీత సావిత్రి మొదలైనవారి పాతివ్రత్యాదులనూ అత్యున్నతాదర్శాలుగా చూపుతూ ఈదేశానికి మార్గదర్శకాలుగా ప్రకాశిస్తున్నాయి. ఈవిధంగా ఉత్తమాదర్శాలు చూపించడమే కాకుండా, దురాశ, కామమూ మొదలైన దుర్గుణాలచేత రావణుడూ, దుర్యోధనాదులూ, చివరికి ఏవిధంగా నాశం పొందినారో వర్ణిస్తూ, ఈ ఇతిహాసగ్రంథాలు కొన్ని వ్యతిరేక దృష్టాంతాలు కూడా భారతీయుల ఎదుట చూపుతున్నాయి. కావ్యాలు, రూపకాలు మొదలైనవి కూడా ఈ ఇతిహాసాల పద్ధతినే అనుసరిస్తూ, ధర్మం చివరికి అధర్మాన్ని ఏవిధంగా అణగద్రొక్కిందో నిరూపించడం కోసం ప్రయత్నించినాయి. వీరరస ప్రధానాలైన ప్రాచీనగాథలూ, కథలూ, నీతిబోధలూ, సదుపదేశాలూ మొదలైనవాటి నన్నింటినీ తనలో చేర్చుకొని మహాభారతం ఒక బృహత్తరమైన ప్రాచీనచరిత్ర-విజ్ఞాన-సంస్కృతి భాండాగారంగా ఏర్పడింది. ఇందులోని లక్ష శ్లోకాల్లో మానవుని ప్రధాన లక్ష్యాలైన ధర్మార్థ కామమోక్షాలకి సంబంధించిన అన్ని విషయాలూ ఇమిడి ఉన్నాయి.

మహాభారతంలో ఉన్న సంవాదాలన్నింటిలోకీ అత్యుత్తమమైనది భగవద్గీత. కౌరవ పాండవుల మధ్య ఘోరసంగ్రామం ప్రారంభం అయింది. శ్రీకృష్ణుడు అర్జునుడికి సారథ్యం వహిస్తాడు. ఈతడు వహించిన సారథ్యం నిగూఢార్థం గల సారథ్యం. ఆసమయంలో మహారథికుడైన అర్జునుడు విషాదగ్రస్తుడౌతాడు. అప్పుడు శ్రీ కృష్ణుడు ఆ అర్జునునికి ఈ భగవద్గీతలో కర్మయోగం బోధిస్తాడు. ఏడువందల శ్లోకాలు గల ఈ భగవద్గీతలో భారతీయ-ఆధ్యాత్మిక-విచారానికి సంబంధించిన అన్ని విషయాలూ, మార్గాలూ, వాటిలో ప్రధానమైన జ్ఞానయోగ కర్మయోగ భక్తియోగాలు కూడా సంక్షిప్తంగానూ, స్పష్టంగానూ ప్రతిపాదితములై ఉన్నాయి. అందుచేతనే ప్రాచీనకాలంలోనూ, ఆధునికయుగంలోనూ కూడా భగవద్గీత, ఒక్క భారతదేశంలోనే కాకుండా విదేశాల్లో కూడా హిందూమతసారాన్ని ప్రతిపాదించే అత్యుత్తమ గ్రంథంగా పేరుపొందింది. అనాసక్తితో స్వధర్మం ఆచరించడం. ఫలాపేక్ష లేకుండా కర్మచేయడం, స్వార్థచింతలేని సేవ నిర్వర్తించడం అనే భగవద్గీత చేసిన ఉపదేశాలచే ఉత్తేజితులై తిలక్, అరవిందుడు, గాంధి మొదలైన మహాపురుషులు ఎన్నో ఉత్తమకార్యాలు నిర్వహించ కలిగినారు.

పురాణాలు సంస్కృత వాఙ్మయంలో అతివిస్తృతమూ, బృహత్ప్రమాణమూ అయిన ఒకశాఖ. ఇందులో పద్దెనిమిది మహాపురాణాలూ, పద్దెనిమిది ఉపపురాణాలూ ఉన్నాయి. ఇవికాక ఇంకా ఎన్నో గ్రంథాలు ఈ పేరుతో చెలామణీ అవుతున్నాయి. వాటిలో శ్రీమద్భాగవతం ఎక్కువ ప్రచారంలో ఉన్న పురాణం. దీనిలో ప్రతిపాదించిన ప్రేమ, భగవద్భక్తి, ఇవి అందరి భారతీయుల హృదయాలూ చూరకొన్నాయి. దీనితో దేశంలో ఎన్నో భక్తిమార్గాలు బయలుదేరినాయి. ప్రాంతీయ భాషలన్నింటిలోనూ అత్యద్భుతమైన భక్తి వాఙ్మయం ఆవిర్భవించింది.

వేదాలలో భాగం ఐన ఉపనిషత్తులకు వేదాంతాలని కూడా పేరు. "ఉపనిషత్తు" "వేదాంతము' అనే రెండుపేర్లూ సార్థకమైనవి. శిష్యాచార్యులిద్దరూ ఒక్కచోట కూర్చుండి ప్రశ్నోత్తరాదుల ద్వారా బాగా విషయ విమర్శన చేసి సంపాదించిన ఆధ్యాత్మికజ్ఞానం అవడంచేత 'ఉపనిషత్తు' అనేపేరు వచ్చింది. ఈజ్ఞానం వేదాసికంతకీ- అనగా జ్ఞానానికంతకీ- మకుటాయమానం అవడంచేత 'వేదాంతం' అనేపేరు. ఉపనిషత్తుల్లో పది లేక పదమూడు ఉపనిషత్తులు చాలా ప్రధానమైనవి. సృష్టి-స్థితి-సంహారాదులకు కారణభూతమైన పరతత్త్వమూ, దానికి గల లౌకిక-అలౌకిక గుణాలూ, ఈ పరతత్త్వాన్ని సాక్షాత్కరింపచేసుకొనేందుకు ఉపయోగించే జ్ఞానధ్యానాదులూ, వీటికి సహకరించే సత్యాహింసావ్రత సంన్యాసాదులూ ఈ విషయాలన్నీ ఉపనిషత్తులలో ప్రతిపాదితములై ఉన్నాయి. ఈ ఉపనిషత్సారం అంతా వేదాంతసూత్రాలలో సంగృహీతమై ఉంది. వేదాంతసూత్రాలలో ప్రతిపాద్యమైన విషయం ఔపనిషద బ్రహ్మ అవటంచేత వీటికి బ్రహ్మసూత్రాలని కూడాపేరు. సంస్కృతంలో సూత్రవాఙ్మయం అనేది మరి యేవాఙ్మయంలోనూ లేని ఒక అపూర్వ ప్రక్రియ. వేదాంగాలన్నీ కూడా సూత్రరూపంలో ఉన్నాయి. అర్థగంభీరమూ, సర్వతోముఖమూ అయిన చిన్నవాక్యానికి సూత్రము' అనిపేరు. ఈ వాక్యంలో ఒక్కొక్కప్పుడు ఒక్కపదం మాత్రమే ఉండవచ్చు. సూత్రం అనేది అతివిస్తృతమైన అర్థం తెలుసుకోవడానికి ఒక చిన్న 'ఫ్లిట్టు' వల్లె ఉంటుంది. ఐతే ఈ అర్థం తెలుసుకోవడానికి మొదట్ల ఆచార్యుని సహాయం

అవసరం. ఈ సూత్ర నిర్మాణ విధానం పాణిని చేతులలో పరినిష్ఠిత రూపాన్ని సంతరించు కొంది. మొత్తం వ్యాకరణం అంతా ఈ సూత్రాలలో ఇమిడిపోయింది. ఐతే సూత్ర రచనా విధానం కాలక్రమేణా వివిధ వ్యాఖ్యానాలకి దారితీసింది. ఈవిధంగా వేదాంత సూత్రాలపైన నిర్గుణాద్వైత పరంగాను, సగుణద్వైత పరంగాను, ఇంకనూ ఇతరపరంగానూ ఎన్నో వ్యాఖ్యానాలు బయలుదేరినాయి. నిర్గుణాద్వైత తత్త్వం ప్రతిపాదించినవారిలో అగ్రగణ్యులు శంకరాచార్యులు. ఈయన అతి గంభీరార్థంగల భాష్యాలు రచించడం ద్వారానే కాకుండా పాద సంచారంచేత దేశం నాల్గుమూలలా పర్యటించడం ద్వారా కూడా నిర్గుణాద్వైతవాదాన్ని సుస్థిరంగా స్థాపించినారు. వైదికాచారాలు మళ్ళీ ఉద్ధరించినారు. వివిధరూపాలలో ఉన్న భగవంతునిపై భక్తి బోధించి ఆ భక్తి తత్త్వాన్ని తన గ్రంథములలో ప్రతిపాదించినారు. ఈ విధంగా శంకరాచార్యులు హిందూ మతానికి నూతనోత్తేజనాన్నీ, అపూర్వశక్తినీ సాధించి నారు. శంకరాచార్యులకు పూర్వం ఎందరో వ్యాఖ్యాతలు ఉండేవారు. ఆయన తరవాత కూడా ఆయన మతాన్ని వ్యతిరేకించే ఎంతోమంది వ్యాఖ్యాతలు వచ్చినారు. వీరిలో చెప్పుకో దగినవారు శ్రీరామానుజాచార్యులు ఈయన మతం ప్రకారం పరబ్రహ్మము సాకారమూ సగుణమూ కూడా. దానిని చేరడానికి ఏకైకమార్గం భక్తిమాత్రమే. వీరి తరవాత చెప్పుకో దగినవారు ద్వైతమత ప్రతిష్ఠాపకులైన ఆనందతీర్థులు.

ఇతరమైన భారతీయ దర్శనాల్లో కూడా, సూత్రాలూ, వాటిపైన వ్యాఖ్యానాలూ వాటిమీద ఉపవ్యాఖ్యానాలూ, కొన్ని స్వతంత్రగ్రంథాలూ, ప్రకరణ గ్రంథాలూ ఉన్నాయి. జైమిని విరచితమైన మీమాంసా శాస్త్రం వేదాలకు అర్థం చెప్పే విధానాన్నీ, వేదవిహితాలైన కర్మలు ఆచరించే పద్ధతినీ ప్రతిపాదిస్తుంది. అందుచేతనే ఈ మీమాంసకు 'కర్మమీమాంస' అనీ బ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదించే వేదాంతానికి 'బ్రహ్మమీమాంస' అనీ పేర్లు. న్యాయశాస్త్రము గౌతముడు రచించినది. ఇది ఆస్తికద్వైతం బోధిస్తుంది. ఈ మతం ప్రకారం ఈశ్వరుడు ఈ జగత్తుకు కేవలమూ నిమిత్తకారణమే కాని వేదాంతులు అంగీకరించినట్లుగా ఉపాదాన (వివర్త) కారణం కూడా (అభిన్న నిమిత్తోపాదానం) కాదు. కణాదుడు రచించిన వైశేషికశాస్త్రానికీ న్యాయశాస్త్రానికీ అంతగా తేడా లేదు. కాని జగత్తంతా పరమాణువులనుండి జన్మించింది అన్న సిద్ధాంతమే ఈ శాస్త్రంలోని ప్రధానవిశేషం. సాంఖ్యశాస్త్రానికి సంబంధించిన కొన్ని సిద్ధాంతాలు ఉపనిషత్తులలో కూడా గోచరిస్తాయి. ఇది కూడా ద్వైత సిద్ధాంతమే. దీనిప్రకారం పురుషుడు (జీవుడు) ప్రకృతి అనే రెండు పారమార్థిక తత్త్వాలున్నాయి. పురుషులు అనంత సంఖ్యాకులు. ప్రకృతి సత్త్వరజస్తమో గుణాత్మకమైనది. పురుషుడు స్వభావతః క్రియారహి తుడు. ప్రకృతిమాత్రం క్రియాశీలమైనది. ఈ ప్రకృతి పురుషుల కలయిక చేతనే సృష్టి అంతా జరుగుతున్నది. ప్రకృతి పురుషుల యథార్థ స్వరూపం గుర్తించి ఆ రెంటికీగల సంబంధాన్ని తెలుసుకోవడంతో పురుషుడు ప్రకృతినుంచి విడిపోయి మోక్షం పొందుతాడు. పతంజలి రచించిన యోగదర్శనం కూడా చాలావరకూ పైసిద్ధాంతాన్నే అంగీకరిస్తుంది. ఐతే, పైన చెప్పిన ప్రకృతీ పురుష వివేకానికి ఉపయోగించే శారీరక మానసిక నియమాలూ, ధ్యానమూ, సమాధీ మొదలైన విషయాలు ప్రధానంగా యోగదర్శనం ప్రతిపాదిస్తుంది.

కాలక్రమంలో, వివిధ రూపాల్లో ఉన్న వేదాంతదర్శనమే బహుళ ప్రచారం పొందింది. మిగిలిన దర్శనాలన్నీ దానికి సహాయకంగా ఉండిపోయినాయి. వ్యాకరణంవలెనే

న్యాయమూ, అందులో ఉన్న వాదపద్ధతీ కూడా వేదాంత సిద్ధాంతనిరూపణానికి సహాయకారిగా ఏర్పడినాయి. సగుణేశ్వర వాదం అంగీకరించే వేదాంతులందరూ కూడా ఇందులోని ఈశ్వర తత్త్వాన్ని చాలావరకు తమ వాదాల్లో ఇముడ్చుకొన్నారు. అలాగే సాంఖ్యదర్శనం కూడా వేదాంతులకు కావలసిన త్రిగుణాత్మక ప్రకృతి స్వరూపమూ, 'పురుషుడు కర్తృత్వము లేని వాడు' అనే సిద్ధాంతమూ, ప్రతిపాదించి శలవు తీసుకొంది. న్యాయశాస్త్రం మోస్తరుగానే యోగశాస్త్రం కూడా బౌద్ధ జైన దర్శనాలలో సహా అన్ని దర్శనాలకీ అవసరమైన సాధనాలు సమకూర్చింది. ఆధునికయుగంలో ఈ దర్శనం ప్రపంచం అంతటా మన్ననలు పొందుతూ ఆచరణలోకి వస్తూంది.

కొందరు మేధావులూ, వ్యాఖ్యాతలూ నిరంతరంగా కృషిచేసి వైజ్ఞానికంగానూ, నియమబద్ధంగానూ ప్రతిపాదించగా కాలక్రమేణా రూపొందిన సిద్ధాంతానికి శాస్త్రం అనిపేరు. పైనచెప్పిన ఆరుదర్శనాలూ ఆరుశాస్త్రాలు. శిక్షించుట, ఆజ్ఞాపించుట అనే అర్థంగల శాస్ (శాస్ అనుశిష్టౌ) అనే ధాతువునుండి నిష్పన్నమైన 'శాస్త్రము' అనే పేరు మొదట వేదాలకి మాత్రమే వర్తించేది. వేదాలనుంచి ఈపేరు షడ్దర్శనాలకి కూడా వచ్చింది. ఈ ఆరు శాస్త్రాలూ ప్రధానపురుషార్థం ఐన మోక్షాన్ని ప్రతిపాదిస్తున్నాయి కనక వాస్తవానికి వీటినే ప్రధానశాస్త్రాలని చెప్పాలి. వీటి తరవాత వచ్చిన కొన్ని నియమబద్ధ సిద్ధాంతాలకి కూడా శాస్త్రం అనే పేరు లభించింది. అర్థం నిర్ణయించడానికి ఉపయోగించే న్యాయాలూ, వాటి ప్రయోగమూ ఉండటంచేత మీమాంసాశాస్త్రంతో ఘనిష్ఠ సంబంధం గలిగి, మతలౌకిక వ్యవహారాలకి సంబంధించిన నియమాలను బోధించే శాస్త్రానికి ధర్మశాస్త్రం అనేపేరు వచ్చింది. రాజ్యవ్యవహారాలు, రాజ్యపరిపాలన. ఆర్థికస్థితి, వస్తూత్పత్తి, వ్యాపారమూ మొదలైన వాటికి 'అర్థము' అని పేరు. దీనిని గూర్చి చెప్పే గ్రంథాలకు అర్థశాస్త్రం అనే పేరు. ఈ శాస్త్రానికి సంబంధించిన గ్రంథాల్లో, క్రీస్తుకు పూర్వం నాలుగో శతాబ్దంలో మౌర్యచంద్రగుప్తునికి మంత్రిగా ఉన్న కౌటిల్యుడు రచించిన గ్రంథం అత్యుత్తమమైనది. సుఖభోగాలు, వివిధ కళలలో ప్రావీణ్యమూ, ఇవన్నీ మూడో పురుషార్థం ఐన కామంలో చేరుతాయి. దానిని గూర్చి వ్రాసిన గ్రంథాలలో వాత్స్యాయనుడు వ్రాసిన కామసూత్రం సర్వోత్కృష్టం ఐనది. ప్రాచీన కాలంలో ఉండే భారతీయులకు కేవలం పారలౌకిక చింతే కాకుండా లౌకిక చింత కూడా ఉండేది అనే విషయాన్ని అర్థకామాలపై వ్రాసిన ఈ శాస్త్ర గ్రంథములు రుజువు చేస్తున్నాయి ఆనాడు ప్రజలు ఏవిధంగా ఉండేవారో, తమ తమ కార్యాలు నిర్వర్తించుకుంటూ వారు ఏ విధంగా భోగాలు అనుభవించే వారో, ఈ గ్రంథములు స్పష్టంగా ప్రతిపాదిస్తున్నాయి. ఐతే ఇక్కడ ఒక్క విషయం జ్ఞాపకం ఉంచుకోవలసి ఉంటుంది. లౌకిక సమృద్ధికీ, సుఖమయ జీవనానికీ గల ప్రాధాన్యం గుర్తించినా కూడా ఆనాటి ప్రజలు ఆదిభౌతికోన్నతికీ ఆధ్యాత్మికోన్నతికీ గల తారతమ్యం మాత్రం ఎన్నడూ మరవలేదు. చివరికి ప్రాముఖ్యం ఇవ్వతగినవి ధర్మమోక్షాలే అన్న విషయం అర్థశాస్త్ర కామశాస్త్ర గ్రంథములు కూడా ప్రతిపాదిస్తూనే ఉన్నాయి. ఈ శాస్త్రాలే కాదు, వ్యాకరణము, సాహిత్య శాస్త్రము, సంగీతశాస్త్రము, నాట్యశాస్త్రము మొదలైన శాస్త్రాలు కూడా ఈ ఆధ్యాత్మిక మతతత్త్వాలకు గల ప్రాధాన్యాన్ని గుర్తించి తమ ప్రయోజనం కూడా ఆత్మసాక్షాత్కారానికి సాధనంగా ఉపయోగపడడమే అని చెబుతున్నాయి. అందుచేతనే వ్యాకరణ దర్శనం భాషకంతటకూ మూలాధరమై 'స్ఫోట'

అనే ఒక నిత్యమైనతత్త్వం ఉన్నదనీ, దానికే 'శబ్దబ్రహ్మము' అనిపేరున్నదనీ ప్రతిపాదిస్తుంది. ఇది గ్రీకు తత్త్వశాస్త్రంలో చెప్పిన "లోగోస్" వంటిది. అలాగే, సంగీత శాస్త్రం కూడా 'నాదబ్రహ్మము' అనే ఒక పారమార్థికతత్త్వాన్ని సాక్షాత్కారించుకోడానికే సంగీతం ఉపయోగిస్తుందని సిద్ధాంతీకరిస్తుంది. కావ్యాలూ, రూపకాలూ ఇవన్నీ కూడా హృదయానికి ఒకవిధమైన అలౌకిక విశ్రాంతి సమకూరుస్తాయి. దానికే రసమని పేరు. ఇది ఆత్మసాక్షాత్కారం చేత కలిగే ఆనందంతో సమానమైన ఆనందాన్ని కూర్చే ఒక అద్భుతస్థితి.

భరతునితో (క్రీ. పూ. 206 నుండి క్రీస్తు తరువాత 200 వరకు) ప్రారంభించి అతి విస్తృతమైన (సాహిత్య) విమర్శ వాఙ్మయం బయలుదేరింది. దానిలో కొన్ని గ్రంథములకు అలంకారశాస్త్రమని, కొన్నింటికి నాట్యశాస్త్రమని పేరు. ఈశాస్త్రాల్లో ప్రతిపాదితమైన రససిద్ధాంతమూ, కావ్యానికి జీవితం ధ్వనియే అనే సిద్ధాంతము కూడా ప్రస్తుతం పాశ్చాత్య సాహిత్య విమర్శకుల మన్ననలు చూరగొన్నాయి.

కావ్యరూపకాదులు ఇతిహాసాల తరవాత బయలుదేరినాయి. భాసుడు రచించిన రూపకాలు అతిప్రాచీనమైనవి. ఐతే, క్రీస్తుశకం ప్రారంభానికి దగ్గరగా ఉన్న పూర్వ శతాబ్దులలోనూ, పరశతాబ్దులోనూ కావ్యనాటకాదులు రచించిన వారిని గూర్చి స్పష్టంగా తెలుసుకోవడానికి మనకిపుడు అవకాశం లభిస్తుంది. ఇపుడు మనకు గ్రంథములు లభించే ప్రాచీన కవులలో ప్రప్రథమంగా చెప్పుకోదగినవాడు కాళిదాసు. ఈతడు క్రీస్తుకు పూర్వం మొదటి శతాబ్దానికి చెందినవాడని కొందరూ, క్రీస్తు వెనుక నాలుగో శతాబ్దానికి చెందినవాడని మరికొందరూ అంటారు. ఇతనికి పూర్వం ఉన్న కావ్యాలు రూపకాలూ కూడా ఇతని గ్రంథములు రావడంతోనే మరుగునపడి పోయినాయి. తరువాత వచ్చిన రచనలన్నీ చాలా వరకూ ఇతని గ్రంథముల అనుకరణలే. ప్రాచీన సంప్రదాయం ప్రకారంగాను, నవీన ప్రపంచాభిప్రాయం ప్రకారంగాను కూడా కాళిదాసు రచనలో అభిజ్ఞాన శాకుంతలం తలమానికం వంటిది. ఆతడు మరో రెండు రూపకాలు, రెండు మహాకావ్యాలు, ఒక లఘు (గీతి) కావ్యమూ రచించినాడు. మేఘదూతము అనే ఈ లఘు కావ్యంలో విరహార్తుడైన ఒక నాయకుడు సుదూరదేశంలో ఉన్న తన ప్రియురాలి దగ్గరకి ఆకాశమార్గంలో ఎగిరిపోతున్న ఒక మేఘాన్ని దూతగా పంపిస్తాడు. ఈ పద్ధతినే అనుసరిస్తూ ఎంతోమంది సంస్కృత కవులూ ప్రాంతీయభాషా కవులూ కూడా అసంఖ్యాకంగా సందేశ కావ్యాలు వ్రాసినారు. ఒక ప్రేమ గాథ వ్రాయడానికి గాని, రూపకాలలో సంయోగ శృంగారం లేక విప్రలంభ శృంగారం కూర్చడానికి గాని, మహాకావ్యం వ్రాయడానికి గాని ఏవైన నమూనా (ఆదర్శం) కావాలంటే తరువాత కవులందరూ కూడా కాళిదాసు దగ్గరకు వెళ్లవలసిందే. కాళిదాసు అవలంబించిన రీతి అతిసులభమైనది, హుందాతనంతో కూడినది; వ్యంగ్య ప్రధానమైనది. భారతీయ సంస్కృతికి ఆలవాలాలైన ప్రాచీన గ్రంథలాలో ప్రతిపాదితములై ఉన్న ఉన్నతాదర్శాలూ, మూలసూత్రాలూ కూడా కాళిదాసు బుద్ధిలో యథాతథంగా, విస్పష్టంగా ప్రతిబింబించినట్లు గోచరిస్తాయి.

కాళిదాసు రచించిన రఘువంశ కుమారసంభవాలు, భారవి (క్రీ. శ. 550 ప్రాంతం) రచించిన కిరాతార్జునీయము, మాఘుడు (క్రీ. శ. 7వ శతాబ్దం) రచించిన శిశుపాల వధ, శ్రీ హర్షుడు (క్రీ. శ. 12వ శతాబ్దం) రచించిన నైషధీయ చరితమూ ఈ ఐదింటికీ

పంచ మహాకావ్యాలని పేరు. భారవి మొదలైన వారు మహాభారతంలో నుంచి కథావస్తువు తీసుకొని తమ కవితాశక్తి స్పష్టంగా గోచరించే విధంగా దానికి అనేక అలంకారాదులే కాకుండా, తమ విస్తృత శాస్త్రపాండిత్యం సహాయంతో ఇతర విషయాలు కూడా చేర్చి ఈ కావ్యాలు రచించినారు. ఈ విధంగా సంస్కృత కావ్యాలు పఠితలకు రసానందంతో పాటు వివిధ శాస్త్ర పరిచయం కూడా సులభంగా కలిగిస్తాయి.

కాళిదాసు రచించిన అభిజ్ఞాన శాకుంతలం నాటకాలలో అగ్రగణ్యం అయినట్లుగానే, శూద్రకుడు రచించిన పది అంకాల మృచ్ఛకటికం 'ప్రకరణము' అనే పేరుగల సాంఘిక రూపకాలలో అగ్రస్థానం వహించింది. ఎంతో విషయవైవిధ్యమూ, అద్భుతమైన పాత్ర నిర్వహణమూ, విచిత్రమైన సన్నివేశాలు-వీటితో నిండిన ఈ రూపకం మానవ ప్రకృతికి అద్దం పట్టినట్లుగా ఉంటుంది. భవభూతి (క్రీ. శ. 700) రచించిన సాంఘిక రూపకం ఐన మాలతీమాధవం అనే ప్రకరణంలో అతని కింత సాఫల్యం లభించక పోయినా, సీతానిర్వాసనం కథావస్తువుగా తీసుకొని వ్రాసిన ఉత్తర రామ చరితంలో మాత్రం అతడు కరుణ రసనిర్వహణ విషయంలో అత్యున్నత స్థానాన్ని సంపాదించుకో గలిగాడు. కనౌజు రాజధానిగా చేసుకొని పరిపాలించిన హర్షవర్ధనుడు (క్రీ శ. 7వ శతాబ్దం) రచించిన మూడు రూపకాలలో కాళిదాసు మాలవికాగ్ని మిత్రానికి అనుకరణరూపాలైన రెండు రూపకాలు శృంగార రసప్రధానాలై నవి. బోధిసత్త్వుని (జీమూతవాహనుని) ఆత్మత్యాగం కథావస్తువుగా గల మూడవ రూపకం, నాగానందం, సంస్కృత రూపక చరిత్రలో ఒకఅపూర్వమూ, విప్లవాత్మకమూ అయిన రచన అని చెప్పవచ్చు. విశాఖదత్తుడనే రాజు (క్రీ. శ. 9వ శ.) రచించిన ముద్రారాక్షసంలో మొదటి నుంచి చివరి దాకా రాజనీతియే ఇతివృత్తం. ఇది రూపక చరిత్రలో అపూర్వం అని చెప్పవచ్చు. రూపకాలు సర్వజనాదరం పొందడంతో తత్త్వ శాస్త్రవేత్తలు కూడా ఈ రూపకాల వైపు మొగ్గు చూపడం ప్రారంభించినారు. బౌద్ధ కవియైన అశ్వఘోషుడు (క్రీ.శ. 1వ శతాబ్ది) బుద్ధునికి సంబంధించిన బుద్ధ చరితము, సౌందరనందము అనే రెండు మహా కావ్యాలు వ్రాయడమే కాకుండా 'శారిపుత్ర ప్రకరణము' అనే ఒక రూపకం కూడా వ్రాసినాడు. బుద్ధుడు శారిపుత్రునికి తన మతం ఇవ్వడం ఇందులోని ఇతివృత్తం. ఆకారంలేని కొన్ని గుణాదులు కూడా ఇందులో పాత్రలుగా చేర్చినాడు కవి. జయంత భట్టు (క్రీ.శ. 10వ శ.) అనే ప్రసిద్ధ కాశ్మీర్ తార్కికుడు ఆస్తిక నాస్తిక మతాల పరస్పర సంఘర్షణ కథావస్తువుగా తీసుకొని 'ఆగమడంబరము' అనే ఒక రూపకం వ్రాసి చివరకు సంపూర్ణ భక్తి విశ్వాసాలతో ఏ దోషమూ లేకుండా ఏ మతం అవలంబించినా ప్రతివాడూ ఒకే ఉత్తమ లక్ష్యం చేరవచ్చు అని బోధిస్తాడు. కృష్ణమిశ్రుడు (క్రీ.శ. 11వ. శ.) "ప్రబోధ చంద్రోదయము" అనేరూపకం అద్వైత సిద్ధాంత ప్రతిపాదనకై ఉపయోగించగా వేదాంత దేశికుడు (క్రీ.శ.1268-1369) సంకల్పసూర్యోదయం అనే రూపకం విశిష్టాద్వైత ప్రతిపాదన కోసం ఉపయోగించుకొన్నాడు.

వేదాల్లో భాగం ఐన బ్రాహ్మణాలనుంచీ కూడా సంస్కృతభాషలో గద్యరచన సాగుతూనే వచ్చింది. గద్యలో వ్రాసిన ఎన్నో కథలు, పౌరాణిక - ఇతిహాసిక - ఉపాఖ్యానాలూ నేడు మనకు లభ్యం అవడంలేదు. ప్రస్తుతం లభిస్తున్న గద్యకావ్యాల్లో ముగ్గురు మహాకవుల రచనలు చెప్పకోతగినవి. వాటిలో మొదటిది సుబంధుడు రచించిన వాసవదత్త. రెండవది బాణభట్టు రచించిన కాదంబరి. మూడవది హర్షచరితము. ఇది కూడా బాణభట్టు

రచించిన చారిత్రక గద్యకావ్యం. ఈ కావ్యంలో కవి తనకు ఆశ్రయదాత ఐన హర్షవర్ధనుని (క్రీ. శ. 7 వ శతాబ్దం) చరిత్ర, తన చరిత్రా కూడా వర్ణించి ఉన్నాడు. కాంచీపురంలోని పల్లవరాజుల ఆస్థానంలో ఆస్థానకవిగా ఉన్న దండి (క్రీ. శ. 7 వ శతాబ్దం) రచించిన దశకుమార చరితము నాలుగో గద్యకావ్యం. పద్యకావ్యాలూ, రూపకాలూ వ్రాయవలసిన పద్ధతి కాళిదాసు చూపించినట్లుగానే గద్యకావ్యాలు రచించవలసిన విధానం బాణభట్టు చూపి ఉన్నాడు. ఈతడు (బాణుడు) భాషను తన ఇష్టంవచ్చినట్లుగా ఆడించగలిగిన నేర్పు కల వాడు. మానవ స్వభావాన్నీ ప్రకృతినీ సూక్ష్మేక్షికతో చూడగలిగినవాడు. శబ్దాలంకారాల తోటీ, అర్థాలంకారాలతోటీ ఒప్పారే అవిచ్ఛిన్న మధుర భాషా ప్రవాహానికి అంతటికీ తరగని జలయంత్రం ఇతడు. సూక్ష్మపరిశీలనాశక్తి, విస్తృత విజ్ఞానమూ కల దండి కూడా ఇతనితో సమానమైన ప్రజ్ఞకలవాడే. ఐతే ఇతని గద్యరచన దీర్ఘ సమాసభూయిష్ఠం కాకుండా ఇతరమైన కృత్రిమాడంబరాలు కూడా లేకుండా సులభ రీతిలో ఉంటుంది.

కాశ్మీరులోని కొందరు కవులు సుదీర్ఘ కాయాలైన మహాకావ్యాలకు కొత్త కథా వస్తువు చేకూర్చి కొన్ని చారిత్రిక కావ్యాలు రచించినారు. ఈ జాతికి చెందిన కావ్యాలలో కల్హణుడు (క్రీ. శ. 12 వ శతాబ్దం) వ్రాసిన రాజతరంగిణి మాత్రమే మనకిపుడు లభ్యం అవుతూంది. అజ్ఞాతకాలం నుంచీ సాంప్రదాయికంగా వస్తూన్న కథలు మొదలు తానున్న శతాబ్దం వరకూ గల కాశ్మీర చరిత్రనూ, అందలి రాజుల పరిపాలనా విధానాదులనూ కవి ఈ గ్రంథంలో వర్ణించి ఉన్నాడు. కవికి ఆశ్రయం ఇచ్చిన ఒక్క రాజుకు సంబంధించిన చరిత్ర మాత్రమే తెలిపే కొన్ని చరిత్రకావ్యాలు కూడా బయలుదేరినాయి. మాల్వాధిపతియైన సింధురాజు చరిత్రను వర్ణిస్తూ పద్మగుప్తుడు రచించిన నవసాహసాంక చరితము (క్రీ. శ. 1005), కల్యాణ రాజైన ఆరవ చాలుక్య విక్రమాదిత్యుని (క్రీ. శ. 1076-1121) చరిత్ర వర్ణించే, బిల్హణ రచితమైన, విక్రమాంకదేవ చరితమూ ఈ కోవకు చెందినవి. ఐతే కల్హణుని రాజతరంగిణికీ, ఈ కావ్యాలకీ చాలా భేదం ఉంది; వాటిలో కొన్ని చారిత్రికాంశాలు ఉన్నప్పటికీ వాటికంటే కవితాశక్తితో కూర్చిన వర్ణనలకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చినట్లుగా కనబడుతుంది. మొన్న మొన్నటివరకూ కవులు ఈ విధమైన కావ్యాలు వ్రాస్తూనే ఉన్నారు దాదాపు ఆయా ప్రాంతలకి చెందిన రాజవంశాలన్నిటికీ, ఒకరిద్దరు రాజులను వర్ణిస్తూ రచించిన కావ్యాలు లభిస్తున్నాయి.

కొందరుమహాకవులు తమ కవిత్వాన్ని కొత్తతోవలు తొక్కించారు. వ్యాకరణంలో ఉన్న నియమాలూ, ఉదాహరణలూ కావ్యరూపంలో అందించడానికై భట్టి (క్రీ. శ. 600) 'రావణవధము' అనే కావ్యం రచించినాడు. కొందరు కవులు రామాయణ కథ మహాభారత కథ వంటి రెండు మూడు కథలు ఒకేమాటు చెపుతూ శ్లిష్టపదాలతోటీ అనేక విధాలుగా విడదీయడానికి అనువైన సమాసాలతోటి కూడిన కావ్యాలు రచించినారు. కవిరాజు రచించిన రాఘవపాండవీయం వంటి కావ్యాలు ఈ తరహాకు చెందుతాయి. భాషా వ్యాకరణాలపై సంపూర్ణ స్వాతంత్ర్యం, పద్యనిర్మాణ శక్తీ ఇవి కలపడంతో ఒక కొత్తరకమైన కవిత్వం కూడా ప్రచారంలోకి వచ్చింది. ఏకాక్షరపద్యాలు, పద్మ, మురజాద్యాకారాలలో వ్రాయడానికి అనువైన పద్యాలూ, ప్రహేళికలూ, సమస్యలూ మొదలైన వినోదార్థం ఉపయోగించే కవి

త్వం అంతా ఈ కోవకే చెందుతుంది. ఇవన్నీ సంస్కృత మహావాఙ్మయానికి చెందిన క్షుద్రమార్గా (by ways) లని చెప్పవచ్చు.

కావ్యాలలోనూ, రూపకాలలోనూ కూడా సంస్కృత కవులందరూ సూక్ష్మంలో రేఖాచిత్రంనిర్మించే శక్తిని సర్వదా చూపుతూనే వచ్చినారు. ఒక రసానికి సంబంధించిన సంపిండితమైన అంశాన్నీ, పురుషులు, స్త్రీలు, వృక్ష పశ్వాదులు, వీటి స్పష్ట రూపాన్నీ చక్కగా చిత్రించే శ్లోకాలు ఎన్నో మనకు లభిస్తాయి. ఈ విధంగా పరిపూర్ణచిత్రం చిత్రించే శ్లోకాలకు ముక్తకాలని పేరు. శృంగారం వంటి ఒకే విషయం చిత్రిస్తూ రచించిన ఆ విధమైన ముక్తకాల ప్రాచీన సంకలన గ్రంథాలలో భర్తృహరి - అమరుకాదుల రచనలు ప్రధానంగా పేర్కొ తగినవి. సాధారణంగా ఈలాంటి సంకలన గ్రంథాలలో వంద చొప్పున శ్లోకాలు ఉండటంచేత వీటికి శతకాలని పేరు. భర్తృహరి శృంగారశతకమే కాకుండా నీతిశతకమూ, వైరాగ్యశతకమూ అనే మరో శతకద్వయంకూడా రచించి ఉన్నాడు. జంతువులు, పక్షులు, వృక్షాలు మొదలైన వాటిని వంకగా చేసికొని మానవుల స్వభావ వ్యవహారాదులు వర్ణించే మరో పద్ధతి కూడా ఈ వాఙ్మయంలో కనబడుతుంది. ఇలాంటి శ్లోకాలకి అన్యాపదేశాలని పేరు. కాశ్మీరుకు చెందిన భల్లటుడు (క్రీ.శ. 9వ శతాబ్దం) వ్రాసిన (అన్యాపదేశ) భల్లట శతకం ఈ రకం వాఙ్మయంలో ప్రధానంగా చెప్పతగింది. మధురానివాసియైన నీలకంఠ దీక్షితుడు (క్రీ.శ. 1 వ శతాబ్దం) అన్యాపదేశ శతకం ఒకటి వ్రాసినాడు ఇతనిది ఉపహాసానికి, అధిక్షేపణకీ అందెవేసిన చెయ్యి. ఈ పద్ధతి మొన్న మొన్నటి వరకూ వాడుకలో ఉంది. సంస్కృత వాఙ్మయంలో నీతిశ్లోకాలకొక విశిష్టస్థానం ఉంది. ముప్పైరెండు అక్షరాల అనుష్టుప్‌వంటి చిన్న శ్లోకంలో అతి సంగ్రహంగా సర్వమానవులకూ ఉపయోగించే వివిధ జీవిత విధానాలకు సంబంధించిన సార్వకాలిక నీతి మార్గాన్ని హృదయానికి హత్తుకునే విధంగా చెప్పడం ఈ రచనలలోని వైశిష్ట్యం. ఈ విధమైన ఎన్నో సుభాషితాలు, వ్యాసుడు మొదలు ఎందరో మహాకవులు రచించినవి, చాలాకాలంగా మనకు అందుబాటులో ఉన్నాయి. ఇవికాక అజ్ఞాతకర్తృకాలైన ఎన్నో నీతి శ్లోకాలు సంకలన గ్రంథాలోలనూ, ఉపదేశప్రధానాలైన పంచతంత్రము, హితోపదేశము మొదలైన గ్రంథాలలోనూ నిక్షిప్తములై ఉన్నాయి. ఈ దేశంలో అనుస్యూతంగా వస్తూన్న సర్వసాధారణ విజ్ఞానానికి ఆలవాలాలైన ఈ నీతి శ్లోకాలు ఎందరో పండితుల నోళ్లలో నిలిచి సంభాషణాదులలోను, ఉపన్యాసాలలోను అపూర్వ సౌందర్యాన్ని సమకూరుస్తున్నాయి.

ఎందరో మహిళలు కూడా సంస్కృత భాషలో కవిత వ్రాసి ఉన్నారు. విజ్జిక లేక విజయాంక అనే కర్ణాట దేశపు రాణివంటి కొందరు ప్రాచీన కవయిత్రుల కావ్యాలను గూర్చి మనకు కేవలం సంకలన గ్రంథముల ద్వారా మాత్రమే తెలుస్తున్నా, 14 వ శతాబ్దం మొదలు 18 వ శతాబ్దం వరకూ ఉన్న స్త్రీకవుల కావ్యాలు మనకు లభ్యం అవుతున్నాయి.

ప్రాచీన భారతదేశం చదరంగము, జంతువుల కథలు మొదలైన హాయిగా కాలం గడపడానికి ఉపయోగించే ఎన్నో సాధనాలు కూడా ప్రపంచానికి అందించింది. నీతి బోధకై ఉద్దిష్టాలైన జంతుకథలు మహాభారతంలో కూడా లభ్యం అవుతున్నాయి. ఈలాంటి కథలనే, రాజకుమారులకు, ఇతరులకు రాజనీతిని ధర్మాన్నీ బోధించడానికై ఒకచోట కూర్చి, దానిలో

మార్పులు, చేర్పులు చేయడంతో పంచతంత్రమూ, తంత్రాఖ్యాయిక, హితోపదేశమువంటి గ్రంథములు బయలుదేరినాయి. ఈ కథలు పహ్లావీ అనువాద రూపంలో మొట్టమొదటిసారిగా (క్రీ. శ. 530-579) మధ్య ఏశియా ప్రాంతంలో ప్రవేశించినాయి. తరువాత పహ్లావీ భాషలోనుంచి సిరియాకో భాషలోకి (క్రీ. శ. 570), దానిలోనుంచి అరబ్బీ భాషలోకి, దానితో నుంచి యూరప్ భాషలలోకి వీటి అనువాదాలు బయలుదేరినాయి. ప్రపంచంలోని యాభై భాషలలో పంచతంత్రానికి దాదాపు రెండువందల విభిన్న పాఠాలు (versions) ఉన్నట్లు తెలియవస్తూంది.

అరేబియాదేశం భారతదేశంనుంచి కేవలం ఈ కథలే కాకుండా ఖగోళశాస్త్రమూ, గణితశాస్త్రమూ, ఆయుర్వేదమూ మొదలైన విషయాలు కూడా తీసుకొని ప్రచారం చేసింది. అరేబియాకి చెందిన పండితులు పైశాస్త్ర గ్రంథములన్నింటినీ చాలావరకు ఎనిమిది తొమ్మిది శతాబ్దాలలో అనువదించినారు. గణితశాస్త్రం విషయంలో ప్రపంచకం భారతదేశానికి ఏవిధంగా ఋణపడి ఉన్నదీ వెనుకనే చూసిఉన్నాము. ఆయుర్వేదం అతిప్రాచీన శాస్త్రం. క్రీస్తుశకం ప్రారంభానికి చెందిన చరక సుశ్రుతులు, క్రీ. శ. 600 ప్రాంతానికి 700 ప్రాంతానికి చెందిన ఇద్దరు వాగ్భటులు, ఆయుర్వేదంలో ప్రధానంగా చెప్పుకోవలసిన మహాపండితులు. ప్రాచీన భారతదేశంలో సూక్ష్మాతిసూక్ష్మం ఐనశస్త్ర చికిత్సా విధానంకూడా ఉండేదని వీరిగ్రంథముల ద్వారా మనకు తెలుస్తూంది, టిబెటు, సిలోను, గ్రేటర్ ఇండియా మొదలైన ప్రాంతాలలో ఉండే వైద్యశాస్త్రం పూర్తిగా భారతదేశంమీద ఆధారపడి ఉండేది. మధ్యఆసియా ప్రాంతంలో ఆయుర్వేదానికి సంబంధించిన అనేకమైన సంస్కృత గ్రంథములు (వ్రాతప్రతులు) లభించినాయి. ఐరోపాఖండం వారు తయారు చేసిన అనేక రకాల శస్త్ర చికిత్సా సాధనాలన్నింటికి భారతదేశంలో లభించే సాధనాలే ఒరవడి అవడం అటుండగా, పాశ్చాత్యదేశీయులు రూప కల్పక శస్త్ర చికిత్సవంటి శస్త్ర చికిత్సా విధానాలు (Plastic surgery) నేర్చుకొన్నది కూడా భారతదేశం నుంచే.

మొదట చెప్పినవిధంగా ఇండోయూరపియన్ కుటుంబానికి చెందిన ఈ సంస్కృత భాషకు పాశ్చాత్య మధ్యఆసియా ప్రాంతాలతో ఘనిష్ట సంబంధం ఉండేది. అథెన్స్, అలెగ్జాండ్రియాలతో కూడా సంబంధం ఉండేది. ఆర్థిక సంబంధానికి గాని, సుఖభోగాలకు ఉపయోగించే వస్తువుల వ్యాపారానికిగాని ఏమాత్రమూ తీసిపోని బౌద్ధిక పరస్పర వ్యవహారం ద్వారా ఈ భాష భారతదేశానికి ఇతర ప్రపంచంతో ఘనిష్ట సంబంధం సంపాదించి పెట్టింది. సంస్కృతమూ, భారతదేశమూ కూడా ఇతరులకు ఇచ్చినాయి, తాము తీసుకొన్నాయి. భారతదేశానికి అవతల సరిహద్దులో ఉండే దేశాల వారందరూ ఈ సంస్కృతభాషను, కొంచెం మార్పు చేర్పులతో, నేర్చుకొనేవారు; వ్యవహరించేవారు కూడా. ఆ ప్రాంతాలలో ఇప్పటికీ అపూర్వాలైన సంస్కృత లిఖితగ్రంథములు లభిస్తూనే ఉన్నాయి. బౌద్ధమతంద్వారా సంస్కృతం టిబెట్టు, మధ్యఆసియా, చైనా మొదలైన ప్రాంతాలలో బాగా వ్యాప్తిచెందింది. సంస్కృత-బౌద్ధగ్రంథముల ప్రాంతీయ భాషానువాదాలు ఇప్పటికీ ఆప్రాంతాలలో లభిస్తున్నాయి. ఐతే వాటి మూలాలైన సంస్కృత గ్రంథములు మాత్రం భారతదేశంలో కూడా లభ్యం అవడంలేదు. ఇదేవిధంగా సంస్కృతమూ, హిందూమతమూ, హిందూశిల్పమూ ఇవన్నీ ఆగ్నేయ ఆసియా ప్రాంతం అంతటా పూర్తిగా వ్యాపించినాయి. నిర్దుష్టమైన

సంస్కృత కావ్యశైలిలో వ్రాసిన అనేకమైన శాసనాలే ఆధారంగా తీసుకొని కంబోడియా దేశ చరిత్ర వ్రాయటం జరిగింది. ఈ విధంగా సంస్కృతం రాష్ట్రైకమత్యానికీ, అంతర్ రాష్ట్రీయ సౌహృదానికీ ప్రతీకంగా నిలచి భారతదేశానికి ఐరోపాఖండంతోనూ, చాలావరకు ఆసియా ప్రాంతంతోనూ సంబంధం సమకూర్చింది. సాహిత్య ప్రక్రియలోనూ, భావావిష్కరణంలోనూ నేటికి కూడా సంస్కృతభాషా ప్రయోగం జరుగుతూనే ఉంది. భారత ప్రభుత్వం వారు జాతీయ భాషలుగా గుర్తించిన భాషలో సంస్కృతభాష ఒకటి. భారతదేశంలోని ప్రతీ బాలుడూ బాలికా కూడా కనీసం భగవద్గీత చదివి అర్థం చేసుకోవడానికైనా సంస్కృతం నేర్చుకోవాలని మహాత్మాగాంధీ బోధించి ఉన్నారు. జాతీయ భాషగా రూపొంద వలసి ఉన్న హిందీని అభివృద్ధి చేయడానికి సంస్కృత భాషను మూలంగా తీసుకోవాలని భారతరాజ్యాంగం ఆదేశించింది. సరిగా ఉపయోగించు కొన్నట్లైతే ఈనాటికి కూడా సంస్కృతం భావాత్మక-నైతిక-భౌగోళిక సమైక్యం సంపాదించి భారత జాతీయాభివృద్ధికి దోహదం చేస్తూ విదేశాలతో అనూచానంగా వస్తూన్న స్నేహబంధాలను కూడా పటిష్ఠం చేయగలదు.

## విషయసూచిక

భవభూతి, సుబంధుడు, హర్షవర్ధనుడు, పల్లవరాజైన మహేంద్ర విక్రముడు, మురారి, విశాఖదత్తుడు, రాజశేఖరుడు, త్రివిక్రముడు, మహిమభట్టు, అభినందుడు, కృష్ణమిశ్రుడు, శ్రీహర్షుడు, జయదేవుడు, వేదాంతదేశికుడు, ఉద్దండుడు, కల్హణుడు.

(గ) (గ) భర్తృహరి-ఆతని శతకత్రయము.

(ఘ) అమరుకుని శృంగార (అమరుక) శతకము.

(ఙ) స్త్రీ కవులు.

(చ) అన్యాపదేశాలు.

(ఛ) శృంగారం.

(జ) వాత్సల్యము, స్నేహము.

(ఝ) (i) బాణుడు-కాదంబరి, హర్షచరితము.

(ii) దండి-దశకుమార చరితము.

(ఞ) సుభాషితాలు.

## వేదాలు

ఋగ్వేదము :

I.90 ఋతంలో ఉన్న మాధుర్యం.

6–8 ''ఋతం కావాలని కోరుకొనేవారికి వాయువులు మధురంగా ఉంటాయి; నదులు మధురంగా ప్రవహిస్తాయి. అదేవిధంగా మా విషయంలో ఓషధులు మధురంగా ఉండుగాక. రాత్రి, ప్రాతఃకాలములుకూడా మధురంగా ఉండుగాక, ఈ భూలోకం మధురంగా ఉండుగాక, తండ్రి ఐన ద్యులోకంకూడా మా విషయంలో మధురంగా ప్రవర్తించుగాక, అరణ్యాధిపతి మధురంగా ప్రవర్తించుగాక, సూర్యుడు మధురంగా ఉండుగాక, ధేను సముదాయం మధురంగా ఉండుగాక"

I. 164.46. "ఆతనిని ఇంద్రుడనీ, మిత్రుడనీ, వరుణుడనీ, అగ్ని అనీ, సుపర్ణుడూ, దివ్యమూర్తి ఐన గరుత్మంతుడు అనీ చెపుతారు. విప్రులు ఒక్క తత్త్వాన్నే (సత్) చాలా పేర్లతో పిలుస్తున్నారు. ఆ తత్త్వాన్ని అగ్ని అనీ, యముడు అనీ,మాతరిశ్వుడు అనీ చెప్పుచున్నారు."

III. 62.10 గాయత్రి : (వేదమాతగా వర్ణించబడిన అత్యుత్తమమైన ప్రార్థన-మహామంత్రం).

"పూజనీయమైన సవితయొక్క దేదీప్యమానమైన తేజస్సును ధ్యానిస్తున్నాము. ఆతడు మా బుద్ధులను ప్రవర్తింపచేయుగాక."

X. 85. వివాహం.

36. (వరుడు వధువుతో అన్న మాటలు). "సౌభాగ్యం కొరకై నేను నీ చెయ్యి గ్రహిస్తున్నాను. నీవు భర్తవైన నాతో వార్ధక్యం పొందుదువు కాక. భగుడు, అర్యముడు, సవిత, పూషుడు అనే దేవతలు గృహస్థజీవితం గడపడానికై నిన్ను నాకిచ్చినారు."

36. (దంపతులతో అన్నమాటలు) "మీరిద్దరూ ఇక్కడే ఉండండి. మీరు వేరు

పడకుందురుగాక. పుత్రులతోటీ మనుమలతోటీ, ఆడుకుంటూ, మీ ఇళ్లలో ఆనందిస్తూ, పూర్ణాయుర్దాయం పొందుదురుగాక.''

44. (వధువుతో అన్నమాటలు) ''తీక్షణమైన చూపులు లేనిదానివై, నీ భర్తకు ఏ అపాయమూ కలగకుండా అభివృద్ధి పొందుము. పశువులయెడల జాలిగా ప్రవర్తించుము, అనుకూలమైన బుద్ధితో ప్రకాశించుము. వీరులకు తల్లివి అవుము. దేవతలయందు భక్తికలదానవై ఆనందము సమకూర్చేదానవు అవుము. మా పురుషులకు, స్త్రీలకు, పశువులకూ మంగళం సమకూర్చేదానవు అవుము''.

45. ''దానశీలుడైన ఓ ఇంద్రా, ఈ వధువుకు ఉత్తములైన కుమాళ్ళనూ భాగ్యాన్నీ ఇమ్ము. ఈమెకు పదిమంది పుత్రులను ఇచ్చి ఈమె భర్తను పదకొండో వానినిగా చేయుము.''

46. (వధువుతో అన్నమాటలు)-'నీ మామగారిపై రాణివి అవుము. నీ అత్తగారిపై రాణివి అవుము. ఆడపడచులపై రాణివి అవుము. నీ మరుదులపైనా బావగార్లపైనా రాణివి అవుము.'

47. (దంపతులతో అన్నమాటలు)-''అందరు దేవతలూ మీ హృదయాలు కలిసేటట్లు చేయుదురుగాక. జలాలు మీ హృదయాలు కలిసేటట్లు చేయుగాక. సృష్టికర్త మీ హృదయాలు కలిసేటట్లు చేయుగాక. ఫలప్రదాత్రి ఐన సరస్వతి మీ హృదయాలు కలిసేటట్లు చేయుగాక.''

X 90. పురుష సూక్తం. (పరమ పురుషుని ప్రతిపాదించే సూక్తం):

పరమ పురుషునికి వెయ్యి (వేలకొలది) తలలు, వెయ్యి కళ్ళు, వెయ్యి పాదాలు ఉన్నాయి. ఈ భూమి నలుమూలలా వ్యాపించిఉన్నా ఈ పురుషుడు దీనికంటే ఒక జానెడు ఎక్కువగా ఉన్నాడు. భూతమూ, భవిష్యత్తూ ఇది అంతాకూడా పురుషుడే. అమృతత్వానికీ. అన్నంచే వృద్ధిపొందేదానికీ కూడా (మర్త్యప్రాణి సముదాయానికీ కూడ) ఇతడు అధిపతి. ఇతని మహిమ అటువంటిది. ఈ పురుషుడు అంతకంటే కూడా గొప్పవాడు. ప్రపంచం అంతా అతనిలో నాలుగోవంతు మాత్రమే. ఇతని మిగిలిన మూడువంతులూ కూడా పైన ఉంటాయి. ఇతని నాలుగోవంతు మాటిమాటికి ఇక్కడకు వస్తూ (ఆవిర్భవిస్తూ) ఉంటుంది. ఈ నాలుగోవంతుతోటే ఆతడు ప్రాణ్యప్రాణి రూపంఐన ఈ జగత్తునంతా వ్యాపిస్తాడు. దాని నుంచి బ్రహ్మాండం (విరాట్స్వరూపం) పుట్టింది; దానిలో ఈ పరమ పురుషుడు జన్మించి ఇంకా (దేవతలుగాను, మనుష్యులుగాను) వ్యాప్తిపొందినాడు. తరవాత ఇతడు ఈ భూమిని, శరీరాలను సృష్టించినాడు.

ఈ పరమపురుషుని పశువుగా చేసికొని దేవతలు చేసిన యజ్ఞంలో వసంతఋతువు నెయ్యిగాను, గ్రీష్మం కట్టెగాను, శరదృతువు హోమద్రవ్యంగాను ఏర్పడింది. వారు యజ్ఞంలో ఉపయోగించదలచిన ఈ పరమపురుషుని పశువుగా (బంధించి) బర్హిస్సుమీద ఉంచినారు. సాధ్యులు, ఋషులు, దేవతలూ ఆతనిని ఉపయోగించి యజ్ఞం చేసినారు. ఈ పురుషయజ్ఞం నుంచి నెయ్యితో కలిసిన పెరుగు ఆవిర్భవించింది. తరవాత అతడు గాలిలోని ప్రాణులను గ్రామారణ్యాలలోని ప్రాణులను సృష్టించినాడు. ఈ పురుషయజ్ఞంలోనుంచి ఋక్కులు, సామాలు బయలుదేరినాయి; దానినుంచే ఛందస్సులు పుట్టినాయి. దీనినుంచి యజుస్సు

ఆవిర్భవించింది. దానినుంచి గుర్రాలు, రెండేసిపండ్ల వరుసలుగల జంతువులు ఆవిర్భవించి నాయి. దానినుంచి పశువులు పుట్టినాయి. దానినుంచి మేకలు, గొర్రెలు పుట్టినాయి.

ఆతని ముఖం బ్రాహ్మణుడుగా ఐనది. ఆతని బాహువుల నుంచి క్షత్రియుడు పుట్టినాడు. వైశ్యుడు ఆతని తొడలు. ఆతని పాదాలనుంచి శూద్రుడు పుట్టినాడు. చంద్రుడు ఆతని మనస్సు నుంచి జన్మించినాడు. ఆతని కళ్లనుంచి సూర్యుడూ, ముఖం నుంచి ఇంద్రాగ్నులు, శ్వాసనుంచి వాయువూ పుట్టినారు. ఆతని నాభినుంచి ఆకాశమూ, తలనుంచి స్వర్గమూ, పాదాలనుంచి భూమి, చెవులనుంచి దిక్కులు పుట్టినాయి. ఈ విధంగా లోకాలు ఏర్పాటు చేసినారు.

ఈ యజ్ఞానికి ఏడు వేదికలు ఉండెను. మూడు ఏళ్ల సంఖ్యగల (ఇరవైయొక్క) సమిధలు ఉంచబడినాయి. దేవతలు చేసిన ఈ యజ్ఞంలో వాళ్లు పురుషుని పశువుగా బంధించినారు. దేవతలు యజ్ఞంతో యజ్ఞం చేశారు. వారు చేసినవి మొట్ట మొదటి ధర్మాలుగా ఏర్పడ్డాయి. ఆశక్తులు ప్రాచీనులైన సాధ్యులూ, దేవతలూ ఎక్కడ ఉంటారో ఆ స్వర్గం చేరుకుంటాయి".

X. 117 ఐశ్వర్యమూ ఆహారమూ పంచు కోవడం :

1-2 "దేవతలు మరణం ఇచ్చినారు. ఆకలి కాదు. ఎవడు (ఇతరులకు ఇవ్వకుండా) తింటాడో అతనికి మరణం ప్రాప్తిస్తుంది. ఔదార్యం కలవాళ్ళ ఐశ్వర్యం ఎన్నటికీ తరగదు. లోభికి ఆనందం కలిగించేది ఏది ఉండదు. నీచబుద్ధి కలవాడు వ్యర్థంగా ఆహారం కూడబెడతాడు; నేను నిజంగా చెపుతున్నాను. నిజానికి ఇది వాడికి మరణమే. దేవతలను గాని స్నేహితులను గాని పోషించకుండా తానొక్కడే పాపాన్ని మాత్రమే పెంచుకొంటాడు."

10-191 ఐకమత్యం :

2-4 "కలిసి మెలిసి ఉండండి. అంగీకారానికి వచ్చేటట్లుగా మాటలాడుకొండి. పూర్వం దేవతలందరూ పరస్పరం అంగీకారంతో హవిస్సు తీసుకొన్నట్లుగా మీ అందరి బుద్ధులూ ఒకే విధంగా గ్రహించుగాక. మీ ఆలోచనలు ఒకే విధంగా ఉండుగాక; మీ నిర్ణయాలు ఒకే విధంగా ఉండుగాక; మీ మనస్సులూ, ఆలోచనలూ కలిసి ఒకే విధంగా ఉండుగాక. నేను మీ అందరికీ సంబంధించిన ప్రార్థన చెపుతున్నాను; మీ అందరూ కలిసి అవలంబించవలసిన కర్తవ్యం చెపుతున్నాను, మీ ఆశయం ఒకే విధంగా ఉండుగాక; మీ హృదయాలు ఒకే విధంగా పనిచేయుగాక; మీ మనస్సులు ఒకే విధంగా ఆలోచించుగాక. సంపూర్ణ ఐకమత్యం ఉండుగాక."

ఖిల సూక్తాలు.

శ్రీ సూక్తం (సౌందర్య-ఐశ్వర్యాధి దేవతను ప్రార్థించే సూక్తం)

1-10. "ఓ అగ్ని, బంగారు చాయకలదీ, బంగారు మాలికలూ, వెండి మాలికలూ ధరించినదీ ఆనందం కలిగించేదీ, సువర్ణాధిష్ఠాత్రి ఐన సౌందర్య దేవతను నాకొరకై ఆవాహన చేయుము. ఓ అగ్ని, నన్ను ఎప్పటికి విడచిపోనిదీ, (నాకు) బంగారమూ, గోవులూ, అశ్వాలూ, మనుష్యులూ సమకూర్చేదీ అయిన భాగ్యదేవతను నాకై ఆవాహన చేయుము. ఎదట గుర్రాలూ, మధ్య రథాలూ ఉండగా, ఏనుగుల ఘీంకారాలచేత ప్రతిబోధిత అయి, ప్రకాశించుచున్న సమృద్ధి దేవతను నా దగ్గరకు ఆహ్వానిస్తున్నాను. ఆ

సమృద్ధి దేవత నన్ను చేరుగాక. చిరునవ్వులొలికించేదీ, బంగారు ప్రాకారము కలదీ, తడిగా ఉన్నదీ, ప్రకాశిస్తున్నదీ, తృప్తిపొందినదీ, తృప్తి పొందించేదీ, పద్మవర్ణం కలదీ ఐన సమృద్ధి దేవతను నేను ఇక్కడకు ఆహ్వానిస్తున్నాను. ఏ దేవత ఈ ప్రపంచకంలో గొప్ప ప్రభావంతో ప్రకాశిస్తున్నదో, ఏ దేవతను ఐశ్వర్యం కొరకై దేవతలందరూ సేవిస్తూ ఉంటారో, అట్టి దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న ఆనందం కలిగించే పద్మ దేవతను నేను శరణు పొందుతున్నాను. నా దురదృష్టమంతా తొలగి పోవుగాక. ఆకలి, దప్పిక, దారిద్ర్యము-వీటి రూపంలో ముందుగా ఆవిర్భవించిన దురదృష్టాన్ని నేను తొలగించు కొంటాను. (ఓ భాగ్యదేవతా!) నా ఇంటిలో నుంచి అన్ని చెడుగులూ, దారిద్ర్యమూ, తొలగింప చేయుము. సుగంధం చేత సూచితమైనదీ, ధరింపశక్యం కానిదీ సర్వదా పుష్టితో కూడినదీ, పశు సమృద్ధి కలదీ, సర్వభూతాధినేత్రి అయిన శ్రీదేవిని ఇచటకు ఆహ్వానిస్తున్నాను. మనస్సు యొక్క కోరికా, అభిప్రాయమూ, వాక్కుయొక్క సత్యమూ అయినదీ అన్న- పశురూపిణి అయిన శ్రీదేవితో మేము సంబంధం కలిగి ఉందుముగాక. ఆ అదృష్టదేవత, ఆ కీర్తి దేవత మా వద్దకు వచ్చుగాక.''

## కృష్ణయజుర్వేదం

III. iii-2. మాధుర్యం

2. ''నేను మధురమైన వస్తువులగూర్చి మాత్రమే తలుస్తాను. మధురమైనవస్తువులు మాత్రమే సృజిస్తాను. మధురమైన వస్తువులు ధరిస్తాను. మధురమైన వస్తువులను గూర్చి మాత్రమే మాట్లాడుతాను. దేవతలకు మధురంగా ఉండేవీ, మనుష్యులు వినడానికి ఇష్టపడేవీ అయిన మాటలు మాత్రమే మాటలాడుదును గాక. అందుచేత, నేను (సంభాషణ సౌందర్యంతో ఆయా సమయాలు) అలంకరించేటట్లుగా దేవతలు నన్ను రక్షించెదరు గాక. మా పూర్వ పురుషులు కూడా నన్ను (నా సంభాషణాన్ని) ప్రశంసించెదరు గాక.''

vii. v. 18. 1. జాతీయ ప్రార్థన

(శుక్లయజుర్వేదంలో కూడా ఉంది. xxxi. 22)

''ఈ దేశంలో బ్రాహ్మణుడు బ్రాహ్మణులలో బ్రహ్మ తేజస్సుతో జనించుగాక. రాజు వీరుడు గాను, ధనుర్ధరుడుగాను, మహారథుడుగాను జన్మించుగాక. ధేనువు పాడి ఆవుగా జనించుగాక. ఎద్దు బలంగా లాగే ఎద్దుగాను, గుర్రం వేగం కలదిగాను, వనిత నగర ప్రశంసా పాత్రురాలుగాను, యోధుడు విజేతగాను, యువకుడు సభార్హుడు గాను అవుగాక. యజమానునికి వీరుడు జనించుగాక. మాకు కావలసినప్పుడల్లా మేఘాలు వర్షించుగాక. మా చెట్లు పండ్లతో నిండి ఉండుగాక. మేము ధనము సంపాదించుకొందుము గాక, దానిని సంరక్షించు కొందుము గాక.''

## శుక్లయజుర్వేదం

xxxiv. శివసంకల్పం. (సదాలోచన)

1-6. ''జాగ్రదవస్థలోనూ, స్వప్నావస్థలోనూ కూడా ఏది దూరంగా వెడుతూ ఉంటుందో, ఏది తేజస్సులన్నింటిలోకీ దూరంగా ప్రయాణంచేసే తేజస్సో (ఇంద్రియాలన్నింటికీ ఇంద్రియమో) అలాంటి దివ్యమైన నా మనస్సు మంచి సంకల్పం కలది అవుగాక. దేని

సహాయంతో కర్మఠులైన బుద్ధిమంతులు యజ్ఞాలలో తమతమ పనులు చేస్తూ ఉంటారో, తెలివి తేటలతో చేయవలసిన కార్యాలు నిర్వహిస్తూ ఉంటారో, ఏది చాలా ఆశ్చర్యజనకమైనదో, ఏది అన్ని భూతాలలోను (ప్రాణులలో) ఉన్నదో, అలాంటి నా మనస్సు అందమైన సంకల్పం కలది అవుగాక. ఏది జ్ఞానధైర్యాది స్వరూపమైనదో, ఏది అన్ని ప్రాణుల లోపలా నివసించే శాశ్వతమైన తేజస్సో, ఏది లేకపోతే ఏ పని జరగదో, అలాంటి నా మనస్సు మంగళమైన ఆలోచనలు కలది అవ్వుగాక. చచ్చిన దానినీ, (జీవించి) ఉన్న దానినీ, పుట్టబోయే దానినీ ఏది గ్రహిస్తుందో, దేని సహాయంతో ఏడుగురు ఋత్విక్కులు జరిపే యజ్ఞం జరుగుతున్నదో, అలాంటి శాశ్వతమైన నా మనస్సు సదభిప్రాయాలు కలది అవుగాక. ఋక్-సామ-యజుర్వేదాలు చక్రం ఇరుసు మీద ఆకులు ఆధారపడి ఉన్నట్లుగా దేని మీద ఆధారపడి ఉన్నాయో, ప్రాణుల ఆలోచనలన్నీ దేనిమీద పడుగూ పేకలుగా అల్లుకుంటున్నాయో, అలాంటి నా మనస్సు సదభిప్రాయం కలది అవుగాక; మంచి సారథి కళ్లెంతో గుర్రాలను సరియైన దారిలో తోలిన విధంగా ఏది మానవులను నడిపిస్తుందో, ఏది హృదయంలో నిహితమైఉందో అలాంటి శాశ్వతమూ, వేగశాలీ అయిన నా మనస్సు సదభిప్రాయాలు కలది అవుగాక."

## అథర్వ వేదం

III. 8. సామరస్యం సంపాదించడం :-

"మేము మీ మనస్సులూ, మీ పనులూ, మీ ఆలోచనలు కూడా మావైపుకు త్రిప్పుకుంటాం. మాకు విరుద్ధం ఐన పనులుచేస్తూ మాకు దూరంగా ఉన్న మిమ్మల్ని మావైపు త్రిప్పుకుంటాం. నా మనస్సుతో మీ మనస్సులు పట్టుకొంటాను. నా అభిప్రాయాలకి అనుగుణంగా ఉండే అభిప్రాయాలతో నాతోరండి. మీ హృదయాలు నా అదుపులో ఉంచుకుంటాను. నేను నడుస్తూన్న మార్గమే అనుసరిస్తూ నా వెనక్కాలేరండి."

III. 15. వ్యాపారంలో లాభంకోసం :-

1, 2, 5. "వాణిజ్యం చేసే ఇంద్రునితో చెపుతున్నాను—అతడు మా దగ్గఱకు వచ్చి, మాముందు నడుస్తూ, వెల చెల్లించకుండా నాదారికి అడ్డంవచ్చే పశువువంటి పోటీదారుని దూరంగా తొలగించుగాక. ప్రభువైన ఇంద్రుడు నాకై ఐశ్వర్యం సంపాదించిపెట్టుగాక. భూమికీ స్వర్గానికీ మధ్య దేవతలు నడిచే మార్గాలన్నీ వాళ్ళు పాలతోటీ నేతితోటీ నింపడంతో, వ్యాపారం ద్వారా నేను ఐశ్వర్యం కూడబెట్టుదునుగాక. ఓ దేవతలారా, ఎక్కువ లాభం అర్థిస్తూ నేను ఏ ధనంతో ఐతే వ్యాపారం చేస్తున్నానో ఆ ధనం చాలారెట్లు పెరుగుగాక, ఎన్నటికీ తరగకుండు గాక, ఓ అగ్నీ, నేను సంపాదించే లాభం చెడగొట్టాలని చూసే వారిని ఈ హవిస్సు స్వీకరించి, విఫలప్రయత్నులనుగా చెయ్యి."

III. 17. వ్యవసాయంలో సఫలత్వం కోసం :-

1-4, 8-9 "దూరదృష్టి కలవాళ్ళు నాగళ్ళకి వాటి వాటి కాడి బిగిస్తారు; ఆలోచన కలవాళ్ళు దేవతల అనుగ్రహం కోరుతూ నాగళ్ళు సిద్ధంచేసి, కాడి బిగించి ఇక్కడ చాలు దున్ని విత్తనాలు చల్లుతారు. ఓ దేవతలారా, వెన్నులు మాకోసం నిండుగా ఉండుగాక. పండిన సస్యం కొడవలిని ముట్టుగాక. వాడైన మొనా, నున్నని పిడీ కల బాగాదున్నే,

నాగలి మాకు పశువులు, గొర్రెలు, రథంలాగే గుర్రమూ, బలిసిన పిల్లా- వీటిని సంపాదించి పెట్టుగాక. ఇంద్రుడు దుక్కి నడిపించుగాక, పూష దానిని నలువైపులా రక్షించుగాక. దుక్కి అనే ఈ పాడి ఆవు మాకు ప్రతీ ఏడూ పంట ఇచ్చుగాక. అదృష్టం గల ఓ దుక్కీ, నీకు నమస్కారము, మావైపు చూచి మాకు అనుకూలంగా ఉంటూ మంచి ఫలితాన్ని అంద చెయ్యి. ఆ చాలు నేతితోటీ, తేనెతోటీ తడిసి ఉంది. దేవతలందరూ దీన్ని ఆశీర్వదించారు. ఓ చాలూ, కొవ్వుతోటీ, వీర్యంతోటీ తొణికిసలాడే పాలతో మాకేసి చూడు."

III. 30. ఐకమత్యం కోసం :-

"నేను మీకు ఐకమత్యంతో కూడిన హృదయమూ, మనస్సూ, పరస్పరం అసూయ లేకపోవడమూ ప్రసాదిస్తున్నాను. ఆవు అప్పుడే పుట్టిన దూడను ప్రేమించినట్లుగా ఒకరినొకరు ప్రేమించుకోండి. కుమారుడు తండ్రిని అనుసరించుగాక; తల్లితో ఐకమత్యం కలిగి ఉండుగాక; భార్య భర్తతో మధురంగానూ, ఆనందకరంగానూ మాటలాడుగాక. సోదరుడు సోదరుని ద్వేషించకుండుగాక. సోదరి సోదరిని ద్వేషించకుండుగాక. ఒకరితో ఒకరు అనుకూలంగా ఉంటూ, కలిసిమెలిసి పనిచేస్తూ వీరందరూ మంగళప్రదమైన మాటలు పలుకుదురుగాక. దేని ప్రభావంచేత దేవతలు పోట్లాడుకోరో, ఒకరినొకరు ద్వేషించరో అలాంటి మంత్రం, ఇక్కడ ఉన్న మనుష్యులందరికీ ఐకమత్యం కలిగించడం కోసం మీ ఇంట్లో పఠిస్తున్నాను. (మీలో ఉన్న) పై అధికారులతోను, మీ ఆలోచనలతోను ఎన్నటికీ విడిపోకుండా సర్వసాధారణం ఐన ఈభారం మోసే పని నిర్వహించండి. ఒకరితో ఒకరు తియ్యగా మాటలాడుకుంటూ రండి. మిమ్మలినందరినీ సమంగానూ, ఐకమత్యం కలవారిని గానూ చేస్తాను. ఒకేచోట తాగుతూ, ఒకేచోట తింటూ మీరూ నేనూ కార్యభారం వహిద్దాం. మీరందరూ కలిసి అగ్నిని పూజించండి. ఇరుసువలె ఆ అగ్నిని చుట్టుకొనండి నేను మిమ్మలిని అందరినీ సమంగానూ, ఐకమత్యం కలవారినిగానూ చేస్తాను. మిమ్మలినందరినీ ఒకచోట చేర్చి అమృతం రక్షించే దేవతలవలె ఒక సంఘంగా చేస్తాను. ప్రొద్దుటా, సాయంకాలమూ కూడా (ఎల్లవేళలా) మీ అందరిలోనూ మంచి అభిప్రాయం నెలకొని ఉండుగాక."

IV. 16. వరుణుడు (ఋతానికి పర్యవేక్షకుడు) :-

"ఈ మహా పర్యవేక్షకుడు అన్ని విషయాలూ గూడా దగ్గరగా ఉండి చూసి నట్లుగా చూస్తాడు. నేను రహస్యంగా వెడుతున్నానని ఎవరైనా అనుకోవచ్చు, ఐతే అదంతా దేవతలు తెలుసుకుంటూనే ఉంటారు. నిలచినా, కదులుతున్నా, వక్రంగా నడుస్తున్నా, రహస్యంగా కాని, క్రూరబుద్ధితోగాని ప్రవర్తించినా అందరినీ వరుణుడు చూస్తూనే ఉంటాడు. ఎవరైనా ఇద్దరు కూర్చుండి రహస్యంగా కుట్రపన్నుతూ ఉంటే మూడోవాడుగా వచ్చి వరుణుడు తెలుసుకుంటాడు. ఈ భూమీ, సుదూరంలో ఉన్న ఆకాశమూ కూడా రాజైన వరుణుడివే. ఈ రెండు సముద్రాలూ అతని పొట్ట ఐతే ఇంత తక్కువ నీటిలో కూడా అతడు దాగి ఉంటున్నాడు. ఆకాశం దాటకలిగిన వాడ.కూడా వరుణుని నుంచి తప్పించుకో లేడు. స్వర్గలోకంలో నుంచి అతని గూఢచారులు భూమికి కాపలాకాస్తూ ఉంటారు. ఈ భూమిని వెయ్యి కళ్ళతో చూస్తూ ఉంటారు. భూమికీ స్వర్గానికీ మధ్య ఉన్న దానినీ, వాటికి అవతల ఉన్నదానినీ కూడా వరుణుడు చూస్తూ ఉంటాడు. అతడు మానవుల రెప్పపాట్లు వెక్కిరిస్తాడు. జూదగాడు పాచికలు లెక్క చూసుకున్నట్లు, అతడు ఆ రెప్పపాట్ల లెక్కల్లూ

ఆపీ జాగ్రత్తగా చూసుకోగలడు. ఓ వరుణుడా మూడేసి చుట్లు చుట్టి పీడించడానికి సిద్ధంగా ఉన్న నీ ఏడేసి పాశాలు అసత్యం ఆడేవానిని బంధించుగాక; సత్యం పలికేవాని జోలికి పోకుండా ఉండుగాక."

XII. 1. భూమి

1-3. "మహాసత్యమూ, దాటరాని ఋతమూ, వ్రతమూ, తపస్సూ, జ్ఞానమూ, యజ్ఞమూ భూమికి ఆధారంగా ఉన్నాయి. మన భూతానికీ భవిష్యత్తుకీ అధిపతిగా ఉన్న ఆ భూమి మనకై (మనజీవనానికై) విశాలమైన ప్రపంచం ప్రసాదించుగాక. ఎన్నో ఎత్తైన స్థలాలూ, విశాలమైన ప్రదేశాలూ, సమభూములు కలిగి గొప్ప ప్రభావంగల ఓషధులు పండే ఈ భూమి మనుష్యులతో ఇరుకు లేకుండా విస్తరించి మా విషయంలో సమృద్ధంగా ఉండుగాక దేనిపై సముద్రాలూ, నదులూ, ఇతర జలాలూ ఉంటున్నాయో, దేనినుంచి ఆహారాలూ, పంటలూ పండుతున్నాయో, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కల ప్రతిప్రాణీ కూడా దేనిపైన సంచరిస్తుందో అలాంటి భూమి మాకు ప్రథమభాగం ఇచ్చుగాక.''

6-7 "ఈ భూమి అన్నింటినీ ధరిస్తుంది; ధనానికి నిధి; సర్వాధారం; దీని గర్భంలో బంగారం ఉన్నది; సంచరించే ప్రాణులన్నింటికీ స్థైర్యం సమకూరుస్తుంది. అగ్నిని ధరిస్తుంది. ఇంద్రుడు దీనికి పుష్టి కలిగిస్తూ ఉంటాడు. అలాంటి భూమి మాకు ఐశ్వర్యం ఇచ్చుగాక. ఈ సువిశాల భూమి మాకు ఇష్టమైన మధుర పదార్థాలు ఇచ్చి మహామహిమ ప్రసాదించుగాక. 12. ఓ భూమీ నీ మధ్యభాగంలో నీ నాభి ప్రదేశంలో, నీకు పుష్టి కలిగించే స్థానాలలో మమ్మలిని ఉంచుము. మమ్మలిని పవిత్రింప చేయుము. భూమి నా తల్లి. నేను భూమి కుమారుడను. వర్షాలు నా తండ్రి. ఆతడు (వర్షదేవుడు) మా కోసమై (భూమిని) నింపుగాక.

16. అందరూ కూడా ఆమెను సామరస్యంతో పిదకుదురుగాక. ఓ భూమీ, నాకు మధురమైన వాక్కులు ఇమ్ము.

ఖిలమంత్రాలు :

వివాహం :

(ఋగ్వేదంలోంచి వివాహానికి సంబంధించిన కొన్ని మంత్రాలు వెనుక ఇచ్చి ఉన్నాము. ఇక్కడ మరికొన్ని చూపుతున్నాం.)

సప్తపది :

(కలిసి చేయవలసిన జీవన యాత్రకి ప్రతీకంగా ఏడు అడుగులు. దీనితో హిందూ వివాహ సంస్కారానికి పరిపూర్ణత్వం లభిస్తుంది. వరుడు వధువుతో అన్నమాటలు ఇవి.)

"నాతోపాటు ఏడు అడుగులు వేసి నాకు సఖివి అవుము. కలసి ఏడు అడుగులు వేసి మనం ఇద్దరమూ సహచరులం అవుదాం. నాకు నీ సఖ్యం లభించుగాక. నీ సఖ్యంనుంచి నేనూ, నా సఖ్యం నుంచి నీవూ విడిపోకుండా ఉందాముగాక. పరస్పరము ప్రేమాతిశయాలతో, (అన్యోన్య సాహచర్యం చేత) కాంతిని పెంపొందించుకుంటూ, సామరస్యంతో కూడిన మనస్సులతో ఆహారమూ, పరిపోషకద్రవ్యాలు కలిసి తీసుకుంటూ మనం ఇద్దరమూ కలిసి నడిచెదము గాక, కలిసి నిర్ణయించెదముగాక. ఒకే విధమైన ఆలోచనలతోటీ, నిర్ణయాలతోటీ ఏకమైన మనస్సులు కలియుగాక. నేను ఋక్కునైతే నీవు సామానివి; నేను సామం ఐతే నీవు

ఋక్కువు. నేను స్వర్గం, నీవు భూమివి. నేను విత్తనం, నువ్వు దానిని ధరించే దానవు. నేను మనస్సును, నువ్వు వాక్కువు. నేను సామం, నీవు ఋక్కువు. నువ్వు నాతో కనక ఒక్కటిగా కలిసి పని చేసినట్లైతే మనకు పుత్రుడు కలుగుతాడు. ఐశ్వర్యమూ, సంతానమూ లభిస్తాయి. ఓ మధురవాణీ, (నాతో) రమ్ము".

సన్నికల్లు త్రొక్కించడం.

(వధువు పాదం రాయిమీద ఉంచడం. ఆమె భక్తి రాయివలె స్థిరమైనది అని చెప్పడానికి ప్రతీకం ఇది.)

"ఈ శిలాఖండంపై అడుగుపెట్టు. ఈ శిలవలె స్థిరంగా ఉండు. అన్ని ప్రతిఘాతాలు ఎదురుకో. ఆక్రమించే వాళ్ళని పరాభవించు.

ధ్రువ-అరుంధతుల దర్శనం :

(ధ్రువనక్షత్రాన్ని, సప్తర్షిమండలంలో ఉన్న అరుంధతీ నక్షత్రాన్నీ) చూపడం. ధ్రువనక్షత్రం స్థైర్యాన్ని సూచిస్తుంది. భర్తయైన వశిష్ఠునియందు గొప్పభక్తిగల అరుంధతి పతిభక్తిని సూచిస్తుంది. వరుడు వధువుకి ఆ రెండు నక్షత్రాలు చూపిస్తూ ఇలా అంటాడు).

(ఓ ధ్రువుడా !) నువ్వు స్థిరమైన స్థానంలో ఉంటున్నావు. స్థైర్యం నీ నుంచే లభిస్తుంది. స్థిరమైన ఉనికికి నువ్వు కారణభూతుడవు. నీవు స్థిరంగా ఉన్నావు. నువ్వు నక్షత్రమండలానికి ఇరుసువు. ఘాతుకుల నుంచి నన్ను రక్షించుము.

## ఉపనిషత్తులు

ఈశ (వ్యాస) ఉపనిషత్తు.

ఈ ప్రపంచకంలో ఉన్న ప్రతీ జంగమవస్తువూ ఈశ్వరునిచేఅధివాసితమై ఉంది. దీనిని (జగత్తును) త్యాగం ద్వారా అనుభవించుము. ఎవరి ధనము కొరకూ ఆశపడకు.[1]

2. తనకు విహితాలైన కర్మలు నిర్వహిస్తూ మానవుడు నూరు సంవత్సరాలపాటు జీవించడానికి అభిలషించాలి. నీవు ఆవిధంగా ప్రవర్తిస్తే, విహిత కర్మల చేయడం కంటె వేరే మరో మార్గం లేదు. (ఎందుచేతనంటే-ఆవిధంగా చేసినట్లైతే) కర్మఫలం మానవుని మలినునిగా చేయజాలదు. 4. ఆ ఏకతత్త్వం (ఆత్మ) చలించదు, మనస్సుకంటే వేగంగా వెడుతుంది; మహా వేగంగా ముందుగా పరుగెత్తే దీనిని దేవతలు (జ్ఞానేంద్రియాలు) పట్టుకోజాలరు. అదిస్థిరంగా నిలచి ఉంటూనే పరుగెత్తే ఇతరులనందరినీ దాటి వెళ్ళిపోతుంది. మాతరిశ్వుడు (సూత్రాత్మ) దీనియందే సర్వప్రాణి కర్మవిభాగం చేస్తాడు. 5. అది కదులుతుంది, కదలదు; అది చాలా దూరంగా ఉంటుంది, దగ్గరగా ఉంటుంది; అది అన్నింటికీ లోపల ఉంది, బయట ఉంది. 6. అన్ని భూతాలనీ తనయందు (ఆత్మయందు) తనను

1. గాంధీమహాత్ముని అభిప్రాయం ప్రకారం ఈ మొదటి మంత్రం చాలా ప్రధానం ఐనది. "ఏ కారణంచేతనైనా మిగిలిన అన్ని ఉపనిషత్తులు, మతగ్రంథాలూ హటాత్తుగా భస్మం ఐపోయి ఈశావాస్యోపనిషత్తులోని ఈ మొదటి శ్లోకం ఒక్కటి మాత్రం హిందూదేశ స్మృతి చిహ్నంగా మిగిలినా కూడా, హిందూమతం శాశ్వతంగా జీవించి ఉంటుంది," అని ఆయన ఒక చోట అన్నారు.

(యంగ్ ఇండియా, 11 అక్టోబరు. 1928)

(ఆత్మను) అన్ని భూతాలయందూ చూచేవానికి ఇతరులను ద్వేషించేపని ఉండదు. 7. అన్ని భూతాలూ తానే (తన ఆత్మయే) అని భావిస్తూ ఏకత్వాన్ని చూసే యతికి భ్రాంతి ఎక్కడ దుఃఖం ఎక్కడ ? 8. ఆత్మ సర్వవ్యాప్తము. అది దేదీప్యమానమైన తేజస్సు. దీనికి శరీరం లేదు, ప్రాణాలులేవు, నరాలు లేవు; అది పవిత్రమైనది. పాపంచేత కలుషితం కాదు. సర్వశక్తుడూ, సర్వేశుడూ, స్వయంజాతుడూ ఐన ఆ కవి (ఆత్మ) ఏ వస్తువులు ఏవిధంగా ఉండాలో శాశ్వతంగా నిర్ణయించి ఉన్నాడు. 11. విద్యను (ఆత్మజ్ఞానము) అవిద్యనూ (దేవతా యజ్ఞాదుల జ్ఞానమునూ) సంపాదించిన మానవుడు రెండవదాని (అవిద్య) సహాయంతో మృత్యువును జయించి, మొదటిదాని (విద్య) సహాయంతో అమృతత్వం పొందుతాడు. 15. సత్యం ముఖాన్ని బంగారు మూత కప్పి ఉంది. ఓ సూర్యుడా దానిని తీసివేయుము, అప్పుడు నేను సత్యం తెలుసుకోగలుగుతాను.

## కఠోపనిషత్తు

నచికేతుడు యముడు ఊళ్ళో లేని సమయంలో యమలోకానికి వెడతాడు. ఆతని ద్వారం దగ్గర మూడురోజులు నిరీక్షిస్తాడు. ఒక బ్రాహ్మణుడు అతిథిగావచ్చి ద్వారం దగ్గర నిరీక్షిస్తున్నాడని యమునికి రాగానే తెలిసింది. అతన్ని నిరీక్షించేటట్లుగా చేసిన పాపానికి పరిహారంగా యముడు అతనికి మూడు వరాలు ఇస్తానంటాడు. నచికేతుడు నాతండ్రి నా విషయంలో ప్రసన్నుడు అవుగాక అని మొదటి వరం కోరుతాడు. రెండవ వరంగా అగ్ని విద్య చెప్పవలసింది అని ప్రార్థిస్తాడు. మూడవ వరంగా ఈ క్రింది ప్రశ్నలు వేస్తాడు.

I. i. 20 నచికేతుడు : "మానవుడు మరణించిన తరవాత కూడా ఆతడు ఉంటాడని కొందరూ, ఉండడని కొందరూ చెపుతూ ఉంటారు. నీవు బోధిస్తే ఈ విషయం తెలుసుకోవాలని అనుకొంటున్నాను. ఇది మూడోవరం."

23-25. యముడు :- "నూరు సంవత్సరాలపాటు జీవించే కుమాళ్ళు, మనుమలూ కావాలని కోరుకో. ఎన్నో పశువులు, ఏనుగులు, గుర్రాలు, బంగారమూ కోరుకో. భూలోకంలో గొప్ప సామ్రాజ్యం కోరుకో. ఎన్ని సంవత్సరాలు కావాలంటే అన్ని సంవత్సరాలపాటూ జీవించేటట్లుగా కోరుకో............మర్త్యలోకంలో లభ్యంకాని కోరదగిన వస్తువులు ఏవి ఉన్నా నీ ఇష్టంవచ్చినట్లు కోరుకో..........ఓ నచికేతుడా! మరణానికి సంబంధించిన ప్రశ్న విషయంలో మాత్రం పట్టు పట్టకు."

26. నచికేతుడు :- "ఓ అంతకుడా! ఇవన్నీ ఒక్కరోజు మాత్రమే నిలిచేవి. ఇవి ఇంద్రియాల శక్తిని చెదరగొడతాయి. జీవితం అంతా పోగుచేస్తే చాలా తక్కువేగదా; గుర్రాలు, నాట్యమూ, సంగీతమూ ఇవన్నీకూడా నీదగ్గరే ఉంచుకో.............అతి దీర్ఘమైన జీవితం విషయంలో ఎవడు రమిస్తాడు ?

I. ii. 1. యముడు :- "శ్రేయస్సు ప్రేయస్సు అనే రెండూ రెండు విభిన్న విషయాలు. వేరువేరు ఫలాలుకల ఈ రెండూకూడా మానవుని బంధిస్తాయి. ఈ రెండింటిలో శ్రేయస్సును ఏరుకోవడం మంచిది. ప్రేయస్సును కోరుకొన్నవాడు ఉత్తమలక్ష్యం పొందలేడు.

2. శ్రేయస్సూ ప్రేయస్సూకూడా మానవుని వద్దకు వస్తాయి. బుద్ధిమంతుడు బాగా పరీక్షించి ఆ రెండింటికీఉన్న తారతమ్యం కనుక్కుంటాడు. బుద్ధిమంతుడు ప్రేయస్సు

కంటే శ్రేయస్సుకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తాడు. మూఢుడు భౌతికసుఖాలకోసం ప్రేయస్సునే ఎన్నుకుంటాడు.

3. 'ఓ నచికేతుడా! సుఖంగా ఉండేవీ, సుఖంగా కనబడేవీ అయిన కోరికలు గురించి బాగా పరిశీలించి నువ్వు వాటిని విడిచివేసినావు. సాధారణంగా ప్రతీ మానవుణ్ణీ బంధించే ఈ ఐశ్వర్యమార్గం నీవు అనుసరించలేదు. 4. విద్య అవిద్య ఈ రెండింటి స్వభావాలూ ఒకదానికొకటి పూర్తిగా విరుద్ధాలు. వీటి ఫలితాలుకూడా వేరువేరుగా ఉంటాయి. నచికేతునికి కావలసింది జ్ఞానమే అని నాకు తెలుసు. ఏ కామమూకూడా నిన్ను ఆకర్షించలేకపోయింది. 5. అజ్ఞానగర్భంలోపడి, జ్ఞానవంతులు అని అనుకుంటూ మూఢులు కష్టాలతో నిండిన మార్గాలలోపడి గుడ్డివాడి వెంబడిపడి నడిచిపోయే గుడ్డివాళ్ళులాగ కొట్టుమిట్టులాడుతూ ఉంటారు. 6. మూఢుడు ఇదే నిజమైన లోకం అనీ, మరో లోకంలేదనీ అనుకుంటూ, మాటిమాటికీ నా వాత పడుతూంటాడు. 7. ఈ ఆత్మ వినడానికికూడా చాలామందికి లభ్యం కాదు. దీనిని గూర్చి వినికూడా చాలామంది సరిగా తెలునుకోలేరు. దీనిని గూర్చి చెప్పకలిగినవాడు అరుదు (ఆశ్చర్యకరుడు). దీనిని తెలుసుకోగలిగిన కుశలుడు కూడా అరుదు. కుశలులచేత బోధితుడై తెలుసుకొనేవాడు ఇంకా అరుదు. 9. ఓ అత్యంత ప్రీతిపాతుడా! ఈ జ్ఞానం తర్కంచేత పొందడానికి, లేదా (తొలగించడానికి) శక్యమైంది కాదు. నీవు సంపాదించగలిగిన ఈ జ్ఞానం ఎవరైనా ఒకరు బోధిస్తేనే బాగా తెలుస్తుంది. నువ్వు తత్త్వాన్వేషణలో మంచి పట్టుదల కలవాడవు. ఓ నచికేతుడా! నీవంటి జిజ్ఞాసువులు మాకు లభించాలని కోరుకొంటున్నాం. 11. దేనియందు అన్ని కామాలూ ప్రాప్తించునో, ఏది జగత్తుకు ప్రతిష్ఠాభూతమైనదో, ఏది క్రతువువల్ల (ధ్యానంవల్ల) లభించే శాశ్వతఫలమో, ఏది అభయం లభించే తీరమో, ఏది మంత్రాల ప్రధాన ప్రతిపాద్య విషయమో, దూరవ్యాప్తమో, ఏది స్వప్రతిష్ఠితమో అల్లాంటి ఆత్మను తెలుసుకొని, ఓనచికేతుడా! నువ్వు అస్థిరాలైన కామాలు విడిచివేసినావు 12. చూడడానికి శక్యం కానివాడు, రహస్యస్థానంలో దాగినవాడు, హృదయకుహరంలో ఉండేవాడు ఐన ఆ దేవుణ్ణి ధ్యానంద్వారా సాక్షాత్కరింపచేసుకొన్న బుద్ధిమంతుడు హర్షశోకాలు రెండూ విడనాడుతాడు." 14. నచికేతుడు :- "ధర్మాధర్మాలకంటేను, ప్రసిద్ధాలైన కార్యకారణాలకంటేనూ, భూత భవిష్యత్తులకంటేను భిన్నమైన ఏతత్త్వం నీకు తెలుసునో దాన్ని నాకు బోధించుము.'

15-16. యముడు : "సమస్తవేదాలూ ఏ పదాన్ని బోధిస్తున్నాయో, సర్వతపస్సులూ దీనికోసమే అని చెప్పుదురో, దేనిని కోరుతూ బ్రహ్మచర్యం అవలంబిస్తున్నారో ఆ పదాన్ని గూర్చి నీకు సంగ్రహంగా చెపుతున్నాను-అది 'ఓమ్'. ఇదే నాశంలేని బ్రహ్మ. ఇదే నాశంలేని పరతత్త్వం. ఈ అక్షరం తెలుసుకొన్నవాడు కోరినదంతా పొందగలుగుతాడు. 18. ఆ సర్వజ్ఞాత్మ పుట్టుటలేదు గిట్టుటలేదు; ఇది ఎక్కడినుంచీ రాలేదు; ఇది ఏవిధంగానూ మారదు. జన్మలేనిది, నిత్యము, శాశ్వతము, పురాతనము. ఇది శరీరంతోపాటు మృతిచెందేది కాదు. 19. చంపేవాడు తాను చంపుతున్నానని అనుకొన్నా, చంపబడేవాడు నేను చంపబడుతున్నానని అనుకొన్నా వాళ్ళిద్దరూ సరిగా తెలియని వాళ్లే. ఇది (ఆత్మ) చంపదు, చంపబడదు (చావదు). 20 ఈ ఆత్మ అణువుకంటే అణువు. మహత్తుకంటె మహత్తరము. ప్రాణుల హృదయగుహలో (నిహితమై) ఉన్నది. కామమూ శోకమూ లేనివాడు ధాతువుల (అంతః

కరణాదుల) ప్రసన్నత్వంచేత ఆత్మ మహిమను తెలుసుకోగలుగుతాడు. 23. ఈ ఆత్మ ప్రవచనంచేతగాని, బుద్ధిబలం చేతగాని, అధిక శాస్త్రాభ్యాసం చేతగాని లభ్యం అయేది (తెలిసేది) కాదు. ఎవడైతే ఈ ఆత్మను అన్వేషిస్తాడో వానికే ఈ ఆత్మ లభ్యం ఔతుంది. అతనికి తన యథార్థ స్వరూపాన్ని ఆవిష్కరిస్తుంది. 24. పాపాలనుండి విరమించి, శాంతుడై, శాంతమనస్కుడై, ఏకాగ్రచిత్తం కలవాడే జ్ఞానంద్వారా ఈ ఆత్మని సాక్షాత్కరింప చేసుకోగలుగుతాడు. 25. బ్రహ్మక్షత్రియ జాతులు రెండూ ఎవరికి ఆహారమో, మృత్యువు ఉపసేచనమో (నంజు) అట్టివాడు ఎక్కడ ఉన్నదీ ఎవడు తెలుసుకోగలడు ?

1 iii. 3. ఆత్మ రథికుడనీ, శరీరం రథమనీ, బుద్ధి సారథి అనీ, మనస్సు కళ్లెమనీ తెలుసుకో. 4. ఇంద్రియాలు గుర్రాలనీ, విషయాలు వాటి గమ్యస్థానం అని చెపుతారు. శరీరం తోటీ, ఇంద్రియాలతోటీ, మనస్సుతోటీ కూడి ఉన్న ఆత్మ భోక్త అని బుద్ధిమంతులు చెపుతారు.

5. ఎవడు విజ్ఞానం లేనివాడై మనస్సును వశంలో ఉంచుకో జాలడో అతనికి, సారథికి పెంకి గుర్రాలు స్వాధీనం కానట్లుగా ఇంద్రియాలు స్వాధీనం కావు.

7-8. ఎవడు విజ్ఞానం లేనివాడై, మనోనిగ్రహం లేనివాడై అశుచిగా ఉంటాడో, అతడు ఆ స్థానం చేరజాలడు. సంసారంలో తిరుగుతూ ఉంటాడు. విజ్ఞానం సంపాదించుకొని మనస్సు వశం చేసుకొని, సర్వదా శుచిగా ఉండేవాడు ఆ స్థానం పొంద గలుగుతాడు. అక్కడి నుంచి తిరిగి రాడు (పుట్టడు). విజ్ఞానం అనే సారథీ మనస్సు అనే కళ్లెమూ గల మనుష్యుడు మార్గం దాటి పరమాత్మని అత్యుత్తమ స్థానం చేరుకుంటాడు. 10-11. ఇంద్రియాల కంటే విషయాలు పరంగా ఉంటాయి. విషయాలకంటే మనస్సు పరంగా ఉంటుంది. మనస్సు కంటే బుద్ధి పరంగా ఉంటుంది. బుద్ధి కంటే హిరణ్యగర్భుడు పరమైనవాడు. (మహత్తు అనే నామాంతరం గల) ఈ హిరణ్యగర్భుని కంటే అవ్యక్తం పరమైనది. అవ్యక్తం కంటే పురుషుడు (బ్రహ్మ) పరమైనవాడు. పురుషుని కంటే పరమైనది మరేదీ లేదు. పురుషుడే పరమావధి. పురుషుడే అత్యుత్తమగతి. 12. సమస్త భూతాలోనూ నిగూఢమై ఉన్న ఈ ఆత్మ పైకి గోచరించదు. సూక్ష్మదృష్టి కలవాడు సూక్ష్మబుద్ధితో దీన్ని చూడగలుగుతాడు. 13. బుద్ధిమంతుడు వాక్కును మనస్సులో నియమించాలి, ఆ మహత్తత్వాన్ని శాంతమైన ఆత్మలో నియమించాలి. 14. లెండి ; మేల్కొనండి ; ఉత్తమ గురువులను సేవించి తెలుసుకోండి. వాడియైన కత్తి మీద అంచు మీద నడవడం చాలా కష్టమైన పని. (అట్లే) ఇది దుర్గమం ఐన మార్గం అని పెద్దలు చెపుతారు. 15. శబ్ద స్పర్శరూపాలు లేనిదీ, క్షీణించనిదీ, రసం లేనిదీ, గంధం లేనిదీ, ఆద్యంతరహితమూ, మహత్తు కంటే పరమూ, స్థిరమూ ఐన దీన్ని తెలుసుకొని మృత్యుముఖం నుండి తప్పించుకో కలుగుతాడు.

II. ii. 9. 10. ఒకే అగ్ని ప్రపంచకంలో ప్రవేశించి తాను దహించే వస్తువుల రూపాలు పట్టి అనేక రూపాలు ధరించినట్లుగాను, ఒకే వాయువు ప్రపంచకంలో ప్రవేశించిన వస్తువుల రూపాలకి అనుగుణంగానూ, సర్వభూతాలలోను నిండి ఉన్న ఆత్మ ఆయా రూపాలకు అనురూపంగా ఉంటూ, వీటి బహిః ప్రదేశంలో గూడా ఉంటుంది. 11. సర్వ లోకానికి నేత్రం ఐన సూర్యుడు ఏవిధంగా చూచేవారి నేత్రాలలో ఉండే బాహ్యదోషాలచేత కలుషితుడు కాడో, సర్వభూతాంతర్యామియైన పరమాత్మ వాటికంటే బహిర్భూతుడుగా కూడా

ఉంది లోకం దుఃఖం చేత లిప్తుడు కాడు.

12. 13. ఏకైక నియంత ఐన సర్వాంతర్యామి ఒక్క రూపాన్ని (స్వస్వరూపాన్ని) అనేక రూపంగా తయారు చేస్తాడు. తమ ఆత్మయందే ఉన్న ఆ పరమాత్మను ఏ బుద్ధిమంతులు చూడకలుగుతారో వారికి మాత్రమే శాశ్వతమైన ఆనందం లభిస్తుంది. ఇతరులకు లభించదు. ఏది అనిత్య వస్తువుల మధ్య ఉన్న చేతన పదార్థమో, విభిన్న వస్తువుల మధ్య ఉన్న ఏకైకతత్త్వమో, కోరికలను సఫలం చేస్తూ ఉంటుందో, అట్టి, తమలోనే ఉన్న ఆత్మ తత్త్వాన్ని ఏ ధీరులు చూడగలుగుదురో వారికి మాత్రమే శాశ్వతానందం లభిస్తుంది, ఇతరులకు లభించదు."

14. (ప్రశ్న) "వర్ణనాతీతం అయిన ఆ మహానందాన్ని వారు ఊరికే 'అది, ఇది' అని అంటూంటారు. నేను దానిని తెలుసుకోవడం ఎట్లు? అది స్వయంగానే భాసిస్తూందా లేదా ఇతర వస్తువుల సహాయం చేత భాసిస్తుందా?" 15. (సమాధానం) "అక్కడ సూర్యుడు ప్రకాశించడు, చంద్రుడు ప్రకాశించడు, నక్షత్రాలు ప్రకాశించవు, మెరుపులు ప్రకాశించవు. ఇంక ఈ అగ్ని మాట చెప్పేదేముంది? ప్రకాశిస్తున్న దానిని (ఆ ఆత్మతత్త్వాన్ని) అనుసరించే మిగిలినవన్నీ ప్రకాశిస్తున్నాయి. దాని కాంతి చేతనే ఇదంతా ప్రకాశిస్తూంది".

II. ii. 1. "సనాతనం ఐన ఈ అశ్వత్థ వృక్షానికి మొదలు పైకి ఉంది, కొమ్మలు కిందికి ఉన్నాయి. పవిత్రం ఐనది అదే; అదే బ్రహ్మ. అదే నాశరహితమని చెప్పబడుతూంది. అన్ని లోకాలు దీన్నే ఆశ్రయించుకొని ఉన్నాయి. దానిని ఎవరూ దాటి పోలేరు. 2. ఈ ఉన్న ప్రపంచం అంతా దానినుంచే వచ్చింది. ప్రాణభూతమైన దాని యందే చేష్టకలదై ఉంది. ఎత్తిన వజ్రాయుధం వలె ఇది (బ్రహ్మ) చాలా భయంకరం అయినది. దీనిని తెలుసుకొన్నవారు మరణరహితులు అవుతారు. 3. దీనివల్ల భయంచేతనే అగ్ని మండుతూన్నది, సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. ఇంద్రుడూ, వాయువూ ఐదవ వాడైన యముడూ కూడా దీనివల్ల భయంచేతనే తమ తమ కర్తవ్యాలు నెరవేర్చడం కోసం తొందర పడుతున్నారు. 4. శరీరం పడిపోవడానికి ముందుగానే (మానవుడు) ఆత్మతత్త్వం తెలుసుకో కలిగితే మంచిది. అలా కాకపోతే ఈ సృష్టిలో ఎన్నో శరీరాలు గ్రహించవలసి వస్తూంది. 9. దాని రూపం నేత్రాలకి గోచరించేది కాదు. దీనిని ఎవరూ కళ్లతో చూడ లేరు. మనస్సు చేతనూ, సిరమైన బుద్ధిచేతనూ గ్రహించబడుతుంది. దానిని ఎవరు తెలుసు కొంటారో వారు మరణ రహితులు అవుతారు. 10. ఎప్పుడైతే ఐదు జ్ఞానేంద్రియాలు కూడా మనస్సుతోపాటు స్థిరంగా ఉంటాయో, బుద్ధికూడా చలించదో అది పరమగతి (ఉత్తమస్థితి) అని చెపుతారు. 11. స్థిరమైన ఇంద్రియనియమనమే యోగం అని అంటారు. అప్పుడు జాగర్తగా ఉండాలి. ఎందుచేతనంటే – యోగం లభించి కొంతకాలానికి తొలగి పోవచ్చు. 12. దానిని (ఆత్మను) వాక్కు చేత గాని, మనస్సు చేత గాని, నేత్రం చేత గాని పొందజాలరు. 'అది ఉన్నది' అని చెప్పేవాడు తప్ప మరి యెవరు దీనిని పొందగలరు? 13. (ఆత్మ) 'ఉన్నది' అని మాత్రమే (ముందుగా) ఆత్మను గూర్చి తెలుసుకోవాలి. తరువాత దీని తత్త్వం తెలుసు కోవాలి. ఈ రెండు విధాలైన జ్ఞానాలలోనూ 'ఉన్నది' అనే జ్ఞానం కలిగిన తరవాత దాని (ఆత్మ) తత్త్వం క్రమంగా స్పష్టం అవుతుంది.

15-16. హృదయంలో ఉన్న కామాలన్నీ పోగానే మర్త్యుడు అమర్త్యుడు అవు

తాడు. ఆతడు ఇక్కడనే బ్రహ్మను పొందుతాడు. హృదయ గ్రంథులనీ భిన్నం ఐపో గానే మర్త్యుడు అమర్త్యుడు అవుతాడు. ఇదే ఉపదేశం. 16. హృదయానికి సంబంధించి నూట ఒక్క నాడులు ఉన్నాయి. వాటిలో ఒకటి తలవైపు వెడుతుంది. దాని ద్వారా పైకి ఎక్కిన వాడు అమృతత్త్వం పొందుతాడు. ఇతర నాడులన్నీ వివిధ మార్గాల గుండా పోవ డానికి ఉపయోగించేవి. 16. పరమపురుషుడు, అంగుష్ఠప్రమాణంతో అందరి ప్రాణుల హృదయాలలోనూ, అంతరాత్మగా ఉంటున్నాడు. ముంజ గడ్డినుంచి లోపల ఉన్న ఏసిని వేరు చేసినట్లుగా, దృఢనిశ్చయంతో ఆతనిని శరీరం నుంచి వేరు చేయాలి. అతడే అమృతమైన తేజస్సు అని తెలుసుకోవాలి, ఆతడే అమృతమైన తేజస్సు అని తెలుసుకోవాలి.

## మ ను స్మృ తి

II. 1. ఎన్నడూ ద్వేషరాగాలు లేని విద్వాంసులైన సత్పురుషులు దేన్ని సేవి స్తారో తమ హృదయం చేత అంగీకరిస్తారో అదే ధర్మం అని తెలుసుకొనండి. 6. సమస్త వేదమూ ధర్మానికి మూలం. వేదవేత్తల స్మృతులూ, శీలమూ, ఆచారమూ, సత్పురుషుల హృదయతుష్టి కూడా ధర్మానికి మూలం. 159. సాటివారికి లాభకరమైన విషయాలు బోధించేటప్పుడు హింస ప్రయోగించ కూడదు. ధర్మం కోరేవాడు మధురమూ అందమూ అయిన వాక్కునే ఉపయోగించాలి.

161. పీడితుడైనపుడు కూడా ఇతరులకు మర్మభేదకంగా ఉండే మాటలు పలక కూడదు. ఏ మాట వినడం చేత ఇతరుడు చాలా బాధపడతాడో, అలాంటి ఉత్తమలోక భంగకరమైన మాట మాటలాడకూడదు.

227-8. పుట్టిన సంతానం నిమిత్తం తల్లిదండ్రులు ఎన్నికష్టాలు పడతారో కొన్ని వందల సంవత్సరాలకైనా. ఆ కష్టానికి తగిన ప్రత్యుపకారం చేయడం అసంభవం. వారికీ, ఆచార్యునికీ సర్వదాప్రియం చేకూర్చాలి. వీరు ముగ్గురూ సంతోషిస్తే తపస్సు అంతా పూర్తిఅయినట్లే.

238. శ్రద్ధావంతుడు తక్కువ వానినుంచి కూడా ఉత్తమ విద్య సంపాదించు కోవాలి. నీచుని నుండి కూడా ఉత్తమ ధర్మం నేర్చుకోవాలి. తక్కువ కులం నుండి కూడా స్త్రీ రత్నాన్ని స్వీకరించాలి.

III. 55. శ్రేయస్సే కావాలి అనుకుంటే, తండ్రులు, సోదరులు, భర్తలు, మరుదులూ కూడా స్త్రీలను పూజించి వారికి అనేకమైన అలంకారాలు ఇవ్వాలి. 56 స్త్రీలను గౌరవించే చోట దేవతలందరూ ఆనందిస్తారు. స్త్రీలను గౌరవించని చోట చేసే కర్మలన్నీ నిష్ఫలాలు.

157. కోడళ్లు మొదలైన వారు దుఃఖించే ఇల్లు శీఘ్రంగా నశించి పోతుంది. వీళ్లు దుఃఖించని ఇల్లు సర్వదా వృద్ధి పొందుతూ ఉంటుంది.

60. ఏ కులంలో భర్త తన భార్యతో సంతృప్తి పడతాడో, భార్య భర్తతో సంతృప్తి చెందుతుందో అక్కడ ఎల్లప్పుడూ కల్యాణంగా ఉంటుంది.

11-12. గృహస్థుడు సంతృప్తి అవలంబించి సుఖ సంపాదనం విషయంలో సంయమం కలవాడై ఉండాలి. సంతోషమే సుఖానికి మూలం. దానికి వ్యతిరేకంగా

ఉండడం దుఃఖానికి మూలం. 138. సత్యం పలకాలి, ప్రియం పలకాలి. అప్రియమైన సత్యం చెప్పకూడదు. అసత్యమైన ప్రియం పలక కూడదు. ఇది సనాతన ధర్మం.

160. ఇతరుల మీద ఆధారపడ్డదంతా దుఃఖమే. తన ఆధీనంలో ఉన్నది సుఖం. సంక్షేపంగా సుఖదుఃఖాల స్వరూపం ఇది. 161. ఏపని చేస్తే తన అంతరాత్మకు సంతోషం కలుగుతుందో ఆపని ప్రయత్న పూర్వకంగా చెయ్యాలి. అందుకు విపరీతమైన పని విడిచి వేయాలి.

176. ధర్మానికి దూరమైన అర్థకామాలు వదిలి పెట్టాలి. దుఃఖానికి దారి తీసేది లోకులు నిందించేదీ, అయిన ధర్మం విడిచి పెట్టాలి.

vii. రాజ ధర్మాలు :-

44. (రాజు) ఇంద్రియాలు జయించడం కోసం రాత్రింపగళ్ళు ప్రయత్నం చెయ్యాలి. ఇంద్రియాలను వశం చేసుకొన్న వాడు ప్రజలను సులభంగా వశం చేసుకోగలుగుతాడు. 47. వేట, జూదము పగటి నిద్ర, పరనింద, స్త్రీలోలత్వము, (మద్యం మొదలైన వాటివల్ల) మత్తు, నాట్యగీతవాదిత్రాలు, పనిలేకుండా తిరగడం ఈ పదీ కామంవల్ల కలిగే వ్యసనాలు. 48. చాడీలు చెప్పడం. సాహసము, ద్రోహము, ఈర్ష్య (ఇతరుల గుణాలు సహింప లేక పోవుట), అసూయ (ఇతరుల గుణాలను దోషాలుగా చిత్రించడం), ధనాపహరణము, వాక్పారుష్యము, ఇవి క్రోధం వల్ల కలిగే ఎనిమిది వ్యసనాలు. 49. ఈ వ్యసనగణాలు రెండింటికి ఏది మూలకారణం అని పండితులు చెపుతారో అల్లాంటి లోభం (దురాశ) ప్రయత్నపూర్వకంగా జయించాలి. ఈ రెండు గణాలూ దానినుంచి పుట్టినవే.

50. కామంవల్ల కలిగే పది వ్యసనాలలో మద్యపానము, జూదము, స్త్రీలోలత్వము, వేట అనే నాలుగూ చాలా చెడ్డవి. 64. రాజుకు అనురాగం కలవాడు, పవిత్రుడు (లంచాలు మొదలైనవి తీసుకోనివాడు), సమర్థుడు, స్మరణ శక్తికలవాడు, దేశకాలాల జ్ఞానంకలవాడు, మంచి ఆకారం కలవాడు, భయం లేని వాడు, వాక్చాతుర్యం కలవాడూ అయిన దూత ఉండడం ప్రశస్తం.

viii న్యాయ నిర్ణయం.

13 శక్యమైనంతవరకు న్యాయాలయానికి వెళ్లకుండా ఉండడం మంచిది. వెళ్లిన తరవాత సరిగా మాట్లాడాలి. (అక్కడ) మాటలాడకుండా ఉన్నా అసత్యం మాటలాడినా మానవుడు పాపం చేసిన వాడవుతాడు. 15. ధర్మాన్ని నశింప చేస్తే అది నశింపచేస్తుంది. ధర్మాన్ని రక్షిస్తే అది రక్షిస్తుంది. నశింప చేయబడిన ధర్మం మనలను చంపకుండా ఉండాలంటే మనం ధర్మాన్ని చంపకూడదు. 18. అధర్మం నాల్గువంతులలో ఒక వంతు కర్తకూ, ఒక వంతూ సాక్షికీ, ఒక వంతు న్యాయాలయంలో ఉన్నవాళ్లకూ, ఒక వంతు రాజుకూ చెందుతుంది. 81. సత్యం పలికే సాక్షి బ్రహ్మలోకాదులైన ఉత్తమ లోకాలు పొందుతాడు. సత్యవాక్కు బ్రహ్మచే పూజితమైనది. 81. ఎవరి ఆత్మ వారికి సాక్షి. ఎవరి ఆత్మ వారికి గతి. అందుచేత మానవుని అత్యుత్తమ సాక్షి ఐన (నీ) అంతరాత్మను (అసత్యం చెప్పి) అవమానించకు. 85. పాపం చేసేవాళ్ళు మనలను ఎవరూ చూడడం లేదు కదా అని అనుకుంటారు. ఐతే దేవతలూ వారి అంతరాత్మ కూడా చూస్తూనే ఉంటారు.

86. స్వర్గము, భూమి, జలము, హృదయము, చంద్ర-సూర్య-అగ్ని-యమ-వాయువులూ రాత్రీ, రెండు సంధ్యలూ, ధర్మమూ. ఇవి అందరు ప్రాణుల నడవడికను కనిపెడుతూనే ఉంటాయి.

92. యమధర్మరాజు నీ హృదయంలోనే ఉన్నాడు. అతనితో నీకేమీ తగాదా లేకపోతే నువ్వు గంగ దగ్గరకి వెళ్ళవలసిన పనిలేదు, కురుక్షేత్రం వెళ్ళవలసిన పనిలేదు.

386. ఎవని నగరంలో దొంగ ఉండడో, పరస్త్రీ గమనం చేసేవాడుండడో, దుర్భాషలాడే వాడుండడో, గృహదాహాది సాహసకృత్యాలూ, దండపారుష్యమూ, చేసే వాడుండడో ఆ రాజు దేవేంద్రలోకం చేరుతాడు.

x. 63. అహింస, సత్యము, దొంగతనము చేయకుండుట, పవిత్రత్వము, ఇంద్రియనిగ్రహము-ఇవి నాలుగు వర్ణాలవారూ ఆచరించవలసిన ధర్మం అని సంక్షేపంగా మనువు చెప్పినాడు.

## వాల్మీకి రామాయణం

అయోధ్యకాండ :-

మొదటి సర్గ 8-23 శ్లోకాలు.

హృదయానికీ బుద్ధికీ సంబంధించిన రాముని ఉత్తమగుణాలు :-

కేకయరాజు నగరంలో ఉన్నాకూడా భరత శత్రుఘ్నులు ఎల్లప్పుడూ దశరథుని మనస్సులోనే ఉండేవారు. నిజానికి వాళ్ళందరూ దశరథునికి ఇష్టమైనవాళ్ళే. ఐతే వారిలో ఎక్కువ సుగుణాలుకల రాముడు దశరథునికి ఎక్కువ ఆనందం కలిగించేవాడు. దృప్తుడైన రావణుని సంహరించడానికై దేవతలు ప్రార్థించగా అవతరించిన మహావిష్ణువు కదా అతడు ? ఎల్లప్పుడూ ప్రశాంతమైన స్వభావంగల రాముడు మృదువుగా మాటలాడేవాడు. చిరునవ్వు నవ్వుతూ, ముందుగా మాటలాడేవాడు. ఎవరైనా పరుషంగా మాటలాడినా కూడా దానికి సమాధానంగా పరుషవాక్యాలు పలికేవాడు కాదు. ఎప్పుడో చేసిన చిన్న ఉపకారానికి కూడా కృతజ్ఞుడై ఉండేవాడు. ఎవరైనా ఎన్ని అపకారాలు చేసినా ఆత్మనిగ్రహం కలవాడై వాటిని స్మరించేవాడు కాదు. మహాబలశాలియైనా చాలా వినయవంతుడు. పెద్దలను గౌరవించేవాడు. అవకాశం లభించినప్పుడల్లా వారిదగ్గర మంచి విషయాలు నేర్చుకొనేవాడు. ప్రజలయందు అనురాగం కలవాడై వాళ్ల అనురాగం చూరగొన్నాడు. దయాశాలి, కోపం అణచుకొనేవాడు. కష్టాలలోఉన్న వారిని చూచి జాలిపడేవాడు. తాను క్షత్రియుడుగా పుట్టినందుకు క్షత్రియ ధర్మం గౌరవించేవాడు. పరిశుద్ధమైన కీర్తి స్వర్గాధిపత్యంతో సమానమైనదని భావించేవాడు. బృహస్పతివలె యుక్తిప్రయుక్తులు చెప్పే సామర్థ్యం కలవాడే అయినా అతనికి వితండవాదం చేయడంఅంటే ఇష్టం ఉండేదికాదు. మంచి దేశకాలౌచిత్యజ్ఞానం కలవాడు. చూడగానే మనుష్యుల స్వభావం కనిపెట్టకలిగినవాడైనా ఎల్లప్పుడూ మంచితనంతో ఉండేవాడు. ప్రపంచకంలో అతడు ఒక్కడే దైన్యం అనేది ఎరుగడు. ఋజుస్వభావం కలవాడు. లౌకికాలైన ఆచారవ్యవహారాలలో మంచి నేర్పరి. గంభీరంగా ఉండి ఎప్పుడూ బయటపడేవాడు కాదు. ఇతరులతో ఆలోచించినా తన ఆలోచన మాత్రం తనలోనే ఉంచుకొనేవాడు. అతనికి కోపం వచ్చినా అనుగ్రహం వచ్చినా వ్యర్థంగాపోయేది కాదు. ఎప్పుడు ఇవ్వాలో ఎప్పుడు మానాలో

తెలిసినవాడు. దురాలోచన లేనివాడు. ఎన్నడూ పరుషవాక్యం పలికి ఎరగడు. సోమరి తనంగాని పొరపాటుగాని లేనివాడు. తనలోఉన్న లోపాలూ ఎదటివారిలో ఉన్న లోపాలూ తెలుసుకోగలిగినవాడు. మనుష్యుల స్వభావం గ్రహించే మంచి చాతుర్యం కలవాడు. ఎవణ్ణి ఎప్పుడు అణగతొక్కాలో, ఎప్పుడు పైకి లేవదీయాలో తెలిసినవాడు. ధనం ఎలా సంపాదించాలో ఎలా ఖర్చుపెట్టాలో తెలిసినవాడు. మహాశాస్త్రాలలోనే కాకుండా సామాన్యవిషయాలలోకూడా మంచి పాండిత్యం కలవాడు. అలసత్వం లేకుండానూ, అర్థధర్మాలకి దెబ్బ తగలకుండానూ భోగాలు అనుభవించగలిగినవాడు. వినోదంకోసం ఉపయోగించే కళలలో మంచి ప్రవేశం కలవాడు. ఐతే దేనికి ఎంత ప్రాధాన్యం ఇవ్వాలో తెలిసినవాడు. అసూయ, కోపము, గర్వము, మాత్సర్యము లేనివాడు. సాటివారిని ఎన్నడూ అవమానించేవాడు కాదు. ఐతే పరిస్థితుల ప్రభావానికి సులభంగా లొంగిపోయేవాడు కాదు. ఇలాంటి గుణాలతో రాముడు దేదీప్యమానుడైన సూర్యుడువలె ప్రకాశించినాడు. భూమియే ఆతనిని తనకు భర్తగా కావాలని కోరుకొంది.

## రాముడన్న మాటలు

అయోధ్యాకాండ 19వ సర్గ 20వ శ్లోకం.

(నువ్వు వెంటనే అరణ్యానికి వెళ్ళాలి అని చెప్పిన కైకతో) "ఓ దేవి ! నేను అర్థప్రధానుడనై ఈ లోకంలో నివసించాలని కోరుకొనేవాణ్ణి కాదు. ధర్మానికి ప్రాధాన్యం ఇచ్చే నేను ఋషీశ్వరులతో సమానమైనవాడినని తెలుసుకో."

21 వ సర్గ, 55-58 శ్లోకాలు.

(రాజ్యాభిషేకానికి వచ్చిన విఘ్నం గురించీ, అరణ్యవాసం గురించీ వినగానే కోపం వచ్చిన లక్ష్మణునితో .)

ధర్మ నిష్ఠుడైన శ్రీరాముడు ధర్మసమ్మతమైన మాటలు పలికినాడు. అటువంటి పరిసితులలో ఆలాంటి మాటలు రాముడొక్కడే పలకగలడు. "ఓ లక్ష్మణా, ధర్మము, అర్థము, కామము అనే మూడూకూడా ధర్మంవల్లనే లభిస్తాయి. అని లోకంలో ప్రసిద్ధి. ఇవన్నీ కూడా, వాస్తవానికి, ధర్మంలోనే ఉన్నాయి ... ... లౌకికం ఐనలాభం కోసమే పాకులాడేవాడు నిందనీయుడు. కేవలం కామంగూర్చి ఆలోచిస్తూ ఉండడం కూడా కొనియాడ దగిన విషయం కాదు. అయోధ్యాకాండ, 30వ సర్గ, 30 శ్లోకం—

ఆ సందర్భంలోనే సీతతో అన్న మాటలు :-

'తల్లి, తండ్రి, గురువు అనే రూపాలలో అందుబాటులో ఉన్న దైవాన్ని విడిచి పెట్టి, అందుబాటులో లేని దైవాన్ని ఎవరైనా ఆరాధిస్తారా!"

అయోధ్యకాండ. 105 వ సర్గ. 15-31 శ్లోకాలు.

(భరతుడు చిత్రకూటం పైన ఉన్న రాముని దగ్గరికి వెళ్లి అయోధ్యకు వచ్చి పట్టాభిషేకం పొందవలసిందిగా బలవంతం చేస్తాడు. అప్పుడు స్థిరమనస్కుడైన రాముడు ఎట్టి వికారమూ చెందకుండా భరతుణ్ణి ఇలా ఓదారుస్తాడు .)

"ఎవ్వడూ కూడా తన ఇష్టం వచ్చినట్లుగా చేయలేడు. తనపై తనకు సర్వాధికారాలూ ఉన్నాయి అని అనుకోవడం పొరబాటు. దైవం మానవుణ్ణి ఇటూ అటూ లాగుతూ

ఉంటుంది. పోగు చేసినదంతా చివరకి నశిస్తుంది. పైకి లేవడం అనేది పతనానికే దారి తీస్తుంది. కలయిక తరవాత విడిపోవడం తప్పదు. జీవించి ఉన్నవారికి ఎప్పటికైనా మరణం వచ్చి తీరుతుంది. బాగా పండిన పండుకు రాలిపోతామనే భయం తప్ప మరేభయమూ ఉండదు; అదే విధంగా పుట్టినవానికి మరణం వల్లనే మహాభయం. దృఢమైన స్తంభాలతో కట్టిన ఇల్లు కూడా ఏ విధంగా కాలక్రమంలో శిథిలం అయిపోయి కూలిపోతుందో అదే విధంగా మానవులు కూడా జరామరణాలకి లొంగిపోయి నశిస్తారు. గడిచిన రాత్రి తిరిగి రాదు. ప్రవాహంతో నిండిన యమున ఎడతెరిపిలేకుండా, నీటితో నిండిన సముద్రంలోకి ప్రవేశిస్తుంది. వేసవికాలంలో సూర్య కిరణాలు హరింపచేసినట్లుగా గడుస్తూన్న పగళ్లూ, రాత్రులూ అన్ని భూతాలనూ నశింపచేస్తున్నాయి. నువ్వు నిన్ను గూర్చి విచారించు, ఇతరులను గూర్చి ఎందుకు విచారిస్తావు? కదలకుండా ఒక చోట కూర్చున్నా, కదులుతున్నా కూడా నీ ఆయుస్సు రోజురోజుకు తరిగి పోతూనే ఉంది కదా! మృత్యువు మానవుని పక్కనే సంచరిస్తుంది, వానితో కూర్చుంటుంది; వానితో పాటుచాలా దూరం వెళ్లి మళ్లీ వానితో తిరిగి వస్తుంది. శరీరం అంతా ముడతలు పడింది; జుట్టు నెరిసింది. మానవుడుముసలితనంతో ఒడలిపోయినాడు. ఏంచేస్తేమాత్రం వాటిని అన్నింటినీ తనవశంలో ఉంచుకో గలుగుతాడు? సూర్యోదయం అయినప్పుడల్లా జనం సంతోషిస్తూ ఉంటారు; సూర్యాస్తమయంఅయినపుడు కూడాసంతోషిస్తారు. ఐతే ప్రతీసారీ (ఉదయాస్తమయాలైనప్పుడల్లా) తమ ఆయుర్దాయం క్షీణిస్తున్నది అనే విషయం, పాపం, వాళ్లు తెలుసుకోలేకుండా ఉన్నారు. క్రొత్త ఋతువు ప్రారంభం కాగానే వాళ్ళు ఆనందంతో గంతులు వేస్తారు; ఐతే ఈ ఋతువులు తిరగడంతో పాటు ప్రాణుల ఆయుర్దాయం కూడా క్షీణించిపోతూంది. మహాసముద్ర మధ్యంలో రెండు కర్ర దూలాలు కలుసుకోవచ్చు, ఐతే కొంతసేపట్లో అవి మళ్ళీ విడిపోతాయి. అట్లాగే భార్యలూ, కుమాళ్ళూ, బంధువులూ, ఐశ్వర్యమూ ఇవన్నీ వస్తూ ఉంటాయి, కొన్నాళ్ళకి దూరం అవుతూంటాయి. అవి దూరం అవడంమాత్రం తథ్యం. పుట్టిన ఏప్రాణి కూడా ఒకేస్థితిలో ఉండడం అసంభవం. మరణించిన వారిని గురించి విలపించి ఎవరూ ఏమీ చేయలేరు. వెడుతూన్న వర్తకులగుంపు చూసి రోడ్డుమీద నిలబడ్డవాడు- 'నేను కూడా మీ వెనక్కాలే వస్తున్నాను, అని అంటాడు. తండ్రులూ తాతలూ పోయిన మార్గం కూడా ఇటువంటిదే. అలాంటప్పుడు, తప్పనిసరిగా ఆమార్గం అవలంబించవలసి ఉంది ఆమార్గం వెంబడే పోయిన వానిని గూర్చి, విచారించి ఏమి ప్రయోజనం ? పోయిన ప్రవాహం వెనక్కి మరల్చడం సాధ్యంకాని పని. అదేవిధంగా సంవత్సరాలు గడిచిపోతూ ఉంటే, ప్రతీవాడూ తనకు లభించిన ధర్మసమ్మతమైన సుఖంతో సంతృప్తిపడాలి. నిజానికి ప్రతీవారూ అలాంటి సుఖంకోసం ప్రయత్నించాలని తెలుసుకోవాలి.

109 వ సర్గ 2-27 శ్లోకాలు

(తనతో నాస్తికవాదం ప్రారంభించిన జాబాలితో అన్న మాటలు :-)

"బహుశా నన్ను సంతోషపెట్టడం కోసం, అధర్మమూ, అహితమూ అయిన విషయాన్ని ధర్మమూ, హితమూ అని ప్రతిపాదిస్తూ మాటలాడినావు. నియమాలు ఉల్లంఘించి, పాపాచారవంతుడై, మంచి నడవడిక, మంచి ఆలోచనా లేని మానవుడు సత్పురుషుల నుంచి మెప్పు పొందలేడు. ఏ మానవుడైనా, కులీనుడా లేక అకులీనుడా,

వీరుడా లేక కేవలం వీరత్వాభిమానం మాత్రం కలవాడా, పవిత్రుడా, అపవిత్రుడా అనే విషయాలు వాని నడవడికే తెలుపుతుంది. అనార్యుడనై ఉండి కూడా ఆర్యుని వేషం వేసుకొని, శౌచం లేకపోయినా శుచిగా కనబడుతూ, దుర్లక్షణాలు కలవాడనైనా, మంచి లక్షణాలున్నట్లు కనబడుతూ, దుశ్శీలవంతుడనైనా మంచి శీలం చాటుతూ, ధర్మం అనే ముసుగులో లోకోపద్రవానికి కారణం ఐన అధర్మమార్గం అనుసరిస్తూ, నేను శుభకరమైన మార్గం వదిలి నిషిద్ధమైన మార్గం అవలంబిస్తే, ఈ విధంగా చెడ్డ నడవడికతో లోకానికి కళంకంగా ఉన్న నన్ను, మంచిచెడ్డల వివేకం గలవాడు, చైతన్యం ఉంది అని చెప్పుకోతగ్గవాడు ఎవడైనా గౌరవిస్తాడా ? చేసిన ప్రతిజ్ఞ నిలుపుకోకుండా ఈవిధంగా ప్రవర్తించినట్లైతే నేనెవరికైనా ధర్మమార్గం గురించి బోధించగలనా ? నేను స్వర్గం సంపాదించగలిగేది ఎట్లు ? ఈ ప్రపంచకం అంతా కామం మీద ఆధారపడి ప్రవర్తిస్తూ ఉంటూంది. రాజులు ఏవిధంగా ప్రవర్తిస్తే ప్రజలూ ఆ విధంగానే ప్రవర్తిస్తారు. సత్యమూ, పరులకు సహాయం చేయడం అనేవి రాజుకు విధించిన, చిరకాలంనుంచీ వస్తూన్న ధర్మం. అందుచేత రాజ్యం సత్యస్వరూపం అయినది. వాస్తవంలో ఈ ప్రపంచకం అంతా సత్యం మీదనే నిలబడి ఉంది. సత్యమే సర్వోత్తమం అయినదని ఋషులూ దేవతలూ అంగీకరించి ఉన్నారు. సత్యం పాలించేవాడు అత్యుత్తమమైన లోకాలు చేరుతాడు.......నా తండ్రిగారికి మాట ఇచ్చి ఉన్న నేను లోభంవల్లగాని, మోహం వల్లగాని, అజ్ఞానంవల్లగాని, భ్రాంతివల్లగాని సత్యసేతువును ఎన్నడూ భేదించను......నీచులూ, క్రూరాత్ములు, దురాశాపరులూ, పాపాత్ములూ ఐన కొందరు రాజులు ధర్మం అని చెప్పుకుంటూ చేసే అధర్మమయమైన క్షత్రియ ధర్మాన్ని నేను విడిచిపెడతాను......మోసం అనేది లేకుండా, మంచిచెడుగులను స్పష్టంగా తెలుసుకొనే వివేకంతో శ్రద్ధావంతుడనై సంతృప్తి చెందిన పంచేంద్రియాలతో ఈ జీవయాత్ర సాగిస్తాను.

**సీత అన్నమాటలు**

అయోధ్యాకాండ : 27 వ సర్గ, 4-21 శ్లోకాలు

(తనతో అడవికి రావద్దని నివారించడానికై ప్రయత్నించిన రామునితో అన్న మాటలు :)

'ఆర్యపుత్రా, తండ్రీ, తల్లీ, సోదరుడూ, కుమారుడూ, కోడలూ, వీరందరూ తమ తమ పుణ్యాలు తామే అనుభవిస్తారు. వారి అదృష్టం వారికి మాత్రమే చెందుతుంది. ఓ పురుషశ్రేష్ఠా, భర్త భాగ్యాన్ని పంచుకొనేది భార్య ఒక్కతి మాత్రమే......ఇహంలోనైనా పరంలోఐనా కూడా స్త్రీకి భర్త ఒక్కడే ఉత్తమగతి: తండ్రిగాని, కుమారుడుగాని, తానుగాని, తల్లిగాని, సఖీజనంగాని, కాదు. నీవు దుర్గమారణ్యానికి వెళ్లడానికి బయలుదేరే పక్షంలో, నేను నీకు ముందునడుస్తూ (నా పదన్యాసముచేత) తీక్ష్ణమైన కుశాగ్రాలు (నీకోసం) మృదువుగా ఉండేటట్లు చేస్తాను......మేడల శిఖరాలపైగాని, విమానాలమీద ఆకాశమార్గంలో సంచరించేటప్పుడుగాని, అన్ని పరిస్థితులలోనూ కూడా భార్యకు భర్త పాదచ్ఛాయయే ఉత్తమం ఐనది. ఓ నరోత్తమా, రాఘవా, స్వర్గంలో నివాసం లభించినా కూడా నీవు లేకపోయినట్లైతే దానికై అంగీకరించను."

అరణ్యకాండ :-9వ సర్గ, 2-32 శ్లోకాలు :

(హింస వదిలిపెట్టి, తాపసవృత్తితో అరణ్యవాసం చేయవలసింది అని ప్రార్థిస్తూ రామునితో అన్న మాటలు) :

"సూక్ష్మమైన విధులు అవలంబించడంద్వారా ధర్మం సంపాదింపవచ్చు. కామాల వలన కలిగే వ్యసనాలనుండి దూరంగా ఉండకలిగేవాడు దీనిని సంపాదించకలుగుతాడు. సాధారణంగా మానవునికి కామంవల్ల కలిగే మూడు వ్యసనాలు సంప్రాప్తిస్తాయి. అసత్య వాక్యం అనేది పరమవ్యసనం. పరదారగమనమూ, కారణం లేకుండా క్రూరంగా ప్రవర్తించ డమూ, ఈ రెండూ అంతకంటే పెద్దవైన వ్యసనాలు. ఓ రాఘవా ! అసత్యవాక్యం అనేది నీలో ఎన్నడూ లేదు, ఉండబోదు. ధర్మనాశానికి హేతువైన పరస్త్రీ అభిలాష అనేది నీకు ఉండడం సర్వథా అసంభవం. ఇది నీకు ఇప్పుడు లేదు, ఇదివరకెన్నడూ ఉండేది కాదు, నీ మనస్సులో ఎక్కడా దీనికి చోటులేదు. ఓ మహారాజకుమారా ! నీవు ఎల్లప్పుడూ స్వభార్యామాత్ర నిరతుడవు. సత్యసంధుడవు, ధర్మాత్ముడవు, పితృవాక్య పరిపాలకుడవు... ఐతే మోహంవల్ల అకారణంగా పరులకు ద్రోహం చేయుట అనే మూడవదైన ఘోర వ్యసనం నీకిప్పుడు ప్రాప్తించింది! ఓమహావీరా, దండకాటవిలో నివసించే మునులను రక్షించడానికై యుద్ధంలో రాక్షసులను సంహరిస్తానని నీవు ప్రతిజ్ఞ చేసినావు. ఇందుకోసమే ధనుర్బాణాలు ధరించి తమ్మునితో దండకారణ్యం ప్రవేశించినావు...ఓ వీరుడా, నీవు దండకారణ్యంలోకి ప్రవేశించడం నాకు ఇష్టం లేదు. అందుకు కారణం ఏమిటో చెపుతున్నాను విను. క్షత్రియు లకు ధనుస్సూ, అగ్నికి కట్టెలూ, దగ్గరగా ఉన్నట్లైతే తేజోబలాలు వృద్ధిపొందుతాయి...... అగ్ని సంబంధం మోస్తరుగానే ఆయుధసంబంధం కూడా (అపాయానికి మూలం). నీవిష యంలో నాకుండే ప్రేమ, గౌరవమూ వీటిని పురస్కరించుకొని నేను నీకీ విషయం జ్ఞాపకం చేస్తున్నాను గాని బోధించడం లేదు. ధనుర్ధరుడవైన నీవు దండకారణ్యంలో ఉన్న రాక్షసు లను కారణంలేకుండా చంపడానికి అభిలషించరాదు. ఓ వీరుడా, ఏ తప్పులేనివాళ్ళను చంపడం నాకు ఇష్టంలేదు. అరణ్యంలో నివసించే ధనుర్ధరులైన క్షత్రియులకు ధనుస్సువల్ల ప్రయోజనం ఒక్కటే. అది దుఃఖితులను రక్షించడం. ఆయుధాలెక్కడ? అరణ్యం ఎక్కడ? హింస ఎక్కడ? తపస్సు ఎక్కడ ? ఇవి పరస్పర విరుద్ధమైనవి. మనం దేశానికి అనుగుణ మైన విధంగా ప్రవర్తిద్దాం. ఆయుధాలు పట్టడంచేత బుద్ధి కలుషం ఔతుంది...పరిశుద్ధమైన మనస్సు కలవాడవై, ఓ సౌమ్యుడా, తపోవనంలో తపస్సు చెయ్యి.నీకు అన్నీ తెలుసు. వాస్త వానికి ఈ మూడు లోకాలలోనూ నీకు తెలియనిది లేదు".

సుందరకాండ - 21 వ సర్గ 3-11 శ్లోకాలు.

(తనను చేరవలసిందిగా కోరిన రావణాసురునితో అన్న మాటలు :-)

"నీమనస్సు నానుంచి మరల్చుకొని నీవాళ్ళమీద నిలుపుకో. పాపాత్ముడు సిద్ధి కావాలని కోరుకున్నట్లు నువ్వు నన్ను కోరడం మంచిది కాదు. పతివ్రతనూ, ఉత్తమ కులం చేరినదాననూ, పుణ్య వంశంలో పుట్టిన దాననూ ఐన నేను నింద్యమైన అకార్యం చెయ్యను. నేను నీకు భార్య కాజాలను, నేను పరభార్యను. ధర్మం బాగా పాలించుము. సత్పురుషుల ఆచారం అవలంబించుము. ఓ నిశాచరుడా నీకు నీ భార్యలు ఎట్లో ఇతరులకు కూడా వారి భార్యలు ఆ విధంగా రక్షించుకో తగిన వారే. నిన్నే ఉపమగా చేసికొని నీవు నీభార్యలతో ఆనందించుము. తమ భార్యలతో సంతృప్తి పడక, చపలులై, చపలేంద్రియులుగా ఉన్న

నీచబుద్ధి కలవారు పరభార్యల పరాభవానికి గురి అవుతారు. ఇక్కడ ఎవ్వరూ మంచివారులేరా? ఉన్నా కూడా వారి మాట నువ్వు వినడం లేదా? ఎందుచేతనంటే సదాచారశూన్యమైన నీ బుద్ధి విపరీతంగా ప్రవర్తిస్తున్నది................ ఇంద్రియ నిగ్రహం లేక చెడుమార్గం పట్టిన వాడు రాజుగా ఉండడంతో సమృద్ధాలైన రాష్ట్రాలు, నగరాలూ కూడా నశించిపోతూ ఉంటాయి.

యుద్ధకాండ : 116 వ సర్గ 37-48 శ్లోకాలు.

(రావణుని ఆజ్ఞప్రకారం తనను (సీతను) రక్షిస్తూ బాధించిన రాక్షసస్త్రీలను సంహరిస్తానని పలికిన హనుమంతునితో అన్నమాటలు:)

ఓ హనుమంతుడా, రాజభక్తికి వశులై పరాజ్ఞప్రకారం ప్రవర్తించే సేవకురాళ్లను గూర్చి ఎవరైనా కోపిస్తారా?......ఈ రాక్షస స్త్రీలు రావణుని ఆజ్ఞప్రకారం నన్ను భయ పెట్టినారు. ఇప్పుడు రావణాసురుడు సంహరింపబడినాడు కనక ఇటుపైన భయపెట్టరు..... ఆర్యుడైనవాడు, పాపాత్ములైనా, పుణ్యాత్ములైనా, వధచేయడానికి తగిన వారైనా, ఇతరుల విషయంలో కారుణ్యం చూపాలి. అపరాధం చెయ్యని వాడంటూ ఉండడు కదా!"

161 వ సర్గ 95-101 శ్లోకాలు.

రామరాజ్యం [1]

రాముడు రాజ్యం చేస్తూండగా విధవలు ఎన్నడూ ఏడవలేదు. సర్పభయం కాని వ్యాధి భయం కాని లేదు. లోకంలో ఎక్కడా దొంగలు ఉండేవారు కాదు. ఎవరికీ ఆపదలు కలుగ లేదు. పెద్దవాళ్ళు ఎప్పుడూ చిన్నవాళ్లకి ప్రేతకార్యాలు చేయలేదు. అంతా ఆనంద మయంగా ఉండేది. ప్రతీ ఒక్కడూ ధర్మపరుడై ఉండేవాడు. ప్రజలు రాముణ్ణి గూర్చే ఆలో చిస్తూ ఎన్నడూ ఒకరినొకరు హింసించుకోలేదు. దుఃఖవ్యాధి నిర్ముక్తులై చాలాకాలం జీవించే వారు. "రాముడు, రాముడు, రాముడు", అంటూ ఎప్పుడు చూసినా రాముణ్ణి గురించే మాట్లాడుకొనేవారు. ప్రపంచం అంతా రామమయం అయిపోయింది. వృక్షాలు బాగా వృద్ధి పొంది అన్ని కాలాల్లోనూ కూడా పుష్పాలూ, ఫలాలూ సమృద్ధిగా ఇచ్చేవి. సకాలంలో వర్షాలు ఉండేవి. అన్ని జాతుల వాళ్లూ వాళ్ళవాళ్ళ ధర్మాలతో సంతృప్తి పడుతూ దురాశ లేకుండా ఉండేవారు.

## మహాభారతము

వనపర్వం. 313 వ అధ్యాయం[2]. యక్ష ప్రశ్నలు

పాండవులు వనవాసం చేస్తూండగా యుధిష్ఠిరునికీ అతనిని పరీక్ష చేయడం కోసం కొంగ రూపంలో వచ్చిన యమధర్మరాజుకీ మధ్య ఒక సంభాషణ జరిగింది. ఈ ఘట్టం మహాభారతంలోని వనపర్వంలో అత్యుత్తమం ఐన ఘట్టం అని చెప్పవచ్చు. యక్షునికీ యుధిష్ఠిరుడికీ మధ్య ప్రశ్నోత్తరాలు ఈ క్రిందివిధంగా జరిగినాయి.

"భూమికంటే గొప్పది ఏది? ఆకాశం కంటే ఎత్తైనది ఏది?"

"భూమి కంటేగొప్పది తల్లి. ఆకాశంకంటే ఎత్తైనవాడు తండ్రి."

---

1. మహాత్మాగాంధీ కోరిన ఆదర్శ రాజ్యం ఇదే.
2. గోరఖ్‌పూర్ ప్రతి

"ధర్మం అంటే ఒక్క మాటలో ఏమని చెప్పాలి? కీర్తిఅంటే ఒక్కమాటలో ఏమని చెప్పాలి? స్వర్గానికి సాధనాన్ని ఒక్కమాటలో ఏమని చెప్పాలి? సుఖం అంటే ఒక్కమాటలో ఏమని చెప్పాలి?"

ఎవరి ధర్మం వారు నిర్వర్తించే నేర్పే, ఒక్కమాటలో చెప్పాలంటే, ధర్మ సాధనం. ఒక్క మాటలో చెప్పాలంటే దానమే కీర్తి. ఒక్క మాటలో చెప్పాలంటే స్వర్గానికి సాధనమైనది సత్యమే. సుఖం అనగా, ఒక్క మాటలో చెప్పాలంటే. మంచి శీలమే."

"ఐశ్వార్యాలలోకెల్లా గొప్ప ఐశ్వర్యం ఏది?"

"పాండిత్యం."

"గొప్ప లాభం ఏది?"

"ఆరోగ్యం."

"అత్యుత్తమైన సుఖం ఏది?"

"సంతృప్తి."

"ఈ ప్రపంచంలో ధర్మాలలోకెల్లా గొప్ప ధర్మం ఏది?"

"అపకారం చేయకుండా ఉండడం."

"దేనిని నిగ్రహిస్తే దుఃఖాలు లేకుండా ఉంటాయి?"

"మనస్సును."

"ఎవరితో స్నేహం క్షీణించకుండా ఉంటుంది?"

"సత్పురుషులతో"

"దేన్ని వదిలివేయడం చేత మానవుడు ఇతరులకు ఇష్టుడు ఔతాడు?"

"గర్వం."

"ఏది విడిచిపెట్టడంచేత మానవుడు ధనవంతుడు ఔతాడు?"

"కామం."

"ఏది విడిచిపెట్టడంచేత సుఖవంతుడౌతాడు?"

"లోభం."

"తపస్సు అంటే ఏది?"

"ఎవరి ధర్మం వారు చేయడమే తపస్సు."

"దమం అంటే ఏది?"

"మనో నిగ్రహం"

"ఓర్పు అంటే ఏమిటి?"

"సుఖదుఃఖాలు, లాభనష్టాలు మొదలైన ద్వంద్వాలు సహించడం."

"సిగ్గు అంటే ఏమిటి?"

"చెడ్డ కార్యాలనుంచి దూరంగా ఉండడమే సిగ్గు"

"ఆర్జవం అంటే ఏమిటి?"

"సమచిత్తంతో ఉండడమే ఆర్జవం."

"జయింపరాని శత్రువు ఎవరు?"

"క్రోధం."

"అంతంలేని రోగం ఏది ?"

"దురాశ".

"సాధువు ఎవరు ?"

"సర్వభూతాల హితం కోరేవాడు".

"అసాధువు ఎవరు ?"

"దయలేని వాడు"

"అత్యుత్తమం ఐన స్నానం ఏది ?"

"మనో మాలిన్యం అంతా పోగొట్టుకోవడం."

"దానం ఏది ?"

"ప్రాణాలు రక్షించడం"

"ప్రపంచకంలో ఆశ్చర్య కరమైన విషయం ఏది ?"

"ప్రతీరోజూ ఎంతోమంది ప్రాణులు యముని ఇంటికి వెడుతూనే ఉన్నారు. ఐతే మిగిలిన వాళ్లందరూ తాము ఇల్లాగే ఉండిపోతామని అనుకుంటూ ఉంటారు. ఇంతకంటే పరమాశ్చర్యం ఏముంది ?"

"ఈ ప్రపంచకంలో విశేషాలు ఏమిటి ?"

మహా మోహం అనే ఈ బాణలిలో, సూర్యుడు అనే అగ్నితోటీ, రాత్రింబవళ్ళు అనే కట్టెలతోటీ, కాలుడు ఈ భూతాలన్నింటినీ, మాసాలు ఋతువులూ అనే గరిటెతో దట్టిస్తూ, వండుతున్నాడు. ఇవే విశేషాలు."

ఉద్యోగ పర్వం. 33-39, 39-40

## విదుర నీతి

33 వ అధ్యాయం.

### బుద్ధిమంతుడు

ఆత్మజ్ఞానమూ, ప్రయత్నమూ, ఓర్పు, ధర్మనిష్ఠా కలిగి అర్థంనుంచి తొలగిపోని వాడే పండితుడు. ప్రశస్తమైనవాటిని సేవిస్తాడు, నిందితమైనవాటిని సేవించడు. నాస్తికుడు కాకుండా శ్రద్ధావంతుడై ఉంటాడు. ఇదే పండిత లక్షణం. కోపమూ, హర్షమూ, గర్వమూ, సిగ్గు, మొరటుతనమూ, నేనే గొప్పవాడననే అహంకారమూ, ఇవి ఎవనినైతే అర్థంనుంచి దూరం చేయవో ఆతడే పండితుడు. ఎవనిపనిగాని, ఆలోచనగాని, ఆలోచించి నిర్ణయించిన విషయంగాని, ఇతరులెవరూ తెలుసుకోలేరో, అతడు సాధించి పూర్తిచేసిన పని మాత్రమే తెలుసుకోగలుగుతారో, ఆతడే పండితుడు. శీతం కాని, ఉష్ణం కాని, భయం కాని, ప్రేమకాని, సమృద్ధికాని, దారిద్ర్యం కాని, ఎవని పనులకు విఘ్నం కలిగించలేవో ఆతడే పండితుడు. నలువైపులా ప్రసరించే శక్తిగల ఎవని బుద్ధి ధర్మార్థాలు రెండింటినీ అనుసరిస్తుందో, ఎవడు కామంనుండి అర్థం సంగ్రహించడం కోసం కోరుతాడో అతడు పండితుడని చెపుతారు. బుద్ధిమంతులైన మానవులు తమ శక్తికి లోబడిన పనులు మాత్రమే చేయడం కోసం ప్రయత్నిస్తారు. శక్తివంచన లేకుండా చేస్తారు. దేని విషయంలోనూ కూడా చిన్నచూపుతో చూడరు. విషయాలు తొందరగా తెలుసుకుంటారు. చాలాసేపు వింటారు. ఏ విషయమైనా పూర్తిగా అర్థం చేసుకొని మాత్రమే దానికోసమై ప్రయత్నిస్తారు. కాని కామంచేత ప్రయ

త్నించరు. ఇతరులు అడక్కుండా తన మాటలు వ్యర్థం చేయడు. ఇది పండితుని ప్రధాన లక్షణం. పండితులైనవాళ్లు అందరానిదానికోసం ఆశపడరు. దానిని గూర్చి విచారించరు. ఆపదలలో మోహం చెందరు. ఏ పనైనా బాగా నిర్ణయం చేసుకొన్న తరవాతే ప్రారంభిస్తారు. మధ్యలో ముందువెనుకలాడరు. కాలం వ్యర్థం చెయ్యరు. ఎల్లప్పుడూ తమ మనస్సు వశంలో ఉంచుకుంటారు. వాళ్ళే పండితులు......ఎవని బుద్ధి శాస్త్రాభ్యాసాలు పరస్పరమూ సహాయకారులుగా ఉంటాయో, ఎవడు (తన విద్యాబుద్ధులచేత) పెద్దలు చూపిన సదాచారం వ్యతిరేకించడో అతడే పండితుడనే పేరు పొందగలుగుతాడు.

**మూఢుడు**

చదువులేకపోయినా గర్వం కలవాడు, ధనం లేకపోయినా పెద్ద ఎత్తులు వేసేవాడు, పనిచేయకుండా ఫలితం సాధించాలని కోరేవాడూ మూఢుడని పెద్దలు చెపుతారు. తనపని వదులుకొని ఇతరుల పనికోసం ప్రయత్నించేవాడు, మిత్రుల కార్యాల విషయంలో అసత్యంగా ప్రవర్తించేవాడూ మూఢుడని చెపుతారు. తనమీద ఇష్టంలేనివారితో స్నేహం కోరేవాడు, ఇష్టం ఉన్న వాళ్ళని విడిచిపెట్టేవాడు, బలవంతునితో పగ సాధించడం కోసం ప్రయత్నించేవాడు మూఢుడని చెపుతారు. మిత్రుడు కాని వానితో మైత్రిచేసేవాడు, నిజమైన మిత్రుడు కానివానితో మైత్రి చేసేవాడు, నిజమైన మిత్రుని ద్వేషించి హింసించేవాడు, చెడ్డ పని చేయడానికి పూనుకొనేవాడు, మూఢుడని చెపుతారు. పనులు చేయడంలో జాప్యం చేసేవాడు, అడుగడుగునా శంకించేవాడు, తొందరగా చేయవలసిన పనుల విషయంలో ఆలస్యం చేసేవాడు మూఢుడని చెపుతారు. పిలవకుండా ప్రవేశించేవాడు, అడగకపోయినా ఎక్కువగా మాటలాడే వాడు, విశ్వాసం లేనివారిని విశ్వసించేవాడు, నరాధముడైన మూఢుడని చెపుతారు. తాను తప్పుపని చేస్తూ ఆ పనే చేస్తున్న ఇతరులను నిందించేవాడు, సామర్థ్యం లేకపోయినా కోపగించే వాడు మూఢుడని చెపుతారు. తన శక్తి తెలుసుకోకుండా ధర్మార్థాలకి విరుద్ధమూ, అలభ్యమూ, అయిన వస్తువును ఏ ప్రయత్నమూ చేయకుండానే సంపాదించాలని కోరేవాడు మూఢుడని చెపుతారు. ఉపదేశార్హత లేనివానికి ఉపదేశించేవాడు, శూన్యోపాసన చేసేవాడు, లోభిని సేవించేవాడు మూఢుడని చెపుతారు.

తనమీద ఆధారపడ్డవాళ్లకి పెట్టకుండా మృష్టాన్నం భుజిస్తూ, వాళ్ళకి ఇవ్వకుండా మంచి వస్త్రాలు ధరించే వాడికంటే క్రూరుడెవడైనా ఉన్నాడా?

ఒకడు చేసిన చెడ్డపని ఫలితం ప్రజలందరూ అనుభవించవలసివస్తుంది. ఐతే వాళ్లందరూ చివరికి తప్పించుకోవచ్చు కాని, పాపం మాత్రం చేసినవానికి మాత్రమే చెందుతుంది.

ధానుష్కుడు వేసిన బాణం ఏ ఒకరినైనా చంపవచ్చు, మానవచ్చు. బుద్ధిమంతుడు పన్నిన పన్నాగం మాత్రం రాజుతో సహా రాష్ట్రం అంతటినీ నాశం చేయవచ్చు. సముద్రం దాటడానికి ఓడ ఒక్కటే ఏకైక సాధనం ఐనట్లు స్వర్గం అధిరోహించడానికి ఉపయోగించే సోపానమార్గం సత్యం ఒక్కటే గాని మరేదీ కాదు.

## ద్వయం

ఏమాత్రమూ పరుషంగా మాటలాడకుండడం, అయోగ్యుని సత్కరించకుండా ఉండడం-ఈ రెండింటి చేతనే మానవుడు ఈ లోకంలో ప్రకాశిస్తాడు. ధనం లేకపోయినా

కోరికలు కలిగి ఉండడం, సామర్థ్యం లేకపోయినా కోపగించడం ఈ రెండూ శరీరాన్ని శుష్కింపచేసే తీక్షణమైన కంటకాలు.

త్రయం

పరధనం అపహరించడమూ, పరదార సంబంధమూ, మిత్రపరిత్యాగమూ, ఈ మూడూ నాశానికి దారితీసే దోషాలు. భక్తుణ్ణీ, సేవచేస్తున్న వానినీ, 'నేను నీవాడను' అని పలికే వానినీ-ఈ విధంగా శరణుజొచ్చిన ముగ్గురినీ తాను ఎన్నికష్టాలలో ఉన్నా మానవుడు విడిచిపెట్టకూడదు.

చతుష్టయం

మహాబలవంతుడైన రాజు తెలివిగలవాడైతే ఈ నాల్గింటినీ విడిచిపెట్టాలి-అల్ప బుద్ధి కలవాళ్లతో ఆలోచన చేయకూడదు, చాలా సమయం తీసుకొనే వాళ్ళతోటీ, తొందర పాటు కలవాళ్లతోటీ, ముఖస్తుతి చేసే వాళ్ళతోటీ కూడా ఆలోచన చేయకూడదు.

పంచకం

తండ్రి, తల్లి, అగ్ని, ఆత్మ (తాను), గురువు అనే ఈ ఐదు అగ్నులనూ మానవుడు జాగర్తగా పూజించాలి.

ఐదు ఇంద్రియాలు కల మానవునికి ఏ ఒక్క ఇంద్రియం చిల్లుపడినా కూడా, (చిల్లుపడిన) నీళ్ళు నింపిన తోలుతిత్తినుంచి నీరు కారిపోయినట్లుగా, ఆ ఇంద్రియాల ద్వారా వాని బుద్ధి కారిపోతుంది.

షట్కం

సత్యమూ, దానమూ, మందగొండి తనం లేకుండడం, అసూయ లేకుండడం, ఓర్పు, ధైర్యము-ఈ ఆరు గుణాలూ మానవుడెన్నడూ విడిచిపెట్టకూడదు.

ధనం (రాబడి), ఎల్లప్పుడూ ఆరోగ్యము, ప్రియమైనది, ప్రియంగా మాటలాడేది ఐన భార్య, చెప్పిన మాటవినే కుమారుడు, ధనం సంపాదించిపెట్టే విద్య ఈ ఆరూ మానవులకు సుఖాలు.

ఈ ఆరుగురూ తమకు పూర్వం ఉపకారం చేసిన వారిని తప్పకుండా చిన్నచూపు చూస్తారు-చదువు నేర్చిన శిష్యులు గురువునూ, వివాహం అయినవారు తల్లినీ, కామం తీరిన వారు స్త్రీని, పని పూర్తిఅయినవారు ఆ పనిలో సహాయం చేసినవారిని, ఏరు దాటినవారు నావనూ, జబ్బుపడ్డవాళ్ళు (జబ్బుతగ్గిన తరవాత) వైద్యుణ్ణీ (మరచిపోతారు).

ఈర్ష్య కలవాడు, ఎక్కువ జాలికలవాడు, సంతృప్తి లేనివాడు, ముక్కోపి, నిత్యశంకితుడు, పరుల భాగ్యం మీద ఆధారపడ్డవాడు - ఈ ఆరుగురూ నిత్యదుఃఖితులుగా ఉంటారు.

సప్తకం

స్త్రీలు, జూదము, వేట, పానము, పరుష వాక్యము, దండ పారుష్యము, పరధన హరణము-వ్యసనానికి దారితీసే ఈ ఏడు దోషాలూ మానవుడు విడిచిపెట్టాలి. ఈ దోషాలు ఉండే బాగ నిలద్రొక్కుకొని ఉన్నరాజులు కూడా నశించిపోతారు.

## అష్టకం

బుద్ధి, బలము, ఆభిజాత్యము, ఇంద్రియ నిగ్రహము, విద్య, పరాక్రమము, మితభాషిత్వము, యథాశక్తిగా దానం చేయడం, కృతజ్ఞత్వము-ఈ ఎనిమిది గుణాలూ పురుషుణ్ణి ప్రకాశవంతుని చేస్తాయి.

## నవకం

ఇది తొమ్మిది గుమ్మాల ఇల్లు. దీనిలో మూడు స్తంభాలూ, ఐదుగురు సాక్షులూ ఉన్నారు. దీనిని గూర్చి బాగా తెలిసిన ఒక అధిపతి దీనిలో నివసిస్తున్నాడు. ఈ విషయం తెలుసుకొన్నవాడే గొప్ప ఋషి. (తొమ్మిది గుమ్మాలనగా శరీరంలో ఉన్న తొమ్మిది రంధ్రాలు. వాత, పిత్త, కఫాలనే మూడూ మూడు స్తంభాలు. ఐదు జ్ఞానేంద్రియాలు ఐదుగురు సాక్షులు. ఈ నివాసాన్ని గూర్చి బాగా తెలిసిన అధిపతి అనగా జీవుడు.)

## దశకం

మత్తెక్కినవాడు, సావధానంగా లేనివాడు, పిచ్చిఎత్తినవాడు, అలిసిపోయినవాడు, కోపగించినవాడు, ఆకలిగొన్నవాడు, తొందరపాటులో ఉన్నవాడు, లుబ్ధుడు, భయం చెందినవాడు, కాముకుడు-ఈ పదిమందీ ధర్మం తెలుసుకోలేరు. అందుచేత పండితుడైనవాడు ఈ అవస్థలకు లొంగిపోకూడదు.

## 34 వ అధ్యాయం

మోసంతో కూడేవి, చెడ్డ ఉపాయంతో సాధించతగినవీ అయినపనుల విషయంలో ఫలం లభించినా కూడా మనస్సు ప్రవర్తింపచేయకు. మంచి ఉపాయాలు ప్రయోగించి బాగా చేసిన పని ఏ కారణంచేతనైనా ఫలించకపోయినా కూడా బుద్ధిమంతుడు విచారించవలసిన పనిలేదు. ఒక కార్యానికి సంబంధించిన అన్ని విషయాలూ, దానివల్ల కలిగే పరిణామాలూ, తనకుగల సాధన సామగ్రి-వీటినన్నింటినీ జాగర్తగా ఆలోచించుకొని బుద్ధిమంతుడు ప్రవర్తించాలి, లేదా విరమించాలి.

ఏది సులభంగా మ్రింగుడు పడుతుందో, మ్రింగుడుపడిన తరవాత జీర్ణం అవుతుందో, జీర్ణంఅయిన తరవాత హితకరంగా ఉంటుందో అల్లాటి దానినే అభివృద్ధి కోరేవాడు భక్షించాలి. పక్వంకాని పచ్చికాయలు కోసేవాడు, ఆ కాయల రసమూ అనుభవించలేడు, ఆ చెట్టు విత్తనం పాడుచేస్తున్నాడు. తుమ్మెద పుష్పాలకేమీ నొప్పి కలగకుండా వాటిలోంచి తేనె తీసుకొంటుంది. అదే విధంగా మానవులకు బాధ కలగకుండా వాళ్ల దగ్గర నుంచి ధనం సేకరించాలి. ఉద్యానంలోని మాలాకారుడులాగ ఒక్కొక్క పువ్వే ఏరాలి గాని బొగ్గు తయారు చేసేవాడులాగా మొదలంటా నరికివేయకూడదు.

సత్యం ధర్మాన్ని రక్షిస్తుంది. ఏకాగ్రత విద్యను రక్షిస్తుంది. అభ్యంగన స్నానం రూపాన్ని రక్షిస్తుంది. సచ్చరిత్ర కులాన్ని రక్షిస్తుంది.

విద్య, ధనము, ఆభిజాత్యము, ఇవి దుష్టునికి మద హేతువులు. ఇవే సత్పురుషుని విషయంలో ఆత్మనిగ్రహానికి ఉపకరిస్తాయి.

మంచి వస్త్రాలు ధరించినవాడు సభను జయిస్తాడు. గోవులు కలవాడు మధుర భక్ష్యాల కోసం ఆశను జయిస్తాడు. వాహనం కలవాడు మార్గాన్ని జయిస్తాడు; శీలవంతుడు అంతన్నూ జయిస్తాడు.

దరిద్రులు ఎప్పుడు కూడ మిక్కిలి సంపన్నమైన (రుచి గల) అన్నమే తింటారు. ఆకలి రుచిని పుట్టిస్తుంది. అది ధనవంతులకు లభించేది కాదు.

ఉద్యోగం ఉండదేమోనని సామాన్యులు భయపడుతూ ఉంటారు. మధ్యరకం వాళ్ళు మరణం నుండి భయపడుతూంటారు.

మానవుడికి తన శరీరమే రథం. బుద్ధి సారథి; ఇంద్రియాలు గుర్రాలు. వాటిని వశంలో ఉంచుకొన్నట్లయితే మంచిగుర్రాల సహాయంతో రథికుడు వెళ్లినట్లుగా అతడు సుఖంగాను ప్రయాణంచేయకలుగుతాడు. ఉత్తములైతే అవమానంనుంచి మాత్రమే ఎక్కువగా భయపడతారు.

తనంతట తానే మనస్సును జయించిన వానికి ఆ మనస్సు బంధువుగా ఉంటుంది. నిగ్రహించిన మనస్సు బంధువు. నిగ్రహించలేకపోతే ఆ మనస్సే శత్రువు ఔతుంది.

వాక్సంయమం అనేది చాలా కష్టమైన పని. ఎక్కువగా మాటలాడుతూ అది అర్థవంతంగాను విచిత్రంగాను ఉండేటట్లు చూడడం అశక్యం. బాగా మాటలాడినమాట ఎన్నో విధాలయిన కల్యాణం చేకూరుస్తుంది. అదే చెడ్డగా ప్రయోగిస్తే అనర్థానికి దారి తీస్తుంది. బాణం గుచ్చుకొని ఏర్పడిన గాయం మానిపోతుంది. గొడ్డలితో నరికేసిన అడవి మళ్లీ పెరుగుతుంది. సహింపరాని చెడ్డమాటలచే ఏర్పడిన గాయం మాత్రం ఎన్నటికీ మానదు. వంకర ములికి గల నారాచ బాణాలైనా శరీరం నుంచి పైకి లాగివేయవచ్చుగాని వాక్శల్యాన్ని లాగివేయటం కష్టం. ఎందుచేతనంటే — అదిహృదయంలో గ్రుచ్చుకొని ఉంటుంది. మాటలు బాణాలవలె నోటినుంచి బయటకు వస్తూఉంటాయి. అవి తగిలినవాడు రాత్రింబగళ్లు బాధ పడుతూ ఉంటాడు. అవి సరిగ్గా ఇతరుల మర్మస్థానం లోనే గుచ్చుకొంటాయి. పండితుడెన్నడు వీటిని ఇతరుల విషయంలో ప్రయోగించకూడదు. దేవతలు ఎవణ్ణిఅణగ ద్రొక్కాలని అనుకుంటారో వారి బుద్ధిని తీసివేస్తారు. దానితో వాడు అన్నింటిని వక్రంగానే చూస్తాడు.

35 వ అధ్యాయం

దేవతలు పశువుల కాపరిలాగ చేతులో కర్ర తీసుకొని రక్షించరు. తాము రక్షించాలనుకున్న వారికి సద్బుద్ధి ప్రసాదిస్తారు.

పెద్దలు లేని సభ సభకాదు, ధర్మం బోధించని పెద్దలు పెద్దలు కారు: సత్యం లేని ధర్మం ధర్మం కాదు. మోసంతో కూడిన సత్యం సత్యం కాదు.

రాత్రి సుఖంగా గడపడానికి వీలు కలిగించే పని పగలు చేసుకోవాలి. వర్షాకాలం నాలుగు మాసాలు సుఖంగా ఉండే విధంగా మిగిలిన ఎనిమిది మాసాలు పనిచేసుకోవాలి. ముసలి తనంలో సుఖంగా ఉండటానికి వీలుండేటట్లుగా పూర్వ వయస్సులో ప్రవర్తించాలి. పర లోకంలో సుఖం కలిగేటట్లుగా ఇహలోకంలో వ్యవహరించాలి. శూరుడు, చదువుకొన్నవాడు, ఎట్లాసేవచేయాలో తెలిసినవాడు-వీళ్ళు ముగ్గురూ భూమి మీద బంగారం పంట పండిస్తారు.

36 వ అధ్యాయం

మాటలాడటం కంటే మౌనంగా ఉండటం మంచిది. మాటలాడ వలసి వస్తే సత్యం మాటలాడడం ఉత్తమం. అంతకంటే ఉత్తమం ప్రియంగా మాటలాడడం. ధర్మయుక్తంగా మాటలాడడం ఇంకా ఉత్తమం.

కోపగిస్తాడేమో అని భయపడవలసిన వాడు కాని, భయపడుతూ ఉపచారాలు చేయ వలసిన వాడు కాని మిత్రుడు కాదు. తండ్రి విషయంలో వలే ఎవని విషయంలో పూర్తి విశ్వాసం ఉంటుందో అతడే మిత్రుడు. మిగిలిన వాళ్లందరూ పరిచితులు. మిత్రుల వల్ల సత్కారాలు, ఉపకారాలు పొందికూడా వారికి ఏ మాత్రమూ సహాయకారులుగా ఉండని కృతఘ్నుల మృతశరీరాన్ని నక్కలు కూడా ముట్టుకోవు.

39 వ అధ్యాయం

సమయానుగుణం కాకుండా మాటలాడే బృహస్పతిని కూడా ఉపేక్షించి అవ మానిస్తారు.

ఒకడు దానంచేత ప్రియుడౌతాడు; మరొకడు ప్రియవాక్యంచేత ప్రియుడౌతాడు. మరొకడు నమ్మకం కుదరడంచేత ప్రియుడౌతాడు. ప్రియుడైనవాడు ఎల్లాగైనా ప్రియుడే.

తనకు ఏది ప్రతికూలమో అది ఇతరుల విషయంలో కూడా చేయకూడదు సంక్షేపంగా చెప్పాలంటే ఇదే ధర్మం. దీనికి విరుద్ధంగా జరిగే పని అంతా కేవలం స్వలా భాపేక్ష చేతనే.

ఎక్కువ శ్రమపడి గాని, అధర్మ మార్గం అవలంబించిగాని, శత్రువుకు లొంగి పోయిగాని, సాధించవలసిన పనుల విషయంలో మనస్సు ప్రవర్తింపచేయకు.

40 వ అధ్యాయం

ఆత్మయే పవిత్రమైనది. సత్యమే ఉదకం. ధృతియే తీరం. దయయే తరంగాలు. దీనిలో స్నానం చేసిన పుణ్యాత్ముడు పవిత్రం ఔతాడు. ఎందుచేతనంటే ఈ ఆత్మ ఎల్ల ప్పుడూ పుణ్యమైనదే, లోభం లేనిదే.

## (భీష్మోపదేశాలు) శాంత్యనుశాసన పర్వాలు

56 వ అధ్యాయం. 15, 43, 44, 45 శ్లోకాలు

దైవము, పురుషకారము అనే ఈ రెండూ సాధారణ కారణాలు. ఈ రెండింటి లోనూ పురుషకారం చాలా ప్రధానం ఐనదని తలుస్తాను. దైవం ఎలాగైనా ఒక నిశ్చితరూపం లోనే ఉంటుంది కదా. (దైవం గురించే ఆలోచించే వాడు విక్షుబ్ధ చిత్తం కలవాడు అవుతాడు).

రాజు గర్భిణీ స్త్రీ వలె ప్రవర్తించాలి...గర్భిణీ స్త్రీ తన మనస్సుకు ఇష్టమైన వస్తువులు వదిలిపెట్టి గర్భస్థ శిశువుకు హితమైన వస్తువులే భుజిస్తుంది. అదే విధంగా రాజు కూడా తనకు ఇష్టమైన విషయాలు వదిలిపెట్టి ప్రజలకు ఏది హితమో దానినే చేయాలి.

66 వ అధ్యాయం. 37 శ్లోకం

ధర్మంపై నిలచినదీ, సత్త్వమనే వీర్యం కలదీ, ధర్మపరిపాలనమనే త్రాడు కలదీ, త్యాగమనే వాయువు మార్గంలో నడిచేదీ, అయిన నావ ఒకటి ఉన్నది. అది (వానిని) తరింప చేస్తుంది.

72 వ అధ్యాయం. 24 వ శ్లోకం

అభయం ఇచ్చిన వానికి గొప్పఫలం లభిస్తుంది. ప్రాణదానంతో సమానమైన దానం మూడు లోకాలలోనూ కూడా లేదు కదా!

73 వ అధ్యాయం. 24, 25 శ్లోకాలు

ఇహలోకంలో భూమి మంచివారిని చెడ్డవారినీ కూడా ధరిస్తుంది. సూర్యుడు మంచివారికి చెడ్డవారికీ కూడా వేడి ఇస్తాడు. గాలి మంచివారికీ చెడ్డవారికీ కూడా వీచుతుంది. ఉదకం మంచివారిని చెడ్డవారినీ కూడా పవిత్రం చేస్తుంది (తృప్తిపరుస్తుంది). ఐతే ఈ విధంగా జరిగేది ఈ లోకంలోనే. పరలోకంలో ఈ విధంగా ఉండదు. పుణ్యాత్ముల పాపాత్ములకీ గల భేదం మరణించిన తరవాత పరలోకంలో తెలుస్తుంది.

79 వ అధ్యాయం. 18, 21 శ్లోకాలు :-

అహింస, సత్యవాక్యము, క్రూరంగా ప్రవర్తించకుండడం, ఇంద్రియనిగ్రహము, దయ, ఇవియే తపస్సు కాని శరీర శోషణము తపస్సు కాదని పెద్దలు చెపుతారు.

వక్రమార్గాలన్నీ మరణానికి దారి తీస్తాయి. ఋజుత్వం మోక్షానికి మార్గం. ప్రధానంగా తెలుసుకోవలసినది ఇదే. ఎక్కువగా మాటలాడడం వల్ల ప్రయోజనం ఏమిటి ?

91 వ అధ్యాయం. 19-20 శ్లోకాలు :-

అగ్ని కట్టెను దహించి వేసినట్లుగా దుర్బలుల నేత్రాలు నిన్ను దహించకుండు గాక, అకారణంగా నిందితులైన వారి కండ్లనుండి కారిన కన్నీళ్లు, ఆ విధంగా నిందించే వానిని ,పిల్లలనూ, పశుసంపద మొదలైనవాటినీ నశింప చేస్తాయి.

108 వ అధ్యాయం 12, 18,-20, 22 శ్లోకాలు :

తల్లిదండ్రులనూ, గురువునూ పూజించినవాడు, మూడు లోకాలనూ పూజించినవాడవుతాడు. వారిని పూజించని వాని అన్ని కర్మలూ వ్యర్థం ఔతాయి. తల్లిదండ్రులకంటే కూడా గురువే గొప్పవాడని నా అభిప్రాయం. తల్లి దండ్రులు కేవలమూ శరీరం సృష్టించి జన్మకి మాత్రమే ఉపయోగపడతారు. ఆచార్యోపదేశం ద్వారా లభించిన జన్మ జరామరణ వర్జితంగా ఉంటుంది. సత్యోపదేశంచేత అలంకరించి, ఉత్తమ మార్గం చూపించి శాశ్వతమైన జ్ఞానం అందచేసిన గురువునే తల్లిగాను తండ్రిగాను భావించాలి. అతడు చేసిన మహోపకారం గుర్తించి అతని విషయంలో ద్రోహ చింత చేయకూడదు.

109 వ అధ్యాయం. 9-12 శ్లోకాలు :-

"ధర్మం అనగా ఏమిటి ?" అనే ప్రశ్నను అర్థం చేసుకోవడం చాలా కష్టం. సర్వప్రాణుల కల్యాణార్థం ధర్మ ప్రవచనం చేసిఉన్నారు. అందుచేత దేనివలన ప్రాణులకు సుఖం కలుగుతుందో అది ధర్మము అని నిశ్చితంగా చెప్పవచ్చును.

ధారణం చేసేది కనుక ధర్మం. ప్రజలను ధర్మమే నిలబెడుతూన్నది. దేనికి ప్రాణలను నిలబెట్టే శక్తి ఉన్నదో అది ధర్మం అని నిశ్చయం.

ప్రాణులు పరస్పరమూ హింసించుకోకుండా ఉండడానికై ధర్మనిర్వచనం చేసి ఉన్నారు. దేనియందు హింసకు తావుఉండదో అదే ధర్మమని నిశ్చయం.

111 వ అధ్యాయం. 59-68 శ్లోకాలు :-

పనులు చేయడంలో పోటీవల్ల కలిగిన అపవిత్రమైన దోషాలు పవిత్రమైన వానిని కూడా దూషితుని చేస్తాయి. ఉన్నతిలో ఉన్నవానిని చూచి ఎవడూ సహించలేడు. కర్మ ప్రవృత్తి అనేది వైరానికి దారి తీస్తుంది.

వనంలో నివసిస్తూ తన కర్తవ్యాలు నిర్వహిస్తూన్న మునికి కూడా మిత్రుడు, ఉదాసీనుడు, శత్రువు అనే మూడు పక్షాలవార్లు బయల్దేర్తుతార్లు.

లోభం కలవారు పరిశుద్ధమైన వారిని ద్వేషిస్తారు. పిరికివాళ్ళు తేజస్సు కలవారిని ద్వేషిస్తారు. మూర్ఖులు పండితులను ద్వేషిస్తారు. దరిద్రులు ధనికులను ద్వేషిస్తారు. అధార్మికులు ధార్మికులను ద్వేషిస్తారు. కురూపులు రూపవంతులను ద్వేషిస్తారు. మాయచేసి జీవించే లుబ్ధులైన అనేక మంది మూర్ఖులు చేరి ఏవిధమైన దోషమూలేని బృహస్పతివంటి వానికి కూడా దోషం అంటకడతారు.

120 వ అధ్యాయం 45-46 శ్లోకాలు :

విద్య, తపస్సు, విపులమైన ఐశ్వర్యమూ ఇవన్నీ ప్రయత్నం చేస్తేనే లభిస్తాయి. అందుచేత ప్రతీవాడు ఉద్యమం చేసి అభివృద్ధి సంపాదించుకోవాలి.

తెలివైనవాడు దేహాన్ని నిందించకూడదు- ఎందుచేతనంటే ఈ దేహంలోనే మహత్తరమైన బుద్ధి, గొప్ప ఆలోచనలు కల ఆత్మ ఉంటూన్నవి. దేవేంద్రుడు, విష్ణువు, సరస్వతి, సమస్త భూతాలూ కూడా ఈ శరీరంలోనే ఉంటున్నారు.

139 వ అధ్యాయం. 85-86-87, 90, 96 శ్లోకాలు :-

విద్య, శౌర్యము, సామర్థ్యము, బలము, ధైర్యము, ఈ ఐదు సహజమిత్రులు. పండితులైన వారు వీటితో నివసిస్తారు. ఇల్లు, సంపద, భూమి, భార్య, మిత్రుడు ఈ ఐదుగురు ఆగంతుకాలు. వీటిని ఎక్కడైనా సంపాదించుకోవచ్చు.

బుద్ధిమంతుడు ఎక్కడైనా సుఖంగా ఉంటాడు, తాను ఎక్కడైనా ప్రకాశవంతంగానే ఉంటాడు. ఎవరినీ భయపెట్టడు; ఎవరైనా భయపెడితే భయపడడు.

నా ఇల్లు, నా పొలాలు, నామిత్రులు, అంటూ మానవులు మోహావృత బుద్ధితో బాధపడుతూ ఉంటారు.

ప్రియంగా మాట్లాడేదే భార్య. మనస్సుకు ఆనందం కలిగించే వాడే కుమారుడు. విశ్వాసపాత్రుడే మిత్రుడు. జీవికి లభించే దేశమే స్వదేశం.

140 వ అధ్యాయం. 34, 66, 56, శ్లోకాలు :-

చొరవ తీసుకొంటేనే గాని మానవుడు భద్రమైన విషయాలు చూడలేడు. చొరవ తీసుకొన్న తరువాత బ్రతికిఉన్నాడా, వాడు భద్రంచూస్తాడు.

లభించిన సుఖాన్ని నిర్లక్ష్యం చేయడం, రాని దానికై అర్రులు చాచడం ఇది బుద్ధిమంతుని లక్షణం కాదు.

పని లేకుండా విరోధం పెట్టుకోకూడదు. చేతులతో నది దాటకూడదు. ఎద్దుకొమ్ము తినడం కోసం ప్రయత్నం చేయడం నిష్ఫలమే కాకుండా ఆరోగ్యభంగకరం కూడాను. పళ్లు విరుగుతాయి. రసం ఏమీ దొరకదు.

142 వ అధ్యాయం. 10 వశ్లోకం :-

నిజమైన జ్ఞానం కొంతమందికే ఉంటుంది. చాలా మంది తెలిసినట్లుగా అభినయించే వాళ్లే. ఈ విషయం బాగా తెలుసుకొని మంచివారినుండి జ్ఞానం సంపాదించాలి.

144 వ అధ్యాయం 6, 10, 12, 14, 15, 16, శ్లోకాలు:-

గృహం గృహంకాదు. గృహిణియే గృహం. గృహిణి లేని గృహం అరణ్యం వంటిదని చెపుతారు.

ఏ స్త్రీ భర్త సంతోషించినపుడు సంతోషిస్తుందో, దుఃఖించినపుడు దుఃఖిస్తుందో, అతడు ప్రవాసంలో ఉన్నప్పుడు దీనురాలై ఉంటుందో, (అతను) కోపగించినపుడు ప్రియంగా

మాట్లాడు తుందో అట్టి పతివ్రతయై, పతియే పరమగతిగా కలిగి, అతని ప్రియహితాలను కోరే భార్య ఎవరికి ఉంటుందో ఆతడే ఈ లోకంలో ధన్యుడు. అలాంటి భార్యతో చెట్టు క్రింద కాపురం చేసినా అదే ఉత్తమమైన గృహం. ఆమె లేని ప్రాసాదం కూడా అడవియే. పురుషునికి భార్య అనేదే గొప్ప సొత్తు. ఈ లోకంలో అసహాయంగా ఉండే వానికి ఆమె జీవనయాత్రలో తోడుగా ఉంటుంది. భార్యతో సమానమైన మిత్రుడు లేడు. రోగార్తునికి భార్యతో సమానమైన ఔషధం లేదు. భార్యతో సమానమైన గతి లేదు, భార్యతో సమానమైన శరణం లేదు. ధర్మసంగ్రహం విషయంలో భార్యను మించిన సహాయం మరొకటి లేదు.

162 వ అధ్యాయం. 6—9 శ్లోకాలు:-

ఇప్పుడు సత్యానికి లక్షణం ఏదో చెపుతాను. సత్యం పదమూడు విధాలైనది-సత్యము, సమదృష్టి, ఆత్మనిగ్రహము, మాత్సర్యము లేకపోవడం, ఓర్పు, సిగ్గు, సహనశక్తి, అసూయ లేకపోవడం, త్యాగం, ధ్యానం, ఆర్యత్వము, స్థిరమైన ధైర్యం, అహింస, -ఈ పదమూడూ ఓ రాజా! సత్యానికి గల వివిధ స్వరూపాలు.

2̶26 వ అధ్యాయం. 69 -77 శ్లోకాలు : -

ఎంతో కాలం పరీక్షిస్తేనే గాని ఎవరితోటీ మైత్రి చేయకూడదు. అలా చేసిన మైత్రి వదిలి పెట్టాలంటే కూడా చాలా కాలం తీసుకోవాలి. చాలా కాలానికి సంపాదించిన మైత్రి చాలా కాలం దాకా రక్షించుకోవాలి.

రాగము, గర్వము, మానము, ద్రోహము, పాపకర్మ, అప్రియము, చేయవలసి వచ్చినప్పుడు అలసించేవాడు ప్రశంసార్హుడు.

బంధువులూ, మిత్రులూ, భృత్యులూ, స్త్రీలూ చేసిన అపరాధం విషయంలో సందేహమున్నప్పుడు (వాళ్ళని శిక్షించడం విషయంలో) ఆలస్యం చేసేవాడు ప్రశంసార్హుడు. బాగా ఆలోచించి నిశ్చయానికి రావటం విషయంలో ఆలసించే వాడు చాలాకాలం పశ్చాత్తాపం పడవలసిన పని ఉండదు. పండితులను చిరకాలం సేవించటంచేత, సదాచారవంతులను చిరకాలం అనుసరించడం చేత, చిరకాలం ఆత్మ నిగ్రహం చేసుకోవడం చేత మానవుడు చాల కాలంపాటుఅవమానానికిగురి కాకుండాఉంటాడు. ఎన్నోమాట్లు అడిగినా కూడా ఇతరులకు సలహా ఇవ్వడంలో జాప్యం చేసేవాడు చాలాసేపు పశ్చాత్తాప పడవలసిన పనిఉండదు.

330 వ అధ్యాయం. 12, 13, 24, శ్లోకాలు! -

దుఃఖానికి మందేమిటంటే దానిని గూర్చి ఆలోచించకుండా ఉండడమే. దానిని గురించే ఆలోచిస్తూ ఉంటే అది తగ్గక పోవడమే కాకుండా ఇంకా వృద్ధిపొందుతుంది కూడాను. మానసికమైన దుఃఖాన్ని బుద్ధిచేత పోగొట్టుకోవాలి. శారీరకమైన దుఃఖాన్ని ఔషధాల ద్వారా పోగొట్టుకోవాలి. ఇదే జ్ఞాన సామర్థ్యం. చిన్న పిల్లలవలె ప్రవర్తించకూడదు.

కామాలతో తృప్తి పొందకుండగా ఒకదాని తరువాత ఒకటి సంపాదిస్తూఉండగానే, పెద్దపులి పశువును ఎత్తుకొనిపోయినట్లుగా, మానవుణ్ణి, మృత్యువు ఎత్తుకుపోతుంది.

(అనుశాసన పర్వం)-11 వ అధ్యాయం

(నీవు ఎవరిదగ్గరకు చేరుతావు, ఎవరిని ఆశ్రయించుకొని ఉంటావు, ఎవరిని సేవిస్తావు ? అన్న ప్రశ్నలకు సమాధానంగా లక్ష్మీదేవి చెప్పినమాటలు)

"అందమైనవాడు, ధైర్యవంతుడు, సమర్థుడు, కార్యపరాయణుడు, కోపరహి

తుడు, దేవతాభక్తుడు, కృతజ్ఞుడు, ఇంద్రియ నిగ్రహం కలవాడు అయిన మానవుని యందు నివసిస్తాను."

"అకర్మణ్యుని వద్దగాని, నాస్తికుని వద్దగాని, చరిత్ర హీనుని వద్దగాని, కృతఘ్నుని వద్దకాని, దుర్మార్గుని వద్దకాని, గురుద్వేషి వద్దగాని నివసించను."

"అల్పమైన తేజోబల సత్త్వమానములు కలవారివద్ద గాని, మాటిమాటికీ క్లేశపడుతూ కోపగిస్తూ ఉండేవారివద్ద గాని, తమ కోరికలు తమలోనే దాచుకొనే వారివద్దగాని ఉండను."

"తన కోసమై ఏదీ(కావాలని) కోరనివానివద్దగాని, స్వభావతః శక్తివిహీనుడైనవాని వద్దగాని, చిన్న లాభాలతో మాత్రమే సంతోషించే వానివద్దగాని నేను ఉండను."

"(ఇంట్లో) వస్తువులు జాగర్తగా అమర్చనిదీ, ఏ పనీ చేయడంలో లక్ష్యం లేనిదీ, మాటిమాటికీ భర్తకు ఎదురు చెప్పేదీ, పొరుగిండ్లకు తిరిగేదీ, సిగ్గులేనిదీ అయిన స్త్రీని నేను విడిచిపెట్టేస్తాను."

"సత్యం కలవారు, ఎల్లప్పుడూ ప్రియంగా కనబడేవారు, సౌభాగ్యం కలవారు, గుణవంతులు, పతివ్రతలు, కళ్యాణ శీలవంతులు, అలంకృతులు అయిన స్త్రీల వద్ద నివసిస్తాను."

"నేను ఎవరి దగ్గరా కూడా శరీరంతో నివసించను. నేను ఏ పురుషుని యందు భావం చేత సన్నిహితురాలనై ఉంటానో అతని ధర్మమూ, కీర్తి, అర్థమూ, కామమూ, వృద్ధిపొందుతాయి."

## 22వ అధ్యాయం

లక్ష్మి కన్యకలలో సుప్రతిష్ఠితురాలై నిత్యమూ నివసిస్తుంది. (కన్యలలో ఉన్న ఆ లక్ష్మి) మంగళప్రదురాలు, శుభ యోగ్యురాలు, మంగళ కర్మలయందు పూజింప తగినది. గనిలో ఉన్న రత్నం ఏవిధంగా సమస్త కామఫలాలను ఇస్తుందో మహాలక్ష్మి రూపమైన కన్యకూడా అదేవిధంగా సర్వలోకానికీ మంగళం చేకూరుస్తుంది. మానవుల ఆనందమూ, సంతృప్తీ కూడా ఆమెపై ఆధారపడి ఉన్నాయి. సచ్చరిత్రకు గీటురాయి అయిన ఆమెమీద మహాకులాల పవిత్రత్వం ఆధారపడి ఉంది.

సాధ్వి కులాన్ని వృద్ధిపొందిస్తుంది. సాధ్వి గృహానికి గొప్ప పుష్టి. సాధ్వి సాక్షాత్తూ లక్ష్మి, రతీదేవి; వంశం అవిచ్ఛిన్నంగా ఉండడానికి మూలకారణం.

## స్వర్గారోహణ పర్వం

(భారతసావిత్రి) మహాభారత సారం :

మానవుడు వేలకొలది తల్లిదండ్రులనూ, వందలకొలది పుత్రులనూ, భార్యలనూ వివిధ జన్మలలో అనుభవించి (చూచి) ఉన్నాడు, అనుభవిస్తున్నాడు, అనుభవించనున్నాడు.

మూఢునికి వేలకొలది ఆనందకారణాలు, వందలకొలది భయహేతువులు ప్రతీ రోజూ వచ్చి చేరుతూ ఉంటాయి. పండితుణ్ణి మాత్రం చేరజాలవు.

చేతులు పైకెత్తి గట్టిగా అరుస్తున్నాను. ఒక్కడూ వినటం లేదు. అర్థమైనా, కామమైనా ధర్మంనుంచే లభిస్తాయి. అట్టి ధర్మాన్ని ఎందుకు సేవించరు ?

కామం వల్లగాని, భయంవల్లగాని, లోభం వల్లగాని, ప్రాణాలకోసమైనా ధర్మం ఎన్నడూ పరిత్యజించకూడదు. ధర్మం నిత్యమైంది, సుఖదుఃఖాలు అనిత్యమైనవి. జీవుడు

(ఆత్మ) నిత్యమైనవాడు; ఈ జీవత్వహేతువు అనిత్యమైనది.

ఇది భారత సావిత్రి (సారం) ప్రతీరోజూ లేవగానే దీనిని పఠించేవాడు మొత్తం భారతం అంతా చదివిన ఫలితం పొందుతారు. పరబ్రహ్మను చేరుకుంటాడు.

# భగవద్గీత

## ద్వితీయాధ్యాయం

1 ఆత్మకు మరణం లేదు

13, 17, 19, 20, 22, 24, 25 శ్లోకాలు :

జీవుడు ఈ దేహంలోనే ఏవిధంగా బాల్యమూ, వార్ధక్యమూ అనే వివిధావస్థలు పొందుతాడో అదేవిధంగా దేహాంతరం కూడా పొందుతూ ఉంటాడు బుద్ధిమంతుడు ఈ విషయంలో మోహపడడు.

ఏ ఆత్మ దీనినంతనీ వ్యాపించి ఉన్నదో అది నాశము లేనిది అని తెలుసుకో. వినాశరహితమైన దీనిని ఎవ్వడూ నశింపచేయజాలడు. ఈ ఆత్మ చంపేది అని ఎవడు తలుస్తాడో, ఇది చంపబడినది అని ఎవడు తలుస్తాడో వారిద్దరూ కూడా (యథార్థం) తెలిసిన వారు కాదు. ఇది చంపదు. చంపబడదు.

ఇది పుట్టదు. ఇది ఎన్నడూ మరణించదు. కొంతకాలం ఉండి మరల ఉండకుండా పోయేది కాదు. ఇది పుట్టుకలేనిది, నిత్యమైనది, శాశ్వతమైనది, ప్రాచీనమైనది. శరీరం చంపబడుతున్నా కూడా చచ్చేది కాదు.

మానవుడు చినిగిపోయిన వస్త్రాలు విడిచిపెట్టి కొత్త వస్త్రాలు ధరించినట్లుగా జీవుడు జీర్ణమైన శరీరాలు విడిచిపెట్టి, కొత్తవైన ఇతర శరీరాలు ధరిస్తాడు.

ఇది ఛేదింపశక్యమైనది కాదు. దహింప శక్యమైనది కాదు. తడపడానికి వీలైనది కాదు. ఎండచేయడానికి శక్యమైనది కాదు. ఇది నిత్యము. సర్వవ్యాప్తము, స్థాణువు, అచంచలము, సనాతనము.

ఇది వ్యక్తము కాదు. ఊహింప శక్యము కానిది. ఎట్టి వికారము కలిగించుటకు శక్యము కానిది. అందుచే ఇది ఈ విధమైనదని తెలుసుకొని నీవు దుఃఖించరాదు.

**నీ కర్తవ్యం ఏవిధంగా చెయ్యాలో తెలుసుకో :-**

నీకు కర్మ చేయుట యందే అధికారం గాని ఫలం విషయంలో లేదు. ఫలమనే పయోజనంతో కర్మ చేయకుము. కర్మ చేయకుండా ఉండడములో ఆసక్తి చూపకుము.

ఓ అర్జునా! యోగము నందున్న వాడవై, ఆసక్తి లేనివాడవై (ప్రయత్నం) సిద్ధించినా, సిద్ధింపకపోయినా సమంగా ఉంటూ కర్మలు చెయ్యి. సమత్వానికే యోగం అని పేరు. ఓ అర్జునా ! (ఫలాశతో చేసిన కర్మ) బుద్ధి యోగం కంటే (సమత్వ బుద్ధి కంటే) చాలా అధమమైనది. సమత్వ బుద్ధిని శరణు పొందుము. ఫలాభిలాషతో ప్రవర్తించే వారు దీనులు. సమత్వ బుద్ధి కలవాడు సుఖదుఃఖాలు రెండింటికీ అతీతుడుగా ఉంటాడు. అందుచేత యోగం కోసం ప్రయత్నం చెయ్యి. యోగమనగా కర్మాచరణలో నేర్పు.

స్థితప్రజ్ఞుడు :- 55-58, 62-66, 68-71

ఓ అర్జునా! మనస్సులో ఉన్న కామాలన్నీ వదలిపెట్టి, ఆత్మ యందు, ఆత్మ చేతను సంతసించేవాడు స్థితప్రజ్ఞుడు అని చెపుతారు.

దుఃఖసమయాలలో ఉద్వేగం చెందని మనస్సు కలవాడై, సుఖాలపై ఆసక్తిలేనివాడై రాగభయక్రోధాలు తొలగిపోయిన ముని స్థితప్రజ్ఞుడు అని చెపుతారు. ఆయా శుభా శుభాలు పొందుతున్నా కూడా దేనియందూ ఆసక్తి లేనివాడై ఎవడు అభినందించడో, లేక ద్వేషించడో ఆతని ప్రజ్ఞ స్థిరమైనది. తాబేలు తన అవయవాలన్నీ లోనికి ఇముడ్చు కొన్నట్లుగా ఎప్పుడైతే తన ఇంద్రియాలను విషయాలనుంచి ఉపసంహరించుకుంటాడో అప్పుడు ఆతని ప్రజ్ఞ స్థిరంగా ఉంటుంది.

మానవుడు విషయాలను గూర్చి ఆలోచిస్తున్న కొలది వాటియందు ఆసక్తి పెరుగుతుంది. ఆసక్తి వల్ల కోరిక కలుగుతుంది. కోరిక వల్ల కోపం బయలుదేరుతుంది. కోపం వల్ల మోహం కలుగుతుంది. మోహం వల్ల స్మరణశక్తి నశిస్తుంది స్మరణ శక్తి పోవడంతో బుద్ధినశిస్తుంది. బుద్ధినశించడంతో పూర్తిగా నశిస్తాడు. మానవుడు మనస్సును నిగ్రహించుకొని తన అదుపులో ఉన్న రాగద్వేషశూన్యాలైన ఇంద్రియాలతో విషయాలను అనుభవిస్తూ ఉన్నట్లయితే మనో నైర్మల్యం పొందుతాడు. ప్రసాదం లభించగానే అతని దుఃఖాలన్నీ నశిస్తాయి. ప్రసన్న చిత్తం గలవాని బుద్ధి వెంటనే స్థిరంగా నిలుస్తుంది. సమచిత్తత్వం (యోగం) లేని వానికి బుద్ధి కాని ధ్యానం కాని ఉండదు. ధ్యానం లేనివానికి శాంతి లేదు. శాంతి లేనివానికి సుఖం ఎట్లు లభిస్తుంది? ఆ కారణం చేత ఓ అర్జునా! ఎవడు తన ఇంద్రియాలు ఇంద్రియార్థాలన్నింటి నుంచీ నిగ్రహించు కుంటాడో అతని ప్రజ్ఞ స్థిరంగా ఉంటుంది.

ఇతరులందరికీ రాత్రి అయినపుడు, ఆత్మ సంయమం కలవాడు మేల్కొని ఉంటాడు. ఇతరులందరూ మేల్కొని ఉన్న సమయం సమ్యదృష్టి గల మునికి రాత్రి.

అవిచ్ఛిన్నంగా నింపుతున్నప్పటికీ అచంచలంగాను, స్థిరముగాను ఉన్న సముద్రంలోకి నీళ్ళు ప్రవేశించినట్లుగా ఎవనిలోనికైతే కోరికలన్ని ప్రవేశిస్తాయో అతడే శాంతిపొందుతాడు. కోరికలు కలవాడు పొందడు.

సమస్తమైన కామాలు విడిచిపెట్టి ఆశలేని వాడై, అహంకార మమకారాలు లేకుండా ఎవ్వడయితే సంచరిస్తాడో అతడే శాంతి పొందుతాడు.

## 3 వ అధ్యాయం

11. కర్మయోగం. 3-5, 8, 9, శ్లోకాలు.

దోషరహితుడవైన ఓ అర్జునా! ఈ ప్రపంచములో సాంఖ్యులకు జ్ఞానయోగం అనీ యోగులకు కర్మయోగం అనీ రెండు మార్గాలు పూర్వం నేను బోధించి ఉన్నాను.

కర్మలు చేయకుండా ఉన్నంత మాత్రం చేత మానవుడు కర్మరాహిత్యం పొందజాలడు. సన్యసించినంత మాత్రం చేత సిద్ధిపొందలేడు.

ఏ ఒక్కడూ ఏ పనీ చేయకుండా క్షణకాలం ఐనా ఉండలేడు. స్వభావ సిద్ధాలైన గుణాలు ప్రతి ఒక్కని చేత కూడా, ఇష్టం లేకపోయినా, పనులు చేయిస్తాయి.

నువ్వు తప్పకుండా కర్మ చెయ్యి; కర్మ చెయ్యకుండా ఉండడం కంటే కర్మ చేయడం ఉత్తమం. కర్మ చేయక పోతే నీ శరీరయాత్ర జరగడం కూడా కష్టం.

భగవంతునికి సమర్పించిన కర్మలు తప్ప మిగిలిన కర్మలన్నీ బంధనహేతువులు. ఓ అర్జునా! ఆ కారణం చేత ముక్తసంగుడవై కర్మ చెయ్యి.

## చతుర్థాధ్యాయం

### v. భగవంతుని అవతారము

6-9 శ్లోకాలు.

నేను జన్మ నాశాలు లేనివాడనైనా, సర్వభూతాలకే అధీశ్వరుడనైనా, నా ప్రకృతిని అధిష్ఠించి నా మాయ సహాయంతో జన్మ ఎత్తుతూ ఉంటాను.

ఎప్పుడైతే ధర్మానికి గ్లాని కలుగుతుందో, అధర్మానికి అభివృద్ధి కలుగుతుందో అప్పుడు నన్ను సృష్టిస్తాను. (అవతరిస్తాను).

సత్పురుషులను రక్షించడానికీ, దుర్మార్గులను నశింపచేయటానికీ, ధర్మంస్థాపించడానికీ నేను ప్రతి యుగంలోనూ అవతరిస్తూ ఉంటాను.

ఓ అర్జునా! నా జన్మ, కర్మా కూడా దివ్యమైనవి. ఈ విషయం ఎవడైతే యథార్థంగా తెలుసుకుంటాడో అతడు దేహం విడచిన తరవాత మరల జన్మ పొందడు, నన్నే చేరుతాడు.

నన్ను ఎవరు ఏ విధంగా సేవిస్తే వారిని ఆ విధంగా అనుగ్రహిస్తాను.

vi. జ్ఞానం. 33-39 శ్లోకాలు.

ఓ శత్రువినాశకుడా! ద్రవ్యమయమైన యజ్ఞం కంటే జ్ఞాన యజ్ఞం ఉత్తమమైనది. కర్మ అంతా కూడా జ్ఞానంలో సమాప్తి చెందుతుంది.

నమస్కారం చేత, ప్రశ్నించడం చేత, సేవ చేత తెలుసుకో. తత్త్వవేత్తలైన జ్ఞానులు నీకు జ్ఞానం ఉపదేశిస్తారు. ఆ జ్ఞానం సంపాదించినట్లైతే నీవు మరల ఈ విధంగా మోహం పొందవు. దీని ద్వారా నీవు సర్వభూతాలనూ నీయందూ నా యందూ కూడా చూస్తావు.

నువ్వు పాపాత్ములలో కెల్ల పాపాత్ముడవైనా ఆ సమస్తపాపాలన్నీ జ్ఞానం అనే నావతో దాటివేస్తావు.

ఓ అర్జునా! ప్రజ్వలిస్తూన్న అగ్ని కట్టెలన్నీ భస్మంచేసినట్లు జ్ఞానాగ్ని సర్వకర్మలనూ భస్మంచేస్తుంది.

ఈ ప్రపంచకంలో జ్ఞానంతో సమంగా పవిత్రమైనది మరొకటి (ఏదీ)లేదు. యోగంలో సిద్ధిని సాధించినవాడు కాలక్రమేణ స్వయంగానే దానిని తనలో సంపాదించుకుంటాడు.

తత్పరుడైన, ఇంద్రియ నిగ్రహవంతుడైన శ్రద్ధావంతుడు జ్ఞానం పొందుతాడు. జ్ఞానం పొందగానే కొద్ది కాలంలో ఉత్తమమైన శాంతిని పొందుతాడు.

v. అధ్యాయం 18-19 శ్లోకాలు.

vii. అన్నింటిలోను సమంగా ఉన్న తత్త్వం:- పండితులు, విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణునిలోను, గోవులోను, ఏనుగులోను, కుక్కలోను, కుక్కమాంసం తినేవానిలోను సమంగా ఉండే ఆత్మను చూస్తారు.

సర్వసమమైన ఆ ఆత్మ తత్త్వం మీద స్థిరంగా నిలచిన మనస్సుకలవారు జన్మను ఇక్కడనే జయించకలుగుతారు. సమము అనగా నిర్దోషమైన బ్రహ్మయే. అందుచేత వారు (సమధర్ములు) బ్రహ్మయందు ఉన్నవారే.

## షష్ఠాధ్యాయం

viii. యోగం 16-17 శ్లోకాలు.

తిండిపోతుకు యోగం లభించదు. పూర్తిగా ఏమీ తినకుండా ఉండేవానికీ యోగం లభించదు. ఎక్కువగా నిద్రపోయేవానికి యోగం లభించదు. ఎక్కువగా మేల్కొనే వానికి కూడా లభించదు.

యుక్తమైన ఆహారవిహారాలు కలిగి అయా కర్మల విషయంలో యుక్తంగా ప్రవర్తిస్తూ యుక్తమైన నిద్రాజాగరణాలు కలవానికి దుఃఖవినాశకారియైన యోగం లభిస్తుంది.

## సప్తమాధ్యాయం

ix. భగవంతుడు

6-14, 16-19, 21 శ్లోకాలు.

ప్రపంచకానికంతకీ మూలకారణమూ, ప్రళయమూ కూడా నేనే. ఓ అర్జునా! నా కంటే భిన్నమైనది ఏదీ లేదు. దారంలో మాణిక్యాలు గుచ్చినట్లు అన్నీకుడా నా యందే గుచ్చి ఉన్నాయి.

ఓ అర్జునా! నీళ్లలో ఉన్న రుచి నేనే. సూర్యచంద్రులలోని కాంతి, సర్వవేదాల్లోనూ ఉన్న ఓంకారము, ఆకాశంలోని శబ్దము, మానవులలోని పౌరుషము, భూమిలోని సుగంధము, అగ్నిలోని తేజస్సు, ప్రాణులలోని జీవనము, తాపసులలోని తపస్సు, ఇవన్నీ నేనే, ఓ అర్జునా! సమస్తభూతాల అతిపురాతన బీజం నేనే అని తెలుసుకో. బుద్ధిమంతుల బుద్ధి, తేజశ్శాలుల తేజస్సు నేనే. బలవంతుల్లోనున్న కామ రాగ విహీనమైన బలం కూడా నేనే. మానవుల్లో వున్న ధర్మ విరుద్ధం కాని కామం నేనే.

సాత్వికాలు, రాజసాలు, తామసాలు అయిన వస్తువులన్నీ కూడా నా నుండే వచ్చినా యని తెలుసుకో. అవి నాలో ఉన్నాయి కాని నేను వాటిలో లేను. సత్త్వ రజస్తమో రూపాలైన ఈ మూడు భావాలచేత వ్యాప్తమైన ఈ జగత్తు మోహితమై వీటి అన్నింటి కంటే పరుడనూ, వినాశరహితుడనూ అయిన నన్ను గుర్తించ జాలకుంది. త్రిగుణాత్మకమైన ఈ నా మాయ అతిక్రమించడానికి శక్యంకానిది. నన్ను శరణుజొచ్చినవారే ఈమాయను దాటగలుగుతారు.

భరతవంశ శ్రేష్ఠుడవైన ఓ అర్జునా! కష్టాల్లో ఉన్నవాడు, తత్త్వం తెలుసుకోవాలని అనుకునేవాడు, ఏదో ఒక లాభం అపేక్షించేవాడు, జ్ఞాని అనే నాలుగు విధాలైన పుణ్యాత్ములు నన్ను సేవిస్తారు. వీరిలో ఎల్లప్పుడు నన్నే ధ్యానిస్తూ, మదేకాయత్త భక్తిగల జ్ఞాని గొప్పవాడు. నేనంటే జ్ఞానికి చాలా ఇష్టం, జ్ఞాని అంటే నాకు చాలా ఇష్టం. ఈ నాలుగు రకాల మనుష్యులూ మంచి వాళ్లే కాని జ్ఞాని మాత్రం మత్స్వరూపుడే అని నేను భావిస్తాను. ఎన్నో జన్మల తరవాత జ్ఞానవంతుడు "వాసుదేవుడే సర్వమూ" అని నన్ను గూర్చి తెలుసుకుంటాడు. అలాంటి మహాత్ముడు సామాన్యంగా లభించడు. ఏయే భక్తుడు ఏయే దేవతామూర్తిని శ్రద్ధగా పూజించాలని ఇచ్ఛయిస్తాడో, అట్టివాళ్లందరికీ అలాంటి శ్రద్ధనే నేను కలుగజేస్తాను.

## అష్టమాధ్యాయం

X చివరి ఘడియలు 6, 7, 9, 10, 13, 16 శ్లోకాలు.

అర్జునా! మానవుడు చివరికి ఏయే విషయాలు స్మరిస్తూ శరీరం విడిచి పెడతాడో,

ఎల్లప్పుడూ అదే భావంతో నిండి ఉండడం చేత, ఆ భావమే పొందుతాడు. అందుచేత సర్వ కాలాల్లోనూ నన్నే స్మరిస్తూ యుద్ధం చెయ్యి. నా యందే మనో బుద్ధులు అర్పించినట్లయితే నన్నే పొందగలుగుతావు. సందేహం ఏమీ లేదు.

అతి ప్రాచీనుడు, ఉపదేష్ట, అణువు కంటే అణువైనవాడు, సర్వస్రష్ట, అచింత్య రూపుడు, ఆదిత్యవర్ణుడూ, తపస్సు కంటే పరుడూ అయిన కవిని (పరమాత్మను) ఎవడైతే స్మరిస్తాడో అతడు మరణ సమయంలో స్థిరమైన మనస్సుతోటి, భక్తితోటి కూడిన వాడై యోగబలం చేత ప్రాణాన్ని కనుబొమ్మల మధ్య బాగుగా నిలిపి, దివ్యుడైన ఆ పరమ పురుషుణ్ణి చేరుతాడు.

ఏకాక్షర బ్రహ్మ అయిన 'ఓం'కారం ఉచ్చరిస్తూ, నన్ను స్మరిస్తూ ఎవడైతే శరీరం విడిచిపోతాడో అతడు పరమ గతి పొందుతాడు.

ఓ అర్జునా! బ్రహ్మలోకం వరకూ ఉన్న లోకాలన్నీ పునరావృత్తి కలవే. నన్ను కనక చేరినట్లైతే పునర్జన్మ లేదు.

## నవమాధ్యాయం

xi భక్తుడు 22, 26, 27, 29, 30, 31 శ్లోకాలు.

ఇతర దృష్టి లేకుండా నన్నే ధ్యానిస్తూ ఏ జనులు నన్ను సేవిస్తారో, ఎల్లప్పుడూ నా యందే లీనమైన మనస్సు కల వారి యోగక్షేమాలు నేనే చూచుకొంటాను.

పత్రంగాని, పుష్పంగాని, ఫలంగాని, జలంగాని ఎవ్వడైతే నాకు భక్తితో సమర్పిస్తాడో స్థిరభక్తి కల అతని నుంచి, భక్తిగా సమర్పించిన దానిని నేను స్వీకరిస్తాను. ఓ అర్జునా! నువ్వు చేసే పని, తినే తిండి, చేసే హోమము, ఇచ్చే దానము, ఆచరించే తపస్సూ ఇవన్నీ నాకు సమర్పించు.

సర్వ భూతాలలోనూ నేను సముడను. నాకు ద్వేషించవలసినవాడు కాని, ప్రియుడు కాని లేడు, నన్ను ఎవరైతే భక్తితో సేవిస్తారో వారు నాయందే ఉంటారు, నేను వారియందుంటాను.

ఎంత దురాచారవంతుడైనా ఇతరుల నెవరినీ సేవించకుండా నన్నే సేవించినట్లైతే అతడు మంచివాడే అని భావించాలి. ఎందుచేతనంటే-అతడు మంచి నిర్ణయంతో ప్రవర్తిస్తున్నాడు. అట్టివాడు అచిరకాలంలోనే ధర్మాత్ముడై శాశ్వత శాంతి పొందుతాడు. ఓ అర్జునా! ప్రతిజ్ఞ చెయ్యి-నా భక్తుడైన వాడు ఎన్నడూ నశించడు.

## దశమాధ్యాయం

xii. దివ్యమూర్తులు 40-42 శ్లోకాలు.

ఓ శత్రువినాశకా! నా దివ్య విభూతులకు అంతం అనేది లేదు. గొప్పతనము, అందం, శక్తిగల ప్రతిసత్త్వమూ కూడా నా తేజస్సులోని ఒక అంశంతో పుట్టిందని తెలుసుకో.

ఓ అర్జునా! ఇది అంతా (వేరువేరుగా) తెలుసుకొని ఏమి ప్రయోజనం? నేను ఈ ప్రపంచకం అంతా ఒక అంశచేత వ్యాపించి ఉన్నాను.

## ద్వాదశాధ్యాయం

XIII భగవంతుడికి ఇష్టమైన వాడు 13-20 శ్లోకాలు.

ఏ ప్రాణినీ ద్వేషించనివాడు, మైత్రీ స్వభావం కలవాడు, కారుణ్యం కలవాడు, అహంకార మమకారాలు లేనివాడు, సుఖదుఃఖాలు రెండింటినీ సమంగా చూసేవాడు, ఓర్పు కలవాడు, ఎల్లప్పుడూ సంతృప్తికలవాడు, యోగి, మనస్సును నిగ్రహించినవాడు, దృఢమైన నిశ్చయం కలవాడు, నాయందే మనోబుద్ధులను అర్పించినవాడూ అయిన నా భక్తుడు నాకు ప్రియుడు.

ఎవనినుంచి లోకం భయపడదో, లోకంనుంచి ఎవడు భయపడడో ఎవడు హర్షము, అమర్షము, భయము, దిగులు లేనివాడో అట్టివాడు నాకు భక్తుడు. ఏమీ అపేక్షించనివాడు, పవిత్రుడు, సమర్థుడు, ఉదాసీనుడు, వ్యథచెందనివాడు, సర్వకార్యాలనూ పరిత్యజించినవాడూ అయిన నాభక్తుడు నాకు ప్రియుడు. ఎవడు సంతోషించడో, ద్వేషించడో, దుఃఖించడో, కోరడో, అట్టి శుభాశుభాలు రెండూ విడిచిపెట్టిన భక్తిమంతుడు నాకు ప్రియుడు.

శత్రువు విషయంలోను మిత్రుని విషయంలోనూ సమంగా ఉండేవాడు, మానావమానాలు రెండింటినీ సమంగా చూసేవాడు, శీతోష్ణ సుఖదుఃఖాలలో సమంగా ఉండేవాడు, ఆసక్తిలేనివాడు, నిందించినా స్తుతించినా సమంగా ఉండేవాడు, మౌనవంతుడు, ఏది దొరికితే దానితో సంతృప్తిపడేవాడు, గృహంలేనివాడు, స్థిరమైన బుద్ధి కలవాడు అయిన భక్తిమంతుడు నాకు ప్రియుడు.

పైన చెప్పిన అమృతత్వం ఇచ్చే ధర్మయుక్తమైన మార్గం అనుసరిస్తూ శ్రద్ధావంతులై, నన్నే పరమ లక్ష్యంగా అంగీకరించే భక్తులు నాకు చాలా ఇష్టమైన వారు.

## అష్టాదశాధ్యాయం

XIV నిజమైన సన్యాసం 2, 5, 6, 7 శ్లోకాలు

కామ్య కర్మల త్యాగం సన్యాసం అని ఋషీశ్వరులు చెపుతారు. సర్వకర్మల ఫలాలూ త్యజించడమే త్యాగం అని బుద్ధిమంతులు చెపుతారు.

యజ్ఞదాన తపోరూపమైన కర్మ త్యజించకూడదు. అది తప్పకుండా చెయ్యాలి. యజ్ఞము, దానము, తపస్సు అనేవి బుద్ధిమంతులను కూడా పవిత్రింప చేస్తాయి. ఆసక్తినీ, ఫలమునూ విడిచిపెట్టి ఈ కర్మలు కూడా చెయ్యాలి అని నా ఉత్తమమైన, నిశ్చితమైన అభిప్రాయం. విహితమైన కర్మ పరిత్యజించడం అయుక్తం.

స్వస్వధర్మానుష్ఠానం 45-48 శ్లోకాలు.

తన కర్మయందు శ్రద్ధగల ప్రతివాడు సిద్ధి పొందుతాడు. స్వకర్మ నిరతుడు ఏ విధంగా సిద్ధిని పొందుతాడో విను. ఎవనినుండి సమస్త భూతాలూ ఆవిర్భవిస్తున్నాయో, ఎవనిచే ఈ ప్రపంచమంతా వ్యాప్తమైనదో అట్టి పరమాత్మను స్వకర్మచే ఆరాధించి మానవుడు సిద్ధిని పొందుతాడు.

బాగా అనుష్ఠించిన పరధర్మం కంటే స్వధర్మం కొన్ని లోపాలతో అనుష్ఠించినా మంచిదే. తన స్వభావ విహితమైన కర్మను చేసేవాడు పాపం పొందడు. ఓఅర్జునా! తన సహజమైన కర్మలో ఏమైనా దోషాలున్నా కూడా దానిని విడిచిపెట్టకూడదు. ఎందుచేతనంటే ధూమం అగ్నిని ఆవరించి ఉన్నట్లుగా సర్వకర్మలనూ కూడా దోషాలు ఆవరించి ఉంటాయి.

XV శరణాగతి : 61, 62, 65, 66 శ్లోకాలు.

ఓ అర్జునా ! ఈశ్వరుడు అన్నిభూతాలనూ యంత్రంమీద ఎక్కించి తిప్పినట్లుగా తన మాయచేత తిప్పుతూ వాటి హృదయాల్లో ఉంటున్నాడు. ఓ అర్జునా ! సర్వదా ఆతనినే శరణుపొందుము. అతని అనుగ్రహంచేత గొప్పశాంతిని శాశ్వత స్థానాన్ని పొందుతావు.

నీ మనస్సు నాపై నిలుపుము. నా భక్తుడవు అవుము. నన్నుపూజిస్తూ నాకు నమస్కరించుము. నన్నే చేరుతావు. నీకు నిజంగా ప్రతిజ్ఞ చేసి చెపుతున్నాను నేను; నీవు నాకు ఇష్టుడవు.

సర్వధర్మాలూ విడిచిపెట్టి నన్ను ఒక్కనినే శరణు పొందుము నిన్ను సర్వ పాపాలనుంచీ విముక్తుణ్ణి చేస్తాను. విచారించకు.

## శ్రీమద్భాగవతం

తృతీయస్కంధం 25-33 అధ్యాయాలు.

కపిలుని ఉపదేశాలు :

బిందు సరస్సు దగ్గర నివసిస్తూన్న కపిలునితో ఆతని తల్లియైన దేవహూతి- "నాయనా! అజ్ఞాన తమస్సులో మునిగిన ప్రపంచానికి నీవు కన్నువంటి వాడవు, సూర్యుని వంటివాడవు" అని పలికింది. అప్పుడాతడు ఆమెకు ఈవిధంగా ఉపదేశించినాడు :

బంధానికీ మోక్షానికీ కూడా మనస్సే కారణం. లౌకిక విషయాల్లో ఆసక్తం అవుతే బంధానికి హేతువు అవుతుంది. పరమాత్మయందు లగ్నమైతే మోక్షం ఇస్తుంది. అహంకార మమకారాల వల్ల కలిగే కామ లోభాది మాలిన్యాలు తొలగిపోయి ఎప్పుడైతే మనస్సు పరిశుద్ధంగాను, సుఖదుఃఖరహితంగాను సమంగాను ఉంటుందో అపుడు ఆత్మ సహజమైన తేజస్సుతో ప్రకాశిస్తుంది. అప్పుడు దానిని ఆవరించి ఉన్న అచేతన పదార్థం ఏదీ బంధహేతువుగా ఉండదు. రాగమే మహాబంధనమని బుద్ధిమంతులు చెపుతారు. ఈ రాగమే సత్పురుషుల విషయంలో కలిగినట్లైతే మోక్షద్వారం తెరుస్తుంది. ఎందుచేతనంటే- సత్పురుషులు ఓర్పు, దయ కలవారు, అన్ని ప్రాణులయందూ ప్రేమకలవారు, ఎవరితోటీ శత్రుత్వం లేనివారు, శాంతస్వభావులు, సచ్చరిత్రాలంకృతులు, వారు అనన్య దృష్టితో నా విషయంలో దృఢభక్తి కలవారై, సర్వకర్మలనూ, నాకు సమర్పిస్తారు. నేను వారికి చాలా ఇష్టమైన వాడను; వారికి ఆత్మ, మిత్రుడు, గురువు, దేవుడు అన్నీ నేనే. భూతహింస చేస్తున్నంతవరకూ నాపైన భక్తి ఉన్నా కూడా వ్యర్థమే. అన్ని ప్రాణుల్లోనూ నేనే అంత రాత్మగా ఉన్నాను. ఈవిధంగా సర్వత్ర ఉన్న నన్ను ఉపేక్షించి మూర్ఖుడైన మర్త్యుడు విగ్రహ పూజా విడంబనం చేస్తూ ఉంటాడు. ఇతరుల శరీరంలో ఉన్న నన్ను ద్వేషిస్తూ భేద బుద్ధితో దురభిమానవంతుడై భూతాల విషయంలో వైరం కలవాని మనస్సు ఎన్నటికీ శాంతి పొందజాలదు. ఇతర ప్రాణులను అవమానించే వాడు ఎంత ఆడంబరంతో పూజచేసినా కూడా నేను సంతోషించను. స్వధర్మం నిర్వహిస్తూన్న మానవుడు, తన హృదయంలోను, ఇతరుల లోనూ కూడా నేను ఉన్నాను, అనే విషయం తెలిసేవరకూ కూడా విగ్రహాదుల్లో నన్ను పూజించాలి. తనకూ ఇతరులకూ మధ్య భేదం ఉన్నదని ఎవడు అనుకుంటాడో వానిని

భయమూ, మృత్యువూ వెంటాడుతాయి. పరమేశ్వరుడే జీవరూపంతో ప్రవేశించి ఉన్నాడని తెలుసుకొని, అన్ని భూతాలకూ కూడా మనసా నమస్కరించాలి." ఈ విధంగా పలికి కపిలుడు వెళ్ళిపోయినాడు. దేవహూతి కపిలుని ఉపదేశం ప్రకారంగా నడుచుకొని పరమానంద స్వరూప పరబ్రహ్మ సాక్షాత్కారం పొందింది.
సప్తమస్కంధం, నవమాధ్యాయం, 44 వ శ్లోకం.

## ప్రహ్లాదుడు చేసిన భగవత్స్తుతి

ఓ దేవా! సాధారణంగా మునీశ్వరులు తమకు మోక్షం కావాలనే కోరికతో మౌనం వహించి విజనవనాలలో తపస్సుచేస్తూ ఉంటారు. వాళ్ళు ఇతరుల విషయం పట్టించుకోరు. ఐతే నా వాళ్ళందరికీ లేకుండా నేనొక్కడినీ మోక్షం పొందాలని నేను కోరను. భ్రాంతితో కొట్టుకుంటూన్న మానవులకు నీవు తప్ప మరెవ్వరూ శరణు లేరు.
అష్టమస్కంధం. ప్రథమాధ్యాయం 16 వ శ్లోకం.

అహంకారం లేకుండా ప్రయత్నం చేసేవాడు, ధీమంతుడు, కోరికలు లేనివాడు, పరిపూర్ణుడు, ఇతరులచే ప్రేరితుడు కానివాడు, మానవులకు బోధించేవాడు, తన మార్గంలో ఉన్నవాడు, సకల ధర్మ పరిపాలకుడు, ప్రభువు అయిన పరమాత్మను శరణు పొందుతున్నాను.
22 వ అధ్యాయం, 24 వ శ్లోకం.

"నేను అనుగ్రహించాలనుకొన్న వాని ఐశ్వర్యం తీసేసుకొంటాను. ఎందుచేతనంటే- మానవుడు తన ఐశ్వర్యం దుర్వినియోగంచేస్తూ ఈ ప్రపంచకాన్నీ నన్నూ కూడా అవమానిస్తాడు" అని భగవంతుడు చెప్పినాడు.
నవమస్కంధం, 21 వ అధ్యాయం, 12 వ శ్లోకం.

"అష్టైశ్వర్యాలతో కూడిన ఉత్తమ గతి కావాలని గాని మోక్షం కావాలని కాని భగవంతుణ్ణి కోరను. అఖిల ప్రాణుల లోపల ప్రవేశించి, వాళ్లకు దుఃఖం ఉండకుండేటట్లుగా' వాళ్ల దుఃఖాన్ని నేనే అనుభవిస్తాను".
ఏకాదశస్కంధం. 7-29 అధ్యాయాలు.
ఉద్ధవునికి శ్రీకృష్ణుడు జేసిన ఉపదేశం.
భగవంతుడు ఇట్లు చెప్పినాడు :-

ఓ ఉద్ధవా ! నువ్వు నాభక్తుడవు, ప్రియ భక్తుడవు. అందుచేత నేను నీకు తెలియపరుస్తున్నాను. ఈ రోజునుంచి ఏడో రోజున ద్వారకా నగరాన్ని సముద్రం ముంచివేస్తుంది. తరవాత కొద్దిరోజులకే కలియుగం ప్రవేశిస్తుంది. నేను లేని ఈ ప్రపంచకంలో నువ్వు ఉండడం మంచిది కాదు. నీవు ప్రాపంచిక సంబంధాలన్ని పరిత్యజించి, ప్రశాంతమైన మనస్సు నాయందు నిలిపి సంచరించాలి. నీ ఇంద్రియాలను, మనస్సును నిగ్రహించుకొని ఈ ప్రపంచ కాన్నంతనీనీలో చూస్తూ నిన్ను సర్వాధీశ్వరుడనైన నాలోచూడు. బుద్ధిమంతులు తమను తమ ప్రయత్నం చేతనే ఉద్ధరించుకొంటారు. ఆత్మయే తనకు అత్యుత్తమైన గురువు. మహా భూతాదుల నుంచి ఎన్నో విషయాలు నేర్చుకోవాలి.అందరూ తొక్కుతున్నా సరే, అన్ని కష్టాల్లోను కూడా భూమి వలె స్థిరంగా ఉండాలి. పర్వతాలు లోకక్షేమార్థం ఎన్నో ధాతువులు ఇతర

వస్తువులు ఇస్తూ ఉంటాయి. ఆ విధంగా తనకోసం కాకుండా ఇతరుల కోసం జీవించడం నేర్చుకోవాలి. గాలి వలె ఏ విషయాలూ అంటుకోకుండా నడిచిపోయె పద్ధతి నేర్చుకోవాలి. సర్వ వ్యాప్తమై అన్నింటినీ స్పృశిస్తు తాను మాత్రం దేని చేతను స్పృశింప బడ కుండా ఉండే ఆకాశం గొప్ప దృష్టాంతం. జలం వలె స్వచ్ఛంగాను, పవిత్రంగాను, పవిత్రం చేసే ఓట్లుగాను, ఆనంద కరంగాను, సత్త్వ వృద్ధికరంగాను ఉండాలి. అగ్ని వలె జ్ఞాన తేజస్సుతో ప్రకాశిస్తూ కల్మషాలన్నీ భస్మం చెయ్యాలి. కొండ చిలువ వలె నిశ్చలంగా పడి ఉండి ఏది లభిస్తే అది తీసుకొంటూ ఉండాలి. ఏదీ లభించక పోతే నిరాహారంగా ఉండిపోవాలి. అతి గంభీరమైన మహా సముద్రంలా లోపలికి వచ్చే వాటితో పొంగిపోకూడదు, తనలో నుంచి ఏదైనా తీసివేస్తే ఎండి పోకూడదు. తుమ్మెద వలె కొంచెంకొంచెము తీసుకోవాలి, తుమ్మెద తేనె తీసుకొన్నట్లుగా మంచి నుంచి చెడుగు నుంచీ కూడా సారం మాత్రమే గ్రహించాలి.

భగవంతుడు ముక్తుని లక్షణాలు ఉద్ధవునికి ఈ విధంగా బోధించాడు :

"విద్వాంసుడు శరీరంలో ఉన్నా కూడా శరీరానికి సంబంధించిన వాడు కాడు. ఇంద్రియాలు ఇంద్రియార్థాలను గ్రహిస్తున్నా కూడా అతడు అహంకార దూరుడై ఎట్టి వికారము చెందడు. ఎవరైనా నిందించినా స్తుతించినా వికారం పొందడు. తాను ఆ విధంగా నిందాస్తుతులు చెయ్యడు. ఆత్మరాముడై జడుడు వలె సంచరిస్తాడు".

ఈ ఉన్నత స్థితిని పొందలేని వారిని గూర్చి భగవంతుడు చెపుతున్నాడు :-

"అన్ని కర్మలూ మదర్పణ బుద్ధితో చెయ్యి. ధర్మంకోసమైనా, అర్థంకోసమైనా, కామం కోసమైనా చేసే పనులన్నీ కూడా నాయందే నిలిచి చెయ్యి. సత్పురుషుల సేవచేయడం చేత లభించే నా భక్తి ద్వారా నన్ను చేరగలుగుతావు."

"సత్పురుషులు అనగా ఎవరు ? అని ఉద్ధవుని ప్రశ్న కీసమాధానంగా భగవంతుడు చెపుతున్నాడు :-

"దయ కలవాడు, ద్రోహం చేయని వాడు, అన్ని ప్రాణుల విషయంలోను ఓర్పు కల వాడు, సత్యమే బలంగా కలవాడు. నిర్దుష్టాంతరంగుడు, అందరికీ ఉపకారం చేసేవాడు, కామములచే హతము కాని బుద్ధి కలవాడు, తన వంశంలో ఉండే వాడు, మృదు స్వభావుడు, శుద్ధుడు, ఏమీ (సంపద) లేనివాడు, ఆశ లేనివాడు, మితంగా అనుభవించే వాడు, శాంతుడు, స్థిరుడు, మానవంతుడు, నన్ను శరణుపొందినవాడు, అప్రమత్తుడు, గంభీర స్వభావుడు, క్షోభ చెందని వాడు, గర్వం లేని వాడు, ఇతరులను గౌరవించే వాడు, అర్హుడు, మైత్రీ స్వభావము కలవాడు, జాలి కలవాడు, భావనా శక్తి కలవాడు - ఇట్టివాడే పవిత్రుడైన సాధువు.

తరవాత భగవంతుడు నిజమైన భక్తుని లక్షణాలు వర్ణించాడు :-

"ఇతర విషయాలు, ఇతర ధర్మాలు అన్నీ విడిచి పెట్టి మరి ఏ ప్రయోజనం ఉద్దేశించకుండా నన్ను మాత్రమే పూజించే వారు నా నిజమైన భక్తులు."

"నా భక్తులను, నా ప్రతీకలను (సాలగ్రామాదులను) పూజించడం, సేవ, నా స్తోత్రాలు పఠించడం, నా కథ గానం చేయడం, అట్టి గానం వినడం, ప్రాపంచిక విషయాలు సంపాదించే సమయంలో కూడా 'నేను భగవంతుని సేవకుడను' అనే భావంతో ఉండడం, నన్ను శరణు పొందడం, గర్వాహంకారాలు లేకుండా ఉండటం, తనను గూర్చి బడాయి

చెప్పుకోకపోవడం ఇవన్నీ నా భక్తుని లక్షణాలు, అట్టివాడే భక్తి ద్వారా నన్ను చేరుతాడు".

తరవాత భగవంతుడు సత్సంగం చాలా ప్రధానమైనదని చెపుతూ తనను చేరడానికి అత్యుత్తమైన మార్గం అదే అని వక్కాణించి తరవాత ఈవిధంగా చెప్పినాడు :

"అకించనుడు, వశీకృత చిత్తుడు, శాంతుడు, సమచిత్తుడు, సంతుష్టాంతరంగుడు అయిన వానికి ఎక్కడ చూసినా సుఖమే లభిస్తుంది. ఆశ లేనివాడు, శాంతుడు, వైర రహితుడు, సమదర్శనుడు అయిన మునిని అనుసరించి, అతని పాదపరాగం చేత పవిత్రం కావాలనే అభిలాషతో నేనుకూడా వెడుతూంటాను. నామీద భక్తి పతితులను కూడా పవిత్రం చేస్తుంది."

తరవాత భగవంతుడు భక్తివల్ల కలిగే పరమానందాన్ని వర్ణిస్తాడు :-

"నా భక్తివల్ల హృదయం కరిగిపోవడం, ఆనందబాష్పాలు, లోకోత్తరానందం- ఇవి లేకుండా మానవుడు మనస్సును ఎట్లు శుద్ధం చేసుకోగలుగుతాడు. అతని కంఠం గద్గదం అవుతుంది. మనస్సు కరిగిపోతుంది. ఒకమారు ఏడుస్తాడు. ఒకమారు నవ్వుతాడు సిగ్గువిడిచి గట్టిగా పాడతాడు. నాట్యం చేస్తాడు. అలాంటి నా భక్తుడు వాస్తవానికి ఈ ప్రపంచకాన్ని త్యజిస్తాడు."

"ధ్యానం ఏవిధంగా చెయ్యాలి ?" అని ఉద్ధవుడు ప్రశ్నించగా, భగవంతుడు విపులంగా వివరించినాడు :-

"సుఖాసనంలో స్థిరంగా నిటారుగాకూచోవాలి. చేతులుకలిపి ఒడిలో వుంచుకొవలసింది. నాసాగ్రంమీద దృష్టి కేంద్రకరింపజేయి. గాఢంగా ఊపిరిపీల్చి శ్వాసకోశాన్ని పరిశుభ్ర పరచుకో. ఈ ఊపిరినికొంత సేపునిలిపి వుంచి నెమ్మదిగా వదులుతూ, ఘంటా రావంవలె 'ఓం' కారాన్ని ధ్యానిస్తూ, కాంతి పరివేష్టితమైన నారూపాన్ని హృదయపద్మంలో నింపుకోని ధ్యానించవలసింది.

"జ్ఞానం జీవితంపట్ల విసిగివేసారిన వారికే పనికి వస్తుంది. ఇంకా కోర్కులుడగని వారు, కర్మమార్గంలో ఉదాత్తంగా పరిశ్రమించాలి. పూర్తిగా బంధాలు వదిలించుకోని వాడూ, పూర్తిగా తగులమూ పెట్టుకోనివాడు, భక్తిమార్గంలో సఫలుడవుతాడు" అని త్రివిధమైన భక్తి, జ్ఞాన, కర్మమార్గాలను గురించి జగన్నాథుడు బోధించాడు.

ఉద్ధవునికి తనబోధను ముగిస్తూ జగత్ప్రభువు ఇట్లా అన్నాడు. నాకోసం, నన్ను దృష్టిలో పెట్టుకొని, నాయందు స్థిరంగా మనసు నిలిపి కర్మలాచరించు. ఆకాశంవలె స్వచ్ఛంగా నిష్కళంకంగా వుండి నీలో నిన్నుదర్శించవలసింది. సమస్తభూతములూ నాస్వరూపమే అని తలంచి అర్చించవలసింది. ఉచ్చనీచాలు, అల్పాధిక్యాలు, కారుణ్యక్రౌర్యాలు గణించకుండా అందరికీ నమస్కరించు. అందరిలోను నన్నే నిరంతరందర్శించు. అసూయ, అసహనము, హింస, అహంకారాలను వదిలిపెట్టవలసింది. మానావమానాలు, గర్వము విడిచి కుక్కకూ, గాడిదకూసైతము, సాష్టాంగ ప్రమాణపూర్వకంగా విధేయతతో నతుడవు కావలసింది. పండితులు దర్శించే జ్ఞానస్వరూపమిది. విద్వాంసులు సాధించే ఎరుక ఇది- నిత్యమైననన్ను (ఆత్మ) అనిత్యమైన దానితో (తనువు), అశాశ్వతమైన దాని నుంచి శాశ్వతస్థితికి మానవుడు చేరుకోవడం.

పతంజలి యోగసూత్రములు.

1. సమాధి.

2. చిత్తవృత్తి నిరోధమే అంటే మనస్సు కార్యకలపాలను నియంత్రించడమే యోగము. 3. అప్పుడు (మనస్సు నిశ్చలంగా వున్నప్పుడు), సాధకుడు స్వస్వరూపస్థితిని పొందగలడు. 4. ఇతరవేళల (సాధకుని మనస్సు) వివిధావస్థలనొందుతూ వుంటుంది. 5. ఈ మానసికా వస్థలు ఐదు, బాధాకరమైనవీ, బాధించనవీ. 6. అవి నిద్రా, జాగ్రత్, భ్రాంత్య వస్థలు, అచ్చమైన జ్ఞానము, జ్ఞానా భాసము.

12. నిరంతరసాధనంవల్ల, నిస్సంగత్వంవల్ల, ఈ మానసిక స్థితులను దమించ వచ్చు. 13. నిశ్చలమైన అవికలమైన మనః స్థితిని పొందటానికి పట్టువిడువని సాధన కావాలి. 14. దీర్ఘము, తీవ్రము, విచ్ఛిన్నమూ అయినదే అయినా, చివరకు అది కుదురు కుంటుంది. సాధ్యమవుతుంది. 15. ఎవనికైతే దృశ్యమానమవుతున్న ప్రాపంచిక సుఖాలపట్ల కాని, పవిత్ర గ్రంథాలలో చెప్పబడి దృశ్యమానంకాని సౌఖ్యాల పట్ల కాని, పిపాసఉండదో వానికి నిస్సంగత్వం స్వాధీనమై పోతుంది. దాని యందు అధికారి అతడవుతాడు. 16. స్వాత్మ దర్శనుడైన విజ్ఞనియందు ఈ నిస్సంగత్వం త్రిగుణములయందు కూడా ఎప్పుడైతే అను వర్తిస్తుందో అప్పుడది పరమశ్రేష్ఠతా స్థితిని చేరు కొంటుంది.

30. వ్యాధి, క్రియాశూన్యత, సందేహము, నిర్లక్ష్యము, అలసత, ప్రాపంచిక మగ్నత, భ్రాంతి, మనస్సును ఏకాగ్రమైన స్థితికి తీసుక వచ్చి సమాధి స్థితిలోని ఏస్థాయిని కూడా అందుకో లేక పోవడం, అనేవి దీనికి అవరోధాలు.

31. చంచల మనస్కుడైన వాడు దైన్యం, క్రుంగుపాటు, శారీరక ధృడత్వం లేక పోవడం, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సౌష్ఠవంగా లేక పోవడం, మొదలైన వానికి వశవర్తియై ఉంటాడెల్లప్పుడూ.

32. వీటన్నిటిని అధిగమించడానికి ఏకాగ్రతతో కూడిన ధ్యానంఅలవరచుకోవాలి.

33. సుఖితులయెడ, అసుఖితులయెడ, ధన్యులయెడ, దుఃఖోపహతులయెడ క్రమంగా మైత్రి, దాక్షిణ్యం, తృప్తి, అనాసక్తత అలవరుచుకోగలిగినప్పుడు, మనస్సు ప్రశాంతంగానూ, ఆనందంగానూ వుంటుంది. 35. లేదా ప్రాణాయామంవల్లనైనా. 35. లేదా దేనియందైనా నిర్దిష్టమైన వస్తువునందు నిశ్చలమైన మనసు నిలిపిధ్యానించడంవల్లనూ ఈ సమాధి స్థితి లభిస్తుంది. 36. లేదా సతతమూ ఆనందప్రదమైన సత్త్వమునందే మగ్నమై,వీతదైన్యమైన తైజసాత్మికమైన మనస్సువల్ల. 37. సమస్త మోహముల నుంచి ముక్త సంగులైన మహాత్ముల నుధ్యానించడంవల్ల. 38. లేదా స్వప్నజ్ఞానంగాని, నిద్రాజ్ఞానంగాని ఆలంబనంగా తీసుకొన్న చిత్తం (ధృఢస్థితి కలదిఅవుతుంది). 39. తనకు ఇష్టమైన విష యాన్ని గూర్చి ధ్యానంచేసినా సరే. 40. ఈ విధంగా చిత్తస్థైర్యం సంపాదించిన వానికి పర మాణువు మొదలు పరమ మహత్తు వరకు వశీకారం లభిస్తుంది.

47. ఆలోచనలులేని స్థితి పరిశుద్ధంకాగానే బుద్ధినైర్మల్యం లభిస్తుంది. 48. అప్పుడు బుద్ధి సత్యపూర్ణం అవుతుంది. 49. వస్తువుల విశేష స్వరూపాన్ని తెలుసుకోవడం చేత చిత్తానికి కలిగిన ఈ ఋతంభరా స్థితి శబ్దానుమానాలద్వారా లభించిన జ్ఞానం కంటే భిన్నమైనది. 50. ఈ ఋతంభరా స్థితి వలన కలిగిన సంస్కారం ఇతర జ్ఞానాల వలన

కలిగిన సంస్కారాలకు ప్రతిబంధకంగా ఉంటులది. 51. ఈ స్థితికి సంబంధించిన సంస్కారం కూడా నిరుద్ధం అవగానే ప్రతీదీ నిరుద్ధం అవడంచేత నిర్బీజ (విషయశూన్య) సమాధి లభిస్తుంది.

II సాధనా పాదం.

1. తపస్సు, స్వాధ్యాయమూ, ఈశ్వరధ్యానము - ఇవి యోగ సాధనాలు 2. చిత్తానికి ఏకాగ్రత కలిగించడం క్లేశాలను తగ్గించడం - ఇది తపస్సు మొదలైన సాధనాల ప్రయోజనం.

3. అవిద్య, అహంకారము (అస్మిత), రాగము, ద్వేషము, అభినివేశము - ఇవి క్లేశాలు. 4. చివరి నాలుగు క్లేశాలకూ — అవి ప్రసుప్తాలైఉన్నా, సూక్ష్మంగాఉన్న, విచ్ఛిన్నాలైనా, ఉద్ధృతంగాఉన్నా - అవిద్యయే మూలం 5. అనిత్యమూ, అశుచి, దుఃఖము, అనాత్మ ఐన వాటి యందు నిత్యము, శుచి, సుఖము, ఆత్మ అనే బుద్ధి అవిద్య. 6. దృష్ట, దర్శన సాధనములు అభిన్నములని అనుకోవడం అస్మితము. 7. సుఖాన్ని పట్టుకొని వ్రేలాడడం రాగం 8. దుఃఖం విషయంలో కలిగే క్రోధాదికం ద్వేషం 9. విద్వాంసుల్లో కూడా సహజంగా కనిపించే ప్రాణాలమీద తీపి అభినివేశం.

11. ఈ క్లేశాల వలన కలిగే వృత్తులనన్నింటినీ ధ్యానంచేత పరిత్యజించడం కోసం ప్రయత్నించాలి. 15. వివేకవంతునికి అంతా దుఃఖమయంగానే కనబడుతుంది. ఎందుచేతనంటే - అన్ని సుఖాలూ చివరికి దుఃఖంగానే పరిణమిస్తాయి; వాటికి విఘ్నం కలిగినపుడు మనస్సు బాధపడుతుంది; సుఖాలకోసం ప్రయత్నించేటప్పుడు దుఃఖం కలుగుతుంది. బుద్ధి రూపంగా పరిణమించిన సత్త్వరజస్త మోగుణాలు పరస్పర విరుద్ధంగా పని చేస్తూ ఉంటాయి. 16. రాబోయే దుఃఖాన్ని (యోగాభ్యాసాదుల చేత) తొలగించుకోవాలి.

28. యమ నియమాది యోగాంగాలు అభ్యసించడంచేత అశుద్ధులు క్షీణించగా జ్ఞానం ప్రదీప్తమై వివేకఖ్యాతికి దారి తీస్తుంది. 29. యమము, నియమము, ఆసనము ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి అని అంగాలు ఎనిమిది. 30. అహింస, సత్యము, అస్తేయము (దొంగతనం చేయకపోవడం) బ్రహ్మచర్యము, అపరిగ్రహము (ఏ వస్తువులూ స్వీకరించకుండా ఉండటం) - ఇవి యమాలు. 31. ఈ నియమాలు జాతి, దేశము, కాలము, సమయము వీటి భేదంమీద ఆధారపడక పోవడంచేత సార్వభౌమాలు. అందుచేతనే వీటికి మహావ్రతాలని పేరు. 32, శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరధ్యానము - ఇవి నియమాలు. 33. యోగానికి వితర్కాలచేత విఘాతం కలిగినపుడు ప్రతిపక్ష భావనం చెయ్యాలి. 34. "హింసాదులు వితర్కాలు. ఇవి స్వయంగా చేసినవి కావచ్చు, చేయించినవి కావచ్చు, ఆమోదించినవి కావచ్చు. లోభం లేక క్రోధం మోహం వీటికి కారణాలు. ఇవి మృదువైనవి (తక్కువసాయిలోనివి) గాని, మధ్యమాలు కాని, అధిక ప్రమాణాలు కాని కావచ్చు. ఇవి అన్నీ అంతులేని దుఃఖా జ్ఞానాలకి దారి తీస్తాయి'' - అని భావించడం ప్రతిపక్ష భావన. 35. అహింసయందు స్థిరమైన స్థితి లభించిన వాని సమీపంలో ఇతర జంతువులు తమ సహజ వైరం పరిత్యజిస్తాయి. సత్యంలో ప్రతిష్ఠ లభించిన వాని మాటమాత్రం చేత (ఇతరులకు కూడా) క్రియా ఫలాలు లభిస్తాయి,

37. అస్తేయంలో ప్రతిష్ఠపొందిన వానికి అన్ని రత్నాలూ లభిస్తాయి. 38. బ్రహ్మచర్యంలో ప్రతిష్ఠ లభిస్తే సామర్థ్య విశేషం ప్రాపిస్తుంది. 39. అపరిగ్రహంలో స్థైర్యం లభించగానే ఈ జన్మ ఎట్లు, ఎందుకు వచ్చింది అనే విషయం తెలుస్తుంది. 40. శౌచంవల్ల తన శరీరంమీద జుగుప్స ఇతరులతో సంబంధంలో పెట్టుకోకుండా ఉండడమూ లభిస్తాయి. 41. అంతే కాకుండా సత్త్వ శుద్ధి (చిత్తంలోని రజస్తమోగుణాలు తొలగిపోవడంద్వారా) మంచి (సుఖంగా ఉన్న) మనస్సు, ఏకాగ్రత, ఇంద్రియజయము, ఆత్మదర్శన యోగ్యత ఇవికూడా లభిస్తాయి. 42. సంతృప్తివల్ల అత్యుత్తమమైన సుఖం లభిస్తుంది. 43. తపస్సువల్ల అశుద్ధి నశించడంద్వారా దేహేంద్రియసిద్ధి (అణిమాది దేహసిద్ధి, దూరశ్రవణాది ఇంద్రియసిద్ధి) లభిస్తుంది. 44 స్వాధ్యాయాధ్యయనంవల్ల ఇష్టదేవతా సంబంధం లభిస్తుంది. 45. ఈశ్వరధ్యానం వల్ల సమాధి లభిస్తుంది. 46. స్థిరంగాను (చాలాసేపు) సుఖంగాను కూర్చోడానికి అనువైనది ఆసనం. 48. ఆసనస్థైర్యం లభించడంతో శీతోష్ణాది ద్వంద్వాలు బాధించవు. 49. ఆసనం వేసిన తరవాత శ్వాసప్రశ్వాసాల గతిలో శాస్త్రోక్తంగా మార్పులుచేయడం ప్రాణాయామం. 50. ప్రాణాయామం రేచకం (పైకి శ్వాసవిడుచుట), పూరకము (లోనికి నింపుట), కుంభకము (లోన నిలుపుట) అని మూడు విధాలు. ఇది దేశము, కాలము, సంఖ్య వీటిచేత నియమితం ఔతుంది. ఇవి దీర్ఘంగాను, సూక్ష్మంగానూ ఉంటుంది. 51. పైన చెప్పిన రేచకపూరకాలకు అతీతమై స్వయంగానే కలిగే (కేవలకుంభక రూపమైన) ప్రాణాయామం నాలుగోది. 52. ప్రాణాయామస్థైర్యంవల్ల ప్రకాశావరణం తొలగిపోతుంది. 53. మనస్సు ధారణకు యోగ్యం అవుతుంది. 54 ఇంద్రియాలను వాటి విషయాలనుండి దూరం చేయడంతో అవి చిత్త స్వరూపం కలవి వలె అవుతాయి. దీనికి ప్రత్యాహారం అనిపేరు. 55. దీనితో ఇంద్రియాలు పూర్తిగా వశం ఔతాయి.

## వేదాంతం

బ్రహ్మ సూత్ర శాంకర భాష్యం I.I.I-4. అధ్యాసభాష్యం :

"నువ్వు" "నేను" అనే వ్యవహారానికి గోచరంఅయిన విషయము విషయి ఈ రెండూ చీకటి వెలుతురువలె పరస్పరమూ విరుద్ధం అయినవి. అందుచేత ఈ రెండింటికీ తాదాత్మ్యం కుదరదు. వాటి ధర్మాలకు ఇనలే కుదరదు. అందుచేత 'నువ్వు' అనే ప్రత్యయానికి గోచరమైన జడాత్మకమైన విషయంపై "నీవు" అనే ప్రత్యయానికి గోచరమైన విషయాన్నీ దాని ధర్మాలనూ అధ్యసించడం, దానికి వ్యతిరేకంగా విషయినీ దాని ధర్మాలనూ విషయంమీద అధ్యసించడం అయుక్తమని చెప్పడం యుక్తమే. ఐనా పరస్పర భేదం తెలియకపోవడంచేత ఒకదానిమీద మరియొకదాని తాదాత్మ్యాన్నీ, మరియొకదాని ధర్మాలనూ అధ్యసించి, అత్యంతము పరస్పరభిన్నాలైన ధర్మధర్ముల అధ్యాసంచేత సత్యాసత్యాలు రెండింటినీ కలిపివేసి "ఇది నేను" "ఇది నాది" అని స్వభావసిద్ధమైన లోకవ్యవహారం కనబడుతుంది.

"అధ్యాస" అంటే ఏమిటి? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. ఒక వస్తువునందు పూర్వము చూచిన దాని స్మృతి రూపమైన ఆభాసం అధ్యాసఅని చెపుతాం. ఒక వస్తువుపై ఇతరవస్తు ధర్మాల ఆరోపం అని కొందరు అంటారు. ఏ వస్తువుపైదేని అధ్యాసమో వాటి

భేదమును గ్రహించకపోవడంవల్ల కలిగిన భ్రమఅని మరికొందరంటారు. ఇతరులైతే-దేని యందు దేని అధ్యాసమో దానికే విపరీత ధర్మత్వకల్పన అనిఅంటారు. ఎవరు ఏమి చెప్పినా ఒక వస్తువు అన్యవస్తుధర్మాలతో భాసించడం అనేదానిలో మార్పులేదు. అందుచేతనే- ''ముత్యపుచిప్ప వెండివలె ప్రకాశిస్తుంది, ఒక చంద్రబింబం రెండు చంద్రబింబాలలాగ కన బడుతూన్నది" అని లోకంలో అనుభవం.

సరే, విషయం కాని (ఇంద్రియాది గోచరం కాని) ప్రత్యగాత్మ మీద విషయాలకీ వాటి ధర్మాలకీ అధ్యాస ఎట్లు ? ప్రతీవాడూ ఎదర ఉన్న విషయం మీదే కదా మరొక విషయం అధ్యసిస్తూ ఉంటాడు? యుష్మత్ప్రత్యయానికి (నువ్వుఅనే ప్రత్యయానికి) గోచరం కాని ప్రత్యగాత్మయా అ విషయం అని చెపుతున్నావు ? చెపుతాం విను - ఈ ప్రత్యగాత్మ సర్వదా అ విషయం కాదు. 'నేను' అనే ప్రత్యయానికి విషయమే కదా. ప్రత్యగాత్మ జ్ఞానం అపరోక్ష జ్ఞానం కూడాను. ఎదుట ఉన్న విషయం మీదనే మరి ఒక విషయం అధ్యసించాలి అనే నియమం కూడా లేదు. అప్రత్యక్షంఅయిన ఆకాశం మీద కూడా బాలులు తలత్వము, మాలిన్యము మొదలైనవి అధ్యసిస్తున్నారు కదా? అందుచేత ప్రత్యగాత్మమీద అనాత్మాధ్యాసం అని చెప్పడంలో విరోధం ఏమీ లేదు.

ఇలాంటి లక్షణాలు కల అధ్యాసయే అవిద్య అని పండితులు అభిప్రాయ పడు తున్నారు. దానికి విపరీతంగా వస్తుస్వరూపాన్ని నిర్ణయించడం అనేది విద్య అని అంటారు. ఇది ఇలా ఉండగా - ఏ వస్తువు మీద ఏ వస్తువును అధ్యసిస్తారో దాని (అధ్యస్తమైన దాని) దోషం కాని గుణం కాని అణుమాత్రమైనా దానికి (అధ్యాసాశ్రయానికి) సంక్రమించదు. అ విద్య అనే ఈ ఆత్మానాత్మల పరస్పరాధ్యాసాన్ని పురస్కరించుకొనే లౌకికాలు వైదికాలు ఐన 'ఇది ప్రమాణము', 'ఇది ప్రమేయము' ఇత్యాది వ్యవహారాలు నడుస్తున్నాయి ; విధి నిషేధాలు మోక్షమూ బోధించే శాస్త్రాలన్నీ కూడా ప్రవర్తిస్తున్నాయి

ఐతే ప్రత్యక్షాది ప్రమాణాలు, శాస్త్రాలూ కూడా అవిద్యాస్థితిలో మాత్రమే ప్రవర్తించేవని చెప్పడం ఎట్లా ? చెపుతున్నాం విను. దేహేంద్రియాదుల విషయంలో అహం కారమూ మమకారమూ లేని వానికి ప్రమాతృత్వమే కుదరనప్పుడు ప్రమాణముల ప్రవృత్తి యే ఉండదు.ఎందుచేతనంటే-ఇంద్రియాల సహాయంలేకుండా ప్రత్యక్షాది వ్యవహారం కుదరదు. అధిష్ఠాత ఒకడు లేకపోతే ఇంద్రియాలు వ్యవహరించ లేవు. దేహం మీద ఆత్మత్వాధ్యాసం లేకపోతే ఎవ్వడూ వ్యవహారాలు చేయలేడు. ఇదంతా (శరీరేంద్రియాదులు) లేకపోతే అసంగ మైన ఆత్మకు ప్రమాతృత్వం అనేది కుదరదు. ప్రమాతృత్వం లేకపోతే ప్రమాణాలకి ప్రవృత్తి లేదు. అందుచేత ప్రత్యక్షాది ప్రమాణాలూ శాస్త్రాలూ కూడా అవిద్యావంతులను ఉద్దేశించినవే.

'అట్లు కాని దానిని ఆ విధంగా చూడడం' అధ్యాస అని చెప్పి ఉన్నాం. ఉదా హరణకి - పుత్రభార్యాదులలో ఏమైనా లోపాలున్నా లేకపోయినా తనకే లోపాలున్నాయనీ, లోపాలు లేవనీ భావిస్తూ బాహ్యధర్మాలు తనపై అధ్యసించుకొంటున్నాడు. అలాగే దేహ ధర్మాలు అధ్యసించి "లావుగా ఉన్నాను, చిక్కిపోయినాను, తెల్లగా ఉన్నాను, నిలచినాను, నడుస్తున్నాను, గెంతుతున్నాను" అని అనుకొంటున్నాడు. అలాగే ఇంద్రియ

ధర్మాలు అధ్యసించి, "మూగవాడను, ఒంటికంటి వాడను, నపుంసకుడను. చెవిటి వాడను, గుడ్డి వాడను" అని అనుకొంటున్నాడు. అలాగే అంతఃకరణ ధర్మాలైన కామము, సంకల్పము, సంశయము, నిశ్చయము మొదలైన వాటిని తనపై అధ్యసిస్తున్నాడు. ఈ విధంగానే అహం ప్రత్యయానికి గోచరమైన అంతఃకరణాది కాన్ని, అంతకరణాదుల సమస్త వ్యవహారానికీ సాక్షీ భూతమైన ప్రత్యగాత్మ పై అధ్యసిస్తాడు; అంతఃకరణాది విరుద్ధంగా ఉండి సర్వసాక్షి ఐన ప్రత్యగాత్మను అంతఃకరణాదులపై అధ్యసిస్తాడు. ఈ విధంగా ఆద్యంతాలు లేకుండా నైసర్గికంగా వస్తూ కర్తృత్వ భోక్తృత్వాలు ప్రవర్తింపచేసే మిథ్యా ప్రత్యయ రూపం ఐన ఈ అధ్యాస సర్వలోకానుభవ సిద్ధంగా ఉంది. సర్వానర్థాలకీ మూల కారణం అయిన ఈ అధ్యాసను తొలగించడానికీ ఆత్మైకత్వ జ్ఞానం కలిగించడానికీ ఉపనిషత్తులన్నీ బయలుదేరినాయి. సర్వోపనిషత్తులకూ ఇదే ప్రధానోద్దేశం అనే విషయాన్ని మేము ఈ శారీరక మీమాంసలో ప్రదర్శిస్తాం.

నేను వ్యాఖ్యానం చేయదలుచుకొన్న వేదాంత మీమాంసా శాస్త్రానికి ఇది మొదటి సూత్రం :-

'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' ('తరవాత అందు వలన బ్రహ్మ జిజ్ఞాస') సూత్రంలో ఉన్న 'అథ' శబ్దానికి 'తరవాత' అని అర్థం, అనే విషయం అంగీకరించాం. ఐతే ధర్మ జిజ్ఞాసకు పూర్వం తప్పని సరిగా వేదాధ్యయనం ఉండాలని చెప్పినట్లుగా బ్రహ్మ జిజ్ఞాసకి కూడా పూర్వం తప్పని సరిగా ఏది ఉండాలి - అనే విషయం తెలుసుకోవాలి. స్వాధ్యాయనం తర్యం రెండు జిజ్ఞాసలకూ సమానమే. ఐతే- బ్రహ్మజిజ్ఞాస విషయంలో, ఇది కర్మావబోధ తరవాత జరగాలి అనేది విశేషం కాదా ? కాదు. ధర్మ జిజ్ఞాస చేయకపోయినా కూడా ఉపనిషత్తులు చదువు కొన్నవానికి బ్రహ్మ జిజ్ఞాస కలగవచ్చు కదా ?............ ధర్మ, బ్రహ్మ జిజ్ఞాసలకు ఫలం విషయంలోనూ, జిజ్ఞాస్య విషయంలోనూ కూడా భేదం ఉంది. ధర్మజ్ఞానానికి ఫలం అభ్యుదయం. అది అనుష్ఠానం మీద ఆధారపడి ఉంటుంది. బ్రహ్మజ్ఞానానికి ఫలం మోక్షం. దానికి ఏ అనుష్ఠానాల అపేక్షా లేదు. తెలుసుకో దలచిన ధర్మం తెలుసుకొనే సమయంలో ఉండదు. దీనిని ఇంకా పుట్టించాలి. అది పురుషుని వ్యాపారం మీద ఆధారపడినది కదా ? తెలుసుకో దలచిన బ్రహ్మ మాత్రం ఎప్పుడు ఉన్నదే. అది నిత్యం కాబట్టి పురుషుని వ్యాపారం మీద ఆధారపడ్డది కాదు. ఆ రెండింటికీ సంబంధించిన ప్రమాణాల (వైదిక ప్రమాణాల) ప్రవృత్తిలో కూడా తేడా ఉంది. ధర్మం బోధించే బోధన ధర్మం చేయవలసిందిగా పురుషుణ్ణి నియమిస్తూనే బోధిస్తుంది. బ్రహ్మ బోధన మాత్రం కేవలం పురుషునికి బోధ మాత్రమే చేస్తుంది. ఇంద్రియాలకి విషయాలతో సంబంధం కలగగానే జ్ఞానం కలిగినట్లు బ్రహ్మబోధన వల్ల జ్ఞానం కలుగుతుంది కాబట్టి పురుషుణ్ణి జ్ఞానం విషయంలో నియమించే పనిలేదు.

అందుచేత, దేని వెనువెంటనే బ్రహ్మజిజ్ఞాస కలుగుతుందో అలాంటిది ఏదో ఒకటి చెప్పవలసిఉంది. చెపుతున్నాం వినండి. నిత్యానిత్య వస్తువివేకము, ఇహలోకపరలోక భోగాల మీద వైరాగ్యం, శమదమాది సాధన సంపద, మోక్షం కావాలనే కోరిక. ఇవి కనక ఉన్నట్లైతే ధర్మజిజ్ఞాస చేయడానికి పూర్వమూ తరవాతా కూడా బ్రహ్మజిజ్ఞాస కలగడానికీ, బ్రహ్మను తెలుసుకోవడానికీ కూడా వీలౌతుంది; అవి లేకపోతే వీలుకాదు. అందుచేత 'అథ

శబ్దం పైన చెప్పిన 'సాధనసంపత్తి లభించిన తరవాత' అనే అర్థం బోధిస్తుంది.

ఆ బ్రహ్మ ప్రసిద్ధమైనదా, అప్రసిద్ధమైనదా? ప్రసిద్ధమైనదైతే దానిని గూర్చి జిజ్ఞాస చేయవలసిన పనిలేదు. అప్రసిద్ధం ఐతే జిజ్ఞాసచేయడానికి శక్యం కాదు. దానికి సమాధానం ఏమిటంటే - నిత్యమూ, శుద్ధమూ, బుద్ధమూ, ముక్తస్వభావమూ, సర్వజ్ఞమూ, సర్వశక్తి సమన్వితమూ అయినబ్రహ్మ అనేది ఒకటిఉంది. బ్రహ్మ శబ్దం వ్యుత్పత్తి ప్రకారం, (బ్రహ్మ శబ్దానికి మూలం ఐన) 'బృహ్' ధాతువు అర్థం అనుసరించి నిత్యత్వమూ, శుద్ధత్వమూ మొదలైన అర్థాలన్నీ లభిస్తాయి. బ్రహ్మ అందరికీ ఆత్మకనక దాని ఉనికి సర్వప్రసిద్ధమైనది. 'ఆత్మఉన్నది' అని ప్రతీవాడూ తెలుసుకుంటూ ఉంటాడు. 'నేను, లేను' అని ఎవడూ అనుకోడు. ఆత్మాస్తిత్వమే కనక ప్రసిద్ధం కాకపోతే ప్రతీవాడూ "నేను, లేను" అని అనుకోవలసివస్తుంది. ఆ "నేనే" (ఆత్మయే) బ్రహ్మ.

బ్రహ్మ ఆత్మగా లోకంలో ప్రసిద్ధం ఐతే అది తెలిసిందే కాబట్టి దాని జిజ్ఞాసతో పని లేదు-అనే ఆశంకవస్తుంది కదా? అలా కాదు. (సామాన్యతః దాని ఉనికిని అందరూ అంగీకరించినా) దాని విశేషాన్ని గూర్చి విప్రతిపత్తి ఉంది. చైతన్యంతో కూడిన దేహమే ఆత్మ అని ప్రాకృతజనులూ లోకాయతులూ అభిప్రాయపడుతున్నారు. చైతన్యం గల ఇంద్రియాలే ఆత్మఅని కొందరు అంటున్నారు. మనస్సే ఆత్మఅని మరికొందరు. క్షణికమైన విజ్ఞానమే ఆత్మఅని ఇతరులు అంటున్నారు. శూన్యము అని కొందరు అంటున్నారు. దేహాదుల కంటే భిన్నుడై కర్తగాను భోక్తగాను ఉన్న ఒకసంసారి ఉన్నాడని కొందరు అంటున్నారు. ఆ జీవాత్మ కంటే భిన్నుడైన సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అయిన ఈశ్వరుడు ఉన్నాడని, అతడే జీవాత్మకు ఆత్మ (జీవునికంటె వేరుగా లేడు) అని మరికొందరు అంటున్నారు. ఈ విధంగా ఎంతోమంది యుక్తులూ, యుక్త్యాభాసాలూ, వాక్యాలూ, వాక్యాభాసాలూ ప్రమాణంగా చూపిస్తూ అనేక విధాలైన అభిప్రాయాలు వెల్లడిస్తున్నారు. జాగ్రత్తగా పరీక్షించకుండా ఏదో ఒక మతం అవలంబించేవాడు మోక్షానికి దూరం అవడమే కాకుండా అనర్థాలపాలవుతాడు. అందుచేత బ్రహ్మజిజ్ఞాసోపన్యాసం ద్వారా శ్రుతి విరుద్ధంకాని తర్కం సాధనంగా తీసుకొంటూ మోక్ష ప్రయోజనమైన ఉపనిషద్వాక్యార్థ విచారం ప్రారంభిస్తున్నాము.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

## (రాజ్య శాస్త్రము)

1.1 (ఈ గ్రంథంలో ఏయే విషయాలు ఎంతెంతవరకు ఉన్నవి).

రాజ్యం సంపాదించటం, దాన్ని పాలించటం విషయంలో పూర్వాచార్యులు ఎన్ని అర్థశాస్త్రాలు ప్రస్తావించారో సామాన్యంగా వాటినన్నిటినీ వడగట్టి ఈ అర్థశాస్త్రం రచించటం జరిగింది. ఇందులో ఏయే అధికరణాల్లో ఏయే ప్రకరణాలున్నాయో దిగువ వివరిస్తున్నాము.

విద్యా విభాగాలను పరిగణనం చెయ్యటం - విద్యలకోసం వృద్ధులను సేవించటం, ఇంద్రియాలను జయించటం, అమాత్యులను ఎన్నుకోవటం, ఇతర సలహాదారులనూ పురోహితులనూ సమకూర్చుకోవటం, అమాత్యుల నిజాయితీని ఉపధల చేత (రహస్య పరీక్షల చేత) గుర్తించటం, గూఢ పురుషులను నియమించటం, వారిని తగిన పనులలో నియోగించటం, తన రాజ్యంలో శత్రువుల బోధలకు లొంగి తనయెడల విరక్తులు కావటానికీ కాకపోవటానికీ అవకాశం ఉన్న వాళ్ళ విషయంలో జాగ్రత్త వహించటం, పరరాజ్యాలలో ఆయా రాజుల విషయంలో విరక్తి కలిగించటానికీ వీలయిన వారిని కూర్చుకోటం, మంత్రాలోచనము, దూతలను నియమించటము, వారిలోని రకాలూ విధులూ, రాజ పుత్రులను దారి తప్పనీయకుండా జాగ్రత్త వహించటం, వారి దుర్వృత్తం కనిపెడుతూండటం, ఎదురు తిరిగిన రాజపుత్రుల విషయంలో రాజు ప్రవర్తించ వలసిన విధము, రాజు నడవడి, విధులు, రాజ భవనము - అది ఉండదగిన ప్రదేశము - దానిలో ఏర్పరచదగిన గదులు; రాజు అంగరక్షణము - ఇవి వినయాధికరణమనే ప్రథమాధికరణంలో ఉన్న ప్రకరణాలు.

జన పదాల నేర్పరచటం, బంజరు భూములను తగిన యేర్పాట్లు చేసి అడవులను ప్రత్యేకించటం, రకరకాల దుర్గాలు, దుర్గ రూపంలో రాజధానిని నివేశనం చేయటం, కోశాగారము, పణ్యాగారము (Market), ఆయుధాగారము, బంధనాగారము (Prison) మొదలైనవి నివేశనం చెయ్యటం.

ఆయ (Revenue) విభాగము నేర్పరచటం, ఆయాన్ని సంగ్రహించే వనరులు, గణక (Accounts) విభాగము, ఆయంలో వచ్చే నష్టాలు, వాటిని రాబట్టుకోవటం, పరిపాలనాధికారులు, వారి నడవడిని కని పెట్టటం.

శాసనాలు వెలయించటం, వాటిని వ్రాయటంలో ఉండదగిన లక్షణాలు.

కోశంలో చేర్చటానికి యోగ్యమైన రత్నాలు సేకరించటం, గనులు - వాటినుంచి ధాతువులను సంగ్రహించటం, సువర్ణానికి సంబంధించిన వ్యవహారాలు, సువర్ణాధ్యక్షుడు, విశిఖ (Gold Market) లో సౌవర్ణికులు (సరాఫ్‌లు) స్వర్ణకారులు; ధాన్యాలను వ్యవసాయోత్పత్తులను నిలవ చేయటం, ధాన్యాగారాధ్యక్షుడు, వ్యాపారము (Commerce), పణ్యాధ్యక్షుడు, అటవీ సంపద - దాని అధ్యక్షుడు, ఆయుధాగారము, దాని అధ్యక్షుడు,

తూనికలు, కొలతలు; దేశకాలమానము, శుల్కాలు (Customs and tools) కట్టు బళ్ళు; ఎగుమతి దిగుమతులపై పన్నులు; శుల్కాధ్యక్షుడు, సూత్రాధ్యక్షుడు. (నూలు, నేతవస్త్రాల మీద అధికారి), నేత వస్త్రాలు, సీతాధ్యక్షుడు (వ్యవసాయాధ్యక్షుడు), సురాధ్యక్షుడు మత్తుపదార్థాలపై అధికారి); సూనాధ్యక్షుడు (Superintendent of Slaughter Houses) గణికాధ్యక్షుడు, నదులు సముద్రాలు మీద జరిగే వ్యాపారాన్ని పర్యవేక్షణ చేసే నౌకాధ్యక్షుడు, గోశాఖాధ్యక్షుడు, అశ్వాధ్యక్షుడు, హస్త్యధ్యక్షుడు; ఏనుగులను పట్టు కొనటం; రథాధ్యక్షుడు, పదాత్యధ్యక్షుడు, సేనాపతి; జనపదాలలో ప్రవేశ నిష్క్రమణా లకు ఆజ్ఞాపత్రాలిచ్చే ముద్రాధ్యక్షుడు; ఈ ఆజ్ఞాపత్రాలను పరిశీలించే వివీతాధ్యక్షుడు. (వివీతమంటే అడవులలో ఏర్పరిచే చౌకీ).

రాజ్యాన్ని పరిపాలనావసరాలదృష్ట్యా మండలాలుగా వ్యవస్థ చెయ్యటం, గుప్త చరుల నియామకము, నగరాధ్యక్షుడు (City Chief), అతని విధులు-ఇవి అధ్యక్షప్రచార మనే రెండవ అధికరణంలో ఉన్న ప్రకరణాలు - ఆయాశాఖల అధ్యక్షులను, వారి విధులను గురించి ఈ ప్రకరణాలు తెలుపుతున్నవి.

న్యాయవిచారణము, వివాదకారణాలు, వివాహము, విధులు, నియమాలు; వైవా హిక సంబంధాలనుంచి ఏర్పడే వ్యవహారాలు, దాయవిభాగము-గృహము, ఇతర స్థిరాస్తులకు సంబంధించిన తగాదాలు, సార్వజనిక ప్రదేశాలు, జలాధారాలు మొదలయిన వాటికి సంబంధించిన నేరాలు, పరంపరాచారాల భంగము, ఋణాలు, ఉపనిధులు (Deposits) కర్మకరులూ, వేతనాలూ, శ్రేణీ కర్మస్థానాలు (Corporate bodies), క్రయవిక్రయాలు, దానమిచ్చినదాన్ని తిరిగి ఈయక పోవటం, చౌర్యము, బలవంతంగా ఇతరుల సొత్తుహరించటం (సాహసం), వాక్పారుష్యము, దేహపీడ కావించటం, జూదము – ఇవి ధర్మస్థేయమనే తృతీయాధికరణంలోని ప్రకరణాలు.

వివిధవృత్తులలో ఉండేజనులు, కారుకులు (Artisans), నేతగాండ్రు (Weavers) మొదలైనవారి చౌర్యాన్నీ అక్రమాలనూ నిరోధించటం, అగ్నిప్రమాదాలు, వరదలూ, అంటురోగాలు, కరువుకాటకాలు, చీడపురుగులు మొదలైన సహజోపద్రవాలు (Natural Calamities) విషయంలో తీసుకోవలసిన చర్యలు, రహస్యమార్గాల (చీకటి బజారు) ద్వారా ఆదాయం పెంచుకొనేవాళ్ళను పట్టుకోటం, గుప్తచరులద్వారా సంఘంలోని దుర్మార్గులను పట్టించటం, మోహజనక విద్యలచేత చోరాదులను కనుక్కోటం, అపహృత ధనాదులను పట్టుకోటం' హఠాత్తుగా మరణించిన వారి విషయమై దర్యాప్తు చేయించటం, చోరులనుంచి ప్రశ్నించటంద్వారాను, నిర్బంధమార్గాలద్వారానూ సమాచారం రాబట్టటం,అన్ని అధికరణాల (departments) మీదనూ అధికారులమీదనూ వారిమహకృత్యాలమీదనూ నిఘా ఉంచటం, చిన్న దొంగతనాలకూ, నేరాలకూ శిక్షలు, ప్రాణదండనకూ చిత్రవధకూ అర్హమైన నేరాలు, కన్యాబలాత్కారము (Rape), అతిచారము (Transgression), అక్రమప్రవే శము (Tresspass), బుద్ధి పూర్వకహింస.మొ; వ్యభిచారము మొదలైనవి.-ఇవి కంటకోద్ధ రణమనే చతుర్థాధికరణంలో ఉన్న ప్రకరణాలు. కంటకోద్ధరణం అంటే అసాంఘికశక్తుల నిర్మూలనము.

రాజకీయోద్యోగుల అభిద్రోహము, వారికి దండన, పన్నులు మొదలగువానిద్వారా కోశాభివృద్ధి (Development of Treasury), భృత్యకర్మ (Service), వేతనాలు (Salaries), రాజుదగ్గర ఆశ్రయము (Asylum), భృత్యకర్మకోరేవారు నడచుకోవలసిన పద్ధతులు (వృత్తము-Conduct) అతర్కితమైన ఆపదలలో (Emergencies) రాజ్యాన్ని రక్షించటానికి ఉపాయాలు లేదా మార్గాలు - ఇవి రహస్యము-రక్షణ చర్యలూ (Secrecy and Security Measures) అనే ఐదవఅధికరణంలో ఉన్న విషయాలు.

రాజ్యంలో ఉండే ప్రకృతులు (Elements)-రాజు (స్వామి), అమాత్యుడు జనపదము (Country), దుర్గము (Fort), కోశము (Treasury), సైన్యము (Army), మిత్రులు, సంధి-విగ్రహము (Active Preparation) ఇవి మండలయోనిఅనే ఆరవ అధికరణంలోఉన్న విదేశవ్యవహారాలు, వైదేశికనీతి అనే వాటికి సంబంధించిన విషయాలు.

షాడ్గుణ్యనీతి (ఆరు విధలైన రాజనీతి)-సంధి (Peace Treaty), విగ్రహము (War), ఉపేక్ష (Indifference), యానము-శత్రువుపై నడవటం (proceeding against the enemy), శరణము పొందుట (Seeking Refuge), ద్వైధీభావము (సంధి, విగ్రహము రెండు కూడా నడపటం-Joint pursuit of Peace and War).

షాడ్గుణ్యాన్ని ప్రయోగించటం- సంశ్రయవృత్తి అవలంబించవలసిన పరిస్థితులు-తుల్యబలులు, అధికబలులు, హీనబలులు అయిన రాజులయెడల ప్రయోగించదగిన నీతి విధానము, ఆసనము, యానము-అవి అవలంబించదగిన పరిస్థితులు, ఇద్దరు సామంతుల క్లిష్ట పరిస్థితులలో కల్పించుకోవటం, తన అనుయాయులలో విరక్తిసూచనలు, రాజ్యకూటాలు (కొందరు కలసి ఏర్పడినకూటాలు-Confederacies)-సమష్టి చర్యలు (కొందరు కలసి యుద్ధం నడపటం), మిత్రవర్గయానము (March of Allies)-రకరకాలస్వామి త్యాగులతో (Deserters) సహాభిన్నభిన్న వ్యక్తులతో సంధులు ద్వైధీ భావప్రయోగానికి అనుకూలమైన పరిస్థితులు, వ్యక్తులు.

యుద్ధానికి గురిఅయిన రాజు నడవడి, తనకు సాయపడే వారితోనూ ఇతరులతోనూ అతడు నడిపే వ్యవహారాలూ, సంధులూ, మిత్రులనూ, భూమినీ, ధనాన్ని, కర్మసహాయాన్ని సంపాదించటంకోసం సమాఖ్యలు, సహదండయాత్రలు, పార్ష్ణిగ్రహణము (attacking from the rear), హీనశక్తిగల రాజు సామవాయికులైన శత్రువులు తలపడినప్పుడు సముదాయాన్ని భేదించటానికీ తనశక్తిని పూరించుకోటానికీ ముఖ్యశత్రువును ఎదిరించటానికీ ఉపాయాలు, బలవంతుడైన శత్రువు ఉపరోధించినప్పుడు లొంగిపోయి (ఉపనతుడై-ఉపనతి Surrender), సంశ్రయం (Shelter) పొందడం.

బలవంతుడైన రాజు పరులను లొంగదీసుకొంటూ నడిచే నడవడి, అతడవలంబించే సంధి-సంధిమోక్షవిధానాలు, మధ్యముడైన రాజునడవడి, అతనితో వ్యవహరించేపద్ధతి, ఉదాసీనుడైన (Neutral) రాజు, రాజమండలము-ఇతర రాజ్యాల విషయంలో రాజులు అవలంబించదగిన షాడ్గుణ్యవిధానాన్ని తెలిపే ఏడవ అధికరణంలోని విషయాలు ఇవి.

ప్రకృతులకు కలిగే వ్యసనాలు (Calamities), రాజుకూ రాజ్యానికీ కలిగే వ్యసనాలు, పురుషునికి కలిగే వ్యసనాలూ వాటివల్ల అతని పతనము, అగ్ని, జలము, వ్యాధి,

కాటకము, మృత్యువు-అనే దైవికవిపత్తులు, సైన్యానికీ, మిత్రులకూ, మిత్రరాజులకూ పీడకలిగించే వ్యసనాలు-ఇవి వ్యసనాలను గురించిన ఎనిమిదవ అధికరణం.

తనబలము, తగినసమయమూ స్థానమూ, శత్రువుబలాబలాలూ, యానానికి తగిన సమయము, వివిధసేనలు, వాటిని కూర్చుకోటం, శత్రురాజుల వివిధసేనలను సమసంఖ్య గల తన వివిధసేనలతో ఎదిరించటం, తన సైన్యంలో కలిగే తిరుగుబాటులు-వాటి సందర్భంలో వ్యవహరించదగిన పద్ధతి, ఒక్కొక్కపక్షంలో కలిగేక్షయ (Loss of men) వ్యయాలు (Loss of material), లాభాలు, అపనయాల (Wrong Policies) వల్ల కలిగే ఆపదలు-ప్రకృతులు విరక్తులు కావటం మొ. ద్రూష్యుల (traitors) వల్ల, శత్రువుల వల్ల కలిగే ఆపదలు, తనకూ, ఎదిరికీ అర్థ (advantageous) - అనర్థ (disadvantageous)-సంశయ (doubtful) కరాలైన విషయాలు-ఇవి యుద్ధానికి వెళ్ళేరాజు నడవడిని తెలిపే తొమ్మిదవ అధికరణంలోఉన్న విషయాలు.

స్కంధావారము-సేనానివేశాన్ని ఏర్పరచటం, ప్రయాణము-యుద్ధంలో సైన్యాన్ని క్షయ, వ్యయ, వ్యసనాలనుంచి రక్షించటం, ఉభయపక్షాలలోనూ కూటయుద్ధ (Deceitful Warfare) ప్రకారాలు. యుద్ధభూములు; పదాతులు, అశ్వాలు, గజాలు, రథాల కర్మవిశేషాలు, వ్యూహాలు (battle arrays)-వాటి భేదాలు-ఇవి సాంగ్రామికమనే పదవ అధికరణంలోని విషయాలు.

గణతంత్రవంశాలు (Republican clans), ప్రభుతంత్రసంఘాలు (Oligarchies)*-వాటితో వ్యవహరించటం, ఉపాంశుదండము (Quiet Liquidation of the undesirable-విరోధులను రహస్యంగా చంపించటం)- ఇవి సంఘవృత్తమనే పదకొండవ అధికరణంలోని విషయాలు.

దుర్బలుడైనరాజు-దూతలద్వారా మంతనాలు జరపటం, మంత్రయుద్ధము-(War of diplomacy), వైరిసేనాపతిని ఉపాయంగా చంపించటం, శత్రువుమీదికి చుట్టుపట్ల రాజులను రెచ్చగొట్టటం, కుట్రలతోనూ, బలంతోనూ శత్రువును ఏమరించి జయించటం-ఇవి అబలీయసమనే పన్నెండవ అధికరణంలోఉన్న విషయాలు. అబలీయసమంటే దుర్బలుడైన రాజునడవడికి సంబంధించినదని అర్థము.

శత్రు దుర్గాన్ని పట్టుకోటానికి ఉపాయాలు. ఉపజాపము (విరుద్ధప్రచారము), మాయోపాయాలను, గుప్తచారులను ప్రయోగించటం, ముట్టడించటం, ఆక్రమించటం, జయించిన రాజ్యంలోని ప్రజానీకాన్ని లోబరచుకోటం, శాంతి నెలకొల్పటం (లబ్ధప్రశమనము)-ఇవి దుర్గలంభోపాయమనే పదమూడవ అధికరణంలోని విషయాలు.

అధర్మిష్ఠులయిన శత్రువుల విషయంలో చేయదగిన రహస్యప్రయోగాలు, శత్రుసైన్యాలను నాశనంచేసే ప్రయోగాలు, మాయలూ, అద్భుతాలూ, మందులూ, ధూపాలూ, వీటినే ఇతరులు తమమీద ప్రయోగిస్తే చేయదగిన ప్రతిక్రియలు-ఇవి ఔపనిషదికమనే పద్నాలుగో అధికరణంలో ఉన్నవిషయాలు.

* మూలంలో కాంభోజ-సురాష్ట్రాలలోని వార్తా-శస్త్రోపజీవులయిన సంఘాలు, లిచ్ఛవిక-వ్రజిక మల్లక మద్రక కుకుర కురు పాంచాలాలలోని రాజశబ్దోపజీవులయిన వారని పేర్కొనబడింది.

ఈ విజ్ఞానశాఖను వివరించటానికుపయోగించే తంత్రయుక్తిని పదిహేనవ అధికరణం తెలుపుతుంది.

పదిహేను అధికరణాలూ నూటయాభై అధ్యాయాలూ నూటఎనభై ప్రకరణాలూ ఆరువేల శ్లోకాల పరిమితిగలది ఈ అర్థశాస్త్రం. గ్రంథవిస్తరం లేకుండా, తత్త్వార్థపదాలను నిశ్చయంగా తెలిపేటట్లూ సుఖంగా తెలుసుకోగలిగేటట్లూ కౌటిల్యుడు ఈ గ్రంథం రచించాడు.

**నాటకకళ**

భరతుడు రచించిననాట్యశాస్త్రము.

(నాట్యశాస్త్రంలో I-14-17; 104-8; 113-14; VI-10; 15-21; 31-32; XXVII-49-52; 55; 56; 59-62; XXXVI-72; 74-76.)

"ధర్మాన్ని ప్రతిపాదించేదీ, అర్థాన్ని సంపాదింపజేసేదీ, కీర్తికలిగించేదీ, నేటి వారికేగాక ముందు తరాలవారికి గూడ సర్వకర్మలను ప్రదర్శించేదీ, సర్వశాస్త్రాలలోని అర్థాలతో నిండినదీ, సర్వశిల్పాలనూ ప్రవర్తింపజేసేదీ అయిన నాట్యవేదాన్ని దానికి కావలసిన కథాప్రణాళికలు తెలిపేటట్టు రచిస్తాను" అని బ్రహ్మదేవుడు సంకల్పించాడు.

ఆయన ఋగ్వేదంనుంచి పాఠ్యాన్నీ సామవేదంనుంచి గీతాన్నీ యజుర్వేదంనుంచి అభినయాన్నీ, అథర్వవేదంనుంచి రసాలనూ గ్రహించాడు. (I-14-17).

బ్రహ్మ ఇట్లా అన్నాడు-"నాట్యంప్రపంచమంతటిలోనూ ఉన్న భావాలస్వభావాన్ని ప్రదర్శిస్తుంది. ఇందులో కొన్నిచోట్ల ధర్మము, కొన్నిచోట్ల క్రీడ, కొన్నిచోట్ల అర్థార్జనము, కొన్నిచోట్లశమము, కొన్నిచోట్లహాస్యము, కొన్నిచోట్ల యుద్ధము, కొన్నిచోట్ల కామము, మరి కొన్నిచోట్ల వధము ప్రదర్శించబడుతుంది. నేను నిర్మించిన నాటకంలో ప్రపంచంలో ఉండే వ్యాపారాలన్నీ గోచరిస్తాయి. ధార్మికులకు ఇందులో ధర్మం కనపడుతుంది. కామోపసేవకులకు కామం కనపడుతుంది. దుర్వినీతులు దీనిచే వినీతులవుతారు. వినీతులకు దమం పెరుగుతుంది. దుర్బలులకు ధైర్యం కలుగుతుంది. శూరులకు ఉత్సాహం పెరుగుతుంది. అజ్ఞానులకు జ్ఞానం కలుగతుంది. విద్వాంసులకు ఇతోధికవైదుష్యం కలుగుతుంది. ఇది ప్రభువుల విలాసాన్ని ప్రదర్శిస్తుంది. దుఃఖార్థితులకు స్థైర్యం నేర్పుతుంది. అర్థపరులకు లాభాలు చూపిస్తుంది. మనస్సు ఉద్విగ్నమైన వారికి ధైర్యం ప్రసాదిస్తుంది. ఈ విధంగా దీనిలో వివిధ భావాలూ వివిధావస్థలూ కనిపిస్తాయి. (I. 104-8)

ఈ నాట్యంలో కనిపించని జ్ఞానంగాని, శిల్పంగాని, విద్యగాని, కళగాని, నైపుణ్యంగాని, కర్మగాని లేనేలేదు. (I. 113-14)

రసాలూ, సంచారీభావాలూ, అభినయాలూ, ధర్మి (Technique), వృత్తులూ (Styles), ప్రవృత్తులూ (Modes), నాటకనిర్మాణమూ, సిద్ధులూ, స్వరాలూ, వాద్యాలూ, గానమూ, రంగమూ ఈ పదకొండు విషయాల వివరణమే, నాట్యవేదము. (VI-10).

బ్రహ్మ ప్రతిపాదించిన రసాలు ఎనిమిది. అవి-శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము. ఈ రసాలు రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము అనే స్థాయీభావాల నుంచి పరిణామం చెందుతాయి. సంచారిభావాలు, నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము మొదలైనవి ముప్పైమూడు (VI. 15-21).

ముందుగా రసాలను గురించి వివరిస్తాను. రసము లేనిదే ఏ భావమూ నడవదు. విభావములు, అనుభావములు, వ్యభిచారిభావములు, సంయోగం పొందినందువల్ల రసం నిష్పన్నమవుతుంది. అందుకు ఉదాహరణమేమిటి ? రకరకాలైన రుచికరవస్తువులు కలిపినపుడు రసవంతమైన భోజ్యవస్తువు సిద్ధమైనట్లే వివిధభావాల సమ్మేళనంవల్ల రసస్థితి కలుగుతున్నది. బెల్లపుపాకమూ ఇతరభోజ్య పదార్థాలూ కలిపితే మధురాది షడ్రసాలూ ఎలా ఏర్పడుతున్నవో అలాగే అనేక విధాలైన విభావాను భావవ్యభిచారిభావాల సమ్మేళనంవల్ల అష్టవిధరసాలూ అనుభవయోగ్యత్వం పొందుతాయి. అపుడు ఋషులడిగారు: రసమనేపదానికి అర్థమేమిటి ? అందుకు సమాధానమిది. రస్యమానమవుతోంది (ఆస్వాదించబడుతోంది) కాబట్టి దాన్ని రసమంటున్నాము. ఇంకొక ప్రశ్న : రసము ఎలా ఆస్వాదించబడుతున్నది ? సమాధానము : వివిధ వ్యంజనాలతో సంస్కరించిన అన్నం తింటూ ఆరోగ్యవంతులైన మనుష్యులు దాని రుచులు (ఉప్పు, పులుపు, కారం, తీపి. మొ॥) అనుభవిస్తూ సంతోషాదులను పొందుతున్నారు. అట్లాగే ఆంగికవాచిక సాత్త్వికాభినయాలు సూచించే వివిధ భావాలనుంచి వ్యక్తములై పుష్టి చెందేరతి, ఉత్సాహము మొ॥ స్థాయీభావాలను ఏకాగ్రమనస్కులైన ప్రేక్షకులు అనుభవిస్తున్నారు (VI. 31-32).

ఇప్పుడు ప్రేక్షకుల లక్షణాలు చెబుతాను. ప్రేక్షకులు శీలవంతులు, కులీనులుగా ఉండాలి. శాంతము, తగిన నడవడి, విద్యవారికి అలంకారంగా ఉండాలి. కీర్తి పుణ్యము సంపాదించుకోటానికి సన్నద్ధులుగా ఉండాలి. వారుదేనిని గురించీ ముందే ఒక నిర్ణయానికి వచ్చిన వారుగా ఉండకూడదు. తగినంత వయస్సు ఉండాలి. నాట్యంలోనూ దాని వివిధాంగాలలోనూ వారికి చక్కని ప్రవేశం ఉండాలి. వారు చురుకుగాను, శుద్ధమనస్కులుగాను, పక్షపాతం లేనివారుగానూ ఉండవలె. వారికి వాద్యక్రియలోనూ వేషధారణంలోనూ గొప్ప నైపుణ్యం ఉండాలి. వారికి మాండలిక భాషాభేదాలు తెలిసి ఉండాలి. కళలలోనూ శిల్పాలలోనూ (Crafts) వారికి మంచి అభ్యాసం ఉండాలి. అభినయ కౌశల్యంలోనూ విభావానుభావాదుల సూక్ష్మ వివేచనలలోనూ వారు అభిజ్ఞులై ఉండాలి. నిఘంటువు, ఛందస్సు, వివిధ విద్యలలో వారు నిష్ణాతులై ఉండాలి. ఇటువంటి వారు ప్రేక్షకులుగా ఆహ్వానింపబడాలి. సంతోషాన్ని ప్రదర్శించినపుడు సంతోషించటం శోకం ప్రదర్శించినపుడు శోకించటం, దైన్యం ప్రదర్శించినపుడు దీనులు కావడం ఈ లక్షణాలు గలవారే సరియైన ప్రేక్షకులు. (XXVII) 49-53, 55)

ఒకే ప్రేక్షకుడిలో ఈ గుణాలన్నీ ఉంటాయని అనుకోలేము...... యువకులు ప్రేమాభినయాన్ని మెచ్చుకుంటారు. శిల్పవేత్తలు సాంకేతిక విశేషాలనూ, అర్థపరులు ప్రాపంచిక క్రియలనూ, సంగరహితులు మోక్షార్థుల ప్రయత్నాలనూ ప్రశంసిస్తారు. నాటకం భిన్నభిన్న పాత్రలమీద ఆధారపడి ఉంటుంది. వారి నడవడి బహువిధాలుగా ఉంటుంది. శూరులైనవారు జుగుప్స, హింస, కలహాలూ యుద్ధాలుచూసి పొంగిపోతారు. వృద్ధులైనవారు పురాణాలూ, పుణ్యకథలూ అంటే ఎక్కువ ఇష్టపడతారు. తరుణులూ, సామాన్యులూ, స్త్రీలూ హాస్యానికీ, వేషవిశేషాలకీ ఆనందిస్తారు. కనక ఆయా భావాలకూ సన్నివేశాలకూ చలించిపోయి ఆయా కథావిధానాలలో నిమగ్నులు కాగలిగినవారే ఆయా నాటకాలకు తగిన ప్రేక్షకులని

చెప్పవచ్చు. వారికి ఆయా నాటకాలకు ప్రేక్షకులు కాదగిన గుణాలు అన్నీ ఉన్నవన్నమాట. (XXVII 58, 59-62)

నాట్యశాస్త్రమూ నాటక ప్రయోగమూ ప్రజల తెలివి తేటలను వృద్ధిపరుస్తాయి. ప్రపంచంలో ఉండే సకలక్రియాకలాపమూ దానిలో ఉంది. అన్ని విజ్ఞానశాఖలనూ అది ప్రదర్శిస్తుంది.

బ్రహ్మదేవుడు ప్రవర్తింపజేసిన ఈ విజ్ఞానశాఖను అధ్యయనం చేసినవారూ నాట్య ప్రయోగంచేసినవారూ ఏకాగ్రదృష్టితో నాట్యాన్ని సందర్శించినవారూ వేదవేత్తలకూ, క్రతు కర్తలకూ, భూరిదాతలకూ లభ్యమయ్యే ఉత్తమగతిని పొందుతారు. రాజుకు విధించిన విధు లలో నాటకాలు వేయించటం అధిక ప్రయోజనకరమైనది. ప్రజలకు ఒక నాటక ప్రదర్శనం ఇవ్వటం ఉత్తమదానాలలో ఒకటిగా భావించబడుతుంది. (XXXVI-72, 74-76)

## కావ్యశాస్త్రము

### మమ్మటాచార్యుని 'కావ్యప్రకాశం' నుంచి

ఉ. 1. కవివాక్కు ఉత్తమంగా విలసిల్లుతున్నది. ఆయన రచన ప్రకృతిసిద్ధ ములైన నియమాలకు లోబడదు. ఎటువంటి ఘట్టంలోనైనా అది ఆనందాన్నే కలిగిస్తుంది. ఆయన ప్రతిభేతప్ప ఇంకేదీ దాన్ని అదుపులో పెట్టదిలేదు. నవరసాలతో అది చవు లూరిస్తూంటుంది.

కావ్యంవల్ల కీర్తికలుగుతుంది. ధనం సంపాదించవచ్చు. లోకవ్యవహారం తెలు స్తుంది. అరిష్టాలు తొలగిపోతాయి. చదవగానే సాటిలేని ఆనందం లభిస్తుంది. అది మనసు నొప్పించకుండా ప్రియురాలివలె సరసంగా (చెప్పకుండానే) ఉపదేశం అందిస్తుంది.

కావ్యంలో చిత్రించిఉండే రసాలను ఆస్వాదించిన వెంటనే కలిగి, ఇతర అను భూతులు వేటినీ గుర్తించ నియ్యకుండా ఉండే పరమానందమే కావ్యప్రయోజనాలన్నిటిలోకీ ఉత్తమమైనది.

వేదాదిశాస్త్రాలలో శబ్దము ప్రధానము. ఆ శబ్దానికి కించిత్తుకూడా ఇటూ అటూ నడవటానికి వీలులేదు. అందువల్ల వేదాదిశాస్త్రాలు ప్రభువు మాదిరి శాసించేవి. పురాణేతి హాసాదులలో అర్థతాత్పర్యాదులు ముఖ్యములు. వాటి కనుగుణంగా నడుచుకొనేటట్లు స్నేహి తులలాగా అవి ప్రేరేపిస్తాయి. వాటి ఉపదేశరీతి అటువంటిది. కావ్యము ఈ రెండిటికంటే భిన్నమైనది. లోకోత్తర వర్ణనానిపుణమైనది కవికర్మ. దానిలో శబ్దాలు అర్థాలు తమతమ ప్రాధాన్యాన్ని కోల్పోతాయి. ప్రియురాలు భర్తను రసపరతంత్రునిచేసి అభిముఖునిచేసు కొనేటట్లు కావ్యం కూడా సహృదయుడైన పఠితనూ, కవినీ ఒకే మాదిరి రామాదులవలె ప్రవర్తించవలె, రావణాదులవలె ప్రవర్తించగూడదు, అనే తన ఉపదేశం అవలంబించేటట్టు చేస్తుంది. కనక అన్నివిధాలా కావ్యరచన కోసం ప్రయత్నం చెయ్యాలి.

కావ్యం శబ్దార్థాల పొందిక. అందులో శబ్దాలలోనూ అర్థాలలోనూ దోషాలుండ గూడదు. గుణాలు తప్పకుండా ఉండవలె. ఎక్కడయినా అలంకారం లేకపోయినా కావ్య త్వానికి హాని కలగదు. అంటే శబ్దాలకూ అర్థాలకూ సంబంధించిన అలంకారాలు సామాన్యంగా ఉండనే ఉంటాయి. అయితే ఎక్కడయినా స్ఫుటమైన అలంకారము కనపడకపోవచ్చు.

ఆక్కడ (వ్యంగ్యమో, రసమో, కథాగమనమో ప్రధానం కావటం వల్ల) కావ్యత్వహాని కలగదు.

వాచ్యంకంటే వ్యంగ్యం ప్రధానంగా ఉండే కావ్యం ఉత్తమమైనది అని అభిజ్ఞుల అభిప్రాయము. [వ్యంగ్యముకన్నా దానికంటే వాచ్యమే ముఖ్యంగా ఉండే కావ్యం ఒకమాదిరిది-మధ్యమం] వ్యంగ్యమేమీలేకుండా శబ్దచిత్రాలూ, అర్థచిత్రాలూ ముఖ్యంగా ఉండేకావ్యం అధమము. ఇక్కడ చిత్రాలంటే రచనకు సంబంధించిన గుణాలూ అలంకారాలూ.

ఉ. 4. రసము, భావము, రసాభాసము, భావాభాసము, భావోదయము, భావ సంధి, భావశబలత, భావశాంతి, అనేవి ఎనిమిదీ ప్రధానములై ఒకవరస లేకుండా కావ్యంలో స్ఫురించవచ్చు. అవి వాచ్యాన్ని అతిక్రమించి ధ్వనికావ్యసృష్టికి దారితీస్తాయి. వేరొకచోట రసాదులకంటే వాచ్యమే ముఖ్యమవుతుంది. అట్లాంటిచోట్ల వ్యంగ్యం అప్రధానం అవుతుంది. రసాదులు అలంకారాలవుతాయి.

భరతమహర్షి రసనిర్వచనం ఇట్లా చెప్పినాడు. "విభావాలు (Causes), అను భావాలు (Effects), వ్యభిచారి భావాలు (Accessory moods) సంయోగంవల్ల రసం నిష్పన్నమవుతుంది". దీన్ని ఈ విధంగా వివరించినారు.

రసాన్ని కలిగించేవి 1. మానవరూపమైన ఆలంబనము (ఆలంబన విభావము) 2. ఉద్దీపనం కలిగించే పరిసరాలు (ఉద్దీపన విభావాలు) అంటే శృంగారం తీసుకొంటే స్త్రీ ఆలంబనమూ, ఉద్యానమూ మొదలైనవి, ఉద్దీపనం కలిగించేవి. శృంగారమనే రసస్థితిని ఈ రెండు కారణాలు కలిగిస్తున్నాయి. ఇక్కడ ఈ రసము ఉన్నదని తెలియటానికి సహకరించే పరిస్థితులు (అనుభావాలు) కొన్ని ఏర్పడుతాయి. శృంగారానికి సంబంధించినంత వరకు ఓర చూపులు, బుజాలు అదరటం మొదలైనవి కనపడతాయి. వ్యభిచారి భావాలు రసం ఉప చయం పొందటానికి ఉపకరిస్తాయి. ఇవి శృంగారరసం విషయంలో నిర్వేదము, గ్లాని మొదలైనవి. ఇట్లా ఉపచయం పొందిన రసం ముఖ్యవృత్తిచేత ప్రదర్శితమయ్యే పాత్రలో అంటే రాముడు మొదలైనవారిలో ఉంటుంది. రాముని పాత్రను అతనిలో మనం భావించటం వల్ల నటునిలో ప్రతీయమానమవుతుంది. రసస్వభావం ఇటువంటిదని ప్రాచీన వ్యాఖ్యాతలైన భట్టలోల్లటాదులు వివరించినారు.

భట్టనాయకుడు ఇట్లా వివరించినాడు. రసము తటస్థగతంగా గాని ఆత్మగతంగా గాని ప్రతీయమానం కాదు. అది ఉత్పన్నమూకాదు, అభివ్యజ్యమూ కాదు. కావ్యంలోనూ, నాటకంలోనూ వాచ్యం కంటే భిన్నమైన భావకత్వమనే వ్యాపారమొకటి ఉంటుంది. అది అప్పుడుండే సన్నివేశంలోని విభావాలనూ, అనుభావాలనూ, వ్యభిచారి భావాలనూ (విశేషోపాధులను తొలగించి తన అనుభవాలతో) సాధారణమైనవిగా (సమానమైనవిగా) సామాజికుడు భావించేటట్టు చేస్తుంది. ఇటువంటి భావకత్వవ్యాపారం రతి మొదలైన స్థాయి భావాలను భావించేటట్టుచేస్తుంది. అప్పుడు ఇతర విషయాలకు సంబంధించిన వేదన నిలిచిపోతుంది. సత్వోద్రేకము చేత ఆనందం కలుగుతుంది. అటువంటి స్థితిలో రసం అనుభవానికి (భోగానికి) వస్తుంది.

పూజ్యులైన అభినవగుప్తులు ఇట్లా వివరించినారు : రతి మొదలైన స్థాయిభావాలు సహృదయులైన ప్రేక్షకుల హృదయాలలో వాసనారూపంలో అంతర్గతంగా ఉంటాయి. అవి విభావాదులవల్ల అభివ్యక్తి పొందుతాయి. అవి సాధారణీకృతమైన రీతిలో అనుభవాన్నికి

వస్తాయి. ఈ సాధారణీకరణబలం వల్ల ఈస్థాయిభావాలు ఒక ప్రమాతలో ఉన్నవైనా అవధులులేని ప్రమాత అనుభవంలోకి వచ్చినట్టవుతుంది. పరిమితమైన ప్రమాతృత్వంపోయి అతడు ఇతర వస్తువులేవీ తోచనిస్థితిలోకి వస్తాడు. పరిమితిలేని ఆస్థితిలో - అన్ని హృదయాలతోనూ సాధారణీకృతమైన స్థితిలో ఉన్నందువల్ల స్థాయిభావం ఆత్మల అభిన్నత్వం వలెనే గ్రహణదశకు వస్తుంది. ఈ వ్యంజన లేదా చర్వణం రసరూపం పొందుతుంది. ఇది ఆ సన్నివేశం ఉన్నంతవరకూ ఉంటుంది. పానకరసంలో వివిధద్రవ్యాల రుచి విడివిడిగా తెలియకుండా ఒకే రుచి అనుభవానికి వచ్చినట్టు ఇది ఏక రసంగా అనుభవంలో ఉంటుంది. ఇది ఎట్టఎదుట స్ఫురిస్తున్నట్టుంటుంది. ఇతర విషయాలనన్నిటినీ మరుగుపరుస్తున్నట్టుంటుంది. బ్రహ్మానుభవానందం కలిగిస్తున్నట్టుంటుంది. లోకంలో ఎక్కడాలేని చమత్కారం పుట్టిస్తుంది. శృంగారం మొదలైన రసానుభవము ఇట్లా ఉంటుంది...... రసానుభవాన్ని కలిగించే హేతువులు గుర్తించటానికి వీలుకానివికావు. విభావాదులను గుర్తించనిదే ఈ అనుభవం కలుగదు. అట్లాఅని హేతువులు కేవలం గుర్తించటమూ ఉండదు. ఎందుకంటే - ఆ కలిగే ఆనందం అలౌకికమైనదీ, ఆత్మానుభవంగా అనుభవించేదీని. పైన చెప్పిన ఏ ఒక్కరకానికీ చెందనిదీ, రెండు విధాలాకలిగేదీ కావటంవల్ల రసానందం అలౌకికమని రుజువౌతుంది. అందువల్ల ఇందులో విరోధమేమీలేదు.

## కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలము

### చతుర్థాంకము

(పూలుకోస్తూ శకుంతల సఖులు ప్రవేశిస్తారు)

అన : ప్రియంవదా! శకుంతల తనకు తగిన భర్తను గాంధర్వ వివాహం చేసుకొన్నదని తృప్తిగానే ఉందిగాని అయినా ఇది మాత్రం కొంచం ఆలోచించవలసిఉంది.

ప్రియం : ఏమిటది ?

అన : మహానుభావుడయిన ఆరాజు ఇక్కడ యజ్ఞం ముగింపజేసి మహర్షుల సెలవుపొంది తన నగరానికి వెళ్ళినాడుగదా ! అక్కడ నిజభార్యలతోకలసి ఆనందంలో మునిగిపోయి ఇక్కడి సంగతి తలుచుకుంటాడా లేదా అని.

ప్రియం : ఏమీ చింతించ నక్కరలేదు. ఆటువంటి ఆకృతిగలవారి గుణాలు విరుద్ధంగా ఉండటం అసంభవం. కాని - ఈ సంగతివిని తాతపాదులేమి చేస్తారో ఊహించలేకుండా ఉన్నాను.

అన : నాకు తోచినంతవరకూ ఆయన అంగీకరిస్తారనే అనుకుంటున్నాను.

ప్రియం : ఎట్లా చెప్పగలవు ?

అన : కన్యను గుణవంతుడైన వరునికీయవలెనని గదా ఆయన ముఖ్య సంకల్పము ! భాగ్యమే దీన్ని సమకూర్చినప్పుడు పెద్దలకోరిక సునాయాసంగా తీర్చినట్టే గదా!

ప్రియం : (పూలసజ్జకేసిచూసి) చెలీ ! పూజకు తగినన్ని పూలుకోసినామే.

అన : మనం శకుంతల సౌభాగ్యదేవతను పూజించవలె.

ప్రియం : అవును. అదే తగినపని.

(వారు అట్లాగే చేస్తుంటారు)

(తెర లో)

ఇదిగో నేను వచ్చినాను.

అన : (విని) చెలీ ! ఎవరో అతిథి వచ్చినట్టుంది.

ప్రియం : పర్ణశాలలో శకుంతల ఉంది.

అన : కాని ఆమెమనస్సు అక్కడ ఉండి ఉండదు

ప్రియం : అవును ఈ కోసిన పూలు చాలు.

(ఇద్దరూ బయలుదేరుతారు)

(తెర లో)

ఆఁ ! అతిథుల నవమానిస్తావా ! నీ ఆలోచన లెక్కడో ఉన్నవి. నీ మనస్సు ఇక్కడలేదు. ఒక తపస్విని నేను ఇక్కడ నిలిచిఉన్నానని గమనించలేక పోయి నావు. ఎవరిని భావిస్తూ నీవు ఈ స్థితికి వచ్చినావో అతడు నిన్ను గుర్తుపట్టడు. ఉన్మత్తుడు అప్పుడేపలికిన మాటలను ఎంతకూ జ్ఞాపకం తెచ్చుకోలేనట్టు, ఎన్ని గుర్తులు చెప్పినా అతడా మరుపునుండి బయటపడలేడు

ప్రియం : అయ్యయ్యో ! అప్రియం జరిగిపోయింది. మనసు దగ్గరలేక పోవటంవల్ల శకుంతల ఎవరో పూజ్యుడైన అతిధికి కోపం తెప్పించింది. కాదు, ఆయన ఎవరో కాదు, దూర్వాసుడు – ఆ మహర్షికి ముక్కుమీదనే కోపం ! ఈ విధంగా శాపం పెట్టి తొందర తొందరగా వెళ్ళిపోతున్నాడు. మనకాయనను ఆపటానికి అవకాశం లేకపోతున్నది. అగ్నిహోత్రుడు దహించకుండా ఎట్లా ఉంటాడు?

అన : పోయి ఆయన కాళ్ళమీదపడి వెనక్కి తీసుకొనిరా. ఈలోగా నేను అర్ఘ్యజలం తెస్తాను.

ప్రియం : పోతున్నాను.

(ప్రియంవద వెళుతుంది)

అన : (రెండడుగులలో తడబడి) అయ్యో తడబాటులో పూలసెజ్జ చేతిలోనుంచి జారి పోయిందే!

(పడిపోయిన పూలనేరుతూ ఉంటుంది)

ప్రియం : (ప్రవేశించి) చెలీ ! ఆయనను బతిమాలటం ఎవరితరం ? అసలే ఆయనది వక్ర స్వభావం. ఎట్లాగో కొంచెం కరుణించేటట్టు చేయగలిగినాను.

అన : (చిరునవ్వుతో) ఆయనతో అదే పదివేలు. చెప్పు చెప్పు.

ప్రియం : ఆయన రానని భీష్మించుకొన్నాడు. నేనాయనతో అన్నాను – స్వామీ ! ఎప్పుడూ ఆమె మీ మీద భక్తిచూపుతూనే ఉంది. ఆమె మీకు బిడ్డ లాంటిది. మీ ప్రచండ తపశ్శక్తి ఆమెకు తెలియదు. ఈ ఒక్క తప్పుకాచండి.

అన : తరవాత ?

ప్రియం : "నామాటకు తిరుగులేదు. కాని అభిజ్ఞానంగా ఇచ్చిన ఆభరణం చూస్తే శాప విమోచనమౌతుంది." అంటూనే చరాచరా వెళ్ళిపోయినాడు

అన : ఇప్పుడు కొంతభారం తగ్గిందనుకోవచ్చు. ఆ ఉంగరమున్నదికదా, ఆయన పేరుతోకూడా ఉన్నది. ఆ రాజు వెళ్ళేటప్పుడు అభిజ్ఞానంగా మన చెలి చేతికి అలంకరించినాడు, అది ఉంది గనక శకుంతలకు ప్రతిక్రియ తన చేతిలోనే ఉంది.

ప్రియం : చెలీ! రా. ఆమెకోసం మనం పూజ చేయవలసి ఉంది.

(ఇద్దరూ పరిక్రమిస్తారు)

ప్రియం : (శకుంతలను చూసి) అనసూయ! ఆమెకేసి చూడు. ఎడమఅరచేతిమీద మొహం ఆనించుకొని మన ప్రియసఖి ఎట్లా బొమ్మలాగ కూర్చొని ఉందో!

అన : ప్రియంవదా! ఈ జరిగిందంతా మన ఇద్దరి పెదవుల మాటుననే ఉండవలె సుమా! సహజంగా సుకుమారి అయిన ఆమెను మనం కాపాడవలె.

ప్రియం : నవమాలికకు ఉడుకునీళ్ళుపోసే వారెవరులే.

(ఇద్దరూ నిష్క్రమిస్తారు)

ఇది విష్కంభము

(అప్పుడే నిద్రలేచిన శిష్యుడు ప్రవేశిస్తాడు)

శిష్యు : ఇప్పుడు సమయమెంతైనదో చూసిరమ్మని యాత్రముగించుకొని వచ్చిన పూజ్యులైన కణ్వమహర్షులు ఆజ్ఞాపించినారు.

(చుట్టూ తిరిగిచూసి)

ఆహా! తెల్లవారిందే! ఒకపక్క ఓషధీశ్వరుడైన చంద్రుడు అస్తగిరి దిగుతున్నాడు. ఇంకో పక్క అనూరుని ముందుపెట్టుకొని సూర్యుడు పొడుపుకొండ ఎక్కుతున్నాడు. తేజోమయులైన వీరి పతనోత్పతనాలు లోకులకు కష్టసుఖాలు ఇట్లానే వస్తాయని తెలుపుతున్నాయి. ఇంకా, చంద్రుడు కనుమరుగై పోగానే రాత్రంతా సొంపులు నింపిన నల్లకలువ సొగసు ఇప్పుడు స్మృతిమాత్రంగా నిలిచిపోయి ఆనందం కలిగించటంలేదు. భర్తదూరమయినప్పుడు పడతులకు కలిగే బాధలు నిజానికి ఏ మాత్రం సహించ శక్యంకానివి గదా!

(పటాక్షేపంతో ప్రవేశించి)

అన : ప్రాపంచికాను భవాలను వదలిపెట్టిన వాడికికూడా ఈ మాత్రం తోచకుండా ఉండదు - రాజు శకుంతల విషయంలో ఎంత దారుణంగా ప్రవర్తించినాడో!

శిష్యు : అగ్నికార్యానికి సమయమైందని గురువుగారికి తెలుపుతాను.

(నిష్క్రమించును)

అన : లేచి మాత్రం నేనేమి చేసేది? చేయవలసిన పనులకే కాళ్ళుచేతులు ఆడటంలేదు. ఉదార హృదయురాలైన మా చెలిమాట తప్పినవానిని చెట్టబట్టేటట్టు చేయగలిగినందుకు కామదేవుడు సంతోషిస్తూండవచ్చు. లేకపోతే దుర్వాసుని శాపము రాజుకు తగిలి ఉండవచ్చు. కాకపోతే ఆరాజర్షి ఆనాడు అట్లా అన్ని కబుర్లుచెప్పి ఇన్ని రోజుల వరకూ ఒక ఉత్తరం ముక్కకూడా వ్రాయకుండా ఉంటాడా! అందుచేత రాజుకు జ్ఞాపకం కలిగించే ఆ ఉంగరం ఇక్కడినుంచి ఆయనకు పంపిస్తాను. ఎప్పుడూ ముక్కుపట్టుకొని ఉండే ఈ తపసిజనంలో ఇందుకు ఎవరిని కోరను? ఇంతకూ ఇందులో నిందించదగినది నాచెలి శకుంతలే అని నిశ్చయించుకున్నా యాత్రనుంచి తిరిగివచ్చిన పితృపాదులైన కణ్వులతో శకుంతల దుష్యంతుని వివాహమాడి గృహస్థాశ్రమంలో ఉంది అని చెప్పలేకపోతున్నాను. ఈ పరిస్థితిలో ఏమిచెయ్యవలె?

ప్రియం : (ప్రవేశించి సంతోషంతో) చెలీ, త్వరపడు. శకుంతలను అత్తవారింటికి పంపటానికి సన్నాహాలు చెయ్యవలె.

అన : ఇదెట్లా

ప్రియం : విను, రాత్రి నిద్రబాగా పట్టిందా అని అడగటానికి ఇప్పుడే శకుంతల దగ్గరికి వెళ్ళాను. అప్పుడే సిగ్గుతో తలవంచుకొని ఉన్న శకుంతలను కౌగిలించుకొని తమ సమ్మతిని పితృపాదులిట్లా సెలవిస్తున్నారు "పొగతో కళ్ళు మూసుకొని పోయినా యజమానుడు వేసిన ఆహుతి అదృష్టంవల్ల అగ్నిలోనే పడింది. బిడ్డా! విద్య గరపినమంచి శిష్యుని విషయంలో లాగే నీవిషయంలోనూ నాకు చింతలేదు. నిన్ను వివాహమాడిన ఆ రాజర్షి దగ్గరికి ఈనాడే నిన్ను పంపుతాను"

అన : అయితే ఈ సంగతి పితృపాదులు కణ్వులకెవరు సూచించినారు ?

ప్రియం : ఆయన అగ్నిగృహంలో ప్రవేశించగానే ఒక అశరీరవాణి ఆయనకిట్లా శ్లోకం వినిపించింది.

అన : (సంతోషంతో) ఆఁ, చెప్పుచెప్పు.

ప్రియం : "బ్రహ్మర్షీ ! శమీవృక్షం అగ్నిని ధరించినట్టు లోకశ్రేయస్సుకోసం నీ కుమార్తె శకుంతల దుష్యంతుని బీజాన్ని ధరించి ఉంది "

అన : (ప్రియంవదను కౌగిలించుకొని) ఎంతో ఆనందంగా ఉంది. అయితే ఇవాళ శకుంతల వెళుతున్నదే అనే వేదనతో ఆతృప్తిమిశ్రితమవుతున్నది.

ప్రియం : మనం మన వేదన నెట్లాగో సహిద్దాము. పాపం ! శకుంతలను సుఖపడనీ !

అన : అయితే-ఇదిగో ఈ మామిడికొమ్మకు వేలాడగట్టిన చిన్న కొబ్బరాకులబుట్టలో శకుంతలకోసం చాలాకాలం వాడిపోకుండా ఉండే పొగడ పూలదండదాచి ఉంచి నాను. అది తీసి సిద్ధంగా ఉంచు. ఇంతలో నేను శకుంతల శుభాలంకరణకోసం కావలసి గోరోచనము, గంగ మట్టి, గరిక చిగుళ్లు అన్నీ సమకూరుస్తాను.

ప్రియం : అట్లాగే.

(అనసూయ వెళుతుంది. ప్రియంవద పొగడదండ తీస్తుంది)

(తెరలో)

గౌతమీ ! శకుంతలవెంట వెళ్ళవలెనని శార్ఙరవాదులకు ఆజ్ఞనందించు.

ప్రియం : (విని) అనసూయా ! త్వరగారా. హస్తినాపురానికి వెళ్లవలసిన ఋషులను పిలుస్తున్నారు.

అన : రా చెలీ రా.

(ఇద్దరూ పరిక్రమిస్తారు)

ప్రియం : అదిగో శకుంతల. ఉదయమే మంగళస్నానంచేసి నివ్వరిధాన్యం చల్లుతూ స్వస్తి వాచనాలు పలుకుతున్న తాపసస్త్రీల అభినందనలందుకొంటూ కూర్చొని ఉంది. దగ్గరికి వెళదాముర.

(శకుంతలపైన చెప్పిన విధంగా కూర్చుండి కనపడుతుంది)

**తాపసస్త్రీ 1 :** నీ భర్త అనురాగం పొంది పట్టపురాణివి కావలె.

**తా. స్త్రీ2 :** బిడ్డా ! నువ్వు వీరమాతవు కావలె,

తా. స్త్రీ 3 : బిడ్డా ! నీ భర్త అత్యంతాభిమానంపొందు.

అ.మ.ప్రి: (శకుంతలదగ్గరికి వచ్చి) సఖీ! సుఖంగా స్నానం చేసినావా ?

శకుం : సఖులకు స్వాగతం ఇక్కడ కూర్చోండి.

అ.మ.ప్రి: (చేతులలో మంగళద్రవ్యాలు పట్టుకొని కూర్చుంటారు) శకుంతలా ! నీకు మంగళాలంకారాలు చేస్తాము. సిద్ధంగా ఉండు.

శకుం : ఇది నాకు ఎంతో ప్రియమైనది. ఇంక మీరు చేతులమీదుగా చేసే అలంకారం నాకు అరుదుగదా ! (కన్నీరు విడుస్తుంది)

అ.మ.ప్రి: చెలీ ! ఈ మంగళక్షణాన నీవు ఏడవటం తగదు. (ఇద్దరూ ఆమె కళ్ళు తుడిచి అలంకరిస్తారు.)

ప్రియం : విలువైన నగలకు తగిన రూపాన్ని ఆశ్రమంలో దొరికే అలంకారాలతో అందవికారం చేసినాము

(కానుకలు పట్టుకొని ప్రవేశించి)

ఇద్దరు ముని బాలకులు : ఇవిగో ఆభరణాలు. వీటితో ఈ పూజ్యురాలినీ అలంకరించండి.

(ఆ ఆభరణాలు చూసి అంతా ఆశ్చర్యపోతారు)

గౌతమి : నాయనా ! నారదా ! ఇవన్నీ ఎట్లా వచ్చాయి ?

మొ.తా.బా: పితృపాదులైన కణ్వులవారి ప్రభావంవల్ల.

గౌత : ఆయన మనస్సు సృష్టించినవా ?

రెం.తా.బా: కాదు వినండి. పెద్దపెద్ద వృక్షాలనుంచి పూలుతెమ్మని పూజ్యులైన తాతపాదులు ఆజ్ఞాపించినారు. అప్పుడు ఒకచెట్టు చంద్రధవళమైన పట్టుచీర ఇచ్చింది. ఇంకొక చెట్టు చిగుళ్లలోనుంచి పాదాలంకరణార్థం లాక్షారసం చిమ్మించింది. వనదేవతలు తామ్రవర్ణములైన తమ చివురు చేతులను మణిబంధాలదాకా జాపగా తక్కినచెట్లు తొడిమలువేసినట్టుగా ఈ ఆభరణాలతో నింపినవి.

ప్రియం : సఖి ! వనదేవతలు నీమీద చూపిన ఈ అనుగ్రహం అత్తవారింట్లో నీవు అనుభవించబోయే రాజ్యలక్ష్మిని సూచిస్తుంది.

(శకుంతల సిగ్గుపడుతుంది )

మొ.తా.బా: గౌతమా, రా. ఈ పాటికి గురువులు హవనం ముగించుకొనివేచి ఉంటారు. ఈ వృక్షాల అనుగ్రహం వారికి నివేదిద్దాం.

రెం.తా.బా: అట్లాగే (ఇద్దరూ వెళ్ళిపోతారు)

అ.మ.ప్రి : చూడు శకుంతలా ! మనమెప్పుడూ ఇటువంటి ఆభరణాలు ఉపయోగించినవాళ్ళంకాము. చిత్రాలలో చూసిన పరిచయాన్నిబట్టి వీటిని తగినచోట్లఅలంకరిస్తున్నాము.

శకుం : నాకు మీ నేర్పు తెలుసు.

(అనసూయ, ప్రియంవద అలంకరిస్తారు)

(కణ్వుడు అగ్నిహోత్రం ముగించుకొని ప్రవేశిస్తాడు.)

కణ్వు : ఈ వేళ శకుంతల వెళ్ళిపోతుందని హృదయం బెంగపడుతున్నది. పొంగుతున్న

దుఃఖంతో గొంతు బిగుసుకొని పోతున్నది. చింతవల్ల కంటి చూపు ఆనటంలేదు. విరక్తులమై అడవులలో ఉన్న మేము పెంచిన మమకారానికే ఇట్లా అవుతున్నామే. ఇంక కడుపారకని చేతులార పెంచిన గృహస్థులు తమ కూతుళ్ళను వదలిపెట్ట వలసివచ్చినపుడల్లా ఎంత యాతన అనుభవిస్తారోకదా !
(పరిక్రమిస్తాడు)

ఋ మ. ప్రి: శకుంతలా ! నీ అలంకారం పూర్తిఅయింది. ఇంక ఈ తెల్లపట్టు చీరలజత కట్టుకో.
(శకుంతల లేచి ధరిస్తుంది)

గౌతమి : బిడ్డా! ఇదుగో ఆనందాశ్రువులుతొణికిసలాడే కళ్ళతో మీ నాన్నగారు నిన్ను కౌగిలించుకోటానికన్నట్టు వస్తున్నారు, సముదాచారం నిర్వర్తించు.

శకుం : (సిగ్గుతో) తండ్రీ ! నమస్కారము.

కణ్వ : బిడ్డా ! యయాతివల్ల శర్మిష్ఠలాగా నీ భర్త అనురాగం అందుకో. ఆమె పూరుని కన్నట్టే నీవూ చక్రవర్తి కాగల కొడుకును కను.

గౌత : భగవన్ ! ఇది ఆమెకు ఆశీస్సుమాత్రమేకాదు-వరమే.

కణ్వ : అమ్మా ! ఇటు వచ్చి ఇప్పుడే ఆహుతులుపొంది ప్రసన్నంగాఉన్న అగ్నులకు ప్రదక్షిణం చెయ్యి.
(అందరూ పరిక్రమిస్తారు)

కణ్వ : (వైదికరీతితో) ఇదిగో వేదికచుట్టూ అగ్నులున్నాయి. పక్కల పచ్చిదర్భలు పరచి ఉన్నవి. ఇప్పుడే సమిధలతో హోమం చేశాను. హుతమయిన పదార్థాల పరిమళమే పాపాలను నశింపజేస్తుంది. ఈ అగ్నులు నిన్ను రక్షించవలెనని కోరుతున్నాను.
ఇంక బయలుదేరు. (చుట్టూచూసి) శార్ఙ్గరవాదులేరీ ?
(ప్రవేశిస్తూ)

శిష్యులు : భగవన్ ! ఇక్కడే ఉన్నాము.

కణ్వ : మీ చెల్లెలికి దారిచూపండి.

శార్ఙ్గ : పూజ్యురాలా ! ఇటు ఇటు.
(అంతా పరిక్రమిస్తారు.)

కణ్వ : ఆశ్రమంలోఉన్న వృక్షములారా ! వినండి.
ఈ శకుంతల మీకు నీళ్ళుపోయకుండా తాను నీరుముట్టేదికాదు. అలంకారాలంటే ఎంత ఇష్టమయినా మీ మీది ప్రేమవల్ల ఒక్క చిగురుకూడా తెంపలేదు. మీకు తొలిపూత పట్టితే ఈమెకు పెద్ద పండగగా ఉండేది-అటువంటి ఈమె ఇప్పుడు అత్తవారింటికి పోతున్నది. సెలవియ్యండి.
(కోయిల కూతను నిర్దేశిస్తూ)
ఈ అడవిలో మనకు దగ్గరి చుట్టాలైన ఈ చెట్లు మధురమైన ఈ కోయిల కూతతో జవాబిస్తూ శకుంతల గమనానికి అనుమతించాయి.

(ఆకాశవాణి)
తామరతంపరతో అందమైన కొలనులుదారి పొడుగునా ఉన్నాయి. ఛాయావృక్షాలు సూర్యకిరణ తాపాన్ని తగ్గిస్తాయి. దారిపొడుగునా తామర పుప్పొడి ధూళితో కలిసి మృదువుగా ఉంది. చల్లనిపిల్లగాలులు వీస్తున్నవి. ఈమె ప్రయాణము భద్రంగానూ సుఖంగానూ జరుగుగాక !

(అంతా ఆశ్చర్యంతో వింటారు)

గౌతమి : బిడ్డా ! మన చుట్టాలవంటి ఈ వనదేవతలు నీ ప్రయాణానికనుమతించారు. వారికి వందనం చెయ్యి.

శకుం : (వందనం చేస్తూ ప్రదక్షిణించి చెలితో) ప్రియంవదా ! భర్తృదర్శనాభిలాష ముమ్మరంగా ఉన్నా ఆశ్రమం వదిలిపోవడానికి కాళ్ళు రావటం లేదే.

ప్రియం : ఆశ్రమ విరహం నిన్నొకతినే బాధించటంలేదు చూడు. కొద్దిసేపట్లో నిన్ను విడవవలసివస్తుందే అని ఆశ్రమం ఎంత చిన్నబోతున్నదో ! నోటిలోని గరిక పరకలు కిందపడిపోతున్నా తెలియకుండా ఆలేడిచూడు ఎట్లా నిలుచుదో ! ఆశ్రమ మయూరాలు నృత్యం మరిచిపోయినట్టున్నవి. లతలు పండుటాకులు రాల్చేమిషతో అశ్రుబిందువులు రాలుస్తున్నాయి.

శకుం : (జ్ఞాపకం తెచ్చుకుంటూ) నాన్నగారూ, నా చెల్లి వనజ్యోత్స్నలత దగ్గర సెలవు తీసుకుంటాను.

కణ్వు : నాకు తెలుసు ఆ లతమీద నీకున్న సోదరీప్రేమ. ఇదిగో, నీ కుడివైపున ఉందది.

శకుం : (లతను సమీపించి) వనజ్యోత్స్నా ! నీవు మావితో కలిసి ఉన్నా నన్ను కొంచెం నీ కొమ్మల చేతులతో కౌగలించుకో. నీకు ఎంతో దూరంగా పోతున్నాను.

కణ్వు : నీ అదృష్టంవల్ల నేను మొదటినుంచీ నీ కోసం ఎంచుకొంటున్న వరుణ్ణి నువ్వు పొందగలిగినావు. ఈ నవమాలిక కూడా మామిడిచెట్టు నాశ్రయించింది. మీ యిద్దరినిగురించీ నాకింక బెంగలేదు. ఇంక బయలుదేరు.

శకుం : (తన చెలికత్తెలతో) చెలులారా ! ఈంతను మీయిద్దరికీ ఒప్పజెబుతున్నాను.

అన. ప్రియం : కాని మమ్ముల నెవరికొప్ప జెబుతున్నావు ? (కళ్ళ నీళ్ళు పెట్టుకుంటారు)

కణ్వు : అనసూయా ! కళ్ళ నీళ్ళు చాలించండి. మీయిద్దరే శకుంతలకు ధైర్యం చెప్పవలసినవారు.

(అంతా పరిక్రమిస్తారు)

శకుం : నాన్నగారూ, గర్భభారంతో నడవలేకుండా ఉన్న ఈ పావురం సుఖంగా ప్రసవించినప్పుడు ఎవరినైనా నాకు ఆసంతోషవార్త చెప్పడానికి పంపిస్తారుకదూ !

కణ్వు : తప్పకుండా.

**శకుం** : (ముందుకు అడుగువెయ్యటంలో అవరోధం నటిస్తూ) ఇదేమిటి నా చీరకొంగు పట్టుకుంటూంది ?

(వెనుకకు తిరుగుతుంది)

కణ్వు : అమ్మా, ఇది నీవు పెంచిన లేడిపిల్ల. శిశువుగా ఉన్నప్పుడు దీని మొహాన దర్భ గుచ్చుకొని పుండైతే గారనూనె రాసి మాన్పి మెల్లిమెల్లిగా చామలు తినిపించి పెంచినావు గదా ! అది నీ అడుగుజాడలను ఎట్లా వదులుతుంది ?

శకుం : వత్సా, స్నేహితులందరినీ వదలిపోతున్న నా వెంట ఎందుకు వస్తున్నావు ? నీ తల్లి నిన్ను కనిపడేసిందేగాని తరవాత నీగతి ఎరగదు. అప్పుడు నిన్న పెంచి నాను. ఇంక నీకు నేను కనపడను. మానాన్నగారు నీ సంగతి చూసుకొంటారులే. వెనకకుపో.

కణ్వు : కన్నీటి ప్రవాహాన్ని కొంచెం అరికట్టుకో అమ్మా ! దారంతా మిట్టపల్లాలుగా ఉంది. సరిగాకనపడక అడుగులు తడబడగలవు.

శార్ఙ్గ : భగవన్! ఆప్తులను పంపటానికి నీటిదాపునరకే వెళ్ళవచ్చునని పెద్దలు చెబుతారు గదా ! కాసార తీరానికి వచ్చినాము. ఇక్కడ మాకు మీసందేశం చెప్పి మీరు వెనకకు వెళ్ళటం మంచిదికదా !

కణ్వు : ఐతే మనం ఆ*పాలచెట్టుకిందికి పోదాం పదండి.

(అంతా అక్కడికి వెళ్ళి నిలుస్తారు)

కణ్వు : (తనలో) సన్మాన్యుడైన దుష్యంత చక్రవర్తికి తగిన సందేశము ఏమి పంపవలె ? (ఆలోచిస్తాడు)

శకుం : (జనాంతికంగా) చెలులారా ! అటుకుడివైపుచూడండి. తామరాకులలో దూరిఉన్న తన భర్తను చూసుకోలేక ఆ చక్రవాకి ఎట్లా ఏడుస్తున్నదో ! వాటికి కేవలం తామరాకులే అడ్డము. అయితే నేను వహించిన నిబ్బరం దుష్కరంగదటే !

అన : చెలీ ! అట్లా అనకు

"(ఆ చక్రవాకి) అది తన ప్రియుడు లేకుండా విరహంతో అంతులేకుండా పెరిగిపోతున్న రాత్రంతా గడపాలి. త్వరలో కలుసుకుంటాననే విశ్వాసం ఉంటే ఎంత దుస్సహ విరహవేదననైనా భరించవచ్చు".

కణ్వు : శార్ఙ్గరవా ! శకుంతలను గురించి నా పక్షాన నీవారాజుతో ఇట్లా చెప్పవలె.

శార్ఙ్గ : ఆజ్ఞాపించండి.

కణ్వు : " మేము తపోధనులమన్న సంగతి గుర్తించి మీ ఉన్నత వంశాన్ని స్మరించుకొని, చుట్టపక్కాల చాటుదైనా ఆనాడు నీమీద శకుంతల ఆ విధంగా కురిపించిన ప్రేమ నెమరుకు తెచ్చుకొని నీవీమెను నీ యితర భార్యలతో ¶ సమానంగా చూసుకో. అంతకంటే ఎక్కువ ఈమె చుట్టపక్కాలు కోరేది కాదు; ఆమె అదృష్టంమీద ఆధారపడి ఉంటుంది."

శార్ఙ్గ : సందేశాన్ని గ్రహించుకున్నాను భగవన్ !

కణ్వు : అమ్మా, ఇప్పుడు నీకు కొంచెం ఉపదేశించవలసి ఉంది. మేము ఎంత అడవుల లోనే ఉంటున్నా లోకవృత్తాన్ని ఎరుగుదుము.

శార్ఙ్గ : మహర్షులకెరుగరానిది ఏమీ ఉండదు

---

* పాల చెట్టంటే మర్రి, రావి, ఇప్పచెట్లలో ఏదైనా కావచ్చును.

¶ ఇక్కడ అభిజ్ఞులు ముందు శకుంతలకు కలిగేస్థితికి అనుకూలంగా రెండురకాల అర్థాలు చెబుతారు. (1) 'ఆమెను ప్రత్యేక శ్రద్ధతో చూడు' అనీ (2) నీ యితర భార్యలతో సమానంగా చూడవద్దు అనీ.

కణ్వు : "అత్తవారింట్లో అడుగుపెట్టినప్పటినుంచీ అత్తమామలను పెద్దలను సేవించవలె. నీ సవతులతో వారి ఆత్మసఖిగా ప్రవర్తించవలె. నీభర్త నీకు ప్రతికూలం చేసినా కోపగించుకొని ఆయన నెదిరించబోకు. సేవకులతో ఉదారంగా వ్యవహరించు సౌభాగ్యానికి పొంగిపోకు ఇట్లా నడచుకొంటే స్త్రీలు గృహరాజ్ఞులవుతారు. ఇంకో విధంగా నడిస్తే ఆ కుటుంబం చెడిపోతుంది." గౌతమి ఏమనుకొంటున్నది ?

గౌత : కొత్తగా కాపురానికి వెళ్ళేటప్పుడు ఇంతకంటే చెప్పదగిందేమీ ఉండదు. తూచా తప్పకుండా మనస్సులో నిలుపుకోతల్లీ !

కణ్వ : వత్సా. నన్ను నీ చెలులనూ కౌగిలించుకో.

శకుం : ఇంతవరకేనా నా చెలులు అనసూయ, ప్రియంవద వచ్చేది ?

కణ్వు : బిడ్డా ! వీళ్ళకుకూడా పెళ్ళి కావలసిఉంది. వీళ్ళక్కడికి రావటం మంచిదికాదు. గౌతమి నీతో వస్తుంది.

శకుం : (తండ్రిని కౌగలించుకొని) మలయంనుంచి పెరికిన చందనపు కొమ్మలాగా మీ ఒడిలోనుండి వేరుపడి అక్కడ ఎలా జీవించగలను ?

కణ్వు : బిడ్డా ! ఎందుకట్లా భయపడుతున్నావు !

''గొప్ప వంశంలో పుట్టిన నీ భర్తకు గృహరాజ్ఞివై ప్రతిష్ఠపొందుతూ, ప్రతి నిమిషమూ రకరకాల విధులలో మునిగితేలుతూ, ఐశ్వర్యంతోతులతూగుతూ అచిరకాలంలోనే ఉదయపర్వతం సూర్యునికన్నట్టు కుమారుని ప్రసవించి పెంచుతూ ఉన్నప్పుడు మా విరహాన్ని గురించి నీకు ఆలోచనే రాదుతల్లీ!"

(శకుంతల తండ్రికి నమస్కరిస్తుంది)

కణ్వు : నేను నీ కోసం ఏది కోరుకుంటే అది నీకు లభించవలె.

శకుం : (చెలికత్తెలను సమీపించి) ఇద్దరు ఒక్కసారిగా నన్ను బిగ్గిత కౌగిలించుకోండి.

అన. ప్రియం : (అట్లాగేచేసి) సఖీ ! ఆరాజు తొందరగా నిన్ను గుర్తించకపోతే-ఆయన పేరుంది చూడు-ఆ ఉంగరం చూపించు.

శకుం : సఖులారా ! మీరు సూచించిన ఈ భయం నన్ను కలత పెడుతూందర్రా !

అన. ప్రియం : ఏమీ భయం లేదు. ప్రేమ ఎక్కువయినకొద్దీ ఏవేవో కష్టాలనే ఊహించు కోటం సహజమేగదా !

శార్ఙ : (శకుంతలతో) అప్పుడే సూర్యుడు నాలుగు బారలు పైకెక్కినాడు. ఇకత్వరపడ వలె.

శకుం : (ఆశ్రమం వంక తిరిగి) నాన్నగారూ ! ఈ ఆశ్రమాన్ని మళ్ళీ ఎప్పుడు చూడగలనో గదా !

కణ్వు : వినుతల్లీ !

"చతుస్సముద్రముద్రితమైన ధరావలయానికి సమ్రాజ్ఞివై దుష్యంతుని వల్ల నీకు కలిగిన కుమారుని ఏకరాట్టుగా ప్రతిష్ఠించి సర్వకుటుంబభారమూ పుత్రునికి అప్ప గించిన భర్తతో కలిసి శాంతి రాజ్యమయిన ఈ ఆశ్రమంలో కాలు పెడతావు.''

గౌత : బిడ్డా ! ప్రయాణానికి కాలాతీతమవుతున్నది. మీ నాన్నగారిని వెనకకు మళ్ళనీ (కణ్వునితో) ఇంక ఎంత సేపయినా అమ్మాయి యిట్లా మాట్లాడుతూనే ఉంటుని లెండి. ఇంక మీరే కొంచెం ధైర్యం చెయ్యవలె.

కణ్వు : తపోఽనుష్ఠానాలు ఆగిపోతున్నాయి తల్లీ!

శకుం : (తండ్రిని మళ్ళీ కౌగిలించుకొని) ఇంతవరకూ తపస్సుచేతనే కృశించిపోయిన నాన్నగారి శరీరము నామూలంగాగూడా ఇంకా బడలిపోతుంది గదా!

కణ్వు : (నిట్టూరుస్తూ) "అదుగో! నాకుటీరం ముందు నీవు బలి పెడుతూ వచ్చిన నీవార ధాన్యం మొలిచి నిలిచి ఉంది. రోజూ ఆ మొక్కలు నాకంటపడకుండా ఎట్లా ఉంటాయి వాటిని చూస్తూగూడా నిన్ను వదలిపెట్టిన దుఃఖం మరచిపోగలనా తల్లీ!" వెళ్ళమ్మా. ప్రయాణం సుఖంగా కొనసాగుగాక !
(శకుంతల, ఆమెతో ప్రయాణించేవారు వెళతారు)

అన ప్రి. : (శకుంతల వెళ్ళిన వంక చూస్తూ) అయ్యో అయ్యో! శకుంతల ఆ అడవి చెట్ల పొదల నడుమ కనుమరుగై పోయింది.

కణ్వు : (నిట్టూరుస్తూ) అనసూయా! మీ స్నేహితురాలు వెళ్ళిపోయింది. మీ దుఃఖాన్ని ఆపుకొంటూ నాతోరండి, నేను వెళుతున్నాను.

అన,ప్రి. : తండ్రీ! శకుంతల లేకపోవటంచేత శూన్యంగా ఉన్నట్టున్న ఆ తపోవనం ఎట్లా ప్రవేశించగలము ?

కణ్వు : అవును, స్నేహంవల్ల అట్లాగే అనిపిస్తుంది. (పరిక్రమించి విమర్శతో) అహా! శకుంతలను అత్తవారింటికి పంపటంవల్ల నా హృదయమిప్పుడు తేలికపడింది. "ఆడపిల్ల పరునిసొత్తు. శకుంతలను భర్త దగ్గరికి పంపించి నందువల్ల ఒకరు దాచబెట్టిన సొమ్ము వారికిచ్చివేసినప్పటిలాగా నామనస్సు నిర్మలమైంది."

## కాళిదాసు కావ్యాలు, నాటకాలు

రఘువంశము

I 5-9 : నా వాక్కు అల్పమయినది. అయినా ప్రసిద్ధులైన రఘురాజులవంశాన్ని గురించిన ప్రబంధం చెబుతాను. ఆ రాజులగుణాలు నా చెవిని ఇల్లు కట్టుకొని నన్ను ఇటువంటి చాపల్యానికి ప్రోత్సహించినవి. రఘువంశీయులైన రాజులు పుట్టినప్పటినుంచీ పరిశుద్ధులు. ఫలంపొందనిదే ఏ పనినీ వారు నడుమవదలిపెట్టరు. వారి అధికారం నలువంకలా సముద్రాలవరకూ వ్యాపించింది. వారి రథాలు స్వర్గానికి కూడా వెళ్ళినవి. శాస్త్రాలు చెప్పిన దానికి తూచా తప్పకుండా అగ్నులను ఉపాసించినారు. యాచకులు ఏదికోరినా ఇచ్చివేసినారు. అపరాధాలకు తగిన దండన విధించినారు. తగిన సమయంలోనే మేల్కొనేవారు. త్యాగంకోసమే ధనం సంపాదించినారు. ఎక్కడపొల్లు మాట వస్తుందో అని మితంగా మాట్లాడేవారు. యశస్సుకోసమే విజయం కోరుకొనేవారు. సంతానంకోసమే వివాహం చేసుకొనేవారు. వారు చిన్నతనం చదువులో గడిపేవారు. యౌవనంలో విషయసుఖాలు కోరేవారు. ముసలితనం రాగానే మునివృత్తి వహించినారు. చివరికి యోగమార్గాన శరీరం వదలివేసినారు.

I-12,15,18,19,20-5,28 : పవిత్రమైన ఆ మనువువంశంలో క్షీరసముద్రంలో చంద్రునివలె దిలీపుడనే రాజచంద్రుడు జనించినాడు. ఆయన ఇతరులందరికంటే విశుద్ధుడు. అతనిప్రజ్ఞ అతని ఆకారానికి తగినది. అతనివిద్య ప్రజ్ఞకు తగినది. విద్యకు తగినది అతనికృషి. కృషికి తగినఫలము అతడు పొందినాడు.

ప్రజల అభివృద్ధికోసమే అతడు వారినుండి పన్నులు తీసుకొన్నాడు. వెయ్యిరెట్లు వర్షించటానికేగదా సూర్యుడు జలాన్ని గ్రహించటం ?

సైన్యం అతనికి అలంకారప్రాయంగా మాత్రమే ఉండేది. శాస్త్రాలలో నిశితంగా ప్రసరించేబుద్ధి, వింటసంధించిన అల్లెత్రాడు, రెండే అతని ప్రయోజనాలను సాధించేవి.

అతని మంత్రంనిగూఢంగా ఉంటుంది. అతని ఆకారంవల్లగానీ ఇంగితంవల్లగానీ ఏమీ బోధపడదు. ఇప్పటి జన్మలో అనుభవించే ఫలాలనుబట్టి పూర్వజన్మసంస్కారాలను ఊహిస్తుంటారు. అట్లానే కలుగుతున్న ఫలితాలనుబట్టి ఆయన ఇటువంటి సామాన్యపాయ ప్రయోగాలుచేసి ఉండవచ్చునని ఊహించదగి ఉంటుంది.

అతడు వెరపులేక తన్ను రక్షించుకొనేవాడు. రోగాదులు లేకుండానే ధర్మమాచరించేవాడు. పేరాసలేకుండా ధనం సంపాదించేవాడు సక్తుడు కాకుండానే సుఖమనుభవించేవాడు.

జ్ఞానమునందు మౌనము, శక్తియందు క్షమాగుణము, త్యాగమునందు గర్వరాహిత్యమూ ఆయన లక్షణాలు. అన్యోన్య విరుద్ధములైన సద్గుణాలు ఆయనయందు సహవాసం చేస్తూ తోబుట్టువులవలె పొంది పొసగిఉంటాయి.

అతనిని విషయసుఖాలు ఆకర్షించలేదు. చదువులలో సారమంతా అవగతం చేసుకొన్నాడు. ధర్మరతుడైన అతడు ముసలితనముపైన బడకుండానే వృద్ధుడుగా పరిగణింపబడ్డాడు.

ప్రజలకు తగిన శిక్షణమియ్యటంవల్లనూ వారిని రక్షించటంవల్లనూ పోషించటంవల్లనూ వారికి ఆ దిలీపుడే తండ్రి అయినాడు. వారి తల్లిదండ్రులు వారికి జన్మమాత్రమే ఇచ్చినారు.

లోక స్థితికోసం దండించదగిన వారిని మాత్రమే దండిస్తూ, సంతానంకోసం మాత్రమే వివాహం చేసుకున్నవాడు కావటంవల్ల బుద్ధిమంతుడైన అతడు అర్థకామాలవల్ల ధర్మాన్నే సంపాదించినాడు.

రోగార్తునికి ఔషధంవలె ధర్మవర్తనుడైన శిష్టుడు ద్వేష్యుడైనా అతనికి సమ్మతుడే. పాము కరచినవేలు మాదిరి దుష్టుడయినవాడు ప్రియుడైనా అతనికి త్యాజ్యుడే.

అతనిని బ్రహ్మదేవుడు మహాభూతాలన్నీ కలిపి సృష్టించి ఉండవచ్చు. అందువల్లనే కాబోలు ! అతని గుణాలన్నీ ఇతరులకోసమే ఫలించేవిగా రూపొందినవి.

III_67 : తన ప్రియురాలైన రాణి ఇందుమతి మరణించినప్పుడు అజుని విలాపము: నాకు గృహిణివి, మంత్రివి, అంతరంగిక మిత్రానివి. లలితకళలలో నచ్చిన శిష్యురాలివి, అయిన నిన్ను హరించిన కృపారహితమైన ఆ మృత్యువు నాది ఏమి హరించలేదో చెప్పు.

III_88 : మూఢమతి అయినవాడు ప్రియనాశనాన్ని హృదయశల్యంగా భావిస్తాడు. అదే సందర్భంలో స్థిత ప్రజ్ఞుడు హృదయ శల్యంపోయిందనుకుంటాడు. మరి అది మోక్షద్వారంగదా !

మలినంగా ఉన్నా అది చంద్రుడికి అందమే ఇస్తున్నది. ఈ సుందరి నార చీర కట్టుకొన్నా ఎంతో మనోజ్ఞంగా ఉంది. మధురమైన ఆకృతులకు ఏది అలంకారం కాదు?

I-19. సజ్జనులకు సందేహం వచ్చినప్పుడు తమ అంతఃకరణ ప్రవృత్తులే ప్రమాణము.

III-8/9. మిత్రులతో కలిసి పంచుకొంటే దుఃఖవేదన సహించదగినది అవుతుంది.

15/16. నీవు చెప్పవలెననుకొన్నది చెప్పిఉండకపోతే పశ్చాత్తాపమే మిగిలేది.

IV-ప్రేమ ఎక్కువయిన కొద్దీ ఏవేవో కష్టాలనే ఊహించు కోటం సహజమేగదా'

V-2. రమ్యములైన వస్తువులను చూసీ, మధురములైన పలుకులను వినీ సుఖంగా ఉన్న ప్రాణికూడా ఒకప్పుడు చాలా ఉత్సుకత్వం పొందుతుంది. మనస్సులో లీలగా ఏదో మెదులుతుంది. పూర్వజన్మలలో పొందిన స్నేహానుబంధాలు భావంలో పాతుకొని పోయిఉంటాయి.

V-12. పండ్లు పుట్టుకొని వచ్చినకొద్దీ చెట్లు వంగిపోతూంటాయి. కొత్తనీరు తాగిన మబ్బులుబాగా వేళ్ళాడతాయి. ఐశ్వర్యం పెరిగినకొద్దీ సజ్జనులు వినయవంతులవుతారు. పరోపకారులయినవారి స్వభావం ఇటువంటిది గదా !

II-25. ఏరోజు కారోజు తాను ఏమేమి పొరపాట్లు చేస్తున్నాడో తెలుసుకోవటమే కష్టము. ప్రజలలో ఎవడు ఏదారిన పోతున్నాడో తెలుసుకోగల శక్తిఉంటుందా?

VII-17. సహజంగా నవ్వుతున్న ఈ పిల్లవాని పళ్ళు మొగ్గల లాగా కనపడుతున్నవి, ఇతడు పలుకుతున్న తొక్కుపలుక్కులు ఎంతో ఇంపుగా ఉన్నవి. ఇటువంటి బిడ్డలు ఒళ్లో ఎగబాకుతూంటే వీళ్ళను ఎత్తుకొని తమవస్త్రాలను మలినం చేసుకొనే వాళ్ళు ఎంత ధన్యులు !

## శూద్రకుని నాటకము - మృచ్ఛకటిక

I-8. కొడుకులు లేని యిల్లు శూన్యము. అట్లాగే మంచి స్నేహితుడు కరువయిన వానికి ఇల్లు ఎప్పుడు శూన్యంగానే ఉన్నట్లనిపిస్తుంది. మూర్ఖునికి సకలదిశలూ శూన్యంగానే కనిపిస్తాయి. ఇంక పేదవానికి విశ్వమంతా శూన్యమే.

I-10. అంధకారంలో దీపంలాగా చిర కష్టానుభవంలో సుఖం రాణిస్తుంది. సుఖాలను భవిస్తూ దారిద్ర్యంలోకి దిగజారినవాడు చనిపోయినట్లే. శరీరాన్ని అంటిపెట్టుకొని ఉండటం వల్లనే వాడు బతికున్నట్టు కనబడతాడు.

I-43. పేదవాడైనంత మాత్రాన ఒకనికి అగౌరవం కలగదు. భగవంతుని దృష్టిలో పేద, గొప్ప అనే భేదం ఏమీలేదు. శీలం లేనివాడు ధనవంతుడైనా పేదవాడే.

II-15. సజ్జనునికి ఐశ్వర్యం గౌరవమే. వస్తూపోతూఉండే రెండవరకపు ఐశ్వర్యం ఎంతమందికి లేదు ? ఇతరులను గౌరవించడం ఎరగని వారికి గౌరవమంటే ఏమి తెలుస్తుంది ?

VI-8 : తనపంచన జేరిన వానిని ఎవడు వదిలిపెడతాడో వానిని విజయం విడిచిపెడుతుంది. స్నేహితులూ చుట్టపక్కాలూ వదలిపోతారు. వాడు శాశ్వతంగా తిరస్కారానికి పాలవుతాడు.

VIII-24 : దశదిశలూ నన్ను చూస్తున్నవి. వనదేవతలు కూడా చూస్తున్నారు.

అట్లాగే చంద్రుడూ ఉజ్జ్వలుడైన సూర్యుడూ చూస్తున్నారు. ధర్మము, వాయువు, ఆకాశము. నా అంతఃకరణము, పృధివి-ఇవన్నీ మానవుడు చేసే మంచికీ చెడ్డకూ సాక్షులు.

VIII-29, IX-7, వంశాన్ని ఎందుకెత్తుతారు ? నిజానికి గుణమే ప్రధానము. సుక్షేత్రంలో ముళ్ళచెట్లు కూడా స్వేచ్ఛగా పెరుగుతాయి.

43. ఓరిమిని మించిన మిత్రము లేదు. భవిష్యత్తులో క్షేమానికి అది సహాయకము. తాను చేసిన శ్రమకు అపార సత్ఫలితాలను ఇస్తుంది. తప్పిపోని శత్రు సంహార ప్రక్రియ అది.

X-59 : అదృష్టం మోటచక్రం మాదిరి పనిచేస్తుంది. దానికి కట్టిన బొక్కెనలు లోకంలో వ మనుష్యులు. ఆదికొంత మందిని వట్టిపోయేటట్టు చేస్తుంది. కొంతమందిని నిండుగా లాగుతుంది. కొంతమందిని పైకి గుంజుతుంది. కొంతమందిని పాతాళంలో వదలుతుంది కొంతమందిని ఈడుస్తూ వారికి బాధకలిగిస్తుంది. ఇట్లా ద్వంద్వాలతో నిండిఉన్న ప్రపంచం తరహాను చూపిస్తుంది.

## భారవికావ్యము - కిరాతార్జునీయము

I-4 : ఒకే విధంగా పథ్యములూ, ఆహ్లాదకరాలూ అయిన మాటలు దుర్లభాలు

I-30 : తొందరపడి ఏపనీ చేయకూడదు. అవివేకం వల్ల గొప్ప ఆపదలు వస్తాయి. మనుష్యులలోని గుణాలు సంపదలను ఆకర్షిస్తాయి. విమర్శించుకొని పనిచేసే వారిని సంపదలు తమంతతామే వరిస్తాయి.

VII-15 : అల్పదోషం చేత బహు సుకృతం కొట్టుపడదు.

VIII-37 : గుణాలు ప్రేమను బట్టి భాసిస్తాయి. వస్తువు నాశ్రయించిఉండవు.

XI-11 : లోకంలో సౌందర్యం సులభమేకాని గుణార్జనం మాత్రం చాలాకష్టము.

XI-27,28 : ప్రియురాలితో కూడి ఉన్నప్పుడు అరణ్యాలైనా జనంతో కిక్కిరిసి ఉన్నట్టుంటాయి; ఆపద వచ్చినా పండగలాగే ఉంటుంది; నష్టంకూడా లాభంలాగానే కనబడుతుంది. ప్రియా విరహితుడైనప్పుడు రమ్యప్రదేశాలు అరణ్యాలు లాగానూ ప్రియములైన ప్రాణాలు దుర్భరంగానూ కనపడుతాయి. చుట్టపక్కాల నడుమఉన్నా ఒంటరిగానే ఉన్నట్టుంటుంది.

XI-72,73 : పుట్టుకవల్ల వచ్చిన పురుష శబ్దంతో పనిలేదు. గుణగ్రాహులైన వారు ఎవనిని ప్రశంసిస్తారో, అద్భుతపడుతూ పేర్కొంటారో ఎవనితేజస్సు పరుల ఓజస్సులను మింగేస్తున్నట్టుంటుందో, ఎవనిని సభలలో నలుగురూ గౌరవంగా పేర్కొంటారో, శత్రువులు కూడా ఎవనిని ప్రశంసిస్తారో అటువంటి పురుషుడే మనుష్య నామమున కర్హుడు.

## మాఘుని శిశుపాల వధ

I-73. పతివ్రత భర్తను అనుసరించినట్టు, నిశ్చలమైన స్వభావము ముందుజన్మలలో గూడా పురుషుని విడువదు.

II-22. అర్థమైన క్రియయే సదుత్తరము.

II-27 వాగ్మి అయినా అనుభవం లేనివాని మాట వృధా

III-31. అనల్పమయిన ప్రీతివల్ల బాగా తెలిసిన వస్తువయినా సరికొత్తదిగా కనిపిస్తుంది.

IV-7. చూసినకొద్దీ అనుక్షణం కొత్తదనం ఉట్టిపడే దాన్నే అందమంటారు.

V-44. కాలమే శక్తినీ ఆశక్తినీ నిరూపిస్తుంది.

VIII-10. తనకు ప్రత్యేకతను కోరేవాడు ఔచిత్యం పట్టించుకోడు.

IX-12. గుణవిహీనుడికి దోషరాహిత్యమే గుణము

## భవభూతి - నాటకాలు

**మహావీర చరితము.**

V-59. మిత్రుని మేలుకోసం ప్రాణాలైనా ఇయ్యటం, ద్రోహంతల పెట్టక పోవటం, దేనికీ ఏ మిషనూ చెప్పక పోవడం, ఇతరులు తనకేవిచేస్తే హితమనిపిస్తుందో ఆవే మిత్రునికి చెయ్యటమూ - ఈ నడవడినే మైత్రీ మహావ్రతమంటారు.

**మాలతీ మాధవము.**

I-8. ఎవరు మమ్ముల నిక్కడ అవజ్ఞచేస్తున్నారో వారికి తెలిసింది కొంచెమే. మా ఈ కృషి వారికోసంకాదు. మాతో సమాన ధర్మం కలవాడెవడో పుడతాడు. కాలం అనంతము. పృథివి విశాలము.

I-17. బైటికి అన్నివిధాలా మంచిగా ఉన్నట్టు కనబడుతూ ఇతరులు తన్ను గుర్తించటానికనువైన మరీ సన్నటి ఛిద్రాలను గూడా మూసివేస్తాడు. విద్వాంసు డొక్కడు అనేకమందిలో ప్రవేశించి అందరినీ కపటోపాయాలతో లోబరుచుకొని తటస్థునిలాగా కన పడుతూ తన పనులన్నీ చక్కబరుచుకొని మాట్లాడకుండా పోతాడు.

I-27. అది ప్రీతి అనీ దానికిది కారణమనీ చెబితే అది స్వవచనవ్యాఘాతమవుతుంది. వస్తువులను ఆంతర్గతమైన హేతు వేదోకలుపుతుంది. ప్రీతి అనేది బయటికారణాల నాశ్రయించదు. సూర్యుడు ఉదయించగానే తెల్లతామర వికసిస్తుంది. చంద్రుడు పొడవ గానే చంద్రకాంతపురాయి ద్రవిస్తుంది.

II-2/8. ఇతరేతరానురాగం వల్ల వివాహంమంగళతమమవుతుంది. ప్రియుని మనస్సునూ నయనాలనూ ఆకట్టుకొన్న మహిళకు సౌభాగ్యం దాస్యంచేస్తుంది.

III-11. శాస్త్రాలు బాగా చదివిఉండటం, సహజమైన తెలివి తేటలు, ప్రాగల్భ్యము, అభ్యాసంచేత మెరుగులు తీరిన వాక్కు, సమయస్ఫూర్తి, నవీనమైన ప్రతిభ-ఈ గుణాలు క్రియాకాలంలో కామధేనువులు.

## ఉత్తర రామచరిత్ర

1-5. ఒకడు ఎట్లాపడితే అట్లా మాట్లాడవచ్చు. లోకంలో విమర్శకు గురికానిదేముంది? ఆడవాళ్ళ విషయంలోలాగే వాక్కుల విషయంలోనూ జనం ఆడిపోసుకుంటూనే ఉంటారు.

I-39. అన్ని సందర్భాలలోనూ సుఖంలోనూ దుఃఖములోనూ ఏకరూపంగా అనుసరిస్తుంది. దానితో హృదయం విశ్రమిస్తుంది. ముసలితనం దాని రసాన్ని తగ్గించ

లేదు. కాలం గడిచేకొద్దీ ఆవరణం తొలగిపోయి అందులో ప్రేమసారం నిలుస్తుంది. అటువంటిది దాంపత్యము. ఏవిధంచేతనయినా అది భద్రంగా ఉండవలెనని ఈ ఒక్కటే కోరుకుంటారు.

I_41. ఏపని చేసిఅయినా లోకానికి తృప్తికలిగించటమే మంచివాళ్ళకు వ్రతము.

II_2. అంతటా ప్రియంతో నిండిన నడవడి, వినయంచేత మృదువై హద్దుమీరని వాక్కు, స్వభావంచేతనే మేలుకోరే బుద్ధి, మచ్చలేని పరిచయము, ముందుగానీ వెనకగానీ తారుమారుకాని ఆనందము-మంచివాళ్ళ ప్రవర్తనలో రహస్యమిది. ఇందులో మిషకు తావు లేదు. ఇది ఎప్పుడూ విశుద్ధంగానే ప్రకాశిస్తుంది.

II_4. ప్రాజ్ఞునికెట్లాగో జడునికికూడా అట్లాగే విద్య నేర్పుతాడు గురువు. వాళ్ళ తెలివిని పెంచటంగానీ తగ్గించటంగానీ ఆయన చెయ్యడు. అయితే ఫలంలో చాలా తేడా కనపడుతుంది. ఎట్లాగంటే-స్వచ్ఛమైన మణిలో కనబడ్డమాదిరి బింబం మట్టిముద్దలో కనపడదు గదా !

II_19. ప్రియుడైనవాడు ఏమీ చేయకుండా సౌఖ్యాలచేత దుఃఖాలను పోగొడతాడు. అటువంటి ప్రియుడు అతనికి విశిష్టమైన ద్రవ్యంవంటివాడు.

III.17 దంపతుల హృదయాలను ప్రేమతో బంధించే ఆనంద గ్రంథినే పుత్రుడంటారు.

III_29. వరదనీరు ఒడ్డొరసినప్పుడు అలుగు వదలటమే మందు. హృదయం శోకంతో నిండినప్పుడు గట్టిగా ఏడిస్తే అది పగిలిపోకుండా ఉంటుంది.

IV_11. గుణాలతో నిండి ఉన్నప్పుడు స్త్రీయా పురుషుడా అనే ప్రశ్న లేదు. ఆ గుణాలే పూజించదగినవి.

V_12. కారణాన్ని పురస్కరించుకొనకుండా కలిగిన పక్షపాతానికి విఘాతం కలగదు. స్నేహమనే దారము లోపలి మర్మాలను కలిపి కుడుతుంది.

V_29_30 పిచ్చివాడూ గర్వితుడూ పలికే మాటలను ఋషులు రాక్షస వాక్కు అంటారు. అది అన్ని విరోధాలకూ మూలమూ, లోకానికి అనిష్టమూ. శుద్ధమూ శాంతమూ సత్యమూ అయిన వాక్కును ధీరులు గోవుతో పోలుస్తారు. దానివల్ల కోరికలన్నీ తీరతాయి. దారిద్ర్యం తొలగిపోతుంది. కీర్తి కలుగుతుంది. అది చెడు మనస్సుగల వారిని తొలగిస్తుంది. తల్లిలాగా మంగళం కలిగిస్తుంది.

## సుబంధువు వచనకావ్యము-వాసవదత్త

అతి దుష్టకార్యం చేయవలసినప్పుడు దుష్టుల మనస్సు శక్తిమంత మవుతుంది. చీకటిలోనే కదా గుడ్లగూబ చూడగలుగుతుంది.

మనుష్యులు అంశస్వరూపులయినా సత్యమైన తమ స్వభావం పరునిద్వారానే తెలుసుకోగలరు. కళ్ళు తమ శక్తిని చూసుకోగలిగేది అద్దంలోనేగదా!

## హర్షభూపతి నాటకము-నాగానందము

IV_7 భూమిమీద పడగానే అనిత్యత దాదివలె ఒళ్ళోకి తీసుకొంటుంది. తరవాతనే తల్లి కౌగిలించుకొన్నేది. అట్లాంటప్పుడు శోకానికింక వర్తసా వాపీ ఏమిటి?

IV-10. ఎంతో దయగలవారై ఆర్థుల కోర్కెను వమ్ము చేయనివారు, కారుణ్యం వల్ల పరార్థంకోసం స్వార్థాన్ని లెక్కచేయనివారు, ఎప్పుడూ పరుల దుఃఖాలకు మనస్సులో కుమిలిపోతూ ఉండేవారూ ఆ మహాత్ములు నేడు లేరు. ఎవరి ముందర ఏడుస్తావు తల్లీ! బాష్పవేగాన్ని ఆపుకో.

## మహేంద్ర విక్రమపల్లవుని ప్రహసనము

భగవదజ్జుకీయము-శ్లో. II

ఇంతవరకు ప్రపంచంలో లభించని వాటిని కోరుకొంటూ, జరిగిపోయిన వాటిని గురించి విచారిస్తూ, వర్తమానంలో దొరుకుతున్నవాటితో తృప్తిపడకుండా ఉండేవాడికి సుఖం లేదు.

## మురారి నాటకము-అనర్ఘరాఘవము

X-4 న్యాయంగా నడుచుకొనేవాడికి జంతువులు కూడా సాయంచేస్తాయి. పెడదారి పట్టిన వానిని తోడబుట్టినవాడైనా వదలిపెడతాడు.
(ఇక్కడ ఉదాహరణకి మొదటిదానికి రాముడు, వానరులూ రెండోదానికి రావణుడు, విభీషణుడు)

VI. అతి దుఃఖం కలవాడు దుఃఖం లేనివాడనే లోకోక్తి సత్యమే.

అనేకమంది క్షుద్రులు కలిసి ఒక గొప్పవానిని తేలికగా పడగొట్టగలరు.

## విశాఖదత్తుని నాటకము-ముద్రారాక్షసము

III-14 రాజంటే భయపడవలె, మంత్రిని చూస్తే గడగడలాడవలె. రాజుగారికి ప్రీతిపాత్రులైనవారికి వణకవలె. ఇంక రాజభవనంలో తిని తిరిగే విటులకు మరీ భయపడవలె. తలయెత్తుకొని చూస్తూ నమ్రతతో మాట్లాడుతూ దైన్యంవల్ల పొట్టకోసం తిప్పలు పడుతూ ఎంతచేసినా లాఘవమే కలిగించే ఈ సేవను బుద్ధిమంతులు శ్వవృత్తిగా పరిగణిస్తారు.

III-16 ఎప్పుడూ అబద్ధమాడనివారైనా లోభంవల్ల ప్రగల్భవాక్కులైన పురుషులు లేని గుణాలను కల్పించి రాజులను పొగడుతుంటారు. అదంతా తృష్ణస్వభావమే అని చెప్పవచ్చు. ఏ కోరికాలేని వారు రాజులను గడ్డిపోచలలాగా చూస్తాడుగదా!

V-8. రాజనీతి ప్రయోజనాన్నిబట్టి మిత్రులను శత్రువులుగానూ, శత్రువులను మిత్రులుగానూ చేస్తుంది. అది బ్రతికుండగానే పూర్వవృత్తమెరగని కొత్తజన్మ తెచ్చిపెడుతుంది.

## రాజశేఖరుని నాటకాలు

బాలరామాయణము

I ప్రస్తావన: ఒక్కొక్కనికి ఒక్కొక్క విషయంలో ఎక్కువ నేర్పు ఉంటుంది. ప్రతివానికీ ప్రతి విషయమూ తెలియదు.

II-51. లోకోత్తర చరిత్రంవల్ల మానవుడు ఉదాత్తుడవుతుతాకాని కులంవల్ల కాదు.

IV-47-48. మధురమైన స్వభావముంటే మానవుడు ఎవరినైనా ఏవిధంచేత్త

నైనా సంతోషపెట్టగలడు.

VII-16. శోకశంకువు హృదయంలో పాతుకొనిపోయి ఉన్నా యథోచితంగా తమ కార్యక్రమం నిర్వహించుకోటం మహాత్ములలో వారి గాంభీర్యానికి తగిన ఒక విశిష్టత.

XI-21, 22 పురుషుని ఉదాత్తుని చేసేది పరిణతి పొందిన మనస్సు. వయస్సు కాదు.

సిద్ధసాలభంజిక

III-5. మల్లెచెండు నలిగిడికి ఓర్వదు. కొత్తప్రేమ అంతరాయం సహించదు, పొగడదండ అయితే వాడినా వదలవలసిరాదు

## త్రివిక్రముని దమయంతి కథ

II-14-16. సాయం చెయ్యటం, ఆహ్లాదకరంగా మాట్లాడటం- విశుద్ధమైన స్నేహం చూపటం. మంచివాళ్ళ స్వభావము. చంద్రుని చల్లగా ఉండేటట్టు చేసేదెవరు? మనస్సు ఎట్లాంటిదో మాటలట్లాంటివి. మాటలెటువంటివో చేతలటువంటివి. మంచివాళ్ళ మనో-వాక్-కర్మలు ఏకరూపంగానే ఉంటాయి. విత్తంతోపాటు వివేకం, విద్యతోపాటు వినయము, ప్రాభవంతోపాటు నమ్రత-ఇవీ గొప్పవాళ్ళ లక్షణాలు.

## మహిమభట్టు వ్యక్తివివేకము (కావ్యశాస్త్రము)

ప్రవేశకశ్లోకము : నాతో సమానులయిన వారికోసం చేస్తున్న ఈ పరిశ్రమ తగినదే. అందరినీ సంతోషపెట్టగలది లోకంలో ఏదీలేదు. ప్రపంచాన్ని వెలిగించే సూర్యుడు ఉదయిస్తే కొన్ని వస్తువులు మండిపోతాయి. మరికొన్ని పుష్పిస్తాయి. ఇంకా కొన్ని మూతి ముడుస్తాయి.

## అభినందుని రామచరితమనే కావ్యంలో

XII-6. చేతగానివాడికి ప్రపంచమంతా మండిపోతున్నట్లు ఉంటుంది. చేతనయిన వాడికి ఎక్కడ ఉన్నా మనశ్శాంతికి కొరతె ఉండదు. ఒక మహావృషభం ఎదుట నిలిచి కుక్క వికారంగా మొరుగుతుందంటే దానికి కారణము పట్టరాని భయమే.

## కృష్ణమిశ్రుని నాటకము-ప్రబోధచంద్రోదయము

V-25. అనుకోకుండా అప్పటికప్పుడు మీదబడి మర్మాలను ఛేదించే గాథ శోకాల దెబ్బలకు మంచి మందు వాటినిగురించి ఆలోచించకపోవటమే.

## శ్రీహర్షుని నైషధీయ చరితము

VIII-32. అద్భుత గుణాలరాశి అయిన వస్తువును చూస్తూ వాక్ శక్తి ఉండి కూడా మౌనంగా ఉండవలసివస్తే అంతకన్నా సహించరాని బాధ ఏముంటుంది?

IX-8. మంచి వాక్కుకు పదాడంబరమూ, అర్థలాఘవమూ రెండూ విషాలు. తక్కువ మాటలలో సారగర్భంగా చెప్పగలవాడే వాగ్మి అనిపించుకుంటాడు.

IX-36. మంచిపనిచేస్తే బాధకలిగే విపత్కరపరిస్థితిలో నిషిద్ధకర్మమైనా శ్రేయవల్లసిందే. వాసనీటితో రాజమార్గము జారుడుగాఉంటే ఒకప్పుడు పండితులైనా పక్క

దారినే పోతారు.

125. లోకుల మాతులు మియ్యటానికెవనికి శక్యము ?

X-13. కామము జాతినీ విత్తాన్నీ గుణాన్నీ గణించదు. ఆవ్యక్తబుద్ధి ఎప్పుడూ అందం వెంటనే పడుతుంది.

19. ప్రకృతిసిద్ధమైన వస్తువువేరు ? కృత్రిమవస్తువువేరు.

43. పురుషునికి ఒకగుణంలో వంక పెట్టటానికి వీలులేకపోయినా మరోదానిలో ఒకదోషం వెతకటం ఖలత్వానికి లక్షణము.

XIV-9. దేవతలు ఇంకేమీ ఇయ్యరు. వారికి అనుగ్రహంవస్తే మంచి బుద్ధినిస్తారు.

83. ఏ ఇతర భూతాలూ నీళ్లు నడపినంతగా లోకయాత్ర నడపటంలేదు.

87. కోరకుండా వచ్చే అర్థం ఎంత అల్పమైనా దానిని ధీరులు కాలదన్నుకోరాదు.

## జయదేవుని నాటకము ప్రసన్న రాఘవము

II-2. కుతూహలం కలిగించేవార్త, మంచివిద్య, కస్తూరినుంచివచ్చే లోకోత్తర పరిమళమూ ఈ మూడూ నీటిమీద తైలబిందువులాగా స్వయంగానే ప్రపంచంలో వ్యాపిస్తాయి. వాటిని వ్యాపించకుండా ఆపటం ఎవరి తరము ?

V-49. సామాన్యంగా దుష్టుల సంపదలు ఏదో దుఃఖంతంతో ముగుస్తాయి. మహాత్ముల ఆపదలు సుఖోదర్కాలుగా ఉంటాయి.

## వేదాంత దేశికుల నాటకము-సంకల్ప సూర్యోదయము

I-64. జనులకు పరులలో లేని దోషాలు కనపడినట్టు ఉన్నగుణాలు కనపడవు. తమ విషయంలో మాత్రం దృష్టి ఇందుకు విపరీతంగా ఉంటుంది. ఇదంతా మోహమనే కాటుక మహిమగదా !

II-31. అప్పటికి కొత్తగా ఉండేది కాలాంతరంలో పాతదవుతుంది. వాటిలో ఒకటి మంచి ఒకటి చెడ్డ అనరాదు.

V-34. భయకారణాలను తెలిపే గ్రంథాలు చదువుతూనే ఉంటాడు—మాటిమాటికీ నిద్రపోతూనే ఉంటాడు. ఆత్మసాక్షాత్కారం పొందుతాడు-శరీరం పోషణలో నిమగ్నుడౌతూనే ఉంటాడు. దుఃఖసముద్రంలోనుంచి బయటపడాలనుకుంటాడు-సుఖంకావాలనుకుంటూనే ఉంటాడు. మనుష్యుడు ఇట్లా ద్విధావృత్తితో దుఃఖపడుతూ డోలాయమానుడవుతూనే ఉంటాడు.

IX-19. అంతరంగంలో గొప్పతనం ఉన్నవ్యక్తిగౌరవమనే కాలకూట విషానికి దూరంగా ఉంటాడు. తరుణిని శవంమాదిరి చూస్తాడు. సభఅంటే త్రాచుపాముని దాని చాయలకు పోడు. అతడు రాజధానిని నరకంగా భావిస్తాడు.

## ఉద్దండుని నాటకము-మల్లికామారుతము

X-42. చెలిమితో నిండిన హృదయము, సంతోషంతో బాగా విప్పారిన చూపు-ఇవి మంచివాళ్ళకు స్వాగతమియ్యటానికి కావలసినవి. ఇంక ఏమి చేసినా ఆచారదంబమే,

## కల్హణుని రాజతరంగిణి (కాశ్మీర చరిత్ర)

I_7. ఎవని మాటలు తన ఇష్టానిష్టాల ప్రభావానికి లోబడక జరిగిన విషయాలను జరిగినట్టు వర్ణించటానికి దృఢంగా పూనుకొని ఉంటాయో అటువంటి గుణవంతుడైన రచయిత ప్రశంసనీయుడు.

VII_789. వాక్కు అభ్యుదయాన్ని పెంచుతుంది. కీర్తి కలిగిస్తుంది. దారిద్ర్యం తొలగిస్తుంది. శత్రువులో కూడా మైత్రి పుట్టిస్తుంది. అడుగడుగునా సౌముఖ్యం పెంచే మార్గంలో నడుస్తుంది. సర్వప్రదమైన వాక్కు తొలగించలేని అరిష్టమేది ?

VII_795. వానలకు ముందు వేసవివేడి పెరుగుతుంది. ఉషస్సు దగ్గరించినకొద్దీ చీకటి దట్టమవుతుంది. ఇట్లాగే మానవులలోకూడా అభ్యుదయం కలగబోయేముందు వదలిపోబోతున్న దారిద్ర్యం కలిగించేబాధ శిఖరాలందుకొంటుంది.

VII_985. ఎటువంటి విపత్సమయంలోగూడా ధైర్యము, భావనాశక్తి, బలము, వివేకము, నిశ్చలత అనేగుణాలు దృఢమతులైన మహాత్ములనువీడవు.

VIII_3188. లోకంలో సాటింపు అవుతున్న విషయాన్ని చెవిలో ఊదుతారు. విని సిగ్గుపడదగిన విషయాన్ని వినమ్రులై విచారిస్తున్న ధోరణిలో పేర్కొంటారు. శత్రువుకూడా చెప్పలేని మర్మభేదకమైన భయంకరవిషయాన్ని ప్రశంసిస్తారు. ఇట్లా దౌష్ట్యానికి నిలయాలూ మూఢులూ అయినవాళ్లు రాజులకు వినోదం కలిగిస్తారు. పాత్రుడనే సుక్షేత్రంలో బీజంనాటి మంచిమాటలతో పాదుచేసి కలుషితంకాని మనః పవిత్రత అనే నీరుపెట్టి పెంచిన దానవృక్షం చిన్నదైనా తగిన సమయాలలో కల్పవృక్షంలాగా వివిధకామిత ఫలాలనిస్తుంది.

## భర్తృహరి శతకత్రయము

### నీతి, శృంగార, వైరాగ్యములను గురించి

I. నీతి (మంచి నడవడి).

2. తెలియని వానికి తేలికగా తెలియజెప్పవచ్చు. తెలిసినవానికి చెప్పటం మరీ తేలిక తెలిసీ తెలియనివానికి తెలియజెప్పటానికి బ్రహ్మదేవుడి తరంగాదు.

7. ఏకొంచెం తెలిసినప్పుడు ఏనుగులాగా నేను మదాంధుడనయినాను. అప్పుడు నాకు అంతా తెలుసునని నా మనస్సు గర్వంతో నిండిఉంది. ఇప్పుడు పండితుల వల్ల కొంచెంకొంచెం తెలుసుకొన్న తరువాత నేను మూర్ఖుడనని తెలిసికొనగానే నా గర్వం జ్వరంలాగానే తొలగిపోయింది.

12. విద్య అనే అంతర్ధనము దొంగకు కనపడదు. ఇటువంటిదని చెప్పరాని సుఖాన్ని పెంచుతుంది. అహర్నిశమూ అర్థులకిస్తున్నా ఇంకా వృద్ధిపొందుతూనే ఉంటుంది. ఇంక ప్రళయము వచ్చినా ఇది నశించదు. కనక రాజులారా ! విద్యాధనమున్నవారి విషయంలో మీగర్వం మానండి. వారితో ఎవరు పోటీ పడగలరు ?

15. మానవునికి భుజకీర్తులు అలంకారాలుకావు. చంద్రునివలె ప్రకాశించే ముత్యాలహారాలుకావు. మరి స్నానమూ, గంధాదిలేపనమూ, పుష్పాలూ, దువ్వుకొని అలంకరించికొన్న కేశాలూ అలంకారాలుకావు. సంస్కారం పొందిన వాణి ఒక్కటే అతనికి తగిన అలంకారము. అన్ని అలంకారాలూ నశిస్తాయి. వాగ్భూషణమే భూషణము.

16. మానవునికి విద్య అనేది గొప్పరూపము. దాచిపెట్టుకొన్న ధనము. దాని వల్ల భోగాలతనికి లభిస్తాయి. పేరువస్తుంది. సుఖం కలుగుతుంది. విద్య గురువులకు గూడా గురువే. విదేశాలకు వెళ్ళినప్పుడు విద్య బంధుజనులలాగా ఉపయోగిస్తుంది. విద్య పరదేవత వలె మోక్షమిస్తుంది. రాజులు విద్వాంసుని పూజిస్తారుగాని ధనవంతునికాదు. విద్యలేనివాడు వింత పశువు.

17. క్షమాగుణం ఉంటే కవచమెందుకు ? క్రోధముంటే శత్రువులెందుకు ? జ్ఞాతి ఉంటే ఇక నిప్పుతో పనేమి ? మిత్రుడు ఉంటే దివ్యౌషధాలతో పనిఏమి ? దుర్జను లుంటే సర్పములతో పనేమి ? మంచి విద్యఉంటే ధనములతో పనిఏమి ? సిగ్గు ఉంటే భూష ణములతో పనిఏమి ? మంచి కవిత్వము ఉంటే రాజ్యముతో పనిఏమి ?

19. బుద్ధిమాంద్యం హరిస్తుంది. వాక్కులో సత్యం కురిపిస్తుంది. గౌరవాన్ని పెంచుతుంది. పాపాన్ని పోగొడుతుంది. మనస్సుకు ప్రసన్నత కలిగిస్తుంది. దిక్కులయందు కీర్తిని వెల్లివిరియజేస్తుంది. మనుష్యులకు సత్సాంగత్యము ఏమి కలగజెయ్యలేదో చెప్పు.

25. అభిమానం కలవాడికి రెండేరెండు వృత్తులున్నాయి. పూలగుత్తిలాగా ఉంటే అందరి శిరస్సులయందూ ఉండటం; లేకపోతే అడవిలోనే వాడిపోవటం.

34 దానము, భోగము, నాశనము - ఈ మూడేగతులు విత్తానికి ఉంటాయి. ధనాన్ని దానమూ చెయ్యక, అనుభవించనూ అనుభవించక దాస్తే, దానికి మూడవగతి తప్పదు.

35. ఒకానొకడు పరిక్షీణ స్థితిలో ఒక గుప్పెడు యవలను యాచిస్తాడు. అతడే తరవాత సంపూర్ణ ధనవంతుడైనప్పుడు భూమినంతటినీ ఒక గడ్డిపోచకింద చూస్తాడు. ధనవంతుల అవస్థ వస్తువుల విలువలను తగ్గించటానికీ హెచ్చించడానికీ హేతువవుతుంది. అంతేగాని ఒక ప్రమాణమంటూ ఉండదు.

44. డబ్బు కక్కుర్తి ఉంటే ఇంక అవగుణాలేమున్నాయని వెతకనక్కరలేదు. వెన్నుపోటు పొడిచే గుణం ఉంటే ఇంక పాతకాలను గురించి అడగనక్కరలేదు. సత్యముంటే తపస్సు ఉందా అని విచారించనక్కరలేదు. శుద్ధమైన మనస్సు ఉంటే ఏ తీర్థాలకు వెళ్ళివచ్చి నాడు అని జిజ్ఞాస అక్కరలేదు. మంచితనముంటే ఇతనికెంత బలముంది అనే ప్రశ్నే లేదు. గొప్పతనం ఉంటే ఇంక అలంకారాల సంగతి తడవనవసరం లేదు. విద్య ఉంటే ధనం సంగతి ప్రశంస చెయ్యనక్కరలేదు. అపకీర్తి ఉంటే ఇంక మృత్యువెందుకు ?

47. రాజసేవంత కష్టమైనదింకొకటి లేదు. నీవు మౌనంగా ఉంటే మూగ వాడంటారు. బాగా మాట్లాడగలిగితే సందర్భం లేకుండా వటవట వాగుతున్నాడంటారు. రాజుగారి సమీపంగా ఉంటే ఏమి భయం లేనివాడంటారు. అట్లా అని దూరంగా ఉంటే వట్టి చేతగాని వాడంటారు. క్షమ గలిగి ఉంటే వట్టి పిరికిపంద అంటారు. ఓర్పులేకుండా ఉంటే కులీనుడవుకావు అంటారు. సేవాధర్మము మిక్కిలి గహనమైనది. యోగులకుగూడా దాని పరిస్థితి దురవగాహమే.

48. ప్రొద్దుటి పూట నీడ మొదట పెద్దదిగానూ తరువాత పోను పోను కురచ గాను కనపడుతుంది. అట్లాగే కుజనులమైత్రి మొదట ఎక్కువగా ఉండి తరవాత తగ్గి పోతుంది అదే నీడ సాయంత్రంపూట మొదట చిన్నగా ఉండి తరవాత పోను పోను పెద్ద

దవుతుంది. అట్లాగే సుజనుల మైత్రి మొదట కొంచెముగా ఏర్పడి పోను పోను పెద్దదిగా పెరుగుతుంది.

50. లేళ్ళు, చేపలు, మంచివారు లోకంలో గడ్డి, నీరు, తృప్తి అనే వాటితో జీవనం గడుపుతున్నా వాటికి బోయ, జాలరి, కొండెగాడు కారణమేమీ లేకుండానే వైరులుగా ఉంటారు.

51. మహాత్ముల చిత్తము సంపదలయందు కలువపూలవలె మృదులమైనది; ఆపదలయందు మహాశైల శిలా సంఘాతమువలె కర్కశమైనది.

52. ప్రచ్ఛన్నంగా దానం చేయటం, అతిథులువస్తే వారిని గౌరవించటం ప్రియంచేసి చెప్పుకోకుండా ఉండటం, ఒక ఉపకారం పొందితే దాన్ని నలుగురిలో చెప్పు కోటం, ఎంత ఐశ్వర్యమున్నా పొంగిపోకుండా ఉండటం, ఇతరులనుగురించి గర్హణారహితంగా మాట్లాడటం-ఇటువంటి అసిధారావ్రతమైన చర్య మంచివారి కెవరునేర్పినారు ?

64. స్వార్థాలను పరిత్యజించి పరుల ప్రయోజనాలను సాధించేవారు సత్పురుషులు. తమ ప్రయోజనాలను చెడగొట్టుకోకుండానే పరార్థములను సాధించేవారు. సామాన్యులు. ఇంక మనుష్యులలో రాక్షసులు కొంతమంది ఉంటారు. వాళ్ళు స్వప్రయోజనం కోసం పరహితాన్ని బలిచేసివేస్తారు. మరియే ప్రయోజనమూ లేకుండా పరహితాన్ని నాశనం చేసే వారిని ఏమనవలెనో మాకు తెలియదు.

65. పాపంనుంచి నివారిస్తాడు. హితం చేకూరుస్తాడు. నీరహస్యాన్ని దాచిపెడు తాడు. గుణాలను ప్రకటిస్తాడు, ఆపదలోనిన్ను విడవడు. తగిన సమయంలో ఇస్తాడు- మంచిస్నేహితుడండే ఇటువంటివాడు.

70. మనోవాక్కాయాలలో పుణ్యమనే అమృతం నిండిఉండగా, మూడు లోకాలకూ ఉపకారశ్రేణులతో ప్రీతి కలిగిస్తూ పరులగుణాలను గోరంతలు కొండంతలు చేస్తూ తమ హృదయంలో వికాసం పొందుతూఉండే మంచివాళ్ళు ఎంతమంది ఉంటారు ?

72. ఏవో విఘ్నాలు కలుగుతాయని ఏపనీ ఆరంభించరు నీచులు. మధ్యరకం వారు మొదలుపెట్టిన పనిని విఘ్నాలవల్ల విడిచిపెడతారు. అడుగడుగునా విఘ్నాలు ఎదురౌతున్నా ఉత్తములు మొదలుపెట్టిన పనిని వదిలి పెట్టరు.

73. నీతి నిపుణులైనవారు నిందించనీ మెచ్చనీ లక్ష్మిరావచ్చు. లేదా ఇష్టం వచ్చినట్టు వెళ్ళిపోవచ్చు. మరణం ఇప్పుడే రావచ్చు, యుగాంతరంలో రావచ్చు. ఏది ఏమైనా ధీరులు న్యాయమైన మార్గంనుంచి ఏమాత్రమూ వైదొలగరు.

74. కొట్టివేసినా చెట్టుపెరుగుతుంది. కళలు తరిగినా చంద్రుడు పూర్ణకళలతో వెలుగుతాడు. వీటిని తలచుకొంటూ మంచివారు లోకంలో హాని కలిగినా కష్టపడరు.

75. ఐశ్వర్యానికి విభూషణము సౌజన్యము. శౌర్యానికి అలంకారము వాఙ్మయమము. జ్ఞానానికి శాంతి. చదువుకు వినయము. ధనానికి సత్పాత్రదానము తపస్సుకు అక్రోధము. సమర్థతకు క్షమ. ధర్మానికి నిర్వ్యాజత. సర్వజనులకూ సమస్తమూ ఇచ్చేది, అన్నిటికీ మించిన అలంకారము శీలము.

76. బంతి ఎంత కిందపడితే అంతగా ఎగురుతుంది. అట్లాగే సుజనుడు కింద

పడినా మళ్ళీ పైకివస్తాడు. మట్టిముద్ద కిందపడితే అక్కడే ఉండిపోతుంది. అనార్యుడు అట్లాగే పడిఉంటాడు.

84. ఏనుగులు, పాములు, పక్షులు బంధనంలో కట్టుబడటం; చంద్రసూర్యులకు గ్రహపీడనము, బుద్ధిమంతులకు దారిద్ర్యము కలగటం చూస్తే విధి బలిష్ఠమనిపిస్తున్నది.

95. మంచిదైనా చెడ్డదైనా ఏపని చేయవలసివచ్చినా పండితుడు పరిణామాన్ని జాగ్రత్తగా ఆలోచించి ప్రయత్నం చేయవలె. తొందరపడి పనిచేస్తే విపత్తి తథ్యము ఫలితము హృదయ దాహకమూ శల్యతుల్యమూ అవుతుంది.

## II. శృంగారము

3. భ్రూచాతుర్యంచేత చివరికి మూతబడిన కన్నులతో పొడవైన కటాక్షాలూ స్నిగ్ధములైన వాక్కులూ లజ్జావసానములైన హాసాలూ; లీలామందములైన గమనా గమనాలూ–స్త్రీలకివి ఆభరణాలూ ఆయుధాలూకూడా.

20. స్నేహంచేత సంతాపాన్ని హరించేవీ అనురాగవిశేషంచేత మనోహరమైనవీ, శృంగార రసాన్ని ప్రసరింప జేసేవీ, సందర్భ విశేషంచేత తీయదనం పొందినవీ సౌకుమార్యముతో నిండినవీ, సంభోగౌత్సుక్యాన్ని వెలువరించేవీ, స్వభావంచేత రుచికరమైనవీ, విశ్వాసంతొణికిసలాడేవీ, (జితేంద్రియులకుగూడా) మన్మథోద్రేకాన్ని కలిగించేవీ, అయిన మృగీదృశల రహస్య స్వైరాలాపాలు మమ్ములను ఎక్కడికో తీసికొనిపోతున్నవి.

22. చూడనంత సేపూ ఆమెకు నన్నుచూడాలనే ఉంటుంది. చూచిన దగ్గరినుంచీ మాయిద్దరికీ పరిష్వంగ సుఖంమీదనే కోరిక. కౌగిలించుకున్నదే తడవుగా మా విగ్రహముల అభేదాన్నే కోరుకుంటాము.

40. నేను నిజమే చెబుతున్నాను. పక్షపాతంతోకాదు. ఏడులోకాల్లోనూ ఇదే తథ్యమైనది. నితంబినులకంటే మనోహరమైనది ఇంకొకటి లేదు. వారికంటే దుఃఖహేతువు ఇంకొకటి లేదు.

42. స్మరించినంతమాత్రంచేతనే తాపం కలిగిస్తుంది. చూసినంత మాత్రం చేతనే ఉన్మాదం కలిగిస్తుంది. ఇంక ముట్టుకుంటే అంతులేని మోహంలో పడేస్తుంది. అటువంటి స్త్రీని ప్రియురాలు అని చెప్పటం ఎట్లా ?

65. ఎడబాటులోనైనా ఎవరి మనస్సులు ఒకటితో ఒకటి కలిసి ఉంటాయో వారికి సంగమమే. ఎవరిమనస్సులు వేరుపడి ఉంటాయో వారికి సంగమం విరహంకంటె బాధాకరమైనది.

70. ఎంతవరకు హరిణలోచనల చంచలలోచనాంచలముల దెబ్బతగలదో అంత వరకే సమర్థులైన మనుష్యులలో నిర్మలమైన వివేకదీపము వెలుగుతూంటుంది.

## వైరాగ్యము

2. పర్వతాలచేత దుర్గమములైన అనేక ప్రదేశములకు పోయి తిరిగినాను. ఏమీ ఫలం లభించలేదు. స్వజాతి కులాభిమానాలు వదలి సేవచేసినాను. ఏమీ లాభించలేదు. అభిమానం వదలి పరగృహాలలో కాకిలాగా ఏవేవో ఆశలతో భుజించినాను. ఓ పేరాసా ! పూర్వజన్మలో చేసినా పాతకాలకు దెక్కైనా ! ఈనాటికి నువ్వు తృప్తిపడటం లేదు. పెరుగుతూనే ఉన్నావు.

7. మేము భోగాలననుభవించలేదు. మేమే అనుభవించబడినాము. తపస్సు చేసికోలేదు. మేమే తపింపజేయబడినాము. కాలము గడపలేదు. మేమే గడిచిపోతున్నాము. తృష్ణ జీర్ణము కాలేదు. మేమే జీర్ణమయినాము.

8. మొహమంతా ముడతలు పడింది. తల ముగ్గుబుట్టలాగా నరసింది. అవయవా లన్నీ శిథిలమవుతున్నాయి. ఒక్క-తృష్ణమాత్రం నవయౌవనం పొందుతున్నది.

27. కోరినమేరకు శ్రమలేకుండా చెట్లనుండి దోరపండ్లు కోసుకోవచ్చు. అక్క-డక్క-డ పుణ్యతీర్థములలో చల్లని తియ్యని నీరును గ్రహించవచ్చు. సుకుమారమైన తీగెలు, ఆకులు చేర్చి మెత్తని శయ్యను ఏర్పరచుకోవచ్చు. అయినా కృపణులు ధనవంతుల ద్వారములు యొద్ధ సంతాపమును సహిస్తునే ఉంటారు.

31. భోగాలుంటే రోగాలవల్ల భయం తప్పకుండా ఉంటుంది. కులముంటే దాని గౌరవహాని కలుగుతుందనే భయముంది. విత్తముంటే రాజువల్ల భయము మానముంటే ఏదైనా దైన్యం వస్తుందేమోనని భయముంది. సైన్యములుంటే శత్రువులవల్ల భయం కలుగుతుంది. రూపముంటే ముదుసలి తనంవల్ల భయం కలుగుంది. శాస్త్రముంటే వారితోటీ వీరితోటీ వాదించవలెననే భయము కలుగుతుంది. గుణముంటే ఖలులవల్ల భయముంటుంది. అసలు శరీరముంటేనే యముడు తీసుకొని పోతాడనే భయం తప్పదుకదా ! లోకంలో ప్రతివస్తువును భయం వెన్నంటి ఉంటుంది. ఇంక-వైరాగ్యమొక్క-టుంటే భయమనేదేమీ కలుగదు.

34. తరంగాలు ఎత్తుగా లేచినా పడి పగిలిపోక తప్పదు. అటువంటివి భోగాలు. ప్రాణాలు ఏ క్షణంలోనైనా ధ్వంసమైపోయేవే. ప్రియురాళ్ళతో సుఖించే యౌవనసుఖస్ఫూర్తి కలదినాలు వేళ్ళమీద లెక్క-పెట్టదగినవే గదా! కాబట్టి ఓ పండితులారా ! సంసారము అంతా అసారమే అని తెలుసుకొని లోకానుగ్రహ పేశలమైన మనస్సుతో లోకకల్యాణానికి యత్నం సాగించండి.

38. ముసలితనం పెద్దపులిలాగా భయపెడుతూ కూర్చుంది. రోగాలు శత్రువులలాగా శరీరాన్ని కొడుతున్నాయి. ఓటికుండనుండి నీటిలాగా ఆయువు పోతూనేఉంది. ఐనా-లోకం తనకు అహితమైనదాన్నే ఆచరిస్తూంది. ఇది చిత్రంకాదా ?

49. బాగా బ్రతికితే ఆయువు నూరేండ్లు. అందులో సగం రాత్రి నిద్రలోనే గడిచిపోతున్నది. మిగిలిన సగంలో సగము బాల్యము వార్ధక్యము అనే వాటిలో గడచిపోతుంది. ఇంక మిగిలినది సేవాదులచేత గడుస్తుంది. అందులో వ్యాధులు, ఎడబాటులు, దుఃఖాలూ ముమ్మరంగా ఉంటాయి. తన బ్రతుకే వారి తరంగంలాగా చంచలతరమైతే ఇంక ప్రాణికి సుఖమనేది ఎట్లా కలుగుతుంది ?

50. ఒక్క- క్షణంలో బాలుడూ, ఇంకో క్షణంలో కామరసికుడైన యువకుడూ, ఒక క్షణంలో దరిద్రుడూ, ఇంకొక క్షణంలో ఐశ్వర్యవంతుడూ అయి చివరికి ముసలితనం శరీరాంగాలను జీర్ణంచేయగా ముడతలు పడిన తనువుతో ఒక నటుడివలె ఈ సంసారాంతంలో ఆతడు యమరాజధాని అనే యవనిక చాటున అదృశ్యుడౌతాడు.

53. ఒక విరాగి ఒకరాజుతో అంటాడు, 'ఇక్క-డ మేము వల్క-లాలతో తృప్తి పడుతున్నాము; నీవు చీనాంబరాలతో తృప్తిపడుతున్నావు. మన ఇద్దరి సంతోషంలోనూ

భేదంలేదు. ఎవని ఆశ పెద్దదో వాడు దరిద్రుడు. మనస్సు పరితుష్టంగా ఉన్నప్పుడు అర్థవంతుడెవరు? దరిద్రుడెవరు?

## అమరకుని శృంగార శతకము

17. ప్రియుణ్ణిచూడగానే లేచి స్వాగతం చెప్పటం మూలంగా అతనితో ఒకే ఆసనంమీద కూర్చోటం తప్పించుకుంది. అతడు కౌగలించుకోటానికి చూపే ఆత్రాన్ని తాంబూలంతెచ్చే మిషతో వమ్ము చేసింది. చెలికత్తెలను అటుఇటు పంపించటమనే మిషతో అతనితో మాట కలపటం తప్పించుకుంది. ఈ విధంగా స్వాగతసత్కారాల ఆడంబరంతో ఆ నేర్పుకత్తె వరునిపై తనకున్న కోపం అంతా చూపించింది.

28. బొమలు ముడిపడుతున్నా అతడు వస్తున్నాడా అని కన్ను మిక్కిలి ఆత్రంతో చూస్తూనే ఉంది. మాట ఏమి మాట్లాడకపోయినా ఈ హతభాగ్య ముఖంమీద చిరునవ్వు విరిసింది. హృదయం పాషాణమవుతున్నా శరీరంమీద పులకలు వస్తూనే ఉన్నాయి. అతడు రానేరావాలిగాని ఈ కోప చిహ్నాల పరిణామమేమిటో తెలవకుండా ఉంది.

50. "చిన్నదానా!" "స్వామీ!" "కోపనా, నీ కోపం విడువు" "నేను కోపంవచ్చి ఏంచేశాను?" "నీవు నన్ను బాధపెట్టినావు." "నీ తప్పులేదు. తప్పులన్నీ నాలోనే ఉన్నాయి." మరి ఎందుకేడుస్తావు మాటలు బిగుసుకొని పోతుండగా?" "ఎవరి ఎదుట నేనేడుస్తున్నాను?" "నా ఎదుటనే గదా?" "నేను మీకేమవుతాను?" "ప్రియురాలవు!" "నేనదికానుగనుకనే ఏడుస్తున్నాను."

82. "ఓసి అమాయకురాలా! ఎందుకు కాలమంతా అమాయకంగా గడపగోరుతావు? కోపం చూపు, ధైర్యం వహించు. నెచ్చెలీ! నీయీ ఋజుమార్గం దూరంగా వదలిపెట్టు" అని యిలా నేర్పుతున్న చెలికత్తెను కోపంగా చూస్తూ "మెల్లగా మాట్లాడు. ఇదిగో ఆయన ఇక్కడే ఉన్నారు (హృదయంలో). ఆయనకు వినపడుతుంది." అన్నది.

## కవయిత్రులు

**విజ్జిక (విద్య)**

1. భాగ్యమనేది మహాకఠోరమైనది. అది హృదయాన్ని పట్టుకొని కఠినంగా మట్టిముద్దలాగా మెదిపి, చింతఅనే చక్రంమీద పెట్టి, ఆరితేరిన కుమ్మరిలాగా తిప్పేస్తుంది నెచ్చెలీ! అది ఏమేమి చేస్తుందో మనకు తెలియదుగదా!

2. ప్రేమబంధము విడివడి, నా హృదయంలోనుంచి అతనిమీద గౌరవం జారిపోయి, మంచితనం అంతరించి, అతడు నా ముందునుంచి జడుడులాగా తిరుగుతూంటే– ఆ జరిగిపోయిన దినాలనుగురించి ఇప్పుడిలా అనుకొంటున్నప్పుడు–నా నెచ్చెలీ! నా హృదయము ఎందుకు ముక్కలుకావటంలేదో తెలియటం లేదు.

**మరుళ**

"ఏమిటింత చిక్కిపోయినావేమిటి?" "ఔను నా శరీరపుతీరే అంత," నీ శరీరం ఇంతదస్సిపోయిందేమిటి?" "అవును మా అమ్మగారింట్లో వంటావార్పూచేశానుగదా!" "నేను జ్ఞాపకమున్నానా నీకు?" "లేదులేదు" అంటూ ఆమె వణుకుతూ నావక్షంమీదపడి యేడ్చింది.

**సుభద్ర**

పాలను పితికి కాగబెట్టినారు. వాటి తీపిని పోగొట్టేటట్టు చిలికినారు. వాటినుండి నెయ్యిని తీసికోటానికి వెన్న తీసినారు. ఇన్ని బాధలు పెట్టటానికి వాటిలో నిండి ఉన్న స్నేహమే (కొవ్వు పదార్థం-మైత్రి) కారణము.

లక్ష్మి

అడవిలోని అన్నిపూలమీద వాలే తుమ్మెద చంపకాన్ని వాసనచూడదు. చంపకానికేమి వాసన లేదా ? తుమ్మెదకు అనుభవించటం చేతకాదా ? కేవలం ఈశ్వరాజ్ఞ తిరుగులేనిది గదా !

**వికటనితంబ**

"ఇంత చీకటిలో ఎక్కడికి బయలుదేరినావు తల్లీ !" "నా ప్రాణేశ్వరుడు నివసిస్తున్నచోటికే నా ప్రాణసఖీ !" "నీకు ఒంటరిగా పోవటానికి భయం వెయ్యదా చెల్లీ ?" "ఎందుకూ, నావెంట మన్మథుడు తనపూల బాణం ఎక్కుపెట్టి వస్తూనే ఉన్నాడు గదా !"

మోరిక

నిన్ను వదలి వెళ్ళవలెననే కోరిక నాహృదయంలో ఎట్లా కలుగుతుంది ? నా జీవితంలాగా ప్రియమైన నా భార్యతో హృదయం లేకుండా అటువంటి భావం ఎట్లా చెప్పేది ? కాని చెప్పనే చెప్పినాను. ఆమె ముఖమంతా ఎడతెరపిలేని అశ్రువులు ప్రవహిస్తుండగా మనము మొగవాళ్ళము ఏదో సంపాదించుకుందామనే ఆశతో బయలుదేరుతూనే ఉంటాము.

**శీలభట్టారిక**

కఠోరమతియైన మన్మథుడు కృశింపజేస్తున్నాడు. హృదయంలేని మృత్యుదేవత రోజులు లెక్కపెట్టుతున్నది. నిన్నేమో గౌరవపు జ్వరం పట్టుకున్నది. ప్రియా! ఆలోచించు. తీగలాంటి ఆడదాని బతుకీ షడ్యంత్రంలో ఎట్లా నిలుస్తుంది ?

## బాణుని వచన రచనలు

చంద్రాపీడ రాజకుమారుని జననము

(i) కడుపుతో ఉన్న రాణి...... విలాసవతి, ఆ గదులు, ఆమె శయనించిన మంచము, ఆమె కనటం, కుమారుడు జనించటం.

ఆమె గదివి అలికి శుభ్రపరచి దుష్టభూతాలవల్ల కడగండ్లు కలగకుండా బాగా కట్టుదిట్టం చేశారు. అందులో మంగళ ప్రదీపాలను బాగా వెలిగించారు. ద్వారం పక్కన పూర్ణకలశం ఉంచారు. అప్పటికప్పుడే ఉజ్జ్వలంగాఉన్న గోడలమీద మాంగల్య చిత్రాలు రాయించారు. పైన తెల్లని మేలు కట్టుకట్టి దాని అంచుల దగ్గర ముత్యాల కోవలు నెలకొల్పారు. మణిప్రదీపాలవల్ల ఎక్కడా చీకటి రేఖామాత్రంగా కూడా కనబడటంలేదు.

అటువంటి వాసభవనంలో ఆమెకోసం ఒక విశిష్టమైన శయనం ఏర్పాటు చేశారు. దాని రక్షకోసం విభూతితో పత్రలతలు చుట్టూ రచించారు. తలాపుదిక్కున ఆమె నిద్రను నిరంతరాయం చేసేందుకు తెల్లని కలశము ఉంచారు. శయనం అంతటా రకరకాల ఓషధులూ, వేళ్ళూ, యంత్రాలూ మొదలైనవి కట్టించారు. శయనం చుట్టూ రక్షాశక్తి వలయాన్ని ఏర్పాటు చేశారు. అక్కడక్కడ తెల్లావాలు చల్లారు. ఒకవైపు లేత రావాకులు గుచ్చిన

వెంట్రుకల దారం వేలాడదీశారు. మరొకవైపు పచ్చని వేపమండలను కూర్చారు. శయనం పాదపీఠాన్ని ఎత్తు చేశారు. పక్కమీద వెన్నెలరేకవంటి దుప్పటి పరిచారు. అటువంటి పక్కమీద ఆమె పడుకొన్నది.

ప్రసవాచారాలు తెలిసిన అంతఃపురవృద్ధనారులు తమ రాణి కోసం ఒక మహా పురుషుణ్ణి ఆవాహనం చెయ్యటానికి తగిన సన్నాహాలు చేస్తున్నారు. పాత్రలలో కర్పూర దీపాలు చల్లగా వెలుగు తున్నవి. వాటిలో తెల్లావాలు, గోరోచనం వేస్తున్నారు. ఎడతెగకుండా నీళ్ళుపోస్తున్నారు [1] నీళ్ళలో కొత్తమాంసము, ముఖాలుకొయ్యని చేపలు కలిపి నివేదన చేస్తున్నారు. పూలతో అలంకరించిన పూర్ణకుంభాలు తెస్తున్నారు. కనక పాత్రలలో విడిపూలు వేసి నీళ్ళుపోసి అన్నమూ, పెరుగు తేటా తేలుతుండగా పూర్ణపాత్రలు తెస్తున్నారు.

(ii) యువరాజు పుట్టటం, ఆ సందర్భంలో మతాచారాలకు సంబంధించిన చర్యలు, ఉత్సవాలు.

కొంతకాలానికి ఒక శుభదినాన ఆమెకు నవమాసాలూ నిండినవి. జ్యోతిష్కులు ఘటికా యంత్రాల[2]ద్వారానూ, బయటి నీడల ద్వారానూ లగ్నాన్ని[3] లెక్కగడుతున్నారు. ఒక శుభక్షణంలో రాణి విలాసవతి కొడుకును కన్నది. సేవకులు ఇటూ అటూ పరుగెత్తటం మొదలు పెట్టారు. ముసలి కంచుకులు రాజుగారి దగ్గరకు పరుగెత్తసాగారు. అందరి హృదయాలూ ఉప్పొంగి పోతున్నవి. సేవకులలో పొట్టివారూ, గూనివారూ, ముదుసళ్ళూ నలిగి పోతున్నారు. అంతఃపురంలోని కాంతలచేతి గాజుల గలగలలు ఆనందంగా ఉన్నవి. పూర్ణపాత్ర[4]లలో నుంచి ఎవరికి తోచినవి, పాత్రలూ, వస్త్రాలూ, వారు పట్టుకొని పోతున్నారు పట్టణమంతా గడబిడగా ఉంది. అంతఃపురంలో శుభాశంసనోద్వేగం అంత ఘనంగా ఉంది...

రాజు పుత్రదర్శనం కోసం ఉవ్విళ్ళూరుతున్నాడు. కాని శుభసమయం కోసం ఎదురుచూస్తున్నాడు. జ్యోతిష్కులు చెప్పిన శుభలగ్నం రానే వచ్చింది. రాజు తన పరివారాన్నంతా వెనకనే ఉంచి మంత్రి శుకనాసుణ్ణి ఒకణ్ణీ వెంట పెట్టుకొని రాణిఉన్న గదిలోకి వెళ్ళాడు.

(తల్లీ కొడుకూఉన్న) ఆ గది ద్వారానికి ఇరువైపులా రత్నాలు నింపిన శుభ కలశాలు ఉన్నవి. ఎన్నో బొమ్మలూ, వివిధ వర్ణాలుగల లేత కొమ్మలూ ద్వారంమీద వేళ్ళాడగట్టి ఉన్నవి. ఇంక గరికపోచలూ, తెల్లపువ్వులూ, పులిచర్మమూ, స్వాగతమాలా మధ్యమధ్య ఘంటికలతో గూడా వేలాడుతున్నవి.

ద్వారానికి ఇరువంకలా ఇటువంటి సందర్భాలలో అవలంబించ వలసిన పద్ధతులు బాగాతెలిసిన స్త్రీలు ఉన్నారు. కొందరు కుంకుమపూవు పొడితో ఎరుపెక్కిన గీతలూ,

---

1. ఇది ఇప్పటికీ బ్రాహ్మణుల పెండ్లిండ్లలో జరుగుతున్నది.
2. లగ్నాలంటే రాశిచక్రంలో రాశులు
3. ఘటికా యంత్రమనేది ఒక కుండలో నాళికద్వారా సమాంతరంగా నీటి చుక్కలు పడేట్టు చేసిన యంత్రం. అందుకే కాలవిభాగానికి ఘటిక, నాళిక అనే పేర్లువచ్చినవి.
4. పూర్ణపాత్ర అనేది ఒక సముదాచారం. ఉత్సవసమయంలో యజమానుడు ఆనందంతో నిండి ఉన్నప్పుడు సేవకులూ, ఆశ్రితులూ వచ్చి ఎవరికి తోచినట్టు వారు విలువగల పాత్రలూ, వస్త్రాలూ పట్టుకొని పోతారు.

స్వస్తికాలూ, ఇంకా ఇతర నమూనాల[5]ముగ్గులూ వేస్తున్నారు. ఆ గీతల పొడుగునా ఆవుపేడ ముద్దలూ, వెల్లికిల పరచిన గవ్వలూ, వాటికి మధ్యలో బహువర్ణకములైన కార్పాస పుష్పాలూ[6] పరుస్తున్నారు. ఇంకా కొందరు షష్ఠిదేవి[7] విగ్రహాన్ని చేసి దానికి పసుపురాసిన వస్త్రాలు కడుతున్నారు. మరికొందరు నెమలిమీద ఎక్కిన కార్తికేయుడి[8] విగ్రహాన్ని చేస్తున్నారు: ఆ నెమలి పురివిచ్చుకొని ఉన్నట్టు ఉంది. ఆయనకు ఎఱ్ఱని వస్త్రంగల జెండా[9] పెడుతున్నారు ఆయన శక్త్యాయుధంతో[10] గంభీరంగా ఉన్నాడు. ఇంకా కొందరు సూర్యచంద్రుల కక్ష్యలను ఏర్పరుస్తూ వాటి కేంద్రాలను అలక్తక వర్ణంతో అలంకరిస్తున్నారు. కొంతమంది మట్టితో పూసలుచేసి కుంకుమపువ్వు నూరి వాటికి రంగు వేస్తున్నారు. వాటి మీద సువర్ణవర్ణంగల యవగింజలనూ, తెల్లావాలనూ అద్దుతున్నారు. దానితో ఆ పూసలు బంగారంలో ముంచెత్తినట్టు మెరుస్తున్నవి. ఇంకా కొంతమంది స్త్రీలు గోడలపై అంచులకి అలంకారం చేస్తున్నారు. వారు మంచిగంధపు ముద్దలతో తెలుపెక్కించి పచ్చపిండితో వర్ధమానముద్రలు[11] వేస్తున్నారు. వాటిమీద ఐదురంగుల గుడ్డలతో జెండాలు అతికిస్తున్నారు.

ద్వారందగ్గర ఒక ముసలి మేకను కట్టివేశారు. దానిని రకరకాల సువాసనలు వెదజల్లే పుష్పాలతో అలంకరించారు. రాణిగారి తలాపిదిక్కున అక్షతలమీద గౌరవనీయురాలైన ఒక ముదుసలి అవ్వ కూర్చున్నది. ఒక పక్కన నేతిలో పాముకుబుసమూ మేక కొమ్మూ కాగబెడుతున్నారు. వేపాకులు నిప్పులో వేస్తూ దానిలోనుంచి వచ్చే రక్షక ధూమాన్ని ప్రసరింపజేస్తున్నారు.

బ్రాహ్మణులు వేదపఠనంచేస్తూ పుణ్యాహవాచన తీర్థం చల్లుతున్నారు. దాదులు కొత్తగా చిత్రించిన మాతృదేవతల చిత్రాలతో హడావుడిగా ఉన్నారు. వృద్ధస్త్రీలు ప్రసవ సమయాని కనుగుణంగా పాడుతున్న పాటల మధురగానం అంతటా వినవస్తున్నది. నవజాత శిశువుక్షేమంకోసం ఉచితకృత్యాలు చేస్తున్నారు. శిశువు శరీరాన్ని రక్షించటంకోసం బలులిస్తు

---

5. కోలం (తమిళం), అల్పన (ఉత్తరభారతం), రంగవల్లి లేదా ధూళి లేదా రసచిత్రం (సంస్కృతం)- ఈ నమూనాలు భారతీయ బాలికలు, స్త్రీలు ఇళ్ళు, దేవాలయాలు మొదలైన వాటిముందు తమ హస్తనైపుణ్యం ప్రదర్శిస్తూ గీస్తారు.

6. ఇప్పటికీ ముఖ్యంగా మార్గశిరమాసంలో (డిసెంబర్-జనవరి) ఇళ్ళముందు ఇటువంటి ముగ్గులతో అలంకరిస్తూ ఉంటారు. వాటిలో అక్కడక్కడ చిన్నచిన్న పేడముద్దలను పెట్టి వాటిమీద గుమ్మడి, ఇంకా పలురకాల పూలు అలంకరిస్తారు.

7. నవజాత శిశువులను కాపాడే మాతృదేవత; శిశువుపుట్టిన ఆరవరోజున ఇరవైఆరవ రోజున పూజిస్తారు; ఆమె కార్తికేయుని భార్యఅని నమ్మకం.

8. శివపార్వతుల పుత్రుడు. పుత్రులలో దేవతల సేనానివంటివాడు. పైన చెప్పిన షష్ఠిదేవి భర్త.

9. ఆయన జెండామీద కోడి ఉంటుంది.

10. పొడుగైన బల్లెంలాగా ఉండి పైన (చివరన) వెడల్పుగా పదునుగా ఉండే ఫలకం ఉంటుంది.

11. ఇది స్వస్తికం లాంటిదే, పదునుగా ఉంటుంది. శుభసూచకము.

న్నారు. వందలకొద్దీ శ్వేతపుష్పమాలలు వేలాడదీస్తున్నారు. విష్ణుసహస్రనామపారాయణం[12] నిరంతరాయంగా చేస్తున్నారు. బంగారుసెమ్మెలపై మంగళదీపాలు మిక్కుటంగా ప్రకాశిస్తూ నవజాత శిశువు క్షేమాన్ని కోరుతున్నట్టు గదినిండా ప్రకాశాన్ని విరజిమ్ముతున్న ఆగదిచుట్టూ విచ్చు కత్తులతో పహరా ఇస్తున్నారు. అప్పుడు రాజు జలాన్ని, అగ్నిని స్పృశించి ఆ గదిలో ప్రవేశించాడు.

## బాణుని చారిత్రక వచన గ్రంథము - హర్షచరిత

### 8 వ ఆశ్వాసము - దివాకరమిత్రుడనే ఉపాధ్యాయుని ఆశ్రమ విద్యాలయము

(హర్షరాజు తన సోదరికోసం వెదుకుతూ ఉన్నాడు. ఆమె భర్తనుకోల్పోయి జీవితంమీద విరక్తిచే అంతఃపురం వదలి వెళ్ళిపోయింది. ఒక వేటగాడు ఆ అడవి అంతా తిరిగివచ్చి తన రాజుకు వార్తచెబుతున్నాడు.)

"ఓ ప్రభూ ! ఇక్కడికి దగ్గరలో ఈ కొండవాగు పక్కన ఒక పెద్ద తోపులో దివాకరమిత్రుడనే సన్యాసి నివసిస్తున్నాడు. ఆయనచుట్టూ చాలామంది శిష్యులు ఉన్నారు. ఆయనను ఋషులు గౌరవిస్తుంటారు ఆయనకు తెలియవచ్చు."

రాజు ఇదినిని ఇట్లా అనుకున్నాడు. "కీర్తిశేషుడైన గ్రహవర్మ[1]కు బాల్య మిత్రుడుగా ఉండిన ఇతణ్ణిగురించి విన్నాము. ఇతడు మైత్రాయణీశాఖ[2] బ్రాహ్మణుడు, చదువుకున్నవాడు. వేదమార్గాన్ని వదలిపెట్టి ఏకాగ్రతతో ధ్యానం అవలంబించినాడు. బాల్యం లోనే బౌద్ధసన్యాసి అయినాడు...... నాకెన్నాళ్ళనుంచో అతన్ని చూడాలని ఉంది. కార్య వశాత్తూ ఈయనను కలుసుకొని మాట్లాడే అవకాశం నాకు కలిగింది. ప్రత్యేక కృషివల్లగాని కలియటానికీ మాట్లాడటానికీ వీలుపడనివ్యక్తి. ఆయనను చూస్తాను." రాజుపైకి ఇలా అన్నాడు. "ఓ! ఆ సన్యాసి ఎక్కడున్నాడో చూపించు."

ఆ కిరాతుడు దారి చూపించగా రాజు బయలుదేరినాడు. పోగాపోగా దివాకర మిత్రుని ఆశ్రమవృక్షాలు కనిపించినవి. గుబురుగాఉన్న చెట్టుకొమ్మలకు సన్యాసుల కమండ లాలు వేలాడుతున్నవి. కొమ్మలు వారి భిక్షాపాత్రల చిక్కాలతో వంగి ఉన్నాయి. చుట్టు పక్కల చిన్న పాకలలో ఎఱ్ఱని దేవతామూర్తులు కనపడుతున్నాయి.

అంతట రాజు ఆ బౌద్ధసన్యాసి నెలవు దగ్గరలోనే ఉన్నదని తెలుసుకున్నాడు. అతడు గుఱ్ఱముదిగి ఆ కొండవాగులో స్నానముచేసి పవిత్రుడయినాడు. ఆ అరణ్యమంతా తమ సకిలింపులతో చెవుడుపరుస్తూ తనవెంటవస్తున్న గుర్రపుదళాన్ని అక్కడే ఆపుచేశాడు. ఋషి దర్శనానికి అనువుగా తనలో వినయం సంతరించుకొన్నాడు. మాధవగుప్తుడిమీద

12. విష్ణుసహస్రనామమనే సార్వజనికమైన హైందవస్తోత్రాన్ని ఎల్లవేళలందు పారాయణం చేసే సంప్రదాయం ఉందని తెలుసుకోటానికి చాలా ఉత్సాహంగా ఉంటుంది. ఇందులో లోక ప్రభువు యొక్క వెయ్యినామాలు ఉంటాయి. పూర్వపువైద్య గ్రంథాలుకూడా ఔషధంతో పాటు ఈ సహస్రనామాల పారాయణను విధిస్తున్నవి.

**హర్షచరిత**

1. హర్షరాజు సోదరిని వివాహమాడిన మౌఖరిరాజపుత్రుడు.
2. కృష్ణ యజుర్వేదంలో ఒక భాగం.

పడిచేయి వేసుకొని ఇంకా కొందరు రాజపుత్రులు వెంటరాగా నడుచుకుంటూ బయలుదేరాడు.

ఆ చెట్లతోపునడుమ రాజు మధ్యవయస్కుడైన దివాకర మిత్రుని చూసినాడు. దారిపొడుగునా ఆయన శిష్యులైనవారు అక్కడక్కడ స్తంభాలమీద, చత్రాళ్ళమీద, చెట్ల నీడల్లో, చెట్లమొదళ్ళలో, కొమ్మల చాటున కనపడకుండా కూర్చుండి ఆయనే దివాకర మిత్రు డని చెప్పక చెబుతున్నట్టున్నారు. ఈ శిష్యులలో కోరికలు పరిత్యజించిన వారు, జైనులు, బ్రాహ్మణ విరాగులు, శ్వేతాంబర జైనులూ, శ్వేతాంబరమునులూ, సగుణోపాసకులూ, బ్రహ్మ చారులూ, వెంట్రుకలు ఊడలాక్కుంటున్న జైన సన్యాసులూ, సాంఖ్యులూ, ఇంకాకొన్ని తెగల జైనులూ, చార్వాకులూ, వైశేషికులూ, వేదాంతులూ, సేశ్వరవాదులైన నైయాయి కులూ, రసవాదులూ,[3] ధర్మశాస్త్రాధ్యయనులూ, పౌరాణికులూ, యాగనిష్ఠులూ, వైయా కరణులు, పాంచరాత్రాగమానుయాయులూ[4] ఉన్నారు. ఇంకా ఎందరో అధ్యయనపరులు ఉన్నారు. ప్రతిఒక్కరూ తన విద్యావిషయాలు వింటూ, అవి వంటపట్టించుకుంటూ వాటినే చింతన చేస్తూ పునఃపునరధ్యయనం చేస్తూ శంకా సమాధానాలు చేసుకుంటూ ఉపన్యసిస్తూ వాదవివాదాలు చేస్తూ ఆవిద్యలలో నిష్ణాతులౌతూ ప్రవచనం చేస్తూ ఉన్నారు.

## వచనకథ - దండిదశకుమార చరిత

షష్ఠోచ్ఛ్వాసము - సమర్థురాలైన భార్య గోమిని.

[దండి మహాకవి రచించిన దశకుమార చరితము అనే వచనకథా గ్రంథంలో నుంచి ఒక చిన్న కథ ఇక్కడ ఇస్తున్నాము. ఈ మహాకవి క్రీ. శ. 8 శతాబ్దంలో కంచిని పాలించిన పల్లవ రాజుల సభలో ఉండినవాడు.

గోమిని కథ 6 వ ఉచ్ఛ్వాసంలో ఉంది. ఆదర్శవంతురాలైనభార్యతన గుణాలతో గృహకృత్యాలలో సహాయము, సంతోషము కలిగిస్తుందని చూపటానికి చెప్పినకథ ఇది. ఇందులో పూర్వం కామసూత్రాలలో చెప్పి ఉన్న గృహకృత్య కళలు, కౌశల్యాలు నిరూపితా లయినవి.]

ద్రవిడదేశంలో కంచి అనే పట్టణం ఉంది. అందులో కోటీశ్వరుడైన శక్తికుమారు డనే శ్రేష్ఠిపుత్రుడుండేవాడు. అతనికి పద్దెనిమిదేండ్లు నిండినవి. అప్పుడతనిలో ఈ చింత కలిగినది. "భార్యలేనివానికి, అననుగుణవర్తినియైన భార్య ఉన్నవానికి సుఖం కల్ల. కనక గుణవతియైన భార్యను పొందడం ఎలా?" ఇతరులు తీసికొనివచ్చే పెళ్ళి కూతుళ్ళలో తనకు కావలసిన గుణాలు ఉండవనుకున్నాడు. ఒక జ్యోతిష్కుడి వేషంలో కన్యాన్వేషణం కోసం బయలుదేరాడు. పైపంచె కొమ్మున ఒక ప్రస్థం ధాన్యం మూటకట్టుకొని కావలసిన వాళ్ళకు జ్యోతిషం చెబుతూ తిరుగుతున్నాడు. ఇతడు జ్యోతిష్కుడని పెండ్లి కావలసిన పిల్లలను తల్లిదండ్రులు చూపిస్తున్నారు. వాళ్ళలో లక్షణవతియైన తన వర్ణపు కన్యను చూసి 'అమ్మా! నాదగ్గర ఉన్న ఈ ప్రస్థంధాన్యంతో మంచిగా వంటచేసి నాకు భోజనం పెట్టగలవా?" అని అడుగుతూండేవాడు. ఇట్లా ఇల్లిల్లూ తిరుగుతూ వాళ్ళు నవ్వి వెళ్ళగొడుతున్నా అతడు తన ప్రయత్నం మానలేదు.

3. పాదరసం మూలంగా అజరామరత్వం పొందగలమనుకొనే తత్త్వజ్ఞులు,

4. విష్ణుపూజను విస్తరించి తెలిపే ఒక ఆగమము,

ఇట్లా ఒకప్పుడు చోళరాజ్యంలోకి వెళ్ళాడు. అక్కడ కావేరి దక్షిణ తీరంలో పట్టణం[1]లో ఒకదాది చూపిన కన్యను చూశాడు. ఆ అమ్మాయి పితృగృహంలోనే ఉంది. నగలాట్టే లేవు. ఆ ఇంటివారి ఐశ్వర్యం క్షీణించిపోయింది. ఆ అమ్మాయినిచూస్తూ ఆ శక్తి కుమారుడు ఇలా అనుకున్నాడు. "ఈమె కేవలం లావుగానూలేదు, సన్నగానూలేదు. అంత పొడుగూలేదు, అంత పొట్టికాదు. ఈమె అవయవాలు పుష్టంగానూ, శుభ్రంగానూ, సుందరంగానూ ఉన్నవి[2]....ఆకారానికి తగిన గుణాలే ఉండవచ్చు. నా హృదయం ఈమెయందు సక్తమైంది. ఈమెను పరీక్షించి వివాహమాడుతాను. బాగా పరిశీలించకుండా చేసుకుంటే పశ్చాత్తాపపడవలసి వస్తుంది". ఇట్లా చింతించి ఆమెను స్నేహదృష్టితోచూస్తూ "అమ్మా! ఈ ప్రస్థం ధాన్యంతో నాకు సంపన్నమైన భోజనం చేసిపెట్టే కౌశలం నీకుందా," అని అడిగాడు.

అప్పుడు ఆమె తన వృద్ధదాసివంక సాభిప్రాయంగాచూసి అతని చేతినుంచి ప్రస్థం ధాన్యం తీసుకొంది. ఇంటిముందు శుభ్రంగా కడిగి తుడిచినచోట అతణ్ణి కూర్చోబెట్టింది. ఆమె ఆధాన్యాన్ని కొంచెందంచి కొద్దిగా ఎండబెట్టి స్థిరసమమైన భూమిమీద మాటిమాటికీ కలిపి ఒకగొట్టంతో ఊది పొట్టునూ బియ్యాన్నీ వేరుచేసింది. ఒకదాదిని పిలిచి "ఈ పొట్టు స్వర్ణకారులకు భూషణాలకు మెరుగుపెట్టే పనికి పనికివస్తుంది: వారికి ఇది ఇచ్చి వచ్చిన ధనంతో మంచికట్టెపుల్లలు మరీ ఎండిపోయినవి కాకుండా మరీ పచ్చివికాకుండా చూసి తెచ్చిపెట్టు. అంతేకాక ఈ బియ్యం వండటానికి తగిన కుండ, రెండు మూకుళ్ళూకూడా తీసికొనిరా". అని చెప్పింది. దాది వస్తువులు తేగానే ఆమె ఆ బియ్యాన్ని ఎక్కువ లోతుగాలేని మద్దిచెక్కల[3] రోటిలోవేసి ఇనుపపొన్నుగల చంద్రకట్టె[4]రోకలితో మధ్యమధ్య ధ్యాన్యాన్ని కిందికీ పైకీ మెదుపుతూదంచింది. తరువాత ఆ బియ్యం చేటలో కిటికీ దగ్గర చక్కగా శుభ్రంచేసి పలుసార్లు నీళ్ళలో కడిగి ఉంచింది. అంతకుముందే పొయ్యికి పూజచేసి బియ్యానికి ఐదురెట్లు నీళ్ళనుకాచి ఆ బియ్యాన్ని అందులో పోసింది. అది ఉడుకుపట్టిన తరువాత దింపి పొయ్యి చల్లార్చింది. ఆ బియ్యం తెల్లగా మెత్తగా ఉడుకుపట్టి ఉన్నాయి. అప్పుడామె ఆ కుండను మూకుడుతో మూసి గంజి వార్చింది. ఆ తరువాత తెడ్డుతో కలియబెట్టి కుండను కొంచెం వంపుగా మూతికిందికి ఉండేట్టు వంచిపెట్టింది.

ఆమె పొయ్యిలోని కట్టెలను బయటకుతీసి నీటితో నిప్పును పూర్తిగా చల్లార్చింది. ఆ బొగ్గులనుతీసి దాదితో "వీటిని బజారులో అమ్మి ఆ వచ్చిన డబ్బుతో కూరలు, పెరుగు, నెయ్యి, నూనె, ఆమలకాలు, చింతపండు ఎంతవస్తే అంత తీసికొని రమ్మన్నది. ఒక మూకు

---

**దండి దశకుమార చరితము**

1. పుహార్ అనీ కావేరిప్పూంపట్టిణమ్ అనీ పేర్లుగలచోట రేవుపట్టణము. ఇది కావేరి సముద్ర సంగమం దగ్గరఉంది.
2. ఈ తరువాత ఆమె సాముద్రిక లక్షణాలు వర్ణించబడినవి. వీటివల్ల ఆమె ఆదర్శ సౌందర్యం తెలుస్తుంది.
3. మద్దిచెట్టు.
4. చంద్రచెట్టు,

డులో గంజినిపట్టి తడి ఇసకమీద చల్లార్చి కొంచెం విసిరి ఆర్పిన కట్టెలనుంచి వచ్చే పొగ వాసనను దానికి పట్టించి అందులో ఉప్పువేసింది. ఆ తరువాత ఆమలకాలను దంచి కలువ గంధం పట్టించి స్నానసంభారాలు సిద్ధంచేసి శక్తికుమారునికి స్నానం చేయవచ్చునని కబురు చేసింది. ఆమెకూడ తైలామలకంతో శుభ్రంగా స్నానం చేసింది.

ఇంక ఇంట్లో భూమిపై శుభ్రంగా నీళ్లుజల్లి పీటవేసి అతన్ని కూర్చుండబెట్టింది. దొడ్లోఉన్న అరటి చెట్టుదగ్గరకువెళ్ళి అంతగా పండిపోని ఒక ఆకును కొననుండి ముప్పాతిక వరకు కత్తిరించితెచ్చి అతని ముందుంచింది ఆ ఆకుమీద తాను తయారుచేసిన మండాన్ని రెండు మూకుళ్ళతో వడ్డించింది. అతడాపేయాన్ని తాగగానే శరీరమంతా చెమటపట్టి అంతకు ముందు నడచినడచిఉన్న శ్రమంతా తీరిపోయింది. పిమ్మట రెండుగరిటెల అన్నమూ, కొంచెం నేయి, పప్పు, కూరలు పెట్టింది మిగతా అన్నం చల్లలోకి ఉంచింది. చల్లలో గంజికలిపి త్రిజాతాల పొడుము (లవంగపట్టా, మిరియాలు, యాలకుల పొడుము) వేసింది. భోజ్యవస్తువులు పూర్తి కాకుండానే శక్తి కుమారుడు తృప్తుడైనాడు

అప్పుడతడు మంచినీళ్లడిగాడు. ఆమె చల్లని కుండలో ఉంచి కలబందధూపము, పాటల పుష్పాలు, కలువపూలతో పరిమళం పట్టించిన పానీయాన్ని కొమ్ముచెంబుతో పోస్తుంటే మూకుడుతో అతడాపానీయం తాగాడు. హిమశీతలమైన ఆ పానీయంతో అతనికళ్లు స్నిగ్ధములై కనురెప్పలు పైకి నిక్కబొడుచుకున్నవి. పడుతున్న నీటిధార సవ్వడితో అతని చెవులు నిండుతున్నవి. ఆ పానీయస్పర్శచే అతని చెక్కులు పులకిస్తున్నవి. దాని పరిమళానికి అతని నాసికారంధ్రాలు విప్పారుతున్నవి. ఆ పానీయపురుచికి అతని నాలుక తిరుగుతూంది. అతడా పానీయానికి తృప్తుడై శిరఃకంపంతో చాలునని చెప్పాడు. ఆమె వేరొక చేతితో ఆ చమనానికి తీర్థం ఇచ్చింది.

దాది అతడు భుజించిన ఆకు తీసివేసి క్రొత్త ఆవుపేడతో శుద్ధిపెట్టింది. శక్తి కుమారుడు తనపైపంచె కిందపరచుకొని కొంచెంసేపు విశ్రమించాడు. సంతుష్టుడై అతడామెను వివాహమాడి ఇంటికి తీసికొని వెళ్ళాడు....................

## అన్యాపదేశాలు

[ప్రకృతిలోఉన్న తరులతాదులను వర్ణించటంద్వారా మానవప్రకృతిని సాంకేతికంగా చూపటం]

**ఖల్లటుడు**

21. అందంగా నర్తించే మయూరాలూ, మధురంగా భాషించే చిలుకలూ-ఇవి మన కళ్ళకు కనపడవు. వాటిని ఇప్పుడు లోనికి రానియ్యకుండా కోపంతో చూస్తారు. ప్రేమికుడి రాబోయే వార్త తెలిపి ఆశ్రయం సంపాదించుకొన్న పాడుకాకి ఇక్కడ కాలుపెడుతుంది. ప్రోషిత భర్తృక అయిన ఈమె ఇల్లంతటా స్వేచ్ఛగా విహరిస్తుంది.

32. చందనపు చెట్లమీద సర్పాలున్నాయంటే సహిస్తాము. అంతఅందమైన వస్తువుకు తగిన రక్షణ లేకుండా ఉండటం ఎక్కడ చూడగలం ? ఓ చంద్రచెట్టా! కొంచెం చెప్పు. నీలో ఉండే ఏ సౌందర్యాన్ని రక్షించడానికై ఒంటినిండా ముళ్లు పెంచుకున్నావు ?

59. నీవు చౌరస్తాలో ఎందుకు పెరిగావు ? ఇంతగాఢమైన నీడ ఎందుకిస్తున్నావు ? పోనీ నీడ ఉంటే ఉంది, పళ్ళెందుకు కాస్తున్నావు ? పోనీ పళ్ళుంటే ఉన్నాయి. మనుషులందుకోగలిగేటట్లు కిందికెందుకు వంగావు ? ఓ సఖా ! రసాలమా ! ఇన్ని చెడ్డపనులు చేశావు గనక కొమ్మలు వంచటం, దులపటం, విరవటం, అవి తీసుకొనిపోవటం ప్రజలు చేస్తున్నారని సంకటపడితే ప్రయోజనమేమిటి ? [ఇది ఇతర సంకలనాలలో జ్ఞానవర్మదని ఉంది.]

60. చిన్నది బరువులేనిదీ, ఎవ్వరూ లెక్కచేయనిదీ, అందరిపాదాల కిందపడి నలిగేదీ, ఎవ్వరికీ కనపడకుండా భూమి మీద ఉండేదీ, చూడు నేస్తం ! ఈ ధూళి ఒకి చంచలమైన వాయువు చేత రేగిపోయి ఆ ఉన్నత పర్వత శిఖరాల(రాజుల) మీద చోటు వేసుకుంది.

69. పక్షుల్ని పిలిచినపుడు ముందుకు వచ్చే దోమను ఆపలేరు. నెత్తిమీద పెట్టుకున్న తృణమణి రత్నంలాగే ప్రకాశిస్తుంది. వెలుగులెన్ని ఉన్నా మిణుగురు పురుగులు కాంతివంతమైన పదార్థాలమధ్య సంచరిచటానికి వెనుకంజవెయ్యవు. అక్కటా ! రాజుకు మల్లే మతిహీనంగా ఉండే జాతి అనేక జాతిసిద్ధాంతాన్ని తప్ప మరి ఏ సిద్ధాంతాన్ని లెక్కచేయదు గదా !

87. ప్రపంచంలో తమకు ఆహారమనే వంకతో పాములు ఉన్న గాలి సంతా పీల్చేశాయి. మేఘంలోంచి పడే చినుకులే తమకు ఆహారమని మయూరాలు ఆపాముల్ని మింగేశాయి లేడి చర్మాలు కప్పుకొని వచ్చిన కిరాతులు మయూరాలను నాశనం చేశారు. లోకంలో వ్యర్థత్వాన్ని గమనించి కూడా మూర్ఖుడైన మనుష్యుడు సద్గుణాల కోసం ఆశిస్తాడు.

94 తామరాకు మీద నీటి బిందువును చూసి అది ముత్యమని ఆమూర్ఖుడు అనటంలో విశేషం లేదు. తరవాతేం జరిగిందో వినండి. వాడా ముత్యం తెచ్చుకోటానికి మెల్లిగా వెళ్ళి వేళ్ళతో ఆకును ముట్టికొనే టప్పటికి ఆనీటిచుక్క జారి నీళ్ళలో కలిసి పోయింది. వాడు అయ్యో ? నా ముత్యం ఎక్కడో పడిపోయింది. అని గోలపెట్టాడు. అంతేకాకుండా వాడు రోజులకొద్దీ నిద్ర లేకుండా ఆ ముత్యం కోసం అలమటిస్తాడు.

తనకు తాను నీడ ఇచ్చుకోలేని తాటిచెట్టు ఎవరికైనా నీడ ఎట్లా ఇస్తుంది ? వేసవి ఎండల్లో దాని కింద చల్లగాలి ఎట్లా వస్తుంది ? కొందరంటారు. వంద ఏళ్ళ తరువాత దానికి మంచిపళ్ళు దిగుతాయని. అదికూడా వట్టి ఆకాశరామన్న వార్తే. ఈ తాడిచెట్టు ఎత్తును చూసి బాలిశులలాగా మోసపోయాము.

వింత శరీరం, కర్ణకఠోరమైన శబ్దం ఉన్నా ఈ ఒంటె వడివడిగా దూరప్రయాణం చేస్తుంది. కనక ఆ దోషాలు లెక్కలోకి రావు.

**మురారి**

కుట్టినప్పుడు బాధ, కుండలాలు మోసేభారం చెవులకేగాని అసలు కుండలాల అందమంతా చెవులకే.

**గోయీ, ధోయీ**

నెమలి ఈకలు భూమిమీద రాలిపోయినా విసనకర్రలుగా, గొడుగులుగా తయారై ఇతరుల తాపాన్ని పోగొడతాయి.

**పేరు తెలియని రచయితలు**

తాము చిన్న చెట్లుగా ఉన్నప్పుడు తాగిన నీటిని జ్ఞాపకం ఉంచుకొని కొబ్బరి

చెట్టు కలకాలం భారాన్ని నెత్తిమీద మోస్తూ మనుష్యులకు అమృతంలాంటి నీళ్ళిస్తున్నాయి. మంచివాళ్ళు తాముపొందిన ఉపకారాన్ని మరచి పోరు.

తనను గొడ్డలితో కొట్టేవాడికైనా, తేనే, నెయ్యీపోసి పెంచేవాడికైనా, తనకు హారతిచ్చి పూలదండ లిచ్చేవాడికైనా-అందరికీ వేపచెట్టు చేదు పళ్ళే ఇస్తుంది.

ఓ రసాలమా! నీపళ్ళు తియ్యగా ఉంటాయి. పూలు ఘుమఘుమ పరిమళిస్తాయి. నీ ఆకులు ఏ పండగలకైనా శుభసూచకాలైన తోరణాలుగా ఉంటాయి. అయితే ఏం? ఎండకు తట్టుకోలేక నీపాదం పట్టిన బాటసారులను భయంకరమైన ఎర్ర చీమలు కుట్టి పెడతాయి.

ఓ సూర్యుడా! నిన్ను తామర పూలు ప్రేమిస్తాయి. నీ ఉదయానికి జక్కవ పిట్టలు సంతోషిస్తాయి. నీవెలుగుతో లోకమంతా కలకలలాడి పోతుంది. అటువంటి నిన్నుచూసి గుడ్లగూబ అసహ్యించుకుంటుంది. అయితే నీకేం నష్టం? అంతా గుడ్లగూబనే హేళన చేస్తారు.

ఓ ఘటమా! నీ జీవితమే చాలా గొప్పదనుకుంటాను. నీ గొంతుచుట్టూ ఉరిపోసు కొన్నైనా నీవు అందరికీ జీవనం(నీరు) ఇస్తావు.

**నీలకంఠ దీక్షితులు**

1. బాటసారులు నడిచినడిచి అలసి ఒక ఛాయావృక్షంనీడకు అంతా ఒకమాదిరే చేరుతారు వాళ్ళలో ఒకడు తన మంచి మనస్సులో సంతోషంగా తనకు ఆ చెట్టు చేస్తున్న ఉపకారాన్ని పొగడుకొంటాడు. ఇంకోడు "అహా! దీని కొమ్మలు బాగా ఉన్నాయి. స్తంభాలకు దూలాలకు పనికివస్తాయి". అని కొట్టుకొని పోవటానికి ఆలోచిస్తాడు. ఇంకా ఒకడు ఆ చెట్టు మొదలు నరికి తలుపు చెక్కలకింద కోయటానికి నిశ్చయిస్తాడు.

7. తమకు లాభంఏమిటి అని ఆలోచించకుండా పోనీ వాళ్ళు అడిగితే చూద్దాములే అని ఆగనైనా ఆగకుండా మబ్బులు ప్రపంచాన్ని నీటితో నింపుతాయి. జీవజంతువులు పెరుగుతాయి. ఇంక జ్యోతిష్కుడు "వర్షాలు కురుస్తాయి" అని జ్యోస్యం చెప్పినందుకు ఈ ప్రపంచాన్నే కొనేస్తున్నాడు. ఈ ఆలోచనే నా బుద్ధిలో బాధపెడుతూ తిరుగుతోంది.

12. ఓ నెచ్చెలీ! కాకీ! నువ్వు ఎంతకాలం ఇలా తిరుగుతూ కాలక్షేపం చేస్తావు? ఒక హంసగామారి ఆ తామరకొలనులో మంచి తామరతూడులుతింటూ హాయిగా గడపరాదూ! ఏముంది నీవు చేయవలసిందల్లా ఒకటే. నీ శరీరాన్ని కొంచెం తెలుపు చేసుకోటమే. ఎవళ్ళైనా నిన్ను హంసకాదని తగవుపెడితే ఇక్కడ నేనున్నానులే వాళ్ళ ప్రథమదండాన్ని భరించడానికి.

13. ఓదత్తూర పుష్పమా! ఎవరైనా ఒకసుందరికోరి నిన్ను ధరించాలని కోరిక ఉందా? ఎవరన్నా నీకు నీళ్లుపోశారా? పాదుచేశారా? ఎరువు పెట్టారా? అయినా రోజుకు రెండుమూడుసార్లు పుష్పిస్తున్నావు. నీ గుణాలు ప్రశంసించకుండా ఉండలేము. నీ దుర్వాసన ఇంతటిది కాకపోతే నువ్వు నాకు పారిజాత పుష్పంలాంటిదానివి [పారిజాతమంటే కోర్కెలు తీర్చే దివ్యవృక్షం కల్ప వృక్షం.]

26. మేము వినాయకుణ్ణి ఎప్పుడూ పూజచేస్తాము. అయినా వందలకొద్దీ ఎలుకలను చంపుతాము. భైరవుణ్ణి మా మనస్సుల్లో భావిస్తాము. అయినా కుక్కలను తరిమివేస్తాం,

భూతనాథుణ్ణి (భూతాలు - దయ్యాలు) ప్రస్తుతిస్తాం. కాని మంత్రాలతో భూతాలను కట్టి వేస్తాం. ఒకరిగుణాలవల్ల ఇంకొకరి దోషాలు కప్పబడిపోవు.

## ప్రేమ

**మాయురాజు తాపస వత్సరాజంలో**

పగలంతా చంద్రసదృశమైన ఆమె ముఖం చూడటంతోనే గడచింది. సాయంత్రం అలాగే ఆమెతో ముచ్చటించటంతో గడచింది. రాత్రంతా మన్మథబలంచేత ఆమె తనను తాను సర్పిమంచటంలోనే గడచింది. అయినా ఇప్పుడు (బయటికి వెళ్ళబోతూ) నా బాట వెంటనే చూస్తున్న ఆమె కళ్ళను ఒక్కసారి చూసేసరికి (మళ్ళీ) నా హృదయం కోరికతో నిండిపోయింది ఆహా ! ప్రేమ ఉత్సవానికి అంతం లేదుకదా !

**రాజశేఖరుడు బాలరామాయణంలో**

అనుభవించదగినవాటిలో అగ్రగణ్యమైనదీ, ఇద్దతిమధ్యా సౌందర్యాన్నీ, ఐశ్వ ర్యాన్నీ నాస్తిప్రాయంగా చేసేదీ, ప్రేమకు ప్రాణమిత్రమైనదీ, అత్యల్పకాలంలోనే వందల కొద్దీ పేచీలూ, ఏ సహచరుడి తెలివితేటలూ రకరకాల మాటలూ అవసరంలేకుండానే తీర్మా నాలు కలిగించేదీ అయిన ప్రణయం వర్థిల్లుగాక !

**భోజుడు పేర్కొన్న పేరు తెలియని రచయిత రచన**

నా ప్రియురాలు నాకు నచ్చే పనులే చేస్తుందో ఏమో నాకు తెలియదు కాని ఆమె చేసేదల్లా నాకు రుచిస్తుంది.

**రుద్రుడు**

మిత్రమా నాకు విలువైన బట్టలు లేవు. మెరిసిపోయే హారాలు లేవు. హంస నడకలు లేవు. మధురహాసాలు లేవు. మధుమదం లేదు. అయితే అంతా అంటారూ, "ఆమె మొగుడికి ఆమెమీద ప్రేమ ఎక్కువ. ఇంకొకరివైపు కన్నెత్తయినా చూడడు" అని ఇదే ప్రపంచాన్ని తల్లకిందుల చేస్తున్నది అని అనుకోవాలి.

**యోగవాసిష్ఠము III. 15-31**

అతనికి చిరాకెత్తితే ఆమె చిరాకు పడుతుంది. అతను సంతోషంగా ఉంటే ఆమె సంతోషపడుతుంది. అతడు బాధపడితే ఆమెకూడా బాధపడుతుంది. ఎవని ప్రియు రాలు వానికి నీడలాగా వర్తిస్తుంది. తేడా ఇంతే. అతడు కుపితుడైతే ఆమె భయభ్రాంతు రాలౌతుంది.

**ప్రజ్ఞానానందుడు**

గౌరవ మర్యాదలకు ఏమాత్రం తావు లేకపోతే అది యోగికి ధ్యానం, ప్రేమి కుడికి ప్రేమ. అది సమస్తమైన అశుభాన్ని పోగొడుతుంది.

నీవు కనపడకపోతే నిన్ను చూడాలని కోరిక. నీవు కనపడితే ఎప్పుడూ విరహం కలుగుతుందో అని వ్యథ. నీవు కనపడ్డా కనపడకపోయినా ఏమీ సుఖం లేదు.

"నెచ్చెలీ ! నన్ను జ్ఞాపకముంచుకో." "అది నాకు చేతగాదనుకుంటాను. ఎందు కంటే నేను దేనితో నిన్ను జ్ఞాపకం పెట్టుకుంటానో ఆ నాహృదయాన్ని నీ వెంటనే తీసికొని పోతున్నావు."

---

1. ఇంకా కాళిదాసు, భవభూతి మొదలైనవారి రచనలు చూడండి.

ఒక దక్షిణాదికవి

"నీవుపోవద్దు" అంటే అపశకునమవుతుంది. 'సరేపో' అంటే ప్రేమలేనట్టవుతుంది. 'ఆగు" అంటే ఆజ్ఞాపించినట్టవుతుంది. "నీఇష్టం వచ్చినట్టుచెయ్యి" అంటే ఔదాసీన్యమవుతుంది. "నువ్వు లేకుండా నేను బతకను" అంటే అది కావచ్చు, రాకపోవచ్చు. కనక నాథా! నీవు బయలుదేరేటప్పుడు నేనేమంటే ఉచితంగా ఉంటుందో నువ్వే నేర్పు.

మంచిది. పగలైతే బాగుంటుంది. కాదు. రాత్రే చాలా బాగుంటుంది, పగటికంటే. లేదా ఈ రెంటిలోనూ నాప్రియుని సంగమం లేకపోతే ఈ రెండూ లేకపోవుగాక.

ఓహో! నాదే అదృష్టం. నాదే అదృష్టం. ఆ యువతి భీతచకిత హరిణాక్షి తన అద్భుత విశాలనేత్రాలతో నన్ను చూసింది.

సంయోగం కోరుకొనేవాళ్ళు మూర్ఖులు. నేను వియోగమే కోరుకుంటాను. సంయోగంలో ఆమె ఒక్కతే మాత్రమే కనపడుతుంది వియోగంలో ప్రపంచమంతటా ఆమె రూపాలే.

ఆమెను చూసినవాళ్ళూ చూడని వాళ్లూ కూడా వ్యర్థులైనారు. మొదటివాళ్ళు తమ హృదయం కోల్పోయినారు. రెండవ వాళ్లు తమకు కళ్ళున్న ఫలం పొందలేదు.

నేను విషాదం పొందితే ఆమె విషణ్ణ అవుతుంది. నేను ఆనందం పొందితే ఆమె ఆనందిస్తుంది. నేను ఉదాసీనంగా ఉంటే ఆమె ఉదాసీనురాలౌతుంది. నేనుపరుషంగా కోపంగా ఉంటే ఆమె మంచిమాట మాట్లాడుతుంది. సమయమెరిగి తెలివితేటలతో ఇంగితం చెబుతుంది. మా పరిచయాలతో తృప్తిపొందుతుంది. ఆమె ఒక్కతే పెక్కురూపులతో నాకు భార్య, సలహాదారు, నెచ్చెలి, సేవకురాలు అవుతుంది.

ఉరికే ఆడదంటేనే నాసహనం జారిపోతుంది. ఇంక ఆమె అందగత్తె అంటే ఏం చెప్పేది? ఆమె బోధమూ, అభిరుచీ కలదైతే నాకు దుఃఖం కలుగుతుంది నన్ను ప్రేమిస్తుందీ అంటే నిజానికి నేను భరించనేలేను.

పెద్దవాళ్ళకు చూపించే గౌరవం తరహాలో చేరేదీ, స్నేహితులు వేలుపెట్టటానికి వీలయినదీ, ఏదో ఇచ్చిపుచ్చుకోటం, భయం, బలవంతం, లేకపోతే స్నేహం తీర్చుకోటంవల్ల వేర్పడేదీ, చిన్న చూపుకు లొంగిపోయేదీ, నిలవదీసి ఒట్టేస్తే తేలిపోయేదీ అది ప్రేమా? అది పరిచయము, ప్రేమలో కోపానికి తావుంటుందా?

నీ అవయవాలు కొరుక్కొనితిననా? నిన్ను మింగివేయనా? ఎంత కాలానికో కనపడ్డావు. నిన్నేం చెయ్యాలో తెలియదు.

ఔదాసీన్యం వహించినవాడి పొగడ్తలు గుండెల్లో గుచ్చుకుంటాయి గాని ఒక గొప్ప హాస్యోక్తిలాంటి తిరస్కారం కూడా సంతోషపరుస్తుంది. ఒక దోషంవల్లగాని, గుణంవల్లగాని తరగదు, పెరగదు. అటువంటి సహజ ప్రేమ రాజమార్గమై విలసిల్లుతుంది.

నేనెంత దూరానఉన్న నీదాననే. నీవుకూడా అంత దూరాన ఉన్నా నావాడవే. శరీరాలు కలసిన కలయిక గొప్పదికాదు. హృదయాలు కలసిన కలయికే గొప్పది.

(ప్రేమికకు సందేశం) కారణమేమీ వెతక్కుండానే కలగినదీ, (ఎవరిపట్ల) దోషమున్నా తరగనిదీ, (ఎవరిపట్ల) ప్రశంసలకూ పెరగనిదీ ఈ ప్రేమ అమృతం లాంటిది. ముల్లోకాలూ కలిగించే కష్టాన్ని నశింప జేస్తుంది. అటువంటి ఈ ప్రేమను కొన్ని మాటల్లో వర్ణించి ఎట్లా చౌకచేయను?

## శిశువు[1]

**భట్ట ఉత్కళుడు**

'మీ నాన్న వచ్చాడు' అనే మాటలు వినగానే ఒళ్ళు దుమ్ము కొట్టాడుతున్న లెక్కచెయ్యక, వేరేపిల్లలతో ఆడుకుంటున్న సంతోషాన్ని కూడా వదలి అఖండమైన ఆనందంతో నవ్వుతూ రెండు చేతులుజాపి కొంత దూరంనుంచి మొలగజ్జెలు గల్లుమనగా పుత్రుడు వచ్చి వాలేది ఎంతో అదృష్టవంతునికే లభ్యమవుతుంది.

**భట్ట అర్దసుడు**

రెండు మూడు తప్పటడుగులు దాడిచెయ్యి పట్టుకొని వేస్తూ, తనకు బాగా అలవాటైన మోకాళ్ళమీద పాకడం చేస్తూ, అప్పుడే వస్తున్న పళ్ళు బయట పడేస్తూ ముద్దుమాటలు పలుకుతూ వచ్చే శిశువు వెల్లిగొలిపే ఆనందాన్ని వర్ణింప శక్యమా మిత్రమా!

## మైత్రి[2]

**అభినందుడు**

అరమరికలు లేకుండా నువ్వు మెలగరాని చోట స్నేహానికి సంబంధించిన తగవులతో సంతోషించటం తగదు. మరి పరస్పరం భయభయంగా దూరదూరంగా మెలిగే చోట స్నేహానికి గౌరవంగా స్వస్తి చెప్పటం మంచిది.

**అశ్వఘోషుడు**

అసహనాన్ని గెలుస్తారు పరులమేలుకోసం పాటు పడుతారు. పరుల అభ్యుదయం చూసి సుఖపడతారు. బాధలు చూసి బాధపడతారు. గొప్పవారిని గురించి మంచి వార్తలు వినటానికి ఉత్సహిస్తారు. దౌష్ట్యం అనే సముద్రం పొర్లిపోవటానికి ఒరవకట్ట కడతారు ఇటువంటి మంచివాళ్ళు ప్రకాశింతురుగాక.

**దండి**

ఇవి ఇండ్లు కావు. అడవులు. వీరు స్త్రీలు కాదు. నదులు. వీరు బంధువులు కారు. మృగాలు. కనక నా హృదయం ఆనందంగా ఉంది.

## సుభాషితాలు

శ్రీహర్షదేవుడు : ఐశ్వర్యం దుర్మార్గుడూ, లోభీ, వక్రబుద్ధీ అయినవాణ్ణి పొందకుండా, ఉదారుడూ, ప్రేమికుడూ, మంచీ చెడ్డా తెలిసినవాడూ అయినవాణ్ణి పొందితే అది తన్నుతాను మోసం చేసుకుంటున్నదన్నమాట.

దామోదరగుప్తుడు : మంచితనం, గొప్పకుటుంబంలో జననం, స్వేచ్ఛ, వీటితోపాటు ఆరోగ్యం, విద్య, మైత్రి అనేవి ఉంటే భౌతికసంపదలు లేకపోయినా అతడు సంపన్నుడే.

ఖరనాదుడు : చెరకు పొలానికి పెట్టిన నీరు కలుపు మొక్కలకు కూడా ఉపయోగించినట్టే ఒక పుణ్యంకోసం చేసే పని భౌతికలాభాన్నీ ఆనందాన్నీ కూడా పొందటానికి ఉపయోగపడుతుంది. ఆ పుణ్యకార్యానికి హాని కలిగించకుండానే.

1. కాళిదాసు భవభూతి కిందగూడా చూడండి.
2. భర్తృహరి 1_65 క్రిందకూడా చూడగలరు.

*మయూరాజుడు :* పొట్టేలు వెనక్కుపోయేది ముందుకు వచ్చి విసురుగా తగల టానికే. సింహం కోపంతో దూకబోయేటప్పుడు ఒళ్ళు కుంచించుకుంటుంది. హృదయంలో ద్వేషం కలిగినపుడు తమ కార్యక్రమాలను లోపలదాచుకొని తెలివిగలవారు ఏ చరమ లక్ష్యంకోసం ఓర్పుతో వేచిఉంటారు?

*భల్లవుడు :* గౌరవం నాజోలికిరాదు, శాంతి నిరోధింపబడింది. లజ్జాభావం (అధో ముఖమై) నేలగోకుతోంది. స్వాతంత్ర్యం వెన్నుచూపింది. సహనం నాచేతులు వదలి వెళ్ళి పోయింది. ఇటువంటి పరిస్థితిలో ఓ ఆశా! నీ వెంట పడ్డాను. నాకు దొరికిన ఫలమేమిటి? ఒకప్పుడు ఎవరిని నా కాళ్ళు పట్టుకోనివ్వలేదో వాళ్ళే తమ పాదాలను నన్ను స్పృశించ నివ్వటం లేదు.

*సూతసంహిత [II (ii-53)] :* మానసిక భావన అన్నిటికంటే గొప్పది పవిత్రమైనది. ప్రతిపనిలోనూ పరికించవచ్చు. ప్రియురాలిని కౌగిలించుకోటం ఒక రకం ప్రియ పుత్రికను కౌగిలించుకోటం ఇంకొకరకం.

*రవిగుప్తుడు :* అది కలగనే కలగదు. కలిగినా ఎంతోకాలం ఉండదు. చాలా కాలం ఉన్నా అభిమత ఫలాలను ఇవ్వదు. మంచివారికోపం నీచులమైత్రిలాంటిది.

అజ్ఞాని క్రమంగా జ్ఞాని అవుతాడు. పర్వతం పొడుము అవుతుంది. చెదలు కూడా ఒక పెద్ద వృక్షాన్ని తినేస్తాయి ఇది (నిదానంగా చేసే) అభ్యాసం ఫలితం. హృదయం మని షిలో ఉన్న స్వచ్ఛమైన వజ్రం. అది స్వచ్ఛతను కోల్పోతే అన్నీ కష్టాలే వస్తాయి. మంచి వాడు ఇతరులకు మేలు చేయగోరితే తన ప్రాణంమీదికి వచ్చినా వారికి శత్రువుకాజాలడు. చందనవృక్షం తనను కొట్టిన గొడ్డలికి కూడా పరిమళం కలిగిస్తుంది.

*గోభటుడు :* దుష్టుడు, సజ్జనుడు సూదిలో కిందిభాగం, పైభాగంలాంటివారు. సూది కిందిభాగం గుచ్చికన్నం చేస్తుంది. పైభాగం గుణం (దారం) కలిగి దాన్ని పూడుస్తుంది.

*గోవిందరాజు :* ఆహా! మంచివాళ్ల మనస్సు సముద్రంలాగా ఇంతలోతుగా ఉండటం ఎందుకు? అని వ్యధచెంది కాబోలు వక్రబుద్ధియైన ఆ బ్రహ్మ వాటినిండా ఇత రుల కష్టాలు నింపాడు.

*గోవర్ధనుడు :* ఇతరుల నోటిమీదినుంచి వచ్చినది అపనింద అయినా అది తన ప్రియమైన వాళ్ళనోటినుండివస్తే హాస్యమవుతుంది. ఒకకట్టెనుంచి వచ్చింది పొగ అయితే ఊదువత్తినుంచి వచ్చింది పరిమళద్రవ్యంకదా!

*భాస్కరుడు :* చెడ్డపనులవల్ల వచ్చిన ద్రవ్యంకంటే దారిద్ర్యమే మేలు. రోగం వల్ల వచ్చిన బలుపుకంటే కార్శ్యమే మేలు.

*వల్లభదేవుడు :* సజ్జనుడు ప్రపంచానికి మేలుచేసి ఆనందిస్తాడు. కొందరు తమ ఐశ్వర్యంతోటే తృప్తిపడి ఊరుకుంటారు. సూర్యుడు ప్రపంచం అంతా తిరుగుతాడు. ధన పతి కుబేరుడు కైలాసంలో కూర్చుంటాడు. మనోవాక్కాయ కర్మాల్లో ఒకేవిధంగా ఉండి హృదయం సూటిగా స్వచ్ఛంగా ఉండే ఆ గొప్పవారిని మంచివాళ్లెవరు ప్రశంసించరు?

*భాత్రుడు :* ఓ శనీ! నీ కాంతితో ఇతరగ్రహాలను కప్పివేయలేకుండా ఉన్నావు. చీకటిని పోగొట్టలేవు. ప్రపంచానికి కాంతిని ప్రసాదించలేవు. ఇంక నీవు సూర్యుని కుమా

రుడవని ఏ గుణాన్నిబట్టి నిరూపించగలవు ? ఒక్కఒట్టు వేసుకోటంతో తప్ప.

ప్రబోధ సుధాకరుడు : కప్ప తనను పాము మింగివేస్తున్నా వందల కొద్దీ దోమలను మింగుతూనే ఉంటుంది. అలాగే తాను మరణిస్తున్నా గ్రుడ్డివాడు ఆనందాలను సంపాదించే ప్రయత్నంతోనే ఉంటాడు.

**కాశీపతి ముకుందానందభాణంలో**

*42 శ్లోకం* : 'దుఃఖం మానుకో' అని చెబితే కఠినంగా ఉంటుంది. 'ఈ విచారంవల్ల ప్రయోజనం ఏమిటి ?' అంటే ధిక్కారంగా ఉంటుంది. సానుభూతితో తానుకూడా దుఃఖిస్తే దుఃఖం పెరుగుతుంది. నిశ్శబ్దంగా ఊరుకుంటే జాలిలేనట్టనిపిస్తుంది. ఇంక స్నేహితుని దుఃఖసమయంలో ఎలా ఊరుకోబెట్టాలో మాకు తెలియటంలేదు.

*64 శ్లోకం* : ప్రతివారి నడవడీ ఇతరులకు తెలుసు. అయితే బుద్ధిమంతులు బహిరంగంగా నిందవెయ్యటానికి ప్రయత్నించకపోవటం పరస్పరభయం చేతనే.

## కర్త తెలియనివి

ఇంకొక విధంగా చక్కబెట్టటానికి అవకాశం ఉన్నప్పుడు బుద్ధిమంతుడు బలవంతం చెయ్యడు. నీళ్ళు కావలసిన వాడెవడైనా తాడు, బొక్కెన ఉండగా బావిలోకి దూకుతాడా ?

ఇతరులమీద నిందవేయటంలో మూకత్వమూ, ఇతరుల భార్యలవైపు చూడటంలో పుట్టు గ్రుడ్డితనమూ, ఇతరుల వస్తువులు తీసికొనిపోవటంలో కుంటితనమూ ఉన్న మహాపురుషుడు ఈ ప్రపంచంలో ప్రకర్షగా ఉంటాడు.

గుణాలను దోషాలుగా, పుణ్యాలను పాపాలుగా న్యాయవాది చేయగలడని అంటారు. కాని అది నిజంకాదు. దోషాలు దోషాలే, గుణాలు గుణాలే.

ఒక మంచి వస్తువు కనబడితే దాన్ని మళ్లీ చూస్తాము. దాన్ని గురించి వింటే మళ్లీ వింటాము. మంచిపనుల విషయంలో పునరుక్తి దోషంలేదు.

వాయువు గరికను పెరికి వేయలేదు. చుట్టుపక్కల అటువంటి చిన్నవస్తువులన్నీ నమ్రంగా వంగుతాయి. ఎత్తుగా దర్పంగా నిలచిఉన్న చెట్లమీద వాయువు ప్రతాపం చూపిస్తుంది. శక్తిమంతులు శక్తిమంతులనే ఆక్రమింపచూస్తారు.

అతి సమర్థులకు అసాధ్యమేది ? ప్రయత్నశీలుడికి దూరదేశమేది ? విద్వాంసునకు పరాయిదేశమేది ? మంచిమాటలాడేవాడికి పరాయివాడెవడు ?

గుఱ్ఱము, ఆయుధము, విద్య, వాద్యము, భాష, పురుషుడు, స్త్రీ–ఇవి తాము పొందినవారినిబట్టి మంచివో చెడ్డవో అనిపిస్తాయి.

దుర్మార్గుడికీ, శ్లేష్మానికీ ఎంతదగ్గర సంబంధం ఉంది ! ఇద్దరికీ తియ్యటి వాటివల్ల చేటువస్తుంది, చేదువాటివల్ల సమస్థితి కలుగుతుంది.

అందం పరుల వనితలను వంచించటంకోసమే. ఐశ్వర్యం ప్రజలను బాధించటానికే. శక్తి మంచిదాన్ని చెడగొట్టటానికే. ఇట్లా మంచిగుణాలు కూడా చెడ్డవారి చేతుల్లో పడి చెడ్డవవుతాయి.

బతికిఉన్న జంతువులను చంపటం వేరు. ఇతరుల మర్మాలుగాదేటట్టు మాట్లాడటం

హాస్యమూ చాతుర్యమూను. ఇతరులను బాధించటం వ్యాపారం. ఇట్లాంటివాళ్ళు మృత్యువు కంటే క్రూరులు.

ఆహా ! ఏమి దురదృష్టం ! ప్రపంచం తల్లక్రిందులుగా ఉంది. మంచివాడు దానికేసి చూడటానికి సిగ్గుపడుతున్నాడు. నీచుడు సంతోషిస్తున్నాడు.

మూర్ఖుడు ఏనుగులమీదా గుర్రాలమీదా సవారీచేస్తూపోనీ. పేదవారూ బుద్ధిమంతులూ నడచిపోనీ. కాకులు పర్వతశిఖరాలమీద కూర్చుంటే మాత్రం హంసలతో సమానమవుతాయా ?

వీడు నా వాడనీ, వీడు నా వాడు కాడనీ అనుకోటం అల్పబుద్ధుల పని. ఉదార చరిత్రులైన వారికి ప్రపంచమంతా ఒకే కుటుంబం.

మొసలి నీటిలో ఉన్నప్పుడు పెద్ద ఏనుగునైనాపట్టి గుంజుతుంది. అదే నేల మీదికివస్తే కుక్కకూడా దాన్ని భంగపెడుతుంది.

బాధల్లో ఉన్నవాడు తన బాధలు పోగొట్టగలవాడితో చెప్పుకోవాలి. లేదా వాటిని విని బాధపడేవాడితోనైనా చెప్పుకోవాలి.

అతడు మా భార్యలను స్వేచ్ఛగా చూశాడు. మా యింట్లో స్వేచ్ఛగా భోజనం చేశాడు. మారహాస్యాలన్నీ విన్నాడు. ఇంతకంటే స్నేహం ఇంకేముంది ?

ఇదివరకు ఉపకారం చేసినవారికి మళ్లీ ఉపకారం చెయ్యటం అంటే దాచిన వస్తువును తిరిగి ఇవ్వటమే. తాను దానంచేసి దానికి ప్రతిఫలం కోరేవాడు కేవలం తనకున్న దానిని (ఐశ్వర్యాన్ని) అనుభవించటంలేదా ? తన సాద్గుణ్యంకోసం తగిన వాడికి దానం చెయ్యటం అప్పివ్వటం కాదా ? నిజమైన దానం అంటే తనకెప్పుడూ తెలియని అనాథకు దానం చెయ్యటమే.

మనకు సహాయం చేసినవాడికి అపకారం చేసేవాడు అనుమాన పాత్రుడుకాడు. మంచి మనస్సు కలవాడిగా చలామణీ అవుతాడు. ఓ భూదేవతా ! అటువంటి ద్రోహిని నీవెట్లా భరిస్తావు.

వాడు నీ స్నేహితుడు కదా అని దుర్మార్గుడి మీద ఆశ పెట్టుకోకు. వాడికి నీవు ఎంతో ఉపకారం చేశావు గదా అనేభావం ఏ మాత్రం ఉండదు. మంచి మనిషి అనేది పురాతన కాలం మాట. ఇప్పుడు ప్రపంచం అంతా పైసామీదనే నడుస్తోంది. స్నేహితుడు సహాయం చేస్తాడనీలేదు. చెడ్డ మనస్సు ఉంటే శత్రువు, మనస్సు ఉంటే మిత్రుడు.

"కాలం ఎట్లాంటిది ? మిత్రుడెవడు ? ప్రదేశమెటువంటిది ? లాభనష్టాలేమిటి ? నేనెవరిని ? నా సమర్థత ఎంత ?" అని మనుష్యుడు తరచు అనుకుంటూ ఉండాలి.

అతిపరిచయం ఉంటే గొప్ప విశిష్టగుణం కలిగినదానికికూడా గుర్తింపు ఉండదు. ప్రయాగ (గంగా యమునల సంగమ స్థానం) లో నివసించేవాళ్ళు తమ దొడ్లో బావిలో స్నానం చేస్తారు.

అతి పరిచయముచేత అవజ్ఞ కలుగును. సంతతగమనము వలన అనాదర మేర్పడును. మలయ పర్వతమున భిల్ల వనితలు చందనపు చెట్టు కట్టెలను వంటకుపయోగిస్తారు. కదా !

ఏవిధం చేతనైనా ప్రతివాడూ తనకు లాభం కలిగే పని చేసుకోవాలి. వాగుడు

కాయలు ఎవరేమనుకుంటేఏం? ప్రపంచంలో అందరికీ తృప్తి కలిగించేపని చేయటానికి అవకాశమేలేదు.

వినమ్రులైన పుత్రులూ, గొప్పచదువూ, ఆరోగ్యమూ, సజ్జనసాంగత్యమూ, కోరదగిన వినయవంతురాలైన భార్యా ఈ ఐదూ దుఃఖం నశింపజేసే సాధనాలు.

విజ్ఞులైన సదస్యులూ, మహాభారతపురాణమూ, కావ్యప్రశంసా, జంత్రవాద్యమూ, ప్రశంసనీయమైన పాటా, మనసుకునచ్చిన భార్యా, అటువంటివాడే అయిన స్నేహితుడూ- ఈ ఏడూ దుఃఖాన్ని వెంటనే పోగొడతాయి.

జిత్తులమారి తనంతో స్నేహం కలుపుకోవటం, మోసంతో పుణ్యకార్యం చెయ్యటం, ఇతరులను బాధపెట్టి తాను ఐశ్వర్యవంతుడు కావటం, అలవోకగా విద్యనేర్చుకోవటం, క్రూరత్వంచేత వనితను స్వాధీనం చేసుకోవటం, ఇట్లాంటి పనులతో వీటిని సంపాదించుకో గోరేవారు నిశ్చయంగా మూర్ఖులు.

జన్మసిద్ధమైన వివేకం ఒకకన్ను, కేవలం పాండిత్య సాంగత్యంచేత కలిగేది ఇంకోకన్ను. ఈ రెండూలేనివాడు నిజంగా గుడ్డివాడు. అతడు దారి తప్పితే అతన్ని నిందించవలసిన పనిలేదు.

తన చెలివెల లోంచి ధాన్యం జారిపోతే ఏనుగుకేంనష్టం? అయితే ఆధాన్యపు గింజలమీదనే చీమ తన కుటుంబం అంతటితో బతుకుతుంది.

ఎలుకకూ దుర్మార్గులకూ కూడా ఇతరుల ఇళ్ళకు కన్నాలు తవ్వటం తప్ప వేరే పనిలేదు. అయితే ఈ విద్య ఎవరినించి ఎవరికి వచ్చినట్టు?

ఒక మిత్రుణ్ణి ప్రేమవల్ల వశపరచుకోవచ్చు శత్రుణ్ణి నీతి చాకచక్యంతో లోబరచుకోవచ్చు. లోభిని ధనమిచ్చి తనవైపుకు తిప్పుకోవచ్చు. యజమానునికి పనులు చేసిపెట్టి ఆయనను ప్రసన్నుణ్ణి చేసుకోవచ్చు. ఒక బ్రాహ్మణుణ్ణి దయతో ఆదరించి వశపరచుకోవచ్చు. యువతిని ప్రేమతోను, బంధువులను కలుపుగోలు తనంతోను ఆకట్టుకోవచ్చు. తీవ్రస్వభావులను పొగడ్తలతో లోబరచుకోవచ్చు. పెద్దవారికి నమస్కారాలు మోహనాస్త్రాలు. మూర్ఖులకు కొండెములు చెబితే వశమవుతారు. పండితులకు పాండిత్యం చూపి సంతోషపెట్టవచ్చు. అభిరుచులు కలవారికి వారి రుచులకు తగిన పనులు చేస్తే సంతోషం. ఇట్లా ప్రతివారినీ సముచిత ప్రవర్తతో సంతోషపరచవచ్చు.

లోకంలో ఒక్కొక్కడికి ఒక్కొక్క విశిష్టత ఉంటుంది. అంతేగాని ప్రతివానికీ ప్రతిదీ రాదు. మొగలిపువ్వుకు పండు పుడుతుందా? పనస పండుకు పువ్వుంటుందా? తమలపాకు తీగను పూలు పళ్లూ ఉంటాయా?

అరణ్యాన్ని దహించేటప్పుడు అగ్నికి వాయువు సహాయుడవుతాడు. అయితే ఒక చిన్న దీపాన్ని ఆ వాయువే ఆర్పివేస్తుంది. పేదవారికెవడు స్నేహితుడు!

ఓ నదీ! తాడెత్తున పెరిగే నీవరదలు కొద్దిరోజులే ఉంటాయి. కాని నీగట్టుమీద చెట్లను పెరికివేసిన పాపం చాలాకాలం ఉంటుంది.

మనుజుల అదృష్టం కుంటి. వారి ప్రయత్నం గ్రుడ్డి. ఈ రెండూ విజయవంతంగా పని చేసినట్లే వారి జ్ఞానమూ ప్రవర్తనకలయిక ఉంటుంది.

భార్యనుంచి వియోగమూ, దుర్మార్గులవలన నీలాపనిందా, ఋణశేషమూ, దుర్మా

ర్గుడికింద నౌకరీచేయటం, దారిద్ర్యంలో తనవారిని కలవటం ఈ ఐదూ నిప్పులేకుండానే శరీరాన్ని తగులబెడతాయి.

ఒకడికి విదేశంలో ఎంత అభ్యుదయుం కలిగితే ఏం లాభం ? దానిని శత్రువులు చూడగలరా ? అతని బంధువులు అనుభవించ గలరా ?

పిల్లనివ్వటానికి చూసినట్లే మంచికుటుంబం, విద్య, నడవడి, సామర్థ్యం చూసి విధి దారిద్ర్యం ఇస్తుంది.

సజ్జనులు సత్ప్రవర్తనకోసం పేరుపొందటానికి చాలా కష్టపడాలి. వారికి దారిలో ఎన్నో ఆటంకాలు. ప్రజలు తమను ఎక్కడ విమర్శిస్తారో అని వారు కఠినంగా జీవితం గడుపుతారు. కాని మనస్సులో సంస్కృతి లేకుండా, తాను చేసే పనుల మంచిచెడ్డలను విమర్శించుకోకుండా, ఉచితానుచితాల వివేకం లేకుండా ఉండేమామూలు రకం మనిషి నిజంగా సుఖపడుతాడు.

అతడు భూనభోంతరాలు వ్యాపించి బలిని తొక్కివేశాడు. అయినా అతడు మరగుజ్జువాడని ఇప్పటికీ బాగా చెప్పుకుంటున్నారు. దుర్మార్గపు ప్రపంచం తీరది. అదెప్పుడూ ఇతరుల లోపాలనే ఎంచుతుంటుంది.

సహనము, ఓర్పు, సానుభూతి, శుద్ధత, ఔచిత్యము, ప్రసన్నవాక్కు, పరులకు హింస చేయకపోవటం ఇవి ఏడూ అభ్యుదయ యాగంలో ఏడు సమిధలు.

అతడు వినగల్గినా చెవిటివాడే. చూడగలిగినా గ్రుడ్డివాడే. తెలివితేటలున్నా మూఢుడే. దేశకాలపాత్రల పరిజ్ఞానం ఉన్నవాడే నిజమైన మనుష్యుడు.

మూర్ఖత్వమంటే ఏమిటి? ఎవరికీ ఉపయోగించని పనిచెయ్యాలనుకోవటమే. తెలివంటే ఏమిటి? జాగ్రత్త. మంచి సహచరులెవ్వరు? తనతోటి బాటసారులు. మధురమైనదేది? నలుగురు మిత్రులతో కలిసి భక్షించేది.

సౌందర్యవతి, సంస్కారం గలది, ప్రేమమయురాలు, నచ్చినట్లు మాట్లాడగలిగేదీ, మంచివంశంలో పుట్టినదీ, తన కనుకూలురాలు అయిన భార్య ఎవరికి లభిస్తుంది?

దారువును తొలిచే శక్తిగల తుమ్మెద తమ్మికన్నె తనను కౌగిలించినప్పుడు కదలలేదు. ప్రపంచంలో ఎన్నో బంధములున్నవి గాని ప్రేమబంధమునకు సరియైనది లేదు.

ఇల్లిల్లూ తిరిగే సన్యాసి అడుక్కోటంలేదు. ప్రజలకు బోధిస్తున్నాడు "దానం చెయ్యకపోవటంవల్ల మీరు నాలాంటివారు కాబోకండి. దానం చేసి మీరు ఇలాగే కొనసాగండి" అని.

నెయ్యి కలిపిన వేడి అన్నమూ, చిరుగులేని బట్టా, ఇంకోడికి నౌఖరీ చెయ్యకపోవటమూ - ఇంతకంటే ఎక్కువ కోరినవాడు పడిపోతాడు.

క్షుధార్తుడికి రుచిగా ఉందా? మంచిగా వండిందా? అన్న విచక్షణ ఉండదు. కామార్తుడికి భయమూ సిగ్గూ ఉండవు. విద్యార్థుడికి సుఖమూ నిద్రా ఉండవు. ధనార్తుడికి బంధువులూ పెద్దలూ అనే భావం ఉండదు.

నువ్వేమీ తప్పుచెయ్యటం లేదుగదా అని ఎవనికీ భయపడవలసిన పనిలేదని అనుకోవద్దు. సమర్థుల సద్గుణాలే దుష్టులలో విరోధం కలిగిస్తాయి.

ఈగలు గాయాలను వెదుకుతాయి. దుష్టులు పరుల లోపాలను వెదుకుతారు. తేనెటీగలు పూలను వెదుకుతాయి. సజ్జనులు ఇతరుల సద్గుణాలను వెతుకుతారు.

శీతోష్ణాలూ, ప్రేమభయాలూ, ఐశ్వర్యదారిద్ర్యాలూ ఎవనికి ఆటంకాలూకావో అతడు పండితుడు.

పూల చెట్లను కోసుకుంటారు. పెద్ద వృక్షాలను నరికివేస్తారు. ధనవంతులను పేదలు, బంధువులు పీడిస్తారు సుందరులైన స్త్రీలను కౌగిట్లో నలిపివేస్తారు. నీరు పడేభూమిని తవ్వుతారు. సామాన్యంగా ప్రపంచంలో ఏమాత్రం గుణం లేకపోవటమే మంచిది. గుణం ఉండటం అంటే కష్టాలు కొనితెచ్చుకోటమే.

పంచ మహాయజ్ఞాలు ఇవి : తల్లిదండ్రులను పూజించటం : భార్యకు భర్తను ఆరాధించటం ; ప్రజలందరి యెడల సమభావము ; మిత్రులకు ద్రోహం చెయ్యకపోవటం; భగవంతుని యందు భక్తి కలిగి ఉండటం.

నీటిలోవేసిన నూనే, దుష్టుడికి చెప్పిన రహస్యం, తగినవానికి ఎప్పుడో ఒకప్పుడు ఇచ్చిన దానం, తెలివికలవానిలో ఉన్న జ్ఞానం - ఇవి తమ సహజశక్తిచేత వ్యాపిస్తాయి.

నా శత్రువులు సుఖముగా నుందురుగాక ! వాళ్ళ అనుగ్రహంవల్ల నేను నిర్దోషుణ్ణయినాను. ఎప్పుడైనా నా మనస్సు జారితే వాళ్ళు నాకు జాగరూకత కలిగిస్తున్నారు.

ఉత్తమజాతి గుర్రాలు కొరడాదెబ్బలను సహించవు. సింహాలు మేఘగర్జనను సహించవు. ఉత్తమ బుద్ధిమంతులు ఇతరులు తమవైపు వేలుచూపి చెప్పటాన్ని సహించరు.

ప్రజలు ఒకరివంక శుష్కముఖాలతో చూసుకుంటూ దూరంనుంచి ఎవరినివేలెత్తి చూపుతారో అతడు శ్వాసవిడుస్తున్నా నిజానికి మరణించినవాడే.

ఎవరూ నాలుకను తెగకొయ్యరు. తాలువులు పడిపోవు. భయం లేకుండా మాట్లాడ వలసిందే. వాచాలుడైనవాణ్ణి ఎవణ్ణి పండితుడనుకోరు ?

లంచం, బహుమానం, అద్దె, హాస్యోక్తి, పడవకేవు, వేటలో భాగం - ఈ ఆరూ వెనువెంటనే పుచ్చుకోవాలి. తరువాతరావు.

ఒక్కపనితో ప్రపంచాన్నంతటినీ ఆకట్టుకోదలచుకుంటే నీ మాటలనే గోవులను ఇతరుల నీలాపనిందలనే పైరు మెయ్యనియ్యవద్దు.

మూర్ఖులే ఇతరులమీద నిందలు వెయ్యటంలో గొప్పపండితులు. వారు ఇప్పుడొక మాట, ఇంకకొంత సేపటికి ఇంకొక మాట చెబుతారు. వారికి పునరుక్తి అంటే భయం కాబోలు.

నీవు వినయంగా ఉంటే జడుడవనుకుంటారు. శక్తివంతుడవుగా ఉంటే వివేకం లేదంటారు. నిశ్శబ్దంగా ఉంటే వృద్ధుడవంటారు. దయగా మాట్లాడితే మస్కారాయుడవంటారు. తీవ్రంగా మాట్లాడితే గర్విష్ఠుడవంటారు. వక్తవుగా ఉంటే వాగుడుకాయ అంటారు. నిశ్చలంగా ఉంటే నపుంసకుడివి అంటారు. ఇంక మూర్ఖులచే మలినీకరింపబడని ఏగుణాన్ని సజ్జనులు చూపగలరు ?

రావణుడు పరుడి భార్యను ఎత్తుకొనిపోవటం తప్పని అనుకోకపోవటం ఎలా ? రాముడు ప్రపంచంలో బంగారులేడి ఉండదని అనుకోకపోవటం ఎలా? యుధిష్ఠిరుడు జూదం సర్వాపహారియైన వ్యసనం అనుకోక పోవటం ఎలా? ఇంతకూ కష్టాలు తరుముకొని వచ్చేటప్పుడు మనిషిలో వివేచన జారిపోతుంది.

కారణం లేకుండానే కోపం తెచ్చుకొనేవాళ్ళు అసంఖ్యాకులు. ఏదో ఒక కారణం చేత కోపగించేవాళ్ళు వేళ్ళమీద లెక్కపెట్టదగి ఉంటారు. మరి ఇంకకారణమున్నా కోపగించని వాళ్ళు ప్రపంచంలో ఏ ఐదారుగురో ఉన్నారు.

ప్రాణాన్ని లెక్కచెయ్యకుండా వారు తమ కీర్తిని రక్షించుకుంటారు. వారికి శత్రువులంటే భయం లేదుగాని పాపాలంటే మహాభయం. వారు యాచకులకోసం చూస్తుంటారు. తమ స్వార్థాలకోసం కాదు. ప్రపంచంలో మహానుభావుల రీతి ఇది.

మిత్రమా ! అనుబంధమనేది హృదయంలో పుట్టిపెరిగే ఒకలత. అది బాగా చిగిరించాలంటే స్నేహపు మాటలనే అమృతంపోసి పెంచాలి.

కేతకీ పుష్పాన్ని ముళ్ళు గుచ్చుకుంటున్నా తేనెటీగ వదలకుండా తిరుగుతుంది. గుణానుసారులైనవారిని ఆపదలేం చేస్తాయి ?

సంగంవల్ల బాధలు వస్తాయి. రుచులవల్లనుంచి వ్యాధులు వస్తాయి. అత్యాశనుంచి పాపాలు వస్తాయి. ఈ మూడింటిని వదిలిపెడితే మానవుడు సుఖంగా ఉంటాడు.

మొదట మధురంగానూ చివరికి మనుష్యులందరికి తెలిసేటట్టూ ఉండి వివిధ విద్యాసారామృతంతో ప్రతి అక్షరాన్ని ముంచెత్తిన అటువంటి వాక్కులు పండితుల హృదయ పద్మాలనుండి సువాసనలతో వస్తూంటే ఎవరికి ఆనందం కలగదు ?

# అస్సామీస్

మూలం :
డాక్టర్ మహేశ్వర్ నెఉగ్

అనువాదం :
శ్రీ. వి పతంజలి

## చారిత్రక సమీక్ష

క్రీస్తుశకం పదకొండవ శతాబ్దం నాటికి నవీన ఇండో-ఆర్యన్ భాషలు ఉత్పన్నం కావడం ఆరంభమయింది. వీటిలో మిక్కిలి ప్రాచ్యమయిన అస్సామీస్ (అస్సామియా) భాషలో పన్నెండో శతాబ్ది తొలి భాగానికి చెందిన రచనలేమీ కనుపించక పోయినా, క్రీ. శ. 8-12 శతాబ్దాల మధ్యకాలం నాటి 'చర్య'లనే గీతాలు లభ్యమవుతున్నాయి. ఇవి సహజయాన పంథావారి రహస్యతంత్రములు, శృంగారాత్మక చర్యలకు సంబంధించిన రచనలు. తూర్పు భారతంలోని భాషలన్నీ ఈ గీతాలను తమ సాహిత్యానికి చెందినవి గానే భావిస్తాయి. కాని వీటిలో కొన్ని గీతాలూ, వాటిని వ్రాసిన సిద్ధపురుషులు కామరూప ప్రాంతానికి చెందిన వారని భావించడానికి అవకాశం లేకపోలేదు. కామరూప ప్రాంతంలో వివిధ సంప్రదాయాల తాంత్రిక బౌద్ధం ప్రచారంలో ఉండేది కదా!

అస్సామీస్ అని విస్పష్టంగా చెప్పదగిన భాషలో సాహిత్యం అవతరించిన నాటికే, ఈ భాషలో నిర్దుష్టమైన శబ్దాలూ, వాక్య నిర్మాణ చాతురీ, ఛందోబద్ధమైన పద్యరచనా రీతులూ కనబడుతున్నాయి. ఇవి 'పయారా' 'త్రిపది' ఛందములుగా కనబడతాయి. ఈ కాలానికి చెందిన కవులలో మాధవకందలి (క్రీ. శ. 1400) సుప్రసిద్ధుడు. రామాయణ కావ్యంలోని అయిదు ప్రధాన కాండములనూ దేశీయమైన పలుకుబడిగల అస్సామీస్ భాషలో పద్యబద్ధం చేశాడు. హరిహరవిప్రుడు, హేమసరస్వతి అనే ఇద్దరు కవులూ దుర్లభనారాయణుని (క్రీ.శ. 1400) పరిపాలనా కాలానికి చెందినవారు. కవిరత్న సరస్వతి దుర్లభనారాయణుని కుమారుడైన ఇంద్రనారాయణుని రాచరికమునాటివాడు. హరివరకవి ఈ యుగానికి చెందిన అగ్రశ్రేణి కవులలో రెండవవాడు. ఇతడు శ్రీరామచంద్రునితో కుశలవ కుమారులు కావించిన యుద్ధము, జైమినీయ అశ్వమేధ పర్వమునుండి అర్జునుడు తన కుమారుడైన బభ్రువాహనునితో చేసిన పోరాటము ఆదిగాగల కథలను గ్రంథస్థము చేశాడు. హేమసరస్వతి అనే కవి వామన పురాణములోని ప్రహ్లాద-హిరణ్యకశిపుల వృత్తాంతమును నూరుపద్యములుగా వ్రాశాడు. అనేక పురాణములనుంచి సేకరించిన ఇతివృత్తముల ఆధారంగా హరగౌరీ సంవాదమనే కావ్యమును కూడా ఈ కవి వ్రాశాడని అంటారు. ద్రోణ పర్వంలో భాగమైన జయద్రథ వధ ఉపపర్వంలోని కొంతభాగాన్ని కవిరత్న పద్యరూపంగా వ్రాశాడు.

దేశంలో శంకరదేవుడు (1449-1568) ప్రచారం చేసిన నవ్య వైష్ణవోద్యమము వలన నూతన సాంస్కృతికోజ్జీవనం వెలిసింది. ఈ ఉద్యమానికి చెందని వారైన మంకర, దుర్గావర కాయస్థ, పీతాంబరకవి అనే ముగ్గురు కవులు క్రీ. శ. 16వ శతాబ్ది ఆరంభంలో రచనలు సాగించారు. సర్పారాధన ప్రధానమైన 'మనస' సంప్రదాయానుగుణంగా అస్సామీస్ భాషలో దేశీయ పురాణం సృష్టించాలని మంకర, దుర్గావర ప్రయత్నించారు. ఇది గేయ ఫణితుల్లో ఉన్నది. దుర్గావరుడు రామాయణాన్ని రాగబద్ధమైన గీతాలుగా (ఎడనెడ పద్యాలతో) వ్రాశాడు కూడా. ఇదే పద్ధతి ననుసరిస్తూ పీతాంబరుడు ఉషాపరిణయం, భాగవత దశమస్కంధం, నలదమయంతి, చండీ ఆఖ్యానం వ్రాశాడు. ఆనాడు వంగ ప్రాంతంలో ప్రచారములో ఉన్న 'పాంచలీ' లేదా 'పంచలి' రీతిలో వ్రాయడం వల్లనూ, ఇతివృత్తభేదం వల్లనూ ఈ ముగ్గురి కవితాసృష్టి సమకాలిక వైష్ణవ సాహిత్యం కన్న భిన్నంగా విశిష్టంగా నిలిచింది. వీరి కవిత్వం ఆలోచనామృతం కాక వైష్ణయిక ప్రబోధంగా ఉంటుంది.

శంకరదేవుని వైష్ణవ సిద్ధాంతం ఏకేశ్వర ప్రతిపాదకము. "ఏకశరణ నామధర్మ' వనే ఈ సంప్రదాయం శ్రీకృష్ణపరమాత్ముని లీలలను, కీర్తిస్తుంది. కృష్ణభక్తిని ప్రోత్సహిస్తూ, ఇతర దేవీ దేవతల ఆరాధనను నిరసిస్తుంది. ఈ ఉద్యమము అస్సామీస్ భాషలో నూతన సారస్వత చైతన్యాన్ని రేకెత్తించింది. శంకరదేవుడూ, ఆయన ప్రధాన శిష్యుడూ ఆయన సిద్ధాంత ప్రచారకుడూ అయిన మాధవదేవుడు ఎన్నో గీతాలు, నాటకాలు, పద్యకావ్యాలు వ్రాశాడు. శంకరదేవుడు స్వయంగా భాగవత పురాణంలోని ఎనిమిది స్కంధాలు అనువదించడమే కాక, తక్కిన గ్రంథాన్ని అనూదించమని దారి చూపిస్తూ ఇతర కవులను ప్రోత్సహించాడు. ఆయన సాహిత్య సృష్టికి మకుటాయమానమైన కీర్తనఘోష అనే గ్రంథం భాగవత పురాణ సారాంశమే. శంకరదేవుడు 'వ్రజబులి' అనే నూతన నుడికారాన్ని రూపొందించి తమ హరగీతాలూ, పత్నీప్రసాదము. కాళీదమనము, కేళీగోపాలము, రుక్మిణీహరణము, పారిజాతహరణము, రామవిజయము అనే నాటకాలు వ్రాశాడు. పాత్ర ఆవిష్కారాదులలో సంస్కృతనాటక రీతులు కొన్ని కనబడినా, నిర్మాణ విధానంలోను, ఇతర లక్షణాలలోనూ ఈ నాటకాలు భిన్నమైనవి.

మాధవదేవుడు వ్రాసిన హరగీతాలలోనూ, భోరధరా, పింపార గుసువా అనే నాటకాలలోనూ గురువును మించగల శిల్పచాతురి గోచరిస్తుంది. శంకరదేవుని సాహిత్యంలో దాస్యభక్తి ప్రధానమయితే, మాధవదేవుని రచనలలో వాత్సల్యభక్తి ప్రాముఖ్యత వహిస్తుంది. చిన్నికృష్ణుని కొంటెపనులను వర్ణించడంలో, యశోదమ్మనూ, బృందావన గోపికలనూ ఆ పరమాత్ముడు వేధించిన తీరూ, వారికి అధీనుడై పోయిన విధమూ గ్రహించి విస్తుపోతాడు కవి. నామఘోష అనే వేయి ద్విపదల కావ్యం మాధవదేవుని రచనల్లో ప్రధానమైనది. భక్తుడుగా, ఆధ్యాత్మిక జిజ్ఞాసువుగా, కవి అనుభూతులు అక్షరరూపం దాల్చిన అపూర్వ కావ్యమిది

శంకరదేవుని కాలానికి చెందిన మరో ఇద్దరు ప్రముఖ కవులు అనంత కందలి, రామసరస్వతి. భాగవత దశమస్కంధం ఉత్తరార్థాన్ని అస్సామీస్ భాషలోనికి అనువదించమని నాయకునిచే ఆదేశం పొందినవాడు కందలి. భక్తి ప్రపత్తులతో గురుసత్తముని కొలిచి తరించినవాడు రామసరస్వతి. ఉషా అనిరుద్ధుల ప్రణయగాథ అయిన కుమారహరణ మనే

కావ్యమే అతని ప్రశస్తరచన. ఇదికాక, భాగవత పురాణ భాగాలనూ అనువదించాడు; రామాయణ కావ్యాన్ని తిరిగి వ్రాశాడు. రామాయణ రచనలో మాధవకందలి నుంచి ఇతడు కొంతవరకు గ్రంథచౌర్యం చేశాడు కూడా. రామసరస్వతి విస్తారంగా మహాభారత ఇతివృత్తాలను వస్తువుగా స్వీకరించాడు. అరణ్యపర్వంలో పాండవుల రాక్షస సంహార గాథలను బాగా విస్తరించి అతిశయోక్తులతో నింపివేశాడు. జటాసుర వధ మనే కావ్యం వ్రాసిన సాగర ఖరి మొదలైన కవులు ఈ విషయంలో రామసరస్వతిని అనుకరించారు. రామసరస్వతి భీమ చరిత మనే హాస్యగ్రంథ మొకటి కూడా వ్రాశాడు. దీనిలో శివుడొక రైతుగానూ, భీముడు పాలికాపుగానూ వర్ణింపబడ్డారు. శ్రీధర్ కందలి కాన్‌ఖోవా (చెవి కొరుకుడుగాడు) అనే సుప్రసిద్ధమైన హాస్యగ్రంథాన్ని బాలగేయాల రూపంలో హృద్యంగా వ్రాశాడు.

గోపీనాథ పాఠక్, దామోదర సాస, లక్ష్మీనాథ ద్విజ, పృథురామ ద్విజ మొదలైన కవులు మహాభారత ఘట్టాలను అస్సామీస్ భాషలో పద్యరూపంలో వ్రాయ నారంభించారు. హృదయనాథ కాయస్థ మొదలైన కవులు రామాయణ భాగాలను అనువదించ పూనుకున్నారు. అప్పటి ప్రధానమంత్రి అయిన పూర్ణానంద బురగుహాయ్ ప్రోద్బలంతో శ్రీకాంత సూర్యవిప్రుడు (19 వ శతాబ్ది ఆరంభం), గోస్వామి తులసీదాసు విరచితమైన రామచరిత మానసమనే అవధి భాషా కావ్యాన్ని పద్యాలలో అనువదించాడు. భగవద్గీతను గోవింద మిశ్ర, రత్నాకర మిశ్ర అనేవారు పద్యాలలో వ్రాశారు. గోపాల చరణ ద్విజ (16వ శతాబ్ది), భవానంద మిశ్ర (16వ శతాబ్ది), విద్యాచంద్ర భట్టాచార్య (18వ శతాబ్ది) హరివంశ కావ్యానికి సంవాదములు వ్రాశారు. చివరి ఇద్దరు కవులూ మూలంనుంచి ఎంతో స్వతంత్రించారు. పురాణాలు చాలామంది కవులను ఆకర్షించాయి. వారిలో ప్రతిభాశాలురు చాలామంది భాగవత పురాణం మీదనే దృష్టి కేంద్రీకరించారు. శంకరదేవుడు, అనంత కందలి, అనిరుద్ధ కాయస్థ (మాధవదేవుని సవతిసోదరుని మనుమడు, 16 వ శతాబ్ది), మరి యొక అనిరుద కాయస్థ (మాయామర అనే సంఘర్షణాత్మక వైష్ణవశాఖకు ప్రవర్తకుడు), గోపాలచరణ ద్విజ (16వ శతాబ్ది), కేశవదాస కాయస్థ (శంకరదేవుని సవతి సోదరుని మనుమడు, 16వ శతాబ్ది), నిత్యానంద కాయస్థ (17వ శతాబ్ది) మొదలైనవారు భాగవత ఇతివృత్తాలనే స్వీకరించారు. ఇతర పురాణాల అనువాదాలను సంవాదాలను గ్రహించిన వారిలో భాగవత మిశ్ర (విష్ణుపురాణం), 18వ శతాబ్ది ఆరంభానికి చెందిన ( ? ) భువనేశ్వర వాచస్పతి మిశ్ర (బృహన్నారదీయ పురాణం), రుచినాథ కందలి (18వ శతాబ్ది) (మార్కండేయ పురాణం, చండీ ఆఖ్యానం), రంగనాథ ద్విజ చక్రవర్తి (17వ శతాబ్ది) ప్రభృతులను గూర్చి చెప్పుకోవాలి.

కలాప చంద్రుని రాధాచరిత, రామాద్విజుని మృగావతీ చరిత, పశుపతి ద్విజుని చంద్రావళీ - విశ్వకేతు, ద్విజవరుని మాధవ - సులోచనా - ఉపాఖ్యానం, అజ్ఞాతకవి ఒకరు వ్రాసిన మధుమాలతి మొదలైనవి ప్రాచీన అస్సాము భాషలోని శృంగార ప్రబంధాలు. ఉత్తర హిందూస్థానపు కవులైన కుతుబన్, మన్‌జహార్ వంటి వారి ప్రభావం ఈ తరగతి సాహిత్యం మీద బాగా కనబడుతుంది. సంచార కవియైన కవిరాజ సూర్యవిప్రుడు వ్రాసిన సివల్‌గోశ్రీ (ఝంఝుక యతి, 1616 సం.) అను కావ్యము షసితనంలో త్రోదేశ్లచే పెంఛఖడిన

ఒకానొక వైష్ణవ భక్తుని జీవితగాథ. రామానంద ద్విజుడు కృష్ణమిశ్ర కృతమైన ప్రబోధ చంద్రోదయమనే అన్యాపదేశ నాటకము ఆధారంగా మహామోహ కావ్యమనే గ్రంథం వ్రాశాడు. రామమిశ్ర అను కవి హితోపదేశము, ద్వాత్రింశత్పుత్తలిక అనే గ్రంథాలను అస్సామీస్ భాషలోనికి అనువదించాడు. బృందావన చరితమనే మరో గ్రంథంలో ఇతడు బృందావనంలోని పవిత్ర క్షేత్రాలను కళ్లకు కట్టినట్టు వర్ణించాడు.

అస్సాములోని వైష్ణవ మహంతులు చాలామంది శంకరదేవ, మాధవదేవులు వ్రాసిన హరగీతాలను అనుకరిస్తూ గేయాలు రచించారు. 18వ శతాబ్ది తొలి పాదంలో ఇటువంటి కృష్ణభక్తి మూలక గేయాలకు శాక్తగేయాలు, రాధాకృష్ణ భక్తిగేయాలు చేర్చబడినవి. ఇటువంటివి వ్రాసిన వారిలో పాలకులైన రుద్రసరసింహ (1696 - 1714), శివ నరసింహ (1714 - 1744), ఇతరులు కొందరు ఉన్నారు. వారిలో ఒకరైన రామ నారాయణ కవిరాజ చక్రవర్తి గీత గోవిందమూ, బ్రహ్మవైవర్త పురాణంలోని కృష్ణజన్మ కాండమూ, అదే పురాణంలోని ప్రకృతి ఖండంనుంచి సాంఖ్యచూడ - తులసి వృత్తాంతము అనువాదం చేశాడు. చంద్రకేతు - కామకళ శృంగారగాథను చెప్పిస్తూ శాకుంతల కావ్యం వ్రాశాడు. రామచంద్ర బడపాత్ర అను కవి యోగినీ తంత్రంలో కొంతభాగాన్ని అనువదించాడు. ఇతడొక రాజోద్యోగి. కామరూప జిల్లాలోని హజో అనే ప్రదేశంలో ఉన్న హయగ్రీవ - మాధవ దేవాలయపు అర్చా విధానంలో ఈ గ్రంథం ఉపయోగపడేది. అనంతాచార్య అనే మరోకవి ఆదిశంకరుల సౌందర్య లహరి ఆధారంగా అస్సామీస్ భాషలో ఆనంద లహరి వ్రాశాడు. నారాయణ దేవుని దేశీయ పద్మపురాణంలో మనసా సంప్రదాయం కీర్తించబడింది.

శంకరదేవునీ, మాధవదేవునీ అనుకరిస్తూ ఎందరో వైష్ణవ మఠాధిపతులు నాటకాలు వ్రాశారు. వాటిలో కొన్ని గుణవంతములైనవి ఉన్నాయి. అవి నేటికీ పల్లె ప్రాంతాలలో ప్రదర్శింపబడుతూనే ఉన్నాయి.

పద్యరూపంలో జీవిత చరిత్రలు వ్రాసే పద్ధతిని దైత్యారి భూషణుడు, వైకుంఠ కవి, రామానంద (17వ శతాబ్ది) ఆరంభించారు. వీరందరూ శంకరదేవుని జీవిత వృత్తాంతాన్ని వ్రాసిన వారే. ఈ పద్ధతిని తర్వాత తరాల కవులు కూడా అనుసరిస్తూ వచ్చారు. సూర్యఖరి దైవజ్ఞుడు (1798 సం.), రతికాంతుడు (18వ శతాబ్ది) ఆదిగాగల కవులు కామరూప ప్రాంతాన్ని ఏలిన కోచ్ రాజుల జీవిత విశేషాలను వ్రాశారు. 19వ శతాబ్దంలో విశ్వేశ్వర, దుటిరామ కవులు అహోమ్ సామ్రాజ్యపతన గాథను పద్యాలలో వ్రాశారు. పద్య కవిత్వ ప్రయోగము ప్రయోజనాత్మక కళలకు కూడా వ్యాపించింది. బకుల కాయస్థ కవి (1434 సం.) గణితశాస్త్రం, భూమి కొలతలు, చితా - ఆవర్జాల వివరాలు చేర్చిన కితాబత్ మంజరి అనే పద్యకావ్యం వ్రాశాడు.

శంకరదేవుడు, మాధవదేవుడు వ్రాసిన నాటకాలలో అస్సామీస్ భాషలో గద్య రచనకి తొలి దృష్టాంతాలు కనబడతాయి. వచన రచన అంతా వ్రజబులి పలుకుబడితోనే సాగింది. క్రమంగా ఈ సంప్రదాయం చాలా బలం పుంజుకొంది. వైకుంఠనాథ భాగవత భట్టాచార్య (1558 - 1638) తన భాగవత పురాణ, భగవద్గీత అనువాదాలలో ప్రాచీన

కవుల కృతక భాషనూ, అన్వయరీతులనూ వాడాడు. దాదాపుగా అదేకాలంలో, కవిగా కొంత పేరు తెచ్చుకున్న గోపాలచరణ ద్విజుడు, భక్తిరత్నాకరమనే శంకరదేవుని సంస్కృత గ్రంథాన్ని ప్రసన్నమూ కోమలమూ అయిన వచనంలో వ్రాశాడు. రఘునాథ మహంత వ్రాసిన కథారామాయణం (సుమారు 1658 సం.). ఒకానొక అజ్ఞాత కవి కృతమైన పద్మపురాణము, క్రియా యోగసారము, కృష్ణానంద విరచితమైన సత్యతంత్రమూ; కథాఘోష మొదలైనవి తరవాతి శతాబ్దములలో వెలువడిన ఇతర పురాతన గద్య కృతులు.

వైష్ణవ కవుల కథా గురుచరిత్రల్లోను, బురంజి లనబడే అహోమ్ రాజుల ఇతిహాస గ్రంథాలలోను నిత్యవ్యవహారంలోని వచనశైలి వాడబడింది. ఈ రెండు విధాలైన వచన రీతులూ, 17వ శతాబ్ది చతుర్థ పాదం నుంచీ అవిచ్ఛిన్నంగా ప్రయోగంలో ఉంటూనే ఉన్నాయి. పురానీ అసమ్ బురంజి (గోస్వామి సంపాదకత్వము 1922), అసమ్ బురంజి (డాక్టర్ భూయాం సంపాదించినది 1945), కథా గురుచరిత (లేఖారు సంకలన 1952) శిల్పసౌందర్య విలసితములయిన ప్రాచీన వచన కావ్యాలు; ఇవి చరిత, బురంజి రీతుల సాహిత్యానికి దృష్టాంతంగా చెప్పుకోదగిన గ్రంథాలు. ఈ విధమైన ఇతిహాస రచన 19 వ శతాబ్ది ఆరంభం వరకూ ప్రాచుర్యంలో ఉంది. కాశీనాథ ఫూకన్, మణిరామ్ దివాన్ బరువా (1357 విప్లవవీరుడు), హరకాంత బరువా వ్రాసిన అస్సామ్ చారిత్రక గ్రంథాలు ఈ కాలానికి చెందినవే.

కొత్తగా వాడుకలోనికి వచ్చిన వచనశైలిలో ప్రయోజనాత్మక శాస్త్రగ్రంథాలు కూడా వచ్చాయి. గజశాస్త్ర సంబంధమైన సంస్కృత గ్రంథానికి అనుసరణగా సుకుమార బడకత్ వ్రాసిన హస్తి విద్యార్ణవము (1734), ఒక అజ్ఞాత రచయిత వ్రాసిన చోర నిదానము అనే అశ్వరోగ చికిత్సా గ్రంథం, గణితశాస్త్రంపై కాశీనాథ కృతమైన అంకార్ ఆర్య, నృత్యమందలి హస్తాలపై శుభంకరుడు వ్రాసిన హస్తముక్తావళి (నెఉగ్ సంపాదన 1964) అనే గ్రంథమూ చెప్పుకొనదగినవి.

బ్రిటీషువారూ, బర్మీయులూ చేసుకున్న యండాబు ఒప్పందం (1826) ప్రకారం రెండవ కంటివాడికి తెలియకుండా అస్సాము బ్రిటిషువారి అధీనమయింది. తత్ఫలితంగా దేశము మృత్యుచ్ఛాయా క్రాంతమయింది. 1836 సం. ప్రాంతాల స్కూళ్ళలో, న్యాయస్థానాలలో అస్సామీస్ స్థానంలో బెంగాలీభాష నెలకొన్నది. అప్పుడు-గత శతాబ్ది మధ్య భాగంలో-నిద్రాణమైన స్వభాషాభిమానము అస్సాము ప్రజలలో ఉద్బుద్ధమయింది. అమెరికన్ మిషనరీలు అస్సామీస్ భాషలోనూ, అస్సామీస్ భాషను గురించీ గ్రంథాలు ప్రచురించడంతో ప్రజలలో స్వభాషాచైతన్యం బలపడింది. కాశీనాథఫూకన్ చరిత్ర (1844), రెవరెండ్ నథాన్ బ్రౌన్ వ్రాసిన "గ్రమెటికల్ నోటీసెస్ ఆఫ్‌ది అస్సామీస్ లాంగ్వేజ్" (అస్సామీసుభాషా వ్యాకరణ సూచనలు-1844) డాక్టర్‌మిల్స్ బ్రోన్‌సన్ తయారుచేసిన "అస్సామీస్-ఇంగ్లీష్ డిక్షనరీ (అస్సామీస్-ఆంగ్లభాషా నిఘంటువు-1867) ఈ రోజులలో ప్రచురించబడినవే. అయితే, 1818 లోనే బెంగాల్‌లోని సెరాంపూర్‌నుంచి ఇంగ్లీషు మిషనరీలు బైబిల్‌ను అస్సామీస్ భాషలో ప్రచురించారు. స్థానిక ప్రజలకు ఆధునిక దృక్పథమూ, ఆధునిక భావాలతో త్రాలి

పరిచయం కలిగించిన అస్సామీస్ మాసపత్రిక **"అరుణోదయ"** అనునది. అమెరికా బాప్టిస్టు మిషనువారు 1846 సం.లో ఈ పత్రిక ప్రచురణ ఆరంభించారు. ఈ మిషనరీలున్నూ, ఆనందరామ్ పూకనచేసిన కృషివలన 1873 సం. నాటికి అస్సామీస్ భాషకు తిరిగి అధికార గౌరవం లంభించింది. సాహిత్యరంగంలో నవచైతన్యం రేకెత్తడానికి దారి ఏర్పడింది.

ఆధునిక అస్సామీస్ భాషను ప్రమాణీకరించేందుకు వ్యాకరణాలు, నిఘంటువులు తయారుచేసి, వ్యంగ్యరచనలద్వారా సమాజంలోని లోపాలను తొలగించడానికి పూనుకుని అమోఘమైన సేవచేసిన వ్యక్తిగా హేమచంద్రబరువా పేరు మొదట స్మరించుకోవాలి. ఆయన వ్రాసిన బాహిరెరంగ్-చంగ్ భీతరె కోవా భటూరి (1861) అనే నవలికవంటి వ్యంగ్యాత్మక వ్యాసము, కనియా కీర్తన అనే నాటిక చెప్పుకోదగినవి. ఆధునిక యుగంలో మొదటి చరిత్ర గ్రంథము, జీవిత చరిత్ర వ్రాసినవాడు గుణాభిరామ్ బరువా. అన్త్యప్రాసలేని ఛందంలో తొలి కావ్యం వ్రాసినవారు-రమాకాంత చౌధురి. భోలానాథదాస్ (అభిమన్యువధ 1875. సీతాహరణం 1888).

అయితే ఆధునిక అస్సామీస్ సాహిత్యంలో మేరుసమానవ్యక్తిగా నిలిచే సాహితీవేత్త లక్ష్మీనాథ బెజ్‌బరువా (1968 సం.లో శతజయంతి జరిగింది). 1889 లో ఆయన తన సహచరులైన చంద్రకుమార్ అగర్వాలా, హేమచంద్ర గోస్వామి తోడ్పాటుతో 'జోనకి' అనే మాసపత్రిక స్థాపించాడు. హేమచంద్ర బరువా రూపొందించిన శైలిని మరింత పరిపుష్టంచేసి, ఆధునిక అస్సామీస్ భాషను అనేక సాహితీ ప్రక్రియలకు తగిన మాధ్యమంగా రూపుదిద్దాడు. సాంఘిక, రాజకీయ, సారస్వత ఆక్షేప కావ్యరచనలలో హేమచంద్రబరువా ప్రభావం బెజ్‌బరువామీద స్ఫుటంగా కనబడుతుంది. ఆయన కథలు, నవలలు, నాటకాలలో ముఖ్యంగా చెప్పుకొనవలసిన విషయమేమంటే వాటిలో కనబడే పాత్రలన్నీ సానికమైన అస్సామీసు ముద్ర కలిగిఉండటం. 19వ శతాబ్ది తొలి సంవత్సరాల ఇంగ్లీషు కవిత్వంలోని 'రొమాంటిసిజమ్' పరిమళాలు బెజ్‌బరువా, గోస్వామి, అగర్వాలా మొదలైనవారు అస్సామీస్ సాహిత్యంలో ప్రవేశపెట్టారు. ఆత్మాశ్రయమూ, లౌకికమూ అయిన కవిత్వం అస్సామీస్ భాషలో రానారంభించింది. తర్వాత తర్వాత దేశప్రాచీన చరిత్రపరిశోధనలలో మునిగిపోయినా, గోస్వామి అస్సామీస్ భాషలో తొలిసారిగా చక్కని 'సానెట్'లు వ్రాశాడు. అగర్వాలా ఉదాత్త ఆదర్శవాదంవైపు మొగ్గాడు. కమలాకాంత భట్టాచార్య గాఢమైన దేశభక్తినీ, బుద్ధినైశిత్యమునూ ప్రోత్సహించే కవిత్వం వ్రాశాడు. ఈయన పద్యరచనలో సున్నితమూ, సరళమైనధార లోపించినా, గద్యరచన మాత్రం శక్తిమంతంగా ఉంటుంది. మరొక ప్రముఖ కవియైన పద్మనాథగుహాఁయ్ బరువా చారిత్రక విశేషాలను నాటకాలుగా, నవలలుగా వ్రాయడంలో దిట్టఅనిపించుకున్నాడు. ఈ కవి వరేణ్యుడు సుందరసుకుమార పద్యనిర్మాణంలో నేర్పరి; ఆత్మీయమైన ఇతి వృత్తాన్ని పరాశ్రయమైన ఉపాఖ్యానంగా (లీల) చిత్రించడంలో ప్రతిభాశాలి. తన శేషజీవితాన్ని ధార్మిక, ఆధ్యాత్మిక ఇతివృత్తాలపై రచనలకే వినియోగించిన గాథశీలి. ఇతని గద్యశైలి విశిష్టమయినది. ఆత్మప్రజ్ఞ నెరిగిన గద్యరచయితలుగా గణుతికెక్కిన వారిలో లంబోదర బరా, సత్యనాథ బరా చెప్పుకోదగ్గవారు. సత్యనాథ బరా బేకన్ ఆంగ్లవ్యాసాల పద్ధతిలో కొన్ని రచనలు చేశాడు. రజనీకాంత బార్దోలోయ్ స్కాటును,

బంకిం చంద్రుని అనుకరిస్తూ చారిత్రక, కల్పనాత్మక నవలలు వ్రాశాడు. హితేశ్వర బర్ బరువా కథాకవిత్వంలో గొప్పపేరు తెచ్చుకున్నాడు. దుర్గేశ్వరశర్మ కవిత్వంలో సరళ సుందరమైన స్థానీయ పలుకుబడి ఎక్కువ.

'జోనకి' మాసపత్రిక ఆదర్శాలే 20వ శతాబ్దం రచయితలకు కూడా కరదీపిక లయ్యాయి. బెజ్ బరువా నిర్వహించిన 'బాహి' మాసపత్రిక (1909-1945) కొత్త రచయిత లను సాహిత్యరంగంలో ప్రవేశపెట్టి, వారిని తీర్చిదిద్దడానికి దోహదంచేసిన ప్రధాన సాధ నాలలో ఒకటయింది. రఘునాథ చౌధురి వ్రాసిన విహంగమ కవిత్వంలో ప్రకృతితత్వము అపూర్వకళాప్రతిభతో గానం చేయబడింది. అంబికాగిరి రాయ్‌చౌధురి కవిత అలౌకికప్రేమ, జీవితముయొక్క నిష్కపటచైతన్యము, గాఢమైన విధ్యంకల దేశభక్తి భావములతో నిండిఉంటుంది. ఒతీంద్రనాథ దువరా దేశదేశాల సాహిత్యాలలోని కవిత్వసౌందర్యాలను గ్రహించి, విషాద గీతాలూ, వచనగీతికలూ (ఇవి రష్యన్ రచయిత తుర్గినెఫ్‌శైలిని పోలిఉంటాయి.) అస్సా మీస్ భాషలో నవ్యసుందరంగా సృష్టించాడు. ఈతని ఉమర్‌తీర్థ అనేకావ్యం ఉమర్ ఖయ్యామ్ మీద స్వీయ వ్యాఖ్యాపరంగా ఉంటుంది. అదే విధంగా, మిలనార్ సుర్ అనే రచన హాఫిజ్ కృతికి అనుసరణగా ఉంటుంది. సూర్యకుమార్ భూయాం, రత్నాకాంత జడకాకొటి, లక్ష్మీ నాథఫూకన్, శైలధర రాజఖోవా, నళినీ బాలాదేవి వ్రాసిన గీతాలు శైలీవిన్యాసంలోనూ, గుణ సంపదలోనూ లక్షణ వైశిష్ట్యం కలవి. ఈ శతాబ్దపు ద్వితీయ దశకంలో ఉత్తమశ్రేణి కవులు ఉద్భవించారు. వారిలో డింబేశ్వరనెఉగ్, బినందచంద్ర బరువా, అతుల్‌చంద్ర హజా రికా, దైవచంద్ర తాలూక్‌దార్ మొదలైనవారున్నారు. తృతీయ దశకంలో దేవకాంత బరు వాను ఉత్తమకవిగా చెప్పుకొనవచ్చు. ఆధునికరీతి కవితను ఆ వాహనముచేసి, నూతన ప్రేరే పకశక్తినీ, గవేషణాశీలతనూ, భావపుష్టినీ ప్రేమకవిత్వంలో ఉద్దీపింపచేసిన వాడీతడు. ఇతనివలెనే గణేశచంద్ర గొగొయ్ అనే మరొకని తన ప్రేమగీతాలలో వైశిత్యమూ, విషా దమూ ప్రస్ఫుటీకరించాడు. ఈతరానికి చెందిన ప్రముఖ కవులలో చంద్రధర బరువా, పద్మా ధర చలిహా, నీలమణి ఫూకన్, దండినాథ కలిటా, ఉమేశ్ చంద్రచౌధురి, కమలేశ్వరచలిహా, ప్రసన్నలాల్ చౌధురి, ఆనంద చంద్రబరువా మొదలైన వారిని పేర్కొనవలసి ఉన్నది.

నాటకరచనలో అతుల్‌చంద్ర హజారికా విస్తారంగా కృషిచేశాడు. అయితే జ్యోతి ప్రసాద్ అగర్వాలా రచించిన పౌరాణిక నాటకం సొనితకువరి, చారిత్రకనాటకం కారెంగర్ లిగిరి, నిర్మాణకౌశలంలోనూ, కళాఔన్నత్యంలోనూ ఉత్తమ తరగతికి చెందినవి. మిత్రదేవ మహంత, ఇంద్రేశ్వర బడతాకూర్, నకులచంద్ర భూయాం, ప్రసన్నలాల్ చౌధురి మొదలైన వారు అస్సాములోని ఔత్సాహిక నాటకసమాజాలకు తగిన చక్కని నాటకాలు అందజేస్తూ ఉన్నారు. నవలాసాహిత్యం చెప్పుకొనదగ్గంత సంపన్నం కాకపోయినా, దండినాథ కలిటా, దైవచంద్ర తాలూక్‌దార్లు కొంత దోహదం చేశారు.

పోతే, కథానికా రచన విషయంలో ఈ కాలం ఎంతో ఫలప్రదమైంది. శరత్ చంద్ర గోస్వామి ఈ సాహిత్యప్రక్రియకి సదా అంకితమైన రచయిత. 1930 సం.ప్రాంతాల సమర్థులైన కథారచయితలెందరో వచ్చారు. మహిచంద్ర బొరా, హలిరామ్ దేకా వ్యంగ్య, చమత్కార పూర్ణమైన కథలు వ్రాశారు. 'భేనా బరుఫా' రమాదాస్, మునీన్ బడకటకి,

కృష్ణా భూయాం, నగేంద్రనారాయణ చౌధురి, త్రైలోక్యనాథ గోస్వామి కథకులుగా ప్రసిద్ధులు. లక్ష్మీనాథశర్మ కథల్లో, రచయిత నిశిత దృక్పథమూ, సుసంపన్నమైన అభివ్యక్తీకరణా కనబడతాయి. అబ్దుల్‌మలిక్ అసంఖ్యాకంగా వ్రాసే తన కథల్లో సరళమైన భాషాశైలిద్వారా బీదజనంపట్ల చిత్రమైన సానుభూతి ప్రదర్శిస్తాడు; రచయితగా తనకొక స్థానం పొందుతాడు.

లక్ష్మీనాథ బెజ్‌బరువా సాహిత్యవ్యాసాల తర్వాత 'చిత్రసేన్ జఖరియా' వినోదాత్మక వ్యాసాలొచ్చాయి. తరుణరామ్ ఫూకన్ వ్రాసిన వేటకు సంబంధించిన కథన వ్యాసాలలో సాహిత్యధార ఉన్నది. సూర్యకుమార భూయాం, సోనారామ్ చౌధురి, ఆనంద చంద్ర అగర్వాలా అనేక చారిత్రక వ్యాసాలు వివిధ పత్రికలలో వ్రాశారు. బనికాంత కాకోటి ప్రాచీన, ఆధునిక అస్సామీస్ సాహిత్యాన్ని వర్తమాన విమర్శకరీతిలో పరామర్శించాడు. బిరించి కుమార్ బరువా, తీర్థనాథ శర్మ, హేమబరువా, మహేశ్వర నెఉగ్ మొదలైన యువరచయితలు ఈ శతాబ్దపు తృతీయ దశకం, చతుర్థదశకపు తొలిభాగంలో సాహిత్య విమర్శనారంగంలో కృషిచేయ నారంభించారు.

1940 సం. నాటికి వర్తమాన సాహిత్యరీతులను ప్రతిఘటించే విమర్శనాత్మకమైన నూతన తరం దృగ్గోచరమైంది. కథానికా రచనలో మనస్తత్వ శాస్త్రప్రభావం ప్రవేశించనారంభించింది. పెక్కురు కవులు అవలంబించకపోయినా, వచన పద్యాలు రచన ధారాళంగా కనబడసాగింది. కొత్తగా వచ్చిన ఈ విమర్శనాత్మక ధోరణి లక్ష్మీనాథ బెజ్‌బరువా 'కొత్త' జీవిత చరిత్ర రచనా ప్రయోగంగా వెల్లడి అయింది.

రెండవ ప్రపంచ యుద్ధం ఆరంభం కావడంతో అస్సాము జనజీవితం ఒకవిధంగా అస్తవ్యస్తమయింది; అస్సామీస్ భాషలో సాహిత్యసృష్టికి అంతరాయం కలిగింది. ప్రచురణలు సన్నగిల్లినవి. పత్రికలు ప్రచురింపబడుతూనే ఉన్నా, వాటి సంఖ్య దిగజారిపోయింది. పుస్తకాలూ, పత్రికలూ తిరిగి ప్రచురింపబోయేసరికి, గతకాలపు ఆదర్శాలనుంచి పూర్తిగా తెగతెంపులు చేసుకున్నట్టే అయింది. సన్నసన్నగా వెలువడే సాహిత్యప్రవాహంమీద ఇరుగు పొరుగు సాహిత్యాల పరస్పర వైరుధ్యధోరణుల ప్రభావం గోచరమయింది. ఈ మార్పు పద్యరచనలో సుస్పష్టమయింది. ధారాళమైన ప్రయోగాలు సాగినవి; వీటిలో కొంత ప్రశంసనీయమైన కృషికూడా ఉన్నది. ఇటు రవీంద్రనాథ టాగూరు, జీవనానంద లగాయతు అటు ఫ్రెంచి ప్రకృతి వాదులు, జపానీయ కవిశ్వచింతనవరకు వివిధ భావాలవల్ల ఉత్తేజితులై యువకవులెందరో సాహిత్యసృష్టి కొనసాగించారు. వారిలో-అమూల్య బరువా, నవకాంత బరువా, హేమ్ బరువా, హరి బరకాకొటి, మహేంద్ర బరా, నీలమణి ఫూకన్, బీరేంద్రకుమార్ భట్టాచార్య, కేశవ మహంత, నిర్మలప్రభా బార్డొలోయ్, అమలేందు గుహ, బీరేశ్వర్ బరువా, హోసేన్ బరగుహాయ్, భవన్ బరువా, హీరేన్‌దత్తా మొదలైనవారున్నారు. నవలా రచన స్వల్పమే అయినా స్థిరంగా ముందంజవేసింది. బీనా బరువా వ్రాసిన జీవనేర్ బాటట్, రసనా బరువా రచించిన సూయిల్ ఫతర్ కహితాయ్, రాధికా మోహన్ గోస్వామి వ్రాసిన చాక్ నేయా, నవకాంత బరువా వ్రాసిన కపిలి-పరియ సాధు, ప్రఫుల్లదత్త గోస్వామి రచించిన కేథాపతర్ కపని, జోగేశ్‌దాస్ రచించిన డావర్ అరూనై, అబ్దుల్ మలిక్ వ్రాసిన ఛబిఘర్,

సూరజ్‌ముఖీర్ స్వప్న, ఆధారశిల, హితేశ్ డేకా వ్రాసిన మాటీకార్, ఖారఘర్.పద్మా బరకటకి రచించిన మనేర్ దపన్, బీరేంద్రకుమార్ భట్టాచార్య రచించిన ఇయారియంగం, అస్సామీస్ నవలా సాహిత్యంలో చెప్పుకోదగ్గ రచనలు. మహమ్మదు పియర్ మొదలైన రచయితలు ఎన్నో నవలికలు ప్రచురించారు. ప్రేమనారాయణదత్తా అపరాధపరిశోధక నవలా రచనలో స్వీయమైన ఒకశైలి ఏలవరచుకున్నాడు. కథానికారచనకి ఇప్పటికీ ప్రాముఖ్యం ఉన్నది. క్రితం తరానికి చెందిన అబ్దుల్ మలిక్, దీనానాథశర్మ ఇప్పటికీ తమ రచనలు ప్రచురిస్తూనే ఉన్నారు కాని ఈ శతాబ్దపు తృతీయ దశకం నాటి ప్రముఖ కథారచయితలు ఇప్పుడు అరుదుగా వ్రాస్తున్నారు. యువరచయితలనేకులు ముందుకు వచ్చారు; నూతన జీవితదృక్పథం నవ్యమైన భావ ప్రకటనాశక్తి, నిశితమూ తరచు క్లిష్టమూ-అయినశైలి కథానికరచన లోనికి తెచ్చారు. ఈ ప్రక్రియకి నూతనత్వం సంతరించిన వారిలో జోగేశ్‌దాస్, బీరేంద్ర కుమార్ భట్టాచార్య. హోమేన్ బడగుహాయ్, సౌరభ్ చలిహా, రోహిణికుమార్ కాకోటి చంద్రప్రసాద్ సైకియా, మహీమ్ బొరా, నిరద్ చౌధురి, భబేన్ సైకియా, లక్ష్మీనందన్ బొరా మొదలైనవారున్నారు. వీరి రచనలలో జీవితగాఢత్వ సందర్శనమేకాక, శైలీ వైశిష్ట్యము కూడా ద్యోతకమవుతుంది. స్వీయముద్రకల సాహిత్య వ్యాసరచన యువరచయితలనేందరినో ఆకర్షించింది. హేమ చంద్రబరువా, తిలక్ హజారికా, హేమచంద్రశర్మ భద్రా బొరా మొదలైన రచయితలు వారి వ్యాసాలను పుస్తకరూపంలో ప్రచురించారుకూడా లలిత్ బొరా, కిరణ చంద్రశర్మ స్థానిక పత్రికలలో తరచు వ్యాసాలు వ్రాస్తున్నారు.

అస్సాములో ఇప్పటికీ వృత్తినాటక సమాజాలు లేవు. కాని యువకులలో నాటక రచనపట్ల అపూర్వమైన ఉత్సాహం కనబడుతుంది. కాని, నాటకరచనలో హర్షించదగిన ప్రగతి మాత్రం కనబడడం లేదు. పాతకాలంనాటి పౌరాణిక నాటకాలు మరుగునపడాలనే వాదం ఒక వైపున ఉన్నది. మరొకప్రక్క, భారత జాతీయ ఉద్యమంనాటి ప్రత్యేక వాదం నిరసిస్తూన్నా, చారిత్రక నాటకరచన వృద్ధిచెందే సూచనలు కనబడుతున్నాయి. మొగలుల నెదిర్చి నిలిచిన గౌహతీ వీరుడు లచిత్‌పూకన్, 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం నాటి వీరుడు మణిరామ్ డివాన్, మణిపూర్‌లో బ్రిటిషుపాలనను ప్రతిఘటించిన వీరుడు టికేంద్రజిత్, 1942 సం.లో ప్రాణాలొడ్డిన వీరుడు కుశల్‌కోవర్ మొదలైన వారి ఇతివృత్తాలు ఇప్పటికీ నాటకరచయితలను ఆకర్షిస్తూనే ఉన్నాయి. సాంఘిక ఇతివృత్తాలు ఏకాంకికలు ఇప్పుడు విస్తారంగా వస్తున్నాయి. ప్రతిభాన్వితుడైన నాటక రచయిత ఇంకా పుట్టలేదు, అయినా, ఔత్సాహిక నాటక సమాజాలకోసం నిత్యమూ నాటకాలు వ్రాయబడుతూనే ఉన్నాయి. నేటి నాటక రచయితలు - సత్యప్రసాద్ బరువా, గిరీశ్ చౌధురి, అనిక్ చౌధురి. శారదా బార్డొలోయ్. సురేంద్రనాథ సైకియా, దుర్గేశ్వర బడతాకూర్, అరుణ శర్మ, బీనా బరువా వ్రాసిన ఎబెలార్ నట్ రేడియోలో చక్కగా వచ్చింది. రంగస్థలంమీద ప్రదర్శించ లేదుగాని, ఈ నాటకం ప్రదర్శనకు వీలుగానే ఉంటుంది.

సాహిత్య విమర్శనం ఇప్పటికీ నిస్సత్తువగానే ఉన్నది. విమర్శకులు విమర్శించడానికి సాహసం చూపడం లేదు. అయినా, ఉపాధ్యాయ వృత్తిలో ఉన్న కొందరు ఈ విభాగంలో కృషిచేస్తూ. వివిధ సాహిత్యశాఖలలో తమ సమాలోచనలను ప్రచురిస్తూనే ఉన్నారు-

వారిలో, బిరించి కుమార్ బరువా, హేమ్ బరువా, త్రైలోక్యనాథ గోస్వామి, మహేశ్వర నెఓగ్, ప్రఫుల్లదత్త గోస్వామి, సత్యేంద్రనాథ శర్మ, ఉపేంద్రనాథ గోస్వామి, భావనా నంద దత్తా మొదలైన వారున్నారు. అతులచంద్ర బరువా చక్కని సాహిత్య పరిచయ వ్యాసాలు ప్రచురించాడు. విశ్వవిద్యాలయాధ్యాపకులు-తమ ఇష్టం ప్రకారం కాకపోయినా—మధ్యయుగంనాటి అస్సామీస్ సాహిత్య సమాధులను త్రవ్వితీసి, ఆ రచనలకు సంస్కరణ ప్రతులు తయారుచేస్తున్నారు. జీవితచరిత్ర. యాత్రావర్ణన సాహిత్య ప్రక్రియలుగా అంత ఆకర్షణీయం కాలేదు. మహేశ్వర నెఓగ్ వ్రాసిన శ్రీశ్రీ శంకరదేవ సాక్ష్యాధారాలతో వ్రాసిన ప్రథమ జీవితచరిత్ర. బేణుధర శర్మ వ్రాసిన మణిరామ్ దివాన్ గతాన్ని మరొక సారి మననం చేసుకునే జాతీయోత్తేజానికి సాక్ష్యం. ఈ రెండు గ్రంథాలు రెండవ ప్రపంచ యుద్ధం తర్వాతనే ప్రచురించబడ్డాయి. సూర్యకుమార భూయాం వ్రాసిన హరిహర అటా అనే కుహనా సన్యాసి గాథ వస్తువులో, శైలిలో స్వచ్ఛమైన రచన. తమ యూరోపుయాత్రా విశేషాలను గూర్చి బిరించి కుమార్ బరువా, ప్రఫుల్లదత్త గోస్వామి, అమలేందు గుహ మొదలైనవారు వ్రాశారు; తమ అనుభవాలను మనకు అందజేశారు. అతిచక్కగా వ్రాసిన తన అమెరికా, రష్యా, ఇజ్రేల్ మొదలైన దేశాల యాత్రావివరణల్లో హేమ్ బరువా కవితా కల్పనల సుగంధాన్ని మనకందిస్తాడు

నేటి అస్సాము రాష్ట్రంలోని సాహిత్యవాతావరణం సచేతనంగా, శక్తియుతంగా, విశ్వాసపూర్ణంగా ఉన్నది. సంఖ్యావిస్తారం లేకపోయినా గుణవైశిష్ట్యతను వెల్లడిస్తూ, భారత దేశంలోని ఏ ఇతర ప్రాంతీయభాషలోని సాహిత్య సృష్టితోనైనా పోల్చదగినదవుతున్నది.

## విషయసూచిక

6. ఖాయోఖాయి
బడగీత — మాధవదేవ

7. దయార్ ఠాకూర్
బడగీత — ,,

8. కాన్ ఖోవా — శ్రీధర కందలి

9. తుంగ్ ఖుంగియా బురంజి
తుంగ్ ఖుంగియా వంశచరిత్ర — అజ్ఞాతకవి

10. ప్రకృతి — చంద్రకుమార అగర్వాలా

11. అజేయ — ,,

12. ఖదరీ
కథానిక — లక్ష్మీనాథ బెజ్ బరువా

13. ప్రియతమార్ చిఠి
ప్రియురాలి లేఖ — హేమచంద్ర గోస్వామి

14. గోలప్
గులాబి — రఘునాథ చౌధురి

15. విశ్వభవన
విశ్వనాటకము — దుర్గేశ్వర శర్మ

16. అతీతక్ నెయాఖా పహాడి
గతాన్ని మరువవద్దు — జితీంద్రనాథ దువరా

17. సృష్టి పటని
సృష్టి ఆది — సూర్యకుమార్ భూయాం

18. జాగ్ జాగ్ జాగ్
జాగృతి — అంబికాగిరి రాయ్‌చౌధురి

19. దుటి మానుహ్
ఇద్దరు మనుషులు — రత్నాకాంత బడకాకోటి

20. పరమతృష్ణ — నళినీబాలాదేవి

21. అమిదువార్ ముకలికరో
మేము ద్వారము తెరుస్తాము — దేవకాంత బరువా

22. కారెంగర్ లిగిరి
అంతఃపుర పరిచారిక — జ్యోతిప్రసాద్ ఆగర్వాలా

—o—

శంకరదేవ

## ఉద్ధవక సంబుద్ధి (కీర్తన ఘోష నుండి)

అంతట ఉద్ధవుని ఉద్దేశించి కృష్ణు డిలా అన్నాడు:

కర్మ బంధాలనుండి విముక్తి కోరి యత్నించువాడు-
తొలు దొలుత వైష్ణవ సాంగత్యము నర్థించును
భక్తుల నుండి నా లీలలనే ఆలకించును
అనుదినము నామ సంకీర్తనము కావించును
శ్రద్ధతో నా రూపము ధ్యానించును.
నృత్య గీతాదులతోడనా నా మహిమ కీర్తించువాడు
వెరుప పనిలేదు, ధ్యేయము చేరుకొనగలడు
ఓ ఉద్ధవా, ప్రేమ తత్వమెట్టిదో వినుము.
నిశ్చల మతితో సదా ఆచరింపుము.
హరిని నేను సర్వభూతాలలోను ఉందును సుమా
విష్ణ్వంశగా సర్వుల భావింపు మదిలోన
ఇతడు బ్రాహ్మణుడు, ఆతడు ఛండాలుడనుచు
ఈయన దొర వేరొకడు దొంగ యనుచు
భేద భావము చూపని వాడు
దుష్టుల శిష్టుల నేకరీతి గ్రహించువాడు
వాడె సుమి పండితుడు, సర్వజ్ఞుడు.
సకలజనుల విష్ణువుగా ఎంచువాడు
మన్నించువాడు
ఈర్ష్యా ద్వేషముల త్రెంచుకొనగలవాడు,
పదుగురు నవ్విపోగల పిరికితనమేమి.
"నే నుత్తముడను వా డధము"డను భావమేమి
కుక్కలు నక్కలకు కూడా నీవంటి ఆత్మకలదని తెలియవేమి
సర్వ జీవులకు సాష్టాంగప్రమాణాల నిడ వెనుకాడెదవేమి?
సర్వప్రాణులలో విష్ణువును దర్శించువరకు
మనోవాక్కాయ కర్మలను
నీ భావము మన్నింపదగును.
విష్ణుమూర్తిని విశ్వమంతటను దర్శించువాడు
మరణమునకు ముందే ముక్తుడౌను.
'ఆత్మ వత్సర్వ భూతాని' అను మార్గము
సకల మార్గములలోనె ఉత్తమము.
ఈ ధర్మమున సుంతయైన వమ్ముకాదు
పూర్ణ సత్యమును నే ప్రవచించు కారణమున,

తెలియరాదు ఈ ధర్మము గర్విష్టులకు దాంభికులకు
బోధింపదగును మందలించిన వెనుక వైష్ణవులకు,
స్త్రీలు, శూద్రులైన నన్నారాధించు నెల్లరకు
బోధింపదగును నా ధర్మము.
ప్రేమభావమున ఈ జ్ఞానము నరయువారు
పునీతులగుదురు, జ్ఞానజ్యోతిని దర్శింతురు.
హెచ్చరికలు వింటివి నావలన
నీ క్లేశము, మాయాపంకిలము తొలగినదో?
బ్రహ్మాది దేవతలు, హరుడు హలాయుధుడు
నా ప్రియసతి శ్రీమహాలక్ష్మి
నీవు దర్శించు ఈ సుందర దేహముననే వసింతురు.
ఉద్ధవుని మించిన మిత్రులు లేరు నాకు-
నీవు నాకు అత్యంత పియుడవు సుమ్ము
భక్తులె నా ఆత్మ, మరి వారి ఆత్మను నేను,
నన్ను గూర్చిన భావము తక్క అన్యములేదు నాభక్తునికి
భక్తునిగూర్చిన చింత తక్క అన్యములేదు నాకు వినుము.

---

శంకరదేవ

## పావే పరిహారి (బడగీత)

శరణు జొచ్చితిని
చరణము లంటి కావుమనుచు
దీనుడై వేడితిని.
విషయ వాంఛా సర్పదష్టమై
నశింపనున్నది నా ఆత్మ.
ఈ సమస్త జగమందలి సర్వము క్షణ భంగురము
సిరులు బంధువులు జీవితము నాశనమగును.
కుమరులు కుటుంబాలు అనిశ్చితములు
ఎవరిని విశ్వసింపగలను?
మనసు చంచలము, నిలకడలేదు
తామరాకుపై నీటి బొట్టువలె,
నీ కరుణలో అనిశ్చిత మన్నదిలేదు
నీ పాదచ్ఛాయలో వెరపన్నది రాదు.
శంకర నుతుడవు హృషీకేశుడవు
నా మానసమందు వసించునాడవు

సంసార సాగరమును తరింపచేయవే ప్రభూ.
పరమ దయాళు కరుణామూర్తి వి
సత్యము సన్మార్గము దర్శింపచేయవే ప్రభూ.
నీవే హృదయము ధ్యేయము
నీవే సుమ ధర్మ సఖుడవు
శంకరుని మొర లాలకించి
దుఃఖసాగరము దాటింపవే ప్రభూ.

మాధవదేవ

## అవ్యక్త ఈశ్వర (నామఘోష నుండి)

ఆ పరమ భాగవతునికి ఆకారమే లేదు.
ఎలా ఆరాధిస్తావు?
రూపమేలేని పరమాత్మను
ఎలా ధ్యానిస్తావు?
రామనామ జపము చేసుకో
మనోమాలిన్యము కడిగివేసుకో.

* *

నా హృదయగతికి
నీవే దర్శకుడవు, పరమాత్మవు.
నీ పాదాల క్రింద రక్షణ నిచ్చి
నాపై దయ చూపించు
ఈ మాయతెరను ఛేదించు
నా ఆత్మను నడిపించు సారధివి నీవు
దీనుడను నీ దాసుడను నేను.
నీ సేవకై దారి కోరితిని నేను.
నా వంటి పాపులు లేరు
ఈ మూడు లోకాల-
నీ వంటి పుణ్యమూర్తి లేడు
ఎందెందు వెదకినా,
దయచూపు నాపైన
గోవిందస్వామీ,
ఎన్ని పాపాలు చేస్తాను
రాత్రులు పగళ్లు
ఈ మాయలోకంలో పడి-
నన్ను కరుణించు క్షమించు

నీ దాసుడను నేను
జగన్నాథ విభో.
సత్ కీర్తనమంటే ఏమిటో నాకు తెలుసు
అనుసరించడానికి అలాపోదు మనసు
నీచపు బ్రతుకు నుంచి ఎందుకో దూరంకాలేను
నాలో వసించి నడిపించు నీ ఆజ్ఞ మీరలేను.
నిన్ను పూజించే విధం నాకు తెలియదు
నిన్ను ప్రసన్నం చేసుకొనే పద్ధతి నేనెరుగను
నిన్ను ఆరాధించడమెలాగో ఏమీ తెలియదు
ప్రభూ నాకు తెరు చూపించుము నీ పాదాల చెంతవాలాను.

మాధవదేవ

## దుర్వార దుస్సంగ (నామఘోష నుండి)

హరీ హరీ యని స్తుతింతునయ్యా
దుస్సాంగత్యము దుష్టవాంఛలను అంధకారమున
అజ్ఞానములో పడిఉన్నానయ్యా అనాదిగా.
నీ పదసేవలు మహదానందము
సేవలు మానిన చింతలు వంతలు
జననం జననం మాయాజాలం
హరీ హరీ యని స్తుతింతునయ్యా,
నీవే కృష్ణా నా పరమాత్మవు
నారాయణుడవు పరమేశ్వరుడవు
నీ పదసన్నిధి శరణు వేడితిని
హరీ హరీ యని స్తుతింతునయ్యా
మాయాజాలము తొలగించవయా!
అనంత జన్మల అనేక బాధలు
అనేక జన్మల అనంతక్లేశం
పారద్రోలు పరమాత్మవు నీవు
పదముల చెంతను మననీయవయా,
మానవ జన్మను మరిమరి పొందుచు-నీ
మహిమ తెలియకనె బ్రతికితినయ్యా
నీ దాసుడనై ప్రోల నిలిచితిని
కరుణచేసి నా సేవలందుమయ్యా
సేవలంది నీ కరుణ చూపుమయ్యా

ముకుందస్వామీ మాధవమూర్తీ
నీ దాసుడ నేనయ్యా.

మాధవదేవ

### రామగోసాయి (బడగీత)

రామా నీకిదే నామొర—
నా హృదయ కమలంలో నీవు వికసించాలి
మాయ తొలగించి భక్తి పెంచాలి
నీ పాదకమలాల మధువును నేను గ్రోలాలి
నీ పాదము లెక్కడుంటాయో-రామా
నా శిరమూ అక్కడే ఉంటుంది.
రామా ఇదే నీ దాసుని మాట.

మాధవదేవ

### భాయో భాయి (బడగీత)

జీవితం గడిచిపోయే వరకూ జాగ్రత్త భాయీ
గోవిందదేవుడు నీకో వరమిస్తాడు
జీవితం వట్టిది; యౌవనం వట్టిది.
అంతా మాయ- దేన్నీ లక్ష్యపెట్టకు.
క్లేశాలను దూరంగా విసిరేయ్
కోరికలను త్రుంచి పారవేయ్
మనసును హరికి చేరువ చేయ్
మాధవుడు చెప్పిన మాట చెవినిపెట్టు
హరి చరణాల మీదనే ఆశపెట్టు

మాధవదేవ

### దయార్ ఠాకూర్ (బడగీత)

హరీ కరుణాలవాలా!
యదుకుల తిలకా రామా!
ఈ దీనుడు నీ నామజపం చేస్తున్నాడు
నారాయణా నన్ను దయచూడు—
నా చంచలచిత్తం నీ పాదాల చెంత నిలవాలి.

అజామీలుడు దుష్టుడు పాపిష్టి విప్రుడు
నీపేరు తలచినంత మాత్రాన
పాతకర్మల పాపాలన్నీ మాసిపోయాయి
వైకుంఠంలో తావు దొరికింది
ఈ వైనం ప్రపంచమంతా ఎరుగును.
అంతకు కోట్లరెట్లు పాపాలు చేశాను
కోటివేల క్రూరాలు చేశాను
నీ నామం ముందు మోకరిల్లుతున్నాను
పతిత జనోద్ధారకుడవు నీవు
కలియుగ భక్త వత్సలుడవునీవు
జప తపాలు మంత్రతంత్రాలు కట్టిపెట్టి
మా భక్తిని నీ పదాంకితం చేస్తే
నీవు లభిస్తావని చెబుతున్నాయి గాథలు,
అందుకే నారాయణా, హరీ
ఈ మాధవుడు దీనుడు బుద్ధిహీనుడు
నీ చరణాలంటి వేడుకుంటున్నాడు.

శ్రీధర కండలి

## కాన్ ఖోవా (చెవి కొరుకుడుగాడు)

పల్లవి : కళ్లు మూసురా కోనాకన్నతండ్రి
కర్ణభోజనుడు చూడు వస్తున్నాడు
పిల్లలందరి చెవులు కొరికి నమిలేశాడు
మెల్లగా నినుచేర రాబోవుచున్నాడు.

తల్లిమాటలు విన్న కన్నయ్య తండ్రి
తొందరగ చేరాడు తల్లి ఒడిలోన
చిరునవ్వు లొలుకుతూ పలికె నీలాగ:
"పేరు వినినయంత మేను కంపించునే
నిద్ర రానేరాదు రాత్రియెంత యైన
చెవులు కొరికి తినగ తిరిగేటి వ్యక్తి
ఆకారమేమి, వాని రూపమేమి?
తొందరగ చెప్పవే నాకన్న తల్లి
పారిపోదును నేను వాని రాకకు మున్నె!
అనాదిమూర్తిగా కర్తను విశ్వసృష్టికి నేను
చరాచరములుగ భాగించితిని నేను

విశ్వస్థితికి ఆత్మను, రక్షనునేను
బ్రహ్మాది దేవతలు సృష్టించితిని నేను
కాని నేనెరుగ నీ కర్ణభోజనుడెవరో
నేనెరుగ నేనెరుగ నెవరు సృష్టించిరో !
గరుడ వాహనమెక్కి వైకుంఠమున నుండి
విశ్వమెల్ల వెతకిన విష్ణుమూర్తిని నేను
స్వర్గము పాతాళము మహాత్ములు కాపురుషులు
ఏదేదో ఎవరెవరో తెలుసుకొంటిని
కాని కర్ణభోజనుడెవరో తెలియరాదు.
పాతాళమున నుండి వేదోద్ధరణముచేసి
సర్వ సాగర తీరముల విహరించితిని
మత్స్యరూపములోన-కాని
కర్ణభోజనుడెవరో కానరాలేదు

**(దశావతారములూ వర్ణింపబడినవి)**

కృష్ణునిగా పుట్టితిని నీ ఇంట
తనువు వణకిపోవును వానిపేరు విన్నంత
కన్ను వింతకాగ కంపించి పోదును
చెవులు కొరికి తినగ తిరిగేటి వ్యక్తి
ఆకారమేమి, వాని రూపమేమమ్మ ?"
చిన్ని కృష్ణయ్య పలికిన పలుకులు విని
గడగడ వణకినది యశోద
నోటమాట లేకపోయె
తట్టుతుకు చిరునవ్వుతో పలికె:
'వట్టిది నాయన, ఇదంతా అసత్యము' అని
ముద్దాడి ముదమున పాలుకుడిపెను.
శ్రీకృష్ణలీలలు శ్రీధర కందలి
హరీ హరీ యని గానము చేసెను.

**అజ్ఞాతకవి**

## తుంగ్ ఖుంగియా బురంజి

(తుంగ్ ఖుంగియా రాజవంశ చరిత్ర)

వంగదేశం మీద దాడిచేయ తలపెట్టి స్వర్గదేవుడు బహాగ మాసములో సరాయ్‌ఘాట్ చేరాడు. పరీక్షిత్ మహారాజు గారి కోట వెలుపల శిబిరం వేశాడు.

అంతకు పూర్వం భాద్ర మాసంలో ఢాకాపై దాడిచేసే విషయమై ఈ క్రింది వారితో రాజు చర్చలు జరిపాడు. లాయ్‌థేపెనా గుహాయ్ కొడుకు బడగుహాయ్, కువాయ్ గాయా, పూకన్‌బడగుహాయ్, కెందుగురియాదేకా బడపాత్రగుహాయ్, బరువాలు, పూకన్‌లు. వీరిని ఉద్దేశించి రాజిలా అన్నాడు. 'ఢాకా-రంగగారా సరిహద్దుల మధ్యనున్న ప్రాంతం మీద దండయాత్ర జరపవలెనని నా తలంపు. మీ అభిప్రాయమేమిటి?' కెందుగురియా వంశానికి చెందిన బడపాత్రగుహాయ్ రాజు తలంపును సమర్థించి ఇలా అన్నాడు: "రాజుగారి ప్రతిపాదన సబబుగా ఉన్నది. కరటియా హద్దులలోని ప్రాంతాలు మనవి మన నిర్లక్ష్యం వల్లనే శత్రువు వాటిని స్వాధీనం చేసుకున్నాడు. శత్రువును పరిహరించి, ఈ రాజ్యపు ప్రాచీన సరిహద్దును సంరక్షించే నిమిత్తం ఆ ప్రాంతాలను ఆధీనం చేసుకోడం రాజుగారి కర్తవ్యం. మనకు విస్తారమైన నావికా బలం ఉన్నది, నౌకాసేన ఉన్నది. కావలసినంత యుద్ధసామగ్రి ఉన్నది. రాజుగారు ఆజ్ఞ ఇస్తే, శత్రువును అణచివేయవచ్చు. నాశనం చేయవచ్చు'. అంతట కువాయ్ గాయా వంశస్థుడైన పూకన్‌బడగుహాయ్ ఇలా అన్నాడు;' రాజుగారి ప్రతిపాదన సమర్థనీయంగా ఉన్నది. బడపాత్రగుహాయ్ చెప్పినదీ సమర్థనీయమే. మన రాజుగారి పూర్వులు సాహసం, శౌర్యం కలవారై రంగమాటీ సరిహద్దులను దాటి కరటియా గంగలో తమ ఖడ్గాలను కడిగారు. అస్సాం సరిహద్దులను కరటియా దగ్గర ఏర్పాటు చేయడం వారికి అసౌకర్యముగా తోచినందున, మనసానదిని పశ్చిమ సరిహద్దుగాచేసి, గువాహాటీ (గౌహాటీ) దగ్గర సైనికస్థావరం నెలకొల్పారు. జయధ్వజసింహుని పరిపాలనలో భండారాలు, మనుషులూ కూడా ఎక్కువే. కాని 'మరుభూపతి' అనే పేరొచ్చింది ఆయనకి. ఆయుధాలు, ఆయుధసామగ్రి, వస్తువులు, సరఫరాలు నిస్తేజాలు. కాని రాజుగారి పరివారం చైతన్యశక్తికి సంకేతాలు. నిశ్చేతనమైన యుద్ధయంత్రాంగానికి చైతన్యం ఈయ గలిగినది వారే. అయినా, మన శక్తిని, మన పరికరాలనూ, మన శత్రువు శక్తితో, సాధనాలతో తూచి చూసుకోవాలి. జయాపజయాలకు మనం సిద్ధం కావాలి. వీటిని గుర్తించిన మీదటనే మనం ప్రయత్నం ఆరంభించాలి. ఏది ఏమయినా రాజుగారి ఆజ్ఞ సర్వదా అనుసరణీయము.'

అప్పుడు రాజు ఆగ్రహావేశముతో, గుహాయ్ వంశస్థులు ఇచ్చే సలహాలు ఎప్పుడూ ఇలాగే ఉంటున్నవి.' అని వారందరినీ పంపివేశాడు. ఆ తర్వాత, బరువా, పూకన్ వంశీయులు ఇలా అన్నారు:' రాజా గుహాయ్‌లను అలా ఉండనీయండి. తమరు ఆజ్ఞాపిస్తే ఢాకా సరిహద్దు వరకు ఉన్న ప్రాంతాన్ని ఎదుర్కొంటాము.' అప్పుడు రాజు కోటద్వారం నుంచి బ్రహ్మపుత్రా నది వరకుగల మార్గాన్ని సరిచేసి, ప్రజలకు సంతర్పణచేశాడు. దారికి ఇరువైపులా ప్రజలు ఏర్పాటు చేసిన వినోదాలు చూడడానికిగాను ఒక భవంతి నిర్మించాడు. అక్కడ ఆసీనుడైన రాజును అందరూ 'దీర్ఘాయుష్మాన్‌భవ' అని ఆశీర్వదించారు. అక్కడ ఉండగానే రాజుకు అస్వస్థత కలగడం వలన శిబిరానికి తిరిగి వచ్చాడు. ఆనాటికానాడు రాజు అనారోగ్యం ముదిరి పోయింది. అంతకుముందు, ప్రక్కనున్న కొండను త్రవ్వించివేసినందువల్లనే రాజుగారికారుగ్మత కలిగిందని ఎవరో కలలో కనబడి చెప్పారు. అప్పుడు రాజు ఆ కొండను తిరిగి నిర్మించాడు. కొండమీద చెట్లు పుట్టలు తిరిగి ఏర్పాటుచేశాడు. దానధర్మాలెన్నో చేశాడు. కాని రాజు ఆరోగ్యం మాత్రం కుదుట పడలేదు.

జబ్బు చేసిన ఎనిమిదవనాడు 1636 వ సంవత్సరం కృష్ణపక్ష విదియా ఆదివారం నాడు సూర్యాస్తమయానికి మరొక్క ప్రహర ఉన్నదనగా, పద్దెనిమిదేళ్ల ఆరునెలలు రాచరికం చేసిన తర్వాత రుద్రసింహ మహారాజు మరణించాడు.

చంద్రకుమార అగర్వాల

## ప్రకృతి

పూలు విరిసి పరిమళమ్ముల ప్రేమ ఝురులు
కురిపించినవి
వాడి రాలిపోయినవి

మధుప మొకటి పూదేనెల జుర్రినది
మదమున విచ్చలవిడి విహరించినది
విహరించి విహరించి
హృద్గీతికలు పాడి తనదారి పోయినది
ఎవరెచ్చటికి పోయిరో తెలియదు
ఆనవాళ్లు లేవు స్మృతులు కరగిపోయె
ఈ ప్రకృతి మాత్రమట్లే నిలిచిపోయె.

## అజేయ

హా విధీ, ఏమిది ?
నా బ్రతుకుగింజలను కటికిరాల నడుమ
నలిపి నలిపి పొడిచేసితివి
సరిలే, ఇది నీలీల - చూడవుగాని
ఆ పొడిని నా కన్నీళ్లతో కలిపి
రొట్టెలు చేతును
ఆశలను బంతులుగా కూర్తును
చేలో పంటకు కంకులే లేని -
కందమూల ఫలములైన దొరకని -
వేయి హృదయాలకు ఊరట కల్గును వానివల్ల
హా విధీ, ఏమిది ?
నా సుందర జీవితమును
చీకాకుల చితి మంటలలో కాల్చి
బూడిద చేసితివి
సరిలే ఇది నీలీల - ఇటుచూడు

నా లతా కుంజమున
మృదు పల్లవముల శాఖలు పెరిగినవి
పూలు పత్రాలెన్నో అందముగ అమరినవి.
ఈ కటికి కాలపు ముళ్ళ మొక్కలు తప్ప
అన్యమేమెరుగని
వేయి హృదయాలిచట సేద దీర్చుకొనును
వాని ఎడారి బ్రతుకులు చిగిర్చి తీరును.

**లక్ష్మీనాథ బెజ్ బరువా**

## భదరీ (చిన్న కథ)

### (అస్సాం గ్రామీణ జీవిత దృశ్యము)

శివరాం అప్పుడే పొలంనుంచి తిరిగివచ్చాడు. నాగలిని పెరట్లో ఉంచి తొందరగా స్నానంచేసి అంగవస్త్రాన్ని మార్చుకుని, సరాసరి వంటింటిలోనికి వెళ్ళాడు. అతని భార్య భదరీ మధ్యాహ్న భోజనానికి వంట చేస్తోంది. అన్నం ఇంకా వండలేదనీ, కూర ఇంకా తయారు కాలేదనీ చూసి శివరాంకి కోపం వచ్చింది. ఆకు కూరలింకా తరగనేలేదు; అరటాకు మధ్య కత్తిపీట చచ్చిపడివున్న నెమలిలా ఉంది. ప్రక్కనే పడివున్న చేప, వంటి నిండా బూడిద పూసుకుని చిలుం త్రాగడంతో మత్తెక్కిన సన్యాసిలా ఉంది. మరొక ప్రక్క, పొగ వల్లకళ్ళమూతలుపడిపోయిన భదరీ పొయ్యిరాజేస్తున్నది.

భోజనమింకా తయారు కాలేదని శివరాం చిందులు త్రొక్కుతున్నాడు. ఉదయం నుంచీ అతని మనసు చీకాకుగానే ఉంది. అనేకానేక కారణాలవల్ల అతని ఆగ్రహం పెరిగి పోయింది. నిన్నటి రోజున కృష్ణ ఏకాదశి కనుక దోషమని నాగలి పట్టనేదు. నేడు గిత్తలు చాలా చీకాకు కలిగించాయి. ఉదయాన్నే పొరుగింటి బహువాతో సరిహద్దురాళ్ళ గురించి పేచీపెట్టుకున్నాడు. తగాదా ముదిరిపోయేదే కాని బహువా రానున్న ప్రమాదం గమనించి చల్లగా జారుకున్నాడు. కోపమంతా ఇల్లాలిమీద తీర్చుకొనడమనేది సామెతేకాదు, పూర్తిగా సత్యం. అదివరకొకసారి బహువా వల్లనే బుర్ర వేడెక్కిపోయి, గిత్తలకు వేళకి మేత వేయలేదనే కారణంమీద శివరాం భార్యను చితుకకొట్టడంద్వారా తన కోపాన్ని తీర్చుకున్నాడు.

భదరీ భూదేవి వంటిది. భర్త ఆగ్రహావేశాలను పల్లెత్తుమాట అనకుండా సహించింది. నిజానికి-నిద్ర, ఆకలి ఎలాంటివో వివాహిత స్త్రీకి దెబ్బలు, ఛీత్కారాలు అటువంటివేనని ఆమె నమ్మకం. కాని దేనికైనా ఒక పరిమితి ఉన్నది. సహనానికి మారుపేరైన భూదేవి కూడా ఒకొక్కప్పుడు ఆగ్రహిస్తుంది. భూకంపం సంభవిస్తుంది. పరిస్థితులు భరింపరానివిగా తయారైనప్పుడు భదరీ కూడా ఎదురు తిరిగితే అసహజమవుతుందా ?

భదరీ పొగతో వేగిపోయింది. శివరాం ఆమెవంక కసిగా చూసి, ఆవేశంతో అరిచాడు. "ఇంత పొద్దెక్కినా వంట ఎందుకు చెయ్యలేదే ఫలానివారి కూతురా ?" అతని కళ్ళు, ముఖం కోపంతో జేవురించాయి.

పొగలోంచి తలవెనుకకు త్రిప్పి భదరీ ఇలా అన్నది : "నా కాళ్ళూ చేతులూ పొయ్యిలో పెట్టి వంట చేయనా ? ఇంట్లో ఒక్క ఎండుపుల్లయినా లేదు. తడిపుల్లలు ఊది ఊది ప్రాణం కడగంటుతూంది. ఏమీ చూడకుండా అలా విరుచుకుపడడం బాగున్నదా ?" ఆమె కనురెప్పలు చెమటతో బరువెక్కాయి.

''ఏమిటి అన్నావూ, ముండా !" అని శివరాం కఠం చించుకున్నాడు. ఆవేశంతో భదరీవంక ఒక అడుగు వేసి, క్రిందనున్న కత్తిపీట తీసి దానితో ఆమె వీపున ఒక్కవేటు వేశాడు. మరొక దెబ్బతీసే లోపున భదరీ ఆర్తనాదం విని శివరాం తమ్ముడు కిసాగాం ఒక్క అంగన వచ్చి, అన్నను పట్టుకొని బయటకు లాగివేశాడు. పాపం భదరీ నెత్తురు మడుగులో స్పృహతప్పి పడిపోయింది. తర్వాత ఆమెను ఆస్పత్రికి తీసుకు వెళ్ళారు.

మూడవనాడు భదరీకి తెలివి వచ్చింది. కళ్ళు తెరచి, ఎవరికోసమో అన్నట్టు గది అంతా కలయజూసింది. చేరువగా వచ్చిన నర్స్‌ను చూసి, భదరీ నీరసంగా "ఏరీ ఆయన ?" అని అడిగింది.

"ఎవరు కావలెనమ్మా ?"

"మా బాబు తండ్రి."

"ఆ దుష్టుడా ? జైల్లో ఉన్నాడు."

"వారినిక్కడికి రప్పించరూ ?" భదరీ జాలిగా అడిగింది.

"ఎలా రాగలడూ ? అయినా ఇప్పుడు అతన్ని గురించి ఆలోచించకూడదు నువ్వు. నీ ఆరోగ్యం మరింత పాడవుతుంది."

నర్స్ మాటలు వింటూ ఉండగానే భదరీ కళ్లు మూతపడ్డాయి. కొద్ది క్షణాలలో ఆమెకు తెలివి తప్పింది. విషయం తెలుసుకున్న డాక్టరు, శివరాంను తీసుకురాకపోతే రోగి పరిస్థితి విషమించవచ్చునని గ్రహించాడు. తిరిగి తెలివివచ్చేసరికి భదరీ తన భర్తను చూడ డానికి వీలుగా శివరాంను రప్పించే ఏర్పాటుచేశాడు.

మర్నాటి ఉదయం భదరీకి స్పృహ వచ్చేసరికి, శివరాం ఆమె తల నిమురుతూ ప్రక్కన కూర్చున్నాడు. భర్తను చూసేసరికి ఆమెకు ఏదో బరువు తీసినట్టయింది- మెల్లగా నవ్వి, "ఎలా ఉన్నారు ? భోజనం సరిగా చేస్తున్నారా ?" అంది. "వంట చేసుకోడం మీకు కష్టమే. ఇంకెంత, మరో రెండు రోజులలో నాకు నయం అవుతుంది. నన్ను ఇంటికి తీసుకు వెళ్ళే ఏర్పాటుచేయండి. మీకు యిబ్బంది ఉండదు" అంది. శివరాం కళ్ళనుండి అశ్రువులు రెండు ధారలు కట్టాయి.

డాక్టరును చూసి భదరీ యిలా అంది : "బాబూ, ఆయన ఏ పాపం ఎరుగరు. వట్టి అమాయకులు. ఆయన్ను ఏమీ చేయకండి. నేనే కత్తిపీటమీద పడి గాయం చేసుకున్నాను" అని వెక్కి వెక్కి ఏడ్చింది. అంతా నిస్తబ్ధులయారు. శివరాం తన దుఃఖాన్ని అణుచుకోలేకపోయాడు. పసివానిలా ఏడ్చాడు.

"అది నిజంకాదు బాబూ, నేనే కత్తిపీటతో ఆమెని కొట్టాను. నాకు శిక్ష విధించండి. నేను పాపిష్టివాణ్ణి బాబూ, కట్టుకున్న భార్యని కత్తితో పొడిచిన దుష్టుణ్ణి" అని తొందర తొందరగా, జాలిగా అన్నాడు శివరాం.

కొద్ది వారాలలో భదరీ గాయం నయమయింది. ఆమెను ఆస్పత్రి నుంచి పంపించి వేశారు శిశురాం ఏ పాపమూ ఎరగడని భదరీ శత విధాల చెప్పడానికి ప్రయత్నించినా, నేరం రుజువై, ఆతనికి మూడు నెలల కఠిన శిక్ష విధించారు. శిశురాం తన పాపానికి ప్రాయశ్చిత్తం అనుభవించేందుకు నవ్వుతూ వెళ్ళాడు జైలుకి.

భర్త జీవితంలో వచ్చిన ఈ మచ్చకి తనే కారకురాలనని భదరీ తన్ను తనే నిందించుకుంది. తన్ను తాను నిందించుకొన్నట్టుగా మరెవ్వరూ ఆమెను నిందించలేకపోయారు!

హేమచంద్ర గోస్వామి

*ప్రియతమార్ చిఠి (ప్రియురాలి లేఖ)*

(అస్సాం భాషలో తొలి ప్రేమ గీతం)

సుందర ఉరోజాలపై ఆచ్ఛాదనం తొలగించి
ప్రకృతి నేపథ్య గృహాన్ని దోచివేశాను
కాని- ఈ అసంగత పాత్రలపై చిత్రించిన
అమృతం మరెక్కడా కనబడలేదు.
కవుల నికుంజంలో కవితాకుసుమాలు వికసిస్తాయి
ఇలలో, వసంత వీచికలలో తేలిపోతాయి
కాని- ఆ రచనలలోని కవిత
లేఖలో సొంపు దిద్దుకున్న
గీతాల పరిమళంలా ఎన్నడూ వాసించలేదు.
పూవులు పూస్తాయి, వాడి రాలిపోతాయి
పచ్చికలు ఎండిపోతాయి, చిగురాకులు నేగిపోతాయి
ఎన్ని దినములైన వాడని పూవు పోలిక.
నీ లేఖ ఎంత మనోహరమో వానికే మెరుక
ఎన్నిమారులు వాసన చూసి ముద్దిడిన
మనసు తీరదు
ఆశా తారకలు నా హృదిలో వెలుగునట్లు!

రఘునాథ చౌదరి

*గొలప్ (గులాబి)*

ఓ సుందర పుష్పమా
ఎవరి స్పర్శ వలన నీవు వికసిస్తావు?
పచ్చని ఆకుల తెరల మాటునుంచి
ఎవరిపై చిరునవ్వు లొలికిస్తావు?
ప్రేమ మధుపానమున మైమరచి
కోకిలాంగనలు విలాస శాపదష్టలై నర్తించు
ఏ నందనోద్యానమునకు

వింత శోభలు సంతరిస్తావు?
మంజుల మనోహర సురభిళ వళమై
స్వాప్నికావస్థ పొందు శారద రాత్రిని
ప్రేమోన్మత్తుడౌ శశాంకమూర్తి
దాహము తీర్చెదవు నీ స్పర్శ వలన.
ఎడారి తోటలో నీవు వికసించిననాడు
రెక్కలొచ్చి నీ సౌరభము నలుదిశల వ్యాపించును
ఆకాశము నంటు ఎడారి వృక్షావళులు
నీ సౌందర్యం మాధురిని మనసార గ్రోలును.
ఆ దేశపు పూదోటల రాణివై చెలగితివి
సుకుమార భావాల కవుల వెలయించితివి
ఈ దేశ రసిక జన మానసము దోచితివి
హృదయ జలధులలోన ప్రళయాలు రేపితివి.
ఈ సకలవిశ్వమును చెలువమున నింపితివి
ఈ సకల హృదయాల ప్రేమలను నింపితివి
రాణి వాసపు స్త్రీల పసిమి బుగ్గలపైన
మేలైన జలతారు నిగనిగల కూర్చితివి
ప్రేమలకు ప్రాణమిడు పాదుషా ఎదలోన
పరువంపు మహలులే నిర్మింపజేసితివి.
మధురస్మృతులనింప మహనీయకావ్యాలు
హృదయభారము తీరదయనీయ కావ్యాలు
ఎన్ని ఎన్నెన్ని వెలయించినారు కవులు
అన్ని నీవలెనె సుకుమార భావసంకేతాలు

నా హృదిని హరియించు వరరాజ కుసుమమా
ఈ ఎడద గుబాళించ సదా వికసింపుమా!

దుర్గేశ్వరశర్మ

## విశ్వభవన (విశ్వనాటకము)

ఈ జీవితమంతా నర్తిస్తూనే ఉన్నాము
కాని-తెలియదు ఎవరి సంగీతానికో-
ఈ జీవితమంతా పాడుతూనే ఉన్నాము
కాని తెలియదు ఎవరి పాటలో
నర్తించే మట్టిబొమ్మలం మనం
కాని తెలియదు ఎవరు ఆడిస్తున్నారో-
ఎవరి మురళినో ఊదుతున్నాం మనం

కాని చూడలేదు ఎవరు ఊదిస్తున్నారో
ఎవరి కీర్తినో గానం చేస్తున్నాం మనం
కాదు-మరచిపోయి మన్ని గురించి మనమే పాడుకొంటున్నాము
ఎవరి పనితోనో ఎప్పుడూ గడుస్తూనే ఉంది
ఒక్క క్షణమైనా తీరిక ఉండదు.
మనకి అనేక పాత్రలు ఈ విశ్వనాటకంలో
అభినయంలో ప్రతిభావంతులం మనం
నవ్వుతూ, ఏడుస్తూ, ఆడుతూ, పాడుతూ
ఏ పాత్రను ఎంత బాగా నటించవచ్చునో
మనకు బాగా తెలుసు.

**జతీంద్రనాథ దువరా**

**అతీతక్ నెయబా పహాడి** (గతాన్ని మరువవద్దు)

మిత్రమా ఇదేనా తుదికోరిక
గతాన్ని మరువవద్దు
ఈ భూమిమీద నా జీవిత కర్తవ్యం
ముగిసిన తర్వాత వెళ్లిపోతాను నేను
గతాన్ని మాత్రం మరువవద్దు
పాత రోజులనాటి కరిగిన కలలు
జీవితాన్ని వెన్నాడతాయి తీయగా బాధగా
కన్నుమెరసి నంతలో కదచిన ప్రేమలు
కలలుగా అలలుగా ప్రతిబింబితమవుతాయి.
'సెలవు' చెప్పనైనాలేవు వణికే పెదవులు
రెండు కన్నులవెంట బాష్పధారలు
చివరి వీడ్కోలిది చెప్పక తప్పదు
ముసిరె దఃఖమేఘాలు జీవితాకాశమున
కనరాదు ఒక చిన్నవెలుగైన.
గమన మతి మందము దీన యాత్రికునికి
కనరాదు చిన్నివెలుగైన మార్గమున
పెనుచీకటి దారి కానగరాదు
దారిలో స్మృతుల సమాధులు
ఎన్నెన్ని ప్రేమ చిత్రాలు కరిగిపోయినవి
ఈ స్మృతుల శ్మశాన స్థలిని !
ఇటు దుఃఖము మరొకవంక హర్షము
పాటలుగా వినిపింప

ఎదలో ఆశ నిరాశలు ముసురుకొనగ:
దీన యాత్రికుని గమన మతి మందము
తెల్లని తెరచాప కట్టిన నావికుడు
నా మార్గము గమనించును
నావలోనే నడుగుపెట్టినతోడనె
నడిపించును ప్రవాహము వెంబడి
సాగిపోవును నావ సాగిపోవునుసుమ్మ.
విను; అనంతసాగరం అల్లంతదూరాన ఘోషిస్తోంది
ఉవ్వెత్తుగా తరంగంలా లేచే
మృత్యువు ఆఖరి పరిష్వంగం ఆనవాళ్లు మిగల్చదు
ప్రేమ తృణీకారానికి, జనుల నిర్లక్ష్యానికి
సుఖదుఃఖాలకు
హార్దికంగా సగౌరవంగా నమస్కరిస్తూ
నావ ఎక్కుతాను
నావ ఎక్కి వెళ్లిపోతాను.
సాయం సంధ్యలోని ఒకచిన్న తారక
చివరిసారి ఆదరంతో పిలుస్తోంది
ప్రకృతి ఒడిలో ఇక నా ఆటలు ముగిశాయి
అదిగో చివరిసారి పిలుపు
పడవ ఎక్కుతున్నాను నేను
గతాన్ని మరువవద్దు నువ్వు!

సూర్యకుమార్ ఖాయాం

## సృష్టి-పటని (సృష్టి ఆది)

ఆ విలయమునాడు ప్రభూ
నీవు భయంకర వీణను చేతబట్టితివి
సూర్యచంద్రులు స్తబ్ధులైరి
విను వీధిలో నేదో వికల సంరంభము-
నీవు భయంకర వీణను చేతబూనిననాడు.
నూతనాకాశము కోరి
పరిధి తప్పి చరించినాడు చంద్రుడు
అంతరిక్షము మెడలోని వెలుగు పూమాల
కళ తప్పి వెలవెలా పోయినది-
నీవు భయంకర వీణను చేతబట్టిననాడు
మేఘావృతమైనది ఆకాశము
ఉగ్రజలవాహినియైనది సమస్తసృష్టి

అదే ఎగిరి మ్రోగినది నీ భయంకరవీణ
ఆ చీకటిలో పుట్టినవి వేయివేల తారకలు
ఆ ప్రళయమునుండి పుట్టినది పుష్పాలంకృత ధరణి
జావిలత చిగురించినది మరల
గానకళ స్వరములు నేర్చినది కొత్తగ
ఉరముపై రాలినవి నవసృష్టి బీజాలు
నీవు భయంకర వీణను మ్రోగింప ఆపివేసిననాడు.

అంబికాగిరిరాయ్ చౌధురి

జాగ్ జాగ్ జాగ్ (జాగృతి)

లేవండి లేవండి హిందువులు ముస్లిములు
భరతాంబ సంతతి లేవండి లేవండి
చెవులలో మ్రోగినవి
జలియన్ వాలాబాగు స్వాతంత్ర్య శంఖాలు
భ్రాతృరక్తధార అరుణిమలతోడ
రక్తదాహము కోరు రాక్షసుల మూక
ఇనుప పాదాల దిగువ నలిగేటి నరులు
లేవండి లేవండి స్త్రీ పురుషులందరూ
శృంఖలాలు, బాధలు క్లేశాల క్రింద
బ్రతుకు బరువైన వృద్ధులు యువకులార
లేవండి లేవండి
విలాసముల వినోదించు జనులార
లేవండి లేవండి
రెండు శతాబ్దాల ధూళి క్రింద
జాతీయ గౌరవం మరుగున పడింది.
వేదాలలో, గీతలో, కొరాను లోని
ఉత్తేజకరమైన వాణి
ప్రపంచాన్ని జయించే శక్తి నిస్తుంది.
భీష్ములు బుద్ధులవంటి వారు
సత్యాన్వేషణ చేయరండి
లేవండి లేవండి
సత్యాగ్రహము ఆత్మ త్యాగము
జాతి గౌరవము ఆయుధాలుగా
అజేయశక్తులుగా వాడండి
లేవండి లేవండి.

హిందూ ముస్లిం సోదరులెల్లరు
ప్రేమభావమున ఒక్కటి కావలె
జలియన్ వాలా బాగు ఆదర్శముగ
భారతమాతకు సేవ చేయవలె.

రత్నకాంత బడకాకోటి

## దుటి మానుహ్ (ఇద్దరు మనుషులు)

ఏ ఇంటిలోనైన ఇద్దరే మనగలరు
ఇద్దరే మనుషులు
ఒకడు కలలవెనుక ఆడును
వేరొకడు రోగముతో వేగును
ఒకడు చుక్కలవంక చూసి ఆనందించును
    పూల గంధాలు జుర్రుకొనును
వేరొకడు పుడమి పొత్తిళ్లలో పడి ఏడ్చును
    జన్మ బంధాలతో కాగును
ఒకడు ఆకసమునందు తేలియాడును
    పసివానివలె విహరించును
వేరొకడు కర్మలతో బందియగును
    వేదనలతో రోదించును
ఒకడు కొండలు గుహలలో వసించును
    నదులు సాగరాలలో తేలును
వేరొకడు సంతృప్తుడై తిరుగును
    దేనిని గ్రహించక మగ్గును
ఒకడు వివిధ వేషాలలో సంతసించును
    నిర్మాణ నాశనములలో వినోదించును
వేరొకడు అన్ని స్థితులలో మరణ మనుభవించును
    అన్ని యుగాలలో, వేళలలో మధనపడును.

—

నళినీ బాలాదేవి

## పరమతృష్ణ

ఓ సుందర ధరిత్రీ
నీ వీనాటి దానవుకావు
యుగ యుగాలనాటి శక్తివి
నా కరగిన కలల వేదికవు
అనంత శాంతి నిలయానివి.
నీ ఒడిలో ఎన్ని జన్మలెత్తితినో
ఎన్నిమారులు నిష్క్రమించితినో

అనుభవించని కర్మలు అనుభవించడానికి
ఎన్నిమారులు తిరిగి జన్మించితినో,
గతకాలపు గీతికలు విందును
గలగల మను ప్రవాహ సైకతమున-
చెట్లలోదాగి కీచురాళ్లు రోదించు నప్పుడు
దేహములేని ఆత్మ పాడినట్లగును.
బంగరు బండిపై చిరునవ్వుతోడ
ఉదయము తన అరుణాంచలమును పరచును.
రాత్రి చీకట్లను తొలగించి
తూర్పు నీలిమిపైన
బాలసూర్యుడు ఉదయించును.
ఎగిరే పిట్టల బారులు విషాద గీతము పాడును
వాటి ప్రతిధ్వనులు దూరదూరాన వినబడును
ఈ దేహపంజరంలోని ఏకాకి పక్షి
అనంతము చేరుకో నాశపడును
అజ్ఞాత పథములో పయన మాశపడును.
చల్లని ప్రభాత వాయువులు
నా నొసటిని కడుగును
నా కొక దివ్య సందేశమిచ్చును.
మూసిన కన్నులు తెరచుకొనే ముందు
కలల నిద్రలు తొణికి పోయేముందు
రాత్రిఉదయాల మేళన వేళ
గులాబి రంగుల
గతయుగాల స్మృతులు మనసులో మసలును.
చల్లని సాయం వీచికలలో విహరించునపుడు
కేతకితో గొంతు కలిపిన
కోకిల పాత పాటలలో
పురాస్మృతులు కదలును.
పచ్చని పొలాల ఒడిలో విశ్రమించునపుడు
ప్రకృతి ఉరముపై వలె
నాభావ సాగరమున
తరంగములు మిడిసి పడును.
హాసక్లేశముల అనంత మాల
గతజన్మల తీరని బంధాల ముత్యాలపేరులు
గళమున భారముగ వ్రేలాడును.
నేనేల వచ్చితిని ? ఏల మరలితిని ?

మరల మరల ఎందుకు వత్తు నిటకు ?
ఈ అనంత విశ్వమున ఏమి సాధించగలను ?
నే నెచట నివసించితిని ?
ఏల ఈ ప్రవాహమున బడితిని ?
గమ్య మెచటికి చేరగలను ?
నా కన్నియు దొరికినవని భావింతును
ఆయిననేదో కొరత తోచును
ఆత్మగత భావాలు సమకూర్చుకొలను
ఏమి లోపమో మాటల చెప్పలేను.
తీరని ఆశయాల ఆర్తి
ఎవరు నింపిరీ ఆత్మలోన
అనంత శాంతినిచ్చు ప్రేమామృత పరుసవేదిని
కూర్చకుండిన ఎట్లుండునో ?
దూర దూరాలనుండి మనోహర శబ్దములు
ఎవరు పలికేరు, ఎవరు పిలిచేరు ?
శాంతికి నోచుకోని బ్రతుకులకు
శాంతి సతోషమయ ఝరులు కాగ
అనుభవమున తృప్తి సమకూడి నట్లయిన
ఆశలు కోరికలే మిగులవు
ఆత్మ అనంతము చేరగలిగిన
జీవితము, మృత్యువు లేనేలేవు.
ఈ తీరని సౌందర్య తృష్ణ
ఈ మితిలేని కోరికలు
ఏనాటికిని పోవు.
అవధులులేని ఆనందము కొరకు
అసీమిత సౌందర్యము కొరకు
ఇది పరమ తృష్ణ
ఇది తీరని దాహము

దేవకాంత బరువా

## అమి దువార్ ముకలి కరో (మేము ద్వారము తెరుస్తాము)

నా మేజాపై నున్నది ఒక వర్ణ చిత్రము
నికొలాస్ రోరిచ్ చిత్రించినది
దాని శీర్షికేమి ?
'మేము ద్వారము తెరుస్తాము'
దేని ద్వారము ? తూర్పుదో, పశ్చిమానిదో ?
లేక యముని దక్షిణ ద్వారమో ?

ఆ లోకము నుండి జీవుల నాహ్వానించు
ఉత్తరాపథము సింహ ద్వారమో ?
దేవకాంతుడను, కవిని నేను
యౌవనపు మిట్టమధ్యాహ్నన
మార్గాయాసము తీర విశ్రమింతును
వ్యర్థ నిష్ఫల యాత్ర గూర్చి కలలు కందును.
విరామ గృహమున వినోద కోలాహలము
విశ్రమించుటకు స్థానమేది ?
మూసిన ద్వారమువంక మూక పరుగు లిడును
తెరచిన ద్వార మెక్కడ ?
జీవిత లయావర్తనము
నా హృదిని ఉన్మత్తము చేయును
ఈ మార్గము తప్ప అన్యమార్గము లేదు
నాలోని సింహద్వారము చూడగల్గుదునా ?
తాళము తనంత తా తెరచుకొని
యువ హృదయాలను లోనికి చేరనిచ్చునా ?
ఇంత కింత దూరము సాగి వచ్చితిని –
పెరూ దేశమున 'ఇన్‌కా'ల కూడి
వెండి బంగారు పూసిన పల్లకి నెక్కితిని
మెక్సికో దేశమున సుందరాంగుల కూడి
ఆటలు పాటలు నర్తనముల
యువకాశలకు ఆరతి పట్టితిని.
నైనేవి నంది ప్రతిమల ముందు
భూతాలు విలయ నృత్యము చేయ
బాబిలోను తోటలలో వలె
ఇచట కూడ అడుగు కలిపితిని.
ఇస్నాన మందిర ద్వారముల చెంత
ముకుళిత హస్తాలతో ప్రేమ నర్థించు
రాణకాంతలు, వనితా సమూహమును చూచితిని
వారి ప్రేమలు స్వీకరించితిని.
వక్షోజముల వంటి సైకతములు గల
క్రీటు ద్వీప రమణీయకతను
యువతీ యువకుల
క్రీడోత్సవములను ఆవిష్కరించితిని
ఇంతకింత దూరము సాగివచ్చితిని
తెరచిన మార్గము కానరాదు

ద్వారము లన్నియు మూసియే ఉన్నవి
నా మేజాపై గల వర్ణ చిత్రములోనె
ద్వారము తెరచి యున్నది
రోరిచ్ వ్రాసిన చలనము లేని
వర్ణ చిత్ర మది !

జ్యోతి ప్రసాద్ అగర్వాల

కారేంగర్ లిగిరి (అంతఃపుర పరిచారిక)
(మూడవ అంకం - మూడవ దృశ్యం)

రేవతి : రాజకుమారులకు వినతి - సేవాలీ తన ఇంటలేదు.

సుందర్ : ఎక్కడకు వెళ్లింది ?

రేవతి : నాకు తెలియదు ప్రభూ.

సుందర్ : (ఆమెను అపాదమస్తకం పరికించి) తడబడుతూ మాట్లాడుతున్నావేం ? వణుకుతున్నట్టు...... (కొంచెం ఆలోచించి, ఏదో అనుమానించినట్టు) సేవాలీ కోటలో ఉందా లేదా ?

రేవతి : (వణికే కంఠంతో) నేనెరుగను ప్రభూ

సుందర్ : (ఆశ్చర్యంతో) ఏమిటీ, విచిత్రంగా ఉందే. ఇలాటి మాట ఎన్నడూ వినలేమ. (సుదర్శనుని వైపు తిరిగి) విన్నావా మిత్రమా ? సేవాలీ కోటలో లేనట్టుంది, ఒక్కసారి ఎందుకు అదృశ్యం కావల్సి వచ్చిందని ? అర్థమైంది నాకు. వినండి. బాపూరా, రేవతీ! సేవాలీ సంగతి తక్షణం తెలుసుకోవాలి. రాజమాతను అడగండి సేవాలీ ఎక్కడికి వెళ్లిందో.
(రాజమాత ప్రవేశం. సుందర్ ఆమెవైపు బెబ్బులిలా చూస్తాడు.)
సేవాలీ ఎక్కడికి వెళ్లింది?

రాజమాత: (తీవ్రంగా) సేవాలీతో నీకేంపని?

సుందర్ : (మరీ తీవ్రంగా) చెప్పు సేవాలీ ఎక్కడికి వెళ్లిందో! (బాపూరాని, రేవతిని ఉద్దేశించి) ఎందుకు చెప్పరు మీరు?(బాపూరా భుజాలు పట్టుకుని గుంజుతూ) ఎందుకు? ఎం-దు-కు?

బాపూరా : నాకు తెలియదు ప్రభూ

సుందర్ : నీకు తెలియదు - నీకు తెలియదు—నీకూ తెలియదు! కోటలో అందరికీ తెలుసు (పిచ్చివాడిలా) ఎవరు? ఎవరక్కడ ! ఎవరక్కడ ! పిలు, అందరినీపిలు ! (బాపూరా పరుగెత్తుకుని వెడతాడు. సుందర్ కేకలువిని కోటలోని పరివారమంతా ఆత్రంతో వచ్చి వరుసలో నిలుచుంటారు. సుందర్ వారందరి వంకచూస్తూ) సేవాలీ ఎక్కడికి వెళ్లింది?

అందరూ ఏక కంఠంతో: మాకు తెలియదు.

సుందర్ : (నొక్కి పలుకుతూ) మీకు తెలుసు, మీకు తెలుసు! మీకుతెలియాలి, లేకపోతే అందరికీ శిక్ష తప్పదు. నేను అమానుషంగా ప్రవర్తించగలను. బాపూరా

చావొడాంగ్ బరువాని తక్షణం పిలుచుకొనిరా! వెళ్లు. (ఆవేశంతో ఊగిపోతాడు. సుదర్శన్‌కి నోట మాటరాదు.)

రాజమాత: ఏమయింది నీకు! ప్రపంచంలో ఎవ్వరూ చేయరాని పనిచేశావు నువ్వు. శాస్త్రవిధిగా వివాహమాడిన భార్యను మరొకనికి అప్పగించావు. మనవంశానికి మచ్చ తెచ్చి పెట్టావు నీ గౌరవాన్ని మంట కలుపుకున్నావు. ఖగుహాయుల గుండెల్లో ముళ్లు గుచ్చావు. ఈ కోటని నవ్వులపాలు చేశావు, నీతి నియమాలు, మంచిచెడ్డలు విడిచి పెట్టావు. అయినా నీకు సిగ్గు లేకుండా పోయింది. పాపిష్టివాడివి. ఇప్పుడు ఓ పరిచారిక వెంట పడుతున్నావు ?

సుందర్ : నేను చాలా మంచివాణ్ణిఅయాను. సేవాలీ ఎక్కడుంది చెప్పు? ఏంచేశావు సేవాలీని?

రాజమాత: నేను ఏమి అనుకున్నానో అది చేసి ఉంటాను చంపడమో, ముక్కలు ముక్కలుగా నరికించడమో !

సుందర్ : 'ఏం అనుకున్నానో అది చేసే ఉంటాను' అంటే చెల్లదు!

రాజమాత: అది అంతే. నామాట విని తీరాలినువ్వు.

సుందర్ : నేను వినను, సేవాలీని ఎక్కడేనా దాచిఉంచితే పిలిపించు. తరిమి వేసి ఉంటే మళ్ళీ అహ్వానించు. దేశబహిష్కారం చేసి ఉంటే, ఆ ఆజ్ఞ రద్దుచెయ్యి. కాలో చెయ్యో తీయించివేస్తే, మళ్లీ వేయించి ఇక్కడికి రప్పించు. ప్రాణమే తీయించి ఉంటే, మళ్లీ ప్రాణంపోసి నా దగ్గరకి పంపించు !

రాజమాత: పంపించకపోతే ఏం చేస్తావు?

సుందర్ : ఏం చేస్తానా? ఏ కొద్దిగానో మిగిలిన నీ కీర్తి గౌరవం నా కాలికింద నలిపేస్తాను. ఏడు తరాలనుంచి వస్తున్న నియమాలు, సంప్రదాయాలు పిండిపిండి చేస్తాను. (చావొడాంగ్ బరువా ప్రవేశం–మోకాళ్లమీద నిలిచి నమస్కరిస్తాడు) చావొడాంగ్ బరువా, సేవాలీ అనే పరిచారిక కనబడ్డంలేదు. వేగుల్ని, భటుల్ని నియోగించి ఆమెను వెతికించాలి. నగరంలోని ప్రతియిల్లూ వెతకాలి, అడవుల్లోని మూల మూలా వెతకాలి. కోటలోని వీరందర్నీ బందీచేసి, సేవాలీ ఏమయిందో వారి నోటినించే తెలుసుకోవాలి. కోటంతా ఒకటయింది ఈ విషయంలో. నాకు తెలుసు!

రాజమాత: (నిశ్చలంగా) సుందర్, నువ్వు సేవాలీని కోటలోనికి తీసుకురాలేవు.

సుందర్ : నువ్వు అలా అంటే నేను అంతకన్న ఎక్కువే చెయ్యగలను. సేవాలీని నా దగ్గరకి రప్పించి తీరాలి. చావొడాంగ్ బరువా, ఇక్కడున్న వారంతా వెతకాలి. ఆమెను నాదగ్గరకి తేవాలి వెంటనే, వెంటనే! (రాజమాత వంకకు తిరిగి) సేవాలీని కోటలోనికి తీసుకురాలేనూ? నా పూజనీయమైన రాజమాత, నీ ఆజ్ఞను ఉల్లంఘిస్తాను. అవేకాదు, మీ నియమాలూ, సంప్రదాయాలూ, నా తాత తండ్రులనాటి ఆచారాలూ, మీ శాస్త్రాల ఆదేశాలూ అన్నిటినీ ఉల్లంఘిస్తాను. సేవాలీని కోటలోనికి తెస్తాను. ఆమెను–ఆమెను వివాహం చేసుకుంటాను (అందరూ విస్మయులవుతారు). ఇంకా ఏం చేస్తానో చెప్పనా—పరమ పూజనీయమైన రాజమాతా, కోటలో అందరూ, రాజ్యంలో ప్రజలందరూ ఆమెముందు మోకరిల్లేలా చేస్తాను. ఆమె పరిచారిక కాదు, రాణిని చేస్తాను!

# ఉర్దూ

మూలం :
ప్రొ. జియా-ఉల్-హసన్ ఫారూఖీ

అనువాదం :
డా॥ ముకురాల రామారెడ్డి

## చారిత్రక సమీక్ష

ఉర్దూ అనే తుర్కీమాటకు పటాలం అనిఅర్థం. 19వ శతాబ్ది ఉత్తరభాగం లోనే ఉర్దూ భాషకు ఒక ప్రత్యేకత ఏర్పడినట్లు తెలుస్తున్నది. ఇట్లన్నంతమాత్రాన ఈ భాష పుట్టుక మరీ ఇటీవలిదే అనుకోవడం పొసగదు. వాస్తవం చూడబోతే 11వ శతాబ్దినాటికే పార్సీమాట్లాడే తండాలూ, సైనిక పటాలాలూ వాయవ్యసరిహద్దులగుండా హిందూదేశానికి వచ్చి మొదట్లో నేటి పడమటి పంజాబులో ఆగి తర్వాత ఢిల్లీదాకా వ్యాపిస్తూ స్థిరపడ్డవి. ఆనాటినుంచి ఓ కొత్తభాష క్రమంగా రూపొందబట్టింది. ఉర్దూలోని ప్రధానాంశాలన్నీ ఇండో-ఆర్యన్ భాషల కుదురులోనివి. పైన పేర్కొన్న తండాలూ, పటాలాలూ ఉన్న ప్రాంతంలో కలగలుపుగా ఏర్పడ్డమాటలు ఒకవంక, పార్సీవ్యవహారం మరోవంక మిశ్రిత మవుతూ ఓ కొత్తభాష రూపొందేపద్ధతి ఏర్పడ్డది. విజేతలై దిగిన మహమ్మదీయుల పార్సీపై అరబ్బీముద్ర బాగా ఉండేదని ఇక్కడ గమనించవలసిఉంది. 12వ శతాబ్ది ముగిసేనాటికి హిందూదేశంలో మహమ్మదీయుల పెత్తనం ప్రబలి, ఢిల్లీనగరం రాజకీయ, వ్యాపార కార్య కలాపాలకు కేంద్రమైంది. నాటికి ఇంకా పొదుగుగుడ్ల దశలోఉన్న ఈ భాష ఢిల్లీ చుట్టుపట్ల వ్యవహారంలోఉన్న మాండలికాలను బాగా ఆకళించుకొన్నది. 14వ శతాబ్ది ప్రారంభంలో దక్కన్‌కు వ్యాపించిననాటికి దీనికింకా ఒక పరిణతరూపం ఏర్పడలేదు· నాటి మతబోధకులు దీన్ని తరుచువాడినట్లు, అడ్డాదిడ్డి సమాసాలతో, మొరటువాక్యాలతో ఇది పెరిగినట్లు దాఖలా లున్నవి· బిజాపూర్ పాలకులైన ఆదిల్‌షాలూ, గోల్కొండపాలకులైన కుతుబ్‌షాలూ పోషించడంవల్ల ఇది దక్కన్‌లో వ్యాపించిపద్య, గద్య కృతులతో వెలసింది· 17వ శతాబ్ది ముగిసేనాటికి దక్కన్ దేశమంతా మొగలాయీల అధీనంలోకి వచ్చింది. 19వ శతాబ్ది ప్రారంభందాకా ఢిల్లీలో రాజకీయ, సాంస్కృతిక రంగాలలో పార్సీ భాషే కొనసాగుతూ ఉన్నా దక్కన్ ఉర్దూలో వెలసిన సాహిత్యంకూడా అక్కడికి చేరుతూఉండేది. దక్కన్ ఉర్దూ ఢిల్లీకిచేరి ఊరుకోలేదు· అక్కడి కవులపై తనముద్ర వేసింది. వాళ్ళుకూడా దాన్ని వాడకంలో ఉంచినారు. ఢిల్లీలో జరిగే ఉన్నత సాహిత్యవ్యాసంగాలకు ఈ భాష సమర్థవంత మైంది కాకపోయినా 600 సం॥ తరబడిగా ఇది అక్కడే పెరుగుతూ వచ్చింది. ఇక్కడ గమనించవలసింది మరోటి: ఆ యుగంలో ఉత్తర హిందూదేశం ఉర్దూలో వెలయించిన విశిష్టగ్రంథాలు ఇవి అని తేల్చి చెప్పడానికి వీలులేకున్నా, సాధారణ పౌరులూ, మతపీఠాలూ, బజార్లూ, దర్బారూ ఈ భాషను తమ నిత్యవ్యవహారంలో ఉంచినట్లు సులభంగా కనుక్కో-

వచ్చు. అట్లా ఉండకుంటే, 18వ శతాబ్ది ఉత్తరభాగంలో ఈ భాషను మాట్లాడి ఇందులోనే రచనలు సాగించిన కవులను నాటి పాలకులుగనీ, నవాబులుగనీ, సాధారణప్రజలుగానీ ఆదరించి పోషించేవారే కారు. లబ్ధప్రతిష్ఠతో ఇప్పటికి నిలిచిఉన్న 'ముషాయిరా' (కవి సమ్మేళన) సంస్థ నెలకొనేదే కాదు. ఈ భాషమీది ఆపేక్ష ఎంతో దూరం పెరిగి 'తజ్కిరా'లు (కవులజీవిత విశేషాలు) గూడా ఇందులోనే రచించుకొనేదాకా పోయింది. అప్పట్లో ఈభాషను వేర్వేరు పేర్లతో పిలిచేవారు. దహల్వీ (ఖుర్‌స్రావ్ మ. 1325 క్రీ.శ.), హిందీ, హిందవీ, రేఖ్తా, దక్కనీ, జబాన్-ఎ-ఉర్దూ-ఎ, ము' అల్లా జబాన్-ఎ-ఉర్దూ, ఉర్దూ. యూరోపియన్లు దీనికి మరోపేరుపెట్టి హిందూస్తానీ లేదా హిందూస్తాన్ భాష అనేవారు. 19వ శతాబ్దిమొదటి పాదంనాటికి ఇది తన రూపుదిద్దుకొని చివరకు 1832 లో పార్సీ స్థానంలో చేరి ఉత్తర హిందూదేశానికి న్యాయస్థానభాషగా, పరిపాలన భాషగా కాగలిగింది.

**మధ్యయుగం**

(a) *కవిత* : దక్కనీ ఉర్దూ సాహిత్యం సాధారణంగా మార్మిక ధోరణిలో నడిచింది. స్థానిక కవితలు పరిగణనీయమైనవి. ఉర్దూసాహిత్య ప్రక్రియలలో ముఖ్యమైనవనే గజిల్, మస్నవి, ఖసీదావంటివి రూపెత్తి దిట్టంగా పాదుకొన్నవి. తదుపరి బాగా వికసించినవి. తర్వాత వచ్చిన ఉత్తరహిందూస్థానీ కవులచేతిలో భాష మరీ చిత్రికపట్టినట్లైంది. ఔరంగజేబు గతించిన తర్వాత, క్రీ.శ. 1707 నుంచి 1857 దాకా ఉత్తరహిందూస్తానాన్ని అంతా రాజకీయ, సాంఘిక కల్లోలాలుపీడకలలవలె కలవరపెట్టినవి. ఏ రంగంలో చూసినా పూర్వపరిస్థితులన్నీ తల్లకిందులై పోయినవి. 18వ శతాబ్ది ఉత్తరభాగంనాటి కవులరచనల్లో ఉన్న భావాలను చూస్తే, నిస్సహాయత, నిరాశ, పరాఙ్ముఖభావము, వ్యాకులతవంటి ఆనాటి చిత్తవృత్తులతో అవి రంగరించుకొని ఉంటవి. ఆనాటి కవులలో దర్ద్ (మ. 1786) సౌదా (మ. 1781), మీర్‌హసన్ (మ. 1786), మీర్ (మ. 1810)-వీళ్ళు ముఖ్యులు. వాళ్ళ రచనలనిండాఉన్న ప్రబోధాత్మక గుణాన్ని సులభంగా గుర్తించవచ్చు. ఢిల్లీలోనే కాకుండా ఫరూఖాబాద్, తాండా, ఆజిమాబాద్, పాట్నా, ఔధ్‌వంటి బస్తీలలో ఉర్దూకవులకు పోషకులైన ప్రభువులుండే రాంపూర్‌లో సాహిత్యకేంద్రాలు వెలసినవి ఢిల్లీ వాతావరణం ఇబ్బందిగా తోచిన కవులంతా ఆయాస్థలాలకు చేరుకొన్నారు. లక్నోలో భాషను ప్రమాణీకరించే పట్టుదల దృఢంగా ఏర్పడి నిజమైన కవితాసృష్టికి అది తరచూ అడ్డంకిగా కనిపించింది. మర్సియా (స్మృతికావ్య) ప్రక్రియను సాధించడంతో ఆలోటు చాలావరకు భర్తీ అయింది. మీర్ అనీస్ (మ. 1874) రచించిన ఎలిజీలలో ముఖ్యంగా వీరగాథా లక్షణాలూ, విషాద కావ్యచ్ఛాయలూ సులభంగా గ్రహించవచ్చు.

నజీర్ అక్బరాబాదీ (మ. 1830) పేరు ఇక్కడ ప్రత్యేకంగా పేర్కొదగ్గది. అప్పటి కవితామార్గాలలో-లక్నోదిగానీ ఢిల్లీదిగానీ-ఏ ఒక్కమార్గానికి ఇతను కట్టుబడి ఉండలేదు. యథేచ్ఛాగతిని ప్రదర్శించిన రౌతుగా ఇతణ్ణి చూడటం సబబు. స్వచ్ఛందమైన ఈతని కావ్యాలలో మామూలు మనిషి జీవితరేఖలు గమనించవచ్చు. మామూలు మనిషి, అతని. సంతోషాలూ, సంతాపాలూ; కోరికలూ, తీరికలూ; ప్రణయం, ఆకలీ; ఆర్థికమైన అవసరాలు మొదలైన వాటినిఉద్దేశించి ఈకవి ఒక పట్టుదలతో రచించినాడు.

వృత్తిరీత్యా ఈతను మామూలు ఉపాధ్యాయుడే అయినా ఆయామతవర్గాలకు సంబంధించిన ఉత్సవాలన్నింటిలోనూ పాల్గొని వాటిని గుర్తించి రచించినాడు. ఉర్దూ కవి

త్వంలో స్థానికవాతావరణచిత్రణ మహమ్మద్ ఖులీఖుతుబ్షా (మ. 1611) కాలంనుంచే గమనించే వీలుంది. కాని, నజీర్ అక్బారాబాదీ కూర్పులోనే తగిన తొడుగులూ, దిరిసులూ అమరినవని చెప్పుకోవడం సబబుగా ఉంటుంది. ఇతని భాష సున్నితమూ, సుసంస్కృతమూ కాకున్నా అది బహుళ ప్రజలను ఆకర్షించగలిగిందనడంలో అనుమానమేమీలేదు.

ఈ కాలంలో ఢిల్లీ పరిసరమంతా కవితాశూన్యమైపోయిందని కాదు. చివరకు 1857 నాటికి పతనావస్థకు చేరకముందే ఆ ప్రాంతం ఉర్దూభాషలో మహాకవులనదగినవారిని కొందరిని సృష్టించింది. జౌఖ్ (మ. 1854), మోమిన్ (మ. 1851), గాలిబ్ (మ. 1869) ఈ యుగానికి చెందినవారే. మనిషి సమస్యలను తాత్విక సంగతిలో దర్శించిన గాలిబ్ ఔచితీపరిజ్ఞానాన్ని, నైరాశ్యంలోనుండే ప్రత్యాశను, కళాత్మకమైన వైశద్యాన్ని అందించడంలో గణనీయుడైనాడు.

(b) వచనరచన : దక్కన్‌లో వివిధ వచనరచనలు వెలువడినవి. అవన్నీ ఇంచుమించు మతపరమైనవే. ముల్లావాఝి రచించిన 'సబ్‌రాస్' (సౌందర్య, హృదయాల కథ) ఉర్దూలోని మహత్తరమైన అన్యాపదేశకావ్యశైలికి మచ్చుగా ఇంకా నిలిచిఉంది. 18వ శతాబ్ది ముగిసేనాటికి ఈ భాష తన ప్రాముఖ్యాన్ని వెలుగురేకలవలె భాసింపజేస్తూ యూరోపియనులను ఆకర్షించింది. దీని ప్రాముఖ్యాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీకూడా తెలుసుకొన్నది. కలకత్తాలో ఫోర్ట్ విలియం కళాశాల నెలకొన్నది (1800). కంపెనీ ఉద్యోగులకు ఈ భాషను నేర్పే వీలయ్యేటట్లుగా సుప్రసిద్ధపండితులను నియమించి గ్రంథరచనలు చేయించినారు. ఫోర్ట విలియం కళాశాలానియుక్తులైన రచయితలు చేసిన కృషి, అందించిన సేవలు గణనీయమైనవై ఉర్దూలో వచనరచన వికసించడానికి తోడ్పడ్డవి. ఆ కళాశాల ప్రిన్సిపాల్ డా. జాన్ గిల్‌క్రైస్ట్ కోరికపై మీర్‌అమన్ రచించిన 'బాగ్-ఏ-బహార్' (tale of the four Dervish, నల్గురు దర్వీష్‌లకథ) నానాటికీ సరళభాషారచనకు ఒరవడి పెట్టింది. ఈ కథలోని పాత్రలు రాజులూ రాణులూ, దేవకన్యకలూ. సంస్కృతికి సంబంధించినంతవరకూ ఇది హిందూదేశీయమైన విలక్షణతను మనకు ప్రత్యక్షం చేస్తుంది. గాలిబ్ తన మిత్రులకూ, శిష్యులకూ వ్రాసిన జాబులెన్నో సరళభాషలోనే రచితమైనవి. ఇవి సాంఘిక, చారిత్రక, సాహిత్యపరంగాఉన్న సమస్యలను స్పృశించినవి. ఈ నాటికీ అనుకరణకు వీలుకాకుండా నిలిచినశైలి ఇతనిది. 1840 ప్రాంతాలలో ఢిల్లీ కళాశాల నెలకొల్పిన దేశభాషల తర్జుమాసంస్థ న్యాయశాస్త్రం, గణితశాస్త్రం, చరిత్ర, ప్రకృతి శాస్త్రాలువంటి విషయాలపై గ్రంథాలు ప్రకటించింది. దీనివల్ల సువ్యవస్థితమైన వచనరచన వికసించడానికి మార్గమేర్పడ్డది. తదుపరి ఢిల్లీ కళాశాల విద్యార్థులుగాఉన్న సర్‌సయ్యద్ అహమ్మద్‌ఖాన్, హాలీ, ఆజాద్, నజీర్ అహమ్మద్ తదితరులు ఉర్దూవచనరచనకు మార్గదర్శకులైనట్లు రుజువైంది. ఉర్దూ సాహిత్యంలో ఆధునిక యుగాన్ని తడవి చూసేముందు మధ్యయుగపు ఉర్దూసాహిత్యానికంతా సంకేతంగా నిలిచిన అంశాలు "విస్పష్టమైన మానవత్వం, మానవుని నైతికాభ్యున్నతి, మానవజాతి సమైక్యత" అని ఇక్కడ గుర్తించవలసి ఉంది.

ఉత్తర హిందూస్థానంలో బ్రిటిష్ పరిపాలన స్థిరపడి పెరిగి రావడంతో పాటే ఉర్దూ సాహిత్యంలో ఆధునిక యుగం మొదలవుతుంది. పాశ్చాత్య భావసరళి, ఇంగ్లీషు

సాహిత్యం, ఆధునిక శాస్త్రాలు - వీటితో సంపర్కం పెట్టుకొన్న హిందూదేశ మేధావులపై అవి తమ ప్రభావ ముద్రను వేసినవి. అంతే కాకుండా ఒక కొత్తవర్గం - మధ్య తరగతి - పైకి వస్తుండేది. కాలానుగుణ్యమైన సాంఘిక సంస్కరణ అవసరమని ఆ వర్గం భావించింది. సర్ సయ్యద్‌తోపాటు అతని అనుచరులు హాలీ, నజీర్, అహమ్మద్, షిబ్లీ, తదితరులు కూడా పాశ్చాత్యభావ సరళిని బాగా పరిచయం చేసినారు హిందూ దేశస్థులకు కావలసినన పునరుజ్జీవనధోరణి ఆధునిక శాస్త్రాలలోనే ఉన్నదని వారు విశ్వసించినారు. సామాజికపరమైన పరివర్తన తీసుకొని రావడానికి సాహిత్యమే తగిన సాధనమని గ్రహించి అదే ఉద్దేశంతో వారు సాహిత్యాన్ని ఉపయోగించినారు. సర్ సయ్యద్ మతాన్నిగూర్చి, ఇస్లాంను గురించి ప్రకటించిన భావాలకు అనుకూలంగా కొంత, వ్యతిరేకంగా కొంత సాహిత్యం వెలువడింది. అదంతా ఉర్దూ వచన రచనలో ఉరవడి పెరగడానికి సహజంగా తోడ్పడింది.

నజీర్ అహమ్మద్ (మ. 1911) మత, సాంఘిక రంగాలలో సంస్కరణను ప్రేరేపించే దృక్పథాన్ని ప్రసారిస్తూ, మధ్యతరగతి ముసల్మానులలోని సాంఘిక సంస్కరణలను అభివర్ణిస్తూ కొన్ని నవలలు రచించినాడు. షిబ్లీ (మ. 1914) కవిగా, విమర్శకుడుగా ప్రసిద్ధి పొందడమే కాకుండా ఇస్లాం వీరుల జీవిత కథలు రచించి ప్రసిద్ధుడైనాడు. హాలీ (1914) మహమ్మద్ హుసేన్ ఆజాద్ (1910)తో కలిసి ఆధునిక ఉర్దూ కవిత్వానికి పునాదులు వేసినాడు. వీరిద్దరూ గొప్ప రచయితలు. మునుపటి కాల్పనిక ప్రణయ కవితను వరించిన ఆజాద్ ప్రత్యేకత పరిగణించ దగ్గది. కవియై అలవరచుకొన్న సున్నితమైన భావనాత్మకత అతనిని ఒక ఆదర్శ వచనరచయితగా నిలుపలేదు. అయినా వచనరచనా శైలిలో అతడు గొప్ప నేర్పరి. ఈ యుగానికి చెందిన ఒకసాటి కళాఖండం హాలీ రచించిన దీర్ఘకావ్యము, 'ఇస్లాం మతం - ఆటుపోటులు'.

కాలగతిలో పాశ్చాత్య సాహిత్య ప్రక్రియల ప్రభావమే ప్రాముఖ్యం వహించింది. రతన్‌నాథ్ సర్‌హార్, అబ్దుల్ హలీం షరార్, మిర్జా రస్వా సుప్రసిద్ధులైన నవలా రచయితలు. రస్వా రచించిన నవల 'ఉమ్రావొజాన్ అదా' లక్నో రాజనర్తకి కొనివేసిన ఒక అపహృత బాలిక జీవిత కథకు సంబంధించిన గవేషణ ఇది. హిందూదేశ సంస్థానాల్లో 19వ శతాబ్దిలోను ఈ రోజుల్లోనూ ఉన్న దుర్వ్యవస్థనూ, దిగజారిన లక్షణాన్నీ మనకు ప్రత్యక్షం చేసేరచన ఇది. దీనిలో బాగా చిత్రించిన కొన్ని పాత్రల నమూనాలు సమాజంలోని వివిధ వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తాయి.

పండితాగ్రగణ్యుడై బ్రిటిష్ ప్రభుత్వంలో ఉద్యోగిగా ఉన్న అక్బర్ అలహాబాదీ (మ. 1921) ఉర్దూలో ఒక విశిష్టస్థాయిని అందుకొన్నకవి. పాశ్చాత్య జీవిత విధానాలనూ వాటి అనుకరణలనూ ఆక్షేపించే హాస్య, అధిక్షేప కవితలచే ఇతడు ప్రసిద్ధుడు. గత వైభవంపై ఆసక్తి సాంఘిక సంస్కరణాభిలాష, జాతీయ స్వాతంత్ర్యోద్యమ స్పృహ ఈ యుగం మొదటి పాదంలో ఉన్న ఉర్దూ రచయితలపై తమ ప్రభావం వేసినవి. చెక్‌బస్త్ (మ. 1926), ఎఖ్బాల్ (మ. 1938) ఇంకా మరెందరో కవులు ఈ విషయంలో ఎన్నో సేవలు చేసినారు. తాత్త్విక ఘటననూ, లౌకిక దృక్పథాన్నీ, కవితా భావుకతనూ, శక్తిమంతమైన అభివ్యక్తీకరణనూ ఆకళింపు చేసుకొన్న కవి అయిన ఎఖ్బాల్ హిందూస్థానం సృష్టించుకొన్న అపూర్వ కవుల్లో ఒకడైనాడు.

స్వాతంత్ర్యోద్యమం తారస్థాయికి చేరుకొన్నది కాబట్టి ఉర్దూ కవులు సాధారణ ప్రజల హృదయస్పందనలను రచనాబద్ధం చేయకుండా విడువలేదు. కవితా రంగంలో పూర్వం యువతరం కవిగా పేరందిన జోష్‌మలీహాబాదీ యువతను చర్యాభిముఖంగా ఉద్బోధిస్తూ 'విప్లవకవి' అయినాడు.

పత్రికా రచనలో జఫర్ అలీఖాన్, మౌలానా మహమ్మద్, అలీ (మ. 1927) అబ్దుల్ కలాం అజాద్ (మ. 1959) తగిన ఒరవడులు అమర్చినారు. అబ్దుల్ కలాం ఆ ంకారిక శైలిని అవలంబించినా ఆయన సంపాదకత్వంలో వెలువడిన పత్రిక 'అల్-హిలాల్' బాగా ప్రచారంలో ఉండింది.

నవలాసాహిత్యంలో, సాంప్రదాయికమైన కథాకథనప్రక్రియ (దాస్తాన్ ప్రారంభంలోనే పక్కకు పోయింది. చిన్నకథ రంగమెక్కింది. ప్రేమ్‌చంద్ (మ 1936) అత్యంత ప్రాముఖ్యాని కెక్కిన రచయిత అయినాడు. మానవతకూ, గ్రామీణులైన పేద వర్గాలవైపు చూపిన సానుభూతికీ ఆకరాలైన ఆయన రచనలు (నవలలూ, చిన్నకథలూ) ముఖ్యంగా పేర్కొనదగినవి,

1930 ప్రాంతాల్లోనే 'అభ్యుదయరచన' ఒకకొత్తసాహిత్యోద్యమమై కాలూను కొన్నది. స్థూలంగా చెప్పదలిస్తే సాంఘిక విప్లవం తేదలచిన అభ్యుదయ రచయితలు సాహిత్యాన్ని సాధనంగా ఉపయోగించు కోవడానికి ప్రయత్నించినారు. ఈ యుగంలో లైంగిక విషయాలకు హత్తుకొని వచ్చిన రచనలు కారణంగా తీవ్ర విమర్శ రేకెత్తింది. ఇంతేకాక మార్క్స్, ఫ్రాయిడ్, మొపాసా ప్రభావాలు సాహిత్యంలో ఒక ధోరణిని రూపుకట్టించినవి. చిన్నకథ బాగా పుంజు కొన్నది. సజ్జాద్ జహీర్, అహమద్ అలీ, కిషన్ చందర్, ఉపేంద్రనాథ్ అషక్, రాజేంద్రసింగ్ బేడీ, ఇస్మత్ చుఘ్తాయి తదితరులంతా అభ్యుదయ రచయితల పక్షానికి చెందినవారే.

నవలా రచయిత్రి అయిన ఇస్మత్ చుఘ్తాయి పాత్ర చిత్రణలకు పేరు మోసింది. ఆమె మధ్య తరగతి ముస్లిం ప్రజల సాంసారిక జీవనంపై సంపాదించిన అనుభవం, భాషా ప్రయోగంలో నేర్చిన నైపుణ్యం, కాల్పనిక సాహిత్య రచనలో అలవరచుకొన్న కిటుకు ఆమెను ఉర్దూలో మహోత్తమ నవలా రచయిత్రిగా ప్రతిష్ఠించాయి.

చైతన్యస్రవంతి తరహా శిల్పాన్ని కూడా కొందరు నవలా (కథా) రచయితలు ప్రయోగించినారు. ఆ బాపతులో ఖ్వారత్ - ఉల్ అయిన్ హైదర్ ప్రశస్తి కెక్కింది. కొన్నిసంపుటాలుగా ఆమె రచించిన నవల 'ఆగ్ కాదర్యా' (అగ్నితరంగిణి) ఈ రకమైన శిల్పంలో ఆమెకున్న నిపుణతను చాటుతుంది.

నాటకం, వ్యాసం తదితర సాహిత్యప్రక్రియలు కొన్ని పాశ్చాత్య సాహిత్య సంపర్కంతో వెలువడ్డవి.

ఈ నాటికి బాగా పాదుకొన్న జాతీయరంగ స్థలం, దాని పథకాలూ; వివిధ ఆసక్తులతో నానాటికీ ప్రవర్ధమానాలవుతూ వస్తున్న ఆయాఔత్సాహిక నాటక సమాజాలు; విద్యావిషయక సంస్థలూ; ఆలిండియా రేడియో నాటికా విభాగం; నాటక రచనను ముందు ముందు బాగా ప్రోత్సహిస్తాయని ఆశించవచ్చు.

వ్యాసరచన ప్రవేశించిన 19 వ శతాబ్ది ఉత్తర భాగం నుంచీ ఉర్దూలో వ్యాస రచయితలు చాలామంది బయలుదేరినారు. సర్ సయ్యద్, మహమ్మద్ హుస్సేన్ ఆజాద్, హాలీజకాఉల్లా మంచి వ్యాసాలు రచించినారు. ఆబిద్‌హుస్సేన్ సమకాలిక తన నాటి వ్యాస రచయితల్లో ప్రముఖుడైనట్లు వెంటనే చెప్పవచ్చు. ఈయన కాలక్షేపం బాపతు రచనలు కూడా చేసినవాడు. కాని ఒక నిశ్చిత మార్గంలో, క్లుప్తంగా, హేతుబద్ధంగా యుక్త మైన భాషలో రచించగలిగినందుకే ఈయన విశిష్ట రచయితగా పేరొందినాడు.

నెహ్రూ చెప్పినట్లు నేటి హిందూదేశం ఆశ, ఆవేదనలు కలపోసిన ఒక మిశ్రచిత్రం. అందులో ప్రశంసనీయమైన పురోగమనంతో పాటు జడత్వం కూడా మిళితమైఉంది. ఒక భవ్య నూతనోత్సాహమూ, గత కాలమూ ప్రత్యేక స్వత్వాల తాలూకు మృతహస్తమూ; సార్వత్రి కమై విజృంభ మాణమవుతూన్న ఐక్య భావన-దాని వెంట వెంటనే విచ్ఛిన్నకర శక్తులూ - ఇవన్నీ చేతులు కలిపి విహరిస్తున్నాయి. యుగ యుగం మారుతూన్న భారత జాతీయ చిత్రాన్ని ఉర్దూ వాఙ్మయం ప్రతిబింబిస్తూనేఉంది. సమకాలీన ఉర్దూ సాహిత్యంలో కూడా నేటి భారత జీవిత చిహ్నాలు తొంగిచూస్తూనే ఉన్నాయి.

## వి ష య సూ చి క


1. మీర్ అమ్మన్ : "బాగ్ ఓ బహార్" లెవిన్ ఫెర్థినాండ్ స్మిత్ చేసిన ఆంగ్లానువాదము : 'ది టేల్ ఆఫ్ ది ఫోర్ దర్వీష్' పు.129-132, ప్రచురణ నేవల్‌కిశోర్ ముద్రణా లయము, 1895.
2. కలింకు ఏమైనట్టు ? ... ...
3. మిర్జామహమ్మద్ హాదీ రుస్వా : "ఉమ్రావొజాన్ అదా" ఆంగ్లానువాదము : కుష్వంత్‌సింగ్, ఎం. ఏ. హుసేనీ
4. ఆబిద్ హుసేన్ : "ది డెస్టినీ ఆఫ్ ముస్లిమ్స్" పు. 259-64, ప్రచురణ : ఆసియా పబ్లిషింగ్ హౌజ్. ఈ పుస్తకానికి ఉర్దూలో ఉన్న శీర్షిక 'హిందూస్తానీ ముసల్మాన్ ఐనె - అయ్యాంమేఁ' ప్రచురణ. మక్తబా జామియా, ఢిల్లీ.
5. మీర్ పద్యము : ఆంగ్లానువాదము : ఎం. సాదిఖ్. ఉర్దూసాహిత్య చరిత్ర ఓ. యు. పి. 1964.
6. వర్షాకాలము : ఆంగ్లానువాదము : ఎం. సాదిఖ్.
7. గాలిబ్ పద్యాలు : ఆంగ్లానువాదము: జె. ఎల్. కౌల్ 'ఇంటర్ ప్రిటేషన్స్ ఆఫ్ గాలిబ్', ప్రచురణ, ఆత్మారాం, 1957.
8. హాలీ పద్యాలు : ఆంగ్లానువాదము : సి. ఎన్. ట్యూ, ఓ. యు. పి. 1932.

9 ఎఖ్బాల్ పద్యాలు : ఆంగ్లానువాదము ఎఖ్బాల్, గ్లింప్సెస్ ఆఫ్ ఉర్దూ లిటరేచర్' ప్రచురణ ఆలీగఢ్‌ముస్లిం యూని వర్సిటీ, 1961.

## బాగ్ - ఓ - బహార్

మీర్ అమ్మన్

ఇట్లా ఉన్న జాతక విశేషాలు విని రాజు ఈ తోటను నాకోసం విడిగా ఏర్పాటు చేసినాడు. ఇందులో రకరకాల విడిదిశాలలు కట్టించినాడు. నన్ను ఒక నేలమాళిగలో పెంచవలసిందిగా ఆజ్ఞాపించినాడు. ఆనేలమాళిగలో భాగమంతా పరదాలు తీర్చి కట్టినారు. నా విడిదిశాలకు సూర్యునినుంచిగాని, చంద్రునినుంచిగాని ఒక్కకిరణమైనా సోకకుండా చేసినారు. నా సపర్యలకోసం ఒకదాదితోపాటు ఇతర సేవికలు కూడా ఉండేవారు. ఇంత విభవోజ్జ్వలమైన ఈ స్థలంలో నన్ను ఎంతో జాగ్రత్తగా, నాజూకుగా పెంచినారు. నా విద్యా వ్యాసంగాలను పర్యవేక్షించడానికి ప్రభుత్వ వ్యవహారాలలో దక్షులైన పండితులను నియమించినారు. శాస్త్రం, కళ- ఒకటేమిటి విద్యారంగంలోని ప్రతిశాఖలోను నన్ను ప్రవీణుని చేసినారు. నా తండ్రి నన్ను సురక్షితంగా చూస్తుండేవారు. ప్రతిదినం, ప్రతిక్షణం నన్ను గురించిన సంగతులు రాజుకు నివేదిస్తుండేవారు. ఈ స్థలమే నా ప్రపంచం. బొమ్మలతో కొంతసేపు, పూలతో కొంతసేపు వినోదిస్తూ ఉండేవాణ్ణి. సరసమైన ఆహార పదార్థాలతో పాటు నేనేదికోరితే అది బయటి ప్రపంచంనుంచి వచ్చిపడేది. పదేండ్ల వయస్సు పడేసరికే విద్యావిషయకమైన ప్రతి అంశాన్నీ, ఉపయుక్తమైన ప్రతి శాస్త్రాన్నీ ఆకళింపు చేసుకొన్నాను.

ఒకనాడు నేనుంటున్న నేలమాళిగపై గవాక్షం అంచున్నే ఒక విచిత్రమైన పువ్వు కనిపించింది. చూస్తూ చూస్తూ ఉండగానే అది విప్పారుకొంటున్నది. దానిని ఉన్నది ఉన్నట్లుగా పట్టుకొందామనుకొన్నాను. నా చేతులు విప్పి దానివైపు ఎత్తుతుండగానే అది అట్లాగే రెగవాలుగా వచ్చిపడి నా పట్టులోంచి తప్పించుకొనిపోయింది. నేను చిత్రపోయి దానివైపే రెప్పగొట్టకుండా చూస్తున్నాను. అప్పుడెవరోకాని పకపకానవ్విన సవ్వడి నాగూబలకు తాకింది. ఆ నవ్వుల సవ్వడి వస్తున్న గవాక్షంవైపు తలెత్తి చూస్తే పరదా చీలికలై పోయింది. ఆ వెలుగుగూనలోంచి ఒక ముఖం చందమామే తొంగిచూస్తున్నట్లు తళతళా మెరిసింది. దాన్ని చూస్తూనే నాకు స్పృహ తప్పింది, మూర్ఛపడిపోయినాను. స్పృహలోకి వచ్చితలెత్తి చూసినాను. వజ్రాలు తాపిన ఒక గద్దెను గంధర్వ కన్యకలు మోసుకొని వస్తున్నట్లు కనిపించింది. ఆ గద్దెమీద ఒక సుందరి కూర్చొని ఉంది. ఆమె తలపై రత్నకిరీటం ఉంది దివ్యమైన దిరిసులు తొడిగింది. గరుడపచ్చల గళాసుతో మద్యం సేవిస్తూ ఉంది. ఆ గద్దె నిదానంగా దిగుతూ దిగుతూ వచ్చి పైగవాక్షం అడుగున వాలింది. అప్పుడా దివ్యసుందరి నన్ను పిలిచింది. తనగద్దెపై ఓ పక్క కూచోబెట్టుకొన్నది, చిరునవ్వులు చిందుతూ సల్లాపాలాడింది, నన్ను ముద్దుపెట్టుకొన్నది, గులాబీరంగువంటి మద్యం ఓ గళాసు నింపి ఇచ్చి తాగించి ఇట్లా అన్నది. "మనిషి విశ్వాసహీనుడే అయినా నా హృదయం నిన్ను ప్రేమిస్తు

న్నది''. ఒక మాటలో చెప్పవలెనననంటే ఎంతో ప్రియంగా, సమ్మోహనంగా ఉన్న ఆమె సల్లాపాలతో నాహృదయం రసస్నిగ్ధమైపోయింది. జీవితామోదాలన్నిటినీ రుచిచూడగలిగినట్లు భావించినాను. ఆనంద ప్రపంచంలోకి ఆనాడే ప్రవేశించినట్లు ఎంతో ఆప్యాయంగా తలపోసుకొన్నాను, దాని ఫలితాంశం నన్ను ఇప్పటి పరిస్థితిలోనే విడిచినా ప్రపంచంలో ఏ ఒక్కరికీ అట్లా రుచులాడి, అట్లా చూసి, అట్లావినే ఆనందమే సంభవించ లేదనుకొంటాను. ఆదే సాభిలాషతోనే మేమిద్దరమూ కులాసాగా కూర్చొని పరస్పరం మురిసిపోతున్నప్పుడు మా ఆనందభూమికలు హఠాత్తుగా తునాతునకలైపోయినాయి. హఠాత్సంభవంగా ఇట్లా మార్చిన విచారకరమైన సంఘటనలను ఇప్పుడు వినండి : అదేపాటున నలుగురు గంధర్వ కన్యకలు స్వర్గంనుంచి దిగివచ్చి నా ప్రియురాలైన ఆ దివ్యసుందరి చెవిలో ఏదో గుసగుసలు చెప్పినారు. దానిని వినగానే ఆమె వెంటనే బారిపోయి నన్ను చూసి ఇట్లా అన్నది. ''ప్రియతమా ! నీతో కొంత కాలక్షేపం చేసి నాహృదయపీణను మోగించుకొందామని, ఇట్లే కొన్ని పర్యాయాలు వచ్చిపోదామని, ఎంతో ఆశపడ్డాను. కాని విధిక్రూరమైంది. ఏ యిద్దరినీ సుఖశాంతులతో ఉండనీయదు. నా ప్రియతమా ! సెలవు. దైవం నిన్ను రక్షించనీ''. భయంకరమైన ఆమాటలు వినగానే స్పృహ తప్పి పడిపోయినాను నా ఆనందం మాయమైంది. "ఓ నా మోహినీ! మళ్ళీ మనమెప్పుడు కలుసుకొంటాము ? ఎంతభయంకరమైన మాటలు వినిపించినావు ? వెంటనే నీవు తిరిగి రాగలిగితేనే నన్ను ప్రాణాలతో చూస్తావు. తాత్సారం చేస్తే విచారిస్తావు. కనీసం నీపేరూ ఊరైనా చెప్పిపో. ఎక్కడఉన్నా వెతుక్కొంటూ వస్తాను. నీపాదాక్రాంతుణ్ణి అవుతాను" అంటూ అంగలార్చినాను. అని విని "దైవాజ్ఞ అట్లే చెయ్యవలసి ఉంటుంది. [1]నూటాఇరవై యేండ్లు వర్ధిల్లుదువుగాని. ప్రాణాలతో ఉంటే మళ్ళీ కలుసుకొందాము. నేనొక గంధర్వరాజు కూతురును [2]ఖాఫ్‌గిరి పరిసరాలలో ఉంటాను "అన్నదామె. అట్లన్న వెంటనే గంధర్వ కన్యకలు ఆమెగద్దెను మోసుకొనిపోయినారు. అది దిగివచ్చిన క్రమంలోనే పైపైకి వెళ్ళిపోయింది. ఆ గద్దె కనుమేరలో ఉన్నంత సేపూ మేము పరస్పరం చూసుకొంటూనే ఉన్నాము. అది అదృశ్యం కాగానే నేను తికమకలో పడిపోయినాను. నా మనస్సునిండా విచిత్రమైన చీకటి అలముకొని పోయింది. బుద్ధి పనిచేయలేదు. నిశ్చేష్టుడనైనాను. నాకను దగిలినంతదూరం ప్రపంచమంతా చీకటి అయిపోయి నన్ను తబ్బిబ్బుచేసి దిగ్భ్రమలో పడేసింది. నేను లబలబ మొత్తుకొన్నాను. నెత్తినిండా దుమ్ము పోసుకొన్నాను. బట్టలు చీరుకొన్నాను. ఆహారపానీయాలమీద నాకు ఆస్థ నశించింది. పుణ్యపాపాలు విచారించే స్థితిలో లేను. ప్రేమ! అబ్బా ఎంత చిత్రమైన కష్టాలు తెచ్చి పెడుతుంది ! మనస్సును దుఃఖభరితం చేసి చాంచల్యంతో దానినే చీల్చిపారవేస్తుంది.

నాకు అట్లా సంభవించిన దురదృష్ట సంఘటనను దాది, తదితర సేవికలు తెలుసుకొన్నారు. భయంతో వణుకుతూ వారు రాజు దగ్గరకి వెళ్లి ఇట్లా చెప్పినారు. "యువరాజు స్థితి ఇట్లా అయింది. ఈ ఉపద్రవం అకస్మాత్తుగా ఇట్లా ఆయనమీద వచ్చి పడటానికి కారణమేమిటో మాకు తెలియదు. అన్నపానాదులనూ, విశ్రాంతినీ త్యజించివాడు." విచారకరమైన ఆ వార్తను విన్న వెంటనే వజీరునూ, విద్యాధికులైన నవాబులనూ, విజ్ఞులైన వైద్యులనూ, అద్భుమైనజోస్యులనూ, పవిత్రులైన పురోహితులనూ వెంటబెట్టుకొని నేనున్న తోటలోకి వచ్చి తబ్బిబ్బులలో ఉన్ననన్నూ, నా శోకావస్థనూ చూసినాడు. నన్ను చూసిన తర్వాత ఆయన

మనస్సుకూడా వికలమైంది. ఏడ్చినాడు, గాఢంగా నన్ను ఎదకు హత్తుకున్నాడు. నన్ను బాగు పరిచేకోసం ఆజ్ఞలు జారీచేసినాడు. నామనస్సు దిటవుపరిచి మేధను బాగుపరచే నిమిత్తం వైద్యులు మందులు వ్రాయించి తెచ్చినారు. పురోహితులు మంత్రించిన జలం తాగించి తాయెతులు కట్టించినారు. భూతోచ్చాటనకోసం ప్రార్థనలు చేసినారు. జ్యోస్యులుచూసి గ్రహ, నక్షత్రాలు వికటించడంవల్ల ఈ విపత్తు సంభవించిందని పవిత్రకార్యాలకు దానాలు చేసి దీనిని తప్పించవచ్చునన్నారు. వాళ్ళ వాళ్ళ వృత్తులప్రకారం, శాస్త్రాలప్రకారం సలహాలు చెప్పినారు. కాని జరిగిన సంగతంతా నా మనస్సుకే తెలుసు. నాకు సంభవించిన విపత్తును తొలగించడానికి ఆ సలహాలూ, సహాయాలూ, చికిత్సలూ ఏ ఒక్కటీ పనిచేయలేదు. దినదినం ఉన్మాదం అతిశయించి తిండిమానడం వల్ల బక్కచిక్కిపోయినాను. రేయింబవళ్ళు మూల్గుతూ, గుణుస్తూ ఉన్నాను.

మూడు సంవత్సరాలు ఇదే విచారకరమైన స్థితిలో గడిచినాయి. నాలుగో సంవత్సరం దేశదేశాలు తిరుగుతూ వచ్చిన ఒక వర్తకుడు మా నాన్న దర్బారులో ప్రవేశించి వివిధ దేశాలనుంచి తెచ్చిన అసాధారణమైనవి కొన్ని, అమూల్యమైనవి కొన్ని కానుకగా సమర్పించి సుస్వాగతం అందుకొన్నాడు. రాజు అతణ్ణి ఘనంగా అభిమానించి, అతని ఆరోగ్యం ప్రయాణ విశేషాల గురించి కుశలప్రశ్న చేసి "మీరిన్ని దేశాలు తిరిగివచ్చినారుగదా! నిజంగా నిపుణుడైన వైద్యుణ్ణి ఏక్కడైనా చూడడం తటస్థించిందా? కనీసం ఒకరిని గురించి వినడమైనా జరిగిందా?" అని అడిగినాడు. ఆ వర్తకుడు సమాధానంచెబుతూ ఇట్లన్నాడు. "మహాప్రభూ! ఈ దాసుడు ప్రయాణించిన దేశాలనేకం ఉన్నాయి. కాని నేను చూసినవారిలో శ్రేష్ఠుడైన వ్యక్తి ఒకాయన ఉన్నాడు. హిందుస్తాన్‌లోని గంగానది ఉంది, ఆనది మధ్యలో ఒక గండశిలపై ఆయన ఉంటాడు. ఆయనొక జటాధారి[4] గోస్వామి. అక్కడే[5] మహాదేవుని గుడి కట్టి ఓ మంచి ఆశ్రమం, తోటా ఏర్పాటు చేసుకొని అందులో ఉంటున్నాడు. ఆయన నియమం ప్రకారం ప్రతిసంవత్సరం[6] శివరాత్రినాడు తన ఆశ్రమం నుంచి బయటకివచ్చి, గంగా నదిలో ఈది వినోదిస్తాడు. స్నానంచేసి ఆయన ఆశ్రమంలోకి వెళ్ళుతున్నప్పుడు దేశ దేశాలనుంచి వచ్చిన రోగిష్ఠులూ, వందిలి పడ్డవాళ్ళూ ఆయన ఆశ్రమద్వారం వద్ద గుమిగూడి ఉంటారు."

**వివరణలు:**

1. మహమ్మదీయులు, 'ఉమ్రేతబయీ' (భౌతిక జీవితం) గణనప్రకారం మనిషి ఆయుష్యం నూటా ఇరవై సంవత్సరాలు.

2. ప్రాచ్యపురాణాలకూ కట్టుకథలకూ సంబంధించిన ప్రాణులంతా: (జెనీపరీలూ, దేవతలూ, దానవులూ) ఉండే సుప్రసిద్ధమైన ఖాఫ్ (కాకేసస్) పర్వతాలు. మాయకోటలూ, భూతభేతాళ కథలూ మొదలైన వాటితో అలంకరించుకొన్న ప్రాచ్య నవలారచయితల పుటలకంతా ఆధారాలుగా ఉన్న సరసమైన పరిసరాలివే.

3. మహమ్మదీయులు మంత్ర తంత్రాలను బాగా నమ్ముతారు. తంత్రాలబొమ్మలు చెక్కినవాటినిగాని, ఖురాన్‌లోని వాక్యాలు వ్రాసిన వాటినిగాని నీళ్లలో కలిపి ఉన్మాదులెందరో తాగినారు. ఇండియన్ ఇంక్‌గానీ, కాగితంగానీ చేయగలిగిన అపచారమేమీ లేదు కనుక వాళ్ళ తెలివి-బహుశా తమ వృత్తిని గురించి తమకు ఏమీ తెలియని-వైద్యులు నిర్వహించే ఉపచారం పసకన్నా అమాయకమైన దైనట్లుంది. హిందువులూ, మంత్ర తంత్రాలను ఇట్లే నమ్ముతారు.

**4.** *జటాధారి గోసామి:* మూఢభక్తి శాఖకుచెందిన హిందూ సాధువు. ఈ శాఖ వారు వెంట్రుకలు పెంచి సిగలు కడతారు. సాధారణంగా దిగంబరులై సంచరిస్తారు.

*5. మహాదేవుడు:* హిందువుల దేవుడు సృజన శక్తికి ప్రతీక. సహజసాధారణంగా లింగరూపంలో కనిపిస్తాడు. గ్రీకులూ, రోమనులూ నమ్మే ప్రియపస్ (Priapus) తో మహా దేవుని పోల్చవచ్చు.

*శివరాత్రి:* హిందువుల పండగ. మహమ్మదీయుల 'షబెరాత్' కూ దీనికి పోలిక దగ్గరగాఉంది.

## కలీంకు ఏమైనట్టు

అతని పోవడి మనకు తెలుసు కదూ ? అతని మేనత్త కూతురు సాలిహా రావడమే తడవుగా కనిపించకుండా జారిపోయినాడు కలీం. మళ్లీ ఎప్పుడూ ఇంటి మొగం చూడ కుండా వెళ్ళిపోతున్నానని అతడనుకోలేదు. ఇంటినుంచి పారిపోవడం అతనికి కొత్తేమీకాదు. కుర్రనాడే ఎప్పుడు ఏది కావలసినా కోరింది ముందుకు వస్తే అది అతని కిష్టమయ్యేదికాదు, బజారుదాకా పరుగెత్తేవాడు. ఒక్కొక్కసారి తల్లివెళ్లి అతణ్ణి డోలీలో తీసుకొని రావడం జరిగేది. అదే ఒంటెత్తు తనంతో ఇంకా అతను కొన్ని విషయాల్లో కుర్రవాడులాగే కనిపి స్తాడు. ఈ వయస్సులోగూడా అట్లా చెప్పకుండా పారిపోతే తనను వెదకుతూవచ్చే వాళ్ళుంటారని అతని భ్రమ. వెనక్కైనా తిరిగి చూడకుండా వెళ్లిపోయినాడు. కవిగా తనకు పెద్ద ప్రఖ్యాతి ఉందనుకొన్న వ్యర్థుడు. ప్రభుత్వం దానంతకదే పిలిచి ఓమంచి ఉద్యోగం ఇస్తుందని ఆశించినాడు. స్వతంత్రరాజ్యాలలోనైతే ఎవడో ఓ అధినేత బారలుచాచి స్వాగతాలు చెబుతాడని, వెంటనే ప్రధానిగా చేస్తాడని విశ్వసించినాడు. అతను పోదలచిన చోటికల్లా ఓ పెద్ద ఏనుగు, బంగారు తాపిన అంబారీతో తయారుగా ఉంటుందనుకొని మురిసేవాడు. ఇట్లాంటి తలతిక్కభావాలతో గర్విస్తూఉన్న అతను మిర్ జాజహిర్‌దార్‌బేగ్ అనే ఒక పరి చితుని ఇంటివైపు నడక సాగించి బందం విడిచిన గుర్రంవలె పోతున్నాడు. అతను అను కొన్న మిర్‌జా ఇంటికి వెళ్లి తలుపు తట్టినాడు.

అతని స్నేహితుని తాతగా పేరుబడ్డవ్యక్తి మీర్‌జా. ఇంగ్లీషువారి ఆక్రమణకాలంలో జమేదారుగాఉండి ఇంగ్లీషు రెసిడెంటుకు కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తుండేవాడు. ఉద్యోగరీత్యా కలిసివచ్చిన దానిని బట్టి, అప్పటి పరిస్థితులనుబట్టి అతను సంపన్నుడై క్రమంగా ఢిల్లీ పౌరులలో ముఖ్యస్థానం సంపాదించినాడు. విధవరాలైన మిర్‌జా తల్లీ, ఆమె కొడుకూ ఆ రెసిడెంట్ బతికిఉన్నంత కాలం అతనిఇంట్లోనే ఉండేవారు. వాళ్ళకు గూడా మంచి మర్యాదే జరిగేది. రెసిడెంటు చచ్చిన తరవాత అతని కొడుకులు, మనములుఆ పాత సంబంధం తెంచు కొన్నారు. అంతేకాక మీర్‌జాను అన్ని విధాలా ఆదుకోవలసి వచ్చిందని అతని సమ్మతి ప్రకారమే అనిపించి అతనికి వచ్చే ఆ 7 రూ.ల పింఛను కూడా ఆపివేసినారు.

మీర్‌జా ఆదాయం చాలీ చాలనిదై పోయింది. బజారులోఉన్న దుకాణాలపైవచ్చే కిరాయలమీదనే ఆధారపడి తానూ, తల్లీ, భార్యా బతకవలసి ఉండేది. అట్లా మరణించిన జమేదారు వారసులకు బంధువునని చెప్పుకొంటూ ఇతనొకడు తనవారినంతా తినబెడుతూ వాళ్ళు విసుక్కొంటూ ఉండగా, గాయపడ్డ మనిషివలె తిరుగుతుండేవాడు. ఆ యింటి పడి

కట్టు నలవరచుకొని అవే వేషభాషలను అనుకరించేవాడు. ఏట్లానైతేమిగాని మంచి ఫాషన్ దిరుసులు వేయమరిగినాడు. అల్లికల పాపోసులు, జమిలి అంచుల షష్లా, పూలుకుట్టిన ఢక్కా మస్లిన్ జుబ్బా, లోపల వేసుకోవడానికి ఓ నాజూకు అంగీ, చలికాలమైతే ఓ దుప్పటి (గజానికి 7 రూ. విలువ చేసేది), మధ్యాహ్నం తిరిగితే సరి వెండి బంగారు పనితో నిగనిగలాడే మెత్తని పట్టుదిరుసు వేసేవాడు. మిరిప పండు రంగులో కనిపించే ఓ నడుంకట్టు పొడుగాటి లాగులూ లేదా అంచులకు తోలు తుర్వాయి చేయించిన జెట్టి లాగులూ; నడుముకు వేలాడుతూ ఝున్‌మనే ఓ తాళపుచెవుల గుత్తి (తాళాలేవీ ఉండేవికావు). అవీ అతని వేషమూ, భాషనూ. ఇట్లాంటి వ్యక్తి ఓ కవితా రచనల పోటీల సందర్భంలో కలీంతో పరిచయం చేసుకొన్నాడు. చూసిన వెంటనే కలీం ఆ మాత్రం మంచిమనిషి ప్రపంచంలో మరొకడుండడని అనుకొని అతనికి సన్నిహితుడై పోయినాడు. ఆ మిరజా విషయంలో చెప్పుకోదగిందేమీలేదు. ఢిల్లీ రాజభవనానికి ముదాంపోతూ వస్తుండేవాడు, అంతే.

తలుపు తడుతున్న కలీంను వదిలేస్తిమిగదా ! చాలా సేపయింతరవాత ఇద్దరు పనిమనషులు వచ్చి ఎవరు మీరు ? అర్ధరాత్రి ఏమి కావలసి వచ్చి నారు? అని అడిగినారు.

'మీర్‌జాసాహెబ్ కోసం వచ్చినాను.' కోపంగానే అన్నాడు కలీం.

'ఏ మీర్జా?' వాళ్ళు అడిగినారు.

'ఈ ఇంటి యజమాని మిర్‌జాజహీదార్ బేగ్.' కలీం గట్టిగానే అరిచినాడు.

'అట్లాంటి వ్యక్తి ఎవరూ లేరిక్కడ' అంటూ వాళ్ళు అతని మొకం మీదనే తలుపులు వేయబోతుండగా ఆశ్చర్యపడుతూ ఇట్లా అడిగినాడు.

"ఇది జమేదార్ సాహెబ్ ఇల్లు కాదా? మిర్‌జాజహీర్‌దార్ బేగ్ అతని వారసుడు గానీ, వంశీకుడుగానీ కాడా?"

ఆ మాట వింటూ ఉండానే జమేదార్ వారసుడుగా చెప్పుకొని తిరిగే ఆషోకిల్లా మిర్‌జాపేరు వాళ్ళకు తట్టింది.

"నీవు కావాలను కొంటున్న వ్యక్తి ఈ యింటి వెనక కట్టెలమండి వద్ద ఓ మట్టి గోడ గుడిసెలో ఉంటాడు" అంటూ వాళ్ళు తలుపు వేసుకొన్నారు.

కలీం ఎట్లాగో అదంతా వెదకి ఆ యింటిని చూచినాడు. తన మిత్రుని కపటనాటకాలకు ఆశ్చర్యపడుతూ మిర్‌జాను బయటికి పిలిచినాడు. ఆ రాత్రి బసకోసం ఏర్పాటు చెయ్యమన్నాడు.

'సరే, మంచిది. ఆమసీదులోకిపద. నిమిషంలో వస్తాను.' అన్నాడు మిర్‌జా.

అదో పాడుబడ్డ మసీదు రెపరెపలాడుతుండే గబ్బిలాలూ, వాటి రెట్టా, చూస్తూ తన మిత్రుని రాక కోసం ఆదుర్దా పడుతున్నాడు కలీం. చాలా సేపటికి మిర్‌జా వచ్చి తన భార్యకు అకస్మాత్తుగాసుస్తీ అయినదని,తాను అరసుకోవలసివచ్చిందని నసిగాడు. కలీం అట్లా రావడానికి కారణమేమిటో తెలుసుకోగోరుతూ అంత గౌరవానికి తనను పాత్రుణ్ణి చేస్తూ అట్లా చూడవచ్చినారెందుకని అడిగినాడు.

కథ అంతా చెప్పుకొన్నాడుకలీం. ఇంటికి తిరిగి పోవడమనేది మినహా గత్యంతరమేమిటో సలహా ఇవ్వమన్నాడు.

మాపుమంచిదే అనిపించింది రేవు చెడేకావచ్చు. బిక్కు మనిపించినాడు మిర్జా. "పక్కకు బట్టలు పంపిస్తాను ఇక్కడ నీవు సుఖంగా గడపడమొక్కటే మంచిది" అన్నాడు.

"నీకో పెద్ద మేడా, శ్రోతల కోసం ఓహాలూ, తోటలూ, స్నానాల గదులూ, ఇట్లా కావలసిన వన్నీ ఉన్నట్టు నాతో చెప్పావే. అంతా ఆశ్చర్యం. మిత్రుడు వస్తే ఆరాత్రి ఉండేటందుకు ఓగది అయినా లేదు నీకు విడ్డూరమే కదూ!" అన్నాడు కలీం.

"విచారిస్తున్నాను ఎంతో కాలం నాసావాసంలో ఉండి కూడా నీవు నన్ను సరిగా అర్థంచేసుకోలేదు. ఆ మరణించిన జమ్‌దారు నన్ను పెంచుకొన్నాడు. నేనతనకి వారసుణ్ణి. అందరికీ తెలిసిందే. నా కితాబు (బైబిల్) ఇప్పుడు కాస్త చిక్కులో పడ్డది. ప్రస్తుతం ఆ ఇబ్బందిలోనే కొంచెం తప్పించుకొని తిరుగుతున్నాను. నా కథ చెప్పినిన్ను బాధించ, డానికి నా ఆత్మగౌరవం అడ్డుపెట్టింది. నీ విట్లేనిలబడి అలసి ఉలటావు. పోతాను పక్కబట్టలు పంపిస్తాను. మా ఆవిడను అరసు కొంటాను.

"గత్యంతరం లేదన్నమాట సరే, ఓ దీపమైనా పంపు, చీకటి ఘోరంగాఉంది ఇక్కడ" అన్నాడు కలీం.

"నేనూ అదే అనుకొన్నాను. కాని నీకిక్కడ దీపం లేకుంటేనే నయం. వెలుతురుంటే చిమ్మట పురుగులు పాకేటట్టుంది. దూలాల సందుల్లోంచి తోక పురుగులు గూడా దొర్లవచ్చు. కాసేపట్లో వెన్నెల వస్తుందిలే".

కలీం ఆ రాత్రి తన తిండి సంగతిని ఎత్తగూడదనే అనుకొన్నాడు. కడుపులోనేమో నకనకలాడుతున్నది. మీర్‌జా చూపిన అతిథి మర్యాదలో భోజనం సంగతే లేదు. తనకు ఆకలి అవుతున్నట్లు చివరకు ఒప్పుకోక తప్పనేలేదు.

"అన్యథా భావించకుకాని, ఏమైనా తినాలని ఉందా? దురదృష్టవశాత్తు మాఇంట్లో ఏమీలేదు. దుకాణాలు గూడా ఈపాటికి అన్నీ మూతబడిఉంటాయి. కాస్త ఆగు. ఆపెనం పొయ్యిదాకా వెళ్ళి వేయించిన శెనగలు ఓ దమ్మిడేవి పట్టుకొస్తాను.'' అని వెళ్ళిపోయినాడతని మిత్రుడు.

"ఇంతరాత్రి శెనగల పొయ్యైనా కాలుతూ ఉండడం అదృష్టమే నంటాను. ఏమంటావు? నాప్రియమిత్రుడవు కదూ! తినెయ్. కమ్మగా వాసన కొడుతున్నవి. పండుగా వేగినవి కదూ! ఇంత రుచికరమైన శెనగలను ఎప్పుడైనా చూసినావా! భేష్! శెనగలను గురించి నీకోకథ చెబుతాను. ఒకసారి శెనగ దేవదూతయైన మైకేల్ దర్బారుకు పోయిందట. నీకు తెలిసే ఉంటుంది. పంట ఫలాలకంతా అతడు అధినేత. అట్లా వెళ్ళిన శెనగ ఇట్లా చెప్పుకొన్నది. నేను చేసుకొన్న పాపమేమిటో కాని కాస్త నేలమీదికి నిక్కపొడుస్తూనే అరిష్టాలపాలవుతున్నాను. నన్ను కోయడం, నలపడం మొదటనే చెప్పుకోవలసింది. కాని మనుషులు నాలేతాకులే తెంపుకొని అట్లే తినేస్తారు. కొంచెం ఎదిగినాననుకో, మేకలు కొరికివేస్తుంటాయి. ఈ గండం తప్పించుకోగానే కంకులు-కాయలు తెంపుకొనే కాలంవస్తుంది. అప్పటికి నాదంటు కాస్త బలపడుతుండంగానే బూకటి పసులన్నీ వచ్చి నా ఆకులను తమ పొట్టలో పెట్టుకొంటాయి.

"ఇక నాగింజల సంగతికి వస్తే వాటిని తిరుగలి నడుమవేసి బద్దలు చేసేస్తారు. కొన్నింటిని గుర్రాలతో నమిలిస్తారు. కొన్నింటిని పెనంమీద పోసి కాల్చుతారు, ఉడికిస్తారు.

పిసికి పులుసు చేస్తారు. ఒక్క గుక్కలో చెప్పవలేనంటే ఎన్నో దుండగాలకు గురిఅయి బాధపడుతున్నాను." అట్లా చిటపటలాడుతున్న శెనగను చూస్తే ఆ కొలువులో ఉన్న దేవదూతలకు చిరాకెత్తింది, దాన్ని అందుకుని తినేసినారు. ''కనీసం ఉప్పుమిరియాలైనా ఉంచే మీకు మంచివిందుగా ఉండేదే" అన్నాడుట దివ్య పురుషుడు ఛలోక్తిగా. అందుకే శెనగ అప రూపమైపోయింది.

శెనగల రుచి అట్లుంచి మిర్జాగప్పాల మజా బాగా తగిలింద కలీంకు.కలీం ఏదో అనబోదామనుకొన్న పాటున్నే అతను మాయమైనాడు. ఓ గొంగడిబొంతా, ఓ ముడికి మెత్తా వచ్చిపడ్డాయి. ఆ రాత్రిని ఎట్లో నెట్టేయడానికి కలీం సిద్ధపడ్డాడు. ఆ మసీదును గురించి ఓ అపహాస్యకవిత, మిర్జాను గురించి ఓ అధిక్షేపకవిత వ్రాసుకొన్నాడు. తెల్లవారుజామున గాని అతనికి నిద్ర పట్టలేదు. మిర్జానో మరే ఒఘంగానోకాని మెత్తతోసహా ఆ గొంగడినీ అతని టోపీనీ, పాపోసులనూ ఎత్తుకొని పోయినాడు. లేచిచూసుకొనే సరికి అన్నీ పోగొట్టు కోవడమే అతనికి దక్కింది. మసీదు నేలపై ఉన్న పేడ అలుకంతా అతని ఒంటినిండా పట్టింది.

## మిర్జా మహమ్మద్ హాదీ రిస్వా

## ఉమ్రావొ జాన్ అదా

"ఎందుకట్లా స్వైరపంథాలో పడిపోయినానో; ఎందుకట్లాపట్టి పీడిస్తుండే రోజులు గడుపుతూ, అడివిలో అడివినై తిరిగినానో నాకు తెలుసు; అయినా, నీ తాత్త్వికబుద్ధికి సరి పడేటట్లు చెప్పగలనా, మిత్రమా ?"

ఆ నోటా ఆనోటా చెప్పుకొనే మాట. సానల ఇండ్లలో పుట్టిన బాలికలకు తమ వ్యక్తిత్వాన్ని అభివృద్ధిచేసుకొనే వీలే ఉండదట. ఆ పరిసరాలలోఉన్న ఆ బాలికలు అపే క్షించేదంతా చెడునడతేనట. స్వైరవిహారాలు చూస్తూ, కాముక ప్రసంగాలు వింటూ వాళ్లు పెరుగుతారట. వాళ్లు ఎవరివైపు తిరిగి చూసినా—తల్లిగానీయండి, తోబుట్టువుగానీయండి- పతితలేనట. గౌరవమర్యాదలతో బతికే తల్లిదండ్రులకు జన్మించిన బాలికల సంగతి చూస్తే, అట్లాఉండదు. వాళ్లు లేచిపోయి చెడుదారిన పడ్డారనుకో, ఏ పరిస్థితిలోనూ క్షంతవ్యులు కారు. వాళ్ళను గొర్రెలవలె కోసి పారేస్తారు. మళ్ళా మాట్లాడితే చేరెడు నీళ్లుపోసి గొంతునైనా తడప కుండానే వాళ్ళ తలలు చరచర కోసేస్తారు.

నన్ను వేశ్యావృత్తిలోకి దించిన పరిస్థితు లేవో చెప్పుకోకపోతే, లోకులు నేను గూడా అడ్డాదిడ్డాఇండ్లలో పెరిగిన దాన్నిగానే అనుకోవచ్చు. ఈడు ముదిరినా లగ్ననిశ్చయం వాయిదా పడిందేమో, అట్లా ఎప్పటికీ కుదరని ముహూర్తానికి తాళలేక కాలు జారిందేమో? ఎవనిమీదనో కన్నుబడి లేచిపోయిందేమో, వాడు విడిస్తే మకోడు అంటుకొన్నాడేమో, వాని తోనూ సరిపడక మరెవణ్ణో చూసుకొని కొని ఉండవచ్చు. అట్లా జారి జారి జారిణీ వృత్తిలోకి దిగజారి ఉండవచ్చు అని ఇట్లా ఎందరెన్నైనా అనుకోవడానికి వీలుంది నాగురించి. అట్లా లోకులు తీర్మానించుకోవడం మామూలే. వాళ్ళను నే ననగలిగిందేమీ లేదు. గౌరవమర్యాదల తో బతికిన వాళ్ళ భార్యలో, కూతుళ్లో ఎందరో పాడుకావడం నేనూ చూసినాను. వాళ్లు పతి

తలు కావడానికి దారితీసిన సంఘటనలు కూడా తెలుసు. మొదటిది: ఈడుకువచ్చిన కూతుళ్ళ పెండ్లిండ్లు వాయిదావేస్తూపోవడం తలిదండ్రుల తప్పు. రెండోది: కన్యల ఇష్టానిష్టాలు విచారించకుండా పెండ్లిచేయడం, వధూవరుల వయస్సూ, రూపు రేఖలూ, ప్రకృతులూ సరిచూసుకోకుండా తలిదండ్రులు కన్యను ఎవడు దొరికితే వానికి అంటగట్టడం. కన్యమాత్రం ఏం చేయగలుగుతుంది? వాడితో సరిపడకపోతే వాణ్ణీ విడిచి పారిపోతుంది. కన్యలకు మరో దుర్దశ గూడా ప్రాప్తిస్తుంది. చిన్నప్రాయంలోనే విధవలవుతారు అది దుర్భరమైనదశ. అదృష్టం కలిసివస్తే మరొకణ్ణి వరించ గలుగుతారు. అట్లాకాకుండా చెడు అలవాట్లకే లోనై తిరా, బజారు పాలౌతారు. కానీ ఇట్లాంటివేమీ నాకుతగలలేదు. నేను పుట్టిందేదుర్దశ. పరిస్థితులు అనంది విధివ్రాత అనండి నన్ను అడివిపట్టించినాయి. చెడుదారి తప్ప మరో మార్గమే కనిపించలేను.

మా ఇంటికి కొంచెం దూరంలోనే ఉంటున్న దిలావర్‌ఖాన్ దొంగలతో కలిసి తిరిగేవాడు. ఎన్నోఏండ్లు అతని జీవితం లఖ్నో జైలులోనే గడిచింది నేను చెబుతూన్న ఈ కథ నాటికి అతను అప్పుడప్పుడే జామీనుపై విడుదలై వచ్చినాడు.

మానాన్న అంటే సరి, దిలావర్‌ఖాన్‌కు మహా కక్షగా ఉండేది. ఫైజాబాద్‌లో అతణ్ణి అరెస్టుచేసినప్పుడు అతని శీలంగురించి జరిగిన విచారణలో మావాడలో ఉంటున్న వాళ్ళు వెళ్ళవలసి వచ్చింది. అందులో మానాన్న కూడా ఒకడు. ఆయన రుజుమార్గంలో వెళ్ళేవాడు నిజాయితీనే నమ్మినవాడు. మహారాణి ప్రభుత్వంలోని ఆన్యాయాధిపతి పవిత్రమైన ఖురాన్ తలపైఉంచి "సరే జమేదార్ ఉన్నదున్నట్టు నిజంచెప్పు. దిలావర్ ఖాన్ ఎట్లాంటిమనిషి ?" అని అడిగినాడు. తనకు తెలిసిన వాస్తవం చెప్పినాడు మానాన్న. ఆయన చెప్పినదాన్ని బట్టే అతణ్ణి జైలులో వేసినారు. అప్పటినుంచీ మా నాన్నమీద అతను ద్వేషాన్ని పెంచుకొన్నాడు. జైలునుంచి బయటపడగానే పగతీర్చుకోవాలనుకొన్నాడు. మానాన్న మీదుండే పగ తీర్చుకోవడానికి ఓ పావురాలగుంపును తెచ్చాడు. మానాన్నదే ఒక పావురాన్ని పట్టేసినాడు. పట్టేసిన పావురాన్ని తిరిగి ఇస్తే పావలా ఇస్తానన్నాడు మానాన్న. అర్ధరూపాయి ఇమ్మన్నాడతను.

ఒక సాయంత్రం, మానాన్న పనికివెళ్లి ఇంకా ఇంటికి రాకున్నాడు, నేను అట్లా బయటికీ వెళ్లినాను. దిలావర్‌ఖాన్ ఓ చింతచెట్టుకింద నిలచి ఉన్నాడు.

"అమ్మీ! ఇటురా, మీనాన్న నాకు చెల్లించవలసిన పైకం చెల్లించినాడు. మీ పావురాన్ని తీసుకుపోదువురా" అన్నాడు. నాకు వల తగులుకుంటున్నట్టే. అతని ఇంటికి పోయినాను. లోపలికి పోగానే తలుపేసి లోపలిపక్కగొళ్ళెం తగిలించినాడు. నేనేమో కేకలు వేస్తున్నాను. అతడో పాతరగ్గు తెచ్చి నోటినిండా కుక్కినాడు. ఓ సెల్లాతో నా చేతులుకట్టేసి నేలమీద పొర్లించినాడు. దొడ్డితలుపు తెరిచి పీర్ సాహెబు అనే వ్యక్తిని పిలచినాడు. ఇద్దరూ నన్ను ఎత్తి ఓ ఎద్దులబండిమీద ఎక్కించినారు. బండి కదులుతూ ఉంది. ఎద్దులు పరిగెత్తుతున్నాయి.

నాది నిస్సహాయస్థితి. దయ్యం పిడికిట్లో ఇరికిన గతి. దిలావర్‌ఖాన్ మోకాళ్ళసందున ఇరికిపోయి ఊపిరిగూడా పీల్చుకోలేకపోతున్నాను. అతని చేతిలో కత్తిఉన్నది. రక్తం తిరిగిన గుడ్లతో హంతకునివలెనే చూస్తున్నాడు. నేను కట్టె గరచుకొని పోయినాను.

ములిసంజ వెలుగులు మసక మసకగామారిపోతూ చుట్టూ చిమ్మచీకటి అలముకొన్నది. చల్లని దవగాలి జవ్వున కొడుతున్నది. రేకలు వారేసరికి నేను బిగ్గర కరచుకపోయి

చలిలో వణికిపోతున్నాను. నా కళ్ళవెంట వేడివేడిబొట్లు అదేపనిగా జారుతూ, రాలుతూ పోతున్నాయి. నేను ఇట్లా అనుకొంటున్నాను. "పని నుంచి తిరిగి ఇంటికి వచ్చి మానాన్న నాకోసం ఊరంతా గాలిస్తాడు. మాఅమ్మ అయితే కలవరపోయి ఎదగొట్టుకుంటుంది. చిన్న తమ్ముడేమో నాఅవస్థ తెలుసుకోలేక ఆడుకొంటూ ఉంటాడు. ఒకరేమిటి, మామ, నాన్న, అన్న అందరూ ఒకటేమిటి, వంటిల్లూ ఇల్లుయానత్తూ, ఆవరండా, ఆవాకిలీ నాకళ్ళముందు మెరుస్తున్నాయి. మాటిమాటికీ దిలావర్ ఖాన్ కత్తితీస్తుంటాడు. నన్ను బెదిరిస్తూ ఉంటాడు. ఎప్పుడు గుండెలో పొడుస్తాడో అని గజ గజలాడిపోతున్నాను. నానోరు కాస్త తెరుచుకొనే ఉన్నా, మాట పెగిలేటట్లులేదు. నా అవస్థలో నేనున్నాను. ఇక దిలావర్ ఖానూ, పీర్ సాహెబూ తెల్లవార్లూ ఏదో మాట్లాడుకొంటూ, ఎందుకో నవ్వుకొంటూ సంతోషపడుతున్నారు. నన్నూ, నా తల్లిదండ్రులనూ అనరాని మాటలంటున్నారు.

"అసలు మొనగాని కొడుకే అయితేవాడు పట్టినపగ పన్నెండేండ్ల తర్వాత అయినా తీర్చుకొంటాడంటారు. పీర్ భాయీ! చూడుమరి, ఆ మాటను నేను నిజం చేసినాను. ఫలానా వాని కొడుకున్నాడే వాడట్లే కక్కాస పడవలసిందే." అన్నాడు దిలావర్ ఖాన్.

"నిజంగా నీవా సామెతను రుజువు చేశావు. నీవు జైలుకుపోయి పన్నెండేండ్లు అయిందనుకొంటాను. అంతేనా?"

"సరిగ్గా పన్నెండేండ్లు. భాయీ! లఖ్నో జైలులో ఎంత కష్టపడ్డా ననుకొన్నావు. పోనీ, అదంతా ఇప్పుడు వాడనుభవించి చూడనీ. ఎన్నిరోజులు ఏడుస్తాడో ఏడ్వనీ. ఇంతైతే ఇది నా అదురుదెబ్బ చివరకు వాణ్ణి చంపే తీరుతాను.

"అట్లా అనకు."

"నన్నేమనుకొంటున్నావు. వాణ్ణేగనక చంపకపోతే నేను నా తండ్రికే పుట్టలేదనుకో"

"నీవు అన్నమాట తప్పవని నాకు తెలుసు."

"కాస్త ఆగు. చూడు ఏమవుతుందో?"

"మరి ఈ పిల్లదాన్ని ఏం చేస్తానంటావు?" పీర్ సాహెబ్ అడిగాడు.

"చంపి మురుగుకాల్వలో పారేసి తెల్లారకముందే ఇల్లుచేరుకొంటాను."

ఆ మాటను వినగానే నా కాలం సమీపించిందని అనుకొన్నాను. కన్నీళ్లెండి పోయినాయి. హఠాత్తుగా గుండె కలుక్కుమన్నది. కాళ్ళూ, చేతులూ చల్ల బడ్డాయి. కాని ఆ రాక్షసునిముఖంలో కాసంత జాలిరేఖ గూడా కనిపించలేదు. జాలిసంగతి అట్లుంది. అతడు నా రొమ్ముమీద గట్టిగా పొడిచినాడు మళ్లీగుద్దినాడు. ఉండ చుట్టుకుపోయి నేను బండిమీదినించి పడినంత పని అయింది. చచ్చిపోయేముందు వలె నా మెడ వాలిపోయింది.

"ఆ పిల్లను అట్లా చంపేసి, నాకిచ్చే డబ్బు లెట్లా ఇస్తావు?" పీర్ సాహెబ్ అడిగినాడు.

"నీ డబ్బులా! చిల్లిగవ్వ మిగలకుండా ఇచ్చేస్తాను."

"ఎక్కడ తెస్తావు. నీ వింకేదో చేస్తావనుకొన్నా."

"ఎక్కడా దొరకక పోతే, పావురాలమ్మేస్తాను."

" ... ... ... "

"మరో వనరు చెప్పనా?"

"చెప్పు."

"అరే ముసిలీ, ఈ పిల్లదాన్ని లఖ్నో తీసుకొని పోతాము. అమ్మేస్తాము." చస్తా ననే భయంతో నా చెవులు దిమ్మెక్కినాయి. ఆదుష్టుల సంభాషణ అంతా నాకు పీడకలలో కనిపించే గలభాలాగే ఉంది. పీర్ సాహెబ్ మాటలు మాత్రం విన్నాను. ఇతను నూరేండ్లు బతకనీ అనుకొన్నాను. కాని ఆ కసాయి ఏమిచేయ దలచినాడో కదా!

"సరే మంచిది. సమయమెట్లొస్తుందో చూతము. పదపద, పోనీ."

"ఇక్కడ కాసే పొగుదాం. ఆచెట్టు కింద ఇంగలం కనిపిస్తుంది. హుక్కామీదికి ఓ నిప్పుకణం పట్టుకొస్తా." పీర్ సాహెబ్ నిప్పుకణం తీసుకొని వచ్చేలోపలే దిలావర్ నా ప్రాణాలు తీసేసుకొంటాడేమో అని తనుకులాడు తున్నాను. వణుకు పట్టుకొన్నది. నాకు వెఱ్ఱెత్తినట్లయి లబలబ మొత్తుకొంటున్నాను. దిలావర్‌ఖాన్ నా వైపుచూసి, రెచ్చిపోయి మొకం మీద ఒక్కటి జమిరినాడు. "నోరుముయ్, పిల్లముండా, కత్తినూకుదునా". అరుస్తున్నాడు. అదో బూతు.

పీర్‌సాహెబ్ దూరమేమీ పోలేదు. "ఆఁ ! అట్లా చేసేవుభాయీ !" ఎత్తినచెయ్యి దింపవద్దని దిలావర్‌ఖాన్‌తో అంటున్నాడు.

"సరే, మంచిది. నీవుపో, నిప్పైతే తీసుకరా" హామీ ఇచ్చినాడు దిలావర్‌ఖాన్.

కొంచెం సేపయింది. పీర్ సాహెబ్ కొరకాసులు పట్టుకొనివచ్చినాడు. హుక్కా తయారుచేసినాడు. తన జతగానికి గూడా అందించినాడు. దిలావర్‌ఖాన్ హుక్కాను ఒక్క బుక్కలాగుతున్నాడు.

"ఇది ఎంతకు పోతుందంటావు ? బ్యారం ఎవరు చేయిస్తారో ! మనం చిక్కుల్లో పడకుండా చూసుకోవలెగదా !"

"ముసిలోడా, అట్లా దిగులు పడతావేమిరా ! మనలను పట్టేవాడెవ్వడూలేడు లఖ్నోలో ఇట్లాంటి బ్యారాలు జరగడం ఎప్పుడూ మామూలే. ఆ సంగతి నాకు వదిలిపెట్టు. ఆతతంగమంతా నేనే చూసుకొంటాను. మా ఆవిడ తమ్ముడు లేడూ, నీకు తెలుసా ?"

"కరీం కదూ ?"

"వాడే. వాని బతుకుదెరువే ఇది. అబ్బాయిలను అమ్మాయిలను తెక్కలేనంత మందిని తెచ్చినాడు, సొమ్ము చేసుకొన్నాడు."

"అతను ఇప్పుడెక్కడుంటాడు ?"

"లఖ్నోలోనే, వాని అత్తగారిల్లు గోమతీనది అవతలికే ఉంది. అతడక్కడుండి తీరవలసిందే."

"అబ్బాయిగాని, అమ్మాయిగాని, ఎంతవెలకు అమ్ముడుపోవచ్చు" ? కొంతసేపైన తరవాత దిలావర్‌ఖానే అడిగినాడు.

"వన్నెనూ వాసినీబట్టి"

"ఇదెంతకుపోతుందంటావు ?"

"నూరు, అదృష్టముంటే నూటాయాభై"

"నీ నమ్మకం నీ కుండవచ్చుగాని భాయీ, దీనికి వన్నే, వాసె ఏమీలేదు. దీనికి నూరైతే మహాఎక్కువ."

"ప్రయత్నం చేసిచూస్తే తప్పేమిటి ? కాని దాన్ని చంపి నీవు ముళ్ళెగట్టుకొనేదే ముందని."

రాత్రి అంతా ప్రయాణంచేసినాము. ఉరిశిక్షపడిన వాళ్ళకు నిద్రబాగా ముంచు కొస్తుందని అంటారు. నాకట్లే వచ్చింది. మృత్యువు నాముందే ఉన్నది. కాసేపటికి వాళ్లూ నిద్రపట్టినారు. పీర్‌సాహెబ్‌కు నామీద జాలివేసింది. ఎడ్లగంతలు తీసి నామీద కప్పినాడు. ఎన్నోసార్లు లేచి చూసినాను. కాని కిసుక్కుమనకుండా ఉన్నాను. మొకంమీదినుంచి గంత తీసిఅట్లా చూసినాను. బండిలో నేనొక్కదాన్నే ఉన్నాను. ఓ రెక్కఎత్తి అట్లా పక్కకు చూస్తే, బారుగా గుడిసెలు కనిపిస్తున్నాయి. ఓ కూరగాయలంగడి ఉన్నది.

దిలావర్‌ఖాన్, పీర్‌సాహెబ్ ఇద్దరూ ఏదో కొనుక్కొంటున్నారు. బండి విడిచి ఉంది. ఎడ్లు ఓ మర్రిచెట్టుకింద మేస్తున్నాయి. కొంతమంది ఊరివాళ్లు మంటచుట్టూ కూచొని చేతులు కాపుకొంటున్నారు. ఓ చిమ్నీలోంచి పొగవెళ్లుతున్నది. పీర్‌సాహెబ్‌వచ్చి తలా యించిన శనగలు కొన్ని నాకిచ్చినాడు. రాత్రంతా ఉపాసమే. కడుపులో నకనకలాడు తున్నది. ఎంతో ఆదుర్దాగా వాటిని నోట్లో పోసుకొన్నాను. ఓ జెగ్గనిండా నీళ్ళు ఆతనేతెచ్చి ఇచ్చినాడు. కొన్ని గుటకలు తాగికిమ్మనకుండా చతికిలాబడ్డాను.

బాగా అలసట తీర్చుకొన్న తరవాత పీర్‌సాహెబ్ లేచి ఎడ్లను మేకొల్పినాడు దిలావర్‌ఖాన్ తన హుక్కా నింపుకొని నా పక్కనేవచ్చి కూచొన్నాడు. సాపొతూనే ఉన్నాం. ఆనాడు నా గురించి అంతకక్ష పట్టినట్టులేదు. కత్తి ఆడిస్తూ చూపలేదు. ఆబ్బలి కరవలేదు. గద్దించలేదు. తోవ పొడుగునా అక్కడక్కడ వాళ్ళు ఆగుతారు, హుక్కాలు నింపుకొంటారు. సరసాలాడుకొంటారు. ఉండిఉండీ తిట్టుకొంటారు. చొక్కా చేతులుపైకి ఎక్కిస్తారు. నడుములు బిగిస్తారు. కిందకి దుముకుతారు. ఏదో సమాధానపడతారు. జగడం ముగుస్తుంది. ఎంతస్నేహంగా మాట్లాడుకొంటారంటే, ఇద్దరిమధ్యా రవంత పొరపొచ్చెం గూడా లేనట్లే ఉంటుంది. "మనం విడిపోయే సమస్య ఎట్లా వస్తుందంటావు ?" ఒక దడుగుతాడు.

"ఏమైనాసరే, అదిరాదు" జవాబిట్లుంటుంది.

"సరే మంచిది. పోయిన సంగతి పోనీ."

"పోనీలే పోయిందేదో పోనీ."

ఆబిద్‌హుసేన్

## నేటి హిందూస్థానీ ముసల్మాను

హిందూదేశపు ముసల్మానులు పూర్వం ఎట్లా ఉండిరి ? ఇప్పుడెట్లా ఉన్నారు ? ముందెట్లా ఉండగలరు ? అనేవరకే ఈ పుస్తకంలోని చర్చ పరిమితమైంది. అపేక్షించిందంతా వాళ్ళు అచ్చంగా చేస్తారని, అనుకొన్నట్లే మారి తీరుతారని సాహసించి చెప్పడం కుదరని పని. మనిషి-పురాణజోస్యాలనుంచి చరితాత్మకమైన జోస్యాలు చెప్పగలిగేదాకా-భవిష్యత్తులోకి తొంగిచూడగలిగే టెలిస్కోపులు తయారుచేసుకొన్నాడు. అందులో ఏ ఒకటీ ఈ చీకట్లో వెలుగుదారి వేసేటందుకు పనికిరాలేదు మరి.

"దేవుడువేసిన ముసుగు తొలగించడానికి మన వశంకాదు."

వచ్చిన చిక్కేమిటంటే : మానసికంగా, ఆధ్యాత్మికంగా కొన్నియుగాలపాటు తపించికూడా మనిషి తన హేతుబుద్ధిని కొంతవరకైనా అదుపుకోపెట్టే అనుభవం సంపాదించలేదు. ఎన్ని సాధనలుచేసి చూసినా మనిషికామన అదుపులోకి రావేలేదు. అసలు పిత్తలాటకం ఏమంటే : సాధ్యాలమీదికంటె అసాధ్యాలమీది మోజుకోసమే ఈ కామన విశేషంగా పనిచేస్తుంది: భూతకాలాన్నీ వర్తమానకాలాన్నీ గురించి తెలుసుకోవడంకంటె భవిష్యత్తును అధ్యయనం చేసేకోసమే కోరిక తొలుచుకొనిపోతున్నది.

హిందూదేశపు ముసల్మానుల భావిజీవితాన్నీ, ఆశలనూ రేఖామాత్రంగానైనా గ్రహించడానికీ, గ్రహింపజేయడానికీ ఈ రచయిత కోరిక నిర్విరామంగా పెనగలాడుతున్నది. నిద్రలో మినహా ఈ రచయితకు చేతనాచేతన స్థితిలో ఉదయించే ఆదుర్దానంతా హేతుబుద్ధి పర్యవేక్షిస్తుండేది. హేతుబుద్ధి వైదొలగినప్పుడు ఆ ఆదుర్దా-ఖైదీ లేచి చేతన ఉండేగదిని తట్టడం, ఎటూ చొరరాని ఆగది అదృష్టంకొద్దీ ఓసారి తలుపు తెరిచి ఉండడం, ఆ 'ఖైదీ' కలరూపంలో ఆ గదిలోకి ప్రవేశించడం ఈ రచయిత ఊహాచిత్తాన్ని ఆక్రమించడం జరిగింది. హఠాత్తుగా భావోద్రిక్తుడైన రచయితకు కాలవేగం వెనక్కి మళ్ళినట్లుఅయి, గతంలోకి చొరబడి ఊహను ప్రభావింపజేస్తూన్న భవిష్యత్తు ఓ పుస్తకమే అయి, తనను చదివిస్తున్నట్లు అనిపించింది. అతను ఎంతో అప్యాయంగా చదివి జ్ఞాపకం పెట్టుకొన్నది. మేల్కొన్నప్పుడు మెదిలిన జ్ఞాపకాలను వ్రాతకెక్కించి చూపే పరిచయమిది. రచయిత రచించిన స్ఫూర్తితోనే వీటిని చదివి చూద్దాం.

20వ శతాబ్దిలోఉన్న హిందూదేశపు ముసల్మాను హృదయం విచిత్రమైన భావ సంచారానికి గురిఅయింది. జీవితాన్ని మూడు గోళాలలో చూసి మతసామాజిక జీవితం, జాతీయజీవితం, అంతర్జాతీయ జీవితం అని మూడు పేర్లు పెట్టుకొన్నాడు. ఈ మూడుగోళాల చుట్టూ వంతు పట్టి తిరుగుతున్నాడు. వీటిచుట్టే తిరిగి జీవితాన్ని వినియోగిస్తే జీవితానికి ప్రాముఖ్యమైన విలువలుగల కేంద్రాన్ని దర్శిస్తానని విశ్వసిస్తున్నాడు. కాని కైవారం అంచుల నుంచి కేంద్రాన్ని చేరుకోవడంకంటె కేంద్రంనుంచి బయలుదేరి కైవారానికి చేరుకోవడమే సులభతరమని అన్న ప్రమాణ వాక్యాన్ని మరిచినాడు. మరోరకంగా చూస్తే విభిన్న గోళాలకు ఒక సమష్టి కేంద్రాన్ని కనుక్కోవడం బొత్తిగా అసాధ్యమేమరి. అన్వేషణలో ఏమీ కనిపించని పొగమంచులోకి తొంగిచూడడమే దక్కింది. ఎంత విషాదమంటే: ఆ పొగమంచే ప్రకాశమని అనుకొన్నాడు. దాన్నే పట్టుదలతో చూస్తున్నాడు. తనలోఉన్న ప్రకాశాన్ని చూచే ప్రయత్నం అసలు చేయనేలేదు. దానికోసం తపించే మాటేలేదు. అతనిలో బుద్ధిపూర్వకంగానే ఏర్పడ్డ ఈ అజ్ఞానం ఎంతవరకు పాదుకొనిపోయిందంటే, దాన్ని తొలగించడం మానవశక్తికి మించినపని అయింది. దివ్యశక్తి సహాయమే అవసరమైంది.

దివ్యశక్తి సోకింది. హిందూదేశపు ముసల్మాను అంతర్ముఖుడైనాడు. తేజస్సును దర్శించినాడు. ఆ తేజస్సులోనే సత్యాన్ని, వాస్తవికతను కనుగొన్నాడు. భగవానుని దర్శించినాడు. అంటే పవిత్రమైన ఆమూర్తి అతనికి ప్రత్యక్షమైందని కాదు. అది సాధ్యమయ్యేది కూడా కాదు. ఎందుకంటే అతని భౌతిక నేత్రం ఆ పవిత్ర తేజస్సును

దర్శించడానికి సమర్థమైంది కాదు. జీవితపు మసకతెర గుండా ప్రతి ఫలించే శాశ్వత విలువలో కేవలం ఆ మూర్తి మహాత్మ్యాలు మాత్రమే కనుక్కోజాలినాడు. సత్యం, శివం, సుందరం, ధర్మం, పరమవిజ్ఞానం, శక్తి, ప్రేమ, విభూతి వీటి పోలుపులు గ్రహించ గలిగినాడు. నిరంజనమైన తత్వంలో దర్శించగలిగే ఈ మహాత్మ్యాలను ఈ శాశ్వత విలువలను చూసి అతడు భక్తి ప్రపత్తులతో ప్రణమిల్లినాడు. వాటిని ధ్యానించినప్పుడు అతని ఆత్మ అంతా ప్రేమమయమైనది. ఈ అనుభవంతో అతను ఆచరణ రూపమైన ధార్మిక విశ్వాసాన్ని మలచుకొన్నాడు. అతనికి వారసత్వంగా సంక్రమించిన జీవితమన్నా, విశ్వాసశీలత్వమన్నా అదే

ఇదిట్లా కావడానికి ముందు రెండు ప్రశ్నలు ఉదయించినాయి. అవి అతణ్ణి పూర్తిగా జాగ్రదవస్థలోకి తీసుకరాలేదు. అంతరాత్మలోనుంచి గానీ నిరంతరమూ అవి గిపెడుతూ అతని శాంతిని భంగపరుస్తున్నట్లున్న సంస్పందన అతనిలో ఉంది. ఈ విశాల సృష్టికి కారణ మేమిటి? తానట్లా రూపొందిన ఉద్దేశమేమిటి? అనేవి అతనిలో ఉదయించిన ప్రశ్నలు. (అతడు భగవద్విశ్వాసంలో పడి నూతన జీవితాన్నీ, శక్తినీ ఎప్పుడు పొందినాడనే సమస్య స్వాభావికంగానే పరిష్కారమైందనుకోండి) మొదటిప్రశ్నకు అతనికి లభించిన సమాధానమేమీ లేదు. ఆ ప్రశ్న అతణ్ణి చేయగలిగిందేమీ లేదు కనక తనకు తానే ప్రశమించింది. సర్వజ్ఞుడైన భగవంతుడే విశ్వాన్ని సృష్టించినాడనే భావంతో సరిపెట్టుకొన్నాడు. తాను పుట్టింది ఎందుకు అనే రెండో ప్రశ్నకు మాత్రం సంతృప్తికరమైన సమాధానమే లభించింది. ఆ ప్రశ్న ఉదయించిన తర్వాత అంతరాంతరాల్లోంచే అతనికి తెలిసిందేమిటంటే తనచుట్టూ ఆవరించిన ప్రకృతిలో తానేమిటో శక్తివంచన లేకుండా తెలుసుకొనేటందుకే తనలో పరిపూర్ణ ఆదర్శాల రూపంలో పొదిగిన విలువలను గ్రహించడానికే మానవసృష్టి జరిగిందని తెలుసుకొన్నాడు. సత్యాన్ని తెలుసుకొని సదాచారపరాయణుడై, సౌందర్యగుణ గ్రహణంచేస్తూ దాన్నే సృష్టిస్తూ, ధర్మపంథాలో నడుస్తూ అట్లాంటి విలువలనే ప్రవచిస్తూఉండడమే తన జీవిత ధర్మమని గ్రహించినాడు. జ్ఞానస్వరూపాన్నీ, సంపదనూ ఆర్జించేటందుకు అతడు ప్రబోధితుడైనాడు. జ్ఞానోద్దేశం సత్యవర్తనను గౌరవించేటందుకేనని, అధికారం ధర్మాన్నీ ప్రేమనూ గౌరవించేటందుకేనని, సంపదలు భగవంతుని (సృష్టిలోని జీవరాసుల) సేవలకు వినియోగం చేసేటందుకేనని ఉన్న షరతు కూడా తెలుసుకొన్నాడు.

తపస్సు ఫలితంగా నూతనంగా, ఆవిర్భవించిన ఆదృక్పథంలో, ఆ అంతర్ముఖతలో, అనిశ్చయంలో, ఆ స్ఫూర్తిలో వాస్తవికతకు కేంద్రంగా ఉన్న అంశాన్ని పొడగంటూ కష్టాలకూ కడగండ్లకూ అతీతమైన ఓ జీవితాన్ని దర్శించి దాన్నే అనుగమించే ధైర్యాన్ని తెచ్చుకొన్నాడు. అతని భౌతిక నేత్రానికి మూడు సమాధి చక్రాలు కనిపించినవి: మతవర్గానికి ప్రాతినిధ్యం వహించే అట్టడుగు జీవితం, జాతీయ పరమైన మధ్య జీవితం, అంతర్జాతీయ సంబంధమైన బాహ్య జీవితం. కాని అట్టడుగు భాగం, మధ్య భాగం ఆ రెండూ అచ్చంగా భావాత్మకాలుగానే ఉన్నా ఆచరణోద్దేశ్యానికి ప్రతీకలుగా ఉన్నాయని అతని అంతర్వాణి (దివ్యవాక్కు) నొక్కి చెప్పింది: తనతోటి వారితో అంటిపెట్టుకొని ఉండి జీవితాంతం వారితోపాటు భాగస్వామిగా ఉండడానికి మతపరమైన జీవితం,

లౌకికరంగంలో భాగస్వామిగా నిలబడటానికి జాతీయ జీవితం, వ్యక్తిగతంగా చేతనైనంత పొత్తు కూడడానికి అంతర్జాతీయ జీవితం. బాహ్యచక్రంలో పరిస్ఫుటంగా కనిపించే సమస్త మానవ జాతి (భగవంతుని కుటుంబమై అందరూ అందులో సజాతి సోదరులుగా ఉండేది) వాస్తవంగా నిలిచేది.

ఇది మామూలు సంగతే అన్నట్లు బాహాటంగా కనిపిస్తున్నదే కాని ఇది హిందూ దేశపు ముస్లిం మానసికాన్ని జీవితధ్యేయాన్ని పూర్తిగా మార్చేసింది. వివిధ మతదృక్పథాలన్నీ ఒకే సత్యపూర్ణమైన ధర్మంలో లీనమైనట్లు వివిధ సంస్కృతుల పేరనిలిచిన అడ్డుగోడలు కూలినట్లు అతడు భావించినాడు. మానవ సంస్కృతి ఒకటే అని దిగ్దేశ, ప్రాంత, ప్రదేశభేదాలు లేని ఉన్నతోన్నతమైన విలువలన్నీ అందులోనే ప్రతిఫలిస్తున్నాయని అతడు నియతిగా భావించినాడు. అతని నిజాయితీ, జ్ఞానతృష్ణ విశ్వసంస్కృతిలోని విలువలనన్నిటినీ ఆకర్షించినాయి. కాపరిని చూసిన గొర్రెల తటాలున మందలో వచ్చి కలిసినట్లే శాస్త్ర జ్ఞానమూ, శాస్త్రీయ వైఖరి అతనితో కలిసినాయి. ఎడబాసిన సోదరులు వచ్చి కౌగిలించుకొన్నట్లే ప్రజాస్వామ్య భావనతో కూడిన స్వాతంత్ర్యము, సమానత్వము ఆత్రపడుతూ వచ్చి అతణ్ణి చేరినాయి. కొన్ని తరాలనుంచి వేచిచూస్తున్నట్లు సాంఘిక న్యాయ సంబంధమైన నిజమైన ఉత్సుకత అతణ్ణి స్వాగతించింది. ఎంతో కాలం తర్వాత తమకు తగిన స్థానం కల్పించే యజమాని దొరికినాడన్నట్లు సాంకేతికత, దాని ఉత్పత్తులు అమాంతంవచ్చి అతని కాళ్ళపై ఒరిగినాయి. శిశువులు శిక్షాగురువును సమీపించినట్లే లలిత కళలూ, వాటి సృజన క్రియాకలాపాలూ ఒక వంక సిగ్గుపడుతు, ఒకవంక జంకుతూ అతణ్ణి ఆశ్రయించినాయి. ఎంతోకాలం అతను ప్రయత్నించినా లభించని అధికారం దాని వికృత రూపాన్ని విడిచి పవిత్రమై, మానవ సేవానుభవ పరాయణమై దానంతకదే వచ్చి అతణ్ణి చేరింది. ఒక్కమాటలో చెప్పవలసివస్తే మహోత్తమమైన విలువలన్నీ-ఇందాకా అతడు దూరంగా చూసినవి కొన్ని, అతణ్ణి దూరంగా చూసినవి కొన్ని - గుమిగూడి ఆస్తికతాలిప్తములైన సమరసభావంతో అతనిలో నిలిచి అతని వినూత్న మహమ్మదీయ మూర్తిమత్వాన్ని రూపొందించినాయి.

ఇప్పుడు వాస్తవమైన లక్ష్యాలు : భగవద్భక్తి, సత్య ప్రచారము ఈ రెండే అని అతడు విశ్వసించినాడు. కాని 20 వ శతాబ్ది మధ్యభాగంలోని చీకటి ఘడియలలో, నిరాశలో ఉండి చూసిన దానికంటె అతనిభక్తి భావన ఇప్పుడింకా విశాల పరిధిలో పడ్డది. అప్పటి భక్తిభావన కేవలం నిరంతర ప్రార్థనవరకే పరిమితమై ఉండేది. ఇప్పుడది ప్రార్థనతో ప్రారంభమై భగవన్మహిమను విశాల విశ్వావీధులవెంట చాటేదాకా విస్తృతమైంది. ఇప్పుడతని "తక్బీర్" (భగవన్మహిమను చాటేకార్యకలాపం) కేవలం రాజకీయ నినాదంగా కాక అతని జీవితానికి ప్రాణవాయువై ఉంది.దాన్ని ఇప్పుడు కేవలం తన ప్రత్యర్థులను జడిపించటం కోసంగాని తన భయాన్ని పోగొట్టుకొనేటందుకుగాని అతడు ఉపయోగించడం లేదు. తన ధైర్యాన్ని పుంజుకోవడానికి, ఇతరులను గూడా ధైర్యవంతులను చేయడానికి భక్తి ప్రపత్తులతో సర్వ శక్తిమంతుడైన భగవంతుని మహాత్మ్యాన్ని అతడు చాటుతున్నాడు. సత్యం, సద్వర్తన, ధర్మం, సౌందర్యం, ప్రేమవంటి శాశ్వతమైన నైతిక విలువలను ఆకళింపు చేసుకొన్న అతని భక్తిభావన నేడు విశాలమైన పరిధిలో ఉంది. ఈ విలువలన్నీ అతడు తనతో

పాటు తన సమాజానికి, జాతికి, ఇంకా ముందుకు వెళ్ళి మానవాళి కంతకూ అందిస్తున్నాడు. వ్యక్తి, సమాజం, జాతి, విశాలమానవత అన్నింటికీ దివ్యత్వమే మాతృక అని భావిస్తున్నాడు. ఆత్మ సంస్కరణలు పెంపొంది తోటి మానవుని సేవలోనే మానవుని మూర్తిమత్వపు పరిణత ఉందని గుర్తిస్తున్నాడు. విద్య, విజ్ఞానం, మార్గదర్శకమైన ధార్మిక సంస్కరణ, రాజకీయ సంస్కరణ, సౌందర్య సృష్టి, ఆర్థిక ఉత్పత్తి ఇట్లాంటివి మానవ సేవకు ఉపయుక్తమైనవి ఏవి చేపట్టినా ప్రాపంచిక జీవన లక్ష్యం ఒకటేనని ; సమాజంలో, జాతిలో, సంపూర్ణ మానవాళిలో పరస్పరం ప్రతిబింబించుకొనే తత్త్వం ఉన్నదని వీటిని భేదపరచి చూడడం అసాధ్యమని గుర్తిస్తున్నాడు. పైవాటిలో ఏ ఒక్కదాన్ని ఉద్ధరించినా రెండోదాని ప్రగతి కలిసి వస్తుందిగదా ! అందుకే భారతీయుడైన మహమ్మదీయుడు తన శాయశక్తులా భగవదర్పితముగా చేసే సేవ భేదభావం లేకుండా సృష్టికి దోహదం చేస్తూ ఉంది

అతని 'తబ్లిక్' (సత్యప్రచారం) కూడా 'ఇబాత్' (భగవద్భావన) వలెనే మారింది. మహమ్మదీయధర్మ పరమైన విలువలను అతడు విశ్వజనీనమైన శాస్త్రీయ భాషలో హేతుమతి, నీతి వీటిద్వారా అందిస్తున్నాడు. కొందరు ఈ విలువలద్వారా మహమ్మదీయ విశ్వాసాన్ని అరమరలేకుండా గ్రహిస్తున్నారు. తదితరులు, తమ తమ సాంప్రదాయికమైన విశ్వాసాలకు అంటిపెట్టుకొని ఉన్నవారు ఈ విలువలను గ్రహించి తమ విశ్వాసాల మేరకు మరింత నియతితో పట్టుదలతో, వ్యవహరిస్తున్నారు. క్రియాశీలురైన ముస్లింలు ఏ మతశాఖకు చెందిన వారైనాసరే, లౌకిక సిద్ధాంతరీత్యా ఏ నిష్ఠను అనుసరించే వారైనాసరే మౌలికమైన విలువలను గ్రహించి ఆచరించేవారైతే సరి వారినందరినీ భారతీయుడైన మహమ్మదీయుడు గుర్తిస్తాడు. జీవిత పోరాటంలో వారినందరినీ తన సహచరులుగా చేసుకొంటాడు దేశప్రగతికి సంబంధించిన కార్యకలాపాలలో వారందరితో తాను బుజం బుజం కలిపి నిలుస్తాడు. ప్రాపంచిక స్థాయిలో న్యాయ, సామాజిక, ఆర్థిక రంగాలలో ప్రేమధర్మాన్ని సాధిస్తాడు.

20వ శతాబ్ది మధ్యభాగంలో ధర్మాధర్మాలకు కలిగిన పోరాటంలో పాల్గొని తన సహచరుల సహాయంతో ఇతడు గణనీయమైన విజయాన్ని సాధించినాడు. భారతదేశంలో శ్రేయోరాజ్యస్థాపనను ఆశించి ఒక నియతమైన ఆర్థికవిధానాన్ని స్థాపించడంలో నేమి; ఆర్థికమైన పోటీలో లోపాయకారీ తనాన్ని తనిఖీ చేయడంలోనేమి; అమాయకతనూ, అజ్ఞానాంధకారాన్నీ తనదేశంనుంచి పారదోలడంలోనేమి; అనైక్యతను ప్రోత్సహించే ప్రాంతీయభాషా-మతవర్గ శక్తులను ఓడించి భారతదేశాన్ని ఒక సమైక్యజాతిగాచేసి జాతీయ రాజ్యాల కుటుంబంలో సుఖసంతోషాలతో మెలిగే సభ్యదేశంగా రూపొందించడంలో నేమి తన పాత్రను బాగా నిర్వహించినాడు. ఏకాధికారానికీ, పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యానికీ మధ్య ఆధరాజ్య, నాస్తిక రాజ్య, సోషలిస్టురాజ్యాలకు మధ్య అణుయుద్ధం పెటిలిపడేతరుణంలో ఇతడు తన అమూల్యమైన సేవలను అందించి ఆ ప్రమాదాన్ని తప్పించడమే కాకుండా వివిధ విధానాలను అనుసరించపోయే ఆయారాజ్యాలమధ్య సన్నిహిత సంబంధం చేకూర్చి తన హితమిత నీతిని నిరూపించినాడు. ప్రజాస్వామ్యం ప్రసాదించిన స్వాతంత్ర్యము ఆర్థిక అసమానత్వానికి లోబడి చిక్కిపోయినప్పుడు, స్వాతంత్ర్య రుచిని కోట్లాది ప్రజలు అనుభవించలేని స్థితిలో ఉన్నప్పుడు ఇతడు సత్యసందేశాన్ని అందివ్వడానికి మొదటి వరుసలోకే వచ్చి నిలిచినాడు. మానవ

జీవనానికి కావలసింది కేవలం పొట్టపూరితత్వం మాత్రమే కాదని, అతని జీవనాడిని కదలించేది స్వతంత్రమైన చైతన్యమే అని; అతని గుండెకువేడి,ఆత్మకు సత్తాకలిగించేది ధార్మికానందమే అనిచెప్పి సోషలిస్టులకు ఆత్మవిమర్శ కలగజేసినాడు.

ఇప్పటి భారతీయ మహమ్మదీయుని విశాలగృహ పరిసరాలు ప్రపంచమే అయినా ఆ పరిసరాలలో వైభవోపేతమైన ఉద్యానంవంటి భారతదేశంలోనే అతడు నివసిస్తూ, పరులు అసూయపడేటట్లుగా దాని పచ్చదనాన్ని పరిపోషిస్తూ తన రక్తమూ చెమటలూ ధారపోస్తున్నాడు. అతడు జీవించినా, మరణించినా స్వదేశీయ విదేశీయభేదం లేకుండా మిత్రులసాదర సానుభూతులను పొందుతూనే ఉన్నాడు. సంతుష్టి, అసంతుష్టి, సంభ్రమం, విశ్వాసం ఇవి కలగాపులగమై ఏర్పడ్డ ఒక మిశ్రభావంతో అతడు తనసృష్టి కర్తవద్దకు పోతాడు :—తన సాధ్యమైనంత తాను చేసినాడని సంతుష్టి, ఆశించింది చేయలేకపోయినాడని అసంతుష్టి, పరలోకంలో తనకేమి సంభవిస్తుందో అని సంభ్రమం, పరిమితమైన తనశక్తి కారణంగా సంభవించిన లోపాలను దయాపూర్ణుడైన భగవంతుడు క్షమిస్తాడని విశ్వాసము. అతడు నిష్క్రమించిన తర్వాత వాతావరణమంతా ఒక కవి అన్నట్టే అదే శబ్దాలతో ప్రతిధ్వనించనుంది. "అతని ఆత్మ ఎంత ఉల్లాసకరమైంది ఎంత స్వతంత్రమైంది! అతనికి భగవదాశీర్వాదం లభించనీ."

## మీర్ పద్యం

ఋతువు మారెనని వగలగాలి ఈలవేసి చెప్పింది,
బుల్‌బుల్ కుసుమపొదకు వాలి కొసరికొసరి పాడుతుంది.
ధార్మిక సంస్కరణా ? బలిఅయితవి పాత నమ్మకాలు,
కొత్తది 'కాబా' దర్శించండీ తెల్ల విగ్రహాలు !
ఎవరు కిమ్మనరు ఈ మార్పులతో ఏమి అబ్బురాలు !
తామంతా తమకు జన్మనిచ్చిన తంబురాస్వరాలు.
విప్లవమిది అక్బర్ ! ఎందుకు గుండె బాదుకొంటావు ?
మాడిన కాలం. నేనుండను మరి నీవు ఉండబోవు.
అక్బర్‌పై పోలీసులకే ఫిర్యాదులు చేస్తారు,
ఈ యుగాన గూడా నమాజు చేస్తాడని చెప్తారు ?
ముస్లిం బతుకా ఇది ? అబ్బా, అడుగడుగుకు ఓబాకు,
దేవుని ప్రసాదమే, అయినా తాగనివ్వడా షేఖు !
ఆయుధాలను ధరించడానికా అసలు వీలులేదు,
తుర్కీశత్రువులను ఎదిరించే శక్తి మనకులేదు.
గుండెబద్దలైపోయేదాకా ఘోషిస్తామంతే,
ఇటలీ తుపాకి దవనెక్కాలని శపిస్తాము అంతే.
అతిగ ఆకేకా ? దూరదూర కోణాల్లో మూల్గింది,
క్లారెట్ పిలుపేమో దగ్గరదగ్గర రమ్మంది.

పూవు జీవితం ఎంతకాలమని సవాలు వచ్చింది,
మొగ్గకు తెలిసిందేమోమరి పొరపొరగా నవ్వింది.
సంధ్యలు పడగా గుడిసెకోన ఓ ప్రమిద మిలుకుమంది,
ఆణగీపుణగీ చికాకుపడ నాగుండె కలుకుమంది.
వియోగవేదనలోనే సంయోగబాధ మసిలింది,
గాఢవాంఛ గజిబిజి పాలయ్యి సమాధికి పోతుంది.
పరిసరమంతా ప్రపంచమంతా భ్రమకు లోనయింది,
మన ఊహను గిపెట్టుతున్నదే ఈడమిగులుతుంది.
ప్రణయం ప్రారంభంలోనే సలసల కాగించింది,
బూడిద బుగ్గై మిగిలితిని ప్రణయ పరిణామమా ఇది?
ఆల్బం వలె కనిపించే ఢిల్లీ బజార్ల అపురూపం,
చూచేదంతా పూర్ణభావనకు అమరే ప్రతిరూపం.
నాదైన్యంలో లోతుచూచి ఆశ్చర్యపడకుమోయి!
బతుకుదారిలో గతుకులు తప్పని గతి ఇట్లేనోయి.
పేద ఆశలకు తికమకతీరదు జీవితపర్యంతం,
నీ వెడబాసిన పుణ్యం నేనగుడయ్యిన ఏకాంతం.
ఆదేమిటో? బులిపించిందీ తోటో! బుల్‌బుల్ పాటో!
జీవిత కాలం ఎంత వేగిరంగా నడిపింది? ఎటో?

ఆంగ్లానువాదం : ఎం. సాదిఖ్

## వర్షాకాలం

తాగు, తాగు,
తనువు మరిచి ఊగూగు :
జడలు విచ్చుకొని మబ్బులు దిక్చక్రంచాయన వేలాడినవి!
చుట్టూముట్టూ, రోదసినిండా చీకట్లే దిగగమ్మినవి. తాగు...
తలలపై తొగరు పొగాలూ,
కలకల లాడే మొగాలూ,
పూవులమీది మంచుబొట్లవలె
చిటిపోటి చినుకుల మొగాలచూసి తాగు...
శ్రావణ మాసపు కాళరాత్రులూ
కత్తిమెరుపుతో తళుక్కుమన్నవి;
చుక్కలతోనే పోటీపడుతూ
మిణుగుర్లు మిలుకు మిలుక్కు మన్నవి తాగు...
గడగడ ఉరుముకు ప్రియురాలు
ప్రియుని కౌగిట్లోనే అతుక్కొన్నది,
ఇంటి కప్పుకూలి లప్పుమన్నది,
ఎవ్వరికేకనో గతుక్కుమన్నది. తాగు...

పటపట బోట్లకు మెరిసేముఖాలు పసందుగా మెరిసినవి ;
జిలజిల రాలేచినుకులు చక్కిలిగింతలు పెడుతున్నవి :
చివికిన కప్పుల గుడిసెల్లో చిటపొట పొటుకుల దోవాటం ;
కొండ నడుముచుట్టూ ఆడుకొనే పసిక అలల దోవాటం. తాగు...
ధారలుగట్టి కురిసే వర్షం వరదలు గట్టిస్తుంది ,
పశువులనూ, పక్షులనూ కలిపి స్నానం చేయిస్తుంది.
కప్పలు గరగరగరవాగంగా, కీచురాళ్ళు కీచుకీచుమనగా,
కొరకొరమని రెక్కలు ఝాడిస్తూ కొంగలు నింగికి బారుగట్టినవి ;
కోకిలదే, పిచ్చుకదే పాట ;
మత్తెక్కిన నెమలిది ఆ ఆట. తాగు...

ఆంగ్లానువాదం : ఎం. సాదిఖ్

## హోళి

తీయతీయగా అడుగులువేస్తూ,
ముఖం మీది పర్దా తొలగిస్తూ,
తొంగి తొంగి అది చూసిందిపుడే
మన ఎదలను కలపాలి
రసకేళి హోళీ
కంజీరల్లో కైపు దాచుతూ,
మంజీరాల్లో లయలు చూపుతూ,
పొంగే ఎదపై నిశ్వాసిస్తూ
అది కదలగనే అందరు కదిలిరి,
వీధివీధి ఆడాలి
రసకేళీ హోళీ
హోళీచెలి చూపుల బెళుకుల్లో,
పడుచు సఖుల చూపుల తళుకుల్లో,
కుంకుమ పళ్ళాలు కుమ్మరిస్తూ
గంగాళాల్లో రంగు కలుపుతూ
ఊరంతా పాడాలి
రసకేళీ హోళీ
చెలి హోళీ నృత్యం చూస్కుంటూ,
దాని అడుగుతో దరువేస్కుంటూ
చిన్నాపెద్ద గుంపులు గడుతూ
ఈలలువేస్తూ, కేకలు పెడుతూ
తనన నననన తంబురాలతో
ఝకఝుం ఝకఝుం ఝమిడీకలతో

అడుగు అడుగు గజ్జెల గలగలతో
పెటపెటపెట తప్పెట్ల కొట్లతో
దినమంతా అడాలీ
రసకేళీ హోళీ.

అంగ్లానువాదం : ఎం. సాదిఖ్

జె. ఎల్. కౌల్

## గాలిబ్ వ్యాఖ్య

కొత్తగా ప్రవేశిస్తున్నారా జీవితంలో ?
ఇదో కోరికల పండుగ జాగ్రత్త.
తాగుడులో నాట్యంలో తన్మయులవుతూన్న
మీరంతా జాగ్రత్త, మీకు కళ్ళుంటే చూసుకోండి
మీకు చెవులు గనక ఉంటే నామాట కాస్త పట్టించుకోండి

* * *

హేతువుకూ, విశ్వాసానికీ బద్ధశత్రువు సాకీ ;
నీ ఉరువు బరువులనూ ఆధిక్యాన్నీ దోచేసుకుంటుంది.
నిన్నరాత్రి, తోట పూలబరువులతో, గుబా
ళింపులతో బాగా విచ్చుకొన్నది.
వీణమెట్ల స్వరాల్లో ఉబికే సంగీతానికి
పరవశించిన సాకీ – కండ్ల పండగగా,
చెవుల పండగగా – అది ఆడిందే ఆట,
పాడిందే పాట.

* * *

కానీ, మీ ఉదయం ఆ సంగీతం సంబరం ఏదీ ?
ఆ ఉబలాటం అంతా ఏమైనట్టు ?
తోట ఎడారిగా మారిపోయింది,
అంతా సద్దుమణగారు,
కాంతులు వెదజిమ్ముతూ ఉల్లాసంగా
రాత్రి పొంతమూ వెలిగిన కొవ్వొత్తితోసహా
అందరూ మాయమయ్యారు !
ఆరిన మంటలు వెలిగక్కే పొగలవలె
విచారాలు కమ్ముకొంటున్నవి.
మళ్ళీ తిరిగిరాని గత వైభవాన్ని తలచుకొని
ఏకాంతమౌనం గొణక్కొంటున్నది.

* * *

ఈ ప్రపంచం పిల్లలు ఆడుకొనే రంగస్థలంగా

కనిపిస్తున్నది.
ఇదంతా ఓ కల్పితదృశ్యం.
సొలమన్ వైభవంలాంటి కట్టుకథ.
శవాలను లేపి మనుషులుగాచూపే
దేవదూత గారడీ వంటిది.
నామట్టుకు ఈ ప్రపంచం నామకార్థమే
వాస్తవం.
కనిపించేదంతా భ్రమజన్యం
నా ఆత్మలోని నిస్సారత్వాన్ని ఎడారులతో పోల్చనా ?
నీటి ఎడారులనదగ్గ సముద్రాలతో పోల్చనా ?
దద్దరిల్లిన నా హృదయంలోంచి వెలువడే
సుడిగాలుల దుమ్ములో ఉన్నవన్నీ ఎడారి
ధూళులే.

* * *

దేవుళ్ళులేరు, దేవుడొక్కడే అంటుంది ఖురాన్.
మార్మికతావాది ఓ అడుగు వెనకేశాడు.
తన వైజ్ఞానిక చైతన్యంతో కాలూని నిలబడి,
'ఉన్నది శూన్యమే కాని దేవుడులేడు' అంటున్నాడు.
వైవిధ్యంలో ఏకత్వాన్నీ, ద్వేషంలో సామరస్యాన్నీ
అతను చూస్తూ ద్వైధీ భావాన్నీ వ్యతిరేక స్థితినీ తిరస్కరిస్తున్నాడు;
అవన్నీ భ్రమలనీ, కట్టుకథలనీ, చావుతెలివి
వంటివనీ భావిస్తున్నాడు.
హేతుబుద్ధీ, తన్మాత్రల జ్ఞానమూ ఇవి
మనిషి కండ్లకు గంతలు;
వస్తువులో దాగిఉన్న ఏకసత్యాన్ని అవి
చూడకుండా చేస్తాయి.
పవిత్ర గ్రంథాలు ఒప్పుకొనే దేవుణ్ణి
మార్మికతావాది గూడా నిలిపినట్లే
'జరిగే పాపాలకంతా దేవుడు ఓ రకంగా
నిస్సహాయుడైఉన్న సాక్షిభూతుడు, పాపాన్ని
నిషేధించడానికిగానీ, అణచడానికిగానీ
అతనికిశక్తిలేదు' అంటాడు మార్మికతావాది,

* * *

కాని సందేహం మిగిలింది :
శూన్యమే ఉండి దేవుడు లేకుంటే
అందే ఉన్నది అంతా శూన్యమే అయితే,

అదే దేవుడా ?
అన్నిటిలోనూ ఉన్నది ఏకత్వమే అని
కొందరు గుర్తించింది అదేనా ?
అట్లయితే ఉన్నది ఒకటే,
అదిబహుధాత్వంచెంద వలసిన అవసరమేముందని
అడగ వలసివస్తుంది.
సృష్టితత్వాన్ని గురించి కొందరు తికమకపడతారు
ఎందుకో శూన్యం ఉన్నప్పుడు ఓపరిటూ !
నీవు ఉన్నట్లే.
ప్రకృతిలోనూ, మనిషిలోనూ ఉన్న ఈ
నానా రూపత్వం ఏమిటి ?
సౌందర్యం, ప్రేమ వీటిమూలం ఎక్కడుంది?
సుషుప్తిలో, నిశ్వాసలో,
అగరుబత్తి పొగవంకరల్లో, కాటుకకళ్ళల్లో
ఆకర్షించే దానికి అర్థమేమిటి
పచ్చికలో ఉండే పసిమి,
పూలల్లో తొంగిచూసే లేతగరికపచ్చరంగు,
మేఘాల నీలిమ,
కదలాడే గాలి,
ఇవన్నీ ఏమిటి ఎక్కణ్ణుంచి వచ్చాయి ?

* * *

జీవితం ఒకపందెపు గుర్రం, దానివేగం గాలివంటిది;
ఎక్కడికి పరుగెత్తుతుందో ! గమ్యమేమిటో !
ఎక్కడ ఆగుతుందో !
దానిమీది రౌతు (మనిషి) నిస్సహాయుడు,
కళ్ళెం సంబాళించలేడు,
రికాబుల్లోకాళ్ళు స్థిరంగాతొక్కిపట్టు కోలేడు,

* * *

భగవాన్ ! ఈ ఆపత్తు నుండి రక్షించు,
పాపాలను లెక్కచూసుకొమ్మని నన్నడగకు;
నీ శిక్షనుంచి తప్పుకోనూతేను,
కాని నాలో చేరిన నానాపాపాలు
పరస్పరం పోరాడుతూ, మరకలంటించుకొంటూ,
నేను గురికాబోయేతాపాలనూ, వేదనలనూ
జ్ఞాపకం చేస్తున్నాయి
వాటి నన్నింటినీ ఎంచుకొంటున్నప్పుడు

నేను చేయని పాపాలను తలచుకొని
మొత్తుకొంటున్నాను. మళ్ళీసరికొత్తబాధ.

* * *

వసంతం తన చైతన్యాన్ని, ఆకారాన్ని,
రంగుహంగులనూ వినిపిస్తున్నది.
రోదసిలో స్తబ్ధంగా ఉన్న చీకటితెరను
సూర్య చంద్రులు చీల్చివేశారు,
నీ చుట్టూ సంబరంగా చూసుకో, పరకాయించు,
మెరిసేకళ్ళను భూమిపై సారించు.
భూగోళవాసులారా! ప్రపంచప్రాభవాన్ని
చూడండి; భూదేవి చిరునవ్వు మోము,
మెరిసేకళ్లు, ఆకుపచ్చని దిరుసు చూడండి;
ఆమె ధరించిన మెత్తని గరికపచ్చ-ఎరుపు-
రంగుపూలు చూడండి
ఎక్కడచూసినా భూమి వజ్రాలు తాపిన
ఆకాశంవలె మెరుస్తున్నది.
తెరపిమాటేలేని, సిగ్గు దొంతరలేలేని
ఈవసంతవైభవం కాలువల్లో, సరస్సుల్లో
ప్రతిఫలిస్తున్నది. సరస్సులనీలవర్ణం
కనుమరుగైపోయి లేతగరికపచ్చని
జలవర్ణం మెరుస్తున్నది.
అ దాసానిపూవు ఆప్యాయంగా
చూస్తున్నది పూలన్నీ గుప్పునగుబా
ళిస్తున్నవి. చుట్టూరా ఉన్న ఆకుపచ్చ
దనంమీద చూడు : మలయమారుతం
గలగలా వీస్తూసారాయిస్పర్శవలె చల్లగా
తగులుతున్నది కాంక్షలను రేకెత్తించే
నీ చూపులు నావాంఛను మేల్కొల్పి
నన్ను అమాంతం ఊపేస్తున్నాయి.
దుస్సహమైన నీ వియోగభారం నన్ను నిరాశతో
క్రుంగదీస్తూంది ప్రశాంతమైన నా
హృదయానికి చల్లని నిరాశను
కలిగిస్తున్నది.
భగవాన్ ! ప్రేమ అనేది సుఖమూ దుఃఖమూ కూడా కల్గించాలి

* * *

నాకు తెలుసు ప్రణయజీవి జీవితమంతా

తాను ప్రేమించిన హృదయాన్ని స్పృశించడం
కోసమే శ్వాసిస్తుంది.
వానచినుకు ముత్యం రూపం ఎత్తడానికి
ముందు ఎన్నో అగ్నిపరీక్షలకు గురి
అవుతుంది.
నాకు తెలుసు : బాధించే ప్రేమ ఎంతకాల
ముంటుందో !
నా శోకం కేకలు నీ చెవిదాకా సోకినప్పుడు
నన్ను నిర్దయగా చూడకుమని కోరుతున్నాను
నాకు తెలుసు : ప్రణయసుఖానుభూతి
అంటే నా మరణమని, అప్పుడు ప్రణయమే
లేదు గదా !
నాకుతెలుసు : మరణం దుఃఖాలనన్నిటినీ
ముగిస్తుందని, అన్నిటినీ ప్రశమింపజేస్తుందని,
ప్రభాతమయ్యేదాకా (మృత్యుంజయు
డయ్యేదాకా) మనిషిని కొవ్వొత్తివలె వెలిగించి
ఆర్పేస్తుందని

* * *

అందరికీ శుభాకాంక్షలు
కుల-మత-ప్రతిపక్షభావనలతో మనం చీలిపోయి
జరుపుకొంటున్న పోరాటాలకు
స్వస్తి చెప్పుకొందాం.
మన కార్యకలాపాలన్నిటికీ మంచిగానో,
చెడ్డగానో చెప్పుకొనే వ్యాఖ్యానాలు
ఆపుదాం.
ఈ ప్రపంచం ఇట్లా-మనిషి కోరికలన్నీ
తీరుస్తూ, అద్భుతమైన సంతోషసంబరాలు
నింపుతూ-స్వర్గంగా వికసించనీ (P. II)
సమైక్య భావమా ! హిందువులు తమ
విగ్రహాలముందు నీ నామకీర్తనం చేసుకొనే
అవకాశం కల్పించు. పారసీలు అగ్నిలో
నీ సంగీతాన్నే వినని
అవును, నాస్తికులు గూడా ఓమూలకార
ణాన్ని ఒప్పుకొని తీరాలి.
దేవుడు, యెహోవా, బుద్ధుడు, అల్లా
అంతా ఒకటే

## నక్షత్రం

నిన్ను జడిపించిన చందమామ ఇదేనా ?
నీవు దిగులుపడే వేకువసమీపించిందా ?
సౌందర్యగళంపై వ్రాలి జారిపడ్డకత్తి
ఇచ్చిన సందేశం వారు నీకు అందించారా ?
నీ తేజస్సంపదను చీకటి కొల్లగొట్టిందని
నీకు సూచనగానైనా తెలిసిందా ?
ఈ దళ ముడుచుకొనిపోతూ, వెలుగురేక
వలె నిష్క్రమించడానికి ఎదురుచూస్తున్నది.
ఈ మట్టిగోళానికి దూరంగా ఉన్న స్వర్గం
ఆ ఉన్నతపీఠాన్ని ఎవరికి అందించింది ?
శ్వేత వెన్నెలపొరవలె మెరిసే దుస్తులను
ఎవరిపైన విసిరింది ? - నీపైనే.
గజగజ లాడించే చలిని నీ నాజూకు కిరణం
చుట్టి వేసే దెప్పుడు ?
చీకటి చెదరిపోతున్నప్పుడు కాలజ్ఞుడు
కాని మనిషి అసహ్యమైన మనిషే.
ముడుచుకపోయిన ఓ బాటసారీ ! ఈ జీవిత
నాటకరంగం చిత్రమైంది. ఒకరికేమో అగాధ
మైంది, మరొకరికి బ్రహ్మానందమైంది. ఈ
రెంటిమధ్య ఎన్ని విచిత్ర దృశ్యాలు ? అబ్బా !
ఈనిన పందివలె ఉన్న సూర్యుడు ఊపిరి
పీలుస్తున్నప్పుడు చుక్కల గుంపులు చావవలసిందే.
భయంకరమైన ఈ జీవితం మరణశయ్యపై
భీకర-ఆటవిక-వినోదాలు ప్రదర్శిస్తుంది.
కొత్త పూవు విలసనం వెన్క మొగ్గచేసిన త్యాగం ఉంది.
అస్తిత్వం ఖాళీగా ఉన్నప్పుడు ఓ గాజు
చిట్లుతుంది. ఎందుకంటే, ప్రకృతి యాంత్రిక
మైన శాంతిలో ప్రవేశించ గూడనిది.
అన్ని కాలాల కోసమని ఏర్చికూర్చి పెట్టిన
సహనమంతా అస్థిరమైందే.

(బాంగె - దారానుంచి)

## గజల్

గట్లసందులు మెరిసినవి 'గసగసా' మొగ్గల వెలుగులో,
కొత్త నొక్కులు నేర్చి బుల్ బుల్ పలికినది నా మనసులో.

రంగురంగుల దొంతరలు, అవిపొదలు విచ్చిన పూవులా ?
వన్నెవన్నెల దిరుసులను సవరించుకొను అప్సరసలా ?
మంచు ముత్యాల్ చల్లుతూ వీచినవి వేకువగాలులు,
గుబాళిస్తూ విచ్చుతున్నవిదే గులాబీ చాలులు.
ఓ స్వతంత్ర విలాసినీ ! నిను పిలిచినవి అకవిదార్లా ?
ఉదయకిరణం జిలుగులో మెరిసేటి పట్నం బజార్లా ?
లోతులో పాతుకొని పోయిన స్వాత్మను కెలికి చూచుకో
నాకు బాసటకావుగా; నీకైన నీవే నోచుకో.
సొంతలోకం వింతలోకాం, అక్కడివెసై యాత్రలు;
వినాశమొ ! ధోకా విజయమో ! తెలుపవీ తన్మాత్రలు
స్వయంగా సాధించినవే నిధులు, అవి నిలబెట్టుకో,
ఎగిరివస్తూ ఎగిరిపోయే సంపదలు ఏమట్టుకో !
సొంత పరిసరములో చూడను తెల్లవాని హుకూమతు,
బ్రాహ్మణుల ద్వేషాగ్ని, షేఖుల కసి గలాటా బాబతు.
పరుల శక్తికి మోకరిల్లే వాని వైభవము చూడు,
ప్రాణమూ, మానమూ రెండూ కుదువబెట్టిన మగాడు !

(బాలె - జబ్రీల్ నుంచి)

## కాలం

జారిపోయిందేమిటి ?
జారుతున్నదేమిటి ?
ఈ సత్యం కొందరికే తెలుసు.
కాలం గుమ్మంలో నిలిచి ఆప్యాయ
మైన రాగజ్వాలతో మెరుస్తుంది.
నా చెంబులోంచి జారిపడే ప్రతిబొట్టులోంచి
కాలప్రవాహపు సవ్వడులు వినిపిస్తూకొత్త
కొత్త దృశ్యాలు కనిపిస్తున్నవి.
నా జపమాల జారి ఉదయసంధ్యాకాంతులపై పడి మెరుస్తుంది.
పరిచయమైన ప్రతిదానితోనూ, ప్రతివారి
తోనూ నాకు అభిప్రాయభేదమే ఏర్పడింది.
నా విధులకోసం నా ఆజ్ఞలే జారీచేసుకొంటున్నాను.
ఈ కాలమా ? : ఒకరికి రౌతు, ఒకరికి
పందెపు గుర్రం, మరొకరికి కొరడా దెబ్బ.
నా పంక్తిలో నీవు కూర్చోకపోతే అది
నీ తప్పా ? నా తప్పా ?
శాస్త్ర కులాసాగా చెప్పమంటే, మధ్యరాత్రి

మైకానికి అలవాటుపడని వారిని నేను చూడలేదంటాను.
ఎంత లోతు దృష్టికైనా నా గాథరా - అఖాతం కనిపించదు.
గురికాని ముఖానికి వెలుగుతన్నినప్పుడు బాణం గురితప్పుతుంది.
పాశ్చాత్య దిక్చక్రం వైపుచూడు, అది
ఉదయంకాదు, వాళ్ళ రక్తస్నానం.
ప్రకృతి సంకల్పశక్తి వాళ్ళను దుస్తులు తడిసేదాకా ఏడ్పిస్తున్నది.
ఇప్పుడు వాళ్ళ స్వదేశమే ఆపదకు గురిఅయింది,
తటపటాయిస్తున్న ఈ విద్యుత్తు నిలువదు.
వ్యాపార పట్నాలు పరంగీలవే, సముద్రాలూ ఓడలూ వాళ్ళవే.
సుడిగుండాల్లో పడిపోయిన వాళ్ళ
విధివిలాసాన్ని నేను శమింపజేయలేను కాని
మన కనుమేరకు దూరంగా ఓ కొత్త ప్రపంచం
పుట్టింది. పాతలోకం చూస్తున్నది.
యూరపు జూదగాడు ప్రపంచాన్ని అంతా
ఒక జూదగృహంగా చేశాడు.
తన కళ్ళలో స్వర్గాన్ని దాచుకొని
తుఫాను గాలి వీస్తున్నా తన దీపం
ఆరకుండా చూసుకొనేవాని ప్రకృతినే
ప్రభువు రాజసంలో ఉంచుతాడు.

(బాలె - జబ్రీల్ నుంచి)

## గాబ్రియల్ - సైతాను

గాబ్రియల్: రా, పురాణ మిత్రమా రా, వార్తలేమిటి? ఎట్లా ఉంది ప్రపంచం?

సైతాను : కుతకుత ఉడికిపోతుంది, దుఃఖంలో బాధల్లో మసలుతూ ఆశలతో, తీరని వాంఛలతో మండిపోతుంది.

గాబ్రియల్: నీ పేరు తలచుకోనిదే స్వర్గంలో ఓ గంటైనా గడవదే! నీవు ధరించే ఆ ఢాలు తుప్పుపట్టి బెట్లూడిపడే ఆ పాత ఢాలు చూడవచ్చా?

సైతాను : ఏయ్ గాబ్రియల్, నా రహస్య పన్నాగం నీవు ఊహించలేవు. చూడు స్వర్గ సీమను ఎక్కడ పడేశానో, సీసపు ముక్కలమీద తోశేశాను, పొర్లి పొర్లి తిక్క లేచిపోతున్నది. దానికి మళ్ళీ పునరుజ్జీవనమా? అసాధ్యం - అసాధ్యం. చూడు ఎట్లా నోరు చచ్చిపడిపోయిందో ఈ స్వర్గం? ఏవీ ఆహార్మ్యాలు? ఏ సందు లోనూ సవ్వడి వినపడదే? ఇదీ నేను తలపెట్టిన పన్నాగం. ప్రపంచగోళాన్ని ఎగనాకుతున్న మంటలన్నీ చూడు. అవన్నీ నేను సృష్టించిన నిరాశా నిస్పృహల ఫలితాలే. దేవుని సందేశమా? నీవీ నిరాశానిస్పృహలలో పడిపోవా?

గాబ్రియల్: ఎల్లకాలమూ నీ తిరుగుబాటేనాయె. దానితోనే మన ఉన్నత భువనమంతా కుంగిపోయింది. దేవదూతల ఔన్నత్యాన్ని చాటే దృశ్యమొక్కటైనా మిగలలేదు.

సైతాను : నా తిరుగుబాటు దెబ్బే, మానవునిలోని దైన్యకుహరాన్ని హింసా ప్రవృత్తులతో కూరింది.

మానవుని మేధస్సునూ, హేతుబుద్ధినీ పడుగూ పేకగా అల్లివేసింది నా తిరుగుబాటే.

మంచి-చెడ్డల లోతుపాతులు చూడదలిచావా? చూడు, సుదూరాల అంచుల్లో చూడు. అవిగో ఆ తుపాను కొట్టే కొరడాదెబ్బలు - మంచిమీదా, చెడ్డమీదా - అన్నిటిమీదా పడుతున్నవి.

నేను లేవదీసిన తుపానుల్లో కైజర్ గానీ, నీ సంరక్షక భటులు ఎవరైనా గానీ, పాలిపోతారు, వెలవెలబోతారు.

నేను ఉసికొల్పిన తుపానుల్లో సముద్రాల మీద సముద్రాలు పొర్లిపడతాయి. నదులపై నదులు, ప్రవాహాల మీద ప్రవాహాలు ఒరగబడతాయి.

సరే, దేవుణ్ణి ఓ ప్రశ్న అడిగిరా : మానవాళి చరిత్ర మెరమెరా మెరిసిపోతున్నదంటే, అది ఎవరు చిందించిన రక్తంవల్ల అంటావు? 'సర్వశక్తిమంతుడు' అనే వాని గుండెలో ముల్లై ఉన్నది నేనే. ఈ వాస్తవం అతని భక్తుల కెప్పటికి తెలుస్తుంది? నీవెప్పుడూ దేవుడే గొప్ప, దేవుడే గొప్ప' అంటూ వాగుతుంటావు.

(బాలె - జబ్రీల్ నుంచి)

——

# ఒరియా

మూలం :
ఆచార్య వేణుధరరౌత్

అనువాదం :
శ్రీ పురిపండా అప్పలస్వామి

................................................................................................

## చారిత్రక సమీక్ష

### 1. ఒరియా వారి మొదటిదశ, వారి భాషా, సాహిత్యమూ.

భారతదేశంలోని సమస్తరాష్ట్రాలలో ఒరిస్సా ఒకటి దాని భాషా, సాహిత్యమూ ఒరియా. రకరకాల కులాలకూ, మతాలకూ, వర్గాలకూ, జాతులకుచెందిన ప్రజలు ఉంటున్నారిక్కడ. అయినా సుమారు రెండుకోట్ల మందికి ముఖ్యమైన భాష ఒరియా.

ఒరిస్సాకు మరొకపేరు ఉత్కలము. ఉత్కళింగానికి లేదా ఉత్తర కళింగానికి సంక్షిప్తనామం ఉత్కలము. ఏనాటినుంచో దాని ప్రాచీనతమ చరిత్రను బట్టి పురాణాలలోను, ఎన్నో కావ్యాలలోను, వ్యాస మహాభారతం బౌద్ధసాహిత్యం మొదలైన వాటిలోను కళింగదేశ ప్రశంస కనిపిస్తుంది.

ఏమైనా అశోకుడి కళింగదండయాత్రనుంచే, సుస్థిరమైన దాని పర్యవసానంవల్ల కళింగదేశ క్రమచరిత్ర ప్రారంభమవుతుంది. ధౌళి, జౌగడలలో అతడు వేయించిన శిలా శాసనాలు నేటికీ ఆయన హృదయనివేదనానికి సాక్ష్యాలుగా నిలిచిఉన్నాయి. క్రీ. పూ. రెండోశతాబ్దం నాటికే కళింగసామ్రాజ్యం మహోన్నతదశలో ఉన్నట్టు జైన మహాచక్రవర్తి ఖారవేలుడు ఖండగిరి – ఉదయగిరిలోని హాతీగుంఫ (Elephant Cave) లో వేయించిన శిలా లిపికూడా సాక్ష్యమిస్తున్నది. అదే శతాబ్దంలో గ్రీక్ భూగోళశాస్త్రజ్ఞులు కూడా కళింగాన్ని పేర్కొన్నారు. వారిలో టాలెమీ (Ptolemy) కళింగతీర సముద్రాన్ని వర్ణిస్తూ దాన్ని కళింగసాగరం అన్నాడు. క్రీ. శ నాలుగో శతాబ్దానికి చాలా పూర్వమే ఉత్కళింగం ఉత్కలంగా వాడుకలో ఉన్నట్టు కాళిదాసు మహాకావ్యం రఘువంశం తెలుపుతున్నది.

అశోకుడి శాసనాలలోను, ఖారవేలుడి శిలాశాసనాలలోను ఎన్నో ఒరియా ప్రాచీన శబ్దరూపాలు కనిపిస్తున్నాయి ఈ శిలాశాసనాలు సాధారణంగా పాలీ లేదా ప్రాకృత భాషలకు చెందినవి. ఖారవేలుడు జైనవేదికులానికి చెందినవాడు. మధుర లేదా శూరసేనదేశం జైనసంస్కృతికి ముఖ్యకేంద్రము. పాలీ సంపర్కమున్నా హాతీగుంఫ శాసనాలభాష శౌరసేని ప్రాకృతము. అలాగే అశోకుడి శాసనాలు మాగధీప్రాకృతానికి చెందినవి. రమారమి క్రీ.పూ. మూడోశతాబ్దంలో భరతుడు తననాట్యశాస్త్రంలో ఉద్రవిభాష అనేదానిని పేర్కొన్నాడు. పరస్పర వినిమయంవల్లా, సంపర్కంవల్లా పైనచెప్పిన పాలీప్రాకృతమూ, శౌరసేని ప్రాకృతమూ,

సంస్కృతమూ, ద్రావిడభాషా, మాగధి ప్రాకృతమూ - ఇవన్నీ కలిసి కళింగప్రాకృతం ఏర్పడింది. ఖారవేలుడి శాసనాల భాష ఈ విషయాన్నే స్థూలంగా నిరూపిస్తూంది ఈ శాసనాల భాషను కళింగప్రాకృతం మొదటిరూపంగా గ్రహించవచ్చు.

బౌద్ధసన్యాసులూ, భిక్షువులూ, శ్రమణులూ కళింగాన్ని తమ ముఖ్యకేంద్రంగా ఏర్పరుచుకున్నారు. ఇక్కడినుంచే వారు క్రీ. శ. మొదటిశతాబ్దం నుంచి ఏడో శతాబ్దం వరకు చైనా, సింహళమూ, బర్మా, భోటదేశమూ (టిబెట్) మొదలైన అనేక దూరదేశాలకు మతయాత్రలు సాగించారు. ఆ దేశాలలో బౌద్ధమతం ప్రచారం చేశారు. కళింగప్రాకృతం ఒక ప్రత్యేకమైన ప్రాంతీయభాషగా పరిణమించడానికి ఇవి ఎంతైనా ఉపకరించాయి.

లిపివిషయం - బుద్ధభగవానుడికి తెలిసిన అరవై నాలుగు లిపులలో ఉగ్రలిపి ఒకటని లలితవిస్తరం తెలుపుతున్నది. ఈ ఉగ్రలిపి ఉడ్రలిపి అయివుంటుందని చరిత్రకారుడు రాజేంద్రలాల్‌మిత్ర అభిప్రాయపడుతున్నాడు. కాని ఖారవేలుడి శిలాశాసనాలు బ్రాహ్మీలిపిలో ఉన్నాయి. అందుచేత ఉగ్రలిపి లేదా ఉడ్రలిపి ( ? ) నిజస్వరూపం తెలియడంలేదు. ఏమైనా పన్నెండో శతాబ్దం ప్రాంతంలో, అప్పుడు వ్యాప్తంలో ఉన్న నాగరిలిపి శాఖోపశాఖలయి, ఒకశాఖ ప్రత్యేక లిపిగా రూపొందింది. అది మారిమారి మూడువందల ఏళ్ళలో ఈనాటి ఒరియా లిపి స్వరూపానికి వచ్చింది.

క్రీ శ 638 ప్రాంతాన హుయేన్ సాంగ్ (Hieuntsang) కళింగానికీ, కళింగ ప్రాంతంలోని కోంగదానికీ వచ్చాడు. ఈ ప్రాంతాన్ని అతడు ఉచ (Ucha) అనిపేర్కొన్నాడు. కనక ఆనాటి భాష ఉద్రశౌరసేని అన్న పేరుతో ఉండి ఉంటుంది. అశోకుడి కాలంనుంచి లేదా భరతుడి కాలంనుంచి మాగధ ప్రాకృత ప్రభావం దాని మీద పడుతూ వచ్చి ఉంటుంది. ఇతర సమకాలీన ప్రాంతీయ భాషల లాగానే దీని పెరుగుదలా, పరిణామమూ సాగిఉంటాయి. మాగధి ప్రాకృతమూ, దాని అపభ్రంశమూ ప్రాంతీయభాషలలో క్రీ. శ. పదోశతాబ్దం వరకు ఉంటూవచ్చాయి. వాటి ప్రభావం, కళింగ ప్రాకృతం లేదా ఉద్రప్రాకృతం ప్రత్యేకభాషగా వృద్ధి పొందడానికి ఎంతైనా పనిచేసిందని నమ్ముతున్నారు.

క్రీ శ. 11, 12, శతాబ్దాల ప్రాంతాన ఉడప్రాకృతం ప్రత్యేక ఒరియా భాష రూపం ధరించిఉంటుంది. అయితే సంస్కృతభాషతోనూ, సాహిత్యంతోనూ నిరంతరం దీనికున్న సంపర్కమూ, వాటి ప్రభావమూ, విడతీయరానివని మరిచిపోకూడదు. 7,8-12,13 శతాబ్దాల మధ్య ఉత్తరమహాయాన శాఖకు చెందిన బౌద్ధసిద్ధాచార్యులు అపభ్రంశ భాషాభేదాల మాండలికరూపాలతో చర్యాపదాలు లేదా చర్యాగేయాలు వ్రాశారు. అవి నేపాల్‌లో దొరికాయి. అవి తమ తమ భాషల ప్రాచీన వాఙ్మయ స్వరూపాలని బెంగాలీవారూ, ఒరియావారూ, అస్సామీయులూ, మైథిలీవారూ ఒకేవిధంగా వాదిస్తున్నారు. పై భాషల వ్యాకరణాలూ. సారస్వత రూపాలూ మారుతూన్న కాలంలో వ్రాసినవి చర్యాపదాలు. అందుకని వాటిలో పై భాషల పోలికలు గాఢంగా ఉండటం సహజము. కనక వారి వాదన సహేతుకమే అనవచ్చు. అప్పటి కాహ్నుపాద (కృష్ణాచార్య) భుసుకుపాద, లుయిపాద, గరహపాద, మొదలైనవారి చర్యా పదాలలో ఉడ్రప్రాకృతం లేదా ఒరియా ఛాయలు నిస్సందేహంగాను, గాఢంగాను ఉన్నాయి ఈ విషయంలో డా॥ సునీతికుమార చటర్జీ ఇలాచెప్పుతున్నారు ;

"చర్యాపదకర్తలైన కొందరు ఉత్తరకాలిక మహాయాన బౌద్ధ 'సిద్ధాచార్య' రచయితలకు ఒరిస్సాతో సంబంధముంది. నిజానికి చర్యాపదాల భాష ప్రాచీనమై ఒరియా, అస్సామీ, బెంగాలీ భాషలకు బాగా చేరవగా ఉన్నట్లు మనం భావించవచ్చు. మాగధిమాండలికాలైన బెంగాలీ, అస్సామీ, ఒరియా భాషల కొన్ని ప్రత్యేక రూపాలు - ఉదా - భూత కాల క్రియాధాతుమూలం 'ఇల్' తోను భవిష్యత్కాల క్రియామూలం 'ఇబ్' తోను కనిపిస్తున్నాయి."

(The Oriya Language - The Early History. P. 20 of the Culture of Orissa, 1964 ).

## II. ఒరియా సాహిత్యము-గాంగయుగము (క్రీ. శ. 1042-1435)

చర్యాపదాలలో అంకురరూపంగా కనిపించే రచనలు తప్పిస్తే ఈ కాలంలో క్రీ. శ. పన్నెండో శతాబ్దానికి ముందు స్వతంత్ర రచన అని చెప్పదగింది ఒరియా భాషలో ఏదీలేదు. ఆకాలంలోనూ, తరవాత కాలంలోనూ వచ్చిన శిశువేదీ, సప్తాంగ, ఒరియాలో తొలి రచనలుగా కనిపిస్తాయి. వాటిలో మహాయాన శాఖకు చెందిన బౌద్ధభావనలూ, యోగమూ, శైవధర్మమూ మొదలైనవి కనబడతాయి.

గాంగుల కాలంనాటి ఒరియాభాషలో ఎన్నోవచన రచనలు, శాసనాలు కనిపిస్తాయి. ఈ సందర్భంలో అనంతవర్మ వజ్రహస్తదేవుని (క్రీ. శ. 1069 ) సేనాని అయిన మధురీయ వర్మభార్య గుండమనాయికాణి వేయించిన శాసనాలూ, బాలేశ్వరం జిల్లా రెముణాలో దొరికిన రెండో నరసింహదేవుని (క్రీ. శ. 1278 - 1305) తామ్రపట్టికలూ, మూడోనరసింహదేవుని (క్రీ. శ. 1328-1352) శిలాశాసనాలూ ఉదాహరించవచ్చు.

క్రీ. శ. పదిహేనోశతాబ్దం వరకు ఎన్నోవచన రచనలు వచ్చాయి. 'నాగులచతుర్థివ్రతకథ'. 'దామోదర ఒసా (నోము) కథ', 'ఖుదురుకుణి ఒసా కథ' మొదలైనవి కొన్ని వాటిలో మచ్చుకి చూపవచ్చు. వీటిలో కొన్ని ఒరియావారి ఆనాటి సముద్రయాన చర్యలూ, పూజాపద్ధతులూ, వైదిక సంప్రదాయాలూ సూచిస్తాయి.

కవిత్వానికి సంబంధించినంతవరకు పారలౌకిక విషయాలను అభివర్ణించే యోగి పదాలు, కలశాశాఖకు చెందిన చౌతిశాలు (ఒరియాలోని ముప్పయినాలుగు అక్షరాల ప్రకారం ముప్పయినాలుగు చరణాల పద్యరచన. వర్ణసమామ్నాయం వరసన ఒక్కొక్క చరణం మొదట ఒక్కొక్క అక్షరం ఉంటుంది.)-ఇవన్నీకూడా దేవతల కళ్యాణాలూ, పట్టాభిషేకాలూ వర్ణిస్తాయి. ఎనిమిది శుభ సాంకేతికాలలో కలశం మొట్టమొదటిది కనక దేవతాసంబంధం కల ఈ చౌతిశాలకు కలశానామం ఏర్పడి ఉంటుంది.

## III. ఒరియా సాహిత్యము-సూర్యవంశరాజులయుగము (క్రీ. శ. 1435-1568)

(అ) క్రీ. శ. సూర్యవంశం పదిహేనోశతాబ్దం మధ్య సూర్యవంశపురాజు కపిలేంద్రదేవు రాజ్యంచేసినప్పుడు సారళాదాసు మహాభారతం వ్రాశాడు. ప్రపంచంలోని మహావిస్తృతమైన గ్రంథాలలో ఇది ఒకటి. దీనిలోని సభాపర్వం ఒక్కటే ఇలియడ్ (Iliad) గ్రంథానికి ఏడెనిమిదింతలు ఉంటుంది. వ్యాసుడి సంస్కృత భారతంలాగే సారళాదాసు తన మహాభారతంలో పద్దెనిమిది పర్వాలు ఉంచాడు. కాని మూలకథలో ఎన్నో అన్ని మార్పులూ.

కూర్పులూ, చేర్పులూ, సవరణలూ చేశాడు. లెక్కలేని ఈ మార్పులవల్లా, చేర్పులవల్లా మూలంలోని కథాక్రమం వ్యత్యస్తమయింది. అయినా మూలకథను విరూపంచేసే కొత్తకల్పన జరగలేదు. పైగా తనసాటి జీవనవిధానాలూ, సాంఘిక ప్రవృత్తులూ కళ్ళకి కట్టినట్టు మనోజ్ఞంగా చిత్రించడం చేత సారళాదాసు మహాభారతం మరింత వన్నెకెక్కింది. యుద్ధాలతో, విజయాలతో నిండిన వాతావరణంలో జీవితపువిలువలలో వస్తున్న గొప్పమార్పులు సూచిస్తూ మహాభారతం పునస్సృష్టిచేశాడేమో సారళాదాసు అనిపిస్తుంది.

హిందీ రాసోసాహిత్యంలోలాగ సారళాదాసు మహాభారతంలోని రణరంగాలు ఒరియాయుద్ధ సాహిత్యంలో అమూల్యమైన రత్నాలు. ఆకాలంలో జీవించి ఉండి, కపిలేంద్రదేవు సాహసంతో సాగించిన సైనికదండయాత్రలతోను, మన విజయాలతోను తనకు ప్రత్యక్ష పరిచయం ఉండడంచేత యుద్ధదృశ్యాలు ఆవేశపూరితంగా, అతి సహజంగా భయానకరసం చిప్పిల్లేటట్టు చిత్రించ గలిగాడు సారళాదాసు.

అతడు తనపాత్రలన్నిటిలోను సామాన్య లక్షణాలూ, ఉదాత్తలక్షణాలూ, మానవలక్షణాలూ, దేవతాలక్షణాలూ మిళితం చేశాడు. అందుకని అవన్నీ ఒక విచిత్రకోణంలో కనిపిస్తాయి. అతడి ద్రౌపది మూలభారతంలోని ద్రౌపదికంటే హెచ్చుదివ్యాంశ కలది. లౌకిక జీవితంలో ఆమెకంటే హెచ్చు మానవాంశ కలది. వాల్మీకిరామాయణానికీ, కంబరామాయణానికీ ఉన్న తారతమ్యంలాగే మూలమహాభారతానికీ, సారళాదాసు మహాభారతానికీ తారతమ్యం ఉంటుంది.

తనకు ఉన్న విశాలమైన, నిశితమైన లోకానుభవంవల్ల సారళాదాసు మానవజీవితంలో అనేక విధానాలు - సాంఘిక ఆచారాలు - ప్రవృత్తులు - మతసంస్థలూ, మతాచారాలూ, వృత్తులూ, అభిమాన వ్యాపారాలూ, నమ్మకాలూ, శాస్త్రాలూ, నేరాలూ-నేర ప్రవృత్తిశాస్త్రమూ మొదలైనవాటిని గురించి వివరంగాను, వినోదాత్మకంగాను చిత్రించగలిగాడు. దీనికితోడు అతడి అమోఘమైన పాత్రచిత్రణ నైపుణ్యము, నీతిప్రధానమైన పద్యరచన, సరళమైనశైలి, ఉపమాలంకారం మొదలైనవాటి ప్రయోగము-ఇవన్నీ అతడి మహాభారతాన్ని మరవరాని మహాగ్రంథంగా తయారుచేశాయి. మొత్తంమీద సారళాదాసు మహాభారతం ఆనాటి ఒరిస్సా, భారతదేశాల బహుముఖమైన జీవితానికే విజ్ఞాన సర్వస్వంవంటిది.

ఇంతకీ ముఖ్యంగా ఈ మహాభారతం అంత్యానుప్రాసలేని ఛందస్సు (Blank Verse)లో వ్రాసి ఉంది. తొమ్మిది అక్షరాలు మొదలు, ముప్పయిరెండు అక్షరాల వరకు ఉంటాయి చరణాలు. ఏచరణమూ తొమ్మిది అక్షరాలకు తక్కువకాని, ముప్పయిరెండు అక్షరాలకు మించికాని ఉండదు. ఈనాటి నవ్యకవితలో అనిబద్ధకవిత్వంలాగ మాట్లాడుకునే శైలిలో దానిని చదవవలసి ఉంటుంది. అందుకని ఈనాటి అనిబద్ధకవిత్వానికి సారళా ఛందస్సు పూర్వరంగంగా వివరించవచ్చు. తరువాతి ఒరియాకవులను ఎంతో మందిని ఈ ఇతిహాసం (Epic) ప్రభావితం చేసింది.

సారళాదాసు తరవాత కల్పలత, రామవివాహ కావ్యాలు వ్రాసినదాసూ, ఉషావిలాస కావ్యం వ్రాసిన శిశుశంకర్‌వంటి కవులు ఒరియా రీతి కవితకు వైతాళికులు. ఒరియా గేయకవితలోని కోయిల్లి శాఖకు చెందిన నాటి గేయ కావ్యాలలో (Lyrical Poems)

మార్కండేయదాసు 'కేశవకోయిలి' ఎంతో జనాదరణ పొందింది. ఇందులో పుత్రవాత్సల్యం వియోగం, కరుణ చిరుగాలి తరగల్లా కదిలిస్తాయి. తరవాత కలశారీతిని అనుసరించి శివ పార్వతుల ప్రేమా, వారి పరిణయమూ మనోహరంగా వర్ణిస్తూ చాల్నాదాసు కూడా కలశా చౌతిశా వ్రాశాడు.

ఒరియా సారస్వతంలో గద్యస్వరూపం కపిలేంద్రదేవ, పురుషోత్తమదేవుల పత్రాలలో (Documents) స్పష్టంగా కనిపిస్తుంది. కానినిజానికి గణ్యమైన గద్యరచన నారాయణానంద అవధూత స్వామి లేఖినినుంచి వెలువడింది. అతడి గ్రంథం 'రుద్రసుధానిధి'. దీని భాషాశైలీ, ఇతివృత్తమూ-అన్నీ ఆనాటి మతభావాల-శైవతాంత్రికధర్మాల-వాతావరణానికి చెందినవి. బాణభట్టు గద్యమహాకావ్యం కాదంబరి లాగ దీనిలోని పద్యంవంటి గద్య, అలంకారికశైలి, వర్ణనలు, ఆకృతికల్పనలు ప్రత్యేకతను చాటి చెపుతున్నాయి.

(ఆ) పూరీలో అనాదికాలంనుంచీ జగన్నాథస్వామిని ఆరాధిస్తున్నారు. అన్ని మతాలవారూ, అన్ని జాతులవారూ వారి విభిన్న విశ్వాసాలు ఎలాఉన్నా-ఏకరీతిగానే ఆస్వామిని గౌరవిస్తున్నారు. జగన్నాథస్వామిని పురస్కరించుకుని ఒరిస్సాలో ప్రత్యేకమైన మత సంస్కృతి ఆవిర్భవించింది. భారతదేశంలోని వివిధమత విశ్వాసాల కలయికతో ఏర్పడిన మిశ్రితసంస్కృతి ఇది. ఎన్నెన్నోమతాల ప్రచారకులు వచ్చి, నిరాకార బ్రహ్మానికి చిహ్నమైన జగన్నాథస్వామికి తమ ఆరాధనలు అర్పించారు. క్రీ. శ. 1510 లో చైతన్యుడు పూరీ రాక ముందే ఒరియా వైష్ణవకవులు జ్ఞానమార్గానుయాయులు, ముఖ్యంగా నిరాకార యోగసిద్ధాంతం అనుసరించినవారు భక్తిసాహిత్యం సృష్టించడం మొదలు పెట్టారు. కాని క్రీ. శ. పదహారో శతాబ్దం నడుమ ఎన్నో సాహిత్యగ్రంథాలు వెలువడ్డాయి. అవన్నీ నిరాకారబ్రహ్మసిద్ధాంతాన్ని అనుసరిస్తూ ఆత్మశక్తిని గూర్చిన ఇతివృత్తాలు, యోగపద్ధతులపై శరీరప్రవృత్తుల్ని నిగ్రహించడం, స్వాధీనం చేసుకోడం మొదలైనవి ప్రతిపాదిస్తూ ఉంటాయి. ఈ యుగంలో బలరామ, అచ్యుత, యశోవంత. అనంత, జగన్నాథులు సుప్రసిద్ధ వైష్ణవ కవులు. ఈ అయిదుగురి మూలాన ఈ యుగానికి 'పంచసఖాయుగం' అని మారుపేరు వచ్చింది. వారి రచనల్లో అచ్యుతుని 'సూర్యసంహిత', హరివంశం'; బలరాముని జగమోహనరామాయణం; మిగిలినకవుల అసంఖ్యమైన భక్తిగీతాలు ఎన్నదగినవి. కాని ఆనాటి సాహిత్య గ్రంథాలలో జగన్నాథకవి భాగవతం అత్యంత ప్రధానమైంది. సంస్కృత భాగవతాన్నే అనుసరించినా ఈ గొప్ప రచనలో భాషాశైలీ, కథాకథన విధానమూ సంస్కృత భాగవతానికి ఒక కొత్తరూపం కల్పించాయి. జగన్నాథ భాగవత లో ప్రసన్నమైన కవితాధార, నివృత్తి ప్రధానమైన విలువలమీద ఏర్పడిన ఇతివృత్తాలు, వాటిపై గంభీరమైన విచారధారలు, స్పష్టమైన సంభాషణాత్మకశైలి - తొమ్మిది అక్షరాల పరిమితిగల ఛందస్సులో ఇవన్నీ ప్రతిఫలించడం చూస్తే ఇది ఒక స్వతంత్రరచన అనే భ్రమకలుగుతుంది. ఒరియా సాహిత్యవిపణిలో దీనికీర్తి ఎన్నడూ మార్పులకు గురికాలేదు. జగన్నాథదాసు భాగవతం ఒరిస్సాదేశీయుల జీవితంలో శాశ్వతమైన స్థానం సంపాదించుకుంది. అది ఆవిర్భవించిననాటినుంచీ ఒరిస్సా ప్రజల ధార్మిక, నైతిక భక్తిజీవితాన్ని అనుశాసిస్తూ మార్గదర్శకంగా నిలిచింది. కాలాంతరాన అది వారి సాంఘిక జీవితంలో కూడా ప్రవేశించి భాగవత గృహం అనే నూతనవ్యవస్థ ఏర్పడ

డానికి దోహదం చేసింది. ఈ భాగవత గృహాలు నిత్యభాగవత పఠనలకోసం ఒరిస్సాలో ఊరూరా ఏర్పడ్డాయి. నైతిక సంక్షోభం వ్యాపించిన ఈ దినాల్లో కూడా ఈ భాగవత గృహాలు మానవత్వానికి పెట్టనికోటలుగా విరాజిల్లుతున్నాయి. జగన్నాథ భాగవతం ఒరియా సాహిత్యంలో ఎన్నటికీ మాసిపోకుండా నిలిచే నవ్యసృష్టి.

## V. ఒరియా సాహిత్యము - మహమ్మదీయ యుగము (క్రీ. శ. 1568-1757)

ఒరిస్సా చివరి చక్రవర్తి ముకుందదేవ గజపతి కాలం చేశాక 1568 లో భోయి వంశం రాజులు ఒరిస్సా పరిపాలకులయారు. దేశం మొగలుల అధీనం అయింది. ఈ భోయి వంశం కీర్తిప్రతిష్ఠలు సంరక్షించడానికీ, గజపతుల వంశంతో ఈ వంశం తక్కువ కాదని నిరూపించడానికి ప్రసిద్ధమైన మాదలాపంజి రచన మొదలయింది. ఇది విస్తృతమైన గెజిటేర్ (Gazetteer) వంటిదనవచ్చును. జగన్నాథదేవాలయంలోని పూజాపునస్కారాల వివరాలు గజపతిరాజుల కార్యకలాపాలు, దినచర్యలు ఇందులో పూసగుచ్చినట్టు వ్రాసే వారు. దీనిలో భాష పదహారో శతాబ్దం నాటిది. కొద్ది మార్పులతో ఇప్పటికి ఆదే కొన సాగుతూ ఉంది అందుచేత భాషావేత్తలకు అది ఎంతోముఖ్యమైంది.

"రఘునాథవిలాస" మొదలైన గ్రంథాలు వ్రాసిన ధనంజయభంజ్ (1611-1701) కవిసమ్రాట్ ఉపేంద్రభంజ్ (1675-1720) తాతగారు. ధనంజయభంజ్ ఒరియా రీతి కావ్యారంభకులలో ఒకడు. ఆ కాలంలోనే ఉన్న లోకనాథ విద్యాధర మంచి కవి చాలాకావ్యాలు వ్రాశాడితడు. వాటిలో "నీలాద్రిమహోత్సవ" బాగా పేరుపొందింది. మహాలక్ష్మీ, జగన్నాథస్వాములు ఇందులో నాయికానాయకులు. నిత్యజీవితంలో మనకు తారసిల్లే వారిగానే వీరిని చిత్రించాడు కవి. రమణీయమైన కల్పనలవల్లా, ధారాళమైన శైలివల్లా ధనంజయ భంజ్, లోకనాథవిద్యాధరుల కావ్యాలు ఆసక్తితో చదువుతారు పాఠకులు.

ఈ కాలంలో మంచి పేరు గడించిన కవి భూపతి పండితుడు. పశ్చిమ ప్రాంతం నుంచి వచ్చి ఒరిస్సాలో స్థిరపడిన వాడితడు. ఒరిస్సా వచ్చాకనే ఇతడు ఒరియా నేర్చు కున్నాడు అయినా భాషమీద అతడికున్న ప్రభుత్వము, శైలిలో అతడు సాధించిన సారళ్యము అతడి ప్రేమ పంచామృత కావ్యంలో మనకు కనిపిస్తాయి దేవదుర్లభదాసు "రహస్యమంజరి"లో లాగ వైష్ణవ సంప్రదాయాలే ప్రేమ పంచామృతలో కూడా చోటు చేసుకున్నాయి.

ఈ కాలంలోని దీనకృష్ణదాసు కవిసమ్రాట్టు ఉపేంద్రభంజుతో సరిపోల్చదగిన కవి. ఎన్నో కావ్యాలు వ్రాశాడితడు. ఇతడి బృహత్కావ్యం "రసవినోద". ఇందులో దారిద్ర్యం, దైన్యం, కష్టం గొప్పగా చిత్రించాడు కవి. "ఆర్తత్రాణచౌతిశా" వంటి చౌతిశాలు కూడా అనేకం వ్రాశాడు దీనకృష్ణదాసు. ఇతడి "రసకల్లోల" మంచి పేరు గడించింది. ఈ కావ్యంలో శ్రీకృష్ణుడు జగన్నాథస్వామి అవతారంగా జన్మిస్తాడు. బృందావనంలో శ్రీకృష్ణుడి బాల్యవిహారం, గోపికల ప్రేమ భక్తి ప్రధానంగా చిత్రించాడు కవి. అతడి ప్రకృతివర్ణనా, ఋతుశోభాచిత్రణ తరువాతి కవులకు ఒరవడిపెట్టాయి.

ఒరియాలో రీతివాదం సంస్కృత రీతివాదానికి నకలుకాదు. అన్ని మంచి

అనుసరణం లాగే సంస్కృత సంప్రదాయాలనుంచి వేరుపడి ఒరియా సాహిత్యం తన ప్రత్యేకతను నిలుపుకుంది. సంస్కృతంలోని అలంకారం, వక్రోక్తి, ధ్వని - వీటి సమ్మేళనమే ఒరియా రీతివాదం. సంస్కృత సంప్రదాయంలో ఒక ప్రత్యేకమైన అభిరుచి చూపించారు ఒరియా రీతికవులు. ఈ కాలంలోని కావ్యాలన్నిటిలో రసమే ప్రధానం. అలంకారాలు, శైలి అప్రధానం

ఉపేంద్రభంజ్ ఈ కావ్యయుగానికి సమ్రాట్టు. భాష, శైలి, ఉపమానాలు, కల్పనలు, గంభీరమైన - విస్తారమైన జ్ఞానమూ, కవిత్వపటుత్వమూ, యుక్తి వైచిత్ర్యమూ - ఈ అన్నిటిలో ఇతడు శ్రీహర్షుడికి సాటైనవాడు. ఇంచుమించు అరవై, డెబ్బయి కావ్యాలు వ్రాశాడు ఉపేంద్రభంజ్. ఇతడికి అనన్యసామాన్యమైన భాషాప్రభుత్వముంది. భాషనితడు శ్రావ్యంగా వాడాడేకాని కథావస్తువు పాడయేలాగ భాషతో కసరత్తులు చెయ్యలేదు. పైగా ఇతడి భాష కథావస్తువుకు దోహదం చేసింది. ఒకే అక్షరం ప్రతి చరణం మొదటా ఉంచి ఎన్నో కావ్యాలు వ్రాశాడు ఉపేంద్రభంజ్. వాటిలో "సుభద్రా పరిణయ" "స" వర్ణంతోను, "బైదేహీశవిలాస" "బ" వర్ణంతోను "కళాకౌతుక" "క" వర్ణంతోను వ్రాశాడు. అతడి "లావణ్యవతి", "కోటిబ్రహ్మాండ సుందరి" కావ్యాలు చాలా గొప్పవి. అతడి శైలి నాటకీయమైంది.

గౌడీయవైష్ణవుల ప్రేమభక్తిని వర్ణిస్తూ అనేకమైన ఇతర కావ్యాలు కూడా ఆ కాలంలో వచ్చాయి. వాటిలో బృందావతిదాసి వ్రాసిన "పూర్ణతమ చంద్రోదయ" ఒకటి. బృందావతిదాసి ఒరియాలో మొదటి కవయిత్రి. వైష్ణవకవులలో పేరుపడ్డ మరొక కవి సదానంద కవి సూర్యబ్రహ్మ.

పైవారితో పాటు విశ్వనాథఖుంటియా లేదా కేశవ పట్నాయక్ వంటి 'రామ పంథి కవులు గేయరామాయణాలు వ్రాశారు. అవి రామలీలా నృత్యప్రదర్శనలలో ఉపయోగపడేవి.

ఉపేంద్రభంజ్ వంటి కవుల కావ్యధారలో నుంచే సరైన వచన రచన అభివృద్ధికి వచ్చింది. సోమనాథవ్రత కథ, శివదాసు బత్రిస్ సింహాసన వీటిలో పేరు పడ్డాయి. వీటి భాషా, శైలీ వెనుకటి కావ్యాలలో వాటికంటే సరళమైనవి.

## V ఒరియా సాహిత్యము - మహారాష్ట్ర యుగము (క్రీ. శ. 1751 - 1803)

ప్రగాఢమైన ఉపేంద్రభంజ్ ప్రభావమూ, వైష్ణవభక్తి ప్రవాహమూ ఈయుగంలో ముఖ్యమైనవి. ఈ కాలంలో వ్యంగ్యరచన కొత్తగా తలెత్తింది. వ్యంగ్యరచయితలలో చక్రపాణి, బలదేవ, జదుమణి సుప్రసిద్ధులు. వీరు రాణీ నిశ్శంకరే, బ్రిజనాథ్ బడజనా మొదలైన వారితోపాటు మంచి కావ్యాలుకూడా వ్రాశారు. వారి మార్గానవారు ప్రసిద్ధులే అయినా వారి రచనల మీద ఉపేంద్రభంజ్ ప్రభావం ఎంతైనా ఉంది. వీరిలో బ్రిజనాథ్ బడజనా తన యుద్ధ కవిత్వం 'సమరతరంగ'లో మంచిపేరు సంపాదించాడు. ఉపేంద్రభంజ్ లాగ ఇతడు కూడా తన 'అంబికావిలాస' కావ్యంలో ప్రతి చరణం మొదట

'అ' కారం పెట్టి వ్రాశాడు. ఇవేకాక 'చతురవినోద' అని వచనకావ్యం కూడా వ్రాశాడితడు.

కవితలో - కోయిలి, భజన, పోయి, చౌపది చౌతిశా — ఇవన్నీ ఒరియా గేయకవితలో ఒక పాయిగా ప్రవహించినా బనమాలి, బలదేవ, గోపాలకృష్ణులు సక్రమమైన దాని గతిని నిర్దేశించారు.

ఈ కాలంలోనివాడే అభిమన్యుసామంత సింహార్. మంచి కవీ, గొప్పపండితుడున్నూ ఇతడు. ఇతడు శ్రీహర్ష, ఉపేంద్రభంజుల్నీ అనుసరించాడు. అయినా ఇతని 'బిదగ్ధచింతామణి' రీతిసంప్రదాయ కావ్యాలలో స్వతంత్రమైన పోకడలు పోయింది. కవి సూర్యసదానంద బ్రహ్మ ఇతని గురువు. వైష్ణవప్రభావం ఇతడి మీదకి గురువుగారి వల్లే వచ్చింది. బిదగ్ధచింతామణి రీతికావ్యపద్ధతికీ, ప్రేమభక్తికీ చక్కని మేళవింపు.

భక్తచరణ (1748 - 1805) మరొక గొప్పకవి. ఇతడి మొదటి కావ్యం 'మన బోధ చౌతిశా' జగన్నాథభక్తి ప్రతిపాదిస్తుంది. ఇతడు తరవాత వ్రాసిన 'మథురామంగళ' కావ్యం ప్రేమభక్తికి ఎంతో పేరుపడింది. ఇందులో పాండిత్యం తొణికిసలాడుతుంది.

ఈ కాలంలోనే కృష్ణసింగ్ మహాభారతం వ్రాశాడు. విశ్వంభరదాసు వ్రాసిన 'విచిత్రభారతం' కూడా పేర్కొనదగినది. మహాభారతకథ జనానికి అభినయం ద్వారా తెలుపుతుంది. 'విచిత్రరామాయణమూ', 'రామలీలామృతమూ', 'కృష్ణలీలామృతమూ', ఈ కోవలోనివే.

## IV, ఒరియాసాహిత్యము - బ్రిటిష్ యుగము (క్రీ. శ. 1803 - 1947)

పందొమ్మిదో శతాబ్దం పూర్వార్థంలో ఉన్నకవి కవిసూర్య బలదేవరథ. జదుమణీ, చక్రపాణి అతని సమకాలికులు. ఒరియాసాహిత్యంలో చంపూకావ్యాలకు బలదేవరథ మార్గదర్శి. అతడి 'కిశోరచంద్రానన' చంపూ, జయదేవుడి 'గీతగోవిందమూ' ఇతివృత్తంలో ఒక్కటే అయినా, కావ్యగుణంలో, కవితాసౌందర్యంలో గీతగోవిందం కంటే కిశోరచంద్రానన చంపు గొప్పది. భాషకు బలదేవరథ బానిస కాడు, ప్రభువు. అందుకనే అతడి రచనలు ఒరియాభాషలోను, సాహిత్యంలోను చెప్పుకోదగిన మైలురాళ్ళు కాగలిగాయి. అతడి చిన్నచిన్న గేయాలూ, భక్తిగీతాలూ బాగా ప్రచారంలోకి వచ్చాయి. అవి ఒరియా సంగీతంలో శాస్త్రీయ పద్ధతిని ప్రవేశపెట్టాయి. ఒరిస్సా అంతటా వాటిని గానం చేస్తారు. గోపాలకృష్ణ (క్రీ. శ. 1786 - 1856) ఆనాటి ఒరియా పదకవితలో ఒక మైలురాయి. వెనుకటి వైష్ణవ భావాలు బాగా అతణ్ణి ప్రభావితం చేశాయి. అయినా అతడి పదావళిలో ప్రతిపదమూ ఉన్నతమైన భావావేశంతో ఉద్ధూత లూపుతుంది. ఒరియా పదకవితకు మార్గదర్శి గోపాలకృష్ణ.

వెనకటియుగంనాటి రీతిసంప్రదాయం పందొమ్మిదోశతాబ్దం పూర్వభాగంవరకు కవి సూర్యబలదేవరథ 'చంద్రకళ, జదుమణి 'ప్రబంధపూర్ణచంద్రోదయ' వంటి ప్రసిద్ధ కావ్యాలలో సాగుతూనేవచ్చింది. ముఖ్యంగా చెప్పదగిందేమంటే ఒరియా రీతివాదసాహిత్యంలో ప్రసిద్ధమైన ఉత్తమకావ్యాలు నాలుగువందలకు పైగానే వెలువడ్డాయి. అవన్నీ హిందీలోని జాయసీ

వ్రాసిన 'పద్మావతి' కావ్యం కోవకు చెందినవే. ఒరియా సాహిత్యంలో ఆధునికభావన సరిగ్గా క్రీ. శ. 1870 లో ప్రవేశించింది. రాధానాథ, మధుసూధనుల కవితావళులు 1870 లో వెలువడ్డాయి ఎన్నో మాసపత్రికలూ ఆవిర్భవించాయి. వాటిలో కేవలం సారస్వతపత్రిక 'ఉత్కల దర్పణం'. ఇది క్రీ. శ. 1873 లో వెలువడింది. ఈ కాలంలోనే జగమోహన్ తన 'బాబాజీ' నాటకం వ్రాశాడు. ఆ దినాల్లోనే రామశంకర్ సౌదామిని' నవల వచ్చింది. ఒరియాలో మొట్ట మొదటి నవలఅది. అప్పుడే పాఠ్యగ్రంథరచనకు ఉపక్రమించడం ఒకముఖ్యవిషయం. కవులు గ్రంథకర్తలు, వ్యాసరచయితలు వివిధ సారస్వతశాఖలలో తమతమ ప్రయత్నాలు సాగించారు. డెబ్బయ్యేళ్ళ ఇంగ్లీషు ప్రభావం ఇప్పుడు సృజనాత్మకమైన కొత్త సాహిత్యసృష్టికి దోహదంచేసింది. పాశ్చాత్యభావరీతులు ఉదారమైన ఒరియా సాంప్రదాయంతోకలిసి నవీనమైన దేశీయ సాహిత్యపరిణామానికి దారితీశాయి. ఈ నవ్యపరిణామం ఆమోదం గడించుకుంది. రాధానాథ్ (క్రీ. శ. 1848-1908) ఒరియా సాహిత్యంలో కొత్తప్రయోగాలు చేశాడు, కృత కృత్యుడయాడు, ముందుకు దూసుకుపోయాడు.

చివరి రీతివాద కవులలో అగ్రగణ్యుడు భీమాభోయి. ఆనాటి మహిమామతావలంబి ఇతడు. సహజగేయకవిగా ప్రసిద్ధుడు భీమాభోయి.

అభిమన్యు సామంత సింహార్‌లాగే సూక్ష్మబుద్ధికల పండితుడు రాధానాథ్. ఎన్నో ఇతర భాషలు కూలంకషంగా అభ్యసించాడు. ఎన్నో సాహిత్యాలు మథించి అగాధమైన పాండిత్యం గడించాడు. గ్రీక్ పురాణగాథలువంటి ఇతరదేశ గాథలు తీసుకుని వాటిలో ఒరియా వాతావరణం, చారిత్రక భూమికలు చొప్పించి, అవి కేవలం ఒరియావారివే అనిపించే టంత చక్కగా మలిచిన సమర్థుడీయన. ఈయన రచనలన్నిటిలోను దేశభక్తి, జాతీయతా తొణికిసలాడుతూ ఉంటాయి. ప్రకృతి వర్ణన వీటిలో ఎక్కువపాలు. అదే రాధానాథ్ రచనలో గొప్పగుణం కూడా. ఈ దృష్టితో పరికించినప్పుడు ఇతని 'చిలికా' ఎంతో గొప్ప కావ్యం. 'మహాయాత్రా', 'నందికేశ్వరీ', 'పార్వతీ' మొదలైనవి సర్వోత్కృష్టమైన కావ్యాలు. రాధానాథ్ కవితాశక్తిని ప్రశంసించినప్పుడు ముఖ్యంగా చారిత్రక సంఘటనలకూ, వ్యక్తులకూ అతని కావ్యాలు కల్పించిన సరికొత్తదనం మరచిపోకూడదు.

రాధానాథ్ శిష్యుడు మధుసూదనరావు (క్రీ. శ. 1853-1912) తాత్త్వికకవి. భక్తిభావం, ఆధ్యాత్మికవాదం, నైతికతత్వం ఇతనికవితలో కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. వేదాల, ఉపనిషత్తుల కాలంనాటి వైజ్ఞానిక, ఆధ్యాత్మిక వాతావరణం, హైందవ తత్త్వవేత్తల జీవితాలు, వారి ఘనకార్యాలు ఇతని రచనలలో ప్రత్యేకంగా చోటుచేసుకున్నాయి.

ఈ కాలంలోని కవే గంగాధరమెహర్ (క్రీ. శ. 1867-1924). భంజ్‌సాహిత్యంలోని ఆలంకారిక మార్గమూ, రాధానాథ్‌లోని ప్రకృతివర్ణనా పద్ధతీ - రెండూ అనుసరించాడు మెహర్. కాళిదాసు కల్పనలు, సజీవమైన ఆతని ప్రకృతివర్ణనలు కూడా అనుసరించాడితడు. ఇన్ని ప్రభావాలు తనమీదఉన్నా తనదిగా ఒకప్రత్యేకమైనశైలి కుదుర్చుకున్నాడు. అందుచేతనే ప్రజాభిమానం బాగా సంపాదించిన ఒరియా కవులలో ప్రత్యేకమైనస్థానం గడించుకున్నాడు.

'పల్లీకవి' అనిపేరు సంపాదించిన నందకిశోరబల (క్రీ. శ. 1875-1928) ఒరియా పల్లెజీవితం, అతిసామాన్యమైన సంఘటనలు, సాంఘిక పరిస్థితులు తన కవితావస్తువులుగా స్వీకరించాడు. తీయని తేటపదాలతో ఇతని పాటలు తేనెలూరుతూ ఉంటాయి.

అనాటి సాహిత్యయోధులలో ప్రముఖుడు ఫకీర్ మోహన్ సేనాపతి (క్రీ.శ. 1843-1918). తన ఏభయ్యో పడిలో ముఖ్యమైన రచనలావరింపాడీయన. ఎన్నో చిన్నచిన్న కథల తోపాటు ఈయన నవలలు 'ఛమాణా అఠగుంఠ', 'మాము', 'ప్రాయశ్చిత్త' ఈనాడు కూడా ఒరియా సాహిత్యంలో ఎంతో ప్రతిభావంతంగా నిలచి ఉన్నాయి. వివిధమైన మొగమాటాలకి లోబడని రచయిత సేనాపతి. ఇతనిదృష్టి అపారమైంది. నుడికారం శక్తిమంతమైంది. నిశిత మైన హాస్యానికి ఇతనికితనే సాటి. సృజనాత్మకమైన ఇతని రచనలలో సమకాలిక జీవితమూ, సంఘమూ చక్కగా ప్రతిఫలించాయి. సేనాపతి 'ఆత్మజీవనచరిత' సార్థకమైన రచన. కెంవురుర ఘుంయా విప్లవంలో చావుబ్రతుకులమధ్య ఫకీర్ మోహన్ అనుభవాలు అద్వితీయ మైనవి. ఆధునిక భారతీయ గ్రంథకర్తలలో ఎక్కడో కాని కనపడవవి.

ఆ కాలంలో రామశంకర్, ఉమేష్చంద్ర మొదలైన నవలా రచయితలు ఎందరో రంగంలోకి వచ్చారు. వారిలో రామశంకర్ సరైన ఒరియా నాటకం సృష్టించాడు. కొద్ది నాటకాలు సంస్కృత పద్ధతినే వ్రాసినా, సాంఘిక నాటకాలలో మాత్రం తన ప్రత్యేకత ప్రదర్శించాడు రామశంకర్. కొలాపడామహంతు సహాయ ప్రోత్సాహాలతో అధికంగా రంగస్థలంమీద నాటకాలు ప్రదర్శించా డితడు. ఇరవయ్యో శతాబ్దం తొలి దశాబ్దంలో నాటక కర్త అశ్వినీకుమార్ ఎన్నో చారిత్రకనాటకాలు వ్రాశాడు. బళంగాలో బనమాలిపతి స్థాపించిన నాటకశాలలో అశ్వినీకుమార్ నాటకాలు ప్రదర్శించాడు.

క్రీ. శ. 1910-1925 మధ్య ఉత్కలమణి గోపబంధు (క్రీ. శ. 1876-1928) నాయకత్వంకింద సత్యబాది జాతీయవనవిద్యాలయం ప్రాచీన గురుకులపద్ధతిని ఒరిస్సాలో ముఖ్యమైనపాత్ర నభినయించింది. విదేశీయుల పెత్తనంఅంటే అసంతృప్తి, జాతీయ-అభినివేశం అంటే అనురక్తి-వీటితో నిండిన వాతావరణం ఈ సత్యబాదిగురుకులం జాతీయసంగ్రామానికి సైనికుల్ని సిద్ధంచేయడంకోసం సాహిత్యంకూడా సృష్టించి కృతకృత్యురాలయింది.

జాతీయకార్యక్రమమే ఏర్పరుచుకోడానికి మేధావులైన యువకుల్ని ఎందరినో ప్రేరేపించాడు గోపబంధు. అతనిగీతాలు జాతీయభావాలతోనిండి, తీవ్రమైన దేశభక్తితో తొణికిసలాడుతూ ఉంటాయి. తరవాతి కవుల నెందరికో స్ఫూర్తినిచ్చాయవి. సార్థకమైన వచనరచన కావాలని యువరచయితలను ఉద్బోధించాడు గోపబంధు. స్వయంగా చెయ్యి తిరిగిన గద్యరచయిత అతను. చక్కని శైలికీ, స్పష్టమైన భావాలకీ, విశాలమూ గాఢమూ అయిన కల్పనాశక్తికీ పేరుపడ్డా డాయన. నిజానికి ఆధునిక గద్యరచనకు మార్గదర్శకుడు గోపబంధు. ఆయన సహకారి నీలకంఠ గొప్ప సంస్కరణవాది. జాతీయ రచయిత. అతడు మంచి కవి అని అతడి "కోణార్కే" కావ్యం తెలుపుతుంది. మధుసూదనరావు గాంభీర్యం, ఫకీర్ మోహన్ తీవ్రత, గోపబంధు విస్పష్టత నీలకంఠదాసు శైలిలో మిళిత మయాయి. విమర్శకుడిగా కూడా ఒరియాసారస్వతంలో నీలకంఠకు ప్రత్యేకమైన స్థాన ముంది. మిగిలిన సమకాలిక రచయితలలో గోదావరీశ్ మిశ్ర నవలా రచయిత, నాటక కర్త, గేయకవి.

కవయిత్రి కుంతలా కుమారి రచనలలో జాతీయ భావప్రాబల్యం సాహిత్యపరంగా శిఖరాగ్రమందుకుంది. ఆమె కావ్యాలలో 'స్ఫులింగ', 'ఆహ్వాన' దీనికి మంచి మచ్చుతున

కలు ఈ కావ్యాలలోను, ఆమె నవలలలోను గాంధేయ భావనలు, ఆదర్శాలూ ప్రతిబింబించాయి.

క్రీ. శ. 1925 తరవాత శతాబ్దం సబూజ సమితికవులను సృష్టించింది. ఒరియా సాహిత్యానికి కాల్పనిక నవ్యరూపమిచ్చిన వైకుంఠనాథ్, కాళిందీచరణ్, అన్నదా శంకర్ మొదలైనవారు బెంగాలీ సబూజ కవులనూ, రవీంద్రనాథ్ ఠాకూర్‌నూ అనుసరించారు. అయితే ఛందస్సులోను, కావ్యగమనంలోను ఎన్నో మార్పులు తెచ్చారు, కాని కొత్తజీవన మేదీ సాహిత్యంలో నింపలేకపోయారు. అయినా వారి రచనలలో వైకుంఠనాథ్ తాత్వికపరమైన గేయాలూ, కాళిందీచరణ్ కథలూ, అతని ప్రసిద్ధమైన నవల 'మట్టిమనుషులూ' పేర్కొనదగినవి. మట్టిమనుషులు గాంధేయ తత్వం మీద ఆధారపడిన నవల.

పూర్తిగా సబూజ సమితికి చెందకపోయినా ప్రేమతోను సౌందర్యంతోను కూడిన కాల్పనిక కవిత్వానికి ప్రత్యేకంగా పేర్కొనదగిన కవి మాయాధర మానసింగ్. ఈయనే కాక ఇలా చెప్పదగిన కవులు అనంతపట్నాయక్, రాధామోహన్ గడనాయక్, కుంజబిహారీ దాస్, నాటకకర్త కాళీచరణ్, గేయనాట్యకారుడు (Opera writer) వైష్ణవపాణి, నవలా రచయితలు కాహ్నుచరణ్, రాజకిశోర్ పట్నాయక్, నిత్యానంద మహాపాత్ర, గాంధీజాతీయోద్యమం ఆధారంగా నవలలు చిత్రించడంలో పేరుపడ్డ హరేకృష్ణమహతాబ్ కూడా ఉన్నారు. కథారచయితలలో రాజకిశోర రాయ్, రాజకిశోరపట్నాయక్, సచ్చిదానంద మొదలైనవారు ఎందరో ఉన్నారు. ఒరియాసాహిత్యంలో సుమారు ఇరవయ్యేళ్ళ పాటు ప్రాబల్యం వహించారు వీరు.

పందొమ్మిదో శతాబ్దం ఉత్తరార్థంనుంచి బిశ్వనాథకర్, మృత్యుంజయరథ్, శశిభూషణరాయ్ నీలకంఠ, రత్నాకరపతి, కాళిందీచరణ్, మాయాధరవంటి వ్యాసకర్తలు ఎంతో మంది వచ్చారు. ఆలోచనలు రేకెత్తించే ఎన్నో వ్యాసాలు వ్రాశారు. విమర్శనారంగంలో గోపీనాథనంద, ఆర్తవల్లభమహాంతి, కుంజబిహారీదాస్, గౌరీకుమారబ్రహ్మ, సురేంద్రమహాంతి చిత్తరంజనదాస్, నటబరసామంతరాయ్, వేణుధరరౌత్, చింతామణి బెహరా మొదలైనవారు చెప్పదగినవారు.

## VII. ఒరియా సాహిత్యము-స్వాతంత్ర్య-అనంతరయుగము (1947 నుంచి)

జాతీయసంగ్రామ కాలంలోను ముఖ్యంగా స్వాతంత్ర్యం లభించిన తరవాతా ఒరియా సాహిత్యం బ్రహ్మాండమైన మార్పులు పొందింది. నాటక సాహిత్యంలోనూ దాంతో పాటు నాటకరంగంలోనూ కలిగిన అభివృద్ధి అపారమైంది. అయితే కథాసాహిత్యంలోను, నవలా సాహిత్యంలోను వచ్చిన అభివృద్ధి అంతకంటే అధికమైంది. కవితారంగంలో కలిగిన మార్పు అన్నిటికంటే అధికం. పాశ్చాత్యుల ఆధునిక దృష్టి ఇక్కడ ఆదర్శమయింది. దాని ఫలితంగా ఈ సాహిత్యం ముఖ్యంగా అందులో కవిత్వం ఆదినుంచీ పారంపర్యంగా వస్తున్న భావాలతో సంబంధం లేకుండా పోయింది. ఏ రచయితా కూడా ఈ కాలంలో వెనుకటి కవులలో సామాన్య కవి పొందినంత జనాదరణకూడా కనీసం పొందలేకపోయాడు. ఇప్పటి రచయితలు ఇంగ్లీషుచదువుకున్నవారో, లేదా మైతరగతిబుద్ధిజీవుల సంఘంనుంచి వచ్చినవారో కావడంచేత సామాన్య ప్రజానీకాన్ని సుతరామూ ఆకర్షించలేకపోతున్నారు. ఈ పరిస్థితిలో ప్రాచీనసాహిత్యమే ఇప్పటికీ ప్రజల్లో ఆదరణ పొందుతూ ఉంది. దీనికి గాయకరత్న

హరినాథ్‌వంటి "పాలా" గాయకుల ప్రోత్సాహం ఎంతైనా ఉంది. వాద్యాలతోను, సంగీతం తోను ప్రజలముందు ప్రాచీన సాహిత్యాన్ని చక్కగా చర్చిస్తూ ప్రదర్శిస్తున్నారు వీరు. ఇలాగే గణకవి వైష్ణవపాణి వీధి నాటకాలు, యాత్రలు (యక్షగానాలు) ఈనాడుకూడా లక్షలాది ప్రజల హృదయాలను ఆకట్టుకుంటున్నాయి. అభివృద్ధికి వచ్చిన రంగస్థలంమీద కూడా ఆధునిక నాటకాలు తరుచు అలా చెయ్యలేకపోతున్నాయి. దీనికి ముఖ్యమైన కారణం పాశ్చాత్యభావాలను అనుకరించడమే. ఇంచుమించు ప్రపంచం అన్నిభాగాలలోనూ జీవిత వైవిధ్యాలూ, నిగూఢమైన మానవ మనస్తత్వాలూ, జీవన సంక్షోభాలూ ఎన్నో అన్ని సమస్యల్ని రచయితలమీద రుద్దుతున్నాయి; సందేహంలేదు. అయితే మనదేశపరిస్థితుల దృష్ట్యా పాశ్చాత్య నాగరికత ప్రాతిపదికగా ప్రాచీన సాహిత్యం లోపభూయిష్ఠం కాకతప్పదు. ఇది భారతదేశం అంతటికీ వర్తిస్తుంది. వైదేశిక సాహిత్యలక్షణాలు పరాక్రమిస్తున్న నవతావ్యామోహం సాహిత్యంనుంచి పఠితలను వేరుచేయడం సంభవమనిపిస్తుంది. ప్రయోగం ఆసక్తికలిగిస్తుంది.

ఈ కోణంనుంచి పరికిస్తే ఒరియా కవితలో ఈ నవ్యతను ప్రవేశపెట్టినవారిలో సచ్చిదానందరౌతరాయ్ అగ్రగణ్యుడు. ఇతడుకాక మరొక ఆధునిక గేయకవి అనంత పట్నాయక్. వివిధ కోణాలనుంచి పరికించినప్పుడు ఈనాటి అతినవ్యకవులలో జ్ఞానేంద్రవర్మ, బినోదనాయక్, గురుప్రసాదమహంతి, వేణుధరరౌత్, చింతామణిబెహరా మొదలైనవారు ప్రసిద్ధులు. ఈనాటి కవితలో యువకవులు కొందరు రకరకాల ప్రయోగాలు చేస్తున్నారు. వారిలో రమాకాంతరథ్, వేదా రవీంద్రనాథ్‌సింగ్ చెప్పదగినవారు. గేయకవులలో జీవనానంద్ పాణి మొదలైనవారు ముఖ్యులు

ఒరియాసాహిత్యంలో గొప్పప్రయోగం సాగుతున్న ఈ యుగంలోని నవలా రచయితలలో గోపీనాథమహంతి అతిముఖ్యుడు. ఇతడి రచనలన్నిటిలోను ఆనాదరణపాలైన ఆదిమవాసులూ, సంఘంలో అణగారిన అభాగ్యుల జీవితాలూ, జీవనవిధానాలూ వర్ణితమయాయి. ఒరియా సాహిత్యంలో గోపీనాథ మహంతి రచనలు సరికొత్తపద్ధతిని ప్రవేశపెట్టాయి. జీవితమూ, మనిషిఆశలూ, ఆశయాలూ సూక్ష్మంగా అవగాహనచేసుకోవడం; పరిస్థితులూ, నిజాలూ విమర్శాత్మకంగా నిరూపించడం ఇతని ప్రత్యేకత. ఇతని రచనలలో 'పరజా', 'అమృతరసంతాన', 'హరిజన', 'మాటిమటాళ' మొదలైనవి ప్రసిద్ధమైనవి. ఇతని తరవాతి యువకులలో బసంతకుమర పట్నాయక్ వ్రాసిన నవల 'అమడాబాట' ప్రసిద్ధమైనరచన. ఈ సందర్భంలో శంతనకుమార్ 'నరకిన్నెర' కూడా పేర్కొనదగినది.

కథారచయితలలో సురేంద్రమహంతి ప్రముఖుడు. బౌద్ధయుగం భూమికగాచేసి వ్రాసినా ఆధునికజీవితాన్ని తీసుకునివ్రాసినా చక్కని నాటకీయతనే ప్రదర్శింపగలిగాడితడు. బామచరణ్‌మిత్ర, మహాపాత్రనీలమణిసాహు, కిశోరీచరణ్‌దాసు మొదలైనవారు ఆతడితో సరిపోల్చదగినవారు.

నాటకాలూ, ఏకాంకికలూ వ్రాసినవారిలో రామచంద్రమిశ్ర, గోపాలఛోటరాయ్, మనోరంజన్‌దాసు, ప్రాణబంధుకర్ సిద్ధహస్తులు.

ఒరియాసాహిత్యం విస్తృతమైంది. దీని ప్రయోగం నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది. చుట్టుపక్కల ప్రాంతీయసాహిత్యాలకు ఇది ఏమంత తీసిపోదు. వాటితో సమంగానే

తులతూగుతుంది. ప్రాదేశికసంప్రదాయాలను అంతర్జాతీయతలతో మేళవించే ఈ ప్రయోగం ఎంతవరకు సఫలమవుతుందో కాలమే తేల్చి చెప్పగలుగుతుంది.

## గమనిక

[ఒరియాసాహిత్యానికి పీఠికరూపమైన ఈ వ్యాసంలో తెలిపిన గ్రంథకర్తలా వారి గ్రంథాలా పేర్లు కేవలం ఉదాహరణకోసం చెప్పినవే కాని సమగ్రమైనవికావు. నిర్దిష్టమైన రచనాపద్ధతులూ, ప్రక్రియలూ నిరూపించడానికిమాత్రమే అవి ఏర్చుకోడం జరిగింది. స్థలాభావం వల్ల ఎంతోమంది సుప్రసిద్ధరచయితలను, వారి గ్రంథాలను పేర్కొనడానికి గాని, పేర్కొన్నవారి గ్రంథాలనన్నిటినీ వివరించడానికిగాని వీలు పడలేదు. ఇంగ్లీషు చేసిన భాగాలు ప్రత్యేకరీతులు చూపడానికి ఏర్చినవేకాని అవిమాత్రమే రచయితల సర్వోత్కృష్ట రచనలని కాదు.]

## వి ష య సూ చి క

'శూద్రముని' సారశారదాసు

# మహాభారత

(15 శతాబ్ది మధ్య భాగము)

(జరాకిరాతుడు విలువిద్య నేర్చుకోడం)

అగస్త్యముని వివస్వంతుడి కుమారుడు మనువుతో ఇలా చెప్పాడు. అజపతి కుమారుడు జరుడని గొప్పకిరాతుడు ఉండేవాడు. వాడు చక్కగా రెండు ఖడ్గమృగాలు సంగ్రహించి, వాటిని మోసుకుని ఉల్లాసంగా వారుణాతంతం చేరాడు తలలో నెమలి ఈకలు పెట్టుకున్నాడు. మెడలో గురివిందల దండలు వేసుకున్నాడు. ఎర్రటిబట్టలు కట్టుకున్నాడు. ఒంటిమీద రంగురంగుల ధూళిపూసుకున్నాడు. గచ్చుతీగ నారికట్టిన 'ధమన' కర్ర ధనుస్సు పట్టుకున్నాడు. చిన్నచిన్న కొమ్మలు అలంకరించుకున్నాడు. బాణాలు నిండిన జమిలి తూణీరాలు కట్టుకున్నాడు. అలా అన్నిటితోనూ ముస్తాబయివెళ్ళి వారుణాతంతంలో అస్త్ర విద్య అభ్యసించేచోట ద్రోణాచార్యుల్ని దర్శించాడు జరుడు.

తనకు ఉపహారంగా తెచ్చిన ఖడ్గమృగాలు రెండూచూసి సంతోషించాడు ద్రోణాచార్యులు. ఆచార్యుడు ఆనందించడం చూసి తనను శిష్యుడిగా అంగీకరించమని ప్రార్థించాడు కిరాతుడు.

అడవినుంచి వచ్చిన కిరాతుడు ఎంతో సహకరించవచ్చును అని ఆలోచించి అతణ్ణి శిష్యుడిగా అంగీకరించమన్నాడు పాండవులలో పెద్దవాడయిన యుధిష్ఠిరుడు.

కాని కౌరవులలో పెద్దవాడు, ధృతరాష్ట్రుడి కుమారుడు దుర్యోధనుడు చీదరించుకున్నాడు. కిరాతుణ్ణి పొమ్మని ఆజ్ఞాపించాడు.

"కిరాతుణ్ణి పొమ్మనడం మంచిదికాదు" అన్నాడు పాండవులలో మధ్యముడు అర్జునుడు. ఏమంటే, వీడు ఖడ్గమృగాలూ, దుప్పులూ, గొర్రెలూ, మేకలూ, చమరమృగాలూ మొదలైనవి అడవినుంచి వేటాడితెచ్చి ఎంతో ఉపయోగపడతాడు" అన్నాడు.

"ఊరూపేరూ లేని కిరాతుడు సహాయపడతాడనుకోడం కేవలం భ్రమ" అన్నాడు దుర్యోధనుడు. అందుకని కౌరవులలో రెండో వాడైన దుశ్శాసనుణ్ణి పిలిచి కిరాతుణ్ణి తరిమి వేయమని ఆదేశించాడు.

అన్నగారి ఆజ్ఞ పాలించాడు దుశ్శాసనుడు. కిరాతుణ్ణి ఎనిమిది మైళ్ళదూరం తరిమేశాడు. జరాకిరాతుడు ఎంతో విచారించాడు. తిన్నగా తన గుడిసెలకి వెళ్ళిపోయాడు. అక్కడ తన పాకలముందు చిన్నస్థలం శుభ్రపరిచాడు. చెట్టూ చేమా కొట్టేసి రంగస్థలం సిద్ధంచేశాడు. వారుణాతంతానికి వందమైళ్ళ దూరంలో ఉందది. సరిగ్గా వారుణాతంతంలోని రంగస్థలం (అస్త్రవిద్య అభ్యసించేచోటు) లాగే తన రంగస్థలం తయారుచేశాడతడు. అందులోనే తన విలువిద్య ఆరంభించాడు.

కిరాతుడి పట్టుదలకి సాటిలేదు. వారుణాతంతం రంగస్థలంలో కౌరవులు అనుసరించిన పద్ధతులే అవలంబించాడతడు. వారిలాగే ముందుకీ, వెనుకకీ అడుగులు వేసేవాడు. వారిలాగే గురిచూసేవాడు. ఈ విధంగా విలువిద్యలో నైపుణ్యం గడిస్తూవచ్చాడు.

జరాకిరాతుడికి 'తార' అని భార్య ఉండేది. తనభర్త అలా అస్త్రవిద్యాసాధనలో

నిమగ్నుడు కావడం నచ్చలేదామెకు. ఒకనాడు అతడితో ఇలా అన్నదామె. "మనం అడివిలో ఉండేవాళ్ళం. మన జీవితాధారం వేట. మన బతుకుకి కావలసిన వేటమాను కుని ఇలా కాలం వ్యర్థపుచ్చడంవల్ల ఏమిటి ప్రయోజనం?". దానికి కిరాతుడు "సమయంరానీ నీకే అంతా తెలుస్తుంది" అన్నాడు.

"ఏం తెలివి తక్కువగా మాట్లాడుతున్నావు నువ్వు!" అంది తార. "నీ ధోరణి బోధపడటం లేదు నాకు. గురువు లేకుండా ఏమిటి నేర్చుకుంటున్నావు? ఎవరు నీ గురువు? గురువులేనివిద్య ఒంటబట్టదని ఎరగవా?"

తన పొరపాటు తెలుసుకున్నాడు కిరాతుడు. భార్య ఉపదేశం ఒప్పుకున్నాడు. తన రంగస్థలంలోనే గురువుని ప్రతిష్ఠించాడు. ద్రోణుడి విగ్రహం తయారుచేశాడు. సరిగ్గా వారుణావతంతంలోని నిజమైన ద్రోణుడిలాగే దానిని చేశాడు. విగ్రహం తలకి నల్లటి చామరాలు పెట్టాడు. తలకి గురివింద పూసలు కట్టాడు. రెండు స్ఫటికంముక్కలు కళ్ళుచేశాడు. గురివిందలు, గులుములు మాలకట్టి మెడలో వేలాడదీశాడు. కిత్తలినార జందెంచేసి ఎడమ బుజానవేశాడు. కలవళాడలు ఉత్తరీయంగా కప్పాడు. ద్రోణుడు పూసుకున్నట్టే గుండెలకు చందనం పూశాడు, ఎడమచేతిలో విల్లుపెట్టాడు. కుడిచేతి చూపుడువేలు నిర్దేశిస్తున్నట్టు రంగస్థలంవేపు చూపుతూ ఉంచాడు ఆ గురువుపాదాలు పూజిస్తూ, విశ్వాసంతో విలువిద్య మెలుకువలు నేర్చుకున్నాడు జరాకిరాతుడు.

*కవిసమ్రాట్ ఉపేంద్రభంజ్*
*(1675-1720)*

**లావణ్యవతి**

"స్నానసుందరి"

[ఆరో అధ్యాయంనుంచి]

సావధానంగా వినండి పండితులు
స్నానాలకొలను గట్టున
పొగడచెట్టుకింద తిన్నెమీద
కూచున్నది జాజికురుల రాజపుత్రి
పగడాలరేవున పక్షుల ప్రతిబింబాలు
కొలనులోని సోయగాలు
ఆమెచూపును, మనస్సును ఆకట్టుతున్నాయి.
పుడమిసుందరి ఆమెకొనాలని
హంసలద్దిన నీలిచీర
పరిచినట్టుంది, పక్షులు ప్రతిబింబిస్తున్న తీరంతో కొలను.
స్ఫటికం మెట్లు, కొలనినీళ్ళు
పరస్పరం పోటీపడుతున్నాయి.
నీలవేణి రాజపుత్రి సాంగత్యవాంఛతో

త్రివేణి (గంగా, యమునా, సరస్వతుల ప్రసిద్ధ
సంగమం) కొలనై అవతరించినట్టుంది ఇక్కడ.
మహాభవనంచుట్టూ చెదరిన సౌందర్యరాసులు
గిరగిరా తిరుగుతున్నట్టు
జలమండపం (దీపదండి) చుట్టూ
(కొలనుమధ్య చిన్నకట్టడం)
గిరగిరా తిరుగుతున్నాయి హంసలు.
నీటిఅడుగు బురద, నీటిమీదినాచు
మలిన హృదయాలను ఆకర్షిస్తున్నాయి.
కొలను నైర్మల్యం ఉజ్వలమైన అద్దాన్ని
మించిపోయింది.
ఈ కొలను గంభీరత్వం నిజంగా
పండితులనుంచీ, అలల కదలికలు
సుడులమెలికలు నర్తకినుంచీ,
తియ్యదనం అమృతంనుంచీ
ఎరువుతెచ్చుకుందేమో !
దీని చల్లదనం చూస్తే చంద్రుడిమీద
అభిమానం అనవసరం.
ఈ అన్నిటితోనూ ఇది (కొలను)
కామమోహితమైన 'సారశి' పక్షులమీదా
చూపరులమీదా అయాచితంగా
ఆనందం కుమ్మరిస్తోంది.
ఆ ఆనందంతోపాటు
మన్మథబాణాలు నాటుతూఉంది.
గుంపులు గుంపులై కలువలు
ప్రియతముడైన చంద్రుణ్ణి
చుట్టుముట్టాలని చూస్తున్నట్టున్నాయి.
భూమి ఆనందం, చందమామలాగే
తప్పించుకుంటున్నది కొలను
కొలను సోయగానికి పరవశిస్తూ
స్నానసంవాహనాలకని గుండెలోతు నీళ్ళలో
దిగింది లావణ్యనిధి రాజకుమారి.
అబ్బురపడుతున్నాడు కవి –
ఎంతవింత !
సొరకాయబుర్రలాంటి ఆమె జఘనభాగం
నీటిలో మునిగిపోయింది,

మరింత వింత!!
మునిగిపోక నీటిమీద తేలాడుతున్నాయి
ఆమె స్తన పర్వతాలు.
ఎన్నివింతలు చూడము, జీవించిఉంటే!
ఎంతటి అసంభవం
సంభవముందో ఇక్కడ!
(బెండ్లు మునిగి గుండ్లు తేలాయి అని కవి చమత్కారం)

'కవివర్' రాధానాథ్ రాయ్
*(1848 - 1908)*

**చిలికా**

"సెలవియ్యి ఓ చిలికా!"
(ఒక భాగం)

సెలవడుగుతున్నాను చిలికా! సెలవు
దారుణమైన సంసారంలోకి తిరిగి వెళ్ళిపోతాను
నా పడమటి మనుగడ నీ పడమటి తీరాన
గడపాలని ఆశించాను
ప్రయాసలేకుండా నీ దగ్గర
సౌందర్య పిపాస తీర్చుకుందా మనుకున్నాను
అభిరుచికి తగిన అదృష్టమే ఉంటే
అందమైన నీ తీరం ఆశ్రయమయేది!
"జటియా" కింద కుటీరం కట్టుకుని
చివరిజీవనం ఏకాంతంగా గడిపేవాణ్ణి!
కాని పరిణామం క్రమకింద తేలింది.
ఆశ ఆశగానే ఉండిపోయింది
సంసారంలో ఉండినా సంసార సుఖాలెరగన్నేను.
అవి జీవితకాలమంతా నాకు దూరంగానే ఉన్నాయి.
సంసారంతో అంటిపెట్టుకున్నవారి స్నేహానికి
ఎన్నడూ ఇష్టపడలేదు.
ఆటపాటలతో కాలం గడిపేవారు
జీవనం అనంతమైన మహోత్సవ మని భావిస్తారు.
నా భాగ్యం మీద బండరాయి పడింది.
నా జీవనం భిన్న పదార్థంతో ఏర్పడింది.
నిట్టూర్పులూ, మూలుగులూ, కన్నీళ్ళూ - ఇవే నా జీవనం
జీవనం కాదిది జీవంతమరణం
దుఃఖశోకాఘాతాలతో

చిరబాధితుణ్ణి నేను, చిరజర్జరితుణ్ణి
దుఃఖం నిండిన కన్నులతో
లోకాన్ని చూడటం పరిపాటి నాకు
ప్రజల కళ్ళకి సుఖంగా అవుపడేది
ఇట్టే చేతికివచ్చి, ఇట్టేవేళ్లల్లోంచి జారిపోతుంది
పదార్థం కాదది పొగ
గగన కుసుమాల వంటిది
నీ తీరంలో మృగతృష్ణలాగ
మనోమృగాన్ని పెడదారి పట్టిస్తుంది,
ప్రపంచమంతటా తిప్పట పెడుతుంది
ఈ సుఖాలు ఎన్నడూ మోహపెట్టలేదు నన్ను
నా లక్ష్యమంతా నీ తీరంలోని
గుట్టలమీదా, గుహలమీదే ఉండేది
మధురమైన నిరూపమధువు ఆస్వాదించి
నీ ఏకాంత తీరాల పరవశించిన
వాగ్దేవి వరపుత్ర కవి ద్వయం
ఉపేంద్రభంజ్ బలదేవుల లాగ
దివ్యప్రశాంతమైన నీ తీరాన ఏకాంతాన
వాగ్దేవి పాదాలు పూజించాలని ఉండేది
అడియాస అకించనుణ్ణి అంత ఆశించాను
మేలుకుని కలలు కన్నాను
ఆశతో మత్తెక్కి మైమరిచాను
కోరికలతో మోసపోయాను
అదృష్టంలో ఏం వ్రాసుందో తెలియక
గాలిలో మేడలు కట్టాను
ఆకాశం పువ్వులు కోశాను
మృగతృష్ణలో మునిగాను
ఉగ్రంగా ఎదుట నిలబడింది
నిష్ఠురమైన రేపటినీడ
క్షణంలో మాయమయింది
మోహనమాయ.
ఆ నీడ చీకటిలోనే చూశాను
భీషణమైన నైరాశ్యపిశాచవికట నర్తనం.
కాని మంత్రించినట్టు
మనోహరమైన నీ కాంతులు
ఆ బిభీషికల్ని క్షణంలో తుడిచిపారేశాయి

'భక్తకవి' మధుసూదనరావు
(1853-1912)

## వసంతగాథ

### "శంఖధ్వని"

పడమటి దిఙ్మండలాన సూర్యుడు గుంకిపోతున్నాడు.
ప్రశాంతదినాంతచ్ఛాయ ఆకాశమావరిస్తున్నది.
అలసిన అవనిమీద మౌనంగా, గంభీరంగా, నెమ్మదిగా
శాంతికురుస్తున్నది శాంతమయి సంధ్య.
పగలు ముగిసిపోతూ ఉంది.
అలసిన పాంథుణ్ణినేను ఇంటిదారిపట్టి
గబగబా నడుస్తున్నాను.
దూరగ్రామంనుంచి హటాత్తుగా
వినపడింది శంఖధ్వని
స్తంభించిపోయినట్టు చకితమయింది విశ్వం
కలలోలాగ ఆశ్చర్యపోతూ ఆలకించాను-
ఆస్వరలహరి
మహాజాగరణలో తెలుపుకుంది నా ఆత్మ.
ఆధ్వనిలో సముద్రస్వరమేళనం విన్నాను.
సముద్రంలో పుట్టిన శంఖం
మహోదారమైన, అనంతరమైన సాగరసంగీతం
ఆలపిస్తూ ఉంది.

**2**

మహాసముద్ర మహాప్రణవ ఝంకారం
మంద్రనాదంతో ఆగకుండా
ఘోషిస్తూ ఉంది శంఖం.
సముద్రం నా మహాలయం
అనంతమది, అపారమైంది
నా అంతరంగం అనంతనాదంలో కలసి
నాదమయమయింది
ఆ అమృతాలయ విడిచివచ్చి -
మరచిపోగలనా ఆ అమృత సంగీతం!
క్షుద్రాతి క్షుద్రమైన మట్టికొంప కోసమని
తెలివిమాలి పాంథుడా !
మరచితివో నీ పుట్టినిల్లు !
ఏదీ నీ పెదవులలో అలనాటి అమృతవాణి ?
రావోయి రా !
సుగంభీరమైన వేదమంత్రాలతో రా.

జగతిలోని అనంత సంతానంలో
అనంత జీవన మూర్తిని
అనంతమైన అభయాన్ని మేలుకొలుపు
ఈ మర్త్యప్రవాసంలో
అమృతవిజయం ఆలపించు"

*మాయాధర మానసింగ్*
*( 1906 )*

**కోణార్క**

ఓ కోణార్క !
నీ యౌవన ప్రాభవం గతించింది
మౌనవేదనతో సైకత శయ్యమీద
శయనించి ఉన్నావు
అయినా ఇప్పుడు కూడా నీ జీర్ణకాయాన్ని
విషాదనేత్రాలతో చూస్తుంది విశ్వం
నీ విషాద నిద్రకి జాలిగా
కన్నీళ్ళు కారుస్తున్నది.
రాళ్ళమీద ఇతిహాసాలు సృష్టించేకవి
నీ సౌందర్యానికి సమ్మోహితుడయి
నీ ముదిమిదేహాన్ని కౌగలించుకోవాలని
నీ ప్రతి అంగమూ ముద్దుపెట్టుకోవాలని
నీ రూపపిపాసతో కృశించిపోతున్నాడు.
ఓ వృద్ధమూర్తీ !

**3**

పన్నెండు వందలమంది శిల్పుల
స్వాప్నిక ఊహలకూ, బుద్ధికీ అతీతంగా
అజ్ఞాతంగా, రహస్యంగా
గడిపావు నీ శైశవం.
చకితమైన విశ్వదృష్టి నీమీదపడినప్పుడు
నీ ప్రతి అంగానా యౌవన లావణ్యలీల
తాండవిస్తున్నది.
శరీరమంతటా సులలితమైన
అంగసౌష్ఠవం పొటమరిస్తున్నది
పన్నెండు వందల మంది శిల్పులు

ప్రపంచంలో ఊహాతీతమైన
కల్పనాతీతమైన, మనోమోహనకరమైన
సౌందర్యం తెలుసుకున్నారు.

4

ఆకసాన అగణితమైన తారకల
రజతధవళ దివ్యజ్యోతి
అమాంతంగా ఆరిపోయింది
సిగ్గుపడి శీకల శీతాంశుడు
ఆకసం మాటున దాగిపోయాడు.
భక్తితో పులకరించి, భయంతో
జలదరించాయి దూరదూరాన చెట్లు.
తరంగమాలికలతో నీ పాదాలు ముద్దాడి
గానం చేస్తోంది సముద్రం!
"ఓ సుందరతర నిర్మాణమా!
ఓ మానవ భీషణ కీర్తీ!
నా తీరాన్ని అలంకరించు
నీ పాదాలు సేవించి ఆనందించనీ"

5

సుకుమారమైన నీ స్తూపం
కిరణాల వెల్లువతో తడిపిన
పున్నమ చందమామ తెల్లని నవ్వులో
సముద్రతరంగాల స్వరంతో స్వరం కలిపి
జలదేవత నీ గాథ గానం చేసింది.
నీ సూటి చూపుతో నిశ్చేష్టులయి
ఆకాశవిహారులు దిగివచ్చి
నీ చెవుల్లో నిగూఢవార్తలు వినిపించారు.
స్వర్గలోకం నుంచి అప్సరసలు వచ్చి
పారిజాత పుష్పాలు నివాళు లిచ్చారు.
వెన్నెల వెల్లువలో నిన్ను ఆరాధించారు.

6

జీవితంలోని ఆటలూ, విలాసాలూ
ఎన్నో ప్రదర్శిత మవుతున్నాయి నీ రూపంలో,

ఓ అతీత సౌందర్య మూర్తీ!
రాజు నీ నుంచి దండయాత్ర నేర్చాడు.
మంత్రి మంత్రాలోచన నేర్చాడు
ప్రేమికులు తమ కౌగిలింతలూ,
యోధులు తమ రణకౌశలాలూ.
నీ చిత్తరువుల నుంచి సంగ్రహించారు.
పిల్లలు, బెత్తాం పట్టుకున్న గురువుగారి
బడికి వెళ్ళడం కూడా
ఓ అచలమూర్తీ!
నీ దగ్గరే నేర్చుకున్నారు.

సచ్చిదానంద రౌత్‌రాయ్
( **1916** )

## సుందరమ్

ఒకప్పుడు కవి ఉద్బోధించాడు,
"సత్యం పరమానందకరం కావచ్చు,
కాని అసత్యం సుందరమైంది.
వాదప్రతివాదాలు చెలరేగినా సరే,
ఇది మాత్రం వస్తుతః నిజం
జీవనం సత్యంకాదు
కాని ఎంతసుందరమైంది!
దాని ఆవిష్కరణ, మనోహరమైన దాని
మధుర గీతాలు
ఎంతముచ్చటైనవి! ఎంత అందమైనవి!
ఎంత సుందరమైనవి !!
ఈ విశ్వమూ, దాని కౌశలమూ,
దాని అలంకారాలూ, కవితలూ
అన్నీ మట్టికొట్టుకు పోయేవే.
అవి అసత్యాలే కావచ్చు
కాని ఎంతలావణ్యమైన వవి!
ఎంత సుందరమైనవి!
సత్యం ఆనందకరమైందే
కాని సుందరమైందా?
అందమైన చిన్నదాని ఛాయాచిత్రం కంటే
ఆమె వర్ణచిత్రం సుందరం కాదా?

హెచ్చు మనోహరం కాదా ?
హెచ్చు పరవశత్వం కలిగించదా ?
అది అసత్యమే కావచ్చు కొంత
కాని ఎంతసుందర సుందరమ్ !

సత్యం నిజమైంది, నిత్యమైంది,
స్థిరమైంది. నిరపేక్షమైంది, అతీతమైంది.
పరమేశ్వరుడి లీలలో అపహాస్యంలేదు.
సృజనా, విధ్వంసమూ –
ఈ విధానం మధ్య ఇంకేదీలేదు.
సత్యం నిత్యమైంది.
పూర్తిగా తప్పని సరైంది,
ఊహించ వీలులేంది,
సదా స్వతంత్రమైంది.
లీలలు మాత్రం మర్త్యమైనవి.
కనకనే అసత్యం సుందరమైంది.
వెలుగు నీడల ఇంద్రజాలం లాగ
రహస్యమయమైన ఈ ప్రపంచమహాకావ్యాన్ని
సృష్టిస్తుందది.

నారాయణానంద అవధూత స్వామి
(15 వ శతాబ్దం చివర)

### రుద్రసుధానిధి

"దివ్యపరీక్ష"

( గద్యరచన నుంచి )

"వీరంతా నిజమైన సమాధిలోనే ఉన్నారా ? మనం కొన్ని మాయలు ప్రయోగించి వీరి పరమ సిద్ధి పరీక్షించడం అవసరము. వీరి లోపలి అభిప్రాయాలేమిటో పరీక్షిద్దాము" ఇలా ఆలోచించి, జగదీశ్వరుడు, త్రిపురారి పార్వతిని పిలిచి, కొంతపరిహాసమాడి, నెమ్మదిగా చెవిలో ఇలా ఆదేశించాడు : "ఓ కృపామయా ! కళ్యాణీ ! శుభ్ర సుకుమారీ! శాకంభరీ ! విశ్వమాయా స్వరూపిణీ ! పరమమోహినీ ! బ్రహ్మ మొదలు గడ్డిపోచవరకు బాహ్యాభ్యంతరాల ప్రకృతి అంతా నువ్వేవ్యాపించి ఉన్నావు. ఇది నీ విభ్రమ మాయాప్రభావము. నిశ్చలమైన, నిర్మలమైన వీరిసిద్ధి బుద్ధిలోంచి కలిగిందా ? విచారించి సరిగ్గా తూచి తెలుసుకుందాము. ఎవరి బరువు ఎంతో, ఎవరి తేలిక ఎంతో గమనిద్దాము. దేవీ ! నా కోరిక ప్రకారం ప్రసన్నురాలవై, మూడు లోకాలూ మోహింపచేసే ఒక కన్యను పుట్టించు. ఆమె ఈ రుద్రగణంలోని సిద్ధుల జ్ఞాన బుద్ధులు మోహింపజేయగలదు. ఓ సుందరీ ! పరమమాయ నీ స్వభావము. లావణ్యమయం నీ శరీరం. నీ నితంబ ప్రదేశ మాశ్రయించి మన్మథుడు నా యోగభంగానికి సాయపడ్డాడు. ఆశక్తి కామదేవుడికి ఇప్పుడు ఉందో, లేదో తెలుసుకుందాము. నాకోరిక ప్రకారం ఇప్పుడు పరమ ప్రసన్నురాలవై, నాకౌతుక

లీలాక్రీడలో అన్ని భయాలూ ఒదిలిపెట్టి ఒక స్త్రీ లాగ సచరాచరమైన ప్రపంచ మంతటి నీ మోహింపచేసే ఒక కన్యను కను. పూలబాణం పట్టుకుని మన్మథుడు తన మిత్రుడైన రుతు రాజు వసంతుడితోనూ, ఆ త్రిజగన్మోహిని కన్యతోనూ కలిసి నీ సహాయంతో తనపని సాధిస్తాడు. అప్పుడు ఆకామ దేవుడి ప్రభావం చూద్దాం మనము."

ఈశ్వరుడి ఆజ్ఞమన్నించి ఆ చైతన్యస్వరూపిణి ఈ అవకాశం వినియోగించుకొని ఆత్మాసక్తిపాశవిముక్తులైన ప్రాణులమనస్సు తిరిగీ మన్మథపాశాల సహాయంతో ఆకర్షించ డానికి కుతూహలపడింది. ఒక ముహూర్తం సమాధి తరవాత తనమనస్సులోంచి విశ్వమోహిని అయిన రూపవతి కన్యని ప్రసవించింది. అహో! ఏమా అందం! తన మనోహరత్వంతో విశ్వమంతటినీ వశపరచుకుంటున్నది. ప్రపంచం శోభావంత మయింది. అందరి ధైర్యమూ అంతరించింది, కామసముద్రం కైలాసం చుట్టు ముట్టింది. ధన్యమీశోభ ! ఏమిటీ మెరుపుల ప్రభ ! ఏమిటీ మన్మథ ధనుస్సు మహేంద్రజాలం ! సృష్టికర్త అయిన బ్రహ్మ వంటి దేవతల మీద కూడా ఏమిటీ మోహపాశాలు ? ఏమిటీ మధుర సృష్టి ! అమృత ప్రేమ కలశము !

* * *

ఈశ్వరుడే స్వయంగా ఆశ్చర్యపోయాడు. పార్వతిని కౌగిలించుకుని ఆనందంతో ఇలా అన్నాడు. ప్రేయసీ ! దగ్ధమైపోయిన మన్మథుణ్ణి సమ్మోహనజలంతో తిరిగీ బతికించావా నువ్వు ? పద్మాక్షీ ! నా మనస్సుకూడా కలతపెట్టే ఈ కొత్త మన్మథుణ్ణి ఎక్కడనుంచి సృష్టించావు ? మనమిప్పుడు నా అనుచరులైన సిద్ధులశక్తి తెలుసుకుందాము". అంతలో అపూర్వమైన ఆశ్చర్యకరమైన మోహినీకన్యను చూసి రుద్రుడి అనుచరులు సిద్ధులు తమ తమ సమాధులు మరచి పోయారు.

*శివదాసు*
(18 వ శతాబ్దము)

## బత్రిశసింహాసన
### మొదటి ప్రతిమ కథ
(గద్యనుంచి)

తెల్లవారాక భోజరాజు తన నిత్యకృత్యాలు తీర్చుకుని చేత్తో ఒక పూలగుత్తిపుచ్చుకుని సింహాసనం దగ్గిరికి వెళ్ళాడు. సింహాసనంమీద కూచునీ కూచోడంతోనే మొదటిప్రతిమ నవ్వింది. "ఎందుకు నవ్వావు ?" అని అడిగాడు రాజు. "రాజా ! విక్రమరాజు ఒక్కడే ఈ సింహాసనానికి అర్హుడు" అంది ప్రతిమ. "అతడి సుగుణాలేమిటి ?" అని అడిగాడు రాజు. "నేను వర్ణించగలనా అతడి సుగుణాలు ? దేవతలకు కూడా తెలియవవి. సాధ్యమైనంతవరకు చెప్తుతాను సావధానంగా విను" అంది ప్రతిమ.

"నాకంటేకూడా గొప్పదాతా అతడు ? ఒక తడవకు లక్ష బంగారం నాణేలు తక్కువలేకుండా దానం చేస్తాన్నేను" అన్నాడు భోజరాజు. అతడిమాటను విని ఇలా అందుకుంది ప్రతిమ : "రాజా, నువ్వు పరమలోభివని తెలుసుకున్నా నిప్పుడు. నీదానం నువ్వు గొప్పలు చెప్పుకోడంతోనే తెలిసిపోయింది. "తనగొప్పతాను చెప్పుకోడంతోనే కీర్తియావత్తూ

బూడిదపాలవుతుంది' అని సామెత. ఈ విషయంలో ప్రవర్తనకి నియమాలేర్పరిచారు మునులు. ఎంతగొప్పవాడైనా సరే, తనగొప్ప తాను చెప్పుకోకూడదు. నాకు తెలుసు పై వాళ్ళ దగ్గిర సొంతబాకా ఊదుకోవడం అప్రతిష్ఠ. అంచేత ఒకరిముందు గొప్ప చెప్పకూడదు. పైగా మహానీయుల ప్రసక్తివచ్చినప్పుడు అలాచెప్పడంమరింత నైచ్యం." ప్రతిమచెప్పినమాటలు విన్నాడు రాజు. అంత మహాదాతా ఆయన? విక్రమరాజు విషయం కొంతవినిపించు" అన్నాడు ప్రతిమ ఇలా చెప్పింది!" సేనాధిపతులూ, ఆస్థానికులూ, గుర్రపురౌతులూ, సేవకులూ విక్రమరాజుని సేవిస్తూ ఉండేవారు అతనికి బుద్దిపుట్టడంతోనే వాళ్ళందరికీ తలావెయ్యి బంగారం నాణేలు ఇచ్చేవాడు. ఎవరితో కలిసినా మధురంగా మాట్లాడేవాడు. లక్షకోట్ల బంగారం నాణేలు బహూకరించేవాడు. తానిచ్చింది సక్రమంగా వినియోగించనివాణ్ణి బుద్ధిచెప్పి హెచ్చరించేవాడు. అతని ఆజ్ఞప్రకారం కోశాధికారులు ఖజానాలో బంగారం నాణేలు ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంచేవారు." భోజరాజుతో ఇలా అన్నీ చెప్పి, "ఈసుగుణాలన్నీ ఉంటేనే సింహాసనంమీద కూచో" అంది మొదటి ప్రతిమ.

*"వ్యాసకవి" ఫకీర్ మోహన్ సేనాపతి*
(1843 - 1918)

## ఆత్మజీవనచరిత

### "కెంపుర్ఝర్ ఖుంయాల విప్లవము"

(1891 -1892)

(గద్యరచననుంచి)

ముహూర్తకాలం ఏనుగుమీదే కూర్చొని ఆలోచించాను. ఏమిటి కర్తవ్యమిప్పుడు? సిపాయీలను అక్కడే నిలబెట్టి అనుకూలమైన చోటుకోసం ఏనుగును పరిగెత్తించి రెండువేపులా వెదికాను. చెట్లు జీబుగా ఉన్నచోటు దొరికితే సిపాయీలను అక్కడపెట్టి ఆత్మరక్షణకు ప్రయత్నించాలని నా అభిప్రాయం. కాని అదృష్టం అడ్డం తిరిగింది. ఆ ప్రదేశమంతా చిన్నచిన్న తుప్పలతో ఉంది. పల్చటి అడివి. శత్రువుల చూపు తప్పించుకొనేందుకు వీలు లేదు. మరోదారి లేదు, పూర్తిగా నిరాశచేసుకున్నాను నేను. తప్పించుకోవాలంటే ఏనుగును పరిగెత్తించి ఆనందపూర్ వెళ్ళిపోగలను. సిపాయీలను శత్రువులపాలుచేసి అలాపారిపోవడం సిగ్గుచేటనిపించింది. అంచేత వెనక్కువచ్చేసి బసంతపూర్ మామిడితోపు చేరుకున్నాను. సిపాయీలను వరుసలు తీర్చి నిలబెట్టి ఆత్మరక్షణ ప్రయత్నంలో ఉన్నాను. ఇంతలో ఖుంయాలు వచ్చి మమ్మల్ని చుట్టుముట్టారు. తక్కువమందే ఉన్నారు వాళ్ళు. సులువుగా వాళ్ళని తరిమివేయగలనుకాని దగ్గరలోనే వాళ్ళ ముఠా పెద్దసంఖ్యలో ఉంటారన్నదృష్టితో నేను దానికి సాహసించలేదు. ఖుంయాలు నాదగ్గిరికి వచ్చి "మీరు ధరణీధర్ బాబు దగ్గిరికి రండి" అన్నారు. మారుమాటాడలేదునేను. నా ఏనుగుతోనూ, సిపాయీలతోనూ వారివెంట బయలుదేరాను.

బసంతపూర్ పడమటివేపు బరారాసి కొండకింద బసాఘరఘాట్ ఖుంయాల ప్రధానమైన కీలకస్థానాల్లో ఒకటి. అది ధరణీధర్ అన్న గోపాళియా అధికారంలో ఉంది. ఖుంయాదండుకి అతడు నాయకుడు కూడా. ఆరుమాసాల క్రితం పట్నం జైల్లో అతణ్ణి చూశాను. గొలుసులతోనూ, బేడీలతోనూ ఉన్నాడప్పుడు.

గోపాళియా ఒడ్డూపొడుగూ ఉన్న స్థూలకాయుడు. అతడిమూపు భయంకరంగా ఉంటుంది. కండలు ఉక్కుతో మలిచినట్టుంటాయి. ఛాతీ విశాలమైంది. మొహం పెద్దది. బల్లపరపుగా, అసహ్యంగా ఉంటుంది. కళ్ళు చిన్నవి. ఎనుపోతంత బలవంతుడు. ఎంతక్రూరుడో అంత దుర్మార్గుడు. అంత మూర్ఖుడు. విల్లూ, అమ్ములూ, కత్తులూ, బల్లాలూ తన రెండు వేపులా కుప్పలు పెట్టుకుని, ఒక బండమీద కూచున్నాడు గోపాళియా. అతడిచుట్టూ ఎంతోమంది ఛుంయాలు మారణాయుధాలు పట్టుకుని, అతడిఆదేశంకోసం ఎదురుచూస్తూ సిద్ధంగా నిలిచి ఉన్నారు. నేనువెళ్ళడంతోనే తన ఎర్రటి చిరుకళ్ళతో ఒకతణం నన్ను కర్కశంగా చూశాడు గోపాళియా. భయంకరమైన అతగాడి ఆకారం, అతడిముఖతణాలు కనిపెడుతూ, అతడి ముందు బందీలాగ నిలబడ్డాను. ఒక్కక్షణం గడిచాకనాకు ఆదేశం వచ్చింది. "ధరణీధర బాబు దగ్గిరికి రాయిసుం ఆ పద"

నేను ఏనుగుమీదెక్కి కూర్చున్నాను. రెండు చేతులతోనూ రెండు కత్తులు పట్టుకుని నాపక్క కూచుని అడిగాడు గోపాళియా. "నీదగ్గిర పిస్తోలుందా ?" "లేదు" అన్నాను "అయితే విను, కోటలోకి (పట్నం) పారిపోవడానికి ప్రయత్నించావా, చంపేస్తాను తెలిసిందా?" అన్నాడతడు. కత్తులూ కటార్లూ నడుములకు కట్టుకుని, ఎక్కుపెట్టిన ధనుస్సులూ, బాణాలూ పట్టుకునీ నలభై, ఏభైమంది కాపలా వాళ్ళు అలా నన్నుతీసుకుని రాయిసుం ఆ వేపు బయలుదేరారు. మేము వెళ్ళుతూ ఉండగా రాయిసుం ఆ వేపునుంచి గుంపులు గుంపులు జనం బసాఘర్ ఘాట్ తట్టు వస్తున్నారు. ఎవరైనా వస్తే మాకాపలా వాళ్ళు "హుషయార్" అని అరిచేవారు. ఎదటివారు అలాగే "హుషియార్" అని అరిస్తే. "తఫాత్ తఫాత్"అని హుకుమయేది. ఛుంయాలి సాంకేతికపదం"హుషియార్". ఎదటివాడు అదేపదం పలికితే అతడు మిత్రుడన్నమాట. అలాపలకనప్పుడు అతడు శత్రువుకింద జమ.

సుమారు సగందారిలో ఒక భయంకరమైన మనిషి ధనుస్సున బాణం తొడిగి, నన్ను కేకవేసి పిలిచాడు. "తెలుసా ? పొద్దుటినుంచి సాయంకాలం దాకా తిండీతిప్పలూ- నీటిచుక్కయినా లేకుండా బిచిత్రానంద్ నాచేత పని చేయించాడు కదూ! నిన్ను చంపేస్తాను" అంటూనే బాణం నా మీదికి గురిపెట్టాడు. ఒక్క సెకెండ్ మించిపోతే తారుమని నేను చచ్చిపోయేవాణ్ణి. కాని అంతలోనే వెనుకనుంచి ఒకడు పరిగెత్తుకువచ్చి వింటినారి మీది అతడి పిడికిలి పట్టుకున్నాడు. నేను బతికిపోయాను.

మధ్యాహ్నం మూడుగంటలు కాబోతూ ఉండగా రాయిసుంఆ చేరుకున్నాము. నేను ఏనుగు దిగిదిగడంతోనే ధరణి ఛుంయా నా దగ్గిరికి పరిగెత్తుకు వచ్చి తన కాళ్ళ మీద పడమని పదేపదే అన్నాడు. నేను తటపటాయిస్తున్నాను. నా వంటమనిషి ఏడుస్తూ వెనక నుంచి వచ్చి, నన్ను కౌగిలించుకుని "పడండి, పడండి" అంటూ బలవంతపెట్టాడు. నేను తలవంచలేదు. సగౌరవంగా చేతులు జోడించాను. ఆ తరవాత ధరణి నా చెయ్యి పట్టుకుని తన ఆసనం దగ్గిరికి తీసుకువెళ్ళాడు. స్నానానికీ, భోజనానికీ నాకు అనుమతి దొరికేసరికి పొద్దుగుంకి పోవచ్చింది.

ధరణి కొలువు తీర్చే హాలుకి కొంచెం దూరంలో ఒక పంపెరిపాక నాకు బసగా ఇచ్చారు. పాకలోపలి భాగం అయిదు మూరల పొడవు, అయిదు మూరలు వెడల్పు

ఉంటుంది. గుగ్గిలం కొమ్మలూ, రెమ్మలూ, ఆకులూ దాని గోడలు. అలాటిదే పైకప్పు కూడా గుగ్గిలం కొమ్మలతోనే ఉంది. లోపటినుంచి చక్కగా చుక్కలు లెక్కపెట్టవచ్చు. కొద్దిరోజుల క్రితమే వానకురిసింది. కింద చెమ్మగా ఉంది. ఆయుధాలు పట్టుకుని ఒకమూక భుంయాలు నా పాకముందు కాపలా కాశారు. అలాగే వెనకవేపు కూడా ఒక గుంపు కాస్తూ కూచుంది. నేను బాగా అలిసిపోయాను. నా నౌకరు ఆ చెమ్మ నేలమీద పక్క పరిచేశాడు. సాయంకాలం భోజనం చెయ్యడంతోనే నిద్రపోయాను. రవంతసేపు నిద్రపోయానో లేదో, వేలకివేలు కండచీమలు నన్ను కరవడం మొదలుపెట్టాయి. పాకలో చెమ్మనేల కింద ఉన్నాయవి. నేను చూసుకోలేదు. దాంతో నిద్రమాట దేవుడెరుగు, నా ఒళ్ళంతా మంటలు పుచ్చుకున్నాయి. మంటలు తడుముకోడంతోనూ, పక్కమీద చీమలు తరవాడంతోనూ రాత్రంతా గడిచింది.

ఉదయం ధరణీధర్ కొలువు తీర్చి కూర్చున్నాడు. అన్నివేపుల నుంచీ వచ్చి భుంయాలు సమావేశమయారు. మేనేజరు (నేను) దొరికిపోయాడని భుంయా లోకమంతటా ఒకటే ఆనందం ఈవేళ. నాయకులందరూ సమావేశానికి హాజరయారు. తన పక్కని కూర్చున్న నన్ను ధరణి అడిగాడు: "ఫకీర్ మోహన్ బాబూ! ఇప్పుడు ఏమంటారు మీరు?" వెంటనే జవాబు చెప్పాను "మీ మేనేజరుగా ఉంచితే ఉంటాను. లేదంటే మా దేశం వెళ్ళిపోతాను." ధరణి భుంయా నాయకుల అభిప్రాయం అడిగాడు. వాళ్ళంతా "వద్దు వద్దు" అంటూ అరిచారు "ఇతను రాజు పక్షం మనిషి" అన్నారు. నన్ను మేనేజరుగా ఉంచే తుదనిర్ణయం ఆ దినం తేలలేదు. ఇతర విషయాలు కొన్ని చర్చించడంతో ఆ వేళటి సభ ముగిసింది. ఆ రాత్రికూడా చలిచీమలు నన్ను వేధించాయి. నాకు నిద్ర కరువయింది.

నన్ను మేనేజరుగా ఉంచే విషయం మర్నాటి సమావేశంలో మళ్ళా చర్చకు వచ్చింది చాలామంది సర్దార్లు వ్యతిరేకించారు. వారికి జవాబు చెపుతూ "మహారాణీపుత్ర" ధరణీధర్ అన్నాడు: "తగిన బుద్ధిమంతుడు ఒకతను నా దగ్గిర ఉండకపోతే ఇంత పెద్ద రాజ్యం నేను ఎలా పాలించగలను?" దాంతో భుంయాలు యావన్మందీ అంగీకరించారు. నేను మంత్రిగా నియమితుణ్ణయ్యాను. నా ఉద్యోగపత్రం మీద "మహారాణీపుత్ర" ధరణీధర్‌భుంయా అని సంతకం జరిగింది. ప్రతి పత్రం మీదా ఇలాగే సంతకం జరిగేది. జీతం కింద ఏడు ఎకరాల పొలం శిస్తులేకుండా అనుభవించడానికి నాకు ఆదేశం లభించింది. రాయిసుంఅలో అది నా మూడోరాత్రి. గత రెండు రాత్రులూ నాకు నిద్రలేదు.

ఎంతో ప్రాధేయపడి బ్రహ్మాండమైన ప్రయత్నం చేశాక రాయిసుంఅ ప్రధాన్ (గ్రామాధికారి)నులకవేసిన పాతకుక్కిమంచం తెచ్చిపెట్టాడు. నా నౌకరు దానిమీద నా పక్క పరిచాడు. గుడాకు సిద్ధంచేసి గొట్టం నా చేతికి అందిచ్చాడు. నేను హుక్కాగొట్టానికి పెదవులు తగిలించానో లేదో మండుతున్న నిప్పుతోనూ, పొగాకుతోనూ కూడా చిలుము ఊడిపోయి నా తలమీద పడిపోయింది. నిప్పులుపడి చాలాచోట్ల కాలి, శరీరం బొబ్బలెక్కింది. దురదృష్టం ఎప్పుడూ ఒకటిగా రాదు అనుకున్నాను.

నేను ధరణీధర్ గారి మంత్రి నన్నవార్త భుంయాల ముఖ్యకేంద్రాలన్నిటా

వ్యాపించిపోయింది. ధరణీధర్ కూడా నన్ను నమ్మాడు. రాజకార్యాలలో నా సలహా కాదనే వాడు కాడు. ఆ ప్రాంతమంతా అతణ్ణి దేవుడిలా పూజించేవారు. శంఖాలు పూరిస్తూ 'ఉలఉల' ధ్వనిచేస్తూ చుట్టుపక్కల గ్రామాలనుంచి స్త్రీలు గుంపులుగుంపులుగా వచ్చి ప్రతిదినం అతణ్ణి పూజించేవారు (శుభ కార్యాలూ మొదలైనవాటిలో స్త్రీలు పెదవులతోనూ, నాలికతోనూ ఉల ఉల ధ్వనిచేయడం ఒరిస్సాలో సంప్రదాయం. విశాఖపట్నం శ్రీకాకుళం జిల్లాలలో దీనిని, ఉలవలు పోయడం' అంటారు. ఒరియాలో "హుళహుళి" అంటారు). ధరణీధర్ తన పాదాలు అందించేవాడు. అతడి పాదాలు పసుపునీళ్లతో కడిగి, పూలతో పూజించేవారు స్త్రీలు. అతణ్ణి పూజించాక, నన్నుపూజించడానికి వచ్చేవారు వారు. నేను మంత్రిని కదూ! అందుకని నన్ను కూడా పూజించడం అవసరం. కాని నేను వారికి నమస్కరించి అనేవాణ్ణి. మీరు "నా తల్లులవంటివారు. దయచేసి నా పాదాలు ముట్టకండి. నేను సేవకుణ్ణి మాత్రమే. నన్ను పూజించడ మెందుకూ ?"

ధరణి నా సలహా మన్నించేవాడు. నా కుటీరానికి వచ్చి తాంబూలం వేసుకునేవాడు. గోపాళియాకి, మహాపాత్రకీ ఇది కనుకుట్టుగా ఉండేది. నన్ను బంధించి ఘుంయా గ్రామంలో కొండశిఖరంమీద ఉంచాలని మహాప్రాత్ర సంకల్పం. కాని ధరణికి భయపడి ఏమీచేయలేక పోయేవారు వారు. చివరికి ధరణీధర్ లేకుండా చూసి నన్ను ఎత్తుకుపోవాలని మహాపాత్ర, మరి కొందరూ రహస్యంగా కుట్రపన్ని, అదే సంకల్పంతో ఒకనాడు నిజంగానే నన్ను చుట్టు ముట్టారు. ఎలాగో ఈ వార్త తెలిసి ధరణి పరిగెత్తుకువచ్చి నన్ను విడిపించాడు.

నేను మంత్రినయాక ఒక ప్రత్యేక విషయంమీద మనస్సు లగ్నం చేశారు ఘుంయాలు. ఏమిటంటే-రాజుగారి కోటలో అనేక లక్షల రూపాయలున్నాయి. అవి దోచుకో వాలనీ, రాజుగారి కుటుంబాన్ని పరిజనంతో కూడా ఎత్తుకురావాలనీ వాళ్ల ప్రధానలక్ష్యం. రాణీ రాజకుమారీ వారి పరిచారికలూ ఉండటంకోసమని కొండకింద వరసపెట్టి ఆకుపాకలు తయారయాయి. పాకలు సిద్ధం కాకపోతే వారంతా ఎక్కడ ఉంటారు?

"మనకి ఇరవై బాంబులు కావాలి" అన్నాను నేను. "ఎవరైనా వెళ్ళి వంద బాంబులు అలాంటివి తీసుకురండి. వందబాంబులైతే ఈ కొండ ఎగరగొట్టెయ్యవచ్చు. మట్టి ప్రాకారం గల కోట అనగా ఎంతమాత్రం?" అన్నాను. ఒకరు కలకత్తా వెళ్ళి వంద బాంబులు కొని తేవాలని నిశ్చయమయింది. వెయ్యిరూపాయలు కావాలి దానికి. రూపాయలు జమ చేయడం కోసం ముఖ్యులైన ప్రజలకు తాఖీదులు వెళ్ళాలి. ఇద్దరు గుమాస్తాలు పని మొదలు పెట్టారు. వేలువేలు తాఖీదులు వెళ్ళవలిసి ఉంది. ప్రతితాఖీదుమీదా "మహారాణీపుత్ర" ధరణీ ధర్ ఘుంయా, సంతకం జరగవలిసి ఉంది. అది అంత తేలికా? ఒకటిరెండు దినాల్లో జరిగే పనా? రాత్రీ పగలూ గుమాస్తాలు తాఖీదులు రాస్తూ ఉండేవారు. వారి పని నేను తనిఖీ చేస్తూ ఉండేవాణ్ణి.

సైన్యపటాలం వచ్చి కెంవుఝురపట్నం కాపాడాలని గవర్నమెంటు ఆర్డరు. పటాలం రాలేదు. ఎంతకాలం ఘుంయాలను ఆపగలను ? వీళ్లు ఒకమారు కోటలో అడుగు పెట్టారా, రాజుసంపదా, అతడి గౌరవ మర్యాదలూ అన్నీ నాశనమయిపోతాయి. ఇవి రాజుకి

తెలియచెయ్యడం అవసరం. కాని రాజు ఎక్కడున్నదీ ఎలా తెలుస్తుంది? తెలిసినా ఎలా కబురు చేయడం? ఒక ఆలోచన తట్టింది నాకు. బాలేశ్వరం భోలానాథ్ దే ఆనందపూర్‌లో సర్వేయరుగా ఉన్నాడు. అతనికి నేను కబురందిస్తే రాజుకి ఉప్పందిస్తాడతను. ముందే చెప్పాను, తాంబూలమంటే మహాయిష్టం ధరణికి. తరుచు నా బసకి వచ్చి తాంబూలం వేసుకునేవాడు. నేను వెళ్ళి అతడితో చెప్పాను. "నాదగ్గిర తమలపాకులు అయిపో యాయి" అని. "ఇక్కడ తమలపాకులు దొరకవు. భద్రక్‌లో నా కంబారి (పొలం కాపరి, పాలేరు) భోలానాథ్‌కి నేను వ్రాస్తే ఆకులూ, చెక్కలూ పంపిస్తాడు. అంతేకాక అక్కడ చిన్న చెరుకుమడి నేను వేశాను. నేను వచ్చేయడంచేత నీరులేక ఎండిపోతూ ఉంటుంది చెరుకు. సెలవైతే చెరుకుమడికి నీరు పెట్టించమని కూడా అతడికి వ్రాస్తాను" అన్నాను. ఉత్తరం వ్రాయడానికి అనుజ్ఞ దొరికింది. నేను వ్రాసిన ఉత్తరం నకలు కింద పొందుపరుస్తున్నాను.

రాయిసుంఅ<br>
మే 16, 1891

కంబారి భోలానాథ్ వినవలసింది.

మహారాణీ పుత్రగారికి తక్షణం అవసరం, వంద తమలపాకులూ, రెండు వందలు పోకచెక్కలూ పంపించు. చెరుకు మడికి ఉత్తరం వేపునుంచి నీరుపెట్టు. అలా కాకపోతే అది పాడైపోతుంది. ఇంతే సంగతులు.

*ఫకీర్ మోహన్ సేనాపతి*

మహారాణీపుత్ర ముందు ఉత్తరం చదవడం జరిగింది. అనుమతి పత్రం మీద అతడు సంతకం చేశాడు. ఆనందపూర్‌కీ కెంవ్ఝర పట్నానికీ మధ్య మూడు నాలుగు తనిఖీ చౌకీలున్నాయి. మహారాణీపుత్ర సంతకంతో అనుమతి పత్రం లేందే ఈ రోడ్డు మీద ఎవ్వరూ రాకపోకలు చెయ్యలేరు. ప్రతి చౌకీ దగ్గిరా బాటసారుల్ని పూర్తిగా పరీక్షించేవారు. మంచి బలవంతులైన సిపాయిలచేత ఉత్తరం పంపాను. సోడాబుడ్ల నుంచి తీసిన మూడు చిన్నచిన్న తీగెముక్కలు ఒక ఖండాయత్ సిపాయి జందెముతో ముడిపెట్టాను. సిపాయీలు బందీలుగా ఉండేవారు. ఇంటికి వెళ్ళడానికి ఇప్పుడు స్వేచ్ఛ దొరికింది వాళ్లకి. అందుకని పగలూ రాత్రీ ఆనంద్‌పూర్ పరిగెత్తారు. రాజు ఆనందపూర్‌లోనే ఉన్నాడు.

ఉత్తరమూ, మూడు తీగె ముక్కలూ అతడికి అందించారు సిపాయిలు. రాజు ఉత్తరం చదివాడు. మూడు తీగె ముక్కలూ చూశాడు. ఇలా వ్యాఖ్యానించాడు: మూడు తీగెముక్కల అర్థం మూడు తంతులు – టెలిగ్రాములు. ఒకటి గవర్నమెంటుకీ, ఒకటి కటకం పోలీసు సూపరెంటెండెంటుకీ, మూడోది నందకిశోర్ బాబుకీ, లేదా మధుబాబుకీ పంపాలనీ మేనేజరు (నా) అభిప్రాయం. తమలపాకులు అంటే సైన్యం. పోక చెక్కలు అంటే తుపాకి గుళ్ళు. చెరుకుతోట అంటే కెంవ్ఝర్ నగరం. సైన్యం ఉత్తరంవేపు బైబసాగుండా వెళ్ళాలి. లేకపోతే కోట దోపిడీ అవుతుంది అని ఉత్తరం భావం.

ఇక్కడ నేను సాయుధ సైన్యం కోసం ఎదురు చూస్తూ దినాలు గడుపుతున్నాను. ఒక్క మహాపాత్రను తప్ప ఎంతోమంది భుంయా సర్దార్లని అప్పటికే అదుపులో పెట్టు

కున్నాను. నా నడవడిమీదా, హావభావాల మీద గట్టి నిఘావేసి ఉండేవాడు మహాపాత్ర. కాని అతణ్ణి నేను సందేహిస్తున్నట్టు రవంతైనా సూచన దొరకనివ్వలేదు నేను.

## భాష, జాతీయ సమైక్యత

'ఉత్కలమణి' గోపబంధుదాసు

( 1876 - 1928 )

భారత దేశంలో జాతీయ పురోభివృద్ధి కోసమని అందరూ ఇవాళ వ్యాకులపడుతున్నారు. భారత జాతీయత ఎలా స్థిరపడుతుందని పత్రికలలో చర్చలూ, సభలలో ఉపన్యాసాలూ సాగుతున్నాయి. కావ్యాలలోను, నవలలలోను, నాటకాలలోను ఇదే ధ్వనిస్తూ ఉంది. భారత దేశంలో జాతీయత అభివృద్ధి కావడం కేవలం అసంభవం అంటూ అనేకమంది నిరాశ చూపుతున్నారు. ఉత్సాహం పుంజుకోడం కోసమని కొందరు గతచరిత్ర నెమరు వేస్తున్నారు. కొందరు భవిష్యత్తు మీద ఆశలు పెట్టుకుంటున్నారు. కొంతమంది ఆంతరంగికమైన తమ పురాతన సంస్కృతిని విశ్లేషిస్తున్నారు. మరికొందరు పరాయివారి మీద ఆధారపడుతూ, పాశ్చాత్య దేశాలమీద ఆశ పెట్టుకుంటున్నారు. ఈ జాతీయ సందిగ్ధం నిజంగా హిందూ దేశానికి విపత్కరమైంది. దేశంలో ఎన్నో రాష్ట్రాలున్నాయి. దానికి తోడు రాష్ట్రానికీ రాష్ట్రానికీ రాష్ట్రానికీ మధ్య పద్ధతులూ, ఆచారాలూ విభేదిస్తున్నాయి. వీటన్నిటిపైనా పరస్పర అవసరాలకు సంబంధించిన వైరుధ్యాలూ ఎన్నో ఉన్నాయి. హిమాలయానికీ కన్యాకుమారికీ మధ్య ఎప్పుడైనా సంబంధముందా? అని ఆలోచిస్తే ఒక్కొక్కప్పుడు హృదయం కుంగిపోతుంది. ప్రాచీన కాలంలో భారతీయ రాష్ట్రాలు బోలెడన్ని ప్రత్యేకతలతో ఉండేవి. రాష్ట్రానికీ, రాష్ట్రానికీ మధ్య రాకపోకల సౌకర్యాలు కష్టంగా ఉండేవి. ప్రతి రాష్ట్రమూ అడవులూ, నదులూ మొదలైన సహజసిద్ధమైన సరిహద్దులతో కప్పిఉండేవి. అందువల్ల అలాటి ప్రతి రాష్ట్రంలోను కాలక్రమాన భాష, సాహిత్యమూ, చరిత్రా, ఆచార వ్యవహారాలూ మొదలైనవి ప్రత్యేకంగానూ, స్వతంత్రంగానూ పరిణామం పొందడం ఎంతైనా సహజమే. కాని అనాదిగా వస్తూఉన్న ఆర్యనాగరికత వెన్నెముకలా నిలిచి ఉండటం ముఖ్యంగా గమనించదగిన విషయం. ఆర్య సంస్కృతి గల మునులు మానవశీలమూ, దాని ప్రాధాన్యతా గుర్తించి మానవుల భావసమైక్యతకు భాష ఏకైక సాధనం" అని పదే పదే ప్రబోధించారు. మనుషులు వివిధమైన గుణాలతో ఉండవచ్చు. అలాగే వారి ఆచార వ్యవహారాలూ రకరకాలుగా ఉండవచ్చు. వారు వివిధమైన భౌగోళిక పరిస్థితులలో పెరగవచ్చు. అందువల్ల వారంతా ఎక్కడ కలుస్తారు? అన్న ప్రశ్న సహజంగా ఉదయిస్తుంది. ఆర్యుల ఆధిపత్యం భావాలు, ఆలోచనలు మొదలుకుని క్రమక్రమంగా తుదకు నాగరికతారంగం యావత్తూ తనలో పొదుగుకుంది. క్రమక్రమంగా శూరసేన, లేదా మహారాష్ట్ర ఆర్యులకూ మగధ ఆర్యులకూ మధ్య భిన్నభిన్నమైన భేదాలు ఏర్పడ్డాయి. ప్రత్యేకమైన ప్రాంతీయ విశేషం తయారయింది. అయితే సంస్కృత భాషా, వైదిక సంస్కృతీ ఆ భిన్నత్వంలోనే గణ

సీయ మైన గట్టి ఐక్యత సాధించాయి. అలాగే సాధిస్తూ ఉన్నాయికూడా. ద్రావిడులకూ, ఆర్యులకూ సంఘర్షణ వచ్చింది, నిజమే కాని ద్రావిడులు క్రమేపి ఆర్యుల భాషనూ, సంస్కృతినీ, నాగరికతనూ అంగీకరించారు. దాని ఫలితంగా ఆర్యులతో వారు పూర్తిగా కలిసి పోయారు.

భారతదేశంలో రాష్ట్రీయ ప్రత్యేకత నెమ్మది నెమ్మదిగా క్షీణిస్తూ వచ్చింది. అయితే అది జాతీయ సమైక్యత నేపు ప్రయాణిస్తూ ఉందా? దీనికి విరుద్ధంగా లెక్కలేని స్వార్థాలూ, ఎన్నో అన్ని ప్రత్యేకతలూ ప్రతిరాష్ట్రంలోనూ తలెత్తుతున్నాయి. రాకపోకల సౌకర్యాలు సులువయినాయి. అంతర్ రాష్ట్రీయ సంబంధాలు అధికమవుతున్నాయి. విడిగా ఒకే జాతి నివసించే రాష్ట్రమేదీ లేదు. వివిధ కులాలకు, ధర్మాలకు, మతాలకు చెందిన ప్రజలు ఒకచోట నివసిస్తున్నారు. వారు తమ స్వభాషా, సాహిత్యమూ, సంస్కృతీ, ఆచారమూ, సాంఘిక వ్యవహారాలూ మొదలైనవి తమతో నిలుపుకుంటున్నారు. తమ ప్రత్యేక స్వలక్షణాలు వదిలిపెట్టడానికి వారు సంసిద్ధులు కారు. వృత్తివల్ల కాని మరేదో కారణం వల్లకాని తాము స్థిరపడిన ప్రదేశంలోని భాషా, సాహిత్యమూ. ఆచార వ్యవహారాలూ అలవర్చుకోడానికి ఇష్టపడరు. అలాంటప్పుడు భారతీయ ఐకమత్యం మాట అటుంచి రాష్ట్రీయ ఐకమత్యం మాత్రం ఎలా సంభవమవుతుంది? ఏమైనా ఈ స్థితిలో మనం ఇంత అసమంజసమైన ప్రాంతీయ ప్రకృతిలో ఐకమత్యం కుదర్చగలిగిన భాషమీదా, సాహిత్యంమీదా, సంస్కృతిమీదా తిరిగి ఆధారపడడం అవసరం. సమస్య రవంత పరిశీలిస్తే భావమే కానీయండి, సంస్కృతే కానీయండి-అన్నిటికీ మూలం భాషే అని వ్యక్తమవుతుంది.

భాషలో వైరుధ్యం లేనప్పుడే భావంలో ఐకమత్యం కుదురుతుంది. కాగా సంస్కృతి ఒక్కటే అన్నది తిరుగులేని సత్యం. నాగరికతగల ప్రపంచ దేశాలన్నీ ఈ సూత్రాన్ని అంగీకరించాయి. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వివిధ జాతుల ప్రజలు ఉంటున్నారు. ఇంగ్లీషువారు, జర్మనులు, పోర్చుగీసులు-అందరూ ఆ దేశంలో నివసిస్తున్నారు. దైనందిన జీవితానికి సంబంధించిన నియమాలూ, న్యాయచట్టాలూ ప్రతి రాష్ట్రానికీ భిన్న భిన్నంగా ఉంటాయి. అయితే అన్ని రాష్ట్రాలూ ఇంగ్లీషు ఒక్కటే రాష్ట్రీయ భాషగా (State language) అంగీకరించాయి. ఇంగ్లీషు భాష అంగీకరిస్తే తప్ప ఎవరికీ పౌరసత్వపుహక్కు ఆలవడ దక్కదు. ఎన్నో ప్రాంతీయ విభేదాలున్నప్పటికీ భాష ఒక్కటే కావడం చేతనే ఆదేశంలో జాతీయ చైతన్యం సాధ్యమయింది. ఈ దినాల్లో ఒక భారతీయ రాష్ట్రంలో రకరకాల ప్రజల్ని మనం చూస్తాము. క్రమంగా భిన్నభిన్న తరగతులవారు, సంఘాలవారు వచ్చి చేరుతున్నారు. గతంలోని ఒంటరితనం ఏమీలేదు. మన భారతీయ సమైక్యత సుస్థిరంగా ఉండాలంటే ప్రజలంతా జాతీయ భాషను లేదా తాము నివసిస్తున్న చోటి ప్రాంతీయ భాషను అంగీకరించడం అవసరము. అప్పుడే భావసమైక్యత సాధ్యపడుతుంది. అప్పుడే వారు ఆ ప్రాంతపు ఆచారాలూ, సంస్కృతీ, సాహిత్యమూ అంగీకరిస్తారు. కాలక్రమాన దాని గత చరిత్రమీదా, వర్తమాన చరిత్ర మీదా ప్రేమా, విశ్వాసమూ కుదుర్చుకుంటారు. వివిధ ప్రాంతాల వారంతా ఒకే భాష మాట్లాడినట్లు చేసి, వారిని ఒకే పరిపాలనా వ్యవస్థకిందికి తీసుకు వచ్చినప్పుడు కాని జాతీయ సమైక్యతా లక్ష్యం సాధ్యం కాదు.

# ప ర జా

గోపీనాథ్ మహంతి

(నవల నుంచి)

కాలం ముదిరిన కొద్దీ తల్లిదండ్రుల చేతులూ, ఒడులూ కఠినంగా, ఎముకలుగా తయారవుతాయి. కాని వాటి స్పర్శలో ఏముంటుందో హృదయం చల్లబడుతుంది. మనో వేదన శాంతిస్తుంది. కారణమూ, ఫలితమూ రెండూ వేరుపడినప్పుడు వాటి బాహ్యార్థంలో ప్రత్యేకత గోచరిస్తుంది. అయితే వాటి కలయిక వల్ల అనంతమైన, అమృతమయమైన జీవ రాగం ఉజ్జీవన మవుతుంది.

అందరూ అలా నిశ్శబ్దంగా కూర్చున్నారు. టిక్రా ఒళ్ళు తడువుకుంటూ ఉండే వాడు. సుక్రుజాని చుట్ట జోరుజోరుగా పీలుస్తూ ఉండేవాడు.

"అయ్యా ! నేను నాట్యానికి వెళతాను". నిద్రలో పలవరించినట్టు అన్నాడు టిక్రా.

"సరే, వెళ్ళు. అట్టే ఆలస్యం చెయ్యకు".

టిక్రా వెళ్ళిపోయాడు.

కొంతసేపయాక మాండియాజాని పిలిచాడు-"అయ్యా !"

"ఏం బాబూ ?"

"నా పెళ్ళి సంగతేమిటి ?"

"ఊఁ"

ఏమిటి నిశ్చయించావు?"

"ఏమిటి?"

"నా పెళ్ళి సంగతి"

ఈ మాట ముసిలాడు శ్రద్ధగా విన్నాడు. కాలుతూ ఉన్న చుట్ట కొస కాలి మడమతో ఆర్పేసి, మళ్ళా కాల్చుకునేందుకు అట్టే పెట్టాడు. తరవాత అడిగాడు : "ఏంచేసేది చెప్పు ? నువ్వయినా ఆలోచించి చెప్పు". తండ్రి అభిప్రాయం మాండియాజాని తెలుసు కున్నాడు. నిజానికి అన్నీ కలిసి ఒకవేపు, డబ్బు ఒకవేపు. అప్పటికేతాను ఒకరి దగ్గిర గుత్తపడి ఉన్నాడు. తన శరీరం తాకట్టులో ఉంది. మరొకమారు దానిని తనఖా పెట్టడం వల్లకాదు. కన్యాశుల్కం ఇవ్వనిదే ఏ పిల్ల తండ్రి తనకు పిల్లనిస్తాడు ?

కొడుకు ఊరుకోడం చూచి ముసిలాడు అన్నాడు: "పురుజాని ఏం బేరం పెడ తాడో నాకు తెలియదు. చిన్న మడిచెక్క తప్ప మనకు ఏమీలేదు, నీకు తెలుసు. అది తాకట్టు పెడతాను, లేదా అమ్మేస్తాను. కాని నా ఇంటికి కోడలు వస్తే దానికి తిండి పెట్టడం ఎలాగ ? పెళ్ళికాని కూతుళ్ళిద్దరినీ పోషించడ మెలాగ ?"

వాదనకోసం మాట్లాడే మాటలకీ హృదయం లోపలినుంచి వచ్చే మాటలకి ఉండే తారతమ్యం సుక్రుజాని గమనించాడు. మాండియాజాని మీద చిరాకు పడ్డాడతడు. ఏమంటే, ఎప్పుడూ అదేపనిగా ఆలోచించడమే, ఆలోచించడమే, అతడు. ముసిలిమని షిలాగ సమస్య ఈవేపూ, ఆవేపూ ఆలోచిస్తూనే ఉంటాడు.

యువకుడైన వాడు ఆలోచించడు. దురుసుగా ముందుకు దూసుకుపోతాడు. ఎదటి దారి దానంతట అదే తెరుచుకుంటుంది.

తన యువావస్థలో మాండియాజాని తల్లి కడుపులో ఉన్నాడు.

ఎవతెనో ఒక పిల్లని ఎత్తుకురావలసిం దతడు. అయితే పెళ్ళికూతురు బంధువులు వచ్చి రివాజు ప్రకారం బాగా రెండు వాయించి, కన్యాశుల్కం తెములుస్తారు. ఎలాగో సరిపెట్టుకోవచ్చునది. ఈ రకం పెళ్ళిళ్ళు తరుచు జరుగుతాయి. అలాటి పెళ్ళిని 'ఉదులియా' అంటారు.

మాండియాజాని ఏం చెయ్యాలో చెప్పడంకోసం తిరిగీ తాను యువకుడు కాలేడుకదా!

విధేయుడూ బుద్ధిమంతుడూ అయిన కుమారుడి కోసం అతడి ఆత్మ కలతపడింది. కొడుకుని అద్దాలలో పెట్టుకుని తలమీద జోకొడుతూ నిద్రపుచ్చాలని అనిపించిందతడికి. జాలి కలిగింది. భరోసా కలిగిస్తూ, ఉత్సాహం పుట్టిస్తూ ఇలా అందుకున్నాడు : "పెళ్ళిళ్ళ కాలం దగ్గిర పడుతూఉంది. నన్నింత అడగడమెందుకూ ? నువ్వు కోడల్ని ఇంటికి తెస్తే ఎంతో సంతోషిద్దును. సంతోషించడానికి మీ అమ్మ లేదు మరి".

"నాట్యానికి వెళతాను" అన్నాడు మాండియాజాని, "అయ్యా! నా దగ్గర మంచి పొగాకు రెమ్మ ఉంది. కావాలంటే కాల్చుకో..." తండ్రిపట్ల అతడి మనస్సు ఎంతో మెత్త పడింది. ఒకేకోవకు చెందినవాళ్ళు వాళ్ళు. కనక తండ్రి అభిప్రాయం గ్రహించగల డతడు. అతడి హృదయంలో తండ్రిపట్ల కృతజ్ఞత తొణికిస లాడింది.

చీకటిలో కొడుకు కళ్ళు, మొహమూ చూడలేకపోయాడు సుకుజాని. చెయ్యి చాచి పొగాకు అడిగాడు, "ఓ, పొగాకు ఉందా నీ దగ్గర ? అయితే ఇయ్యి."

అందరూ వెళ్ళిపోయారు. ముసిలాడు ఒక్కడూ చీకటిలో అరుగుమీద కూచున్నాడు, చల్లటి ఐదిగాలి మొహంమీద కొడుతూఉంది. ఊరి నాట్యకోలాహలం మనస్సులో దూరి లోపలి దేనినో రేకెత్తిస్తూ ఉంది. ఎదటి పొదలమీద చూపుని నిలిపి, కలత పెడుతూన్న తలపులు అడచుకోవాలని ప్రయత్నించాడతడు. లక్షలాది మిణుగురులు ఆకులమీద అంటి పెట్టుకున్నాయి. ఒకేసారి మెరుస్తూ, ఒకేసారి ఆరిపోతున్నాయి. ఇవేవీ ఉద్రూత లూగుతున్న మనస్థితికి నిలకడ కలిగించలేకపోయాయి.

ఉఁ హూఁ......మనశ్శాంతి వీలులేదు. ఊరిచివరి నాట్యం తనను నెట్టుతూఉంది. అప్పటికే అది తన ప్రతి అవయంతో-రక్తమంతటా సారాయిలాగ చొరబడింది.

చప్పున తలపుకి వచ్చింది-తనకి చేతులున్నాయి కాళ్ళున్నాయి. శరీరముంది. అవయవాలన్నిటికి పరిమాణముంది. బరువూ ఉంది...

ముసిలాడు లేచాడు. నెమ్మదిగా తన చేతికర్ర ఆనుకుంటూ, నాట్యం జరుగుతూ ఉన్న దిక్కు మెల్లిగా నడిచాడు.

## పితా ఓ పుత్ర

సురేంద్ర మహాంతి

(కథనుంచి)

పై కప్పులోని చిన్న రంధ్రంలోనుంచి జారిన సన్నని ఉదయకిరణం చీకటి ఛేదు

కొట్టులో మసగ వెలుగు ప్రసరించింది. రాజగృహం వీధుల్లో దైనందిన జీవితంలోని ఎప్పటి కలకలం మీదికి వినవస్తూ ఉంది. ఆకలితో అలసిన చూపుతో రంధ్రంలోని కిరణం వేపు చూశాడు ఖైదీ చల్లగా, స్నిగ్ధంగా బుద్ధభగవానుడి దీవనలా ఉంది ఉదయరేఖ.

వార్ధక్యంతోనూ, సంతాపంతోనూ, ఆకలితోనూ బాధపడుతూ కృశించిపోయి జాలిగా, ఎముకల పిశాచంలా కనిపిస్తున్నాడు ఖైదీ. ఒకప్పుడు తరుణంగా, విశాలంగా ఉన్న అతడి వక్షస్థలం జీబుగా పండు వెంట్రుకలతో కప్పిఉంది. ముడతలు పడి వేలాడుతూ ఉంది చర్మం.

ఖైదీ మగధ చక్రవర్తి బింబిసారుడు. తన కన్న కొడుకు అజాతశత్రువు ఆజ్ఞప్రకారం ఖైదులో పడున్నాడతడు. తిండి పెట్టకుండా పిసరపిసరగా అతణ్ని చంపాలని ప్రతిన పూనాడు అజాతశత్రువు. దుఃఖంతోను, బాధతోను బరువెక్కిన ఖైదీ కనురెప్పలు తిరిగి మూతపడ్డాయి. ఆకలితోనూ అలసటతోనూ అతడి ప్రతి అవయవమూ క్షీణించిపోయి పట్టు తప్పిపోతూఉంది.

ఆర్చుకుపోయిన నాలుకతో పొడిపెదవులు తిరిగి ఓ మారు చప్పరించి, బాధతో మూలిగాడు బింబిసారుడు.

ఈ రాజగృహం అతడి ఆదేశంవల్లే తయారయింది. అతడే ఇప్పుడు ఇక్కడ ఈ చీకటి కారాగృహంలో బయటి ప్రపంచానికి తెలియకుండా అనుక్షణం మరణవేదన అనుభవిస్తున్నాడు. దీనికి అర్హుడేనా అతడు ? కాకపోతే ఇదంతా అతడు గత జన్మలో చేసుకున్న కర్మఫలమా ?

వెనుకటి మగధ రాజధాని కుశాగ్ర నగరంలో ఒకప్పుడు భయంకరమైన అగ్ని ప్రమాదం సంభవించింది. ఏ ఇంట నిప్పు పుడితే ఆ ఇంటి యజమానిని రాజధాని నుంచి బహిష్కరించాలని రాజశాసనం ప్రకటించాడు బింబిసారుడు. విధి విధానం తెలియరాంది. కోటలోనే అగ్గి పుట్టింది. ఇంటి యజమాని బింబిసారుడు. తనంతతాను ప్రవాస శిక్ష విధించుకుని దగ్గరి అడవికి (శీతల వనానికి) వెళ్ళిపోయాడు. చుట్టూ వైభార, వృద్ధకూట, విపుల పర్వత పంక్తులతోనూ, పక్కనే పారుతూఉన్న సర్పిణీ నదీ ఒలాలతోనూ చల్లనైన అరణ్యం బింబిసారుణ్ని ముగ్ధుణ్ని చేసింది. అక్కడే అతడి ఆదేశ ప్రకారం మగధ కొత్త రాజధాని రాజగృహం తయారయింది.

అదే రాజగృహాన్ని తుదిసారి చూడటానికా అన్నట్టు అలిసిపోయి జీవంలేని, చూపులేని రాతిగుళ్ళలాటి తన కళ్ళు తెరిచాడు బింబిసారుడు.

అవాళ అజాత శత్రువు ఆజ్ఞప్రకారం బింబిసారుణ్ణి ఖైదులో పెట్టాక కోసలదేవి దుఃఖార్తురాలై ఏడుస్తూ, విడిపోయిన జుత్తుతో అజాత శత్రువు దగ్గరకి పరిగెత్తుకు వెళ్ళి ప్రాధేయపడింది.

"నాయనా!"

అజాతశత్రువు అవహేళన స్వరంతో అన్నాడు:

"ఏమి ఆజ్ఞ మహారాణీ !"

" 'అమ్మా' అని నన్ను పిలవడం అంత పరువుతక్కువా నాయనా ?" అని అడిగింది కోసలదేవి. విరగబడి నవ్వాడు అజాతశత్రువు "నిన్ను 'అమ్మా' అని పిలవడానికి అంత

అభ్యంతరమేమీ లేదు నాకు," శుష్కమైన కఠిన స్వరంతో అన్నాడతడు, "కాని తల్లీ! ఒక్కటి అడుగుతున్నాను- తన కొడుకు పితృఘాతకుడవుతాడని శంకించి పుట్టకముందే వాణ్ణి హత్య చేయాలని ప్రయత్నించిన తల్లి వచ్చి తనను 'అమ్మా' అని పిలవమంటే ఆ దుర దృష్టవంతుడు ఏమనాలో చెప్పు."

కోసలదేవి అసహాయ కంఠంతో అంది: "వెయ్యిమార్లు చెప్పానుకదా, నాయనా! ఇవన్నీ ఉత్తి పుకారులని."

"ఏమీ నిజం లేందే పుకారు పుట్టదు," అజాతశత్రువు మళ్ళా జవాబు చెప్తూ అన్నాడు, "అయినా ఆ చర్చంతా ఇప్పుడెందుకు. ఏమైనా కేవలం బింబిసారుణ్ణి ఒదిలిపెట్టడం తప్ప నువ్వు ఏం కోరినా విచారించడానికి సిద్ధంగా ఉన్నాను."

కోసలదేవి తన మలిన చేలాంచలంతో కన్నీళ్ళు తుడుచుకుంటూ గద్గద కంఠంతో అంది: "కన్నతండ్రి రక్తంతో చక్రవర్తి పట్టాభిషేకం చేసుకుంటానంటే అపడానికి ఎవరు సాహసించగలరు? కాని నాదొక్క కోరిక మహారాజా! ఈ దురదృష్టవంతురాలి చేతివంట తప్ప ఇంకేదీ రుచికరమయేదికాదు బింబిసార చక్రవర్తికి. అందుకని ఇవాళ జైల్లో ఆయనకి నా చేతులతో వండిన భోజనం పెట్టడానికి నిరాకరించవద్దని ప్రార్థిస్తున్నాను."

"ఈ ప్రార్థన అంగీకరించాను" అన్నాడు అజాతశత్రువు. కాని కోసలదేవి అక్కడి అక్కడినుంచి వెళ్ళిపోగానే కారాగృహ రక్షకుడైన చండను పిలిచి ఆమె పంపే అహారం ఏదీ ఖైదీ ముట్టకుండా చూడు" అంటూ ఆదేశించాడు.

నీటిపాత్ర శూన్యంగా ఉంది, పొడిగా ఉంది. వణుకుతూన్న చేతులతో పాత్ర పెద వులకు తగిలించబోయి కిందపడేశాడు బింబిసారుడు. కిందపడి ముక్కముక్కలయిపోయింది పాత్ర.

ఉదయసూర్యుడు ఆకాశంమీద ఎంతో పైకి పయనించాడు. ఖైదు గదిలో చొర పడిన వెలుగురేఖ అప్పుడే మాయమైంది. ఖైదుకొట్టు లోపల చీకటి దట్టంగా ఉంది. విషాదం భయం పుట్టిస్తూ ఉంది.

ఆకలి దారుణ వేదన మరిలేదు. శారీరకమైన బాధ, దప్పిక మాత్రం మిగిలాయి. అవికూడా కొంచెం సేపటిలో పోతాయి. అనంతరం కేవలం శూన్యం మిగులుతుంది. బుద్ధుడి సమాధిస్థితిలాటి శూన్యం.. ఖైదీ కళ్ళు కదలిక లేకుండా నిలిచిపోయాయి. శూన్యవృత్తం పరిధి మెల్లమెల్లగా నలువేపులనుంచీ క్రమంగా బింబిసారుడికి దగ్గిరగా చేరుకుంటూ ఉంది. అతడి మనక దృష్టి ఎదట మహాశూన్య పృష్ఠభూమి. ఆమనకదృష్టిలో బుద్ధదేవుడి శాంతగంభీర మూర్తి కనపడింది. అర్ధనిమీలితాలైన అతడి రెండు నేత్రాలలోను దివ్యకాంతి తాండవించింది

బింబిసారుడి తడిలేని నాలుకనుంచి, పెదవులనుంచి నల్లని రక్తం చుక్కలు చిందాయి. వాటితో అతడి గొంతుక రవంత చెమ్మగిల్లింది. దెబ్బతిన్న తోడేలులాగ రుద్ధ కంఠంతో మూలిగాడతడు.

మాహాశూన్య పృష్ఠ భూమిని గృధ్రకూట శిఖరం మీది సప్తపర్ణిగుహ బింబిసారుడి కళ్ళముందు మెరిసింది. ఆ గుహలో శాక్యరాజ కుమారుడు గౌతముడు వానకాలంలో తపస్సు చేస్తున్నాడని విని ఒకప్పుడు విస్మితుడయాడు బింబిసారుడు,

అవాళ నీరసమైన సాయంకాలపు నీడలు నిర్మలమైన నీలాకాశాన్ని ఆవరిస్తున్నాయి. గౌతముణ్ణి దర్శించడానికి సపరివారంగా వెళ్ళాడు బింబిసారుడు. గుహ దక్షిణద్వార ప్రకోష్ఠంలో తన శిష్యులకు ప్రవజ్జ సూత్రాలు నెమ్మదిగా మృదుకంఠంతో బోధిస్తున్నాడు గౌతముడు.

పర్వతపాద ప్రదేశాన ఆనందంతో నాట్యం చేస్తూ ఉంది నెమలి. ఉండుండి హటాత్తుగా తన పెంటి నెమలి కనపడక పోవడంతో దాని అడుగులు తరచు లయ తప్పుతున్నాయి. ఉండీ ఉడిగీ చుంచువున ప్రియురాలి ముద్దు పరవశత్వం కలిగిస్తూ ఉంది. కొంచెం దూరంలో ఎంచక్కటి లేళ్ళమంద విశాలమైన పచ్చికబయలులో గరిక మేస్తూఉంది. అమాయకపు ఆడలేడి ఒకటి చేరువలోని నీలిచెరువు నీళ్ళలో తన ప్రతిబింబం చూస్తూ మురిసిపోతూ ఉంది......మామూలు అభినందనాలు ముగిశాక బింబిసారుడు అడిగాడు "ఎందుకీ వ్రత సాధన రాజకుమారా ? ఏం దుఃఖం దీనికి కారణం ?"

చిరునవ్వుతో జావాబు చెప్పాడు గౌతముడు "ఏ దుఃఖం వల్లా కాదు మహారాజా, జీవన దుఃఖానికి కారణమూ, దాని నివారణోపాయమూ వెదకడమే ఇదంతా".

పకపకా నవ్వుతూ అన్నాడు బింబిసారుడు ''కారణం అతి సహజమైంది. కాని ఏ కాంతమైన ఈ చీకటిగుహలో దానికి విరుగుడు ఎలా కనిపెట్ట గలవు ? నాతో రాజ గృహం విలాసమందిరానికిరా. అక్కడ మధుపాత్రలో, రాజనర్తకీమణుల కామనృత్యంలో అన్ని దుఃఖాలకీ ఉపశాంతి లభిస్తుంది."

"ఆః ... ... ... ... అర్చుకుపోయిన తన గొంతుక ఎవరో పెరికేస్తున్నట్లు వికారంగా నవ్వాడు బింబిసారుడు.

కొంతసేపయాక గౌతముడు జవాబిచ్చాడు." ఈ దాహాన్ని వాంఛ తీర్చలేదు. మహారాజా."

ఒంటరి ఖైదు కొట్టులో వికృత నిశ్శబ్దం ఈ మాటలతో మారుమోగిఉంటుంది.

* * * * * * * * *

రాజగృహ దిగంతానికి అలంకరించిన మేఖలలా ఉన్న పర్వతపంక్తుల వేపు మేడ మీద కిటికీలోంచి చూస్తున్నాడు అజాత శత్రువు. పురిటి గొప్పులు పడుతూ ఎండిన ఎడారి లాగ పక్కమీద పడుంది వజ్ర. పావురాల గూళ్ళలోంచి పావురాలు ఎగిరి బయటకి వెళుతూ తిరిగి వస్తున్నాయి. అంతఃపుర ఉద్యానంలో తమాల వృక్షాల నీడల్లో పెంపుడు నెమలి పురివిప్పి నాట్యం మొదలుపెట్టింది.

"మహారాజా ! " అలసిన గొంతుకతో పిలిచింది వజ్ర. ఆమె పక్కని కూచుని, పాలిపోయిన ఆమె నుదురు నెమ్మదిగా నిమురుతూ అడిగాడు అజాతశత్రువు. "ఏం కావాలి చెప్పు?"

"చెప్పండి మహారాజా, ఈ కానుపుకు కుమారుడా ? కూతురా ? అతడి చెయ్యి పట్టుకుని అడిగింది వజ్ర. అజాతశత్రువు తడబడి పోయాడు. మళ్ళీ అదేప్రశ్న వేసింది వజ్ర.

"ఈ బిడ్డ కూతురు కావాలా, కొడుకా ?"

ఆమె పక్కదగ్గిరనుంచి పారిపోయాడు అజాతశత్రువు. తన గదిలోకి పరిగెత్త పోయాడు, భరించలేని బాధతో అరిచింది వజ్రి.

కొడుకు. మగబిడ్డ, (వజ్రి కొడుకుని కంటుందా ? అజాతశత్రువుకి దుర్భరం.) రాజగృహం చీకటి ఖైదు కొట్టు, తన కాళ్ళకి సంకెళ్ళు, చేతికి అరదండాలు వేసిన దృశ్యం తటుక్కున తన కళ్ళముందు మెరిసింది. ఖైదీ అజాతశత్రువు తిండికోసం గట్టిగా ఏడుస్తున్నాడు.

*కవిసమ్రాట్ ఉపేంద్రభంజ్*

**లావణ్యవతి**

షష్ఠ ఛాంద

రాగ - రామకేరీ

మనదేయి శుణ కోవిదే నృపసుతా సుకేశీ
కూళరే వకుళ మూళరే పీఠ ఉపరే బసి.
సరసీ శోభిత అనాయిఁ మననేత్ర లోభిత
తట ఘటణ బిద్రూమరే పక్షి పంతి బింబిత.
కి నీళ శాఢీ హంసావళీ రంగధడి హోయిఛి
అవనీ వనితా బిస్తారే కిబా కిణిబా ఇచ్ఛి.
పాబచ్ఛ సచ్ఛస్ఫటికరె నీరతీర ప్రతీత
సువేణీ పరళ ఖాబి కి తహిఁ త్రివేణీ ఖ్యాత.
దీపదండీ లిఖి మరాళపంతి దియె భ ఉఁరీ
బడ బడ భీకి బెఢికి శోభా చూర్ణ చ ఉఁరీ.
జల జంబాల ఆబిళరె జనమన హరుఛి
జల నిర్మళరె ఆదర అదరఖుఁ సారుఛి.
గభీర గుణకు పండితతారు గృహీతవరి
నర్తకీతాబరు భఉఁరీ శిక్షా పరా ఏహారి.
అమృత సంగతే హోఇఛి మిత మధుర గుణె
బిధుర స్నేహకు బిధురకరే శీతల పణె.
కామ సరాశీరె ప్రకాశమాన సుఖదానరె
కుముదరె జెఋ ఉదిత తేఋ హరి ప్రకారె.
సర శోభా దెఖు దెఖు సే సరే మర్దన విధి
వక్షప్రమాణ జలె జాయిఁ బిజె లావణ్యనిధి.
కవి విచారిలా విచిత్రహెలా తుఁబీ బుడిలా
న బుడి శయిళ సలిళ ఉపరరే రహిలా.
కిసపుణి దేఖా న జాయి జెబెథాయి జీవరె
విషమ సమస్యా పూరణహెలా ఏహి తాహిరె.

'కవివర్' రాధానాథ్ రాయ్

## చి లి కా

"మాగుఛి, మెలాణి తోఠారె, చిలికా !
మాగుఛి, చిలికా! మెలాణి తొఠారె,
బాహుడిబి ఎబె దారుణ సంసారె,
కోరిథిలి ఆశా కరిబి యాపన
తో పశ్చిమతీరె పశ్చిమ జీవన,
వినా ప్రయాగరే సౌందర్య పిపాసా
మెంటిబార థిలా తోహఠారె ఆశా,
భాగ్యహోయిథిలే రుచి అనుకూళె,
అశ్రి థాంతి ముహిఁ తోర రమ్యకూళె,
కుటీర వరచి జటియా చరణే
కాటు థాంతి ఆయుశేష నికాంచనె,
మాత్ర పరిణామె ఛాయా బాజిబత
ఆశారె సే ఆశా హెలా పరిణత,
సంసారే ఆయిముఁ సదా ఉదాసీన,
ఉదాసీన ప్రాయె కటాయిలి దిన,
సంసారీ సంగతె సంగీహేబా పాయిఁ
కెబెహేఁ మోహర మన బళే నాహిఁ,
హసి ఖేళిసేహు గమంతి సమయ
జీవన మణంతి మహోత్సవమయ,
ఛార భాగ్యమోర పీహిత పాషాణె,
మో జీవన గఢా అన్య ఉపాదానె,
చిర హాహామయ ఏ ఛార జీవన,
జీవన నుహయి, జీవంతమరణ !
చిర దిన దుఃఖ ప్రహారె జర్జర,
పట్ట శిష్య ముహిఁ దుఃఖగురుంకర,
దుఃఖద త్తజ్ఞాన చక్షురె జగత
దేఖిబారె ముహిఁ అభ్యస్త సతత,
సుఖజోలి జాకు బోలయి సంసార,
కరుథాయి తాకు దూరుఁ ముఁజుహార,
సుఖరూపె జాహా జననేత్రే దిశే,
హాతే ఆసే, హాతుఁ పడిబాపాయిఁ సే,
వస్తునుహయి సే అటయిటి ధూమ,
అన్యనామ తార అకాశ కుసుమ,

తోహరి పుళినె మృగతృష్ణా ప్రాయె
మనో మృగ కుసే జగతె భ్రమాయె,
సే సుఖే నథిలా కెబే మోర స్పృహా,
లక్ష్యథిలా మాత్ర తోర తీర గుహా,
శాంతి రసాస్పద సెహిదదీ కోళె
వాగ్దేవీచరణ పూజబి నిరోళె
పూజిలె జెసన మజ్జి నిరజనె
తో మధురరూప మధు ఆస్వాదనె
భాగ్యవాన బెని వాణీంక కుదుర
కవి బలదేవ, భంజ వీరవర,
కాహిఁ సెహి, కాహిఁ ముహిఁ అకించన?
దేఖు థిలి సినా జాగ్రత్త స్వపన।
ఆశామదే మత్త హోయి క్షెత్ర థర
పురాయిలి మనమోదకె ఉదర,
న దేఖి మోహర జీవన పంజికా
గఢు థిల బిసి మనఅట్టాళికా,
తోళు థిలి సిగా వ్యోమపుష్పమాన
కరుథిలి మృగతృష్ణా జళే స్నాన,
అగ్రేపడి భీమ భవితవ్య ఛాయా
పళకే రుటిలా సే మోహన మాయా.
సే ఛాయా అంధారె దేఖిలి భీషణ
నైరాశ్యప్రేతర వికట నర్తన,
చారు ఛవి తోర సేహి బిభీషికా
తడి దేలా మను నిమిషే, చిలికా!

మాయాధర్ మానసింగ్
*(1906 - 1973)*

### కోణార్క

హే కోణార్క విగతయౌవనా!
మౌన దుఃఖె శైకత శయనా!
తోర ఏహి జీర్ణదేహే అద్యపి గో విముగ్ధ నయనే
చాహేఁ విశ్వకరుణారె తెజి అశ్రుతో దుఃఖ శయనే,
జగతర శిల్పీ కవి రూపరాగ దేఖితోహతారె
ఆశ్లేష ఇచ్ఛుఇ తోర వృద్ధ దేహే శోభా పిపాసారె.
అంగే అంగే చుంబిబాకు నిరవధి కరఇ భావనా

తోహరె గోగత జఉవనా :

బారణత కవి కల్పనారె
జగతర బుద్ధి అజణారె
అజ్ఞాత రహస్యమయ శయిళవ యాపిత తోహరి
జే దిన చకిత దృష్టి విశ్వర గో పడిలాతో పరి
యౌవన లావణ్య లీళా ఖేళు అధి అంగే అంగే తవ
ఫుటి ఉఠే దేహే దేహే సులళిత అంగస ఉష్వవ
మంత్ర శిఖి అసిథిల మనజయే మనరసే పారె
బారణత కవి కల్పనారె

సహసా హోయిలా విమళిన
నభే నభే హోయిలా విలీన

అగణిత తారకార దివ్యజ్యోతి రజత ధవళ,
లాజె లాజె వ్యోమపటె లుచిగలె శీతాంశు శీతళి
దూర నగమాళా హెలె భక్తి భయే చకిత పులక
పదచుంబీ మహాసింధు గాయె స్తవ, లహరీ అళక
"హే చారుభైరవ కీర్తి మనుష్యర, ముండమో పుళిన
ధన్య హుఏఁ తోహరె సేవిణ.

పౌర్ణమాసీ శుభ్రహాస్య తళె
ధవళిత సముద్ర లహరె

తాళె తాళె లాస్యేమాతి జళదేవీ గాయిలెతో కథా
ఔషదీశ జ్యోత్స్నాపురె సిక్త కలె తో తరుణ మథా
తోర మౌన కబాఖరె వ్యోమచారీ మార్గెహోయి మూఢ
అవతరి కర్ణె కర్ణె కహి గలె బారతా నిగూఢ
అప్సరీ నందిలె తోతె స్వర్గుఁ ఆసి కౌముదీకల్లోళె
పారిజాతపుష్ప ఉపహారె.

జీవన రజెతె లీళా ఖేళా
అంగే తుహి ధరిచు ధవిళా

శిఖిలాతోహఠుఁ రాజా శత్రుముఖి యుద్ధఅభిజాన
పాత్రమంత్రీ రాజా పాశె కరిబార యుక్తమంత్రదాన,
ప్రేమిక ప్రేమికా ఆసి తోహఠారు శిఖిరె ఆశ్లేష
వీర పుణి యుద్ధభూమె అరి గహకౌశళ విశేష
వేత్రహస్త అవధాన చాటళాళె శాస్తిబార పిలా
హే పాషాణి ! తోఠారు శిఖిలా.

గమనిక : ఓడ్ర భాషలో అకారం ఒకారంలాగా, వకారం బకారలాగా, పలుకుతారు.

'పురిపండా'

# కన్నడము

మూలం :
ఆచార్య ఆర్. ఎన్. ముగళి

అనువాదం :
శ్రీ పి. వి. సత్యనారాయణమూర్తి

## చారిత్రక సమీక్ష

భారత దేశంలోని అతి ప్రాచీన భాషల్లో కన్నడం ఒకటి. ద్రావిడ భాషాకుటుంబానికి చెందిన యీ భాష తమిళానికి తర్వాత చాలా పురాతనమైన సాహిత్యాన్ని కల్గి ఉంది. సాహిత్య సౌందర్యం గల అతిప్రాచీనమైన కన్నడ శాసనం క్రీ. శ. 6వ శతాబ్దికి చెందిందని విశ్వసింపబడుతోంది. క్రీ. శ. 9 వ శతాబ్దికి చెందిన "కవిరాజమార్గ" కన్నడంలో లభించిన మొట్టమొదటి గ్రంథం.

ఉత్తమ శ్రేణికి చెందిన కథలు, పద్యాలు క్రీ. శ. 600 నుంచి గాని, అంతకు ముందు నుంచే గాని పుష్కలంగా రచించబడినా యనుటకు నిర్దుష్టమైన నిదర్శనాలున్నాయి. దాని పేరు సూచిస్తున్నట్లుగానే 'కవిరాజ మార్గ' ఒక అలంకార గ్రంథం. దీనికి దండి రచించిన 'కావ్యాదర్శం ' ఆధారం. కవులు శాగోరేవారి కిది రాచబాటను చూపిస్తోంది. అంతకు పూర్వపు శతాబ్దాలలో ఉత్తమ శ్రేణికి చెందిన కొన్ని గద్య పద్యకావ్యాలను సృజించిన కవులను ఆ కావ్యం పేర్కొన్నది. కన్నడిగులకు కవిత్వ రచన ఒక గాఢమైన వ్యసనంగా ఉండేదని 'కవిరాజ మార్గ' సగర్వంగా ప్రకటించింది. కవులు రచనాశిల్పంలో సిద్ధహస్తులు కాకపోయినా విస్తృత రచనలో నేర్పరులు.

కర్ణాట దేశమంతటా అధిక సంఖ్యలో లభించిన శాసనాలు చారిత్రకమైన వట్టి దండకవిలెలు గాని 'దస్తావేజులు' గాని కావు. వాటిలో కొన్ని శక్తిమంతమై ప్రవాహశీలమై రసభరితమైన శైలిని కలిగి ఉన్నాయి. అలాంటి శాసన సాహిత్యంలో చిత్రించబడిన వీరుల యోగుల పాత్ర చిత్రణలు సజీవంగా ఉన్నాయి. సంప్రదాయబద్ధమైన కావ్యాలలో ఇలాంటి చిత్రణలు అరుదుగా కన్పిస్తాయి. ఇట్టి రచనల్లో కొన్ని వర్ణనలు గతానుగతికంగా ఉండి, అతిశయోక్తుల్తో నిండి ఉంటాయి. కొన్నింటిలో భావనాశక్తియొక్క అపూర్వ విలసనం కనబడుతుంది. అది మహా కవిత్వశ్రేణిలోకి వస్తుంది. 'కవిరాజమార్గ' కంటె చాలా ముందే సంప్రదాయ కవితారచన ఎక్కువ వ్యాప్తిలో ఉండి ఉంటుంది. కాని వాటిలో ఏరచనా మన కీనాడు లభించటం లేదు. ప్రజలభాష ద్వారా జైనమత వ్యాప్తిని చేసే ఆవశ్యకతను గుర్తించిన జైనులు కన్నడ పద్యసాహిత్య రంగంలో మార్గదర్శకులైనారు. బౌద్ధులు

ఇంతకుముందే సాహిత్య రంగంలో ప్రవేశించినాడన్న అభిప్రాయ మొకటి ఉంది గాని మనకు లభించిన ఆధారాల వల్ల అది సమర్థనీయం కాదు.

ప్రాచీన కన్నడంలో సంప్రదాయ కవిత గద్యపద్యాత్మకమైన చంపువుగ రచించబడింది. అది గాఢమైన భావప్రకటనకు పేరు గాంచింది. 10, 12 శతాబ్దాల నడుమ పంప, రన్న, నాగచంద్ర, జన్న అవంటి గొప్పకవుల రచనల్లో చంపూకావ్య రచన మహోన్నత స్థాయి నందుకున్నది. కన్నడ భాషలో ఆవిర్భవించిన అత్యుత్తమ కవులలో ఒకడుగ పంప విరాజిల్లినాడు. మహాభారతేతిహాసమును అనువదించుటలోను, కథాకథనంలోను, పాత్ర చిత్రణలోను పంపకవీంద్రుడు నవీన కల్పనాశక్తిని కనపరచడమే కాక తనకాశ్రయ మిచ్చిన అరికేసరి మహారాజుతో అర్జునుని పోల్చి, అతన్ని ఆ యితిహాసానికి నాయకునిగ చేశాడు. నిశితమైన పరిజ్ఞానం కలిగి పంప భారతమని ప్రసిద్ధి వహించిన అతని రచన మానవ స్వభావ పరిశీలనలోను, ఉన్నతమైన కల్పనలలోను పరిపక్వమైన భావప్రకటనను సూచిస్తుంది. సంప్రదాయ రచనలకిది ఆదర్శప్రాయం. కన్నడ కావ్యాల్లో ఏకావ్యమూ దీనితో సరితూగ జాలదు. అతని 'ఆదిపురాణ' మొత్తంమీద గొప్పదే అయినా, 'పంపభారత' మంతటి ఉన్నత స్థాయిని అందుకోలేదు. జైన సంప్రదాయమున అభివర్ణితమైన మొదటి తీర్థంకరుడైన ఆది జినుడి కథ యిందు చిత్రించబడింది. దాస్యశృంఖలం నుంచి స్వాతంత్ర్య సముపార్జన నొందిన మానవుడి పరిణామం చిత్రించుట చేత అది వ్యంగ్య మహితముగా ఉన్నది.

రెండవ తీర్థంకరుడైన అజితనాథుని కథను రచించడంలో రన్న కూడ యీ సంప్రదాయాన్నే అనుసరించాడు. కాని అతని 'సాహస భీమ విజయ లేదా గదాయుద్ధ' ఇంతకంటె గొప్ప కావ్యం. దానిలో అతడు మహాభారత కథలో చివరిభాగమైన భీమ దుర్యోధనుల యుద్ధమును చిత్రించాడు. కథావస్తువులోను, పాత్ర నిర్మాణంలోను ప్రధానంగా పంపకు ఋణపడి ఉన్నా, రన్న ఉత్తమ కవిగా, నాటకశిల్పిగా అత్యద్భుతమైన ప్రజ్ఞను పరిమిత పరిధిలో ప్రదర్శించాడు.

రామాయణమును కథావస్తువుగ ఎన్నుకొన్న నాగచంద్రుడు జైనుల కథామార్గాన్ని అనుసరించాడు. క్షణికమైన బలహీనతకు లోనై మనోవికారానికి ఎఱయైనా, తర్వాత సీతను బంధించి తెచ్చినందుకు పశ్చాత్తాపపడిన గొప్పరాజుగా రావణుడి పాత్రను అతడు చిత్రించాడు. 'యశోధర చరిత్ర'లో అక్రమ మోహంతో పురుషుని వాంఛించే స్త్రీని, 'అనంతనాథపురాణం'లో అక్రమ మోహంతో స్త్రీని వాంఛించే పురుషుణ్ణి చిత్రించటంలో జన్న మానవ మనస్తత్వాన్ని నిశితంగా అవగాహన చేసుకున్నట్లు వ్యక్తమవుతుంది.

తక్కువ స్థాయికి చెందిన కవుల చేతుల్లో ప్రాచీన కవిత్వం సంప్రదాయ వీథుల్లో నడుస్తూ, తన సహజ పాటవాన్ని కోల్పోయింది. దాని ప్రభావం 14-17 శతాబ్దాల నడుమ క్షీణించింది. కాని తర్వాత 'షడక్షరి', 'తిరుమలరాయ'మున్నగు వారి చేతుల్లో మార్గకవితా రీతి పునరుద్ధరించబడింది. వారిద్దరూ గొప్ప భావనాశక్తి రచనాశక్తి గల అగ్రశ్రేణి కవులు.

12 వ శతాబ్ది మధ్యకాలంలో కర్ణాట దేశం "అల్లమప్రభువు", "బసవన్న"ల

నాయకత్వంలో ఒక సాంఘిక మత విప్లవానికి ఆలవాల మయింది. దాని ప్రభావం-కన్నడ సాహిత్యంలోని రచనావిధానం, విషయం, శైలి—వీటియందు అతి విస్తృత పరిణామాలకు దారి తీసింది. "వచన" మనే క్రొత్త సాహిత్యస్వరూపం ఉదయించింది. నిగూఢమైన గద్యలో కూర్చబడిన ఒక విధమైన ఆధ్యాత్మిక గీతంగా దాన్ని అభివర్ణించవచ్చు. ఆధ్యాత్మిక తత్వాన్ని ఆశించి, వీరశైవమతంలో చేరిన స్త్రీపురుషుల్లో చాలా మంది తమ ఆధ్యాత్మిక అనుభవాలను, తమ పరిసరాల్లోని జీవితంపై తమ అభిప్రాయాలను వ్యక్తం చేయుటకు "వచనము"లను కూర్చారు.

అల్లమ ప్రభువు తమ గణనీయుడైన ఉపదేశకుడుగాను, బసవన్న తమ ప్రియ తమ నాయకుడుగాను "అనుభవ మంటప" మనుపేరుగల ఆధ్యాత్మిక సభాంతరంలో వారు కలిసేవారు. "శూన్య సంపదనె" అనే మహాకావ్యంలో అనుభవ మంటపంలో జరిగిన సంభాషణలు, గోష్ఠులు-నాటకీయంగా చిత్రించబడినవి. ఇది కన్నడ భాషీయుల పాలిటి అపూర్వ వారసత్వము. సాంఘిక మత సమానత్వమును, గ్రామిక విలువలను, తీవ్రమైన ఆత్మసంశోధనకు బోధించటంవల్ల "వచనములు" విప్లవాత్మకమైన భావాలను కలిగి ఉన్నాయి. అవి సులభమూ, గాఢమూ అయిన భావప్రకటనను కలిగి ఉండి, సామాన్య ప్రజలను ఆకట్టుకొని, వారి దృక్పథాల్లో మార్పుల్ని తీసుకొని వచ్చాయి. కన్నడ కవిత్వం మార్గకవితాశిఖరాల నుంచి సామాన్య జనులనే సమతలం మీదికి జాలువారింది.

13వ శతాబ్దారంభంలో జనసమ్మతమైన యీ నూతనోద్యమ ఉపఫలితంగా నూతన పద్యప్రక్రియలు ఆవిర్భవించాయి. హరిహరుడు వందకుపైగా వీరశైవ భక్తుల జీవిత చరిత్రలను "రగడ"ల రూపంలో పద్యకావ్యంగా వ్రాశాడు. దీనిలో ఒక కాండం పద్యకావ్యంగా వ్రాశాడు. దీనిలో ఒక కాండం పద్యరూపంలోనూ, మరియొక భాగం గద్య రూపంలోనూ ఉన్నాయి. ఇందలి పద్యభాగం తాళబద్ధమైన ద్విపదరూపంలో ఉంది. ఇది కవిగారి సొమ్ము అని చెప్పదగిన నిజాయితీతో కూడిఉంది. అతని భక్తి సంపదనూ వర్ణనాత్మక శక్తినీ ఇది ప్రగాఢంగా చిత్రిస్తుంది. అతని శిష్యుడు "రాఘవాంక" తన భావ ప్రకటనకు ఒక సాధనంగా "షట్పది" అనే నూతన పద్యరూపాన్ని ప్రారంభించాడు. అతని రచనల్లో "హరిశ్చంద్ర" కావ్యం పేర్కొన దగ్గది. దీనిలో హరిశ్చంద్రుడి కథ అద్భుతమైన కథాకథన నైపుణ్యంతోను, నాటకీయ సంభాషణలతోను వివరించబడింది. హరిహర, రాఘవాంకలు ఇద్దరూ కన్నడ పద్య సాహిత్యంలో నూతన రీతుల్ని కల్పించిన మహనీయులుగా ప్రసిద్ధి పొందారు.

14వ శతాబ్దం నుంచి విజయనగర సామ్రాజ్యాభ్యున్నతితోపాటు జానపద పద్యరచన సాహిత్య వేదిక నధిష్ఠించింది. దాదాపు ఆనాటి కన్నడ సాహిత్యం అంతా "షట్పది", "సాంగత్య", "త్రిపది" ఛందములలోనే వెల్వడింది. పూర్వ కవితకు చెందిన "చంపువు", ఇతర రచనా విధానాలు మరుగుపడిపోయాయి. ఒకటి రెండు రకాల "షట్పది" ప్రసిద్ధ రచనారీతులన్నింటిలోను ప్రాచుర్యం వహించింది. కన్నడ కావ్యకర్తల్లో అగ్రశ్రేణికి చెందిన మహాకవి కుమార వ్యాసుడు మహాభారతాన్ని "భామినీ షట్పది" రూపంలో వెలువ

రించాడు. భారతం పదోపర్వం చివరివరకు కథా సన్నివేశాలను నైశిత్యంతో అవగాహన చేసుకొని, అపూర్వ పాత్రపరిజ్ఞానంతో నిర్వహించాడు. రూపకోపమానాలు ప్రయోగించ టంలో అతని ప్రావీణ్యం, సహజ ధోరణి, కన్నడ శైలిలో అతని ప్రతిభ, అతని పద ప్రయోగ నైపుణ్యం సాహితీ ప్రియులను ఆశ్చర్యచకితులను గావించాయి. అతని భారత కావ్యం కన్నడ దేశంలో మిక్కిలి ప్రచారంలో ఉన్న అభ్యర్హిత రచనల్లో ఒకటి. శతాబ్దాల తరబడి, నేటివరకు అది చదివి వ్యాఖ్యానించబడుతున్నది. పంప భారతం గొప్ప మానవ సృష్టి అయితే కుమార వ్యాసుని రచన మానవాతీత పరిజ్ఞానంతో కూడినది. అనగా మానవ జీవిత సంఘటనల్లో దివ్యశక్తికి గల ప్రాధాన్యాన్ని నిరూపించడంలో కవికిగల దృష్టిని అది రూపొందింప జేస్తున్నది.

ఈ కాలానికి చెందిన యితర ముఖ్యకవుల్లో 'చామరస' 'లక్ష్మీస' 'నిజగుణ శివ యోగి' 'రత్నాకరవర్ణి' 'సర్వజ్ఞ'-పేర్కొన దగినవారు. అంతుచిక్కని అల్లమ ప్రభువు ఆత్మీయతను, నూతన జీవిత దృక్పథాన్ని బాగా అర్థంచేసుకొని, "చామరస" అతని జీవిత చరిత్రను వ్రాశాడు. సరళమై, కథాకథన రీతిగల చమత్కార శైలి అతనిది. లక్ష్మీశుడు సహజమైన కథకుడుగా-ఆలంకారిక భాషపై అద్వితీయమైన ఆధిపత్యంతోను, అనుప్రాసల తోను, అనన్య సామాన్యమైన మాధుర్యంతోను జైమినీ భారతాన్ని రచించాడు. "నిజగుణ శివ యోగి" అపూర్వసాధనతోకూడిన వేదాంత మర్మముల నెరిగిన తాత్త్వికకవి. విజ్ఞాన కోశంగా పేర్కొనదగిన అతని "వివేక చింతామణి" కన్నడంలోని అపూర్వ గ్రంథాల్లో ఒకటి. అతని గీతాలు, అతని అంతరనుభూతిని, విశాల దృక్పథాన్ని వెల్లడిస్తాయి.

రత్నాకరవర్ణి ఇంకొక గొప్ప సాహితీవేత్త. కన్నడ సాహిత్య చరిత్రలో సువర్ణా క్షరాలతో లిఖించదగిన అమర జీవుల్లో ఒకడు. భరతేశవైభవము-అను విస్తృత కావ్యము అతని గొప్ప రచన. అది జానపద సాహిత్యంలో బహుళ ప్రచారం కలిగి, భావప్రకటనకు చక్కని వాహికయైన సాంగత్య ఛందస్సులో వ్రాయబడింది. మొదటి తీర్థంకరుని కుమారుల్లో గొప్పవాడైన భరతేశుని వైభవం దీనిలోని కథావస్తువు. ఆ వైభవం ధనంవల్లగాని, అధికారం వల్లగాని హోదావల్లగాని వచ్చినది కాక కేవలం యోగభోగముల కలయికగల అతని సంపూర్ణ వ్యక్తిత్వం వల్ల కలిగినట్టిది. ఈ విధంగా అతడు భరతేశుని తాను భావించిన జీవిత సర్వస్వ నిధానంగా, తన ధ్యేయమైన సంపూర్ణవ్యక్తిగా చిత్రించినాడు. ప్రతి సన్నివేశంలోను, సంఘ టనలోను మనోజ్ఞమైన కవితలో అభివర్ణితమైన యీ జీవిత దృక్పథంలో ఈ కావ్య మహ త్త్వం ఇమిడి ఉన్నది. ఇతడు సాంగత్య ఛందస్సుకు చెందిన జానపద సరళికి మార్గకవితా స్థాయిని చేకూర్చినాడు.

సర్వజ్ఞుడు కపటమును మోసమును నిశితంగా విమర్శించిన అతితీవ్రమైన యథార్థ వాది. ఈతని త్రిపదలు జీవితానుభవంతోను, వ్యంగ్యంతోను, విజ్ఞానంతోను నిండి ఉన్నవి. తెలుగులో వేమనవలె కన్నడ సాహిత్యంలో మంచి ఆత్మోన్మీలకుడుగా జ్ఞానదాతగా ఇతడు వరలినాడు.

విష్ణుదేవుని భక్తులు లేదా దాసుల సమాజమైన "దాసకూట" సంస్థాపనతో కన్నడ సాహిత్యంలోని ప్రజా ఉద్యమము ఇంకొక రూపం దాల్చినది. దాసకూట ప్రారంభదశ యింతకంటె ప్రాచీన కాలానికే చెందినా, వ్యాసరాయని శిష్యులైన పురందరందాసు, కనకదాసుల ఆవిర్భావంతో విజయనగర సామ్రాజ్య మహోన్నత దశలో ఇది ఉచ్ఛస్థితిని పొందినది. ఈ యోగుల అనేక భక్తిగీతాలు ప్రజాజీవితంపై తరతరాలుగా తమ ప్రభావాన్ని కలిగి ఉండి, కర్ణాటదేశమున ఇంటింట విజ్ఞాన భాండారాలై విరాజిల్లాయి.

కన్నడంలోని జానపద సాహిత్యం విస్తృతి చేతనూ, వైవిధ్యంచేతనూ ఆశ్చర్యజనకంగా ఉంది. 1920వరకు ఈ జానపద సాహిత్యంలో చాలా భాగం సేకరించబడలేదు నవ్యసాహిత్య పునరుజ్జీవన కార్యకలాపాలలో భాగంగా వీటిని సేకరించి ప్రచురించటానికి కృషి జరిగింది. అప్పటినుంచి జానపద గేయ సంకలనాలు ఎన్నో ప్రచురించబడినాయి. ఈ కోవకు చెందిన కవిత్వాన్ని ప్రశంసించు వ్యాసాలు, పుస్తకాలు వ్రాయబడినాయి. ఈగేయాలను రచించిన వారెవరో తెలియనప్పటికీ నిరక్షరాస్యులైన స్త్రీ పురుషులు వీటిని అవలీలగా కూర్చినారనుట సుస్పష్టం. వీటి శైలి కొంత ప్రజాగంధం కలదిగాను మోటుగాను ఉన్నప్పటికీ, వీటిలో కొన్ని ఉదాత్త కవితా రీతిని కలిగి ఉన్నాయి.

పాశ్చాత్యుల ప్రభావంవల్లను, భారత స్వాతంత్ర్య పోరాటంలో జనించిన నూతనోత్తేజ పరిణామంవల్లను దాదాపు 60 సంవత్సరాల క్రితం ఆధునిక కన్నడ కవిత్వం ఆవిర్భవించింది. మొదట మొదట అనువాదాలతో ప్రారంభించిన ఆధునిక సృజనాత్మకయుగం 1920 ప్రాంతంలో విరిసింది. భావగీతాలు, చిన్నకథ మొదలైన సాహిత్య ప్రక్రియలన్నీ అవతరించాయి. ఈ యుగోదయానికి నాంది పల్కిన ఖ్యాతి కీ. శే. పంజె మంగేశరావు, బి. ఎమ్. శ్రీకంఠయ్యలవంటి సుప్రసిద్ధ మార్గదర్శకులకు చెందుతుంది. నవ్య కన్నడ సాహితికి మహోజ్జ్వల సేవ చేసిన కవులు రచయితలలో డి. వి. జి., మాస్తి, గోవింద్‌పాయ్, బేంద్రే, కు. వెం. పు (కె. వి. పుట్టప్ప), కారంత్, కైలాస్, శ్రీరంగ మొదలగువారు ప్రధానంగా పేర్కొనదగినవారు. గేయాలు కథానికలు, నాటకాలు, నవలలువంటి ప్రక్రియల్లో కన్నడంలో గణనీయమైన కృషి జరిగింది. ఈ సంగ్రహ సమీక్షలో పేర్కొనబడని రచయితలు తమ తమ రచనారంగాల్లో ఏమాత్రమూ తీసిపోరు. గడిచిన రెండు దశాబ్దాలలో ఆధునికరీతిలో పద్య, కథానికా, నవలా రచనలు ఉదయించినవి. వాటిలో కొన్ని ఉన్నత స్థాయికి చెందినవి. రాబోవుకాలంలో ఇంతకంటె ఉత్తమ రచనలు రాగలవన్న విశ్వాసం ఇవి కలిగిస్తాయి.

ఎన్నికచేయబడి ఇందు ఉదాహరించబడిన కొన్ని ఉత్తమ పద్య రచనలు -ప్రాచీన మధ్యయుగ, ఆధునిక కాలాలకు చెందిన కన్నడ పద్యాలు స్థలాభావంచేత మరికొన్ని రచనలకు ఇందులో అవకాశం లేకపోయింది.

కన్నడిగులు కాని పాఠకులకు ఈ పద్యముల సందర్భ వివరణకుగాని, ప్రశంసకుగాని ఒకటి రెండు మాటలు అవసరం. శాసన పద్యాలలో మొట్టమొదటిదైన సరస్వతీ ప్రార్థన సముచితంగా ఉంది. భారతీయ సాహిత్యమంతటిలో అసమానమైన స్వతంత్ర చిత్ర

ణంగా సరస్వతిని గూర్చిన ఈ పద్యం అపూర్వమైనది. సరస్వతీదేవి తేజోభాస్వరమైన అక్షమాలను రాత్రింబవళ్ళు త్రిప్పుతున్నట్లు వర్ణించబడింది. విశ్వమునందలి మహాగోళములే యీ అక్షమాలలోని పూసలు. ఈ అభిప్రాయం భావనలో ఉత్కృష్టమైనది మాత్రమేగాక తన ఉపాసకులకు సరస్వతి అనుగ్రహించే విశ్వదృష్టికీ, శక్తికీ సంకేతం కూడా.

రెండవ పద్యం భారతదేశాన్నిగూర్చి కవికిగల భావనను తెలియజేస్తోంది. ఇందులో భావసూక్ష్మత, ఉక్తి ఔచితి గోచరిస్తాయి. శాసన సాహిత్యంలో మనకు కనిపించే చిన్న తరహా సజీవ పాత్ర చిత్రణలకు "కలియుగ విపరీత" ఒక ఉదాహరణ.

మూల గ్రంథంలో కనిపించని భావాలతో కూడిన అనేక పద్యాలు "కవిరాజ మార్గ"లో ఉండటం విశేషం. మత వైజ్ఞానిక విషయాలలో సహనభావం కలిగి ఉండాలన్న ధర్మం మానవుడు గర్వించదగ్గ ఏకైక సంపద అని నిరూపించే పద్యాలలో ఒకటి దీనిలో చేర్చబడింది. వెయ్యి సంవత్సరాల క్రితమే కన్నడదేశానికి చెందిన ఒక కవి, విమర్శకుడు పైవిధంగా చెప్పి ఉండటం మన ప్రశంసా బహుమానాలను అందుకోదగ్గది.

ద్రౌపది అమర్యాదగా దుశ్శాసనుడిచేత సభలోకి ఈడ్వబడినప్పుడు పాండవులు మూగవోయి, అసహాయ స్థితిలో చూస్తూ ఉన్న బిగువైన నాటకీయ సన్నివేశం పంప విక్రమార్జున విజయం నుంచి ఎన్నికచేయబడిన పద్యభాగంలోనిది. పంపకుగల పాత్ర చిత్రణ సామర్థ్యానికీ, సన్నివేశాన్ని తీవ్రతరం చేయగల అపూర్వ శక్తికీ యిది నిదర్శనం.

ఉత్తమ నాటకీయ పద్ధతిలో భీమదుర్యోధనుల స్వాభావికమైన లక్షణాలను రన్నని 'గదాయుద్ధ' లోని వైశంపాయన గాథ వ్యక్తపరుస్తుంది.

నాగచంద్రుడి రామాయణం నుంచి తీసుకున్న భాగంలో రావణుడు తన శౌర్యాడంబరాలకు చిహ్నాలైన దివ్యరూపాలను మంత్రవిద్యద్వారా చూపించి సీతను వశపరచుకోటానికి తన చివరి ప్రయత్నం చేస్తాడు. రావణుడి దుష్ట ప్రేరేపణలకు లొంగిపోక తిరస్కరించిన సీతకు తనభర్త అయిన రాముడియందు అచంచలమైన భక్తి ఉన్నట్లు చిత్రించి,సీతకూ రావణుడికీ వ్యత్యాసాన్ని నిరూపించడంలో నాగచంద్రుడు తన్ను తాను అధిగమించాడు.

అహింసా జీవకారుణ్యాలను బోధించే సుప్రసిద్ధ జైనకథ జన్నడి "యశోధర చరితె"లోది. దానిలో ఒక రాజు తన భార్య అక్రమ సంబంధాలకు ఆమెను వధించాలనే మనోవికారానికి లోనుకాకుండా తన్ను తాను నిగ్రహించుకున్న సన్నివేశం చక్కని నాటకీయ ధోరణిలో నడిచింది.

ముద్దన మనోరమల సంభాషణ యెంతో ఆసక్తికరంగానూ జ్ఞాన ప్రబోధకంగానూ ఉంది. అమాయికంగాను సరసంగాను ఉన్న సమాధానాలవల్ల గృహజీవనాన్ని ఎంత మధురంగా చేసుకోవచ్చో, సామాన్యుడికోసం సులభమైన వచనంలో సాహిత్యాన్ని ఎలాసృష్టించవచ్చో అది తెలియజేస్తున్నది. అధునిక కన్నడ రచనకు శ్రీకారం చుట్టిన ముద్దన ఆధునిక సాహిత్య ప్రేరణలను రీతులను నొక్కి వక్కాణిస్తాడు.

వచనములు పారమార్థికములై స్వీయ ఆధ్యాత్మికభావ ప్రకటనకు సాధనాలుగా తమకు తామే వ్యక్తీకరించుకున్నాయి. వాటిలో చాలా ఉత్తమములయినవి సంయమనంతో

స్వేచ్ఛతో ఊహాత్మకంగా భావప్రకటనాత్మకంగా ఔన్నత్యాలను అందుకొన్నవి.

రాఘవాంకుడి హరిశ్చంద్ర కావ్యం నుంచి గ్రహించిన భాగంలో ఇతివృత్తాన్ని నిర్వహించిన రీతిలో సంస్కృత ప్రాకృతాల్లోని ఏమూల కావ్యంలోనూ కనిపించని క్రొత్త పోకడలు కనిపిస్తాయి. హరిశ్చంద్రుణ్ణి అల్లరిపాలుచేసే ఉద్దేశ్యంతో విశ్వామిత్రుడు సృష్టించిన ముగ్గురు చండాల స్త్రీల వృత్తాంతంలో ఈ వినూత్నత్వం గోచరిస్తుంది. వారి శ్రావ్యమైన పాటకు ముగ్ధుడైన రాజు వారిని సత్కరించబోగా వాళ్ళు అతడి రాజ్యాధికారాన్ని అడుగుతారు. రాజు తిరస్కరిస్తాడు. సాహసించి వాళ్ళు రాజుతో వివాహాన్నే కోరతారు. రాజుకూ ఆస్త్రీలకూ మధ్య నడిచిన సంభాషణ ఎంతో ఆకర్షణీయంగా ఉంది. చివరకు హరిశ్చంద్రుడు వాళ్లను పెళ్ళిచేసుకోటానికి బదులుగా తన రాజ్యాన్నే వదులుకోవటానికి నిశ్చయిస్తాడు. ఈ విధంగా హరిశ్చంద్రుడు విశ్వామిత్రుడి పన్నాగంలో ఇరుక్కుంటాడు సత్యాహింసల విజయాన్ని కొనియాడిన పురందరదాసు కీర్తన హరిదాసుల కీర్తనలలో ఒకటి. ఆధునిక యుగంలో ఈ సత్యాహింసలకే గాంధీమహాత్ముడు అంకితమైనాడు. సంఘర్షణలేకుండా తియ్యటి బోధనతోనే భరతేశుడు తన సోదరుడు బాహుబలిని ఎలా జయించగలిగాడో రత్నాకరవర్ణి రచించిన 'భరతేశ వైభవ' విశదపరుస్తుంది.

## విషయసూచిక

[ప్రభుదేవ-బసవన్న-అక్కమహాదేవి]
శరణులదృష్టిలో బసవేశ్వరుడు
[హరిహరుడి బసవరాజదేవర రగడల నుంచి]
హరిశ్చంద్రుడు-మాతంగ కన్యలు
[రాఘవాంకుడి హరిశ్చంద్ర కావ్యం నుంచి]
ఉత్తరకుమారుడి పరాభవం
(కుమారవ్యాసుడి భారతం నుంచి)
హరిదాసుల కీర్తనలు
[పురందరదాసు-కనకదాసు-జగన్నాథదాసు]
ఆదర్శప్రభువు
(రత్నాకరవర్ణి భరతేశవైభవం నుంచి)
సర్వజ్ఞసూక్తులు
జానపదగేయాలు

## ఆధునిక కన్నడం

కన్నడమాత (బి.ఎమ్. శ్రీకంఠయ్య)
మహోద్ధృతమైన దక్షిణమారుతం (పంజే మంగేశరావు)
పక్షిమార్గం (డి.వి. గుండప్ప)
మానవజాతి వాస్తవాన్ని గ్రహించేదెప్పుడు ? (శ్రీనివాస)
అరుణోదయం (ద.రా.బేంద్రే)
వసంతం వస్తోంది (కె.వి. పుట్టప్ప)
రాత్రివేళ యదుగిరి (పి.టి. నరసింహాచార్)
ఆ! వాళ్లు మైకంలో ఉన్నారు (జి.పి. రాజరత్నం)
మందారపూవు (ఆర్.ఎస్. ముగళి)
పున్నమ-సంద్రము (వి.కె. గోకాక్)
మేము నిర్మిస్తాం (ఎమ్. గోపాలకృష్ణ అడిగ)

## శాసనాల్లోని పద్యాలు

### సరస్వతీప్రార్థన

సరస్వతికి తమ్ము అర్పణ గావించుకొని ప్రతి విషయంలోను మంచికోసం ఆమె కృపను ఆపేక్షించేవారిని ఉత్తేజపరచటానికి అహర్నిశము విశ్వంలోని గొప్ప ఖగోళాలతో కూర్చిన దేదీప్యమానమైన అక్షమాలను త్రిప్పే విద్యాధిదేవత భారతి మాజిహ్వపై ఎల్లప్పుడూ స్థిరంగా ఉంటూ మావాక్కు హితకరంగానూ పవిత్రంగానూ చేయుగాక !

### ఒక కవి భావనలో భారతదేశం

ప్రసిద్ధికెక్కిన భరతుడిపేర పరగిన యీ భూమిని భారత్ అని అనటం సమంజ

సమే. ఎందుకంటే ఇక్కడ ప్రేమాధిదేవత అయిన మన్మథుడు తన సతి రతీదేవితోపాటు ప్రేమికుల హృదయాలనే రంగస్థలం మీద నాట్యం చేస్తాడు. వాళ్ల నృత్యానికి ప్రేమికుల సుకుమార హృదయ స్పందనం మద్దెల మ్రోతగాను తేనెటీగల ఝుంకారం మధురగానం గాను చిరుగాలులవల్ల కదలాడే చిగురాకుల చప్పుళ్లు తాళంగాను అవుతాయి.

## కలియుగ విపరీతం

సాధులకు పరమసాధువుగా, అమాయకులకు సౌమ్యుడుగా, దుష్టులకు కలిపురుషుడుగా గోచరించేది వేరెవరోకాదు ఆ శ్రీకృష్ణపరమాత్మే.

ఆయన మంచికి మంచి చేస్తాడు. చెడ్డకి చెడ్డ చేస్తాడు. ఇదే ప్రతీకారదేవత విధానం. ఇదే కర్మసిద్ధాంతం. చేసినంత చేసినవాళ్లు పొందుతారు.

ఇకముందు హానికరం కాదనే ఉద్దేశంతో బోనులో ఉన్న సింహాన్ని వదిలితే ఏమవుతుందో అట్లాగే అతడి సహజమైన మంచితనాన్ని అపార్థం చేసుకొనేవాళ్లకు అతడు భీకరంగా గోచరించి వాళ్లను విచారగ్రస్తుల్ని చేస్తాడు.

## స్తన్యమిస్తూ తల్లి చేసిన హితబోధ

పసిబిడ్డగా చనుబాలిస్తున్నప్పటినుంచే లక్ష్మీధరామాత్యుడి చెవుల్లో అతడి తల్లి యీ మాటలు నూరిపోసింది.

బావులు, చెరువులు త్రవ్వించు. దేవాలయాలు కట్టించు. అంధకార బంధురమైన చెరసాలనుంచి మంచివాళ్లను న్యాయస్థులను విడిపించు. స్నేహితులకు సాయంచెయ్యి. నీ అనుయాయులకు చేయూతనివ్వు. నీ శిష్యుల యోగక్షేమాలు విచారించు.

## కన్నడసీమ

కావేరీ గోదావరీ నదులు ఎల్లలుగా గల కన్నడదేశం ప్రపంచంలోకల్లా అపూర్వమైన విశిష్టమైన ఏకైక సుందర భూభాగంగా పరిగణించదగ్గది. సమయోచితంగా మాట్లాడటం, తమతో మాట్లాడిన మాటలకు విలువకట్టడం ఇక్కడి ప్రజలకు తెలుసు. సహజంగా వాళ్లు చాలా తెలివిగలవారు. అలంకారశాస్త్రాన్ని గూర్చి కొంచెమే తెలిసినా వాళ్లు కవిత్వంలో దిట్టలు. కత్తినీ, కలాన్నీ చాకచక్యంతో ఉపయోగించగలరు. వాళ్లు నీతిమంతులు, గౌరవనీయులు, సహనశీలురు, సుందరులు, పరిపాలనాదక్షులు, యుద్ధవీరులు, గొప్ప కళాభిజ్ఞులు. వాళ్లకు తమ సంస్కృతీ సంప్రదాయలంటే ఎంతో అభిమానం.

## సహనశీలత

పరమత పరవిశ్వాసాల సహనమే నిజమైన నిధి. ఐహిక వస్తువులకై ప్రాకులాడటమే తప్ప వాటి ప్రయోజనం తెలియని వాళ్లచేతుల్లో వెండి బంగారాలు చెత్త చెదారంవంటివి.

పంపమహాకవి (కవిరాజమార్గమునుండి)

## ద్రౌపదిశపథం-ఆ తర్వాత

"విక్రమార్జున విజయం" నుండి.

దుశ్శాసనుడు తన కురులు పట్టి రాజసభకు ఈడ్చగా అవమానభారంతో కుమిలిపోయిన ద్రౌపది క్రోధావేశంతో ఇలా అంది :

"నాకొప్పు విడిపోవుటకు కారకుడైన దుర్మార్గుడు అంతమొందేదాక నా యీ కురులు ముడిపడవు. ఆ దుష్టుణ్ణి అంతం చేసినవాడే ఆతర్వాత వీటిని ముడివేయుగాక !"

చాలాకాలంగా లోలోపలే రగుల్కొంటున్న క్రోధాగ్నిజ్వాలలతో కూడిన భీముడు అన్నగారి అనతిని పాటించటమా, లేదా-అన్న మీమాంసతో ఆనాటివరకు బద్ధుడై ఉండి, ద్రౌపది క్రోధవచనాలతో ధూపంవేసిన భూతంలాగా ప్రకోపితుడై నవమేఘంలా ఇలా గర్జించాడు.

"ఓ పద్మపత్రనేత్రా ! నీవు క్రోధంతో అన్నమాటలు వ్యర్థంకావు. భూమిని కంపింపజేసే యీ గద మహాజలప్రళయాన్ని సూచించే ఉల్కాపాతంలాగా నీచుడైన దుశ్శాసనుణ్ణి అంతంచేస్తుంది. ఆ దుష్టుణ్ణి పడగొట్టి వాడి పేగులు వెలికి తీసిన యీ చేతుల్తో నీకొప్పు ముడివేస్తా."

"నేను దుశ్శాసనుడి గుండెలు చీల్చి తద్రుధిరధారలు త్రాగి నాదప్పిక తీర్చుకుంటాను. దుర్యోధనుడి తొడలు విరగగొట్టి కాంతిపుంజశోభిత రత్నఖచితమైన వాడి కిరీటాన్ని కాలదన్ని తునాతునకలు చేస్తాను. ఓ పంకజముఖీ ! ద్రౌపదీ ! నన్ను నమ్ము ! నా నేత్ర గోళాల్లోకి చూడు. శత్రువులు కంటపడగానే నా నేత్రగోళాల్లోంచి బహిర్గతమవుతూన్న అగ్నికణాల్ని చూడు."

"కౌరవులు మనయెడ ఎన్నో యెగ్గులు చేశారు.మనల్ని రేకెత్తించారు. కాని ఆ పిరికి పందలు ఇంకా మెడమీద తలలతో తిరుగుతున్నారంటే మా అన్న ధర్మజుడి మంచితనానికి మేము కట్టుబడి ఉండటమే కారణం. ఇక నేనెంతమాత్రం సహించలేను.

ద్రౌపది సంతృప్తికోసం ఇలా అన్న భీముడు ఇంకా యిట్లంటున్నాడు:

"భీష్మ, ద్రోణ, కృపాచార్యవర్యులారా ! వినండి. మందరగిరితో అసురసంహారం చేసిన నారాయణుడిలాగా, నేను నాచేతిలోని గద అనే మందరపర్వతంతో కౌరవసేనా సముద్రాన్ని చిలికి వాళ్లను సర్వనాశనం చేస్తాను. నూర్గురు కౌరవసోదరులను హతమారుస్తానని ప్రతిన పూనుతున్నాను."

భూమి కంపించిందా లేక ఒక శైలం మరొక శైలాన్ని ఢీకొన్నదా అన్నట్లు భీముడి గర్జన సాగింది. నలువైపుల అల్లకల్లోలమైన సముద్రకెరటాల సంఘట్టనకు లోనైన పర్వతంలాగా కౌరవులు కంపించారు. అప్పుడు వయోవృద్ధుడైన భీష్ముడు ఇలా అన్నాడు:

"ఓ ధృతరాష్ట్రా ! విను. భరత యయాతి కుత్స పుతుకుత్స పురూరవాదులచే ప్రశస్తిపొందిన చంద్రవంశపు యశస్సును నీ కుమారులు వర్ధిల్లజేస్తారని నీవు ఒక్కక్షణమైనా అనుకుంటే చాలా పొరబడుతున్నావన్నమాట. అక్కటా! ఈ వంశరథంయొక్క ఇరుసే మండిపోతోంది. !"

ఈ మాటలకు కుంభసంభవుడు, కృపుడు, అశ్వత్థామ, విదురుడు మొదలయిన వారు కుటుంబకలహంలో జోక్యం కలిగించుకోవటం మంచిదికాదనీ, ఏనుగు దంతంలాగే కౌరవులుగాని భీముడుగాని లొంగే ఘటాలు కారనీ, కలహించుకుంటున్న సోదరులను కాల పరిణామానికి వదిలివేయటమే మంచిదనీ అన్నారు. తర్వాత వాళ్లు వెళ్లిపోయారు.

తన అగ్రజుడైన ధర్మరాజును ఉద్దేశించి, భీముడు ఇలా అన్నాడు : "చాలాకాలం ఉపయోగించకుండా ఉంచిన ఉప్పు మెత్తపడి పేరిన నెయ్యిలాగా అనిపిస్తుందో అలాగే ఉప్పులాగా దృఢంగా ఉన్న మనం కౌరవులు ప్రకోపింపజేసినా, చిరకాలం చప్పబడిఉండటం చేత నెయ్యిలాగా మెత్తనై పోయాము.

పాండవులకు న్యాయం చేకూర్చమని ధృతరాష్ట్రుడు కొడుకుతో వాదించి విఫలు డైనాడు. ద్రౌపదిని నిర్బంధించటం అక్రమమని దుర్యోధనుడికి నచ్చజెప్పి, ఆమెను అడవికి వెడుతున్న పాండవులవెంట పంపించేట్టు చేశాడు.

పాండవుల వనగమనాన్ని దుఃఖంతో పరికించిన పురజనులు విధివైపరీత్యానికి తమలో తాము ఇలా చర్చించుకున్నారు.

"అహా ! ధర్మజుడు ఎంతటి ఉదాత్త రాజకుమారుడు ! భీమార్జున నకుల సహ దేవులు ఎంతటి గొప్ప సోదరులు! వాళ్లకు ఇలాంటి దుర్దశ ప్రాప్తించటం ఎంత శోచనీయం!"

"ధర్మరాజు జూదంలో తన రాజ్యాన్ని పోగొట్టుకున్నాడు. కాని ప్రతీకారదేవత కాలాంతరమందు కసితీర్చుకోక మానదని దుర్యోధనుడు ఏమైనా ఊహించడా ? విజయోన్మా దియైన దుర్యోధనుడు తన రాజ్యాన్ని గురించే ఆలోచిస్తాడు గాని దాయాదులయెడ తన కర్తవ్యాన్ని విస్మరిస్తున్నాడు. పాలకుండను చూసి మురుస్తూ యజమాని చేతిబెత్తాన్ని మరిచే పిల్లిలాగా అతనెంత బుద్ధిహీనుడు.

పౌరులు శకుని దుశ్శాసనులను అధిక్షేపించారు. దుష్టశకునకు పక్షిలాగా శకుని దుర్యోధనుడి మందిరంలో ప్రవేశించాడు.

రన్న

## వైశంపాయన సరోవర తీరాన సంఘర్షణ

గదాయుద్ధంనుండి

వైశంపాయన సరస్సులో నీటిలోపల దాగియున్న దుర్యోధనుణ్ణి బయటకు రప్పిం చటంలో తన సోదరులు విఫలులుకాగా భీమసేనుడు అపరిమితమైన ఆవేశంతో కనుబొమ్మలు ముడివడగా-దాక్కొని ఉన్న ఆ శత్రువు అనే దయ్యం తనకు తప్ప ఎవరికీ లొంగదనీ, తనకు దానిని లొంగతీసే మర్మం తెలుసనీ అంటూ ఇలా అన్నాడు :

"ఓ దుర్యోధనా ! నీతమ్ముడి రక్తాన్ని, నీసైన్యం రక్తాన్ని నేను తనివితీరేట్టుగా త్రాగాను. ఇప్పుడు ఈ సరస్సునంతా పూర్తిగా ఇంకింపజేస్తాను. నీ నెత్తురుతో నా దాహం తీర్చుకుంటాను.

"మూర్ఖుడా ! మేఘగర్జనవంటి నా సింహనాదానికి నా ఉగ్రరూపానికి భయకంపి తుడవై రణరంగంనుంచి పారిపోయి జీవితేచ్ఛతో ఈ పద్మాకరంలో దాక్కున్నావా?

చేపలాగ నీకు నీళ్లల్లో దాక్కోవలసిన గతిపట్టిందా?పాపం! చలికి వణుకుతావేమో నీపేరునే అర్థరహితంచేసేలా యీవిధంగా ప్రవర్తించటం ఎంతశోచనీయం! అహా! ఎం తటి పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్నావు! ఛీ! ఫో! చచ్చిపోతే మరల జన్మ ఉండదేమోనని నువ్వు చావుకు భయపడుతున్నట్టున్నావు. దుర్యోధనా! బయటికిరా! బయటికిరా! నీ గదన్ను

చేపట్టి కదనానికి సిద్ధంకమ్ము! ఆకాశపు జంగమ వజ్రపాతమూ, కౌరవులకు భయోత్పాతాన్ని కలిగించే భీమసేనుణ్ణి నేను ఇక్కడే ఉన్నాను."

"నీదగ్గరకు సంప్రదింపులకని వచ్చిన శ్రీకృష్ణపరమాత్మనే నిర్బంధించ సమకట్టిన నీ దురహంకారం ఇప్పుడేమయింది? ద్రౌపది కొప్పుపట్టి యీడ్చి వలువ లొలిపించిన నాటి నీ మదోన్మత్తత ఇప్పుడేమయింది? పాండవులను అడవుల పాల్జేసిన నీ గర్వాతిరేకం ఇప్పుడేమయింది?"

అని కౌరవాధిపతిని భీమసేనుడు ఎత్తిపొడిచాడు. విశ్వగోళం విచ్ఛిన్నమౌతుందా? పేకమేడలాగా మేరుపర్వతం కూలిపోతుందా? భూమి క్రుంగుతుందా? స్వర్గంలోని దేవతలు కూడా దద్దరిల్లారా? అని అనిపించేలా జటాసుర హిడింబాసుర వైరి మళ్లీ సింహగర్జన చేశాడు. భీమగర్జనకు భయంతో సరస్సు గుండెపైకి ఉబికిందా అన్నట్టుగా-ఆ సరస్సే నివాసంగా చేసుకున్న పక్షుల గుంపులన్నీ తక్షణమే ఎగిరిపోయాయి. భీమసేనుడి క్రోధాగ్నికి ఆ కొలను కుతకుతలాడింది. అందులో చేపలన్నీ ఎసట్లోపోసిన బియ్యంలాగా ఎగిరెగిరి పడ్డాయి. సింహకేతనుడైన భీముడి గర్జనలతో జలప్రపంచంలో ఉపరితలం ఆవిరికాగా, నాగకేతనుడైన దుర్యోధనుడు కోపంతో కళ్లు ఎఱ్ఱబడగా నీటిలో ఉన్నప్పటికీ విపరీతంగా చెమర్చ నారంభించాడు. సింహగర్జననూ ఉఱుములధ్వనినీ మించిన భీమసేనుడి గర్జనే దీనికి కారణం.

నల్లకలువల మధ్యనుంచి దుర్యోధనుడు వెల్వడగానే అతడి రూపం నల్లగా కనిపించింది. నానావర్ణ రత్నశోభితమైన అతడి కిరీటం జిగేలుమంటూ అద్భుత సౌందర్యోపేతమైన ఇంద్రధనుస్సు కాంతుల్ని విరజిమ్మింది. ఎత్తబడిన భుజార్గళాలతో తన గదను తోరణంగా పట్టుకొని ఉన్న నాగకేతుడైన దుర్యోధనుడడుగో చూడండి!

నిప్పులు క్రక్కే కళ్లతో అధోలోకంనుంచి ఆవిర్భవించిన రుద్రుడిలాగా దుర్యోధనుడు చూడగానే ప్రశంసకు అర్హమైన అధికార దర్పంతో కూడుకొన్నవాడై గదను త్రిప్పుతూ కొలనులోనుంచి బయటకు వచ్చి నలువైపులా చూస్తూ, "భీముడెక్కడ?" అని అరిచాడు. పరమేశ్వరుడి మూడవకంటి మంటలాగా అతడి కళ్లు క్రోధరంజితాలైనాయి.

దుర్గసింహుడు

## దుఃఖానికి పాల్పడ్డ అత్తగారు

### పంచతంత్రం నుండి

"సాలిగ్రామ" అనే ఒక పెద్ద అగ్రహారంలో గ్రామాధికారి భార్య కుమతి, ఆమె కోడలు సౌమిత్రి అనేవాళ్ళు ఉండే వారు. ఒకనాడు కుమతి సౌమిత్రితో "నేను దగ్గర పల్లెకు పోతున్నాను. నేను లేని సమయంలో ఇల్లు జాగ్రత్త!" అని చెప్పి వెళ్ళింది.

కుమతి వెళ్ళాక ఒక బ్రాహ్మణుడు వచ్చి సౌమిత్రితో–"ఓ కోమలాంగీ! నీవు పన్నెడు మంది బ్రాహ్మణులకు విందు ఏర్పాటు చెయ్యాలని నా కోరిక. భగవంతుడు నీకు ఐశ్వర్యాన్ని, సంతతిని నీవు కోరిన దాన్నంతటినీ ప్రసాదిస్తాడు" అని అన్నాడు, సౌమిత్రి దాన్నిగూర్చి ఆలోచిస్తూ బ్రాహ్మణులు భూమిపై దేవుడి అనుగ్రహానికి పాత్రులైనవాళ్ళు

గనుక బ్రాహ్మణ వచనాలు తప్పక నిజమౌతాయని అనుకొన్నది. ఆమె పాలూ నెయ్యీ పుష్కలంగా ఉండేటట్లు సుష్టైన విందును ఏర్పాటు చేసింది. భూసురులు సంతృప్తి చెంది సౌమిత్రిని ఆశీర్వదించారు. ఆమె అంతులేని ఆనందాన్ని పొందింది.

కుమతి తిరిగి వచ్చాక ఇంట్లో గొప్ప విందు జరిగినట్లు నిదర్శనాలు కనిపించగానే మండిపడింది. తొంటగాని బిచ్చగాళ్ళకు ఇంత పెద్ద విందు చెయ్యటానికి నీకు హక్కు ఎవడిచ్చాడని ఆమె కోడల్ని నిగ్గదీసింది. ఆపుకోలేని కోపంతో ఆమె సౌమిత్రిని ఇంట్లోంచి వెళ్ళగొట్టింది.

అప్పుడు చీకటి పడుతోంది. సౌమిత్రి ఎక్కువ దూరం వెళ్ళటానికి భయపడింది. ఆ ఊరి పొలిమేరల్లో ఒక పెద్ద చింతచెట్టును ఆమె చూసింది. దాని మానులో ఒక పెద్ద తొర్ర ఉంది. ఆ తొర్రలో ఉండవచ్చుగదా అని ఆమె సంతోషించింది. కొంచెం సేపటికి కొన్ని దయ్యాలు అక్కడికి వచ్చి ఆ చింతచెట్టు కొమ్మలపై ఎక్కాయి. అవి ఒక మంత్రాన్ని ఉచ్చరించి, ఆ చింతచెట్టును సువర్ణ ద్వీపానికి తీసుకుపొమ్మని ఆదేశించాయి. చింతచెట్టు గాలిలో ఎగిరి సువర్ణద్వీపానికి చేరుకుంది. సౌమిత్రికి ఎటుచూసినా బంగారమే కనిపించింది. ఆ దయ్యాలు వెళ్ళిపోయాక సౌమిత్రి తొర్రలోంచి బయటకు వచ్చింది. ఒక ఎలుక కన్నం దగ్గర బంగారపు తునకలు కుప్పగా పడి ఉండటం చూసింది. ఇదంతా తాను విందుచేసిన బ్రాహ్మణుల ఆశీర్వాద ఫలితమేనని అనుకుంటూ ఆమె బంగారాన్ని ప్రోగు చేసుకొని, దయ్యాలు తిరిగి వచ్చేలోగా మళ్ళీ ఆచింత చెట్టు తొర్రలో దూరి దాక్కుంది. దయ్యాలు తిరిగి వచ్చి ఆ చెట్టును యథాస్థానానికి పొమ్మని ఆదేశించాయి. తెల్లవారగానే దయ్యాలు మాయమైనాయి. సౌమిత్రి తొర్రలో నుంచి బయటపడి బంగారంతో పాటు ఇంటికి చేరుకుంది. ఉత్తేజపూరితమైన సౌమిత్రి సాహస యాత్రనంతా ఆమె అత్తగారు ఆసక్తితో విన్నది.

"ఈ సాయంకాలం నేను సువర్ణ ద్వీపానికి పోయి ఇంకా చాలా బంగారం తెస్తా" నని కుమతి సౌమిత్రితో అంది. ఇలాంటి పిచ్చి ఊహలు మానమని సౌమిత్రి అత్తగారిని ప్రాధేయపడి, విఫలురాలయింది. "దయ్యాల తీరుతెన్నులు మనం ఊహించలేం. మీరు తప్పక వెళ్ళాలనుకుంటే ఒకవేళ దయ్యాలు ఏమైనా అన్నప్పటికీ మీరుమాత్రం ఏమీ జవాబు ఇవ్వక జాగ్రత్తగా మసలుకోండి" అని అన్నది. కోడలు తనకు నీతులు బోధిస్తోందని ఆమె కోపగించుకొని, సౌమిత్రిని దూషించింది.

సూర్యాస్తమయం కాకుండానే ఆ చింతచెట్టు తొర్రలో దూరిన కుమతి తనను సువర్ణ ద్వీపానికి తీసుకొని వెళ్ళటానికి దయ్యాల రాకకోసం ఆతురతగా ఎదురుచూసింది. దయ్యాలు వచ్చాయి. కాని తాము చూడటానికి వెళ్ళే ప్రదేశాన్ని మార్చుకున్నాయి. కదర ద్వీపానికి తమ్ము తీసుకొని పొమ్మని చింత చెట్టును ఆ దయ్యాలు ఆజ్ఞాపించాయి. అది విన్న కుమతి నిరాశా నిస్పృహలతో-ఏమయితే కానిమ్మని సాహసించి, ఆ దయ్యాలకు ఒక సలహా యివ్వటానికి నిశ్చయించింది. "కదరద్వీపంలో మనిషి మాంసం రుచిగా ఉండదుగాని సువర్ణ ద్వీపంలో మనిషి మాంసం చాలా రుచ్యంగా ఉంటుంది. మీరు అక్కడికి పోరాదా ?" అని అంది. ఆ దయ్యాలు చాలా సంతోషించి," ఇదిగో ! మనకు ఆహారం ఇక్కడే అందుబాట్లో

ఉంది" అని అంటూ కుమతిని ఎలుకను లాగినట్లు బయటకు లాగి ముక్కలు ముక్కలుచేసి తినేశాయి!

నాగచంద్రుడు

## శీలవతి సీత

రామచరిత పురాణము నుండి

తన అంతస్తుకు తగిన వైభవాడంబరాలతో సీతపై తనకుకలిగిన గాఢ కామవాంఛ పెల్లుబుకగా, రావణుడు తన దృష్టినంతా ఆమె ముఖంపై కేంద్రీకరించి, అనురాగ కృశీభూతములై కలువల్ని వికసింపజేసే చంద్రకాంతులవలె ప్రకాశించే పలువరుసతో తన ప్రేమను వ్యక్తం చేస్తూ ఊహాలోకంలో విహరించ నారంభించాడు.

ఓ పంకజాక్షీ! సకల భూమండలం నుంచి సేకరించిన వజ్రవైడూర్యాదులతో నిన్ను అలంకరించి చూడటానికి ప్రేమతో నిండిన నా హృదయం ఉబలాట పడుతోంది. నీ పాదద్వయాన్ని మంజీరాలతోను, నీ నడుమును రత్నఖచితమైన ఒడ్డాణంతోను, నీ కరద్వయాన్ని కంకణకీర్తులతోను స్వయంగా అలంకరిస్తాను. నీ సొగసైన చెక్కిళ్ళను అత్యంత సుందరమైన రచనలతోను, నీ ఫాలభాగాన్ని అపూర్వమైన కుంకుమతోను అలంకరింపజేస్తాను.

దాసీజన పరివేష్టితవై శ్వేతచ్ఛత్ర శీతల చ్ఛాయల్లో ఏనుగుపై పయనించే నీకు-లంక పొలిమేరల్లో ఉన్న సుప్రసిద్ధ సప్తోద్యాన వనాలు కన్నుల విందు చేస్తాయి.

ఓ జానకీ ! దేవభామినులకు కూడా గర్వకారణమైన నా పుష్పక విమానంలో నా ప్రక్కన్న కూర్చొని పర్వత శిఖరాలపై నుంచి గొప్ప నదులను, సుందరమైన సరోవరాలను కొండ చరియలపై గల అరణ్యాలను సముద్రతీరాలపై ఉన్న దేదీప్యమానమైన రత్నరాసులను అద్భుత దృశ్యాలను చూచి నీవు పులకరిస్తావు.

పదభ్రష్టుడైన ఇంద్రుడి ఏనుగు ఐరావతపు దంతాలతో నీ కొకపాన్పు నమరుస్తాను. పరాజితుడైన బ్రహ్మకు వాహనమైన హంస తూలికలతో నీ పాన్పును మృదుతరం చేస్తాను. దిక్పాలకులే నీ శయ్యకు మంచపుకోళ్ళు. ఆ శయ్యమీద నిద్రిస్తున్న నీవు తెల్లవారే ముందు దేవభామినుల గంధర్వగానమే మేల్కొలుపులుగా నిద్రలేస్తావు.

ఓ మీననేత్రా! ఎవని ఆయుధశాల సునిశిత ఖడ్గాలకు మేలురకం డాలులకు ఆలవాలమో, ఎవని కోశాగారం భూవలయంలోని అపూర్వ రత్నరాసులకు నిలయమో, ఎవడు సకల విద్యావేత్తయో, ఎవడు దిక్పాలకులను భయకంపితుల్ని చేశాడో, వేగిరపాటుతో దండెత్తి వచ్చిన ఇంద్రుణ్ని ఎవడు అవలీలగా కాళ్లుచేతులు కట్టి పడవేసెనో, ఎవడు తన సామ్రాజ్యాన్ని దక్షిణభారతం మీద కైలాసంమీద విస్తరింపజేశాడో-అట్టి పౌలస్త్యుడనైన నాతో సరితూగగల మానవుడు ఈ విశాల విశ్వంలో ఉన్నాడా ?

ఓ వైదేహీ ! నిన్ను అడవుల్లో త్రిప్పుతూ, నీ కాళ్లకు నొప్పిని కలిగిస్తూ-అడవి పూలను పళ్ళను ఇవ్వటంకంటె రాఘవుడు నీకు ఇంకే బహుమానాన్ని ఇవ్వగలడు?.

ఓ సీతా ! ఇక్కడైతే పట్టు వస్త్రాలతో సుగంధ పరిమళ ద్రవ్యాలతో అనంత

మైన వినోదాలతో కూడి దేవతలకు యోగ్యమైన భవనంతో నీవు కాలం గడపగలవు.

తన్ను తానీవిధంగా స్తుతించుకొని, రాముణ్ణి నిందించి, రావణుడు పలువిధాల సీతను లోబరచుకోటానికి శతథా యత్నించాడు. కాని అనంతమైన నిర్మలాకాశాన్ని మలినం చేయటం సాధ్యమా !.

తన సౌందర్యాన్నీ తన ఐశ్వర్యాన్నీ డాంబికంగా ప్రదర్శిస్తూ సీతను పెడదారి పట్టించటానికి రావణుడు ప్రయత్నించాడు. గుప్తనిధి తారసిల్లితే నిర్మలాగ్ని జ్వాలకూడా మందం కావచ్చు. కాని మాణిక్య దీప్తికి మాత్రం ప్రలోభత్వం లేదుగదా ! ధర్మబద్ధమైన ఆగ్రహంతో కూడి యున్నప్పటికీ ఉత్తేజవంతమైన మనోనిబ్బరంతో సీత రావణుడికిలా సమాధానం చెప్పింది.

నీ గౌరవ మర్యాదలకు భంగకరంగా పాపచింతనలకు నువ్వెలా లోలుడవైనావు? పరసతి, పరులపాన్పు, పరుడుస్నానం చేసిన నీళ్ళు, పరుల పుష్పాలు, పరిమళ ద్రవ్యాలు, ఎంగిలి అన్నము, ధరించిన వస్త్రాలు, నమిలిన తాంబూలము నిషిద్ధ వస్తువులని నేను నీకు జ్ఞాపకం చెయ్యాలా ?.

నీతిమాలినవాడు దేవుడి దయను పోగొట్టుకుంటాడు. ధర్మమార్గాన్ని అనుసరించిన వాడు ఆనందాన్ని మోక్షాన్ని అందుకోగలడు. నీతి తప్పినవాడి ఆడంబరం ఐశ్వర్యాల కంటె నీతిమంతుడి తీరని కోరికా-దారిద్ర్యాలే నయం.

జన్నకవి

## అమృతమతి వ్యామోహం

యశోధర చరితము నుండి

వేము తిన్నకాకికి
రుచిహీనమై మామిడి తోచినట్లు
కురూపిపై రాణికి అనురాగం అంకురించగా
తగ్గసాగె మమకారం రాజన్యునిపై.
తనశయ్యపై ఉత్సాహంలేని రాణిచుంబనానికి
ఆమె చూపులో సంబోధనలో శైత్యానికి విసిగి
వేధించే యీర్ష్యకు బందీ అయిన యశోధరుడు
భయంకర సత్యాన్ని తెలుసుకోవాలని ఆతురత పడ్డాడు.
రేయి తామరపూవు ముడతల్లో చిక్కుకున్న తేనెటీగ
ఉదయవేళ విముక్త యౌచు సంతసించు విధాన
నిద్ర నటించే రాజు కౌగిలి తప్పించుకొని రాణి
సాగిపోయె మెలమెల్లన సంకేత స్థలమునకు.

రాణి తప్పిదమే కాలనాగై కరవగ
కత్తి ఒరనుంచి లాగాడు వేవేగ రేడు
అధర్మాన్ని వెంటనంటే ధర్మదండంలా
అనుగమించె సన్నసన్నగా సంకేత స్థలమునకు.

అదృష్టహీనయైన అంచపై బడిన డేగ విధాన
సుగంధాలు పరిమళాలు తాంబూలము పళ్లెరంలో
చిందర వందరగా చెదరునట్టు
రాణి సిగబట్టి పడనెట్టె ఆమోటు మనిషి.

రైతు నారనుబాదినట్లు ఆ దుష్టుడు
జుట్టుపట్టి తన్నె అమాయికరాణిని
దెబ్బలు తిన్న దుష్ట నాగినిగా
గాయాల్తో రక్తసిక్త దేహంతో
అతడి పాదాలకు చుట్టుకొని ఆమె ప్రాధేయపడింది.

ఓ ప్రియా! నేను మసలటం సత్యమే!
అకారణంగా నేనలా చేస్తానా?
ద్వేష్యుడైన ఆ తెక్కలికాడు అయ్యో!
నన్ను శృంగార కేళిలో చిక్కించుకున్నాడు
మనసు లేకపోయినా మసలక
తప్పిందికాదు-సిగ్గు విడిచి చెప్పింది ఆమె.

వినుమా! నా మావటీడా!
నీ కంఠధ్వని నా చెవులకు మధువు
నీ రూపం నా కళ్లకు ప్రమోదం
నీ కనుసన్నలో నేను జీవిస్తా
నీవు నిరాకరిస్తే మరణిస్తా
అన్యమానవులంతా సోదరులే అనుకో.

అహో! కత్తి దుమికింది చేయి కదిలింది
రాజు ఉద్రేకంలో ఆ నీచుల్ని తృటిలో హతమార్చేవాడే
కాని ఆ పని జరక్కముందే జ్ఞానోదయమయింది.
విసుగుతో రాజు తా నాగిపోయాడు.

చీమను నిర్లక్ష్యం చేసే ఏనుగులా
నక్కను నీచంగా చూసే సింహంలా
క్షాత్ర రక్తంతో ఉద్దీప్తం కాగోరే నా ఖడ్గం
నీచ జారుల రుధిరాన్ని అపేక్షించదు.

పెక్కు సమరాల్లో క్షాత్రరక్త క్షాళితమైన నాఖడ్గం
కామాంధుల రక్తాన్ని చిందిస్తే కలుషితం కాదా!
అచంచలమైన నా విశ్వవ్యాప్త కీర్తిజ్యోతి కొడిగట్టినా
అపుడు నేను చేదు పుచ్చకాయలు కాసే తీగవలె ఉంటాను.

పాపాత్ముడి దేహాన్ని మాత్రం గాయపరచి
కలుషిత మానసాన్ని స్వేచ్ఛగా వదిలే ఖడ్గం నిష్ఫలం
ఒక స్త్రీ అధఃపతనాన్ని బొత్తిగా నిర్లక్ష్యం చెయ్యటమే ఘనవిజయం
తాను చంపిన హీన జీవుడు పునర్జన్మ ఎత్తే నరకంలో
జ్ఞాని ఏనాడైనా పడతాడా?

—అని అంటూ—

నరహత్యపు టాలోచన లంతంకాగా

రాజు వెనుదిరిగి పోయాడు
నిద్ర నటిస్తూ శయ్యపై మేను వాల్చాడు
అలసటతో రాజు నిదురించాడని అనుకుంటూ
రాజునే అనుసరించిన రాణి ఆయన పజ్జన చేరింది.

విటుణ్ణి కౌగిటజేర్చిన అందాల రాణి
రాజుకు శరీరంలో గుచ్చుకున్న ముల్లులా ఉంది
నిమ్మరసం ఒక్కబొట్టుతో చెడిపోయే కడివెడు పాలలా
నీరుగలిసిన తేనెలా అనిపించింది రాణి.

ఔరా! విధి నిర్ణయం ఎంత విచిత్రం
అందాల బరణి ఆ రాణి రూపమన్మథుడైన ప్రభువును పెళ్లాడి
వికృత రూపియైన ధూర్త విటుణ్ణి కోరడమా
ఆ విధిని నేను ముఖాముఖి కలుసుకోటం తటస్థిస్తే
దాని ముక్కు కోసేస్తా! అది రక్తధారలతో
కనికరం పొందకుండా తిరగనీ!

అభయరుచి మారి దత్తుడితో ఈ కథ చెప్పి—
"విధి మన్మథుడి మాయలతో చేతులు కలిపితే
మానవుడి బ్రతుకు బండలవుతుంది" అని నీతిని
పొందుపరిచాడు.

షడక్షరి

## మాతృవేదన

### రాజశేఖర విలాసము నుండి

దట్టమైన తెరల్లాంటి పొగలో కప్పబడ్డ నిప్పులాగా దురంత విషాదచ్ఛాయల్లో మునిగిన తిరుకొళవినాచి తెగిపడ్డ తన మృతశిశువు అంగాల్ని ఒకచోట చేర్చి ఇలా పరితపించింది.

విధి నిర్ణయానుసారంగా నా అమూల్యనిధిని పోగొట్టుకున్నాను. భూగర్భంలో భద్రపరిచిన సువర్ణకలశం అదృశ్యమయింది. విశాలాంబుధి వట్టిపోయింది. శక్తిమంతమైన

కల్పవృక్షం నా దౌర్భాగ్యంవల్ల మొదలంటా నరకబడింది.

నా బాబూ ! నీకు ఆకలేస్తోందా ? నీ ముఖం వేలగిలబడింది. నీ కడుపు అప్పడము అయింది. నీ కళ్ళు కాంతివిహీనమైనాయి. నా ముద్దుల బిడ్డా ! ఇలా నీవు వస్తుండి చని పోవటం న్యాయమేనా ? శంకర్ ఏడి ? అని అడిగే నీ నేస్తాలకు నేను ఏమని చెప్పేది ? రాజు గారి గుఱ్ఱపు డెక్కల చేత త్రొక్కబడి చనిపోయావని నేను వాళ్ళకు చెప్పేదా ?

నా ప్రియతమ కుమారా ! నీవు ఆడి, నిద్రించి, భుజించిన చోట్లను చూసి నేనెలా భరించేది ? ప్రీతి పాత్రుడా ! నీవు నన్నెలా వదిలి వెళ్లగలిగావు ? నీవు ఆటలనుంచి తిరిగి రాగానే నా పమిట చెంగుతో నీ కాళ్ళ దుమ్మంతా దులపలేదా ? నేను నీకు నీళ్ల పోయలేదా ? అన్నం పెట్టలేదా ? చూడముచ్చటగా నీకు బట్టలు వెయ్యలేదా ? నీ చిన్నారి కోర్కెలను తీర్చ టానికి నేనెంత ఆతురతపడేదాన్ని ! నీకు కోపం వచ్చిందా ? మీ అమ్మను-నన్ను-విచారపడ వద్దని కన్నీళ్ల తుడుచుకోమని అనకుండా ఊరుకున్నావేం ? ఇప్పుడు నీవు చనిపోయాక నీ సుందర రూపాన్నిచూసి మురిసిపోయే యీ నా కళ్ళు పగిలిన అద్దాలే ! నీతో ముచ్చట లాడిన ఈ నాలుక త్రెంచి పారేస్తే ఎండిపోయిన తీగలాంటిది. నిన్ను ప్రేమతో ఎత్తుకున్న యీ నా చేతులు నిర్దాక్షిణ్యంగా నరికివేసిన కొమ్మలాంటివి. నీకోసం పాటలు పాడిన యీ పెదవులు కమిలిపోయాయి. నా నాయనా ! ఇక నేను ఎవరికోసం ఎదురుచూసేది ? నాదుఃఖ హేతువును ఎవరితో మొరపెట్టుకునేది ? ఈ మానవ మాత్రులతో చెప్పుకున్నంత మాత్రాన నా దుఃఖం తీరుతుందా ? భగవంతుడే తన కృపను ఇట్లా ఉపసంహరిస్తే ఇక నిన్ను నాకు దక్కించే వాళ్లెవరు ?

**ముద్దన**

## మనోరమ

### రామాశ్వమేధం నుండి

ప్రకృతి తన మాయచేత అరణ్యాలను జనపదాలను సమ్మోహితంచేసింది. వాన కురిసిన ఒకనాటి సాయంత్రం కవులకు గర్వకారణమైన ముద్దన రాజాస్థానం నుంచి ఇంటికి వస్తూ, రాచబాటలోంచి తన ఇంటి సందు తిరిగాడు. తన భర్త రావటం చూసిన మనోరమ అతడికి స్వాగతంచెప్పి కాళ్లు కడుక్కోటానికి నీళ్ళిచ్చింది. చేయిపట్టుకొని మధ్యగదిలోకి తీసు కెళ్ళి కూర్చోబెట్టి మధురమైన పళ్ళు,మీగడపాలు ఇచ్చి సంతోషపరిచింది. అతడి ఆకలి, అల సట తీరాయి. వక్కాకులు అందిస్తూ మనోరమ ముద్దనతో సల్లాపాలాడింది.

మనోరమ: ప్రభూ ! ఈ రోజుల్లో ప్రొద్దుపోవటంలేదు. విసుగు పుడుతోంది. ధారాపాతంగా అహర్నిశలూ కురిసే యీ వానవల్ల జీవితం చాలా మందకొడిగా సాగుతోంది. మీరు నాకొక మంచి కథ చెబితే బాగుండును.

ముద్దన : ప్రేయసీ ! నీ కంత మనసైతే నేను చెప్పకుండా ఉంటానా ? నీకు ఏకథ యిష్టం? భోజప్రబంధం - విక్రమవిజయం- మహావీరచరితం - వీటిలో నీకు ఏది బాగుంటుంది ?

మనోరమ: ఛ ! ఛ ! నాకు అవేవీ వద్దు. ఇహలోకంలోగాని, పరలోకంలోగాని మార్గదర్శ

కమైౖ ఆసక్తిదాయకమైన కథ చెప్పండి,

ముద్దన : సరే! నీకు ఏ రసం ఇష్టం ? శృంగారమా ? వీరమా ? లేక హాస్యమా ?

మనోరమ: బాగు బాగు! ప్రత్యేకం ఒక రసం ఎందుకు ? నా హృదయం నవరసేచ్ఛతో ఉంది.

[నవ పదంలో శ్లేష ఉంది. క్రొత్త, తొమ్మిది అనే అర్థాల్లో]

ముద్దన : సరే! అయితే - అలాంటి కథ ఏదో చెప్పు.

మనోరమ: రామాయణంలోది ఏకథ అయినా సరే.

ముద్దన : అయితే సీతాస్వయంవర కథ చెబుతాను

మనోరమ: నేనది ఇదివరకే విన్నాగా!

ముద్దన : అయితే సీతాపహరణ ఘట్టం నీకు ఇష్టమేనా ?

మనోరమ: వద్దు వద్దు అది నాకు వద్దు.

ముద్దన : బాగుందీ వరస! ఈ లెక్కనయితే నేను నీకు ఏకథ చెప్పాలో అర్థం కావటం లేదు.

మనోరమ: ఎందుకంత నిట్టూర్పు! రకరకాల రామాయణాలు ఉన్నాయి. అందులో మీకు నచ్చింది ఏదైనాసరే.

ముద్దన : నీకు నచ్చిందేదో నువ్వే చెప్పరాదూ!

మనోరమ: సరే! శ్రీరాముడు అశ్వమేధయాగం చేశాడుగదా! ఆ కథ నాకు చెప్పండి.

ముద్దన : అలాగా! నీకు శేష రామాయణం వినాలని ఉన్నదన్న మాట!

మనోరమ: ఆఁ! అదే నాకు కావాలి. దాన్ని ఎవరెవరికి చెప్పారో నాకు చెప్పండి.

ముద్దన : శేషుడు వాత్స్యాయనుడితో చెప్పాడు. నేను నీకు ఆ కథ చెప్తాను. కాని అది చాలా పెద్దది గనుక చాలా రోజులు పట్టవచ్చు!

మనోరమ: కానీయండి. రోజూ కాస్త కాస్త చెప్పండి.

ముద్దన : నీ ఇష్టం. మరి నన్నా కథ పద్యరూపంగా చెప్పమంటావా? గద్యంలోనా? నీకు ఏది యిష్టం ?

మనోరమ: పద్యాలకో దణ్ణం బాబూ! వచనం ఎంతో రమణీయంగా ఉంటుంది. వచనంలోనే చెప్పండి.

ముద్దన : తథాస్తు. అలాంటి కథకు రాజైతే విలువైన రాళ్లతో పొదిగిన ఖడ్గమో లేదా బంగారపు గొలుసో బహూకరించేవాడు. మరి నువ్వేం బహుమానం ఇస్తావు నాకు?

మనోరమ: అంతకంటె గొప్పగా నేనేం ఇవ్వగలనబ్బా! నన్ను నేనే మీకు అర్పించుకుంటాను.

ముద్దన : ఎంత చిలిపిదానివి! నీ తలిదండ్రులు నిన్నేనాడో నాకు అర్పించారని నీకు తెలియదా ఏం ?

మనోరమ: అవును. అది నిజమే! నేను పరాధీననే! కానీయండి. ముందు నన్ను కథ విననీయండి. రాజైనా మీకథ బాగుంటేనేగదా మిమ్మల్ని సత్కరించేది ? మీకథ ఆసక్తిదాయకంగా ఉంటే బహుమానం సంగతి అప్పుడాలోచిస్తాను.

ముద్దన : మంచిని గుర్తుంచుకో. కథ విన్నాక బహుమానం ఇవ్వకపోతే మాత్రం నేను నిన్ను వదిలేదిలేదు.

మనోరమ: సరే! మీరు కథను ఎంత ఆసక్తికరంగా చెప్పగలరో చూద్దాం!

ముద్దన : అది అలా ఉండనీ! నన్ను మొదలు పెట్టనీ! ఎవడి పాద పంకజాలు దేవదానవ ఋషి సార్వభౌముల రత్నఖచిత మకుటాంచములచే స్పృశించబడినవో, అటువంటి వాని...—

మనోరమ: ఓ! ఆపండి నేను రాముడి కథ వినాలనుకుంటూంటే మీరేదో దేవదానవ ఋషి సార్వభౌముల్ని గురించి మాట్లాడుతారేమిటి? ఈ ధోరణితో మీ కథ ఎంత ఆసక్తిదాయకంగా ఉంటుందో నేను ఊహించగలను. మరి-మీరేం బహుమతి పొందగలరు?

ముద్దన ; బాగా చెప్పావు ప్రేయసీ! నామాట నమ్ము. పవిత్రమైన నీకేశభారంపై ఒట్టు! నేను నీకు నిజంగా రామ కథే చెబుతున్నాను. నేను ప్రారంభించిన ధోరణి సంస్కృతంలో ఒక మనోహరమైన పద్ధతి. అంతకన్న వేరేం లేదు.

మనోరమ: బలే బాగుంది! కన్నడంలోని మనోహరరీతులు అర్థంకాని నాకు సంస్కృతంలోని మనోహరరీతులు చెబుతున్నారే? నీళ్లే మ్రింగలేని వాడికి ఉండ్రాళ్లు తినిపిస్తా నన్నట్లుంది. మీరు చెప్పేది-

ముద్దన : మరి నన్నెలా చెప్పమంటావు?

మనోరమ: మీ కథాసారాన్ని సరళమైన కన్నడంలో చెప్పండి. కన్నడభాష కస్తూరి లాగా పరిమళ శోభితం అని మీకు తెలుసుగా!

ముద్దన : బంగారపు గొలుసులో అక్కడక్కడ కూర్చిన అమూల్య రత్నాల్లాగా లేదా నీకు అర్థమయేలా చెప్పాలంటే నల్లపూసల్లో అక్కడక్కడ కూర్చిన పగడాల్లాగా కన్నడ భాషాసౌందర్యాన్ని పెంపొందించటానికి అక్కడక్కడ నన్ను సంస్కృతం వాడనీ!

ప్రభుదేవ

## శివశరణుల వచనాలు

రాయిలోని నిప్పు రవ్వలా
గింజలోని చెట్టులా
ఊహాతీతుడవు నీవు గుహేశ్వరా!
నీ సాయుజ్యపుటానందం తెలిసిన వారే
అరయగలరు నీ ఉనికిని.
పాల కడలి నడుమ పాడియావెవరికి కావాలి?
కాంచనగిరిపై ధూళిధూసరిత సువర్ణమెవరికి కావాలి?
దేవదేవు పద సన్నిధిలో సత్యాన్వేషణ మెందుకు?
నీ కర్పణ చేసుకున్నాక (జీవికి) మోక్ష మెందుకు?

ఓ గుహేశ్వరా ! కరకలితమైన నీ లింగంతో
జీవి బంధవిముక్తుడౌను గదా !

చలితో వణికే పర్వతాన్ని ఎవడు కప్పగలడు ?
నగ్నంగా ఉన్న భూదేవికి ఎవడు చీర కట్టగలడు ?
ఓ గుహేశ్వరా ! నీభక్తుడు మాయకు లోనైనప్పుడు
మాట మూగపోతుంది !

ఆనందలేశంకోసం వాళ్లు దుఃఖసాగరాన్ని కొని తెచ్చుకుంటారు.
క్షణికమైన దేహసుఖాల ఆభాసం అట్టిది
ఓ గుహేశ్వరా ! బంగారు కుండకై (అమూల్యమైన) ఆత్మలే అమ్ముకుంటారు

నీవు ఈ దేహాన్నే గుడిగా చేస్తే
నిన్నారాధించటానికి నాకింకోగుడితో పనిలేదు-
నాకు రెండోగుడి లేనేలేదు
నీవు రాయివైతే నేనూ అదే కావాలి !

దివ్యసాన్నిధ్యపు టానందాన్ని ఎవడు (మాటల్లో) నిరూపించ సాహసిస్తాడు ?
అటువంటి దుస్సాహసానికి మాటే సిగ్గుపడుతుంది
మాటల్లో నిన్ను దర్శించేవాళ్లు నిన్ను తెలుసుకోనేలేరు !

### బసవేశ్వర

కరికంటె అంకుశాన్ని చిన్నదిగా భావించవచ్చా? కూడదు.
గిరికంటె వజ్రము చిన్నదని చెప్పగలమా? కూడదు.
తమస్సుకంటె జ్యోతి చిన్నదని చెప్పవచ్చా? కూడదు
నిన్నే యోచించే మనస్సు విస్మృతికంటె తక్కువా? కాదు
ఓ కూడల సంగమదేవా! కాదు!

సారవంతమైన మానసక్షేత్రంలో
పెరిగే దౌర్బల్యాలనే కలుపుమొక్కల్ని తొలగించు
అవి నన్ను తెలుసుకో నియ్యవు-మేలుకో నియ్యవు
అట్లాచేస్తే ఓ ప్రభూ!
నేను కొమ్మలతో రెమ్మల్తో ఎదుగుతాను
ఓ కూడల సంగమదేవా!

గడపలో గడ్డిమొలిచింది ఇంటిలోపల దుమ్ము నిండింది.
ఇంటిలోపల యజమాని ఉన్నాడో లేడో!
దేహంలోపల యజమాని ఉన్నాడో లేడో!
దేహంలోపల అనృతం నిండె, మనసులోపల విషయవాంఛలు నిండె-

ఇంటిలోపల యజమాని లేడేమో!
కూడల సంగమ దేవ!

లోకమంతా సరిచెయ్యడానికి ఎందుకు చూస్తారు?
మీ దేహాన్ని మీరు మంచి వ్యవస్థలో పెట్టుకోండి.
మీ మనస్సును మీరు అదుపులో ఉంచుకోండి.
పరులకోసం పరితపించేవారిని హర్షించడు
కూడల సంగమ దేవుడు!

ఈ లోకం దేవదేవుడి టంకసాల
ఇక్కడ చెల్లినవారు అక్కడా చెల్లుతారు
ఇక్కడ అప్రయోజకులక్కడ వెలలేని నాణాలు
కూడల సంగమదేవా.

క్రోధాన్ని క్రోధంలో ఎదిరించకు
క్రోధం నీదైనా పరులదైనా
దేహికోపం దేహానికి ముప్పు
మనసులోని కోపం విచక్షణకే ముప్పు
ఇంటిలోని అగ్ని ఇంటినే కాలుస్తుంది
పొరుగింటిని కాదయ్యా
కూడల సంగమదేవా!

నా దేహమె వీణాదండంగా
నా శిరస్సే దాని బుఱ్ఱగా
నా నరాలు వీణాతంత్రులుగా
నా అంగుళ్లలే మీటలుగా చేసి
వీణను నీ హృదయానికి హత్తుకొని
ఆలపించు ముప్పైరెండు రాగాలు దానిపై-
కూడల సంగమదేవా!

నన్ను స్తుతించేవాళ్లు నాకు బంగారు సంకెలు తగిలిస్తారు
వాళ్ళ ప్రశంసలే నన్ను భ్రష్టుణ్ణి చేస్తాయి-నాపాలిట ఉరిసెలౌతాయి
అయ్యో! నేను ఆవేదనతో గిజగిజలాడుతున్నాను.
...ఇక యే మాత్రం భరించలేను
కూడల సంగమదేవా! నీవే నావాడవైతే...నాపై నీకుదయ ఉంటే
నాకూ నన్ను స్తుతించే వాళ్ళకూ మధ్య నిలువుము అడ్డంగా!

నీ నామామృతమే నానాలుకపై
నీ దివ్యరూపమే నా నేత్రాల్లో

నీ ధ్యానమె నా మనసున
నీ గానమె నా వీనుల్లో ప్రతిధ్వనించగా
నీ పదపంకజ సన్నిధిలో
ఆలపించనీ నన్ను అవ్యక్తంగా!
కూడల సంగమ దేవ!

## అక్క మహాదేవి

కొండమీద ఇల్లు కట్టాక క్రూరమృగాలంటే జడుపెందుకు?
సంద్రపొడ్డున ఇల్లుకట్టాక నురుగన్నా కెరటమన్నా భయమెందుకు?
సంతలోన ఇల్లు కట్టాక సద్దని సణిగితే యెట్లాగు!
చెన్నమల్లికార్జునదేవ! వినవయ్యా!
పుడమిపై పుట్టాక పూలగుచ్ఛాలకు రాళ్ల దెబ్బలకు
తల యొగ్గవలెనయ్యా!
మనసులోన కోపానికి తావీయక
సమభావనతో సాగవలెనయ్యా!

విషదంష్ట్రలు పెకలించాక
సర్పంతో సయ్యాటలాడటం
దానితోడి సాంగత్యం సుసాధ్య మవుతుంది
అలాగే జీవుడికి దేహంతో సాంగత్యం కోరదగ్గదే
కామానికి లోనైన కాయం భూతం పట్టిన తల్లి లాంటిది
ఈ కాయంతో సతమత మౌతున్న నీ యిష్ట దాసుల్ని నిందించకయ్యా
చెన్న మల్లికార్జున దేవ!

నిన్నరసిన వారికి నరకమె స్వర్గం
అరయకున్న స్వర్గమె నరకం
నీ ఆమోదం పొందని సుఖమే దుఃఖం
నీ ఆమోదం పొందిన దుఃఖమే పరమసుఖం
నీ దాస్యమే బంధవిమోచనం
చెన్న మల్లికార్జునదేవ!

ఆకలి తీరేందుకు నేను దేశమంతా తిరిగి బిచ్చమెత్తుతా
దాహం తీరేందుకు నేను బావులు చెరువులు ఏరులు శోధిస్తా
రాత్రి గడిపేందుకి నేను పాడుబడ్డ గుళ్లోకి వెడతా
నాలోని జీవుడికి తోడుకోసం నిన్నే నేనర్థిస్తా
చెన్న మల్లికార్జునదేవ!

నిప్పులవర్షం కురవనీ—

నా ఆకలి తీరిందంటా ;
నా నెత్తిపై కుంభవృష్టి కురవనీ-
అదే స్నానంగా భావిస్తా ;
కొండవిరిగి నెత్తినపడనీ-
అదే పుష్పవృష్టిగా భావిస్తా ;
నా శిరసే తెగిపడనీ-
నీ కదే నా కానుక అని అంటా!
చెన్న మల్లికార్జున దేవ!

నీ సతి నౌదామని నేను
తరతరాలుగా నిన్నే ప్రేమించా
పవిత్రభస్మం అలదుకొని
వివాహకంకణం ముంజేత దాల్చి
నేను నీకు అర్ధాంగిని కాగలనని
నీకోసమే వచ్చేశా-
చెన్న మల్లికార్జునదేవ!

**హరిహరుడు**

## శరణుల దృష్టిలో బసవేశ్వరుడు

### బసవరాజదేవర రగడల నుండి

బసవేశ్వరుడు శరణులతో వేదాంత ప్రసంగంచేస్తూ, ఎంతో నమ్రతతో కూడిన ఆధ్యాత్మిక ధోరణిలో ఇలా అన్నాడు—

"నా ప్రభూ! నన్ను సదా నీ దృష్టిలో ఒక చిన్న కీలుబొమ్మగా నీది నీకు ఇచ్చే ధర్మదాతగా నీ కానుకలకోసం నీకు సంతోషంతో సేవచేయటానికి నన్ను తయారుచేశావు. నా చేష్టలు, స్వభావాల్ని గురించి వారు చెప్పేది విపరీతంగా ఉంది. వాస్తవానికి నిన్నెలా అర్చించాలో నాకు తెలియదు. నీ కటాక్షానికి అర్హమైన పనులు నేనేమీ చెయ్యలేదు. నిన్ను కీర్తిస్తూ పాడటం తెలియని ఒక అల్పకుణ్ణి నేను. నాలో ఏ సుగుణాన్నిగానీ దోషాన్నిగానీ చూడవద్దనీ నా లోపాన్ని ఉపేక్షించి, నీ కటాక్షాన్ని నాపై ప్రసరించమనీ నిన్ను వేడుకొంటున్నాను."

అని అతడు ముగించగానే ఆ సభ ప్రస్ఫుటంగా తన సమ్మతిని తెల్పింది. శరణులు ఏకకంఠంతో అతన్ని ఇట్లా కీర్తించారు

"ఓ బసవా! బసవన్నా! బసవన్నా! బసవయ్యా! బసవప్రభూ! బసవరాజా! బసవదేవా! ధార్మికచింతనలో నిన్ను అధిగమించిన వాడెవడూ లేడు. నీకు శివలింగం, గురువూ ఒక్కరే. వారు విడదీయరానివాళ్ళు. నీవు శరణుణ్ని శివుడి అవతారంగా భావిస్తావు. శివభక్తులకు నీవు స్వాగతం చెప్పి, ఆతిథ్యమిస్తావు. నీ ఔదార్యం అవధులు దాటింది. అడిగినవారు, అడగనివారు సమానంగానే నీ వితరణాన్ని అందుకుంటారు. జాగ్రదవస్థలో స్వప్నావ

స్థలో సుషుప్త్యవస్థలో శరణుణ్ని ఈశ్వరుడుగానే నీవు భావిస్తావు. నీకు ప్రతినిత్యమూ శివ రాత్రే. శివభక్తులు నీకు ప్రాణసమానులు. పరమశివుడికి నైవేద్యం చెయ్యనిదానిపై నీవు నీ పంచేంద్రియజ్ఞానాన్ని ప్రసరించనీయవు. నీవు శైవధర్మ వ్యాఖ్యానం, అన్యధర్మ ఖండన చేస్తావు. దేవదేవుణ్ణి గూర్చి చెడుగా మాట్లాడితే నీవు సహించవు. జంగములలో నీవు కులాన్ని పరిగణించవు. ఈశ్వరుడి కానుకలపై నువ్వు తీర్పుచెప్పవు. నీ దృష్టిలో ఇతర స్త్రీలంతా నీకు తల్లులే. పరద్రవ్యాలు నీకు విషతుల్యాలు

నీ మాటలకు క్రియలకు వైరుధ్యంలేదు. నీవు అన్నమాట తప్పటంగాని, వెనక్కి తిరిగిపోవటంగాని, విడిచిపెట్టడంగాని చెయ్యవు నీ కానుకలను నీవు జ్ఞాపకముంచుకోవు. నీవు చేసినదాన్ని అన్యథా చెయ్యవు. ఇతరులతో పరిచయానికి వెనుదీయవు. నీవు ఆడినమాట తప్పటంగాని అనలేదనటంగాని మరవటంగాని చెయ్యవు. నీ మనసులో దేన్నీ దాచుకోవు. నీవు దురహంకారివికావు. నీ మనస్సు ఆలోచనల్తో నిండిఉండదు. నీవు మోహాతీతుడవు. అందు వల్ల నీలో క్రోధానికి తావులేదు. లోభం నిన్ను చేరటానికి సాహసించదు. మమత నీలో చోటు చేసుకోలేదు. అహంకారాతీతుడవు నీవు. అసూయ నీ కవచాన్ని భేదించలేదు. ఓ బసవ రాజా! నీ సద్గుణాలను వర్ణించడం మా తరం కాదు. దైవానుగ్రహపాత్రుడవైన నీవు నిరుప మానవుడవు. నీ శక్తి అమూల్యం. ఓ బసవా! ఈశ్వరభక్తి దీపికతో ఈ నాస్తిక విశ్వంలోకి వచ్చావు. నీవు అద్భుత కార్యాలు చేశావు అనుచరవర్గాన్ని సంపాదించావు. నీవు ఒక యుగ పురుషుడవు. నీవు భక్తికి క్రొత్త వెలుగును ప్రసాదించావు."

ఈ విధమైన శరణుల స్తోత్రాన్ని ఆపటానికి బసవేశ్వరుడు వాళ్ళ కాళ్ళమీద పడ్డాడు. వారి ప్రశంసలు కొరడా దెబ్బల్లాగా బాధించగా, అతడు భరించలేకపోయాడు. అతడి మనస్సు ఈశ్వరుడి వైపు మళ్ళింది. శివస్తుతి గీతాలను అతడు విన్నాడు. ఆ భక్తి ధ్యానాల్లో అతడు ఆత్మస్తుతి సంరంభాల్ని విస్మరించాడు.

**రాఘవాంకుడు**

## హరిశ్చంద్రుడు—మాతంగ కన్యలు

### హరిశ్చంద్ర కావ్యం నుండి

విశ్వామిత్రుడి ఆశ్రమానికి వచ్చిన హరిశ్చంద్రుణ్ని తమ గాన మాధుర్యంతో అలరించిన చండాల వనితలు "ఓ హరిశ్చంద్ర మహారాజా! దాతలలో సాటిలేనివాడా! అసమానమైన నీ దాతృత్వ గాథలు మా చెవుల్లో మారుమ్రోగుతున్నాయి. ఓ హరిశ్చంద్రా! అతులిత త్యాగమూర్తీ! మా వినయపూర్వకమైన విజ్ఞప్తిని విను. మా హృదయాలు ఆతురతతో బద్ధలవుతున్నాయి. మమ్మల్ని తిరస్కరిస్తావేమోనని చెప్పనలవికాని భయం మమ్మల్ని ఆవహించింది. మాకు వరాల్ని ప్రసాదించి, మా హృదయంలో చెలరేగుతున్న తుపానును నిశ్శబ్దం చెయ్యి. మేము ఆత్మార్పణ చేసుకుంటున్నాం. మమ్మల్ని నీ భార్యలుగా స్వీకరించు" అని అన్నారు.

"ఛీ! ఛీ! ఈ విశాల విశ్వంలో మహోన్నతమైన సూర్యవంశంతో వంశపారంపర్య దీప్తిలోగానీ శౌర్యంలోగానీ కీర్తిలోగానీ తగుదుమని వధువునిచ్చి ధైర్యంగా సరితూగదగిన

వంశం ఒక్కటయినా లేదు కేవలం చరాస్తివంటి మీరు మిమ్మల్ని నాకు భార్యలుగా సమర్పించుకుంటున్నారు! ఇదంతా కాల వైపరీత్యమో స్థలవైపరీత్యమో అయి ఉండాలి." అని హరిశ్చంద్రుడు ముమ్మరమైన క్రోధావేశంతో అన్నాడు.

"ఓ మహారాజా! దేవుడివలెనే, నీతిని పరిగణించు! కులాన్ని కాదు. ఆవు పొదుగు అందంగా లేకపోయినా, అందులోఉండే పాలు దైవానికి పవిత్రామృతం. తేనెటీగ అందవిహీనంగానే ఉంటుంది. కాని అది సేకరించే తేనె మధురంగా ఉండి, దేవుడికి ప్రీతిపాత్రమైంది. కస్తూరి పరిమళమైనదే కాని అది ఎక్కడినుంచి వస్తుందో, చూడటానికి అసహ్యమైన ఆనాభిని గూర్చి ఎవడూ ఆలోచించడు. భగవంతుడు మంచివాటినీ అందమైనవాటినీ వాటి పుట్టుపుర్వోత్తరాలతో నిమిత్తం లేకుండానే స్వీకరిస్తాడు. మేము అందంగానూ యౌవనంలోనూ ఉన్నాం. మమ్మల్ని స్వీకరించు మహారాజా!"

"మాయమాట లెంతమధురం! ఎంతో నిర్మలంగా ఉన్నా, మురుగు నీళ్ళలో ఎవడైనా స్నానం చేస్తాడా? కుక్కపొదుగులోని పాలు ఎవడైనా కాంక్షిస్తాడా? శ్మశానంలో వికసించిన పుష్పం ఎంత సుందరంగా ఉన్నా, దాన్ని ఎవరైనా పెట్టుకుంటారా? పరిత్యజించదగినవారై యౌవన సౌందర్యపు మదోన్మత్తతతో మీరు పేలుతున్నారు. అయ్యో! వీనుల విందు-అనిపించే ఇట్లాంటి మోసపు మాటల్తో నా చెవులు ఎంత కలుషితమైనాయి! దేవుడి ముఖం చూసి అయినా ఇటువంటి అపవిత్రమైన ఆలోచనలు వదిలి పెట్టండి."

"విడ్డూరం! ఎంత విపరీతం, మా గానం విన్నంత మాత్రాన నీ చెవులేం కలుషితం కాలేదే! మాతో మాట్లాడినంత మాత్రాన నీ పెదవులేం మలినం కాలేదే! మా సిగలోని పూల సౌరభం నీ ముకుపుటాలు ఆఘ్రాణించినంత మాత్రాన చెడిపోలేదే! ఆశ్చర్యం! ఒక్క స్పర్శానుభూతి మాత్రం అపవిత్రమవుతుందా? విపరీతం! ఎంత విపరీతం! పంచేంద్రియాల్లో స్పర్శ శక్తి కొక ప్రత్యేకస్థానం ఉందా!

"ఎంత సిగ్గులేని వితండవాదం! చెవులు విన్నాయి-కాని ఎంతో దూరంనుంచి! కళ్ళుచూశాయి- కాని దూరంనుంచే- పెదవులు పలికినా ముక్కు వాసనచూసినా దూరంనుంచేగా! కణకణలాడే నిప్పుకణికలను చూస్తాం.వాటి శబ్దంవింటాం-కాని వాటిని తాకంగదా!-చేతులు కాల్చుకోవాలనుకుంటే తప్ప!-పొండి! పొండి మీ కపటపు మాటలూ మీరూ!"

"శాపవశాత్తు తక్కువ కులంలో పుట్టబట్టే-మా పాప ప్రక్షాళన కోసమేగా నిన్ను మేమింతగా అర్థిస్తోంది!" అని వాళ్ళన్నారు.

"మీ పాప ప్రక్షాళనకోసం నేను పాపం చేస్తానా?" అని రాజు అడిగాడు. "పావనమైన గంగానది అపవిత్రుల్ని పవిత్రం చేసినంత మాత్రాన తా నపవిత్రమౌతుందా!" అని వాళ్ళు రాజును ఎదురు ప్రశ్నించారు. "అర్థంలేని వితర్కం! కడివెడు పాలను చెడగొట్టటానికి నిమ్మరసం బొట్టు ఒక్కటి చాలదా?" అని వాళ్ళకు సమాధానం చెప్పాడు రాజు.

"ఓ సార్వభౌమా, మాటకు మాట బదులుచెప్పగల చాతుర్యం మాకు లేదు. అనంతమైన నీ యశస్సు, నీ సుందర విగ్రహం, నీ సుగుణసంపద, నీ ప్రావీణ్యం, నీ యౌవనం-

వీటన్నిటివల్ల వ్యామోహితులమై నీకు మమ్మల్ని సమర్పించుకున్నాం. శరణార్థుల్ని త్రోసి పుచ్చటం ధర్మం కాదని నీవు అనుకుంటే-మమ్మల్ని స్వీకరించమని నిన్ను వేడుకొంటున్నాం. మేము నీ తిరస్కారానికి ఒప్పుకోం-అది మాత్రం ఖాయం." అన్నారు ఆ కోమలులు.

కుమార వ్యాసుడు

## ఉత్తరకుమారుడి పరాభవం

భారతం నుండి

సమీపిస్తున్న కౌరవసేనను చూచి ఉత్తరకుమారుడు భయంతో నిశ్చేష్టుడైనాడు. అతడి దేహం వణికింది. ఒళ్ళు గగుర్పొడిచింది. పెదవులు, నాలుక తడి ఆరిపోయాయి. బరువెక్కిన హృదయంతో అతడు ఆ దృశ్యాన్ని చూడలేక తన ముఖాన్ని రెండు చేతులతోను కప్పుకున్నాడు.

"సారథీ ! విను రథాన్ని ఇంకాముందుకు నడుపుతావెందుకు? దేవతలను కూడా కలవరపరిచే ఆ సేనావాహిని ఎదురుగా ఉన్నా నీకు కనపడటంలేదా? ఆ భయానక దృశ్యాన్ని నా కళ్లు భరించలేవు. నీకు మతిపోయిందా? రథాన్ని వెనక్కి త్రిప్పు. త్వరగా కానీ! అని ఉత్తరకుమారుడు అర్జునుడితో అన్నాడు.

ఆమాటలను లక్ష్యపెట్టకుండానే అర్జునుడు గుఱ్ఱాన్ని అదిలించాడు. వణుకుతూ ఉన్న ఉత్తరుడి చేతుల్లోంచి విల్లమ్ములు జారిపడ్డాయి."నేను చెప్పేది వినబడటంలేదా?నువ్విట్లా ప్రవర్తించటానికి నేను నీకేమయినా శత్రువునా? మేము నీ యజమానులం కామా? మేము చేసిన మేలు మరచిపోయి నీవు ద్రోహిగా మారావా?" అని ఉత్తరుడు అన్నాడు.

ఈ మాటలకు అర్జునుడు నవ్వి గుఱ్ఱాలను ఇంకా ముందుకు తోలాడు. "ఈ సారథి నన్ను చంపేశాడు." అని ఉత్తరుడు అరిచాడు. నేనింక ముందుకు పోనని తనలోతాను అనుకొని రథంమీదనుంచి క్రిందకు దూకి జుట్టు చిందరవందరకాగా ప్రాణంమీది తీపితో అతడు పరుగెత్తాడు.

"సిగ్గుచేటు" అని పార్థుడు అరుస్తూనే, సిగ్గులేకుండా పారిపోతున్న ఉత్తరుణ్ణి వేగంతో వెన్నంటాడు. అప్పుడు భూమి కంపించింది. ఆదిశేషుడు చలించాడు. అర్జునుడు వెంటాడుతూ ఉన్న ఆ దృశ్యాన్ని చూచిన కౌరవసేన కడుపుబ్బ నవ్వింది.

"పలాయనం చిత్తగిస్తూ ఉన్న ఆ వీరుణ్ణి చూడండి. కాని అతన్ని వెన్నంటుతూ ఉన్న రథసారథి గుండె నిబ్బరం ఉన్నవాడులాగా కనిపిస్తున్నాడు. అతడెవరైనదీ భగవంతుడికే తెలియాలి-కాని అతని రూపం, ధోరణి ఫల్గుణుని జ్ఞప్తికి తెస్తున్నాయి." అని సేనలో గుసగుసలు బయలుదేరాయి.

"ఆగు! లేకపోతే నీతల ఎగిరేట్టు చేస్తాను." అని అర్జునుడు గర్జించాడు. ఉత్తరుడు అతని మాటలు పట్టించుకోలేదు. అతడు అర్జునుణ్ణి చూడటానికి ఒకసారి వెనక్కి తిరిగి, తన్ను వెంటాడుతున్నది సారథేనా లేక మృత్యువా-అని ఆశ్చర్యపోతూ ఇంకా వేగంగా పరుగెత్తాడు.

ఉత్తరుణ్ణి అధిగమించిన అర్జునుడు అతని చేయిపట్టుకొని," ఎంత అవమానం! ఒకక్షత్రియుడు యుద్ధంనుంచి పారిపోవటమా! అమాయకస్త్రీల ఎదుట నీ ప్రతాపాన్ని గూర్చి ఎంతో గొప్పగా మాట్లాడావు. మరి ఇప్పుడు నీవు విరాటవంశ గౌరవాన్ని మంటగల్పుతూ కుందేలులాగా పరుగెత్తుతున్నావు!'' అన్నాడు.

ఉత్తరుడు పండ్లిగిలించి తలవంచుకొని తన మేలు కోరుకుంటూ జాలికలిగేట్టుగా అతడు "ఓ సారథీ! నన్ను పోనీ! నేను నీ బిడ్డననుకో. ఈ ఉద్రిక్త సేనావాహినికి ఎదురునిలిస్తే నాప్రాణాలపై ఆశ వదులుకున్నట్లే. నేను చావాలనుకున్నట్లయితే-నీవే నాతల నరికేస్తే బాగుండును." అని అన్నాడు.

తనలోతాను నవ్వుకుంటూ అర్జునుడు ఇలా గర్జించాడు. "పిరికివాడా! రాజ మందిరంలో అందాలపడుచుల ఎదుట అంతులేని ప్రగల్భాలు పలికావే! ఇప్పుడు నీకు ఏమయిందని-కౌరవసైన్యాన్ని చూడగానే నక్కలాగా పరుగెత్తటం మొదలెట్టావు. నీ ఇగిలింతలు ఆపెయ్యి! నేను నిన్ను పోనివ్వను. నీవు కౌరవసేనతో యుద్ధంచేసి తీరాల్సిందే!"

అతడు ఇంకా ఇలా అన్నాడు."పిరుడు యుద్ధంనుంచి వెనక్కివేసే ప్రతి అడుగువల్లా నరకానికి చేరువవుతున్నాడనీ, ముందుకువేసే ప్రతి అడుగువల్లా అశ్వమేధయాగఫలాన్ని పొందుతాడనీ నీకు తెలియదా ? యుద్ధంలో చనిపోయిన ప్రతి యోధుడికీ స్వర్గంలో దేవతలు స్వాగతమిస్తారు. దేవేంద్రుడే స్వయంగా వాడి వీరత్వాన్ని గానంచేస్తాడు."

"నేను యుద్ధంనుంచి పారిపోవటంవల్ల పాపం సంక్రమిస్తే భూసురులవల్ల ఆ పాప ప్రక్షాళన చేయించుకుంటాను. అశ్వమేధయాగ ఫలమంటావా-నే నీ భువిపై ఆ యజ్ఞంచేసి సంపాదించగలను. నాకు స్వర్లోకసుందరులతో పనిలేదు. మా రాజమందిరంలో ఉన్న అందమైన యువతులే చాలు. నాచిన్న రాజ్యానికి నేనే ఇంద్రుణ్ణిగా భావిస్తాను. నన్నుపోనీ! అని ఉత్తరుడు ప్రాధేయపడ్డాడు.

అతడు ఇంకా ఇట్లా అన్నాడు. "ఓ సారథీ! విను-నన్నుపోనీ నీకు అన్నిరకాలైన బహుమతులను, అమూల్యమైన ఆభరణాలను ఏనుగులను అందమైన యువతుల్ని ఇచ్చి సత్కరిస్తాను. అయ్యో! మాతండ్రి సహాయ సహకారులకు కృతఘ్నుడవై ఇదేనా నువ్వు చూపించే ప్రతిఫలం! నీ గుండె రాయిగా మారినట్టుంది.

**పురందరదాసు**

## హరిదాసుల కీర్తనలు

ధర్మమే జయమనే దివ్యమంత్రాన్ని తెలియండి
ఆ మంత్రమర్మాన్ని అరసి ఆచరించండి.
విషమిచ్చేవాడికే అమృతమందించాలి
ఈర్ష్యపడేవాణ్ణే పోషించాలి
తియ్యటి మాటల్తో మీ ఇల్లు ఆక్రమించినవాడికీ

మేలుజరగాలని దేవుణ్ణి మొక్కాలి
నీమీద కత్తినెత్తినవాడి పేరే నీ బిడ్డకు పెట్టాలి

ఈసడించేవాణ్ణి గురించి ప్రశంసాపూర్వకంగా మాట్లాడాలి
చంపదలచినవాడితో స్నేహం చెయ్యాలి
పరోక్షంగా నిన్ను నిందించేవాణ్ణే అభినందించాలి
నిన్ను బంధించడానికి చూసేవాడికే విమోచనం కలిగించాలి

చంపదలచినవాణ్ణే ప్రస్తుతించాలి
ద్వేషించేవాణ్ణే కీర్తించాలి
పురందర విఠలదేవుడి అఖండమహిమ తెలుసుకోవాలి
వినమ్రతతో కీర్తించాలి.

* * *

## కనకదాసు

దుర్బలమైన ఓ మనసా! చిరచిరలాడకు
సకలజీవులను సాకి రక్షించువాడు దైవమే-సంశయం వలదు
కొండశిఖరంపై పుట్టిన చెట్టుకు
కట్టకట్టి నీరు పోసిందెవరు ?
పుట్టించిన స్వామియే జీవి బరువు మోస్తాడు
ఆతడే మన క్షేమాన్ని అవశ్యం చూస్తాడు
దానికోసం లవలేశమూ సందేహపడకు.

నెమలికి రంగులు వేసిందెవరు?
పగడపుతీగెను ఎరుపు చేసిందెవరు?
చిలుకకు పచ్చని వర్ణం పూసిందెవరు ?
నారుపోసినవాడు నీరు పోయకమానునా!

రాతిలో పుట్టిన చిరుకప్పకు
అందులో ఆహారం సమకూర్చిందెవరు ?
'కాగినెలె' ఆదికేశవుడు సర్వశక్తిమయుడు
సకలజీవుల సాకునతడు సందేహపడకు.

* * *

## జగన్నాథదాసు

తెలుసుకుంటే తేలికే ఈశునారాధన
తెలియకున్నవాడెపో అదృష్టహీనుడీలోకంలో.
విశ్వమే మంటపంగా

పృథివియే మూలపీఠంగా
సూర్యచంద్రములే జ్యోతులుగా
వృక్షాలే చామరములుగా
అంబరమే ఛత్రంగా
దినమే అష్టదళపద్మంగా

వర్షజలమే స్నానజలంగా
క్షితిజమే వసనంగా
సుగంధమలయపవనమే పరిమళంగా
అగ్నియే ధూపంగా
నవధాన్యాలే నైవేద్యంగా
విద్యుల్లతయే కర్పూరహారతిగా
లెక్కలేని చుక్కలే శతసహస్రదీపాలుగా
అయనాలే పవిత్ర ఘడియలుగా
పుష్పఫలశోభితలౌ తరులతామధ్యంలో
తనరారిన ఆదిలక్ష్మి సతిగా
తన హృదయపీఠంపై అలరారగా
అందుకొనును అర్చనలను
అనవరతం ఆ ఆదివిష్ణువు.
తమ సర్వస్వం అర్పించిన రాజులకు
సప్తసముద్ర ఘోషణలే
ఆకాశపు గర్జనలే
దుందుభిమ్రోతలు
రవిచంద్రుల పరివేషాలే ముకురసేవలు
లయబద్ధమైన దివానిశల ఆగమనమే నాట్యసేవ ।

వేదాల్ నాలుగు తల్పాధారంగా
వత్సరాలే కట్టిన త్రాడులుగా
మాసాలే కుచ్చులుగా
అంబరమే తల్పపు పందిరిగా
అయనాలే శయనాస్తరణాలుగ
షడృతువులె బాలీసులుగా
అమరినవయ్యా ! ఆదిదేవ నీకు ।

పగళ్లే తమలపాకులుగా
కరణాలే వక్కలుగా
యోగాలే సున్నంగా

రాత్రులే కౌతుకంగా
భోగవతియే పుక్కిలిజలముగా
అంబుధులే అనంతరూపుడైన
ఆదిదేవు పదాంబుజ ప్రక్షాళనోదకంగా
ఈ మహావిశ్వంలో అంతర్వ్యాప్తుడైన
జగన్నాథవిఠలుడు
త్రికరణశుద్ధిగ తన్నారాధించినవారికి
దుఃఖాలన్నీ దూరంచేస్తూ
సకలసుఖాలూ కలిగిస్తాడు.

రత్నాకరవర్ణి

## ఆదర్శప్రభువు

### భరతేశవైభవం నుండి

ఆదర్శప్రభువుకు ఆత్మవ్యవహారాలవల్లనే రాజ్యవ్యవహారాలూ ముఖ్యమైనవి. అతడు ధర్మబద్ధుడై ఉండాలి. ప్రాపంచిక విషయాలను అనుసరిస్తూనే వాటిల్లో సక్తుడు కాకూడదు. లయబద్ధంగా నాట్యంచేస్తూనే శిరసుమీద కలశం కదలకుండా చూచుకొనే నర్తకిలాగా నృపుడు పాలనావ్యవస్థను పరిశీలిస్తూనే ధార్మికవిలువలు కాపాడాలి.

ఆకాశంలో ఎగిరే గాలిపటానికి ఆధారం భూమి మీద నిపుణుడి చేతుల్లో ఉన్నట్లుగానే భౌతికంగా సుఖం అనుభవిస్తూనే ప్రభువు ధర్మబద్ధుడై ధరపై మెలగాలి. ఇది కల్లగానీ కపటంగానీ కాదు.

* * * * *

## బాహుబలికి భరతుడి సలహా

"నీది నేను గాని నాది నువ్వుగాని ఏమీ తీసుకోలేదు. మన తండ్రి కోరినట్లుగా నేను రాజును నీవు యువరాజువు అయినాము.

నీకు నేను గాని నాకు నీవుగాని శత్రువులం కాము. ఆసంగతి నీకు తెలుసు. జినుడి కొడుకులు శత్రువుల్లా ప్రవర్తించడం రాజద్రోహానికి ప్రబల నిదర్శనం.

కత్తిని కత్తితోనే ప్రతిఘటించటానికి భయపడి నేనిలా అనటం లేదు. నేనూ రణదుందుభులు భయానకంగా మ్రోగించగలను కాని నేను తొందరపడ కూడదు.

కయ్యానికి కాలు దువ్వేవాడు నా బంధువు కాకపోయినట్లయితే నేనూ కత్తితో కదనరంగానికి ఉత్సాహంగా దూకేవాణ్ణే. కాని యుద్ధనీతికే క్రొత్త అయిన సోదరుల సంఘర్షణను లోకం గర్హిస్తుంది.

నేను మొదట పుట్టిన కారణాన విజయపథంలో అగ్రగామిని అయినాను. నీవే తొలుత జన్మించి ఉంటే నేను నీకు తల ఒగ్గకుండా ఉంటానా?

తమ్ముడు అన్న దగ్గరకు పోవటం లోకాచారం. మన తండ్రి నిర్ణయంలో ఎలాంటి

అపోహకూ ఆస్కారం లేదు.

మనం ఈ భూమిపై జైత్రయాత్రలు సాగించి, నృపులను లోబరచుకొన్నాం. ఇప్పుడు మనలో మనం అసహజమైన కయ్యానికి సన్నద్ధులమైతే లోకం జుగుప్సతో మనల్ని చూచి పరిహసించదూ !.

నన్ను నీవుగాని, నిన్ను నేనుగాని జయించటం నీకుగాని, నాకుగాని గర్వకారణ మవుతుందా ? స్వర్గ మర్త్య పాతాళ లోకాలు మనల్ని ఈసడించుకోవా? ఆ విషయం ఆలోచించు. జయ కాంక్షతో కూడిన నీ చూపుల్లో "నిషా" ఎక్కినట్లయితే, నేను పామర జనస్థాయికి దిగజారడం కన్న నీకే విజయాన్ని కట్టబెడతాను." - అని భరతుడు బాహు బలితో అన్నాడు.

అప్పుడు రాజానుచరులు, స్నేహితులు, సభాసదులు - "అయ్యో ! రాజు ఓటమినే అంగీకరించాడు గదా!" అని అరిచారు.

వెంటనే మందహాసంతో రాజు ఇలా అన్నాడు - "మన్మథుడికి వశులు కాని దెవరు ? స్త్రీల సౌందర్య సౌకుమార్యాలకు మనంలోను కామా ? మీరెందుకు ఆందోళన చెందుతారు?".

తిరిగి సోదరుడితో ఇలా అన్నాడు భరతుడు :-

"ఈ రాచరికపు వైభవమంతా ఏ అహంకారమూ లేకుండా నేను భగవత్ప్రసాదంగా భావిస్తాను. నేను దురాశాపరుణ్ణి కాను. నీవు నామాట కాదనకపోతే, నా రాచరికాన్ని నువ్వే చేపట్టు.

"నేను నీ అగ్రజుణ్ణి. నువ్వు నా తమ్ముడివిగా నాకు ప్రియతముడవు.

"నా ప్రియమైన సోదరా ! అంగీకరించు నీవు సింహాసనంపై ఉండగా చూడ టానికి నా నేత్రాలు కుతూహల పడుతున్నాయి".

గరుడ మంత్రం పఠిస్తే త్రాచుపాము విషం ఎట్లా దిగిపోతుందో, అట్లాగే భరతుడి మధుర వచనాలతో కోపోద్రిక్తుడై ఎత్తిన బాహుబలిచెయ్యి క్రిందకు జారిపోయింది. అతడి హృదయంలో చెలరేగిన తుపాను చల్లారింది.

## సర్వజ్ఞ సూక్తులు

సర్వం తెలిసిన సర్వజ్ఞుడు అహంభావంచేత జ్ఞానిగా పరిణమించాడా ? ఇక్కడ కొంతా, అక్కడ కొంతా జ్ఞాన సమీకరణం గావించి ఒక మహాజ్ఞాన పర్వతంగా విలసిల్లాడు.

జ్ఞానసారాన్ని అందించేటప్పుడు
జ్ఞాన బోధకుడెవరైతేనేం
జ్ఞానమార్గాన్ని చూపించే దెవరైతేనేం?

దేవుడి అనుగ్రహం ఉంటే
పనికిరాని త్రాడు కామ్యాలుతీర్చే కల్పలత అవుతుంది.
భిక్షుకుడే స్వర్గాధిపతి అవుతాడు

గడ్డిపరకే మేరుపర్వతం అవుతుంది.

వేళ్లు జపమాలను త్రిప్పుతున్నా
పెదవులు మంత్రం జపిస్తున్నా
మనసెక్కడో మసలుతూ ఉంటే
అది పాడుపడిన గ్రామంలో తిరిగే కుక్కతో సమానమవుతుంది.

దేవుడొక్కడే, ఇద్దరు లేరు
సర్వాంతర్యామి ఒక్కడే
ఈ జగత్కారకుడైన విశ్వాధినేత ఒక్కడే.

రాతిపై రాతినమర్చి గుడి కట్టేవాళ్లూ
అందులో ఒక శిలను ప్రతిష్ఠించి దాన్నే దేవుడనేవాళ్లూ
అంతా నిస్సందేహంగా శిలాసదృశులే.

మనస్సు పరధ్యానంతో ఉండగా
గుడిచుట్టూ ప్రదక్షిణం చెయ్యటం
నూనెగానుగ చుట్టూ గానుగెద్దు తిరగటం లాంటిదే.

నీవు దానంచేసేదే నిజంగా నీది
నీవు నిల్వచేసింది ఇంకొకరిది
నీవు ధర్మం చేసిందేమీ వ్యర్థంకాదు
బాటసారి చద్దిమూటలా
అనంతరకాలంలో అది నీకు ఉపకరిస్తుంది.

మనమంతా నడుస్తున్నది ఒకే భూమిమీద
త్రాగుతున్నది ఒకే నీరు, మండించేది ఒకే నిప్పు
మరి కులమనీ వర్ణమనీ విభేదాల హద్దులు కల్పించుకోవడమెందుకు?

వెలివేయబడినవాడి దీపం తక్కువకాంతి నిస్తుందా?
కులమనీ కులబహిష్కరణ అనీ ఏమీ లేనేలేదు
ఒకే కులం ఉంది—అది భగవద్భక్తుల కులం.

అసత్యవాది నుదుట చేతులు జోడించి దేవుణ్ణి ప్రార్థించినపుడల్లా
వాడు దేవుడికి నమస్కరించినంతకాలం
కల్లలాడుతున్నట్టే నీవు భావించవచ్చు.

నిజంచెబితే లోకమంతా నీమీద విరుచుకపడుతుంది.
కాని నీవు తియ్యటి అబద్ధాలాడితే
నిన్ను ఆకాశానికి ఎత్తేస్తుంది.

## జానపద గేయాలు

ఓదేవా! నీ నామబీజాన్ని నే నెచ్చట నాటేది?

నా జిహ్వపైతప్ప ఇంకెచ్చట నాలేదీ?
శివనామం స్మరిస్తే పిడుగుకూడ మీదపడదు
కొండకూడ తొలగిపోతుంది; ఆ నామజపం మానవద్దు

ఎంతీయగలడు నరుడు నీకు
ఎంతిస్తే తృప్తి నీ మనసునకు
పరాత్పరుడే అనుగ్రహిస్తే
ఇల్లంతా నిండుతుంది-నీ మనసంతా పొర్లుతుంది.

ఆ దేవదేవుడు పూవులో దాగాడు-మాలలో నిద్రించాడు
మొగ్గలో కళ్లు తెరిచాడు
పరాత్పరుడికోసం అన్వేషించే కళ్లకు నిద్ర దూరమవుతుంది.

* * *

కుమార్తెకు వీడ్కోలిస్తూ తండ్రి తన కన్నీటిని తుడుచుకోడానికి ప్రక్కకు తిరిగి, నిట్టూర్చి "ఇంకొక జన్మలో నేను కుమార్తెను పొందగోరను" అని అనుకున్నాడు.

నాకు పాలిచ్చిపెంచిన ఇంటిక్షేమాన్ని నేనెలా కోరాలి?-ఈ విధంగా నదిఒడ్డున ఉన్న రెల్లుపొదలా వృద్ధిచెందుగాక!

ఇక్కడికి కాశీనగరం చాలాదూరం
కాని నాపాలిట కాశీ అయిన నాకన్నతల్లి నివాసం
గంట ప్రయాణంలోనే చేరుకుంటాను.

* * *

వాడెందుకంత బిగ్గరగా ఏడుస్తున్నాడని వాళ్లు నన్నడిగారు.
పొదుగుపాలలోని మీగడకోసం వాడేడుస్తున్నాడు.
నన్నంటిపెట్టుకొని వదలటంలేదు.
ఏడుస్తున్న ఆ పాపకేసిచూడు-
పగడాల్లా ఎట్టటి పెదవులు
వేపాకుల్లాంటి కనుబొమలు!
వాడి కనులకాంతి పరమశివుడి త్రిశూల కాంతిలా ఉంది.
పసిపాప ఉన్నఇంట్లో వింజామర అవసరంలేదు
ఆబిడ్డ ఆడే చోటంతా మృదుపవనం వీస్తూ ఉంటుంది.

* * *

మరొకరికి చాకిరీచేసే ఎద్దులాగా
పెంటకుప్పపై పారవేసిన అరటి ఆకులాగా
శిశువులేని జీవితం దుర్భరం
గొడ్రాలి ప్రాంగణంలో మేడిచెట్టు కొమ్మపై
ముద్దుపల్కులు పల్కే చిల్కలు చేరి

"ఈ గొడ్రాలిని చూచి జాలిపడండి
ఆమె నిరర్థకంగా ఇతరులకు ఊడిగంచేస్తోంది."
-అని అంటూ ఉంటాయి.

*         *         *

బి.ఎమ్. శ్రీకంఠయ్య

## కన్నడ మాత

చనుబాలు త్రాగే పసిపాపగా,
చేతులు కాళ్లతో ప్రాకులాడే వయసులో,
పెద్దయాక స్నేహితులతో మాట్లాడుతూ
ప్రేమరహస్యాన్ని అవగతం చేసుకోడానికి
వినియోగించిన ఆ భాష ఏది?

ఏ భాషలో మనం కమ్మని పాటను, కథను విన్నామో
దేశముయొక్క ప్రజలయొక్క ఘనతను ఏ భాషలో కనుకొన్నామో
మనకు గర్వకారణమైన కవులను ఏ భాషలో గుర్తించామో
ఆ భాష ఏది?

మనభాష కన్నడం
మన సొంతతోటలోని మధురఫలం
దీని తరవాతే ఇంకోభాష మనల్ని వలచింది.
దీని తరవాతే ఇంకో మధురాతి మధురఫలం మనల్ని రజింపచేసింది.

పడమటి సంద్రపురాణి (ఇంగ్లీషు)
నా జీవిత ప్రాణవాయువుగా, నా కంటికి మధురఫలంగా
నన్ను సంతోషపెట్టింది-నన్ను పరవశింపజేసింది.
ఆనందంకోసం నాచేత నృత్యం చేయించింది.
ఇప్పుడొకదాని తర్వాత ఒకటి
నాలో ఉత్సాహాన్ని నింపుతున్నాయి.

ఆ పరవశత్వంలో
నేను రెంటినీ ప్రేమించాను
ఒకదాన్ని ఇంకోదాని ఆభరణాలతో చూడాలని అభిలషించాను
ఒకదాని నగిషీదుస్తుల్లో మరొకదాన్ని చూస్తూ
ఉల్లాసంకోసం పాడాలనుకున్నా.

తెలిసినవారికిది ఆశ్చర్యమౌతుందా?
అజ్ఞానుల్లో జ్ఞానజ్యోతిని చూచినపుడు
నేను ఆనందంతో పరవశించాను

నా చిన్నిపాత్రను నేను స్వీకరించానని
నాకు సంతృప్తి కల్గింది.

పంజె మంగేశరావు

## మహోద్ధృతమైన దక్షిణమారుతం

అహో! మైళ్లదూరాన్నుంచి నీవు దాన్ని వినగలవు
అధోలోకపుపాము బుసయేనా అది ?
ఆకలిదయ్యపు నిట్టూర్పా అది-లేక
కాలుని కొత్త దున్నపోతు అరుపా అది?

నురుగులు క్రక్కుతూ కెరటాలు
ఒడ్డును తాకి స్వర్గతలందాకా గర్జిస్తూ
సముద్రమంతా ఆటుపోట్లతో
అల్లకల్లోలమయ్యేట్లు విజృంభించిందాగాలి.
అది వస్తోంది. కాని మన కంటికి కనపడటంలేదు.

చూడు! ఇక్కడ ఉంది అది
బ్రహ్మాండమైన నావల్నే పగలగొడ్తూ
దృఢమైన నౌకల్నే తల్లడిల్లజేస్తూ
పడవల్ని చితుకగొడ్తూ-అదిగో వస్తోందది!

మహోన్నతాకాశంలో
ఎత్తుగా ఎగిరే పక్షుల కనుబొమలకు రంగు పూసేట్లు
బ్రహ్మాండమైన ధూళిమేఘాలను కల్పిస్తూ
అడవుల్లో విహరించే ఆలమందలకు
భయోత్పాతం కల్గిస్తూ
కారుచిచ్చును కణకణ మండిస్తూ-వస్తోందది !

యువతుల రవికల్తోనయ్యాటలాడుతూ
వాళ్ల కొప్పుల్ని చిందరవందరచేస్తూ
తాటియాకు గొడుగుల్లో ఉన్న ముసలివాళ్లను బాధిస్తూ
బడినుంచి వచ్చే చిన్నపిల్లల టోపీలతో
ఆడుకొంటూ వస్తోందది !

అందమైన ఉద్యానాలను ఛిన్నాభిన్నంచేస్తూ
దృఢమైన కొబ్బరిచెట్లనూ సన్నని పోకచెట్లనూ
ఉయ్యాలలూపి, వాటిని త్రోసేస్తూ, పెకలిస్తూ
తాటియాకుపాకల్ని దూరంగా విసిరేస్తూ-అహో! వస్తోందది!

అది రానే వచ్చిందీ
అహో! అది వచ్చింది
కొండలకోనల్లో లోయల్లో
పండిన-పండని ఫలాలను
ఒకటొకటిగా గుత్తులు గుత్తులుగా
పలురంగుల్లో-పలుపరిమాణాల్లో రాలేలాగా
చెట్లను ఎడాపెడా దులిపేస్తూ-వచ్చిందది !
పడమటికొండల్ని-ఢీకొనేలాగా
దట్టమైన మేఘాల్ని-అటూ ఇటూ నడిపిస్తూ
మెరుపుల్ని ఉద్దీపింపజేస్తూ
ఉరుముల్లో పుడమిని వణికిస్తూ
అపరిమితంగా పిడుగులు రాలుస్తూ
దప్పిగొన్న భూదేవికి తృప్తి కల్గించేలాగా.
కుంభవృష్టి కురిపిస్తూ వచ్చిందది !
మహా సంక్షోభాన్ని కల్గిస్తూ
కొంకణదేశానికి దక్షిణపుగాలి వచ్చింది!
అదిగో వచ్చింది! అదిగో వచ్చింది!

డి.వి. గుండప్ప

## పక్షిమార్గము

అసౌకర్యాలను గూర్చిన అభియోగమెందుకు?
ఆచరించు శక్తి కొలది మనసార-చేతులార
అధిగమించి, వచ్చినదాన్ని అనుభవించు
మిగిలినదంతా విధికే వదిలేయ్.
పరాత్పరుణ్ణి అలరించే మార్గమదే మంకుతిమ్మా!

పక్షికి తానెగిరే మార్గం తెలియదు
ఎవరూదాన్ని పిలిచి పోషించరు
రెక్కలు మోసుకుపోయే దిక్కుకు పోతుంది అది
తనకందిన ఆహారంతో బ్రతుకుతుంది అది
అదే నీకు సరియైనదారి-మంకుతిమ్మా!

కొమ్మమీద వాలుతుంది ఆ పిట్ట
తానుచూచిన దానికోసం పయనం సాగిస్తుంది
ఉన్నట్టుంది ఏదో గుర్తుకువచ్చి ఎగురుతుంది
నిత్యమూ దాని అక్కర అది-
దానికంటె ఉన్నతుడనని నీ భావనయా-మంకుతిమ్మా!

ఏ దారిన ఎగురుతుందది?
ఏదిక్కుకు తిరుగుతుందది?
ఎప్పుడు దేనిమీద వాలుతుంది ఆ పిట్ట ?
అలాగే-విధిచేతిలో కీలుబొమ్మలం మనం
జ్ఞానాన్ని ఎదిరిస్తుంది జీవితం-మంకుతిమ్మా!

మామిడిని పెంచు-కాని వేపను రుచి చూచేందుకు సిద్ధంగా ఉండు.
భూమినిబట్టి వస్తువుల రుచి మారుతుంది ఒకప్పుడు
దాన్నిగూర్చి నువ్వెందుకు శ్రమపడతావు?
కేవలం సేవకుడవు నీవు
తోటమాలికే వదులు ఆ విషయం-మంకుతిమ్మా!

నీవొక సైనికుడవు మాత్రమే
సైన్యాధికారిని చూడవు నీవు
అతడి ఆజ్ఞను తెలుసుకో-సాహసంతో దాన్ని నిర్వహించు
యుద్ధపరిణామం జయమో పరాజయమో కావచ్చు
దాన్ని అదృశ్య శక్తికి విడిచిపెట్టు-మంకుతిమ్మా !

ఏనాడైనా నీ గతకాలానుభూతుల్ని పొసగించుకోడానికి
నీవు పూనుకొనేట్లయితే ఈ రోజే ప్రారంభించు ఈ పద్ధతిని.
నీవారు కారని నీవు భావించేవారికి
నీ హృదయావరణలో స్థానం కల్పించు
నీవు విశ్వమానవుడవు కావాలి!-మంకుతిమ్మా!

తనలో కనిపించని మంచిని
తన తనయుడిలో చూచి ఉప్పొంగే తండ్రిలాగా
విశ్వానికి జరిగే మంచి అంతా
తన సుతుడికే జరిగినట్టుగా
ఆనందిస్తాడు జ్ఞాని-మంకుతిమ్మా !

శ్రీనివాస.

## మానవజాతి వాస్తవాన్ని గ్రహించేదెప్పుడు ?

మానవాళి అంతా ఒక్కటే అని ఎప్పుడు గుర్తించగల్గుతుంది ?
తనను విభజించే అగాధాల నెప్పటికైనా పూడ్చగల్గుతుందా ?
తెల్లజాతి నల్లజాతిని అణగద్రొక్కుతుంది.
భగవానుడికి ఆత్మీయుడనని యూదుడిగర్వం
తాను బ్రహ్మవదనం నుంచే ఆవిర్భవించిన ఉత్తముడనని మరొక భావన.
ఈ వికృత భంగిమల్ని దేవుడి దయవలన మనం విడనాడేదెప్పుడు ?

అప్పుడే కళ్లు తెరిచికొన్ని-అప్పటికి ఒక కన్నే తెరిచి కొన్ని
ఇంకా కళ్లు తెరవవలసినవి మరికొన్ని-కుక్కపిల్లలగుంపు
తల్లి చనుబాలకోసం పెనుగులాడినట్టుగా
అయ్యో! జగడాలలో నేరారోపణలో మునిగి తేలుతున్నాం మనం.

ద.రా. బేంద్రె

## అరుణోదయం

ఆహో! తూర్పుదిశను జిగేలుమనిపించాడతడు
ముత్యంలాంటి కాంతితో
సున్నితంగా అందంగా జిగేలు మనిపించాడు
తూర్పు ద్వారాన్ని తెరిచాడు అతడు
ఓహ్! విశ్వాన్ని వెలుగుతో స్నానమాడించాడు.
ఆహా! విశ్వాన్ని వెలుగుతో స్నానమాడించాడు.

ఆహో! కరిగించిన వజ్రపులావా బ్రద్దలయింది
అది దూకుతోంది దూకుతోంది
తనంతట తాను దూకుతోంది
సుమధురపరిమళంతో మొగ్గలు వికసించాయి
అవి అన్నీ తొందర తొందరగా విచ్చుకున్నాయి
తమంతట తాము విచ్చుకున్నాయి

పత్రాలమీద పుష్పాలలోపల
ఆహో! మంచునీటి ముత్యాలు ఉన్నాయి
మంచునీటి ముత్యాలు ఉన్నాయి
ఆ అమృత బిందువుల్ని తెచ్చింది ఎవరు?
దివినుంచి భువికి వాటిని తెచ్చింది ఎవరు?
పత్రాల్ని పుష్పాల్ని అలంకరించింది ఎవరు?

చిరుగాలి చేతుల్లో
చిగురుటాకుల వింజామర
పుష్పదళాల వింజామర
తుమ్మెదల గుంపును
పచ్చనిపుప్పొడితో అలది
పరిమళభరితమైన పచ్చని రజముతో అలది-దూరంగా పోనిచ్చాయి.

ఆహో! అరణ్యాల కుహరాల్లో నుంచి
పులుగుల కలకూజితం వినవస్తోంది
పక్షుల కిలకిలారావం అడవుల్లో వినిపిస్తోంది

ఆ అరణ్యసీమ ఇప్పుడు గంధర్వలోకం అయింది.
ఆ అటవీప్రదేశం మంత్రభూమి అయింది విచిత్రంగా!

కన్నులకు విందును చేకూర్చింది
అంగిలి, అంగుళి
తమవంతు తృప్తిని పొందాయి
స్వరమాధుర్యంతో నిండింది చెవి
ముకుపుటాలు సుగంధంతో నిండిపోయాయి
దేహమే దేవుడిగుడిగా పరివర్తించింది.

పట్టుబడని ప్రాతఃకాల స్వభావాన్ని
పంచేంద్రియాలు గ్రహించలేవు
మనస్సు అర్థం చేసుకోలేదు
ప్రేమలాగా శాంతిని స్పష్టపరుస్తుంది అది
అత్యున్నత శాంతిస్వభావం కలిగినట్టిది అది
ఉషస్సుకాదు సోదరా ! అది అరుణోదయం మాత్రమేకాదు!

కె.వి. పుట్టప్ప (కువెంపు)

## వసంతం వస్తోంది.

కాలి గజ్జెలు ఘల్లు ఘల్లున మ్రోగగా
వసంతం వస్తోంది. వసంతం వస్తూ
పుడమికి ఆనందంతో
స్వర్గ సుఖాన్నే తెస్తోంది.

లోయలుదాటీ గుట్టలుమెట్టీ
మోడైన చెట్లను చిగుళ్లతో నింపీ
నవజీవకళను అందించీ

వసంతం ఆవిర్భవించింది.
వనసీమల్లో పక్షుల కిలకిలారావం
నా మనస్సులో ప్రతిధ్వనిస్తోంది.

మధువును గ్రోలి మధుకరాలు
చెంగుచెంగున విహరిస్తున్నాయి
మత్తెక్కిన మధుమాసం వచ్చింది
రండోయి రండి అని ప్రకటిస్తున్నాయి
మాఘమాసంలో చలిజారిపోతోంది
పుష్పించిన లతంపై
మత్తెక్కిన మధుపాల్లు

ముక్త జీవాలవలె నినదిస్తున్నాయి.
సుందరవసంతం వచ్చిందని
కోకిల కుహూ కుహూ అంటోంది
చిలుక పలుకుతోంది.

మామిడి తోపుల్లో పక్షుల కలకల నాదం నిండింది
చిగురుటాకులు పూలగుత్తులు కల
వనవనాలలో పచ్చనివస్త్రం కట్టుకొని
వికసించిన పూలు పెట్టుకొని
హిమమణిమాల వేసుకొని
కళ్లూ మనసూ తన్మయత చెందేలాగా
వసంతమయ మనముతో
వనదేవత ప్రీతిగా పిలుస్తోంది.

ఆకసాన రవిబింబం అగపడుతుంటే
గలగల ప్రవహించే ఏటిచల్లటి ఒడ్డుమీద
చెట్టుక్రింద కూర్చొని
ప్రకృతి సౌందర్యం తిలకిస్తూ
గీతాలాపన చేస్తా
అవధులు దాటిన ఆ సుందర దృశ్యంలో
కరిగి మునిగి తేలుతా.
తనను వదిలిన ప్రియుడు ఆకస్మికంగా అగపడితే
ప్రేయసి పొందే తన్మయతలాగా
నేను పరవశిస్తా.

ఆలమందలు మేస్తూ ఉంటే
పసులకాపరి బసిరిచెట్టు నీడచేరి
వేణువును ఊదనారభించాడు
అహో! ఆ వేణునాద మాధుర్యానికి
విప్పారిన నేత్రాలతో పశుగణం
ఆ గోపాలుని చూస్తూ తన్మయత్వంతో
నిక్కబొడుచుకున్న చెవులతో
ఆ నాదశ్రవణం చేస్తున్నాయి.
సజీవ చిత్రకళాఖండంలా
అనిపిస్తోంది ఆ దృశ్యం-
విశాల ముఖద్వారాలు గల గుహలు
ఆ గాన మాధుర్యాన్ని మ్రింగేస్తున్నట్లున్నాయి.

ఓ గిరులారా! ఝురులారా!
విహంగములార! తరులార!
కాననములార! పరిమళ సుమములార!
సౌందర్యమే సత్యమనీ
సత్యమే సౌందర్యమనీ ఘోషించండి!
స్వర్గానందంగల విశ్వంలో ప్రవేశించండి!
ప్రేమసౌందర్యాలలోనే
పరాత్పరుడి నిర్మలానందం ఇమిడి ఉందని
విశ్వానికి చాటి చెప్పండి!

పి.టి. నరసింహాచార్

## రాత్రివేళ యదుగిరి

సూర్యుడి మాంత్రిక దృక్కులనుంచి విడిపోయి
తన సహజస్థితికి వచ్చింది పృథివి.
ఆమె సహజస్థితి నిశయేగా!
తన వేషాన్ని అలంకరణలను తీసేసి తానుగా మారిన
నర్తకిలాగా అనిపిస్తోంది ఈ పృథివిపై జీవనం
మేలుకో! విశ్వాత్మ తన నక్షత్ర నేత్రాలను తెరిచింది.
ఈ జగత్తుకు ఊపిరిలాగా ప్రతిక్షణం గాలి వీస్తోంది.
దైవం ఎదలో మెదిలే కలలాగా
సత్యపు లోలోపలి రహస్యపు ఆలోచనల్లాగా
గిరులు తరులు దేవాలయ గోపుర శిఖరాలు
సౌధాలు కుటీరాల ఆకృతిలో నగరం గోచరిస్తోంది.
ఇది కేవలం కలయేనా? లేక నిజమా?-ఆశ్చర్యం!
కవి ఊహల్లోని రహస్య జ్ఞానంలాగా
ధ్రువనక్షత్ర సముదాయం నిరంతర విస్మయంతో ప్రశ్నిస్తోంది.

జి. పి. రాజరత్నం

## ఆ! వాళ్లు మైకంలో ఉన్నారు!

మధు పాత్రను అక్కడ వదిలేసి
సూటిగా ఇక్కడికి వచ్చాను నేను
ఓ ప్రియమైన మార్గమా!
నీవు తికమకగా ఉన్నావు
నాట్యం చెయ్యాలన్న ఉత్తేజం కలిగినట్టుగా
వంకరటింకరగా తిరుగుతున్నావు.
ప్రియా! నీవు కాలు జారిపడ్డావు
నీవు మిక్కుటంగా మద్యాన్ని పుచ్చుకున్నావు.

చంద్రుడెందుకు అనాకారి అయ్యాడు
అతడి కుడికన్ను నరకటంవల్ల పోయింది
మిగిలిన ఎడమకన్ను నిమ్మచెక్కలాగా కనిపిస్తోంది.
ప్రియమైన చంద్రుడా! అటువంటి అపనిందకు లోనై
ఎంత తెలివితక్కువ వాడవైనావు!
అలగా జనం తాగటం నిజమే
కాని నువ్వు ఇంత దిగజారటం...

ఆ వీధి దీపాన్ని చూడు
అది పోకిరివాడిలాగా ప్రవర్తిస్తోంది!
కేవలం ఒక లోభిలాగా
అది గిరగిరా తిరుగుతోంది!

ఈ జట్టులో ఒక్కడూ
నాలాగా మైకం లేకుండా లేడని నా అనుమానం!
బీరు సారా పీకలదాకా తాగి
వాళ్లు కలిసి ఊగుతున్నారు.

పెద్దా చిన్నా ఆ వెధవలంతా
అపకీర్తిని పూర్తిగా తెచ్చిపెట్టారు!
ఈ తాగుబోతుల గుంపులో
నే నొక్కడనే స్పృహతో ఉన్నాను!
సరే! నేనూ వెళ్లిపోతాను మళ్లీ
నా మధుపాత్ర దగ్గరకు

ఆర్.ఎస్. ముగళి

## మందార పూవు

స్వర్గలోకం నుంచి క్రిందికి దిగి వచ్చారు
అపూర్వమైన మందార సుమంతో పూలకన్యలు
మందారం! అంటూ కేకేస్తున్నారు ఆ కన్నెపిల్లలు
"అరుదైన మందారం! ఒకటైనా కొనండి!"

ఘల్లుఘల్లుమనే అందెల రవళితో
తమ అడుగుల సవ్వడి సరిచూచే నర్తకిలాగా పచ్చారాపూలకన్యలు
ఇంటింటికి తిరిగారు ఎంతో నినదిస్తూ
"అరుదైన మందారం! ఒకటైనా కొనండి!"

మందారం! మందారం! ఇంద్రుడి స్వర్గంలోని పుష్పరాజం!
ఆ పూలకన్యలు పృథివి అంతా తిరిగారు కాని ప్రయోజనం శూన్యం.

కొందరు చూచారా కుసుమాన్ని! కొందరు దానిపరిమళాన్ని ఆఘ్రాణించారు
కాని, ఏ కన్నెపడుచూ మందారాన్ని కొనేందుకిష్టపడలేదు!

ఆ పూలకన్యలు కోపంతో తమ పెదవులు కొరుక్కున్నారు
అలసిసొలసి కోపంగా దుఃఖంగా అగుపించారు
తమ గంపలతో స్వర్గాన్ని చేరుకున్నారు
మందారాలన్నీ ఒక సరస్సులో పారబోశారు
ఇంద్రుడితో ఆ పూలకన్యలు మొరపెట్టుకున్నారు
తమ హృదయభారం తీరేందుకు: "ఒక మూలనుంచి
ఇంకో మూలకు భూలోకమంతా తిరిగాము కాని నిష్ప్రయోజనం!
ఎవరికీ ఇష్టంలేని పూలు బహుశా అక్కడకూడా ఉన్నాయేమో!"

వి.కె. గోకాక్

## పున్నమ - సంద్రము

అవధులు లేని సంద్రంలో ఎగిరిపడే భీకరమైన కెరటాల్ని చూడు!
దాన్ని చిలికే దేవతలు ఎక్కడున్నారా అని నా సందేహం!
పలచని గాలిలోకి వాళ్లు అదృశ్యమైనారా ?
చిలుకుతున్న సాగరాన్ని అది పైకి తెచ్చిన చంద్రుణ్ణి మనం చూస్తున్నాం
గంతులువేసే సాగరంలోంచి పున్నమ చంద్రుడు వచ్చాడు.
మనోవికారంతో పట్టుదలగా సముద్రం పైకి ఉబుకుతోంది
రత్నతుల్యుడైన చంద్రుణ్ణి తిరిగి పొందాలని-
ఆకాశాన్ని తాను తివాచీగా కప్పాలని పందెంతో పెల్లుబుకుతోంది.
తమ సేనానిని విడిపించే దృఢనిశ్చయంగల సైన్యంలాగా
తమ సార్వభౌముడి బంధ విమోచనానికి శత్రునాశనం చేసే-ఉద్రిక్త సామ్రాజ్యంలాగా
తమ నాయకుణ్ణి తిరిగి గెలుచుకోవాలని ఉరుకలు వేసే దేశంలాగా

నురుగులు క్రక్కుతూ గర్జిస్తూ పరవళ్లు త్రొక్కుతోంది సాగరం
కాదు! అది సాగరంకాదు! అది అనంత శూన్యం! అశాశ్వతం!
ఈ మూలపదార్థంనుంచే విశ్వం ఆవిర్భవించింది.
అందంగా అజ్ఞానంగా కారు చీకటిగా
మార్పు చెందని ముడిపదార్థం అది
తన ఒడినుంచి ఆకాశం లాక్కున్న చంద్రుణ్ణి
తిరిగి సాధించేందుకు సముద్రం పన్నిన యుక్తిగల వ్యూహం ఇది!
బ్రహ్మాండమైన అలల అంచులపై
ప్రచండమైన పిశాచాలు నృత్యం చేస్తాయి!
నల్లటి నీళ్లపాయల్లో దివ్వెలు ధరించిన దయ్యాలు చేరాయి!

చెవులు గింగురులు ఎత్తేలాగా బ్రహ్మరాక్షసుడు చేసిన శంఖారావం
ఝంఝప్రళయశకునాలు-కాదు అది సాగరం కానేకాదు
అది భయోత్పాతానికి నిలయం।
ఆకాశపు తీరుతెన్నులను ఎవరు ఊహించగలరు?

తన హృదయాభరణమైన చంద్రుణ్ణి కనిపెట్టి ఉండేందుకు
పారావాళ్లలాగా నక్షత్ర సమూహాన్ని నియమించింది.
సాహసించి దౌర్జన్యం చెయ్యటానికి భయపడి
చందమామ పాదాలవద్ద సౌమ్యంగా ప్రాధేయపడుతోంది ఆకాశం!
ఆకాశపు తీరుతెన్నులను ఎవరు ఊహించగలరు?

సాగరపు హృదయంలోకి చొచ్చుకొని పోయేలాగా
పున్నమ చంద్రగోళంనుంచి కాంతికిరణపుంజం ప్రవహించింది
ఇటు చీకటి! అటు చీకటి! నడుమ మాత్రం తేజోవంతం!
చందమామ ప్రతిబింబం తనలో చూచుకొని ఉపశమించింది ఆ సాగరం!
అనేకవిధాల దాన్ని ముద్దులాడింది!

ఎమ్. గోపాలకృష్ణ అడిగ

## మేము నిర్మిస్తాం

నిర్మిస్తాం మేమొక క్రొత్త భూతలం
ఒక ఆనంద నికేతనం.

మా నరాలలో ఉడుకురక్తం చల్లారక ముందే
యౌవనపు ఇంద్రజాలం పట్టు వీడకముందే
ఈ దైన్య సాగరంపై
ఉవ్వెత్తుగ లేచే ఆశాసాహసాల కెరటాలు
చిదపచిదపలు కాకముందే
నిర్మిస్తాం మేము ఒక క్రొత్త భూతలం.

మన హృదయాల్లోని స్వప్నాలు
కామధేనువులా తీర్చవచ్చు మన కోరికలను
ఏక మనస్కతయేఆధారంగా విజయం సాధించే
మృదువైన హస్తాలే స్వప్నఫలాలు అందుకుంటాయి.

ఎటుచూచినా కులమతాల కందకాలే
చౌరశక్యంకాని కలవరపరిచే కోటలే
శిథిలమైన ఆచారం రాక్షసుడిలా మనల్ని పాలిస్తోంది.
సంఘర్షణకు పిలుస్తోంది మనల్ని

యువవీరులం మేము- జంకుతామా?
కందకాలు దాటేస్తాం ఒక్క గంతులో
కోటల్ని తుత్తునియలు చేస్తాం
పిశాచాల్ని గెల్చి అణగద్రొక్కుతాం!

మృతదేహాలమీదుగా కోటలెగబ్రాకుతాం మేము
మృత్యువూ, వేదనా ఉయ్యాలలౌతాయి క్రొత్త భూతలానికి
భయంగాని సంకోచంగాని లేవు మాకు
వీరులు ఎన్నడూ ఊగిసలాడరు!

విపత్సముద్రంగుండా ఈదుతాం మేము
నిరాశా నిస్పృహలనే అగ్నిని ధైర్యంగా ఎదుర్కొంటాం
అవరోధాల్ని అధిగమిస్తాం- విభేదాలను సరిచేస్తాం
క్రొత్త భూతలం నిర్మిస్తాం నిర్భయంగా!

అయ్యో! తిండికోసం పెనగులాట ఈనాటి జీవితం
చావుతప్పని మానవుడికి తన కడుపే సర్వస్వం
మనిషిపై మనిషికి ఉన్న క్రూరత్వం అనే మూసలో
దయా, ప్రేమా, భవితవ్యపుకలలూ అన్నీ కరిగిపోతున్నాయి.

సుదూరానికి చూడు! ఐకమత్యపు అలలపై
సుఖదుఃఖాల సమత్వం అనే స్వరమేళనవాదంతో
సమానావకాశాలు సమకూరుస్తానని ప్రతిన పూని
మేం పెంచుకొన్న కలల పంటలా క్రొత్తభూతలం వస్తోంది!

ఇక్కడే-అవును ఇక్కడే...మా కనులముందే
మాదీన ఆక్రందనాల ఆచ్ఛాదన క్రిందే
వైఫల్యాల ఒడిలోనే
పుష్పిస్తుంది క్రొత్తభూతలం.

మాహృదయాలే దానికి పరిమళం అందిస్తాయి
కొంచెం వేచిచూడు!
యువవీరుల సామ్రాజ్యపు గుడిలో
ఆశ, ఆనందం, ఉత్సాహం నినదిస్తాయి.

ఆకాశమే సరియైన హద్దు దానికి
ఏ అవరోధాన్నీ సహించం మేము

రండి–అంతా రండి– మమ్మల్ని ఎదిరించేవాళ్లు
చెడు పే మాట్లాడేవాళ్లు, చెడు పే కోరేవాళ్లు–ముఖాముఖి ఎదుర్కోండి.

మీరెంత చెడుచేసినా మేం ప్రతిఘటిస్తాం
మిమ్మల్ని తిరస్కరించి, మీసమాధుల పైనే
ఒక నూతన భూతలాన్ని నిర్మిస్తాం......అదే ఆనంద నికేతనం!

—0—

# కాశ్మీరీ

మూలం : ప్రొ॥ జె. ఎల్. కౌల్

అనువాదం : డా॥ పోరంకి దక్షిణామూర్తి

## చారిత్రక సమీక్ష

### 1

కాశ్మీరలోయలో నివసించే ప్రజల భాష కాశ్మీరీ. ఈ భాషాప్రాంతానికి ఉత్తరం వైపు, దార్దిక్ ఉపకుటుంబంలోని షీనాభాషలు; తూర్పువైపు బౌద్ధులుండే లదఖ్‌లోని బోధి భాష; దక్షిణాన డోగ్రీ పహాడీ భాషలు; పశ్చిమాన పహాడీ, పశ్చిమ పంజాబీ భాషలు వాడుకలో ఉన్నాయి. కాశ్మీరభాషకు నిజమైన మాండలికం ఒకటి ఉంది. దాన్ని 'కిష్టావరి' అంటారు. ఇది కాశ్మీరలోయకు ఆగ్నేయంగా, పీర్‌పంత్సల్ పర్వతశ్రేణికి ఒకపక్కనుంచి మరొకపక్కకు వ్యాపించిఉన్న కిష్టేవర్ ప్రాంతంలోని కొన్ని భాగాల్లో వాడుకలోఉంది. కాశ్మీరీభాషకు అధఃస్తరంగా, ఇండో-ఇరానియన్ భాషలతాలూకు షీనా లేదా దార్దిక్ భాషా సమూహం ఉంది. ఈ భాషమీద, మొదట్లో హిందార్య కుటుంబంలోని సంస్కృతం, తరవాత ప్రాకృతాలు, ఆటుతరవాత పద్నాలుగో శతాబ్దినుంచి మధ్యయుగ పారశీకభాషలు విస్తృతంగా ప్రభావం ప్రసరింపజేశాయి. అందువల్ల భాషాపరంగాను, సాహిత్యపరంగాను కూడా ఆసక్తికరమైన లక్షణాలనేకం కాశ్మీరీభాషలో కనిపిస్తాయి. ఉదాహరణకు, నాదత గల మహాప్రాణాలు లేకపోవడం; ఆర్యభాషాసమూహానికి చెందిన ఇతర ఆధునిక భారతీయ భాషల్లో లేనివర్ణాలు - కనీసం ఆరు అచ్చులు, మూడు హల్లులు కాశ్మీరీభాషలో ఉన్నాయి; ఆ భాషకొక విలక్షణత చేకూర్చే అజ్వర్ణవ్యవస్థ, పదమధ్యాగమ హల్లులు ఉన్నాయి. సర్ జార్జ్ గ్రియర్సన్‌మాటల్లో చెప్పాలంటే, "విశ్లేషాత్మకభాషావ్యవస్థనుంచి సంశ్లేషాత్మకభాషగా మారుతున్న ఆర్యన్‌భాషకు ఏకైక ఉదాహరణ" కాశ్మీరీభాష.

### 2

కాశ్మీరచరిత్రలో, పద్నాలుగోశతాబ్ది సంక్షోభాలకు గురయినకాలం; సామాజిక, రాజకీయరంగాల్లో కొత్తసవాళ్ళు గట్టిగా ఎదురైనది ఈకాలంలోనే. ముస్లిమ్‌పాలన స్థిరంగా నెలకొనడం ఆరంభమైనదికూడా ఇప్పుడే. దానిఫలితంగా, ప్రాచీనసంప్రదాయానికీ కొత్తసవాళ్ళకూ మధ్య సంఘర్షణ తప్పనిసరి అయింది. ఇంచుమించు ఈరోజుల్లోనే, సంస్కృతం పట్టుసడలిపోతూ, హిందూసమాజమే విచ్ఛిన్నమవుతూంది. సంస్కృతం స్థానాన్ని పారశీక

భాష ఇంకా ఆక్రమించుకోకముందు, ప్రజల వాస్తవమైనభాషలో కవిత్వం వెలువడటం మొదలైంది.

1947 వరకు వెలువడిన కాశ్మీరీ సాహిత్యం చరిత్రలో ప్రధానమైన నాలుగు యుగాలు గమనించవచ్చు. 1555 తో ముగిసిన మొదటి యుగంలో అత్యంత ప్రసిద్ధిచెందిన వ్యక్తి లాల్ దద్ (లాల్అవ్వ); ప్రజలు ఆమెను అభిమానపురస్సరంగా, అలా పిలుస్తారు. 'త్రిక' మనే పేరుగల, దేశీయమైన శివాద్వైత మతశాఖకు చెందిన మార్మిక కవయిత్రి ఈమె. అయితే ఈమెను ప్రజాకవయిత్రిగా చేసినవి శైవతత్త్వంలోని గూఢసత్యాలూ కావు, ఆధ్యాత్మికాన్వేషణకు ఆచరించవలసిన అభ్యాసాలూ కావు. హిందువులు, ముస్లిమ్‌లు, పండితులు, పామరులు అందరూకూడా సమంగా, ఈమె 'వాక్కుల్లో' (కాశ్మీ. వాఖ్, సంస్కృ. వాక్యాణి) విశ్వజనీనతాలక్షణాన్ని గుర్తిస్తారు. ఈమె మార్మికానుభవంలో చిత్తశుద్ధి ఉంది; వివిధ అనుభూతులనూ అనుభవాలనూ అరుదైన గాఢావగాహనతో, చమత్కారపూర్వకమైన ఉపమారూపకాలంకారాల్లో చక్కగా రూపుగట్టిస్తుంది; కాశ్మీరకవిత్వం మొత్తంలోనే సాటిలేని విధంగా ఈమె ఆవిష్కరించిన నుడికారంలో శక్తి ఉంది, పొంకమైన కల్పనాశక్తి ఉంది. కాశ్మీరీసాహిత్యంలో ఈమెను ఉన్నతస్థానాన నిలిపినవివి. తక్కువస్థాయికి చెందిన అనేక మంది దుర్బలులైన మార్మికవాదుల రచనల్లో మాదిరిగా ఈమె రచనల్లో రససంబంధమైన దేమీలేదు; ఉపదేశించే నీతిబోధ అంతకంటే లేదు. పైగా ఈమె, బాహ్యప్రదర్శనకోసం పాటించే ఛాందస ఆచారకాండలోనూ సంకుచిత్వంలోనూ ఉన్న కపటత్వంమీద తిరుగుబాటు చేసింది. ఈమె కేవలం భగవత్సాక్షాత్కారం పొందిన అరుదైన మార్మిక కవయిత్రి మాత్రమే కాదు; కాశ్మీరీ సాహిత్యానికి రూపురేకలిచ్చినది ఈమె. ఈనాటికీ కూడా వాడుకలో ప్రచురమై, చిరస్మరణీయమైన అనేకసూక్తులను కాశ్మీరీ సాహిత్యానికి అందించినది ఈమె. వీటిలో –

> "బుద్ధిని మరింత సునిశితం కావించే దివ్యప్రేరితమైన వాక్కుతోబాటు
> వాక్‌శక్తిని పెంపొందించే దర్శన" గుణం

అదనంగా ఉంది.

ఈమె సమకాలికుల్లో ఈమెకంటె చిన్నవాడు షేక్ నూర్-ఉద్-దీన్. ఈయన పేరు నందఋషిగా జనంలో ప్రాచుర్యం పొందింది. ఈయన వ్రాసిన 'శ్రుఖ్‌లు' (సంస్కృ. శ్లోకాలు) ఉపదేశాత్మకమైనవి. కవిత్వ పరంగా ఇవి అల్పస్థాయివే అయినా తెలివితేటలు ఉట్టిపడే సామెతలు, సరసమైన లోకోక్తులు వీటిద్వారా దేశంలో వ్యాపించాయి.

ఈ సందర్భంగా చెప్పుకోవలసిన ఇతర గ్రంథాలు ఏవంటే: ఒకటి, శితకంతుడు వ్రాసిన 'మహానయప్రకాశ్'; గుప్తవిద్యల్లోని సాధనాలకు సంబంధించిన గ్రంథమిది. మరొకటి, భట్టావతార్ వ్రాసిన 'బాణాసురకథ'; ఉషానిరుద్ధుల ప్రణయగాథ ఆధారంగా వ్రాసిన గ్రంథమిది; కాలనిర్ణయం చేయగలిగిన మొట్టమొదటి లౌకికకావ్యం. మూడోది, గణక ప్రశస్తుడు వ్రాసిన 'సుఖదుఃఖచరితం'. సుఖజీవనమనే కళను గురించి వ్రాసిన ఉపదేశ కావ్యమిది. చివరచెప్పిన రెండు కావ్యాలూ సాహిత్య చైతన్యం చెప్పుకోదగ్గంతగా పునర్వికాసం చెందుతున్న తరుణంలో, సుల్తాన్ జయిన్-ఉల్-అబీదియాఁ బాద్షా (క్రీ. శ. 1420-1470) పాలనకాలంలో వ్రాసినవి.

కాశ్మీర సాహిత్య చరిత్రలో ఈ తొలిదశ చాలావరకు నిర్మాణారంభదశ. ఈ దశలో ప్రజలభాష, కావ్యరచనకు ఉపయుక్తమవుతూ వచ్చినందువల్ల చాలా అభివృద్ధి చెందింది; కొత్త నుడికారాలు, కొత్త అలంకారాలు, విస్తృతార్థాలతో సంపన్నం అయింది. ఈనాటికీ నిలిచిఉన్న అప్పటి సాహిత్యంలో మనకు ఎక్కువగా, మార్మిక, ఉపదేశాత్మక కవితలు గోచరిస్తాయి; భావగాంభీర్యంగల చిన్నచిన్న పద్యాల రూపంలో ఉన్నాయివి. ఒక్కొక్క పద్యంలో సాధారణంగా, గుణాత్మకమైన ఊనిక స్వరంగల పాదాలు 4 ఉంటాయి; ప్రతి పాదంలోనూ నాలుగు ఊనిక స్వరాలుంటాయి.

# 3

రెండోయుగం [1555 నుంచి రమారమి పద్దెనిమిదో శతాబ్ది చివరివరకు], కొన్ని విషయాల్లో, కాశ్మీర కవిత్వ చరిత్రలో విలక్షణమైన కాలమని చెప్పవచ్చును. మార్మిక కవిత వ్రాస్తూనే ఉన్నారు; ముఖ్యంగా, హబీబ్ఉల్లా నవ్‌శోహ్రీ [1555-1617] దీర్ఘమైన పల్లవితో వ్రాసిన పాటలలో అది కనిపిస్తుంది. అలాగే, రూపభవానీ [1625-1720]ఇప్పుడు వాడుకలోనుంచి తొలగిపోయిన భాషలో వ్రాసిన నిగూఢమైన వాక్కు [వాఖ్]లు కూడా చెప్పుకోదగ్గవి. అయితే ఈ కాలంలో వెలువడ్డ కవితల్లో ప్రముఖంగా చెప్పుకోదగ్గది, లౌకికమయిన మానవ ప్రణయాన్ని ప్రతిబింబించే కొత్తరకం కవిత్వం. దీన్ని 'లోల్'-గీతిక అంటారు. ఇది సంగీతబద్ధమైనది. ఇందులో కవి, తన "లోల్"ను గురించి గానంచేస్తాడు. "లోల్" అన్న ఈ కాశ్మీరీపదం, అనువాదంచేసి చెప్పడానికి సాధ్యంకాని ప్రణయం, గాఢమైన ఆకాంక్ష, గుండెను పట్టిలాగుతున్నట్లు ఉండడంవంటి అనుభూతుల సంకీర్ణతను సూచిస్తుంది. లోల్-గీతిక కురచగా ఉంటుంది; ఇది ఒకేఒక మానసికస్థితిని అభివ్యక్తంచేస్తుంది. ఇందులో కవితావస్తువును ప్రకటించడం ఉంది; ఈ మానసికస్థితిని,

> "ప్రేమను నిలిపిన గద్దెవరకు
> మారుమోగుతూ..."

సాగే సంగీతంనుంచి వేరుచేయడం కష్టం. ఈ మాదిరికవితలో మామూలుగా, ప్రేమించే వ్యక్తి స్త్రీ. ఈమె తనప్రణయాన్ని గురించి అనేక మానసికస్థితుల్లో గానంచేస్తుంది; "ఆమని వచ్చింది, పూవులు విచ్చుకొంటున్నాయి, కోకిల ఇక్కడే ఉంది, మరి నువ్వెన్న దెక్కడ?"

ఈ గీతికల్లో చాలావరకు కర్తృత్వం తెలిసినవే. కాని ప్రసిద్ధులయిన ఇద్దరుకవులు నిస్సంశయంగా ఆడవాళ్ళే. వేరువేరు ఛందాల్లోనూ లయవిన్యాసాల్లోనూ రచన సాగుతూ ఒక్కొక్క చరణంలో మూడేసి పంక్తులూ వాటివెంబడి పల్లవీ వచ్చేటట్టుగా గీతాలు [లేదా 'వత్సన్'] వ్రాసిన ప్రతిష్ఠ హబా ఖటూన్‌ది. ఈ పాటలు తొందరగానే జనప్రియమైనాయి. అంతేకాకుండా, పంథొమ్మిదో శతాబ్దిలో వచ్చిన 'లీలా' గీతాలకంటే-ఆమాటకు వస్తే కథనాత్మక దీర్ఘ కావ్యాల కంటెకూడా-ఇవి పూర్వపువి. పద్దెనిమిదో శతాబ్ది ఉత్తరార్థంలో జీవించిన అర్ని మాల్ అనే కవయిత్రి, సుకుమారమైన, సునిశితమైన గీతాల రచనలో హబా ఖటూన్ సంప్రదాయాన్ని కొనసాగించింది.

ఈ పాటలు, గృహజీవితంలోని సుఖదుఃఖాలకు, "ఏదో ఒక సహజసిద్ధమైన విచారం, నష్టం లేదా వేదన"కు సంబంధించినవి. వీటిలో కొన్ని, భగవంతుని సాక్షాత్కారంకోసం పడే ఆరాటాన్ని సూచిస్తాయి. హిందూ-ముస్లిమ్ సంస్కృతులు రెండింటికీ మార్మికవాదం ఒకకూడలి అయింది; అలాగే, "హిందువుకాని ముస్లిమ్‌కాని లేని" భగవంతుని రాజ్యంలో దివ్యప్రేమనుగురించి కవులు గానంచేయడం వింటాము. ఈ సందర్భంలోనే చెప్పుకోవలసిన మరోగ్రంథం "శ్రీ కృష్ణావతారలీల". దీన్ని వ్రాసినవారెవరో తెలియదు. ఇందులో భాగవత పురాణంలోని పదో స్కంధాన్ని ఆధారం చేసుకొని శ్రీకృష్ణుని చరిత్రను వర్ణించడం జరిగింది. రచన 'వత్సన్' రూపంలో సాగిన పద్యాలు; ఒక్కొక్క పద్యానికి నాలుగు పాదాలుంటాయి. ప్రతిపద్యంలోనూ నాలుగో పాదం (మకుటం) కావ్యమంతటా ఒకే తీరుగా ఉంటుంది. సరళమైన ఆధునిక కాశ్మీరభాషలో వ్రాసిన మొట్టమొదటి కథాకావ్యమిది.

## 4

పద్దెనిమిదో శతాబ్ది చివరి సంవత్సరాల్లో మనకు ఒక ఉద్యమం పొడగడుతుంది. ఈ ఉద్యమం, పంథొమ్మిదో శతాబ్దిలో దాదాపు మూడోదశకంలో వర్ధిల్లడం మొదలై, అప్పటి నుంచి ఈ శతాబ్ది మొదటిపాదం వరకు శక్తిమంతంగా పరిఢవిల్లింది. ఈ మూడోయుగం (సుమారు పద్దెనిమిదో శతాబ్ది చివరినుంచి 1925వరకు) సాహిత్యాన్ని సుసంపన్నం చేసినకాలం పారశీకభాష పల్లెపట్టులకు సైతం విస్తరించి విద్యావంతులందరికీ సాహిత్యభాషగా స్థిరపడింది ఈకొత్త ఉద్యమానికి ప్రబలంగా ప్రేరణ ఇచ్చినవి-పారశీకభాష, పారశీకసాహిత్యం. పారశీకం నుంచి అనేక కళారూపాల్ని-ముఖ్యంగా 'మస్నవి', 'గజల్, అను-కవులు స్వేచ్ఛగా ఎరువు తెచ్చుకున్నారు. అనువాదాల ఉధృతి ఒక్కపక్క సాగుతూఉండగా, మరోపక్క ప్రాచీన పారశీకఐతిహ్యాలకూ చరిత్రకూ సంబంధించిన కావ్యవస్తువుల్ని కాశ్మీరీకవులు స్వేచ్ఛగా వాడుకున్నారు. యూసఫ్-జులైఖా, షిరీన్-ఫర్హాద్, లైలా-మజ్నూ, సోహ్రబ్-రుస్తుమ్ మొదలైనవి ఈ కోవకు చెందినవి. వీటిలో పారశీక ఛందాన్ని, మామూలుగా బహర్-ఇ-హాజీ ని అనుసరించి ద్విపదలుగా వ్రాశారు. రచనలో పారశీక పదాల్నీ పదబంధాల్నీ-ఆ మాటకువస్తే, వాక్యనిర్మాణాన్ని కూడా-కాశ్మీరీ భాష స్వభావానికి అనుగుణం కానివిధంగాకూడా విరివిగా ప్రయోగించారు. పారశీక కవితలోని క్షీణయుగంనాటి పాత ఆలోచనలను, భావాలను, అతిశయోక్తులను కూడా తరచు ఈకవులు దిగుమతి చేస్తూవచ్చారు. అయితే కొందరుకవులు స్థానిక సంప్రదాయంలోనుంచే కావ్యవస్తువులను ఎన్నుకోవడం జరిగింది. ఉదాహరణకు, హీమల్-నాగ్రాయ్, అకనందమ్, రామాయణం, మహాభారతం (సుదామవృత్తాంతం, నలదమయంతుల కథ), భాగవతపురాణం (శ్రీకృష్ణావతార లీల).

ఆ శతాబ్ది ప్రథమార్ధంలో చెప్పుకోదగ్గ ప్రముఖ కవులు మహ్మూద్‌గనీ [మరణం: క్రీ. శ. 1855], వలీ ఉల్లా మోటూ [మరణం: క్రీ. శ. 1858]. మహ్మూద్ గనీ నవీన కల్పనాచతురుడు. కాశ్మీరీ కవితలో పారశీకనమూనాకు సన్నిహితమైన "మస్నవి", "గజల్" లు రూపొందించిన ప్రతిష్ఠ ఈయనది. అంతేకాకుండా, రోహీ [నృత్య] గీతాన్ని గౌరవప్రదం చేసినవాడు కూడా ఈయనే. ఈ ప్రక్రియ అంతకుపూర్వం జానపద గీతంగానే

ఉంటుండేది. ఈయన ఎనిమిది మస్నవీలు వ్రాశాడు. వీటిలో చాలా వరకు, నిజామి, జాని మొదలైనవాళ్ళ పారశీకమూలాలకు అనువాదాలో, సంక్షిప్తానుసరణలో అని చెప్పవచ్చు. ఇవన్నీ ప్రణయగాథలు; భావోద్రేకంతో కూడిన నిజమైన కవిత్వగుణాన్ని ఆలంకారికమైన శైలిలో ఆవిష్కరించిన రచనలు. కాని పాకమూ పదచిత్రాలూ, కొన్ని ఖండాల్లో మినహా, అసంగతంగాను కృతకంగాను కనిపిస్తాయి. ఈయనే వత్సన్ శైలిలో వ్రాసిన భావగీతాలూ, పాటలూ సహజసిద్ధంగా, దేశీయ బాణీల కనుగుణంగా చురుకుగా సాగుతాయి.

వలీ ఉల్లా మోటూ భాష ఇంతకంటె సరళమైనది, జనప్రియమైనది. 'హీమ్మాల్ తా నాగ్రాయ్' పేరుతో ఈయన వ్రాసిన మస్నవీ, స్థానిక ఐతిహ్యానికి భిన్నంగా సాగడంవల్ల కథాప్రయోజనంతోబాటు కవితా సౌందర్యంకూడా దెబ్బతిన్న సందర్భాలు ఉన్నప్పటికీ దేశీయత సంతరించడంలో ఇతడు కృతకృత్యుడయ్యాడు.

# 5

తరవాతి అంతర్యుగం, 1859 - 1885, లో కాశ్మీరీ కవిత పరమానంద్, ప్రకాశ్ రామ్, మక్బూల్ షా, లఛ్మన్ రాయినా, రసూల్ మీర్, షమ్స్ ఫకీర్ వంటి ఉత్తమ కవుల్ని పరిచయం చేసింది.

పరమానంద్ [1791 - 1885] మూడు దీర్ఘమైన కథాకావ్యాలు వ్రాశాడు: '*శివలగన్*' (శివుడి పెండ్లి), "*రాధాస్వయంవర*" (రాధ భర్తను ఎంపిక చేసుకోవడం), "*సుదామ చరిత్*" (సుదాముడి కథ). ఏ భాషలో నయినా ప్రాముఖ్యం పొందగల కవి పరమానందుడు. దేవుని కోసం జీవుని అన్వేషణ, మానవుని కోసం దేవుని అన్వేషణ ప్రధాన వస్తువుగా ఎన్నుకొన్నట్లు కనిపించే ఈ కావ్యాలు ప్రతీకలతోను, ఆవశ్యకమైన రూపకాలంకారాలతోను నిండి ఉంటాయి. ఈయన వ్రాసిన లీలాగీతాలనే లఘుకావ్యాల్లో కూడా ఇవి కనిపిస్తాయి. ఈ కవి ప్రేమించే భక్తురాలిగా లేదా ఆకృతి గైకొన్న దైవంగా - ముఖ్యంగా రాధాకృష్ణుడిగా-గానం చేస్తాడు. వీటన్నిటిలో పరిత్యాగం, ఆనందం, వేడుక కనిపిస్తాయి. ఇవి కాశ్మీరీ సాహిత్యంలో అరుదైనవి. లీలాగీతాలు వ్రాసే కవుల దృష్టిలో ప్రపంచం సత్యైనది. ఇది వాస్తవమైనది, ఉత్తమమైనది. ఇది సృష్టికర్త ఆనందాతిరేకంలోనుంచి పొంగి పొర్లిన ఒక లీల, నటరాజ తాండవం. ఉదాత్తమైన ఆరంభానికీ, భాషలో పొదుపరితనానికి, కావ్యానికొక విలక్షణత చేకూర్చే విధంగా ఆధ్యాత్మిక భావుకతను జోడించి కథకొక ఉదాత్తత చేకూర్చడానికి అద్వితీయమన్న పేరుగన్న కథాకావ్యం "సుదామ చరిత్". అయితే "రాధాస్వయంవర" మాత్రం ఈయన వ్రాసిన కావ్యాలన్నిటిలోకీ. సంగీతయుక్తమైనది.

ప్రకాశ్‌రామ్ వ్రాసిన "రామావతార్ చరిత్", "లవకుశ" కావ్యాలు పరమానందుడి కథాకావ్యాల ముందు తీసికట్టే. వాటిలో ఆయన ఉద్దేశించిన ప్రయోజనం కేవలం కథ చెప్పడం కాకుండా భక్తి ధర్మం పెంపొందించడమేనేమో అనిపిస్తుంది. అయినప్పటికీ, బహుశా మొట్టమొదటి రజ్మియా (యుద్ధాత్మక) మస్నవీగా చెప్పదగ్గ ఈ కావ్యం, సరళతరమైన భాషలో వ్రాసినది. అంతేకాదు, ఇటు సంస్కృతం నుంచి కాని అటు అరబ్బీ పారశీకాల నుంచి కాని ఎరువుతెచ్చుకున్న అపరిచిత పదాలలో వేటితోనూ ఇది బరువెక్కలేదు.

'గుల్రెజ్' కావ్యంలోని భౌతిక ప్రణయం విషయంలో అర్హమైన ప్రశస్తి పొందినవాడు మక్బూల్‌షా. కేవలం ఖండాలుగా కాకుండా, ఎప్పటికీ సంపూర్ణరూపంలో నిలిచే కొద్దిపాటి మస్నవీల్లో ఈ కావ్యం ఒకటి. ఇందులో ఆద్యంతం దాదాపు సమానప్రతిభ గోచరిస్తుంది. అంతే కాకుండా ఉద్రిక్తప్రణయం ప్రదర్శితమవుతుంది. తత్ఫలితంగా, కొన్నికొన్ని చోట్ల ప్రకృతిదృశ్యాల వర్ణనలతో సముదాత్త మవుతూ ఉంటుంది. ఈయన వ్రాసిన 'గ్రీస్తనామా' అనే అధిక్షేపకావ్యం, మా సాహిత్యంలోని హాజ్లియా (హాస్య-అధిక్షేప) మస్నవీల్లో మొట్ట మొదటిది. ఆ మాదిరి రచనలన్నిటిలోకీ ఇది అత్యుత్తమమైనది.

'సామ్ నామా' అనే రజ్మియా మస్నవీ మూలంగానూ 'నలదమయంతి' అనే ఐజ్మియా (ప్రణయం)మస్నవీ మూలంగానూ అధికప్రశస్తి పొందడానికి అర్హుడైనవాడు లఛ్మన్ రాయినా (మరణం:క్రీ.శ.1897). ఈ రెండింటిలోనూ ఈయన, పారశీక భాషను కాశ్మీరీ భాషాస్వభావానికి అనుగుణంగా మలుచుకోవడంలో కృతకృత్యుడయ్యాడు. మా గీతికారచయితల్లోకల్లా అత్యుత్తముడని నిస్సంశయంగా చెప్పదగ్గ రసూల్ మీర్ వ్రాసిన గజళ్ళలోనూ పాటల్లోనూ కూడా ఈ లక్షణం కనిపిస్తుంది. వాటిలో మానవుడే ప్రేమికురాలు. ఆమె ఆకర్షణశక్తులను కవి అపరిమితంగా, అనర్గళంగా అభివర్ణిస్తాడు. వాటిలో గాఢమైన కాంక్ష, స్వచ్ఛందత గోచరిస్తాయి.

ఆ కాలంనాటి పాటల్ని గురించి, గజళ్ళను గురించి మొత్తంమీద ఇక్కడొక మాట చెప్పవలసి ఉంది. ఇవి వెనకటి వాటికంటె కల్తీగాను, అనుకరణాత్మకంగానూ కృతకంగానూ కూడా ఉంటాయి. అంతేకాదు; పూర్వకాలపు పాటల్లో ఉన్న మాధుర్యాన్ని, సూటితనాన్ని, సున్నితమైన తీక్షణతను ఇవి కొంతవరకు కోల్పోయాయి. అయితే, పూర్వగాథా స్మృతులను ఇంద్రియానుభూతిని, ఆలంకారికతను పెంపొందించుకున్నాయి. ఈనాటి కవులు తమ మార్మిక కవితలు కూడా, ఈ 'గీత్' (వత్సన్) లేదా 'గజల్' రూపంలో వ్రాస్తున్నారు. పైగా వీటిలో కూడా నుడికారం విషయంలోనూ పదబంధవిషయంలోను మార్పు గమనిస్తాం. ఈ కాలపు మార్మికకవి, పారశీక ధోరణిని అనుసరించి పానశాల-మధుపాత్రల సంప్రదాయాన్ని, అనూచానమైన మతాచార విధులపట్ల నిర్లక్ష్యాన్ని సమర్థిస్తాడు. ఈ యుగమంతటిలోకీ ప్రసిద్ధులైనమార్మిక కవులు--షకుర్ ఋషి, షాకలాందార్, మోమిన్ సాబ్, అజీజ్ దర్వేష్, నమాసాబ్ స్వాచ్ క్రాల్ షమ్స్ ఫకీర్, వాహబ్ ఖార్, బహ్మన్ దార్, అహ్మద్ బత్‌అవారీ, వాజా మహ్మూద్. వారిలో చాలా మందిలో హిందూ, సూఫీ సంప్రదాయాల సంశ్లేషణ కనిపిస్తుంది. అంతేకాక, తాము "శాస్త్రం" (శాస్తర్‌హైయో) చెప్పిన ప్రకారం పలుకుతున్నట్లు చెబుతారు. వీరి ఉత్తమ కవితల్లో, మార్మికతను కవిత్వంగా పరివర్తనచేసే లక్షణాలున్నాయి.

మార్మికకవితకు భిన్నంగా "పవిత్ర కవిత" వ్రాసే కవులందరిలోకీ అత్యంత ప్రసిద్ధంగా వినబడే పేరు అబ్దుల్ అహ్మద్ నదీమ్‌ది. ఈయన భక్త్యావేశంతోను, గౌరవప్రపత్తుల తోను నిండిన గీతశైలిలో మహమ్మద్ ప్రవక్త గురించి "నాత్" అనే కీర్తనలు రచించాడు. ఈయనా (1885-1925), హాజిన్‌కు చెందిన వాహబ్ పరో (1846-1909) ఒకే అంతర్యుగంలోని వాళ్ళు. వాహబ్ పరో అనేక గ్రంథాలు వ్రాశాడు. వాటిలో ప్రణయానికీ ద్వంద్వయుద్ధానికీ పేరుగన్న మస్నవీలు, పాటలు, గజళ్ళు, "షానామాలు" కలిసి 23,491 కవితలున్నాయి. ఇలాగే అజీజుల్లా హెక్కాని [1854-1929] కూడా చెప్పుకోదగ్గ కవి. ఈయన

మార్మిక కవితనూ మతప్రమేయం లేని లౌకిక కవితనూ మస్నవీల్లోనూ గజళ్ళలోనూ అందించడమే కాకుండా 'సహ్లోబ్ నామా' (వరద కథ), 'ఆతిష్ నామా' (మహాగ్ని కథ) వంటి సందర్భ వశమైన కవితలు కూడా వ్రాశాడు. ప్రకృతి సంబంధమైన విపత్తులను, అవినీతిపరులైన ఉద్యోగి బృందంవారి నిరంకుశత్వాన్ని చిత్రించే మస్నవీలు, మార్మిక గీతాలు, ఇతరమైన పాటలు, గజళ్ళు, 'షహరాషేబ్' శక్తులు వ్రాసిన ఇతర కవులు కూడా ఉన్నారు. కాని ఈ సంగ్రహ సమీక్షలో వాటి సంగతి విడిచి పెట్టక తప్పదు.

ఈ కడపటి శంకర్యుగంలో చెప్పుకోదగ్గ మరొకకవి కృష్ణ రజ్దాన్ (1850-1952). ఈయన 'శివపరిణయ' కావ్యం, అనేకమైన లీలాగీతాలూ వ్రాశాడు. ఈయన భాష సరళంగా, మధురంగా ఉంటుంది. ఇందులో అందంగాని, ప్రభావోత్పాదకతగాని లోపించదు. నాట్యానుకూలమైన లయలు, ఆనందపారవశ్య గుణం దీనికి స్వాభావికంగా సిద్ధించాయి.

## 6

కొంచెం ఇంచుమించుగా, శతాబ్ది మలుపు తిరిగేనాటికి ఉర్దూ ప్రభావ మొక్కటే కాదు; హిందీ, ఇంగ్లీషు భాషల ప్రభావంకూడా ప్రస్ఫుటం కావడం మొదలైంది. కంకర రోడ్లతో పెద్దపెద్ద రహదారులు ఏర్పడటంవల్లా, తంతితపాలా సౌకర్యాలు చేకూరడంవల్లా కాశ్మీరలోయకు ఇతర ప్రాంతాలతో సంబంధాలు ఏర్పడ్డాయి. పాలనరంగంలో ఉన్నత స్థాయిలో ఇంగ్లీషును అధికార భాషగా ప్రవేశపెట్టారు; పారశీక భాష పట్టు సడలటం మొదలైంది. కాశ్మీర భాషలో వచనరచనల ప్రాదుర్భావం ఈ కాలంలో గమనిస్తాం. బైబిలు అనువాదమైంది ; అలాగే **యూక్లిడ్**, ఇస్లామ్ మత సంప్రదాయాలతో కూడిన **తఫ్సీర్-ఇ-కొరాహ్**, మిసల్ వంటి గ్రంథాలు కాశ్మీరీలో వెలువడ్డాయి. ఈశ్వర్ కౌల్ కాశ్మీరీ శబ్దామృత మనే పేరుతో ఒక వ్యాకరణం వ్రాశాడు. రెవ. హింటన్ నోల్స్ సేకరించిన సామెతలు, జానపద కథలు పుస్తకరూపంలో వెలువడ్డాయి. అలాగే, సర్ ఆరెల్ స్టీన్ వ్రాసిన **హాతిమ్ కథలు** కూడా వచ్చాయి. 1925తో ముగిసే ఈ సుదీర్ఘ కాలంలో నంద్‌లాల్ కౌల్ - చాలావరకు ఉర్దూ నుంచి అనువదించిన - **సతు కహ్వాత్** (సత్యానికి గీటురాయి), **రామున్‌రాజ్** (శ్రీరామరాజ్యం), ప్రహ్లాద్ భగత్ (భక్త ప్రహ్లాదుడు) వంటి నాటకాలతో మంచి సంచలనం కలిగించాడు.

## 7

నాలుగో యుగం గులామ్ అహ్మద్ మజూర్ శకం. సాహితీ సృజనాత్మకత క్షీణ స్థితిలో ఉన్న సంధియుగంలో కాశ్మీరీ కవితను సజీవంగా నిలిపినవాడు ఈయన. గజల్, గీత్ అనే ప్రక్రియల్లో సిద్ధహస్తు లనిపించుకొన్న ప్రసిద్ధు లిద్దరిలో ఒకడు రసూల్ మీర్. రెండోవాడు ఈయన. అంతేకాదు; ఈయన భాషాసహజమైన దేశీయసంగీతాన్ని పునరుజ్జీవింపచేయడమేకాక రెఖ్తా అనే మస్నవీల్లోని సారహీనమైన కృతక ఆలంకారిక పారశీక శైలి నుంచి భాషను విముక్తం కావించాడు. ఈయన ఇంకా చేశాడు. 'పల్లెటూరి పిల్ల', 'రావోయి తోటమాలీ' (సంచలనాత్మకమైన దేశభక్తి కవిత) వంటి అనేక కవితల్లో ఈయన ఆధునిక

స్వరం పలికించాడు. స్వాతంత్ర్యం గురించి అధిక్షేపాత్మకంగా గజల్‌లో ఈయన, స్వాతంత్ర్యానంతర కాలంలో దేశప్రజల భ్రమలన్నీ ఎలా పటాపంచలయాయో వివరించాడు. ఈయనకు సమకాలికుడైన అబ్దుల్ అహ్మద్ ఆజాద్ అనే యువకవి నజ్మ్‌లు వ్రాశాడు. వస్తు భావైక్యంతో వ్రాసిన ఈ పద్యాలు, విప్లవాత్మకమైన కావ్యవస్తువులనాశ్రయించినవి. షిక్వా-ఇ-ఇబ్లిస్ (సైతాను ఫిర్యాదు), దర్యాన్ (నది), పాంతార్ (జలపాతం) మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. సాంప్రదాయికులయితే తమ పూర్వులలాగే మస్నవీలు, గజళ్ళు వ్రాస్తూ వచ్చారు. కాని యువకవులు మాత్రం, దేశంలోని ఇతర ప్రాంతాల్లో వచ్చిన సామాజిక రాజకీయ ఉద్యమాల ప్రభావానికి లోనయినారు. గులాబ్ హసన్ బేగ్ ఆరిఫ్ 'చతుష్పదు'లను ప్రవేశపెట్టాడు. గులామ్ అహ్మద్ ఫజిల్, నందలాల్ అంబర్దార్ కాల్పనిక కవితలు వ్రాశారు. అయినప్పటికీ అహ్మద్ ఫజిల్ వ్రాసిన క్రాలకోర్ [కుమ్మరివాళ్ళ అమ్మాయి], అంబర్దార్ వ్రాసిన కనడోర్ [చెవిరింగులు] వంటి కవితల్లో విశేషమేమిటంటే, పూర్వులు సిద్ధంచేసి పెట్టిన పాతకాలపు నిస్సారమైన శైలిని చాలావరకు పరిహరించారు.

అయితే, ఇంకా లోతుగాచూస్తే, కాశ్మీరీకవితలో కొత్తగొంతు విప్పినవాడు జిందా కౌల్ అని చెప్పాలి. 35 కవితలు గల ఈయన కావ్యం పేరు సుమ్రాన్. ఈయన కవితల్లో మార్మికత ఉన్నప్పటికీ ఒక విశిష్టత ఏమిటంటే, వాటిలో శోధనాత్మకమైన ఒక సంశయం, ప్రశ్నించే ధోరణి గోచరిస్తాయి. గాఢమైన చింతనాశీలత కనిపిస్తుంది. లోలన్ కున్ (ప్రేమకు), వనస్ మన్జ్‌లాల్ (మరుగుపడిన మాణిక్యాలు), సన్త యారే (అసంసిద్ధత) వంటి కొన్ని కవితల్లో అరుదైన దార్శనికత గోచరిస్తుంది. ఈయన కొన్ని నవీన ఛందోరీతులు, పద్యరూపాలు— క్రమబద్ధమైనవీ క్రమవిరుద్ధమైనవీ కూడా ప్రవేశపెట్టాడు.

## 8

1947 అక్టోబరులో కాశ్మీరుమీద వాయవ్యదిశనుంచి దాడి జరిగింది. పాకిస్తాన్ ప్రోద్బలంతో సాగిన ఈ దాడితో మా సమకాలిక సాహిత్యయుగం మొదలైంది. కొత్త నాటక రచయితలూ వచన రచయితలూ, కవులూ హఠాత్తుగా రంగంలోకి విరుచుకుపడ్డారు. పూర్వయుగపు యువకవులు వీళ్ళతో కలిశారు. జీవన్మరణ సంఘర్షణగా గణించదగిన కావ్యవస్తువుల నెన్నుకొని రచనలు ప్రారంభించారు. అయితే చివరికి, వీళ్ళు వ్రాసినవాటిలో చాలావరకు సందర్భానుసారంగా వ్రాసినవి, రచనాకాల ముద్ర వేసుకొన్నవి అయితే కావచ్చుకాని, కొన్ని కావ్యాల్లోనూ నాటికల్లోనూ ఆలంకారికమైన అభివ్యక్తిలో ఒక నూత్నస్వరం, భావాతిరేకం, దేశభక్తి, విస్తృతమైన సామాజికవాద పరమైన సానుభూతి, అమోఘమైన కొత్తలయలు, ఛందస్సులు కనిపిస్తాయి. ఆంగ్ల ఉర్దూ సాహిత్యాల ప్రభావముద్ర వేసుకొన్న ఈ పునరుజ్జీవన యుగానికి నాయకులు-దీనానాథ్ నదీం, నూర్ మొహమ్మద్ రోషన్, అమిన్ కామిల్ ప్రభృతులు. వీరి తరవాత వచ్చిన యువకవులు - రహ్మాన్ రాహీ, గులామ్ నబీ, ఫిరాక్, ముజఫర్ అజీమ్, మోహన్ లాల్ బేకన్, చమన్‌లాల్ చమన్, గులామ్ రసూల్ సంతోష్, గులాబ్ నబీ ఖయాల్. కథానికా, కథాత్మకవచన రచయితలు - అఖ్తార్ మొహి-ఉద్-దీన్, అమీన్ కామిల్, దీపక్ కౌల్, బన్సీ నిర్దోష్, అవాతాయ్ కిషన్ రెహ్బార్, హృదయ్ భారతి, ఉమేర్న్ కౌల్, సూఫీ గులాబ్ ముహ

మ్మద్, అలీముహమ్మద్ లోనే, శంకర్ రాయినా మొదలైనవారు. కాశ్మీరీ కవిత్వానికి ఉజ్జ్వల మైన శృంగారం సంతరించి, సంగీతరూపకం, సానెట్ వంటి కొత్త ప్రక్రియలందించి, అనూహ్యమైన ఆకర్షక పదజాలం సమకూర్చినవాడు దీనానాథ్ నదీమ్. అయితే రాహీ, గజల్ లో ఆధునిక చింతనా విషయాన్ని జోడించి బౌద్ధికం కావించడంలో కృతకృత్యుడయ్యాడు. గులామ్ రసూల్ నజ్కీ చతుష్పదుల్లో వ్రాసిన 'నమ్‌రోద్ నామా' విలువైన గ్రంథంగా ఇటీవల మన్ననలందుకొన్నది.

నాటకరంగంలో కొత్తదనం బయలుదేరింది. సోమనాథ్ జుట్షి రచించిన "మోదుర్ మస్", లేదా విజి 'వావ్' అలీ మహమ్మద్ లోనే వ్రాసిన 'తాజీ బతున్‌కాన్' వంటివి జనరంజకత్వాన్ని సంపాదించుకొన్నవి. 'మచామా' నాటక రీతిలో పుష్కర్‌భాన్ రచించినవీ జనప్రియత సంపాదించాయి. ఇవి హాస్యరసపూరిత మైనవి. తక్కిన నాటక రచనలంతగా గుర్తింపు పొందలేదు. విదేశభాషల ఉద్గ్రంథాలకూ టాగూరు నాటకాలకూ కొన్ని అనువాదాలు వెలువడ్డాయి.

కాశ్మీరీ సాహిత్యంలో — సాధారణంగా కథానికల్లోను ; అఖ్తార్ మొహి-ఉద్-దీన్ వ్రాసిన 'దోద్ దాగ్' అనే నవలికలోను; గులామ్ మొహి-ఉద్-దీన్ హాజిని, రెహ్మాన్ రాహీ, జె. ఎల్. కౌల్ మొదలైనవారి విమర్శావ్యాసాలలోను ; స్కిట్, శీలచిత్రణ, వ్యాసం, రేడియో రూపకాలు, సాధారణంగా నాటకాలువంటి ప్రక్రియల్లోను ఉన్నత ప్రమాణాలను సాధించడం జరిగింది.

## విషయసూచిక

### పద్య విభాగం

7. మంచిభార్య - చెడ్డభార్య

వలీ ఉల్లా మోటూ

8. బాలకృష్ణుడు ...

9. ఆత్మసాక్షాత్కారం

పరమానంద్

10. నొష్లాబ్ విలాపం ...

11. రైతు - పురోహితుడు

మక్బూల్ షా

12. సామ్, మకోకాల్ ల పోట్లాట

లచ్మన్ రాయినా

13. సూఫీ పద్యాలు

నమా సాహెబ్, వహాబ్ ఖార్, అజీజ్ దర్వేష్

14. వత్సన్
పాటలు

రసూల్ మీర్

15. లీలాగీతం

కృష్ణరజ్దాన్

16. రావోయి తోటమాలీ
గజల్ ,,

17. పల్లెటూరిపిల్ల ...

గులామ్ అహ్మద్ మహ్జూర్

18. మానవ విలాపం

జిందాకౌల్

19. చెవి రింగులు

నందలాల్ అంబర్దార్

20. కొండవాగు

గులామ్ హసన్ బేగ్

21. సైనికమిత్రమా ! ...

22. చంద్రుడు
సానెట్

దీనానాథ్ నదీమ్

23. చిరకాంత

అమీన్ కామిల్

24. జ్వాల - నృత్యం ...

25. సరిహద్దు గస్తీకేంద్రంలో

గులామ్ నబి ఖయాల్

## 1. వాఖ్ (పద్యసూక్తులు)

**లాల్ దద్ (14వ శతాబ్ది)**

**1.** వడకని దారంతో, మహాసముద్రంలో
నా నావను లాక్కొనిపోతూ ప్రార్థిస్తాను :
నా మొర విని ఆ దేవుడు
పదిలంగా కడలి దాటించేనా !
నేను వ్యర్థమైపోతాను, మట్టిముంతల్లో నీళ్ళలా,
అభిలాషపడతాను ఇల్లు చేరాలని.

**2.** బారువ బరువున్నంతగా, అర్థంకాని
ఈ ప్రపంచభారం, ఈ సరదాలు,
వడిసెల వదులైపోగా, నా వీపున పడి
వెన్ను వంచేస్తోంది, తన బరువుతో.
మా గురువుగారన్నారు-ఆత్మసాక్షాత్కారంకోసం
నేనీ ప్రపంచాన్నే వదులుకోవాలని-
అది నాకొక అరిష్టమే అయింది. అయ్యో ! నావాళ్ళు
చెల్లాచెదరయినారు, కాపరిలేని గొర్రెల మందలా.

3. ఓ ఆత్మా, విలపిస్తాను నీ కోసం ఎడతెరిపి లేకుండా
ఈ లోకపు మాయాజాలంలో, సుఖభ్రాంతిలో
లంగరులా చిక్కుకున్నావు
నీ సహజ స్వరూపాన్నే విస్మరించావు.
ఈ బంధాల నీడల్లో ఒక్కటైనా కనీసం
రాదు నీ వెంట, నువు కన్నుమూసిన వెనక.

4. మనస్సు గుర్రంలా పరుగులు తీస్తోంది
ఆకాశంలో, లక్ష యోజనాలదూరం రెప్పపాటు కాలంలో.
నిజమైన జ్ఞాని అన్నవాడు
పరుగులు తీసే ఆ గుర్రానికి వేస్తాడు కళ్ళెం.
ప్రాణాపానాలనే చక్రాలు పూన్చిన తన రథాన్ని
నడిపిస్తాడు సరిగా ముందుకు.

5. వెదుకుతూ వేసారుతూ అతనికోసం
అలిసిపోయింది ఈ లల్ల.
నేను పరిశ్రమించాను, నా శక్తికిమించి కూడా.
అతనికోసం అన్వేషిస్తూ అతని తలుపులు గడియపడ్డాయని తెలుసుకున్నాను.
నా ఆకాంక్ష నిది ఇంకా గాఢం చేసింది, పట్టుదల పెంచింది
నేను కదలను ఇక్కడినుంచి, ఉన్నచోటే నిలబడతాను స్థిరంగా
అతని దర్శనంకోసం, ఆశానురాగాలు నింపుకొని.

6. కోరిక, కామం, గర్వం అన్న
ముగ్గురు దొంగల్నీ చంపేదెవరు ?
వినయంతో, దయార్ద్ర హృదయంతో
తానందరికీ సేవకుడయ్యేవాడెవరు ?
వాడే - దేవుణ్ణి వెదికేవాడు,
తక్కినదల్లా బూడిదగా భావించేవాడు.

7. హంస సాగే దారిలో ఆ స్వామిని పిలుస్తూ
భవబంధాలనుంచి, ద్వంద్వాలనుంచి మనస్సును విముక్తం చేస్తే-
నువ్వు చెవిఒగ్గి వింటున్నది ఈ లోకం పిలుపునే అయినా-
తప్పకుండా కురుస్తుంది నీ పైన, దేవుని దయ.

8. రాత్రి కడజామునే మేల్కొన్న నేను
చంద్రుడు కుంకుతూ ఉండగా పిలిచాను ఎలుగెత్తి,
పిచ్చిదాన్ని, భ్రమించే మనస్సును
భగవంతుని ప్రేమతో దాని బాధను చల్లారుస్తూ
అరిచాను నేను, "నేనే, లల్లాని; నేనే, లల్లాని"
అంటూ మేల్కొలిపాను, నా ప్రియతముణ్ణి, నా నిజమైన ఆత్మను.

నా మనస్సు అతనిలో ఐక్యమవడంతో
తొలగిపోయింది నా (పది) ఇంద్రియాల మాలిన్యమంతా.

9. నా గుండె లోతుల్లో వెదికాను నేను
అగోచరమైన చంద్రబింబంకోసం; చూస్తే ఏం కనిపించింది ?
ప్రతిదీ తనను పోలినదాంట్లో లీనమవుతోంది
ప్రతిచోటా నేను చూసింది ఒక్క భగవంతుణ్ణే-
ఇక్కడా, ఇక్కడా, ఇక్కడా.
ఉన్నదంతా నీవే అయితే ఓ భగవాన్ !
ఇన్ని రూపాల్లో చూపేది ఏమిటి, ఇదంతా నీ లీల.

10. కంటికవుపించే ఈ విశాల విశ్వాన్ని
పునఃపునః సాగించే అభ్యాసం ద్వారా
శూన్యంలోకి ఉద్ధరించినప్పుడు;
ఆకాశంలో సగుణం లీనమయినప్పుడు
నీళ్ళలోకి తుళ్ళిపడే నీళ్ళలాగ ;
అప్పుడా శూన్యం కూడా లయమైపోయి
ఆనందమొక్కటితప్ప మరేదీ మిగలనప్పుడు-
అప్పుడు తెలుసుకో, ఇదే సిద్ధాంతం నీకు సత్యమని.

11. ఇక్కడ పలుకులేదు, తలపులేదు
లోకాతీతం లేదు, అనతీతమూ లేదు;
మౌనవ్రతాలవల్ల, ముద్రలవల్ల,
రకరకాల ఆసనాలవల్లా ప్రవేశం లేదిక్కడ;
శివశక్తితత్త్వం కూడా నిలిచేది కాదిక్కడ
అనిర్వచనీయమై నిలిచేది ఏదో అదే నిత్యసత్యం.

12. ఉద్యాన ద్వారంగుండా ప్రవేశించాను నేను
నా ఆత్మలోకి,
ఓహో ! ఏమని చెప్పను నా ఆనందం ?
శివశక్తులిద్దరూ ఒకే రూపంలో నిబద్ధులైనారు ;
అక్కడ ఆనందసరసిలో నిమగ్నునయానునేను
జీవించి ఉంటూనే మృతప్రాయమయాను
నాకేమయితేమట్టుకు ఇప్పుడు నాకేమి లెక్క ?

13. ఆత్మ నిత్యనూతనం; చంద్రుడు నిత్యనూతనుడు
అలాగే చూస్తాను ప్రపంచాన్ని, నవంనవంగా
ఈ లల్లాని-మనశ్శరీరాల్ని శాశనం చేసుకొన్నదాన్ని కనక
(నిన్న రేపులన్నీ అంతరించాయి నాకు)

నిత్యమైన వర్తమానంలోనే జీవిస్తాను నేను
ఎప్పటికీ నిత్యనూతనంగా.

## 2. శ్రుఖ్

నంద్ ఋషి (1377-1438)

1. తన అన్నం ఇతరులకు పంచేవాడు
ప్రార్థనలో మగ్నుడై నిర్భయంగా
రోజులూ నెలలూ తరబడి ఉపవాసాలు చేస్తూ
భ్రాంతినీ, కామాన్నీ, గర్వాన్నీ విడిచిపెట్టేవాడు-
స్వర్గానికి చేరుకోగలవాడు వాడే
నిజానికి వాడే ముసల్మాను.

2. చలికాలం గడుస్తుంది, వేసవికూడా వస్తుంది
నల్లపిట్టల పాట చెవులకే సోకదింక
దురదృష్టం, సౌభాగ్యం గడుస్తాయి
సుఖంగా ఉన్న రోజులు దాటిపోతాయి.

3. (అ.) నిజం తొలిపొద్దు అందంలాటిది
అబద్ధం పిశాచం వెడనవ్వులాటిది.

(ఆ.) నిజాన్ని విడిచిపెట్టేసి, అబద్ధాన్ని అనుసరించాను
నా నూలంతా చిక్కుముళ్ళు పడింది.

4. రాళ్ళగుట్టల్లో అదృశ్యమైంది నీటిబుగ్గ
దొంగల సాంగత్యంలో నశింపయాడు ఋషి
అజ్ఞానుల మధ్యంలో గురువే అంతరించాడు
కాకుల గుంపులో హంస కనుమరుగైపోయింది.

5. తోటలో ఒక గువ్వ పువ్వు నన్వేషిస్తోంది
గుడ్లగూబ విజనస్థలాన్ని కోరుకుంటోంది
ఆడనక్క బంజర్లను గాలిస్తోంది
పేడకోసం, దుమ్ముకోసం పరుగెడుతోంది గాడిద.

6. ప్రేమంటే, తల్లికి ఏకైకపుత్రుడి మరణంలాటిది —
ఆ తల్లి కంటికి కునుకన్నది వస్తుందా?
ప్రేమంటే, కందిరీగల దండు విషపు కాట్లవంటిది-
అవి బాధించిన వాడికి విశ్రాంతి ఉంటుందా?
ప్రేమంటే, వాడిగల బాకు పోటులాంటిది —
ఆ పోటు తిన్నవాడు నిట్టూర్పు విడవగలడా?

## 3. పాట

**హబీబుల్లా** (1555 - 1617)

ప్రేమకు నేను దాసుడి నయ్యాను
నన్ను చూసి ఆ దేవుడెంతో ముచ్చటపడ్డాడు
ప్రేమించు మనసారా, అప్పుడు రుచిచూస్తావు నువ్వు
మనల్ని ఇక్కడికిచేర్చిన జీవితవాహిని నింపే మధువును
జీవులన్నిటినీ, దేవుడు సృష్టించినది
ఆ నదీ జలాలతోనే.

ఎడతెరిపిలేకుండా తాగుతారు కొందరు, ముంతవెనక ముంత
తాగుతూనే గమ్యం చేరుకుంటారు కొందరు
అదేపనిగా కాచుకొని ఉంటారు కొందరు, నిష్ప్రయోజనంగా.

## 4. వత్సన్ (పాటలు)

**హబాఖటూన్** (1551 - 1606)

1. పారిపోయావా, నా హృదయాన్ని దోచుకుని,
నాకు చెప్పకుండా, దొంగలా
రా ప్రియా, నా దరికి రా

రా మిత్రమా, ఈ నవయౌవనంలో ఇద్దరం
ఏరుకుందాము కలిసి, మల్లెపువ్వుల్ని
వెళ్ళినవాడు మళ్ళీ రాడిక
నేను నీమేలు కోరతాను; మరెందుకీ ఆలస్యం?
రాప్రియా, నా దరికి రా.

రా మిత్రమా, ఏటిఒడ్డుకూ గుట్టదరికీ పోదాం
రంగురంగుల అందాల పూలు కోసుకుందాం;
లోకుల మాటలు లెక్కచేయనే వద్దు మనం
పుకార్లతో, గుసగుసలతో మొరటుగా
రచ్చకెక్కిస్తారు నన్ను ; అది నా దురదృష్టం.

విధివేసిన పీటముడిని విప్ప జాలినదెవ్వరు?
అదే విధి వాళ్ళకూ రాసిపెట్టి ఉండవచ్చు
ఏమో ఎవరు చెప్పగలరు? రాప్రియా, నీ కొరకే నా నిరీక్షణ
ఎంతో చెడ్డగా చెప్పారు ఆయనతో నాగురించి
చెవుల్లో ఆయనకు విషం నూరిపోశారు
ఆ మాటలే నమ్మాడు, అమాయకుడు
అయ్యో, నా గతేమిటి? ఇకేమిటి?

ఏటిరేవుకు మనం వెళ్ళేటప్పుడు
ప్రపంచమంతా నిద్రలో మునిగి ఉంటుంది నేను తప్ప
కూచుని కూచుని అక్కడే గడుపుతాను రాత్రంతా
నా ప్రియుని సందేశంకోసం
నాకు విశ్రాంతి లేదు, నిద్రలేదు
రా ప్రియా, నా దరికి రా.

రా మరి, పరాయిదాన్నిలా చూడ్డం మాను
ప్రేమపలికే తొందర పిలుపుకు మారుపలుకు
ఎంత తపిస్తున్నానో నీ కోసం, నువ్వే చూడు
జీవితం స్వల్పకాలికం, ఎంతోకాలం ఉండబోమిక్కడ
కనక, రా ప్రియా, నా దరికిరా.

2. ప్రియా, ఎవతె నిన్ను ఆకట్టుకుంది ?
ఆమె ఎలాటి ప్రత్యర్థి నాకు ?
నీ మనస్సు మారదా? విచారం విడిచి నా దరికి రావా?
చెప్పు, నన్ను పరాయిదానిలా చూస్తావెందుకు ?

చిమ్మచీకట్లో తలుపు తెరిచాను నేను
నువ్వొవస్తావని, కొద్దిసేపట్లో
నేను ప్రేమిస్తున్నాను, నువ్వు ప్రేమిస్తున్నావు
ఇంకెందుకీ కాలహరణం ?

అయ్యో, ఎందుకునన్నిలా పరిత్యజిస్తావు ?

చూడు, ప్రేమ అనే మూసతో
మాడి బూడిదై పోతున్నా, నీ కోసం తపిస్తున్నా
బాదంకాయల్లాటి నాకళ్ళు ధారకట్టి వర్షిస్తున్నాయి
నీ కోసం. నీ ఒక్కడికోసం
నా ఇంటికి నిన్ను చేర్చే ఆ దారులే
తప్పించి తిరుగుతున్నావు నువ్వు.

తోటలో పెరిగిన మల్లెపువ్వునే నేను.
నవయౌవనంలో ఉన్నదానినే; అయినా
గ్రీష్మంలో మంచులా వ్యర్థమైపోతున్నా,
తోటలోకి రా ఓ ప్రియా
వచ్చి ఆఘ్రాణించు నువ్వు ఈ మల్లెపువ్వును
ఇది నీ కోసం పూసిన పువ్వు.

ప్రతిఉదయం నవవధువునై నేను
ఫెళ్ళి దుస్తులా ఆభరణాలా అలంకరించుకుంటాను

నీ కోసం, నీకు స్వాగతం పలకడంకోసం.
కాని నువ్వు తప్పుకొని తిరుగుతున్నావు, మళ్ళిపోతున్నావు
అయ్యో, ఎంత బాధిస్తావు నువ్వు ?

అయ్యో ! పాపం ! హబా ఖతూన్
సేవించలేదా సరిగా నిన్ను ?
తన యౌవనాన్ని కోల్పోయిందామె, విఫలమైన ప్రేమతో
ఎంత బాధాకరమైంది ఈ జ్ఞాపకం
ఆమె గుండెలో గుచ్చుకుంటున్నది.
రావోయి, ఇంకా సమయం మించిపోలేదు
నన్నెందుకు తప్పిస్తున్నావు, రా ప్రియా.

**అర్నిమాల్** (మరణం : 1800)

1. ఒక వేసవి మల్లియనై పుష్పించిన నేను
మారిపోయానిప్పుడు
పచ్చని గులాబి పూవులా
ఎప్పుడు వచ్చేను ప్రేమ, అయ్యో ఇంకెప్పుడు ?

పూలతో పూజించాను, పండ్లూ కలకండపలుకులూ
సమర్పించానతనికి
నా గుండెను దోచుకున్నాడు, నేను మోసపోయాను.
అతను వెళ్ళిపోయాడు,
నలుగురిలో నవ్వులపాలయాను.

నా స్నేహితులముందే చిన్నబుచ్చాడు నన్ను
సిగ్గుతో చిమిడిపోయాను
కాని రగులుతూనే ఉంది ఇంకా, నాలో ప్రేమజ్వాల
ఈ బాధ చెప్పుకోడానికి ఎవరున్నారు నాకు ?

వేకువవేళనే మేల్కొని నేను
అన్వేషిస్తాను నా ప్రియుడికోసం
గుట్టలమీదా ఎత్తయిన కొండలమీదా
ఎదురుచూస్తుంటాను అతని రాకకోసం
రాడా ప్రియుడు నా కోసం ?

2. ప్రియుడికోసం నింపిఉంచాను మధుపాత్రలు
వెళ్ళ, అతన్ని ఎలుగెత్తిపిలు !
కొండల్లో, కోనల్లో పచ్చపచ్చని మైదానాల్లో
సురిమెత్తని తంపులనే పంపా నతనికోసం.

లేడిలా తిరుగుతాడతడు దూరంగా ఎక్కడో
నా బాధ నన్ను పడమని వదిలేసి ఇక్కడ.
వెళ్ళు, అతన్ని ఎలుగెత్తి పిలు !

పళ్ళాలలో తీర్చి పెట్టాను తీపిరొట్టెలు
చాలా, రకరకాలవి.
మనందరినీ సమ్మోహపరుస్తుంది ప్రేమ
ఎలా భరించేది నేనీ వేదన ?
స్వేచ్ఛ పొందేది ఎలా ?
వెళ్ళు, అతన్ని ఎలుగెత్తి పిలు !

3. నా పడుచుతనం కలల్ని పంచుకొన్నవాడా,
ఓ నా ప్రియుడా! యౌవనసహచరుడా,
అర్పిస్తానివిగో నీ పాదపద్మాల దగ్గర
ఈ నా కంటి పాపలనే !

చిన్నతనపు అమాయకత్వంలో నేను
అల్పమైనవాటితో ఆటలాడుకొన్నాను
నా పడుచుతనం విలువను తెలుసుకోలేదు.
కాని పరితపిస్తున్నానిప్పుడు
నా ప్రియుడికోసం,
నా పడుచుతనం కలల్ని పంచుకున్నవాడికోసం.

పైన తిరుగుతుంటావు నువ్వు - కోకిలలా
కొండల్లో పడి అలా పోతూ
చెదిరిపోతున్నదిప్పుడు నా గుండె, ఇక నేను
మోసపోయాను ప్రేమను నమ్ముకొని.

తలుపుకో ఒకసారి ముదురెరుపు పువ్వును.
పిల్లనగ్రోవిని, తుళ్ళిపడే సెలయేటిని
ఇదే సమయం, నీ కోసం నేనెదురు చూసేది
రావామరి నువ్వు, ఈ ముదురెరుపు పువ్వులన్నీ
పుష్పించే ఋతువు వచ్చినప్పుడు ?

## 5. 'లోల్ గీతికలు'

(కర్తృత్వం తెలియదు)

1. వసంతమా, నవవసంతమా !
హాయిగా వీస్తోంది గాలి
అంతంకానీ దుఃఖాల్ని,

రా, పోగుజెయ్యి
ఊదావన్నెగల పూలు, రంగురంగుల పూలు
వసంతమా, నవవసంతమా !

మల్లెపువ్వు తెల్లగులాబితో అంటున్నది,
"నేను వెల్లబారిపోయా"నని.
గసగసాల మొక్క తన గాట్లు చూపిస్తోంది
"సోనాపోష్" గర్వంగాఉంది, ఆనందంగా
వస్తోంది, పోతోంది "డెయిజీ"
మళ్లీవచ్చి తిరిగిపోతూ ఉంది,
ప్రేమగా నిమురుతూ మమ్మల్ని
వసంతమా, నవవసంతమా !

2. పూలన్నీ వచ్చాయి రకరకాల రంగుల్లో
ఓ ప్రియా, ఎక్కడున్నావు నువ్వు?

నాజూకయిన గులాబులు వచ్చాయి;
ట్యూబ్‌రోజ్, బల్సామ్‌లేకాదు
సోనాపోష్‌కూడా.

వెలుగొందుతున్నాయి, సుగంధబంధురమైన ఈ రాత్రివేళ
వికసిస్తున్నాయి కోమలంగా, లార్క్‌స్పర్లు, హయాసింత్‌లు
అయినా నువ్వెక్కడున్నావు ?

3. కారణంలేదా నేను దుఃఖించడానికి ?
మన్నించరాదా నామనవి నతడు,
కొండలు కోనలు ఆమనితో అందగించినప్పుడు,
అంతటా బాదంపూలు విచ్చుకొంటున్నప్పుడు ?

4. నేను పిచ్చెత్తి పోతాను, ఆ పడుచుతనం రోజులు
తలుచుకుంటూ ఉన్నప్పుడు
ఎంత నిజమైన ప్రేమికురాలో ఈ తుమ్మెద,
వసంతంలో ఉద్యానవనాలు విలసిల్లుతున్నప్పుడు
సాగిస్తుంది సంచారం
పిల్చుకొంటుంది తేనెలు మళ్ళీమళ్ళీ అదేపనిగా
రెక్కల్లో సత్తువ ఉడిగేదాకా, నేల కూలేదాకా.

5. మొగ్గతొడిగిన అప్సరసను నేను, అప్పుడే
చందన తైలంలో స్నానమాడానో లేదో,
వెళ్ళిపోయాడు నా ప్రియుడు నన్ను వదిలి,

అనుకున్నప్పుడు నేను
అలికిడి లేకుండా అతన్ని వెదికి
పూలగుత్తులతో అలంకరించాలని,
అతని కిరీటాన్ని
కాని వికసించిందో లేదో ఒక్క పువ్వు,
నా హృదయమనే ఉద్యానంలో
వెళ్ళిపోయాడు నా ప్రియుడు, నన్ను వదిలి.

6. రామధన్ ముగుస్తుంది రేపు
కాని నాకు పండుగ లేదు,
ప్రియుడు నాదరిని లేకుండినప్పుడు.
పండుగ పాటించ జాలినవాడు
ప్రియుడైనవాడొక్కడే.

ఎందుకు బతికుండాలి నేను,
నన్నెన్నడూ తలవనప్పుడతడు,
నా కే ఆశా కలిగించనప్పుడు ?
వస్తే రావచ్చు పండుగ —
నా కోసమెలా వస్తుందది ?

నా గుండెలో దాగిన ఒకమంట
దహించిపారేస్తోంది ప్రేమాగ్నికుండంలో

మసిగా, నుసిగా మారుస్తూ
నాకేల ఇంక
ఈ పండుగ విందు ?

మంచులా కరిగించింది ప్రేమ నన్ను
ఉరకలెత్తించింది కొండవాగుల్లా
నిర్విరామంగా, వేసవి సెలయేళ్ళలా
సాగిపోతాను నిర్విరామంగా.

7. పూలతో నిండుతున్నాయి దూరాన పచ్చనిబయళ్ళు
ఆలకించలేదా నామొర నువ్వు ?
కొండకొలనుల్లో వికసిస్తున్నాయి పూలు
రా, పర్వత మైదానాల్లోకి పోదాంపద.
దూరాన అడవుల్లో లిలాక్‌లు పుష్పిస్తున్నాయి
ఆలకించనేలేదా నామొర నువ్వు ?

8. నా ప్రియా, నా మల్లెపూవా, నా మల్లెపూవా,
పరితపిస్తున్నాను నీకోసం,

రావోయి, రా,
కంటి కవుపడు,
పరితపిస్తున్నాను నీకోసం.

పడుచుప్రాయాన నిన్నే నమ్ముకొని ఉన్నాను,
వమ్ము చేస్తావెందుకు ఆ నమ్మకాన్నిప్పుడు ?
ఓ ప్రియా, నా ప్రియా,
పరితపిస్తున్నాను నీకోసం.

9. ఒకసారి రాగిగా మారుతూ
ఒకసారి కంచుగా మారుతూ
ఎంత అస్థిరుడతడు !

తను చేసిన బాసలు నిలుపుకోడు
వట్టి చంచలుడతడు,
పడనే కూడదు ప్రేమలో
అలాంటివాడు.

అతన్నే అనుసరించాను తల పండబారే వరకు,
ఎవరింటికో వెళ్ళి ఉంటాడు ఈ వేళప్పుడతడు,
వెయ్యిగుళ్ల పూజారి,
వట్టి నయవంచకుడు !
చీకటిలా నల్లనివి ముంగురులతనివి
ఉదయంలా తెల్లనిది వెలుగొందే ముఖమతనిది
కాని, చేసిన బాసలు నిలుపుకోడతడు
తానే ఉల్లంఘిస్తాడు
విశ్వాసఘాతకుడు !

10. నా ముంగిట్లో అడుగుపెట్టి, ప్రేమ
చుట్టూకలయజూసి వెళ్ళిపోయింది;
ఒక్క క్షణంలో నిష్క్రమించాడతడు,
మళ్ళీ ఇటు రావడమంటూ ఉంటే
నిలబెట్టి అడుగుతాను నేను :
"ఏం? అంత అహంకరించి ఉన్నావెందుకు?
అంత నిర్దయగా ఉన్నావెందుకు ?
వస్తావులే నువ్వు, కాని ఇక్కడ నిలవవు
ఆదరాబాదరాగా వస్తావు,
తొందరగానే వెళ్ళిపోతావు."

11. పద్మసదృశమైన ఆతని శరీరంమీది స్వేదబిందువులు
మింట మెరిసే చుక్కల్లా చంద్రుడిలా వెలుగుతుంటాయి

అతడే నా చెంత చేరితే ఎంత బాగుండు,
నా కంఠంలో ఒక మాలికలా,
వెచ్చని రొమ్మును విడవటం ఇష్టంలేనిదాని మాదిరిగా.
అతనితో వినోదించాలని అభిలషిస్తాను
కాని నన్ను చూసి బొమముడివేస్తాడతడు
నాలో అవయవం ప్రతి ఒక్కటీ భయంతో వణికిపోతుంది.

12. చిలక తన జంటకోసం వచ్చినట్లు
రాడా నా ప్రియుడు నాదరికి ?
చిలకకన్నె ప్రియునికోసం తపించడం చూశాను
పాపీ రొమ్ముమీద నెత్తురుపుగాయం చూశాను
పావురం పడుచు విరహస్వరం విన్నాను
ఆ పావురం వెలవెలబాటు ప్రవేశించింది నాలో
ఆ రాచిలక తన జంటకోసం రాదా
నా ప్రియుడు నాదరికి రాడా ?

13. రా ప్రియా, కొంతసేపు వినోదిద్దాం
పడుచుతనం సుతారంగా తేలిపోతుంటుంది.
చిలిపిఅల్లరి చేయడం ఇష్టం దానికి
పడుచుతనమన్నది విచ్చుకుంటున్న మల్లెపువ్వు
పచ్చగా, మెత్తగా సారభరితమైనది.
వయసన్నది గుచ్చుకొనే ముళ్ళపొద
ఎండి, పెళుసయి, నిండా ముళ్లున్నదిక్కి
శరత్తులో మల్లెపువ్వు ముకుళిస్తుంది
ఎండిపోయి చీమలపుట్టగా మారుతుంది
పాపం ! అందమైన ఆ మల్లెపువ్వు
మధుర వసంతంలోనే ఇరుక్కుపోయింది.
ముండ్లతీగెలమధ్య.
రా, ప్రియా, కొంతసేపు వినోదిద్దాంరా.

14, ఓ తుమ్మెదరేడా, వినలేదా నువ్వు,
వనాలన్నీ పుష్పించాయని ?
ఓ ప్రియా, వినలేదా నువ్వు,
తీయని మనసుల కన్నెలకిప్పుడు ఎడబాటులు లేవని ?
చలికాలపు విషాదాన్ని తొలగించినవాళ్లు
ఆమనికారున ఆనందాలకై ఎదురుచూస్తున్నారు ;

టోసా ఉన్ని ఏకుతున్నారు వాళ్లు
సింగిణిరంగులదారం వడుకుతున్నారువాళ్లు.

15. పుట్టింటనే పుష్పిస్తున్నాయి పూలు
కాని రానేరావు నువ్వింకా; నా కనిపిస్తోంది,
నేనొక శాపగ్రస్తురాలినని, ఒంటరిదాన్నని
నలుగురిలో నవ్వుల పాలవుతున్నదాన్నని,
నా నొసటనున్న విధితో పోరాడి ఓడిపోయాను;
విధిలిఖితాన్ని ఎదిర్చి గెలిచే వాళ్లెవరు ?
అయ్యో, ఇంకా ఈ విధి ఏమి వ్రాసిపెట్టిందో నాకు ?
పుట్టింటనే పుష్పిస్తోంది మల్లెపువ్వు
అయినా రావు నువ్వింకా, వ్యర్థంగా ఎదురుచూస్తున్నాను.

16. చెప్పు, మిత్రమా, విధి నా వేపు చిరునవ్వెన్నడు చిందిస్తుందని ?
ఎన్నడు వస్తాడు ప్రియుడు నాదరికి ?
ఎంతోకాలం ఓర్మివహించి కాచుకొని ఉన్నాను
నా గుండె మొద్దుబారింది, ఆశ అంతరించింది.

తీయనైనది ప్రేమకాండ
నగలతో, అందాలతో అలంకరిస్తాను నా ప్రియుణ్ణి
చేతులకు గోరింటరంగు వేస్తాను
పరిమళభరితమైన ఒక్కముద్దుతో మైపూత పూస్తాను
బంగారు కలశాల్లో మధువు నందిస్తాను.

ఆవిధంగా నాహృదయపద్మం
నీలిమలీనే ప్రేమసరసిలో వికసిస్తుంది
చెప్పు, మిత్రమా, విధినావేపు
చిరునవ్వెన్నడు చిందిస్తుంది?

## 6. ఫర్హాద్ మరణం

మహమ్మద్‌గనీ(మరణం 1855)

1. షిరీన్ ఫర్హాద్‌ను కాదనలేదని ఖుస్రోకు రూఢిఅయినప్పుడు
ఫర్హాద్ కొండ పక్కకాలవ తవ్వేశాడని తెలిసినప్పుడు,
తన మంత్రుల్ని పిలిచి ఇలా అడిగాడని చెబుతారు,
"ఏం చెయ్యాలిప్పుడు నేను ?

షిరీన్‌తో అన్నమాట నిలబెట్టుకోవాలి ;
మీకు తెలుసు, ఫర్హాద్‌కోసం తను పరితపిస్తోందని

నేను చచ్చిపోతాను, ఆమె లేకపోతే, బతకనే లేను.
ఫర్హాద్ కోసం, నన్ను విడిచేస్తే తను
అంతకన్నా మంచిదికాదది నాకు." తెలివైన మంత్రులు
సలహా చెప్పారిలాగ, "మనం ప్రకటన చేద్దాం,
షిరీన్ చచ్చిపోయిందని." తెలివైనదాన్ని ఒక ముసలిదాన్ని
వయస్సు బరువుతో నడుము రెండై వంగినదాన్ని
కనుక్కున్నారు వాళ్ళు, పంపించారు ఫర్హాద్ దగ్గరికి, ఆ
వార్త వెల్లడించడానికి, షిరీన్ పోయిందన్న కబురును
శకించకుండా ఉండేందుకు,
అది ఫర్హాద్‌ను సమీపిస్తూనే బుడిబుడి దీర్ఘాలు తీసింది.
"ఓయి వెర్రిప్రేమికుడా, చచ్చిపోయింది నీ షిరీన్
తొందరగా వెళ్ళు, కడసారి చూపు దక్కించుకో"
"అయ్యో !" అంటూ గోడున దుఃఖించాడు ఫర్హాద్,
"ఇక చూడలేనా ? దేవతలాటి ప్రేయసి ముఖాన్ని,
ఇంకలేదా ? లేనేలేదా !

నా విధే నాకు ఎదురు తిరిగింది. ఇంకా మంచి రోజులొస్తాయని
ఆశించినప్పుడా ఇది జరిగింది !
కొండగుండా సొరంగంతవ్వి మళ్ళించిన నీళ్ళు
కారుతూ పారుతున్నాయి. అలాగే ఉంది వా అదృష్టం
నోటి దగ్గరి ముద్ద చేతిలోంచి జారిపోయింది.
అయ్యో, నాకు కీడు తలపెట్టి,విడదీసిన వారెవరు మమ్మల్ని ?"
అని వాపోతూ అతడు పైకెత్తి తన బాడిత, రెండు ముక్కలుగా
తల బద్దలకొట్టుకున్నాడు, చనిపోతూ ఇలా అరిచాడు :
"దేవుడా, నన్ను తీసుకుపో, నా షిరీన్ ఉన్నచోటికి."

ఆ వార్త ఆమెకు అందింది, వీలయినంత తొందరగా,
తొందరగానే వచ్చిందక్కడికి, తన ప్రియుణ్ణి చూద్దానికని ;
ఆమె ముఖంలో ధారగా స్రవించింది కన్నీరు, ఎడతెరిపిలేకుండా
దుమ్ములో పడిఉన్న ఫర్హాద్‌ను ఎలుగెత్తి పిలిచింది షిరీన్,
నేలకు కూల్చిన అందమైన సైప్రస్ వృక్షంలాంటి వాణ్ణి.
అతని గులాబి చెక్కిళ్ళనిండా నెత్తురు పులుముకున్నది
చికిత్సకు అలవికానంతగా గాయపడింది అతని తల. అప్పుడామె
మెత్తని తన ఒడిలో అతని తలపెట్టుకొని దుఃఖించింది.

"చెప్పు ఫర్హాద్, నా అమరప్రేమికుడా, ఈ దారుణమరణం
ఎలా వచ్చింది నీకు చెప్పు! చావుదగ్గరవుతున్న ఆ చీకటిక్షణంలో
షర్బత్తు అడిగింది నువ్వు ఎవర్ని ? ఒకసారి లే,
నేనెంత బాధతో విలపిస్తున్నానో విను.
నువ్వు పోయిన తరవాత నేనిక ప్రాణాలతో ఉండలేను.
నువ్వులేకుండా ఎలా గడపగలను, ఈ రాత్రులూ పగళ్ళూ ?
ఎంత సులువుగా మోసపోయావు ఫర్హాద్, అమాయక ప్రేమికుడా!
అయినా నా మాట నమ్ము, షిరీన్ ఎన్నటికీ నీదేనని,
నీ ఒక్కడిదేనని.

## 7. మంచిభార్య - చెడ్డభార్య

**వలీఉల్లామోటూ** (మరణం : 1885)

**ఉత్తమ** ఇల్లాలే భర్తకు సుఖం, శాంతి, విశ్రాంతి.
ఆమె అతనికొక చక్కని ఉద్యానవనం వంటిది.
కళ్ళకు విందు చేస్తుంది, ఆనందం చేకూరుస్తుంది.
ఓర్పు, విధేయత ఆమెలో సహజ గుణాలు,
అతని సేవ కెప్పుడూ సంసిద్ధంగానే ఉంటుందామె.

తన తల్లిగారింటికి ఆహ్వానిస్తే ఎప్పుడైనా అతన్ని,
అక్కడతనికి జరిగేవన్నీ రాజమర్యాదలు,
రాజ్యపౌరులు ప్రభువుకిచ్చే మాదిరి స్వాగతం లభిస్తుందతనికి.
అతని భార్య అతని ఇంటికి పేరు తెస్తుంది.
లేమిలో, దుఃఖంలో అతని కామె
చినార్ వృక్షంలా నిలుస్తుంది.
నీడనిస్తూ గూడునిస్తూ.

ఇల్లాలు చెడ్డదయితే ఇందుకు భిన్నంగా ఉంటుంది పరిస్థితి.
తిరుగుబాటురకంగా, పెడసరంగా, మొండిఘటంలా.
విధేయుడై ఉంటాడు మగడు ఆమెకు
అయినా హఠం చేస్తుంది,అతడు చెప్పే అనునయాలు చెవిని పెట్టదు.
అతని ప్రతిష్ఠ పాడుచేస్తుంది, చెడ్డపేరు తెస్తుంది.
ఉద్రేకాలతో, బాధలతో, వాదాలతో అతని ఇల్లు
పోట్లాటకూ, తగవులకూ నిలయమవుతుంది,

కోర్టు సమన్లకు జవాబు చెప్పుకోవాలతడు
[విడాకుల దావాలో శరణం రావాలంటుందామె]
లేదా మగడిమీద ఆమె చేసిన ఫిర్యాదులకు
కొత్వాలు కతడు సంజాయిషీ చెప్పుకోవాలి.
"రా రా బయటికి, నీచుడా !" అని పిలుస్తూ ఆమె
"కొత్వాలుకేం చెప్తావో సంజాయిషీ చెప్పుకో"
అంటుంది ధాష్టికంగా
అల్లాటి పెండ్లామే అతని పాలిటి నియంత.
దేంట్లోనో లోపం వెదుకుతూనే ఉంటుంది.
ఏ లోటూ లేకపోయినా
నవ్వులపాలు చేస్తుంది కుటుంబాన్ని ; భౌ భౌ మంటూ ఎప్పుడూ
మొరుగుతూనే ఉంటుంది, కాట్ల కుక్క అవుతుంది;
లేదా సంగ్రహిస్తూ ఉంటుంది తిండిగింజలు, గాదెకింది పందికొక్కులా
లేదా రోగం వచ్చినట్లు నటిస్తుంది, వృథాగా డబ్బు ఖర్చుచేయిస్తూ;
పెద్ద కందిరీగల దండులా కుడుతూ ఉంటుంది, బాధిస్తూనే ఉంటుంది;
లేదా, ఏడుపు మొదలు పెడుతుంది, అవసరం వచ్చినప్పుడు,
చల్లగా జారుకుంటుంది లేదా మెల్లగా మాటాడుతుంది;
ఏ రకంగానైనా తాననుకున్నది సాధించడానికని.

## 8. బాలకృష్ణుడు

1. చీకటిలోంచి వెలుగు వెలువడింది నువ్వుపుట్టినప్పుడు
జయ జయ దేవకీ నందనా, జయ జయ !
ధర్మానికున్న అనేక రూపాల్లో సాక్షీభూతుడివై
బలంలో ఆదిశక్తిలా దివ్యుడవైన స్వామివినీవు
సకల జీవుల్లో వసించే ప్రాణానికి ప్రభువువు నీవే
మూలపదార్థంలో, మానవాత్మలో
అంతటా నిండినవాడివి, శాశ్వత చైతన్యమూర్తివి
శక్తివినీవే, తేజంనీవే, పరిపూర్ణుడవూ పరిశుద్ధుడవూ నీవే
జ్ఞానపూర్ణుడివి, జాగరూకుడివి, శుభుడివి, ఉత్తముడివి
సర్వనిధి నిధానం నీవే నీవే-అనిర్వచనీయ, అవర్ణనీయ
నిరాకారుణ్ణి ఎలా తెలుసుకోగలరీ మానవులు ?

ఎప్పుడూ చిరునవ్వులు చిందించే వసుదేవనందనుడివి నీవు,
ఎన్నో అద్భుతాలు చూశాడాయన, కాని అర్థం చేసుకోనేలేదు
నీ దివ్యలీలలు అందరూ అనుకోడానికి మాత్రం నువ్వు
గోకులంలో నందగోపుడి గారాబు బిడ్డవయినావు.
పైపైకి లేచిన యమునా తరంగాలు, అనుబంధాలన్నిటికీ అతీతంగా,
నువ్వు సాగుతుంటే, నీ పాదాల్ని ఎలా తాకగలిగాయి ?
దేశకాలాల్ని అధిగమించిన నువ్వు నీ ఆత్మలోనుంచే వెలువడ్డావు.
ఊహకందని విధంగా.

పూలుకురిపించింది యశోద నీమీద
ఒడిలో పెట్టుకొని లాలించారు, ఇరుగుపొరుగులందరూ నిన్ను,
ఒకరితరవాత ఒకరుగా. కృష్ణుడని పేరుపెట్టారు నీకు,
నల్లనివాడవని, అందరి ప్రేమనూ చూరగొనే నీకు.
వెన్నమీగడలు హరించేవాడా, ఓ పాలదొంగా !
కొడుకును కన్నందుకు అభినందించ వచ్చారు గోపికలామెను
"పదికాలాలపాటు చల్లగా బతుకు మాతండ్రీ !" అన్నారు వాళ్లు
ఇరుగు పొరుగులవాళ్లు, స్నేహితులు, కన్నెలు
అందరూ ఆనందించారు నిన్నుచూసి.

పాలు కాజేసినందుకు తిట్టింది యశోద నిన్ను
లోకాలన్నిటికీ అధినాథుడివి నువ్వేనని ఎరగక, "నోరుతెరు !
అల్లరి పిల్లాడా !" అని అరిచింది. అప్పుడు నువ్వు నోరుతెరిస్తే
కనబడిందేమిటి ? విశాల విశ్వమంతా అందులోనే అవుపడింది.
ఒద్దికగాఉండే తెలివైన పిల్లవాడు వెళ్ళాడు సొక్కుంటూ,

పాలు దొంగిలించాలని, అప్పుడన్నివేపులనుంచీ వచ్చింది కలకలం
గొల్లపడుచులందరూ ఫిర్యాదు చేశారు: "నా కుండలు
పగలగొట్టాడు వాడు, నావీను, నా వీను, నావీను, నావికూడా"
అంటూ ఏడ్చారువాళ్లు
యశోదా ఏడ్చిందప్పుడు: "ఎంత బాధపెడుతున్నావురా,
నన్ను చిన్నబుచ్చుతున్నావు, తలవంపులు తెస్తున్నావు నలుగురిలో
ఆబగొట్టు పిల్లాడా, ఆకలిగొట్టు పిల్లడా !"
అంటూ అరిచింది యశోద. నువు పారిపోయావు
నిన్ను వెంబడించిందామె, చేతిలో ఒక తాడుపట్టుకొని
"ఈ సారి వీణ్ణి కట్టిపడేస్తాను తాడుతో" అనుకుంది పాపం,

ఏ కళాకారుడూ చిత్రించలేనివాడు, జ్ఞానం ధ్యానం బంధించలేనివాడు
పరిశుద్ధం, దయార్ద్రం అయిన హృదయంతో మాత్రమే బంధించ వీలైనవాడు.
చిన్న ఆవరణలో చుట్టూ పరుగులు తీస్తూ, చిక్కకుండా తప్పించుకున్నాడు
అలిసిపోయి, శోషవచ్చి యశోద
వృథాగా ఇంక వెంటాడటం మానుకుంది. కరిగింది కొడుకు మనసు,
భక్తుల విషయంలో దైవంలాగే, తనకు తానేవచ్చి పట్టుబడ్డాడు.
ఆ తాడు వాడి నడుము చుట్టూ కట్టింది; కాని అది చిన్నదే అయింది చాలా
తాడుకు తాడు ముడివేస్తూ లెక్కలేనన్ని తాళ్ళు కలిపి కట్టింది
అన్నికలిపినాకూడా, అమేయమైన అనంత లోకాల్ని
మెడలో కౌస్తుభహారాలుగా ధరించినవాడికి
చాలా చిన్నదే అయింది.
నీ అద్భుతలీలల్ని వివరించ గలవారెవ్వరు ? అంతర్వ్యాప్తమైన
చైతన్యమూర్తిని నిజానికి వర్ణించగల వారెవ్వరు ?
జ్ఞానేంద్రియ వాతాయనంగుండా బయటకిచూస్తూ
ఆపదలుకొని తెచ్చుకొంటారు, బతుకులో చావును అనుభవించడానికి.

## 9. ఆత్మసాక్షాత్కారం

పరమానంద్ (1791-1885)

దేవుడిలో ఐక్యం కావడానికి యత్నించడమంటే
అన్నిటినీ ఎదురొడ్డి తెగించడం, బతుకులోనే చావును అనుభవించడం,
మళ్ళీ పునర్జన్మ పొందడం, లోపల ఇంకా ఉన్నతమైన పరమాత్మలో-
దేహమనే తొమ్మిది కిటికీల భవనంలో
స్వేచ్ఛగా సంచరిస్తూ ఉంటుంది మనస్సు, బయటికే మలుపుతుంది చూపును,
ఒకసారి ఒక కిటికీలోంచి, మరోసారి మరో కిటికీలోంచి
చూస్తూ, దారి తప్పి చరిస్తూ ఉంటుంది, బాహ్యప్రపంచం
ఎరచూపే భోగాలవైపు-
ఆ కిటికీలన్నీ మూసెయ్యి గట్టిగా
లోపలే నిలిపిఉంచు మనస్సును, లోపలికి తిప్పుకో చూపును
లోపలే ఉన్న పరిమాత్మతో మాటలు కలుపు
సూక్ష్మమై సర్వత్ర వ్యాపించిన చిత్తు అది, అంతటానెలకొని ఉండేదది.
అన్నీ జీవించేది, చరించేది దానియనే.
అక్కడ వెలుగుతూ ఉంటాడు చూడు
స్వయంప్రకాశమానుడైన సూర్యుడు, స్వయంసంజనితమైనది అతని కాంతి,

ఉదయాస్తమయాలు లేనివాడతడు, నిత్యుడు, అక్షీణుడు.
అప్పుడు వీస్తుంది ప్రేమవాయువు, అంతరంగాన మూలమూలకూ
నాల్కలు సాచిన జ్వాలను వెలిగిస్తూ, అణువణువునా నీ దేహంలో;
అన్నిటినీ రగిలిస్తుందది. సునిశితమైన జ్వాల స్పర్శతో; అపుడిక
తాను వెలిగినచోటల్లా ప్రేమ జ్వాలను పెంపొందిస్తుంది,
మంటలో పోసిన చమురు మాదిరిగా.
మండిన కొద్దీ అది, జ్వాల ఇంకా జ్వాజ్వల్యమానమవుతుంది
అహంతలన్నింటినీ కాల్చి పారేస్తుంది, 'అతడు' తప్ప
మరేమీ మిగలనంతవరకు
అంతరాంతరాల్లోని ఈ గర్భాలయాన్ని చూసిన తరవాత
లోపల తలుపులు మూసుకు ఉండకు, ఎందుచేతనంటే
బయట అంతటా నిండి ఉన్నాడు భగవంతుడు.
తెరిచెయ్, ఇంద్రియద్వారాల్ని అన్నిటినీ
పోనియ్, మనస్సును దాని ఇష్టం వచ్చిన చోటికి
పోనేలేదది భగవంతుడు లేనిచోటికంటూ.

## 10. నొష్లాబ్ విలాపం

తెల్లవారింది, బుల్‌బుల్ పిట్టలు కూస్తున్నాయి
చాలాసేపటినుంచి, తీయని నిద్రలోంచి మేల్కొలుపుతూ,
నిద్రాముద్రితమైన నా కళ్ళను తెరిపిస్తూ,
వసంత కాలంలో ఒకనాటి చల్లని ఉదయం
కొద్దిగా పొద్దెక్కిన తరవాత నేననుకున్నాను,
నా ప్రియుని సరసనే ఉన్నానని,
కాని చూసిచూసి తెలుసుకున్నాను,
నా ఉద్యానవనం మాయమయిందనీ, నా ప్రియుడు కనుమరుగైనాడనీ
గతరాత్రి అనుభవించిన వైభోగంకూడా అదృశ్యమయిందనీ.
నా వేకువ అస్తమించింది, నా ఆనందం విషాదమయింది.
అతని జాడలేవీ నా కవుపించలేదు.
వినోదించే పుష్పాలూ కనిపించలేదు; వాటికి మారుగా
అన్నీ ముండ్లు, నా గుండెను గాయపరిచేందుకు;
కనుక్కొనే నిధిలేదు. ఉన్నదల్లా, దానిబదులొక
భయంకరమైన డ్రాగన్. ఇక ఏమాత్రం నమ్మలేక నా కండ్లను,

విలపించాను: అయ్యో నే కన్నది
నిన్నరాత్రి నేనూ నా ప్రియుడూ ఆనందాతిరేకంలో పవళించి ఉన్నట్టు
కన్నది వట్టి కలయేనా ? ఇంకిప్పుడు
దేహతాపంలో, ఆత్మఖేదంలో ఎలుగెత్తి పిలిచానతన్ని
"విశ్వాసరహితుడవైనా, నిజమైన నా ప్రేమికుడా,
మధురమూర్తివే అయినా ఈ వియోగ దుఃఖాన్ని భరించమని
విడిచి వెళ్ళావా నన్ను ? కాని కాదు,
నువ్వు వెళ్ళిపోవు, నన్నిలా వేదన అనుభవించమని
నా ప్రియుణి, నాకు నిజమైన వాణ్ణి చూసే ఆశ
వదులుకోమని, నన్ను విడిచి వెళ్ళవు నువ్వు
నువ్వు లేనిదే కునుకు రాదు నా కంటికి
ఈ వెచ్చదనం, చల్లదనం నన్ను ఓకొట్టలేవు, విశ్రాంతినివ్వలేవు.
ఓ నా ముత్యమా ! ఎక్కడ దాక్కొని ఉన్నావు నువ్వు
అయ్యో, నువ్వెక్కడ ? నా విలాపాలు సోకవు నీ చెవులకు
ఓ వేకువ గాలీ, నా మనవి నతని దరికి తీసుకుపోవా ?
మర్యాదగా, మధురస్వనాలతో అతని గుండెలో నాకై
ప్రేమను మేల్కొలుపు. పడుచుతనపు పరువంలో ఉన్న నేను
వెలవెలపోతున్నాను, చలికాలం చేరువవుతుంటే పచ్చగులాబిలా.
పొయ్యిమీది పెనంలో చిలకకన్నె స్థితి ఎలా ఉంటుంది ?
తోషా-పష్మీనా శాలువను చిమ్మెటలు కొట్టేస్తే ఏమవుతుంది ?
అలా ఉందని తెలుసుకో నా దీనస్థితిని,
నా ప్రియుడు దూరాన ఉంటే బతకలేనని."

## 11. రైతు - పురోహితుడు

**మహ్మూల్‌షా** [1820-1876]

ఆయన వస్తూండడం చూసి బయటికి వచ్చారు
రైతూ అతని భార్యా, ఆయన్ను కలుసుకోడానికి.
"దయచేసి దిగండి, లోపలికి వచ్చి విశ్రమించండి
కొంచెంసేపు. మీ పాదాలు ఒత్తనివ్వండి, చూపించనివ్వండి
మీ మీద మాకున్న గౌరవం. నిన్న రాత్రే మేము
అనుకున్నాం, మీరు కనిపించి చాలాకాలమయిందని
మా పిల్లల్ని సైతం మీకు బందీలుగా అర్పిస్తామని

మీకు వేరే చెప్పనక్కరలేదు" అన్నారు వాళ్లు.
కాని దగ్గరికొస్తుండగా ఆ పురోహితుడు
రైతూ అతని ఇల్లాలూ పారిపోయారు పసులకొట్టంలోకి
తాము దాక్కోడానికి, ఆయన వస్తున్నాడో లేదో
చూడమని [అక్కడికి తాము చూడనట్టు] పిల్లలకి చెప్పడానికి
ఆయన రాగానే ఇలా చెప్పారు పిల్లలు :
"తిండి గింజలకోసం వెళ్ళాడు నాన్న
కట్టెముక్కలకోసం అడవికి వెళ్ళింది అమ్మ.
తినడానికి తిండిలేదు, ఆరురోజులుగా మాకు
నాన్న కోరుకున్నాడు దేవుణ్ణి, మిమ్మల్ని పంపమని
పాతబట్టలేవన్నా మీ దగ్గర అడుక్కోడానికని
ఒళ్లు కప్పుకోడానికీ, చలికి తట్టుకోడానికీ, అని."
ఇది చెప్పగానే ఆశవదులుకొని ఆ పురోహితుడు
తన శాలువా వదులుకోడానికా ఇంతదూరం వచ్చిందని
విచారించి, వెళ్ళిపోవడం మంచిదనుకున్నాడు, అక్కడినుంచి
దారిలో ఆ రైతు కనిపించకుండా ఉంటే
తా నదృష్టవంతుణ్ణే అనుకున్నాడు.

## 12. సామ్, మకోకాల్‌ల పోట్లాట

**లఛ్మన్ రాయినా** (మరణం : 1897)

అప్పుడు మకోకాల్ దూసుకువచ్చాడు, పిచ్చికోపంతో
కనుబొమలు ముడిచి భయంకరంగా గర్జించాడు
తళతళలాడే ఒకకత్తి, ఒకబల్లెం సామ్‌వేపు దూశాడు.
తల కాచుకొన్నప్పటికీ సామ్, వెంట్రుకవాసిలో తప్పింది దెబ్బ
అది పోయి అతని గుర్రం గురాబ్‌కు తగిలింది.
ఆ క్షణమే దాన్ని నేల గూల్చింది.
గుర్రం పోయిన సామ్, నేలమీదే నిల్చున్నాడు
కోపంతో రగులుతూ తన గద ఎత్తాడు, బలమంతా పుంజుకొని
గట్టిగా విసిరికొట్టాడు శత్రువెక్కిన ఏనుగువేపు,దాని తల బద్దలుకొట్టాడు.
కిందపడి చచ్చిపోయింది ఏనుగు ! కింద నేల అదిరిపోయింది.
ఇప్పుడిక సామ్‌తో సమాన స్థాయిలో ఉన్న మకోకాల్,
చావుదెబ్బలుకొట్టి, అప్రతిభుణ్ని చేసి, అవమానపరిచాడు సామ్‌ని
స్పర్థన దూసుకొనే వాళ్ళ ఆయుధాల విసురుకు గాలి మారుపలికింది;

యుద్ధనైపుణ్యంతో వాళ్ళు గొడ్డళ్ళతో, ఈటెలతో, గదలతో
పోరుకు తలపడ్డారు. కొట్లాడింది చాలాసేపే కాని సమఉజ్జీలనిపించు
కున్నారు ఇద్దరూ'
అప్పుడిక ఉండబట్టలేక మకోకాల్, పెద్ద పెడబొబ్బ పెట్టాడు,
అడవి ఎద్దు మాదిరిగా.
బాగా రెచ్చిపోయి సామ్, కొమ్ములుపట్టి మెలదిప్పి విరిచి పారేశాడు.
పెళుసైన చెట్టు కొమ్మల్ని విరిచినట్టుగా
అప్పుడు మకోకాల్, నరాల బలం నిండిన తన చేతుల్ని పైకిఎత్తాడు,
అతన్ని మొత్తడానికి కాని, కాని సామ్, ఒరలోంచి తన కత్తిదూసి
అతని రెక్క ఎముకను నరికిపారేశాడు. అప్పుడులేచి మకోకాల్,
రెండోచేత్తో సామ్ తల పట్టుకోబోయాడు కాని, అతనిచేతిని నరికేసి
నేలగూల్చేశాడు, వలలోపడ్డ కౌజుపిట్ట మాదిరిగా. మళ్ళీలేచాడు,
నోరు తెరిచాడు, కొరికిపారేద్దామన్నంత కసిగా; కాని సామ్
గదతో అతన్ని నేలగూల్చేశాడు. ప్రతి అవయవాన్నీ ఖండఖండాలుగా కొట్టాడు,
అతని రక్తం విరివిగా ప్రవహించింది, అతడు దుమ్ములో దొర్లిదొర్లి
కన్ను మూసేశాడు.

## 13. సూఫీ పద్యాలు

కర్తృత్వం తెలియదు

### 1

తనను తాను తెలుసుకున్న వాడు
మధుపాత్రలకూ ఆనందానికీ మూతలు తెరుస్తాడు
ఆనందాతి రేకంలో తనను తాను మరుస్తాడు
హిందువెవరో, ముసల్మానెవరో మరచిపోతాడు.

### 2

(కర్తృత్వం తెలియదు)

ప్రేమ దారి చూపించాలి
నన్ను నే నర్పించుకుంటాను దేవుడికి,
మరోరకంగా ఎలాకనిపిస్తుంది, ఆయన్ని చేరేదారి?
లోపలి చంద్రబింబాన్ని అన్వేషించి చూస్తాను
బయటి చంద్రబింబం చెప్పజాలదు, నా పండుగ ఎప్పుడో,
నేను ఈద్ పాటించేది, ఆ మార్మిక చంద్రుని చూసినప్పుడే
లోపలి నా దేవుణ్ణి కలుసుకున్నప్పుడే.

మోహకారకులు వినిపించే రాగాలు పలికించనునేను
ఎక్కడో దూరాన ఉన్న అడవుల్లోంచి ఛేదించుకొని వచ్చినది.
ఇక్కడ ఈ నేలలో చిల్లులు పడినది నా పిల్లనగ్రోవి
దాని విషాదస్వరాలే చెబుతాయి, అదెక్కడినుంచి వచ్చినదీ.
నేను పలికించను మోహకారకులు వినిపించే రాగాల్ని
నా దేవుని చేతిలో వేణువుగానే ఉంటాను
అపరిమితమైన అనురాగ రాగాల్నే నిశ్వసిస్తాను.

నమాసాహెబ్ [మరణం: 1880]

**3**

ఆశ్చర్యం, ఆశ్చర్యం!
దేవుడొక్కడే కావడం ఆశ్చర్యం
దేవుడే తప్ప వేరే దేవుడు లేడు.
దేవుడే అన్నీకావడం ఆశ్చర్యం
దేవుడు తప్ప మరేమీలేదు.
ఆశ్చర్యం ప్రత్యక్షమైనది లేకపోవడం
అందుకు సాక్షిగా ఉన్న నేను, లేనే లేను;
ప్రేయసీ ప్రియులు ఒక్కరే
ఉన్నతల్లా ప్రేమైక్యం.

ఆశ్చర్యం, మనిషి పుట్టినప్పుడు
ఎక్కడో దాక్కున్నాడు దేవుడు
ఆశ్చర్యం, మనం వస్తాం, పోతాం
జీవితం సాగుతూనే ఉంటుంది ఎప్పటికీ,
ఇక్కడ ఏదీ సత్యం కాదు
కాని ఎప్పటికీ ముగియని మార్పే.

**4**

వహాబ్ ఖార్ [మరణం: 1912]

ప్రేమ పలికింది, "ప్రియా, నేను సృష్టిస్తా" నని,
ఒక ఫలకం, ఒక కలం వచ్చాయి
దేవుని ఆజ్ఞను వ్రాసింది కలం
ఆనందంగా పాడవోయీ!

షేక్ నన్అన్ తన తావళంతో
రామనామం జపించాడు
తానొక భారతీయ కన్యను ప్రేమించాడు
విగ్రహాల్ని ఆరాధించాడు,
నిర్దిష్ట మార్గాన్ని అనుసరించాడు కాదు.
అయినా, తన ప్రేమను కనుక్కొన్నాడతడు
ఆనందంగా పాడవోయీ !

"నేనే సత్యం" అన్నాడు మన్సూర్
ప్రేమను తన హృదయంలోనే కనుక్కున్నాడు
ఆ రహస్యం చెప్పడం కష్టం
ఆనందంగా పాడవోయీ !

## 5

## అజీజ్ దర్వేష్ (మరణం: 1890)

ఊళ్ళో నీటిబుగ్గ దగ్గర పాడుతున్నారు దేవకన్యకలు
వినండోయి వినండి, పాటల్లో మేటిపాట.

సముద్రం లోతుగా ఉంది, ఒడ్డు దూరాన ఉంది
కుంటి గుడ్డీ కూర్చున్నారీ ఒడ్డున
చేతులు పిసుక్కుంటూ, నిరాశతో
గుడ్డివాళ్ళకు గురి ఏం కుదురుతుందని ?
వాళ్ళ విల్లమ్ములన్నీ వ్యర్థమైనవి.

తుపాను రేగిన ఈ సముద్రంలో, లెక్కలేనన్ని పడవలు
చెల్లాచెదురయాయి, కొన్ని మునుగుతూ కొన్ని తేలుతూ
నేను ఊగిసలాడాను నట్టనడి లోతుల్లో
ఒడ్డు చూడలేదు, దరిచేరే దారి కనబడలేదు
దారి చూపించు నాకు, నేనొక ఆగంతుకుణ్ణి,
నువ్వే నడిపించాలి నన్ను.

కడలి దాటేదారి కనబడింది నాకు
నన్ను నేనే ఒక వంతెనగా చేసుకున్నాను
సముద్రం వెడల్పును కొలుస్తూ పోయాను
అక్కడ కనుక్కున్నాను మరో ఒడ్డును,
"దేవునిలో లీనమైపోవడం".

కాని ఆవతలి ఒడ్డున నాకు
హిందువూ కనబడలేదు, ముసల్మానూ కనబడలేదు,

ఈ పిచ్చి అజీజు సత్యాన్ని చాటుతున్నాడు
తెలిసిన సాధువులకూ యోగులకూ
అందరూ ఒక్కటే, అంతా ప్రేమమయమే-
అన్నదే ఆ విగూఢ సత్యం

## 14. వత్సన్ (పాటలు)

రసూల్ మీర్ (మరణం : 1870)

### 1

నీమీది ప్రేమతో తొందరగా వచ్చాము
ఓ ప్రియా, నా ప్రియా !
ఈ విరహిణి ఇప్పటికీ నీవెనకనే వస్తోంది
ఓ ప్రియా, నా ప్రియా !

నీకు మనవిచేస్తాను, ప్రియా ఆగు,
నిన్ను ప్రార్థిస్తాను, నా మనవి ఆలకించు;
అలసట, ప్రయాణం బడలిక చూపించకు ప్రియా,
ఓ నా ప్రియా !

డస్సిపోయి వాడిపోయారు నీ ప్రియభామినులు
దారిపక్క పడిపోయారు;
నిద్రలో మునిగినవాళ్ళను మేల్కొలపకు
ఓ నా ప్రియా !

నీ పవిత్ర శిరోజాలకు రెండు పక్కలా
మధురమైన నీ ట్యూబ్‌రోజ్‌లు
అవి సొగసైన నీ వెన్నుగా ఎలా ఆయాయి?
ఓ నా ప్రియా !

ఎన్నో ప్రాణాలు తీసిన ఆ లేడికళ్ళు
సమ్మోహపరిచే మాయదారి కళ్ళు చూసి,
సిగ్గుపడిపారిపోయాయి లేళ్ళు అడవిలోకి.
ఓ నా ప్రియా !

నా హయాసింత్ పూలతోట బాగా పరిశీలించాను
రోజులకొద్దీ గడుపుతూ,
ప్రేమజ్వాల రగిలింది నాలో
ఓ నా ప్రియా !

2

తీయని వాసనగల మల్లెగుత్తులు గుదిగుచ్చాను
నా ప్రియా, నీ కోసమే.
మధురస్వనం చేసే బంగారుగాజులు తొడుక్కున్నాను
నా ప్రియా, నీ కోసమే.

పండుగవచ్చింది, ఎక్కడికి వెళ్లావు నువ్వు
కొత్తసుఖాల కోసం ?
అయ్యో, ఆగు కొంతసేపు, ఉపవాసాలు చేశాను
నా ప్రియా, నీ కోసమే.

ఎన్నోరాత్రులు నిరీక్షించాను నీ కోసం
ఎంతో పలవరించాను
అరుణ సంధ్యలో ప్రార్థనలు చేశాను
నా ప్రియా, నీకోసం.

## 15. లీలాగీతం

కృష్ణ రజ్దాన్ (మరణం : 1925)

రా చెలీ, చెయ్యీ చెయ్యీ కలిపి ఇద్దరం
గుంపులో చేరి నాట్య మాడదాం.
గోపీకృష్ణుడు నాట్యమాడటం మొదలైనప్పుడు
గడిచిపోయాయి ఆరునెలలు, ఏకరాత్రిలా,
ఒక్క ఏడాది ఒకే రోజులా, ఒక్కనెల ఒకగంటలా.

పడుచు ప్రాయంలోనే మనం
వీలయినంత ఎక్కువగా పండించుకుందాం జీవితాన్ని
(పడుచుతనం రోజులునిజంగా ఎంతగొప్పవి !)
వెయ్యియుగాలు గడిపేసేద్దాం, నాట్యమాడుతూనే.
మన అక్కచెల్లెళ్లు, తల్లులు, అత్తలతో
కలిసిపోయారు మనపిల్లలు, వాళ్ళను నిద్రపుచ్చారు

మనం పోయి నాట్యంలో చేరవద్దా ?
అతని దగ్గరికి మన దారి మనకు తెలుసు
తెరిచి ఉంచేద్దాం, తలుపులూ కిటికీలూ
పిచ్చివాళ్ళలా ముందుకు పోదాం
మన నాథుని కలుసుకోడానికి
అతడు లేనిదే సంపద దేనికి ?

అతని కోసం ఉవ్విళ్ళూరేది ఎవరు,
నాథులందరికీ అధినాథునికోసం ?
హృదయాలు దోచుకొని మత్తెక్కించే వాడికోసం ?
ప్రాణానికి ప్రాణంగా ఎవరు ప్రేమిస్తారు ?
బాధలెవరనుభవించారు, మనలా అతనికోసం ;
మనలా ఎవరెరుగుదురా నందలాల్‌ని ?
అతనికి కావద్దా మనం, అలంకారాలం ?

అయితే ప్రపంచాన్ని త్యజించడం దేనికి ?
మనకు కావలసిందల్లా దేవుడి ప్రేముడి
తులసిమాల తిప్పడం, కఠోరతపం చేయడం
అన్నీ అందుకే కదా.

మన అలవోక పలుకులే గొప్ప మాయమంత్రాలు
మన అలవోక చూపులే గాఢమైనధ్యానం
మన విందుకుడుపులే పవిత్రమైన ఉపవాసాలు.

మనం స్తంభించి దిగ్భ్రాంతుల మయాం
విన్నా, చూసినా అన్నీ అతన్నే
వ్యర్థమైన మన ఊహలన్నీ ముగిశాయి,

ఇటువంటి దివ్యానందమే నాశం చేస్తుంది దుఃఖాల్ని
కంటి కవుపడదిది అన్ని లోకాల్లోనూ
వాళ్ళు, స్వర్గంలోని వాళ్ళు, అసూయపడతారు మన్ని చూసి.

ఆనంద పరవశులమై చేసే మన నృత్యం చూసి
ఆ దేవలోకపు నట్టువరాలు, ఊర్వశి,
ఆశ్చర్యంగా, విన్నబోయి మూగవోతుంది.

మాయాతీతంగా రూపం ధరిస్తాడాయన
యోగానికి అధిపతి, అన్నీ అనుభవిస్తూనే
అయినా ఏదీ అంటనివాడు, ఏమీ చేయనివాడు.
ఇక్కడినుంచి ఒక పిలుపు, అక్కడినుంచి ఒక అరుపు
అంతటా ఉన్నాడు రాధాకృష్ణుడు
చేతితో చేయి కలుపుతూ ప్రతి ఒక్కరితో
పగటి వెనక రేయీ, రేయి వెనక పగలూ వచ్చాయి.
తొలిసంజతో కలిసి మలిసంజ ఆడింది
అలాగే హరించాం, హరించే కాలాన్ని.

## 16. రావోయి తోటమాలీ (గజల్)

రావోయి తోటమాలీ, సృష్టిద్దాం మనం
నవ వసంత శోభను
గులాబులు మళ్ళీ పుష్పించాలి
బుల్‌బుల్ పిట్టలు మళ్ళీ పాడాలి ప్రేమగీతం.
తోట పాడయిపోయింది
కన్నీరు పెడుతోంది మంచు
గులాబి ఆకులు చీకిపోతున్నాయి
మళ్ళీ కొత్తగా ప్రాణం పోద్దాం మనం
ఈ గులాబీలకి బుల్‌బుల్ పిట్టలకి.
ఓ బుల్‌బుల్, నీ శోకాలు వృథా ;
స్వేచ్ఛగా విడిచేదెవ్వరు నిన్ను ?
నీ విముక్తిని నువ్వే సాధించాలి
కేవలం నీ చేతులతోనే.
తోటలో పిట్టలు పాటలు పాడుతున్నాయి
కాని ఒక్కొక్క పిట్ట ఒక్కొక్క స్వర మాలపిస్తోంది
వాటిని సమ్మేళన చెయ్యి, ఓ దేవా,
ఈ భిన్న స్వరాల్ని ఉత్తేజకరమైన ఒక పాటగా !
ఈ గులాబులూ బుల్‌బుల్ పిట్టల నివాసాన్ని
ఎగరగొట్టి, ఉరుములూ మెరుపులూ

భయంకర జల ప్రళయాలూ రప్పిస్తావా ?
భూకంపం పుట్టిస్తావా ?

గులామ్ అహ్మద్ మహ్జూర్ (1885-1952)

## 17. పల్లెటూరిపిల్ల

అడవిలో పూసిన పూలగుత్తీ,
ఓ పల్లెటూరిపిల్లా ! ఓ తేనెమనసుదానా, ఓ ప్రియతమా !
స్వర్గంలోఉండే హిమాల్‌వి నువ్వు, క్యాఫ్‌నుంచి వచ్చిన పెరీవి నువ్వు !

అడవుల వెల్లడిలో పూలుపూసే ఓ లతా
మూత్రైన వాసనతో నీ మొగ్గలు నింపజాలినదెవరు ?
అందమైన వన్నెలు నీ కద్దినవారెవ్వరు ?
నీ దుస్తులు సాదావి, ఓ అందాల భామా,
వాటికి అల్లిక అంచులులేవు, బంగరు జరీలు లేవు
పక్కలకు వాలే నీ ముంగురులు
కార్తిక చంద్రుణ్ణి కప్పిన కారుమబ్బులు

పాటపాడుతూ మిట్ట పొలాలకు పోతుంటావు నువ్వు
తీయగా పాడుతూ కోకిల మాదిరిగా
నిన్ను చూసి మెచ్చుకుంటారు, ఆ దేవకన్యలు
ఖోజాపడుచులు నీతో సమానులెలా అవుతారు ?
స్వేచ్ఛగా సంచరిస్తావు నువ్వు, ఎక్కడపడితే అక్కడ
క్రీడిస్తుంటావు అడవి పూలతో నువ్వు
మరి ఖోజాపడుచులు, ఇళ్ళలో తలుపులు మూసుకుని ఉంటారు.

నీ చూపులే చెబుతాయి నీ సిగ్గును
నీ మానసంరక్షణే నీకున్న బలం
నీ సిగ్గరితనమే అందరి మెప్పు పొందుతుంది.

నిన్ను చూశాను, కమీజుచేతులు పైకి చుట్టి
వరిపొలంలో పనిచేస్తూ నువ్వు
కలుపుతీస్తూ శృంగారపదాలు ఆలపించడం విన్నాను.

చెమటబొట్లతో ముత్యాలు కూర్చినట్టున్న
నీ కనుబొమలు చెదరగొడుతున్నాయి మా హృదయాల్ని

ఓ మధుకోశమా, నేనంటే నాకే భయం వేస్తోంది
నా తెలివి చెల్లాచెదరుచేసేస్తున్నావు.
నమ్మకానికి కట్టుబడి ఉండు, ఓ అందాల గులాబిబాలా
అలసతకాని సౌందర్యగర్వంకాని
నీ పదుచుతనాన్ని చెదరగొట్టకుండా చూసుకో.

జిందాకౌల్ (1884-1965)

## 18. మానవ విలాపం

మనిషి ఏడుస్తాడు,
కన్నీటిని దిగమింగుకోడు
కాని అతనికి కన్నీరుకార్చే అవసరం ఏం వచ్చింది?
ఆ కళ్ళనుంచి నెత్తురుబొట్లు రాల్చే అవసరం ఏం వచ్చింది?
బండకువేసి తల కొట్టుకోవలసిన అవసరం ఏం వచ్చింది?
ఎవరూ తనగోడు పట్టించుకోరని తెలిసికూడా
అతడు సహాయ మర్థించడానికి ప్రేరణ ఏమిటి?
శూన్యంలోకి బరిసెలు విసిరేందుకు కారణమేమిటి?
ఏమి నిర్బంధం! ఏమి నిస్సహాయత!

మనిషి అనుక్షణం మరణిస్తున్నాడు;
ఆకలితో, చలితో, అణచుకొన్న దప్పికతో,
రోగంతో, అలజడితో,
భయంతో, అవసరాలతో, అణిగిఉన్న శోకంతో
ఈ దుఃఖాలు గడిస్తే చాలు, మరోవంద కోరికలు మళ్ళీ వంచిస్తాయి.
అస్థిరమైన ఆతని మనస్సు, ఇక్కడ దేనిమీదా నిలవక
ఇంకా దేనికోసమో పాకులాడుతుంది, అదేమిటో తెలియకపోయినా.
మంచినెన్నడూ అతడు చూపకపోయినా, అదేమిటో తెలియకపోయినా
అంతకుముందున్నదేదో పోగొట్టుకున్నవాడిలా భావిస్తాడు,
కలలో తాగిన మధువురుచిని
లీలగా గుర్తుంచుకున్నవాడిలా,
ఎంత దైన్యముంది - లేమికీ కోరికకీమధ్య!

ఎక్కడో దూరంనుంచి వర్షించాడు (అని అంటారు)
ఆతని కాంతి పరివేషంతాలూకు ప్రకాశాన్ని, ఒకప్పటిదాన్ని,

ఈ సంగతి మన చెవుల్లో పడింది
మన హృదయాలు దీన్ని నమ్మాయి
అతనికోసం మనం వెంపరలాడతాం
మన ప్రేమ తననేదో అవమానపరిచినట్టు, అసంతృప్తి చెందినట్టు
ఇక్కడినుంచి పారిపోయి ఎక్కడో ఒంటరిగా దాక్కున్నవాడికోసం
ప్రేమజ్వరం నిష్కారణం
ప్రేమజ్వరం నిష్ప్రయోజనం.

దూరాన ఎక్కడో దాక్కొని ఉంది
మన ప్రార్థనలేవీ వినిపించుకోకుండా
చెవుల్లో దూది కుక్కుకున్నట్టుగా ఉన్నతను
మనవిషయ మెప్పుడన్నా పట్టించుకుంటాడా?
మనగురించి ఎన్నడన్నా తలుస్తాడా, అడుగుతాడా:

"తిమిరాంధకార మధ్యంలోకి
కోసైన కొండకొమ్ములమీదికి
దట్టమైన నట్టడవుల్లోకి
నేను విసిరేసినవాళ్ళు వాళ్ళు" అని
కావాలని చూపే ఔదాసీన్యమది.

మనిషి తన హృదయంతో వాదులాడాడు:
"అతనికి ప్రేమలేదు
అటువంటివాణ్ణి నిందించి లాభమేమిటి?
విల్లోచెట్టు ఎక్కడన్నా బేరిపండుకాస్తుందా ?

అతన్ని చేరేదారి నీకు తెలుసా
అతన్ని చేరేటందుకు నీకు దొరికే ప్రయాణ సాధనమేమిటి?"
కాని ఇది వింటుందా అతని మనస్సు?
వెనక్కి మళ్ళిపోతుందా?
గాలికి సంకెళ్లు వేయగలవాడెవ్వడు?
మరి మనస్సును నిందించడమెందుకు?
ప్రేమఅన్నది వెర్రి ఊహా?

అతని చెవుల్లో వినిపించే నాదమే అతని ఆత్మకు ప్రతినాదం
కస్తూరిమృగం కస్తూరివాసనను వెంటాడుతుంది.
అద్ది దానిలోనే నిక్షిప్తమై ఉందికాని దానికంటె కప్పపడదు.

లేడిలా పరుగులు తీస్తుంది
కొండల్లోపడి, అడవుల్లోపడి.
అదేవిధంగా నిర్లక్ష్యంగా వేగంగా
పరుగులు తీస్తుంది మానవహృదయం,
ప్రేమసుగంధాన్ని వెంటాడుతూ
అది అతన్ని విశ్రమించనివ్వదు,
ఇంకా దూసుకుపోతుంది, ముందుముందుకు
విరబూసిన అందాన్ని అంతటావిరిసిన అందాన్ని
చూడటంకోసం
తరగనిదది, అరుదైనదది!

దీపం వెలుతురు చిమ్ముతుంటే
స్థిరంగా కూచోగలదా చిమ్మెట, ఏమీ పట్టనట్టు?
ఆ సుగంధాన్ని అనుసరించకుండా ఉంటాడా,

పంచేంద్రియాలూ మనోబుద్ధులూ[1] ఉన్న మానవుడు?
(కస్తూరి కంటికి కనిపించకపోతేనేమి?)
అందమన్నది వ్యర్థమైన మాయాజాలప్రదర్శనమా?
ఏమి దిగ్భ్రమ!
ఏమి అదుపులేని ఆకాంక్ష!
ఏమి దైన్యం – లేమికీ కోరికకీమధ్య!
ప్రేమజ్వరం నిష్కారణం
ప్రేమజ్వరం నిష్ప్రయోజనం
కావాలని చూపే ఔదాసీన్యం
ప్రేమన్నది వెర్రి ఊహా?
అందమన్నది వ్యర్థమైన మాయాజాల ప్రదర్శనమా?

**నందలాల్ అంబర్దార్** (జననం : 1915 -)

## 19. చెవిరింగులు

నా దగ్గర అమ్మకానికున్నాయి చెవి రింగులు
కొన్ని ఎర్రటివి, కొన్ని నీలపువి, కొన్ని గులాబివన్నెవి
ప్రేమా అందం కలుసుకోనివ్వండి

---
1 ఐదు ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి

పండించడానికి జీవితాన్ని
రండి కొనండి, రండి కొనండి, రండి కొనండి.

నా దగ్గర అమ్మకానికున్నాయి చెవిరింగులు
అమూల్యమైనవి, సుందరమైనవి, నాజూకైనవి;
చెదిరే కురుల మరుగున
రవ్వల్లా మెరుస్తుంటాయవి
గువ్వల్లా రెక్కలుకట్టుకు రండి
సువాసన లీనే శిరోజాలచుట్టూ అవి
హృదయాల్ని దోచుకునే చిరునవ్వులు చిందిస్తాయి.
రండి కొనండి, రండి కొనండి, రండి కొనండి.

వలపుల అంగడినుంచి కొనితెచ్చానివి,
అందాల బజారులో అమ్మకానికని
పరువంలోఉన్న పడుచులందరూ వీటిని
వచ్చి గుమిగూడి కొనుక్కోండి
ఈ అందమైన చెవిరింగులు
రండి కొనండి, రండి కొనండి, రండి కొనండి.

ప్రేమ ఇచ్చే కానుకలివి,
ప్రియమైన పడుచుకన్నెలకివి,
వీటికున్నది ఎంతో ఆకర్షణశక్తి
ప్రియుల హృదయాల్ని దోచేస్తాయివి.
రండి కొనండి, రండి కొనండి, రండి కొనండి.
తొందరగా వచ్చి కొనుక్కోండి చెవిరింగులు
కొనవలసిన సమయమిదే వీటిని
ప్రేమించే సమయమిదే మీకు
శీతకట్టు రాబోతున్నది
పూలన్నీ వెలవెలబోతుంటాయి.
ప్రేమ త్వరగా మరుగుపడిపోతుంది
రండి కొనండి, రండి కొనండి, రండి కొనండి.

గులాం హాసన్ బేగ్ (జననం : 1910—)

## 20. కొండవాగు

పారుతోంది కొండవాగు పాట ఒకటి పాడుతూ :
"దూసుకుంటూ వస్తాను నేను
నా శాంతిధామాన్ని కనక్కోడానికి
నేను యౌవనంలో, బలంగా ఉన్నప్పుడే
యౌవ్వనం చిరకాలం ఉండదు కనకనే.
"మంచి దూకుడుగా బయల్దేరతాను
నా ప్రవాహం ఆగిపోదు
జీవితంలో ఉత్సాహం నా కిష్టం
జీవితం నన్ను ముందుముందుకు సాగమంటుంది.
"దారిలో నేను నీరు చిమ్ముతుంటాను
రాళ్ళను ఢీ కొంటాను, నెత్తురోడుస్తాను
విశ్రమించను నేను, శ్రమిస్తూ ఉంటాను
జాగరూకతకు విశ్రాంతి తెలియదు.
"ఇప్పటికీ యౌవనంలోనే ఉన్నాను నేను
నురగలు కక్కుతాను, గట్టిగా ఉరుముతాను;
వెలలేని ముత్యాల్ని తాల్చేది
నీరవ అగాధం మాత్రమే.
"విశాల మహాసముద్రంలో
శాంతిధామం కనబడుతుంది.
ఆరిఫ్ చెప్పే మాటలు ఇవే
ఇవి వెలలేని మణులు.

## 21. సైనిక మిత్రమా!*

మిత్రమా :
నా సహసైనిక మిత్రమా !
మా పాట నీ చెవులకు సోకదు ఎందుకు ?
అలసటా ? ప్రయాణం ముగించకముందే పడుక్కొంటావేమి అలా ?

* శ్రీ టి. ఎన్. రాయినా ఆంగ్లంలోకి అనువదించి "విశ్వభారతి" త్రైమాసిక పత్రికలో ప్రచురించినది.

మన పని మొదలైంది ఇప్పుడిప్పుడే కదా, ఇదా నిద్రకు నీకు సమయం?
నీ నెత్తురు నీరుగారిపోయి, బంగారు భవిష్యత్తు చూడలేక పోతున్నావా ?
కళ్ళకు కట్టబోయే నవశకోదయం కోసం కాచుకోలేకపోతున్నావా ?
భవిష్యత్తుకు రూపురేకలు దిద్దే శిల్పి, మరణాన్ని వరించడం మంచిదా?
మిత్రమా—
నా సహ సైనిక మిత్రమా !
నువ్వేం చెబుతావో నేను వినలేనా ?
నువ్వు దేనికి ఎర అయ్యావో తెలుసుకోలేనా ?
పేదరికపు చలిపిడుగులు, నీ ఉత్కర్ష కాలానికి ముందే నిన్ను
వెలవెలబోయేటట్టు చేస్తున్నాయి.

కారణం, మందంటే డబ్బు-కనక నీ పొద్దు కుంకింది
అయినా, చావనే పులి పంజాల్లో చిక్కుకొని కూడా నువ్వు
తీసుకొన్న ప్రతిజ్ఞను గుర్తుచేసుకున్నావు.
కొత్తప్రతిజ్ఞల జ్వాలలకు సంతోషంగా ఆహుతయినావు శలభంలా ;
నువు చావలేవు, నీ యానంలో నువ్వొక ధ్రువతారవు
ఎప్పటికీ, మిత్రమా !
నా సహ సైనిక మిత్రమా !

నువ్వికలేవు - అయితే నేమి?
నిప్పెప్పటికీ నిద్రపోయే ఉంటుందా ?
నువ్వికలేవు, కాని నువు వెలిగక్కే నిప్పులెన్నడూ చల్లారవు
అవి వెయ్యి విస్ఫులింగాలై పెరుగుతాయి, ఎన్నడూ చల్లారవు !

చల్లారిన బొగ్గులు సైతం, ఆ నిప్పు సోకగానే రగులుతాయి ఎన్నడూ చల్లారవు !
నా తంబుర ఈ రాగమందుకుంది, నా పాట ఈ గాథను ఎన్నుకుంది
నీలోంచి, మిత్రమా -
నా సహసైనిక మిత్రమా ;

దీనానాథ్ నదీమ్ (జననం : 1916-)

## 22. చంద్రుడు (సానెట్)

కొండల వెనకనుంచి ఉదయిస్తుంటే చంద్రుడు, మినపట్టు మాదిరిగా ఉన్నాడు
దారాలు పికిలిపోయి, మెడపట్టీ చిరిగిపోయి,
ఛలవ్వరాతి రొమ్ముమీది లోపలి మచ్చలుచూపే

పాంపూర్ గౌనులాగున్నాడు, వెలసిపోయి,
మోసపోయిన కూలి వాడికి మిగిలిన మాయవెండినాణెంలా పాలిపోయి
ఉన్నాడు చంద్రుడు; పడమటి ఆకాశంలో ఉన్న
నిప్పును ఆర్పేశాయి మబ్బులు
కాని తూర్పువేపు వనదేవతలు చంద్రుని పొయ్యి రాజేశారు,
మందంగా మండే ఆ పొయ్యిమీద పొంగే అన్నం
కొండలనే కుండమీద పొంగిపోతున్నట్టుంది. నా
ఆకలి కడుపుతో గుసగుసలాడుతూ ఆశకలిగించి
అదే పనిగా చూశాను, వెన్నెలతో వెలుగుతున్న ఆకాశంలోకి
ఆకలి చూపులతో.

**అమీన్ కామిల్** (జననం : 1924-)

## 23. చిరకాంక్ష

మనిషి చూడగలిగినంత మేర, ప్రతివేపూ,
నింగి నేలా కలుసుకునే చోటి వరకు,
శూన్యంగా ఉన్న లోకంలో కొన్ని కోట్ల ఏళ్ళ నిర్జనత్వం,
అలవికాని ఆ ఎత్తులు, కింద లోతైన ఈ లోయలు
తరంగరంగంలాంటి బంజరు భూములు
చలికాలపు మంచు కమ్మిన గోరీ మాదిరిగా నిశ్చలంగా
మనిషీలేడు, పశువూలేదిక్కడ
ఉన్నదల్లా నిస్పృహ కలిగించే ఏకాంతం
అప్పుడప్పుడది నక్కకూతల్లా వినిపిస్తుంది.
చావులాంటి నిశ్చలత్వాన్ని ఇంకా అసహ్యం చేస్తుందది
పిడుగుపాటుకు కాలిన చెట్లకు ఏర్పడ్డ తొర్రల్లోంచి
అలవోకగా ఒక గుడ్లగూబ అపశకునాలు తెలుపుతూ అరిచినట్టుగా:
సడిచేసే దిగుఊపిరి విలయాన్ని సృష్టించినట్టుగా
పగబట్టిన తాచుపాము పక్కనుంచి బుసకొడుతూ సాగినట్టుగా
కాలం స్తంభించింది, పగలురాని రేయి అది
పసరెక్కిన వెల్ల వెలుగు జబ్బునీడలే పారాడుతున్నాయి,
ఓ మబ్బుల్లారా, ఉరమండి; ఓ నేలతల్లీ పలుకమ్మా
ఏ గరుడపక్షి జారవిడిచింది,
గోళ్ళతో చీల్చింది నన్ను, ఈ ద్వీపినున్న కొండకొనపైన ?

మనుషులుండే వాడలో బతికేయోగం లేదా నాకు,
జీవంతో తొణికిసలాడుతూ, మనుషుల్లో మనిషిగా కలిసి మసులుతూ ?
నా విషపాత్రను పగలగొట్టి,
తన చిరునవ్వులతో చిమ్మచీకట్లను వెలిగించి
తన స్పర్శలనే గాయాలు మాన్పే లేపనాలు కావించగల
ఒక్క ఆడది, నా పక్కన కనక ఉన్నట్లయితే
బావురుమనే ఈ నిర్జనదేశంలో ఒక్క గులాబి పుష్పిస్తుంది
గుండెను పట్టిన భయమంతా పటాపంచలవుతుంది.
నా ఒడిలో జోకొడతా నామెను
 ముచ్చటలాడతా నామెతో
 ఒంటరితనం వలను ఛేదించి పారేస్తా,
ఇక నేను ఫిర్యాదుచేసేది ఉండదు, నిట్టూర్పు విడిచేది ఉండదు.
విశాలమైన ఈ చీకటిలోకంలో నా కనిపించేది అది.
ఈ భయానక ఏకాంత వాసంలో
దగ్గరగా ఒక మనిషీ లేక, పశువూ లేక
రోజులు గడిపేది ఎలా నేను ?
దప్పికతో విలవిలలాడే లేడి
నీటిబుగ్గను వెదుకుతూ పరుగెత్తుతున్నట్టే
ప్రేమ అనే చలివేందిరకోసం వెదుకుతున్నాను నేను.
ప్రేమచేసే అల్లరికోసం. శాశ్వతప్రేమనందించే ముద్దరాలికోసం
ఉవ్విళ్ళూరే ఆదామ్‌లాగ.
గుసగుసల ఊసులతో ఆమె చేసే మాయకు బందీనవుతాను
కనక, ఏదో ఒక కొత్త ప్రపంచం పుట్టవలసి ఉంది.

## 24. జ్వాల- నృత్యం

సుగంధబంధురమైన అందం, జ్వలించే ప్రణయం
మధురమైన స్వప్నాలు, చెదిరిపోయిన నిద్ర
సొగసుగాని రొమ్ముమీద నెత్తుటివన్నెగలమచ్చ-
ఈ భంగపాట్లకు దీర్ఘంగా నిట్టూర్పులు విడవడమెందుకు ?
చెట్లను చూస్తూ అడవిని కానకపోవడం ఎందుకు ?
పదాల కూర్పుల్లో చిక్కుకొని చక్కని పద్యాన్ని విస్మరించడమెందుకు?
విచారగ్రస్తంగా ఉండడం దేనికి ? అలాగయితే,

నీ ఆత్మకు శాంతి చేకూరదు, నీ గాయాలకు మందు ఉండదు.
కనక, కలిపిచూడు మొత్తాన్ని, దుఃఖాన్నంతనూ పారదోలు :
నాకూ ఆనందానికీ నువ్వు దూరమైనప్పుడు
కాలం మందగొడిగా సాగుతుంది, చలికాలమంతా,
కాని నువ్వే సరసన ఉంటే అది, రెక్కలు విప్పుకొని ఎగురుతుంది
ఆమనికారులో హడావిడిగా సాగే ఆనందాల మాదిరిగా.
పుట్టుక తథ్యం, గిట్టుక తథ్యం,
మనం పుట్టినా, మనం గిట్టినా-సంప్రదించేది ఎవరు మనల్ని ?
కనక దాన్ని గురించి ఇక యాగీ ఎందుకు ? ఎందుకు కాలాన్ని వృథా చేయడం ?
స్వర్గమన్నది మనిషి నీడ
ఇక్కడ అతని విన్నపాలన్నీ వృథా :
స్వర్గంలో కొంతకాలం, దివ్యమైన అమృతం,
అన్నవి సూచించేది కేవలం మనిషి ఆకాంక్షనే.
అంచేత కొంతసేపు వినోదించు, కెరటాల్ని లాలించు
పసివాని మాదిరిగా నీటితుంపర లేపు,
నిజమే, పుష్పిస్తున్నప్పుడే గులాబి తెలుపుతుంది
దాని కిరాయి : నీ బట్టను చింపేముల్లు
ఇకేమిటి ?
సారా చేదుగానే ఉంటుంది, అయినా మత్తెక్కిస్తుంది
మెత్తగా ఉపశమనం కలిగిస్తుంది నీకు; మంచులా
తేరి చూడటానికే చీదరించుకొన్నట్లయితే విసుగ్గా నువ్వు,
కన్బొమలు ముడివేసి హృదయాన్ని కుంచించుకుంటే,
ప్రతి పువ్వూ ఒక నాగుబామును దాస్తుంది, తన నీడలో
అర్థంకోసం ఎందుకు చూస్తావు ? అదేమీలేదు.
ఏం, ఎందుకని ?-అంటూ వృథాగా అడుగుతావు
కాని, రాత్రిపూట చీకట్లో
ఉదయపు ఆశను నిలుపుకొన్నవాడి చూపులో
ఈ ప్రపంచానికి ఏదో ఒక అర్థం ఉంటుంది.
కనక, దుఃఖాన్ని విసిరేసి గీతాన్ని ఆలపించు
నీ పడుచు ప్రాయపు సంతోషాల్ని నెమరువేసుకో
ప్రేమను ఆన్వేషించు, హాయిగా ఉండు
మనసు విప్పి మాట్లాడు;

వసంతంలో వానకోయిల కలకూజితం విను;
శరత్తులో బుల్‌బుల్‌పిట్ట పాటలు విను;
వేసవి మల్లెపూవు విలాసం గమనించు
చలికాలంలో చూడు ! మంచు ఉన్నదక్కడ
నీకు వ్యవధి లేదు, మరిక ఆలస్యమెందుకు ?
అధికభౌతికమైన దాని గురించి ఆలోచన పెంచడం దేనికి ?
కావలసింది క్రీడ; అది సాగుతూ ఉండగా
ఆందోళన ఎందుకు నీకు, గెలుస్తానో గెలవనో అని ?
బయటికి వెళ్ళి ప్రకృతిలో అనందంచూడు :
మబ్బు గుర్రాలు ఉరుకుతున్నాయి ఎత్తయిన కొండకొమ్ములమీదికి;
నువ్వెక్కడ చూసినా, ఉల్లాసంగా ఉన్న ప్రకృతి
అపురూపమైన అందాల్ని సృష్టిస్తోంది,నాకోసం.
ఇంతకన్న ఏంకావాలి నాకు ? ఇక నీకేమి కావాలి ?
నా కలలు నిజమయాయి, నువ్విక్కడున్నావు
ఇవిగో, సువాసన వెదజల్లే నీ సుందర శిరోజాలు
కాలమనే మకురు గుర్రాన్ని మచ్చిక చేస్తాడు అతడే,
ప్రేమను కనుక్కొన్నవాడే. ఆయన ఆత్మలో వసంతముంది
ప్రపంచానికి కొత్తకాంతి నిస్తోంది.
ఈ రాత్రి ఆకాశంలో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తాయి చుక్కలు
ఈ రాత్రి ప్రేమా, అందం హాయిగా కలుసుకుంటాయి కనక.

గులామ్ నబీ ఖయాల్ (జననం : 1936-)

## 25. సరిహద్దు గస్తీకేంద్రంలో

భూమిమీది ఈ భాగం మలమలమాడింది శత్రువుల కాల్పులతో
మానవరక్తం చిందింది ఇక్కడ, సరిగా
ఈ సరిహద్దు గస్తీ కేంద్రమున్నచోటే,
ఇంటికి చాలాచాలా దూరంగా,
మా మిత్రులు ఒక గొయ్యి తవ్వారు.
తుపాకీ గుండ్లు దూరిన నా శరీరాన్ని సమాధి చేశారు,
కామంతో పరవశ్యుతొక్కే పడుచుప్రాయంలో ఉన్నప్పుడు
ఈ నా శరీరాన్నే, నా జన్మభూమి లాలించింది,
నరనరాన్నీ పోషించింది-నెలలూ ఏళ్ళూగా,

సరోవరాలు, కుంటలు, సుతిమెత్తని కొండగాలి;
ఉజ్జ్వల సూర్యోదయ అస్తమయాల శోభలు చూసిన జన్మభూమి.

ఆ నిర్జన ప్రదేశాని కెప్పుడైనా వస్తే నువ్వు,
షాలిమార్ చినార్ వృక్షాలనీడ నీకు స్వాగతంచెబుతుంది,
డాల్ సరస్సు గట్లమీదున్నట్లుగా విశ్రాంతి ననుభవిస్తావు నువ్వు.
నడిచే నీపాదాలకింది ధూళి గులాబి పూలలా మారుతుంది.
నువ్వడుగుమోపేది పూలపాన్పుమీదే కానీ మరోచోట కాదు
ఇక్కడ కొంతసేపు విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు
ఒక ఆలోచన నీ మనస్సును వేధిస్తుంది:
"యుద్ధం వచ్చిందిక్కడికి, నాశాన్ని మృత్యువునూ వెంటబెట్టుకొని
నెత్తుటివాగులో ఈ ప్రదేశాన్ని తడుపుతూ
తుపాకీ మందుతో, నాపామ్ బాంబులతో ఇక్కడిగాలిని ఉద్రేకపరుస్తూ,
మళ్ళీ పచ్చగా ఎలా మారింది ఈ నేల,
చుట్టుపక్కల మనుషుల సందడి కనిపిస్తోందేమిటి,
ఎత్తుకు ఎగురుతున్నాయేమిటి పక్షులు గాలిలో,
స్వచ్ఛంగా, చల్లగా వీస్తోందేమిటి ఈ గాలి?"
లేచి నించుని చుట్టూ చూపు సారించినప్పుడు
గుర్తుతెలియని గోరీ ఒకటి నీ కంటి కవుపడినప్పుడు
అర్థం చేసుకుంటావు నువ్వు,
ఈ నిర్జన ప్రదేశం ఎప్పటికీ కాశ్మీరుగానే ఉంటుందని,

గులామ్ రసూల్ నజ్కీ (జననం : 1909-)

## 26. చతుష్పదులు

1. భూమికి, సంపత్తికి, తోటలకు, ఆస్తికి
అదృష్టానికి, మంచిచెడ్డలకు, సుఖదుఃఖాలకు,
గుర్రాలకు, పశువులకు, కుటుంబానికి, మిత్రులకూ-
తలవాల్చి మొక్కుతాను, ఒక్కరికికాదు, లెక్కలేనంతమంది దేవుళ్ళకు,

2. పగటిపూట వచ్చాడతడు, సంజవేళ వెళ్ళిపోయాడు
పరీక్షించడానికి, నాప్రేమను తృణీకరించడానికి - అలా అనిపిస్తుంది నాకు.
కాని రాత్రి నాలుగోజామున, అతడు వచ్చాడంటారు.
మళ్ళీ, కాని నిద్రలో నేనుండడం చూసి వెళ్ళిపోయాడతడు
అయ్యో!

8. దుఃఖాల్లో చిక్కుపడి ఉన్నప్పుడు నేను
గుర్తుచేసుకున్నాను నిన్ను, నా భుజాలు
తేలిక పడ్డట్టు. భారంతొలగినట్టు అనిపించింది,
నిటారుగా నిల్చింది మళ్ళీ నా వెన్ను, నా కనిపించింది.
ఒకానొక మెరుపుకత్తి ఈ కారుచీకటి మబ్బుల్ని ఛేదించినట్లూ,
వెలుగు పారనిస్తే, నాగదిలో సూర్యకిరణాలు నాట్యమాడుతున్నట్లూ.

అఖ్తార్ మొహి-ఉద్-దీన్ (జననం : 1928-)

## 27. టాటర్ల కుండ

పాకీ పనిచేసే బ్రోన్త్ వాతుల్ మంచికోపంలో ఉన్నాడు. ఆశ్మిని పట్టుకుని ఆమె చెప్పులతోనే కొట్టాడు. జుట్టుపట్టి లాగుతూ గదిచుట్టూ తిప్పాడు. పిచ్చెక్కినవాడిలా ప్రవర్తిస్తున్నాడు. ఈ పెనుగులాటలో ఆశ్మి ఫెరాన్‌కు నిప్పంటుకోకపోవడం కేవలం అదృష్టమే. ఏమంటే, మట్టిపొయ్యి, ఆమెకు ప్రమాదం కలిగించేటంత దగ్గరగాఉంది. పొయ్యిమీద టాటర్లు ఉడుకుతున్న కుండ, పొంగుతుంటే చప్పుడు కూడా వినిపిస్తోంది.

ఆశ్మి నిస్పృహచెంది అరిచింది. "సంపేత్తన్నాడు బాబోయ్! రాండి, రాండి! ఈడు సచ్చిపోనూ, ఈడురాలిపోనూ!"

"నేను కాదే! నీవోళ్ళంతా సావాలి!" అంటూ అరిచాడు బ్రోన్త్. తుపుకూ తుపుకూ ఉమ్మేశాడు. "నేనే వన్నాసచ్చుసన్నాసి ననుకున్నావంటే- దొంగ లం-!"

"నావోళ్ళని తిట్టడానికి నువ్వెవుడివెహే! నిన్ను నరికి ఆళ్ళకి కూరొండి పెట్టాలి!" అంటూ ఆశ్మి, ఇంకా గట్టిగా అరిచింది. "ఆళ్ళు కాని నీయింటి కొచ్చేరా, నీ పొయిమీద రాళ్ళేసేరా?"

పొయ్యిఊసు ఎత్తేసరికి, టాటర్లు ఉడుకుతున్న కుండ గుర్తొచ్చింది బ్రోన్త్‌కి. "టాటర్లు సవిజూసి శానా కాలమయింది.- కాని ఇది-ఈ రాకాసి..." అనుకుంటూ, ఆశ్మి వేపు తిరిగి బెదిరిస్తూ ఇలా అన్నాడు:"తెల్లారేతలికి, నేన్నీకు యిడాకులియ్యకపోతే నా అయ్యెలిక్కొడుకునే కాను!"

"ఏటి! ఇడాకులిత్తావా! సచ్చినోడా ! నీ కేకలికి బెదిరిపోయేవోళ్ళెవరూ లేరిక్కడ. నా కాలిసెప్పులికి బలాదూరు!" కనుబొమలు గట్టిగా సాగదీస్తూ, చాపినచేతులు విసురుగా తిప్పుతూ జవాబిచ్చింది ఆశ్మి. "ఏ మారాజింటోనో పాసిపని చేసుకు బతుకుతాను, ఏటను కుంటన్నావో! నేనేం అవిటిదాన్ని కాదు తెలుసా ?"

వీళ్ళ పోట్లాట చుట్టుపక్కల వాళ్ళ చెవిని పడింది. ఇంటి చుట్టూ జనం మూగారు. సలాం దోంబ్, గులాం బద్మాష్,నోరా కమాల్ దగ్గరికి వచ్చారు. ఇంకా చాలామంది పిల్లలూ

పెద్దలూ కూడా వచ్చారు. వెర్రిబాగుల ఖ్వార్షి కూడా రొమ్ము బాదుకుంటూ వచ్చింది. "ఏంవయిందిరా బ్రోస్తూ? దానికి నెత్తు రెల్లా కారతన్నాదో కాపడ్డం లేదంట్రా? మాకు పగిలి రగతం ఓడిపోతన్నాది గదంట్రా? నీకు సేతు లెల్లా గొచ్చాయిరా కటికోడా?"

ఆ వెర్రిబాగులదాని మాటలతో ఆశ్మి మనస్సు కుదుటపడింది. "అదో గొప్పను కుంటన్నాడు," అంటూ, "కాదేటి మరి? ఒక్కపాలి పాతిక రూపాయలు కళ్ళజూసినోడెవ డున్నాడూ? నేను దిక్కులేనిదా న్ననుకుంటన్నాడు; నన్నేవంన్నా సెయగల్నను కుంట న్నాడు. తెల్లార్నీ; ఆడి బుర్రకి దూదికట్లు ఏయించకపోతే నన్నడుగు. ఏడుగురన్న దమ్ములికి అక్కసెల్లిని కానా?''

''పో, పోయే!'' అంటూ విదిలించేశాడు బ్రోస్త. "అస లేవంయిందేటి?" అంటూ, తెచ్చి పెట్టుకున్న గాంభీర్యంతో అడిగాడు నోరా కమాల్. "మాకు సెప్పరేం? ఇదిగో, ఆశిమమ్మా, కూతంత సేపు నువ్వాగు"

"నేన్నోరు మూసుకు పడుండాలా" అల్లా ఊరుకోమంటే ఊరుకొనే రకం గాదు ఆశ్మి. "ఈణ్ణి రచ్చకెక్కిత్తాను. ఈడి పరువు తీయిత్తాను; మొగ మ్మీదుమ్మేయిత్తాను"

"ఎవణ్ణే నువ్వనేదీ?" అంటూ అరిచాడు కోపదారి బోర్నిస్త. చిరిగిపోయిన తన కాలిచెప్పు తీసుకొని మళ్లీ పెళ్ళాంమీదికి ఎగబడ్డానికి సిద్ధంగా ఉన్నాడు. కానీ నోరా కమాల్, గులాం బద్మాష్ కలగ జేసుకొని అతన్ని కూచోబెట్టారు.

బోర్నిస్త, కిప్పుడు ఊపిరి ఆడటంలేదు; జోరుగా చెమటలు కక్కుతున్నాడు. అణచుకోలేని ఆగ్రహంతో శివమెత్తిన వాడిలా ఊగిపోతున్నాడు, ఇల్లంతా ప్రళయ బీభత్సం లా ఉంది. అదృష్టవశాత్తు మట్టిదీపం, గూట్లో పైన ఉంది కనక సరిపోయింది కాని, లేకపోతే, దాన్నెవరో మట్టేసేవారే. అయితే ఈ జగడంలో, ప్రమాదానికి గురైన వస్తువు హుక్కా-దాని చిప్ప ముక్కలు ముక్కలయింది; గొట్టం ఎక్కడో మాయమయింది. పిల్లలు చేస్తున్న గోలలో తక్కిన శబ్దాలన్నీ అణిగిపోతున్నప్పటికీ బ్రోస్తూ, ఆశ్మి అలుపూ సొలుపూ లేకుండా ఒకరి మీద ఒకరు వేస్తున్న నిందలూ, తిడుతున్న తిట్లు మట్టుకు వినిపిస్తూనే ఉన్నాయి.

అయితే కాసేపటోనే నోరా కమాల్ వేపు తిరిగి, "నా మొగమ్మీద ఊసి, పుండా కోరెదవా అని తిట్టాలంటే, నువ్వు తిట్టాలి" అన్నాడు బ్రోస్త "ఇంతకీ సంగతేటి? మాకు సెప్పవేటంట ?" అంటూ చొరబడ్డాడు గులాం బద్మాష్.

"సెప్పడానికిదేవంన్నా బారతవేంటి ?" నిట్టూరుస్తూ అన్నాడు. బోస్త. "ఇయ్యాల మద్దినాల మనకి జీతాలిచ్చేరా ! అప్పుణ్ణీకు సెప్పేనా లేదా నేను- కసాయిదుకాణం సుల్తాను కాడ టాటర్లు కొనుక్కోవాలని."

"ఔను సెప్పేవూ," అంటూ ఒప్పుకున్నాడు గులాం బద్మాష్.

"దేవుడు నిన్ను సల్లగా చూడాలి ! అప్పుడేవోం నా సేతికి పాతికి రూపాయి లొచ్చేయి. ఆటిల్లోంచి ముందస్తిగా రొండ్రూపాయిలు ఆ సూపరొయిజరుకి ఇచ్చేసేను. దొడ్డి గుమ్మంలోంచి వొచ్చేద్దారనుకుని, పోలీసులైను పక్కనించి, తాలూకాపీసు ఎనకనించి

తిన్నగా ఇంటికొచ్చేసేను. కిందటెన్నెల గఫార్‌గాడి కిరాణా కొట్లో సరుకులు తెచ్చేనా-ఆదికి పది రూపాయిలు బాకీ పడ్డాను."

"సరే, నేన్చెప్పనా ! ఇల్లాగే నేనుకూడా కిందటెన్నెల బాకీ ఎగ్గొట్టడాకి దొడ్డి గుమ్మం కాణ్ణించి వొచ్చేద్దామనుకున్నాను" అన్నాడు నోరా.

"పదికాలాలపాటు సల్లగా బతుకు !" అన్నాడు బ్రోన్స్. అంతట్లోకే నోరా అడ్డు తగిలాడు.

"నిజమే ! అణ్ణి తప్పించుకోవాలని సూసేనని సెప్పేనా - కాని ఆ గాడిదికొడుకు అప్పటికే మునిసిపాల్టీ ఆఫీసు గేట్లో కొచ్చేసేడు. వొచ్చి నన్ను సూసేసేడు, 'ఇదుగో కమాలా, ఓయ్ నోరా ! నా బాకీడబ్బు లక్క-డెట్టెల్లు' అంటా అరవడం మొదలెట్టేడు. ఏం చేత్తాం ? ఆడి కెగ్గొట్టకాకి ఈలయింది కాదు."

"దేవుడు సల్లంగ సూడాలి !" ఈసారి మాటకు అడ్డువచ్చినవాడు బ్రోన్స్. ఇంకా ఇలా అన్నాడు. "దేవుడి మీదొట్టేసి సెప్తన్నాను, ఆడు నాక్కూడా అల్లాగే సేసేడు. నెల మొత్తానికి సేసిన బాకీ తీరసాలిగందా ?"

అందరూ ఆ మాట ఒప్పుకున్నట్టే ఉన్నారు. కాని అక్కి మట్టుకు కోపంతో రుసరుస పెడూతూఉంది. మగడి కార్జం పీకి పెనంమీద కాల్చేలా ఉంది. ఆమె మాడు ఇంకా నొప్పి లాడుతూనేఉంది కింద పడుక్కొని తలకింద చెయ్యి పెట్టుకొని ధారాపాతంగా కన్నీరు కారు స్తోంది.

"సరే", ఇంకొంచెం గట్టిగా చెప్పడం ప్రారంభించాడు బ్రోన్స్. 'పదిరూపాయిలు అల్లా సెయిజారి పోయేయిగందా ! మరో ఏడ్రూపాయిలు ఆ బియ్యంకొట్టు షావుకారు నోరా గలదార్‌కి ఇచ్చేను."

"నువు నాకు సెప్పక్కల్లేదు. నేనూ ఇయ్యాలాడికి. కాని ఆడు నిజంగా మంచోడు. "ఆజీ సాయెబుగారూ, ఈనెల డబ్బు సాలా అవసరవున్నాదీ. నేను జమకట్టలేను" అన్నాను. అప్పుడాడు అలవాటు పెకారంగానే నాలుగుతిట్లు తిట్టేసి 'సరేలే కానీ వొచ్చేనెలమటుకి ఇచ్చె య్యాలి సువా ! మరిసిపోకు!' అంటూ నన్నొదిలేశాడు.

"కాని నే నేకార్నాలు సెప్పినా ఇనిపించుకోలేదే" అన్నాడు బ్రోన్స్. "మామూలుగా నేవో మంచోడే పాపం; కాని ఇయ్యాల నా ఎంటబడ్డాడు. అయినా అణ్ణనవలిసిన పనే లేదు రొణ్ణెల్లనుంచి నేను డబ్బియ్యడమే వున్నాది లేదు."

ఈ సమయంలో మట్టిదీపం కింద పడిపోయింది. అంతా చీకటి గుయ్యారమయి పోయింది. పెద్ద గందరగోళంగా ఉంది. కొందరు లేచి నించున్నారు. కొందరు అటూ ఇటూ మసిలారు. కాని అందరూ అగ్గిపెట్టెక్కడుందంటూ అక్కిని అడిగారు. అయితే ఆమె మారు పలకకుండా మూలుగుతూనే పడిఉంది. చివరికి ఆ వెర్రిబాగుల క్వార్షి ఉందేం, ఆమె లేచి వెళ్ళి, కాంగ్డిలో ఉన్న బొగ్గులు ఊది, మంటచేసి దీపం వెలిగించింది.

"ఓయ్, గులా బద్మాష్ ఎక్కడికెళ్లేడు?" అంటూ అరిచాడు నబీర్ షేక్ రసులా. అతనిమాట ఎవరూ వినిపించుకోకపోగా, బ్రోన్ ఇంకా ఇలా చెప్పాడు "వాంతో పదేడు రూపాయలవుద్ది: ఆఁహఁ, పందొమ్మిది రూపాయిలు. సూపరొాయిజరుకి రొండూ, కిరాణా కొట్టు గఫారాకి పదీ. ఇంక పోతే, ఏడ్రూపాయిలూ – ఆడెవడూ? ఆడి పేరేటి?

"నోరా గలదార్" అని గుర్తుచేశాడు రసులా.

"ఆఁ, అడే !" అన్నాడు బ్రోన్. "అదుగో, అల్లాగయిపోయాయన్నమాట, పందొమ్మిది రూపాయిలు. ఇప్పుడింక నా జీతంలో మిగిలిసచ్చిందెంత? దానికోపంగా ఉన్నాది. ఎందుకంటా? దాని కూతురుకి నేను కొత్తబట్టలు కుట్టించలేదంట."

"మన కవసరవొచ్చినప్పుడు నీ కాడెప్పుడన్నా డబ్బున్నాదేంటి?" అంది అశ్మి, కన్నీళ్ళు కారుస్తూ. "నీకు జూదవాడ్డానికి డబ్బు కావాలి. ఎళ్ళు, నీ కోసం సబీర్‌తుండా వొచ్చేడు."

"ఇంకోళ్ళ ఊసెందుకెత్తాలిది?" అంటూ అడిగాడు బ్రోన్. "నోరు మూసుకోమని సెప్పండి దానికి, తెల్లారసియ్యండి. దీని సంగతేటో తేల్చి పారేత్తా!"

"అదేం కుదరదు. తక్కిన ఆర్రూపాయిల సంగతేంచేసేవేటి?" అని అడిగాడు, నోరా.

ఇంతట్లోకి హుక్కా పీలుస్తూ సులా డోంబ్ వచ్చాడు. "పదికాలాల పాటు సల్లగా బతకాలి!" అన్నాడు నోరా. హుక్కాతెచ్చి బ్రోన్‌ముందర పెట్టాడు డోంబ్. "ఒక్కపాలి పీలిసేవంటే, పొగాకు బాగా నచ్చుద్ది. ఆ జబ్బారుగాడు లేడూ – పొగాకేపారం చేసేవోడు – ఆడికాడ కొన్నాను, ఒకటోరకం పొగాకమ్ముతాడు. అందులో అనుమానం లేదు."

బ్రోన్ హుక్కా పీలుస్తూ ఇంకా ఇలా అన్నాడు, "అయిదురూపాయలే మిగిలేయి నాకు. ఖ్వార్షికాడ చేసిన బాకీ తీరసాలంటా అదే తీసుకున్నాది, మూడ్రూపాయిలు."

"ఔనౌను, ఆ మాట నిజమే" అంది ఖ్వార్షి. "ఆ మాటకి సాచ్చీకం సెప్పీదాన్ని కానుకానీ, సావుసంగతి మరిసిపోకూడదు. ఔను. తనే ఇచ్చింది నాకు".

"ఇప్పుడు తెలిసిందా?" అంటూ ప్రకటించాడు బ్రోన్, కొంచెం సంతోషపడుతూ. "అంచేత, నాకు మిగిలిందిక రొండ్రూపాయిలేనన్నమాట. ఓ రూపాయెట్టి టాటర్లు కొన్నాను–" అంటూ అతడు పొయ్యివేపు చూసేసరికి అతని గొంతుకలోంచి ఒక కేక బయటికివచ్చింది. "ఏదల్లా? టాటర్ల కుండేది? ఎక్కడికిపోయింది?

వెంటనే అశ్మిలేచి ఆ కుండకోసం వెదకడం మొదలుపెట్టింది. వంటిల్లంతా వెదికింది. మూలమూలలా వెదికింది–సూదికోసం వెదుకుతున్నంత జాగ్రత్తగా. ఇది అక్కడున్న వాళ్ళందరికీ ఇబ్బందిగా, ఇరుకున పడ్డట్టుగా ఉంది. ఎవ్వరూ నోరు విప్పలేదు.

తన టాటర్లకుండ ఎవడెత్తుకు పోయుంటాడా, అని ఆలోచిస్తూ ఆందోళన పడ్డాడు బ్రోన్. పెళ్ళాంతో పడ్డ గొడవంతా మరచిపోయి, తనకి నమ్మకం కలగడం కోసం

ఆమెని అడిగాడు, "పోదు; ఎక్కడో ఉంటాది. ఎక్కడికి పోద్దేటి?"

కాని అమ్మి జాగ్రత్తగానే వెదికింది. "కుండ అక్కడుండడం నీ కళ్ళతో నువ్వు సూళ్ళేదూ?" అంది అమ్మి, గట్టిగా అరుస్తూ. "మన టాటర్ల కుండ ఎవరెత్తుకు పోయేరు? అళ్ళు సచ్చి పోనూ। అళ్ళు రాలిపోనూ. అళ్ళింటోవోళ్ళందరూ బుగ్గెయిపోనూ!"

ఈ దొంగపని చేసిన వాడు ఎవడయి ఉంటాడా అని ఆలోచిస్తూ వెంటనే అరిచాడు నోరా కమాల్, "ఆ గులా బద్మాష్‌గాణ్ణిలా లాక్కురండెహే". నబీర్ షేక్ కూడా అతనితో ఏకీభవిస్తూ, "అడి మీన నాకప్పుడే అనువానవొచ్చింది." అన్నాడు.

అందరూ కలసి గులా బద్మాష్ ఇంటికి వెళ్ళారు. వెళ్ళి పెద్ద గొడవ చేశారు. కాని ఆ యింటి కిటికీ దగ్గర కనిపించింది వాడి తల్లే; తన కొడుకు ఇంట్లో లేడని గట్టిగా చెప్పింది. కాని దానిమాట నమ్మేదెవరు? అమ్మి అసలే నమ్మదు. "నా కుండలో టాటర్లు తిన్నావో, ఉన్న కొడుకు నొక్కణ్ణి పొట్ట నెట్టుకుంటావు!" అంది

బ్రోన్ కోపంలో పొగలూ సెగలూ కక్కుతున్నాడు. తనింట్లోకి చల్లగా వచ్చిన గులా బద్మాష్‌ని తిడుతున్నాడు. లోపలున్నవాళ్ళు బయటికి వచ్చి మాటలతో పోట్లాడడానికి రెచ్చగొట్టకపోవడం వల్ల బ్రోన్, హైరాణపడి నిస్సహాయుడయాడు. అమ్మి చెయ్యి పట్టుకుని ఇంటికి తీసుకు వెళ్ళాడు. "పోదాం పదే! అళ్ళనే తిన్నీ ఆ టాటర్లు! దానూను దేవుడికొది లేద్దారి. పరువు పోగొట్టుకున్నోడు అడే కాని మనం కావు."

ఒక రాత్రివేళ, చుట్టుపక్కలందరూ నిద్రపోయి ఉన్న సమయంలో బ్రోన్ అమ్మి తలకు పసుపు నీళ్ళతో కాపడాలు పెడుతూ, ఆప్యాయంగా ఇలా అన్నాడు, 'ఇంటో మన పిల్లా పోట్లా లైట్టుకుంటే, కట్టాలూ నట్టాలూ రాడంతప్ప మరేటీ లేదని సెప్పలేదా!"

"ఆ దొంగెదవ టాటర్లకుండెలాగెత్తుకు పోయేడో ఏటో! అడి సావు మూడా! అణ్ణి కోసి నీకు కూరొండి పెట్టా!"

**అఖ్తార్ మొహి-ఉద్-దీన్** (జననం : 1928-)

*దోద్ దాగ్ నవల*

## 28. పడవ షికారు

పెద్దవాళ్ళతో ప్రమేయం లేకుండా, అక్కచెల్లెళ్ళిద్దరూ వాళ్ళంతట వాళ్ళు పెద్ద చెరువులో పడవ షికారుకు వెళ్ళడమన్నది, "ఫాత"కూ "రాజ"కూ అదే మొదటిసారి. ఈ పడవ షికారు ఏర్పాటు చేసిన అబ్దుల్ గనికి కృతజ్ఞత చూపవలసిన అవసరం లేకుండా ఉన్నట్లయితే వాళ్ళ మనస్సులింకా తేలికగా ఉండేవి.; వాళ్ళింకా హాయిగా ఉండేవారు. అయితే, షికారుకు వచ్చిన కొద్దిసేపటికే, ఫాత, ఆ సంగతే కాదు,పరాయివాడి దగ్గర తాను చూప వలసిన సిగ్గుకూడా మరచిపోయింది. నిస్సంకోచంగా, క్షయ రోగంతో తీసుకొంటున్న తన ఊపిరి తిత్తులల్లోకి దీర్ఘంగా శ్వాస తీసుకుంటోంది, విడుస్తోంది.

మధ్యాహ్నమయింది. సూర్య కిరణాలు డాల్ సరస్సులో నిర్మలమైన నీళ్ళమీద మెట్లుమెట్లుగాపడి, అట్టడుగు వరకూ పోతున్నట్లు అనిపిస్తున్నాయి. చిరుచేపలు బారులు బారులుగా ఈదుతున్నాయి; ఒక్కొక్కసారి నీటి మొక్కల్లో దాక్కొంటూ, మరొకసారి నీటి

పైకి తొంగిచూస్తూ, అవి చాలా సరదాగా ఆడుకుంటున్నట్టు కనిపిస్తున్నాయి; బడులలో దాగుడుమూతలాడుకొనే చిన్నారి ముద్దుపాపల్లా. నీలిమ లీనే నీళ్ళ మీద కొంచెందూరంలో ఉన్న తామర పూలను సూర్య కిరణాలు తాకే సరికి అవి, నీలాకాశంలో చుక్కల్లా మెరుస్తున్నాయి. వెడల్పాటి పచ్చాకుల మీద పడ్డ నీటిబొట్లు పచ్చలపళ్ళెం మీద తళతళలాడే ముత్యాల్లాగున్నాయి. కొత్తగా ఆకు తొడగిన దట్టమైన కొమ్మలుగల 'విలో' చెట్లు సుతారంగా లయ బద్ధంగా ఊగుతూ ఉంటే, ఈ చెరువు గట్టుమీద రోహీనృత్యం చేస్తున్న పల్లెటూరి పడుచుల్లా గున్నాయి. మబ్బు దొంతరలు కప్పిన పొడవాటి కొండకొమ్ములు చుట్టూ కనిపిస్తుంటే, లెక్కలేసంత మంది మునమల్నీ మునిమనమల్నీ పైనుంచి చూస్తూ ప్రశాంతమైన తృప్తితో చిరునవ్వు నవ్వుతుండే కొండ దొరల్లా గున్నాయవి.

పాత మనస్సులో మరీమరీ మెదులు తున్నది ఒకే ఒక ఆలోచన: "దేవుడు నాకీ దారుణమైన రోగం నయం చేస్తాడా?" కాని రాజ, మంచి ఆరోగ్యంగా యౌవనంతో ఉంది. పరిసర దృశ్యంలోని అందం ఆమెలో పడుచుతనాన్ని మేల్కొలిపింది. ఆమె ముసుగు బుజాల మీదికి జారి పోయింది. ఆమె నల్లని కురులు బయట పడ్డాయి. అంతేకాదు. ఆమె ఈ సారి ఒక్క విషయం స్పష్టంగా గ్రహించింది – తన భర్త ముసలివాడు పైగా రెండోపెళ్ళి వాడు; కాని తాను పడుచుది. అబ్దుల్ గనీకి భార్య కాదగినంత (ఏం, ఎందుక్కాగూడదు:) పడుచుది. ఈ ఊహ వచ్చేసరికి ఆమె సిగ్గుపడింది. అబ్దుల్ గని వేపు ఓరకంట చూసింది; సరిగా అదే సమయంలో అతడు, అనురాగం నింపుకొన్న కళ్ళతో తనవేపు దొంగచూపులు చూస్తున్నాడు. ఆమె సంతోషించింది

**రహ్మాన్ రాహీ** (జననం : 1925-)

*కదీమ్ కాషిర్ శాయరీ*

## 29. లల్లా వాఖ్

కాశ్మీరీ కవిత్వాన్ని గురించి వ్రాసేవాళ్ళు చాలామంది, దాని నేపథ్యం గురించి, బాహ్య ప్రభావాల గురించి, విషయం గురించి వ్యాఖ్యానిస్తూ ఉంటారు లల్లా వాఖ్ (లాల్‌దద్ పద్యసూక్తులు) గురించి వ్రాసేటప్పుడు, ఆ మాదిరి విమర్శకులు, ఆనాటి రాజకీయ, మత సామాజిక, ఆర్థిక స్థితులను గురించి చర్చిస్తూ ఉంటారు. లాల్‌దద్ పద్యాల ఫక్కిని, వాటి నిర్మాణాన్ని, ప్రతి పద్యంలోని పాదాల్ని, వాటిలోని లయను-స్వరసంబంధంగా గాని మాత్రా సంబంధంగా గాని-వాటి విన్యాసాన్ని ఛందస్సునూ వివరిస్తూ ఉంటారు. కవితా వస్తువును, అర్థాన్ని, అంతర్భావాన్ని, ఆ పద్యాలకూ ఆనాటి తత్త్వచింతనకూ గల సంబంధాన్ని చర్చిస్తారు. సంగ్రహంగా చెప్పాలంటే. సామాన్యంగా సాంప్రదాయిక విమర్శకు సామాన్యమైన పద్ధతిలో, ఒకానొక కళాఖండం పట్ల, వాళ్ళదృష్టి వస్తుపరంగా ఉంటుంది.

కవిత్వాన్ని అంచనా వేయడానికి వారు అనుసరించే పద్ధతి ఉపయోగకరమైనదే అనడంలో సందేహంలేదు; కాని ఇది, మొదట ఆ కళాఖండాన్ని, తరవాత విమర్శ ముఖ్య లక్ష్యాన్ని వమ్ము చేస్తాయి. విమర్శకుడి సరైనపని ఏమిటంటే. ఒకానొక కళాఖండంలో ఆంతరికమైన తర్కానికి బాహ్యమైన ఏవిషయంతోనూ ప్రమేయం లేకుండా, ఆ సాహిత్య

రచన ఏవిధంగా ఆధికారికమైనదో అంచనా వేయడం. అంటే, ఉద్దిష్ట కళాఖండంలో ఉన్న విలువమేరకే విమర్శకుడి మూల్యాంకనం తప్పని సరిగా సాగడం విమర్శ చేయవలసినపని. ఒకానొక సాహిత్య రచన మంచి కవిత్వం కిందికి వస్తుందా చెడ్డకవిత్వం కిందికి వస్తుందా అన్నది వివేచించడానికి గాని పరిశుద్ధతను పరీక్షించడానికి గాని తక్కినవేవీ గీటురాళ్ళు కాజాలవన్నది నిజం. ఉదాహరణకు, రాజకీయ సామాజిక భూమిక ఒకటే అయినప్పటికీ, ఛాసర్, గోవర్‌లు, గాలిబ్‌-జౌక్‌లు,-లాల్‌దద్‌-షేక్‌నూరుద్దీన్‌లు వ్రాసిన కవితల మధ్య పెద్ద అంతరాలు ఉన్నాయి. పైగా, ఒకే రచయిత-ఉదాహరణకు, మహమ్మద్ గనీ మహ్జూర్-వ్రాసిన పద్యాలన్నిటిలోనూ సమానప్రతిభ ద్యోతకం కావడం జరగదు. కాబట్టి, కావ్యాన్ని వివేచటానికి అదనపు విమర్శా సామగ్రి ఎంత ఉపయోగకరమైనదైనప్పటికీ, విమర్శకుడికి ప్రమేయం ఉండవలసింది ముఖ్యంగా, ఆ కావ్యంతోనే; అదిఎంతవరకు విశిష్టరూపం దాల్చిన భాషా పరమైన నిర్మాణం అన్నదానితోనే.

మొత్తంమీద, కాశ్మీర కవిత్వం గేయకవిత్వమనే చెప్పాలి. అంటే ఏమిటన్న మాట - కవిత్వం ముఖ్యంగా, కవి ఆత్మాశ్రయతకు అభివ్యక్తి. అది ప్రత్యక్షం కావచ్చు, పరోక్షం కావచ్చు. ఈ రెండో రకం కవిత్వంలో వస్తువు ఒక ప్రకృతి దృశ్యం కావచ్చు, కవీతరుడైన ఒకానొక వ్యక్తి మానసికస్థితి కావచ్చు. కవి మనస్సులోనే ఉన్న ఒకానొక అంతర్దృష్టి ప్రక్షేపణ కావచ్చు. అంతేకాకుండా అది, కవికి బాహ్యమైన దేనిమీదన్నా ఆధారపడటం కానీ దేనితోనన్నా ప్రమేయం ఉండి ఉండటంకాని లేకుండా, కేవలం కవి దర్శనానికి గాని ఆతని మనఃస్థితికి గాని అభివ్యక్తి అవుతుంది కాబట్టి గేయం ఖండకావ్యమే అవుతుంది. గేయంలో ముఖ్యంగా కవికి ప్రమేయముండేవి: లయ, పదాల శ్రుతిసుఖగత్వం, అర్థభేదాల్లో సూక్ష్మతలు, శ్రుతి, శ్రావ్యత మొదలైనవి.

తొలికాలపు కాశ్మీరీ గేయకవిత్వంలో, అంటే మతసంబంధమైన అన్వేషణ లేదా ఆధ్యాత్మిక అన్వేషణ, మతప్రమేయంలేని (లౌకిక) ప్రణయంవంటి ప్రధానబీజాలు రెండు కనిపిస్తాయి. ఈ కాలంలో జరిగిన అత్యుత్తమ సాహిత్యరచన **లల్లావాఖ్** అని ఆధునిక పరిశోధనల్లో వెల్లడి అయింది. లాల్‌దద్ వ్రాసిన ఈ పద్యసూక్తులు ఉత్తమ గేయరచనలు. అయితే మతం, వీటికీ అర్నిమాల్ వంటివారు రచించిన గేయాలకూ గల భేదం గుర్తించక తప్పదు. **లల్లావాఖ్‌**ను సరిగా అంచనావేయడానికి ఈ భేదం గమనించడం అత్యవసరం. అర్నిమాల్ గేయాలు లౌకిక ప్రణయాన్నీ, అప్పటికింకా ప్రసన్నుడుకాని ప్రియుడికోసం - అతడు తన సరసకు ఎప్పుడు వస్తాడా అని - ఆత్రంచూపే ప్రియురాలి సుతిమెత్తని వేదనతో కూడిన ఆకాంక్షను సూటిగా అభివ్యక్తం చేస్తాయి. లాల్‌దద్ "వాఖ్"లు కూడా గాఢమైన అనురాగాన్ని అభివ్యక్తం చేసినప్పటికీ, మనం విస్మరించరాని భేదం ఒకటి ఉంది. లాల్‌దద్ రచనల్లో కనిపించే ఆకాంక్ష, శక్తిమంతమైన ఒక సంవేదనకో, దర్శనానికో అభివ్యక్తి కాని, వ్యాఖ్యకాని కాదు. అయితే అది, గాఢమైన వ్యక్తిగతానుభవంతో వెలుగొందే చింతనా పరమైన ఆలోచనలోనుంచి పుట్టినది, లేదా దానికి ఫలితమైనటువంటిది; ఒకానొక అతీతదర్శనం. ఈ పద్యాల్లో నుంచి మనం కనక, విషయాన్ని లేదా అర్థాన్ని వేరుచేసి చూసినట్లయితే అది, "త్రిక" మనే శైవతత్త్వ పరమైన సత్యాలని, వాటిలోని ఆధ్యాత్మిక శిక్షణలని, అలాగే తదనురూపమైన సూఫీ అనుభవాలని గమనించగలం. కాని వీటిలో తాత్త్వికసత్యాలూ, ఆధ్యాత్మిక

శిక్షణలూ వాస్తవానుభవాలయాయి. మరొకరకంగా చెప్పాలంటే, వాటిలోని ఆలోచనలు లేదా చింతనలు కేవలం ఆలోచనలు లేదా చింతనలు అని కాకుండా అనుభూతమైన గాఢమైన దర్శనాలుగా అభివ్యక్తమయాయి. సత్యం విషయంలో కాని తాత్త్వికచింతన విషయంలో కాని మన అభిప్రాయాలు భేదించవచ్చు. కాని అవి లాల్‌దద్ "వాఖ్" లలో వలె కవిత్వావిర్భావం చెందినప్పుడు వాటిమీద చిత్తశుద్ధితో కూడిన విశ్వాస, సత్యాల ముద్ర ఉంది. అప్పుడు తాత్త్వికచింతన సరైనదా కాదా అన్న ప్రశ్నకు తావుండదు.

ఆలోచన, కాంక్ష, విషయ గ్రహణం, అనుభూతి అన్నవి ఒకదానితో ఒకటి ఎంతగా ముడిపడి ఉన్నాయంటే, వాటిని వ్యక్తీకరించడం రూపకాల్లోనే సాధ్యం. ఈ చిత్రాలు కేవలం తాత్త్వికచింతనలను తటిత్తులా మెరిపించి మనకు ఉపశమనం కలిగించే శక్తిని ఇస్తాయి. లాల్‌దద్ పద్యాల్లో ఉన్న విలక్షణత ఏమిటంటే, వాటిలో కేవలం దానికొక వర్ణనను గాని వ్యాఖ్యానాన్ని గాని కల్పించే సామర్థ్యం మాత్రమే కాకుండా, మానసికస్థితికి వాగ్రూపమిచ్చే సామర్థ్యముంది. అది, మనం పద్యాలు చదివినప్పుడు అనుభూతమయే రూపకాలంకారాల అనుభవరూపమేకాని కేవలం ఆలోచన కాదు. నిజంగా అందువల్లే, వాటిలో రూపకాలూ, ఉపమలూ, భావచిత్రాలూ అతిగా ఉంటాయి.

ఆధ్యాత్మికాన్వేషణ బీజాన్ని చూడవలసింది లాల్‌దద్ "వాఖ్"ల లోనే కాదు; పంధొమ్మిదో శతాబ్ది కవుల రచనలలోనూ ఇరవయ్యో శతాబ్దిలోని కొందరు కవుల రచనల లోనూ, వివిధ భావవృత్తుల్లో, స్వరాల్లో, రాగాల్లో, వారి రచనలకు అది మూలస్రోతస్సుగా ఉంటుంది. అయితే లాల్‌దద్ రచనల్లోని విలక్షణత ఏమిటంటే, వాటిలో ఆలోచన, సంవేదన, గాఢమైన అనురక్తి, మార్దవం, శోభ సంపూర్ణంగా, ఇతర కవుల రచనల్లో కంటే మిన్నగా మిశితమై ఉంటాయి. షేక్ నూరుద్దీన్ వ్రాసిన "శ్రుఖ్" అనే పద్యాలు కూడా కవితా వస్తువు విషయంలో నయితేనేమి, భావం విషయంలో నయితేనేమి పైపైకి, లాల్‌దద్ వాక్కుల్ని పోలి ఉన్నప్పటికీ, వాటితో పోల్చడానికి వీలు లేనివి. లాల్‌దద్ 'వాఖ్'లు కణకణలాడే చంద్ర నిప్పులయితే షేక్ వ్రాసిన 'శ్రుఖ్'లు చల్లారుతున్న బూడిదలోని నిప్పునెరుసుల వంటివి. కావ్య కల్పనా ప్రక్రియ విషయంలో రెండింటి భూమికా ఒకటేకాని, మార్మిక కవుల కవితల మధ్య అంతరాలుండటానికి కారణమేదో ఉంది. షేక్‌గారి "శ్రుఖ్"లు నీతిబోధ చేసినట్టుగా అనుభూతిని అందించవు. అవి కేవలం బుద్ధినే స్పృశిస్తాయి. గుండెల్లోకి చొచ్చుకొనిపోయి స్పందన కలిగించవు. ఆయన వాడే ఉపమలూ, రూపకాలూ ఉదహరణాత్మకమైనవి. కాని అవి, పొందిన గాఢానుభూతికి జీవత్ప్రతీకలు కాలేవు.

**పుష్కర్ ఖాన్ : హీరో మచామా**

## 30. కథానాయకుడు మచామా

మచామా : (తనలో) మచామా, తలఎత్తు (జేబద్దంకోసం వెదుకుతూ) నేను . . . . ఏది జేబులో పెట్టుకోలేదా? ఇదిగో దువ్వెన. (పాడుతూ) ఆఁ, ఇదిగో, ఇక్కడుంది. నాలో లేనిది సినిమా హీరోలో ఏముంది? నేను బాగానే పనికొస్తాను (రంగ స్థలంలో ఎడమ భాగంవేపు చూసి తన భార్యను గమనిస్తాడు) హో, . . హో, . . హల్లో

భర్త : అయితే వచ్చారన్నమాట,

మ : కాఖ్ ఎక్కడా?

ఖ : పక్క గదిలో మీ గురించే మాట్లాడుకుంటున్నారు.

మ : కాఖ్ ద్యాద్ ఎక్కడ? అమ్మ, అమ్మ, ఎక్కడా, అంటున్నాను.

ఖ : వంటింట్లో.

మ : రా, కొంచం దగ్గరికిరా (ఆమెను ఒక కుర్చీలో కూర్చోబెట్టి, కొన్ని అడుగుల దూరం వెనక్కి వెళ్ళి పాడతాడు) .ఇప్పుడు చెప్పు, నిజంగా నేను యాక్టర్‌లా లేనూ? ఖట్జీ, నేను నటుణ్ణి. ఇలాగ (వాలిపోతున్న ఆమె బుజాల్ని పైకెత్తుతూ) నువ్విక్కడ కూర్చున్నావు. నేను... (కొన్ని అడుగులు వెనక్కి వెళ్ళి) నటిస్తున్నాను, పాట పాడుతూ వస్తున్నాను. నన్నిలా చూడకు. ఆహా, ఇలా కాదు. మెడ పైకెత్తు. ఇంకొంచం పైకి. ఆఁ,చాలు (మళ్ళీ పాడుతుంటాడు).

ఖ : (మెడ లేపుతూ) ఇలా అయితే అలసట వస్తుంది.

మ : ఓ ప్రియమైన ఖట్జీ, నువ్వెందుకు అలసట పడాలి? నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను; ఎంతో గాఢంగా. కాని మీ నాన్నకో పాఠం చెప్పాలి-ఎప్పటికీ మరచిపోరాని విధంగా. ఇవాళో, రేపో, మరోనాడో తప్పకుండా చెప్తాను.

ఖ : అయ్యో, దేవుడా! ఆయన మీకేం చేశాడు?

మ : (చిరచిర లాడుతూ) తక్సీర్, తక్సీర్! కనిపించడంలే? నేను నటిస్తున్నా నంతే. ఆ మాత్రం తెలుసుకోలేవేం?

ఖ : అయ్యో! ఏమైందండీ మీకూ? ఇప్పుడేం చెయ్యాలి?

మ : నా పోర్షన్ చెప్పనియ్ నన్ను. మన కష్టాలన్నీ గట్టెక్కి పోవడం నువ్వేచూస్తావు మనం గొప్పవాళ్ళమైపోతాం, చాలా గొప్పవాళ్ళం - ఒక కారు, బంగళా, నౌకరు. ఖట్జీ! డబ్బు, ఇంకా బోలెడు డబ్బు. అప్పుడు నీకే తెలుస్తుంది, నువ్వు పెళ్ళాడిందెవర్నో.

ఖ : (కులుకుతూ) నిజంగానా !

మ : నువ్వు నామాట నమ్మవు. నాకుతెలుసు. కాని ఈ ఒక్క ఛాన్స్ ఇయ్యి నాకు. నా విజయం కోసం దేవుణ్ణి ప్రార్థించు. ఒకటి రెండు రోజుల్లో మన ఊళ్ళో అన్ని పేపర్లలోనూ వార్త వస్తుందని చెప్పారు. నీ కప్పుడు తెలుస్తుంది. ఇప్పుడు రిహార్సల్సు వేసుకోనియ్యి. నాన్న ఏమంటాడో తెలుసనుకో. (అనుకరిస్తూ) "బాబూ! ఏమైంది బాబూ? టైములా వృథా చేసుకోవడం ఎందుకు?నీ పనేదో నువ్వు చూసుకోవేం?" తరవాత అమ్మ, తిట్లు మొదలెడుతుంది. (మళ్ళీ అనుకరిస్తూ) "నాయనా, ఇవాళ ఏమైంది నీకు? మీ నాన్నగారు ఎంత బాధ పడుతున్నారో తెలుసుకోవేరా?" అంటుంది. అయితేనేం? ఈ నిందలూ తిట్లూ ఎవరయినా పడవలసిందే. (ధోరణి మారుస్తూ) త్వరలో ఆ సమయం వస్తుంది. వీధిలో బ్యాండ్లు మోగుతాయి. (బ్యాండ్ల చప్పుడు అనుకరిస్తూ) ఇలా ప్రక

టిస్తారు: “ఈ సాయంత్రం ప్రదర్శనం. అపురూపం – మిత్రులారా, ఈ సీజను కిది బ్రహ్మాండమైన ప్రదర్శనం మొదటి ఆట మధ్యాహ్నం 1-30కి; రెండో ఆట సాయంత్రం 4-30కి; మూడో ఆట రాత్రి 9-30కి. రండి, అందరూ రండి. ప్రఖ్యాత హీరో మదామా నటన చూడండి. ఈ ప్రదర్శనకి గేట్లు విరిగి పోయేలా జనం వస్తారు. త్వరపడుడు. మిత్రులారా! ఆలసించిన ఆశాభంగము. ఈ అవకాశం జార విడుచుకోకండి. అందరూ రండి. అప్పుడు చూడు; అమ్మా, నాన్న, చుట్టాలు, అందరూ కిటికీ తలుపు తెరుచుకు చూస్తారు. నాలాంటి బొమ్మలు-పోస్టర్లలు, నువ్వు నమ్మలేవు. ఔనా? (బ్యాండు వాద్యాన్ని అనుకరిస్తూ).

ఖ : అయ్యో! ఈయన కేమైందిరా భగవంతుడా!

మ : నటన, నటన. ఇంకేమిటి? ప్రకృతి నాకొక గొప్ప వరం ఇచ్చింది. నీ కళ్ళు నీలాలు, నీ చెవులు-ఎర్ర టమాటాలు. నీ కనుబొమ్మలు వంపు తిరిగిన చిక్కుళ్ళు. ఇట్టి! మీనాన్నకి చెప్పు సూటిగా. ఘాటుగా-నువ్వు నన్నే పెళ్ళాడ తావని. ఔను, నన్నే.

ఖ : మిమ్మల్నేకదా పెళ్ళాడింది! ఇదంతా ఎందుకు చెప్తున్నారు?

మ : ముందు నోరు మూసుకో, ఎంత వెర్రిదానివి! కనబడ్డంలేదూ? నేను నటిస్తు న్నాను. ఏడుస్తూ నా దగ్గరకి రావాలి (ఆడగొంతును అనుకరిసూ) “హా, నాప్రియా, నీ కోసం ఈ లోకాన్నే వదిలేస్తాను,” అప్పుడొక పాటపాడాలి నువ్వు:

“పోతాయిలే ఈ చుక్కలూ
పోతాడులే ఈ చంద్రుడూ
పోలేదులే మన ప్రేమ
నీ దాననై నే నెప్పుడూ
ఉంటానులే నా ప్రియా”

ఇదీ నటన. తెలిసిందా? అప్పుడు మళ్ళీ ఏడుస్తావు నువ్వు.

ఖ : ఎందుకేడవాలి?

మ : నా కోసం. మరెవరి కోసం?

ఖ : (ఏడుస్తూ) అయ్యో ఈయనకేదో అయిందిరా దేవుడా!

మ : ఎల్లాంటి పెళ్ళాం దొరికిందిరా నాకు!
(కాఖ్ ప్రవేశిసూ) ఏమిటి? కొత్తనాటకమా ఇది? కొత్త అనుకరణా?

మ : (పాడుతూ) “కాకా, ఏమవునో; దేదే ఏమవునో” . . .

ఖ : ఈ సంజవేళ ఏమయింది మీకు?

మ : నువ్వే చూడు. “ఏమవునో, ఏమవునో, ఏమవునో”

కెడి : నీ కోసం నాకు చావు వచ్చినా పరవాలేదు నాయనా! (తన భర్తతో) వీడికేదో జబ్బు చేసింది. చూస్తున్నారా! పిచ్చెత్తి నట్టున్నాడు.

ఖ : ఔను. అంతే.

మ : హరి దేవుడా! ఏమవునో, ఏమవునో ...ఔనో (బయట నించి పిలుపులు విని పిస్తాయి: మచామా, మచామా...)

## 31. విలేఖరులకు

ప్రియమిత్రమా,

ముఖాముఖి సంభాషణ వల్ల కలిగే లాభంలో కనీసం సగమైనా ఉత్తరంవల్ల కలుగుతుందంటారు. మనం "యారబల్"లో కలుసుకుని మాట్లాడుకుందాం; చర్చించుకుందాం కూడా. యారబల్ అన్నది తియ్యటి మాట; స్నేహితులు కలుసుకొనే చోటు. యారబల్ అనే పత్రిక కాలమ్‌లో మనం కలుసుకోడం కేవలం 'క్షేమమా? బాగున్నారా?' వగైరాలతో పలకరించుకోడానికి కాదు. లేదా, షేరాజ బాగుందా లేదా అని అడగడానికికాదు. మీరు నా పద్యాలు,వ్యాసాలు ఎందుకు ప్రచురించరు? ఫలానావాడు కవి కాడు) వాడంటే నాకు కిట్టదు. ఇలా కాదు-ఇంతకంటె ఏదైనా ఒక కావ్యాన్నిగాని కథావస్తువును చర్చిద్దాం; దాన్ని విడమరిచి చూద్దాం; సాహిత్యంలో కొత్త దృక్పథాలు కనుక్కుందాం. మాటవరసకు: మొన్న ఈమధ్య జేమ్స్ జాయిస్ వ్రాసిన యులిసెస్ చదువుతున్నాను: రెండుసార్లు చదివాను: కాని ఆ నవలలో రచయిత చెప్పదలచుకున్న దేమిటో అర్థం చేసుకోలేకపోయాను. మీకు అర్థమైందా? దాని మూలవిషయం గ్రహించడంలో మీరు నాకు సాయం చేయగలరా? లేకపోతే, ఫలానా అయన షేక్స్‌ప్రియర్ వ్రాసిన నాటక మొకటి అనువాదం చేశాడనుకుంటాను. ఆ అనువాదాన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటి? లేదా, మనలో కాశ్మీరీ పుస్తకాలు కొనేవారు చాలా తక్కువమంది. ఎందుచేత? ఆవిషయంలో మనం చేయగలిగింది ఏమన్నా ఉందా? కాశ్మీరీ కవితలో కనిపించే కొత్త ధోరణి గూఢతవైపు మొగ్గు చూపే లక్షణాన్ని ప్రదర్శిస్తోంది. దానికి కారణం ఏమిటి? కవిత్వమన్నది భావప్రసారమా, లేకపోతే కేవలం ఆత్మాభివ్యక్త్యా? ఇలాంటి విషయాలు ముచ్చటించుకోవచ్చు.

అయితే, ఉత్తరాలు వ్రాయడ మన్నది. ఒక కళ అన్న విషయం మనం గుర్తుపెట్టుకోవాలి; దానికి క్లుప్తత కావాలి; వివేకానికి ఆత్మ అది. వ్రాసే ఉత్తరం సహేతుకమైన పరిమితిని మించి పోయేటట్లయితే, అంత కంటె వ్యాసమే వ్రాయవచ్చు; ఉత్తరం కాదు.

కాని మీరు కాశ్మీరీలో వ్రాస్తున్నట్లయితే, దయచేసి, దస్తూరీ స్పష్టంగా వ్రాయండి; సరైన వర్ణక్రమంలో వ్రాయండి. ఎందుచేతనంటే, మీరు వ్రాసేదేమిటో మేము చదవలేక

పోతే, దాన్ని మేము ప్రచురించడం ఎలాగ ?

మీ స్నేహితుడు,
అక్తార్ మొహి-ఉద్-దీన్
సంపాదకుడు, షేరాజ
కాశ్మీరీ ద్వైవార్షిక పత్రిక, షేరాజ
(జమ్మూ అండ్ కాశ్మీర్ ఎకాడమీ ఆఫ్
ఆర్ట్స్ అండ్ లెటర్స్).

**అవతార్ కిషన్ :** కాశ్మీ అదబుక్ తారీచ్

## 31. చారిత్రక భూమిక

కాశ్మీరు స్వతంత్రంగానే మనుగడ సాగిస్తూ వస్తోంది. కాని కుట్రల వల్లా కలహాల వల్లా ఇది విచ్ఛిన్నమైంది. క్రీ. శ. 950 నుంచి కాశ్మీరులో పరిస్థితులు క్షీణించడం మొదలయింది. క్షేమ్‌గుప్తుడు రాజేకాని, అజాగ్రత్తపరుడు; కామోపభోగాలకూ విలాసాలకూ దాసుడు. సంగీత, నాట్య, నాటక కార్యక్రమాలతోనూ తాగుడూ జూదమూవంటి దుర్వ్యసనాలతోనూ రోజులన్నీ గడిపేశాడు. ఈ వ్యసనాలు ఎంత బాహాటంగా కొనసాగాయంటే, దేశమంతటా జూదాలాడే గృహాలు వెలిశాయి. ఆ రాజుకు వింతవింత అభిరుచులుండేవి. ఆయనా, ఆయన ఆస్థానంలోని వాళ్ళూ ఆడవేషాలు వేసుకొని, తాగి తందనాలాడుతూ ప్రపంచాన్ని మరిచిపోయి, విచ్చలవిడిగా ప్రవర్తించేవాళ్ళు. ఆయన్ని పొగిడే భట్రాజుల్లాంటి వాళ్ళు ఆయన్ని "కంగన్‌వర్ష" అని పిలిచేవారు. అంటే, బంగారపు నాణేలు కురిపించేవాడని అర్థం. ఆ రాజు పోయిన తరవాత, ఆయన భార్య దీదారాణి, దేశ వ్యవహారాలన్నిటిలోనూ ఆధిపత్యం వహించింది. వారసులుగా వచ్చిన నరవాతి రాజులు- అభిమన్యు, నందగుప్త, భీమగుప్త అనే వాళ్ళకు మార్గదర్శిత్వం వహించింది. అయితే వాళ్ళ కాలాల్లో కుట్రలూ కూహకాలూ లేవనికాదు; రాజ్యంలో మంత్రులు కుట్రలు పన్నటం కొనసాగుతూనే వచ్చింది. సుమారు క్రీ. శ. 1015-1021 మధ్య కాలంలో మహ్మూద్ గజనీ దాడిని ఎదుర్కోవలసి వచ్చింది. ఇది తీవ్రమైన ప్రమాదమన్న మెలుకువ పాలకులకు కలిగింది. కాని గొప్ప మార్పేమీ రాలేదు; సంఘటనల పరిణామాలవల్ల ప్రజలింకా ఆందోళన చెందుతూ, గందరగోళ పడుతూనే ఉన్నారు.

ఈ కాలంనాటి పరిస్థితుల్ని - అంటే, దోపిడీ, ఆశేకార్ల అవినీతి, తాగుబోతుల వల్లా సంఘవిద్రోహశక్తులవల్లా ఏర్పడ్డ అస్తవ్యస్త పరిస్థితి, విటులూ వేశ్యలూచేసే మోసాలూ అక్రమాలూ, ప్రజలు అనుభవిస్తున్న అశాంతీ పీడా - క్షేమేంద్రుడు తన రచనలో చిత్రించాడు. పన్నెండో శతాబ్దిలో పరిస్థితులు ఇంకా క్షీణించాయి. దేశ ప్రజల్లో చీలికలు ఏర్పడి ముఠాలు తల ఎత్తాయి. అగ్రకులాలవారికీ నిమ్నకులాలవారికీ మధ్య అంతరం పెరిగింది. దమర్, తంత్రి, ఠాకుర్ వంటి వేరువేరు కులాల వాళ్ళ మధ్య కలహాలు రేగడం సామాన్యమయిపోయింది. వాళ్ళందరూ స్పష్టంగా, విభిన్న సమూహాలుగా చీలిపోయారు; ఊళ్ళకు ఊళ్ళు తగలబెట్టడం, చేతికందినదల్లా నాశనంచేస్తూ పితూరీదార్లుగా, సంఘబహిష్కృతులుగా ప్రవర్తించారు.

# గుజరాతీ

మూలం :
ఆచార్య చంద్రకాంత మెహతా

అనువాదం :
డా॥ అడపా రామకృష్ణరావు

## చారిత్రక సమీక్ష

దేశంలోని ఇతర ప్రాంతాలలోవలెనే గుజరాతీ కవిత కూడా మొదట మతభావాలను వ్యక్తం చేయడానికి సాధనంగా మధ్యయుగంలో ఉదయించింది. గుజరాతీ భాషలో వెలిసిన తొలి కావ్యం "భరతేశ్వర బహుబలీ రాస" అహింసాసిద్ధాంతాన్ని ప్రబోధించడం కోసం దానిని 7 వ శతాబ్దంలో శాలిభద్రసూరి అనే జైనసన్యాసి రచించాడు. నాటినుంచి 18 శతాబ్దం చివరివరకు జైన సాధువులనేకులు "రాస" అనే కథాకావ్యాలను వ్రాశారు. మొదట ఈ రాసలు నృత్యాని కనువైన గీతాల రూపంలో ఉండేవి. నాట్యం చేస్తున్నప్పుడు వానిని ఆలపించేవారు. క్రమంగా అవి శ్రవ్యకథాకావ్యాలుగా పరిణమించాయి. ప్రజలలో ధార్మికబుద్ధిని వికసింపజేయడమే ఆ కావ్యాల ముఖ్యలక్ష్యం. అయినా కథన పద్ధతి శ్రోతలకు ఆహ్లాదాన్ని కూడా కలిగించేది. ఇతివృత్తంలో ఇతరరసాలకు కూడా స్థానమున్నా, శృంగార రసానికే ప్రాధాన్యం ఉండేది ఆరంభదశలో గుజరాతీ కవిత జైనసన్యాసుల కృషి వల్లనే వర్ధిల్లింది.

15 వ శతాబ్ది ఉత్తరార్ధంలో నరసింహ మెహతా తన వైష్ణవభక్తి కవితతో గుజరాతీ సాహిత్యంలో నూతన యుగస్థాపకుడయ్యాడు. ఆయన రచించిన "వైష్ణవ జనతో" అనే గీతాన్ని గాంధీజీ నిత్యం తన ప్రార్థనసమావేశాలలో పాడించడం వల్ల నరసింహ మెహతా పేరు ఇతర రాష్ట్రాలలోకూడా ప్రసిద్ధి చెందింది. ఆయన గొప్ప కృష్ణభక్తుడు. తన గీతాలలో తన ఇష్టదైవాన్ని బహురూపాలలో జగన్మోహనంగా వర్ణించాడు. ఒకచోట చిలిపి చేష్టలు చేస్తున్న కిశోరమూర్తి, మరొకచోట గోపికాలోలుడైన రసికశేఖరుడు. ఒకప్పుడు దయామయుడైన సఖుడు, మరొకప్పుడు ఆపత్కాలంలో స్మరించగానే వచ్చి అభయమిచ్చే రక్షకుడు – ఈ విధంగా ఆయన గీతాలలో కృష్ణుడు బహుభంగులలో మనకు దర్శనమిస్తాడు. ఉపనిషత్తులు ప్రతిపాదించే పరబ్రహ్మాన్ని వర్ణించే తాత్త్విక కవితనుకూడా సరళశైలిలో నరసింహ మెహతా రచించాడు. ఈ రెండు తెగల గీతాలను ఆయన ఎంతో నిపుణతతో రచించి, ఇతర కవులకు మార్గదర్శకు డయ్యాడు. మీరాబాయి తన అవసాన దశను ద్వారకలో గడిపింది. ఆమెకూడా కృష్ణునిపై కొన్ని పదాలను గుజరాతీ భాషలో రచించింది. ఈ విధంగా ఈ ఉభయులు – నరసింహ మెహతా, మీరాబాయి – కృష్ణభక్తి కవితకు శోభాయమానంగా అంకురార్పణ చేశారు. తరువాత ఆ కవితా శాఖ వసంతకాల

కుసుమ సమృద్ధిని స్ఫురింపజేస్తూ రసబంధురంగా వర్ధిల్లింది. రాజే, రఘునాథదాస్, ప్రీతమ్ రత్నో, ముక్తానంద వంటి కవుల గీతాలలో భక్తితోపాటు కవితాశిల్పంకూడా ఉన్నతస్థాయి నందుకొన్నది. క్రిందటి శతాబ్దంలో జీవించిన దయారామ్ వైష్ణవ కవులలో చివరివాడు. నరసింహ మెహతా వలెనే అతనికి కూడా గాఢమైన కృష్ణభక్తితోపాటు శ్రావ్యంగా గానం చేసే ప్రజ్ఞ ఉండేది. అందువల్ల అతని కృష్ణభక్తి గీతాలు బహుళ ప్రచారం పొందాయి.

రామభక్తులలో భలన అనే కవి కృతులు మాత్రమే ప్రత్యేకించి పేర్కొనదగినవి. ఐతే అతని కీర్తిసౌధానికి మూలస్తంభం బాణుని కాదంబరికి అతడు చేసిన పద్యానువాదం. ఆ ఉద్గ్రంథాన్ని పద్యరూపంలో అనువదించడానికి ఎందరో ప్రయత్నించారు. కాని, అతడొక్కడే కృతికృత్యుడయ్యాడు.

18వ శతాబ్దంలో వల్లభ్ అనే శాక్తేయ కవి పలు ఛందాలలో పరాశక్తిని స్తుతిస్తూ భక్తి గీతాలను రచించాడు. ముఖ్యంగా అతడు 'గర్బో', 'గర్బి' అనే నృత్యగీతాల సరణి ననుసరించాడు. అతని గీతాలు నేటికీ ప్రజాదరణను పొందుతున్నవి. అతని కంటె ముందు భణదాస్, ప్రభృతు లటువంటి గీతాలను రచించినా, కవితా శిల్పం అతని గీతాలలోనే ఎక్కువగా కనిపిస్తుంది.

తాత్త్వికరచన కుద్యమించినవారిలో ప్రథముడు నరసింహ మెహతా. ఐనా ఆ శాఖలో అగ్రగణ్యుడనే కీర్తి 17వ శతాబ్దికి చెందిన అఖో అనే కవికి లభించింది. అతి నిగూఢమైన తాత్త్విక సిద్ధాంతాలను అతడు తన కావ్యాలలో అతి సరళంగా, సుబోధంగా వ్యక్తం చేశాడు.

మధ్యయుగ కవులలో ప్రముఖుడైన ప్రేమానందకవి ఆఖ్యానకావ్య రచనకు మార్గదర్శి. అతడు జంత్ర వాద్యాన్ని శ్రుతి చేసుకొని పౌరాణిక గాథలను శ్రోతల వీనుల విందుగా గానంచేసేవాడు. కథన పద్ధతి, వాక్చైపుణి, మానవ మనస్తత్త్వాన్ని నిశితంగా శోధించి రసవంతంగా చిత్రించగల ప్రజ్ఞ, పౌరాణిక కథలలో కూడా సమకాలీన వాతావరణాన్ని సృష్టించే నేర్పు, జనబహుళ్యాన్ని రంజింప జేయగల శక్తి అతని కవిత ప్రజలలో బహుళ ప్రచారం పొందడానికి తోడ్పడ్డాయి.

ఆయితే మధ్య యుగంనాటి గుజరాతీ కవితలో కేవలం ఆధ్యాత్మిక విషయాలే ప్రస్తావితమయ్యేనని భావించకూడదు.

జైనులు, తదితరులు ఎన్నో కథాకావ్యాలను రచించారు. వారు జానపద కథలు నుంచి, సంస్కృత ప్రాకృత గాథల నుంచి తమ ఇతివృత్తాలను గ్రహించారు. జైనకవులలో నయసుందర్, ఇతరులలో సమల్, జనరంజకమైన కథాకావ్యాలను రచించారు. మతంతోనూ, నీతిసూత్రాలతోనూ ప్రమేయం లేని కథలను వారు కల్పించడంవల్ల వారి రచనలు చాలా వినోదదాయకంగా ఉండేవి.

పందొమ్మిదవ శతాబ్దంలో బ్రిటిష్ ప్రభుత్వం నెలకొన్న తరువాత గుజరాతీ కవిత క్రొత్త పుంతలు త్రొక్కింది. నర్మద్, దళపత్ అనే కవులిద్దరూ నవ్యకవితా నిర్మాతలు. వారు ప్రకృతికవిత్వం, ప్రబోధాత్మకకవిత్వం, దేశభక్తిగీతాలు, ప్రణయగీతాలు మొదలైన

రచనలతో కవితాక్షేత్రాన్ని విస్తరింపజేశారు. ఇద్దరూ తమ కవితను సంఘసంస్కరణ ప్రచారానికి ఉపయోగించారు. వారి రచనలలో కవితాశిల్పం కొంత లోపించినమాట వాస్తవమే. కాని కవితాక్షేత్రాన్ని విస్తృతం చేసిన ఖ్యాతి మాత్రం వారికి చెందుతుంది.

నరసింగరావు రచించిన "కుసుమమాల" అనే ఖండకావ్య సంపుటి 1886 లో ప్రకటితమయింది. ఇంగ్లీషు కవుల ప్రభావం ప్రత్యక్షంగా కనిపించే ఖండకావ్యసంపుటాలలో అదే మొదటిది. నాటి కవిత కేవలం విద్యావంతులకు, సమాజంలోని ఉన్నత వర్గాలకు చెందిన వ్యక్తులకు మాత్రమే ఆస్వాదయోగ్యమైనదిగా రూపొందినదనడానికి ఆ సంపుటియే సాక్ష్యం. అందుచేతనే 1920 లో అహమ్మదాబాదులో జరిగిన గుజరాత్ సాహిత్య పరిషత్తులో నరసింగరావును, తదితరకవులను జనసామాన్యానికి బోధపడేటట్లు కవిత్వాన్ని అల్లవలసినదని గాంధీజీ సూచించడం జరిగింది. పాశ్చాత్యసాహిత్యంలో బహుళంగా కానవచ్చే ఆత్మనాయకమైన గీతికను గుజరాతీభాషలో వ్యాప్తిలోనికి తెచ్చిన కవి నరసింగరావు

ఒక స్వదేశసంస్థానాధీశుడైన కలాపి ఆత్మాశ్రయకవిత్వరచనకు గణుతికెక్కాడు. ఆయన తన సమస్యలను అన్యాపదేశ శిల్పంతో కవితలో వ్యక్తం చేశాడు. ఆయన రచనలు ఎక్కువగా ప్రజాదరణ పొందాయి. "ఘజల్" అనే పర్షియన్ గీతాల పంథాను ఆయన అనుకరించాడు. సూఫీ తత్త్వప్రభావానికి లోనయ్యాడు.

కాంత్ (మణిశంకర్ భట్) ఖండకావ్యమనే సాహిత్య ప్రక్రియను సృష్టించాడు. అవి బహురసభరితమై, ప్రకృతి దృశ్యాలను, మానసికసంఘర్షణను వర్ణించే కథాకావ్యం. తమ కవిత్వంతో మానవజీవితగతిని శాసించే అలౌకికశక్తిని ధిక్కరించిన విప్లవాత్మకకవులలో అతడే ప్రథముడు.

దళపత్‌కవి కుమారుడు నానాలాల్ నాటి భావకవులలో అగ్రశ్రేణికి చెందినవాడు. అనుప్రాస, రూపకాలంకారం, ప్రాచీన "గర్బీ" కవితకు నూతనస్వరూపకల్పన, ఉక్తివైచిత్రి, సౌందర్యదర్శనం, ప్రణయచిత్రణం, శిల్పరామణీయకం అతని కవిత్వవిశిష్టతకు ముఖ్య హేతువులు. గాంధీజీ మన దేశానికి చేసిన సేవను శ్లాఘిస్తూ కవిత్వం వ్రాసిన తొలి గుజరాతీ కవి అతడే. కవిత్వరచనలో అంత్యప్రాసనియమాన్ని సడలించిన తొలి కవికూడా అతడే.

కథనపద్ధతిలోనే గాక కథావస్తువు నెన్నుకోవడంలోకూడా నవ్యతను ప్రదర్శించి ప్రఖ్యాతి నొందినకవి బలవంతరాయ్ ఠాకోర్. కావ్యరచన కర్హమైనవి కావని ఇతరులు చిన్న చూపు చూసిన ఇతివృత్తాల నతడు గ్రహించి కవిత్వపు సీమలను విస్తరింపజేశాడు. అంతేకాదు. కావ్యరూపంలో కూడా నూతనమార్గాలను త్రొక్కి తదనంతరకవులకు పథప్రదర్శకుడయ్యాడు.

దక్షిణ ఆఫ్రికానుంచి 1915లో మనదేశానికి మరలివచ్చిన తరువాత గాంధీజీ సాహిత్యంతోసహా జీవితంలోని అన్ని రంగాలలోనూ నూతనదృక్పథాన్ని నెలకొల్పాడు. సామాన్య ప్రజలకోసం వ్రాయవలసినదని ఆయన రచయితలను కోరడంవల్ల గుజరాతీ సాహిత్యంలో "గాంధీయుగం" అనే నవయుగం ఆరంభమయింది. ఆ యుగపు కవులు పేదల

దైన్యాన్ని తమ కృతులలో కండ్లకు కట్టేటట్లు వర్ణించారు. మన సాంఘికవ్యవస్థలో మారు రావాలని ప్రబోధించారు. స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రశంసిస్తూ గీతాలు వ్రాశారు. గాంధీజీని మూలాధారంగా చేసుకొని ఈ రచన లుద్భవించాయి. నాటి కవులు గాంధీజీని గురించి కావ్యాలు వ్రాయడమేకాదు, బుద్ధుడు, ఏసుక్రీస్తుకూడా అహింసాసిద్ధాంతాన్ని ప్రబోధించారు గనుక వారిని గురించి కూడా పూజ్యభావాన్ని వ్యక్తం చేస్తూ రచన చేశారు. ఉమాశంకర్, సుందరం. శేష్, స్నేహరశ్మి, మేఘానీ, శ్రీధరానీ, మన్‌సుఖ్‌లాల్ ఝవేరీ, బేతాయ్ ప్రభృతులు నాటి ప్రఖ్యాతకవులు. గాంధీజీ జీవితంలోని ముఖ్యసంఘటనలు-దండీ పదయాత్ర, అస్పృశ్యతా నిర్మూలనోద్యమం, రౌండ్ టేబిల్ సమావేశంలో పాల్గొనడానికి ఇంగ్లండ్ ప్రయాణం, నవకాలీయాత్ర, చివరకు తన సిద్ధాంతాలకోసం ప్రాణత్యాగం-కథావస్తువుగా ఎన్నో రసవత్కావ్యాలవతరించాయి. గాంధీజీ దైవభక్తిపరుడు గనుకను, ఆయన నిత్యం భక్తిని ప్రచారం చేయడంవల్లను గుజరాతీ సాహిత్యంలో ఆ యుగంలో భక్తికవిత అధికంగా వెలువడింది ఈ నవభక్తి కవితోద్యమానికి నాయకుడు సుందరం. ఇప్పుడాయన శ్రీ అరవిందాశ్రమంలో వసిస్తున్నాడు.

1940 ప్రాంతాల కమ్యూనిస్ట్ సిద్ధాంతాల ప్రభావంవల్ల కొంతకాలం అభ్యుదయ సాహిత్యోద్యమం సాగింది. మేఘానీ, భోగిలాల్ గాంధీ, స్వప్నస్థ ప్రభృతులు వర్గకలహాన్ని వర్ణిస్తూ, మతంపట్ల ద్వేషాన్ని వ్యక్తంచేస్తూ రచనలు చేశారు. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైన తరువాత ఈ ఉద్యమం వెనుకబడింది.

సంభాషణరూపంలో ఉన్న రవీంద్రుని గీతాలననుకరిస్తూ ఉమాశంకరజోషీ 'ప్రాచీన', "మహాప్రస్థాన్" అనే కావ్యాలలో నూతనఫక్కీలో గీతాలను రచించి గుజరాతీ కవితను సంపన్నం కావించాడు. ఈ గీతాలలో ఆయన పౌరాణికగాథలను ఇతివృత్తంగా స్వీకరించి, మూలకథను యథాతథంగా వర్ణిస్తూనే పాత్రల గుణశీలాలను స్వతంత్రంగా వ్యాఖ్యానించాడు.

ఉన్నత విద్యాభ్యాసం కోసం 1930 ప్రాంతాల కొందరు విద్యార్థులు గుజరాతీ విద్యాపీఠం నుంచి శాంతినికేతనానికి వెళ్ళారు. వారక్కడి నుంచి తిరిగివచ్చి గుజరాతీ కవితలో రవీంద్రుని భావనను, ఛాయావాదాన్ని, అక్షరరమ్యతను, భావచిత్రాలను ప్రవేశపెట్టారు. రవీంద్రుని ప్రభావానికి లోనైన గుజరాతీ కవులలో రాజేంద్రషా, స్నేహరశ్మి, మేఘానీ, ప్రహ్లాద పారేఖ్, కృష్ణలాల్ శ్రీధరానీ ముఖ్యులు.

స్వాతంత్ర్యానంతర యుగకవితలో కవితా తత్త్వానికి సంబంధించి నంతవరకు కవుల దృక్పథంలో ముఖ్యమైన మార్పు కనిపిస్తుంది. నేటి కవులు ఎక్కువగా ఆత్మాశ్రయవాదులు. వీరిలో అంతర్ముఖీనత ముఖ్య లక్షణం. బాహ్యప్రపంచాన్ని యథాతథంగా దర్శించి చిత్రించాలనే కాంక్ష తక్కువ. వీరి రచనలలో అన్వయక్లిష్టత ఎక్కువగా కనిపిస్తుంది. బ్రతుకు మీద కలిగిన నిరాశవల్లనో, స్వతంత్ర భారతాన్ని గురించి కన్నకలలు విఫలం కావడం వల్లనో, అస్తిత్వవాద ప్రభావానికి లోనుకావడం వల్లనో, పాశ్చాత్యకవుల అధివాస్తవికతను గ్రహించడం వల్లనో, టి. యస్. ఇలియట్ వంటి కవుల పోకడల ననుసరించడం వల్లనో వీరి కవితకు అన్వయక్లిష్టత సంక్రమించింది. సాంప్రదాయికమైన ఉపమాసామగ్రికి మారుగా వీరు క్రొత్త

ఉపమానాలను సృష్టించారు. అవి అపరిచితమైనవి. భీతిని, బాధను కలిగించేవి. వీరిలో కొందరు తమ గీతాలను రేఖాగణిత శాస్త్రంలోని ఆకృతులవలె వ్రాయడం కూడా కనిపిస్తుంది. నిరాశ నిస్పృహ, సుప్తచైతన్యాన్ని ఆవరించిన ఒంటరితనం, దైవం పట్ల హేళన దృష్టి, నిత్యమైన దానికంటె క్షణికానికే ప్రాధాన్యమీయడం, సంప్రదాయాన్ని, నీతిని, సామాజిక, కళాపరమైన సిద్ధాంతాలను తిరస్కరించడం వీరి కావ్యాల ప్రధాన లక్షణాలన వచ్చును. స్వాతంత్ర్యానంతరం వెలసిన ఈ నవీన కవితా మార్గానికి నాయకులు సురేశ్ జోషీ, ఘునామ్ మహమ్మద్ షేక్, హరీంద్ర దావే, చినూ మోడీ, జ్యోతిష్ జానీ, శితాంశు, నలిన్ రావల్, ఆదిల్ మన్సూర్ ప్రభృతులు.

అయితే స్వాతంత్ర్యానంతర యుగంలో ఈ నవకవితతోపాటు సాంప్రదాయిక కవిత కూడా ఎక్కువగానే వెలసింది. నేటి కవితలో కూడా దైవభక్తి, ప్రకృతి సౌందర్యవర్ణన, ఆదర్శవాదాన్ని, నైతిక సూత్రాలను సమర్థించే ప్రయత్నం, ప్రేమతత్త్వానికి రాధాకృష్ణుల అనుబంధాన్ని సంకేతంగా గ్రహించడం గోచరిస్తుంది. ఈ వర్గానికి చెందిన కవులలో అగ్రగణ్యుడు రాజేంద్ర షా. ఆయన తన గీతాలలో ఉపనిషత్తత్త్వాన్ని నూతన సంకేతాలతో వ్యక్తం చేశాడు. వేదాంతాన్ని కవిత్వంలో ఎంతో రమ్యంగా చెప్పవచ్చునని నిరూపించాడు. వాగనుశాసకత్వం, విశ్వ విశాలదృష్టి కల కవి ఆయన. ముఖ్యంగా ప్రకృతిని వర్ణించడంలోనూ, జానపద ప్రశాంత వాతావరణాన్ని చిత్రించడంలోనూ నిపుణుడు. సాంప్రదాయిక కావ్యరచనలో సిద్ధహస్తులు నిరంజన్ భగత్, ఉశనస్, జయంత్ పాఠక్, బాలముకుంద దావే, ప్రజారామ రావల్, ఉమాశంకర్ జోషీ, కర్సన్‌దాస్ నానక్, మకరంద దావే ప్రభృతులు.

ఈ విధంగా నరసింహ మెహతా నుంచి నేటి ఆదిల్ మన్సూర్ వరకు అనేక కవులు తమ కృతులతో గుజరాతీ కవితకు ఇతివృత్తాలలోనూ, రచనా పద్ధతిలోనూ ఎంతో వైవిధ్యాన్ని సంతరించారు. అది నవీన భావాలను గ్రహించినా, సంప్రదాయంలోని మేలిగుణాలను విడనాడలేదు. భక్తి కవితనుంచి అధివాస్తవిక కవితవరకు సాగిన దాని ప్రస్థానంలో అడుగడుగున అందం కనిపిస్తుంది.

## వచన వాఙ్మయం

### సంగ్రహ చరిత్ర

మధ్యయుగంనాటి గుజరాతీ సాహిత్యంలో మాణిక్యసూరి వ్రాసిన "పృథ్వీచంద్ర చరిత్ర", స్వామి సహజానంద రచించిన "వచనామృతం" వంటి చక్కని వచన రచనలు కొన్ని ఉన్నా, ఉత్తమ సాహిత్యస్థాయి నందుకొన్న గుజరాతీ వచన వాఙ్మయ వికాసం 19 వ శతాబ్దంలోనే, ఇంగ్లీషు విద్యా ప్రభావంవల్లనే కలిగిందని చెప్పాలి. నాడు ఇంగ్లీషు విద్యాభ్యాసం చేసినవారు పాశ్చాత్య వచన వాఙ్మయ మాధుర్యాన్ని చవిచూసి, తమ భాషలో వచన వాఙ్మయం అప్పటికి తగినంత వెలువడలేదని గుర్తించి, నూతన రచనలతో దానిని సంపన్నం కావించాలని నిశ్చయించుకొన్నారు.

ఈ శాఖలో ఇతరులకు మార్గదర్శకుడైన నర్మద్ అనే రచయిత శ్రోతల ఎదుట చదివి వినిపించడానికి ఉద్దిష్టమైన వ్యాసాలను వ్రాయ నారంభించాడు. సాంఘిక విప్లవం

తీసుకురావడానికి అతడు వ్యాసాన్ని సాధనంగా చేసుకొన్నాడు. సాహిత్య, సాంఘిక, రాజకీయ ధార్మిక విషయాలపై వ్యాసరచన చేశాడు. ఈ వ్యాసాలు ఉత్తేజకరంగా ఉన్నా, వాగ్బాహుళ్యంవల్ల శైలిలో బిగి లోపించింది. అతడు స్వీయచరిత్రతో పాటు సాహిత్య చరిత్రలను కూడా వ్రాశాడు గాని అది చాలా అసంబద్ధంగా ఉంది. అప్పటికి గుజరాతీ భాషలో ప్రామాణిక వచన వాఙ్మయం లేకపోవడంవల్ల అతడే క్రొత్తగా మాటలను, పదబంధాలను సృష్టించవలసి వచ్చింది. ఉన్న మాటలకూ, నుడులకూ క్రొత్త అర్థాలను కూడా ఆరోపించవలసి వచ్చింది. భావగ్రథనంలోనూ, శబ్ద ప్రయోగంలోనూ క్రమంగా అతని రచనలలో పరిణతి గోచరిస్తుంది. చివరకు శైలిలో భావోద్వేగపు పాలు తగ్గి, అతని రచన మొదటి కంటె బిం(క)ంగా. స్పష్టంగా, హేతుబద్ధంగా సాగింది. అతడు నాటకరచనకు కూడా ఉద్యమించాడు కాని, ఆ ప్రయత్నం సఫలం కాలేదు. అతని సమకాలికుడైన దళపత్ కూడా వ్యాసాలనూ, నాటకాలనూ వ్రాశాడు. దళపత్ శైలి సరళ గంభీరమై పాఠకుల నెక్కువగా ఆకర్షిస్తుంది.

నర్మద్ సాహిత్యవ్యాసంగాని కుపక్రమించిననాటి రచయితలందరూ సాహిత్యాన్ని సంఘసంస్కరణానికొక ఉపకరణంగా భావించినవారే కావడంచేత సాహిత్యచరిత్రలో దానికి "సంఘసంస్కరణ యుగం" అనే పేరు వచ్చింది. ఆ కాలంలోనే ఉత్తమశ్రేణి విమర్శకుడైన నవల్‌రామ్ సాహిత్యవ్యాసాలతో పాటు గ్రంథసమీక్షలను కూడా వ్రాయడం మొదలుపెట్టాడు. పాండిత్య స్ఫోరకమైన ఆ సమీక్షలలో అతడు తనఅభిప్రాయాలను నిష్పాక్షికంగానూ,నిస్సంకోచంగానూ ప్రకటించేవాడు. యోచనలో స్పష్టత, భాషపై అధికారం ఆ వ్రాతలలో స్ఫుటంగా గోచరిస్తాయి. సాహిత్య విమర్శకు కొన్ని ప్రమాణాలను కూడా అతడు నెలకొల్పాడు.

ఆ యుగంలో నవలలను రచించినవారిలో ప్రథముడు నంద శంకర్. అతడు "కరం ఘేలో" అనే చారిత్రక నవలను వ్రాశాడు. అతడే నవలను సంఘసంస్కరణాని కొక సాధనంగా రూపొందించాడు. అతని శైలిలో పొందిక లేదు. ఒక్కొక్కచోట సందర్భోచితం కానంత సుదీర్ఘంగానూ, ప్రబోధాత్మకంగానూ ఉంటుంది. మహీపత్‌రామ్ అనే రచయిత కూడా సంఘసంస్కర్తయే. అతడే విదేశాలకు వెళ్ళిన మొదటి గుజరాతీ పౌరుడు కావడం వల్ల, యాత్రావాఙ్మయ శాఖకు చెందిన మొదటి పుస్తకాన్ని రచించడం తటస్థించింది. ఈ విధంగా సంఘసంస్కరణ యుగంలో గుజరాతీ వచన వాఙ్మయానికి చక్కని పునాదులు పడ్డాయి.

1858 లో బొంబాయి విశ్వవిద్యాలయ స్థాపన జరిగింది. అక్కడ విద్యాభ్యాసం చేసిన వారు వివిధ శాస్త్రాలలో నిష్ణాతులు కావడంవల్ల పాండిత్యప్రకర్షతో కూడిన సాహిత్యాన్ని వారు సృష్టించారు. అందువల్ల గుజరాతీ సాహిత్యచరిత్రలో దానికి "పండిత యుగం" అనే పేరు వచ్చింది. ఆ యుగానికి చెందిన వ్యాసకర్తలు తమ రచనలలో తత్త్వశాస్త్రం, మతం, మానవధర్మశాస్త్రం, రాజనీతి, ఆర్థిక శాస్త్రం, సాహిత్యం, విద్యాబోధన వంటి వివిధాంశాలను స్పృశించారు. వారి వచన శైలిలో పదాడంబరం, క్లిష్టత కనిపిస్తాయి. గత యుగంలోని ప్రజారంజక సాహిత్యం కంటె ఆ యుగంలో వెలువడిన సాహిత్యం పరిమాణంలోనూ, ప్రమాణంలోనూ ఉన్నతస్థాయి నందుకొన్నది. నాటి రచయితల దృష్టి విశాలమైనది. భావన హేతుబద్ధమైనది. అప్పటి వరకు సాహిత్యంలో వర్ణితంకాని ఎన్నో అంశాలను వారు తమ రచనలలో ప్రస్తావించారు. నాటి పండితులు అభినయం, అలంకార శాస్త్రం, హాస్యం,

కనుకట్టు విద్య, మతం, విద్యావిధానం వంటి వివిధ విషయాలపై రచనలను ప్రకటించారు. నాటి రచయితలను రెండు వర్గాలుగా విభజించవచ్చును. కొందరు గతంలోని మంచిని పున రుద్ధరించాలనే వర్గానికి చెందినవారు. ఆనందశంకర్, నానాలాల్, మణిలాల్, సాభూభాయ్ మన్‌సుఖ్‌రామ్, ఇచ్ఛారామ్, నర్మదాశంకర్ ప్రభృతులీ కోవకు చెందినవారు. మరికొందరు పాశ్చాత్య సంస్కృతిలోని మేలిగుణాల ననుకరించాలని ప్రబోధించిన వారు. ఈ వర్గానికి చెందిన రచయితలలో రమణ్‌భాయ్, నరసింగరావ్, బలవంతరాయ్, ప్రభృతులు ముఖ్యులు. ఈ రెండువర్గాలవారు పరస్పరం వైరుధ్యం వహించడమేగాక అప్పుడప్పుడు తమ రచన లలో వ్యక్తిగత దూషణకు కూడా తావీయడం జరుగుతూ ఉండేది. ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతులు రెండిటిలోని మేలిగుణాలను గ్రహించడం భావ్యమని బోధించే మరొక వర్గం కూడా ఒకటి ఉండేది. ఆ వర్గానికి చెందిన రచయితలలో ప్రథమ గణ్యుడు గోవర్ధన్ రామ్.

"సరస్వతీ చంద్ర" అనే ప్రసిద్ధమైన నవలను రచించినందుకు గోవర్ధన్‌రామ్‌ను ప్రత్యేకించి పేర్కొనవలసి ఉన్నది. అది అత్యుత్తమ రచన. కేవలం గుజరాతీ సాహిత్యంలో నే గాక భారతీయ సాహిత్యంలో ఉన్నత స్థానం పొందదగిన రచన అది. సమకాలిక సమస్య లన్నిటినీ చిత్రించడమేగాక, వానికి పరిష్కార మార్గాలను కూడా సూచించిన మొదటి సాంఘిక నవల అది. గోవర్ధన్‌రామ్ మేధావి గనుక అతని నవలలో తాత్త్వికదృష్టి ఎక్కువగా గోచరిస్తుంది. వచన రచనలో అతడు సిద్ధహస్తుడు. సంస్కృత శబ్దాధిక్యంవల్ల అతని శైలి సులభంగా అర్థం కాదు. ఐతే మాండలిక పదాలను ప్రయోగించడంలో కూడా అతనికి నైపుణ్యం లేకపోలేదు. తరువాత వచ్చిన రచయిత లనేకులు అతని సాహిత్యంవల్ల ఉత్తేజం పొందారు. చిన్నకథ కూడా ఆ యుగంలోనే తలయెత్తి, వ్యాప్తిని పొందింది. నాటి రచయితలందరూ నగర వాసులూ, ఉన్నత విద్యావంతులూ, కావడంచేత ఇతివృత్తాల ఎన్నికలోనూ, పాత్ర సృష్టిలోనూ వారు తమ కథలలో సమాజంలోని ఒక వర్గానికి చెందిన వ్యక్తుల జీవితాన్ని మాత్రమే చిత్రించడం జరిగింది. గ్రామీణ జీవితాన్ని వర్ణించే కథ అప్పుడు వెలువడలేదు. నాటి కథకులలో ధన్‌సుఖ్‌లాల్ మెహతా, మలయానిల్, రామమోహన్ సేన్, హర్గరిదాస్ కాంటావాలా, రమణ్‌భాయ్ ప్రత్యేకించి పేర్కొనదగినవారు.

1915లో గాంధీ మహాత్ముడు భారతదేశానికి తిరిగివచ్చి సాబర్మతీ ఆశ్రమాన్ని, గుజరాత్ విద్యాపీఠాన్నీ నెలకొల్పాడు. క్రమంగా సాహిత్యంతోపాటు జీవితంలోని అన్ని రంగాలలోనూ ఆయన ప్రభావం ప్రసరించ నారంభించింది. ఆ ప్రభావానికి లోనైనసాహిత్యాన్ని గాంధేయ సాహిత్యమనీ, ఆ యుగాన్ని గాంధీ యుగమనీ సాహిత్య చరిత్రకారులు వ్యవహరిస్తు న్నారు. ఆ యుగంలో సాహిత్యపు కార్యక్షేత్రంపట్నాల నుంచి పల్లెపట్టులకు, భావనా జగత్తు నుంచి వాస్తవికతకు, విద్యావంతుల నుంచి జనసామాన్యానికి మారింది. గతయుగంలోని సాహిత్యం విద్యావంతుల కోసమే రూపొందింది .గాంధీ యుగంలోని సాహిత్యం సామాన్య ప్రజల కోసం, వారిని నాయకులుగా చేసుకొని వెలువడింది. గతయుగపు సాహిత్యంపై బొంబాయి విశ్వవిద్యాలయ ప్రభావం ప్రసరించినట్లే, గాంధీ యుగంలో సాహిత్య వ్యాసం

గానికి గుజరాత్ విద్యాపీఠం కేంద్రంగా రూపొందింది. వ్యక్తులదృక్పథంలో మార్పు వచ్చింది. జాతీయతకు ప్రాధాన్యం లభించింది. నవలలు, కథలు, వ్యాసాలు, నాటకాలు సాహిత్యవిమర్శ, యాత్రా వాఙ్మయం, నదుల చరిత్రలు, సాంస్కృతిక రచనలు, తత్త్వ శాస్త్రం, దినచర్యా గ్రంథాలు, లేఖలు, జానపద సాహిత్యం, జీవితచరిత్రలు కోకొల్లలుగా వెలువడ నారంభించాయి. ఉత్తమ సాహిత్యం ఆనాడు గుజరాత్ రాష్ట్రాన్ని ముంచెత్తింది.

కన్హయ్యాలాల్ మున్షీ ఆ యుగానికి చెందినవాడే కాని నాటి వాతావరణాని కతడెక్కువగా లోబడలేదు. "బ్రహ్మచర్యాశ్రమం" వంటి పుస్తకాలలో గాంధేయ సిద్ధాంతాల నతడు హేళన చేసినప్పటికీ, లోలోపల అతడు గాంధీజీ ఆదర్శాల వల్ల ప్రభావితుడయ్యాడనీ, కాని ఆసంగతి వెల్లడించక చాతుర్యంతో దాచిఉంచాడనీ చెప్పవచ్చును. "లోపాముద్ర", "విశ్వరథ", "భగవాన్ పరశురామ్'' వంటి పుస్తకాలలో పౌరాణిక, చారిత్రక కథల మాటున అతడు అస్పృశ్యతానివారణావశ్యకతను సత్యాగ్రహోద్యమ సిద్ధాంతాలను ప్రబోధించాడు. మున్షీ కాల్పనికవాది కావడం వల్ల సాంప్రదాయిక నైతిక సిద్ధాంతాలను తిరస్కరించి, స్వేచ్ఛా ప్రణయాన్ని సమర్థించాడు. నవలలో నాటకీయతను పోషించే విధానాన్ని అతడు తన చారిత్రక నవలలలో రూపొందించాడు. కాల్పనిక వాదశైలిని. సజీవపాత్ర చిత్రణ శిల్పాన్ని, త్వరిత కథాగమనాన్ని ప్రవేశ పెట్టాడు. మున్షీ నవలలతో పాటు నాటకాలను, వ్యాసాలను, ఆత్మకథను, జీవితచరిత్రలను, చిన్నకథలను, సాహిత్యవిమర్శను కూడా రచించాడు. అతని రచనలు గుజరాతీవచన వాఙ్మయాని కెంతో పుష్టిని కలిగించాయి.

మున్షీవలెనే నవలలను, కథలను, నాటకాలను, సాహిత్య విమర్శలను రచించిన రమణ్‌లాల్ దేశాయ్ గాంధీయుగానికి యథార్థ ప్రతినిధి అని చెప్పవచ్చును. "దివ్యచక్షు" "భరేలో అగ్ని" వంటి అతని రచనలు అహింసా సిద్ధాంతాన్ని, సత్యాగ్రహాన్ని, అస్పృశ్యతా నివారణను; ధర్మానికే అంతిమ విజయం లభిస్తుందనే విశ్వాసాన్ని ప్రబోధించాయి. ఆ రచనలకు అత్యధికంగా ప్రజాదరణ లభించింది.

గాంధీజీ స్వయంగా ఉత్తమస్థాయికి చెందిన రచయిత. ఆయన సంస్కృత బహుళమైన వచనశైలికి మారుగా సరళమైన శైలి అవసరమని బోధించడమే గాక జన సామాన్యంనిత్యవ్యవహారంలో ఉపయోగించే నుడులతో, పలుకుబడులతో నిండిన సరళశైలితో తాను స్వయంగా వ్రాసి ఇతరులకు ఒరవడి పెట్టాడు. పొల్లు మాటలు లేకుండా చక్కని పలుకుబడులతో సూటిగా సాగినశక్తిమంతమైన వచనశైలిలో గాంధీజీ అనేకరచనలను చేశాడు. ఆయన ఆత్మకథను, వ్యాసాలను, లేఖలను వ్రాశాడు. "నవజీవన'', "హరిజన" వారపత్రికల ద్వారా ఆయన పత్రికారచనల ప్రమాణాన్ని పెంచి, వానికి సాహిత్యస్థాయిని సంఘటించాడు.

ఆ యుగపు రచయిత కాకా కాలేల్కర్ బహుగ్రంథకర్త. ఆయన వ్యాసాలను, యాత్రా వాఙ్మయాన్ని, ప్రకృతి, సంస్కృతి, మానవ ధర్మశాస్త్రంవంటి విషయాలపై పలు రచనలను, జీవిత చరిత్రలను రచించాడు. తన రచనలలో ఆయన గాంధేయ సిద్ధాంతాలను మనోరంజక శిల్పంతో ప్రబోధించాడు. సరళత, స్పష్టత, సమత, శక్తి ఆయన వచన

శైలికి ప్రధాన లక్షణాలు. మధ్యాహ్న సూర్యుని తేజస్సును, బురదలోని అందాన్ని సమంగా వర్ణించి, ఆయన ప్రకృతిలో సౌందర్యాన్ని దర్శించాలనే పాఠాన్ని గుజరాత్ రాష్ట్రవాసులకు నేర్పాడు. ఆయన రచించిన యాత్రా వాఙ్మయం గుజరాతీ సాహిత్యానికి అపూర్వాలంకారం.

గాంధీజీ ఆశ్రమవాసియైన కిశోరీలాల్ మష్రూవాలా మహామేధావి. ఆయన కొన్ని జీవిత చరిత్రలను, వివిధాంశాలపై వ్యాసాలను రచించాడు. ఆయన విప్లవాత్మక దృష్టి కలవాడు. నాటి ఆర్థిక, సాంఘిక, ధార్మిక, విద్యావిషయక, తాత్విక పరిస్థితులపై సూటిగా, నిస్సంకోచంగా తన అభిప్రాయాలను వ్యక్తం చేశాడు. ప్రజలను వక్రమార్గాల నుంచి మరల్చే సంకల్పంతో వారికి మాటలతో చురుకు అంటించడానికి వెనుదీయలేదు, తన భావాలను శాస్త్రీయంగా, హేతుబద్ధంగా ప్రకటించగల నేర్పు ఆయన వ్రాతలో కనిపిస్తుంది.

నాటి రచయితలలో రామ్‌నారాయణ్ పాఠక్ ఎంతో వైశిష్ట్యాన్ని ప్రదర్శించాడు. అతడు కథలను, కాలక్షేపానికుపకరించే లఘురచనలను, తాత్త్విక వ్యాసాలను, సాహిత్య విమర్శ గ్రంథాలను, కళకు సంబంధించిన రచనలను వ్రాశాడు. సమస్యలతో కూడిన కథలను, మనస్తత్వ పరిశీలన ప్రధానమైన కథలను, ప్రతీకవాదధోరణి కథలను, సంఘటనలే లేని కథలను రచించాడు. సాహిత్య విమర్శనుకూడా సృజనాత్మక రచనగా రూపొందించాడు.

దర్శక్ కూడా గాంధీ యుగానికి చెందిన రచయితయే. అతడు కొన్ని నాటకాలను, నవలలను వ్రాశాడు. గాంధేయ సిద్ధాంతాల నతడు క్షుణ్ణంగా అవగాహన చేసుకొని తన నవలలలోనూ, నాటకాలలోనూ, వ్యాసాలలోనూ వాటిని ఎంతో నిపుణంగా, కళాత్మకంగా ప్రకటించాడు.

ధూమకేతు పల్లెపట్టులను, పేదసాదలను చిత్రించడానికి చిన్నకథను సాధనంగా చేసుకొన్నాడు. సంఘాన్ని యథాతథంగా ప్రతిఫలింపజేయాలని ప్రయత్నించడంవల్ల అతని కథలెక్కువగా విషాదాంతమైనవి. భావావేశానికి తానులోనై పాఠకులకు కూడా అట్టి అనుభూతి నీయగల శక్తి అతని రచనలో కనిపిస్తుంది.

ఝవేర్‌చంద్ మేఘానీ విపులపరిశోధన ఫలంగా ప్రశస్తజానపద వాఙ్మయంతో గుజరాతీ సాహిత్యాన్ని సంపన్నం కావించాడు. అతడు విప్లవమార్గానువర్తి. విప్లవసాహిత్య పోషకుడు. అతడుతన కథలలోనూ, నవలలోను, వ్యాసాలలోనూ, ఏకాంక నాటికలలోనూ, సాహిత్య విమర్శలోనూ వామపక్షీయుల దృక్పథాన్నే స్థిరంగా ప్రదర్శించాడు. జానపదుల శైలిలోని అందచందాల నతడు వచన వాఙ్మయానికి సమకూర్చాడు. "సోరఠ్ తారా వెహతా పానీ" అనే అతని నవల మాండలిక నవలారచనకు మార్గదర్శకమయింది. తరువాత వచ్చిన రచయిత లీసాహిత్య ప్రక్రియలో ఇతోధిక శిల్ప రమణీయతను ప్రదర్శించగలిగారు. సౌరాష్ట్ర ప్రాంత జీవితాన్ని చునీలాల్ మాడియా, ఈశాన్య గుజరాత్‌లోని పర్వతప్రాంత ప్రజల జీవితాన్ని పన్నాలాల్ పటేల్, మధ్యగుజరాత్ ప్రజా జీవితాన్ని ఈశ్వర్ పెట్లీకర్ తమ నవలలలో చిత్రించారు. వారందరూ నవలలతోపాటు చిన్న కథలనుకూడా వ్రాశారు. అందరూ తమ ప్రాంతాలలోని గ్రామీణజీవితాన్ని కథావస్తువుగా ఎంచుకోవడంచేత వారి, రచనలు ఎక్కువగా ప్రజాదరణ పొందినవి.

కథా రచనలోనూ, ఏకాంకికా రచనలోనూ కొన్ని ఫలవంతమైన ప్రయోగాలను గులాబ్‌దాస్ బ్రోకర్, జయంతిలాల్ దలాల్ చేసారు.

హాస్య రచనలో అగ్రశ్రేణికి చెందినవాడు జ్యోతీంద్ర దావే. అతని హాస్యం అతి సహజమైనది. హాస్య సృష్టికతడు శ్లేషను, వితండవాదాన్ని, మానవుల దౌర్బల్యాన్ని, జీవితంలో పరస్పరం పొసగని సన్నివేశాలను నేర్పుతో ఉపయోగించుకొన్నాడు.

స్వాతంత్ర్యసిద్ధి తరువాత వెలువడిన వచన సాహిత్యంలో సాంప్రదాయికమార్గం, నవ్యమార్గం అని రెండు స్పష్టమైన రచనా విధానాలు కనిపిస్తున్నవి. నైతిక సూత్రాలపట్ల భక్తి, బహుళ ప్రచారంలో ఉన్న సాహిత్య ప్రక్రియల వాడుక, ఇతివృత్తానికి ప్రాధాన్యం సాంప్రదాయిక మార్గపు రచనల లక్షణాలు. వ్యక్తి సంక్షేమం సమాజ సంక్షేమానికి భిన్నమైనది కాదని, సమాజానికి దూరంగా తొలగిపోయేవారు చివరకు నష్టపడతారని ఆ రచయితలుద్ఘాటిస్తున్నారు. ఈ మార్గపు రచయితలలో లబ్ధప్రతిష్టులు గులాబ్‌దాస్ బ్రోకర్, మనసుఖ్‌లాల్ ఝవేరీ, శివ్‌కుమార్ జోషీ, ధీరూబెన్ పటేల్, విష్ణుప్రసాద్ త్రివేదీ ప్రభృతులు.

ఇక నవ్యమార్గానుయాయులను పాశ్చాత్య సాహిత్యంలోని అస్తిత్వవాదం, అధివాస్తవికత, ప్రతీకవాదం ఎక్కువగా ఆకర్షించాయి. ఈ రచయితలు నేటి జీవితంలో కనిపించే నిస్పృహను, వ్యక్తి క్రమంగా సమాజానికి దూరం కావడాన్ని, వ్యక్తిత్వంలోని చీలికను తమ రచనలలో ప్రదర్శిస్తారు. మతవిశ్వాసాలను, నైతిక సూత్రాలను నిర్మూలించాలని వారి సంకల్పం. కథన పద్ధతిలో నూతన ప్రయోగాలను చేస్తారు. అసాధారణమైన సంకేతాలను తమ రచనలలో ప్రవేశపెడతారు. లైంగికప్రవృత్తి, చైతన్యస్రవంతి శిల్పం వారి రచనలలో బహుళంగా కానవస్తాయి. వారిలో అంతర్ముఖినత ఎక్కువగా గోచరిస్తుంది. భావనకన్న వాస్తవికత ఎక్కువగా ఉంటుంది. ఈ నవ్యమార్గానికి చెందిన రచయితలలో చంద్రకాంత్ బక్షీ, సురేశ్ జోషీ, మధురాయ్, రఘువీర్ చౌధురీ, మహమ్మద్ మంకడ్, సరోజ్ పాఠక్ ప్రభృతులు ముఖ్యులు.

ఈ విధంగా దాదాపు నూట ఇరవై యైదేండ్ల నుండి గుజరాతీ వచన వాఙ్మయం పురోగమిస్తున్నది. దానికి చక్కని రూపాన్ని సంఘటించడానికి గాంధీజీ చేసిన కృషి గణనీయమైనది. రవీంద్రుడు వంగ వచనాన్ని సంపన్నం కావించినట్లే, గాంధీజీ గుజరాతీ వచన వాఙ్మయ పుష్టికి కారకుడయ్యాడు. ఇది సాహితీ పరులందరికీ గర్వకారణం కావడం సమంజసమే.

## విషయ సూచిక

### కవిత

## వచనం

3. కన్యాకుమారి దర్శనం

మహాత్మా గాంధీ

4. భువనగిరి

కాకా కాలేల్కర్

5. గాంధీ - మార్క్స్

కిశోరీలాల్ మశ్రూవాలా

6. డాక్టర్ జివాగో : తొలి తలపులు

దర్శక్

7. దినచర్యా గ్రంథంనుంచి

మహాదేవ్ దేశాయ్

8. ప్రార్థన

ధీరూబేన్ పటేల్

---

**నరసింహ మెహతా**

## నేను నిద్ర మేల్కొనినప్పుడు

నేను నిద్ర మేల్కొనినప్పుడీ ప్రపంచానికి అస్తిత్వం లేదనిపించింది.

నిద్రలోనే నేను వివిధ సుఖాలను చవి చూశాను. మనస్సు తెలిసి చేసే పనులన్నీ నిజంగా ఆ పరమాత్ముని చేతలే. వినోదింపజేసేదీ ఆయనయే, వినోదించేదీ ఆయనయే.

పంచభూతాలూ పరబ్రహ్మంనుంచి ఉద్భవించినవే. అణువణువుతోనూ అవి విడదీయరాకుండా ఉన్నవి. పువ్వులూ, పండ్లూ వృక్షంలో భాగమే. మానుకూ, కొమ్మలకూ భేదమేమీలేదు. బంగారాన్ని ఆభరణాలుగా మార్చినప్పుడే దానికి వేరు వేరు నామరూపాలేర్పడతాయి. ఐనా కావడానికి అది కేవలం బంగారమే.

ఆ పరమాత్ముని సంకల్పం వల్లనే ఆయననుంచి దివ్యులూ, ప్రాపంచిక జీవులూ విడిపోవడం, చతుర్దశభువనాలూ ఆవిర్భవించడం జరిగింది.

ఎవరిని ధ్యానించడం వల్ల ఋషులకు ముక్తి లభిస్తుందో ఆ పరబ్రహ్మ స్వరూపుడవు నీవే నని అంటాడు నరసింహుడు.

**అఖో**

## పదము

ఈ నాడు నా ఆనందానికి అవధులు లేవు. ఎందుకంటె తెలియరానిది నేడు నా జ్ఞానపరిధి లోనికి వచ్చింది.

మాయాతీతుడైన పరబ్రహ్మన్ని నేను స్తుతిస్తాను.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురూ ఆ పరబ్రహ్మమే.

శ్రుతులు ఆ పరమపురుషుడినే స్తుతిస్తాయి.

కేంద్రీ కృతమైన ప్రాణం ఆయన.

శూన్యంలో మనోహరంగా గోచరించేది ఆయన.

మానవభాషకు, తారతమ్యబుద్ధిగల మానవ భావనకు అతీతుడాయన.

ఆయన పరిపూర్ణుడు. అవ్యయుడు. స్థలకాలాది పరిమితులన్నిటికీ అతీతుడు.

మానవాకృతులు నశిస్తాయనే భయంలేదాయనకు. ఈ బ్రహ్మాండం ఆయనయే.

ఆయనను గ్రహించిన నాడే ఐహిక బంధాలు తెగిపోయి వ్యక్తి తన నిజస్వరూపాన్ని గుర్తించ గలుగుతాడు.

కర్మ లేదు. కనుక తత్పర్యవసాన రూపమైన ఫలం కూడా లేదు.

ఆయన సర్వశక్తిమంతుడు.

మానవచైతన్యం ఆయనలో విలీన మవుతుంది. సీమాబద్ధమైన జీవం అనంతునిలో కలిసిపోతుంది.

ఇక అప్పుడు దాత ఉండదు. ప్రతిగ్రహీతా ఉండడు.

శరీరమూ, ఆత్మా ఆయనలో విలీన మవుతాయి.

ఆధ్యాత్మికోన్నతి బహుముఖంగా కలుగుతుంది. ఆత్మకు భిన్నమైనదంతా అదృశ్య మవుతుంది.

ఇక అప్పుడు ఉదయాస్తమయాలు లేక భాస్కరుడు సదా ప్రకాశిస్తాడు.

ముముక్షువునకా ఆనందం అభిలషణీయమని అంటాడు ఆత్మ! అట్టి నిత్యానందానుభూతిని నేనెంత గాఢంగానో అపేక్షిస్తున్నాను!

ప్రేమానంద్

## సుదాముని పత్ని వేడుకోలు

[శ్రీ కృష్ణుని సహాధ్యాయియైన సుదాముడు దుర్భర దారిద్ర్య దుఃఖాన్ని అనుభవిస్తున్నాడు. అతనిది పెద్ద కుటుంబం. స్థిరమైన జీవనాధార మేదీ లేకపోవడం వల్ల అతనికి సంతతిని పోషించడం కష్ట మవుతున్నది. కనుక శ్రీకృష్ణుని దర్శించి ఆయన నడిగి కొంత ద్రవ్యం తెచ్చుకొంటే తమ జీవయాత్ర నిశ్చింతగా సాగగలదని భార్య అతనిని అర్థిస్తున్నది.]

అశ్రుపూర్ణ నయనాలతో ఆ గృహిణి అన్నది: "ఓ ఋషీ! నా మనస్సు వివశమవుతున్నది. నా మనవి నాలకించండి. మీ శుష్క వేదాంతం నాకు నచ్చలేదు. బిడ్డలు

ఆకలితో అల్లాడుతున్నారు. పోయి వారికి పట్టెడన్నం తెండి. ఎంతటి ఋషి సత్తము లైనా, భక్తశిఖామణులైనా భుక్తి లేనిదే శరీర ధారణ చేయలేరు.

కడుపులో కాలుతూ ఉంటే మనస్సు దేవుని మీదికి మరలదు.

అన్నోదకాలు లేకుండా ఈ ప్రపంచంలో జీవించడం అసంభవం. నా మొర వినండి.

ఓ ఋషీ! సాక్షాత్తు పరమ శివుడంతటి వాడు నట్టింట అన్నపూర్ణా దేవిని నిలుపు కొన్నాడు. స్వయంగా సూర్య భగవానుడే అక్షయ పాత్రను చెంత ఉంచుకొన్నాడు. ఇంద్రుడు సైతం కామధేనువును పెరటిలో కట్టివేసుకొన్నాడు. వారి యెదుట క్షుద్ర మానవులం మనమేపాటి వారమో యోచించండి. దేవతలు కూడా తమ అభీష్ట సిద్ధికి కల్ప వృక్షాన్ని ఆశ్రయిస్తారు. నా మాట చెవిని పెట్టండి. అర్థాకలితో కాలం గడుపుతూ ''ధర్మం'', "ఆత్మ", అంటూ వర్ణించడం నిరర్థకమని గుర్తించండి.

కడుపునిండుగా అన్నం దొరికినప్పుడే యావత్ప్రపంచం నిటారుగా నిలువ గలుగుతున్నది. కనుక మీరు బలరామ కృష్ణులను దర్శించి వారి నర్థించి ఏదైనా కానుక తీసుకొని రండి. అంతర్యామియైన కృష్ణ పరమాత్ముడు మన అభీష్టాన్ని గ్రహించి, మీకు సంప్రాప్తమైన దారిద్ర్యదుఃఖాన్ని వెంటనే హరించగలడు. తక్షణమే ఆ పరమాత్ముడు మీ దైన్యాన్ని తొలగించగలడు. కనుక నా ప్రార్థన నాలకించి మీరు ద్వారకా పురికి తరలి వెళ్ళండి.

## కృష్ణ సుదాములు

[సుదాముడు ద్వారకకు వెళ్ళినప్పుడు ఆయనకు శ్రీ కృష్ణుని అంతఃపురంలో రాజ మర్యాదలు జరిగాయి. కృష్ణుడు సుదాముని ఆరోగ్యాన్ని గురించి, గార్హస్థ్య జీవితాన్ని గురించి ఎన్నో కుశల ప్రశ్నలు వేశాడు.

గోవిందుడు సుదామునితో ముచ్చటిస్తూ, "మిత్రమా! నీ కష్ట సుఖాలన్నీ నాకు వివ రంగా చెప్పు. నీ వ్యక్తిగత విషయాలన్నీ తెలుసుకోవాలని నాకు కుతూహలంగా ఉన్నది. నీవు ఇంత బక్కచిక్కి ఉండడాని కేమి కారణం? నిన్ను ఏ సమస్య వేధిస్తున్నది. దాపరికం లేకుండా నాకు చెప్పు" అని అడిగాడు.

"ఎవరైనా గురువు నీ దృష్టిని ప్రాపంచిక జీవితంమీది నుంచి వైరాగ్యపథానికి మరల్చడంవల్ల నీవీ విధంగా చిక్కిపోయావా?"

"ఆధ్యాత్మిక భావన క్రమంగా వికసించడం వల్ల ఈ విధంగా నీవు దేహాన్ని శుష్కింప జేస్తున్నావా? ఏ కారణం వల్ల నీవింత నీరసించి ఉన్నావు?"

"బలవంతుడైన శత్రు వెవరైనా నిన్ను హింసిస్తున్నాడా? ఎవరైన నీ కలిమినంత టినీ దొంగిలించి నీకీ దీన స్థితిని కలిగించారా?

"నీ దగ్గర లోహ పాత్రలేదు. వెంట కాయ్యతో చేసిన పాత్రను తెచ్చుకొన్నావు. ఒంటి మీద చాలినంత బట్టకూడా లేదు. ఇందు కేమి కారణం మిత్రమా?"

"గత జన్మలో చేసిన దుష్కర్మవల్ల నీకిప్పుడు సుఖం లోపించిందా? అనుక్షణం

కాల్చుకొని తినే గయ్యాళి భార్య దొరికిందా? లేక తగినంత ఆహారం కొరవడడం వల్ల నీవీ విధంగా చిక్కిపోయావా?"

"ఈ కష్టాలలో నిన్నీ విధంగా క్షీణింపజేస్తున్న దేది?" అని కృష్ణుడు ప్రశ్నించాడు.

అప్పుడు సుదాముడు చేతులు జోడించి కృష్ణునికి నమస్కరించి, "సర్వజ్ఞుడవైన నీకు తెలియని దేదీ లేదు. నీఎడబాటే నాదుఃఖానికి ఏకైక కారణం. ఇన్నినాళ్ళుగా నిన్ను చూడ లేకపోయినందు వల్లనె నేను నీరసించి ఉన్నాను. ఇప్పుడు నాకు నీ ఆతిథ్యాన్ని అందు కొనే భాగ్యం కలిగింది. గనుక త్వరలో నాకు పుష్టి కలుగుతుంది" అని సమాధాన మిచ్చాడు.

దయారామ్

## భాగవతుడు

భాగవతుని లక్షణా లివి:

అత డితరులను భూషించడు, దూషించడు. పాక్షిక బుద్ధిలేక సర్వజీవులను సమదృష్టితో వీక్షిస్తాడు.

అతడు దృగ్గోచరం కాగానే ప్రజలు లౌకిక వ్యవహారాలను విస్మరిస్తారు.

అతనిని చూచినప్పుడు మనకు కృష్ణుడు స్మరణకు వచ్చి మనో మాలిన్యం క్షాళిత మవుతుంది.

అతడు చేతనా చేతనాత్మక ప్రకృతిలో సర్వత్ర ఈశ్వరున్నే దర్శిస్తాడు.

నిగర్వియై విశ్వకళ్యాణాన్ని ఆ కాంక్షిస్తాడు.

సర్వేశ్వరుని గుణగానం చేసేటప్పుడతని ఆనందానికి అవధు లుండవు.

అతని కనులలో ప్రేమ, ఎదదలో ఆనందం పొంగి పొరల్తుతూ ఉంటాయి.

పరుల కష్టాలను చూచి బాధపడతా డతడు, తానై ఎవ్వరినీ నొప్పించడు.

ఐహిక సుఖ భోగాలకు లోబడని ఆత్మ నిగ్రహం కలవాడతడు. మానవ మేధ కందని శ్రీ కృష్ణలీలా విలాస ధ్యానంలోనే అతని మనస్సు సదా మగ్నమై ఉంటుంది.

అత డితరులకు తోడ్పడడానికి సర్వదా సన్నద్ధుడై, నిత్యానందాన్ని అనుభ విస్తూ ఉంటాడు.

అతని కనులలో కృష్ణుడు ప్రతిఫలిస్తాడు. కరుణతో అతని ముఖం కాంతి మంత మవుతుంది.

అతడు శాంతి ప్రియుడు. నిత్యతృప్తుడు. ఇతరుల దొసగుల నెన్నడూ ఎంచడు.

అతడు మహోదారజీవి. సకలజనులకు ప్రీతిపాత్రుడు.

ఐశ్వర్యాన్నికాక్షిం చడు. అవిరళ కృష్ణభక్తి తత్పరుడై పొద్దుపుచ్చుతాడు.

అతడు సదా భగవంతుని పట్ల, భక్తులపట్ల అనురక్తుడై ఉంటాడు.
వినయ విశ్వాసపూర్ణ బుద్ధితో జీవిస్తూ సదా మృదుభాషల నాడుతూ ఉంటాడు.
సాధుపురుషుల సాహచర్యం చేస్తూ, ఇతరులకు పరిచర్యచేస్తూ ఉంటాడు.
నిష్కపటియై మనస్సును ప్రభుచరణాలపైననే నిమగ్నంచేసి జీవిస్తాడు.
దైవస్మరణమే అతని కాహ్లాదదాయకమైన కర్మ.
అట్టి భాగవతుని దాసానుదాసుడు దయారామ్.

**కాంత్**

## జ్ఞానాతిశయం

[ పాండవులలో చతుర్థుడైన సహదేవునికి భవిష్యత్తులో జరుగబోయేది ముందుగానే తెలిసికొనే ప్రజ్ఞ ఉండేది. కాని ఎవరైనా అడిగితేనే తప్ప ముందు ఏమిజరుగునున్నదో ఎవ్వరికీ చెప్పకూడదని కృష్ణుడతనినుండి వాగ్దానం పొందడంవల్ల ఆ ప్రజ్ఞ సహదేవునికి వరంగా కాక శాపంగానే పరిణమిరిచింది. ఆ విధంగా అతడనుభవించిన బాధ ఈకావ్యానికి కథావస్తువు. ]

ఆకాశంవంక కన్నెత్తిచూస్తే అది శూన్యమైనట్లు తోచింది. దిక్కులన్నీ అంధకారమయమైనవి. కీడుదాపురిస్తున్నట్లనిపించింది. ఆ ప్రాంతాన్ని భయంకర కాళరాత్రి ఆవరించింది. నగరంలో గుసగుసలు ప్రారంభమయ్యాయి.

ఇంద్రప్రస్థవాసులు తలలు గోకుతున్నారు. ఒక సంగతి వారికి సందేహాస్పదమైనదిగా తోచింది.

దుర్నిరీక్ష్యుడైన దుర్యోధనుడు పంపిన దూత ఆ రాత్రివేళ రాచనగరువైపు చాటుగా దాగి వెళుతున్నాడు.

ఆ దూత ఏమి పనిమీదవచ్చి ఉంటాడని ప్రజలు ఊహాగానం ప్రారంభించారు. అతని రాక సదుద్దేశంతో కూడినదికాదని వారు తలలు పంకించసాగారు.

ప్రజలలో గాఢంగా వ్యాపించిన సందేహం అసమంజసమైనదికాదు. ధర్మరాజును జూదమాడడానికి రమ్మన్న ఆహ్వానాన్ని ఆ దూత తీసుకొనివచ్చాడు. అది కుతంత్రంతో కూడిన ఆహ్వానం.

సాధుశీలియైన పాండవాగ్రజుడా ఆహ్వానాన్ని అంగీకరించి దూతను తిరిగిపంపి తన తమ్ములను సంప్రతించడానికి వారిని పిలిపించాడు.

సంప్రతించడానికి తగినంత పెద్దవాడు కాడని సహదేవుని మాత్రం పిలువనంపలేదు. మిగిలిన ముగ్గురు తమ్ములు బిరువెక్కిన గుండెలతో ధర్మరాజు దగ్గరకు వెళ్ళారు.

అప్పుడు సహదేవుడు ద్రౌపదితో తన మందిరంలో ఉన్నాడు. తనభర్త ముఖంమీద ఏదో విషాదరేఖ పొడసూపుతున్నదని ఆ సాధ్వి గుర్తించింది.

సహదేవుడు త్రికాలవేది. ముందు జరుగనున్నది-తమ పక్షానికి ఓటమి, పాంచాలికి పరాభవం-అతనికి స్పష్టంగా కనుల ఎదుట కనిపిస్తున్నది.

జరుగనున్నది స్పష్టంగా తెలిసినా, దానిని వెల్లడించే స్వాతంత్ర్యంమాత్రం అతనికి లేదు. అందుచేత అతడు ఎక్కువగా వ్యథచెందాడు. చివరకాబాధ అతనికి దుస్సహమనిపించింది.

"నేను రాబోయే ఆపదనుంచి ఎవ్వరినీ రక్షించలేను. ఈ నిస్సహాయత, కన్నీరు-ఇవే నా వంతునకు వచ్చినవి. భూతభవితవ్యాలను వర్తమానం వలెనే చూడగల ప్రజ్ఞ ఎంతటి యాతనతో కూడిన శాపం!

ఎందుకు నా బ్రతుకు, కాల్చనా! నోరువిప్పే అధికారం నాకులేనప్పుడు నా ప్రవర్తనను కృతఘ్నతగా ఎంచడానికి వీలులేదు. విషాద మేఘాలావరించనున్నవని తెలిసికూడా దానిని గురించి ఒక్కమాట అయినా అనే అవకాశంలేదు నాకు."

ఈ విధంగా అనుకోగానే అతని కండ్లలో నీరు తిరిగాయి. క్రమంగా ప్రాణమే, పోతున్నట్లనిపించింది. తన ప్రేయసిని కౌగిటిలోనికి తీసికొని ఆమె చేతులు పట్టుకొని తల వాల్చాడు.

కొంతసేపు ఆ విధంగా ఉండి తిరిగి యథాస్థితికి వచ్చారు. "ప్రియతమా! నిన్ను స్పృశించే అధికారం నాకులేదు. ఈ జ్ఞానాన్ని విస్మృతికూపంలోకి పడద్రోయకుండా ఆపడానికి వీలులేదా? రాబోయే దుర్ఘటనను నివారించే వీలులేదా? ఈ జ్ఞానంవల్లనే నాకీవ్యథ! మేము ఇందరమున్నాము కాని ఈ విధంగా బాధ పడవలసినకర్మ మాత్రం నాకే సంప్రాప్తమయింది.

"ప్రియా! రాత్రివేళల అప్పుడప్పుడు నిద్ర పట్టక నా కళ్ళు బరువెక్కుతాయి. అప్పుడు నీ కేశ పాశాన్ని సవరించి, ఇందు సఖమైన నీ సుందర వదనాన్ని తదేకదీక్షతో చూస్తూ ఉంటాను."

సహదేవు డీ మాట లనగానే అతనికి తీవ్రమైన తలనొప్పి ప్రారంభమయింది. తలను చేతులతో నొక్కుకున్నా ఏమీ ప్రయోజనం లేకపోయింది. హృదయవిదారకంగా ఆర్తరవంచేసి "ఇంక చివరి ఔషధం సేవించడం కంటే గత్యంతరంలే" దన్నాడు.

కొన్ని అడుగులువేసి, సీసాను తీసికొని, క్రింది పెదవిని పళ్ళతో అదిమి, పాత్రను ద్రవంతో నింపి, గడగడ త్రాగి దేహస్మృతిని కోల్పోయాడు.

ఆ వాసనకే ఆ సాధ్వి మత్తెక్కి శయ్యమీద పడిపోయింది. ఆ దైవజ్ఞుడు కూడా పడి ఉన్నాడు. పాత్ర అతని గుండెదగ్గర ఉన్నది.

కలాపి

## నీ స్మృతి

ఎటు చూచినా నాథ నీ మూర్తియే గోచరిస్తుంది.

నీ స్మృతి నా కనులనుంచి అశ్రుధారగా ప్రవహిస్తుంది.

ఎరుపెక్కిన ప్రియురాలి చెక్కిళ్ళలోని అరుణిమవు నీవు.

ఉద్యానవాటికలోని పుష్పాలలో నీ మూర్తినే చూస్తాను నేను.

సుందర సాగరతరంగాలను చూచినప్పుడు నీవా అలలపై తేలియాడుతున్నట్లుంటుంది.

గగనవీధిలోని తారకాపంక్తి నీవు సఖులిరి కూర్చొన్న దృశ్యాన్ని స్ఫురింపజేస్తుంది.
నదిరేయి నీ మధురవీణాస్వరం వారక్త ప్రసారంతో వినిపిస్తుంది.

నీ ప్రేమకవచం నన్ను రక్షిస్తున్నంతకాలం అదృశ్యతీరాలనుండి వచ్చే శత్రువుల దాడికి చలించను.

నీవు సకల కల్మష హారిణియైన పూత గంగాజలరూపంలో ఉన్నావని విశ్వసిస్తున్నాను గనుక లోకంలోని దుర్మార్గం, పాపం నాకు భయాన్ని కలిగించవు.

హింసాకాండకు నేను చలించనప్పుడు, అందరూ ఆశ వదలుకొన్నప్పుడు ఉత్తేజకరమైన నీ స్మృతి నాకు ఊరట నిస్తుంది.

చేయి చేయి కలిపి పరస్పరం చిరస్నేహబంధంతో కట్టువడే ప్రేమికులకునికి నీ కరుణకు నిదర్శనం.

ఆత్మబంధువు అంతిమప్రయాణవేళ అప్తులు కార్చే కన్నీరు మా నుంచి నీవు దూరం కావడంవల్ల స్రవించేవే.

ప్రేయసీప్రియులు నడిచే బాట నీ దగ్గరికే చేర్చేదయితే, ఒంటరిగా నేనా మార్గాన ఎందుకు పయనించరాదు?

ప్రాచీనం, నవీనం, సుఖం, దుఃఖం-అన్నీ పరిణామశీలమైనవే.

కాని పరిణామమే లేనిది నీ స్మృతియే.

పుస్తకపాండిత్యమంతా విస్మృతం కానీ, అనుభూతులన్నీ అంతర్హితం కానీ,
నీ స్మృతి మాత్రం సదా నన్ను వెన్నంటి ఉండాలి.

విధిప్రేరణచేత నేను సహస్రాపరాధాలను చేయవచ్చునుగాక, నిన్ను గూర్చిన స్మృతి ఒక్కటే యథార్థమని, నిత్యమని మాత్రం నేను పూర్తిగా గ్రహించాను.

**నానాలాల్**

## పెరుగు

పెరుగును కొంచెం మెల్లగా చిలుకు!
ఇది కాదు ప్రథా! పెరుగు చిలికే తీరు!
కుండ పగిలిపోగలదు. పెరుగు నా రవికపై చిందగలదు.
నా వక్షంపై చిందులాడే ముత్యాలసరం తెగి ముత్యాలన్నీ చిందరవందర కాగలవు.

కుండ బోర్లపడితే ప్రశస్తమైన చల్ల అంతా వ్యర్థంగా నేలమీద కారిపోగలదు.
నీ ప్రేయసి వలువపై పూర్తిగా పెరుగు చిందగలదు.
పెరుగును కొంచెం మెల్లగా చిలుకు!
ఇది కాదు ప్రభూ! పెరుగు చిలికే తీరు!
యమున అంతా ఈ చిన్న కుండలో ఉబుకుతున్నది.
కవ్వపుత్రాటి నంత వంకరగా పట్టుకోకు ప్రభూ!
ఈ మృదు భాండంలో అమూల్యమైన అమృతం పొంగుతున్నది.
తనివి తీర దీని నాస్వాదించు ప్రభూ!
కాని పెరుగును కొంచెం మెల్లగా చిలుకు!
ఇది కాదు ప్రియా! పెరుగు చిలికే తీరు!

**బలవంత్‌రాయ్ ఠాకోర్**

## పుట్టినిల్లు

కొంతసేపు నేను మంచంమీద కూర్చున్నాను. తరువాత ఇంటిలో క్రింద, మేడ మీదా ఉన్న గదులన్నీ చుట్టివచ్చాను. ఎదలో తెరలు తెరలుగా మధురస్మృతులు విచ్చుకొన్నాయి. ఎప్పుడూముఖాన చిరునవ్వు చిందే మమతామూర్తియైన మా అమ్మను, మేము భయభక్తులతో సమీపించే మా తండ్రిని, పంతుకోటీయేముందు మాకు కథలూ, కబుర్లూ చెప్పే నాయనమ్మను ఊహించు కొన్నాను. చిన్ననాటి స్మృతులతో నిండినప్రదేశాలన్నీ తిరిగి జీవకళతో ప్రకాశించాయి. గతంలోని కంఠాల ధ్వనులూ, ప్రతిధ్వనులూ వినిపించాయి.

కంటి కింపు నింపే నాటి ఆచారాలూ వేడుకలూ తిరిగి చైతన్యవంత మయ్యాయి చెల్లెళ్ళు, తమ్ములూ వేరు వేరు వయస్సులలోని తమ రూపాలతో నా కంటిముందు కనిపిస్తూ మాయమయ్యారు. ఆ విధంగా నా ఎదుట మార్పు చెందుతున్న రూపాలతో నడుమ నడుమ ఒక అపూర్వవ్యక్తిని చూశాను. పాణిగ్రహణవేళ హోమం జరిగినప్పటినుంచి ఈ క్షణం వరకు నా హృదిని సమ్మోహితం చేసిన వ్యక్తి రూపమది. నేను కన్యగా ఉన్నప్పుడు కూడా బాలకరూపంలో నా మనోవీధిలో విహరించిన వ్యక్తి అతడు. నా పుట్టినింటమంచం మీద విశ్రమిస్తున్నప్పుడు గతజీవితమంతా నా కనులముందు చలనచిత్రంలోని దృశ్యాల వలె తిరిగింది. ప్రియా! నీవు నాలో ఎంతగా నిండి ఉన్నావో ఇప్పుడు నేను గుర్తించగలిగాను.

**సుందరం**

## ప్రసాదించు ప్రభూ!

నా చీకటి రాత్రులకు తారకల కాంతిని ప్రసాదించు ప్రభూ!
వెన్నెల రాత్రులకు చంద్రజ్యోత్స్నను,

పవళ్ళకు సూర్యరశ్మిని ప్రసాదించు.
నా చీకటి రాత్రులకు తారకల కాంతిని ప్రసాదించు ప్రభూ!
నా పుష్పాలకు సుగంధాన్ని,
కాంతారాలకు వృక్షాలను,
వసుంధరకు విహాయసాన్ని ప్రసాదించు.
నా చీకటి రాత్రులకు తారకల కాంతిని ప్రసాదించు ప్రభూ!
నా సస్యానికి శోక్తలను,
జలాలకు తీరాన్ని,
సాగరానికి తరంగాలను ప్రసాదించు.
నా చీకటి రాత్రులకు తారకల కాంతిని ప్రసాదించు ప్రభూ!
నా ప్రాంగణానికి పసిబిడ్డలను,
గ్రామసీమకు తటాకాన్ని,
గోవులకు క్షీరాన్ని ప్రసాదించు.
నా చీకటి రాత్రులకు తారకల కాంతిని ప్రసాదించు ప్రభూ!
నా మానసానికి ప్రియానురక్తిని,
హృదయాని కనురూపహృదయాన్ని,
ఆత్మకు రామప్రభువును ప్రసాదించు.

ఝవేర్‌చంద్ మేఘానీ

## తుది పాత్ర

[1931 లో రౌండ్ టేబిల్ సమావేశంలో పాల్గొనడానికి గాంధీజీ ప్రయాణమై వెళ్ళుతున్నప్పుడు రచించిన గీతం]

**బాపూ :** ఈ తుదిపాత్రలోని విషాన్నికూడా మ్రింగు.

సముద్రాన్నే నీవు పానం చేశావు. కనుక ఈ గ్రుక్కెడు విషాన్ని నీవు విడువ నక్కరలేదు.

యావజ్జీవితం నీవు ద్రోహులతోనూ, దుర్మార్గులతోనూ వ్యవహరించవలసి వచ్చినా, ఏ వ్యక్తిపైన నీవు విశ్వాసం విడనాడలేదు. ఇప్పుడుకూడా నీవు స్థైర్యంతో శత్రువుల ఒడిలో తలనుంచుతున్నావు.

ఇప్పుడు నీవు తుదిసారి తలగడపై తల మోపుతున్నావు. ఈసారి నీ కంఠం తెగిపోవచ్చును. శత్రువుల మనస్తత్వం నీకు పూర్తిగా అవగత మవుతుంది బాపూ!

ఈ దేవాసుర సాగర మథనంలో కేవలం ప్రశస్త రత్నాలనే కాంక్షించే వారు అంధులు. కాని పరమ శివుని వలె నీవు కాకపోతే హాలహల పానం చేయగలవారెవరు?

నీ గుండెల దాకా విషం ఇప్పటికే నిండినా, శత్రువుల మధ్యకు వెళ్ళడానికి త్వర పడుతున్నావు. మార్దవం, కాఠిన్యం జీర్ణించుకొన్న మహాత్మా! వెళ్ళు.

"యోగి తపోబలం హరించిందా? సముద్రాలన్నీ ఇంకిపోయినవా? మేఘాలలో నీరు అదృశ్య మయిందా? రవి చంద్రుల తేజం క్షీణించిందా." అని ప్రశ్నిస్తుంది ప్రపంచం.

మా బాధలను గూర్చి నీవు చింతించకు. ఇప్పటికి మే మెంతో కష్ట పడ్డాము. ఇకముందుకష్ట పడబోతాము. కానీ నీవు సంకోచించకు బాపూ!

కొరడా దెబ్బలు, ఆస్తుల దురాక్రమణ, జరిమానాలు, లాఠీ దెబ్బలు, సజీవశ్మశానాలైన చెరసాలలు, తుపాకిగుండ్ల జల్లు-అన్నిటికీ మేము పూర్తిగా అలవాటు పడ్డాము. ఎందు కంటే మా సుమపేశల హృదయాలను నీవు ఉక్కుగా మార్చివేశావు.

విదేశంనుంచి నీ వేమైనా వెంట తెస్తే నేమి, లేకుంటేనేమి? రిక్త హస్తాలతో నీవు తిరిగివచ్చినా మేము నీ పాదాలను చుంబిస్తాము. ప్రేమతో నిన్ను కౌగిలించుకొంటాము.

కొంచెం ప్రపంచం వంక కన్నెత్తి చూడు బాపూ! ఓదార్పు మాటలతో ప్రజలకు నీ సందేశాన్ని వినిపించు. లేకుంటే "జ్ఞానినని భావించే వ్యక్తి దౌర్బల్యాన్ని ఒక మదాంధుడు కనిపెట్టడం వల్ల అతడు వ్యాధిని కుదర్చలేక పోయాడు. మానవ జాతి నంతటినీ ప్రేమించే ఆ వ్యక్తి అన్యప్రాంతాల దుస్థితిని పట్టించుకోలేదు" అని ప్రపంచం నిన్నాక్షేపించగలదు. రుజాగ్రస్తమైన మానవ జాతి నీకోసం, నీవు చేసే చికిత్సకోసం అమితమైన ఆపేక్షతో ఎదురు చూస్తున్నది బాపూ!

రాజేంద్రషా

## పుణ్యభారతధాత్రి

జయము భారతధాత్రికి! ఈ నేలకు! ఈ కడలికి! ఈ నింగికి!
ఋతుకర్తకు జయము! జయము దాతకు! విధినిర్ణేతకు!
స్వర్ణ కిరణాలతో ఉదయాద్రిని స్పృశించే రశ్మిమంతునకు జయము!
స్వచ్ఛ కౌముదితో నిశను నింపే అమృతాంశునకు శశికి జయము!
జయము సురలకు! ఋషులకు! పథ ప్రదర్శకులకు! వైతాళికులకు!
జయము పుణ్య భారత ధాత్రికి! ఈ కడలికి! ఈ నింగికి!
సత్యం, మనోనైర్మల్యం, సంశయానికి తావీయని ధర్మం,
అలసతకు దారితీయని కర్తవ్యపాలన,
హృదయానికీ మేధకూ, భావనకూ తర్కానికీ,
రక్తికీ అనాసక్తికీ సంపూర్ణ సామరస్యం నెలకొన్న పుణ్య ధాత్రి ఇది!

పూర్ణమై, ప్రగతిశీలమై, కాంక్షావిహీనమై సాగేజీవితానికి జయము!
జయము పుణ్యభారత ధాత్రికి! ఈ కడలికి! ఈ నింగికి!
మహనీయులకు, సామాన్యులకు, పెద్దలకు పిన్నలకు, అందరికి జయము!
నిత్యస్థితమైన, నిత్య నూతనమైన, ఆహ్లాదకరమైనఉత్సవానికి జయము!
భూతభవితవ్యాలకు, అనుక్షణానికి, క్షణికానికి, నిత్యానికి, అన్నిటికి జయము!
జయము భారతధాత్రికి! ఈ నేలకు! ఈ కడలికి! ఈ నింగికి!

నిరంజన్ భగత్

## సింహాన్ని చూచినప్పుడు

దూకే తీరు వెనుకటిదే, పదునైన గోళ్ళు కూడా మునుపటివే.
నడకలో ఠీవి, కండ్లలో వెలుగు పూర్వపువే.
ఉగ్రత కూడా అప్పటిదే.
తీక్ష్ణ దంష్ట్రలు, రక్తపిపాస వెనుకటివే.
దేహంలోని ప్రతి రక్తనాళం పూర్వమున్నదే.
కాని చుట్టూ దుర్గమారణ్యం మాత్రం లేదిక్కడ.
ఓ మృగరాజా!
ఈ ఇనుపచువ్వల వెనుక బంధించి
నీకు మేము సభ్యతను, సాంఘిక మర్యాదలను నేర్పుతాము.
ఇక్కడ నిన్ను చూసి మనుష్యులు జంతువులుగా మారుతారు.

ప్రియకాంత్ మణియర్

## రాధాకృష్ణులు

విశాల విహాయసము కృష్ణుడు,
చంద్రజ్యోత్స్న రాధ.
సలిల సరోవరము కృష్ణుడు,
విరిసిన ఇందీవరము రాధ.
కుసుమితోద్యానము కృష్ణుడు,
మలయపవనము రాధ.
మహీధర శిఖరము కృష్ణుడు,
కొండకొమ్మకు కాలిబాట రాధ.

కదలు పదములు కృష్ణుడు,
తత్పద చిహ్నములు రాధ.
చక్కదువ్విన కురులు కృష్ణుడు,
నడుమ సీమంతము రాధ.
ఉజ్జ్వల దీపము కృష్ణుడు,
తద్దీపవర్తి రాధ.
ఈ నా లోచనములు కృష్ణుడు,
దృశ్యమాన ప్రపంచము రాధ.

**హస్‌ముక్ పాఠక్**

## రాజ్‌ఘాట్ దర్శించినప్పుడు

గాంధీగా రెన్నడూ **పూల** రాసుల అడుగున పవళించలేదు,
ఇంత దీర్ఘ కాలమూ కనుమూయలేదు.

**నలిన్‌రావల్**

## స్మృతి

సంధ్యారుణ రాగరేఖలు కిటికీ మీది చెక్కడాలలో దోబూచులాడుతూ ఉండగా చూసి, ఆపకుండా పూలును అల్లుతున్న ఆ ముసలివ్రేళ్ళు హఠాత్తుగా ఆగిపోయాయి.

ముఖంలోని ముడతల వ్యూహంలో ఏదో ఒక ఊహ చిక్కుకొన్నది.

బరువుతో కనుబొమలు క్రిందికి వ్రాలి, తరువాత మీదికి చూశాయి.

స్పష్టంగా, నిశ్చలంగా దృష్టి సారించలేని నేత్రం శూన్యం వంకచూస్తూ అడిగింది, "ఎవరది ? పెదవులపై అగ్నికీలను నిలిపిన దెవరు ? ఎవరి రుధిరమిది, ఈ విధంగా నవ్వుతున్నది ?" అని.

కిటికీ మీది చెక్కడాలలో చీకట్లలముకొన్నవి. పూలు నల్లుతున్న ముసలి వ్రేళ్ళు హఠాత్తుగా వణికాయి. మరుక్షణాన తిరిగి తమ పనిలో మగ్నమయ్యాయి.

**ఆనంద శంకర్ ధ్రువ్**

## ఒకానొక వెన్నెల రాత్రివేళ

నిన్నటి సాయంకాలం ఒక స్నేహితునితో కలిసి నేను పొలాలలో తిరుగుతూ పడమటి దిక్కున సూర్యాస్తమయ కాలపు చిత్రవిచిత్ర వర్ణోత్సవాన్ని తిలకిస్తూ చాలా కాలం

గడిపాము. అప్పుడు నాకు నరసింగరావు రచించిన గీత మొకటి జ్ఞప్తికి వచ్చింది.

"పశ్చిమటి ఆకాశం అగ్నిజ్వాలలతో నిండినట్లున్నది, చూడు. ప్రకాశించే దీపాల పంక్తులు అంతట కానవస్తున్నవి. అరుణారుణ మేఘాలు అగ్నిజ్వాలలవలె దశదిశల వ్యాపిస్తున్నవి. అక్కడక్కడ అవి దానిమ్మ పువ్వులవలె కనిపిస్తున్నవి" అని ఆ గీతంలో నరసింగరావు సూర్యాస్తమయాన్ని వర్ణించాడు.

ఈ పంక్తులను స్మరించుకొంటూ మేము నడుస్తున్నాము. క్రమంగా ఆ రంగుల చిక్కదనం సన్నగిలి, చివరకు పూర్తిగా అదృశ్యమయింది. ఒక్కొక్క నక్షత్రం ప్రకాశిస్తూ రాగా క్రమంగా ఆకాశమంతా తార కాంతితో మెరసిపోతున్నది. ఆకాశంలో పాలపుంత సమతలంలో పాలు ప్రవహిస్తున్నట్లు వెలుగుతున్నది. ఈ దృశ్యాన్ని సంపూర్ణ సౌందర్యంతో భాసింపజేయడానికి మేఘాల మాటునుంచి ధవళకాంతులతో చంద్రుడు ఆకాశసోపానాన్ని అధిరోహించాడు. అప్పుడు ప్రపంచం దేవలోకశోభతో భాసించింది. విశ్వమంతా శీతకిరణుని వెలుగుతో నిండిపోయింది. తారకా సముదాయం నడుమ కదిలే చంద్రుడు ఆకాశ సాగరంలో చిన్న పడవమీద ప్రయాణంచేస్తున్నట్లు తోచింది. నేనా దృశ్యాన్ని తదేకదీక్షతో చూస్తున్నాను.

నా మనోవీథిలో కదిలే భావపరంపరను గ్రహించిన నా మిత్రుడు నన్ను వాగ్వివాదంలోనికీడ్చే ఉద్దేశంతో తనవెంటవున్న పుస్తకంలోని కొన్ని పంక్తులను చదివి వినిపించాడు.

"ఖగోళశాస్త్రం వెల్లడించేవి ఈశ్వరుడనే ఊహాకల్పితమూర్తి ఘనతనుకాదు, ఆకాశంలో వ్యాప్తమైన జడపదార్థాల కార్యకారణ సంబంధ స్వరూపాన్ని గ్రహించగలిగిన హైపీరియన్, కెప్లర్, హెరటన్, భాస్కరాచార్యులు వంటి ఖగోళశాస్త్రజ్ఞుల ప్రజ్ఞనే ఆశాస్త్రం వెల్లడిస్తుంది" అని ఆ పుస్తకంలో ఉన్నది.

భక్తివల్ల, ధ్యానంవల్ల కలిగే ఆనందంతో హృదయం నిండిపోయిన నాకా మాటలలోని తర్కం చాలాబాధ కలిగించింది. అటు హృదయంతో పొందే అనుభూతిని కాని, ఇటు బుద్ధితో సాగించే హేతువాదాన్నికాని తృణీకరించడం నా మతంకాదు, ఈ రెండింటిని సమన్వయం చేయడం నా ఆశయం. శీఘ్రంగానే నేను చిత్తస్థైర్యాన్ని పొందాను.

"నీవు చదివిన పంక్తులలోని వాదాన్ని అంగీకరిస్తే, న్యూటన్ రచించిన "ప్రిన్సిపియా'' అనే గ్రంథం న్యూటన్ ఘనతను గాక; దానిని అవగాహన చేసుకొనే మనఘనతనే సూచిస్తుందన్నమాట. ప్రకృతి స్వరూపాన్ని గూర్చిన రచనలు చాటేది ప్రకృతిని సృష్టించిన ఈశ్వరుని ఘనతను; అంతేకాని న్యూటన్ ఘనతనుకాదని గ్రహించు. న్యూటన్ ఇతరులకంటె కుశాగ్రబుద్ధి కావడంవల్ల అప్పటికెవ్వరికీ తెలియని సత్యాలను గ్రహించగలిగినట్లే, మన ఋషులు వేదాలలోని సత్యం ప్రకృతిలో వ్యక్తంకావడాన్ని దర్శించగలిగారు. ఐతే వారు ఈశ్వరశక్తికి స్రష్టలుకారు-పఠితలు మాత్రమే. అందుకే వారిని ఋషులని, ద్రష్టలని, అంటున్నాము. పురాణాలు వర్ణించే బ్రహ్మదేవుడు ఈ విశ్వాన్ని సృష్టించాడు. ఆయన నలుముఖాలు వేదగానం చేస్తూ ఉంటాయి. ఆ ధ్వనులను వినడమే మన కర్తవ్యం ఆదే మనకు ఆనందాన్ని, సౌభాగ్యాన్ని చేకూర్చగలదు" అని నా మిత్రునితో అన్నాను.

నా వాదం నా మిత్రునికి నచ్చింది. కాని నా మనస్సు ఈశ్వర ధ్యానంనుంచి హేతువాదంమీదికి మరలడంవల్ల మరొక సువితర్కితమైన ఊహకూడా నాకప్పుడు స్ఫురించింది. ఈ విశ్వం మనకు దిఙ్మాత్రంగా ఈశ్వరుని ఘనతను వెల్లడించేమాట నిజమే. కాని ఈ సువిశాలవిశ్వంలో మానవుని స్థానమేమిటి? కాంతి కిరణం సెకండుకు ఒకలక్ష అరవై వేల మైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తుంది. ఐనా కొన్ని నక్షత్రాలనుంచి అది మన భూమి మీదికి చేరడానికి ఇరవై వేల సంవత్సరాలు పడుతుంది. హ్యాయ్ జీన్స్ అనే ఖగోళ శాస్త్రజ్ఞుడు చెప్పేమాట వాస్తవమైతే కొన్ని నక్షత్రాలనుంచి వెలువడే కాంతికిరణాలిప్పటికి భూమిని చేరనేలేదు. ఇతర గ్రహమండలాలలో సూర్యుని చోటును నక్షత్రాలాక్రమిస్తున్నవి. ఒకనాటికి మన సూర్యమండలం పూర్తిగా విచ్ఛిన్నమైనా, అది సముద్రతీరాన ఒక ఇసుకరేణువు పోవడంతో సమానమే! ఐనప్పుడీ విశ్వంలో మానవుని స్థానమేమిటి? అతని ఉనికిని ఈశ్వరుడెందుకు గుర్తించాలి? ఈ ఊహ నిజానికి నన్నెక్కువగా నొప్పించి ఉండేదే, కాని అదృష్టవశాత్తు ఆ క్షణంలోనే నాకొక ఇంగ్లీషు కవి రచించిన గీతంలోని కొన్ని పంక్తులు స్ఫురణకు వచ్చాయి.

"సూర్యుడు కదిలిపోతున్నాడు, చూడు. అతడెక్కడా ఆగనూలేదు. ఎన్నడూ తన దారినుంచి ప్రక్కకు తొలగనూలేదు. ఆ విధంగా దారి తప్పే స్వేచ్ఛ అక్షరమైన మన ఆత్మకు మాత్రమే ఉన్నది. సూర్యునితో నిమిత్తంలేకుండా ప్రకాశించగలశక్తి సృష్టిలో నాకు మాత్రమే ఉన్నది" అని ఆ కవి వ్రాశాడు. ఇది ఎంతటి ఉదాత్తమైన భావం! దీనివల్ల నా విశిష్టత నా కర్థమయింది. నా బాధ్యతకూడా నాకుతెలిసింది. ఈ ఊహనన్ను కదిపివేసింది. దీనిలో గంభీరమైన అర్థం ఉన్నదని నేను గ్రహించాను. నా స్థితి విశ్వవిపంచి నుండి విడివడ్డ ఒకతంత్రివంటిదని, మందనుంచి తప్పిపోయిన లేడిపిల్లవంటిదని నాకు స్పష్టమయింది. ఈశ్వరుని అనుగ్రహంలేనిదే ఒకక్షణంకూడా నేను నా విముక్తధర్మాన్ని నిర్వర్తించలేనన్న సంగతి నాకప్పుడు స్పష్టమయింది. జీవాత్మ పరమాత్మకంటె భిన్నమైనదని, స్వతంత్రమైనదని అంగీకరిస్తేనేకాని ఈశ్వరుని అస్తిత్వాన్ని విశ్వసించడం సాధ్యం కాదని కొందరంటారు. కాని అది అహమికతో కూడిన శుష్కవాదమని నాకనిపిస్తుంది. నేనే పని చేసినా ఈశ్వరుని ప్రేరణవల్లనేనని, ఈశ్వరుని చేతులలో నేనొక ఉపకరణాన్ని మాత్రమేనని చిత్తశుద్ధితో విశ్వసించిననాడు, పాపకర్మల నాచరించాలనే సంకల్పం అతని హృదయం నుంచి పూర్తిగా తొలగిపోయి ధార్మికజీవనం సుమపరిమళంవలె అలముకొంటుంది. ఈ విధంగా నన్ను నేను సమాధానపరచుకొన్నా, మరొక సమస్య తల ఎత్తింది – "ఈశ్వరుడెందుకు నీపై అనుగ్రహించి నిన్ను ఋజుపథంవైపు మరల్చాలి" అని.

సద్భావనవల్ల బలపడిన నా మనస్సుకు సమాధానంకూడా వెంటనే స్ఫురించింది. "ఎందుకనుగ్రహించాలంటావా? ఈశ్వరుడు ప్రేమమయుడు గనుక. ... ప్రభూ! నేను నీ వాడను." ఈ మాట నా హృదయాంతరాళంనుంచి అప్రయత్నంగా వెలువడింది.

నా మిత్రుడీమాట విని, "మీ శంకరాచార్యులవారి అద్వైతవేదాంత మిదేనా?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నలోని హేళనను నేను గ్రహించాను.

"మా శంకరాచార్యులవారు "ప్రభూ! తరంగాలు సముద్రానికి చెందుతవి, కాని సముద్రం తరంగాలకు చెందదు. ఆ విధంగానే నేను నీలోని అంశాన్ని. కాని నీవు నాలోని

అంశానివికావు' అని అన్నారు" అని గంభీరంగా అతనికి సమాధానమిచ్చాను. అప్పుడు బ్రహ్మం సగుణమా, నిర్గుణమా అనేచర్చ ఉదయించింది కాని వ్యవధి లేనందున మరొక మారు దానిని గూర్చి చర్చించవచ్చు ననుకొన్నాను.

అప్పటికి చంద్రుడు నభోంతరాళానికి చేరుకొన్నాడు. విశ్వమంతా శరజ్జ్యోత్స్నా సుధా ధవళిమతో తడిసింది. కాని నా హృదయంలోని వెన్నెల పగటివేళ చంద్రునిఎలె వెలవెలపోయింది.

రమణ్‌లాల్ దేశాయ్-[ "భదో 9 అగ్ని'' అనే నవల నుండి ]

## రుద్రదత్తుని మృతి

క్రమంగా జనంలో ఉద్రిక్తత తగ్గడం ప్రారంభమయింది. రుద్రదత్తుని నిర్భీకత, ఆయన వాదంలోని సామంజస్యం వారిలో కొంతవరకు మార్పుతెచ్చాయి. అక్కడ ఆయన పేరు అందరికీ సుపరిచితమయినదే. గుంపును చెదరగొట్టటానికి ఆయనచేస్తున్న ప్రయత్నం సఫల మవుతుందనిపించింది.

అప్పుడు గుంపు వెనుకనుంచి ఒక గొంతు వినిపించింది. "పండితమహాశయా! ఈ విషయంలో మీరు జోక్యం చేసుకోకండి. ఒక్క యూరోపియన్ జాతీయుడు లక్షమంది జనులంతటి ప్రమాదకారి. అతడిని చంపితీరాలి."

"ఎవరిదా కంఠం? శంకరునిదా? ఇక్కడికి నీవెట్లా వచ్చావు?"

"ఎక్కడినుంచో వచ్చాను. కాని మీరు యూరోపియనులను కాపాడడం మానుకొండి"

"నేను నిస్సహాయులను, నిరాయుధులను, స్త్రీలను, శిశువులను సదా పరిరక్షిస్తాను"

"పండిత మహాశయా! నేను మీపాదాలనంటి వేడుకొంటున్నాను. ఈ విషసర్పాలను వారి కర్మానికి వారిని వదిలివేయండి"

"నే నందుకిష్టపడకపోతే?"

"ఇష్టపడకపోతే పరిస్థితి విషమిస్తుంది"

"నీ వేమిచేసినా సరే, నేను లక్ష్యపెట్టను"

"బాబూ! ఇంకొకసారి అర్థిస్తున్నాను. ఈ ఆటను పాడుచేయకండి."

"మీ ఆట ఇప్పటికే పాడయింది."

"సదా విప్లవాన్ని ఆమోదించిన మీరేనా ఈ మాట అంటున్నది?"

"సమయాసమయాలను పాటించే సంయమంలేని విప్లవాలను నేనామోదించను. ద్వేషవిషపూరితమనస్కుల స్వార్థంకోసం సాగే విప్లవాలను నే నామోదించను. సుశిక్షితసైనికులతో ఆకతాయిమూక చేరిన విప్లవాలను నే నామోదించను. ఉన్నతలక్ష్యమేదీ లేక కేవలం

స్వార్థపరత్వం వల్లనే ప్రేరణ పొందిన విప్లవం గడ్డిమంటవంటిది. అది గడ్డిని తగులబెట్టి నంటతానే చల్లారిపోతుంది."

"ఇంకా చూస్తారెందుకు? పదండి ముందుకు. ఈ ముసలివానికి మతిచెడిపోయింది" అంటూ శంకరుడు ముందడుగు వేశాడు. అతనిలో అంతకుముందెన్నడూ లేని చైతన్యం కనిపించింది రుద్రదత్తునికి. కొందరు ముందుకు సాగుతున్నట్లు నటించారు. "చంపండి!" "చంపండి" అన్న కేకలు వినిపించాయి. త్ర్యంబకుడు వరండానుంచి ఒక వెదురుగడను లాగి క్రిందకు దూకబోయాడు.

"త్ర్యంబకా! శాంతించు" అన్నాడు రుద్రదత్తుడు.

"నా వెంటరండి, ఈ పండితుని నిర్బంధించి, యూరోపియనులను పట్టుకోండి" అంటూ శంకరుడు రెండడుగులు ముందుకువేశాడు. రుద్రదత్తుని కళ్ళు మెరుపుతీగంవలె మెరిశాయి. ఇన్ని సంవత్సరాల పొరల అడుగున దాగిన శౌర్యం ఒక క్షణంపాటు తిరిగి విజృంభించింది. తెల్లని దీర్ఘకేశాలను సింహపు జూలువలె విదిలించాడు. నిరాయుధుడైన వృద్ధ పరశురాముని స్ఫురింపజేస్తూ ఆయన శరీరమంతా ప్రాణశక్తితో నిండిపోయింది. హిమగిరి శిఖరంవలె ఇతరు లందరికంటె సమున్నతమైన ఆయనదేహం భీషణంగా కనిపించింది.

"శంకరా! నా కంఠంలో ప్రాణమున్నంతవరకు వీళ్ళనెవ్వరూ తాకలే" రని ఆయన గంభీరంగా అన్నాడు.

"ఐతే నిన్నెవరూ ప్రాణంతో విడిచిపెట్టరు"

శంకరుడంటున్న మాటలు పూర్తిగా వినిపించలేదు. అంతలోనే దెబ్బకొట్టిన చప్పుడు విని అందరూ వణికారు.

రుద్రదత్తుడు ప్రణవాన్ని ఉచ్చరిస్తూ తనచేతితో గుండెను పట్టుకొని, కల్యాణి, లూసీ చేతులలోనికి వాలిపోయాడు. ధవళగిరి ఉషోకన్య లిద్దరిపై వాలినట్లనిపించింది.

ధర్మశాలలో పూర్తిగా నిశ్శబ్దం ఆవరించింది. ఎవ్వరూ ఊహించని ప్రమాదం సంభవించింది. విప్లవవాదు లమితభక్తితో ఆరాధించే వ్యక్తిపై ఎవరైనా ఆయుధాన్ని ప్రయోగిస్తారని ఆ గుంపులో ఎవ్వరూ ఊహించలేదు. వారందరికీ కురుక్షేత్ర సంగ్రామంలో సాక్షాత్తు కృష్ణపరమాత్ముడే గాయపడినట్లనిపించింది. అందరిలోనూ నిస్సహాయస్థితి అలముకోకముందే, ఒకటి, రెండు క్షణాలలోనే, త్ర్యంబకుని చేతిలోని వెదురుగడ గిరగిర తిరగడం మొదలుపెట్టింది. అతడు క్రిందికిదూకి అక్కడ గుమికూడిన తిరుగుబాటుదారులను నిర్దాక్షిణ్యంగా మోదడం మొదలుపెట్టాడు. చాలామంది పారిపోయారు. ఆలయపు ఇరుకు సందులనుంచి తప్పించుకొని బయటపడ్డారు. శంకరుడు తుపాకిని పైకెత్తడంచూశాడు త్ర్యంబకుడు. అతడు తుపాకిని పేల్చకముందే త్ర్యంబకుడతని చేతిమీద గట్టిదెబ్బకొట్టడంతో తుపాకి క్రింద పడిపోయింది. శంకరుడు వెనుదిరిగిపారిపోయాడు, కాని అంతలోనే త్ర్యంబకు డతనిని పట్టుకొని, జుట్టుపట్టిలాగి, ఉక్కువంటి తన పిడికిలితో స్పృహతప్పేటట్లు కొట్టాడు. శంకరుడు నేలమీద పడిపోయాడు.

త్ర్యంబకుని కోపానికి అవధులు లేవు. క్రింద పడిన శంకరుని వంక చూస్తూ, "ఓరీ నీచుడా! హంతకుడా!" అని అన్నాడు.

అని అతనిని తన్నబోతూ ఉండగా తనకు సుపరిచితమైన, అనుద్విగ్నమైన రుద్ర దత్తుని గంభీరవాణి వినిపించింది.

"త్ర్యంబకా!"

త్ర్యంబకుడు వెనుదిరిగి చూశాడు. లూసీ ఆసరాతో రుద్రదత్తుడు కూర్చొ న్నాడు. కళ్యాణి, జాన్సన్, అతని భార్య రుద్రదత్తుని గుండె నుంచి కారుతున్న నెత్తురును బట్టతో తుడుస్తున్నారు.

త్ర్యంబకు డాగాడు. "నాయనా! ఇటురా! నామరణాన్ని రక్తపాతంతో కళంకితం చేయకు" అన్నాడు రుద్రదత్తుడు.

తనగురువు మీద చేయి చేసుకొన్నారన్న కోపంతో విచక్షణ జ్ఞానం కోల్పో యిన త్ర్యంబకునికి అప్పుడర్థమయింది-రుద్రదత్తునికి తగిలినది చావుదెబ్బ అని. తన గురువు మరణమా! త్ర్యంబకుడు క్షణంలో సత్తువ కోల్పోయాడు. అతనికి కళ్ళు తిరగడం మొదలు పెట్టింది. తూలుతూవచ్చి గురువు పాదాల దగ్గర స్పృహ తెలిసీ, తెలియని స్థితిలో కూర్చొ న్నాడు.

"నేను వెళ్ళి ప్రథమ చికిత్సా పేటికను తీసుకొని వస్తా" నంటూ జాన్సన్ లేచి నిలబడ్డాడు. అతని భార్య అతని ననుసరించింది.

"ఇప్పుడు మీరు వెళ్ళకండి. ప్రజలుద్రేకంతో ఉన్నా" రన్నాడు రుద్రదత్తుడు.

"మాకోసం మీరు గాయపడి నప్పుడు మేము చూస్తూ కుర్చోగలమా? లూసీ మీకు పరిచర్యచేస్తూ ఉంటుంది. ఇంతలో మేము వెళ్ళి ప్రథమ చికిత్సకు కావలసిన ఉపకరణాలను తీసుకొనివస్తాము" అని వారాధర్మశాలనుంచి బయటకు వెళ్ళారు.

"వారు వెళ్ళి ప్రయోజనంలే'' దన్నాడు రుద్రదత్తుడు.

"ఎందుకట్లా అంటున్నారు ?"

"నాకీ గాయం ఆయువుపట్టులో తగిలింది. ఇక నేనెక్కువ సేపు జీవించను"

"ఏమిటీ?" అని కల్యాణి నిర్ఘాంత పోయింది. తనతాతగారికి పరిచర్య చేస్తున్న కల్యాణి అతడు త్వరలో మరణిస్తాడని ఊహించ లేకపోయింది. భయంతో ఆమె వణికింది

"అంత ఆందోళన పడకు. ఈ శరీరమెంతో పని చేసి అలిసిపోయింది. ఇక విశ్రాంతి తీసుకొంటుంది" అన్నాడు రుద్రదత్తుడు. కాని ఆయన ధ్యానం దగ్గరనే వినిపించిన నిట్టూర్పు మీదికి మరలింది. త్ర్యంబకుడు ధారగా కన్నీరు కార్చుతున్నాడు. కన్నీటి నాపుకోవడానికి ప్రయత్నించగా నిట్టూర్పు వెలువడింది.

"త్ర్యంబకా! ధీరులు కంట తడి పెట్టరు" అన్నాడు రుద్రదత్తుడు.

"నేను ధీరుడను కాను, మీబిడ్డను" అన్నాడు త్ర్యంబకుడు రుద్ధకంఠంతో.

"నాయనా! నాసుదీర్ఘ జీవితంలో ఎందరో శిష్యులు నన్ను శ్రద్ధా భక్తులతో ఆరా

ధించారు. కాని నీవందరిలోనూ అద్వితీయుడవు. నేను నీకేదైనా లోటు చేస్తే నన్ను మన్నించు. నీవు నీవ్యక్తిత్వాన్నే నా కోసం త్యాగంచేశావు. నీవు కూడా ఆశ్రమం విడిచి వెళ్ళితే గౌతముని వలె సైనికుడ వయ్యే వాడవు. కాని నా దృష్టిలో నీవే గొప్పసైనికుడవు. గురుదక్షిణగా నాకొక కానుక నీయగలవా?"

త్ర్యంబకుడు మాటలాడలేక పోయాడు. గురువు పాదాలను **చేతులతో** పట్టుకొన్నాడు.

"నాయనా! ఎన్నడూ ఆయుధాన్ని జేతపట్టనని వాగ్దానం చేయి."

**మహాత్మా గాంధీ**

## కన్యాకుమారీ దర్శనం

భారత దేశపు ఎల్లలు కాశ్మీరునుంచి కన్యాకుమారివరకు, కరాచీ నుంచి అస్సాం వరకు వ్యాపించి ఉన్నవి. ఈ దేశపు హద్దులు నాలుగు ఈ ప్రాంతాల వరకు వ్యాప్తమై ఉన్నవి. ఉత్తరాన హిందూకుష్ పర్వత శ్రేణి ఈ దేశానికి మకుటాయమానమై దీనికి రక్షణ నిస్తున్నది. దక్షిణాన అరేబియా సముద్రానికీ, బంగాళాఖాతానికీ చెందిన నిర్మల జలాలు భారత మాత చరణాలను క్షాళనం చేస్తున్నవి. కన్యాకుమారి అనగా మహాయోగియైన పరమశివుని భర్తగా పొందగోరి కఠోరతపమాచరించిన పార్వతీదేవియే. ఇది భారత దేశపు కడపటి కొస కావడంవల్ల మూడువైపుల నీటితో పరివేష్టితమై ఉన్నది. రెండు మహా సముద్రాలకు సంగమస్థానం కావడం వల్ల ఇక్కడ నీటిలో రెండు వేర్వేరు రంగులు మనకు కనిపిస్తాయి. మనం దక్షిణాభి ముఖులమై చూస్తే మనకు కొంచం ఎడమవైపున సూర్యుని ఉదయాస్త మయాలు రెండూ ఒకే దిక్కున జరగడం కనిపిస్తుంది. ఆ దృశ్యాన్ని చూడడానికి మాకు వ్యవధి లేకపోయింది. కాని ప్రొద్దుట సూర్యుడు నక్షత్రాలను కాంతి హీనం కావించి బంగాళాఖాతంలో స్నానమాడి ఉదయించడమూ, సాయంవేళ పవళించడానికి స్వర్ణాకాశం నుంచి దక్షిణాంబుధిలోనికి దిగి మాయం కావడమూ నేనూహించగలను. రాజుగారి అతిథి గృహపు కాపలాదారు మేమా సుందరదృశ్యాన్ని తిలకించి తీరాలని మాకు నచ్చజెప్పడానికి ఎంతో వ్యగ్రతతో ప్రయత్నించాడు. కాని కారుమీద వచ్చి తిరిగి పోవడానికి తొందర పడుతున్న మేము ఆవిధంగా సౌందర్యాలోకనం వల్ల లభించే ఆనందానుభూతికోసం ఎక్కడ ఆగగలం! భారతధాత్రి చరణ స్పర్శవల్ల పవిత్రమైన ఆ సముద్రజలాలలో పాదప్రక్షాళనం చేసి పునీతుడను కావడంతోనే నేను సంతృప్తి చెందాను.

ప్రణాళికా రచనలో మన ఋషుల కెంతటి అద్భుతమైన ప్రజ్ఞ ఉండేది! పురాణ కావ్య స్రష్టల కెంతటి విశిష్టమైన అభిరుచి ఉండేది! మన దేశానికి ఎల్ల అయిన ఈ తావున మనఋషులు కన్యాకుమారీదేవికి ఆలయం నిర్మించారు. పురాణ కవులు దానిని గాథలతో అలంకరించారు. ప్రకృతి సౌందర్యదర్శనాభిలాష నాకక్కడ పూర్తిగా తీరింది. అట్టి అనుభూతికి అక్కడ అమితమైన అవకాశమున్నది. చూడ ముచ్చటగా ఉన్న ఆ స్నానాల రేవులో నేను పాదప్రక్షాళనం చేస్తున్నప్పుడు అలౌకికమైన ఆధ్యాత్మికానుభూతిని పొందగలిగాను.

"వివేకానందుడు ఆగుట్టమీదికి వెళ్ళి ధ్యానంచేసేవా"డని నా సహచరులు చెప్పారు. ఆమాట నిజమో, కాదో, నాకుతెలియదుకాని అది సాధ్యమే. మంచి ఈతగాడు ఆ గుట్టవరకు ఈదు కొంటూ పోగలడు. దీవిగా మారిన ఆగుట్టమీద నిశ్చయంగా అవిరళశాంతి లభిస్తుంది. వీణానిక్వణాన్ని పోలిన సాగర తరంగాల మంద మధుర స్వరాలు ధ్యానానికి సహకరిస్తాయి. కాగా నా ఆధ్యాత్మి కౌత్సుక్యం మరింత ఎక్కువ అయింది. మెట్లకు దగ్గరగా వలయా కృతిలో ఒక సమతలాన్ని నిర్మించారు. దానిమీద దాదాపు నూరుమంది సుఖంగా కూర్చొనడానికి వీలవుతుంది. గీతా శ్లోకాలను బిగ్గరగా ఉచ్చరించాలనే ప్రగాఢ వాంఛ నాలో పొడసూపింది. కాని నేనా ధార్మిక కాంక్ష నణచుకొని, హృదయాన్ని గీతా ప్రవర్తక మూర్తితో నింపుకొని మనశ్శాంతిని పొందాను.

ఈ విధంగా పునీతులమై మేము ఆలయానికి వెళ్ళాము. నేను అస్పృశ్యతా నివారణను ప్రబోధిస్తాను గనుకను, నా వృత్తి పాకీపని అని చెప్పుకొన్నాను గనుకను నన్నా ఆలయంలోనికి రానిస్తారో, లేదో అని కొంత సందేహం కలిగింది. నేనడుగు పెట్టడానికి వీల లేదని తాను భావించే ఏచోటుకైనా నన్ను తీసుకొని వెళ్ళ నక్కరలేదని ఆలయాధికారితో చెప్పాను. అట్టి నిషేధాన్ని పాటించడానికి సిద్ధంగా ఉన్నానని చెప్పాను. "అమ్మవారి దర్శనం ఎటూ సాయంకాలం 5.30 గంటలకు తరువాతనే అవుతుంది. ఇప్పుడు నాలుగు గంటలే అయింది. ఈ లోపల మిమ్మలను గుడి చుట్టూ తిప్పుతాను. మీరు అమ్మవారికి మరీ దగ్గరగా వెళ్ళడానికి వీలులేదు. ఐతే ఈ నిషేధం విదేశాలకు వెళ్ళివచ్చిన వారందరికీ వర్తిస్తుం" దనీ అతడు చెప్పాడు. "మీ నియమాన్ని నేను మనః పూర్వకంగా పాటిస్తా" నని నేనన్నాను. అప్పుడతడు నన్ను ఆలయాంతర్భాగంలోనికి తీసుకొని వెళ్ళాడు.

విగ్రహారాధన పరాయణుడైన హిందూ మతస్థుడు అజ్ఞాని యని నేను జాలిపడ లేను. అతని జ్ఞానాతిశయం నాకు చక్కగా అవగతమయింది. విగ్రహారాధనలోని అంతరార్థాన్ని స్పష్టంగా వ్యక్తం చేస్తూ అతడు ఈశ్వరునికి నానాత్వమును ఆరోపించలేదు. ఒకే దైవాన్ని మానవుడు అసంఖ్యాక రూపాలలో ఆరాధించవచ్చునని, ఆరాధిస్తాడని అతడు గుర్తించి ప్రపంచమంతటికీ వెల్లడించాడు. మహమ్మదీయుడూ, క్రైస్తవుడూ విగ్రహారాధన చేయక పోవచ్చు కాని తన భావనను ఆరాధించేవాడు కూడా విగ్రహారాధకుడే. మసీదూ చర్చీ కూడా విగ్రహారాధనకు చెందిన విభిన్న రూపాలే. అక్కడికి వెళ్ళడం వల్లనే వ్యక్తి పవిత్రు డవుతాడనే భావం కూడా ఒక విధమైన విగ్రహారాధనయే. దానిలో తప్పేమీ లేదు. ఖురాన్ ద్వారానో, బైబిల్ ద్వారానో మాత్రమే ఈశ్వరప్రాప్తి సాధ్యమవుతుందనే ఊహకూడ విగ్రహారాధనయే. కాని దాని వలన చెరుపు లేదు. హిందూమతస్థుడు మరొక అడుగు ముందుకు వెళ్ళి, "దైవాన్ని ఎవరి కిష్ట మయిన రూపంలో వారి నారాధించనీయండి. వెండి తోను, బంగారంతోనో ఒక మూర్తిని నిర్మించి, దానిలోని ఈశ్వరాంశను అవాహనం చేసి ఆమూర్తిపై ధ్యానమగ్నుడై మనస్సును పునీతం చేసుకొనే వ్యక్తి కూడా మోక్షానికి అర్హుడే" అని అంటాడు. ఆలయంలో తిరుగుతున్నప్పుడు నా కీ సత్యం గోచరించిది,

ఐతే ఆనందంతోపాటు కొంత బాధ కూడా కలుగకపోలేదు. నేను సముద్రయానం చేసి విదేశాలకు వెళ్ళాను గనుక నన్ను అమ్మవారి మూర్తిని సమీపించనీయలేదు అస్పృశ్యులను వారి కులం కారణంగా గుడిలోనికి రానీయరు. ఈ నిషేధాన్ని సహించడమెట్లా? గతకాలంలో కూడా ఇట్టి ఆచారమే ఉండేదా? "లేదు! లేదు!" అని నా అంతరాత్మ అన్నది. ఒకవేళ అది ప్రాచీనకాలంనుంచి వస్తున్న ఆచారమే అయినా అది దోషమే. చిరకాలంగా కొనసాగడంవల్ల దోషం గుణంగా మారదు. కాగా తమ మతాని కొక కళంకంగా పరిణమించిన ఈ దురాచారాన్ని నిర్మూలించడానికి హిందువు లందరు ఎంతటి త్యాగమైనా చేయాలని నాకు గట్టిగా తోచింది.

**కాకా కాలేల్కర్**

## భువనగిరి

("జీవణ్ణో ఆనంద్" అనే పుస్తకం నుంచి)

మేము నిజాం రాష్ట్రంలో ఖాజీపేట్ నుంచి హైదరాబాద్ వైపు రైలులో ప్రయాణం చేస్తున్నాము. దారిలో ఎడమవైపున ఒక పెద్ద గుట్ట నా కంట బడింది. భారతదేశంలో ఇటు వంటి గుట్టలకూ, మిట్టలకూ కొదువ లేదు, కాని ఈ గుట్ట ప్రత్యేకించి నా దృష్టి నాకర్షించింది వలయాకారపు ఏకశిలతో ఈ గుట్ట ఏర్పడింది. మీద ఏదైనా గుడి ఉండవచ్చును.

ఏదైనా రాయి కనిపిస్తే దానిని ముక్కలుచేసి తీసికొని పోవడం మానవస్వభావం కాని ఈ గుట్ట ఎంతో గుండ్రంగానూ, నునుపుగానూ ఉన్నది. అందుకే పకపక నవ్వుతూ చూడముచ్చటగా ఉన్న పసిబిడ్డ నెవ్వరూ గిల్లడాని కిష్టపడనట్లే, ఈ గుట్టను కూడా సుత్తితో పగులగొట్టడాని కెవరికీ మనసొప్పి ఉండదు. కనుకనే అది నేటికీ తన సహజ స్వరూపంతో నిలిచి ఉన్నది. నేనా గుట్టను దీక్షతో చూస్తూ ఉండగా మా రైలు "భార్‌గిర్" స్టేషన్ చేరింది. నేనా స్టేషన్ పేరును కొంత ప్రయత్నంమీద తెలుగులో చదువగలిగినందుకు సంతోషించాను. ఎందుకంటే తెలుగులో దాని పేరు "భువనగిరి" అని ఉన్నది. అంతటి అందమైన పేరును మనుష్యులు "భార్గిర్" అనే వికృతరూపంతో ఎందుకు పాడుచేశారో తెలియదు. ఏమైనా వారా గుట్టను పాడుచేయనందుకు సంతోషించడం మంచిది.

రైలు భువనగిరి స్టేషన్ చేరగానే నే నానాడు ప్రార్థనానంతరం గీతాపఠనం చేయలేదని హఠాత్తుగా జ్ఞప్తికి వచ్చింది. నా కత్యంత ప్రియమైన ఏకాదశాధ్యాయాన్ని పఠించగలనన్న ఆశమూలాన ఎంతో ఉత్సాహంతో నేనా గ్రంథాన్ని చేతబట్టాను. నే నా అధ్యాయం చదవడం మొదలుపెట్టగానే రైలు కదిలింది. సామాన్యంగా నేను గీతాపఠనం ప్రారంభించిన తరువాత దానికేవిధమైన అంతరాయం కలుగడానికీ ఇష్టపడను. ఎట్టి ప్రలోభం తల ఎత్తినా గీతాపఠనం పూర్తి అయ్యేవరకు నా దృష్టిని మరల్చడానికొప్పుకోను. కాని ఈనాడు మొదటి నుంచీ భువనగిరి నా మనస్సును ఆకట్టుకొన్నది. రైలు ఆ స్టేషన్ చేరకముందు గుట్టను ఒక వైపునుంచి సావకాశంగా చూశాను. రైలు కదిలాక రెండవవైపు కూడా గుట్ట అదే విధంగా ఉన్నదో, లేదో, కొండమీదికి కాలిబాటను శుభ్రంగా ఉంచారో, లేదో తెలుసుకోవాలని నాలో కుతూహలం కలిగింది. నా చూపు అటువైపు తిరగడానికి ఉబలాటపడుతున్నది. కాని నా

మనస్సులో ఒక భాగం ఇట్టి వ్యర్థకుతూహలాన్ని అణచుకొని గీతాపఠనంలో లగ్నం కావాలని ప్రబోధిస్తున్నది. మనస్సులోని మరియొక భాగం "గీతాపఠనం నీ నిత్యదినచర్యయే. కాని ఈ గుట్టను మాత్రం నీవు ప్రతిదినం దర్శించలేవు. గుట్టలో కొంతభాగం నీ విప్పటికే చూశావు గనుక మిగిలిన భాగాన్ని కూడా గమనించి తీరవలసినదే. గత్యంతరం లేదు. రెండు నిమిషాల పాటు గుట్టను చూసినంత మాత్రాన మించిపోయేదేమి లే"దని వాదిస్తున్నది. "నిర్విఘ్నంగా జరుగవలసిన నీ పూజాక్రమాన్ని నీ వెట్లా విడువగలవు? గీతాపఠనం ప్రారంభించకపోతే అది వేరుమాట. ఎటూ ఆలస్యంగానే ప్రారంభించావు. ఐనప్పుడు మరొక ఐదు నిమిషాలాగి ప్రారంభిస్తే ఏ చిక్కూ లేకపోయేది. కాని గీతను చదువడం ప్రారంభించిన తదువాత దాని కేవిధమైన అంతరాయమూ కలుగడానికి వీలులేదు" అని మనస్సులోని మొదటి భాగం హెచ్చరించింది. ఒప్పించేటట్లు వాదించడాని కలవాటుపడ్డ రెండవ భాగం అన్నది గదా : "నీ కళ్ళూ, మనస్సూ తదేక దీక్షతో ఆ గుట్టను గమనిస్తూ ఉన్నప్పుడు, మధ్యలో గీతాపఠనంతో ఆ పరిశీలన కంతరాయ మెందుకు కలిగించావు? ఏ కర్మనైనా నిరాటంకంగా సాగించాలనే నీ సంకల్పమైతే, గిరిని పరిశీలించే కర్మకు అంతరాయం కలిగించిన గీతాపఠనాన్ని నిలిపివేసి, తిరిగి ప్రకృతిని పరిశీలించడంమీద నీ దృష్టిని కేంద్రీకరించు" అని వాదించింది.

మనస్సులో ఈ సంఘర్షణ సాగుతూ ఉండగా కళ్ళు గుట్టవంక తిరిగాయి, కాని సుశిక్షితమైన మనస్సు వానితో సహకరించడానికి సిద్ధపడలేదు. కళ్ళకు కట్టిన కళ్ళాలను వెనుకకు లాగి వానిని భగవద్గీత మీదికి మరల్చింది.

అప్పుడొక అపూర్వఘటన జరిగింది. నేనప్పుడు ఏకాదశాధ్యాయంలో ఐదవ శ్లోకం లోని "పశ్యమే పార్థరూపాణి శతశోథ సహస్రశః" అన్న పంక్తిని చదువుతున్నాను. "అర్జునా ! నా శత, సహస్రరూపాలను తిలకించు" అనే ఆ పంక్తిని చదువగానే హఠాత్తుగా నా మనస్సులో చెలరేగిన సంఘర్షణ ఆగిపోయింది. మనస్సులోని ఉభయ భాగాలు సమరస భావంతో కలిసిపోయాయి. విశ్వరూపంలో భువనగిరి కూడా ఒక రూపమే అని నాకు స్ఫురించింది. భువనగిరిని చూడడంవల్ల గీతాపఠనాని కపచారమేమీ లేదని, పఠనం సిద్ధాంతమైతే, గుట్టవంక చూడడం ఆచరణయని గుర్తించాను. "నీ కిష్టమైనంత సేపు నీవా గుట్టవంక చూడు" అని హృదయం మనస్సుతో అన్నది. "పశ్యమే పార్థరూపాణి శతశోథ సహస్రశః."

ఇంతకుముందు కళ్ళు సౌందర్య పిపాసతో ఆ గుట్టవంక చూస్తున్నవి. కాని గీతా వాక్యం దానికి ఆధ్యాత్మిక దివ్యదీప్తిని సంఘటించింది. "నేను నీకు దివ్యచక్షువులను ప్రసాదిస్తున్నాను. వీనితో నీవు నా విశ్వసంబంధమైన ఐశ్వర్యాన్ని చూడు" అని స్వయంగా భగవంతుడే అన్నట్లయింది. ప్రకృతి సౌందర్యాన్ని కేవలం కళాత్మకదృష్టితో చూడడమే గాక భక్తి శ్రద్ధలతో దానిలో ఈశ్వరుని తేజోమయ మూర్తిని కూడా సందర్శించ గలగడం ఎంతటి సుకృతం. భువనగిరి ఆకృతిలో మార్పు కలిగింది. ఇప్పుడది కేవలం శిల కాదు. అది ఈశ్వరుని విరాడ్రూపంగా మార్పు చెందింది. దాని బాహ్యాకృతి పరిమితమైనా, వాస్తవాని కది పరిమితి లేని జీవనమూలం. "నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోస్తుతే సర్వత ఏవసర్వ." "నీ ముందు వెనుకలకు నేను నమస్కరిస్తున్నా" నంటూ నేను గిరికి నమస్కరించి తిరిగి గీతాపఠనాని కుపక్రమించాను. భువనగిరిని చూడడంపట్ల నా వైఖరిని ఆ గీతావాక్యం మార్చినట్లే, ఆశ్లోకానికి నా కొక క్రొత్త అర్థం తట్టింది. "మిత్రమా! భువనగిరి! గురూ! నేను గీత ఏకాదశాధ్యాయాన్ని

చదివినప్పుడెల్ల నిన్ను స్మరిస్తాను. నా గీతాధ్యయనాని కడ్డు వచ్చావని కాదు, విశ్వరూపానికి నీవు సంకేతానివని నిన్ను స్మరిస్తాను. నీవు నా హృదయంలో ప్రవేశించినట్లు, నన్ను నీ హృదయంలో ప్రవేశించనీ !"

*కిశోరిలాల్ మష్రూవాలా*

# గాంధీ - మార్క్సు

## 1

### లక్ష్యం

గాంధీజీని "హింసను విడనాడిన కమ్యూనిస్టు" అని తరచుగా వర్ణిస్తూ ఉంటారు. గాంధీజీయే తన్ను తా నీ విధంగా వర్ణించుకొన్నట్లు కూడా ఆయన రచనలలో నుంచి ఎత్తి చూపవచ్చును. తన సిద్ధాంతాల నామోదిస్తూ చేసిన ఏ వర్ణనయైనా తన ఉద్యమానికి సహాయకారి అని గాంధీజీ భావిస్తే, ఆయన దానిని కాదని త్రోసివేసేవాడు కాడు. కాని సిద్ధాంతాలను శ్రద్ధగా పరిశీలించినప్పుడు అట్టి వర్ణనలు పూర్తిగా సత్యమైనవని భావించడానికి వీలు కాదు. వాటిని విషయ వివరణ కనుకూలించే నిర్వచనాలుగా ఉపయోగించ కూడదు. అటువంటి నిర్వచనాల వల్ల రెండు సిద్ధాంతాల మధ్య ఉన్న భేదం ఎంత గాఢమైనదో తెలియ రాకుండా కప్పుపడి పోతుంది. కమ్యూనిజం "హింస లేని" గాంధీ తత్త్వమే అని అంటే, ఆ హింస అనేది కమ్యూనిజంలో చేరిన స్వల్పకాలుష్యమని, దానిని తొలగిస్తే కమ్యూనిజానికీ, గాంధీ తత్త్వానికీ భేదమేమీ ఉండదనే అభిప్రాయం కలుగుతుంది. ఒకవేళ ఈ రెండు సిద్ధాంతాలను ఆ విధంగా పోల్చడం సాధ్యమైనా, "హింస లేకపోవడం" అన్న భేదం చాలా ముఖ్యమైనది. "హింస లేకపోవడం" అన్న మాట తాత్పర్యం ఎంత ముఖ్యమైనదంటే, గాంధీ తత్త్వం "హింసలేని" కమ్యూనిజం అని వర్ణించడం ఎరుపు రంగును పసుపు, నీలం రంగులు లేని ఆకుపచ్చ రంగని వర్ణించినట్లు, క్రిమిని విషం లేని సర్పమని వర్ణించినట్లు భ్రాంతి జనకమే అవుతుంది.

ఇటువంటి నిర్వచనాలు చేయాలనే వ్యామోహానికి కారణం మార్క్సిజం, లేక సామ్యవాదం, ప్రజల దృష్టిని విశేషంగా ఆకర్షించడమే. వర్తమాన సమాజంలోని లోపాలకు సామ్యవాదమే సరియైన పరిష్కారమార్గమని వారు నమ్ముతున్నారు. కాని అది బోధించే ఆచరణ విధానం కఠోరమైనది. హింసాత్మక మైనది. కనుక గాంధీతత్త్వాన్ని మార్క్సిజంతో పోల్చి వర్ణిస్తే అది ప్రజలకు మనస్సు కెక్కుతుందని కొందరు భావిస్తున్నట్లున్నది. పైగా సామ్యవాదం చివరకు అభిలషణీయమే అయినా, దానిని హఠాత్తుగా ప్రవేశపెట్ట కూడదనే ఉద్దేశంకూడా ఇటువంటి నిర్వచనాల సృష్టికి కొంతవరకు ప్రేరకం కావచ్చును. సులభమైన అంచెలలో సామ్యవాదాన్ని ప్రవేశపెట్టడానికి గాంధీతత్త్వం అనుకూలమైనదని వారు భావిస్తూ ఉండవచ్చును.

ఇది సరియైన వైఖరి కాదని నా అభిప్రాయం. ఈ వైఖరి మౌలిక సమస్యలను సూటిగా ఎదుర్కొనదు. పైగా మానవసమాజంలోని ఆర్థిక, సాంఘిక, రాజకీయ వ్యవస్థలో మార్పులన్నిటికీ హేతువైన నైతిక, ధార్మిక సిద్ధాంతాల విషయంలో ప్రజల దృక్పథంలో

ముఖ్యమైన మార్పు రావాలనే అంశాన్ని కూడా అది వారి దృష్టికి తేలేదు. ఈ విధంగా వివక్షించి చూసినప్పుడు ఎరుపు రంగుకు ఆకుపచ్చరంగు ఉన్నంత వ్యత్యాసం గాంధీతత్త్వానికి మార్క్సిజానికీ మధ్య ఉన్నదని స్పష్ట మవుతుంది. ఐనా దృష్టిదోషం ఉన్నవారికి రంగుల మధ్య భేదం కనిపించదనుకోండి.

అహింసను ప్రాతిపదికగా చేసుకోవడం ఒక్కటే గాంధీతత్త్వానికీ, మార్క్సిజానికీ మధ్య ఉన్న భేదమైతే, గాంధేయులకూ, కాంగ్రెస్ పక్షానికి సామ్యవాద వ్యవస్థను నెల కొల్పడమే చరమలక్ష్యమైతే, సైనికుల అవసరం లేకుండా, హింసాకాండకు దిగకుండా ఆ లక్ష్యాన్ని సాధించడానికి అనువైన సమయం ఇదే. ఎందుకంటే నేడు భారతదేశమంతటా గాంధీజీని "జాతి జనకు"డని అభివర్ణిస్తూ, బహిరంగ సభలలో ఆయన సిద్ధాంతాలను శ్లాఘించే వ్యక్తుల చేతులలోనే ప్రభుత్వాధికార మున్నది. కమ్యూనిస్టుల ఎత్తులను ముందుగానే గుర్తించి, అధికారం సంక్రమిస్తే వారు సమాజంలో తెచ్చే మార్పులన్నిటినీ నేడు అధికారంలో ఉన్న గాంధీవాదులే ప్రవేశపెట్టవచ్చును. కమ్యూనిస్టు సిద్ధాంతానుయాయులు చట్టబద్ధమైన చర్యలతో కాక మరొక విధంగా అధికారాన్ని చేజిక్కించుకోవడానికి ప్రయత్నించి నప్పుడే హింసాత్మకమైన సాయుధ విప్లవం అవసర మయ్యేది. కాని ప్రభుత్వమే కమ్యూనిజాన్ని స్థాపించాలని కృతనిశ్చయమై ఉంటే, దానికి గాంధీతత్త్వానికి పెద్ద భేదమేదీ లేదని వాదిస్తే ప్రభుత్వమూ, కమ్యూనిస్టులూ కలిసి కృషిచేస్తూ ఉండాలి. ఒకవేళ వ్యక్తిగతమైన ముతా రాజకీయ కారణాల వల్ల కమ్యూనిస్టులు ప్రభుత్వంతో సహకరించకపోతే, అప్పుడు ప్రజలు వారితో "మాకు మీరూ, మీ కార్యాచరణ పద్ధతులూ అక్కరలేదు. మీరు చెప్పేది మే మిప్పటికే సాధించగలిగా"మని చెప్పగలిగి ఉండాలి.

కాని ఆ విధంగా జరగడం లేదు. ఎందుకంటే గాంధీతత్త్వానికి మార్క్సిజానికి మధ్య ఉన్న అంతరం గాఢమైనది. ఋణ, వృద్ధి సంకేతాలతో వర్ణించడానికి వీలయ్యే సామాన్య సమీకరణం కాదది.

దీనిని కొంత విపులంగా చెప్పడం అవసరం. రాబోయే ప్రకరణం లక్ష్యం అదే.

## 2

## ఉన్నది ప్రాణం ఒక్కటే

గాంధీజీకి, కార్ల్ మార్క్సుకు మధ్యగల మౌలికభేదం జీవితం పట్ల, ఈ విశ్వం పట్ల వారి దృక్పథాలలోనే ఉన్నది. లక్ష్యానికీ, సాధనానికీ, ఆర్థిక, సాంఘిక, రాజకీయ, ధార్మిక వ్యవస్థకూ సంబంధించిన ఇతర భేదాలన్నీ ఈ మౌలిక భేదంనుంచి ఉత్పన్నమవు తున్నవి.

జీవితాన్ని గురించీ, విశ్వాన్ని గురించీ గాంధీజీ దృక్పథం మార్క్సు దృక్పథానికి భిన్నమైనది కావడమే కాదు, అది పెట్టుబడిదారీ విధానంతోనూ, పారిశ్రామిక విధానంతోనూ కూడా భేదిస్తుంది. ఎందుకంటే మార్క్సిజానికి పెట్టుబడిదారీ వ్యవస్థకూ మధ్య ఇతర

భేదాలూ, ఘర్షణలూ ఎన్ని ఉన్నా, రెండింటికీ కొన్ని అంశాలపై సాన్నిహిత్యం కూడా ఉన్నది. మూలధనం మీద, భూమి మీద వ్యవసాయం మీద, పరిశ్రమల మీద అధికారం ఒక్కచోట కేంద్రీకృతమై ఉండడం ముఖ్యమని ఈ ఉభయ సిద్ధాంతాలు భావిస్తాయి. ద్రవ్య రూపకమైన ఆర్థిక వ్యవస్థ అభిలషణీయమని విశ్వసిస్తాయి. ఇక వాటి మధ్య ఉన్న వివాదం కేవలం ఆజమాయిషీని పూర్తిగా తమ వశం చేసుకోవాలని, ఫలంలో పెద వాటా తమకే సంక్రమించాలని ఆ రెండు వ్యవస్థలూ పరస్పరం తలపడడంలోనే ఉన్నది.

ఒక దారి రెండుగా చీలిన దనుకోండి. చీలినచోట ఏర్పడిన కోణం 5 డిగ్రీల కంటె తక్కువయే కావచ్చును, ఐనా కొంత దూరం పోయిన తరువాత వాటి మధ్య అంతరం కొన్ని మైళ్ళ మేరకు వ్యాపిస్తుంది. ఈ చీలిక కన్యాకుమారి దగ్గర జరిగిందనుకోండి. అప్పుడు చీలిన దారులలో ఒకటి మనలను పెషావర్ తీసుకువెడుతుంది. రెండవది నేపాల్ తీసుకు వెడుతుంది. ఆ విధంగానే జీవితాన్ని గురించీ దృక్పథంలో గాంధీజీకి, మార్క్స్‌కు, ఇతరులకు మధ్య గల భేదం ఒక ఘట్టంలో ఎక్కువ అంతరం ఉన్నదిగా తోచకపోవచ్చును. అరదజనుకూ, ఆరుకూ ఉన్నంత పోలిక ఉభయ దృక్పథాలలోనూ ఉన్నట్లనిపించవచ్చును. లక్ష్యాలలో గాంధీజీకి, మార్క్స్‌కు కొంత సామ్యం ఉన్నదనుకోవడానికీ, "గాంధీతత్త్వం హింసలేని మార్క్సిజం" అనే నినాదం తలయెత్తడానికీ కారణం ఇదే. కాని ఈ పోలికలు, ఉభయసిద్ధాంతాలూ ఆర్థిక వ్యవస్థ ద్వారా సాధించదలచిన కొన్ని లక్ష్యాలలో మాత్రమే కనిపిస్తవి. లక్ష్యసాధనకు సంబంధించిన వివరాలను పరిశీలిస్తే, రెండు సిద్ధాంతాల మధ్య ఉన్న వ్యత్యాసాలు క్రమంగా స్పష్టమవుతాయి.

సమాజంలో అర్థాకలితో బ్రతుకువెళ్ళదీసే మూగజీవులను, నిరాశ్రితులను, విద్యాహీనులను, దీనదళితజనులను సముద్ధరించాలనే గాఢమైన ఆకాంక్ష ఒక్కటే గాంధీజీలోనూ, మార్క్స్‌లోనూ సమానంగా కనిపిస్తుంది. మానవసమాజంలో అటువంటి నిర్భాగ్యులే అధికసంఖ్యలో ఉంటారు. అందరికీ ఇప్పటికంటె ఎక్కువ సౌఖ్యాన్ని చేకూర్చడానికి తగిన దక్షతఉన్న ఈ ప్రపంచంలో వారి స్థితి ఎంతో నికృష్టంగా ఉన్నది. పైగా సాహిత్యాన్ని, విజ్ఞానశాస్త్రాన్ని, లలితకళలను, పరిశ్రమలను క్రమబద్ధమైన ప్రభుత్వాలను, విశిష్టమైన సంస్థలను, నగరాలను, కట్టడాలను రూపొందించి, ప్రకృతిరహస్యాలను నిశితంగా శోధించి ఒకప్పుడు గంధర్వలోకంలోనే లభ్యమవుతాయని ఊహించిన సుఖభోగాలను తమ ప్రజలకు లభింపజేసిన నాగరక సమాజాలు ఒకదాని వెనుక ఒకటిగా ఉదయించినా వారి స్థితి మాత్రం బాగుపడనేలేదు. ప్రకృతి మనకు ప్రసాదించే సంపదలోనూ, మానవుని మేధవల్ల, కృషివల్ల లభించే సంపదలోనూ ఈ దళితప్రజలకు కూడా భాగం లభించగల వ్యవస్థను నెలకొల్పాలని గాంధీజీ, మార్క్స్-ఉభయులూ వాంఛిస్తారు. ఐతే ఈ లక్ష్యసాధనకు సత్యాన్నీ, అహింసనూ ప్రాతిపదికగా చేసుకొని తీరాలంటాడు గాంధీజీ. కాని మార్క్స్-లేదా, మార్క్సిస్టులు- ఎందుకంటే, గాంధీవేరు, గాంధేయులు వేరు అన్నట్లే, మార్క్స్ వేరు, మార్క్సిస్టులు వేరు అని కొందరంటారు-ఈ లక్ష్యాన్ని త్వరగా సాధించడానికనుకూలించే సాధనం ఎట్టిదైనా అది తనకు సమ్మతమేనంటాడు.

విజ్ఞత కలిగి, ఉత్తమ సభ్యతా సంస్కృతులు కలిగి, ఒకే మహోన్నత లక్ష్య

సాధనకు కంకణం కట్టుకొన్న ఇద్దరు వ్యక్తులు మానవాళి కందరికీ అతిముఖ్యమైన ఈ సమస్యపై విభిన్న వైఖరుల నెందుకు ప్రదర్శించవలసి వచ్చిందనే ప్రశ్న ఉదయిస్తుంది. అందుకు నిజంగా ఏది కారణమో మనం నిర్ణయించగలమో, లేదో తెలియదు. కాని వారి దృక్పథాలలో భేదం స్పష్టంగా ఉన్నది గనుక ఆ ఇద్దరిలో ఏ ఒకరి పూర్వపక్షపు యథార్థతలోనో, ఆలోచనావిధానంలోనో పెద్ద లోపం ఉన్నదని మాత్రం స్పష్టమవుతుంది ఉభయుల ఊహలోనూ లోపమున్నా ఉండవచ్చును.

ఈ విశ్వానికి మూలమేదో తెలుసుకోవాలని శతాబ్దాల తరబడి లెక్కలేనంత మంది తత్వశాస్త్రజ్ఞాలూ, విజ్ఞానశాస్త్రవేత్తలూ అన్వేషిస్తున్నారు. ఇది చేతనాచేతన పదార్థాల సమ్మేళనంగా మనకు కనిపిస్తుంది. తుదిదాక విశ్లేషించి చూస్తే ఈ పదార్థాలలో కాని, శాస్త్రీయంగా గుర్తింప వీలైన వాటి అంశాలలో కాని ఎన్ని ఆదిమమైనవి ? ఈ అంశాలు అనేకమా ? లేక పదార్థమూ, ప్రాణమూ అనేవి రెండేనా ? ఆ రెండూగాక కేవలం ఒక్కటేనా ? ఒక్కటే అయితే-అది పదార్థమా ? ప్రాణమా ? ప్రాణం ఆదిమమైనదని అంగీకరించినా, స్వతంత్రులూ, నిత్యులూ అయిన వ్యక్తులనేకులున్నారా ? లేక ప్రాణమంతా ఒక్కటేనా ?

తత్వశాస్త్రజ్ఞులూ, విజ్ఞానశాస్త్రవేత్తలూ ఎన్నటికైనా ఈ అంశాలపై సర్వసమ్మతమైన తుది అభిప్రాయాన్ని నిశ్చయంగా ప్రకటించగలరో, లేదో చెప్పడం కష్టం. దైనందిన సమస్యలతో ప్రమేయం లేకుండా కేవలం పండితుల పరస్పర చర్చలకు మాత్రమే సంబంధించినదైతే ఈ సమస్యలపై విజ్ఞులు ఎవరికి వారే ఒక ప్రత్యేక సిద్ధాంతాన్ని రూపొందించినా అందువల్ల నష్టమేదీలేదు. కాని ఆ విధంగా జరగడంలేదు. ప్రతి సిద్ధాంతాన్నీ మానవుల నిత్యజీవిత వ్యవహారాలకూ, సంస్థలకూ అన్వయింపజేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఒక సిద్ధాంతాన్ని ఆమోదిస్తే దాని ననుసరించి సమాజాన్నీ, సమాజంలో వ్యక్తి స్థానాన్నీ ఒక విధంగా ఏర్పరచవలసివస్తుంది. మరొక సిద్ధాంతాన్ని ఆమోదిస్తే సమాజస్వరూపమూ, దానిలో వ్యక్తి స్థానమూ మరొక విధంగా నిర్ణీతమవుతాయి. ప్రతి సిద్ధాంతంతోనూ, ఈ విధంగానే జరుగుతుంది.

శాస్త్రవిజ్ఞానం పెంపొందడంవల్ల క్రమంగా ఇటువంటి సిద్ధాంతాల సంఖ్య తగ్గవచ్చును. కాని నేటివరకు విజ్ఞానశాస్త్రంకూడా ఒక దశను దాటిన తరువాత కేవలం సంభావ్యమైన అనుమానప్రమాణాలనే ప్రకటిస్తూ ఉన్నది. శాస్త్ర పరికరాలనన్నిటినీ ఉపయోగించి కూడా పదార్థానికీ ప్రాణానికీఉన్న సంబంధమెట్టిదో నేటికీ మానవుడు నిశ్చయంగా గ్రహించలేకున్నాడు. ఐనా తన సిద్ధాంతాన్ని వాస్తవమని తా నంగీకరించడంతో సంతుష్టి చెందక ఆ సిద్ధాంతాన్ని అనుసరించి ప్రపంచవ్యవస్థలో మార్పులు తీసుకురావాలనే మొండిపట్టు అతనిలో కనిపిస్తుంది. ఆ విధంగా లోకాన్ని మార్చడానికి ప్రయత్నించడంలో అతడు అవసరమైతే తప్పుదారులు త్రొక్కడానికి కూడా వెనుదీయడు.

ఈ తాత్త్విక సిద్ధాంతాలలో మన దృష్టికి భిన్నంగా గోచరించే పదార్థమూ, ప్రాణమూ ఒకే మూలతత్త్వంనుంచి ఆవిర్భవించినవని భావించే సిద్ధాంతాలు రెండు కనిపిస్తున్నవి. గాంధీజీ, మార్క్సు, ఇద్దరూ ఏకమూలతత్త్వవాదులే. ఐతే ఆ మూలతత్త్వం

ప్రాణమని, పదార్థం కాదని గాంధీజీ విశ్వాసం. మనం అచేతనమని భావించే పదార్థం కూడా ప్రాణంనుంచి ఉదయించినదే. ప్రాణానికి భిన్నంగా దానికి ఉనికిలేదు. కనీసం ప్రాణం లేనినాడు దాని అస్తిత్వాన్ని ఎవ్వరూ నిర్ధారించి చెప్పలేరు. ప్రాణంలోనే ఈ విశ్వం జన్మించి, మనుగడ కలిగి, అంతరిస్తుంది. ఉండేది ఆ ప్రాణం ఒక్కటే. అది నిత్యం, అవినశ్వరం, కనుక ప్రాణమే సత్యం. ఇతర శక్తులూ, రూపాలూ దానిలోనుంచి ఉదయించే రేఖలేనన వచ్చును, అవి నిత్యపరిణామశీలమైనవి. ఒక రూపం నుంచి ఇంకొక రూపానికో, అనేక రూపాలుగానో మార్పు చెందడానికి వీలయినవి. ఐతే సచేతనమైన ప్రతిప్రాణికీ ప్రాణంతో సంబంధం ఉన్నా, దానికి ఎప్పుడూ దూరం కాకపోయినా, అసంఖ్యాక ప్రాణులు తమ జీవితకాలంలో ప్రాణస్వరూప రహస్యాన్ని గ్రహించడమనేది జరుగదు. ఈ అజ్ఞత ఎంతవరకు వ్యాపిస్తుందంటే ప్రాణమనేది ప్రత్యేకంగా ఉన్నదనే అనేకులు ఒప్పుకోరు. ఉన్నదని అనే వారికి కూడా దృఢవిశ్వాసం లేదు.

మహా సముద్రంవలెనే నీటి బిందువుకూడా పూర్తిగా నీరే అయినట్లే, మహామేధావిలోనో, మత్తేభంలోనో బలాఢ్యమైన సింహంలోనో ఉన్నట్లే ప్రాణం సూక్ష్మక్రిమిలో కూడా పూర్తిగా ఉన్నది.దాని శక్తి బహిర్గతం కావడంలో ఎన్నో వర్గాలూ, పరిణామాలూ కనిపించవచ్చునుగాక, అయినా అన్నిటిలోనూ ఉన్న మూలతత్త్వం ఒక్కటే, సమానమే. నిదురించే సింహంలో ఎంత బలం ఉన్నా, అది మనం చూడలేకపోవచ్చును. ఆ విధంగానే ప్రత్యణువులోని ప్రాణశక్తి నిద్రాణంగానో, బహిర్గతంగానో విరాజమానమై ఉన్నది. చిత్రమేమిటంటే ప్రతిప్రాణి తన ఉనికి స్వతంత్రమైనదనీ ఇతర ప్రాణులకంటె భిన్నమైనదనీభావించినా,ప్రాణం అనేకం కాదు.స్వల్పసంఖ్యకలది కూడా కాదు.ఒకే ఒక ఆత్మ అన్నిటిలోనూ వ్యక్తమై ఉన్నది. అతి సూక్ష్మమైనకణంలోని ప్రాణం వన్యమృగంలోని ప్రాణం కంటె భిన్నమైనది కాదు.మహాత్ముని కంటెఅవతార పురుషుని కంటె మహా పాపాత్ముడు భిన్నుడూ కాడు.రంగులోనూ,కాంతిలోనూకాఠిన్యంలోనూ, ఇతర లక్షణాలలోనూ బొగ్గూ, వజ్రమూ ఎంత విభిన్నమైనవైనా ఆ రెండూ అంగారమనే మూలద్రవ్యం నుంచి ఏర్పడే రూపాలే అయినట్లు విశ్వవ్యాప్తమైన పరమాత్మయే వివిధచేతన జీవులలో వ్యక్తమై ఉన్నది. వాటి మధ్య కనిపించే భేదాల రహస్యాన్ని మనం గ్రహించలేక పోవచ్చును. మన మనస్సునూ, వ్యక్తిత్వాన్నీ కూడా మనం గ్రహించలేక పోవచ్చును. ఐతే ప్రపంచంలోని ఇతర ద్రష్టలవలెనే గాంధీజీ కూడా అంతటా ఉన్నది ఒకే ప్రాణమని, దాని వల్లనే ప్రపంచం నడుస్తున్నదని నిస్సంకోచంగా విశ్వసించాడు.చేతనాచేతన వస్తువులతో,దృశ్యాదృశ్యశక్తులతో,పుణ్యపాపనైతికాధ్యాత్మిక లక్షణాలతో, అణువునుంచి బ్రహ్మాండం వరకు విస్తరించిన పదార్థాలతో రూపొందిన ఈ విశ్వం ఒక్కటే. అదే ప్రాణం. దానినే సత్యమనీ, పరమాత్మయనీ వ్యవహరిస్తారు. భిన్న భిన్న రూపాలు బాహ్యాచ్ఛాదనాలే. బహుభంగులలో వ్యక్తంకాగల దాని శక్తి వల్లనే ఈ భిన్న రూపా లేర్పడుతున్నవి. ఈ దృక్కోణం నుంచి చూచినప్పుడు ఉనికిని నేను, నీవు, ఇతరం అని విభజించడానికి అవకాశమే లేదు.

నాకు బోధపడినంతలో ప్రాణాన్ని గురించి విశ్వాన్ని గురించి గాంధీజీ వైఖరి ఇది.

ఐతే, ఇదిఉన్నది ఒక్క ప్రాణమే, లేక దైవమే అనే సిద్ధాంతాన్ని గాంధీ తత్త్వ మొక్కటే కాదు, మరికొన్ని ఇతరతత్త్వాలు కూడా విశ్వసిస్తున్నవి. గాంధీజీ ప్రామాణికమని ఎంచిన భగవద్గీత, ఉపనిషత్తులు వంటి మతగ్రంథాల ఆధారంతోనే అవి కూడా ఈ సిద్ధాంతాన్ని విశ్వసిస్తున్నవి ఐతే ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఈ సిద్ధాంతం నుంచి ఆ తత్త్వాలు గ్రహించే పాఠాలు గాంధీజీ బోధకంటె భిన్నమైనవి. కొంతవరకు అవి కమ్యూనిస్టుల సిద్ధాంతాలతోనూ, లక్ష్యసాధనాలతోనూ సరిపెట్టుకోవడానికి సమ్మతిస్తున్నవి.

చేతనా చేతన రూపమైన ఈ విశ్వమంతా ఒకే ప్రాణపు అభివ్యక్తి అనే విశ్వాసం ప్రాతిపదికగా గాంధీజీ నేర్చిన పాఠాన్ని ఈ విధంగా చెప్పవచ్చును :

ప్రాణమంతా ఒక్కటే అయినప్పుడు, నాతో సహా ఈ విశ్వమంతా ఈశ్వరుని అభివ్యక్తియే అయినప్పుడు, ఎవరినైనా నేను నా శత్రువని, దుర్మార్గుడని, ద్వేషార్హుడని ఎట్లా ఎంచగలను? ఒకరికి నేను భయపడడానికి గాని, ఒకరిని భయపెట్టడానికి గాని ఎట్లా సమ్మతించగలను? ఒకరు నాకు మరొకరి కంటె సన్నిహితులని ఎట్లా భావించగలను? ఎవరినైనా ఒక లక్ష్యసాధనకోసం బలి పెట్టదగిన క్షుద్రుడని ఎట్లా అనుకోగలను?

నా ఆత్మ కూడా ఆయనకే చెందినదే అయినా, దుర్గ్రాహ్యమైన ఆయన శాసనంవల్ల నాకు నా దేహంతో బంధమేర్పడి, దానిని పరిరక్షించుకోవాలనే ఇచ్ఛను నేను విడనాడకుండా చేస్తున్నది. నాలో ఎంత దోషమున్నా నేను ఆత్మహత్య చేసుకోను. ఆ విధంగా చేసుకోవడం భావ్యమని ఎంచను. ఐనప్పుడు ఇతరులలో దోషాలున్నా, వారు వధ్యులని నే నెట్లా అనగలను ?

విశ్వాసం వల్లనే నేను ఈ ప్రపంచం ఈశ్వరుని అభివ్యక్తి అనీ, ఆయన కంటె భిన్నంగా నే నేమీ కాననీ భావిస్తున్నాను. కాని నేనట్టి ఉన్నతస్థితికింకా రాలేదు. ఇంకా ఐహిక వాంఛలకూ, ద్వేషానికీ, హింసకూ, విచక్షణ శీలమైన అనుబంధాలకూ అతీతుడను కాలేదు. బుద్ధిపూర్వకంగా కాని, అప్రయత్నంగా కాని నా చేతలు నా వాస్తవస్థితిని వెల్లడిస్తున్నవి. కాని సత్యస్వరూపం పట్ల నా విశ్వాసం స్థిరమైన గనుక, నా విశ్వాసాని కనుగుణమైన స్థితికి నేను చేరుకోవాలని నిరంతరం యత్నించాలి. అహింసయే పరమధర్మమని నే నంగీకరించి, త్రికరణ శుద్ధిగా నే నా ధర్మాన్ని పాటించిన నాడే అది సాధ్యమవుతుంది. అహింసా సిద్ధాంతాని కనుగుణమైన దీక్షనే వహించాలి, నా విధులను, కార్యకలాపాలను అందు కనువుగానే అత్యంత శ్రద్ధతో నిర్వర్తించాలి. నేనావిధంగా జీవించక, నా లక్ష్యాలకూ, కృషికీ అడ్డువస్తున్నారని కాని, దుర్మార్గులని కాని ఇతరులను దండించడానికీ, వధించడానికీ నాకు స్వేచ్ఛ ఉన్నదని భావించిన నాడు "ఉన్నది ఒక్క ప్రాణమే" అనే సిద్ధాంతం నాకు సంబంధించినంతవరకు ఆచరణతో ప్రమేయంలేని తాత్త్విక చర్చయే కాగలదు.

ఇంతకు ముందే చెప్పినట్లు ఈ విశ్వం ఒకే ప్రాణం యొక్క, ఆత్మ యొక్క అభివ్యక్తి అని విశ్వసించేవారు మరికొందరు కూడా ఉన్నారు. ఐనా వారు ఆ సిద్ధాంతం నుంచి గాంధీజీ గ్రహించిన పాఠాన్ని ప్రమాణంగా ఎంచరు. శిష్టులను హింసించే వారిని, దుష్ట సిద్ధాంతాలను వ్యాపింపజేసే వారిని, కుటిల పథగాములైన దుర్మార్గులను నిర్మూలించ

డానికీ, దండించడానికీ, బలాత్కారంగా నిర్బంధించడానికీ తమకు అధికారం ఉన్నదని వారు భావిస్తారు. ప్రేమించడం కర్తవ్యమైనట్లే, తగిన కారణాలున్నప్పుడు హింసించడం కూడా అవశ్యకర్తవ్యమని వారు విశ్వసిస్తారు. వారి దృష్టిలో ఆవిధంగా హింస కుద్యమించడానికి తగిన కారణాలు క్రమపరిణామ దశలలోని భేదాలవల్ల గాని, వ్యక్తుల సంఖ్యను బట్టి గాని, వారి కులము, మతము, దేశము, జాతి, సంపద వంటి భేదకారకమైన అంశాలవల్లగాని ఉత్పన్నం కావచ్చును. "ఉన్నది దేవుడొక్కడే" అనే సిద్ధాంతాన్ని అంగీకరించే ఇతరులకూ, గాంధీజీకీ ఉన్న ప్రభేదం ఈ విషయంలోనే ఉన్నది.

దర్శక్ (మనూభాయి పంచోలీ)

## డాక్టర్ జివాగో : తొలి తలపులు

మిత్రమా !

నే నొక వారం రోజులు బొంబాయిలో ఉన్నాను. అక్కడ నేను బస చేసిన మిత్రుని ఇంటిలో "డాక్టర్ జివాగో" అనే నవల చూశాను. తిరిగి వచ్చేటప్పుడు ఆ పుస్తకం నా వెంట తీసుకువచ్చాను. రైలులో పుస్తకం చదవడం పూర్తి అయింది. దానిని గురించి నాకేర్పడిన తొలి అభిప్రాయాన్ని ఈ లేఖలో నీకు వ్రాస్తున్నాను.

ఇది తన రచనలలో ముఖ్యమైనదని, దీనిని గురించి వాగ్వివాదాలు చెలరేగడం ఒక విధంగా యుక్తమే అని స్వయంగా రచయిత పాస్టర్‌నాక్ చెప్పుకొన్నాడు. కళ సౌంద ర్యావాసాన్నే స్థిరంగా అంటిపెట్టుకొని ఉండాలి గాని, ఈ తత్త్వం, ఆ రాజకీయపక్షం అంటూ ఏదో ఒక వర్గాన్ని సమర్థించకూడదు. ఆ ఆదర్శాన్ని రచయిత విస్మరించిన నాడు అతనికి చిక్కులు తప్పవు. కొన్ని రాజకీయ సిద్ధాంతాలను ప్రచారం చేయడానికే వెలువడిన గ్రంథాలను పరిశీలిస్తే ఈ మాట వాస్తవమని నిరూపితమవుతుంది. రష్యన్ పుస్తకాలలో అధికభాగం మార్క్సిజాన్ని, కమ్యూనిజాన్ని ప్రచారంచేసే లక్ష్యంతోనే వెలువడుతున్నవి గనుక ఇతర దేశాలతో పోల్చిచూస్తే ఇటీవల అక్కడ ఉత్తమ సాహిత్యం చాలా అరుదుగా వెలువడుతున్నదని విమర్శకులభిప్రాయపడుతున్నారు. స్టాలిన్ బహుమానాన్ని పొందిన "ఇంద్రధనుస్సు" అనే నవల అనువాదాన్ని చదివినప్పుడీ అభిప్రాయం సరియైనదేనని నిశ్చయమయింది. కళ అప్రధానమనీ, రాజకీయ సిద్ధాంతప్రచారమే ప్రధానలక్ష్యం కావాలనీ భావిస్తూ సృజనాత్మక సాహిత్యాన్ని రచించినవారు దురదృష్టవశాత్తు పాస్టర్‌నాక్ రచనను దుయ్యబడుతున్నారు. అది అపమార్గం పట్టిన ప్రచార సాహిత్యానికి ఉదాహరణమని ఖండిస్తున్నారు. ఒక సిద్ధాంతాన్ని ప్రచారం చేస్తున్నదా, లేదా అనే ప్రాతిపదికపై ఏ రచననైనా విమర్శించడానికి రష్యన్ రచయితలకెట్టి అధికారమూ లేదు. కాని సరస్వతీదేవి అభరణాలను సంకెళ్ళనీ, సంకెళ్ళను ఆభరణాలనీ చేసే వాదాన్ని చర్చించి ప్రయోజనమేమీ లేదు.

పాస్టర్‌నాక్ నవలను ప్రచారసాహిత్య మనవచ్చునా ? దానిలో మాతృదేశ ఖండన ఉన్నదా ? అది పాక్షికబుద్ధితో చేసిన రచనయా ?

రష్యాను విడిచి వెళ్ళడానికి పాస్టర్‌నాక్ సమ్మతించక పోవడంలోనే అతనికి రష్యాపైగల ప్రేమ వ్యక్తమవుతున్నది.

కాని తన ప్రేయసి లారాను రష్యాకు ప్రతిమూర్తిగా చిత్రించడంలో అతనికి రష్యాపై గల ప్రేమ ఇంకా స్పష్టంగా వ్యక్తమవుతున్నది. ఉపమానానికీ, ఉపమేయానికీ మధ్య సమానధర్మం ఉండాలి. ఈ దృష్టితో చూస్తే లారాను రష్యాతో పోల్చడంలో రష్యా పట్ల పాస్టర్‌నాక్ ప్రేమ నిరూపితమవుతున్నది. దేశమూ, దాని పాలకులూ, అక్కడి ప్రభుత్వవ్యవస్థా పర్యాయపదాలు కావు. అంకుంఠిత దేశభక్తియే ఒక్కొక్కప్పుడు ఆ దేశపు పాలకులకూ, ప్రభుత్వవ్యవస్థకూ వ్యతిరేకంగా తిరుగుబాటును ప్రోత్సహించవచ్చును. వికర్ణుడు దుర్యోధనుని ఎదిరించడానికీ, లంకను రక్షించే ఉద్దేశంతో విభీషణుడు రావణునికి హితం చెప్పడానికీ కారణం ఇదే. విభీషణుడు లంకను విడిచివెళ్ళాడు. పాస్టర్‌నాక్ రష్యాలోనే ఉండదాని కిష్టపడ్డాడు ! వీరిలో ఎవరు విజ్ఞతతో వ్యవహరించినట్లు ?

మనతో ఏకీభవించనివారు మన విరోధులనీ, ఏకీభవించేవారు మన మిత్రులనీ దూరదృష్టి లేనివారు మాత్రమే నమ్ముతారు. కాని "డాక్టర్ జివాగో" అనే నవలను రచించడం ద్వారా పాస్టర్‌నాక్ తమకు ఉపకారం చేశాడని రష్యన్ దేశస్థు లంగీకరించే సమయం ఒకనాటికి వస్తుంది.

రష్యా దేశంలోని ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించడంలో పాస్టర్‌నాక్ దేశభక్తి చక్కగా వ్యక్తమవుతున్నది. రష్యాలోని విశాలమైన పచ్చిక బయళ్ళు, నదులు, జలపాతాలు, అక్కడి చంద్రోదయం, పొగమంచు, వానలు, వజవజ వణికించే చలిగాలులు, సూర్యోదయాలు, అన్నీ పాస్టర్‌నాక్ భావనను ఎంత సమ్మోహితం చేశాయంటే, ఆత్మీయులకు దూరమైన వ్యక్తి వారి ముఖాలను స్మరిస్తున్నట్లు ఆ ప్రకృతివర్ణనలు కోకొల్లలుగా మనకీ నవలలో కనిపిస్తాయి. అటువంటి సుదీర్ఘ వర్ణనలు కథాగమనాన్ని స్వేచ్ఛగా సాగనీయక అడ్డుపడిన మాట నిజమే. ఐతే ఈ నవలలోని నవ్యతకూ, కవితా సౌందర్యానికీ ఈ ప్రకృతి వర్ణనలు కూడా కొంతవరకు కారణమని ఒప్పుకోవాలి.

పాత్రల ఆకృతినీ, అలవాటులనూ వర్ణించడం ద్వారా వారి రూపాలను తీర్చి దిద్దడంలో టాల్‌స్టాయ్ తన నవలలలో చూపిన ప్రతిభ పాస్టర్‌నాక్ రచనలో కనిపించదు. టాల్‌స్టాయ్ రచించిన "యుద్ధమూ-శాంతీ" అనే నవలలో డజన్ల కొద్ది పాత్రలున్నా, ప్రతి వ్యక్తి రూపమూ పాఠకుల మనస్సులో స్పష్టంగా నిలిచిపోతుంది.

వర్ణనలో కూడా టాల్‌స్టాయ్ సిద్ధహస్తుడు. బోర్డినో యుద్ధానికి ముందు రాత్రి వర్ణన పరిమితిలో చిన్నదైనా చిరస్మరణీయమైనది. అటువంటి వర్ణనలింకా అతని రచనలలో ఎన్నో కనిపిస్తాయి. ఐనా రచయితకు పాక్షిక దృష్టిలేదనే అభిప్రాయం మనకు కలుగుతుంది. అతనికి ప్రకృతిసౌందర్యంతో తాదాత్మ్యం లేదు. కాని పాస్టర్‌నాక్ వర్ణనలు చదివితే అతడు వాటిలో పూర్తిగా లీనమైపోయా డనిపిస్తుంది. ఆ వర్ణనలు నిజానికి ఆత్మాశ్రయ గీతిక లనిపిస్తుంది.

"యుద్ధమూ-శాంతీ", "డాక్టర్ జివాగో" అనే నవలల తులనాత్మకాధ్యయనం

జరిగింది. రెండు కథలలోనూ కాలగమనం సువిస్తృతమైనది. సానుభూతి స్వరం రెండింటి లోనూ వినిపిస్తుంది. ఇవి వాటి పోలికలు. కాని కళాదృష్టిలో వాటిమధ్య భేదం కూడా చాలా ఉన్నది. ఆ రెండింటిని పోల్చడం సాహసమే అవుతుంది.కాని పాస్టర్‌నాక్ మనస్సులో అటువంటి ఉద్దేశమున్నట్లు కనిపిస్తుంది. ఎందుచేతనంటే చరిత్రపట్ల టాల్‌స్టాయ్ వైఖరి నతడు విమర్శిస్తూ అన్నమాటలను బట్టి, తాను చరిత్రను విశాలదృష్టితో చిత్రించినట్లు చెప్పు కొన్నాడనిపిస్తుంది. కాని పాస్టర్‌నాక్ చారిత్రక దృష్టి విశాలమూ కాదు, గంభీరమూ కాదు.

సముద్రాన్ని సముద్రంతోనే పోల్చడానికి వీలవుతుందనీ,'యుద్ధమూ-శాంతీ' అనేనవ లను' "యుద్ధమూ-శాంతీ"అనే నవలతో మాత్రమే పోల్చడానికి వీలవుతుందనీ నేను మనవి చేస్తున్నాను. దానిని"డాక్టర్ జివాగో"తో పోల్చడం ఉత్సాహాతిశయాన్ని ప్రకటించడమే కాగలదు. ఒక మనిషి ఏ రాజకీయ సిద్ధాంతాన్నైనా విశ్వసిస్తాడా,లేదా అన్న మాటతో నిమి త్తం లేకుండా మానవతా ధర్మాన్ని పునఃస్థాపించడమే "డాక్టర్ జివాగో"నవలలోని ప్రధానేతి వృత్తం.విప్లవనినాదాల అడుగున,విప్లవోత్సాహం అడుగున ఒక వ్యక్తిని అణచివేయడం శాస్త్రం కాదని అతడా నవలలో హెచ్చరించగోరుతున్నాడు. ఆ విధంగా ఎందరో అణగిపోయారు. ఎందరో తమ వ్యక్తిత్వాన్ని కోల్పోయి అధికారుల కనుకూలంగా చిందులు వేశారు. కాని తానూ, తన ప్రేయసి లారా ఆ బృందగానంలో గొంతు కలుపలేదు. ఐతే వారి చేతలవల్ల వారి వ్యక్తిత్వాలూ, ఆకృతులూ స్పష్టంగా రూపొందుతాయా? వారు గాని, వారి మిత్రులు గాని ఎన్నడైనా మన కెదురైతే, వారి విలక్షణతవల్ల మనం గుంపులో వారిని పోల్చుకో గలమా?

మంచుతో నిండిన నాటి వాతావరణంలో అందరి దృష్టీ సామాన్య జనంమీదనే కేంద్రీకృతమై ఉన్నప్పుడు, అందరూ ఒక మూసలో పోతపోసినట్లు రూపొందుతున్నప్పుడు మానవుని వ్యక్తిత్వాన్ని గురించి ప్రస్తావించడంలో ప్రయోజనం ఏమున్నదని పాస్టర్ నాక్ సూచిస్తున్నాడా? అతని లక్ష్యం అదేఅయితే ఆ ప్రయత్నం పూర్తిగా ఫలించలేదు. నిరంకు శత్వానికి వ్యతిరేకంగా ఆ ఇద్దరు పాత్రల ప్రతిఘటనతో పాటు మరికొందరి ప్రచ్ఛన్న విమర్శ కూడా అందులో ఉన్నది. కాని వారిని పాస్టర్ నాక్ స్పష్టంగా చిత్రించలేక పోయాడు. ఉత్తమ స్థాయి రచనలో ఇది సామాన్య లోపంకాదని చెప్పవలసి ఉంటుంది. రష్యన్ విప్లవానికీ, సమకాలిక సాంఘిక రాజకీయ వ్యవస్థకూ వ్యతిరేకంగా జివాగో చాలా విమర్శ చేస్తాడు. కాని అతని చర్యల ద్వారా అతడు మనకు స్పష్టంగా ఏమైనా సూచించగలడా? ప్రతి మానవుని వ్యక్తిత్వాన్ని, సమాజంలో ప్రతి వ్యక్తి విలువను తప్పక గుర్తించాలి. అతనిని బానిసగానో, గడ్డిపోచగానో పరిగణించకూడదు. ఐతే అందువల్ల అతని దృష్టిలో మను ష్యులు ఏవిధంగా ప్రవర్తించగూడదో తెలుస్తుంది.కాని సమాజం ఏ విధంగా ఉండాలో అతడు చెప్పలేదు. తనజీవితం ద్వారా అతడిచ్చే సందేశమేమిటి? అతడూ, అతని వంటి అభిప్రా యాలే ఉన్నవారూ ప్రభుత్వాన్ని ప్రతిఘటించాలా ? ఈ వ్యూహంలోనుంచి బయటపడే మార్గాన్ని సూచించాలా ? కమ్యూనిస్టులూ, అధికారులూ తప్పుదారినినుసరించ డంవల్ల ప్రజలు అనేక కష్టాల ననుభవించవలసి వచ్చింది. ఐనప్పుడు ప్రజల

కష్టాలను తొలగించడానికి జివాగో చేసిన దేమిటి? ప్రజలు నిస్సహాయులు. తాను త
కుటుంబానికి దూరమై పార్టీ నినాదాలు చేసేవారి కబంధహస్తాలలో చిక్కుపడినట్లే ప్రజ
కూడా వారివలలో చిక్కుకున్నారు. వారి స్థితి అదేనా? అందుకు భిన్నమైనదా? రష్య
విప్లవంవల్ల, భ్రాతృహత్యా మూలకమైన యుద్ధంవల్ల జాగరితులై ప్రజలు భూస్వామ్య వ్యవస్థన
నిరంకుశత్వాన్ని ప్రతిఘటించి పోరాడారు. ఈ అంశం ఈ నవలలో యథాతథంగా చిత్రి
మయిందా?

ఈ అంశాన్ని వదిలివేసినా, మరొక సంగతి కూడా ఉన్నది. జివాగో కేవల
తనదుస్థితికి చింతిస్తాడా? నూతన వ్యవస్థను సృష్టిస్తాడా? టాల్‌స్టాయ్ నవలలో పియరే
అటు సంపన్నులన్నా, ఇటు యుద్ధోన్మాదులన్నా చిరాకు. ఐనా అతడు స్తబ్ధంగా ఉండడ
నెపోలియన్‌ను హత్యచేయబోతాడు. సైనికులు హింసకు గురిఅవుతున్నా ప్రజలను రక్షిం
డానికి పరుగెత్తుతాడు. చివరకు సామాన్యులైన ఖైదీలతో చేరి, వారితో తాదాత్మ్యం పొంది
తరువాతనే విశ్రమిస్తాడు.

మరి జివాగో మాటఏమిటి? అతడు చెప్పుకోదగ్గ దేదైనా సాధించాడా? పాఠకు
కతడు ప్రసాదించేదేమిటి? పరిస్థితుల తాకిడి కతడు చలించిపోతాడు. కా
మొదటి నుంచీ అతడు తనకర్తవ్యమేదో నిర్ణయించుకోలేడు. చిట్టచివరకి అనిశ్చిత స్థి
కతడు పూర్తిగా బద్ధు డవుతాడు. ఈ దౌర్బల్యంవల్ల తన సేవకుని కుమార్తె మరీనా
పెండ్లి చేసుకుంటాడా? చివరకే మవుతుంది?

"యుద్ధమూ-శాంతీ" అనే నవలలోని ప్రధాన పాత్రలకు యుద్ధం ఏదో ఒకవిధం
విమోచనహేతు వవుతుంది. మేరీ, నికలస్, యాండీ, పియరే, నటాషా, అందరూ త
సమస్యలను కొన్నిటిని పరిష్కరించుకో గలుగుతారు. యుద్ధ శిథిలాలనుంచి తేలిక ప
గుండెలతో తిరిగి లేవగలుగుతారు. రష్యన్ విప్లవంలో జరిగిన తప్పుల వల్ల ఏర్పడి
శిథిలాలనుంచి నవలలోని పాత్రలను కాని, మనలను కాని, పాస్టర్ నాక్ రచన పైకెత్త గల
తున్నదా? ముగింపు చాలా కృత్రిమంగానూ, అసంగతంగానూ ఉన్నదని నా అభిప్రాయం.

విప్లవానికీ, అంతరంగిక సంఘర్షణకూ, యుద్ధానికీ గురియైన జివాగో తన సమస్య
తాను పరిష్కరించుకో లేక పోతాడు. అతనిపై మనకు నిశ్చయంగా జాలి కలుగుతుంద
ఐతే అతని ప్రజ్ఞ అంతరించినందుకు జాలిపడతామే కాని, ప్రతికూల పరిస్థితులలో నుం
తప్పించుకోవడాని కతడు దృఢ నిశ్చయంతో ప్రయత్నించినందుకూ కాదు, ఉన్న
లక్ష్యాలు కలవాడనీకాదు.

ఈ నవలను చదువుతూ ఉండగా ఏమి నేరం చేసి నందుకు, ఏకుట్ర పన్నినందుకు
లారా పారిపోవలసి వచ్చిందనే శంక నాకు కలిగింది. అప్పుడు ప్రబలి
శక్తుల బలాబలాలను రచయిత సరిగా అంచనా వేయలేదా ? ఐతే ప్రఖ్యాత రష్య
రచయితలు రూపొందించిన ఐతిహాసిక మార్గంలో సామాన్య మానవుని హక్కులను ఈ నవ
చిత్రించిందని ఒప్పుకోవాలి. రష్యన్ విప్లవం గుణదోషాలను నిర్ణయించడాని కిది ప్రయ
త్నించింది. రచయిత భావనకు ఉత్తేజం కలిగించేది అతని వ్యక్తిత్వమే కాని ఏదో ఒ

రాజకీయసిద్ధాంతం కాదన్న విస్మృత సంప్రదాయాన్ని ఈ నవలద్వారా పాస్టర్ నాక్ మనకు జ్ఞప్తికి తెచ్చాడు. సాహితీ పరునికి ఏసిద్ధాంతాన్నయినా విశ్లేషించి చూసే అధికారమున్నదని నిరూపించాడు. ఒక సిద్ధాంతాన్ని ఆమోదించే వారితోనూ, ఖండించేవారితోనూ నిమిత్తం లేకుండా వ్యక్తి స్వాతంత్ర్యం ముఖ్యమని అతడుద్ఘాటించాడు. మనుష్యుల కోసం సిద్ధాంతాలు కాని సిద్ధాంతాల కోసం మనుష్యులు కాదని ఎలుగెత్తి చాటాడు.

సామూహికసిద్ధాంతాలూ, నిరంకుశ ప్రభుత్వాలూ తలపడే కాలంలో ఈ సంగతులను చెప్పడానికి అసాధారణమైన మేధాశక్తి కావాలి.

సీ

మనూభాయ్

మహదేవదేశాయ్

## దినచర్యా గ్రంథం నుంచి

2-8-1932 : ఈ వేళ సూర్యోదయం కొంచెం ముందుగా అయింది. కాగా బాపూ (గాంధీజీ) దుప్పట్లను ఎండలో ఆరబెట్ట వలసినదని ఆదేశించాడు. ఈ సందర్భంగా ఆయన ఒక సంగతి చెప్పాడు. దుప్పట్లను గురించి మాతో చెప్పుతున్నప్పుడు ఆయనకు డాక్టర్ నాన్జీ సతి అలవాటు జ్ఞప్తికి వచ్చింది. ఆమె స్కాట్లాండ్ దేశస్థురాలు. బట్టలను చక్కగా ఉతికేది. కాని బట్టలను రోజూఉతికేదికాదు. సబ్బును కూడా ఉపయోగించేది కాదు. కాని వాటిని గంటల తరబడి ఎండలో ఉంచేది. ఎండలో ఉంచడంవల్ల కలిగే లాభాలను ఆమె తనకు వివరంగా చెప్పిందని గాంధీజీ అన్నాడు. ఆ ప్రస్తావన రావడంతో, కస్తూరిబాను డాక్టర్ నాన్జీ గారిఇంట్లో ఉంచడం, అక్కడ ఆమెకు శస్త్రచికిత్స జరగడం గురించి ఆయన మాకు చెప్పాడు. కస్తూరిబా ఓర్పు కడి చక్కని తార్కాణం. ఆమె గుండె బలహీనంగా ఉండడంవల్ల మత్తు మందునిస్తే ఆమె తట్టుకోలేక పోవచ్చునని మత్తు మందు లేకుండానే శస్త్రచికిత్స చేశారు. గాంధీజీ దూరాన నిలబడి చూస్తున్నాడు. ఆయన వణుకుతున్నాడు. బాధా చిహ్నాలు కస్తూరిబా ముఖంమీద కనిపిస్తున్నవి. కాని ఆమె నోటితో తన బాధను వెల్లడించలేదు. "ఒకవైపు భయపడవద్దని నేనామెకు ధైర్యం చెపుతూనే, మరొక వంక వణికిపోతున్నాను. ఆ దృశ్యాన్ని నేను చూడలేకపోయాను" అని ఆయన మాకు చెప్పాడు. "బా నాడు ప్రదర్శించిన సహనశక్తి అసాధారణమైన" దని నేను గాంధీజీతో అన్నాను. "ఔను. శస్త్రచికిత్స చాలాసేపు జరిగింది. అప్పుడు కలిగే బాధకు ఎవరైనా కేకలు బొబ్బలు పెట్టేవారే! కాని బా అద్భుతమైన సహనశక్తిని ప్రదర్శించిం" దని గాంధీజీ అన్నాడు. ఆవు మాంసపు తేనేటిని త్రాగడానికి నిరాకరించడంలో కూడా ఆమె అట్టి ధైర్య స్థైర్యాలనే చూపింది. "చావవలసి వస్తే నేను చావడానికి సిద్ధమే, కాని అటువంటి పదార్థాలు తిని బ్రతకడం నా కిష్టంలే" దని ఆమె అన్నది.

సాయంకాలం బాపూ ఒకవ్యక్తి పేరెత్తి, అతని పుట్టినరోజెప్పుడని అడిగాడు.

వల్లభ భాయ్ : ఎందుకు? మీరతనికి ఉత్తరం వ్రాయాలనుకొంటున్నారా?

బాపూ : పుట్టినరోజు సందర్భంగా ఇతరులకు నేనెటూ ఉత్తరాలు వ్రాస్తున్నాను కదా! అతడు చేసిన నేరమేమిటి?

వల్లభ : ఎవరైనా మిమ్ములను కోరితే, సందేశం కావాలని అర్థిస్తే, వారికి మీరు ఉత్తరం వ్రాయడం భావ్యమే. కానప్పుడు జెయిలునుంచి మీరతనికి వ్రాయవలసిన అవసరమే మున్నది?

బాపూ : అదేమిటి? — రచనలో అతనికి ప్రధానస్థానమున్నది. ఆ శాఖకు చెందిన రచయితలలో అతడే మొదట ఎన్నదగినవాడో, రెండవవాడో.

వల్లభభాయ్ కొంతసేపు మౌనంగా ఉన్నాడు. తరువాత "కావచ్చును" అని అన్నాడు.

బాపూ : కావచ్చునేమిటి? నిశ్చయంగానే అతడు ప్రముఖ రచయితయే.

వల్లభ : ఐతేనేమి ? పని గట్టుకొని ఉత్తరం వ్రాసి మీరటువంటి పిరికిపందను ప్రోత్సహించడం దేనికి? ఒకివైపు దేశం యావత్తూ తగులబడిపోతుంటే తనకేమీ పట్టనట్లు తీరికగా ఇంట్లో కూర్చొని వ్యాసాలు వ్రాయడంలో అర్థమేమిటి?

బాపూ : తన రచనలద్వారా అతడు దేశానికి సేవచేయడం లేదని నీ వనగలవా?

వల్లభ : పండితుల వ్రాతలవల్ల దేశానికి జరిగే ఉపకారమేమీ లేదు. చదవడం, వ్రాయడం అనే అంటువ్యాధిని వారు వ్యాపింపజేస్తారు. అందువల్ల మన ఉద్యమం దెబ్బతింటుంది. చదవడం, వ్రాయడం పట్ల వ్యామోహంవల్ల ప్రజలు మరెందుకూ అక్కరకు రారు. ఇటువంటి నిర్భాగ్యులను తయారుచేసే పాండిత్యంవల్ల, వ్రాతల వల్ల ప్రయోజన మేమిటి?

బాపూ : ...రచనలను గురించి నీవామాట అనగలవా? అతడు వ్రాసిన—జీవిత చరిత్రను నేను చదువలేదు కాని ఆ జీవిత చరిత్రవల్ల ప్రజలు అప్రయోజకులవుతారా?

వల్లభ : ప్రజలు అతడు వ్రాసిన జీవిత చరిత్రను చదువుతారా? లేక అతడు జీవించే తీరును చూస్తారా?

బాపూ : అతడి జీవితవిధానంలో ఉన్న లోపమేమిటి? వెలింగ్టన్ 1916-17 ప్రాంతాన టౌన్‌హాల్ లో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసినప్పుడు, యుద్ధప్రయత్నంలో తోడ్పడవలసినదని అతడు అందరికీ విజ్ఞప్తి చేశాడు, కొన్ని షరతులమీద యుద్ధప్రయత్నానికి తాము తోడ్పడతామని తిలక్ అనుయాయులు ఆ తీర్మానానికి ఒక సవరణను ప్రతిపాదించాలని నిశ్చయించుకొన్నారు. కాని ఆ పక్షం నుంచి - లేచి నిలబడ్డాడు. అందరూ అతనిని గేలిచేస్తూ కేకలు వేశారు. ఐనా అతడేమీ తొణకలేదు. తాను చెప్పదలచుకొన్నదంతా స్పష్టంగా చెప్పినమీదటనే సభనుంచి బయటకు వెళ్ళాడు.

వల్లభ : హ! ఆటువంటి నటనా ప్రదర్శనంలో అతడు సిద్ధహస్తుడే;

బాపూ : ఐతే అతడింకేది చేయాలని నీ అభిప్రాయం?

వల్లభ : ఏ కొంచమైనా త్యాగం చేయనక్కరలేదా?

బాపూ : జెయిలుకు వెళ్ళడమేనా త్యాగమంటే?

వల్లభ : నేనామాట అనను. కాని అతడునాకు సుపరిచితుడు. మీకు తెలియదు. కనుక నేనేమి చెప్పను? వీలయినంత తక్కువ త్యాగంతో అత్యధికలాభం గడించాలని అతని ఆశయం.

బాపూ : ఔను. అతని తత్త్వం అదే.

వల్లభ : అదిగో! ఆ మాట మీరే ఒప్పుకుంటున్నారు! ఇటువంటి తత్త్వం నశించాలి. తానేమో వీలయినంత తక్కువత్యాగం చేయాలి. ప్రజల కడగండ్లంటే అతని కేమీ ఖాతరులేదు. త్యాగం చేసేది వారు. అధికంగా ప్రయోజనం పొందేది అతడు.

బాపూ : నీ వీ విధంగా అన్నావని అతనితో చెపుతాను, జాగ్రత్త?

వల్లభ : కావలిస్తే నేనే అతని ఎదుట ఈ మాట అంటాను. అన్నానుకూడా!— ఆందరూ-చోట కలుసుకున్నారు.— త్వరలోనే రాజకీయోద్యమంనుంచి విరమించనన్నా డని అన్నారు. "అతడెట్లా విరమించుకుంటాడు? విరమించుకునే అధికారం అతనికెక్కడిది? రాజకీయ రంగంమీది కతడెందుకడుగు పెట్టాడు? ప్రజా హిత జీవితంలోనికి ప్రవేశించిన వ్యక్తికి విశ్రాంతి తీసుకునే అధికారంలేదు" అని నేను వారితో అన్నాను.

బాపూ : అది అతని తప్పుకాదు. అతడింకా కృషిచేస్తూనేఉండే వాడు. కాని అంతలో నేను రంగంమీదికి ప్రవేశించాను. దానితో అతడు వేసుకొన్న ప్రణాళికలన్నీ తలక్రిందులయ్యాయి. నాపై అతనికి విశ్వాసంలేదు గనుక అతడు విరమించ దలచుకొంటే మన మాశ్చర్యపడకూడదు.

వల్లభ : సరే! ఐతే అతనికి వ్రాయండి. "సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్" అనే సిద్ధాంతాన్ని మీరు నమ్ముతారు.

బాపూ : మహదేవ్! అతడీ వాక్యం నేర్చుకొన్నాడా?

వల్లభ : ఔను బాపూ రేపటినుంచి అతడు గీతా పఠనం ప్రారంభిస్తాడు. గీతా పఠనం ప్రారంభించాక ఆ గ్రంథాని కతడు చేసే విపరీత వ్యాఖ్యలు మీకు విశ్రాంతి కలిగిస్తాయి. "రేపటినుంచి మనం గీతా పఠనం ప్రారంభిస్తాము కదా?" అని పండుకొనే ముందతనినడిగాను. నేను జెయిల్ సూపరిటెంటును విమర్శిస్తు న్నప్పుడు మాటి మాటికి ఈవాక్యాన్ని ఉచ్చరించాడు.

**ధీరూ బేన్ పటేల్**

## ప్రార్థన

[పూర్తిగా నిస్సహాయస్థితిలో ఉన్నప్పుడు తన స్థితిని చక్కబరచు కోవడానికి

మనుష్యుడేదైనా చేయగోరితే, ద్రవాన్ని ప్రార్థించడం తప్ప మార్గాంతరం లేదు. దీను రాలైన ఒక తల్లి సూర్యభగవానుని ప్రార్థించటం ఈ కథలో వర్ణితమయింది. సూర్యుడు రశ్మిమంతుడు. విద్యా విజ్ఞాన కారకుడు. ఆయనను "ఆకాశాంచలం నుంచి తొంగి చూచే గిరి'' అనీ, "జగచ్చక్షు" వనీ వర్ణిస్తారు.]

ఇంట్లో ముగ్గురం ఉంటున్నాము-అక్షయుడూ, నేనూ, మరొక వ్యక్తీ. ఈ మూడవ జీవి మనస్తత్వం మాకు పూర్తిగా అర్థంకాదు. అక్షయుడికి కోపం వస్తుంది. నేను మాట్లాడక ఊరుకుంటాను. అప్పుడప్పుడు దుఃఖిస్తాను.

*ఆకాశంలో ఒక గిరి ఉన్నది*

చదరంగా ఉన్న సుదీర్ఘ సంకుచిత మార్గం వెంట నేను శ్వాస పీల్చడానికి కూడా వీలు లేకుండా పరుగెత్తుతూ ఉంటాను. దాని కిరువైపుల గదులున్నవి. మరీ వేగంగా పరగెత్తడం వల్ల నా అన్వేషణ అస్పష్టమై చివరకు గాలీ, వెలుగూ, చొరని దారిలో చిక్కుపడి పోతుంది. శుభ, నేను ఏకమై ఉండేవారం, తరువాత శుభ నీటిలో నుంచి మంచు ముక్క పైకి తేలినట్లు నా ప్రక్కను చేరింది ... ప్రాణాధిక శుభ.

*దానిపేరు ఉదయ*

ఎన్నో రోజుల పాటు ఎంతో ఆత్మీయతతో, అనురక్తితో ప్రపంచానికి దూరంగా మా జీవితం మేము జీవించాము. మాటల వంతెనను ఇటూ, అటూ, దాటవలసిన అవసరం మాకు లేక పోయింది. మాకు ఇళ్ళు వేరువేరుగా లేవు. మే మిద్దరం అంత సన్నిహితంగా ఉంటున్నందుకు అక్షయుడు చిరాకు పడేవాడు. సంయోగ వియోగాలకూ, రాగద్వేషాలకూ, పరస్పరం అపార్థం చేసుకోవడానికీ నెలవైన ఈ విశాల ప్రపంచంలోనికి నేను త్వరగా తిరిగి రావాలని అతడు కోరే వాడు. ఈ ప్రపంచంలో మా యిద్దరికీ చెందిన బిడ్డతో-శుభతో-మేము జీవించాలని అతడభిలషించేవాడు.

*దాని అంచునుండి తొంగిచూచేవాడు*

చివరి కతని కోరిక తీరింది. వసంతకాలంలో హేమంతం కోసం నిరీక్షించేవాని అభిలాష ఎప్పుడూ నెరవేరుతుంది. వసంతం అంచు కే వస్తుంది కాబోలు... అప్పుడు మేము ముగ్గురం కలిసి జీవించాము. అక్షయుడూ-నేనూ-శుభ. నిజానికి జీవించింది. శుభయే. శుభ జీవించడంకోసమే మేమిద్దరం జీవించాము. మొదట అది మా ఇల్లు. తరువాత శుభ ఇల్లయింది...నిజంగా అవి ఎంతో మంచిరోజులు. ఆనంద శతదళపు రేకులు ఒక్కటొక్కటిగా అప్పుడే విచ్చుకొన్నవి. విధి విస్మృతి వల్ల మాకు సహస్ర దళ పద్మంకాక అనంత పద్మం లభించిన దనిపించింది.

*కాంతిహస్తుడు, అతడు పద్మపాణి*

జీవితాన్ని మేము శుభ కళ్ళ ద్వారా చూడడం మొదలుపెట్టాము తెల్ల పావురం మెడ నిమిరేవారం. సాగరతీరాన కెరటాల నీటిని మా కాళ్ళతో దోబూచులాడనిచ్చేవారం. పారిజాత పుష్పాలను ఏరి పొడుగైన మాలలను అల్లేవారం. తిరిగి భయానకమైన బడి గంట

విని స్నేహపు రెక్కలను పూర్తిగా విచ్చుకొని ఎగిరేవారం. జీవితంలో మేము మరచిపోయిన వన్నీ శుభ మాకు తిరిగి తీసుకువచ్చింది...పూర్ణారోగ్యంతో ఉన్న శరీరానికి అలసట కలగడం, అదొక స్వచ్ఛమైన, సౌమ్యమైన అనుభూతి. అప్పుడే ఒక క్షణంపాటు చైతన్యం ఘనీభవిస్తుంది...మనస్సుకు దెబ్బతినగల శక్తి-అప్పుడే చైతన్యం లేత గడ్డివలె వేనవేలు చిగుళ్ళు తొడుగుతుంది.

*అతడు జగచ్ఛక్షువు*

ఒక రోజున శుభ పెరిగి పెద్దదయిందని మేము గుర్తించాము. ఒక్కొక్కప్పుడు మేము ముగ్గురం ఉండేవారం. ఒక్కొక్కప్పుడు ఇద్దరమే...విడిపోయి, గింజుకుంటూ. దగ్గరగా పండుకొని ఉండడం వల్లనే ఒకరి నొకరం తాకుతూ.. మే మిద్దరమే-అక్షయుడూ. నేనూ. శుభ వస్తూ పోతూ ఉంటుంది. శుభ వెళ్ళినప్పుడెల్ల వియోగంవల్ల ఏర్పడే ఖాళీ క్రమంగా విస్తృతం కాసాగింది. ఆ శూన్యస్థలంలో శుభ కూడా తప్పిపోయేది. ఏదైనా ఆలంబంకోసం వెతుకుతూ ఉండేది. "అమ్మా! నీ వంటే నాకెంతో ఇష్టం" అనేది.

చదరంగా ఉన్న ఆ చీకటిదారి ఇంకా పొడుగు కాసాగింది. గదులన్నీ మూసి ఉండేవి. నేను ఒంటరిని. నేను పరుగెత్తవలసి ఉన్నది. కాని కాళ్ళలో సత్తువపోయింది. భయంవల్ల నిలబడతాను. కాని వెంటనే కూలిపోతాను. ఐనా కిమ్మనకుండా పరుగెత్తుతాను. భయంకరమైన ఈ శూన్యంలో ఏదైనా ప్రతిధ్వని వినిపిస్తే నేను భరించలేను. ఆ క్షణాననే నేను ఛిన్నభిన్నమై పోతాను. పరుగెత్తడమే మంచిది. అప్పుడు ఎక్కడైనా శుభను కలుసుకొనే అవకాశమైనా ఉంది. శుభ కూడా ఎక్కడో పరుగెత్తుతూనే ఉన్నదట. కాని నన్ను వెతుకుకుంటూ కాదు. ఎన్నటికీ కాదు. ఈ ప్రపంచమత్తేభపు కణతలనుంచి శుభ ఏ ప్రశస్త మణిని ఆపేక్షిస్తున్నదో తెలియదు.

*అతనికి ఉజ్జ్వల నీలమణితో పోలిక*

అక్షయునికి చాలా కోపంగా ఉన్నది. అతనికిది నచ్చలేదు. శుభ రోజూ రాత్రి చాలా ఆలస్యంగా ఇంటికి తిరిగిరావడం అతని కిష్టంలేదు. మాకు పూర్తిగా అపరిచితులైన ఇందరితో, భిన్న ప్రకృతులుగల వ్యక్తులతో శుభ స్నేహం చేయడం అతని కిష్టంలేదు. మాకర్థం కాని పుస్తకాలను శుభ చదవడం, మాకు బోధపడని సంగతులు మాటలాడడం అతని కిష్టంలేదు. కాని శుభ ఈ పనులన్నీ చేసేది. తల్లిగా నేను నా విధినిర్వహణలో పూర్తిగా విఫలమయ్యానని అతని విశ్వాసం. శుభ కళ్ళ క్రింద నల్లని ముడతలను నేను చూడడంలేదనుకొంటున్నాడు.

కాని నేను వాటిని చూస్తూనే ఉన్నాను. అంతేకాదు. అక్షయునికి కూడా కనిపించని అంశాల నింకెన్నిటినో కూడా చూస్తున్నాను. శుభ పరుగెత్తుతున్న ఈ పోటీలో అడ్డువచ్చిన వారిని ప్రక్కకు తన్ని వేస్తుందని, వారిని దిగంతాలకు విసిరివేస్తుందని నేను గుర్తించాను. నాకు తట్టుకొనే శక్తిలేదు. దిగంతమంటే నాకు భయం. ఒంటరి తనమంటే నాకు భయం. అన్నిటిని మించి శుభ చిక్కుల పాలయినప్పుడు దానిని దగ్గరకు తీసుకొని ఓదార్చడానికి నేను ఉండనేమోనని భయం. అది నేను భరించలేను. అక్షయుని కోపాన్ని భరించగలను.

ఏమీచేయలేని నిస్సహాయతను భరించగలను. కాని శుభకు నే నవసరమైనప్పుడు దగ్గర ఉండ నేమోననే ఊహను మాత్రం భరించలేను.

సీమలు క్షణక్షణం మారిపోయే ప్రపంచంలో శుభ తప్పిపోయింది. దాని నావరించిన అంధకారానికి పూర్తిగా అది కారకురాలు కాదు. అది...మన అందరి వల్లనే...నిస్సహాయురాలు.

*అంధకార గజం మీదికి సింహంవలె లంఘిస్తాడతడు*

ఎన్ని అనుకొన్నా అది నా శుభ–శుభ! నా ముద్దుబిడ్డ! అప్పుడప్పుడూ ప్రేమశూనతీ మైన, కర్కశమైన ఆ ముఖంలో కొంత ప్రసన్నత కనిపిస్తుంది. మాతో జీవిస్తున్న ఈ మూడవ వ్యక్తిలో మా శుభ దాగి ఉన్నదని అప్పుడు నేను గ్రహిస్తాను. ఒకనాటికి దానికి కనువిప్పు కలుగుతుంది. అప్పుడది బయటకువచ్చి మమ్మల నిద్దరినీ తిరిగి కలుసుకుంటుంది. కొన్ని క్షణాలపాటే కావచ్చును. ఐనా బాధలేదు.

*ప్రేమ పూర్ణ స్పర్శతో అతడు పద్మాలను మేలుకొలుపుతాడు*

ఆ అపరిచిత వ్యక్తితో అక్షయుడు తరచుగా పోట్లాడుతూ ఉంటాడు. కోపంతో నిండిన వారి మౌనం పొగవలె ఇంటి నంతటినీ ఊపిరి పీల్చనీయకుండా కమ్ముకుంటుంది. "నేను వెళ్ళిపోతా" నంటుందది. "ఎక్కడికి వెడతావు శుభా! నీకు తెలియదు. ఇన్ని విభిన్న ప్రపంచాలు లేవిక్కడ. ఈ విశ్వానికి ఆకృతి నిచ్చిన చరమసత్యం ఒక్కటే."

*అతడు దేవోత్తముడు*

శుభా! భయంతో, ఒంటరి తనంతో నిండిన ప్రపంచంలో ఆయనయే నాకు ఏకైకా శ్రయం. ఒక్కొక్కప్పుడు నేను ఏకాగ్రతతో ఆయనను స్మరించినప్పుడు నా కాళ్ళు స్థిరంగా నిలబడతాయి. ఈ చదరపు బాటకు వర్తులాకారం వస్తుంది. ఏదో అపూర్వానుభూతి కలుగుతుంది. దానిని నీవుకూడా అనుభవించగలిగితే బాగుండునని నే నెంత గాఢంగా వాంఛిస్తున్నానో!

నా నమస్సుల నందుకొంటున్న దేవుడు సుందరుడు. మన కందరికీ పూజనీయుడు.

# తమిళము

మూలం : శ్రీ ఆర్. రంగాచారి

అనువాదం : డా॥ డి. చిన్నికృష్ణయ్య

## చారిత్రక సమీక్ష

తమిళ సాహిత్యానికి స్వదేశీయము, అనుస్యూతము అయిన 2200 సంవత్సరాల నాటి ప్రాచీన సంప్రదాయమున్నది. కాని అతి ప్రాచీన రచనలు మనకిపుడు నష్టమయినాయి నిజానికి సంగం యుగానికి సంబంధించిన - అనగా కడపటి తమిళ పరిషత్కాలమునకు చెందిన సుప్రసిద్ధ గ్రంథాలుకూడా డా. ఉ. వె. స్వామినాథ అయ్యర్ వంటి విద్వత్పరిశోధకుల మార్గదర్శకత్వము వలన విస్మృతి పథము నుండి ఉద్ధరింప బడడం ఇటీవల మనమెరిగిన విషయమే. ఈ గ్రంథ రచనాకాల నిర్ణయమో ఇప్పటిదాకా వివాదాస్పదంగానే ఉన్నది. ఇక సన్నిహిత ప్రాచీన గ్రంథకర్తలను గురించికూడా మనకు ప్రామాణిక వివరాలు లభ్యం కావడం లేదు. కవిత్వము (సంగీతము) మాత్రమేకాక వచనము, రూపకము కూడా తమిళ సాహిత్య విభాగములు అనడం ఆదినుండి అంగీకృత మయిన విషయమే ; కాని ఆ ప్రాచీన వచనానికి, రూపకప్రక్రియకు మచ్చు తునకలు, ప్రధానంగా ఆ కావ్యాలకు రచితమైన వ్యాఖ్యారూపంలోనూ, ఆ కవితా రచనలలో అంతర్నాటికా సదృశ సన్నివేశాలుగానూ మాత్రమే నేడు మనకు మిగిలి వచ్చినవి. వచనము, రూపకము విశిష్ట ప్రక్రియలుగా వర్ధిల్లడం సుమారు 19 వ శతాబ్దము నుండియే జరిగింది. ఆంగ్ల సారస్వత ప్రాబల్యము ముద్రణ సౌకర్యాలు దానికి ప్రధాన కారణాలు. శతాబ్దాల తరబడిగా తమిళ సాహితీ భాషాక్రమము అంతగా విపర్యస్తము కాకున్నా, క్రీ. శ. 1000 దాకా లేఖనోచ్చారణాలు (orthography) అవ్యవస్థితంగా ఉండి, ఉచ్చారణలో పరిణామాలు ఆ తర్వాత ఏర్పడియుండవచ్చుననీ, ప్రస్తుతం ఉపలభ్యమానమగు ప్రాచీన సాహితీ స్వరూపం, ఇంచుమించు క్రీస్తుశక పూర్వాపర కాలంనాటి సాహితీ మాతృకలకు సుమారు క్రీ. శ. 500 ప్రాంతమున పరిష్కృత రూపాలే - అని విజ్ఞుల కొందరి విశ్వాసము. లిపిపరిణామం అంతకంటే వివాదాస్పదమైన అంశము. కాన తమిళ సాహిత్యానికి ఒక నిర్దిష్ట చరిత్రము ఇంకను నిర్మాణ దశలోనే ఉన్నదని చెప్పవచ్చు. ఇక్కడ మేము ఉద్దేశించినది స్థూల విభాగాలను గూర్చిన సంగ్రహకథనము మాత్రమే.

### 1. సంగం కావ్యాలు

తమిళ కవితా వైఖరిలో విలక్షణంగా భావింపబడేది ద్విధావిభాజ్యమైన వస్తు విన్యాస విధానము. అవి 1. అహం-ఆత్మాశ్రయ ప్రణయ స్థితులు. 2. పురం-పరాశ్ర



యము - అంటే యుద్ధం, రాష్ట్రతంత్రం ఇత్యాదులు.

పరిణామ శీలము, సానుభూతి మంతము అయిన ప్రకృతి భూమికను బట్టి అహం లోని విస్తృత విశ్లేషం ఈ విధంగా ఉన్నది - (1) భూవిభాగము (భూపంచకము) తినై అంటే - పర్వత ప్రాంతాలు (కురించి), గోపభూములు (ముల్లై), పొలాలు లేదా సమభూములు (మరుదం), సాగరతీరము (నెయ్‌దల్), బీళ్లు లేదా మరుభూములు (పాలై) (2) షడృతువులు. (3) దినషడ్విభాగాలు ; తమిళ దేశమందలి పువ్వులు, మొక్కలకు; సంబంధించిన ప్రత్యేక సంకేతాలతో, వర్ణనాత్మక సమర కవిత్వం గురించిన సాదృశ్య వర్గీకరణము దీనిలో ఉంటాయి.

ఈ కవితా సమయాలు ప్రాచీన తమిళ వ్యాకరణ సంహితమైన తొల్కాప్పియము (కర్త-తొల్కాప్పియర్) లో ఉగ్గడింపబడినవి. విశదము, విస్తృతము అయిన ఈ గ్రంథం 1. ధ్వని శాస్త్రము, 2. వాక్యపరిచ్ఛేదము, శబ్ద నిష్పత్తి విధానము, 3. ఇతివృత్తము (వస్త్వలంకారాదికము) మొదలగు వాటిని, అప్పటికే స్థిరపడిన నియమ క్రమంలో వివరించడంవల్ల, తత్పూర్వకాల విస్తర సాహిత్య స్థితికి నిదర్శన హేతుకంగా వెలసి ఉన్నది. సంస్కృతాద్యన్యదేశ్య శబ్దజాల స్వీకరణకు సంబంధించిన సూత్రములు ఇందుండడం గమనార్హమైన అంశము. కాలానుగుణంగా ప్రయోగంలో పరిణామములు తప్పనిసరి అని ఈ గ్రంథము ఉద్బోధించును. (ఈ అభిప్రాయాన్నే 12వ శతాబ్దిలో నన్నూల్ అను వ్యాకృతికర్త అయిన పవణంది ముని నొక్కి వక్కాణించారు.) విద్వాంసులు ఈ గ్రంథ రచనాకాల చర్చలో ఏకీభవించడం లేదు. ఈ వ్యాకరణ సంహితపై సంపూర్ణంగా కానీ, భాగాలలో కానీ వెలువడ్డ వ్యాఖ్యానాలలో ఇళంపూరణార్ (సుమారు క్రీ. శ. 10వ శతాబ్దమో లేదా తర్వాతనో), నచ్చినార్ కినియర్ (సుమారు క్రీ. శ. 15 వ శతాబ్దమో ఆ తర్వాతనో) వ్రాసిన వ్యాఖ్యానాలు గణింపదగ్గవి. ఇవి విస్మృతమైన గతకాలపు తేజోదృశ్యాలను మనకు ప్రదర్శించగలుగు తున్నాయి.

సాహిత్యానికి వాస్తవంగా సంబంధించి నంతమేరకు, ఉపలభ్యమౌతున్న కావ్యాల్లో సంగంకావ్యాలే అతి పురాతనాలు. ఇవి కవితా సంకలనాలు ; విభిన్న కాలాల్లో పెక్కురు కవులు వ్రాసినవి. అవి 1. ఎట్టుత్తొగై (అష్ట సంకలనము) 2. పత్తుప్పాట్టు (దశ గీతములు).

ఎట్టుత్తొగైలో (a) పురనానూరు (సుమారు 150 కవులు వ్రాసిన 400 వచన కవితలు) (b) పదిట్టుప్పత్తు (దశదశకములు) (వివిధ కవులు పదుగురు చేరరాజులను వినుతించినవి, తర్వాత స్వరబద్ధమైనవి) - అను రెండు పరాశ్రయ కవితా సంకలనాలున్నాయి. తక్కిన ఆరును ఆత్మాశ్రయ కవితాసంకలనాలు. అవి (1) అహనానూరు (నెడుంతొగై - దీర్ఘ సంకలనాలు) 142 మంది కవులున్నూ, పేరులేని మువ్వురున్నూ వ్రాసిన 400 పద్యరచనలు. ఒక్కొక్క పద్యంలోను 13 నుండి 31 దాకా పాదములుంటాయి.

2. నట్రిణై : [ప్రాంతీయ కవితలు] 400 స్వచ్ఛంద కవితలు (Blank

Verse); పద్యానికి 3 మొదలు 6 పాదాలు. వీటిలో 56 ఖండికల రచయితల పేర్లు తెలియవు ; తక్కినవి 192 మంది కవులు వ్రాసినట్లు పేర్కొంటారు

3. కురుంతొగై (లఘుసంకలనాలు) - 400 స్వచ్ఛంద కవితలు ; పద్యానికి 4 నుండి 8 పాదాలు. 10 ఖండికల రచయిత లెవరో తెలియడం లేదు ; తక్కినవి 205 మంది రచించారంటారు.

4. ఐంకురు నూర్ (లఘు శతకపంచకము) - స్వచ్ఛంద కవితలు పద్యానికి 3 మొదలు 6 దాకా పాదాలు. ఐదుగురు కవులు రచించిన నూరేసి పద్యాలుగల ఐదు భాగాలు.

5. పరిపాడల్ - పరిపాడల్ అను విశిష్ట ఛందస్సుగల 70 దీర్ఘపాదాలు వానిలో మూడిట ఒక భాగం మాత్రమే ప్రస్తుతం లభిస్తున్నది. వీటిని 13 మంది కవులు వ్రాయగా 10 గురు స్వరబద్ధం చేసినారు. ఇవి వివిధ ప్రాంతీయ - అధిదేవతామూర్తులైన విష్ణు, సుబ్రహ్మణ్య, దుర్గలను, మధురానగరాన్ని, వైగైనదిని కీర్తించే కవితలు. అందువైగై కీర్తనం ఆత్మాశ్రయ పద్ధతికి చెందినది.

6. కలిత్తొగై - కలి అనే విశిష్ట ఛ్చందంలో రచించిన 150 నాటకీయ భావగీతి కలు. ఇది వరకే పేర్కొన్న పాంచభౌమిక (తిణై) విభాగక్రమంలో ఐదుగురు రచయితల సంకలనాలు. [ఈ సంకలనం మాత్రమే వ్యాఖ్యతో సహా సంపూర్ణంగా లభించినది. తక్కినవి కొద్దిగానో, గొప్పగానో అసంపూర్ణాలే ]

రెండవ కవితా సంకలనవర్గానికి చెందిన పత్తుప్పాట్టులో (దశగీతముఖ) సుప్రసిద్ధకవినక్కీరకృతమైన 'తిరు-మురుగు-ఆట్రుప్పడై' (సుబ్రహ్మణ్యనిలయాలను సూచించే 300 పంక్తుల రచన), నెడనల్ వాడై (పాండ్యరాజు దండయాత్రను, శీతకాలపు ఉరవళ్లను గురించి తెలిపే 200 పంక్తుల రచన) అనే రెండు కృతులున్నాయి. తక్కిన ఖండికల్లో మూడు 'మార్గదర్శక' రచనలు (పోషకులను అన్వేషించే కవులకు, నర్తకులకు) ; ఐదు. ప్రాంతీయ గీతాలు. వీనిలో సుదీర్ఘమైనది 782 పాదాల్లో మాంగుడి మరుదనార్ రచించిన 'మదురైక్కాంచి' అనే కృతి, ఈ కావ్యం, ఆదర్శపాలక లక్షణాలు ప్రవచించడం మాత్రమే కాక మధురా పరిసర ప్రాంతాలను సమకాలిక సాంఘిక జీవితాన్ని అభివర్ణిస్తుంది. 300 పాదాలుగల 'పట్టణప్పాలై' అనే కృతి సుప్రసిద్ధ "పుహర్" (కావేరి ప్పూంపట్టణము) పుర వర్ణనం కలది. అతి లఘుకావ్యం 103 పాదాల్లో రచితమైన 'ముల్లైప్పాట్టు' (గోప కావ్యము).

ప్రస్తుతం లభిస్తున్న సంగం కావ్య సంకలనాలు రెండింటిలో సుమారు 2400 ఖండికలున్నాయి. వీటిలో చాలా కృతులకు నచ్చినార్ కినియర్ వ్యాఖ్యలు రచించాడు. కొన్నిటికి వ్యాఖ్యాతల పేర్లు తెలియడం లేదు ; తెలిసిన వారిలో పేరాసిరియర్, పరిమేల్ అళగర్ (పరిపాడల్ వ్యాఖ్యాత) ప్రముఖులు.

సంప్రదాయాను గుణంగా ప్రణయేతి వృత్త చిత్రణం గల ఆత్మాశ్రయ కవిత్వ విశిష్టలక్షణాలు ఇవి : నిరాడంబరమూ, ప్రసన్నమూ, సరళమూ అయిన శైలి ; గాఢమైన

అనుభూతితో, నిసర్గమనోహరంగా స్ఫురించే ప్రకృతి వర్ణనలు; లలితమైన రూపకల్పనము; ఆదర్శప్రాయంగా, ఆత్మీయతాతీతంగా, సుకుమారమైన అర్థచ్ఛాయలలో సాగిన వస్తువిన్యాసము. 'పరాశ్రయ' కవితలు ప్రాచీన తమిళ సంఘానికి, నాగరికతకు దర్పణములు.

## 2. ఉత్తర సంగం కావ్యములు

"అష్టాదశ లఘుకృతులు" (పదినెణ్‌కీళ్ కణక్కు) గా వ్యవహరింపబడే పద కొండు నీత్యుపదేశ కావ్యాలు, ఏడు ఆత్మాశ్రయ కృతులు – ఇక పరిశీలనార్హానులు.

వీనిలో ప్రాథమ్యం వహించే గ్రంథం తిరువళ్లువర్ రచించిన తిరుక్కురళ్ (కురళ్). ఇందు 1330 పాదద్వయ కవితలున్నాయి. దీనిని "వెణ్బా" అంటారు. మొదటి పాదం కన్నా రెండవ పాదం చిన్నది. 133 దశక విభాగాల్లో సంధానమైన ఈ గ్రంథంలో మొత్తం మీద మూడు వర్గములున్నాయి. అవి (1) జీవితధర్మతత్వము (అరమ్-గృహస్థ, సన్యాస ధర్మాలు. (2) సాంఘిక రాజకీయ-అర్థతత్వము (పొరుళ్-అర్థము) (3) ప్రణయ తత్వము (ఇన్బమ్-కామము). ఈ గ్రంథం విశ్వకావ్యంగా అభినందితమైనది. (బహు భాషల్లో అనూదితమైన కావ్యమిది; ఇంకా నూతనానువాదాలు సాగుతూనే ఉన్నాయి). మత విద్వేషాలకతీతంగా, మహావిజ్ఞాన స్వరూపంగా, విశ్వజనీన తత్త్వాకృతిగా వెలసిన గ్రంథమిది. లలితమైన హాస్యం, యుక్తమైన రూపకల్పన, దేశీయాభిరుచి, భావతీవ్రత, నిగ్రహ గాంభీర్యాలు దాని కవిత్వపు సోయగానికి వన్నెలు దిద్దినాయి. ప్రణయేతివృత్త సంవిధానానికి సంబంధించిన ప్రాచీన సంప్రదాయాలు కటువుగాకాక కమనీయంగా నిర్వహింపబడ్డాయి. ఈ గ్రంథానికి ఎన్నో వ్యాఖ్యానాలు వెలసినాయి; వానిలో పరిమేల్ అళగర్ వ్రాసినది సుప్రసిద్ధము. నవీన దృక్పథాలకనుగుణంగా వ్యాఖ్యానాలు వెలువడుతూనే ఉన్నాయి.

మహనీయమానవుడైన ఈ మహాకవి జీవితం గురించి పుక్కిటి పురాణాలు తప్ప ప్రామాణిక వర్తమానం ఏదీ లభ్యం కావడం లేదు. ఇతడు మదరాసులోని మైలాపురానికి చెందిన వాడనీ – క్రీస్తుశకాదికి కొంత పూర్వుడనీ – అనగా 2000 సంవత్సరాలకు ముందరి వాడని నమ్ముతున్నారు.

తర్వాతి రచనల్లో "నాలడియార్" అను కవితా సంకలనం (జైనకవులు రచించినవి) "పళమొళి" ("ప్రాచీనోక్తి" - ఏకకవి కృతం లోకోక్తుల పోహళింపు గలది) ముఖ్యమైనవి. ఒక్కొక్క దానిలోను నీతిబోధకాలైన వెణ్బాలు-నాలుగు పాదాలు గల నాలుగు వందల వెంబా పద్యాలు-ఉన్నాయి. తక్కిన 8 ఉపదేశాత్మక కావ్యాలుకూడా ఈ తరగతికే చెందినవైనా పరిమాణంలో చిన్నవి. 7 ఆత్మాశ్రయ కృతులుకూడా చిన్నవే. వీనిని వ్రాసిన కవులు ఉద్దేశపూర్వకంగా ప్రాచీన ప్రాంతీయ కవితా సమయబద్ధులు కావడంచేత వారి రచనల్లో, సంగం కావ్యాల్లో స్ఫురించే సహజధోరణి లుప్తమైంది. సమర రంగ మహిమను ప్రశంసించే "కళవళి నార్పదు" అన్నది మరొక విశిష్ట కావ్యము.

## 3. కథనాత్మక ప్రాచీన కావ్యాలు

కథనాత్మకమైన ప్రధాన మహాకావ్యాలు: (a) జంట కావ్యములు(i)సిలప్పదికారం

(మేఖలాస్వీకారము)-రాజయోగి ఇళంగో అడిగళ్ వ్రాసినది.(ii)మణిమేకలై (మణిమేఖల)-సీత్తలైచ్చాత్తనార్ అను బౌద్ధకవి కృతము. (b) చింతామణి (జీవక చింతామణి)-తిరుత్తక్క దేవర్ అను జైనకవి రచించినది.

"వళైయాపతి" "కుండలకేశి" అనేరెండు కథనాత్మక కావ్యాలున్నూ, పెరుందేవ నార్ రచించిన భారతమున్నూ ఇప్పుడు లభించడంలేదు.

సిలప్పదికారం గద్య-గీత-నాటక ప్రక్రియలకు నిదర్శనప్రాయం, తమిళ సాహిత్యానికి తలమానికము. నాయికా నాయకులుగా రాజులను గాక సామాన్యులను (కణ్ణకి, కోవలన్ అను వారిని) ఎన్నుకోవడం, తమిళదేశ రాజన్యత్రయ చరిత్రను సమగ్రంగాను, సంకోచరహితంగాను ఉగ్గడించడం; ప్రజల జీవితం, ఆచార వ్యవహారాలు, జానపదగేయాలు, లలిత కళలు మున్నగు వానిని విశదీకరించడం-ఈ కావ్యం ప్రత్యేకతలు. ఈ కృతి ప్రాచీన కాలాన్ని విలోకింపజేసే గవాక్షం; ఈ విషయంలో దీనికి "అడియార్కు నల్లార్" వ్రాసిన వ్యాఖ్యానం మరింత ఉపకరిస్తుంది.

విషాద ప్రణయగాథ ఇందలి ఇతివృత్తం. కోవలన్ అనే వణిగ్యువకుడు తాత్కాలికంగా మాధవి అనే వేశ్యా వ్యామోహంలోపడి, తెలివి తెచ్చుకొని-పతివ్రత అయిన తనపత్ని కణ్ణగితో మధుర చేరుకొంటాడు. అక్కడ క్రొత్త జీవితం ప్రారంభించాలనుకున్న కోవలుడు పాండ్యరాజ శాసనంవల్ల పొరపాటున వధ్యుడయ్యాడు; ఆ పతివ్రత కోపాగ్నికి మధుర దగ్ధమౌతుంది. తర్వాత ఆమె పతివ్రతాదైవంగా నెలకొంటుంది. ఇది ప్రసిద్ధ కథ. ఇళంగో కథనపద్ధతి మనోభావాలను శాశ్వతంగా ఆకట్టుకోగల నేర్పుకలది

ఈ కావ్యానికి ఉత్తరభాగం సాత్తనార్ కృతి. అందులో మాధవి పుత్రిక మణిమేఖల బౌద్ధ సన్యాసిని కావడము వర్ణితం.కవి బౌద్ధసిద్ధాంత సమాహితుడు కావడంచేత రచనలో కావ్యత్వం కుంటుపడింది. ఈ కృతిరచనా కాలం ఇంకా నిశ్చితం కాలేదు.

చింతామణి చాల తర్వాతి కాలానికి చెందిన కృతి. (క్రీ.శ. 9 లేదా 10వ శతాబ్దం) కథావస్తువుకు ఒక సంస్కృత కావ్యం ఆధారం. 'వృత్తం' అనే ఛందస్సును తమిళ కవిత్వంలో మొట్టమొదట విస్తృతంగా వాడడంవల్ల, ఆలంకారికమైన వివిధ ప్రయోగాల ఆదృతి వల్ల తమిళ విద్వాంసులు దీన్ని గొప్పకృతిగా పరిగణిస్తారు. ఈ కృతికి "నచ్చినార్కినియర్" వ్యాఖ్యానం వ్రాసినాడు.

'కొంగువేళిర్' అనే రాకుమారుడు వ్రాసిన 'పెరుంకదై' (బృహత్కథ) ఇక్కడ పేర్కొనదగినది. (ఈ కవి సంగం కాలానికి చెందిన వాడుగా కొందరు విద్వాంసులు భావిస్తున్నారు). ఇది ఉత్తర భారతదేశమునకు చెందిన వాసవదత్త ఉదయనుల ప్రణయ వృత్తాంతమును వివరించే కథాకావ్యము. ఈ కృతిలో కొన్నిభాగాలు ఈనాడు మరుగుపడ్డాయి. యథార్థ వస్తు వివేచనరీత్యా ఇది ఎంతో విలువ కలది. ఈ తరగతికి చెందిన ప్రాచీనమైన తక్కిన లఘుకృతులలో తోలామొళితేవర్ వ్రాసిన చూళామణి (చూడామణి) ఒకటియగును.

## IV భక్తి సాహిత్యోదయం

క్రీ.శ. 6,7 శతాబ్దాల నుండి భక్తి సాహిత్యం రూపు కట్టసాగింది. ఇది ప్రజల

మధ్య మతసంబంధమైన పునరుజ్జీవనం కలిగించడానికి పూనుకొన్న వైష్ణవ (ఆళ్వారులు) శైవ (నాయన్మారులు) ఆచార్యుల కాలము. దాదాపు ֱ50 సంవత్సరాలు సాగిన ఈ పురోభివృద్ధి దశలో అంతకు ముందున్న ప్రాపంచిక దృష్టిగల కృతులు విస్మృతములైనాయి. అప్పర్ (తిరునావుక్కరసర్). జ్ఞాన సంబంధర్, సుందరర్, మాణిక్కవాచగర్, కారైక్కాల్ అమ్మైయార్, తిరుమూలర్ మొదలైన పలువురు శివభక్తులు రచించిన స్తోత్రగీతాలను పదకొండు గ్రంథాలుగా, నంబి ఆండార్‌నంబీ అను నతడు 'తిరుమురై' అను పేరిట, 11 వ శతాబ్దిలో సంకలనం చేసినాడు. ఈ విధంగానే పన్రెండుగురు ఆళ్వారులు (పొయ్‌గై, భూత, పేయ్ ఆళ్వారులు అను మొదటి ముగ్గురు-కులశేఖర ఆళ్వారు, పెరియాళ్వారు, ఆండాళ్, నమ్మాళ్వారు, తిరుమంగై ఆళ్వారు మొదలైనవారు) రచించిన 4000 స్తోత్ర గీతాలను ఆచార్య నాథముని 'దివ్యప్రబంధ' మనే పేరిట ఆ శతాబ్దిలోనే సంకలనం చేసినాడు. ఈ సాహిత్యమంతా ప్రాచీన కాలంనాటి సత్సంప్రదాయ బద్ధం మాత్రమే కాక 'ప్రాంతీయ ఆచారాలకు దృష్టాంతాలుగా ఉన్నది. కవిత్వాశయం ఉదాత్తము. ఐహిక దృక్పథాన్ని తీవ్రమత సిద్ధాంత పరంగా కేంద్రీకరించి, సాధారణ మానవ భావాలను భవ్యంచేసి, ఉన్నత పథంవైపు ఉన్ముఖ పరచే ప్రయత్నం జరిగింది. క్రమేణ ఈ పాటలు స్వరబద్ధం కావడంతో తత్ గీతపఠనం దేవాలయాల్లోను ఇతర మతసంస్థల్లోనూ జరిగే అనుష్ఠానాల్లో భాగమై భద్రపడినవి. ఆండాళ్ రచించిన తిరుప్పావై, మాణిక్కవాచగర్ రచించిన తిరువెంబావై (తిరువాచకంలో భాగం) అర్వాచీన కాలంలో బహుళ ప్రచారం పొందినవి.

## V సాహిత్య పునరుజ్జీవనము

11, 12వ శతాబ్దాలు గొప్ప సాహితీ పునరుజ్జీవనానికి సాక్షి భూతములు.ప్రసిద్ధ ఉపదేశాత్మక రచనల్లో, అవ్వైయార్ అనే కవయిత్రి (అదే పేరుగల సంగంకాల కవయిత్రి కంటె భిన్నవ్యక్తి) రచించిన 'ఆత్తిసూడి' మొదలైనవి, జయంకొండార్ అనే కవి యుద్ధ ప్రశస్తి గురించి రచించిన 'కళింగత్తుపరణి', సేక్కిళార్ అనే సర్వోత్తమ శివభక్తుడు శైవ 'తిరుమురై'లో భాగంగా కలిపిన "పెరియపురాణం", సాటిలేని మహాకవియైన కంబన్ వ్రాసిన "రామకదై" అనే విశ్వవిఖ్యాత "రామాయణం", ఒట్టకూత్తన్ రచించిన "తక్కయాగ పరంగణి", "కులోత్తున్ పిళ్లై తమిళ్' మొదలైనవి,పుగళేంది రచించిన "నళవెన్బా"-ఇత్యాదులు ఈ కాలంనాటివే.

కొందరు విద్వాంసులు కంబన్ ఈ కాలానికి పూర్వుడంటారు. ఇది ఏవిధంగా ఉన్నా కంబ రామాయణం మాత్రం (మూలం వాల్మీకి రామాయణమే అయినా) మహా ఇతిహాసంగా ప్రత్యేకస్థానాన్ని సంపాదించింది కంబ రామాయణం తమిళ సంప్రదాయ సిద్ధమైనదే కాకుండా పదవిన్యాసం, కథన దక్షత, కల్పనా గరిమ, పాండితీ ప్రకర్ష, ఆదర్శౌదార్యం మొదలగు వానికి మెప్పువడసిన కావ్యం. అనంతర కాలంలో ఈ రామాయణం పలువుర తాకిడికి (కరకౌశలానికి) గురికావడంతో నిర్దుష్టము, సమగ్రము అయిన శోధితప్రతి ఇంతవరకు ముద్రితం కాలేదు.

(కంబన్ 'శఠగోపర్ అంతాది' మున్నగు లఘుకృతులు రచించాడని ప్రతీతి; అలాగే పుగళేంది కూడా "అల్లి అరసాణిమాలై' వంటి జానపద గేయాలు రచించినట్లు నమ్ముతారు.)

జైన రచయితలు ఉపదేశాత్మక రచనలు, వ్యాకరణ సంహితలు, నిఘంటువులు ఇత్యాదులను అప్పుడప్పుడూ రచిస్తూ వచ్చినారు.

13వ శతాబ్దినుండి ఆధునిక యుగందాకా ఉన్న మధ్యకాలంలో ప్రధానంగా వ్యాఖ్యాతలు, తత్వసిద్ధాంత ప్రతిపాదకులూ ప్రసిద్ధికెక్కారు. సంగం కావ్యాల వ్యాఖ్యానాల గురించి ఇదివరకే పేర్కొనడం జరిగింది. మెయ్‌కండార్ రూపొందించిన శైవ సిద్ధాంతం (శివజ్ఞాన బోధం); దానికి శివజ్ఞాన స్వామిగళ్ వ్రాసిన వ్యాఖ్యానం; వైష్ణవ సిద్ధాంత వివరణాత్మకంగా మణిప్రవాళ (తమిళ సంస్కృత) శైలిలో ఆళ్వారుల స్తుతి గీతాలకు వైష్ణవాచార్యులు లలితంగానూ మూలాను సారంగానూ చేసిన వ్యాఖ్యానాలు అతి ప్రధానములైనవి.

ఆచార్యులలో ఒకడైన వేదాంత దేశికుడు (వేంకట నాథుడు) కూడా, వేదాంత విషయ సంబంధియైనా తమిళసాహితీ దృక్పథంతో వినుతింపదగ్గ 400 పద్యాలు రచించాడు యోగ రహస్యాన్ని గురించి,వైద్యాన్ని గురించి 18 మంది సిద్ధులు రచించిన కవితలు ఇక్కడ సూచనార్హములు.

తరువాతి కాలానికి చెందిన స్వతంత్రరచనల్లో పరంజోతి మునివర్ వ్రాసిన "తిరువిళైయాడల్ పురాణం", విల్లిపుత్తూరార్ వ్రాసిన భారతం, అరుణగిరి నాథర్ వ్రాసిన నాద గంభీరమైన 'తిరుప్పుగళ్' (స్తోత్రాలు) పేర్కొనదగ్గవి. ఈ రచనలపై సంస్కృత ప్రభావం బాగా కనిపిస్తుంది. సంస్కృత పురాణాలకు అనువాదాలు, సారాంశాలు, 'ప్రాంతీయ' పురాణ రచనలు దాదాపు 19వ శతాబ్దివరకు పెద్దఎత్తున సాగుతూ వచ్చినవి. కచ్చియప్ప శివాచారియార్ (కచ్ఛప శివాచార్యులు) వ్రాసిన' కందపురాణం" తమిళ పురాణాల్లో బాలా పెద్దది సంస్కృత కృతి ఆధారంగా గల ఈ పురాణం కవి పాండిత్యానికి, వర్ణనా నైపుణ్యానికి నిదర్శనము. అధివీర రామపాండ్యన్ (వెట్రివేర్కై అనే ప్రఖ్యాత ఉపదేశాత్మక కృతికర్త) వ్రాసిన నైడదం (నైషధము) కవితా ప్రావీణ్యం కలదిగా ఎన్నవచ్చును. పేర్కొదగ్గ ఇతర కవులు, వారి కృతులు: (a) కుమరగురు పరర్ (నీదినెరి విళక్కం, కాశిక్కలంబగం మీనాక్షి అమ్మై పిళ్లైత్తమిళ్ మొ౹), (b) శివప్రకాశర్ (నాన్‌మణిమాలై), (c) పిళ్లై పెరుమాళ్ అయ్యంగార్ (అష్టప్రబంధం), (d) తాయు మానవర్ (మత, వేదాంత సంబంధమైన కృతులు), (e) రామలింగ స్వామి (తిరు-అరుళ్-పా), (f) గోపాలకృష్ణ భారతి (నందనార్ చరిత్రం), (g) మహావిద్వాన్ మీనాక్షి సుందరం పిళ్లై (ప్రాంతీయ పురాణాలు)- ప్రభృతులు.

బౌద్ధ, జైనుల వలెనే, తక్కిన హైందవేతరులు కూడా తమిళ సాహిత్యాన్ని తమ భక్తిరస కావ్యాలతో, తదితర కృతులతో సుసంపన్నం చేసినారు. ఉదాహరణకు :

ముస్లిములు 1 'సీరాప్పురాణం'- (మహమ్మదు ప్రవక్త జీవిత చరిత్రము) 12,000 పద్యాలలో ఉమరుప్పులవర్ (ఉమరు పండితుడు) వ్రాసినది.

2 "పిళ్లైత్తమిళ్"- (ప్రవక్తపై) సక్కరైప్పులవర్ వ్రాసినది.

3 భక్తి, మార్మిక గేయాలు-మస్తాన్ సాహిబు కృతులు.

క్రైస్తవులు 4 "రక్షణ్య యాత్రిగమ్'- (జాన్ బన్యన్ వ్రాసిన పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్‌కు అనుసరణం) (19వ శతాబ్దం) భక్తి గేయాలు వ్రాసిన కృష్ణపిళ్లై రచన.

5 గేయరచనలు-విశ్వజనీన మత సందేశం, నీత్యుపదేశం కలవి (ప్రతాప ముదలియార్ చరిత్రం అను తమిళనవల వ్రాసిన) వేదనాయకం పిళ్లై కృతము.

విదేశీయులు 6 'తేంబావణి'-(క్రీస్తు జీవితాన్ని చిత్రించే మహా కావ్యం) వీరమామునివర్ అనే నామాంతరంగల కాన్‌స్టాంటియస్ బెస్కి-రచించినది. ఇతడు ఇటలీ దేశపు మతప్రచారకుడు. 17-18 శతాబ్దాల మధ్యకాలం 'తొన్నూల్' అనే వ్యాకరణ గ్రంథం, పాశ్చాత్య పద్ధతిలో కూర్చిన 'చతురంగరాది' (అకారాది) అనే నిఘంటువు, వ్యావహారిక వచనంలో సరళమైన కథలు మొ॥ ఇతని రచనలు.

7 క్రీస్తు చరిత్ర-సిద్ధాంతాలు (క్రీ. శ. 17-18 శతాబ్దాలకు చెందిన ఇటలీ దేశపు మతప్రచారకుడు, రాబర్ట్ డినొబిలి రచించినది.

సూచన :- ఇటీవల కాలంలో, డాక్టర్ జి. యు. పోప్, బిషప్ కాల్డ్‌వెల్ తమిళసాహిత్యాన్ని చక్కగా అవగాహన చేసుకోవడానికి అవకాశం కల్పించారు. వివిధ దేశాలకు చెందిన అనేక విద్వాంసులు ఈ పద్ధతిపై తమ కృషిని కొనసాగిస్తున్నారు.

మధ్య యుగం కవులు పెక్కురిలో, కాళమేగం, సత్తి ముత్తుప్పులవర్, పడిక్కాసు తంబిరాన్ ప్రభృతులు, ఉద్భ్రాంతి కొలిపే ఉత్ప్రేక్షలతోను, చాతుర్యంతోను రంజక రచనలు సాగించినా, తర్వాతి సంకలనాల్లో తత్కర్తృకంగా మిగిలినవి కొన్ని చిల్లర మల్లర పద్యాలు మాత్రమే.

20వ శతాబ్దంలో అద్వితీయ మహాకవి కి. శే. సుబ్రహ్మణ్యం భారతి; అతని దేశభక్తి గీతాలు సువిఖ్యాతములు. వాస్తవంగా అతడు అపూర్వదృష్టిగల జాతీయ కవి. దేశభక్తి గీతాలతో పాటు సువిదితమయ్యే అతని కవితల్లో కొన్ని-ఉదాహరణకు కణ్ణన్ పాట్టు (కన్నయ పాట) పాంచాలి శపథం, కుయిల్ పాట్టు (కోయిల పాట)-సాహితీ రత్నాలు. రామలింగస్వామి అడుగు జాడలో అతడు సరళమూ, సామాన్యమూ అయిన గద్యపద్ధశైలికి మార్గ దర్శకుడయ్యాడు; తన్మార్గం అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నది. ఈ సందర్భంలో ప్రత్యేకంగా పేర్కొనదగ్గ ఇతరులు:- ఇటీవలె మరణించిన భారతి దాసన్, కవిమణి దేశికవినాయగంపిళ్లై, ఎస్. డి. ఎస్. యోగి.

## VI జానపదగేయాలు, వీరగాథలు ఇత్యాదులు

సామాన్య ప్రజానీకానికి అభినందనంకలిగించేవి జానపద గేయాలు, వీరగాథలు

మున్నగునవి;వాటిలో కొన్ని-రాజాదేసింగుకథ, ఈ వరకే ప్రస్తావించిన అల్లి అరసాణిమాలై, ముక్కూడల్ పళ్లు,హరిజనులకు సంబంధించిన ఇతర గేయాలు,లాలిపాటలు ఆర్త గీతాలు-ప్రచురితములైనాయి.కౌరవగేయాల్లో తిరికూట (త్రికూట)రాసప్ప కవిరాయని (17వ శతాబ్ది) కుట్రాలకుఱవంజి సుప్రసిద్ధము, పళ్లు, కురవంజి-అనేవి నాటకీయ ధోరణికి చెందినవి.

## VII వచనం, వ్యాసం, నాటకం, నవల, కథానిక, ఇత్యాదులు.

నాటకం: అరుణాచలకవి రాయని (18వ శతాబ్దం) రామనాటకం (పద్యాత్మకం)ఆ కాలంలో ప్రసిద్ధ కెక్కినది. సుందరం పిళ్లై (19వ శతాబ్దం) పద్యరూపకంగా రచించిన మనోన్మణీయం(ఆంగ్లకృతికనుసరణం)ఆధునిక నాటక పరిణామంలో శ్రేష్ఠమయిన మార్గదర్శక రచనగా భావింపబడు తున్నది.ఈ శతాబ్దిలో స్వతంత్రంగాను, షేక్స్పియరుకు అనుసృతులుగాను కీ. శే. సంబంధ ముదలియారు రచించిన నాటకాలు సంభావనీయాలు. వర్తమాన యుగ సాహిత్యపు విలువగల ప్రశస్త రూపక పురోభివృద్ధికి అనువైనది కాదు.

వచనం: ఇదివరకే సూచించినట్లుగా, వచనం అభివృద్ధి చెందడం అన్నది ఇటీవలే జరిగింది. కాని ప్రథమ వచనావలంబిగా పేర్కొదగ్గది 'ఇరైయనాద్ వ్రాసిన అహప్పొరుళ్ అన్నదానికి-7వ శతాబ్దంలోనో ఆతర్వాతనో సంగకవి కంటె భిన్నుడైన మరొక నక్కీరర్ వ్రాసిన వ్యాఖ్యానం. ఈ తరగతికి చెందిన వ్యాఖ్యాతలు ఇటీవలి కాలంలోను-మరైమలై అడిగళ్ వంటి వారుఉన్నారు.

సరళ సాహిత్య శైలిలో, విభిన్నవిషయాల గురించిన వ్యాసాలు, (సాంకేతికమైనవి, పరిశోధనాత్మకమైనవి కూడా) సుబ్రహ్మణ్యభారతి, తిరు వి.క. కల్కి (ఆర్.కృష్ణమూర్తి) మొదలైన వారనుసరించిన మార్గంలో వెలువడుతూనే ఉన్నాయి.

నవలల్లో, ఇదివరకే పేర్కొన్న "ప్రతాపముదలియార్ చరిత్రమే"కాక రాజం అయ్యర్ వ్రాసిన 'కమలాంబాళ్' మాధవయ్య వ్రాసిన 'పద్మావతి' మొదలైనవి తొలి తొలి రచనలు. కీ శే. కల్కి నవలలుగా చిత్రించిన చారిత్రక ప్రణయ గాథలు సుప్రసిద్ధాలు. అతనికి అనుచరులు ప్రస్తుతం అసంఖ్యాకులు.

కథానికాప్రక్రియ 20వ శతాబ్దిలో ప్రముఖ వ్యాప్తి నందుకొన్నది. వి. వి యస్. అయ్యర్, పుదుమైపిత్తన్, కు. ప. ర, రాజాజీ (విశిష్టంగా నీతి దృష్టాంత కథానికలు) సుప్రసిద్ధ కథానికా రచయితలు.

## VIII ఉపసంహారము

ఈ పీఠిక ప్రాయికంగా ప్రాచీన తమిళ కవితాపరామర్శ అని గుర్తింప వచ్చును. నియత పరిధుల్లో-అనువాద వైఖరులు, బాలసాహిత్యం, పరిశోధన, సాహిత్య విమర్శ, పత్రికలు, విదేశీయ ప్రాబల్యం, తమిళవిజ్ఞాన సర్వస్వసంకలనం-ఇత్యాద్యాధునిక సాహిత్య సంవిధానం గురించి ప్రస్తావించడానికి అనువు పడలేదు.

# విషయసూచిక

(సంకలనకర్త: ఆచార్య టి. పి. మీనాక్షి సుందరం)

| | |
|---|---|
| సంగం కావ్యాలు: | |
| ఎట్టుత్తొగై , కురుంతగై | కూడలూర్ కిళార్, కపిలర్, కరుంగుడి |
| అహనానూరు, పరిపాడల్, | మరుతనార్, పోతనార్, ఇల్లంపెరువళితి |
| ఐంకురునూరు, పత్తుప్పత్తు, | యార్, కడువన్ ఇళవేయినవార్, కావూయి |
| కలిత్తొగై,తిరుమురుగాట్రుప్పడై, | యాట్రుక్కాప్పియనార్. నక్కీరర్. |
| ముల్లైప్పాటు, నెడునల్ వాడై | నప్పూత నార్ |
| తిరుక్కురళ్ | తిరువళ్లువర్ |
| నాలడియార్ | |
| సిలప్పతి కారం | ఇళంకో అడిగళ్ |
| మణిమేగలై | సీత్తలైచ్చాత్తనార్ |
| దేవారం | తిరుజ్ఞాన సంబంధర్, అప్పర్, సుందరర్ |
| తిరువాచకం | |
| తిరువెంబావై | మాణిక్కవాచకర్ |
| నాలాయిర దివ్యప్రబంధం | పెరియ ఆళ్వార్, ఆండాళ్, కులశేఖర ఆళ్వార్, తిరుమంగై ఆళ్వార్, భూతత్తు ఆళ్వార్, నమ్మాళ్వార్ |
| తిరుమంతిరం | తిరుమూలర్ |
| సిద్ధుల పాటలు | |
| జీవకచింతామణి | తిరుత్తక్క తేవర్ |
| రామాయణము | కంబన్ |
| పెరియ పురాణం | శేక్కిళార్ |
| కందపురాణం | కచ్చియప్ప శివాచారియార్ |
| మహాభారతము | విల్లి పుత్తూరార్ |
| కుట్రాలక్కురవంజి | తిరుకూత రాసప్పక్క విరాయర్ |
| తిరు-అరుళ్-విలాస-ప్పర | తాయుమాన స్వామిగళ్ |
| శివణక్కం | |
| తిరు-అరుట్-పా | రామలింగస్వామిగళ్ |

## సంగకావ్యములు

### అష్ట సంకలనము (ఎట్టుతొగై)

(1) లఘుసంకలనము (కురుంతొగై)

(2) కురించి (పర్వత ప్రాంతములకు సంబంధించినది-సమాగమ దృశ్యము)

మా అమ్మ మీ అమ్మ అన్యోన్యం సన్నిహితులా?
మా నాన్న మీనాన్న పరస్పరం సంబంధులా?
నీవూ నేనూ మరి తరతరాల సుహృదులమో?
సారారుణ-ఉర్వరలో సార్ద్రిమౌను వర్షాంబువులు-అట్లే?
వలపు లొలుకు మన ఎదలివి కలిసి మెలసి పోయెనులే
(ఇందలి ఉపమా సౌభాగ్యానికి కవి సుప్రసిద్ధుడు)

సూచన :- సమాగమ వాంఛ తీరడంతో యువప్రియుడు తన్ను పరిత్యజింప వచ్చునేమో అని కన్య అయిన ప్రేయసి ఒకతె భయపడుతుంది. ఆముగ్ధ వీక్షణంలో కలిగిన ఆకస్మాత్ పరిణామం ఆమె రహస్సంశయాన్ని బయలు పరచింది. సూక్ష్మ

బుద్ధియైన యువకుడది గమనించాడు తన ప్రేమ నిరంతరమైనదని అతడు పై విధంగా అభయమిస్తాడు

(ii) ముల్లై (గోపభూములకు సంబంధించినది శ్రద్ధాసూచక సన్నివేశం)

విరిరేకులవోలెనున్న మెత్తని తన వ్రేళులతో,
పేరుకొన్న పెరుగునామె పులుసు చేయపూనుకొనుచుండ
అంతలోనే దిగజారెడు అమలమైన చీర చెంగు
కడుగని తనచేతులతో కట్టడగా చెక్కికొనియె;
సకాలమున పెరుగు పులుసు గుబాళించవలెను గదె-
తాలింపుల ఘాటగు పొగ నీలోత్పల నేత్రమ్ముల
నావరించి కారించిన కలకపాటు చెందదామె
వలపారగ వండినట్టి ఆ కమ్మని పెరుగు పులుసు
చెలువారగ వడ్డించెను చెలువ తనదు పెనిమిటికిని.
"అహోకమ్మదనం" అనుచు అతడక్కరతో చవిజూచెను;
అంతకన్న అనువుగాను అతను వేరు పల్కగలడె;
ఆ వలపుల పరిశ్రమకు అర్హమైన ప్రతిఫలమది-
అంతరంగ సంప్రీతిని ఆమె పొంగి పోవగాను
మందహాస విశదమయ్యె ఆ సుందర వదనమపుడు (167)

కూడలూర్ కిళార్.

సూచన :- ఒక పురంలో ఇల్లాలుగా ఉన్నామెను చిన్ననాటి దాది (ఉపమాత) చూడవచ్చింది; తానా ఇంట చూసిన ఒక సన్నివేశాన్ని ఆ పురం విడిచి తన ఊరు చేరుకొన్న ఆ దాది ఇల్లాలి కూరిమి తల్లికిపై విధంగా నివేదించింది.

(2) నట్రినై - (ప్రాంతీయము)

(i) కురించి-పర్వతప్రాంతము.

ఆది తప్పని వాడు ప్రియతముడు నా విభుడు,
నాదు బిగికౌగిలిని వీడి యెరుగని వాడు;
ఎత్తయిన కొండల్లో శ్రీగంధ తరువుపై
తావి పుప్పొడి వలని నెత్తమ్మి తేనెపెర-
సాటిలేనిది గాదె సహజ మాధురిని.
మారాగ బంధమ్మునట్లే సున్నితము;
నీరులేకున్నచో నిలచియుండదు జగము
అట్లె, తానులేకున్నచో నేనుండనని తెలిసి
ప్రియమునే చూపించి మురిపించు గాని,
నా సోగ కనులలో అశ్రువులు జారగా

చూడజాలనివాడు; నీ వన్న రీతిగా
ననువీడి ఒకనాడు వేరుగా నడచుకొను
తెరువు తెలియని వాడు; తథ్యమది నామాట (i)

-కపిలర్

సూచన :- తనయువ ప్రియతముడు తనను విడిచిపెట్టనున్నాడని చెప్పిన నెచ్చెలితో అనురాగిణియైన ఆ యువతి చెప్పిన అధిక్షేపం పై వచనం.

(ii) పాలై (మరుభూమి దృశ్యము)

తళతళ మెరిసే పసిడి గిన్నెలో
తేనెను కలిపిన తీయని పాలను,
నెరసిన కురులవి చెదరుతుండగా
వయసులు చెల్లిన దాదులు శ్రమతో,
మొగ్గలు తొడిగిన లేత రెమ్మలను
చేత పట్టుకొని బెదరిస్తూ
తమ చేతికి నందక
గిరగిర తిరిగే ముద్దుల పట్టిని
"తినవమ్మా"! అని ఆప్యాయంగా
అనిపించుకొనే ఆ అల్లరి పిల్ల-
పొదరుల చుట్టూ పరుగులు తీస్తూ
ముత్యాల్ పొదిగిన బంగరు టందెలు
ఘల్లు ఘల్లుమని రవళి చేయగా;
అలసీ సొలసీ దాదులు, తమపని ఆపు చేసికొనగా
చిలిపి తనముతో అలరించిన చిన్నది;
బలే విధముగా మారిపోయినc!
ఈ నడవడిని ఈ తెలివి తేటలను
ఎప్పుడు నేర్చునో! ఎట్లు నేర్చెనో!
తన ప్రియకాంతుని లేమివేళలో
పలు కష్టాలను పాలుపంచుకొను;
ఆ స్థితి నెరిగిన తండ్రి, ప్రీతితో
పంపిన విలువగు భోజ్యపదార్థము
చేకొన నొల్లని అభిమానవతి;
మండు వేసవిలో గహనాటవిలో
పలుచగ పారే సెలయేరు వలే
ఛాల్లీ చాలని తిండియులేక,

నీరసించి కడు సన్నగిల్లింది, ఆయ్యో నా కన్నతల్లి (110)

-పోతనార్.

సూచన :- వైవాహిక జీవితం తన కుమార్తెలో కలిగించిన ఆకస్మాత్ పరిణామానికి చకితురాలైన తల్లి తెలిపినవి పై వాక్యాలు.

(3) అహనానూరు (అత్మాశ్రయ కవితా చతుశ్శతి)

(i) ముల్లై (అటవీ దృశ్యము)

వానలు వచ్చెను; అంతటా అడవి
అపుడందాలు దిద్దుకొనె.
మొల్ల తీగలను నిండయి కన్పడె
చక్కగ, పదునుగ, మొగ్గల మొత్తము,
"ఇల్లం" తరువూ, పచ్చ బోదెగల
'కొన్రై' వృక్షం నును మొగ్గలతో
విరియ గాచినవి వడివడిగా,
మెలికలు ద్రిప్పిన ఇనుప కమ్మివలె
కొమ్ములు గల దుప్పి, లోయల లోపల
ఇటు నటు గంతులు పెట్టసాగినది;
గ్రీష్మాతపమున ఎండి దిగులుగా
బీటలు వారిన నేలలు చక్కబడినవి.
ఉరుముల మెరుపుల కురిసెను మబ్బులు
భువికి శాంతికరముగా పెను వర్షం. (4)

-కురుంగుడి మరుదనార్

సూచన :- ఒక కన్యకు ఆమె నెచ్చెలి పై విధంగా వర్షర్తువును వర్ణిస్తూ, ఆమె కర్తవ్యాన్ని గుర్తు చేస్తున్నది.

(ii) పాలై (మరుభూమి దృశ్యం)

బహు దూర దేశాలకు నా ప్రయాణం
ఇది మేమిద్దరం చేసుకొన్న నిర్ణయం.
వీడికోలు సమయంలో ఆమె నాదు చెంతలేదు.
భావోద్వేగంతో రుద్ధమైన కంఠంతో, ఆమెను
పిలిచాను, సెలవు తీసుకో దలచాను;
ఎప్పట్లా సమాధానం రాలేదు నాడు
ఒకవేళ నా పిలుపు విన్నదో, లేదో?

చిన్నారి పాపను చంక కెత్తుకుని
మెల్లగా వెలువడెను లోనుండి తాను;
నా కంఠం సూచించే వ్యాకులపాటువల్ల
తెచ్చికోలు నవ్వులతో నెమ్మదిగా నిలిచె చెంత.

తన ఒంటరి తనమప్పుడు నేను చూడగలిగాను
సహజమైన ఒయ్యారము తొలగిపోవ, తడబడుతూ
నేలమీద ముద్రలుగా అడుగులు కదలిస్తూ
చిరునవ్వులు చిందిస్తూ సమీపానికి వచ్చెనామె.
దుఃఖంతో మిశితమైన ఆ లేతనవ్వులు
ఎదలో తీయని తలపుల కదిలికవలన కాదు
దానిమ్మ గింజల్లాంటి పలువరుస కనిపించనే లేదు,
సోగకనులతో దాగిన మమతలు కానరాలేదు,
కారణమేమిటో తెలియ లేకున్నాను.
పూర్వం-ధన సంపాదనకోసం నేను,
దూర దేశాలకు పోవాలన్న నా మాటను తలచెనేమో!
ఆ నాడు తడియారిన గొంతుకతో ఇలా పలికెనామె
"నన్ను ఒంటిదాన్ని చేసి తగునా పోవుట మీకు?
ఒక్కనాడూ నిన్ను విడిచి ఉండలేను నేనంటూ
పలికిన ఆ సాంత్వనాలు ఏ మైనవి నేడు?
నేను విన్న భయంకరపు
బెడారులెట్లు దాటగలవు?
కాలమెరుగని కారడవులలో
ఎండిన మామిడి వృక్షాలను
క్రీడార్థమువలె కుప్పలుగా,
బండలపై మిసమిసలాడుతు
రాలిపడిన రాచ ఉసరికలను,
మండుటెండ వేళల్లో
మాడియున్న కొండచరుల
పేర్చినట్టు సూదిరాళ్లు
అడుగడుగున చీల్చుచుండ
ఏరీతిని నీ పయనం సాగింతువు?
కందికింపుగాని కారు తీక్ష్ణవి

ఏరీతిని దాటగలవు?
(కాని ఆ స్థితి గడిచె కొంత,
సమ్మతించె ఆమెయు నంత)
ఆమె చూపు మౌనంగా
నాకేదో తెలుపుచుండె
కానీ ఏమది? [బహుశః
కలుగునా పునర్వీక్షణ
మరియెడు ప్రత్యాశయొ?]
ఏదో అనిశ్చయ మేదో నిస్పృహ.
ప్రోగగు పొగమంచువలెను
క్రమ్ముకొనే కన్నీటిని
నేను కాంచ గలిగినాను.
యత్నించెను తానెంతో,
అణగదయ్యె ఆవేదన;
సంయమనందారి సంయమనాసిది ప్రకృతి దారి ప్రకృతిది.
గుండెలకును హత్తుకొన్న
పసిపాపని బుజ్జగించు
నెపమున తలవంచుకొనియె;

నీరునిండి నిర్మలముగ పారుచున్న ఏటినుండి
తెచ్చినట్టి అల్లిపూల యెర్రని లేదండ యొకటి,
ఆ పాపడి శిరసుమీద అందముగా అమరియుండె.

— మరి దేనిని నేనప్పుడు చూడగలిగినాద చెపుమ !!
మెడలో తా దాల్చినట్టి పొగడ పూలదండయపుడు
పాలిపోయె నిట్టూర్పులవేడిగాలి సోకగాను-
[లోని తాప మణచివేయ జరుగునదంతేకద !]
"చెంత నేనున్నపుడే ఇంత వందురు ఆ, ఉత్తమురాలు
వదలిపోవ తథ్యముగా బ్రతుక జాలదని తలచితి,

యాత్రానిర్ణయమిప్పటికి నిలుపు చేసుకున్నాను
-పాలై, పాడియ పెరుంకడుంగో
('పాలై" కవిగా ప్రసిద్ధుడైన ఒక యువరాజు)

సూచన: ఒక యువకుడు తన ఇంట సంభవించిన ఉద్వేజక వియోగ సన్నివేశాన్ని స్మరిస్తున్నాడు.

ఈ ఖండికకు ప్రాచీన వ్యాఖ్యలోని అధసూచి ఇట్లున్నది. ఒక "యువకుడు

వీడ్కోలు సమయంలో, చింతాక్రాంతయైన భార్యను చూచి, ధనార్జనకైన తన దూర ప్రయాణ నిర్ణయాన్ని త్రోసిపెట్టిన విధం తెలుపుకుంటున్నాడు :

మద్రాసు విశ్వవిద్యాలయానికి చెందిన డా. ఎం. వరదరాజన్, ఆ ప్రాచీన విస్తృత వ్యాఖ్య-కవి చిత్రించిన పరిసరపరిస్థితుల దృష్ట్యా సవరణ కోరునని విశదపర చారు. ప్రస్తుత రచన వారి వ్యాఖ్య కనుసరణము.

(4) (i) పురనానూరు [పరాశ్రయ కవితాచతుశ్శతి]

ఇంకా ఈ వింత జగము
ఎలా నిలిచివున్నదంటూ
అబ్బుర పడుతావుకదూ ?
ఎందరో మహాత్ములిక్కడ
బ్రతికి యుండు కారణమున

అమృతమే తమ చేతికందినా
అది మధురమ్మని తా మొంటరిగా
ఆస్వాదించరు వారు
పగయన్నది వారెరుగరు;
పరులను వెరపించే పనులుచేయు
దుర్బల మనస్కులు కానే కారు;
కీర్తికొఱకు తమ ప్రాణ
త్యాగానికి వెనుదీయరు;
శాశ్వతమగు అపకీర్తియె వెలగా
ప్రపంచ లాభం సంప్రాప్తమైనా
వదలిపెట్టి మిన్నకుందురు
అలపెరుగరు; తమకుగాక
పరుల కొఱకు పాటుపడెడు
నిరత వైభవోపేతులు. (182)

-(ఇళం పెరువళుతియార్)

(ii) ఈ జగమంతా నా ఆవాసం; అందరూ నా కావులే.
మన మంచి చెడ్డలు పరులు అల్లేవి కావు;
మరణమన్నది క్రొత్త కాదని నాకు బాగా తెలుసు;
ఆనందం అలవడితే చిందులు తొక్కలేదు;
ఆపదలు దాడిస్తే అదరిబెదరి పోలేదు;
మెరపులతో పిడుగులతో మేఘమ్ములు వర్షించును;

ఘోషిస్తూ వరదలు పెనుబండరాళ్లను దొర్లించును;
ప్రవాహవేగంలో తగులుకొన్న తెప్ప, ఎటకో తొలగిపోవును-
అట్లే- అమూల్యమైన మన జీవితమును
నిర్దయవిధి అల్లల్లాడించు
అందుకే, నేను- అధ్యులను చూచి ఆశ్చర్యపడను
దీనులను హీనులను నిరసింపలేను.

-కణియన్ పూంకున్ఱనార్,

["పూలకొండ"కు చెందిన ఖగోళజ్ఞుడు,జ్యోతిష శాస్త్రవేత్త)

(iii) కడలిదాక వ్యాపించిన పుడమిని నిర్భీతిగ
వెల్లగొడుగు నీడలోన సింహాసన మధివసించి
సాటిలేక పాలించే సమ్రాట్టునకుగాని,
క్షణ విశ్రాంతిని కోరక అహోరాత్రమలమటించి
జంతుజాలం వేటాడే అజ్ఞానకిరాతునికి గాని,
-తినడానికి కొంత తిండి, ఆచ్ఛాదనకొక వస్త్రం-
ఈ రెండే అవసరాలు;
తక్కిన అవసరాలు సరిసమానమే;
దాతృత్వమె సంపద లక్ష్యం;
స్వంత సుఖం అన్వేషిస్తే
మన జీవితమున నష్టమౌను
ఎన్నో అమూల్యార్థములవి. (187)

-నక్కీరర్

(5) పరిపాడల్ (ఈ పేరుగల ప్రత్యేకమైన ఛందంలో కూర్చినది)
కదంబ గుచ్ఛఘనహారధారీ: స్వామీ!
నీ దయాగుణమున తేలెడు ధర్మాత్ములు,
మహర్షి ప్రియులగు నీ నిశ్చల భక్తులు
నీ పాద సన్నిధి తప్పక చేరెదరు.
మండెడు ఎద, మరి ఎడిగిన క్రోధం గల తామసులూ,
ధర్మపథానికి దూరవర్తులగు అదృష్టహీనులూ,
కాషాయాంబర కపట హృదయులూ,
పునర్జన్మమే లేదను మూర్ఖులు-
ఎన్నడు చేరుట నీ పాదమ్ములు!

అందులకే నేనర్థించను
బంగారాన్ని భాగ్య భోగాలను.
అంతులేని నీ అనుకంప,
అచంచల పద భక్తి
వీటిఫలమైన ధర్మ బుద్ధి-
ఈ త్రయమునకే నిను వేడుదు.

-కాడువన్ ఇళవేయిన నార్
(ఆటవిక జాతికి చెందిన ఒక యువకుడు)

(6) ఐంకురునూరు [లఘుపద్య పంచ శతి]
బిడ్డను బిగి కౌగిలిలో హత్తుకొనెను తండ్రి,
ఇరువురినీ తన ఆశ్లేషములో బంధించెను
ఆ తొక్కుపలుకుల బుడుతని తల్లి;
ఆ తీరున వారందరు మంచముపై మైమరచిరి,
ఈ రీతిగా నున్నవారు తమకంటే సంపన్నులు
ధరణిలోనె లేరంటూ తలపోసి సుఖించిరి (409)

సూచన: పెంపుడు కూతురి ఇంటికి పోయివచ్చిన దాది, ఆ కూతురు కన్న తల్లికి సంతోషంతో విన్నవించిన వృత్తాంతం.

(7) పదిట్రుప్పత్తు (దశదశకములు)
ఓ! రాజా చిరకాలం వర్ధిల్లుము!
నిత్య సత్య వచనులైన కవులు నీదు
కీర్తిని సదాస్తుతియింతురు;
నీవు చూపెట్టే కరుణకు
నీ శత్రువులు కూడా సంతోషిస్తున్నారు
నీ క్షేమంకోరేవారు
నీ విచ్చే బహుమతులకు
తృప్తి వహిస్తున్నారు
నీ విద్యావైశద్యము, శమదమసంపత్తి
నీ నయవర్తనము, నిర్మలమై వినుతికెక్కె. (87)

(కాప్పియాట్రుక్కాప్పియనార్)

సూచన: ఒక చేరరాజుకు సంబంధించిన మంగళాశంసనము.

(8) కలిత్తొగై ("కలివెణ్బా" అనే ఛందోగతికి సంబంధించిన కవితా సంకలనం)
కురించి (పర్వత ప్రాంతాలకు సంబంధించినది)

తళ తళ మెరిసే కడియాల్ దాల్చిన
ఓ నా చెలి! విను, ఒకవార్త;
ఆడ పిల్లలము మనమందరమూ
ఆబాడుకొనే చోటు తెలుసుకద!
-మనము కష్టపడి అక్కడ కట్టిన
ఇసుక మేడలను కూల్చి కాలితో,
ముడుచుకొన్న మనకొప్పులు లాగీ,
బంతి గుంజుకొని పరుగులుతీసి
వేధించుటలో ఆనందించెడి,
అల్లరి కుఱ్ఱడు, మొన్నొకనాడు
నేనూ అమ్మా కూర్చొని ఉండగ,
ఇంటికి వచ్చెను 'గృహిణుల్లారా!
దప్పి గొంటినే నీళ్లు పోయుడ"ని;
మా అమ్మచూసి, నాతో అప్పుడు-
"ముద్దులకూనా! వచ్చిన వానికి
పసిడిపూత గల కడవనీటిని
దప్పితీరగా పోసి రమ్మ"నెను.
వెళ్లితి నేనును తల్లి మాటపై
వచ్చిన వానిని గుర్తు పట్టకయె;
అంతలోన అతడమాంతముగా
గాజులు తొడిగిన నా ముంజేతిని
ఒడిసి పట్టుకొనె మోటుతనముతో-
భయబాధలతో చకితురాలనై
"చూడమ్మా వీడేమి చేసెనో"
అని గట్టిగా అరచితి, వెంటనె
అదరు బెదరుతో పరుగిడి వచ్చిన
తల్లి చూసె నను, ప్రశ్నార్థకముగ;
(కుదురుపడితి నప్పటికేనును)
"త్రాగుచుండ పొరపోయె నతని"కని
పలికితి; అంతట, తల్లి అతని
వీపు నిమురుతూ, తట్టు చుండగా,
ఆ కొంటె యువకుడు సూదుల్లాంటి ఓర చూపులను

నా పై విసరుచు విరగబడి నవ్వుచుండెను. (51)

-కపిలర్

సూచన : ఆవేళలో తానెదుర్కొన్న విచిత్ర సమాగమాన్ని నెచ్చెలితో ఒక కన్య చెబుతున్న సన్నివేశమిది.

## పత్తుప్పాట్టు (దశగీతములు)

(1) తిరుమురు గాట్రుప్పడై (సుబ్రహ్మణ్య దేవునిచేరడానికి మార్గసూచి)

పరమాత్మునిపాదమ్ములు మెదలడానికనువుగా
నీ హృదయం నిర్మలముగ ఉంచుకొనగలిగితే,
అహంకార రహితమైన అవస్థ నందుకోవాలని
ప్రతి నిత్యం యత్నిస్తూ నీవున్నట్లయితే,
స్వచ్ఛమైన నీఎదలో ఉదయించెడి
అభిలాషలు నిక్కముగా ఫలియించును;
సిద్ధించును చిరకాంక్షితమగు మోక్షము (62-66) పాదాలు

-నక్కీరర్ (మధురాపుర జ్యోతిష్కుని కుమారుడు)

(2) ముల్లై పాట (గోపగీతము)

(ఒక శిబిర దృశ్యము)
అది సరిగా అర్ధరాత్రి; పెనునాల్కలతో
మెరిసె గంటల మోతలపుడు ఆగిపోయే;
అడవి మొల్లతీగెలెల్ల తెల్లగ విరబూచెను,
చుట్టునున్న చిన్న పొదల పూల తావి కప్పివైచె,
చిఱుగాలికి కదలాడెను పుప్పొడిమయమైన పొదలు;

అలాగే తూగుతు ఉన్నా, కర్తవ్యంలో జాగృతి కలిగీ
వృద్ధులైనా నిటారుగ నిలిచి, సితాంబరములు తాల్చినవారై
తమ సిగలిచుక కదలుతుండగా, రాజ రక్షకులు మెదలుచు నుండిరి.
రక్షణగల శిబిరంలో చక్రవర్తి విశ్రమించె;
ఉదయమ్మున జయభేరీ లతని జయము మ్రోగించును
నప్పూతనార్ (కావేరిప్పూం పట్టణమునకు చెందిన బంగారు వ్యాపారికుమారుడు)

(3) నెడునల్ వాడై (హేమంతపు విసురుగాలి)

(సీతు బాధకు గోపాలుర అగచాట్లు)
జలధరాలు భీకరముగా విరుచుకు పడె విశ్వంపై,
కురిసెను నవ ఘన వర్షం కుండలతో పోసినట్లు,
ఉప్పొంగెడు వరదలన్న గర్జించిరి గోపాలురు;

కర్రలతో అవలిస్తూ ఎత్తగు ప్రాంతాలకు
గోగణములను భద్రముగా తరలించిరి వారప్పుడు;
కాని అచట కుదరలేదు నెమ్మది ఏ మాత్రము వారికి;
పెద్ద రేకులున్న వాతి అల్లి పూలదండలప్పుడు
చెదరిపోయే వెంట తరుము జడివానల ఉరవడికిని.
వీచెడు చలిగాలి వారి ప్రాణాలను కొరికివేయ
చలిమంటలు కాచుకొనగ అంటించిన కొమ్మలతో
అదరు వదరు చెంపలతో గజగజమని గుమిగూడిరి.

—నక్కీరర్ (మధురలో జ్యోతిశ్శాస్త్రజ్ఞుని కొడుకు)

తిరువళ్ళువర్

## తిరుక్కురళ్

*(రెండు పాదాలుగల నీతిపలుకులు)*

మనసున మాలిన్యము లేకుండుటే "ధర్మము"
తక్కినవన్నీ దంబములు; వ్యర్థాలు. (34)

అనురాగ హీనులు అన్నియు తమవే అనుకొందురు;
అనురాగవంతులు తమ ఎముకలుకూడా పరులసొమ్మంటారు (72)

చంపునంత కీడు ఒకడు నీకు తలపెట్టినా
వాడు ఇదివరలో చేసిన మేలు తలుచుకుంటే, ఈ కీడు మాయమవుతుంది (109)

పరుని తప్పుల నెన్నునట్లే, తనదు తప్పుల నెన్నగల్గిన
విలువగల ప్రాణాన కేకీడు వాటిల్లు? (190)

చదువదలచినదెల్ల నిర్దుష్టముగ చదివి
పిదప, ఆ చదువుకనువుగ నడచుకోనెరుగుము (391)

సత్యము ఏ నోటినుండైనా మెఱుపులా వెడలివచ్చును
ఏ నోట ఏ మాట విన్నప్పటికినీదాన్ని గ్రహించడంలోనే విజ్ఞానముంది (423)

విషము కలుపుట చూచినను, అది తెలిసి త్రాగెడువారు
ఎల్లరిని ప్రేమించు సంస్కారయుతులు (580)

అణగని ఆకలి, తీరని వ్యాధి, పగగొన్న శత్రువు-
ఈ మూడు దరిజేరనీయనిదె గొప్ప భాగ్యవంతమైనదగు దేశము (734)

సూచన : ఇది ఒక దేశపు ఘనతను సూచిస్తున్నది.

ఉన్నతస్థితినుండి జారి పడినవారు
శిరసునుండి రాలిన శిరోజమువలె నౌదురు (964)

పుట్టునట్టి తీరు పుడమినందరికొకటే
యత్నాలు వేరుపడ ఘనతయు వేరుపడును. (972)

బిచ్చమెత్తి, బతుకుటకే కొందరిని సృష్టించివుంటే
ఆ దోషం స్రష్టకే అన్వయించునుగాక. (1062)

నే చూడగా తాను తలవంచి నిలుచు
నే చూడకున్నచో తలయెత్తి ననుచూచి చిరునగవు చిందించు
నా మగువ (1094)

చదువు పెరుగుకొద్ది మన అజ్ఞానం వెల్లడి యౌను
అట్లే కలియ కలియగ పెరుగు కామాతురతయు (1110)

నేను తుమ్మినపుడు ఆమె నను దీవించె,
ఆవలనె, "ఏ ప్రేయసి తలపో,మిమ్ము తుమ్మించెను," అనుచు దుఃఖించె (1817)

సూచన : (తుమ్మితే చెడుపు కలుగుతుందని ఒక నమ్మకం; దీవిస్తే అది తొలగునట; ప్రేమించిన ఆప్తులు తలచుకుంటే తుమ్ము వస్తుందట.)

## నాలడియార్

*నీతిబోధకాలైన నాల్గు పాదాలుగల పద్యాల సంకలనము*

భేరీధ్వని చాలా దూరానికి వినిపిస్తుంది;
పిడుగుపాటు అంతకన్న ఎక్కువ దూరానికి వినిపిస్తుంది;
మహాదాతృత్వ ప్రశంస మాత్రం
ముల్లోకాల్లో ప్రతిధ్వనించి
చెప్పజాలనంత దూరాలకు వినిపిస్తుంది.

(సిలంబు ఇళంకో అడిగళ్-సిలప్పదికారం)

### 20-అన్యాయం పాలైన అబల తెచ్చిన అభియోగము.

కణ్ణకి : "ఓయి ద్వారపాలకుడా! న్యాయ, జ్ఞాన, ఆత్మ మార్గాలను అతిక్రమించి ప్రవర్తిస్తున్నావు-అతనికి ఇది చెప్పు. "అపకారం పొందిన ఒక స్త్రీ-చేత ఒక్కగా నొక్క అందెను పట్టుకొని, వచ్చిం"దను.
ఆమె భర్తను కోల్పోయింది-వెలుపలి వాకిలిదగ్గర నిలిచింది, అనిచెప్పు; పో, ఆలస్యం చేయకు."

ద్వారపాలకుడు : (సింహాసనంపై కూర్చొని ఉన్న రాజు దగ్గరకు వడి వడిగా పోయి)

"జయం, జయం, కొర్కై వల్లభుడా!

చిరకాలం జీవించు!

ఒక స్త్రీ వచ్చింది; ఆమె లోలోపల ఉడికిపోతూ, ఉగ్రతతో ఉప్పొంగు తున్నట్లు నాకు అనిపిస్తుంది. ఆమె చేత ఒక బంగారు అందె ఉంది; ఆమె భర్తను కోల్పోయిందట. వెలుపలి వాకిలి వద్ద ఉంది-ఔను భర్తను కోల్పోయిన ఆమె తలవాకిలికడ నిలచింది."

రాజు : "ఆమెను రానిమ్ము ; పోయితీసుకొని రా".

(ద్వారపాలకుడు తలవాకిలిదగ్గరకు తిరిగిపోయి, ఆమెకు సభలోకి దారి చూపించును; ఆమె రాజు ఎదుటికి వస్తుంది.)

రాజు : "కన్నీరొలుకుతుండగా నా ముందుకు వచ్చిన నీ వెవరివి యువతీ?"

కణ్ణకి : "ఆలోచన లేని రాజా! నేను చెప్పవలసింది ఎంతోఉంది. ఆదర్శ ప్రాయులైన రాజులచే ప్రసిద్ధి కెక్కిన పుహార్‌కు చెందిన దాన్ని నేను. ఆ రాజులలో ఒకడు ఒక పావురాన్ని రక్షించడం కోసం-దేవతలే ఆశ్చర్య పడేటట్లు తన దేహంలోని కండనే కోసి యిచ్చినాడు; ఇంకొకడు అంత కంటె అరుదైన పని చేసినాడు- ఒక ఆవు ఆ రాజు కట్టించి ఉంచిన గంట స్తంభం దగ్గరికి వచ్చి గంటకు కట్టిన త్రాటిని నోటితో లాగింది; గంట పిడుగువలె మ్రోగింది. రాజు ఆ చప్పుడు విని వేగంగా వచ్చినాడు; దయనీయమైన స్థితిలో ఆ ఆవుకన్నీరు కార్చడం చూచి నాడు; అతని ఎద కాలిపోయింది;

ఆరాజు ఒక్కగా నొక కొడుకు ఎక్కిన తేరు ఆ ఆవు దూడమీదుగా దూసుకు పోయింది; ఇది తెలుసుకొన్న రాజు-రథచక్రాలను యువరాజుపై సూటిగా పోనిచ్చినాడు.

ఇవన్నీ నీవూ వినిఉండవచ్చు!

సరే! ఆ నగరంలోనే గొప్పవంశంలో పుట్టి, అకళంకమైన పేరుగాంచిన మసతువన్ అనే వర్తకశ్రేష్టుడు ఉండేవాడు. అతని కుమారుడు సత్యంగా జీవిస్తామనుకున్నాడు; రాజా, పాపం, విధి వెంటపడి తరుమగా అతడు విజయసూచకమైన అందెను ధరించి నీ రాజధానిలో ప్రవేశించినాడు; అతడు నా అందెను అమ్మడానికి యత్నించినాడు; కాని నీఆజ్ఞ అతనిని క్రూరంగా హత్యచేయించింది. నేనతని భార్యను. నాపేరుకణ్ణకి"

రాజు : "ఉగ్రశక్తీ! దొంగను చంపడం అధర్మంకాదు, ధర్మమే! అది ఈ దేశంలో ప్రసిద్ధ మైన న్యాయము"

కణ్ణకి : "కొర్కై ప్రభూ, నీవు అపమార్గాన ప్రవర్తించినావు-నేను దాన్ని నిరూ

పించగలను; నా బంగారు అందె మణులు తాపినది."

రాజు : "సామర్థ్యం కలదానా! నీవు ఇప్పుడు చెప్పినమాట ఎంతో సమంజస మైనది. రాచరికపు అందె ముత్యాలు పొదిగింది. నీ అందె మాకీయి. మమ్ము చూడనీ."

(ఆమె తన అందెను రాజు ముందు పెట్టగా, రాజు దాన్ని పగుల గొట్టమని ఆమెకు ఆదేశిస్తాడు; కణ్ణకి అట్లా చేయగా, రక్తమంత ఎర్రగా ఉండే కెంపు చెదరి రాజు ముఖానికి తగులుతుంది; కెంపును చూచి అతడు అచేతనుడై, అదిరిపడుతాడు. రాజధ్వజం ఒరిగిపోతుంది. రాజదండం వాలి పోతుంది.)

రాజు(తేరుకుని): ముందు వెనుకలు ఆలోచించక స్వర్ణకారుడి కూటసాక్ష్యాన్ని నిజమను కొన్నాను. నేను రాజునా? కాను, నేను దొంగను పాండ్యులు తమ ప్రజలను సర్వదా కాపాడినారు. ఇపుడు నేను వారి ఆ పేరుకు మచ్చ తెచ్చినాను. నన్ను నశించనీ!"

(ఈ మాటలతో రాజు కిందపడి మూర్చిల్లుతాడు. పాండ్యుని రాణి అదిరి పడింది. ఆమె నిలువెల్లా కంపించి పోయింది. ఆమె "ఒక స్త్రీకి ఏదీ ఆమె కోల్పోయిన భర్తనుతిరిగి ఇవ్వజాలవు," అని మరణించిన తన భర్త పాదాలను భక్తితో స్పృశించి తానూ మరణిస్తుంది.

సూచన: కథనంలోని యీ భాగంలోని కవిత్వం ఎంతో నాటకీయంగా ఉంది. కనుక, అది ఇక్కడ ఒక నాటకంలోని సన్నివేశం రూపంలో మూలానుగుణంగా సమ కూర్చడం జరిగింది).

## మణిమేకలై (మణిమేఖల) సీతలైచ్చాత్తనార్

### అదిరైదానమిచ్చుట (సాధువన్ ప్రేరణ)

54-105 పంక్తులు

అదిరై భర్తయైన సాధువన్ సముద్రతీరాన్ని అంటి పెట్టుకొని ఉన్న ఒక చెట్టు నీడలో పడి ఉన్నాడు. మబ్బులు కమ్ముకు వస్తున్నా ఆగక, భయంకరమైన సముద్రంలో అతడు ఒంటరిగా శ్రమించినాడు. అలసటకు ఓర్వలేక గాఢనిద్రలో పడినాడు. ఆ భయం కరమైన కొండపై ఉన్న నాగులు మొదలైన క్రూరులైన దిమ్మరులు అతని దగ్గరకు వచ్చి అతనిని తేరిపార జూచినారు.

"ఆపద పాలైన ఇతడు ఒంటరిగా వచ్చినాడు; బలహీనంగా ఉన్నాడు; మాంసల మైన ఇతని దేహం తిండిగా ఒదుగుతుంది" అనుకొని వారు అతనిని మేల్కొలిపినారు.

వారి భాషలో ప్రవీణుడైన సాధువన్ వారితో మెత్తగా ముచ్చటించినాడు. దానితో



సంతృప్తులై, వారు అతనికి అపాయం కలిగించడం నుండి విరమించుకొన్నారు. వారు దూరంగా నిలుచుండి, భక్తిమీర అతనితో ఈ విధంగా అన్నారు. "తాము గొప్ప శక్తి గల వారు. ఇక్కడికి సమీపంలో ఉన్న మా నాయకుని కలుసుకోవడానికి. దయచేయండి".

సాధువన్ వారితో ఒంటరిగా పోయినాడు. నాగుల నాయకుని నివాస స్థలం ఎంత అసహ్యంగా ఉందని! కల్లు కాగుతున్న కడవ, పచ్చిచేపలు, మాంసము, ఎండిన బొమికెలు- వీటినుండి వస్తున్న దుర్గంధం సాధువన్ ముక్కుపుటాలను బద్దలు చేసినవి! తన పెంటితో తీరి కూర్చొన్న ఎలుగు బంటివలె ఆ నాయకుడు భార్యతో కూర్చున్నాడు. సాధువన్ మొదట పలికిన మెత్తని మాటలు అతనిపై పనిచేసినవి. ధైర్యం తెచ్చుకొనిన సాధువన్ దగ్గరలో ఉన్న ఒక పెద్ద చెట్టు క్రింద నీడలో విశ్రమించినాడు. ఆ నాయకుడు అడిగిన మీదట సాధువన్-క్రూరమైన సముద్రంలో తాను పొందిన విషాదకరమైన అనుభవాన్ని వివరించి నాడు.

నాయకుడు (సాధువన్ వృత్తాంతం విని చలించినాడు). "ఈవ్యక్తి ఆపదలచే, అలసటచే కష్టపడినాడు; ఎంతోమంచి వాడు. మనగౌరవానికి పాత్రుడు. రండి జనులారా! ఇతని కోసం ఒక స్త్రీని, మాంస మద్యాలనూ తెండి."

సాధువన్: "ఎంత అపవిత్రమైన మాటలు విన్నాను! నాకు మగువా వద్దు. మాంస మద్యాలు వద్దు!!"

నాయకుడు: "నీమాటలు నా కోపాన్ని ఎక్కువ చేస్తున్నవి. మగువ, మాంసము, మద్యం కాక ఈ ప్రపంచంలో మరేదైనా సంతోషం కాని, అవసరం కాని ఉన్నదా అటువంటిదేదైనా ఉంటే చూపించు చూద్దాము. మాకు నిజం చెప్పు."

సాధువన్: "నాగుల నాయకుడా! విను. మైకాన్ని కలిగించే మద్యాన్ని, ప్రాణి హింసను జ్ఞానం కల తాపసులు నిషేధించినారు. నిదురించడం, మేల్కొనడం లాగే జనన, మరణాలు ఒక దాని వెంబడి మరొకటి వస్తాయి. ఇది సత్యం- సన్మార్గంలో ప్రవర్తించని వారు భీకర నరకంలోకి కూరుకొని పోతారు. ఇందుకే బుద్ధి మంతులు చెడును అరికట్టి మంచినే చేసినారు ఇది తెలుసుకో!"

నాయకుడు: (ఆర్భాటంగా నవ్వుతూ): "హహ! ఈ దేహాన్ని విడిచి ప్రాణం ఇంకో చోటు వెదుక్కొంటుందా? ఇది ఎట్లా? కొంచెము విడమరచి వివరించు."

సాధువన్: "అయ్యా! ఆగ్రహించక ఇది విను. జీవం ఉన్నంతవరకు, దేహం ఇంద్రియ జ్ఞానం కలిగిఉంటుంది. జీవం పోగానే దేహం వాడి గాయాన్ని కాని, మండే నిప్పునికాని తెలిసికోజాలదు. కనుక చావుకు గురి కాని లోపలి వస్తువు ఒకటి ఉందని తెలుసుకో. అది ఒక క్రొత్త నెలవులో ఇంకొక జీవిత గతిని పొందు తుంది. నాకే కాదు. తక్కినవారికీ ఇది తప్పదు. అంతదాకా ఎందుకు? నీ కలలలో నీ అంతరాత్మ ఎంతో దూరానికి పోవడం గమనించే ఉంటావు. గమనించలేదా? ఈ ఆత్మ ప్రతిస్థితిలోను తాను చేసిన కర్మల ఫలితాలను అనుభవించడానికి కొంగ్రొత్త ఆకారాలు ధరిస్తూ ఉంటుంది. అనుమానం విడచి పెట్టి దీన్ని స్పష్టంగా గ్రహించు."

# ఇరయనార్ అగప్పొరుళ్ ఉరై

["ఆత్మాశ్రయ" ఇతివృత్తానికి సంబంధించిన ఇరయనార్ రచించిన పద్య కృతికి నక్కీరర్ (అదే పేరిటి సంగం కవికంటె భిన్నుడు) వచనంలో వ్రాసిన వ్యాఖ్యానము.]

విషయం: "అనగా--అతడు, ఆమె ఏకాంత స్థలంలో కలిసికొని, ప్రేమ మీర సంగమించి తనిసినారు.,,

వ్యాఖ్యానము: "ప్రేమమీర సంగమించి" అనుటలోని భావం ఇది:

ఒక యువకుడు, యువతి ఒక తోటలో ఏకాంతంగా కలిసి కొనినప్పుడు గాఢంగా ప్రేమించుకొని, మోహం విజృంభించగా, సంభోగ సుఖం అనుభవిస్తారు. అంతేకాక, రచయిత ముందుగా సూచించినట్లు అతడు, ఆమె (నాయకుడు, నాయిక)-సాటిలేని గుణం కలవారు. వారు ఒంటరిగా వచ్చినారనడాన్ని ఈ విధంగా ఊహించవలసి ఉంటుంది. "అతడు-ఐందల వంటి మూపులతో (కండరాలు కూడ) దృఢంగా ఉన్నవారు; భీకరవర్తనకు ఎగసే పులి (కాకుంటే-గొడ్డు) ని కాని, మదించిన ఏనుగును కాని, క్రూరమయిన ఎలుగుబంటిని కాని పోలి ఉన్నవారు; స్థైర్యంలో ఉన్నత పర్వతాల వంటివారు; విశాలమైన భూమివలె అంతులేని ఆకాశంవలె అదుపును ఎరుగని వారు; సింహబలం కలవారు; చురుకుదనంలో దుప్పిని పోలినవారు అయిన వేలకొలది యువకులకు నాయకుడు. వారు వాడి శూలాలు కలవారు". ఆ విధంగానే ఆమెకూడ చుక్కలమధ్య వెలిగే చందమామవలె వేలకొలది యువతులలో ముఖ్యమైన వ్యక్తిగా ఉండి ఉండవలె. ఆమె చెలికత్తెలు ఆమెకు అజన్మస్నేహితురాండ్రై, సమవయస్కులై ఒక కంచాన తిని ఒక మంచాన నిదురించేటంత దగ్గరివారై, కలసి చదువుకొన్నవారై ఉండి ఉండవలె. వారికి నాగరికత, చెలిమి, ఉన్నతాశయాలు, సత్ప్రవర్తన, గరిమలతోబాటు చూపరుల కంటిని, బుద్ధిని ఆకర్షించే చక్కదనం కూడా ఉండి ఉంటుంది.

ఈ వివరణకర్త-"అతడు","ఆమె"ఒంటరిగా కలసి కొన్నారనడాన్ని తిరస్కరించాడు. తమ పల్లెపట్టు విడిచివచ్చి తోటలో ప్రవేశించిన ఆ యువతులు ఆట సందర్భంలో చెదరిపోయి ఉంటారు. అయితే, ఆ ముఖ్యమైన యువతిని ఒంటరిగా విడచిపెట్టి పోయినారా అని ప్రశ్నించవచ్చు. అందుకు, ఆమె దొడ్డబుద్ధి కలది కనుక తమ్ము అపార్థం చేసికోదని ఆ చెలికత్తెలు భావించి ఉండవచ్చునని సమాధానం చెప్పుకోవచ్చు. మరి అయితే, తమ పల్లెపట్టులో తోడులేక మెలగని ఆ యువతికి ఈ కొత్తచోట ఒంటరిగా ఉండడానికి వెరపు కలిగి ఉండదా అనే ప్రశ్న పుట్టవచ్చు. ఆ తోటకు వారు పదేపదే రావడంవల్ల ఆ చోటు ఆమెకు సుపరిచితమనీ, అక్కడ ఆమె జంకుగొంకులులేక ఉండగలదని అనుకోవచ్చు.

ఆమె తోటలో ఎట్లా నిలచి ఉంటుంది? మొదట మనం ఆ పరిసరాలను గురించి ఆలోచిద్దాము. ఆ తోటలో ఎన్నో రకాల చెట్లున్నవి. అవి పూలు పూస్తాయి. పండ్లు కాస్తాయి. అక్కడ పలురకాల తీగెలు పూచి చుట్టుప్రక్కల సుగంధాన్ని విరజిమ్ముతాయి. తేనెను త్రాగి తుమ్మెదలు ఝుంకారం చేస్తుంటాయి. కోయిలలు కూస్తుంటాయి. చల్లని తెమ్మెరలు అల్లనల్లన వీస్తుంటాయి. అక్కడ ఎవరూ అనుమతిలేక చొరబడడానికి వీలులేదు. అటువంటి తోటలో-ఒక కృత్రిమమైన గుట్టమీద ఎర్రని "వేంగై" (వేగిస) చెట్టు ఒకటి ఉంది. ఆ చెట్టు విరగ బూచి ఉంది. ఆమె దాన్ని చూచి, తమకపడి, అందెలు మ్రోగుతుండగా మెల్లగా ఆవైపుకు



నడక సాగిస్తుంది. ఆమె సువాసన వెదజల్లే పూవును కోస్తుంది.

ఆమె తన వెనుకనున్న బంగారు రాతిమీద ఒక కొండవాగు మృదంగ ధ్వనిచేస్తూ ప్రవహించడాన్ని చూస్తుంది. ఒక పసినెమలి నీలపు గొడుగువంటి తన రంగురంగుల పురి విప్పి నాట్యం చేయడాన్ని చూచింది. దాని రంగస్థలం ఎర్రరాయి. దానిమీద పూల పుప్పొడి కంబళిలా కప్పిఉంది. ఉదయ సూర్యుని లేత కిరణాలు దానిపై వెలుగు చిందిస్తున్నవి. కోయిలలు గాత్ర సంగీతం నిర్వహిస్తున్నవి. తుమ్మెదలే వీణ సారిస్తున్న విద్వాంసులు. ఆమె అ సొగసైన నాట్యాన్ని చూచి తన్మయురాలైంది.

అతని రాక ఎటువంటిది? అతడు తన అనేక అనుచరులతో కొండపై వేటాడడానికి వచ్చాడు. అతడొక దుప్పిని వెంబడించి పోవడంలో తన అనుచరులను వెనుకనే విడిచిపెట్టినాడు. ప్రేమ దేవతవలె రూపుగొన్న ఆమె ఉన్న తోటలోనికి అతడు ప్రవేశిస్తాడు.

ఆ సమావేశం ఎట్లా సంభవించింది? ఉత్తర సముద్రాలలో విడిచిపెట్టిన ఒకే రంధ్రమున్న కాడిమాను, దక్షిణ సముద్రంలో నుండి తేలివస్తున్న చువ్వతో బంధితమైనట్లున్నది. కాకుంటే ప్రచండమైన సూర్యుడు, చల్లని చంద్రుడు తమతమ మార్గాలు విడచిపెట్టి కలగలిసి నట్లున్నది. విధి ఆ ఇరువరినీ తనివినీయడానికై ఏకం చేసింది.

## దేవారం (దేవహారము)

తిరుజ్ఞానసంబందర్:

అనుదిన మీ భువిపై హాయిగాను బ్రతుకవచ్చు;
(నిరసించుట కేమున్నది నిత్యసుఖానుభవమున)
సరిగా గమనిస్తే సరసత ఏమున్నదిచట
తరువాతను పొందనున్న జీవిత సుఖముకన్న;
సుందరమగు 'కళుమలము'న అమృతయగు దేవితోడ
అందముగా నెలవుకొన్న ఆదిదేవు దర్శింపుము.
జీవకోటి బహువిధమని బహుముఖమని వినుచుందుము
జీవరాశి సృష్టించును, జీవగతుండై వెలుగును;

ఏ దేవుడు, ఆ దేవుని కునికిపట్టు "మిళలై";
అట గిరి మేఘములు భేరీధ్వని చేయును
(మయూరములు నర్తించును; మధుపమ్ములు పాడును)
"పొన్ని"యలల తేలివచ్చు నల్లనిలే గలువ గమిని
మన్ననతో స్వీకరించు "మిళలై" తనకర్పణముగ.

సూచన : జీవకోటి=84 లక్షలని తాత్పర్యం; పొన్ని=కావేరీ నది.

### అప్పర్

ఘన మెవరికీ దాసులం కాము;

మరణమన్న వెరపు లేదు, భయద నరకమన్న లెక్కలేదు !
భయ విముక్తులము, ఊర్ధ్వశిరస్కుల మౌదాము;
వ్యాధి బాధలిపుడు దూరము మనకు;
కాలరాత్రికిక మోకరించము;
నిత్య సుఖానుభూతితో ఆవేదనల నెరుగము
సర్వేశ్వరుడు, ఉపకర్త,
శంఖవలయపు చెవిపోగుల వాడు మన ప్రభువు
అతనికి ప్రియమైన పూటకాపులం మనము
ఈ బంధమెన్నటికీ విడిపించుకోడానికి చూడము
కుప్పబోసిన పూల మెత్తదనము కల
అతని దివ్య చరణములే ఏకాశ్రయమని శరణు జొచ్చితిమి;

x x x x

అహో! ఆశ్రయించితి నేను,
నా తండ్రి, నా ప్రభువు మహిత పాదచ్ఛాయ,
ఆవరించెను నన్ను ఉపశాంతికరమైన చల్లదనమిపుడు-
తుమ్మెదలు జుమ్మనగ, జలజాకరములోని చల్లని
నీట నా దేహమది తేలియాడినయట్లు,
మధుర మధు మాసమున మలయ మృదు పవనములు
హితమితముగా మందగతిని వీచినయట్లు;
తొలిదిక్కులో నిండు చందురుడు కనిపింప
చెవి కింపుగా విపంచికా స్వరము వినినట్లు;

x x x x

దేహమను గేహంలో హృదయమనే ప్రమిదజేసి
అజ్ఞానం పరిహరించు జ్ఞానమనే ఘృతము పోసి
జీవితమును వత్తిజేసి, వివేకాగ్ని కణముతో
వెలిగించి, కన్నులెత్తి వెదికితే కనబడును-
+కదంబధారి కన్నతండ్రి అందెల పాదాలవి.

x x x x

ఆమె తొలుత విన్నది ఆ దేవుని నామరూపాలు;
అతని నెలవు "ఆరూర"ని పిదప తెలుసుకొన్నది;
అదిగో! ఉన్మాదినిలా అతనికై తపించసాగె,

---

+కదంబధారి : శివకుమారుడు సుబ్రహ్మణ్యుడు; కదంబవనం అతని ప్రత్యేకావాసం; అతనికి ప్రియమైనది కదంబసుమహారధారణము.

ఆ క్షణమే తలిదండ్రుల నామె పరిత్యజించినది,
విపుల విశ్వపథములన్ని విస్మరించెను పూర్తిగా.
అంతెందుకు? తానెవరో, తన పేరేమో మరచెనామె-
శిరసావహించె నాదేవుని పాదాలను ముద్దరాలు.

## సుందరర్

మలినమైన కాయంతో ఆశ్రయించితి నీ పావనపదములు
నా అంతట నేను చేసినదేదంటే ఇంతే అది,
భక్తవత్సలుడ! మాలిన్యము మాని స్వాదుక్షీరము
స్వీకరించు సహృదయుడా!
తప్పిదాలు చేస్తున్నా వేరెరుగను నీ పేరు తప్ప-
తప్పుదారి త్రొక్కనీక నా కన్నులు చక్కదిద్దుమో దేవా!
-ఒట్రియూరుపురనివాస!

x x x x

నేను పొందినది ఇంకెవరు పొందగలరు? దయామయా!
మేలను భ్రమతోడ మోసాలు పలికితి; దోషాలు చేసితి;
త్రిపురాంతకుడ! ముల్లైవాయిల్ మహా ప్రభో,
నీ కంటె నేవేరు శరణమెరుగను నిజము.
నా తీవ్ర శోకమును నిర్మూలనము చేయుమో దేవ!
జ్యోతి స్స్వరూపా! పాశుపతధారీ!

## మాణిక్కవాచకర్

(a) తిరువాచకం

తన బిడ్డకు పదిలముగా స్తన్యమిచ్చు
తల్లికంటె మిక్కుటమగు ప్రేముడితో
ఈ గట్టిపడిన పాపినైన కండలు కరగించితీవు;
లోదివ్వెను వెలిగించితి;
నిష్యందము చేసితి వనంతానందమను మకరందము;
ఆపై నీవెటకో అంతుచిక్క కరిగినావు,
శివుడా! నా సర్వస్వమ! ఓ దేవా!
నిరతాన్వేషణలో నేనొడిసి పట్టుకొంటి నిన్ను,
ఇక నెక్కడికివిప్పుడు పోగలవో దేవదేవ!

x x x x

నేటికి నాయెడ దయతో లోజీకటి పారదోలి

నా హృదిలో నిలిచినావు తేజోనిధి సూర్యునివలె.
ఈ ఔదార్యం సంస్మరింతు, తక్కినవి విస్మరింతు
నీవులేక ఏదిలేదు;
కాలంలో కరిగి అన్నీ అణువణువై
నీలో తుదిలయమందును, పెరుందుఱైవాస! శివా!
నీవే నిత్యుండవు; నీవులేక శూన్యము సర్వం,
ఎవ్వరు నీ తత్త్వం ఎరుగగలరు, దేవ దేవ!

(b) తిరువెంబావై.

(i) తొలికోడి కూతతో కదలాడు పక్షుల కిలకిలారావాలు,
సప్తస్వరాలు, శ్వేతశంఖానినాదాలు స్పష్టముగ వినిపించె;
(అది అరుణోదయము) వినుతింతుమా పరంజ్యోతి నా కరుణా
మయు నుదార కళ్యాణసంధాత; వినవా నీవా సుస్వరములు?
ఆహా! ఏమిటీ నిదుర? లెమ్ము, మాలో శ్రుతికలుపుము:
ఆ దయాసముద్రునెడ ఇంతేనా నీ ప్రేముడి?
లెమ్ము, కీర్తింపుమా ప్రళయాంతశేషు, పరమేశు,
ఆదిపరాశక్తి నెడబాయని నిత్యు ; అతనికివే అంజలులు.
(పాట - 8)

(ii) యుగయుగాలలో పురాతనాలకు పురాతనుడవు!
ఐనా నవ్యతమునికన్న అతినవ్యుడవౌదువు నీవు!
మేము, నినుస్వామిగ పొందిన భాగ్యవతులము, పరిచారికలము!
నీ భక్తులపాదాలను ఆదరించి అలంకరింతుము
అందరికంటెను మిన్నగ వారినె ప్రేమింతుము
భక్తులనట్టివారలనె భర్తలుగా స్వీకరించి
నిరతము మెప్పించుచు నిజముగ సేవింతుము
మా స్వామీ! ఇట్లే మము నీ వాశీర్వదింపుము
మా కొదవలు తీరును; ఇవియే మా వినతులు. (పాట - 9)

## నాలాయిర దివ్యప్రబంధం

(నాలుగువేల దివ్యగీతసంకలనము)

(1) పెరియ ఆళ్వార్ (విష్ణుచిత్తుడు)

"దీవెన"

వర్ధిల్లు ఓ హరీ, నీలమణివలె మెరయు దేవదేవా!
నీ చేవగల భుజము- నిన్నెదుర్పుటకు సిద్ధపడిన
ధూర్తులెందరినో పడగొట్టె...

నీకీర్తి చిరకాలం వర్ధిల్లుగాక!
అది వేలకొలది ఏండ్లు వర్ధిల్లుగాక!
కాదు- కోటానుకోట్ల వర్షములు వర్ధిల్లుగాక!
అద్భుతావహమైన నీ పాదపద్మాలు
కాంతిహీనముగాక రాజిల్లుచుండగా
దీవెనల కాయెతుగ కాల్చెదను నేను- (తిరుప్పల్లాండు)

(2) ఆండాళ్

(i) తెల్లవారుజాముకు ముందే, నీ సన్నిధికి వచ్చినాము,
వికచాంబుజములు నీ దివ్యపాదముల నర్చింపగ,
మన్ననతో మా మొరవిని దయచూపవె దేవా?
పసులకాచి బ్రతుకువారి కొలములోన
నుదయింపగ నెన్నుకొన్నవాడవీవు,
మా చిన్న సేవలకు మారుమోమిడకుమయ్య!
నేడు మేము ఇచట నిన్ను శరణువేడవచ్చుట-
అల్పక్షణికములౌ విషయముల నాశించికాదు;
ఓ గోవింద; ఎప్పటికిని, ఏడేడు జన్మాలకును
ప్రేమతో మిమ్ము చేరి యుండగలవారము మేము;
నిరంతరం నీ కొక్కనికే దాసీజనమై యుండవలతుము—
తన్ముఖమై మా కోర్కెలనెల్ల నీవు మరలింపుము!
(తిరుప్పావై—పాట 29)

(ii) కడలిలో పుట్టిన తెల్లని శంఖమా! ఉత్సుకతతో అడుగుతున్న
నాకు నిజంచెప్పు (అది నీకు తెలిసే ఉండవలె!)
మదగజదంతం తుంచిన ఆ మాధవు పగడపు పెదవులు
ఎంతటి తీయని రుచిగలవో? అవి
పచ్చకప్పురపు తావులీనునో కాక
వికచ కమల గంధమానో? (నాచ్చియార్ తిరుమొళి; 7—1)

(3) కులశేఖర ఆళ్వార్

## దేవకి చింత

తినడానికై వెన్నముద్దను వేడ్కతో నొక్కెడు
చిన్న తామరలేత మొగ్గ ఆ మెత్తని చేయి;
త్రాటిదెబ్బకు వెరచి - పెరుగుపూతలతోడ
వింతగా వణకెడు ఆ పగడాల పెదవులతీరు;

ఆ కన్నీరు - ఆ బెదురు చూపు -
సొగసుగా వంకరలు తిరిగే ఆ చిన్ని ఎర్రని మూతి
మొరలాలకించుమని మోడ్చిన అంజలులు —
ఆ చిఱుత వానిని, సాటిలేని చిలిపితనాలవి, యశోదచూచినది—
అదియె ఆనందమున కవధిగా భావించి;

(పెరుమాళ్ తిరుమొళి : 7—8)

(సూచన : చెరసాలలో దేవకి కుమారుడుగా జన్మించిన శ్రీకృష్ణుని యశోద సొంతబిడ్డవలె పెంచినది. శ్రీకృష్ణుని చిన్నతనపు చిలిపి చేష్టలనుగూర్చి వినిన దేవకి తానవి చూచే భాగ్యం లేకపోయె కదా అని బాధపడుతుంది)

(4) తిరుమంగై ఆళ్వార్

## అ హో బి ల ం

బీళ్ళలో చెడతిరిగి అలసి అడవి జంతువులు
విరిగి చెదరిపడిన శిలలుగల ప్రాంతాలు,
తీవ్రమగు వేడిలో కాలినిల్చిన వెదుళ్ళు
పైనబడి కరచి చీల్చగల శునకములు
క్రిందవాలుటకు వేచి, మింట తేలెడు గ్రద్దలు;
మండుటెండ వేళ్ళలో మలసివీచు వడగాలులు—
ఇవిమాత్రం కల్గిన గహనస్థలమే
తనకావాసంగా ఎన్నుకొన్న దేవర అతడు,—
వికృతమైన ఆస్యంతో, వెరపుగొల్పు కోరలతో
వాడియైన గోళ్లతోడ ఆ అసురుని (హిరణ్యుని) చీల్చుటకై
నరసింహాకృతిగా అవతరించినట్టి వేల్పు —

(పెరియ తిరుమొళి : 7—8)

(5) పూదత్తాళ్వార్ (భూతత్తాళ్వార్)

నేను నా వేలుపు నారాయణునికోసం
జ్ఞానప్రదీపశిఖ వెలిగించినాను,
ప్రేమార్ద్రమగు హృదియె ప్రమిద
కడలేని పట్టుదల దానికగు నూనియ,
ఆనందలయమగు ఆత్మ దీపపువల్లి
నేను జ్ఞానావృతుడ, తమిళభాషాగాయకుడ.

(రెండవ తిరుఅంతాది — 1)

(6) నమ్మాళ్వార్

ఇంద్రియ జ్ఞానచరమగు వస్తువుల దాటి
మరులుగొల్పెడు ఇంద్రియములను దహించి,
తనంతటన ఆనంతముగ వ్యాపించినట్టి
చిత్రమగు మహాశూన్య తత్త్వమునెరిగి (ఆద్యప్రకృతి)
* సుఖదుఃఖముల మరచి కోరికలు తొలగించి,
శుద్ధముగ విజయవంతముగ చేరితే
అక్కడే అప్పుడే విముక్తిలభించును;
అదియె ముక్తస్థితి, అదియె మోక్షమునౌను.
(తిరువాయ్‌మొళి 8—8—6)

(సూచన : * కర్మఫలితాలు)

## తిరుమూలర్ తిరుమంత్రమ్

(i) మానవజాతి ఒకటే— మరి భగవంతుడూ ఒకడె.
జ్ఞాపకం ఉంచుకో, బాగా జ్ఞాపకం ఉంచుకో-మరణమన్న భయమదేల?
బిగితముగా పట్టుకొమ్ము మనసులోని భగవంతుని,
అతడొకడే శరణీయుడనుట నీవు తెలుసుకొమ్ము. (2104)

(ii) నిజమగు ఆనందం కనుగొంటిని నేను, అది
సర్వులకూ ఉపలభ్యం కావలెనని నా కోరిక.
చిదాకాశమున వెలసిన ఆ వేదవేద్యు విశదం చేసెద
దేహంలోపలి చైతన్యమును పలికించాలంటే
మనం లోచూపుతో చూడవలెను.
లోచూపుల లోతునుబట్టి
ఆ మర్మశక్తి తానే వెలువడు.

(iii) ప్రేమా, దైవమూ వేర్వేరను వారలు మూర్ఖులు,
ప్రేమే దైవమని ఎవరును తామెరుగరు,
దైవం ప్రేమయె-అనుట తెలిసి, ఎల్లవారు
ప్రణయార్ద్రచిత్తులై దేవునిలో జీవించవలెను (270)

## సిద్ధుల పాటలు

(1) చక్కగ ఒకరాయి నిలిపి అదే దైవ మనుచు పలికి,
పూలుకొన్ని పూజచేసి, వలగొని, వినతులతో
మాటలు (మంత్రాలా అవి?)

దైవం నీలో ఉన్నప్పుడు, నిలిపిన రాయేమి పలుకు?
కుండకు గరిటెకు మరి కూరల రుచియేమితెలియు?
(శివవాక్యర్-496)

(2) ఓ చిన్నదానా! తారాడు ఎద్దుకు ముకుతాడు వేయవలె;
కోర్కెక్రుంచవలె;
అందని ఆ కొమ్మను తప్పక వంచవలె;
ఎందాకా ఈ కాయం ఉండగలదో ఎరుగరాదు!
(కొంకణసిద్ధర్-48)

సూచన:- దీనికి మర్మార్థం కలదు తారాడే ఎద్దు మనసుకు, అందని కొమ్మ సత్యానికి సూచకాలు).

(3) ఈ దేహం మలినమైంది-అది ఒక ఉప్పుమరవ,
ఇంకో దేహం చొరడానికి ఔషధ పత్రం నావద్దలేదు
పరమౌషధమట్టిది నేను పొందగలిగితే!
ప్రియ జననీ! ఈ నశ్వరదేహం విడిచి
చేరుకొనవె నీపాదసన్నిధి?-(అకుకుని సిద్ధర్-8)

(4) ఓ లోపలి దయ్యమ!
'అహమె'ప్పుడు తొలగునో దేవునపుడు చూడగలవు,
ఓ లోపలి దయ్యమ!
కాయమెపుడు గెలుతువో నీ కళంకమపుడు తొలగును.
(అహప్పేయ్ సిద్ధర్-18)

(5) మనస్సనే వృషభాన్ని మట్టుపెట్టితే తాను
ముక్తుడౌట నిజమయ్యా తాండవ రాజా! (ఓనటరాజా!)

(6) శూన్యమొకటె సత్యమనుచు
నమ్మువారి కవసరమే
ఆస్తి పత్రాల అక్కర
చెవ్వాకుల చేడియా! (కుదంబై సిద్ధర్-1)

## జీవక చింతామణి (తిరుత్తక్కతేవర్ కృతి)

### భాగము-1-విద్యాభ్యాసము (పాదములు 299-319)

### జీవకుని జననము

విశ్వాస ఘాతుకమైన దాడి మూలంగా సచ్చంద రాజు ప్రాణాపాయ స్థితికి గురి అవుతాడు, గర్భిణి అయిన తన రాణి నెమలిఆకారంలో ఉండే యంత్రంద్వారా తప్పించు

కాని పోయే వీలు కల్పిస్తాడు.)

299. వాడి కన్నులు కలది, తనపతికి అమృతమైనది
అయిన విజయ ఆపదనుండి తప్పించుకొంది
ఆకాశంలో తన మయూర యంత్రాన్ని నడిపిస్తున్నది
దుఃఖంతో బలహీనమైన ఆమె
దురాక్రమణ దారుని భేరిమోత వినింది
బల్లెంపోటు పాలైన ఆడు జింకవలె
ఆమె అల్లల్లాడి పోయి
అచేతనురాలై ఒరిగిపోయింది.

300. ఆ మహానగరాన్ని విడిచి, తనను నడిపేవారు లేకఆయంత్రం
నెమ్మదిగా మెత్తగా
పొలిమేరలలోని శ్మశానంలో దిగింది
అక్కడ నీడలలో గ్రద్దలు నిద్రపోతున్న వి-
అక్కడి పీనుగు పెంటలు అతి ధీరుల
హృదయాలను కూడ అరక్షణంలో భయపెట్టేటట్లున్నవి!

301. కాలే శవాలనుండి మబ్బులవలె లేచివచ్చు
పొగ భీకర పిశాచాలకు వెరపు కొల్పగా,
సౌరభములు వెదజల్లే సుమగుచ్ఛంవలె
ఆ యంత్రం మెల్లగా ఒరిగెను
ముడుచు కొన్న పాదాలతో కదలక నిలిచెను

x x x x

(302-3) (గర్భవతి అయిన రాణికి స్మృతి వచ్చింది. ఆమెకు విషాదకరమైన తన ఒంటరి తనం తెలియవచ్చింది. పురిటి నొప్పులు ఆమెను కమ్మ సాగినవి)

304. మెరిసే అలంకార దీపాలతో చుట్టుమూగిన చీకటిని చెదర
గొడుతూ మమకారం నిండిన దివ్యులు భక్తిగా నిలుచుండినారు
అలజడిగా ఉన్న సముద్రంనుండి లేచే సూర్యునివలె
బంగారు పాపడు పుట్టినాడు
నిరాశా నిస్పృహలలో మునిగిన మానవుల దుఃఖవ్యథ అంతరించింది!

305. తావులీనే శిరోజాలుకల ఆ తల్లి
తనపతి తనకిచ్చిన ఆ వరాల బిడ్డను చూచింది
చందమామ చల్లని కిరణాలవలె మెరిసే పాలధారను
తన వక్షస్థలంనుండి వెలువడేట్లు చేసింది

వక్షాలు తమంతతాము పాలు చేపునంతదాక కాచుకోలేక
పోయింది; ఆ పాలతో మట్టికలిపి ఆ మహాశిశువు
నొసటిమీద ఉంచి సరిగా పరుండబెట్టింది.

306-309. (సంతోషదాయకమైన ఆ రోజులలో రాజుకు వారసుడుగా ఈ కుమారుడు కోటలోపుట్టి ఉంటే రాజు, ప్రజలు కూడా సంతోషించి ఉండేవారు. అన్నిచోట్లనుండి కానుకలు వచ్చి మూగి ఉండేవి. కాని, పాపం ఆ బాలుడు అజ్ఞాతంగా ఈ శ్మశానంలో పుట్టినాడు. ఆ నిర్భాగ్యురాలైన తల్లి ఈ దురదృష్టానికి తల్లడిల్లిపోయి కొడుకుతో అంటున్నది),

310. ఈ విశాల ప్రపంచానికి నీవు ప్రభువువు కాని నాతండ్రీ
నీవున్న ఈచోటు శత్రువుది !
నీ శయ్య శవాలుకాలే శ్మశానవాటిక -
నేను అడిగే దిక్కులేక ఒంటరిగా అలమటిస్తున్నాను !
నిన్ను సురక్షిత ప్రాంతానికి తీసుకొనిపోవడానికి
దట్టమైన ఈ చీకటి అడ్డువస్తున్నది.
నీవెట్లా బ్రతికెదవో పెరిగెదవో తెలియకున్నది
నా ప్రాణం ఇంకా కొట్టుకోవడం ఎందుకో తెలియకున్నది !

311. కోరికలుతీర్చే చింతామణి ! నీవు ఒక మాటన్నా
అనక పరుండి ఉన్నావు
నా కన్నీరు తుడిచేందుకు పుట్టిననిన్ను
అర్హదేవుని- నా జీవితనౌక
దుఃఖసాగరాన్ని దాటడానికి నమ్ముకొన్నాను
ఈ నమ్మకంకూడ వమ్మయితే
మరివేరే దిక్కేది నాకు ?
మీతండ్రి ఆ మహారాజు చెప్పినట్లుగానే నడచుకొన్నాను
మరి నాకీ బాధ ఏల ?

(312-319). (తన తనయుని ముద్దుమోము చూస్తూ ఆమె కొంత ఉపశమనం పొందింది, సూర్యుడు అస్తమించిన తర్వాత చంద్రుని ఉదయంతో కాంతి పుంజుకొన్న కను చీకటివలె ఆమె కనిపించింది.

ఆ చోట నెలకొని ఉన్న ఒక దేవత ఆ రాణికి పరిచితమైన మరుగుజ్జురూపానవచ్చి ఆమెను ఓదార్చింది. అసలు అన్ని కష్టాలకు ఆ దేవత (తానే) తప్పుడుపనులే కారణమనింది. ఆ తర్వాత ఆమె భవిష్యత్తుచెప్పి ఇట్లా ఆదేశించింది :-)

316. "నా కంటి పాపా! ఈ చిన్నవాని ఆజ్ఞ
ఈ లోకాన్ని పరిపాలించగలదు;
కాని మొదట దురాక్రమణ దారుని చంపవలె!

దానిని నెరవేర్చుటకు ఇదిగో ఒకడు వచ్చుచున్నాడు.
అతడు ఈ పాపని తీసికొనిపోయి పెంచనీ!
మనం అడ్డుతగలడం ఎందుకు?
రా, మరుగున దాగి ఏం జరుగుతుందో చూద్దాము."

317 - 318. మరుగుజ్జు రూపాన వచ్చిన ఆ దేవత
తాను పరచిన పడకమీద ఆ పసివానిని
పరుండబెట్టింది-తన వక్షముల నుండి
పాలు పొంగుతుండగా
"నీకు నీ శత్రువులవల్ల
కీడు వాటిల్ల కుండుగాక" అని పాపని
దీవించి, తల్లి చేతినుండి రాజముద్రికను
తీసి, అచ్చట పెట్టింది.
నిర్భాగ్యురాలైన ఆ తల్లి అందెలు మ్రోయగా
ఆభరణాలు మెరవగా ఆవలకి పోయింది.
తాను పొదిగిన ముత్యాన్ని విడిచిపెట్టి
సముద్రానికి మరలిపోయే ఆలిచిప్పవలె
పోయిన ఆమె మరుగుజ్జు చూపిన మరుగులో నిలచి
ఇతరుల కంటికి కనిపించక చూడసాగింది!

(ఆమె కేక పెట్టింది)

319. "నా ప్రాణమా! నీవు కడుపున పుట్టినందుకు
నీకు కొంత మేలైనా చేసినాననుకొందును-
కాని అది నిన్ను పెంచడానికి చాలదురా తండ్రీ!
క్రూర జంతువులు తిరుగులాడే చోటనేనా నీవు
పడుకోవలసింది."

(అని, ఆమె దుఃఖించసాగింది) ఆమె ఆమెపైనున్న ఒక చిన్నరెమ్మను పట్టుకొంది; ఆమె ఒక కంటితో చూస్తుండగా-ఆ కొమ్మను అల్లుకొన్న ఒంటి పూవున్న తీగవలె ఆమె కనిపించింది.

## కంబని రామాయణము
## (రామకథై)
### కాండ II - అయోధ్య
### గుహ పటలము (రామ గుహుల సమాగము)

(అయోధ్య యువరాజైన రాముడు దేశభ్రష్టుడై అడవుల వైపుగా ప్రయాణం చేస్తూ

వచ్చి, గంగానది ఒడ్డున ఉన్న పర్ణశాలలో ఒక దినం విశ్రమిస్తాడు. అతని వెంట అతని భార్య సీత, తమ్ముడు లక్ష్మణుడు ఉన్నారు. బోయల రాజైన గుహుడు-పర్ణశాల వెలుపల ఉన్న లక్ష్మణునితో రామునికి తన వందనాలర్పించ వలెననే కోరిక వెలిబుచ్చుతాడు).

11. "అయ్యా, కొంతసేపు ఆగు"మని గుహునికి చెప్పి
ఆ యువకుడు లోనికిపోయి అన్నకు మొక్కి ఇట్లా అన్నాడు:
"జయ, విజేతా! నిను చూడడాని కొకడువచ్చె.
అతని వెంట అతని వారు పలువురు వచ్చినారు;
నాకతడు సామాన్యుడుగాను, ఔదార్యం కలవాడుగాను కనవస్తున్నాడు
అతని ప్రేమ మాతృప్రేమకంటె మిన్నగా పరిగణిస్తాను నేను. అతడు గంగ
కటు ఇటు పయనించే అంతులేని పడవలకు అధిపతి అట. అతని పేరు గుహుడు."

12. (రాముడు గుహుని తోడ్కొని రమ్మని లక్ష్మణుని కోరగా, అతడు అట్లాగే చేస్తాడు. రాముని చూడగానే గుహుని మనసు ద్రవిస్తుంది. అతడు ఆరాధనా భావంతో తలవంచి, మౌనంగా నిలబడినాడు).

13. "ఇక్కడ కూర్చో అనినాడు రాముడు; అంతులేని ప్రేమగల
గుహుడు అందుకు ఒప్పుకొనలేదు. "నీకోసం కొమ్ముతేనె,
కమ్మగా వండిన చేపలు తెచ్చినాను; వీనిని స్వీకరించవూ?
అనినాడు. (ఏమి జానపదుని అజ్ఞత? అని మునులు అంటున్నట్లుంది)
అపుడు మహావీరుని ధోరణిలో మెల్లగా నవ్వి వయసు మీరిన
ఆ మునులతో మాటాడ సాగినాడు.

14. "ప్రేమకు గుర్తుగా తెచ్చిన ఈ కానుకలు అనర్ఘాలై,
భక్తితో పండిన ప్రేమను తెలియజేస్తున్నవి.
ఇవి అపూర్వాలు-దేవతల అమృతముకంటె విలువైనవి
ప్రేమతో ఇచ్చినప్పుడు అన్నీ అర్ఘాలే అవుతాయి; మనం
స్వీకరించడానికి తగినంత పవిత్రమైనవీ అవుతాయి;
కనుక మనం వీనిని ప్రియమార స్వీకరించితిమని భావింపవలె:"

15. (తర్వాత రాముడు మరునాడు గంగను దాటవలెననే తన
ఉద్దేశాన్ని గుహునికి తెలుపుతాడు: అందుకు అవసరమైన
పడవలను త్వరగానే తెమ్మంటాడు. గుహుని అతనితో వచ్చిన
వారిని ఇండ్లకుపోయి ఆ రాత్రికి విశ్రమించుడని సెలవు ఇస్తాడు.

16. నీలి మబ్బుపోలిన అతడు అట్లా మాట్లాడగా,
ప్రేమ లోగొనగా గుహుడు తనభావాలను వెలిబుచ్చినాడు:

"ఈ ప్రపంచం అంతటినీ పాలించడానికి పుట్టినవాడా!
నిన్నీ విధంగా మార్పుచెందిన స్థితిలో చూడవలసి వచ్చినందుకు
నాకళ్లను ఆక్షణమే ఊడదీసుకోవలసింది-కాని;
కేవలం ప్రేమలు పలికే దొంగను నేను;
నిన్ను దుస్థితిలో ఒంటరిగా విడచి పెట్టడం నాకిష్టంలేదు
కనుక నీ బానిసగా ఉండి సేవించడానికి అనుమతించు."

17. సాటిలేని విలుకాడ, పురుషోత్తముడయిన రాముడు
ఈ వాదం విన్నాడు;
సాభిప్రాయంగా సీతను, తమ్ముని వెలుగు మోమును
చూచినాడు. ఆపై అతడు ఇట్లా అన్నాడు:
" ఇతని ప్రేమ గాఢమూ, అనంతమూ (మీకుతెలియదంలేదా)"-
పిమ్మట విప్పారిన కన్నులలో కనికరమున గుహుతో ననె:
" ప్రియతమ మిత్రమ ! నీవు మాతో ఇక్కడ (కొంతకాలం)
ఉండవచ్చు"

18-19. (గుహుడు లక్ష్మణునిద్వారా రాముని ప్రవాసం గురించిన వివరాలు తెలుసుకొంటాడు. సూర్యుడస్తమిస్తాడు. చీకట్లు వ్యాపిస్తాయి).

20. సంప్రదాయబద్ధంగా
సంధ్యాకాల కృత్యాలు జాగ్రత్తగా నెరవేరినవి;
పాలకడలి వెడలి వచ్చు సుధవలెనున్న సీత,
అసాధారణ పరాక్రమవంతుడా రాముడు
కరకు నేలపై పరచిన రెల్లుగడ్డి పడకపై విశ్రమించినారు;
తమ్ముడు లక్ష్మణుడు ఎక్కుపెట్టిన వింటితో
రెప్పవేయక ఉదయంవరకు కావలి కాచినాడు !

21. గుమిగూడిన గజయూథంవలెనున్న తనదు బలగంతో,
గుహుడు కూడ కావలి కాచెను, సంధించిన బాణంతో;
విప్పారిన కన్నులు మేల్కొని ఉన్నా;
బాధావిల హృదయం బరువయి తపిస్తున్నది,
శోకార్తుడయిన ఆ చినతమ్ముని,
కటికనేలపై శయనించిన ఆ అన్నను చూసెను గుహుడు:
తెప్పున, ఆతెప్పల దొరకన్నులలో బాష్పధార,
నల్లని కొండల వెలువడు నదీ వేగమయ్యెనపుడు.

("మరునాడు రాముడు సీతతోను, లక్ష్మణునితోను నది దాటినాడు. కొంత కాలానికి వారు చిత్రకూటంలో స్థిరపడినారు)

## భాగము 13-గంగ

(*భరత, గుహుల సమాగమము*)

(రాముడు వనవాసానికి పోయిన విషాద సంఘటన అతని పెద్ద తమ్ముడైన భరతుని పరోక్షంలో జరిగింది. అది తెలిసిన తర్వాత భరతుడు- పెద్ద బలగం తీసుకొని రాముని జాడ కనిపెట్టడానికీ, అతనిని అయోధ్య రాచరికాన్ని చేబట్టమని ఆహ్వానించడానికీ బయలుదేరుతాడు. అతడు తన సేనతో గంగను చేరవచ్చినాడు. ఆవలి గట్టునుండి ఇది చూచిన గుహుడు భరతుని ఉద్దేశమేదో తెలియక అపార్థం చేసుకొంటాడు. రాముని సమూలంగా నాశనం చేసేటందుకే భరతుడు సైన్యంతో వచ్చినట్టు భావించినాడు).(1-8)

9. అతడు తన కత్తికట్టును బిగించినాడు, పెదవులు కొరికినాడు;
అతని మాటలు వాడిగా రేగినవి; అతని కళ్లు
నిప్పులు చెరగినవి;
అతని యుద్ధ భేరీ మోగింది; అతని టాకా సందేశాన్ని విస్తరించింది
అతని భుజాలు "యుద్ధం దగ్గర పడింది'' అనే భావంతో
పొంగి లేచినవి!

10. "దండెత్తివచ్చేది ఎలుకలదండు; నేను వానిని కబళించబోయే పామును!"
అంటూ తనవారిని పిలిచినాడు; భూమిపై ఉన్న బెబ్బులులన్నీ
వడిగా కలసి అలవలె పొంగివచ్చినట్టు
గుంపుగా వచ్చినవారు వారు.

12. చుట్టూ ఉన్న బోయలను చూచి గుహుడు అన్నాడు
''ఇటు చూడండి! ఆ సేన ద్రోహబుద్ధితో తరలి వస్తున్నది ;
దాన్ని వీరస్వర్గానికి ఎగజిమ్మవలెనని నేను
నిర్ణయించినాను
దీనిని మీరు అంగీకరించగలరని నా నిశ్చయం !
ప్రాచీనమూ గొప్పదీ అయిన రాజ్యాన్ని నానెచ్చెలికి
తిరిగి ఇస్తాను''

15. ఈ దండు లోతుగా ఉగ్రంగా ఉండే నది నీట నడవగలరా?
యుద్ధంలో ఏనుగుల గుంపును ఎదుర్కొడానికి వెరచితే
నేను విలుకాడినేనా ?

"మిత్రమా", అని అమూల్యమూ, అత్యంత ప్రియమూ అయిన
మాటతో మహాత్ముడైన రాముడు నన్ను పిలువలేదా?
నేనతనికి భంగం కలిగిస్తే "ఈ బోయముచ్చు చచ్చిఉండవచ్చు"
అని ప్రపంచం నన్ను తిట్టుగాక।

16. "రాముడు తన అన్న' అని అనుకోడానికే ఈ భరతుడు
నిదానించలేదా? పైకి ఉరకనున్న బెబ్బులివలె తమ్ముడు
కావలి కాస్తున్న విషయం విస్మరించినాడా?
మరి నా గురించిన గణన లేదా?- నాస్వరాష్ట్రంలోనన్ను
అవమానించి దాటిపోవడమా?
బహుశః రాజుల గుండెలను ఈ హీనస్థితిలోని
విలుకాని కోల చీల్చునని అను కొన్నాడేమో!"

17. "హా! ఈ భూమినేలేపావిష్టి రాజులకు పాపం చెరుపు
శాశ్వతమైన అపకీర్తి అనే ఆలోచనేరాదా!
వారు అయినవారెవరో కానివారెవరో తెలుసుకోలేరా?
తాము కలిగించే వ్యథ ఎంతటిదో ఎరుగరా?
బాగు, బాగు- అట్లే ఉండనీ- నాజీవితంకంటె
విలువకల స్నేహంతో నన్ను ధన్యుని చేసిన
అతనిని ఎదుర్కోడానికి ముందు
వీడు, వీని దండు మొదట మన చేతులలో నుండి
చావు తప్పించుకోవద్దూ?"

22. "నా ఏలిక రాముడు ఈ భరతునికి తన రాజ్యం
సర్వమూ ధారపోసినాడు; అయినా రాముడు మన
గొడ్డు గడ్డలో ఉండడాన్ని ఓర్వలేక ఇతడు తన
దండుతో వచ్చి నాడు;
చూడండి! మీరు "బోయల కులం ఎత్తి వచ్చినదండును
నిర్మూలించి రాజ్యాన్ని సరైన వారసునికి అప్పగించింది
తిరిగి' అనే పొగడ్తను పొందవలెననుకోరా?

(ఈ విధంగా మాట్లాడిన గుహుడు, ఆ వెంటనే యుద్ధానికి సంసిద్ధుడై గంగ ఈ పలివైపు నిలిచినాడు; ఆవలిగట్టున భరతుని సారథియైన సుమంతుడు - భరతునికి గుహుని చూపించి, రాముడు అతనితో ఎట్లా చెలిమిచేసుకొన్నాడో వివరించినాడు. అట్లా అయితే మొదట తాను రాముని స్నేహితుని కలుసుకోవడమే సమంజస మనినాడు భరతుడు. అట్లా నిశ్చయించు కొని నదిని దాటడానికై ముందుకు వచ్చినాడు. జడలు కట్టిన జుట్టుతో,

దుమ్ము కమ్మిన దేహంతో, నారచీరలతో అనంతమైన దుఃఖం మూర్తీభవించినట్లున్న భరతుని చూసిన గుహుడు అదరిపడినాడు. తాను భరతుని ఎంతఘోరంగా అపార్థం చేసుకొన్నాడో తెలుసుకొని విచారించినాడు. అతడు పడవనెక్కి ఒంటరిగా బయలుదేరి ఆవలి తీరాన ఉన్న భరతుని సమీపించినాడు) (23-31)

32. (రామునికి) వందనంచేస్తూ చేతులు కట్టి నిలబడినాడు భరతుడు;
గుహుడు అతని పాదాలపై బడినాడు:
భరతుడు గుహుని లేవదీసి
పితృ వాత్సల్యం కంటె గొప్పదైన వాత్సల్యంతో అక్కునచేర్చు
కొన్నాడు ; ఔను! మహనీయుల భావనలో, మనసులలో
తనపట్ల మన్నన గడించుకొన్న భరతుడు-
పద్మస్థితుడైన బ్రహ్మ కూడ తలవంచిపూజించేటంతటి
భరతుడు - అట్లే చేసినాడు:

(గుహుడు భరతునితో ముచ్చటించి, భరతుని రాకకుగల సత్యమైన అవసరాన్ని గుర్తెరిగినాడు. అతడు భరతుని ఘనతను చూచి మైమరచినాడు). - (33-34)

35. చూడు, నీ తల్లి కోర్కెపై తండ్రి రాజ్యం నీ కిచ్చినాడు;
అదేదో అరిష్టమన్నట్లు తోలగద్రోసుకొన్నావు, నీ మోమున
అలముకొన్న విషాదంతో తరలివచ్చినావు (రాముని తీసికొని పోవ
డానికై )
ఓ-ఆదర్శ ప్రాయుడా! నీ ఈ దశను పరిగణిస్తే - ఎవరైనా
నీకు వేయి రాములైనా సరిపోల్చగలరా?

(ఈ విధంగా భరతుని ప్రశంసించిన గుహుడు అతనిని రాముడు అంతకు పూర్వం నిద్రించిన స్థలానికి తీసుకొని పోయినాడు). (35-38)

39. భరతుడు చెదరిన మబ్బువలె వడిగా సాగినాడు
రాళ్లమధ్య పరచిన రెల్లుగడ్డి పడకను చూచినాడు.
ఆ పడకమీదనే మేటివిలుకాడు, చేతికి ఎముకలేని
శ్రీ రాముడు పవళించినాడు.
భరతుడు పాపం! వణకి క్రిందపడినాడు.
ముత్యపు చుక్కలవంటి అతని కన్నీరు నేలను తడిపినవి.
అతడు దుఃఖ సముద్రంలో గాఢంగా మునిగిపోయినాడు.
(భరతుడు-అందరి కష్టాలకు తన విధియే కారణమని దుఃఖించినాడు).

41. ఎగు భుజాలకల ఆ భరతుడు ఇంకా ప్రశ్నించినాడు:
"ఆ మహనీయుడు పవళించిన శయ్య ఇది అయితే

ప్రేమించే మనసుతో అన్నను వెన్నంటి వచ్చిన
ఆ తమ్ముడు ఆ రాత్రి ఎక్కడ గడుపుచుండె?"
మెత్తగా అడిగిన ఆ మాటవిని బోయలదొర సమాధానమిచ్చె;

42. "పర్వత సదృశమైన భుజాలు కలవాడా!
ఆ నల్లని సొగసుకాడూ, ఆమెయు నిదురించగా
ఆ సాహసి ఎక్కుపెట్టిన వింటితో, మండే నిట్టూర్పులతో
కన్నీరు వర్షించే కండ్లతో-ఉదయం వరకు-
ఔను, ఒకమారైనా రెప్పవాల్చక మేలుకొని ఉండేవాడు!"

43. ఇది వినిన రాజకుమారుడు (భరతుడు) ఈ విధంగా అన్నాడు
"అంతులేని దుఃఖానికి కారకుడను నేనైతే
దానిని తొలగించడానికి పూనుకొన్నాడతడు (లక్ష్మణుడు);
ప్రేమకు సరిహద్దు ఉందా?
నా సేవాతత్త్వం బాగానే ఉంది! బంధితమై!"

x x x x x

## V సుందరకాండ

### *భాగము - 14 హనుమంతుడు మరలివచ్చుట.*

(అరణ్యవాసం తుది సంవత్సరాలతో రాముడు పంచవటిలో జీవించినాడు. ఆ ప్రవాసపు తుది సంవత్సరం మొదట లంకను పాలించే రాక్షస రాజైన రావణుడు మోసంచేత సీతను బలాత్కారంగా దొంగిలించి తీసుకొనిపోయి తన భవనానికి చెంత ఒక తోటలో గట్టి రక్షణలో ఉంచినాడు. కానుకలు, బుజ్జగింపు, బెదిరింపులు వంటి వానిద్వారా ఒక ఏడాదిలో సీతను వశం చేసుకోవలె ననుకొన్నాడు; సీతను కోల్పోయిన రాముడు ఆమెకోసం వెదకసాగినాడు. ఆ అన్వేషణలో వానర నాయకుడైన సుగ్రీవుని కలిసికొని అతనితో స్నేహం చేసినాడు. సుగ్రీవుడు - సీతజాడ కనిపెట్టడానికై చారులను అన్ని దిక్కులకు పంపించినాడు. వారిలో ఒకడైన హనుమంతుడు సీత జాడ కనిపెట్టగలిగినాడు ఆమెకు ధైర్యం కలిగించగల రాముని సందేశాన్ని తెలిపి, ఆమె సందేశాన్ని రామునికి తెలుపుటకై వచ్చినాడు. హనుమంతుడు రామునితో ఇట్లు అన్నాడు;)

25. "చూచినాను సీతను - ఔను - నేను చూచినాను
పతివ్రతా రత్నాన్ని - నా కండ్లతో - అనుమానానికి ఆస్కారం లేకుండా-
పొంగిపడే సముద్ర కెరటాలు కడిగే దక్షిణ నగరమైన
లంకలో నేను ఆమెను చూచినాను;
ఓ దేవా సందేహాన్ని విడచిపెట్టు; దుఃఖమింకలేదు".
ఈ విధంగా నమ్మకం కలిగించి హనుమ ఇంకా అన్నాడు.

26. "అయ్యా! నేను అన్ని విధాల నీకు తగిన ఆ మహాదేవిని
నీ మహారాణి అనీ, మహనీయుడైన నీ తండ్రికి తగిన
కోడలు అనీ, ఇంకా మిథిలకు రాజైన జనకుని ఆదర్శ
ప్రాయురాలైన కుమార్తె అనీ పొందిన పేరును మించునట్లు
ఉండే ఆమెను కనుగొన్నాను; నన్నింకా చెప్పనీ! విను!"

27. "బంగారానికి సాటిలేనే లేదు; అట్లే ఓర్పులో ఆమె సాటివారు లేరు!
ఆమె ప్రత్యేకంగా నిలిచి ఉంది; తన జీవితాన ప్రవేశించిన
నీతో సమానంగా ఇతరులను ఆమె భావించదు!
ఆమె అనుగ్రహంలో నాకు సరిపోలేవారు కూడ లేరు;
ఆమె గొప్పతనం అటువంటిది!"

28. ఆమె ఎన్నిటిని సాధించినది; సూర్యవంశం నీదైనది.
అట్లే ఆదర్శవంతమైన ఆమె వంశం ఆమెదే కాగలదు!
తనను నీ నుండి విడదీసిన ఆటవికుని వంశాన్ని మరణం
పాలు కమ్మన్నది.
శాశ్వతుల సమూహానికి ఆమె జీవం పోసింది; మా
పూర్వీకులను పవిత్రులను చేసింది; ఇక ఏమున్నది?"

29. "సాటిలేని విలుకాడా! సముద్రావృతమైన ఆ లంకలో
మంచిదీ గొప్పది అయిన కాఠిన్యంకల స్త్రీని మాత్రమే
కాదు నేను చూచింది!
ఉన్నత జన్మ, అంతులేని ఓర్పు, పాతివ్రత్యం మొదలైనవన్నీ
కలియుగా మెరిసి పోతు-డగా చూచినాను."

30. "ఆమె కండ్లలో భావాలలో ఆమె మిత వచనాలలో
నీవే ఉన్నావు; గుండ్రని ఆమె వక్షాలలో-
దయ మాలిన మన్మధుడు ఎడతెగక వేసే
పూల బాణాల వల్ల ఏర్పడిన
మానని గాయంలో నీవే ఉన్నావు.
మరి ఆమె నీ నుండి దూరంగా ఉన్నదనటం ఎట్లా?

31. "కడలి కవతల-లంకా పురిలో ఒక చోట
మింటి నంటుతూ ఇంద్రుని వనంవలె స్వర్ణమయమై ఉండే వనంలో-
పగళ్లూ రేయీ తెలియనిచోట్ల

వారు నిర్మించిన రెల్లు ఇంటిలో స్త్రీ రూపంలోని
తపః ఫలమైన ఆమెను నేను చూచినాను!"

(ఆపై హనుమ తాను ఎంతగానో అన్వేషించిన పిమ్మట బలమైన రక్షణకు లోబడి ఉన్న సీతను కను గొన్న విధానాన్ని; మరుగునఉండి తానుచూడగలిగిన వైనాన్ని; సీత రావణుని గద్దించడాన్ని; శోకమగ్నయైన ఆమెకు రాముని ముద్రికను చూపించి సమాదాయించి నమ్మకం కలిగించడానికి యత్నించిన విధానాన్ని వివరించసాగినాడు (3?-40)

41. "నమ్మకాన్ని కలిగించగల ప్రత్యేకమైన గుర్తులెన్నింటినో
ఆమెకు తెలియజేసినాను; వానిని చక్కగా దీర్ఘంగా
పరిశీలించి నా భావనలో మోసం ఏమీ లేదని పూర్తిగా
సంతృప్తిపడి నేను తనకు చూపిన ముద్రికను చూచింది!
అది మరణపు పట్టునుండి మరల్చి జీవాన్ని పోసే మందుగా
పనిచేసింది!"

42. "ఆ ఒక్కక్షణంలోనేను పరస్పర విరుద్ధాలైన
రెండు సంఘటనలు చూచినాను!
మెరిసే ఆ కెంపు ముద్రికను ఆమె తన ఎదకు హత్తుకోగానే
ఆమెలో భీకరంగా చెలరేగుతున్న వియోగ తాపానికి ఆగలేక
మొదట అది కరిగిపోయింది. కాని లోపలి నుండి పొంగివచ్చే
ఆనందం కలిగించిన చల్లదనంతో అది మరల గట్టి పడింది!"

(సీతతో ఆమె విమోచనం దగ్గరపడినదని తాను చెప్పినదాన్ని, ఆ తర్వాత వివరించిన హనుమ రామునికి ఆమె తుదిసందేశాన్ని తెలియజేస్తాడు) (43-44)

45. ఇచటి స్థితిని గూర్చి నేను చెప్పగా ఆమె శ్రద్ధగా చెవి ఒగ్గింది,
ఆపై అక్కడి స్థితిని పూర్తిగా వివరించి ఈ సందేశం ఇచ్చింది:
"ఇంకొక నెల ప్రాణాలతో ఉండగలను ఆ తర్వాత తప్పక
మరణిస్తానని దయతో నిండిన నా మనసుకు తెలియనీ!
అని ఆమె నీ పాద పద్మాలు శిరసున ధరించింది.

(హనుమ సీత ఇచ్చిన చూడామణిని రామునికి ఇచ్చినాడు; ఇదిచూచిన రాముడు ఎంతో కలత పడినాడు. ఆ తర్వాత కొంతకాలానికే వానర సైన్యాలతో అతడు లంకవైపు సాగినాడు).

## VI యుద్ధకాండము

### భాగము 16 : కుంభకర్ణవధ

(యుద్ధం ఇక సంభవింప నున్నదనగా రావణుని తమ్ముడైన విభీషణుడు సీతన్ను

రామునికి అప్పగించమని రావణునికి చెప్పినాడు. అది విని కోపించిన రావణుడు విభీషణుని తిరస్కరించగా, అతడు అన్నను విడిచి పోయి రాముని ఆశ్రయిస్తాడు. రావణుని పెద్ద తమ్ముడైన కుంభకర్ణుడు కూడా అన్న ఆక్రమాలను ఖండించాడు. ఏమైనా అన్నతోబాటే ఉండి, అతని సేవలోనే మరణించడానికి నిశ్చయించుకొన్నాడు. ఆపై జరిగిన యుద్ధంలో కుంభకర్ణుడు రాముని చేత చావు దెబ్బలు తిన్నాడు. తన తుది క్షణాలలో అతడు రామునికి విభీషణుని పక్షాన్ని ఎత్తి చూపి వాదించినాడు).

349. గజపదాతుల బలం లెక్కకు మీరి ఉన్నా
తనను ఆశ్రయించిన అల్పమైన పావురాన్ని రక్షించడానికై
తననే త్రాసులో తూచుకోవడానికి సిద్ధపడిన శిబివంశంలోని వాడా
నీలో కూడా ఆ దయాధర్మం ఉంది! మా దుష్టమార్గాలను
త్యజించి విభీషణుడు నీ శరణు జొచ్చినాడు-
సదా వానిని కాపాడు! నీకు ఇదే నా ప్రార్థన"!

350. "నీ వెవరో నాకు తెలుసు! వేదాలలో
వెలసిన ఆది పురుషుడైన నీవు రాజ రూపంలో వచ్చినావు!
మా వంశంలో పుట్టినా నా తమ్ముడు న్యాయమూ,
గొప్పదీ శాశ్వతమైనదీ ఐనమార్గాన్నే తెలిసినవాడు;
దుష్ట మార్గాలు తెలియని వాడు; అతడు నిన్ను శరణు చొచ్చినాడు;
ఆతని ఈ నమ్మికను వమ్ము చేయకు! ఇదే నా ప్రార్థన!"

351. "మహదాశయాలు కలవాడా! నిరంకుశుడైన
రావణాసురుడు "ఈ విభీషణుడు నన్ను సమూలంగా నాశనం
చేయడానికి యత్నిస్తున్నాడు" అని తలచి తలచి పగను పెంచుకొన్నాడు.
బహుశః ఈ ఇద్దరు కలిస్తే సోదర ప్రేమను విడనాడి
అతడు ఇతనిని చంపగలడు; కనుక నీవే
విభీషణుని కాపాడవలె"!

352. "నీకు మరల చెబుతున్నా-ఆ నీచుడు సోదర భావం
తలచి వెనుదీయడు; విభీషణుని చూడగానే చంపడానికి
యత్నించును ఏ దయా చూపడు! కనుక,
నా తమ్ముడు సదా నీతో, లక్ష్మణ హనుమంతులతో ఉండుగాక!
వారొక క్షణమైన విడిపోవునట్లు చేయకు! ఇదే నిన్ను
యాచిస్తున్నాను."

(తన విషయం ప్రస్తావించిన కుంభకర్ణుడు వ్రక్కలైన తన శిరసును సముద్రంలో పడవేయించమని కోరినాడు. రాము డట్లా చేసినాడు. బలవంతుడైన కుంభకర్ణుని మరణంవల్ల సంతోషంతో దేవతలు నాట్యం చేయగా, రావణుని భానిసలు అతని ఆ మరణ

వార్త తెలియజేయడానికి వేగంగా వెళ్లినారు).

(కాండలో మిగిలిన భాగము ; కుంభకర్ణుని మరణం సంభవించిన తర్వాత ఎందరో యోధులు మరణించినారు. తుదకు పదవనాడు సాగిన యుద్ధంలో రాముడు రావణుని చంపినాడు సీత చెరనుండి విడుదల పొందింది. తన కర్తవ్యం నెరవేరగానే రాముడు సీతాలక్ష్మణులతో, స్నేహితులతో అయోధ్యకు మరలిన రాముడు అందరూ ఆనందించగా పట్టాభిషేకం చేసుకొన్నాడు).

## పూసలార్ నాయనార్

### పెరియపురాణం (శేక్కిళార్ రచన)

(శివభక్తుడైన పూసలార్ ఒక గుడికట్టవలెనని ఆశించినాడు. కాని ధనం పోగుజేయలేకపోయినాడు. కాబట్టి మానసికంగానే ఆలయం నిర్మించడానికి తీర్మానించాడు అతి జాగ్రత్తతోను, మిక్కిలి శ్రమతోను అతడు దానిని చేయడానికి సమకట్టినాడు. ఎన్నో దినాల తర్వాత అతడు ఆలయాన్ని తనభావనలోనే పూర్తిచేసి భగవంతునికి అర్పించినాడు. భగవంతుడు-ఆప్రాంతపు రాజు శ్రమించి రాతితో కట్టిన నిజమైన గుడికంటె దానినే మేలైనదిగా గణించి స్వీకరించినాడు.)

5. పూసలార్ సుదూర ప్రాంతాలలో సంచరించినాడు
శ్రమకు వెనుదీయలేదు-ప్రతిచోట ప్రయత్నించినాడు
కాని సంపాదించింది మాత్రం కొంచెమే!
"ధనంలేకుండా నేనేమి చేయగలను?" అని తదేకంగా ఆలోచించినాడు!
"మానసికంగానే గుడి ఎందుకు కట్టరాదు?"అని
ప్రశ్నించుకొని-గుడికి అవసరమైన వస్తుజాలాన్ని
అల్పమైన వానిని కూడా విస్మరించక మానసికంగానే
జమ చేయ నారంభించినాడు.

6. శిల్పులను పనివాండ్రను, వారి పనిముట్లతో సహా
మనసులో గుమి చేసుకొన్నాడు;
ఒక శుభదినాన దేవునికి గుడి కట్ట డానికి ప్రారంభించినాడు;
శాస్త్రోక్తంగా పునాదులు వేయించినాడు.
ప్రేమతో, భక్తితో రేబవళ్లు విసువులేక శ్రమించినాడు.

7. నేలమట్టంనుండి శిఖరం (విమానం) దాకా వరుస క్రమంలో
గోపురాన్ని ఏర్పరచడానికి తీర్మానించుకొని
తనమనసులోనే దాని ఆకారం దిద్ది తీర్చినాడు.
నేర్పుగా మలచినాడు.
శిఖరం మీది బంగరు కలశాన్ని పూర్తి చేసినాడు.

ఉపమండపాలు మొదలైన వానికోసం దినాల కొద్దీ శ్రమించినాడు.

8 కలశాన్ని శిఖరంపై నెలకొల్పినాడు.
పక్కలకు గచ్చుపని చేసినాడు; గూళ్లు ఏర్పరచినాడు.
చుట్టు ప్రాకారాలు ఎత్తుగా పెరిగినవి.
లోతుగా కోనేరు త్రవ్వడం జరిగింది.
ఇంతపని నిండుగా చక్కగా నెరవేర,
స్థాపనకు శుభదినము నిశ్చయించె నతండు,

9. ఇచట, "కాడవ"రాజు కాంచీనగరమందు
ఎంతోవ్యయం చేసి ఇటుకలతో, రాళ్లతో
గొప్పగా ఒక గుడికట్టినాడు.
ఇతర దేవతలకే అంతుచిక్కని దేవదేవుని
ఆ గుడిలో ఒక శుభదినాన
ప్రతిష్ఠించడానికి తలపెట్టాడు
ఆ ముందు దినంరాత్రి రాజు నిదురించినపుడు-కలలో
జడలు కట్టిన కురులతో, మెరసే "కొన్రై" పసుపుపూవులతో
దేవుడు కనిపించి మాటాడినాడు :

10 "నా భక్తుడు పూసల్ అతిగా శ్రమించి
నింద్ర వూరులో నాకొక గుడి కట్టించినాడు;
రేపు నేనచట ప్రవేశింపనున్నాను. కనుక
నీవు స్థాపనకింకొక దినము నిశ్చయింపుము".
ఈ మాటలు అనిన తర్వాత జడలు కట్టినకురులతో,
మెరసే పసుపుపూవులు దాల్చిన దేవుడు
ఆ పుణ్యాత్ముని నివాసానికి తరలిపోయినాడు.

11. పరిశుద్ధుడైన ఆ పరమాత్మ-కాడవరాజు ఆ భక్తుని
కనిపెట్టడానికి అనుగ్రహించినాడు
నిదురనుండిలేచి, సాహస బలోపేతుడైన ఆ రారాజు
ఆ మరియొక ఆలయనిర్మాతకు వందనం ఆచరించడానికి
మిక్కిలి ప్రేమతో త్వరపడినాడు.
నింద్రవూరు చేతి చల్లని తోటమధ్య పయనించినాడు.

12. 'భాగవతుడైన పూసలార్' కట్టించిన
'ఆ గుడి ఎట ఉన్నది ?' అని ఆ ప్రాంతీయులనడిగినాడు,
"అట్టువంటి గుడి ఏదీ లేద"నిరి వారు.

రాజు ఆ ప్రాంతంలోని భక్తులను, విద్వాంసులను
తరలి రమ్మని పిలుపు నంపినాడు.

13 ఆ పండితులందరు తనముందు గుమిగూడగానే
"పవిత్రుడగు పూసలార్ ఎవరు?" అని రాజు వారినడిగె
వారు "ఆయన ఇచటివాడేకాని, ఇపుడిచటలే"డనిరి
నిరంకుశుడైన రాజు తానే భక్తుని సందర్శించడానికి తరలినాడు.

14 కష్టపడి వెదకి కనుగొన్న తరువాత భక్తుని రాజు అడిగినాడు:
"ఇచట మీరు నిర్మించినట్టు ప్రశంసలందిన గుడి
ఎచటనున్నది? నేడు దాని ప్రతిష్ఠాపన దినమని విని
మీ పాదాలకు వందనాలు అందజేయవచ్చినాను.
ముక్కంటి దొర నన్ను ఇచటికి పంపించినాడు."
భక్తుడు గుడిని మానసికంగానే ప్రేమ, భక్తి మెండుకొనగా నిర్మించినట్లు తెలియ
జేసినాడు. అప్పుడు రాజు నిజమైనభక్తి మహత్వాన్ని తెలుసుకొనగలిగినాడు.

## కచ్చియప్ప శివాచారియార్

### కందపురాణం

(శివుని చిచ్చరకంటినుండి వెలువడిన నిప్పు రవ్వ కాముని కాల్చి బూడిద చేసింది
కాముని భార్య రతి పెద్దగా విలపించసాగింది.)

99. లక్ష్మీ సుందరి సూనుడా! అమూల్యమైన నా ప్రాణమా!
విష్ణుకుమారుడా! శంబరవైరీ! ఇక్షు కోదండుడా!
పగడాల కొండను భస్మము చేసినట్లు, శివుడు
తన కండ్లతో నీ దేహాన్ని కాల్చి రూపఱ చేసినాడు!
బ్రహ్మకు ప్రియమైన వాడా! దేవాతిథులలోన రెప్ప పా
టెరుగని కన్నులవి యెల్ల నిదురలో మునిగెనా ఏమి?"

100. "ఎగిరే పురాలను కాల్చినవాడు శివుడు; అతనిపై నీవు
విల్లెక్కు పెట్టడం తగదని వాదించినాను నేను,
లెక్కపెట్టక పోయినాడవు నా మాట,
దేవతల పథకాలు, నెరవేర్చడానికే నిశ్చయించి శివపుడు,
"ఇపుడు నీ దేహం బూడిద అయింది; ఇది చూచి
ఎవరు జీవింపగలరు? నీవే నా ప్రాణం-నీవే
పోయిన తర్వాత నేను ఒంటిగా జీవింపగలనా?"

101. "దేవుని కంటి ధాటికి నిలువలేక పోయినావు!
నీ దేహం మాడి మసికావడంతో
దేవతలలో భయం ఆవహించింది;
తరగని-గొప్ప దుఃఖం నాకు వాటిల్లింది!
ఇంకా నీవు ఎక్కడ దాగుకొని ఉన్నావు?
ఆకారం తొలగిన నాథుడా! నీకు నేను
ఏ కీడు చేసినానో చెప్పుము!"

102. "త్రిపుర సంహారం చేసిన గొప్ప విలుకాడైన
ఆ దేవుని తపసు చెడగొట్టడమే తమ ఆకాంక్ష
అయినట్లయితే ఆ పనికి నిన్నే ఏల ఎన్నుకోవలె?
స్వర్గస్థులందరూ చచ్చినవారలా?
వెలికి తెలియకపోయిన నిన్ను చంపినదివారే!
అదియె నా బ్రతుకులో వారు పన్నిన కుట్ర"
అల్పులకు మేలు చెయడమన్నది
ఆత్మ వినాశ కారణము కాదె?

104. "నేనేమి చేసితి అపకారమొరులకు? లేక ఇది నా
పూర్వకర్మానుభవమా? విషాదాంతమెందులకు నీకు?
ఓ చెరకు విలుకాడ! నా రక్షకుడ! కాపాడవే నన్ను?
ఆ దేవునికి ఉన్నదే చిచ్చురకన్ను -
నశింపజేయడమాతని ప్రకృతి -
ఆయనను నిందించి లాభమేమిపుడు?

105. "మెరుగు బంగరు చాయ శిరము కనబడదిపుడు!
సొగసు నిండిన నీదు ముఖబింబమేమయ్యె!
భూషణావళికాంతితో మెరయు భుజములు!
వెడదయై కనుపట్టునురము వైభవము
కనబడుటలేదు నా కన్నులకిపుడు
వేధించు కుట్మలబాణాలు కనబడవు
విల్లు కనబడదు, నృత్తవైఖరి కనబడదు,
ఓ నాథా! నేనేమి చేయుదు?
నెటకేగితివి నన్ను వదలియిప్పుడు నీవు?

106-107. ఏ నాటికీ తనను విడనాడనని తమ పెండ్లినాడు చేసిన ప్రమాణాన్ని కాముడు ఏ విధంగా భగ్నం చేయగలిగినాడని రతి ప్రశ్నిస్తుంది. కాముని ఆ పనిమీద

పంపిన దేవతలు అతనిని రక్షించడానికి ఎందుకు ముందుకు రాలేదో, తానంతకు ముందు గెలిచిన దేవతలవంటివాడే శివుడూనని అతనెలా భ్రాంతిపడ్డాడో అని రతి శోకిస్తుంది. కామునితో తన ఆనందాలు, క్రీడలు అన్నీ కలఅయిందని దుఃఖిస్తుంది.

110 "తన అల్లుడని దక్షుడు పేక్షించె శివుని,
తుదకు మహేశుడతని అధ్వరము ధ్వంసము చేసె,"
"అతనిని ఎదుర్కొనుమని చెప్పి
దేవతలు నీ విధికి నిన్ను పంపినట్లున్నారు :
నీ కోసమే అన్నట్లు నేను, శోకాగ్నిలో రగిలి కాలిపోతున్నాను !
నీ ఉన్న చోటికే నన్ను రానిమ్ము !
అటకిదిగో వచ్చెద, వచ్చెద ప్రాణమా !
(అని రతి శోకించును.)

విల్లిపుత్తూరార్

## మహాభారతము

### భాగము 45—17వ యుద్ధము

(కౌరవ పాండవులకు మధ్య జరిగే యుద్ధంలో కౌరవపక్షాన్ని అవలంబించి యుద్ధం చేసిన కర్ణుడు విజయుని (అర్జునుని) బాణందెబ్బకు నెత్తురు వరదలై పారగా, క్రింద పడినాడు. కాని అతని "పురాకృత పుణ్యం" అతని ప్రాణానికి రక్షణగా నిలుస్తుంది. అర్జున రథసారథిగాఉన్న శ్రీ కృష్ణుడు, కర్ణుని పుణ్యాన్ని దానంగా స్వీకరించవలెనని నిశ్చయించుకొంటాడు. అతడు కర్ణుని ముందు బ్రాహ్మణ సన్యాసివలె కనిపించి ఆ దానం కోరుతాడు, కర్ణుడు సంతోషంగా దానం ఇచ్చివేస్తాడు).

236-237. తన దేహం అన్ని భాగాలనుండి నెత్తురు కారుతున్నా తన కిరీటం, కుండలాలు రూపు మాసిపోయినా, కర్ణుని చేతులు మాత్రం వింటిని వంచి బాణాలు వేయడం మానలేదు. అపుడు సూర్యాస్తమయం కానున్నది. కృష్ణుడు అర్జునుని యుద్ధం నిలిపి రథంపైననే ఉండమన్నాడు. ఆపై అతడు బ్రాహ్మణ సన్యాసివలె మారు వేషం ధరించి కర్ణుని దగ్గరికి పోతాడు.

238. (బ్రాహ్మణుడు అంటున్నాడు) :
"వేగముగ పయనించు తురగములు పూన్చిన
రథములో ఆకసమును చీల్చుకొని గమించు
తేజోమూర్తి అంశమున పుట్టిన మహనీయుడా !
మేరు పర్వతంపై నేను కొన్ని కఠోరవ్రతాలు అవలంబిస్తున్నాను
పేదరికపు బురదలో కూరుకొనిపోయాను.
సముద్రవలయితమైన ఈ భూమిపై దుఃఖితులకు

కోరిన వరమిచ్చువాడవు నీ వొక్కడవని విన్నాను,
ఈ క్షణమె నీ వీయగలిగినదేదైన
ఉన్నచో నిమ్మని ప్రార్థించుచున్నాను."

239. విప్రుని మాటలు కర్ణుని చెవులకు
తేనెవలె మిక్కిలి తీయగా సోకినవి;
విజయుని వాడి కోలదెబ్బకు బలమరి
రథముపై పడిఉన్న ఆ, స్థితిలోనూ
అతడు చిరునవ్వునవ్వి" బాగు, నేనేమి
ఈయగలనో చెప్పు మీ వన్నాడు
వేదజ్ఞుడైన విప్రుడు "నీ పుణ్యమది యెల్ల ఇమ్మ నాకిపుడని"యె
కర్ణుని ఎదలోన సంతోషముప్పొంగె.

240. కర్ణుడు సమాధానం ఇచ్చినాడు
"నా జీవం క్షీణిస్తున్నది-అది నా దేహంలో ఉన్నదా
లేక బయట ఉన్నదా అదియు తెలియుటలేదు
అడిగినవి ఈ పాపి ఇవ్వగలిగినయప్పుడు
తామెందులకొ రాకపోయిన వారలు !
ఇన్నేండ్లుగా నేను ఆర్జించినట్టి
పుణ్యమునిపుడు పూర్ణముగ నిత్తును కై కొండు.
పద్మ నిలయుడైన బ్రహ్మకంటెను తాము గొప్పగా
నా కిపుడు కన్పించుచున్నారు. నా పుణ్యమహిమయో !'

241. అని చెప్పి కర్ణుడు తానె "యాచకునిరీతి చేతులు మోగిచె;
శత్రువులకు పిడుగువంటి వాడపుడు
కన్నుల నవ్వుతో కర్ణుని చూచె
ధారా పూర్వకముగ దానము చేయమ"ని
తన గుండెలో కోలనాటినచోట
ప్రవహించు నెత్తురు ధారగాచేసి
కర్ణుడు దానము చేయగా, దేవుడు దాన్ని స్వీకరించెనపుడు
ఔను ! పూర్వం బలిచేతినుండి నీరు గ్రహించ
ముల్లోకాలను కొలిచిన దాదేవుడేకదా !

242. దానంతో తృప్తిపడిన సన్యాసి ఆభరణాలంకృతుడైన
* రాజుతో "నీకు వలసిన వరాలన్నీ అడుగు; ఇస్తా"నన్నాడు

[ * రాజు = కర్ణుడు ]

సూర్యుని తనయుడు ఇట్లు ప్రార్థించినాడు;
"నా పాపాలవల్ల పెక్కు జన్మలనెత్తి,
తమవద్ద లేదని కోరి నా వద్దకు
వచ్చు వార్తలకు లేదను మాట చెప్పని,
హృదయమొక్కటి నాకు దయచేయు"మనెను.

243 తన అత్తకొడుకు (అదే నిజము!) అనిన ఈ గొప్పమాటలు విని కృష్ణుని మనసు సంతోషంతో పొంగి పొరలింది ;

తనకేలు తామరలతో కర్ణుని పట్టిచేర్చి కౌగిలించినాడు;
జాలితో స్రవించిన కన్నీటితో అతనిని తడిపినాడు;
"నీ వెన్ని జన్మలెత్తినా, నీకు సంపద, దాని నీయగల
మనసు ఉండుగాక; తుదకు నీకు ముక్తి కలుగుగాక"
అని ముమ్మారులోకమైన వేలుపు పలికెను.

244. అపుడు కర్ణుడు భక్తి ప్రపత్తులతో నిలబడినాడు;
తులసిమాల తాల్చు తుదిమొదలులేని దేవుడు
కర్ణునికి తన విశ్వరూప దర్శనానందము కలిగించి, కరుణించె!
కడలిని త్రాగి వ్యాపించు కారుమబ్బులవలె నల్లనిమేనివాడు
చేతులలో పంచాయుధాలను ధరించి-ఒకనాడు
మొసలి కోరలమధ్య చిక్కి సాయానికై
ఎలుగెత్తి, పిలిచిన గజేంద్రుని మ్రోల ప్రత్యక్షమైనట్లు
కానవచ్చినాడు !

(245-246) (భూమిపై తన చివరి క్షణాలలో ఉత్తములైన దేవతలకు గూడ దుర్లభమైన దివ్యదర్శనం పొందగలిగిన తాను ఎంతో ధన్యుడని కర్ణుడు సంతోషించినాడు).

247. "ఈ లోకంలో, ఈ జన్మలో నేను
ఎత్తైన కొండవలె, బరువెక్కిన మబ్బువలె,
కడలి నీటివలె, కలువవలె నల్లని రంగును-
దండము, కత్తి, శంఖము, చక్రము, విల్లు మొదలైన
ఆయుధాలను-పెద్ద కుండలాలుగల కర్ణములను-
తావులు చిమ్ము తులసి మాలగల ఉరము, నిండైన
భుజములను, సొగసైన కంఠాన్ని, పగడపు మోవిని,
అరవిరిసిన తామరవంటి ముఖమును,
వెలుగురేఖలు వెదజల్లు మకుటమును,
ఆ అద్వితీయుని రూపు కనులార కాంచితిని"

248. నా ప్రాణముకన్న ప్రియమైన మిత్రునికి
కృతజ్ఞతలు తెల్పుటకు ధర్మాదులైన ప్రియసోదరులతో
భీషణ యుద్ధానికి పూనుకొన్నాను; మరి కథాగీతులతో
వినుతికెక్కిన నాదు కవచకుండలములను
అమరాధిపునకు నిచ్చితి అనాడు;

నా దేవ! నీ వడుగగా ఇపుడు
స్వార్జిత పుణ్యమంతయు నిచ్చితి,
ఏకైకగతి ధన్యమైనది నా బ్రతుకు,
శిశువుగా అర్జున వృక్షాలమధ్య ప్రాకిన ఉత్పల నేత్ర, నా స్వామి!

249. (ఆపై కర్ణుడు తన అవసానానికి ముందు దేవదేవుని దర్శించి ఆయన దయకు పాత్రుడైనందుకు ఆనందించినాడు).

**తిరుకూట రాసప్పకవి రాయర్**

## కుర్టాలకుర్రవంజి

*కొరవతె పాట*

67. ఇది మా కొండ–మా కొండ–కుర్టాలంలోని త్రికూట పర్వతము, జడలు గట్టిన వారు, నెలవంకతాల్పు, వేల్పు నెలకొన్నచోటు.

ఈ కొండలో మగకోతులు ప్రియులకు తీయని
పండ్లిచ్చి వలపులు పచరించు;
ఆడుకోతి అరచేతినుండి జారిపడు పండ్లకయి
అర్రులు చాచువారు అమరులు కూడ.
తీవ్ర వీక్షణముతో అమరులను నిందించు వారలిట ఆటవికులు.

సిద్ధులు తరచుగా గుమిగూడి ఇచట
ప్రకటింత్రు తమ సిద్ధగతులు పరుల కచ్చెరువుగ
చెదరిపడు "తేనె సెలయేటి" ధారల
జల్లు లాకాశ వీధి నావరింపగ,
భాను రథ చక్రములు నశ్వములు
జారిపడు మాటిమాటికి దారి తొలగి

అట్టిది మా కొండ
మా సొంత కొండయది.

## తాయుమాన స్వామిగళ్

*(సంకలిత కీర్తనలు)*

### తిరు-అరుళ్-విలాస-ప్పరశివవణక్కం

### పరమ శివ దయా విలాస స్తుతి

### పాట. 1

*అది ఏది*—అంతటా వెలిగేది, అపరిమితమైనదీ, ఆనంద పూర్ణమది కదలేని దయగలది?

*అది ఏది*—తన కరుణలో లెక్కలేనట్టి విశ్వముల కార్యము మొసగేది, జీవమున జీవమై, చిగురించి మొలిచేది?

*అది ఏది*—మనసుకూ మాటకూ అందక నిలిచేది?

*అది ఏది*—తమ దర్శనమొక్కటే సత్యమని, పరమమని వివిధ మతాల వాదనలు చెలరేగ చిత్రమగు ప్రకృతి గల్గినది?

*అది ఏది*—అన్నిటినీ సాధింపగల శక్తి యుతమనీ, నిత్యానంద రూపమని ఏకైకముగ నందరంగీకరించేది?

*అది ఏది*—రేబవళ్లు దాటి కాలావధులు మీరి నిలిచేది?

*అయది*—మదిలోన హృదిలోన మనమెల్లరము నిలుపుకో గలిగినది; మహా నిశ్శబ్ద శూన్యము, నిరాకారము, మన దృష్టిగోచరమగు పదార్థముల రూపమున భావించి, పూజింప యోగ్యమునైనది.

## రామలింగ స్వామిగళ్

### తిరు అరుట్పా *(దయను వినుతించు గీతములు)*

### దైవ మణిమాలై *(దేవునికి మణిహారము)*

ఈవికి పేరెక్కిన చెన్నపురిలో కంద కోట్టం"లో వెలసి వర్ధిల్లుతున్న స్కంధుడా!<br>
షణ్ముఖా అనర్ఘమణివలె చల్లని దీప్తులు వెదజల్లు వాడ !<br>
అంతర్ముఖులైన జ్ఞానులకు శివుని భూషణంవలె కనిపించు వాడ<br>
నీ కిదే నా ప్రార్థనము :<br>
"ఒక్కనీ సుమ పాదాల సదా స్మరించే ఉత్తముల చెలిమి కావలె !<br>
"లోన ఒకటి తలచి, వెలికింకొకటి చెప్పువారి చెలిమి కలుగకుండవలె !<br>
"నీమహిమ, నీ కీర్తిని వచింపవలె: అసత్యం మాటాడకుండవలె<br>
"గొప్పదీ మంచిదీ అగు దారి తెలిసి కొని బ్రతుకవలె,<br>
"అహంకార పిశాచ మావేశింప కుండవలె!<br>
"స్త్రీ పరిష్వంగము నాశించుతలపు చెడి, నిన్నెల్లవేళల స్మరించుచుండవలె<br>
"జ్ఞానము కావలె, నీ దయ సిద్ధింపవలె, వ్యాధి బాధలు లేక జీవింపవలె !

కాళమేఘప్పులవర్

## చాటువులు - (సంకలనము)

ముగ్గురు కళ్లెములు పట్టి ముందుకులాగ,
వెనుకను ఇద్దరు పట్టి త్రోయుచునుండ,
వేదవిదుడా వికట రాముని చిన్న గుర్రము,
నెలకు పదిమైళ్ల వేగమున సాగిపోగలదులే!

సత్తిముత్తుప్పులవర్

నారాయణ పక్షీ! ఎర్రకోళ్ల నారాయణ పక్షీ!
రెండుగా చీలిన పగడపు ముక్కు కలదానా!
*కుమరి నీటిలో నివసించేందుకు తరలిపోతున్నావుకద!
అక్కడ నుండి నీ జతలో ఉత్తరంగా సాగిపోయేటట్లయితే
సత్తి ముత్తంలోని కొలనులో కొంచెంసేపు ఉండిపో!
అది నా స్వస్థలం!
ఆ దగ్గరలో ఒక కుటీరం ఉంటుంది.
దాని కప్పునుండి నీరు ఉరిసి గోడలపై పడుతుంది!
ఆ లోపల సందేశం కోసం బల్లి పలుకు శకునంగా
వింటుందే వెర్రిబాగులది-నాభార్య-ఉన్నది!

ఇక్కడ నీవు చూసిన నా దీనగతి
"మారన్‌వళుది" రాజధానియైన మధురలో
కప్పుకోడానికి పై బట్టలేక, కొరికే చలిగాలిపాలై
చేతులు గుండెకు చేర్చికట్టుకొని కాళ్ళు ముడుచుకొని
ఒదిగి కూర్చొని
బుట్టలో పెట్టిన పాములా బుసలు కొట్టు
ఈ దీనుని గురించి చెప్పు మావిడకు;
(ఆమెకది కొంత ఉపశాంతి కరమౌను!)

---

* కన్యాకుమారి

పడిక్కాసు త్తంబిరాన్

కుకవులకు ఇది పర్వదినం!
వారిని పట్టుకోడానికి ఇక్కడ ఎవరూ లేరు!
వారి నెత్తిన అతుకులు వేయగల "పిళ్లైప్పాండియన్" ఇటలేడు!
వారి చెవులు పిండి క్రిందికి వంచగల ఏ "విళ్లి" ఇటలేడు!
వరుసలు పేర్చి వారితలలు నరకే ఏ "ఒట్టెకూత్తన్" ఇటలేడు!
భలే! క్షణములో మూర్ఖులు కవితలు కురిపించి
జగతిలో మహాకవులవలె మూగనీ.

*గోపాలకృష్ణ భారతి*

## సంగీత కృతి

### నందనార్ కథ

(హరిజనవాద వర్ణన)

వరి పొలాలగట్లను తాకినట్లుండును పులయుల ఆవాసం!
ఆ పూరి కప్పు మీద గుమ్మడి తీగెలు కప్పి ఉన్నాయి
చుట్టు పక్కల కుక్కలు మొరుగు తున్నాయి-
గ్రద్దలు చుట్టి చుట్టి ఎగిరి వస్తున్నాయి-
అక్కడి ఎండు మాంసం ముక్కల కోసం కోళ్ళు అరుస్తున్నాయి-
పెరటిగోతి దగ్గర ఎముకలు కండలు కుప్పలుగా పడి ఉన్నవి
గుంటలో నాచు పెచ్చు పెరిగి ఉంది - ఎండ్రులకు నత్తలకు
ఉనికి పట్టుగా;
ఆ బావులలో మెట్ట తాబేళ్లు ఉన్నాయి-
వాటిలో నానిపోయిన ఎముక తుంటలు, చివికిన చర్మపు
ముక్కలు నరాల తునకలు, పొలంగట్టుపై పడి ఉంది
నలుదిక్కులా నింపు దుర్భర దుర్గంధాలు,
అక్కడి వారికి సిగ్గన్నది లేదు,
చేపలు ఎండ వేసిన వీథులలో,
తలకు, మొలకు మొగ్గల సరాలు కట్టుకొని
శంఖంతో చేసిన చెవి కమ్మలూ
రకరకాల హారాలు వేసుకొని
ఎగిరెగిరి నాట్యం చేస్తున్నారు!
వీథి వాకిల దగ్గర నిలబడి దుర్భాషలాడుతూ

సందోహమున చేతి చప్పట్లతో,
కల్లు పెల్లానుతూ, ప్రేలుతూ, వదరుతూ;,
తగినట్లు తప్పెటలు వాయించుతుంటారు,
— ఆ పులయుల ఆవాసమట్టిది.

*సుబ్రహ్మణ్యభారతి*

## పాటలు

## 1. భారత సముదాయం

భారత సమైక్యత - వర్థిల్లుగాక - ఎప్పటికీ
భారత సమైక్యత - వర్థిల్లుగాక - జయ ! జయ !

అనుపల్లవి

ముప్పది కోట్ల ప్రజలందరికీ చెందినదీ
సాటిలేని సమైక్యత - జగాన మేటియైన ఐక్యత - వర్థిల్లుగాక !

చరణాలు

1. మనిషి మనిషిని దోచడం - ఇకవద్దు!
బాధ కలిగించు బతుకు - ఇకవద్దు !
మనకు స్వార్థ జీవితం - ఇకవద్దు, వద్దిక.
చల్లని తోటలు, విశాల భూములు నిండిన మన ఈ భూమి
— ఈ భూమి అరుదైనదీ గొప్పదీ !
పండ్లు, దుంపలు, ధాన్యాలు సమృద్ధిగా ఇచ్చేది ఈ భూమి
నిరంతరము సమృద్ధిగ పండే ఈ భూమి వర్థిల్లుగాక !

2. "ఏ జీవికిని తిండి కొరవడ కూడదు - కొరవడితే లోకము
నశియించుగాక !"
అని శాసనం చేద్దాము ! ఎప్పటికీ అనుసరిస్తాము !

3. "జీవులందరిలోన ఉన్నానునేనని శ్రీకృష్ణుడనలేదా ?"
అందరికి ఆనంద మార్గాన్ని చూపును గాక భరతదేశం,
ఔను — విశ్వమునకీదారి భారతమె చూపును గాక.

4. అందరిదొక దేజాతి — అందరి కులమొక్కటే — మనంభారతీ
యులము ! స్థాయిలో, విలువలో ప్రతి ఒకరం సమానులమే !
అందరమూ ఈ దేశపు రాజులం !
ఔను అందరమూ మనదేశపు రాజులం ! దేశం వర్థిల్లుగాక !

## 2. ఊళికూ్కతు
(ప్రళయ తాండవం)
(తాత్విక సందర్శనం)

సూచన: ప్రొఫెసర్ పి. మహదేవన్‌గారి ఆంగ్లానువాదం ఇక్కడ ఉద్ధృతము.

భారతిగారి భక్తి కవిత పరకాష్ఠనందు కొన్న గేయమిది. ఈ విశ్వవలయంలోని స్థితిగతులను ఆధ్యాత్మిక దృష్టితో పరామర్శించి, కరుణ గంభీరముగా కవితలో సందర్శింప జేసినాడు.

1. బ్రహ్మాండ గోళాలు బ్రద్దలై పిడుగులు తాళంవేయగా
శూన్యంలో రక్తదాహంతో నిండిన భూతాలు పాడగా
ఆపాటలో భావం నీ పాదధ్వనితో కూడగా
కదలి ఆడే కాళీ, చాముండీ, కంగాళీ !
అమ్మా అమ్మా
నీ తాండవం చూడనిచ్చావు నన్ను.

2. పంచభూతాలు చెదరిపోయి ఒకటిగాకలిసి,
ఆ భయదధ్వానంలో అంతర్లీనం కాగా
వెలిగే వెలుగులోమది జారిపోగా—
ముగియని నాట్యం చేస్తావు వేగముగ,
నిప్పులు కురిపిస్తావు
అమ్మా అమ్మా
శూన్యంలో నీ తాండవం చూసి మురిసిపోయాను.

3. శూన్యమైన ఆవరణకూడా బెదరి చెదరి పోగా
భూతప్రేత గణాలు విరతి నొందగా
ప్రళయమనే దయ్యం ఓహోహో అని తిరుగగా
అసహ్యించి ఉరిమి చూచి తిరిగి వస్తావు
విలయ తాండవం చేస్తావు
అమ్మా అమ్మా
నీ తాండవం చూడనిచ్చావునన్ను.

4. శక్తిభూతాలు తమ తలలు తలలు ఢీకొని
టప టప టప మని చేతులు తట్టి అచట
దిక్కులన్నిటి వ్యాపించిన నీ కంటి చిచ్చులో

మాడి నశించేట్లు చేస్తావు
అమ్మా అమ్మా
నీ తాండవం చూడనిచ్చావునన్ను.

5. కాలంతో బాటు
ముల్లోకాలు నిర్మూలమౌతాయి - అపుడు
దేవుని దివ్యకాంతి మాత్రమే వెలుగుతుంది - శివుని
స్థితిని చూచి నీ కోపం, తాపం తొలుగుతాయి
ఆయనను చేతితో ప్రియమార తాకి

ఆనంద తాండవం చేస్తావు
అమ్మా అమ్మా
నీ తాండవం చూడనిచ్చావు నన్ను.

### 3. సెన్ తమిళ్‌నాడు

1. చెన్ను మీరిన తమిళ నాడనుచు చెప్ప, తేనియ జాలయి చెవిలోన పారు,కన్నతండ్రులనాడని తలచిన చాలుశ్వాసాన నవశక్తిసంజని తమౌను.

2. వేదానికి నివాసం-పరాక్రమానికి ఆలవాలం!
దివ్య భామల వోలె నిజమైన ప్రేమతో మెదిలే యువతులు
నెలకొన్న తమిళనాడు!

3. కావేరి, దక్షిణ పెన్న, పాలారు, తమిళం కనుగొన్న
వైగై, తామ్రపర్ణి వంటి నదులెన్నో తనమీద ప్రవహింపగా
సారవంతమైన తమిళనాడు !

4. పొదిగై కొండ మీది తమిళముని*
ఎల్లప్పుడును రక్షించు నేల
భూమిపై ఎన్ని సంపదలున్నాయో
అన్నీ నెలకొన్న తమిళనాడు !

5. నీలికడలి అంచున నిలచి
నిత్య తపము చేయు కుమారి (కన్యాకుమారి) ఒక ఎల్ల,

* పొదిగై-ఒక పర్వతము (తమిళముని-అగస్త్యుడు)

ఉత్తరాన వెంకటపతి కొండ,
ఆ మధ్య వెలసిన గొప్పదౌ తమిళనాడు !

6. విద్యలో మేటి తమిళనాడు — గొప్ప
కంబన్ పుట్టిన చోటు - పెక్కు-
శాస్త్రాల వాసనలతో భువిని
పరిమళింపగ జేయునీ తమిళనాడు !

7. వళ్లువ కవిని జగతికి వరముగా నిచ్చి,
మిన్నంటు కీర్తిని పొందిన భూమి,
ఎదనులోగొను సిలప్పదికారమను
కావ్య మణిహార కారణము మా తమిళనాడు !

8. సింహళము, జావా వంటి ద్వీపాలలో
దరిదాపుల నున్న ప్రాంతాలలో
జలయాన మొనరించి పులిచెక్కములను
మరి చేపచెక్కలమునిల్పిన వీరులనాడు

9. నింగినంటెడు హిమవచ్ఛిఖరాలు
కంపింపచేసిన రాజుల భూమి !
ఘోర సంగ్రామాన కాళింగ పతుల
చీకట్లు తొట్రిల్ల జేసిన యట్టి
వీర నర పతులకావాసభూమి.

10. చైనాలో, గ్రీసులో ఖండ ఖండాలలో
వ్యాప్తిచెందిన కీర్తి వల్లరులు కలిగి—
కళలు, విద్యలు యుద్ధ నీతులు, వణిగ్
వ్యాపారముల పెంపు వాసిల్లగా
భాసిల్లినట్టి మా తమిళనాడు.

## కవిమణి దేశిక వినాయగంపిళ్లై

(సుమములు, హారాలు-కవితా సంకలనం)

### సిలువపై - రక్షకుడు ఏసు

1. ఏసును సిలువవేసి చంపవలెనని
నాశకులు గుమిగూడి నిశ్చయించారు
అయ్యయో ! త్వరలోనె అది అమలు జరిగె !

2. "మానవజాతిని రక్షింప వచ్చెనట!
తన్ను తాను కాపాడుకోలేక పోయాడు!
అతడు గర్జించె ఘోషించె - ఇపుడతనికథ ముగిసె
ఉన్నత గతి చూపవచ్చెనట భువికి,
ఇపుడు ఉన్నతమగు సిలువపై మిగిలెతాను".

3. ఇట్లెందరో అతని పరిహసించినవారు!
కాని ఆ ఉత్తముడు నోరెత్తలేదు,
స్థిమితపడి తానట నిలుచుండినాడు.

4. తర్వాత దేవుని కరుణను కీర్తించి
తండ్రీ తాను చేసేదేదో తెలుసుకోలేని
వారిని మన్నింపుమని వేడుకొనియెం.

5. అతడు తలయెత్తి దివిని చూచెను,
అతడు ఏమి కోరెనో ?
ఎవ్వరాతని తలపు తెలుసుకో గలరు ?

6. తుదకు దుఃఖమున అతడిట్లు పలికె:
" ఉంచితినీపట్ల పెనునమ్మకమును
మరచితే నీవిపుడు ఓ దేవ! నన్ను"

7. ఆ నాడు దేవుని సాహాయ్యమట వచ్చినటుల కానరాదు
అతని వేడి కోలంతయు వ్యర్థమని ఎవరైనా అనవచ్చు!

8. "నిన్ను శరణు జొచ్చితి" ననెను,
వంచిన తలతోడ నిలుచుండెగాని
తుది వరకు దేవుని మరచి పోలేదతడు.

## భారతి దాసన్ (*విప్లవకవి*)

(మరణదండన పొందినకవి, రాజుకు వ్యతిరేకంగా ప్రజలతో మొరపెట్టుకొంటున్నాడు)

10. నాకూ రాజుకు మధ్య గలిగింది వ్యాజ్యెం,
"ప్రజలే దాన్ని పరిష్కరించవలె" నంటిని నేను,
అందుకు ఒప్పుకోని రాజు ఈ అబలకూ నాకు

మరణదండన శాసించినాడు.
మేమా శాసనము వినివచ్చినామిటకు
ఈ భూమి-ఒక్క మనిషి కొఱకే అయిన
అది నశించడమే మేలు ;
ఇపుడు మేము మరణించవచ్చు! మీ కున్నదా రేపు
మీరందరను నమ్మకము ?

(రాజు పిలుపుమీద తాను రాకుమార్తెకు కవిత్వం నేర్పడానికి అనుకున్న సంగతి జ్ఞాపకం చేసుకొని ఇలా చెబుతున్నాడు).

12. "నేను తమిళ కోవిదుడనని రాజు నను పిలిపించె
తమిళ కవినని తెలిసి నన్ను ప్రేమించె నతని పుత్రి,
తమిళామృతమే నాదు నాశకారణమని తలతురో ఎవరైన?
అంతకంటెను మాతృభాషకు దుస్సహమగు అపకీర్తి ఉండునే?
అందుకే ఈ విన్నపము మీకు; నిష్కళంకము అత్యుదారము,
అపూర్వము తమిళము మీ ప్రాణసమముగ కాపాడుకొనుడు"

13. "ఇక, ఈ సింహాసనానికి వారసురాలు రాకుమార్తె
ఆ హక్కు నష్టుకొను అధికారమెవరిది? ప్రజలదా కాక ఆరాజుదా?
ధర్మ తిరస్కృతి కావించె రాజనుట నాదు నిశ్చయమగును!
కరఖండనక్రియ రాజుకు క్రీడ; అత్యల్ప విషయము—
కాని మనకది ప్రాణాంతక వ్యథ,
సింహాసనము తానాక్రమించిన నాడు
ప్రజలను ఈ భువికి ప్రభువులుగా చేయ
నెంచినది రాపుత్రి యని మీరలెరుగుదురె?

14. "అయ్యో! ఇపుడామెకు మరణశిక్ష! ఆమెను రక్షించండి!
'నా ప్రియమైన భూతలమా! నా చక్కని దేశమా!
నీ కీర్తిని,-నీపై వేగంగా పారే సెలయేటిని, ఉన్నతనగమును,
మకరంద సుగంధిల వనాలను. ఇంకా ఎన్నిటినో
తమిళ కవితలో వర్ణించాలను కాంక్షాగ్ని ఆఱగిపోనిది।
ఆ కాంక్ష ఎప్పటికీ ఆ విధంగానే ఉండనీ।
నా దేహం ముక్కలు చెక్కలైనా, రక్తం వెల్లువై పారినా
ఆ కాంక్ష ఎప్పటికీ ఆ విధంగానే ఉండనీ!''

15. "వర్ధిల్లు నా మంచి దేశమా-బంగారు దేశమా!
సజ్జనులు, సత్యవంతులు తమ హక్కులతో వర్ధిల్లెదరు గాక!

దివినుండి భూమి పైదికి విరిగిపడే ఉల్కలాగు
ఈ క్రూర నియంతృత్వం తనంతట నశించు గాక!
మహా పురుషులారా, వనితలారా, తండ్రులారా! తల్లులారా!
కడసారిగ అందరికీ అందరికీ మొక్కుచుంటి మనసారా!
నే పోతున్నా; నా రక్తం ఈ ప్రియభూమిలో గాఢంగా
ఇంకనీ!"
ఖడ్గహతికి సిద్ధముగా తలవంచెను ఆ కవి
పొంగి లేచిరి ప్రజలంతట, తమ్ముతాము కాపాడుకొనగ
తలవరులును పారిరి తలకొక దిక్కుగ నప్పుడు.

17. కవినీ అతని సఖినీ ప్రజలే విడిపించినారు
నరపతికి పంపిరి సందేశం ఈ విధముగ
"కాజాలడు మా పాలకుడిక నెన్నడీ నృపతి."
స్థితి గతులెరిగిన రాజప్పటికే తరలిపోయె.

అన్ని హక్కులు జనులవేనని,
సర్వసంపదలు ప్రజలదౌనని,
ఇక కీడు చేసే వారు లేరని
క్రొత్త శాసనం కలిగెనప్పుడు
అంతటా శాంతి సుఖములు కలసి వచ్చె.

(ఎన్. వానమామలై సంకలనం నుండి)

## జానపద గేయాలు

*"నీటిలో మలినమే లేదు"*

గట్లను కోస్తూ మెలికలు తిరుగుతూ
మెరిసే నీలజల మది పారును
సుళ్ల తిరుగుతూ, సఖీ! కావేరిలో!
వెండి లాగు మెరిసే-ఆ నిర్మల జలము
పానానికి స్నానానికి కడవలు కడవలుగా
మోసి కొనుచు పోతున్నారటు చూడుము, నాప్రియా!
ఈ నీటిలో మాలిన్యం ఇంచుకైన కానరాదు-
ఈ నీటిని దాచు కొనుట కెవ్వరి తరముగాదు!

బాల బ్రాహ్మణునికి చల్లనిదే,
ఫాదిరికిని చల్లనిదే. (ఫాదిరి=Parish)

ఈ చిన్న పల్లెలో పాదిరి నుండీ పాలుని దాకా,
రాజు నుండీ బంటుదాకా, కులాలెన్నో, తరగతులెన్నో!
కాని అందరికీ పూజనీయము ఈ చల్లని నీరే!
వారి సంఘర్షణలన్నీ ఈ చల్లని నీటి కొరకె!
నిజానికి, ప్రవహించే ఈ చన్నీరే
మన పాలిటి దేవత, సఖి!

**లాలిపాట**

నిదురపో, ముత్యమా! నాతపః ఫలమా!
నిదురపో, నెమ్మదిగ నిదురపోవయ్యా

విశాల జగతి నాథుడవు,
చక్కగా చెక్కించి పూలతో నించిన ఉయ్యాలలో ఊగి
నిదురపో! నా శిరోరత్నమా! నే పాడెద! నిదురపో!

ఎందుకీ కన్నీరు? ఆపవే నా పాప!
ఎవరు కొట్టిరి నిన్ను లాలించు చేతితో,
కనుమూసి నిదురపో, కనుపాప! ముత్యమా!

కమ్మగా తినిపించు తల్లి నినుకొట్టెనా?
బుజ్జగించెడు చేత అక్కయ్య కొట్టెనా?
పాలిచ్చి పాలించు అవ్వ నిను కొట్టెనా?
పూగుత్తితో మామయ్య కొట్టెనా?
కాటుక తీర్చేటి అత్తమ్మ కొట్టెనా?
చెప్పవయ్యా తండ్రీ! చెప్పరా బాబు!
చెప్పి నీవూ చక్కగా నిదుర పోరా!

[మధురైలోనివళ్లవారి(హరిజనుల) పాట]

ముక్కూడల్ పళ్లు

(తప్పుదారి తొక్కిన భర్తపై భార్య నింద)

1. దొరా వీడు నన్ను మోసగించె
చేప అని తోకనూ, పాముని తలనూ
చూపించే మోసగాడు వీడు!
తేనె కలిపిన రెట్టించు తీపిని
అట్టుమా ఇర్వురి సంపదలు కలిపి,

కస్తూరి పసుపుగా వేరొక పడతికి ఇచ్చె
అవతలదాని చింతముద్దకోసం ఆహుతి చేసినాడు ;
తాను చెడినాడు - నేను నడివీథి పాలైతి,
అవమానం నా పాలు - బహుమానం దానిపాలు;
ఇతనికాళ్లు ఇక్కడ నిలవనే నిలవవు,
కలనైనా ఆ చోటు మరచిపోకున్నాడు;
దేవుడైన "అళగర్" మా బ్రదుకుకు జీవం,
అతడే నింగికీ నేలకూ రక్షకుడూ
అతని సేవకు వీడు కావలసి వస్తే
దొరా ! శిక్షించి దారిలో పెట్టవలె వీని.

2. పదుగుర తిట్లకై పుట్టెనా వీడు ?
సిగ్గన్నదే విడిచి పెట్టెనా ఏమి ?
పచ్చని పడతుల వలపులకై పడిచచ్చు,
నా సొగసులీ వఱకె నాశపఱచెను వీడు,
వంతెనను ముంచి పారింది వెల్లువ,
ఇంకే విధముగా తెలియజెప్పను నేను ;
నాగలిని చేపట్ట మరచెను వీడు,
చేపట్టిన నన్ను చూచి ఇగిలించుట కూడమానె,
నిప్పువలని గాయమారి పోవునుగాని,
నాలుకవలని గాయమారదెన్నడును.
నేను వీని ముఖం మీదనే "ఛీ" అన్నాను !
నా మోము వానికిక చూపజాలను నిజము;
దయతలచి వానితో మాటాడి చూడండి.
కర్ర దిమ్మకూడ ఉలిమొనకు వశమౌను !
చెట్టుబోదెకట్టి, కొట్టండి వీనిని ;
భయమన్న నేమొ తెలుసుకోనీయండి !
మా మంచి దొరా ! ఇదే నా మొర !

*వీరగాథలు*

## 1. దేసింగు రాజుకథ

(యుద్ధంలో)

ఇరవై వేలకు గుర్రపు రౌతులు దౌడు తీసి వస్తున్నారు—
తనదు కండ్లతో దానిని చూచెను రాజాదేసింగు.

ఆ రాజు మీసం అదరింది; అతని గుర్రం
"సరాసరి" వేగంగా తిరిగి ఎగిరింది.
నవాబు సేనలు నేల కూలె- ముక్కలు ముక్కలుగా తునిగి;
అతని గుర్రాలు కూలిపోయె-కకవికలుగా చెదరి;
ఇరవై వేల గుర్రాలు చెదిరె-చిందర వందరగా.
ఏనుగులాటలో మురిసిపోయెనట ఆ రాజా దేసింగు
ఇనుప గుదియతో పట్టపేనుగు మాటిమాటికీ కొట్టింది
తక్కిన ఏనుగులు వడిగా తిరిగి తిరిగి వచ్చినవి
ఆ ఏనుగులు ఘీంకరించినవి ఎంతో బిగ్గరగా
కాని గుర్రం "సరాసరి" వాని పైననే ఎగిరింది
పట్టపేనుగు నెత్తిమీదుగా దూకింది తాను
ఒరలో నున్న కత్తిని దూసెను రాజా దేసింగు
శత్రువులు కింది కొరిగేటట్లుగా గాఢంగా కొట్టె
ఇనుప గుదియతో కొట్టినందుకు వందన మొందె పట్టపేనుగు
కొన్ని ఏనుగులు నేలపై కూలి దుమ్మును కరచినవి
పేగులు చినిగీ, బద్దలై పోయి కొన్ని నశించినవి
తలలు పగిలిన మదపుటేనుగులు మరణించినవానాడు
కాళ్ల గిలగిల తన్నుకొని కొన్ని చావుపాలైనవి
ఈ విధంగా చిందర వందరఐనవి ఇరవై వేల ఏనుగులు!
దీని నంతటిని చూచినాడ యా రాజా దేసింగు।
ఒక ఏనుగు మీది మావటి వానిని అతడు చూచినాడు
పెద్ద పెట్టున గొల్లు మని నవ్వినాడు అతడు
ఎడమకాలి మడమ చీలతో గుర్రం డొక్కలో పొడిచె
అంతే! "సరాసరి" ఎగిరి ఏనుగుపై ముంగాళ్లు మోపింది
రాజు కత్తిదెబ్బ తగలగా నేలకూలె మావటివాడు
కత్తి వాని గుండెల గుండా దూసుకొని పోయె!
జయ జయ! రాజా దేసింగు!

## అల్లి అరసాని మాలై
### (అల్లి రాణి కథ)

ఓహోహో, పాండ్య పౌరులు పరభూములకు తరలి పోతున్నారు।
మధుర నగర సీమలలోవర్షాలె లేవు।
జల్లైనా పడలేదు దక్షిణ మధురాపురిలో

చినుకులైన చినకలేదు చొక్కని* మధురలో
ఎండి వరుగై పోయె మధురా నగర మంతా
కాలి పొగలు రేగింది తడి అనే మాటలేక
తాగేందుకు నీరులేదు కొలనుల్లో మడుగుల్లో
కాకి తాగేందుకైనా గరిటనీరు పుట్టదు!
నదులు, కొలనులు అడుగుదాక ఎండినవి
చెరువులు అడుగంటినవి
అడుగులోతుదాక భూమిలో వేడిపుట్టి
పైకినిప్పులు చెరిగె
పంటలు లేవీ రాజ మధురలో
దొంగతనాలసలు లేవు ఘనమౌ మధురాపురిలో
భూమి మీద దట్టంగా దుమ్ము పేరు కొంది
చిగురించిన చెట్లన్నీ ఎండుటాకులవలె రాలినవి
భూమి ఎండినది గడ్డయినాలేదు,
పాండ్యుని దేశంలో పశులు లేనే లేవు
వెరపునెరుగని మధుర ఇండ్లపై జెండాలెగిరేవి.
కూటికి పేదలై పరదేశం పోతున్నారు అక్కడి ప్రజలు
అందమైన మధురలో అన్నం సున్న అయింది.
మధురచుట్టు ఉన్న మహావనాలు మొక్కలన్నీ
మోడులై మాడిపోయి మసి బొగ్గు లౌతున్నవి
నిలిచేందుకు నీడలేదు నేడు మధురాపురిలో
ఊరిలోనే ఉన్నవారు నిద్రల పాలైనారు
పాండ్య దేశప్రజల మోములు పాడుపడినట్లున్నవి
కడుపు విచారమే చాలా ఘనమై పోయింది
పంద్రెండు ఏండ్లక్కడ కరవు నిలిచిపోయింది
శరీరాలు వెలవెల పోగా కండ్లు గుంటలు పడగా
పురుషులు పిల్లా జెల్లతో భార్యలతో
దిక్కులేక తలకొక్క దిక్కుకు చెదరిపోయినారు!

*చొక్క నాథ స్వామి

## పుదుమైప్పిత్తన్

### (కథానికా సంకలనము)

### వీధి దీపము

వీధి చివర మలుపులో ఒక మునిసిపల్ దీపం ఏ తోడూలేక ఒంటరిగా ఉంది. తన మసక వెలుతురు ప్రసరించడానికి ప్రయత్నిస్తూ అది బతికింది. యౌవనం, వృద్ధాప్యం, మరణం-ఇది మానవుడే గుత్తకు తీసుకొన్నవికాదుకదా ! అందువల్ల ఆ వీధి దీపానికి కూడా ఇప్పుడు ముసలితనము.

ఆ రాతి స్తంభం కొద్దిగా వాలిపోయింది. మీద ఉండే గాజు షేడు ఒకవైపు చీలిపోయింది. ఆదేదో ఆట అయినట్లు రాళ్ళు విసిరే తుంటరిపిల్లవానికి దీపం బాధపడుతుందని తెలుసా ? గాలి ఒక దెబ్బతో దాని ప్రాణం తీసిందా ? లేదు. దాన్ని భయంకరంగా బాధించి బాధించి సగంచచ్చిన స్థితిలో వదలిపోతుంది. గాలి దయతలచినప్పుడైనా ఆ దీపం మసక వెలుగు నివ్వగలుగుతున్నదా ? అదీ లేదు ! వానలో దానికి జలుబుచేసినప్పుడు దాని సంగతి పట్టించుకొనే నాథుడెవడు ?

గాలి కిది తెలుసా ?

"ఈ ప్రాంతంలో ఈ దీపం అవసరంలేదు—దీన్ని పడగొట్టవలె" అంటారు వాళ్ళు.

దానికి ఒక స్నేహితుడుకూడా ఉన్నాడు. అతడొక ముసలివాడు !

సమాన వయస్కుల మధ్యనే స్నేహం పుట్టుకొని వస్తుంది.

ఇందులో ఆశ్చర్యం కలిగించేదేముంది ?

దీపానికి ముసలివాడు.

ముసలివానికి దీపం.

వాళ్ళు ఆ దీపాన్ని తొలగించబోతున్నారని ముసలివానికి తెలియును. అతనికి ఎట్లా తెలుస్తుంది ?

అతడు తన తిండికోసం బిచ్చమెత్తుకోవద్దా ?

తిండి లేకుండా బతకడమెట్లా ?

వీధి దీపం అతని నేస్తమనే మాట నిజమే.

అయితే దాని వెలుగువల్ల అతడేమి సుఖపడినాడు ?

ఆ సాయంకాలం అతడు వచ్చినాడు.

అక్కడింక ఖాళీ గుంతమాత్రం ఉంది.

చీకటి ! చీకటి !

తన చేతిలో దారి తెలుసుకోడానికి ఉంచుకొన్న ఊతకర్రను ఎవరో లాక్కొని పోతే దిక్కు తెలియక అవస్థపడుతున్న గుడ్డివాని స్థితి! అనాడు ప్రపంచం-శూన్యమూ పనికిరానిదీ అర్థం లేనిదీ అయింది.

మనశ్శాంతి?

అది ఎక్కడినుండి వస్తుంది?

అది బీటలు పడిన వీధిదీపమే; కాని అది అతనిని కొంతయినా ఓదార్చుతూ వుండేది. వెలుగు లేకున్నా, తాకి చూచి ఆనందించడానికి రాతిస్తంభమైనా ఉండేది.

ఆ మరునాడు ఉదయం అటువైపు పోయిన వారికి ఒక
ముసలివాని శవం కనిపించింది.

ఇప్పుడక్కడొక కొత్త దీపం!

ఎల్లక్ట్రిక్ దీపం!
పిల్లలు దాని చుట్టూ ఆనందంగా ఆటాడుకొంటున్నారు.
పాత దీపం గురించి, ముసలి వాళ్ళ గురించి వాళ్లెందుకు పట్టించుకోవలె.
ఒకనాడు-వాళ్ళలా ఆ చిన్నపిల్లలూ ముసలి వాళ్ళవుతారు.
అయితే నేం.
ఎక్కడైనా, ఎప్పుడైనా ఇది ఇంతే.
పాతవి తొలగి పోతాయి. కొత్తవి వస్తూంటాయి.
ఇదే ప్రపంచ స్వభావం!

## వచనభాగము

### *ఆధునిక యుగము*

### మరైమలైఅడిగళ్

### పట్టినప్పాలై-ఒక వ్యాఖ్యానము

వ్యక్తీకరణ సంగ్రహంగా ఉన్నా, విషయంలో సుసంపన్నమై ఉండి శ్రావ్యంగా కూడా ఉండే పద్యం ఆనందం కలిగిస్తుంది. ఈ సంగతి ఒక ఉదాహరణ ద్వారానే స్పష్టం కాగలదు. కాబట్టి మనం ఇప్పుడు మాణిక్కవాచకర్ స్వామి వ్రాసిన "తిరుచ్చిట్రం బలక్కోవైయార్" అనే రత్నాలగని నుండి ఒక అపూర్వ రత్నాన్ని ఎన్నుకొని ప్రదర్శిద్దాము.

x x x x x x x

చివరి రెండు పంక్తుల భావం ఇది: "నా కంటి పాపా! ఈ వేళ నేనొక కొండ దారి వెంబడి రావడం తటస్థించింది. నేను అలా వస్తుండగా, మండుతున్న కండ్లున్న ఒక పెద్దపులి నన్ను సమీపించి పంజాలు విప్పింది. అయితే నేనొక క్షణంలో రక్షింపబడినాను! పులి మీదికి బల్లెం విసిరిన ఆ వీరయువకుని నేర్పును ఏమని వివరించగలను?"

ఈ మాటలు ఒక చెలికత్తె నాయికతో అన్నవి. ఈ మాటలు వినిన నాయిక మొదట సహించలేక నీరసిల్లి పోతుంది. ఆ తరువాత ఆమె ఊరడిల్లి ఈ విధంగా భావిస్తుంది:

"హా ! నా వలపుకాడు మాత్రమే దీనురాలైన నాకోసం
ఈ కొండల ప్రాంతాలలో సంచరిస్తాడు ! అతడు తప్ప ఇంకెవరూ
ఈ ప్రాంతాలకు రాలేరు! ఆ పెద్దపులి అతనిని దెబ్బ కొట్టి ఉండే"?

నాయిక ఈ విధంగా గాఢంగా ఆలోచించవలెననీ, చింతించవలెననీ ఆ చెలికత్తె తెలివిగా ఎంత అస్పష్టమైన మాటలను ప్రయోగించింది! ఇది తప్పక ప్రశంసార్హం కదా!

## తిరు. వి. క. (తిరు. వి. కల్యాణ సుందరనార్)

వ్యాసము

### భారతదేశము—స్వాతంత్ర్యము

భారతదేశాన్ని కులతత్త్వ పిశాచం ఆవరించి చాలాకాలమైంది. ఆ కులపిశాచం సంస్కర్తల ఉద్యమాలను—చివరకు బుద్ధుని ప్రయత్నాలను కూడా-మ్రింగి జీర్ణించు కొనింది. పెక్కురు బుద్ధిమంతులు ఇటువంటి విషయాన్ని తొందరగా వెళ్ళగొట్టడం అసాధ్యమను కొంటున్నారు. కాలగతిని గురించి ఆలోచించవలసిందని వారిని ప్రార్థిస్తున్నాను. కుల పిశాచాన్ని తరమగొట్టడానికి తగిన ప్రయత్నం ఇప్పుడే చేస్తే కాలశక్తి తనంత తానే దానికి సాయపడడానికి సిద్ధమై నిలవగలదని స్పష్టం కాగలదు. చేయనున్న కృషిని సక్రమ మార్గంలో వినియోగించడం మాత్రం అవసరము.

సౌజన్యవిప్లవం - కాలానుగుణమైన ప్రయత్నాల ఫలితంగా ఉదయిస్తుంది. మొదట సౌజన్యవిప్లవానికి తగిన ప్రయత్నాలను మాత్రమే చేయవలె. ఇది నిష్ఫలమని తేలిపోతే దౌర్జన్యపూరితమైన విప్లవం తనంత తానుగా పుట్టుకొని వస్తుంది. అయితే దౌర్జన్యం తల ఎత్తేటట్లు కృషి చేస్తే మాత్రం అందుకు ప్రకృతిసాయపడదు.

ప్రయత్నాలను ఏ పద్ధతులలో ఏ విధంగా చేయవలెనో వివరిస్తూ ఒక పుస్తకం నింపి వేయవచ్చు. ఇక్కడ దాని సారాన్ని-దాని జీవాన్ని-ఒక్కగా నొక్క విషయం ద్వారా పరామర్శిస్తాను. ఇది-"వర్ణాంతర వివాహము". "వర్ణాంతర వివాహం" కులం వల్ల కలిగే ప్రత్యేకతా భావాన్ని క్రమేణ నాశనం చేయడమే కాక కొంత కాలానికి కులపిశాచాన్నే కిందికి పడగొట్ట గలదు.

'వర్ణాంతర వివాహం' ప్రకృతిని బలపరుస్తుంది. అది దేవునికి ఇష్టమైన విషయమే. ఆది శైవ బ్రాహ్మణుడైన సుందరమూర్తి నాయనార్ సవర్ణ వివాహం చేసుకోడానికి పూనుకున్న వేళ భగవంతుడు దాన్ని అడ్డగించి అతనిని "వర్ణాంతర వివాహం" చేసుకోమని చెప్పడం ఇక్కడ పేర్కొనతగింది.

భారతమాతను బంధించిన లెక్కలేని సంకెళ్ళలో ఒకటైన కులతత్వపు సంకెలను పగులగొట్టడానికి "వర్ణాంతర వివాహం" చక్కని పనిముట్టు. కనుక-యువతులారా ! పీర యువకులారా ! లెండు ! లెండు ! వర్ణాంతర వివాహపు ఉత్సాహంతో లెండు!

ఇందుకేమి కావలె? బంగారం, తక్కిన సంపదకావలెనా? తుపాకులు, ఆయుధ సామగ్రి కావలెనా? వద్దు. అక్కరలేదు. పట్టుదల కావలె; ధైర్యంకావలె; భారతమాత స్వాతంత్ర్య సంపాదన కోసం మీరు భయంకర యుద్ధం లేవదీయవలెననడంలేదు ప్రకృతిమాత. ఆమె మీరంతా వర్ణాంతరవివాహం పట్ల స్థిరమైన పూనిక కలిగి ఉండవలెనని కోరుతున్నది. మీరామె పిలుపును పాటించరా? యువజనులారా! లెండు. వర్ణాంతర వివాహాన్ని గురించిన పట్టుదలతో లెండు! ఒకటి కండు! గుంపులుగా ప్రోగుకండు! మీరుకలసిలేస్తే కులపిశాచం జుట్టూడి పారిపోతుంది. కులతత్త్వపిశాచాన్ని పారదోలడానికి తగిన నేర్పు, స్థైర్యం, శక్తి మీకు ఉన్నవి; కావలసినది పట్టుదల ఒకటే. దానిని గురించి ఆలోచించండి!

## చక్రవర్తి రాజగోపాలాచారియార్ (రాజాజీ)

### కథానిక (నీతికథ)

## వేపమొక్క తపస్సు

ఒకపురాతనమైన వేపచెట్టు. దాని ప్రక్కనే ఒక చిన్న వేపమొక్కకూడా ఎదుగుతున్నది.

"అమ్మా! నేనుకూడా నీలాగే చేదుగా పెరుగుతానా?" అని అడిగింది మొక్క.

"మరి ఇంకెట్లా పెరగ గలవు? నీవు ఆలాగే పెరుగుతావు.

ఏం నీకది ఇష్టంలేదా?" అంది ఆ పెద్దవేపచెట్టు.

"నీ దగ్గరకు వచ్చే వాళ్లంవరూ మందుకో, మంత్రానికో మాత్రమే వస్తున్నారు. ప్రేమతో నీదగ్గరకు వచ్చే వాళ్ళనెవరినీ నేను చూడలేదు" అని చెప్పింది మొక్క.

"మందు మంత్రం మాత్రమే దుఃఖాన్ని నయం చేస్తాయి; తియ్యని పండు ఏమివ్వ గలదు? అది అంతులేని ఆనందాన్ని ఇవ్వజాలదు.

నాకు నా పరిస్థితే సంతృప్తికరంగా ఉంది. నీవు కూడా అట్లే ఉండు బిడ్డా" అన్నది తల్లి చెట్టు.

"నాకొక గొప్పకోరికఉంది-నేను సొగసైన కరివేపాకు మొక్కగా కావాలను కొంటున్నాను" అన్నది వేపమొక్క.

"బిడ్డా! ఓర్చుకో! నీవు నాలాగే ఆనందంగా జీవించగలవు. మనకు ఇతరుల ఆనందాలు లేకపోవచ్చు. ఇతరుల ఆనందాలను చూడడం వల్ల, అటువంటివి కోరడం వల్ల కీడు మాత్రమే కలుగుతుంది" అని బోధించింది పెద్ద చెట్టు. చిన్న మొక్క ఆమాటలను పట్టించుకోలేదు.

"నేను వేపచెట్టునుకానే కాబోను" అని అది నిర్ణయించుకుంది. గణపతిని వేడు కొని వరం సంపాదించింది. ఆ వేప మొక్క కరివేపాకు మొక్కగా పెరగ సాగింది.

అది మూడడుగుల ఎత్తయినా పెరగకముందే ఇరుగు పొరుగున ఉన్న వాళ్లు వంట కోసం కరివేపాకులు గిల్లడం ప్రారంభించినారు. కొందరు కొంత దయతలచి ముదు

రాకులు మాత్రమే గిల్లినారు. కొందరు కొమ్మలకు కొమ్మలే విరిచేవారు. కొందరు లేతాకులు మాత్రమే కోసేవారు; దానివల్ల వంట రుచి పెరుగుతుందని వారి ఉద్దేశం.

ఒక మేక మొక్కలో మిగులంటూ ఉన్నదాని నంతా ఒకనాడు తినిపోయింది. అయితే ఆ వేపవేరు మాత్రం భూమికింద ఉండగలిగింది. గణపతి వరం వేరుదాకా వ్యాపించలేదు.

ముందు ముందు ఏమి కానున్నదో గణేశ్వరునికి మాత్రం తెలియదా?

"అమ్మా! నాకిప్పుడు తెలివి వచ్చింది!" అంది వేరు-తల్లి చెట్టు వైపు చూసి దుఃఖంతో సన్నని గొంతుకతో.

"నీవింకా ప్రాణాలతో ఉన్నావా బిడ్డా?" తల్లి చెట్టు అడిగింది.

"అమ్మా! ఇదిచాలు. నాది తెలివి తక్కువైన కోరిక. చేదు చెట్టుగా ఉండడమే మంచిదని తెలుసుకొన్నాను. నాకు బతికే మార్గం చెప్పు" అన్నది వేరు.

"తిరిగీ గణేశునే ప్రార్థించు" అని బోధించింది చెట్టు.

"నేనూ నీకోసం ప్రార్థిస్తాను" అని, వేపచెట్టు బిడ్డతరఫున నిండు భక్తితో ప్రార్థించింది. వేరు చిగురుతొడిగింది. వేప మొక్క తిరిగీలేచి ఎదగసాగింది.

మనుష్యులు మళ్లీ ఈ మాటు కరివేపాకులకోసం వచ్చారు. అది చేదుగా ఉండడాన్ని చూచి తిరిగిపోయినారు. మొక్కను పెరగనిచ్చినారు. గ్రామంలోని కోళ్లు వచ్చి మొక్క ప్రక్కనున్న మట్టిని కెలికి పొడిచి పోయినవి. అవి పురుగులు వెదకడానికై అట్లా చేసినవి. కాని అది మొక్కకు మేలుగా పరిణమించింది. అది వేగంగా పెరిగింది. దాని లేత మొగ్గలను తుంచడానికి ఎవరూ లేరు. సంతోష సూచకంగా తల్లి చెట్టునుండి కూడా దానిపై పువ్వులు జలజలా రాలినవి.

# తెలుగు


మూలం :
డా॥ దివాకర్ల వేంకటావధాని

అనువాదం :
శ్రీ మిరియాల రామకృష్ణ


## చారిత్రక సమీక్ష

తెలుగుభాష ఉత్పత్తిని గురించి రెండు రకాల వాదాలున్నాయి. ప్రాచీనాంధ్ర కవులు, ప్రాచీనాంధ్ర వైయాకరణులు ఈ భాష సంస్కృత ప్రాకృత జన్యమని అన్నారు. మొట్టమొదటి తెలుగు వ్యాకరణమైన "ఆంధ్ర శబ్ద చింతామణి" లో

*'ఆద్యా ప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషా తయోర్భవేద్వికృతిః'*

అనే కారిక ఈ అభిప్రాయాన్ని స్పష్టంగా చెబుతున్నది. ఈ నాటికి కూడా ఈ అభిప్రాయాన్నే బలపరచేవారు కొందరున్నారు. కాని ఈనాడు భాషా శాస్త్రవేత్తలు చాలామంది డా॥ కాల్డ్‌వెల్‌గారి సిద్ధాంతాన్ని సమర్థిస్తున్నారు. దక్షిణ భారతదేశంలో వాడుకలో ఉన్న తెలుగు మొదలైన భాషలు ద్రావిడ భాషా కుటుంబంలోనివనీ ఈ భాషలన్నింటికి మూలమైన ఆది ద్రావిడభాష ఒకటి ఉండేదనీ అది అత్యంత ప్రాచీనమైనదనీ డా॥ కాల్డ్‌వెల్ గారు ప్రతిపాదించిన సిద్ధాంతము.

తెలుగు భాష క్రీ. శ. 1వ శతాబ్దినాటికి ప్రాథమిక దశలో ఉండి ఉంటుందని పరిశోధనల వల్ల తెలుస్తున్నది. క్రీ. శ. 1వ శతాబ్ది నాటికి సజీవంగా ఉన్న మూల ద్రావిడభాషకు తెలుగు కూడా ఒక ప్రత్యేక మాండలికంగా ఉంటూ స్వతంత్రంగా ప్రజల వ్యవహారంలో ఉండి ఉండవచ్చు. ఈ విధంగా క్రీ. శ. 1వ శతాబ్ది నాటికే ప్రజలు తెలుగు మాట్లాడుతున్నట్లు నిరూపించడానికి సాక్ష్యాలున్నాయి. కాని, తెలుగులో మొట్టమొదటి శాసనం మాత్రం క్రీ.శ.ఆరవ శతాబ్దిలో కనిపిస్తున్నది. ఆనాటి తెలుగు శాసనాలలో ప్రాకృతపదాలు ఎక్కువగా ఉన్నప్పటికీ తరవాతి కాలంలో క్రమంగా పాకృత పదాలకు బదులు సంస్కృత పదాలే వాడటం కనిపిస్తుంది. క్రీ.శ. తొమ్మిది, పది శతాబ్దాలలోని కొన్ని శాసనాలలో తెలుగులో రచించిన పద్యాలు కూడా కనిపిస్తున్నాయి. ఈ పద్యాలన్నీ దేశిచ్ఛందస్సులోనే ఉన్నాయి. దీనిని బట్టి దేశిచ్ఛందస్సులలో ఆనాడు కొన్ని కావ్యాలు వెలువడి ఉండవచ్చునేమో! అని పరిశోధకులు ఊహిస్తున్నారు. పాల్కురికి సోమనాథుడు (13వ శతాబ్ది) దేశికవితా విశేషాలయిన కొన్ని పదాలను పేర్కొని ఉండటం ఈ ఊహను బలపరుస్తున్నది. ఆ పదసాహిత్యము కాలగర్భంలో కలిసిపోయి ఉంటుంది. ఆనాటి తెలుగుభాష కూడా ద్రవస్థితిలోనే ఉండేది. ఒకే పదాన్ని భిన్న రూపాలలో భిన్న ప్రాంతాలలో ప్రజలు వాడుతూ ఉండేవారు. ఆ భాషకు ఒక స్థిర రూపాన్ని కలిగించినవాడు నన్నయభట్టు. చాళుక్య వంశీయుడైన రాజరాజు పోషణలో ఉన్న

నన్నయభట్టు ఆ రాజు కోరికను అనుసరించి సంస్కృత మహాభారతాన్ని తెనిగించడానికి పూనుకొన్నాడు. ఈ మహాకావ్యానికి పూర్వరంగంగా సంస్కృత పదజాలాన్ని తెలుగులో వాడుకోవడానికి కొన్ని సూత్రాలను ఏర్పరచుకొన్నాడు. ఈ లక్షణ రచనవల్ల తెలుగుభాష సుసంపన్నం కాగలిగింది. అందువల్లనే నన్నయభట్టు "ఆదికవి" అయినాడు. ప్రాచీనాలంకారికులు ప్రవచించిన సాహిత్య సూత్రాలను పాటిస్తూ సలక్షణమైన తెలుగుభాషలో ప్రశస్తమైన కావ్యాన్ని రచించిన మొదటికవి అని మాత్రమే ఈ "ఆదికవి" అనే బిరుదుకు అర్థం.

"దేశభాషలందు తెలుగు లెస్స" అనే భావాన్ని "ఆముక్తమాల్యద"లో సుప్రసిద్ధ రాజకవి శ్రీకృష్ణదేవరాయలు ప్రకటించినాడు. ప్రాంతీయ భాషలలో తెలుగుభాష మేల్తరంగా ఉందని ఈ వాక్యానికి తాత్పర్యము. ఈ వాక్యము క్రీడాభిరామంలో కూడా కనిపిస్తున్నది. క్రీడాభిరామాన్ని కవిసార్వభౌమ బిరుదాంకితుడైన శ్రీనాథుడు రచించినాడంటారు. అతడు 14వ శతాబ్ది ఉత్తరార్థంవాడు. శ్రీనాథుడు కాని, శ్రీకృష్ణదేవరాయలు కాని తెలుగుభాష మీది పక్షపాతం వల్లనే అట్లా చెప్పి ఉంటారని కొందరనుకోవచ్చు. కాని బ్రిటిష్‌వారు మనదేశాన్ని పాలించిన కాలంలో ఉన్నతోద్యోగాలు చేసిన విదేశీయులెందరో దేశభాషలను నేర్చుకొని, వాటన్నింటిలోను తెలుగుభాష మధురంగా ఉన్నట్లు అభిప్రాయపడినారు. "ప్రాచ్యదేశాల ఇటాలియన్ భాష" అని తెలుగును ప్రశంసించినవారు ఆ విదేశీయులే!

ప్రథమాంధ్ర కవి అయిన నన్నయభట్టు మహాభారతాంధ్రీకరణానికి శ్రీకారం చుట్టినాడు. కాని ఆయన పూర్తిచేయగల్గినవి భారతంలోని రెండున్నర పర్వాలు మాత్రమే! ఆ తరవాత రెండు శతాబ్దాలపాటు భారతరచన నెవరూ చేపట్టలేదు. తిరిగి ఆ అనువాదాన్ని కొనసాగించినవాడు తిక్కన. తిక్కన కవిబ్రహ్మ బిరుదం గలవాడు. తుది పదిహేను పర్వాలు తిక్కన తెనిగించినవే! మూడవదైన అరణ్యపర్వంలోని ఉత్తరార్థాన్ని పూరించినవాడు ఎఱ్ఱాప్రగడ. ఇతడు పధ్నాలుగో శతాబ్దివాడు. నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడలను ముగ్గురిని కలిపి కవిత్రయమని వ్యవహరిస్తారు. అనంతర కవులెందరో కవిత్రయాన్ని అనుసరించినారు. వారంతా కవిత్రయంపట్ల ప్రదర్శించిన గౌరవం అతివేలమైనది. కవిత్రయం వారి అనువాద పద్ధతి విలక్షణంగా ఉంటుంది. వారు మూలకథను అతిసన్నిహితంగా అనుసరిస్తూ అనువదించిన మాట నిజమే. కాని వారి అనువాదం మాత్రం యథాతథానువాదం కాదు. ఔచిత్యం కోసం వారు కొన్ని ఘట్టాలను పెంచి వ్రాసినారు. కొన్ని సన్నివేశాలను తీసివేసినారు. కొన్ని చోట్ల నూత్నకల్పనలను చేర్చినారు. అవసరమనిపిస్తే, కొన్నిచోట్ల స్వతంత్రమైన వర్ణనలను చేసినారు. ఈ విధంగా కావ్యానికి పుష్టి కలిగించడం వారి ధ్యేయంగా కనిపిస్తుంది. సంస్కృత మూలంలో అతిదీర్ఘాలుగా ఉండే తాత్త్విక విషయాలనూ నీతి బోధక విషయాలనూ, తెలుగులో సంక్షేపించినారు కూడా. ఇట్లా అనువదించడంవల్లనే ఇతిహాసంగా పేరు పొందిన సంస్కృత భారతము తెలుగులో రసవంతమైన ఒక కావ్యంగా రూపొందింది. తెలుగు భారతము ఒక ప్రక్క సంస్కృత మూలంలోని సారాన్ని తెలుగువారికి భద్రంగా అప్పగించడమే కాకుండా మరోపక్క అనువాదమనే సంగతిని మరిపిస్తూ స్వతంత్రమైన కావ్యంవలె అలరిస్తున్నది. అందువల్లనే కవిత్రయం వారి అనువాదపద్ధతిని ఆ యుగంలోని కవులంతా అనుసరించినారు. అనుసరించి సంస్కృతంలోని పురాణాలను కూడా తెలిగించడం మొదలు పెట్టినారు. అది మొదలుకొని "అనువాదాలయితే నేమి, అవి కూడా సాహిత్య సరస్వతికి అమూల్యమైన

అలంకారాలే" అనే అభిప్రాయం నాటుకొన్నది. మారన తెనిగించిన మార్కండేయ పురాణము, కేతన అనువదించిన దశకుమార చరిత్ర, ఎఱ్ఱన తెలిగించిన హరివంశ, నృసింహ పురాణాలు, నాచన సోమన ఆంధ్రీకరించిన ఉత్తర హరివంశము ఆ యుగంలో వచ్చిన అనువాదాలతో ప్రశస్తాలు. 11వ శతాబ్ది ఉత్తరార్ధంవాడైన నన్నెచోడుడనే మహాకవి శైవమతం మీద మక్కువ గలవాడు. ఆ మతాన్ని అవలంబించినవాడు. అతడు స్వతంత్రమైన ప్రతిభతోనే కుమారసంభవమనే కావ్యాన్ని రచించినాడు. ముమ్ముందు రాబోయే ప్రబంధమనే ప్రక్రియ యొక్క ముఖ్యలక్షణాలు నన్నెచోడుని కుమారసంభవకావ్యంలో దిఙ్మాత్రంగా కనిపిస్తు న్నాయి.

12వ శతాబ్దిలో తెలుగునాటి మత పరిస్థితులు మారసాగినాయి. ఈ మత సంచల నం వల్లనే నన్నయ మొదలుపెట్టిన భారతానువాదాన్ని ఎవరూ పూర్తి చేయలేకపోయి నారు. తెలుగుభారతం పూర్తిగా వెలుగులోకి రాకుండా జరిగిన ఆలస్యానికి మతకల్లో లాలు కొంతవరకు కారణాలు. ఆ కాలంలోనే వీరశైవమత స్థాపన జరిగింది. కన్నడ దేశాన్ని పాలిస్తున్న బిజ్జలుని మంత్రి బసవేశ్వరుడు వీర శైవాన్ని స్థాపించినాడు. ఆ మతము కన్నడ దేశంనుంచి తెలుగు దేశంలోకి అతి శీఘ్రంగా అల్లుకొనిపోయింది. ఆ మతా నికి జీవగఱ్ఱ శివభక్తి పారమ్యం మాత్రమే! కులంతో నిమిత్తంలేకుండా పరమశివుని పట్ల ఎవరు భక్తిని ప్రకటిస్తారో వారికి కైవల్యం తప్పకుండా సిద్ధిస్తుందని ఆ మతం ప్రతిపా దించింది. తెలుగుదేశంలో సామాన్య ప్రజలే కాకుండా కవులు, పండితులు కూడా వీర శైవమతాన్ని స్వీకరించినారు. స్వీకరించడమేకాక ఆ మతాన్ని ప్రచారం చేయడానికి చాలామంది తమ జీవితాలనే ధారవోసినారు. కవులలో పండితారాధ్యుడు, పాల్కురికి సోమనాథుడు అట్టివారే! సులభంగా బోధపడే దేశిభాషను,ప్రచారంలో ఉన్న దేశిచ్ఛందస్సులను ఈ కవులు వాడి వీరశైవ మత ప్రచారానికి ప్రగతికి దోహదం చేసేకావ్యాలను రచించినారు: ఆ కావ్యాలలో శివతత్త్వ సారము,బసవపురాణము,పండితారాధ్య చరిత్ర తలమానికాల వంటివి. ఇవన్నీ 12వ శతాబ్దిలో వచ్చిన కావ్యాలు.వీరశైవ కవుల దృష్టి సాహిత్యం మీద కన్న మతం మీదే గాఢంగా లగ్నమయింది. ఇతి వృత్తాన్ని ఎంచుకోవడంలోనూ భాషను ప్రయోగించ డంలోనూ ఛందస్సులను వినియోగించుకోవడంలోనూ వీరశైవ కవులు అతి స్వతంత్ర మార్గాన్ని అవలంబించినారు. నిన్న మొన్నటివరకు పండితులు వీరశైవ వాఙ్మయంపట్ల కొంత నిరాదరణ చూపేవారు. అందుకు ఆ కవుల నిరంకుశ వ్యాపారము కొంతవరకు కారణము. ఏమయినా తెలుగు వాఙ్మయంలోకి శైవకవులు తెచ్చిన నూతన ప్రక్రియలు అపురూపమైనవని చెప్పక తప్పదు. శతకము, ఉదాహరణము, గద్యలువంటి అనేక సాహిత్య ప్రక్రియలను మొట్ట మొదట ప్రయోగించినవారు శైవకవులే!

14, 15 శతాబ్దాలలో తెలుగుకవులు సంస్కృత భాషలో ఉన్న మహాకావ్యాలను కూడా తెలిగించడానికి పూనుకొన్నారు. కొందరుకవులు అనువాదాలను మానివేసి, స్వోపజ్ఞను ప్రదర్శిస్తూ కథనాత్మకాలైన కావ్యాలను రచించడానికి ఉత్సాహపడినారు. ద్విపద కావ్యంగా వెలిసిన రంగనాథ రామాయణము, భాస్కరాదులు రచించిన భాస్కరరామాయ ణము, మంచనకవి వ్రాసిన కేయూర బాహు చరిత్రము, జక్కన కవి రచించిన విక్రమార్క

చరిత్రము, అనంతామాత్యుడు రచించిన భోజరాజీయము, గౌరన రచించిన హరిశ్చంద్ర ద్విపద ఈ యుగంలో వెలువడిన కావ్యాలలో అగ్రగణ్యమైనవి. మహాకవులుగా నిలిచిన శ్రీనాథ పోతన లిద్దరూ ఈ యుగంలోనివారే! శ్రీ నాథుడు మహాకవి మాత్రమే కాదు, మహాపండితుడు కూడా. కనకనే ప్రచండమైన తర్క పాండిత్యంగల గౌడ డిండిమభట్టును శాస్త్ర వివాదాలతో ఓడించి దేవరాయల ఆస్థానంలో కూడా కనకాభిషేక సన్మానాన్ని శ్రీ నాథుడు పొందగల్గినాడు. శ్రీనాథుడు రచించిన కావ్యాలలో చాలావరకు సంస్కృత పురాణాలకు, కావ్యాలకు అనువాదాలే కాని అనువాదకళలో అతడు ఆరితేరినవాడు. అతడు చేసిన నైషధాను వాదానికి తెలుగులోని ఉత్తమ కావ్యాలలో ఉన్నతమైన స్థానం లభిస్తుంది. శృంగార నైషధ మనే పేరుగల ఆ కావ్యము శ్రీ నాథుని ప్రతిభకు, వ్యుత్పత్తికి గీటు రాయి వంటిది. సంస్కృత నైషధాన్ని యథాతథంగా తెలిగిస్తూ ఔచిత్యం కోసం మధ్య మధ్య కొన్ని చిన్న మార్పులు చేసినాడు. అనేక సన్నివేశాలలో శ్రీనాథుని నైషధాను వాదము హర్ష నైషధాన్ని మించిన కళా సౌందర్యాలను ప్రదర్శించింది. అనువాద సరణిలో తరవాతి తరంకవులమీద శ్రీ నాథుని ప్రభావం నిరవధికంగా కనిపిస్తుంది. పోతన శ్రీనాథుని సమకాలికుడే! అతడు మహాభక్తుడు కూడా! సంస్కృతంలో ఉన్న భాగవత పురాణాన్ని పోతన తెనిగించినాడు. భాగవతంలో పోతన కవిత్వము సుధాలహరిగా వెల్లి వారింది. అందుకు కారణాలు రెండు-మొదటిది అతని మనః ప్రవృత్తి నిసర్గ నిర్మలం కావడం. రెండవది అతడు స్వీకరించిన మహాభాగవత కథ మధురాతిమధురమైనది కావడం. ఈ రెండింటికి తోడు అతని భాష సహజ కోమలంగా ఉంటుంది. తెలుగుభాష కోమలత్వానికి అది పతాకాప్రాయమైనది. ఆ భాగవతంలోని దశమస్కంధంలో గోపికల మధుర భక్తిని పోతన అభివర్ణించిన తీరు మరెవరికిని సాధ్యంకానట్లు కనిపిస్తుంది. మొత్తంమీద దశమస్కంధమంతా ఒక భావగీతం వలె వీనుల విందుగా ఉంటుంది. పోతన తన ఆత్మీయమైన భక్తిని పాత్రలలోకి పొదిగి అనేక సన్నివేశాలను రక్తికట్టించినాడు. ఈ కారణాల వల్ల పోతన గారి భాగవతము నేటికీ బహుళ ప్రచారంలో ఉంది. నాలుగు ముక్కలు చదువుకొన్న ప్రతి తెలుగువాడు పోతన రచించిన పద్యాలలో ఒకటో రెండో నోట పట్టుకోకుండా ఉండడు.

16వ శతాబ్దంలో తెలుగు వాఙ్మయాన్ని విజయనగర రాజులు పోషించినారు. ఆయుగంలోనే తెలుగు వాఙ్మయము సర్వతో ముఖంగా వికసించింది. తెలుగు వాఙ్మయ చరిత్ర చెప్పుకొనేటప్పుడు ఈ యుగాన్ని స్వర్ణయుగంగా పేర్కొంటూ ఉంటారు. విజయనగర రాజులలో శ్రీ కృష్ణ దేవరాయలు మేలుబంతి. ఆయనే స్వయంగా పండితుడు. స్వతంత్రంగా కావ్యరచన చేయగల ప్రతిభావంతుడు. ఆయన రచించిన కావ్యమే "ఆముక్తమాల్యద". తెలుగు వాఙ్మయంలోని ప్రబంధాలలో దానికి ఉన్నత స్థానముంది. శ్రీ కృష్ణదేవరాయలు ఎందరో కవులను, పండితులను పోషించినాడు. ఆ కవులలో ఎనమండుగురు కవులకు అష్టదిగ్గజాలుగా ప్రసిద్ధి వచ్చింది. ఈ యుగంలో ప్రబంధానికి ప్రథమ తాంబూలం లభించింది. కవులు ప్రబంధాలను ఎక్కువగా రచించినారు. అందువల్లనే ఈ యుగాన్ని ప్రబంధయుగము అని వ్యవహరిస్తూ ఉంటారు. సంస్కృత సాహిత్యంలో ఉన్న "కావ్యము" అనే ప్రక్రియనే తెలుగు వాఙ్మయంలో "ప్రబంధము" అని వ్యవహరించడం జరిగింది. అయితే తెలుగు వాఙ్మయంలోని ప్రబంధ

ప్రక్రియకు సంస్కృత వాఙ్మయంలోని కావ్యప్రక్రియ కన్న విచిత్రమైన అర్థం ఏర్పడింది. ప్రబంధ మనేది కొన్ని నిర్దిష్టలక్షణాలు గల ప్రక్రియ.అందులో ప్రధానేతివృత్తము ప్రఖ్యాతమై ఉండాలి.నాయకుడు ధీరోదాత్తుడుగా, రసము శృంగారముగా ఉండాలి. సంప్రదాయసిద్ధాలైన వర్ణనలు పద్దెనిమిది ప్రబంధానికి ముఖ్యలక్షణము· ఆశ్వాసాలు అయిదో ఆరో ఉండవచ్చు. శబ్దార్థాలంకార మయమయిన ఉదాత్తశైలి ప్రబంధానికి ప్రాణము. అల్లసాని పెద్దన రచించిన మనుచరిత్ర, ముక్కు తిమ్మన రచించిన పారిజాతాపహరణము,భట్టుమూర్తి రచించన వసుచరిత్ర ఈ యుగంలో వెలువడిన ప్రసిద్ధ ప్రబంధాలు. ప్రబంధంలోని ప్రతిపద్యము ఆ కవి తాలూకు గాఢవ్యుత్పత్తికీ అద్భుత కవితా శక్తికీ మనోజ్ఞ శయ్యకూ నిదర్శనంగానే ఉంటుంది. తెలుగు వాఙ్మయం లోని నిజమైన అందమేమిటో· ప్రబంధాలను పఠిస్తేనే తెలుస్తుంది. తెలుగు వాఙ్మయాన్ని ఒక నందనవనంతోనూ ప్రబంధాలను ఆ వనంలో పారిజాత వృక్షాలతోనూ పోల్చవచ్చు. విజయనగర సామ్రాజ్యం వర్ధిల్లిన కాలం ఎంత మహత్తరమైందో ఆ నాటి ప్రజల జీవితాలు ఎంత చక్కగా ఉండేవో అడుగడుగునా జీవితంలో ఆనాటి తెలుగువారి రసాత్మక దృష్టి ఎట్లాంటిదో ప్రబంధాలు ప్రత్యక్షంగా చూపిస్తున్నాయి. ఆ యుగంవాడే అయిన పింగళి సూరన్నకు తెలుగు వాఙ్మయంలోనే ప్రత్యేక స్థానముంది. నలిగిపోయిన పాతబాటను విడిచి కొత్త మార్గం తొక్కినవాడితడు. కళాపూర్ణోదయము ఇతడు రచించిన నవ్యప్రబంధము. కవిత్వ రూపంలో వెలువడిన నవలగా కళాపూర్ణోదయాన్ని భావించవచ్చు. ఈ కావ్యంలోని కథను కవి తానే స్వతంత్రంగా అల్లుకొన్నాడు.పింగళి సూరన్న మరి రెండు కావ్యాలను రచించినాడు.వాటిలో రాఘవ పాండవీయము ఒకటి. ఇది ద్వ్యర్థి కావ్యము, ప్రభావతీ ప్రద్యుమ్నము రెండోది. ఇది నాటకీయ పద్ధతిలో వెలసిన ప్రబంధము. ఈ రెండూ కూడా పింగళి సూరన్న ప్రతిభకు స్వతంత్ర రచనా పాటవానికీ నిదర్శనాలు. సంస్కృత వాఙ్మయంలోని మహాకావ్యము· నాటకము అనే రెండు ప్రక్రియల స్వాభావిక మైన లక్షణాలను స్వీకరించి, గద్య పద్యోభయమయమైన చంపూ కావ్యంలో మేళవించి ప్రబంధమనే నూత్న ప్రక్రియను తెలుగు వాఙ్మయంలోకి కవులు ఆవిష్కరించినారని అనిపిస్తుంది.

విజయనగర సామ్రాజ్యం పతనమైపోయిన తరనాత తెలుగు వాఙ్మయంలోని ఉద్యమమంతా దక్షిణ దేశానికి తరలివెళ్ళింది. దక్షిణదేశంలోని మధుర, తంజావూరు రాజ్యాలు రెండూ ముఖ్యంగా తెలుగు వాఙ్మయానికి కేంద్రాలయినాయి. ఈ రెండు రాజ్యాలను పాలించినవారు నాయకరాజులు. వీరికి కళలన్నా సాహిత్యమన్నా ఎక్కువ మక్కువ. కవులను, పండితులను, కళాకారులను నాయకరాజులు ఎన్నోవిధాల సత్కరించి పోషించినారు. ఈ దక్షిణాంధ్రయుగంలో కూడా తిరిగి ఎన్నో ప్రబంధాలు వెలువడినాయి. అయితే ఇవి శ్రీ కృష్ణదేవరాయల యుగంలో వెలువడిన ప్రబంధాలతో పోటీ చేయలేవు అంత పసగలవి కూడా కావివి. ఈ యుగంలో ప్రబంధాలు రచించిన కవులు తమ రచనలలో ఉపదేశానికన్న ఆనందానికే అధికమైన ప్రాధాన్యమిచ్చినట్లు కనిపిస్తుంది. సారంగధరుని కథ, తారాశశాంకుల ప్రణయము,అహల్యా సంక్రందనుల ఉపాఖ్యానమువంటి దుర్నీతి బోధకాలయిన విషయాలను కావ్యవస్తువులుగా ఎన్నుకోవడానికి ఈ యుగంలోని కవులు సందేహించలేదు. శృంగారరసాన్ని నానా ముఖాలుగా వర్ణించడంలో పరవశులై ఈ కవులు

ఔచిత్య సీమలను ఉల్లంఘించినారు. ఈ యుగంలోని వాఙ్మయాన్ని పరిశీలించిన విమర్శకులు కొందరు "ఇదొక క్షీణయుగము" అని భావించడానికి బహుశాకారణము ఔచిత్యపాలన లేకపోవడమే కావచ్చు. కాని ఈ యుగంలో ప్రబంధాలు మాత్రమే కాక ఇతర ప్రక్రియ లెన్నో వెలువడినాయి. వాటిని పరిశీలించి చూస్తే ఈ యుగంలోని వాఙ్మయవికాసంకూడా శ్రీ కృష్ణదేవరాయ యుగంలోని వాఙ్మయవికాసానికేమీ తీసిపోదని అనిపిస్తుంది. ఈ యుగంలో సరికొత్తగా అంకురించిన సాహిత్య ప్రక్రియలెన్నో ఉన్నాయి. అవన్నీ ఆధునిక యుగంలో పల్లవించినాయి. ఆ నూతన ప్రక్రియలలో యక్షగానము, వచనకావ్యము పేర్కొనదగినవి. యక్షగానమనేది ఒక గేయప్రక్రియ. దీనినే "జక్కులపాట" అనీ అంటారు. నృత్యానికి సంగీతానికి సమానంగా ప్రాధాన్యమిచ్చే దేశీయమైన నాటకానికే యక్షగానమని పేరు వచ్చింది. దక్షిణాంధ్రయుగంలో యక్షగానాలు వందలకొద్దీ వెలువడినాయి. యక్షగానాలను ఆ కాలంలో రంగస్థలంమీద ప్రదర్శించినారు కూడా. సంగీత కళలో సిద్ధపురుషులైన త్యాగయ్య, క్షేత్రయ్య లిద్దరూ దక్షిణాంధ్రయుగంలో ఉన్నవారే. త్యాగయ్య కూర్చిన కీర్తనలు, క్షేత్రయ్య రచించిన పదాలు వేల సంఖ్యలో ఉన్నాయి. ఈ పదవాఙ్మయంలో భావగాంభీర్యము, భాషామాధుర్యము జతగూడినాయి. పదవాఙ్మయ ప్రసిద్ధికిదొక కారణము. వచనరూపంలో కావ్యాలను రచించడానికి పూనుకొన్న రచయితలు దక్షిణాంధ్రయుగంలో చాలామంది కనిపిస్తున్నారు. ఈ యుగంలోనే రామాయణము! భారతము, భాగవతము వచనరూపంలో అవతరించినాయి. ఈ యుగంలోని కవులందరిలోనూ చేమకూర వేంకటకవికి అగ్రతాంబూలం లభిస్తుంది. ఇతడు రచించినవి సారంగధర చరిత్ర, విజయవిలాసము. ఇవి రెండూ కావ్యాలే! శబ్దచమత్కారాన్నీ అర్థచమత్కారాన్నీ సాధించడంలో చేమకూర వెంకటకవి సాటిలేనివాడు.

దక్షిణాంధ్రదేశంలోని వాఙ్మయరంగమిట్లా వర్ధిల్లిన కాలంలోనే ఉత్తరాంధ్ర దేశంలో కూడా ప్రసిద్ధమైన ప్రబంధాలెన్నో వెలువడినాయి. ఈ కాలంలోని వాడే వేమన యోగి. తెలుగుదేశంలో ఇతడు బహుప్రసిద్ధుడు. ఇతడు రచించినవన్నీ ఆటవెలది పద్యాలు. అవి వేల సంఖ్యలో ఉన్నాయి. తెలుగుదేశంలో వాటికున్న ప్రచారము అపారమైనది. అతని శైలి ఎంత సరళంగా ఉంటుందో అంత శక్తివంతంగా కూడా ఉంటుంది. నీతులకు, హాస్యానికి, సమకాలీన సమాజంలోని దురాచారాలను విమర్శించడానికి, తెలుగు నుడికారపు తేటదనాన్ని ప్రదర్శించడానికి వేమన పద్యాలు పెట్టిందిపేరు. ఈ కాలంలో ఇంకా పేర్కొనదగిన కవులు ముగ్గురున్నారు-వారు కూచిమంచి తిమ్మకవి, అడిదం సూరకవి, కంకంటి పాపరాజు.

19వ శతాబ్ది నాటికి తెలుగు కవిత్వపు ప్రమాణాలు క్రమంగా దిగజారసాగినాయి. శబ్దాలంకారాలన్నా శబ్దచిత్రాలన్నా మోజుపడే కవులసంఖ్య పెరిగిపోవడమే ఈ క్షీణదశకు ప్రధానమైన కారణము. మనుచరిత్రను కొంతమంది వసుచరిత్రను కొంతమంది గుడ్డిగా అనుకరించి కావ్యాలు వ్రాయసాగినారు. రసావేశంతో స్వతంత్రమైన వర్ణనలు చేయడానికి ఎవ్వరూ తలపెట్టినట్లు కనిపించదు. అసలు స్వతంత్రంగా రచన చేసే శక్తి వారిలో కొడిగట్టిపోయింది. అందువల్లనే ఆ కాలంలో వీరేశలింగం పంతులు

గారు సరస్వతీనారద విలాపమనే లఘుకావ్యాన్ని రచించినారు. తెలుగు సరస్వతి అంద చందాలు ఏ విధంగా దిగజారిపోతున్నాయో ఆ క్లిష్టమైన పరిస్థితులన్నింటినీ సరస్వతికీ నారదునకు జరిగిన సంభాషణద్వారా ఆయన తన కావ్యంలో చిత్రించినారు. ఆంగ్ల భాషను, ఆంగ్లసాహిత్యాన్ని చదివిన యువకులు, ప్రతిభావంతులు కొందరు ఆనాటి తెలుగు సాహిత్యం పరిస్థితులను చక్కగా ఆకళింపుకోగలిగినారు. తెలుగు కవిత్వాన్ని తిరిగి సజీవంగానూ సచేతనంగానూ తీర్చిదిద్దడానికి నూతనరీతులను అన్వేషించినారు. ఆధునిక కవిత్వంలో అభినవరీతులను వారు నెలకొల్పగల్గినారు.

ఒకపక్క ప్రాచీన సంప్రదాయమంటే ఇష్టమున్న పండితులు, కవులు సాంప్రదాయికమైన కావ్యఫణితులలోనే రచనలు సాగిస్తూ ఉండగా మరోపక్క ఆంగ్లసాహిత్యంతో పరిచయమున్న యువకులైన కవులు షెల్లీ, కీట్స్, వర్డ్స్‌వర్త్‌వంటి ఆంగ్లకవులను అనుకరించి రచనలు సాగించినారు. ఆంగ్లసాహిత్య సంప్రదాయాలను అనుసరించడంవల్ల తెలుగు సాహిత్యంలో కాల్పనిక కవిత్వమనే నవ్యశాఖ ఒకటి అవతరించింది. దీనినే భావకవిత్వమని పిలవసాగినారు. ఆ మాటయే స్థిరపడిపోయింది. ఇందులో చాలాభాగము గేయరూపంలో ఉన్న కవిత్వము. వస్తువునుబట్టి చూస్తే ఇది ఆత్మాశ్రయమైన కవిత్వము. ఆత్మాశ్రియ కవిత్వాన్ని అందంగా రచించిన వారిలో శ్రీ కృష్ణశాస్త్రి ప్రభృతులు పేర్కొనదగినవారు అనావశ్యకాలైన వర్ణనలను విడిచిపెట్టి ఒక నవ్యప్రణయ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ శ్రీరాయప్రోలు సుబ్బారావుగారు లలిత, తృణకంకణమువంటి చిన్న కావ్యాలను రచించినారు. ఈ కాలంలోనే కొందరు కవులమీద జాతీయోద్యమ ప్రభావం పడింది. అట్లాంటి కవులు రాణాప్రతాప చరిత్ర, శివభారతమువంటి విశిష్టమైన కావ్యాలను రచించినారు. ప్రత్యేకాంధ్ర రాష్ట్రనిర్మాణంకోసం సాగిన ఉద్యమంచేత మరికొంతమంది కవులు ప్రభావితులైనారు. అట్లాంటి కవులు ఆంధ్రప్రశస్తి, ఆంధ్రపురాణము, రాష్ట్రగానమువంటి ఉత్తమమైన కావ్యాలను రచించినారు. ఇవన్నీ పాఠకలోకంలో జాతీయాభిమానాన్ని, రాష్ట్రీయ చైతన్యాన్ని రేకెత్తించినాయి. గాంధీమహాత్ముని వ్యక్తిత్వము ఎందరో నవ్యకవులను ఆకర్షించింది. సహజంగా గాంధీజీ సిద్ధాంతాలకు బుద్ధభగవానుని సిద్ధాంతాలకు పోలికలున్నాయి. ఈ ఇరువురి సిద్ధాంతాలు కొందరు కవులను కావ్యరచనకు ప్రేరేపించినాయి. కొందరు బుద్ధభగవానుని కావ్యనాయకుడుగాను, కొందరు బుద్ధుని శిష్యులను కావ్యనాయకులుగాను చేసికొని నవ్యకావ్యాలను రచించినారు. ఈ తెగకు చెందిన కావ్యాలలో శ్రీ పింగళి-కాటూరి కవులు రచించిన సౌందరనందము ఉత్తమోత్తమంగా కనిపిస్తుంది. శ్రీ అడవి బాపిరాజుగారు, శ్రీ కవికొండల వేంకటరావుగారు పల్లీయుల జీవితాన్ని వస్తువుగా తీసుకొని పల్లెపదాలను రచించినారు. శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు గ్రామీణుల జీవితాలను వర్ణిస్తూ కావ్యాలను రచించినారు. వాటిలో 'కృషీవలుడు' ముఖ్యమైనది.

మహాపండితుడు, భాషాశాస్త్రవిశారదుడు అయిన శ్రీ గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషోద్యమానికి సూత్రధారులయినారు అన్నిరకాల రచనలకు వాడుకభాషను వాడటమే మంచిదని ఆయన గట్టిగా వాదించినారు. ఈ ఉద్యమము ఎందరినో ఆకర్షించింది. శ్రీ గురజాడ అప్పారావు.

పంతులుగారు వాడుక భాషలోనే కవిత్వాన్ని రచించినారు. ఎంకిపాటలు, కిన్నెరసాని పాటలు, శివతాండవమువంటి భావవగీతికలు వాడుకభాషలోనే వెలువడినాయి. సాంప్ర దాయికమైన గ్రాంథిక భాషలో కూడా కొందరు గేయకావ్యాలను రచించినారు. వారిలో శ్రీ నారాయణరెడ్డిగారిది అగ్నితాంబూలము. ఆధునిక సాహిత్యంలో సరికొత్తగా చివు రించిన మరోశాఖ అభ్యుదయ కవిత్వము. ఈ శాఖకు మూలపురుషుడు శ్రీశ్రీ గారు. ఇప్పుడు ఈ శాఖ అనేక రూపాలను ధరించి విస్తరిస్తున్నది. అభ్యుదయ కవిత్వం రచించే వారిలో కొందరు చందస్సహితంగా వ్రాసేవారు కాగా మరికొందరు ఛందోరహితంగా వ్రాసేవారు. సర్రియలిజమ్, డాడాయిజమ్, సైకో అనాలిసిస్‌వంటి పాశ్చాత్యసాహిత్య తత్త్వరీతులను కూడా అభ్యుదయ కవిత్వంలోకి యథేచ్ఛగా కొందరు దింపినారు. వీటిలో ఒక నిర్దిష్టమైన వ్యవస్థగాని రూపంగాని కనిపించడం లేదు. ఇందులో అక్కడక్కడ కొన్ని మంచి కవితా ఖండాలున్నప్పటికీ క్రమంగా ఈ రకమైన కవిత్వానికి ప్రజాదరణ మృగ్యమైపోతున్నది.

ఆధునికయుగంలో కూడా సంప్రదాయమార్గాన్ని అనుసరించిన కవులెందరో కనిపిస్తున్నారు. శ్రీ తిరుపతి వేంకటకవులు, శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, శ్రీ వావిలి కొలను సుబ్బారావు, శ్రీ జనమంచి శేషాద్రిశర్మ ప్రభృతులిట్లాంటి వారే! వీరంతా స్వతంత్రమైన కావ్యాలను, అనువాదాలను సాంప్రదాయికమైన సరణిలో సంతరించినారు. ఆధునికయుగంలో కొందరు కవులు నవ్యసాంప్రదాయిక పద్ధతిలో కావ్యాలను రచించినారు. ఈ పద్ధతిని సమీచీనంగా అనుసరించి కవులు కావ్యరచనలు సాగిస్తే మన సాహిత్యము సుసంపన్నము, సుఫలవంతము అవుతుందని ఈ వ్యాసకర్త వ్యక్తిగతంగా అభిప్రాయపడు తున్నారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు, శ్రీ పింగళి లక్ష్మీకాంతం, శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి, శ్రీ జాషువా, శ్రీ మధునాపంతుల సత్య నారాయణశాస్త్రి ప్రభృతులు ఎందరో ఈ పద్ధతిలోనే రచనలు సాగిస్తూ ఉన్నారు. వీరు రచించిన కావ్యాలు మన సాహిత్యానికి నిజమైన అలంకారాలుగా ఉన్నాయి. గాంధీజీ రచించిన స్వీయచరిత్రను శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు తెలిగించి "ఆత్మకథ" అని పేరు పెట్టినారు.

నాటకము, నవల, కథానిక, వ్యాసము, విమర్శ, వంటి సాహిత్య ప్రక్రియలు తెలుగు లోకి వచ్చి నూరేళ్ల మాత్రమే అయింది. ఈ నూరేళ్లలోనే ఆ ప్రక్రియలు తెలుగు సాహి త్యంలో ఉన్నతమైన విలువలను అందుకొని పరిపుష్టిని పొందినాయి. తెలుగు సాహిత్యంలో "నాటకము" మొదట సంస్కృత నాటకాల అనువాదంతో ప్రవేశించింది. క్రమంగా రచయి తలు నాటక రచనమీద దృష్టి మరలించి, చారిత్రకాలు, పౌరాణికాలు, సాంఘికాలు అయిన ఇతివృత్తాలను ఎన్నుకొని స్వతంత్ర నాటకాలను తెలుగులో రచించినారు. స్వతంత్ర నాటక రచయితలలో శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు, శ్రీ వీరేశలింగం పంతులు, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి, శ్రీ పానుగంటి లక్ష్మీ నరసింహారావు, శ్రీ తిరుపతి వేంకట కవులు, శ్రీ వడ్డాది సుబ్బారాయుడు, శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహం, శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతం, శ్రీ గురజాడ అప్పారావు ప్రభృతులు గణనీయులు. వీరిలో కొందరు కొన్ని సంస్కృత

నాటకాలను తెలిగించినారు. ఇవన్నీ తెలుగుదేశంలో బహుళంగా ప్రచారాన్ని పొందినాయి. స్వతంత్ర నాటకాలలో ప్రతాపరుద్రీయము, కన్యాశుల్కం, పాండవోద్యోగ విజయములు, హరిశ్చంద్ర గయోపాఖ్యానము, విషాదసారంగధర వంటివి ఉత్తమమయినవిగా పరిగణన పొందినాయి. అయితే, ఈ కాలంలో అనేకమైన అంకాలతో సుదీర్ఘంగా ఉండే నాటకాలను ఎవరూ రచించడం లేదు. ఏకాంకికలయిన నాటికలను మాత్రం పుంఖానుపుంఖంగా రచిస్తున్నారు. శ్రీ పి వి. రాజమన్నారు, శ్రీ విశ్వనాథ కవిరాజు, శ్రీ చింతా దీక్షితులు, శ్రీ ఆత్రేయ, శ్రీ బుచ్చిబాబు. శ్రీ నార్ల వేంకటేశ్వరరావు ప్రభృతులు రచించిన నాటికలకు తెలుగు దేశంలో బహుళంగా ప్రచారం లభించింది. శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు గారు రచించిన హాస్యరస ప్రధానాలయిన రూపకాలను ఎన్నోసార్లు రంగస్థలం మీద ప్రదర్శించడం జరిగింది. గేయరూపంలో నాటికలు మొట్టమొదటిసారిగా రచించిన వారు శ్రీ తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారు. దీక్షితదుహిత, పద్మావతీ చరణచారణ చక్రవర్తి వంటివి శ్రీ శివశంకర శాస్త్రిగారి గేయనాటికలలో రసవంతంగా ఉంటాయి. యువతరం వారిలో శ్రీ సి. నారాయణ రెడ్డి, శ్రీ బాలాంత్రపు రజనీకాంత రావు గార్లిద్దరూ అన్ని గుణాలలోను మిన్నలైన గేయ నాటికలను రచించినవారు. ఆకాశవాణి కార్యక్రమాలలో ప్రసారం చేయడానికి గేయనాటికలను ఎందరో చక్కగా రచిస్తున్నారు.

శ్రీ వీరేశలింగం పంతులుగారి "రాజశేఖర చరిత్ర" తెలుగు సాహిత్యంలో వెలువడిన మొదటి మంచి నవల. అంతకు ముందునుంచీ తెలుగులో నవలలను రచించడానికి కొందరు ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. తెలుగులో నాణ్యమైన నవలలను రచించినవారు చాలామంది ఉన్నారు. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం, శ్రీ కేతవరపు వేంకట శాస్త్రి, శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ అడవి బాపిరాజు, శ్రీ త్రిపురనేని గోపీచంద్, శ్రీ బుచ్చిబాబు, శ్రీ పోతుకూచి సాంబశివరావు, శ్రీ నోరి నరసింహ శాస్త్రి, శ్రీ బలివాడ కాంతారావు ప్రభృతులు నవలలను రచించిన వారిలో ప్రత్యేకంగా పేర్కొనదగినవారు. వీరందరిలోనూ తిరిగి చెప్పవలెనంటే శ్రీ విశ్వనాథవారికి అగ్రస్థానం లభిస్తుంది. స్వతంత్రమైన నవలల సంఖ్య అట్లాఉండగా, ఇంగ్లీష్, హిందీ, బెంగాలీ వంటి భాషలనుంచి అనువాద రూపంలోకి తెలుగులో వచ్చిన నవలల సంఖ్య కూడా అధికంగానే ఉంది.

కథానికా రంగంలోకూడా తెలుగు రచయితలు తమ అసమానమైన ప్రతిభను నిరూపించుకొన్నారు. శ్రీ గురజాడ అప్పారావు, శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ శివశంకర స్వామి, శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ వేలూరి శివరామ శాస్త్రి, శ్రీ చింతా దీక్షితులు, శ్రీ కరుణ కుమార, శ్రీ చలం, శ్రీ కొడవటిగంటి కుటుంబరావు, శ్రీ ముని మాణిక్యం నరసింహారావు, శ్రీ గోపీచంద్, శ్రీ మొక్కపాటి నరసింహ శాస్త్రి, శ్రీ బుచ్చిబాబు, శ్రీ మధురాంతకం రాజారాం ప్రభృతులు తెలుగు కథానికా రచయితలలో ఉత్తమశ్రేణికి చెందినవారు. ప్రపంచ కథానికల పోటీలో పాల్గొని శ్రీ పాలగుమ్మి పద్మరాజు గారు ద్వితీయ బహుమానం పొందినారు. ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ భాషలనుంచి ఎన్నో కథానికలు తెలుగులోకి అనువాదరూపంలోవచ్చినాయి.

ప్రాచీన కాలపు తెలుగుకవులలో చాలామంది పాండిత్య సంపద బాగా ఉన్నవారు. వారు తమపాండిత్యాన్ని చూపెట్టడానికి ద్వర్థి కావ్యాలను, తత్సమాలు చేరని

అచ్చమైన తెలుగు భాషలో ప్రబంధాలను రచించినారు.

తెలుగులో శతకవాఙ్మయానికి ఒక ప్రత్యేక స్థానముంది. రమారమి రెండు వేల శతకాలు తెలుగులో ఉన్నాయి. ఈ శతకాలలో ఎంతో వైవిధ్యం కనిపిస్తుంది. సాధారణంగా కవులు తమ కవితాయాత్రలో ప్రథమదశలో కానీ ప్రౌఢమైన దశలో కానీ శతకాలను రచిస్తూ ఉంటారు. భగవంతుని మీద భక్తిని ప్రదర్శించడం, నీతులను బోధించడం, వేదాంత తత్త్వాన్ని గురించి వివేచించడం ఈ శతకాలలో వెల్లివిరిసిన విషయాలు. తెలుగు ప్రజలు శతకాలను బాగా ఆదరించినారు. వివిధ కాలాలలో శతకాలు తెలుగు జాతి జీవితానికి ప్రతిబింబాలుగా వెలువడినాయి.

ఇక జానపద వాఙ్మయంలో కూడా తెలుగు చాలా సంపన్నమైనది. పండితులు చాలాకాలం ఈ పామరుల వాఙ్మయాన్ని నిరాదరంగా చూచినారు. అయినా జానపదవాఙ్మయము తన సహజమైన విశిష్టతవల్ల దేశంలో నిలదొక్కుకొన్నది. ఇప్పుడిప్పుడు పండితులు కూడా జానపదవాఙ్మయాన్ని ఆదరిస్తున్నారు. జానపద వాఙ్మయం పట్ల పండితులు ఈ నాడు ఎంతో శ్రద్ధను, ఆసక్తిని చూపిస్తున్నారు. సరళమైన తెలుగు నుడికారాలకూ సరసమైన భావసంపదకూ అమాయికమైన రసభావాలకూ ఈ పామర జనుల వాఙ్మయము ఒక తరుగులేని గనిగా ఉంది. అందువల్లనే పండితులు, పామరులు అనే తేడాలేకుండా అది సర్వజనులకు ఆనందం కలిగిస్తున్నది.

ప్రాచీన కాలంలో తెలుగుమీద సంస్కృత భాష బాలూకు ప్రభావం ఎక్కువగా ఉన్నట్లే నవీనకాలంలో తెలుగుమీద ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ భాషల ప్రభావం ఎక్కువగా కనిపిస్తున్నది. తెలుగు వాఙ్మయము సహజంగానే సంపన్నమైనది. అయితే అది ఇతరభాషలనుంచి ఉత్తమమైన సంపదలను స్వీకరించడానికి వెనకాడే భాషకాదు. హిందీ, ఇంగ్లీషు, బెంగాలీ పదాలు ఎన్నో తెలుగుభాషలోకి చేరిపోయినాయి. అందువల్ల తెలుగు క్రమక్రమంగా పెరిగి ఎంతో సంపదను కూడగట్టుకుంది. ఉత్తమోత్తమాలుగా ఎన్నికగన్న హిందీ నవలలను, కథానికలను, నాటకాలను ఇప్పుడు తెలుగులో చదువుకోవడానికి వీలుకలిగింది. అత్యుత్తమాలైన హిందీ కావ్యాలను కూడా తెలిగించడానికి ప్రయత్నాలు చురుకుగా సాగుతున్నాయి.

తెలుగుభాషను గురించి ప్రత్యేకంగా రెండు మూడు మాటలుచెప్పి ఈ వ్యాసాన్ని ముగిస్తాను.

జీవద్భాష అనేది ప్రతిదినమూ మారకపోవచ్చు. కాని ప్రతి సంవత్సరానికీ క్రమేణ కొంత మారుతూనే ఉంటుంది. ఈ సత్యాన్ని తెలుగు భాషలోని పండితులు గుర్తించినారు. మారుతూఉన్న పదాల రూపాల క్రమవికాసాన్ని విశ్లేషిస్తూ కొత్త వ్యాకరణాలను రచించి ప్రజలకీయవలసి ఉంటుంది. 11వ శతాబ్దినుంచి నేటివరకు తెలుగుభాషకు అట్లాంటి వ్యాకరణాలు వస్తూనే ఉన్నాయి.

తెలుగులోని అక్షరాలు ఏభై ఆరు. సంస్కృతంలోని అక్షరాల కన్న తెలుగులో ఆరు అక్షరాలు ఎక్కువ. తెలుగువారి నాదతంత్రులు ఈ అక్షరాలను అన్నింటిని అతిస్పష్టంగా ఉచ్చరించడానికి అలవాటు పడిఉన్నాయి. అందువల్లనే ఉదాత్త - అనుదాత్త - స్వరిత - ఆది సముచిత ధ్వనులతో వేదమంత్రాలను గానంచేయడానికి తెలుగువారే తగినవారుగా

కనిపిస్తారు. తెలుగు భాష సహజంగానే ఉంటుంది. సంగీతానికి తెలుగుభాష ఎంత చక్కగా ఒదిగిపోతుందో పోతన పద్యాలు,త్యాగరాజు కీర్తనలు నిరూపిస్తున్నాయి. అందువల్లనే దక్షిణ భారతదేశంలోని గాయకులు తమ మాతృభాష తెలుగు కానివారు కూడా,తెలుగుభాష పూర్తిగా పెట్టనివారు కూడా త్యాగరాజ కీర్తనలను వదిలి లేకపోతున్నారు,వాటినే పాడుకొంటున్నారు.

దక్షిణ భారతదేశం వాడై, మహా పండితుడుగా వాసికెక్కిన అయ్యప్పదీక్షితులు ఆంధ్రదేశాన్ని గురించి, తెలుగు భాషను గురించి ముద్దుడై

ఆంధ్రత్వ మాంధ్ర భాషాచ నాల్పస్య తపసః ఫలమ్

అని ప్రశంసించినాడని చెబుతారు. ఆంధ్రుడై పుట్టడం, తెలుగులో మాట్లాడటం. నిజంగా వరప్రసాదాలే అనీ గొప్పతపస్సు చేయనిదే ఆ రెండు అదృష్టాలు లభించవనీ పై మాటల తాత్పర్యము.

ఆంధ్రుడై పుట్టని ఒక పండితుడు చెప్పిన ఈ ప్రశంసలు ఎంత అమూల్యమైనవో;

## విషయసూచిక

## పద్యవిభాగము

| | |
|---|---|
| 12. జ్ఞానధనము | తిరుపతి వేంకటేశ్వర కవులు |
| 13. గాంధిమహాత్ముడు | దువ్వూరి రామిరెడ్డి |
| 14. ధర్మపథము | పింగళి-కాటూరికవులు |
| 15. రెండునక్షత్రాలు | విశ్వనాథ సత్యనారాయణ |
| 16. భారతీయ సతీగౌరవము | గడియారం వేంకటశేషశాస్త్రి |
| 17. a) ఆశ | దేవులపల్లి కృష్ణశాస్త్రి |
| b) ఓయినటరాజ | ,, |
| 18. భిక్షువర్షీయసి | శ్రీశ్రీ |

## గద్య విభాగము

| | |
|---|---|
| 1. ఇంద్రప్రస్థమునువీడి శ్రీకృష్ణుడు వెడలుట | కళువె వీరరాజు |
| 2. a) పేరాస (నీతిచంద్రిక-మిత్రలాభము) | పరవస్తు చిన్నయసూరి |
| b) అతిసంచయేచ్ఛతగదు (నీతిచంద్రిక-మిత్రలాభము) | ,, |
| 3. ప్రార్థన | కందుకూరి వీరేశలింగం |
| 4. స్వభావ | పానుగంటి లక్ష్మీనరసింహారావు |

o:-:o

## నన్నయభట్టు–(990-1060)

## సర్పానందము

*శ్రీ మదాంధ్ర మహాభారతము - ఆదిపర్వము-తృతీయాశ్వాసము -*
***203-206*** *పద్యాలు*

మ. రజనీనాథకులైక భూషణుఁడవై రాజర్షివై ధారుణీ
ప్రజనెల్లన్ దయతోడ ధర్మచరిత్రం బాలించుచుం దొంటి ధ
ర్మజు నాభాగు భగీరథున్ దశరథున్ మాంధాతృ రామున్ రఘున్
విజయుం బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారీక్షితా !

తరలము. కువలయంబున వారి కోరిన కోర్కికిందగ నీవు పాం
డవ కులంబు వెలుంగఁ బుట్టి దృఢంబుగా నృపలక్ష్మితో
నవనిరాజ్యభరంబు దాల్చిన యంత నుండి మఖంబులం
దివిరియిష్టధనంబులిచ్చుటఁ దృప్తులైరి మహాద్విజుల్

ఉ. అమ్మనుజేంద్రుఁడైన నలుయజ్ఞము ధర్మజు రాజసూయ య
జ్ఞముఁ బ్రయాగఁ జేసిన ప్రజాపతి యజ్ఞముఁ బాకశాసనీ య
జ్ఞమ్మును గృష్ణుయజ్ఞము నిశాకరు యజ్ఞము నీ మనోజ్ఞయ
జ్ఞమ్మును నొక్కరూప విలసన్మహిమం గురువంశవర్ధనా !

చ. వితతమఖప్రయోగ విధివిత్తము లుత్తమధీయుతుల్ జగ
న్నుత సుమహాతపోధను లనుగ్రహ నిగ్రహశక్తియుక్తు లీ
క్రతువున ఋత్విజుల్ కమలగర్భ సమానులు పూర్వదిక్పతి
క్రతువున యాజకోత్తముల కంటెఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్

శా. విద్వన్ముఖ్యుఁడు ధర్మమూర్తి త్రిజగద్విఖ్యాత తేజుండు కృ
ష్ణద్వైపాయనుఁ డేగుదెంచి సుతశిష్య బ్రహ్మ సంఘంబుతో
సద్వంద్యుండు సదస్యుఁడయ్యెననినన్ శక్యంబె వర్ణింప సా
ధ్విద్విష్ణుంతవ నీవు భూపతులలోఁ గౌరవ్య వంశోత్తమా !

ఉ. ఆర్తిహర క్రియాభిరతుడై కృతసన్నిధియై ప్రదక్షిణా
వర్త శిఖాగ్రహస్తముల వహ్ని మహాద్విజ దివ్య మంత్ర ని
ర్వర్తిత హవ్యముల్ గొనుచు వారిజవైరికులేశ నీకు సం
పూర్త మనోరథంబులును బుణ్యఫలంబులు నిచ్చుచుండెడున్

ఉ. మానిత సత్యవాక్య। యభిమన్యుకులోద్భవ। శాంతమన్యుసం
తానుఁడవై దయాభినిరతస్థితి నీవు మదీయ బంధు సం
తాన మనో జ్వరం బుపరతంబుగ నాకు బ్రియంబుగా మహో
ర్వీనుత సర్పయాగ ముడిపింపుము కావుము సర్పసంహతిన్

## యయాతి నీతులు

క. ఎఱుక గలవారి చరితలు
గఱచుచు సజ్జనుల గోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగిన దానిని
మఱవ కనుష్ఠించునది సమంజస బుద్ధిన్

క. ఇచ్చునది ధనము పాత్రున
కచ్చుగ నొరు వేఁడ కుండునది యభిముఖులై
వచ్చిన యాశార్థుల వృథ
పుచ్చక చేయునది సర్వభూతప్రీతిన్

క. మనమునకుఁ బ్రియంబును హిత

మను బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగు పలు
కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్

సీ. వదన బాణాసనవ్యక్త ముక్తములైన
పలుకులన్కడు వాఁడి బాణతతులఁ
బరమర్మలక్ష్యముల్ పాయక భేదించు
చుండెడు దుర్జన యోధవరుల
కడ నుండకున్నది కరుణ యార్జవ మక్ష
జయము సత్యంబును శమము శౌచ
మనునవి యెద నిల్పునది శత్రుషడ్వర్గ
జయ మందునది శుద్ధశాంతబుద్ధి

తే. మదముఁ గామంబుఁ గ్రోధంబు మత్సరంబు
లోభమును మోహమును నను లోని సహజ
వైరివర్గంబు నొడిచిన వాఁడ యొడుచు
నశ్రమంబున వెలుపలి యహితతతుల.

## తిక్కన సోమయాజి (1200–1280)

### సందేశము

(శ్రీ మదాంధ్ర మహాభారతము – ఉద్యోగ పర్వము – తృతీయాశ్వాసము – 256 – 262, 264 – 269 పద్యాలు)

క. జలదస్వన గంభీరత
నెలుఁగొప్పఁగ దంత దీప్తులెసఁగ ముకుందుం
డలరుచు సభ నఖిలజనం
బులు విన ధృతరాష్ట్ర భూవిభున కిట్లనియెన్

క. జననాథ! నీ యెఱుంగని
పనులు గలవె యైనఁదగవుఁ బరమహితంబుం
దనవారికిఁ జెప్పన తగు
నని వచ్చితి భారతాన్వయము ప్రియమొందన్

క. క్షీరోదకగతిఁ బాండవ
కౌరవు లొడఁగూడి మనికి కార్యం బది నీ
వారసి నడపుము; వారన
పీరనఁ గురుముఖ్య! నీకు వేఱుంగలదే!

చ. భరతకులంబు ధర్మమును బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గియుండు ననఁగా నుతిఁగన్నది; యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుఁగుఁదమ్ముఁడు; నీ తనయుల్ యశోధురం
ధరశుభశీలు రీ సుచరితక్రమమిప్పుడు దప్ప నేటికిన్

శా. ఈ వంశంబునకెల్ల నీవకుదు రిందెవ్వారి చందంబు లె
ట్లైవర్తిల్లినఁ గీడు మేలుఁదుది నీ యందొందెడుం; గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలివృత్తంబున్ జనస్తుత్యముల్
గావింపందగు నీక యెవ్విధమునం గౌరవ్యవంశాగ్రణీ!

చ. వినుము సుయోధనాదులగు వీరు సధర్ములుగాక కార్యము
ల్గానగ మహార్థసిద్ధి యెడలుం దమకిట్లన కన్వయంబు వ
ర్తనమిది గాదు నాక బెడిదంపుఁదనంబున బంధుకోటికి
న్మనసులు నొవ్వఁగా నవగుణంబులకుం బుయిలోద రేమియున్

ఉ. కౌరవపాండవుల్ తెఱఁగు గైకొని శాంతతఁ బొందియున్కి మే
లారయ నాకు నీకుఁ గులమంతకు నీ నృపకోటి కుర్వికిం
బోరితమైన నింతకును బుట్టు మహాపద; గావునన్ ధరి
త్రీ రమణాగ్రగణ్య! గణుతించి యవశ్యముఁబొందొనర్పవే!

ఉ. అందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱు వా
రెందఱొ యెన్నుమా! యిచట నీ గురు భీష్ములఁ గ్రేణిసేయు వా
రెందఱొ! వారు వీరు నని నీల్గుటకంటె భవద్బలంబులై
యందఱుఁ గూడుటొప్పదె జనాధిప శాంతి యొనర్పుమెమ్మెయిన్

తే. జగతిఁ గల జనపతులు నీ చరణపీఠ
మర్థిఁగొలువ సముద్రవేలావృతోర్వి
యెల్ల నేలుటయొప్పదే! తల్లి ప్రజల
విరోధంబు వాటించు టెంత మేలు?

క, నరనాథ! నీ వుపేక్ష
పరుఁడ వయినఁ గౌరవులక పాండవులక శా
దరయఁగ భూప్రజకెల్లను
దురితం బొనరించినట్ల తుదిఁ గీడు సుమీ!

క. కౌరవపాండవులం దె
వ్వారలకుం జావు నొవ్వు వచ్చిన మేలు
ర్వీరమణ! చిత్తమున నె
ట్లారయుమా! నీకు దుఃఖమగునెట్లయినన్

ఉ. వీరును వారుఁ బండితులు విక్రమవంతులు బాహుగర్వ దు
ర్వారులు పూని రిత్తబవరంబున నాఁడిఁ జావఁబోవ నె
ట్లూరక యుండవచ్చుఁ గడునొప్పెడు మేనులు వాడికై దువుల్
గూరఁగ నాటినం బుడమిఁగూలుట కక్కట! యోర్వవచ్చునే!

ఆ. అట్లు గాకయుండ నీ రెండుదెఱఁగుల
వారిఁ గాచికొనుము! వసుమతీశ!
నీదు ప్రాభవంబు నీతియు శాంతియు
నఖిల జనులుఁ బొగడునట్లు గాఁగ

## పాల్కురికి సోమనాథుడు (13 వ శతాబ్ది)

### బెజ్జ మహాదేవి

(బసవపురాణము-తృతీయాశ్వాసము 625-660; 695-698
707-714; 781-804)

మఱియును విను బెజ్జమహాదేవి యనఁగఁ
గఱకంఠ శ్రీపాద కమలాంతరంగ
"యెల్ల నియోగంబు లెల్ల బాంధవులు
నెల్లవారలు గల్గ నిట్లు భర్గునకుఁ
దల్లిలేకుండుట దా విచిత్రంబు
దల్లి లేకది యెట్లు దా నుదయించె!
దల్లి సచ్చెనొ కాక త్రైలోక్యపతికిఁ
జెల్లఁబో! యిట్లేమి సేయఁగవచ్చుఁ?
దల్లి సచ్చినఁ గాదె తాను దస్సితిని
యెల్లవారికి దుఃఖ మిట్టిద కాదె!
తల్లి గల్గిన నేల తపసి గానిచ్చుఁ
దల్లి గల్గిన నేల తల జడల్గట్టుఁ?
దల్లి యున్న విషంబుఁ ద్రావనేలిచ్చుఁ?
దల్లి యుండినఁ దోళ్ళు దాల్పనేలిచ్చుఁ?
దల్లి పాములనేల ధరియింపనిచ్చుఁ?
దల్లి బూడిద యేల తాఁ బూయ నిచ్చుఁ?
దల్లి వుచ్చెనె భువిఁ దనయునిఁ దిరియఁ?
దల్లి వుచ్చునె సుతు వల్లకాటికిని
దల్లి లేకుండిన తనయుండు గాన

ప్రల్లదుఁడై యిన్నివాట్లకు వచ్చెఁ
జన్నిచ్చి పలుమాఱు వెన్నయుఁ బెట్టి
పన్నుగా నిన్నియుఁ బాలును బోసి
యాఁకొనఁగాఁ గడుపరసి పాలిచ్చి
సాఁకించి పెనుపదే జనని గల్గినను
దానింత వాఁడయ్యెఁ దల్లి లేకయును
దానెంత పెరుగునో తల్లి గల్గినను ?
పెండ్లిండ్ల నోములఁ బేరంటములను
బండువు దినములఁ బాటి జాతరలఁ
దగిన పోఁడిమిసేయు తల్లి లేకున్న
వగవరే మఱియెట్టి మగబిడ్డలైన
నూరకుపేక్షించి యుండంగఁ దగునే ?
యారంగఁ దల్లినై హరుని నేనైన
నరసెదఁ గాక ! యిట్లులేక పెనుచు
తరుణియకాదెట్లు దల్లి దా" ననుచు
ననయంబు బెజ్జమహాదేవి దాన
జననియై పరమేశుఁ దనయుఁ గావించి...
...కొడుకని యిబ్బంగిఁ గొనియాడుచుండఁ
బడఁతి నిశ్చల ముగ్ధ భావంబునకును
శివుఁడును మెచ్చి తాఁ జేకొనియుండె
నువిద గావించు బాల్యోపచారములు

..........................................

దినములు సనఁగ నద్దేవ దేవుండు
వెండి యమ్మకుఁ బ్రపన్నుండుగాఁ దలచి
దండి రోగంబైన తలుచంటి క్రియను
జన్నును గుడువక సంధిల్లనోరు
వెన్నకుఁ దెఱవక యున్న యాక్షణమ
బిట్టుల్కిపడి తల్లి బిమ్మిటి నొడలుఁ
బట్టలేకాపదగిట్టి "నా యన్న !
నాతన్న ! నాపట్టి! నాచిన్ని వడుగ!
నా కుఱ్ఱ! చన్నేలరా కుడ్వవైతి!

..........................................

ఫనియేమి? మాటలఁ బాయునే తెవులు

నినుగొంత పీడించి తన మద్దనేలః
చాలఁజూడంగ నీసంకటం బింక
బాలుండ! నీమీఁదఁబ్రాణముల్విడుతు''
నని తన శిరమున కలుగ నున్నంతఁ
దన తల్లికపుడు ప్రత్యక్షమై నిలిచి
యడుగు మిచ్చెద నీకు నభిమతంబనుడుఁ
"గొడుకః నాకొక కోర్కి కొఱఁతయుఁగలదేః
నీవు నీరోగివై నిత్యుండవై సు
ఖావాప్తి నుండు నాకంతియే చాలు
కన్న మోహంబున కంటె నగ్గలము
ఎన్నఁబెంచిన మోహ మెందు నటంద్రు!
అటుగాన నినుఁగన్నులారఁజూచుచును
నిటయుండుటయే నాకు నీప్సితం బనిన
మందస్మిత ముఖార విందుఁడై తల్లి
నందంద కౌఁగిట నప్పళింపుచును
"ముల్లోకములకెల్ల ముత్తవ! నాకుఁ
దల్లివిగాన నాతల్లి! నీయట్టి
తల్లివి గలుగంగఁదనకు రోగంబు
లెల్లెడఁ బొందఁగ నెట్లుండవచ్చుః"
ననుచు నిత్యత్వమా యమ్మకు నొసఁగె
ననుపమ పరమ పరానంద మూర్తి
యమ్మయై శివుఁగొనియాడుటఁజేసి
"యమ్మవ్వ" యనునామ మయ్యె వెండియును.

## మంచన (14 వ శతాబ్ది)

### మూ ర్ఖ త

*(కేయూర బాహుచరిత్రము-ద్వితీయాశ్వాసము 28-33)*

క. గార్గ్యుఁడను విప్రుఁడొకరుఁడు
దుర్గారాధనముఁబెక్కు దొసఁగులఁబడుచున్
దుర్గాటవిలోఁజేయ ని
రర్గళగతిఁదన్నుఁజూచి యా యంబికయున్.

క॰ వరమడుగు మనిన మ్రొక్కుచు
సరభసమగు కాంక్ష తోడ సంజీవని ని
ర్భర కరుణ న్నాకొసఁగుము
పరమేశ్వరి! యనినఁగొన్ని పచ్చని యాకుల్

చ॰ తలఁచిన మాత్ర నాత్మకరతామరసంబున నున్నవాని ని
మ్ములఁగృపసేసి పీని రసముం బయిపైఁజిలికింపఁగా శవ
మ్ములకును బ్రాణముల్ గలిగి ముందటి రూపమువచ్చి తేజముం
బలమును జెంది పూర్వగుణభంగిఁజరించుట కల్గు నెల్లెడన్.

క. ఎండవు తఱుఁగ వనుచు నిడి
చండిక పొడగానరాక చనుటయు మదిలో
నిండిన సంతసమున వి
ప్రుండవి కొని యాత్మపురము పొంత నొకరుఁడున్

చ॰ చనునెడ నిర్మనుష్యమగు చక్కటి నప్పెనుగాన నెండి పో
యిన యొక పుండరీక శవ మీరము వెల్పలనున్నఁజేరఁగాఁ
జని తన కన్నయౌషధము శక్తి నిజంబుగఁజూడనెంచి చే
త నలిపి యాకులం బసరు దానిపయిం బిడిబెం గుబుద్ధియై

చ॰ పిడిచిన నేమి చెప్ప నతిభీకర దుస్సహ పుండరీక మ
ప్పుడు తన నిద్రమేల్కనిన పోలిక మ్రోగుచు బిట్టులేచి య
వ్వెడఁగగు విప్రుఁగూయిడఁగ వ్రేసి మృతుంబొనరించి మ్రింగెమే
ల్వడసియు బుద్ధిచాలని యభాగ్యులు తప్పిం మందనేర్తురే॥

## శ్రీనాథుడు 1380-1450

### కా శీ వి యో గ ము

(కాశీఖండము-ద్వితీయాశ్వాసము-*103-110, 112*)

తేగీ. కమలలోచన! మనుజుఁడొక్కటిఁదలంప
దైవమొక్కటిఁదలఁచు టెంతయు నిజంబు
కాశిఁబెడఁబాయనని యేను గదలకుండఁ
గాశిఁబెడఁబాపె దైవంబు కరుణలేక

తేగీ. అప్పటికి నియ్యకొంటిఁగా కంబుజాక్షి!
ఋషుల పాశంబులే యింతలేసి పనులు?
కొసలకాఁబోతు నాఁబోతు గ్రుమ్ములాడ
నడిమి లేఁబెయ్యగతి వచ్చెనాకు నిపుడు.

సీ. వివరించి చూడంగ విసుమానములు గాక
గోత్రారి వెఱచునే కుధరములకు?
యుగవిరామమున నుఱ్ఱూంత లూపగఁజాలు
గాలి కొండ దమింపఁజాలదెట్లు?
సర్వ భూతంబుల శాసింపఁజాలెడు
జములావు గిరియందు జడతవడునె?
దహనుని దాహకత్వంబు మహీధ్ర సం
స్తంభంబునకు శక్తి చాలదొక్కొ
రుద్రు లాదిత్య తుషిత మరుద్గణములు
దక్కఁగల దేవతలు జగత్త్రియము క్రమింగి
యుమియఁజాలుదు రట్టివారోపలేరె?
వింధ్య గిరి గర్వసంరంభ విభవ మడఁప.

తే. కామధేనువుఁ దనయింటఁ గట్టినాఁడు
కలవు తన కోఁట లోపలఁ గల్పతరులు
అట్టి యింద్రుండు ప్రార్థించె నట్టె నన్ను
నింత పని కియ్య కోకుండ నెట్లు నేర్తు?

సీ. మాట నిల్కాడఁగాదె? మధుకైటభులు దొల్లి
హరిచేతఁ జచ్చిరే కార్ణవమున
గరుఁడుండు మోమోటఁ గాదె? వాహన మయి
వనజాక్షు నెక్కించుకొనియె వీఁపు
స్వాగతంబునఁ గాదె? చక్రాయుధుఁడడంపఁ
బాతాళ బిలములో బలి యడంగె
విశ్వాసమునఁ గాదె? వృత్రాసురేంద్రుండు
సమసె నంబుధివాక శక్రుచేత
మెఱసి యుపకార మొనరింప మేలువచ్చుఁ
గీడు వచ్చు మనంబులో నోడవలదు
వాఁడు చేసిన ధర్మంబు వానిఁ గాంచుఁ
గీర్తి యొక్కటి సాలదే కేవలంబ?

చ. ప్రతిదివసంబు విందుము పురాణముఖంబునఁ గాశియందు సం
తతముగ నంతరాయములు దాఁకుచునుండు ననంగ నిప్పుడా
శ్రుతి నిజమయ్యె నేనిదె యశోక మనస్థత నుండఁగా నత
ర్కిత గతి వచ్చెఁ జూడుమిదె కిన్నరకంఠి! మహాంతరాయముల్,

తే. విముఖుఁడయ్యెఁ జుమీ ? నాకు విశ్వకర్త
గాక యారక యే భంగిఁ గలుగ నేర్చు
సకల కైవల్య కల్యాణ జన్మ నిలయ
కాశికాక్షేత్ర విప్రయోగ వ్యథార్తి.

తే. పాణి యాహార కబళంబుఁ బాఱవైచి
కూర్పరము నాకు పిస వెట్టి కూళ వోలె
భోగమోక్షములకు జన్మభూమి యైన
కాశి విడిచి నరుండన్యదేశ మరుగు।

సీ. పాయంగవచ్చునే ప్రాలేయగిరి కూట
సమవతీర్ణ జలౌఘ జహ్నుకన్య ?
మఱువంగ వచ్చునే మందార మధురసా
స్వాద ఘూర్ణిత నేత్రు వటుకనాథు ?
విడువంగ వచ్చునేం విఘ్నాంధ కారార్కు-
డుంఠి విఘ్నేశు మండూక జఠరు ?
మానంగవచ్చునే మధ్యాహ్న కాలంబు
శ్రీ విశాలాక్షి కెంజేతి భిక్ష ?
సురలు ప్రార్థింపఁగాఁ బ్రతిశ్రుతము చేసి
యెట్టు వోకుండ నేర్తు నేనింత వాఁడ ?
నెట్టువో నేర్తుఁ గాశిఁ బుణ్యైకరాశిఁ
బ్రకట గుణరత్న దుగ్ధాంబురాశిఁ బాసి

## బమ్మెర పోతన - (15వ శతాబ్ది)

## బలి వదాన్యత

(మహాభాగవతము - అష్టమ స్కంధము - 589-595, 597)

సీ. నిజ మానతిచ్చితి నీవు మహాత్మక
మహిని గృహస్థధర్మంబు నిదియ
యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు
నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు
నర్థలోభంబున నర్థిఁ బొమ్మనుటెట్లు
పలికి లేదనుకంటెఁ బాపమెద్ది
యెట్టి దుష్కర్ముని నే భరించెదఁ గాని
సత్యహీనుని మోవఁజాల ననుచుఁ

తే. బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమర మందఱు దిరుగక చచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె
మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె.

క. ధాత్రిని హాలికునకు సు
క్షేత్రము బీజములు లెస్సఁ జేకుఱు భంగిం
జిత్రముగ దాత కీవియుఁ
బాత్రము సమకూఱునట్టి భాగ్యము గలదే!

శా. కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరిమూట గట్టుకొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!

క. ఉడుగని క్రతువుల వ్రతములఁ
బొడగనఁ జననట్టి పొడవు పొడవునఁ గుఱుచై
యడిగెడినట నను బోఁటికి
నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్

శా. ఆదిన్ శ్రీ సతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీఁదై నా కరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే!

మ. నిరయంబైన నిబంధమైన ధరణీ నిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నౌఁ
దిరుగ న్నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్

ఆ. నొడవి నంతవట్టు నుసలక యిచ్చుచో
నేలకట్టు విష్ణుఁడేటి మాట
కట్టెనేనిఁ దాన కరుణించి విడుచును
విడువకుండ నిమ్ము విమల చరిత!

క. మేరువు తలక్రిందైనను
బారావారంబు లింకఁ బాఱిన లోలో
ధారుణి రజమై పోయినఁ
దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్

మత్త॰ ఎన్నఁడుం బరు వేఁడఁబోఁడట యేకలంబుఁట కన్నవా
రన్నదమ్ములు నైనలేరఁట యన్నివిద్యల మూలగో
ష్ఠి న్నెఱింగిన ప్రోడగుజ్జఁట చేతులొగ్గి వసింప నీ
చిన్నపాపని ద్రోసిపుచ్చఁగఁ జిత్తమొల్లదు సత్తమా !

క॰ బ్రతుకవచ్చుఁగాక బహుబంధనములైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక
మాట దిరుగలేరు మానధనులు !

## అల్లసాని పెద్దన - (1475 - 1535)

## హిమాలయ పర్వతము

(మనుచరిత్ర - ద్వితీయాశ్వాసము - *3, 8, 9, 10, 11, 12*)

చ॰ అటఁజని కాంచె భూమిసురుఁడంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠ దభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుట నటనానుకూల పరిఫుల్లకలాప కలాపి జాలమున్
గటక చరత్కరేణుకర కంపిత సాలము శీతశైలమున్

క. పరికించుచు డెందంబునఁ
బొరిఁగొను కౌతుకము తోడ భూమీసురుఁడ
గ్గిరికటక తట నిరంతర
తరుగహన గుహా విహార తత్పరమతియై

సీ॰ నిడుద పెన్నెఱిగుఁపు జడగట్టు సగరు ము
మ్మనుమండు తపము గైకొనినచోటు
జరఠ కచ్ఛపకులేశ్వరు వెన్నుగానరా
జగతికి మిన్నేఱు దిగిన చోటు
పుచ్చడీ కతనంబు పోఁబెట్టి గిరికన్య
పతిఁగోర్వ నాయాసపడిన చోటు
వలరాచ రాచవా రలికాక్షు కనువెచ్చఁ
గరఁగిన యల కనికరపుఁ జోటు

తే॰ తపసి యిల్లాండ్ర చెలువంబుఁ దలఁచి తలఁచి
మున్ను మచ్చిచ్చును విరాళిగొన్న చోటు
కనుపపులు వేల్పుఁబడవాలుఁగన్న చోటు
హర్షమునఁ జూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన

చ. విలయ కృశాను కీలముల వేఁడిమిఁ బోఁడిమి మాలి వెల్మిడిన్
గలసిన భూతధాత్రి మఱి క్రమ్మఱ రూపయి నిల్చి యోషధుల్
మొలవఁగఁ జేయునట్టి నయమున్ బ్రతికల్పము నెట్లు గాంచు నీ
చలిమలవల్ల నుల్లసిలు చల్లఁదనంబును నూనకుండినన్

సీ. పసుపునిగ్గుల దేఱు పాఁపజన్నిదమొప్పఁ
బ్రమథాధిపతి యింటిపట్టెఱింగె
శచి కేఁత గఱపుచుఁ జదలేట సురరాజు
జలకేళి సవరించు చెలువెఱింగె
నదనుతోఁజేపి చన్నవిసి యోషధుల మ
న్నాదవు కొండలకెల్ల బిదుక నెఱిఁగె
వేల్పుటింతులలోన విఱ్ఱవీఁగుచు మేన
నవరత్నరచనల రవణ మెఱిఁగెఁ
బరిపరి విధంపు బన్నంపుఁబరికరంపు
సొంపు సంపద నిఖిల నిలింప సభయు
నప్పటప్పటికిని జిహ్వాత్రుప్పదుల్ల
నామెఱ లెఱింగె నీ తుషారాద్రి కతన

మ. తలమే బ్రహ్మకునైన నీ నగమహత్త్వంబెన్న నేనెయ్యెడన్
గల చోద్యంబులు జేపు గన్గొనియెదన్ గాకేమి నేఁడేఁగెదన్
నలినీ బాంధవ భానుతప్త రవికాంత స్యంది నీహార కం
దళ చూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నమున్ దెల్పెడిన్

## రామరాజ భూషణుడు-(16వ శతాబ్ది)

### సూర్యోదయము

(వసు చరిత్ర-చతుర్థాశ్వాసము-*128-137* ప.)

మ. అమృతాంశుండు నిశాసతిం గఁని, శీర్యచ్చంద్రికా గంధ
శిల్పముతోఁ బుష్కరశయ్యఁబాసిచన, వేళాదూతి తత్కాల సం
భ్రమ సంశీర్ణతరోడుహారమణివారం బేరి తానొక్కచో
గుమిగాఁబోసెనొ నా మినుక్కురను వేగుంజుక్కఁగంటే చెలీ!

మ. తొవకుం దూరపునంటు, రేమగువ పొందుం బూర్వపక్షంబు,వ
మ్మవుఁదారారుచి మద్విభూతి నదిగా కల్హారితో వారికే
యవినాభావము నాకుఁగాక యని చంద్రాపాయవేళం బ్రదీ
పవిపాండుద్యుతిపేరఁజంద్రిక శిఖిం బ్రాపించె నీక్షించితే!

శా. తారాసస్యము పండినన్ గగన కేదారంబునం జంద్రికా
నీరం బారఁగఁగోసి తద్రుచి ఫలానీకంబు ప్రాతర్మహా
సీరిగ్రామణి తూరుపెత్తెననఁదోచెం దూర్పునందెల్పు, త
ద్దూరన్యస్త పలాలరాశి క్రియ నిందుండేగె నిస్సారుఁడై

మ. సిరి నెత్తామర యింటికిన్ మగుడిరాఁ, జెంతన్ ద్విజారావమూ
ధురిఁబుణ్యాహముఁదెల్పుచున్ గురుతరు ద్రోద్రో నటత్పల్లవో
దర నీహార జలంబు చిల్కఁగ, నయుక్తం బొంటి మైనుండ నం
చు, రథాంగంబు ద్విజాతి గానఁగవయై చూపట్టె నప్పట్టునన్

చ. ఎలమి మనోజబుద్బుఁదెనయించిన జక్కవదీము పెంటి పేరెలుఁ
గునఁబిల్చి చూడ్కిఁగదియించి యెదుర్కొని మేనుమేను నిశ్చల
గుణసంగతిం బెనఁచి చక్రము దామర తెంకిఁజేర్పఁద
త్కలకల శంకఁబోలె విహ గంబులు వీడెఁగులాయ కూటముల్

ఉ. పంచశిలి ముఖుండు తుదబాణమునన్ జగమెల్ల గెల్చి య
భ్యంచిత పుష్పవృష్టి మరుదావళి నింపఁగ నిప్పుడల్లు ము
ద్రించిన జాడఁదెల్పె సుదతీ మధుపంబు పరిచ్ఛదచ్ఛటా
కంచుకి తోత్పలంబు తుదకచ్చునఁజిక్కి యచంచలాకృతిన్

ఉ. తమ్మి పతంగపత్ని తమిఁదాల్చిన పాండుర కోరకాండము
ల్గ్రిమ్మి నిమీలితచ్ఛద పరంపరచేఁబ్రసవా ప్తివేళ రా
నిమ్ముగ వాని నొయ్య విరియించిన హేతుగుణా ప్తిఁబాంథ వ
ర్గమ్ముల నేఁచు తేఁటి పిలుకల్వెడలెన్ సహజాసితచ్ఛవిన్

చ. సమయమహర్షి, బోధగుణశాలి, మహోదయ భూమి భృద్వతం
సమునకుఁబ్రాగ్వధూటి యెదఁజక్రహితుండు నశేషదేవతాం
శమునగు సూనునిందలఁచి సాంధ్యమహోమయ హోమవహ్నిదీ
ప్తముగ నొనర్చెఁదారచరు భక్తి శతాహుతి పూర్వకంబుగాన్

మ. కుముదాధార విహారముల్ కమల కన్గోఁజాల కంభోజగే
హము మూయం దెఱపింతు వేగనని వామాలోకమున్మాటి యా
సమయోపేంద్రుఁడు దక్షిణాక్షిఁదెఱచెన్ సంజాత రాగాను బం
ధముతో నా విధుఁడేఁగెఁ బ్రొద్దువొడిచెన్ బంధూక బంధుచ్ఛవిన్

శా. ఓ చామీకర చారుగాత్రి! నిను గోత్రోత్తంసమున్వేఁడి నేఁ
డా చేదిక్షితిపాల శేఖరునితో హత్తింపఁగా వచ్చు తత్

ప్రాచీభర్తకుఁబట్టు పట్టుగొడుగై భానుండు దోఁపం, బ్రభా
వీచుల్ తద్గత రత్న గుచ్ఛముల రీవిం బొల్చెఁబ్రాంతంబునన్

**చేమకూర వేంకటకవి—(17వ శతాబ్ది)**

## పెండ్లి

(*విజయవిలాసము-తృతీయాశ్వాసము-109-113; 115-119.ప*)

చ. కలరొక యెవ్వరైనా నవుఁగాదని యడ్డము వల్కు వార లీ
యిలః మఱిఁదానెఱుంగనటు లెంతటి మాయల కాఁడు కన్యకా
తిలకము దారవోయ వసుదేవునిఁగట్టడ నేసి వేయిక
న్నులు గల వేలుపుంబలెఁగనుంగొనుచుండె మురారి చెంగటన్.

క. మధుకర వేణులు కొందఱు
మధురోక్తులు వెలయఁదెర యమర్చిరి సరగన్
మధుమధన జనకుఁడంతట
మధుపర్క మొసంగె నృపకుమారాగ్రణికిన్

తే. దేవకి యొసంగఁగా వసుదేవుఁడపుడు
చంద్రకాంతపుగిండి గొజ్జంగ నీటఁ
బసిఁడి పళ్ళెములోఁ బదాబ్జములు గడిగి
తనదు మేనల్లునకుఁ గన్యధార వోసె

ఉ. సూరెలఁజేరి యష్టమహిషుల్ దగువారు నొసంగ నావలం
గోరిక నిక్కినిక్కి కనుఁగొంచు సుపర్వులెసంగ వాద్యముల్
బోరు కలంగ నంగములు పొంగ వధూవరులం గడాని బం
గారపు మెట్టుఁ బ్రాలపుటికల్ గదియించిరి గొందతై దువల్

క. వడిఁ దెఱవల్ దెరవంపం
బడఁతుక నగుమొగము కానఁబడియెన్ గాంతల్
తడఁబడఁగ శరన్మేఘముఁ
బెడఁబాసి వెలుంగు చంద్రబింబమువోలెన్

చ. పొలయలుకందు వేఁడుకొను పొందికఁ దెల్పెడు లీల సిగ్గు దొ
ట్రిలిన ముఖాబ్జమెత్తి మెడక్రిందికి హస్తయుగంబు సాఁచి వే
నలి ఁదెమలించి సౌఖ్యకలనస్థితి గట్టిగఁ బట్టి కట్టె న
వ్వెలఁదుక కంఠసీమఁ గురువీరుఁడు మంగళసూత్ర మయ్యెడన్

చ. తమతమ వారలొండొరుల దండఁ గరంబుల ముత్తియంపుఁ బ
ళ్లెములిడి 'చేయి మీఱఁగవలెంజుమి నీ' కని యెచ్చరింపఁగా

నమితముగా సుభద్రపయి నర్జునుఁ డర్జునుపై సుభద్రయుం
తమిఁ దలఁబ్రాలువోసి రెల నవ్వును సిగ్గును లోఁదలంకఁగన్

తే. అగ్నిసాక్షిగఁ బెండ్లాడినట్టి ప్రియ వ
ధూటియును దాను బంగారుపీఁట మీఁద
నుచితగతి వెలయంగఁ గూర్చుండి పాక
శాసని చెలంగె దీవించి సేసలిడఁగ.

తే. మృగమదముచెంతఁ గుంకుమరేఖ వోలె
నీలమణి పొంత నుదిరి పొన్నేకువోలె
మేఘము కుఱంగటన దీగ మెఱుపువోలె
నర్జునుని చెంగట సుభద్ర యలరె నపుడు.

చ. కలుగుఁ గలావిశేషము జగంబునఁ బెండ్లి యటన్న నెట్టి వా
రల కటువంటిపట్ల నెలప్రాయము రూప మొయార మూని పే
ర్కలిగిన రాచకూఁతురఁట! రా కొమరుండఁట! యేమి చోద్య మా
సొలపు మిటారి సిగ్గరులు చూపరచూడ్కికి విందు సేయుటల్

## శతక పద్యావళి

### యథావాక్కుల అన్నమయ్య (13 వ శతాబ్ది)

*సర్వేశ్వర శతకము 87, 88 ప.*

మ. తరులం బువ్వులు, పిందెలై యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగున్
హర! మీ పాదపయోజపూజితములై యత్యద్భుతం బవ్విరుల్
కరులౌ, నశ్వములౌ, ననర్ఘమణులౌఁ గర్పూరమౌ హారమౌఁ
దరుణీ రత్నములౌఁ బటీరతరులౌఁదథ్యంబు సర్వేశ్వరా!

మ. ఒక పుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగ సద్భక్తి రం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదన్నఁ బా
యక కాలత్రితయోపచారముల నిన్నర్చించుచోఁ బెద్దనై
ష్ఠికుఁడై యుండెడువాడు నీవగుటఁదాఁజిత్రంబె సర్వేశ్వరా!

### బద్దెన (13వ శతాబ్ది)

*సుమతి శతకము–14, 39 ప*

క. ఉత్తమగుణములు నీచున
కెత్తెఱఁగునఁ గలుగ నేర్చు నెయ్యెడలం బా
నెత్తిచ్చి కరఁగి పోసిన

నిత్తడి బంగారమగునె యిలలో సుమతీ!

క. కూరిమిగల దినములలో
నేరము లెన్నడును గలుగ నేరవు; మఱి యా
కూరిమి విరసంబైనను
నేరములే తోఁచుచుండు నిక్కము సుమతీ!

## ధూర్జటి (15వ శతాబ్ది)

*శ్రీకాళహస్తీశ్వర శతకము 13, 45 ప.*

శా. ఏ వేదంబు పఠించె లూత, భుజగంబే శాస్త్రములు్సాచెఁదా
నే విద్యాభ్యసనం బొనర్చెఁగరి చెంచే మంత్ర మూహించె, బో
ధా విర్భావ నిధానముల్ చదువులయ్యా! కావు ! మీపాద సం
సేవాసక్తియె కాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!

మ. పవి పుష్పంబగు, నగ్ని మంచగు, నకూపారంబు భూమిస్థలం
బవు శత్రుండతి మిత్రుఁడౌ విషము దివ్యాహారమౌ నెన్నఁగా
నవనీ మండలి లోపలన్ 'శివశి' వేత్యాభాషణోల్లాసికిన్
శివ! నీ నామము సర్వవశ్యకరమౌ శ్రీకాళహస్తీశ్వరా!

## కంచర్ల గోపన్న (17వ శతాబ్ది)

*దాశరథీ శతకము 16, 30 ప.*

ఉ. ముప్పునఁగాలకింకరులు ముంగిట వచ్చినవేళ, రోగముల్
గొప్పరమైనచోఁగఫము కుత్తుక నిండిన వేళ, బాంధవుల్
గప్పినవేళ, మీ స్మరణ గల్గునొ? గల్గదో నాఁటికిప్పుడే
తప్పక చేతు మీ భజన దాశరథీ! కరుణాపయోనిధీ!

ఉ. చిక్కని పాలపై మిసిమిఁజెందిన మీఁగడ పంచదారతో
మెక్కినభంగి మీ విమల మేచకరూప సుధారసంబు నా
మక్కువ పళ్లెరంబున సమాహిత దాస్య మనేటి దోయిటన్
దక్కెనటంచు జుర్రెదను దాశరథీ; కరుణా పయోనిధీ!

## ఏనుగు లక్ష్మణకవి [18వ శతాబ్ది]

*(భర్తృహరి సుభాషితము - 16, 52 ప.)*

ఉ. విద్య నిగూఢ గుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశబంధుఁడున్
విద్య విశిష్టదైవతము విద్యకు సాటిధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే!

ఉ. ఆపదలందు ధైర్యగుణ మంచిత సంపదలందుఁ దాల్మియున్
భూపసభాంతరాళమునఁ బుష్కల వాక్చతురత్వ, మాజి బా
హాపటుశక్తియున్ యశమునందనురక్తియు, విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్ బ్రకృతి సిద్ధగుణంబులు సజ్జనాళికిన్

## వేమన [18వ శతాబ్ది]

(వేమనశతకము)

ఆ॥వె. ఉప్పుకప్పురంబు నొక్క పోలిక నుండు
చూడఁజూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్య పురుషులు వేఱయా!
విశ్వదాభిరామ! వినురవేమ!

అల్పుఁడెపుడుఁబల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను
కంచుమ్రోగి నట్లు కనకంబు మ్రోగునా
విశ్వదాభిరామ! వినురవేమ!

## తిరుపతివేంకటేశ్వర కవులు (1871-1950)

### జ్ఞానధనము

(బుద్ధచరితము–పంచమాశ్వాసము-82-92)

సీ. సహకార కిసలయచ్ఛవితోడ దలనిండ
జడలు గట్టిన శిరోజముల తోడ
రోహిణీ సహితార్క రుచితప్త సుమలతా
గ్రంబుఁబోలిన శరీరంబు తోడ
దినకరచ్ఛన్నుఁడై తేజు బాసిన పూర్ణ
చంద్రుఁబోలిన ముఖచ్ఛాయతోడఁ
జిరదృష్ట పతిరూప పరిపుష్ట మై వర్ణ్య
దైన్య సంతోష ఖేదముల తోడఁ

తే. గూడ నేడేండ్ల రాహులుం "దేడ కేగె"
దంచుఁజెలరేగుచును జీరయంచు లాగ
నెడద నేవేళ భావింప బడుచునున్న
జీవితేశ్వరు గుర్తించి చేరబోయి

క. హా!సిద్ధార్థా! యని కడు
నాస మెయిం గనుల నశ్రు లత్యధికతర
శ్రీ సృష్టి సేయఁబడములు
కై సేసెన్ మిగుల నెగడు కచభరకాంతిన్

ఆ. అతఁడు లేవనెత్తునంత కమ్మహిళ వి
వశమనస్క యగుచు వగ నిగుడగ
గౌఁగిలించుకొనియె; గాంతలు కాంతుల
గారవించుటిట్లు కాదె యెందు॰

వ॰ పసంపడి సిద్ధార్థుండును మొదట నొక్కయింతే వాసినిగాఁ దలంచి తత్పుణ్యంబు
నను దదీయముఖ సౌష్ఠవంబునను బ్రియురాలిఁగా గుర్తించి యోదార్చి జ్ఞానదాయ
కంబులగు వచనంబులు కొన్ని పలికె... అంతట మృదు మధురగంభీర సంభాషణ
మ్ముల విషయనివర్తన విషయంబులగు నుకువులు నుకువుమన్న కుమారు నవికారు
మారాకారు దవుదవ్వులం గాంచి యాతని వేసంబు మనంబుఁగలంప
శుద్ధోదన నృపాలుండు కోపంబు పట్టఁజాలక వాయువంటి డిగి దగ్గఱకుం జనుదెంచు
నయ్యెడ-

క. అనఘాత్ముండగు బుద్ధుం
డును దండ్రికిఁబేర్మి మ్రొక్కుడుం గోపము
గ్రన్నన మాయమయ్యె;
బుద్ధునిఁగనుఁగొనియుం గోపముండఁగలదే యచటన్

తే. అఖిల రాజాధిరాజ పూజ్య ప్రభావ
మహితమై యొప్పు తనదు కుమారు మహిమ
మరసి యాశ్చర్యమంది యయ్యనఘుఁడిట్టు
లనియెఁబుతునితోఁబేర్మి యనువు పడఁగ

చ॰ ధర సకలంబు నేలుచు నుదారుఁడవై యశముంగడించి యె
ల్లరు నృపతల్లజుల్ బ్రణతులం బచరింపఁగఁజుట్టలెల్ల వ
హ్వారె యనఁగా సుఖింపఁదగు నంతటివానికి నింతవచ్చె! నె
వ్వరి నెటు సేయ నేరవు కృపారహితమ్ములు ధాత చెయ్దముల్

సీ॰ ఆపన్న సత్త్వయౌ నర్ధాంగి కోర్కుల
నింపుమైఁదీర్చి మన్నింపవైతి
పురుడు వోవకమున్న పుత్రుని నెమ్మోము పీ

క్షించు భాగ్యంబుఁ గాక్షింపవైతి
నా కుమారుగ నిన్నునమ్మునఁ దలఁచు ప్ర
జల సమ్మతినిఁ బొందఁ జాలవైతి
ముదుసలినై రాజ్యము నొనర్పలేని నా
దగు నశక్తతకు లోఁబొగులవైతి

వకట! యింతటి రాజ్యంబు నడవి పాలు
చేసి సన్న్యాసి వైతి కాశ్మీర గర్ధ
భము విధమ్మున నీ జాతకము వృథావి
శేష భాజన మింకేమి సేయఁగలదు!

క. నావుడు బుద్ధుండిటి
నాకీవేళనె పట్టుపడియెనె? పరంపరగా
నే వచ్చుచున్న దనుటయు
భూవరుఁడిట్టులను నలుక వొంపిరి వోవన్

క. ఎలమి మహాసమ్మత ము
ఖ్యులు నూర్వురు నృపులు శాక్యకుల సంభవులీ
యిల నేలిరందు నీవలెఁ
గలసెనె బైరాగులందొకండేని సుతా!

చ. అనవుడు బుద్ధుఁడిట్లను మహాత్మ! మదుక్తి మదీయ జన్మ వ
ర్తన పర మేను మున్నును బరంపరగా నిటు సన్న్యసించు చుం జ
నకుని కుందు దీర్చితిని జ్ఞాన ధనంబిడి పెక్కుసార్లు
కావున నిపుడట్టిదే ధనము పూర్తిగా నీ కిడువాఁడ శాంతికై

## దువ్వూరి రామిరెడ్డి (1895 - 1947)

### గాంధి మహాత్ముడు

[కవి కోకిల గ్రంథావళి - 2 సం. 258 - 60 పుటలు]

ధర్మ సంస్థాపనార్థంబు దైవశక్తి
యుగయుగంబున జన్మించుచుండునన్న
యార్య సూక్తికిఁ దార్కాణమైన యట్టు
లవతరించితివె గాంధిమహాత్మ! నీవు,

భీష్మదీక్షయుఁ జైతన్య ప్రేమరసము
బుద్ధునియహింస ప్రహ్లాదు పూతభక్తి
యల హరిశ్చంద్రు సత్యవ్రతాఢ్యతయును
గలసి మూర్తీభవించితే కార్యశూర!

కురుభూమిన్ స్వవిపక్ష శోణితపువాగుల్ పొర్లిపాఱన్ వసుం
ధర భారంబును డించి ధర్మనియతిన్ దక్కించె శ్రీకృష్ణుఁడి
త్తఱి నీవన్న నహింస సూత్రమును సంస్థాపించి వర్తించి దు
ర్భర దౌర్జన్యపు మూలబంధము సడల్పం జాలితౌ ధీనిధీ!

ముప్పదిమూడు కోట్లప్రజ ముక్తపథంబున నీ యనుజ్ఞలం
దప్పక యాచరింత్రు; మృతిదంష్ట్రలఁ జిక్కఁగనైన జంకరో
యప్ప! చిరప్రసుప్త శిథిలాస్థికళేబరమైన నీవు చేఁ
ద్రిప్పఁ బునః ప్రబుద్ధమయి తేజరిలున్ మహిమేంద్రజాలతన్

కడపల్ దాటని కోమలుల్ విజయ శంఖంబెత్తి పూరించి న
గ్గడ సత్యాగ్రహ మంత్రబోధనలు సల్పంజల్ప గ్రామీణులున్
నడుముల్‌గట్టి స్వదేశసేవలకుఁ బూనన్ జైళ్లు నిండార నె
క్కడ నూహించితి వీ మహోద్యమ మమోఘశ్రేయమున్ గాంధీజీ!

మొనలో మేటి ఫిరంగిదెబ్బలకు రొమ్ముల్ సాఁపి పోరాడఁ గం
జను నాంగ్లేయుల వజ్రముష్టియుతమౌ సామ్రాజ్యగర్వంబు, త
ర్జన, ధిక్కారము నీదు నాత్మబలమున్ రాకొట్టి డీకొట్టి పొం
దెను గండూతి చికిత్స ప్రాకృతులకున్ దివ్యప్రభల్ లొంగునే!

అరకట్టు పుట్టంపు నిఱుపేదవయ్యును
        సమ్రాట్టుతో సరి సమతఁ గనుట
మఱుచాఁటి కర్చుకై చిఱుపైసయును లేక
        కోటి రూప్యంబులఁ గూర్పఁ గనుట
శమదమక్షమ నిత్యశాంతికి నెలవయ్యు
        సత్యాగ్రహంబును సల్పుచుంట
కంటికిందాఁని కాయంబు గల్గియు
        దేశదేశంబులఁ దేజరిలుట

ఇట్టి యన్యోన్య వైరుద్ధ్య మెసఁగునట్టి
నీ మహత్తర జీవిత నియతి లోని
గుప్తభావంబు లెవ్వరి కొలత కందు
నందు వైదేశికుల కెట్టులంతుచిక్కు?

భోగము, సౌఖ్యసంపదలు బొందుటకుందగు మార్గముండియున్
వేగమ తత్పథంబు విడి విశ్వజనీన కుటుంబివై మహా
త్యాగముఁ జూపి జీవితమునంత స్వరాజ్యపుయజ్ఞ వహ్ని నీ
రాగత వ్రేల్చినాఁడవు ధరం బశుశక్తి వినాశ మొందఁగన్

## పింగళి - కాటూరి కవులు- [1894-1972 ; 1895-1965]

### ధర్మపథము

*[సౌందరనందము - పునరాగమనము 20-27 పద్యాలు]*

మమతా విరహితమున్ సం
భ్రమదూరముఁ గరుణరస తరంగితమున్ శాం
తమహోదారమగు కటా
క్షమునన్ దజ్జనముఁ గనుచు గౌతముఁడనియెన్

సుతుఁడంచున్ బతియంచు బాంధవుఁడఁటంచున్ మోహ విభ్రాంతి సం
గతులై దుస్తర శోకవార్ధిఁబడి చీకాకైన యో జీవసం
తతులారా! కలిపాశబద్ధులగు నార్తప్రాణులారా! జను
ర్మృతి సంపీడితులార! సత్యపథమున్ మీరెల్ల రాలింపుఁడీ!

భావింపన్ క్షణభంగురమ్ములగు జీవవ్రాతమున్ నమ్మి యే
లా విభ్రాంతమతిన్ భవాంధువునఁ ద్రెళ్లన్ జూతురయ్యయ్యో! యీ
చావుం బుట్టువులేల? కామ్యమృగతృష్ణావారికై పర్వు లే
లా? వే భంగుల సృష్టి నిత్యపదవాచ్యంబు బున్న విన్పింపుఁడీ!

మొదలీ సంసృతిబంధకారణముఁ దన్మోక్షమ్ము నూహింప లే
కెద హింసారతి నూని పాపమతులై యేలా చెడన్? ద్రొక్కఁగాఁ
గదరయ్యా! నవధర్మమార్గమును వక్కాణింపుఁడీ సత్యభూ
తదయాశీల త్రిశబ్దయుక్తమగు మంత్రం బర్థి వేనోళులన్!

యమనియమమ్ము లాకులు, యథార్థము నాభి, సమాధి నేమియై
యమరిన ధర్మచక్రము దయామతిఁదాలిచి త్రిప్పరయ్య! యా
యమునకు బొమ్మ వెట్టియు భవాసురు నౌదలమెట్టి, మోక్షకాం
త మెడను తాళిగట్టుటకుఁ దారసిలున్ శుభ తంతు సంతతుల్!

భవ మను నైంద్రజాలికుని పాణితలమ్మునఁ జిక్కి నశ్వరం
బవు సుఖచంచలాద్యుతులకై వలపూని, సువర్ణశృంఖలల్
దవిలిచి యొండొకళ్ళకు సదా నటియింతురు కీలుబొమ్మలై;
తవిలి చరింపరాదె నవధర్మము జన్మవిముక్తి కల్గెడిన్.

చరియింపరే! పాపవంఘాత తిమిర ప
లాయన మంత్ర మస్తేయపథము
పాలింపరే! యపవర్గ దుర్గకవాట
పాటన మ్మిది సత్యవాఙ్నియమము
కైకొనరే! లోక కల్యాణ కృద్ధర్మ
సారభూతం బహింసావ్రతమ్ము
అంగీకరింపరే! యలరువింటికి దురా
సదమైన యీ బ్రహ్మచర్య దీక్ష
తాల్పరే! శాంతి దాంతి నిధానములకు
మహిత సిద్ధాంజనమ్ము సమత్వబుద్ధి
ఆమయజరాపమృత్యువు లంటనీని
శీలకవచమ్ము దీనిఁ గై సేసికొనరె!
ఇది సత్యం బిది నిత్యం
బిది భవలతికాలవిత్ర మిది శితదంష్ట్రా
వదనయగు మిత్తి యోదలఁ
బదార్పణము భవ్యమోక్షపద మియ్యదియే!

## విశ్వనాథ సత్యనారాయణ (1897 - 1976)

### రెండు నక్షత్రాలు

*భ్రష్టయోగి (ఖండకావ్య సంపుటి) 23-24 పేజీలు*

ఉ. వ్రేఁగగు హైమసౌధమణి వీధికఁ బుట్టెను రాచబిడ్డ, క
ల్పాగము వోలె నేల విరియంబడె బంగరుముద్ద లేదెనన్
ద్యాగము పొందె వారసతులాడిరి ముంగిటఁ దూర్యరావముల్
మ్రోఁగెను లోకపుం జనులు బోసన సన్నుతి వెట్టి రెంతయున్

తే. గీ. ఒక్క చిఱుపేద గుడిసెలో నుద్భవిల్లి
నాఁడు కవికూన పదియవనాఁడు మంత్ర
సాని దెప్పిన దన్నము చాలదంచు
మంత్రమో! సఖినాఁడు బ్రాహ్మణుఁడు వచ్చి!

సీ. ఆ రాచబిడ్డ కల్యాణ పల్యాణ స
జ్జిత పంచకల్యాణిఁ జెలువు గులికె
ఈ కవికూన పేఁకట మాడి క
న్నులలోనఁ బ్రాణముల్ నిలుపుకొనియె
ఆ రాచకూన మార్గాయాస ఖిన్ను ష్మా
జములు వంగుచుఁ బథిశ్రమము వాపె

సీ కవిబిడ్డ దుఃఖైక జన్మునిఁ దీక్ష్ణ
కిరణుండు ఖచి నుడికించి వైచె

............................

ఉ. రాజు నిరంత భోగ మధురంబగు జీవిత మంతతించు నా
రోజునఁ దూర్యముల్ మఱల మ్రోసెను శ్రీకలకంఠ కంఠ గీ
తీ జగతీ ఘలంఘల గతిప్రమదం బొలసెన్ మనోజ్ఞ వ
ర్షా జయనాద నీరద ఖరంబయి మ్రోఁగెఁ ద్రయీనినాదముల్.

తే. వె. నాటి సంజవేళ నభమున ధగధగా
యిత విలాసదీప్తి జతను పఱిచి
సానయిడిన మణి విధాన దీపిల్లు తా
రక యొకండు నేల రాలిపడియె!

చ. కవికి క్షుధాగ్ని పీడితము కాయము త్రెళ్లెను కాష్ఠవహ్నిలో
శవమిడు నంతలో సపరసాగరమందునఁ గర్మసాక్షి క్రుం
కువడె నొకింతలోన మెఱుఁగుల్ దెసలందునఁ గ్రమ్ముకొంచు నూ
త్న విలసనమ్ము చిమ్ము నొక తారక మింటికి నెక్కె వెంబడిన్.

## గడియారము వేంకటశేషశాస్త్రి (1897 జననము)

### భారతీయ సతీ గౌరవము

(శివభారతము - తృతీయాశ్వాసము 157-168 ప)

మ. అనుచో నుత్తరసహ్యభూవిజయమై యబ్బాజి సోన్‌దేవుఁడా
య్యెన నేతెంచి సఖడ్గపాణి వినతుండై 'దేవ! మీ యాన తీ
రునఁ గళ్యాణి జయించి దాని సరదారున్ బట్టి బంధించి, యా
తని సర్వస్వము రాణివానమును దోడ్తన్ దెచ్చినా, మంచనన్.

శా. ఆ - యేమీ? యొక రాణివాసమును బుణ్యావాసమున్ దెచ్చి నా
వా? యే హైందవుఁడైన నీగతి నమర్యాదన్ బ్రవర్తించునే?
మా యాజ్ఞన్ గమనింపవో? జయమదోన్మాదంబునన్ రేఁగి, నీ
యాయుస్సూత్రము లీవ త్రుంచుకొనెదో? యౌద్ధత్య మోర్వన్ జుమీ!

మ. అనుచున్ జేవురుమీఱు కన్నుఁ గవతో నాస్పందితోష్ఠంబుతో
ఘనహుంకారముతో నటద్భృకుటితో గర్జిల్లు నా భోన్ సలే
శునిఁ జూడన్ బుయిలోడెఁ గొల్వు; శివుఁడీసున్ గుత్తుకన్ మ్రింగి, లో
ర్ధన నవ్వారల బంధమూడ్చి గొనితేరన్ బంచె సోన్ దేవునిన్

మ. త్వరితుండై యతఁడట్టులే సలిపి "దేవా ! నన్ను మన్నింపు ; మీ
సరదారున్ గొని తెచ్చుచో సరభసోత్సాహంబు కన్గప్పె ; దు
శ్చరితాలోచన లేదు ; లేదు భవదాజ్ఞాలంఘనోద్వృత్తి ; మీ
చరణద్వంద్వము నాన' యంచు వినిపించన్ సుంత శాంతించుచున్.

మ. శివరాజంతట మేల్ముసుంగుఁ దెరలో స్నిగ్ధాంబుదచ్ఛాయలో
నవసౌదామినిఁ బోలు నా యవనకాంతారత్నమున్ భక్తి గౌ
రవముల్ వాఱఁగఁ జూచి పల్కె 'వనితారత్నంబు లీ భవ్య హైం
దవ భూ జంగమ పుణ్యదేవతలు ; మాతా ! తప్పు సైరింపుమీ !

సీ. హరిహరబ్రహ్మలఁ బురుటిబిడ్డలఁ జేసి
జోలఁబాడిన పురంధ్రీలలామ
యమధర్మరాజు పాశముఁ ద్రుంచి యదలించి
పతిభిక్ష గొన్న పావనచరిత్ర
ధగధగద్దహనమధ్యము పూలరాసిగా
విహరించియున్న సాధ్వీమతల్లి
పతినిమిత్తము సూర్యభగవాను నుదయంబు
నరికట్టి నిలుపు పుణ్యముల పంట
అట్టి యెందఱో భరతాంబ యాడుబిడ్డ
లమలపతిదేవతాత్వ భాగ్యములు వోసి
పుట్టి నిలు మెట్టి నిలుఁ బెంచు పుణ్యసతులు
గలరు, భారతావని భాగ్య కల్పలతలు

మ. అనల జ్యోతుల నీ పతివ్రతలఁ బాపాచారులై డాయు భూ
జనులెల్లన్ నిజసంపదల్ దొఱఁగి యస్తవ్యస్తులై పోరె ; వి
త్తనమే నిల్చునె ? మున్నెఱుంగమె పులస్త్యబ్రహ్మసంతాన, మో
జననీ ! హైందవభూమి నీ పగిది దుశ్చారిత్రముల్ సాగునే ?

తే. యవన పుణ్యాంగనామణి వగుదు గాక
హైందవుల పూజ తల్లియట్లందరాదె?
నీదు రూపము నాయందు లేదయైనఁ
గనని తల్లివిగా నిన్ను గారవింతు.

శా. మా సర్దారుఁడు తొందరన్ బడి యసన్మార్గంబునన్ బోయె; నీ
దోసంబును గని నొచ్చుకోకు, నినుఁజేరన్ నీగృహంబిప్పుడే
నా సైన్యంబును దోడుగాఁ బనిచెదన్, నాతల్లిగాఁ దోడుగా
ద్రోసిళ్లన్ నడిపింతు; నీ కనుల యందున్ దాల్మి సారింపుమీ!

మ॰ అని కొండాడి, పతివ్రతాహిత సపర్యాధుర్యుఁడాతండు యా
వన కాంతామణి కర్హసత్కృతు లొనర్పన్‌జేసి, చేసేతఁ జి
క్కిన సర్దారుని గారవించి హితసూక్తిన్ బల్కి, బీజాపురం
బునకున్ బోవిడె- వారితోఁ దన బలంబుల్ గొన్ని తోడంపుచున్

మ॰ శివరాజంతట సోనదేవుమొగమై శ్రీలెంతయున్ బూజ్య, లే
యవమానంబు ఘటింపరా, దిది మదీయాభీష్ట; మస్మచ్చమూ
ధవులీ యాజ్ఞ నవశ్యమోమవలె; నీ తాత్పర్యమున్ జూచి, లోఁ
కువ చేకూరమి నెంచి, నీయెడ దొసంగు ల్లేమి భావించితిన్

తే. మొగలుల దండురాయిడి ముడుఁగఁజేయు
నుత్తరమున 'గళ్యాణి' "మాహులి"యుఁజేరె
ప్రజల సౌఖ్యము మా ప్రభుత్వమును బెనుప
నట సుబేదారుఁడవుగఁ గార్యమ్ము గొమ్ము"

## దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి - (1897 జననము)

### ఆశ

(కృష్ణపక్షము-౩౩)

కన్నీటి కెరటాల వెన్నెలేలా?
నిట్టూర్పు గాడ్పులో నెత్తావి యేలా?
ప్రళయకాల మహోగ్ర భయద జీమూతోరు
గళ ఘోర గంభీర ఘళఘళార్భటులలో
మెఱపేలా?
ఆశని పాతమ్ములో నంబువేలా?
హాలాహలమ్ములో నమృతమేలా?
ప్రబల నీరంధ్రాభ్ర జనిత గాఢధ్వాంత
నిబిడ హేమంత రాత్రి కుంతలములలో
చుక్కేలా?
శిథిల శిశిరమ్ములోఁ జివురేలా?
పాషాణ సాళిపైఁ బ్రసవమేలా;
వికృత క్రూరక్షుధా క్షుభిత మృత్యు కఠోర
వికట పాండుర శుష్క వదన దంష్ట్రాగ్నిలో
నవ్వేలా?

## ఓయి నటరాజ

(ఊర్వశి 25)

అవధరింతువు ప్రతి దివసాంతమందు
నిత్యనూతన తాండవ నృత్యకేళి
ఓయి నటరాజ! తలలైన నూపలేక
భువనములు దుర్భరానందమున నడంగ
అప్పుడూహాంచలమ్ముల నతిశయించి
పొరలు నమృతరసంపు మాధురులలోనఁ
గొట్టుకొనిపోవు స్వామి! నా క్షుద్రజీవి
తమ్ము గూడ దారియెలేక తనివివోక
అంత నే వెఱ్ఱినై పోమనయ్య! నిన్నుఁ
బోలి పాడఁబోవుదు; నిన్నుఁ బోలి నాట్య
మాడఁ బోవుదు, లజ్జఁబోనాడి, కాక
యింత దాహమ్ము దహియింప నెటులు మనుదు?
ఏవిధాన సౌందర్య రసైక జీవి
నిలువ నేరుతు నిట నొక్క నిముసమేని
మానుకీన జీవిత శుష్క మార్గముల త్వ
దీయ పాదమంజీరముల్ మ్రోయకున్న
ఆటతోఁ బాటతో నేర్చినట్లు దేవ!
ఏనుగూడ నీవలె నటియింప నిమ్ము!
ఎడతెగని యాత్ర నెట్లొ సాగించు వఱకు!
ఎట్లో నీ దర్శనమ్ము సాధించు వఱకు!

## శ్రీశ్రీ - (1910 జననము)

### భి క్షు వ ర్షీ య సి

(మహా ప్రస్థానం-14)

దారిపక్క చెట్టు క్రింద
ఆరిన కుంపటి విధాన
కూర్చున్నది ముసిల్దొకతె
మూలుగుతూ ముసురుతున్న
ఈగలతో వేగలేక.

ముగ్గు బుట్టవంటి తలా

ముడుతలు తేరిన దేహం
కాంతిలేని గాజుకళ్ళు
తనకన్నా శవంనయం.
పడిపోయెను జబ్బుచేసి
అడుక్కునే శక్తిలేదు
రానున్నది చలికాలం
దిక్కులేని దీనురాలు
ఏళ్ళు ముదిరి కీళ్లు కదిలి
బతుకంటే కోర్కె సడలి-
పక్కనున్న బండరాతి
పగిదిగనే పడిఉన్నది.
"ఆ అవ్వే మరణిస్తే
ఆ పాపం ఎవ్వరి"దని
వెర్రిగాలి ప్రశ్నిస్తూ
వెళిపోయింది !

ఎముకముక్క కొరుక్కుంటు
ఏమీ అనలేదు కుక్క
ఒక ఈగను పడవేసుకు
తొందరగా తొలగె తొండ!

క్రమ్మె చిమ్మ చీకట్లో
దుమ్మురేగె నంతలోన
"ఇది నా పాపం కా"దనె
ఎగిరివచ్చి ఎంగిలాకు

# గద్యవిభాగము

**కళువె వీరరాజు (17వ శతాబ్ది)**

## ఇంద్రప్రస్థమును వీడి శ్రీకృష్ణుడు వెడలుట

*(ఆంధ్ర వచన భారతము - ద్వితీయాధ్యాయము - పు. 4)*

అంతట వైశంపాయనుండు జనమేజయునిం జూచి "కురువంశోత్తమా ! జనార్ద నుండింద్రప్రస్థపురంబున సంతుష్టాంతరంగులగుచుఁ బాండునందనులు బహుమాన పురస్సరంబుగ నొనర్చు పూజలం గైకొనుచుఁ గొన్ని దినంబులు సుఖంబుగ వసియించి వసుదేవునిం గనుంగొను వేడుక ద్వారకానగరంబునకు నరుగం దలంచి యుధిష్ఠిరార్జునుల చేత వీడ్కోలు

వడసి యనంతరంబ సర్వలోకవందిత దివ్యశ్రీ చరణారవిందుండగు గోవిందుండు తన మేన యత్తయగు కుంతీదేవి పాదంబులకుం బ్రణామం బాచరింప నద్దేవి యతనిం గౌగిలించి శిరంబు మూర్కొని యనిపె.

అంత మాధవుండు తన చెలియలైన సుభద్ర సమీపంబునకుం జని ప్రేమాతిశయంబు వలన నానందాశ్రువులు గ్రమ్ముకొనం బ్రియంబులగు కొన్ని హితవచనంబులు నెయ్యంబునం బలకరించిన సుభద్ర యన్నియును విని, తలిదండ్రులగు దేవకీ వసుదేవులకును మఱియునుం గలుగు బంధుజనంబులకుం దెలుపందగిన వచనంబులు మృదుభాషణంబుల నన్నతో విన్నవించి పాదపద్మములకుం బ్రణమిల్లిన నతండెంతయు సంతసంబు నందుచు వెడలి పాండవ పురోహితుండగు ధౌమ్యుం గనుంగొని యభివాదనంబొనరించి యతని వలన నాశీర్వచనంబులు గైకొని ద్రుపదరాజపుత్రిం జేరంజని, యాదరించి సుభద్రం జెప్పి యప్పగించి యర్జునుండు నుందానును ననుజ సహితుండగు ధర్మనందను పాలికింజని వారలేవురుం బరివేష్టింప నప్పురమపురుషుండు బృందారక బృందపరివేష్టితుండగు పురందరు చందంబున విలసిల్లి యాత్రాకాలయోగ్యంబులగు కృత్యంబులు సేయందలంచి దివ్యంబులగు గంధమాల్యంబుల దేవతలను భూదేవతలను బూజలు గావించి నమస్కరించి యాశీర్వాదంబు సేయు విప్రోత్తముల వలనం గుసుమాక్షతంబులు గైకొని శిరంబున ధరియించి యమ్మహీసురులకు మంచి కనకాంబరంబు లొసంగి ప్రదక్షిణంబు గావించి యనుమతివడసి సకల గుణాన్వితంబగు శుభ ముహూర్తంబున శంఖచక్రగదాయుధపరివృతంబును సైన్య సుగ్రీవ మేఘపుష్ప వలాహక సమేతంబును, గరుడధ్వజాభిరామంబును, రత్న కాంచన శోభితంబును నగు దివ్యస్యందనంబెక్కి వెడలు సమయంబున ధర్మనందనుం డారథంబు నధిరోహించి యరదంబు నడుపుదారుకు నివారించి ప్రేమాతిశయంబునం దానే సారథ్యంబు సేయుచు, భీముండతి విశాలంబును, దివ్యమాల్య విరాజితంబును, సువర్ణమయ కాండంబును నగు పాండు ఛత్రంబువట్టుచు నర్జునుండు సాంద్రచంద్రాతపంబు నుల్లసంబులాగు వాలవ్యజనంబు విసరుచు, నకుల సహదేవుల ధవళంబులగు నుభయచామరంబులు వీచుచు ఋత్విక్పురోహిత సమేతులై వెంబడిం జనుదెంచు నప్పుడు శిష్య పరివేష్టితుండైన గురువు చందంబున నందంబు నొందె; ధౌమ్యుండు వృద్ధజన పరివృతుండగుచు నభిమన్యుని రథంబున నిడికొని యనుసరించె. తదనంతరంబ క్రోశమాత్రం బరిగి ధర్మజు నతని తమ్ములనుం గౌగిలించుకొని వారి వారిని దగు తెఱంగుల నుపచరించి తనకు మ్రొక్కిన నకుల సహదేవులను గారవించి వారల నందఱ నింద్రప్రస్థ పురంబునకు ననిపి, రెండవ యాఖండలుని చందంబున గోవిందుండు ద్వారకా నగరంబునకుం జనియె.

అయ్యెడం గౌంతేయులు జనార్దను రథంబు దృష్టిగోచరంబై యున్నంత తడవును గనుంగొనుచును, లోచనంబుల కగోచరంబైన తఱి రాజీవాక్షుని హృదయ కమలంబున నునిచికొని తనివిచనక యతనిం గొనియాడుచు నగరంబుం జేరిరి.

## పరవస్తు చిన్నయసూరి (1806-62)

### పేరాస

(నీతిచంద్రిక - మిత్రలాభము)

ఒక ముసలి పులి స్నానముచేసి దర్భలు చేతఁబట్టుకొని కొలని గట్టున నుండి

"యోయి తెరువరి! యీ పయిఁడి కంకణము వచ్చి పుచ్చుకొ"మ్మని పిలిచి చెప్పెను. ఒక పాంథుఁడా మాటవిని "యిది నా భాగ్యము చేతనే వచ్చుచున్నది. ఏల సందేహ పడవలె?" నని చింతించి "యేదీ కంకణము చూపు"మని యడిగెను. పులి చేయి చాచి "యిదిగో! హేమకంకణము చూడు"మని చూపెను. "నీవు క్రూర జంతువవు కాబట్టి యేలాగున నిన్ను నమ్మవచ్చు"నని పాంథుఁడు పలికెను. ఆ మాట విని పులి యిట్లనియె. "ఓరి పాంథ! విను. మునుపు యౌవనమందు మిక్కిలి దుష్టుఁడనయి యుంటిని. అనేకములగు గోవులను, మనుష్యులను వధించి, మితిలేని పాపము సంపాదించి భార్యాపుత్రులను బోఁగొట్టు కొని యేకాకినయి నిలిచితిని. అనంతరమొక పుణ్యాత్ముడు నాయందు దయచేసి "యిఁక మీఁదట గోవులను, మనుష్యులను వధింపకు. సత్కార్యములు చేయు, మని చెప్పెను. అది మొదలుకొని పాపకృత్యములు విడిచి మంచికార్యములు చేయుచున్న వాఁడను. వృద్ధుఁడను. బోసినోరివాఁడను. గోళ్ళు పోయినవి. లేవసత్తువ లేదు. నన్ను నివేల నమ్మవు? నీవు దరిద్రుఁడవు కాఁబట్టి యిది నీకు దానము చేయవలె' నని కోరితిని. సంశయ పడక యీ కొలనిలో స్నానముచేసి వచ్చి పసిఁడి కంకణము పుచ్చుకొమ్ము." అనఁగానే వాఁడు పేరాశచేత దాని మాటలకు లోఁబడి కొలనిలో స్నానము చేయఁబోయి మొలబంటి బురదలో దిగఁబడెను. అప్పుడు పులిచూచి "యయ్యయ్యో! పెను రొంపిలో దిగఁబడితివి గదా! నేను వచ్చి నిన్ను లేవనెత్తెదను, భయపడకు' మని తిన్నతిన్నగా సమీపించి వానిని బట్టుకొనెను. ఈ లాగున వాఁడు తగులుకొని "క్రూరజంతువును నమ్మరాదు. నమ్మి యీగతి తెచ్చుకొంటిని. మించిన దానికి వగచి యేమి ప్రయోజనము? ఎవ్వరికైన విధి తప్పించుకో వశముగాదు. అని చింతించుచు దానిచేత భక్షింపఁబడియె.

## అతిసంచయేచ్ఛ తగదు

*(నీతి చంద్రిక-మిత్రలాభము)*

అర్థములు నిత్యములు గావు. యౌవనము ఝురీ వేగతుల్యము. జీవనము బుద్బుదప్రాయము. కాఁబట్టి బుద్ధిమంతుఁడు సత్వరముగా ధర్మము సమాచరింపవలెను. సమాచరింపని వాఁడు పశ్చాత్తాపముఁ బొంది శోకాగ్ని సంతప్తుఁడగును. నీవతి సంచయము చేసితివి. దాని దోషమిది. తటాకోదర జలములకుఁబరీవాహమువలె సమార్జిత విత్తములకుఁ ద్యాగమే రక్షణము. ధనము పాతఱతో దాఁపరికము చేయుట దాని వినాశమునకు దారి చేయుటగాని వేఱుగాదు. వాయికట్టి కడుపుకట్టి ధనము గడించువాఁడు పరులకయి మోపు మోయువాని యట్లు క్లేశమునకు మాత్రము పాత్రము. భోగత్యాగములకు వినియోగింపని ధనముంట వలన ఫలమేమి? పోకడవలన హానియేమి? లోభి ధనికుఁడయ్యు భోగవిరహముచే దరిద్రునితో సమానుండే. అయినను లోభికి ధనార్జన రక్షణ హానులయందు దుఃఖమొకటి విశేషము. లోభి తన ధనము పేదలకుఁ బెట్టఁడు, చుట్టములకు వినియోగింపఁడు. తానుంగుడువఁడు. కడపట నేలపాలో దొంగల పాలో చేయుచున్నాఁడు. ప్రియవచనముల తోడి దానము, గర్వసహితము గాని జ్ఞానము, క్షమాసహితమైన

శౌర్యము, త్యాగయుక్తమైన విత్తమనియెడు నాలుగు లోకమందు దుర్లభములు. బుద్ధిమంతునకు సర్వదా ధనార్జన మావశ్యక కార్యమే కాని యతి సంచయేచ్ఛ తగదు.

## కందుకూరి వీరేశలింగం (19వ శతాబ్ది)

### ప్రార్థన

*వీరేశలింగం గ్రంథావళి-ఏడవసంపుటము (ప్రచురణము 1951)* ***141–142*** *పుటలు*

మనుష్యుఁడు తన సుఖమునకుఁగావలసిన పదార్థముల నిమిత్తమయి పరాత్పరుని సాహాయ్య మపేక్షించువాఁడు గనుక ప్రార్థన యావశ్యకమయినది. కాఁబట్టి ప్రార్థన చేయుట మనుష్యకోటికి సహజగుణము. ఆకలి వేసినప్పుడు బిడ్డ పాలనిమిత్తమయి తల్లిని వేఁడుకొనును; అన్నాతురుడైన దరిద్రుఁడు తన కన్నము పెట్టఁగల ధనికుని గృహమునకుఁబోయి వేఁడుకొనును: రోగార్తుఁడు వ్యాధి బాధ తొలఁగింపఁగల వైద్యుని యొద్దకుఁబోయి వేఁడుకొనును. ఈ ప్రకారముగా బాలురు మొదలుకొని వృద్ధుల వఱకును తమపోషణము నిమిత్తమును సంరక్షణము నిమిత్తమును విపన్నివారణము నిమిత్తమును తత్తత్కార్యములను చేయఁగలవారిని చేరి ప్రార్థింతురు, పోషణ రక్షణాదులు లేక శరీర మెట్లు సుఖస్థితి యందుండ నేరదో యట్లే యాత్మయు పోషణరక్షణాదులు లేక సుఖస్థితి యందుండఁజాలదు. దేహసంబంధములయిన లోపములు తటస్థించినప్పుడు తల్లోపములను వారింపఁగలవారిని వెదకుచుఁబోయి ప్రార్థించుటాగుననే మనుష్యుఁడాత్మ సంబంధములయిన లోపములు సంభవించినప్పుడాలోపములను దీర్చి సుఖము ప్రసాదింపఁగలిగిన యీశ్వరుని నిజస్వభావము చేతనే ప్రార్థించును. జ్ఞాన శరీర పోషణమునకావశ్యకము లయిన సత్యశాంత్యాదులకు లోపము తటస్థించి నప్పుడు తత్సంపాదనమున కయి గుణసంపత్ప్రదాతయైన యీశ్వరుతానే వేఁడుకోవలెను; పాప రోగముల బాధచేత నాత్మరక్షణము కావలసి వచ్చినప్పుడు భవరోగ వైద్యుఁడయిన యీశ్వరునే వేఁడుకోవలెను; అనివార్యములయిన యింద్రియములు యుద్రేకము చేత చిత్తదౌర్బల్యము కలిగి సుఖాభావము సంప్రాప్తము కాఁబోవునప్పుడు సుఖసంధాయకుఁడైన యీశ్వరునే వేఁడుకొనవలెను. ఈ చెప్పిన దృష్టాంతముల వలన భగవత్ప్రార్థన యావశ్యకమనియు స్వాభావికమనియు నేర్పడు చున్నది. సమస్తమునకును మనకెవ్వఁడాధార భూతుఁడుగ నున్నాఁడో, ఎవ్వని యనుగ్రహము లేక మనమొక్క నిమిషమైన సుఖపడుటకు శక్తులము కామో, ఎవ్వఁడు ప్రతిదినమును మన మనుభవించునట్టియు మనకు ప్రియమయినట్టియు మన మనుగడను సుఖవంతముగాఁజేయు నట్టియు సమస్త పదార్థములను, సాధనములను దయచేసెనో, అట్టి పరమ దయాళుఁడును పరిశుద్ధుఁడును ప్రేమైక నిధియునైన యా యీశ్వరుని సంపూర్ణభక్తితోను కృతజ్ఞతతోను దినమున కొకసారి రెండు నిమిషములైనను స్మరింపక, ప్రార్థింపక, తెలిసిన వాఁడెవ్వఁ డూరకుండఁగలుగును?

## పానుగంటి లక్ష్మీనరసింహారావు (1865-1940)

### స్వభాష

(సాక్షి మూఁడవసంపుటము-6 స్వభాష)

మీ స్వభాష మీకు రాదేమి? అబ్బా! మీరే ప్రయత్నము చేసినారని రాదనుచున్నారు? భాష తనంత తాను మీకు వచ్చుననియే యనుకొనుచున్నారా? మహమ్మదుగారి యొద్దకుఁ గొండ రాకపోయినప్పుడు మహమ్మదుగారు కొండయొద్దకు వెళ్లిరావాలేదా? మీకు భాష రాకపోవుట భాషలోపమా? మీలోపమా? భాషను గొంచెము దీక్షతోఁ బఠించినయెడల నది రానివాఁడుండునా? పఠింపకుండ భాష రావలయునన్న నది యింత పైపైన నున్నదా? భాషయందు మీకు నిర్లక్ష్యత యైనప్పుడు భాషకు మీ యందభిమాన ముండునా? భాషాగ్రంథము మీకుఁ దలక్రింద నెత్తునకైనఁ బనికి రానప్పుడు భాషాజ్ఞానము మీతలలో నెట్లుదూరును? చదివినను భాషరానివాఁడెవ్వఁడు? ఎవ్వఁడో, వ్రేలుమడఁచి యొక్కని పేరెత్తి చెప్పుఁడు. భాషలోఁ బుట్టి భాషనేర్చుకొని భాషరాక భ్రష్టుఁడైన ప్రపంచాతీత పురుషుఁ డెవ్వఁడో చూతము. చూచి యథార్థముగ స్వభాషాజ్ఞానమున కర్హుఁడు కాని యమృతాజ్ఞానశత్త్వమే యగునెడ నన్నయభట్టు కాలము నుండి యిప్పటివఱకున్న భాషా గ్రంథము లన్నియుఁ గట్టకట్టి బంగాళాఖాతములోఁ బాఱ వేయుదము. మనకు రానిభాషతో మనకేమిపని? అయ్యయ్యో? రవంత కష్టమైనఁ బడనక్కఱలేదా?... ట్రాన్స్‌ఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు తలఁగొట్టుకొని వల్లెవేసినవారే— తారా శశాంక విజయము రవంత చదువలేరా? సరదా తీరును. శబ్దజ్ఞానము వచ్చునే — ఊరకే రమ్మన్న నేదైన వచ్చునా? అల్లెవ్వనికైనవచ్చినదా? కడుపు నిండుటకు నోటిలోఁ బడినదానిని మ్రింగనైన వలదా? ఆ మాత్రపు శ్రమమైనఁ బడనక్కఱలేదా?... మను చరిత్రమున నొక్క యాశ్వాసమును విలాసము కొఱకైనను జదువుటకు నీ కోపిక లేకపోయెనా? "సిండరిల్లా" నామూలాగ్రముగ నెఱుఁగుదువు కాని చంద్రమతి పేరైన నెఱుఁగవే!... భారత భాగవతములను బఠింపని నీవు బారిస్టరువైన నేమి— ప్రభూత్తముఁడవైన నేమి? ఆంధ్రుఁడవై యేల పుట్టితివోయి నాయనా! నీ వాంధ్రదేశమున కెందులకోయి నాయనా! నాకు బోధపడక యడుగుచున్నాను. క్షమింపుము. నీవే పుస్తకములను జదువనక్కఱలేదు. దినమున కొక్కసారి పావుగంట తెఱపి చేసుకొని రాత్రి భోజనమైన తరువాత నిల్లాలిని బిల్లలను నీ చుట్టు కూరుచుండఁ బెట్టుకొని తాంబూలచర్వణ మాచరించుచు నడుమ నడుమ నాన్కోపరేషను ముచ్చటలఁ జెప్పుకొనుచు నాంధ్ర పత్రికను జదువరాదా? నాలుగు మాసములట్లు చదువుము. నీ కాంధ్ర భాషాజ్ఞాన మెంత వృద్ధియగునో తెలుగుబాసలో నేదైన పసయున్నదని నీ కప్పటికిఁ దెలిసిన యెడల భాషాగ్రంథములను జదువవచ్చును. అందఱు తెలుఁగు మాటలాడవలసిన యిందఱిలో నీ వొక్కఁడవింగ్లీషులో మాటలాడితివి! కావు కావుమని యనవలసిన కాకులన్నిటిలో నొక్క కాకి "కొక్కొరోకో" యని యఱచిన యెడల మిగిలిన కాకులు దానిని ముక్కుతోఁ బొడిచివేయక మానునా? మేము నీవంటి యనేక ప్రకృతుల కలవాటు పడినవారము కావున సరిపోయినది. కాని లేకున్న నేమి కాఁదగినది? ఆంగ్లేయభాష యేల చదువుకొంటివని నేనధిక్షేపింపను. ఇంత

కన్న నధికజ్ఞానమును గూడ నీవా భాషలో సంపాదింపుము. నాకు మఱింత యిష్టము కాని నీ యాంగ్లేయ భాషాజ్ఞాన మెందులకో నీ వెఱుఁగుదువా? ఆంగ్లేయ భాషయే కాదు, ఇంక ననేక భాషలు కూడ నేర్చుకొనుము· నీవు సంపాదించిన పరభాషాజ్ఞాన మంతయు నీ భాష నభివృద్ధి పఱచుటకే. నీ భాషను భాగ్యవత్తరమును జేయుటకే—నీ భాషను బరభాషా గ్రంథ ప్రశస్తాభిప్రాయములతో వన్నె పెట్టుటకే—అంతకంటె వేఱుకాదే. ఆంధ్రభాషలో అ ఆ ల కంటె నవతలి యక్కఱము లెఱుఁగనివాఁడవు కదా! ఆంధ్రుఁడవై యుండియు నాంధ్ర భాషలో "ఆ"యని నోరు మెదలుపలేనివాఁడవు కదా! నీ యాంగ్లేయ భాషాజ్ఞానమును దేశమున కెట్లుపచరింపఁదలఁచితివో చెప్పుము.

# పంజాబీ

మూలం :

డా॥ దర్శన్‌సింగ్ మైని

అనువాదం :

డా॥ అక్కిరాజు రమాపతిరావు

## చారిత్రక సమీక్ష

ఒకస్థాయి సౌకుమార్యాన్ని నాజూకుతనాన్ని సంతరించుకొన్నదాకా ఏదైనా ఒక భాష జవసత్వాలు సిద్ధింప చేసుకోలేదు. ఈ విధంగా జరగటానికి అనివార్యంగా కొంతకాలం పట్టవచ్చు. ఇది జన బాహుళ్య చైతన్య స్థాయిపైన విద్యాధికుల వివేచనా శీలతపైన ఆధార పడి ఉంటుంది. ఇట్లా అన్నంత మాత్రాన సాహిత్యభాష అనేది జానపద నుడికారానికి భిన్నం గాను, అతీతంగానూ తప్పనిసరిగా ఉండాలని చెప్పటంకాదు. ఇంకా ఇందుకు వ్యతిరేకంగా అది వ్యావహారికానికి అతిచేరువగా కూడా ఉండాలి అని చెప్పవలసి ఉంటుంది. అప్పుడు కాని అది తన సత్తువను, ఒడుపును నిలుపుకోలేదు.

భాష అనేది కేవల వ్యవహారోపయోగితను దాటి సౌందర్య భావనాభి వ్యక్తి సాధ నమైనప్పుడు ఆ స్థితి ఒక కొలికికి చేరిన స్థితి అని చెప్పవచ్చు. ఆ విధంగా చేరడంలో విస్తృత సంక్లిష్ట భావోద్విగ్నతలను, సంవేదనలను అది స్పష్టంగా వ్యక్త పరచగలదు. జీవ చైతన్య సంగీత సమ్మేళనం చేయగలదు. జానపద నుడికారం కూడా ప్రముఖమైన స్థితిని చేరి పరిణామ దశను చేరుకొనే లోపున కనిపించని ఎన్నో మార్పులకు లోనవుతుంది. కాబట్టి భాషఅనేది ఒక సువ్యక్త స్థాయిని చేరుకొనేదాకా సాహిత్యపరిణామశీలాన్ని అది సిద్ధింపచేసుకోలేదు.

అది ఎప్పుడైనా ప్రజల ప్రతిభకువాగ్రూపక సంవాదము మాత్రమే నన్నమాట. విట్‌గెన్ స్టైయిన్ చెప్పినట్లు అది ఒక జీవన విధానానికి సూచకంగా పనిచేస్తుంది.

వైదిక ప్రాకృతంలోను, అపభ్రంశంలోనూ లోతుగా కాలూనిఉన్న పంజాబీ భాష ఎప్పుడు సారస్వతపు రెక్కలు విప్పుకొన్నది ? ఎప్పుడది గేయంగాను, గాథగాను జాలు వారింది? మాండలిక స్థాయినుండి సాహిత్య భాషస్థాయికది చేరుకోవడంలో ఏ ప్రతిబంధకాల నది ఎదుర్కొన్నది? ఈ ప్రశ్నలకు ఇదమిద్ధంగా, సూటిగా సమాధానాలు చెప్పడం సాధ్యం కాదు. సాధారణంగా భాష అనే రాసాయనిక పదార్థము అటువంటి విశ్లేషణలకు లొంగదు. అయితే అదృష్టవశాత్తు పంజాబీ భాషకు సంబంధించి 8వ శతాబ్దికాలానికే సాహిత్య భావనల తొలి కదలికలు చూడవచ్చు. ఇందుకు సాక్ష్యాధారాలున్నవి. అయితే పంజాబీ సాహిత్యం యొక్క విలక్షణత అది ఆధ్యాత్మిక మనలేక పోయినా ప్రబోధాత్మకంగా మాత్రం అది పుట్ట

టం వాస్తవము. మత ప్రమేయంలేని లౌకిక పథాలకు మళ్ళటం అటు తరవాత కాలంలోనే జరిగింది. ఉత్తర భారత నవీన భాషలనేకం వలెనే పంజాబీ కూడా హఠయోగ సాధకులు పూనుకొని కృషి చేసినందువల్లనే సాహిత్య వాహకం కాగలిగింది. గోరఖ్‌నాథ్ (940-1031) కాలంలో ఈ హఠయోగులు మరింత పూనికతో పనిచేశారు. ఈ రచనలంటూ మనకు వాటి ప్రాథమ్య రూపాలతో లభ్యంకాలేదు. అవి సాగించిన యాత్రలో ప్రక్షిప్తాలు, కూర్పులు, శైథిల్యాలు విధిగా చోటు చేసుకొని ఉండవచ్చు. వీటిలోని భాష కలగా పులగపు జానపద నుడికారంతో కనపడుతుంది. వేదాంతము, హఠయోగము ప్రజా సామాన్యంలో కూడా ప్రచారం చేయడానికే ఇటువంటి సాహిత్యసృష్టి జరిగిందనడం స్పష్టమే. అంటే ఈ శైలి ఒక ప్రత్యేక లక్ష్యసాధనకు సంబంధించి బయలుదేరిందన్న మాట.

ఏమైనప్పటికీ ఆధికారికమైన అచ్చపు పంజాబీ సాహిత్యపు మచ్చురచనలు భారత దేశంలో ఇస్లాం ఆగమనం తర్వాత మాత్రమే చూడవచ్చు. బలమైన సమతావాదధోరణి పిడివాదము, తీవ్రమతాభినివేశముకల ఈ కొత్తమతము-ప్రశాంతమై, అంతర్ముఖినమైన హిందూమతంతో ముఖాముఖీగా సంఘర్షించటం జరిగింది. ఈ రెంటి సమన్వయ సాధనలో సుప్రసిద్ధమైన సూఫీ ఉద్యమం ఆవిర్భవించింది. ఈ యుగంలో ఉత్తేజితులైన మహనీయులలో కొందరు ఇందువల్ల సూఫీదర్శనోద్భూతమై గూఢము, అవ్యక్తమైన మూసలలో తమ దివ్యదర్శనాలను రూపించవలసివచ్చింది. ఈ విధంగా చేసిన మొట్టమొదటి సూఫీకవి ఫరీద్ (1173-1265). ఈయన ఒక కొత్త శైలిని రూపొందించాడు. ఇందులో పర్షియన్ పదజాలాన్ని సంలీనం చేసుకొంటూ పంజాబీ నుడికారం నిలుపుకోవడం ఆయన సాధించాడు. వాస్తవానికి దీనిని రెండు విభిన్న సంస్కృతుల, ఆలోచనాధారల "మార్మిక పరిణయం" అని చెప్పవలసి ఉంటుంది. ఫరీద్ ఈ విధంగా సంగదూరమైన ముస్లిం తపస్వితను ప్రాంతీయమైన వ్యావహారిక నుడికారంలో ప్రతిపాదించాడు. ఆయన మార్మిక గీతాలలో కూడా, అయన కవితా భావుకతపై పంజాబుదేశ ప్రకృతి సౌందర్యం బరపిన ప్రభావాన్ని దర్శించవచ్చు. ఆయన ప్రకృతిచిత్రాలూ, పదగుంభనలు నిశితమై, విశదమై, సుసంపన్నమై, ఇంద్రియగ్రాహ్యమైన బాహ్యప్రకృతిని ఆకళింపు చేసుకోవడంలో ఆయనకు గల ప్రతిభ నిరూపిస్తాయి.

ఆ తరవాత రెండువందల సంవత్సరాలు, పరిస్థితి చాలా అసంతృప్తికరంగానూ నిరాశాపూరితంగానూ కనిపిస్తుంది. ఈకాలం వినాశకర సంఘటనల కాలవాలమైనది మాత్రమే కాకుండా, ప్రతిభావంతుడైన కవిగాని రచయితగాని ఈ కాలంలో రంగంమీద కనిపించడు. ఈ విధంగా సాహిత్యం కొనఊపిరి దశలో కొట్టుకోవడమనే దశను ఛాసర్ తరువాత ఇంగ్లీషు కవిత్వానికి సంప్రాప్తించిన ఇదే విధమైన దశతో కొంతవరకు పోల్చవచ్చు. ఈ రెండు శతాబ్దాల దీర్ఘమైన నడిమి కాలంలో సాహిత్యపు మసక వెలుగులు మాత్రమే ప్రసరించాయి. ఈ కాలంలో సృజనాత్మకశక్తి సామర్థ్యాలు, నిద్రాణము, జడము అయిపోయినవి. ఒక మహత్తర సంఘటనము, ఒక మహాపురుషుడు ఏకకాలికంగా అవతరించినప్పుడు మాత్రమే ఎప్పుడూ కూడా గొప్ప సాహిత్యం ఆవిర్భవిస్తుంది.

సిక్కు పంథా వ్యవస్థాపకుడైన గురునానక్ (1469–1539) నిరుపమాన పౌష్కల్యంతోను, నిరతిశయ పారవశ్యంతోను కృతులను గీతాలను గానంచేయడమే ఈ సహయోగ సిద్ధి. పంజాబీ భాషా చరిత్రలోనే ఇది అపూర్వ అద్భుత విలక్షణ సంఘటనము. అసాధారణ ప్రతిభాశాలి అయిన మహాపురుషుడు అతి సున్నితమైన భావనను, గాఢమైన అనుభూతిని వ్యక్తీకరణ సమర్థంగా భాషను మలచిన గొప్ప సన్నివేశమిది.

ప్రజలు నిత్యం మాట్లాడుకొనే భాష ఒక సౌలభ్యాన్ని, ప్రభుతను స్వాయత్తం చేసుకోవడమనే ఔన్నత్యం ఎప్పుడైతే పొందిందో, నిసర్గలలితమైన, గృహోచితమైన ప్రాంతీయ భాష, సంప్రదాయబద్ధమూ, పాండితీ ప్రగల్భమూ అయిన సంస్కృత భాషను త్రోసిరాజని దానిని మించిపోయింది. ఈ విధంగా జీవంతో తొణికిసలాడుతున్న, మాంసలమైన, పుష్టికరమైన వాస్తవ హృదయస్పందనకు, నాడికి చేరువైన దేశీయనుడికారం, కవిభావుకతావసరాలను పూర్తిగా తీర్చగలిగింది.

ఇక వెంటనే గురునానక్ కవిత పూర్వ కవితా సంప్రదాయాన్ని, సమకాలీన జానపద ఛందాలను, జానపద గీతపులయలను, జానపద సాహిత్యాన్ని కూడా, ఆకళింపు చేసుకొన్నది. పాండిత్య విలసితమైన, సైద్ధాంతికమైన విషయాలు, నిత్యజీవిత దృశ్యాలైన ఇంటినుంచి, పొయ్యిగింజి, అంగడినుంచి, వీధినుంచి గ్రహించిన ఉపమానాలతో పొదగడం జరిగింది. అందువల్లనే రెక్కలు తొడుక్కున్న మాటకు అంతటి శక్తి వచ్చింది. సూటిగా హృదయంలో అది నాటుకొని ఉద్దిష్ట ప్రయోజనాన్ని అది సాధించటమూ జరిగింది. ఉజ్జ్వలమైన, పరమోత్తేజిత స్ఫూర్తిమంతమైన ఆయన ప్రతిగీతి చరణంలోను విప్లవాత్మక మానవత్వం పొంగులువారింది. అయితే నానక్ ప్రాపంచిక సంతోషాలపట్ల, సుఖజీవనంపట్ల విముఖుడుకాడు. పువ్వులు, ఆకులు, పర్వతాలు, మైదానాలు, పశుపక్ష్యాదులు, జలచరాలు, ఋతువులు, గాలులు, నదులు, సముద్రాలు, ఆయన పద చిత్రాలలో వర్ణించడంచూస్తే నిత్యసత్యమైన సారళ్యమైన జీవిత సత్యాలపట్ల ఆయన ఎంతగా ఆకృష్టుడో, అనురాగపూర్ణుడో అర్థమవుతుంది. అన్నిటికన్నా ప్రధానంగా ఆయన మానవుని అంతరాంతరాలలోని సౌందర్యాన్వేషణను గూర్చి ఫలసిద్ధిని గూర్చి గానం చేశాడు. ఆయన గొప్ప రచనలు జపజి, సిద్ధగోశత్, బారమహి, లను ఆదిగ్రంథ్‌లో చూడవచ్చు.

ఆయన తరవాత వచ్చినవారంతా సహజంగానే గురునానక్ ఛందాన్నే తమదిగా చేసుకొన్నారు. తమ పద్యాలను ఆయన పేరుమీదుగానే కూర్చారు. గురు రామదాస్ అత్యున్నత శ్రేణికి చెందిన సౌందర్య భావుకతను ప్రదర్శించినవాడు. ఐదో గురువైన అర్జునదేవ్ దివ్య కవికి ఉండవలసిన సాధన సంపత్తులన్నీ కలవాడు. ప్రగాఢ వినయము, విశ్వాసము ఆయన కవిత్వలక్షణాలు. దీనికి ప్రకృష్టమైన ఉదాహరణగా తనతండ్రి గురువు అయిన ఆయన నుంచి వియోగం కలిగినప్పుడు అర్జునదేవు, లాహోర్‌నుంచి వ్రాసిన పద్యరూప లేఖావళిని చూపవచ్చు. ఆయన భావగీతికలలో కనిపించే గతస్మృతుల అనుభూతి తీవ్రత దగ్గుత్తికను కలుగజేస్తుంది. ఆయన 'సుఖ్‌మణి' అనే శాంతి గీతం ప్రపంచంలోనే ఈ రకమైన సాహిత్యంలో అగ్రేసరమైన వాటి సరసన నిలుస్తుంది. అది వికల మనస్కులకు ఉపశమనం కలిగించే దివ్యౌషధ విలేపనముగా పనిచేస్తుంది.

గురు అర్జునదేవే ఆది గ్రంథాన్ని సంకలనం చేసిన వాడు. అది మహా గొప్ప ప్రయత్నం. అపురూపమైన విద్వత్తు, శక్తి సామర్థ్యాలు ఉన్నవారు మాత్రమే చేయవలసిన పని అది. తేజ్ బహదూర్‌సింగ్ రచనలుకూడా గురుగోవిందసింగ్ తరవాత ఆది గ్రంథంలో చేర్చాడు.

ఈ ఆదిగ్రంథం, భారతదేశపు మధ్యయుగ సాంఘిక, మతపరిస్థితులను వర్ణించే ఆధికారికమైన సమగ్రమైన సంపుటి అని చెప్పవచ్చు.

ఆది గ్రంథం సంకలనం చేయడంలో గురు అర్జునదేవ్‌కు తోడ్పడిన భాయి గురు దాస్ కూడా గొప్పకవి. గ్రంథ్‌లో ప్రతిపాదితమైన సిక్కుమత విశ్వాసాలు, జీవన విధానాలను వ్యాఖ్యానించినవారిలో, ఆయన తన 'వార్స్'ల ద్వారా ఉత్కృష్టతను ప్రకాశితం చేసుకొన్నాడు. మనస్సుకు హత్తుకొనే ద్విపదలు, రూపకాలు, పవిత్రకృతులలోని జ్ఞానాన్ని నిర్దుష్టమైన, ప్రౌఢమైన పంజాబీ నుడికారంతో క్రోడీకరించి చెప్తున్నాయి.

ఈ కాలపు వచన సాహిత్యం ఎక్కువగా మహిమాన్వితులైన సాధువుల చరిత్రలను వర్ణించేటటువంటిది. గురునానక్ జీవితం, యాత్రా వృత్తాంతాలకు సంబంధించినటువంటిది. ఆయన జీవితంతో ముడిపడి ఉన్న మహిమలు, విభిన్న వర్గాల ప్రజలతో పండితులతో ఆయన జరిపిన గూఢార్థ సంభాషణలు, భక్తి శ్రద్ధలతో గ్రంథ ప్రతిపాదితములైనవి. అప్పటికి వచనరచన బాగా వికసించలేదు. కర్తృత్వం తెలియని రచనలైన జనమ్‌సఖి, పరచి, బచనలు, అప్పుడప్పుడే సాహిత్య శాఖామాధ్యమాలుగా వికసనోన్ముఖమైనవి.

ప్రత్యేకించి సూఫీతత్వ దర్శనంలో ఒక పరివ్యాప్త లక్షణం ఉన్నది. ఫరీద్ కఠిన నియమాలకు, ఇస్లామ్ బోధించే సర్వసంగపరిత్యాగ సాధనకు బద్ధుడై ఉండగా, షా హుసేన్ కొన్ని హిందూ భావనలను, తలంపులను, గ్రహించటమేకాక వారి ప్రతీకలను, కల్పనలను కూడా అనుసరించాడు. తన కాఫిలద్వారా అతడు ప్రసిద్ధుడు. ఈ రచనలు భావకవితా దప్పుతతో, వాస్తవ దర్శనానికి అతీతమైన దర్శనంకోసం ఆత్మప్రతీక్షణను వ్యక్తం చేస్తాయి. ఈ నుడికారపు సరళిలో రచనలు సాగించిన ఇతరులు సుల్తాన్ బహు, షా, ఆలీ హైదర్ మొదలైనవారు. ఈ కవులంతా కూడా దేశభాషలోనే రచనలు చేశారు. భావ ప్రకటన సామర్థ్యంలో దేశభాషను, కొత్త ఎత్తులకు తీసుకొనిపోయినారు.

ఆధ్యాత్మిక, ఆధిభౌతిక విషయాలనుగూర్చి రచనలు బహుళంగానే వెలువడుతూ వచ్చినా, మత ప్రమేయంలేని దృష్టి ప్రవేశించటానికి కూడా చాలా కాలం పట్టలేదు. మతాభినివేశము, మతపరమైన భావుకతలు వీరగాథా సృష్టికి మూలమైనవి. శృంగార ప్రణయ గాథలు ప్రజల ఇంద్రియ సుఖాసక్తి నుంచి ఆవిర్భవించినా అందులోకూడా అవి శౌర్య సాహసాలను, వీరత్వ యోగ్యతలను ఉదాత్తంగా గానం చేయడం జరిగింది. యుద్ధ గీతాలలో సుప్రసిద్ధమైనది గురు గోవిందసింగ్ విరచిత "చండి దీవార్". ఇందులో వేగంగా పరుగులుతీసే ఛందాలు, వర్ణనానుగుణంగా శబ్దించే సంగీతం, ఇవాల్టికి కూడా విద్యుత్ప్రభా కర్షకాలుగానే ఉన్నవి. ఆ తరవాత కాలానికి చెందిన నజబత్ అనే కవి, నాదర్‌షా దండయాత్ర అని వ్యవహృతమయ్యే మహాప్రళయాన్ని పద్యకావ్యంగా వ్రాశాడు. కాదిర్‌యార్ ప్రఖ్యాతినొందిన సిక్కు సైన్యాధిపతి హరిసింగ్ నాలవా విజయయాత్రలు వర్ణించాడు.

పంజాబీల ఇళ్ళలోను, హృదయాలలోను, ప్రణయ శృంగార గాథలకు ఆదరణ ఎక్కువ. అవి సూటిగా వాళ్లను ఆకర్షిస్తవి. విశాలమైన, సుక్షేత్రాలతో, ఈ పంట భూములన్నిటినీ పండించగల నదులతో, స్వర్గతుల్యమైన వాయు ప్రసారంతో, పంజాబీలకు లౌకిక జీవన దృష్టి ప్రబలమైనది.

వారి మార్మిక గూఢ రచనలలోకూడా విస్పష్టంగా ఇంద్రియానుభూతి వాసన రేఖా మాత్రంగా దర్శనమిస్తూనే ఉంటుంది. ప్రణయగాథలన్నిటా మిక్కిలి ప్రాచుర్యం సంపాదించుకొన్నది "హీర్ రంజా" అనే గాథాకావ్యం.

దామోదర్ (17వ శతాబ్ది) కాలంనుంచీ కూడా పంజాబీ భావుకతను అది ప్రభావితం చేస్తూనే ఉన్నది.

దీని ఇతివృత్తంలోనే బలమైన ఆకర్షణ, విలక్షణత ఉన్నది. అందువల్ల ఇది ఒక సాహిత్య శాఖకు పథనిర్దేశక లక్ష్యగ్రంథమైంది. తరతరాలుగా ఎందరో కవులు తమ కవితా స్ఫూర్తిని దానిపై పరీక్షించుకొన్నారు. తమ ప్రతిభను చూపటానికి ప్రయత్నించారు కాని వారిస్ షా (1730-1790) ఆగమనంతోకాని దానికొక అమరమైన సౌందర్యం, ఐతిహాసిక ఉదాత్తత సిద్ధించలేదు. వీటిని ఆయన తన "హీర్" కావ్యంలో సిద్ధింపజేశాడు. పంజాబీ నుడికారపు లోతుపాతులను, సమగ్రమైన శక్తి సామర్థ్యాలను పూర్తిగా వినియోగించుకోవటమే కాదు, అన్యదేశ్యాలను సహితం కూర్చి శైలి గొప్ప అందచందాలు ప్రదర్శించేటట్లు పంజాబీ భాషను సౌందర్య మహితం చేశాడు. ముఖ్యంగా ప్రణయ సన్నివేశాలు మనోజ్ఞమైన ఆహ్లాదాన్ని కలిగించే నవ్యతను వెలారుస్తున్నవి. అయితే ఆ శాఖకు చెందిన కావ్యాలలో వారిస్ "హీర్" కు అత్యుత్కృష్టత నాపాదించిన లక్షణాలు కవి విశాల దృక్పథమూ, ఆయన వెలువరించిన భావాలు. వారిస్ షాకు విభవోపేతము, భావనారమ్యమూ అయిన ఊహాశక్తి మాత్రమే కాదు ఉన్నది. విజ్ఞాన సర్వస్వాత్మకమైన శక్తి కూడా ఉన్నది. ఈ నాటికి కూడా ఈ ఇతిహాసమే పంజాబీ జీవనాన్ని, సంస్కృతిని ఆధికారికమైన, సమగ్ర సుందరమైన చిత్రణ చేస్తున్నది.

ఇతర ప్రణయగాథా కావ్యాలు, విషాదకావ్యాలు, పీలూవిరచిత 'మీర్జాసహిబన్' హషామ్ విరచించిన సస్సి, పున్ను మొదలైనవి. ఇవి బాగాప్రాచుర్యాన్ని పొందినప్పటికీ కూడా వారిస్‌కావ్యస్థాయికి మాత్రంచేరలేదు.

పద్యసంకలన గ్రంథాలను కూర్చడం 18వ శతాబ్దంలోనే ప్రారంభం కావడం ఒక్క విశేషం. భాయిమానసింగ్ (1644-1734) తన జనమ సఖిలో వచనాన్ని పండితైక వేద్యములు గూఢములు అయిన ఆలోచనలను వ్యక్తంచేసే సాధనంగా వాడుకొన్నాడు. అయితే దేశీయమైన నుడికారంలోని ఒడుపును, స్ఫూర్తిని ఏమాత్రంజారిపోనీయలేదు.

19వ శతాబ్ది పూర్వార్థం సిక్కుల వైభవాన్ని, సామ్రాజ్యాధికారాన్ని పంజాబులో ప్రదర్శించిన కాలం. సర్వతోముఖంగా పంజాబీసాహిత్యం సంపుల్లవికసనం పొందినకాలం. ఆది రంజిత్‌సింగ్ ఏలుబడికాలం. అయితే అత్యంతాశ్చర్య కరమైన విషయం. ఆ కాలంలో కూడా పంజాబీ అధికారభాషా పరిగణనం పొందలేకపోయింది. స్వల్పకాలికమైన సిక్కుపర్తి

పాలన అంతమయ్యేనాటికి పంజాబీకి నాలుగు శతాబ్దాలపైబడిన సాహిత్య సంప్రదాయమంటూ ఏర్పడిఉన్నదన్నమాట ఈవిధంగా. ఆ తరవాత బ్రిటిషువారు పంజాబును జయించి తమ అధీనంలోకి తెచ్చుకున్నారు. ఇటువంటి నిర్బంధపూరితమైన, విచ్ఛిన్నకరమైన పరిస్థితి, రాబోయే రచయితలపై సాహిత్యభావనపరంగా విపరీత ప్రభావాన్ని ప్రసరింపజేసిఉంటుంది.

ఇంతలో పందొమ్మిదోశతాబ్ది ఉత్తరార్థంలో రచనలు సాంప్రదాయిక రీతుల్లో కేవలం అనుకరణ ప్రాయంగా వెలువడసాగినవి. ఈ రచనలలో స్వేచ్ఛత, జీవశక్తిలోపిం చడంకూడా ఆరంభమైంది. ఆ శృంగార కావ్యపు మూసలే పునరుక్తం కాసాగినవి. శిల్పము, భావనాశక్తి ఏమాత్రమూ వ్యక్తంకాకుండా. ఈ సంధియుగంలో చెప్పుకోదగిన ఒకే ఒక కవి షామహమద్ (1782-1862). ఈయన సిక్కు సామ్రాజ్యాస్తమయం గురించి వేదనతో వ్రాశాడు. ఈ సన్నివేశాన్ని కరుణరస నిర్భరంగా గొప్పభావోద్రేకంతో ఆయన సాధిం చాడు.

ఆ తరవాత కొద్దిదశాబ్దాలు పాతవిలువలు శైథిల్యం పొందుతూ కొత్తవి కాలూనటం జరిగింది. ఈ కొత్తవిలువలు పాశ్చాత్యవాసనా వాసితములు. ఉదారములు. ప్రజాస్వామి కత, శాస్త్రీయత, సమత్వ చైతన్యము, ప్రతిపాదించేవి. ముఖ్యంగా యువతరం వారిపై ఇంగ్లీషుభాషాసాహిత్యాలు గాఢమైన ప్రభావం బరపటం ప్రారంభమైంది. బ్రిటిషురచయితల తోను, ఇతర యూరోపుఖండ రచయితలతోను సహపాఠులైనవారు ఆరాధనలను ప్రార్థనలను విడిచిపెట్టలేదు.

అయితే ఆర్యసమాజ్, సింగ్‌సభవంటి సనాతన పునరుజ్జీవనోద్యమాలు పాశ్చాత్య సంస్కృతీ చైతన్యాన్ని 20వ శతాబ్దం మొదటి మూడు దశాబ్దాలకాలం వ్యాపించకుండా కొంతవరకు నిరోధించకపోలేదు. అయినా ఎప్పుడైతే ఫ్రాయిడ్ ప్రతిపాదిత మనస్తత్వ విజ్ఞానం, మార్క్సిస్టు తత్త్వచింతన, ఐరోపీయ రసమీమాంస సిద్ధాంతాలు, సాహిత్యశిల్పాలు ఆకళింపుచకు వచ్చాయో, స్వాయత్తమైనవో, అప్పుడిక గతంతోపూర్తిగా తెగతెంపులు చేసుకోవడం సంభవించింది.

ఈరెండు ప్రపంచాల మధ్య వారధిగా ఏర్పడిన కవులలో భాయివీర్‌సింగ్(1872-1957) అగ్రగణ్యుడు. ఆయనకంటే కాలిక ధర్మాన్ని బలంగా చిత్రించినకవి ఇంకొకరులేరు. ఆయన పాశ్చాత్యభావాల మెరమెచ్చులను, శిల్పధోరణులను నిరోధించినా, దేశీయమైన మార్మిక, ఆధ్యాత్మిక కృతుల జలాశయాలనుంచే అధికాధికంగా తనభావధారను తోడుకొనాలి గాలివీచేదిశను మాత్రం ఆయనకూడా గుర్తించకతప్పలేదు. పంజాబీ సాహిత్యంలోని నవ్య శాఖలన్నిటినీ ఆయనే ప్రారంభించినవాడు - నవల, వ్యాసము, సాహిత్యాను శీలనము మొదలయినవాటిని. ఏమైనా కవిగా, బహుశా గురుపరంపర తరవాతవచ్చిన కవులలో అగ్ర గణ్యుడైన మహాకవిగా - ఆయనను పంజాబులోస్మరిస్తారు. ఆరాధిస్తారు. హరీందర్ చటో పాధ్యాయ ఐదునదుల భూమిలో ఆయన ఆరవనది అని ఆయనను గూర్చి వర్ణించడం ఆశ్చ ర్యంకాదు. ఆయన స్పృశింపని సాహిత్యశాఖ అంటూలేదు. ఖండకావ్య రచనలో ఎటువంటి సారళ్యం, సౌలభ్యం చూపినారో, ఇతిహాసరచనంలో కూడా అంతటి సౌలభ్యాన్ని, సార ళ్యాన్నే చూపారు. 'రానాసూరత్‌సింగ్' అనేది ఆయన ముక్తచ్ఛందంలో వ్రాసిన మహా

కావ్యం. నిర్వాణం లేదా విముక్తిని అన్వేషించే ఆత్మయాత్రికుడు, సాగించిన సుదీర్ఘసాహస యాత్రఅది. దానిలోని అంతరార్థ ప్రతిపాదకమైన ఇతివృత్తము, ఆరోపిత కల్పనాశిల్పము, స్పెన్సర్‌కవి విరచిత "ఫెయిరీక్వీన్"ను తలపింప చేస్తాయి. ఆయన వ్రాసిన ప్రకృతి గీతాలు, వర్డ్స్‌వర్త్ రచనలతో దీటురావడమేకాదు, ఒక విలక్షణమైన మార్మికభావసమానత కూడా ప్రదర్శిస్తాయి. అవి మంచుకో తడిసిన పువ్వులవలె మసృణంగాను, సువాసితంగాను, అప్పుడే విరిసినంత స్వచ్ఛంగానూ ఉంటవి. చైనాపూల కుండీ అంత నాజూకుగా రమణీయంగా ఉంటవి. భాయివీర్ సింగ్‌ను ఆయన సమకాలికులలో మహనీయుడైన డబ్లు బి ఏట్సుతో పోల్చడం అంత సముచితంకాక పోవచ్చు. వాళ్ళదర్శనాలలో చెప్పుకోదగిన వైవిధ్యం ఉన్నది. వాళ్ళుచేపట్టిన శిల్పంలో కూడా ఎంతోవైవిధ్యం ఉన్నది. అయితే ఒక విషయంలో మాత్రం వాళ్ళిద్దరి మధ్యాసాదృశ్యం ఉన్నది. కవి వయసులో పెద్దవాడవుతున్నకొద్దీ కవితాభావన తారుణ్యం పొందుతూవచ్చింది. ఇదే ఇద్దరిపోలిక.

భాయివీర్‌సింగ్ నుంచి పురాణసింగ్ (1881-1931) వరకు సాగినదశ సహజంగా మృదువుగా ఆచార్యుడు శిష్యుడికి అందజేసినట్లుగా సాగిపోయింది. మహాత్ముడు, మహాకవి అయిన భాయివీర్‌సింగ్‌తో ప్రత్యక్షపరిచయ సేవాభాగ్యం కలిగిన తరవాతనే పురాణసింగ్ సిక్కుమార్మిక సంప్రదాయ దీక్షితుడుకావడం జరిగింది అయితే వారి కవితా ధోరణులు, శైలులు చాలాభిన్నమైనవి. భాయీవీర్‌సింగ్ తన అతిశయ, అతిలోక కల్పనల మధ్య కూడా పూర్వ కవితా గాంభీర్యముద్రను నిలుపుకోగా పురాణసింగ్‌లో భవ్యకవితావేశంకానవస్తుంది. జపాను పర్యటనానుభవము, తరుణవయసున వాల్ట్‌విట్‌మన్‌తో ఆయనకు పరిచయం లభించడం. ఆయన కవిత్వానికి స్వేచ్ఛను, అనుపమ సౌందర్యాన్ని ప్రసాదించినవి. వచన గీతంమాత్రమే తన కాంక్షల, స్వప్నలోకాలను ఆవిష్కరింప జేయటానికి సమర్థమని బుద్ధిపూర్వకంగానే ఆయన గ్రహించాడు.

ప్రగాఢమైన పంజాబీముద్రతో ఆయన పల్లెపడతులు మధురమంద స్వరంతో పాడుకొనే కూనిరాగాలను, నాట్యాలను, పశువుల అరవాలను, పచ్చికమేయడాన్ని, రైతులు ధాన్యంచల్లడాన్ని, పంటకోయడాన్ని గానంచేస్తాడు. వారిస్‌షా తరవాత పంజాబు ఆత్మముద్రను ఇంతవిపులంగా స్వేచ్ఛగా పద్యరూపంలో అందించిన వారెవరూ లేరనేచెప్పవలసి ఉంటుంది. అయితే ఒక్కొక్కసారి అతడు వాల్ట్‌విటమన్ ఛాయలతో కూడిన ఉద్వేలత కవితా పాత్రలో ఇమడకుండా పొంగిపొరలిపోతూ ఉండటంకూడా చూడవచ్చు. ఖులే మెదాన్, ఖులేచంద్, ఖులేలేఖ్, ఖులేఅస్థానిరంగ్ మొదలైన ఈ శీర్షికలన్నీ ఆయన కవితా భావనయొక్క అపరిమిత స్వాతంత్ర్యాన్నే సూచిస్తున్నవి.

ఈ శతాబ్ది మూడుపదుల నడిమికాలందాకా భాయివీర్‌సింగ్, పురాణసింగ్‌లు కవితారంగాన్ని తమస్వంతం చేసుకొన్నారు. ధనిరామ్‌ఛత్రక్ కవికి పిరివిశాల దర్శనం అలవడలేదు. సుకుమారమైన సుందరమైన గీతరచనలో మాత్రం ఆయన సిద్ధహస్తుడు. సమకాలీన పంజాబీకవులలో ఆయన నిర్దుష్ట శైలిని అనుకరించి చూపగల కవులు చాలా తక్కువ మందిమాత్రమే ఉన్నారు. ఆయన భాషను ప్రేమించాడు. దానిని నేర్పుగా, సాధికారంగా ఉపయోగించు కొన్నాడు.

ఇంతటితో ఇక పంజాబీ ఆధునిక కవితా ప్రాంగణంలో అడుగుపెడుతున్నాము. ఆధునికత అనేది ఒకరు ఏవిధంగా ఒకవిషయాన్ని గ్రహిస్తారో, ఏదృక్పథాన్ని అవలంబిస్తారో దానికి సంబంధించినదికాని, సమకాలీనతకు మాత్రమే సంబంధించినది కాదని మనకు తెలుసు. అది వస్తువుకు, శిల్పానికి రెండింటికీ కూడా సంబంధించింది.

ఈ విధంగాచూస్తే పంజాబీ కవిత్వానికి పందొమ్మిది వందల ముప్పై, ముప్పై ఐదు సంవత్సరాలనాటినుంచి ఆధునికతను సమకూర్చిన విషయాలు ఏవంటే లైంగికప్రణయం, రాజకీయాలు, ఆదర్శాలు, వీటికి సంబంధించిన నిబద్ధత, నిమగ్నతలు, ఇవి అందించే సందేశంలో, ఆపాదించే వైముఖ్యంలోనూ, కవిత ఎంతవరకు తనపాత్ర నిర్వహించిందనేది ముఖ్యము.

రాశిమీద చెప్పవలసివస్తే ప్రధానంగా అదితిరుగుబాటు ధోరణి కవిత్వమని చెప్పవచ్చు. వాళ్ళు అవలంబించిన శిల్పాలలో ఫ్రాయిడ్ చైతన్య స్రవంతి ధోరణి, సాంకేతికతల నుంచి సోషలిస్టు వాస్తవికతవరకు కనపడతాయి. అయితే ఆధునిక కవిత్వంలో చాలా భాగం పూర్తిగా పరోప జ్ఞానుకరణమే. సమకాలీన చైతన్యాభివ్యక్తికి అనువైన శిల్పాలను బహు కొద్ది భారతీయభాషలు మాత్రమే సంతరించుకోగలిగిన స్థితిని చేరుకొన్నాయి. ఇంకా పాశ్చాత్యధోరణే ప్రబలంగా ఉంది.

నవ్య కవిత్వం మోహన్‌సింగ్ (జ. 1905) తో ప్రారంభ మైందని చెప్పవచ్చు. ఆయనను తొలి నవ్యకవి అని పేర్కొనవచ్చు. అలంకారబంధురము, ప్రణయ కథాత్మకము అయిన పద్యరచన నుంచి స్వాత్మానుభూతి ప్రదర్శకము, మానవత్వ సందేశ సుందరము అయిన దశ వరకు ప్రయాణించి, ఆయన విప్లవాత్మక మానవత్వ ప్రతి పాదన రేశకు చేరుకొన్నాడు. భావగీతం ఆయన చేతిలో ప్రత్యేక పరిణతి పొందింది. అపూర్వ లయాత్మక బాణీలు కొన్ని ఆయనసాధించాడు. అయితే అటువంటివి సాధించిన ఆయన ఇటీవల కొంత కౌశలం కోలుపోయినట్లని పిస్తున్నది. ప్రయోగాత్మకతలోను, భావగీతికారచనంలోను మోహన్ సింగ్‌కు చేరువగారాగల కవయిత్రి అమృతాప్రీతమ్ (జ 1919). విషాద ఘట్టమైనవి పంజాబు విభజన, తత్ఫలితంగా చెలరేగిన దారుణ పరిస్థితులు ఆమె కవిత్వానికి కొత్తస్ఫూర్తిని ఇచ్చినవి. యువ సహజ ఊహాలోకపు కల్పనల స్థానంలో గాఢమైన ఆత్మీయగవేషణ, వేదనతో కూడిన పర్యాలోకనం ఆమెలో ప్రారంభమైంది. ఆమె చైతన్యం విస్మయావహమై సుసంపన్నమైన భావనా స్వరాలను సంతరించుకొన్నది. ఆమె కవిత్వం అంతర మానసిక క్షేత్ర చిత్రణము, ప్రసిద్ధి పొందిన హాప్ కిన్స్ భావనలో చెప్పవలెనంటే అది అంతర్ముఖతా చిత్రణ. కాలం ఆమె కవితాభావుకతను పక్వదశకు చేర్చింది. ఇప్పుడామె జీవిత ప్రశాంత సమీకరణ గవేషణంలో ఉంది. పేర్కొన దగిన ఇంకొక పంజాబీ కవయిత్రి ప్రభాజత్ కౌర్ (జ. 1924) ఆమెలో కూడా ఇటువంటి అంతస్సంఘర్షణ దర్శనానుభవం ఉన్నది. ఆమె మనోహరమైన సుందరమైనరచనచేస్తూనే ఉన్నది. ఆమె ఇటీవల ప్రకటించిన కవితా సంపుటి "పబ్బి" సహజ కవితా సామర్థ్యానికి, కొత్త ప్రయోగాలు, కొత్త రూపు దళలు అనుభవాన్ని ఒరుసుకొని వెలువడటానికి నిదర్శనంగా ఉంది.

ప్రీతమ్‌సింగ్ సఫీర్ (జ. 1916)ది మౌలికమైన, విలక్షణంగా ప్రత్యేకమైన

శైలి. కీట్సు భావచ్ఛాయలలో ప్రారంభించి ఇలియట్ శేముషికి, నిగూఢతకు చేరుకొని, చివరకు మళ్ళీ పూర్వీకుల మార్మిక భావనా స్థాయికి ఆయన చేరుకొన్నాడు.

రెండో ప్రపంచ యుద్ధం నాటినుంచీ, పంజాబీ కవిత్వం మరింత సంక్లిష్టమై, ప్రయోగాత్మకంకాజొచ్చింది. ఇది వరకటికన్నా నవకవులు ఆలోచనాంతర్వాహిను ల పట్ల వాళ్ళ అవలంబించే శైలీ పటాటోపం, మాటల ప్రేలుళ్ళు రుచికరంగా ఉండక పోవచ్చు గాక.

ఈ సంప్రదాయానికి చెందిన ప్రముఖులు, ప్రసిద్ధులు హరిభజన్ సింగ్, జస్వంత్ సింగ్‌నేకి, సోహన్‌సింగ్ మిశ, జన్‌బీర్ సింగ్ ఆహులివాల, హసరత్‌లు. వీళ్ళం దరిలోను నేడు వర్ధిష్ణులైన రచయిత శివకుమార్ బటల్వి, తారుణ్య స్వప్నాల, విఫల ప్రేమను చిత్రిస్తాడు ఈ కవి. అతనిది చాలా మృదువైన శైలి. అతని భావగీతాలన్నీ సుతారంగా వాయించిన వాయులీన జన్యాలులాగా స్పందిస్తాయి. ప్రతిధ్వనిస్తాయి. తన బృహత్కావ్యం "లూనా" తో ఆయన అత్యంత ప్రతిభాశాలి అయిన కథనాత్మక కవిగా సుస్థిరస్థానం సంపాదించు కొన్నాడు.

## II

సమకాలీన సాహిత్య ప్రక్రియ లన్నింటిలోను ఒక్క కవిత్వానికి మాత్రమే చెప్పుకోదగినంత గతమంటూ వున్నది. నాటకం, నవల, కథ, వ్యాసం, సాహిత్యవిమర. అన్నీ అత్యంత నవీనాలు. ఇప్పుడిప్పుడే అవన్నీ రూప రేఖలతో సాగుతున్నాయి. ఇంకా పరిణతి సాధించవలసి ఉన్నది.

పంజాబీలో నాటకంకూడా ఇంత ఆలస్యంగా ఆవిర్భవించటం ఆశ్చర్యకరంకి కాళిదాసు కాలం నాటినుంచే నాటకప్రక్రియకు దీర్ఘకాలిక, గౌరవప్రద చరిత్ర ఉన్నప్పటికీ పల్లె పట్టుల "నకల్"లు "నాటక్"లు ప్రజలలో నాటక ప్రదర్శనాభిరుచి నైతే గాఢంగా ప్రోది చేశాయే కాని, సమర్థుడైన పంజాబీ రచయిత ఎవరుకూడా ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలం దాకా సమగ్రమైన నాటక రచన వైపు దృష్టి మళ్ళించనే లేదు. ఈశ్వర చంద్ర నందా (1892-1966) పాశ్చాత్య ప్రభావం కల మొట్టమొదటి నాటకరచయిత. అతడు మధ్యతరగతి బూర్జువా సమాజ చిత్రణను వాస్తవికమైన, చురుకైన సంభాషణలలో చిత్రిం చాడు సమర్థవంతంగా, ఆయన చిత్రణలో పాత్రలను కొన్నింటిని వైయక్తిక మైనవి గాను, మరికొన్నింటిని సామూహిక ప్రాతినిధ్యం కలవి గాను ప్రవేశ పెట్టాడు.

ఆయనకు మెచ్చుకోదగిన ప్రదర్శన విజ్ఞానం ఉంది. అందువల్ల ఆయన రూపకాలన్నీ గొప్పగా ప్రదర్శన యోగ్యతను సాధించుకొన్నవి. సంత్‌సింగ్ షేకాన్ (జ. 1908) యూరోపియన్ నాటకాన్ని బాగా అధ్యయనం చేసినవాడు. పంజాబీ నాట కాన్ని కూడా విలక్షణమైన శిల్పకళాత్మకంగా తీర్చిదిద్దడానికి ఆయన ప్రయత్నించాడు. ఆయన విప్లవవాది. పురాతనాచార, విశ్వాసవిధ్వంసకుడు. ఆయన జడమైన, చివికిన సంప్రదాయాలను' వినాశక అంశాలను, కట్టుబొట్లి నిషేధాలను, నిరసించి సవాలు చేయడమేకాక, విప్లవాత్మక మైన' మానవతా చైతన్యదృక్పథాన్ని నాటక రంగానికి అందించిన వాడైనాడు. ఇబ్‌సెన్-ఫ్రాయిడ్'

మార్క్సు ఆయనమీద తమ ప్రభావం బరపటం స్పష్టమే. ఆయన నాటకాలైన కళాకార్, వారిస్. నలదమయంతి, మొయన్ సర్‌నకై, మొదలైన వాటిలో ఈ విషయం విశదమవుతుంది. ఇంకొక వైపున చూస్తే హరచరణ్ సింగ్ (జ. 1914) ఏ సిద్ధాంతానికి, ఏ తత్త్వ చింతనకు ప్రయోగాత్మక నాటక రచనకు అమ్ముడు బోయిన వాడు కాదు. ఆయన తొలినాటకాలు సంస్కరణాభిమానాన్ని, అభ్యుదయ దృక్పథాన్ని, వెల్లడిస్తాయి. అయితే ఇటీవల ఆయన మానవుని ఆంతరికలోకాలను ప్రతిభావంతంగాను, లో చూపుతోనూ గవేషిస్తున్నాడు. సమకాలీన వాస్తవికతపై ఆయనకున్న అవగాహన, వశ్యశక్తి ఆయన "శోభాశక్తి" ప్రదర్శిస్తుంది. ఆధునిక పంజాబీ రచయితులలో అత్యంత ప్రసిద్ధుడు, ఉత్సాహోపజ్ఞాశీలి, కొత్త కొత్త సీమలకు తీసుకొని పోవలెనన్న అభిలాష గలవాడు బలవంత్ గార్గి (జ. 1918). నాటక శిల్పంలో ఈయన పరిపూర్ణ ప్రజ్ఞ సాధించినవాడు. రష్యన్, యూరోపియన్, అమెరికన్ నాటకాలతో ఈయనకు సన్నిహితమైన పరిచయ సాహచర్యం ఉన్నది. ఇందుకు తోడు పూర్వ సంస్కృత నాటక సంప్రదాయంతోను, జానపద రూపకసాహిత్యంతోనూ, వీటి ప్రదర్శన శిల్పాలతో విశేషమైన విజ్ఞానాన్ని సాధించినవాడు. ఆయన తొలిరూపకం "లోహకుట్" పంజాబీ మాండలికం, పామర భాషలలో ఆయనకు గల అసమాన ప్రజ్ఞను వ్యక్తం జేస్తున్నది. దీనితోపాటు ఆయన ఎంచుకొన్న ప్రాంతాన్ని బాగా ఆకళించుకొన్న విషయం విశద పరుస్తుంది. పంజాబీ నాటకంలో ఇది కొత్త అధ్యాయాన్ని సృష్టించింది. ఆనాటి నుంచీకూడా ఈ రచయిత బహుముఖరంగాలలో ప్రగతిని సాధిస్తున్నాడు.

నవల కూడా చాలా ఆలస్యంగానే వచ్చింది. దీనికి కారణం బహుశా బాగా పారిశ్రామిక పురోగతిని సాధించిన సంఘాలలో మనకు కానవచ్చే సమస్యలను వర్ణించడానికి అనువైన సాహిత్యప్రక్రియ కావడమే ఇది. అయితే నవలా రచయితగా సుప్రసిద్ధుడుగా స్థిరపడ్డ నానక్ సింగ్ (జ. 1897) పరంపరగా ఒకదాని వెనుక ఒకటి నవలలు వ్రాసేస్తూనే ఉన్నాడు. ఆయన రచనా పరిశ్రమ ట్రోలోప్‌తోనో, బెన్నెట్‌తోనో మాత్రమే పోల్చదగినది. ఆయన ముఖ్యంగా కథనడపడంలో నేర్పరి. చిరకాలంగా ఆదృత మవుతూ వస్తున్న కాల్పనిక ప్రణయం, అద్భుత సన్నివేశాలు, అతినాటకీయత మొదలైనవన్నీ యథావిధిగా ఉపయోగించు కొంటాడాయన. అయినప్పటికీ బలమైన సామాజిక, మానవత్వ ప్రదర్శక ధోరణి ఆయన రచనలలో సువ్యక్త మవుతూనే ఉంటుంది. ఆయన మధ్యతరగతి వారిని గురించే వ్రాసినా, ఆయన వ్యంగ్య విమర్శకు గురిఅయ్యేదికూడా ఆ మధ్యతరగతే.

సురెందర్‌సింగ్ నరుల (జ. 1919) తో భావనాలోకంలోనూ, ప్రాయోగిక ధోరణిలోనూ పంజాబీ నవల ప్రవేశించి ముందుకు సాగింది. కథా కథనంనుంచి ఆయన పాత్రోన్మీలనం వైపు తీసుకొని పోయినాడు రచనాశిల్పాన్ని. ఆయన ఆధునిక కావ్యమనదగిన నవల "పియొపుత్తర్‌లో" నగర వాతావరణాన్ని ఆలంబనంగా చేసుకొని మానవ తరాల అంతరాలను, సంఘర్షణను చిత్రించాడు. ఆయన తీసుకొనే ఇతి వృత్తం యొక్క వాస్తవికావగాహన ఆయనకు బాగా ఉన్నది. దాని మీద ఆయన చక్కని కల్పనలు చేస్తాడు. పాశ్చాత్య రచనా శిల్పంతో వాటిని మేళవిస్తూ. అమృతప్రీతమ్ అనే రచయిత్రి తన డాక్టర్ దేవ్, పింజర్ మొదలైన నవలల్లో, కవితాత్మకమైన స్త్రీ సహజమైన వాస్తవిక

గ్రాహ్యతను ప్రదర్శించింది. చారిత్రాత్మక నవల సఫలంగానూ, సమర్థవంతంగానూ నరేంద్రపాల్ సింగ్ చేతిలో రూపుదిద్దుకొంది. ఇతర రచయితలలో మొహిందర్ సింగ్ శర్నా, సూర్జిత్ సింగ్ సేఠీ, గురుదయాల్ సింగ్‌లు, ఇతర ప్రాంతీయ భాషల నవలారచయితలతో పోల్చదగిన నవలలు వ్రాశారు.

పంజాబీ కథానిక, కవిత వలెనే అచ్చమైన మౌలికతను గొప్పగా ప్రదర్శించే ఆధునిక సాహిత్య ప్రక్రియ. కొత్త శిల్పరూపంగా అది కాలూనింది.ఎందుకంటే ప్రయోగాత్మకతకు అందులో అవకాశం ఎక్కువ.జీవితాన్ని నిరూపించగల అవకాశంఉండాలి.అంతేగాని ఐతిహాసిక,బృహత్పరిమాణలక్షణం అవసరంలేదు.అర్థవంతమైన ఒకక్షణాన్ని వేరుపరిచి చూపగలగటం,ఒక పాత్ర ఒక పార్శ్వం చూపగలగటం,వాతావరణ రేఖా చిత్రణం,ఒక మానసిక స్థితిని అందంగా సంపూర్ణతతో చిత్రించగలిగితే చాలు ఇందులో. మొపాస, చెఖోవ్, గోర్కీ, కేథరిన్ మేన్స్ ఫీల్డ్, హెచ్. ఇ. బేట్స్, ఓ హెన్రీ,మొదలయిన మహా రచయితలు పంజాబీ రచయితలకు ఆదర్శ రచయితలు. పంజాబీ రచయితలలో ప్రముఖులుగా పేర్కొనదగినవాళ్ళు సంత్ సింగ్ షేఖాన్, కర్తార్‌సింగ్ దుగ్గల్, కులవంత్ సింగ్‌వరక్ అజీత్ కౌర్, దలిప్ కౌర్ తివానలు, పాశ్చాత్య భావానుకరణంనుంచి విడివడి పరిగణనీయమైన స్వేచ్ఛను సంపాదించారు. స్వీయ వైశిష్ట్యాన్ని, కౌశలాన్ని సాధించారు.

పంజాబీ వచనరచన కూడా ఇటీవల పురోగతిని సాధిస్తున్నది. అయితే ఆధునిక తాత్త్విక చింతనలను ప్రతిపాదించగల ద్రఢిమను ఇంకా అది సంతరించుకోలేదనే చెప్పవలసి ఉంటుంది. అయితే సరళ సుందరమైన, ప్రౌఢ నిర్దుష్టమైన గురుబక్ష్‌సింగ్ శైలి (ప్రీత్‌లరి) కాని, పాండిత్యస్ఫోరకమైన తేజ్ సింగ్ (1894-1958) సాహిత్య నుడికారంకాని ఇందుకు అపవాదులుగా ఉంటాయి. అందువల్ల పంజాబీ లఘు వ్యాసమే ఇప్పుడు చురుకైన శైలితో, సుందరవిన్యాసంతో, వచన రచన ప్రాతినిధ్యం వహించగలదని చెప్పవచ్చు.

బలవంత్‌గార్గి రచిత 'నిమ్‌డెపట్టె' రేఖాచిత్ర రచన. వ్యంగ్య హాస్యస్ఫూర్తితమైనది గ్యానిగురుదత్‌సింగ్ రచన "మేరాపింద్" గ్రామీణ జీవిత చిత్రణనుగూర్చి ఛలోక్తులతోను చమత్కారంతోను సాగిన రచన. లఘు రచనలలో కావ్యత్వ గౌరవాన్ని పొందినవి, వీటి. సమర్థమైన అనుకరణలుకూడా ఎన్నో పుట్టినవి.

సాహిత్య విమర్శ ఇంకా పాండిత్యస్థాయికి చేరుకొని గౌరవం సంపాదించలేదు. ముఖ్యంగా ఇది పరిశోధక విద్వాంసులకు,వారి సిద్ధాంతగ్రంథాలకు పరిమితమైంది. ప్రధానంగా పాశ్చాత్య రససిద్ధాంతాలపైన, విమర్శధోరణులపైన ఆధారపడిఉంది. కొత్తకొత్త సాహిత్య ప్రయోగాలు ఆధునికశిల్ప సంక్లిష్టతల ఆవిష్కారకములుగా సృష్టించడం జరిగినా, అవి తాత్కాలికావసరోచితములుగానే అనిపిస్తున్నాయి.

డా॥ మోహన్ సింగ్ దివానా పంజాబీ సాహిత్య విమర్శకు ఆచార్య పురుషుడు. సంత్‌సింగ్ శేఖన్, మార్క్సిస్ట్ సాహిత్యరస సిద్ధాంత సంవేది. నిశితదృష్టి, విశ్లేషణ, ప్రామాణికతగల విమర్శకుడు. ఈయన ప్రతిపాదనలే గత ముప్పై సంవత్సరాలుగా,ఇంకా అంతకు మించి, చట్టాలుగాను తీర్పులుగాను చెల్లుబాటవుతున్నాయి. ఇంకొక మార్క్సిష్టు విమర్శకుడు

కిషన్‌సింగ్, తన తీర్పులలో మరింతపట్టుదలతోను, నిశితశాస్త్రీయ దృక్పథంతోనూ వ్యవహరిస్తాడు.

ఇప్పుడు పంజాబీ అధికార భాషాస్థానాన్ని పొందినది. దీని అభివృద్ధి కోసం, వికాసం కోసం నిబద్ధమైన ప్రత్యేకంగా ఒక విశ్వవిద్యాలయం కూడా ఏర్పాటైంది కనుక,పంజాబీ సాహిత్యం బహుముఖంగా ప్రగతి సాధించగలదని మనం ఆశించవచ్చు.

## వి ష య సూ చి క



## షే యి క్ ఫ రీ ద్

### ఫరిదా! గలియాన్ చికన్‌దూర్ ఘర్

ఫరీద్, వర్షం రథ్యను సంక్షుబ్ధం చేసింది
ప్రియమందిరం సుదూరం
అతడి దగ్గరకు వెళ్ళావా నీ పరిధానాలు తడిసిపోతాయి

ఇంటిదగ్గరే ఉండిపోతే
ప్రేమబంధాలను నీవు తెంచినట్లే అవుతుంది.

(సొల్క్ 24 పు. 1379)

x x x x x

## తప్ తప్ లొహ్ లొహ్ హత్ మరొరన్

దహించుకొనిపోతున్నాను గిజగిజలాడుతున్నాను వేదనతో
నిరాశతో చేతులు పిసుక్కుంటున్నాను
ప్రభువుకోసం బహుకాల నిరీక్షణతో వెర్రెత్తిపోతున్నాను
నీవు నన్ను వదిలేశావు, అందుకు కారణం ఉన్నది
నాదేదోషం నీదికాదు ప్రభూ
నీవంటి తండ్రి విషయంలో నేను అలక్ష్యం చేశాను
యౌవనం వాడిపోగానే నన్ను నిరాశ ఆవహించింది
నల్లని కోకిలా ఏమిటి నిన్నింత నలుపుగా దహించివేసినది
ప్రభు వియోగాగ్నియా ?
ప్రభువు లేకుండా ఎవరు ఉల్లసించగలరు ?
ఆయనకృపవల్లనే ఎవరైనా ఆయనను చేరగలరు
ఈ ప్రపంచమొక అగాధ అంధకార దుఃఖగర్తం
నేను ఏకాకిని స్నేహితులు, సహచరులు ఎవ్వరూలేరు
ఆయన అనుగ్రహంవల్ల పవిత్రమైన కూటమిలోకి నేను వచ్చాను
చెలికాడుగాను, సహవాసిగాను భగవంతుణ్ణి కొత్తగా దర్శిస్తున్నాను
నేను అడుగిడిన పథం మిక్కిలి కష్టభూయిష్ఠమైనది
రెండంచుల కత్తికన్నాకూడా పదునైనది
అతితీక్ష్ణమైన అతిదభ్నమైన
ఆ పథాన్ని నీవు ఎన్నుకోవాలి
ఓ షేక్ ఫరీద్, మేలుకో
సుప్తిపీడు, ఆయనను గురించి ఆలోచన చేయి.

x x x x

## ఖిజొసిజొకంబ్లి అలొహ్ వెర్సమహ్

ధారాపాతంగా జడివానలు కురియనీ ప్రభూ
నన్ను ముంచెత్తి నా వస్త్రాలు తడిసిపోయేట్లు చేయనీ
అయినా నేను నా ప్రాణమిత్రుణ్ణి చూడబోతాను

లేకపోతే ప్రేమబంధాలు తెంచినవాణ్ణి అవుతాను

x x x x

### ఫరేదా బురేద భాలకర్

ఫరీద్ అపకారానికి ఉపకారం చేసిచూపు
నీ ఆగ్రహంవల్ల సూర్యుడు గతి తప్పకుండా చూడు
నీ శరీరమప్పుడు చింతావివశము కాదు
అత్యంతమూ కోరుకొనే అన్నిటినీ అప్పుడు నీవు పొందెదవుగాక

x x x x

### ఫరిదామై జనియ దుఃఖ్ ముఘ్కు

ఫరీద్ నాకొక్కడికే దుఃఖమను కొన్నాను
సమస్తలోకమూ శోకాకులంగానే ఉన్నది
నా ఇంటికప్పునుంచి నేను చూస్తున్నాను
శోకాగ్ని కీలలు ప్రతి ఇంటినీ చుట్టు ముట్టుకొని ఉన్నాయి

x x x x

## గురునానక్ దేవ్

### బదమహా తుఖరి

ఇది చైత్రమాసం
వసంత కాలం ఎల్లెడలా కనువిందుగా ఉంది
అందమైన తేనెటీగను చూడవచ్చు
పువ్వులతో కలకలలాడుతున్నవన సీమలో
నా బాల్యపు రోజుల ఆవాసమది
కాని నా ఆత్మలో వియోగ దుఃఖం
ప్రభువుకోసం ఎంత కాలం నుంచో వేచి ఉన్నాను
భర్త ఇంటికి చేరరా నప్పుడు భార్యకేవిధంగా మనశ్శాంతి వుంటుంది
వియోగచింత నా శరీరాన్ని కృశింప చేస్తున్నది
మావిగున్నలలో కోకిలకలకూజితం చేస్తున్నది
దానిస్వరం నిండా ఆనందోల్లాసం
కాని నా ఆత్మలో చింత
మధు మక్షికం విరయబూసిన పూల కొమ్మల చుట్టు పరిభ్రమిస్తున్నది
ఆశా ప్రేమల వార్తాహరుడు
కాని ఓనాతల్లీ ఇది నాకు మృత్యు సన్నిభము
నా మనసు దుఃఖ మగ్నం కనుక

శాంతి సౌభాగ్యాలు నాకెట్లా లభిస్తాయి
గురువంటాడు
ప్రభువు వచ్చి తన పత్నిని కలుసుకొన్నప్పుడు
చైత్రింలో ధన్యత్వ శాంతి లభిస్తుంది

x x x x

గురూపదేశం నన్ను చేరరానీ
నీకు నేను తెలియపరుస్తాను ఓలాలో
క్రూరమైన దండ యాత్ర వెడలి బాబర్ కాబూల్ నుంచి దూసుకొనివస్తున్నాడు
బలాత్కారంగా కానుకలు కోరుతున్నాడు
యుక్తాయుక్తాలు నశించి పోయినవి, కాపట్యం బాహాటంగా విహరిస్తున్నది
కాజీవృత్తి, బ్రాహ్మణవృత్తి నశించి పోయినవి
వాటికి బదులుగా సైతాను వివాహ కార్యక్రమం జరిపిస్తున్నాడు పౌరోహిత్యం వహించి
ముస్లిం స్త్రీలు తమ కష్టాలలో ధర్మ శాస్త్రిలు పఠిస్తారు
తమ వేదనలలో తమకు తోడు పడవలసిందిగా భగవంతుణ్ణివాళ్ళు ఆవాహనం చేస్తారు
హిందూ స్త్రీలు,గొప్పతక్కువల వాళ్ళుకూడ ఒకేరకమైన దురదృష్టానికిగురిఅయినారు
ఓ నానక్ ఖూనీ పాటలు వినపడుతున్నవి, పాడుతున్నారు
కుంకుమ పువ్వు చల్లాల్సిన చోట రక్తం చిలకరించడం జరుగుతున్నది

x x x x

"ఓదివ్యగురూ, ఇవాళ ఖురాసాన్ నీదైనది"
భారత దేశం ఎందుకు కాదు?
భారదేశం వైపు మొగలాయి యముడులాగా వస్తున్నాడు
నిన్నెవరు తప్పుపట్టగలరు
మొగలాయి యముడు మా వైపు వస్తున్నాడు
అని మాత్రమే అంటున్నాము
ప్రాణ ప్రియా నీ జనులెందరు
ఘోరంగా ఊచకోతకు గురిఅయినారు
ఇదంతా నీ హృదయానికి అమితమైన వ్యధ కలిగించటం లేదా
అందరికీ నాథుడవు నీవు, అందరికోసమూ సంవేదన చెందుతావు
అధికారం అధికారం పరస్పరం ఘర్షించి నప్పుడు
పెదవి కదపలేని నిస్సహాయతతో చూడవలసిందే
అయినా నా అభియోగం ఒకటి ఉన్నది,
పెద్దపులులూ తోడేళ్ళు ఇవాల్టివలె కట్టు పీడి మీద

పడినప్పుడు, గొర్రెల మంద మీదికి ఉరికినప్పుడు
ఓ ప్రాణప్రియా, ఆ క్రూరనియంతను హద్దులలో శాసించలేవా?
జీవితానికే అలంకారాలైన వాటి నన్నిటిని వృధా చేసుకుంటాడు విజేత
తన అధికారానికి విర్రవీగుతాడు
తనమృత్యువును చూడడు, ఆవల జరగబోయే దానిని కానడు
ఓ సద్గురూ ఇదంతా నీ చిత్రమైన సంకల్పం
మమ్మల్నందరినీ ఒక చోట చేర్చేది, మరల
విడదీసేది కూడా నీవే
ఒకరి నొకరం నీయందే మేమంతా కలుసుకుంటాము
మళ్ళీ నీయందే ఒకరి నుంచి ఒకరం విడిపోతాము
తమను తామురాజులుగా వ్యవహరించుకొంటారు
తమచిత్తం వచ్చినట్లు ప్రవర్తిస్తారు
కాని నీవు తిలకిస్తూనే వుంటావు ప్రభో
నీవు చూస్తునే ఉంటావు అత్యల్పమైన కీటకం ప్రాకటం
తన అల్పాల్పమైన నోటితో అది మింగివేసే గింజలను లెక్కిస్తావు
నూరు సార్లు చావు దెబ్బలకు గురి అయినా
నీ ఇచ్ఛను నియంత తెలుసుకోలేడు

x x x x

ఆశరాగ్ పు. 360

దయను పత్తిగా, తృప్తి దారంగా
జితేంద్రియత దానిముడి, సత్యం దానిపురిగా చేయి
ఆత్మకది జందె మవుతుంది,
నీ దగ్గర అది ఉంటే
ఓ బ్రాహ్మణ్య అది నాకు ప్రసాదించు
అది తెగిపోదు, మాసిపోదు, దహించబడదు, నశించదు
ఓ నానక్, ఆ మానవుడు ధన్యుడు,
తన కంఠసీమ అటువంటి ఉపవీతాన్ని ధరించినవాడు,
నీవు జందేన్ని నాలుగు డబ్బులిచ్చి విలిచి ఒకమూల కూచుని
హిందువుల గురువర్యుడని బ్రాహ్మణుని ఉపదేశాన్ని మెల్లగా జపిస్తావు
మానవుడు మృతినొందుతాడు, ఉపవీతం పీడిపడిపోతుంది.
ఉపవీత రహితంగానే ఆత్మ ఉత్క్రమిస్తుంది.

x x x x

*వర్ ఆశ వు-471*

జితేంద్రియతను నీకొలిమిగాచేయి
పరిత్యాగము స్వర్ణకారునిగా నొనరించు
పరిజ్ఞానము నీదాగలి, ఆధ్యాత్మిక విజ్ఞానము నీఉపకరణాలు
భగవంతుని పాదాలే నీకొలిమితిత్తులు,
తపమే అగ్ని, భగవదనుగ్రహం నీమూస
అందులో దైవనామాన్ని కరిగించు
అటువంటి సత్యమైన టంకసాలలోనే
నామమనే నాణెంపోతపోయాలి
భగవంతుని అనుగ్రహపూర్వక కటాక్షం పొందినవారు ఆచరించే పద్ధతి ఇదే
నానక్ ఇటువంటి కృపావీక్షణం వాళ్ళను సంతోష భరితులను చేస్తుంది.

x x x x

*జప. వు. 8*

ఓ నా హృదయాభరణమూ
నీ విలువ కట్టగల ఆభరణాల బేహారి
ఎవరూ నాకు కనపడలేదు
నీ విలువను బోధించి చెప్పగలవాడు
ఇప్పుడు నీవు నాదానివి
సమస్త సృష్టి నీయందే ఉన్నది
సర్వ భూతమయుడవు నీవు,
ఎప్పుడోగాని నాలో ప్రకాశించవు నీవు
అనునిత్యం నిన్ను నూరుసార్లు దర్శిస్తాను, అదిదాలు
నీవు స్వయంద్రష్టవు
స్వయం మూల్యానివి, స్వయం విక్రయివి స్వయం క్రయకర్తవు
మనసు కాడికి కట్టుబడి పరిభ్రమించే నేను
చిక్కని ఈ అజ్ఞానం రక్తనిష్టమై ఉండగా
గుడ్డిగా, వేసటతో ఈనా సహచరులతో
నేను నీ సుగతినెలా పొందగలుగుతాను.

x x x x

*రాగ్ సుహి వు. 730 - 31*

ఓ నా హృదయాభరణమా నీ అపురూపతను నాకు బోధించు
నీ ప్రకాశమాన కిరణాలు నామనస్సును, హృదయాన్నీ కనీతా

నేను నిన్ను స్పృశిస్తాను జీవిస్తాను
నేను మళ్ళీనిన్ను స్పృశిస్తాను, మరింతకాలం జీవిస్తాను
వాళ్లు చదివారు, చదివారు
ఇండ్లకొద్దీ జ్ఞానభారాన్ని సమకూర్చుకొన్నారు.
ఒంటెలకు ఎత్తారు, పడవలనిండా నింపారు
కానివాళ్లు ఎక్కడికి పోతారు
ఒక్కటే విషయం గణనకు వస్తుంది
తక్కినదంతా ఆత్మరహితమైన నిస్సారం, నిరర్థకం.

x x x x

అహోరాత్రాలు ఆయన పూనుకొంటూనే ఉన్నాడు
ఋతువులనాయనే రూపుకట్టించాడు,
వాయువును, జలాలను ఆయనే రూపొందించాడు.
అగ్నిని, ఆకాశాన్ని, ఆయనే రూపెత్తించాడు
ఈ భూమిని వాయుమధ్యంలో సుప్రతిష్ఠితం చేసాడు
ఇది కర్మభూమి
ఇది భగవంతుని ఆలయం వంటిది
ఈ భూమి పుష్పవర్ణశోభితము, అనేక జీవజంతు జాల ఆవాసితము
వాటి అనంతరాశితో అదినిండి నిబిడీకృతంగా ఉంది.
ఇక్కడ మనం నడుచుకొన్న దానిని బట్టే మనకు తీర్పు లభిస్తుంది
భగవంతుని న్యాయస్థానం గోధుమలనుండి పొట్టును తూర్పారపడుతుంది
పరిపక్వమైనదీ, అపరిపక్వంగా ఉండిపోయినదీ
అక్కడే మన కర్మఫలం పంపకం జరుగుతుంది
ప్రతి మానవుడూ ఒంటరిగా నిలవ వలసిందే
ఈ భూమిమీద జీవితం ముగిసిన తరవాత
అతడు చేసిన పనుల ఫలితాన్నే పొందుతాడు

x x x x

*జప జీ-వ, 34.పు.7*

అసంఖ్యాకమైన దీపాలతో నా ప్రాణనాథుని చుట్టూ
సమస్తస్వర్గమూ పరిభ్రమిస్తూ ఉంటుంది.
చిరునక్షత్రాలు మౌక్తికాలు
వాయువులు ఆయనకు వీవనలు విసురుతాయి
కోటిపువ్వుల గుండెల గుబాళింపు ఆయన ఆలయంతో ఉదితమౌతుంది.
సృష్టియొక్క అనంతమైన సంగీతం ప్రతిధ్వనిస్తూ ఉంటుంది
నా ప్రాణప్రియుడు శతసహస్రాక్షుడు

కాని మర్త్యమైన పాదాలులేవు
ఆయన సమక్షపు పరిమళం నన్ను పారవశ్యంతో ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది
ఆయన దేహం కోటిపరిమళాలు విరజిమ్ముతుంది
అయినా ఆయన గంధరహితుడు
ఆయన జీవనజ్యోతి
ఆయన వదనమండల కిరణ పుంజం వల్లనే నక్షత్రాలు ఉజ్వలకాంతి మంతాలు
ఆయన సర్వాత్మమయుడు
ఆయన ఇచ్ఛ ననుసరించే అన్నీ జరగవలెనని
నేను నిరీక్షిస్తూ వుంటాను
స్వామి వచ్చిఅండన నిలచినప్పుడు
దివ్యకాంతి వ్యక్తమవుతుంది
దప్పిగొన్న సారంగంవలె ఆయన పాదపద్మ (ద్మాల?)
పూర్ణచంద్రుడు నన్ను ఆకర్షిస్తున్నాడు
దానిపిపాస అనునిత్యం ఎక్కువవుతూనే ఉన్నది
ఓ భగవంతుడా! వచ్చి నీ సంరక్షణ వీక్షణాన్ని నాపై బరపు
నీ పవిత్రాతి పవిత్ర నామంలో నాధ్యాస శాశ్వతంగా నిలవనీ

*ధనశ్రీ పు. 663*

x x x x

కెంపులు తాపడం చేసిన ముత్యాల భవనాలు
నీ ముందు నిలిచినప్పుడు
చందనం, కస్తూరి, అగరులతో
నేల అంతా పూతలు పూసి గోడలన్నీ మెత్తినప్పుడు
సత్య సందర్శనంనుండి నీ దృష్టి మళ్ళించకు
ఓ శిష్యుడా నీ ప్రాణప్రియుని నామం మరువవద్దు
సమస్త ఇంద్రజాలం నీవశవర్తి అయినా
మనస్సులో కోరినంతమాత్రం చేత దృశ్యరూపుడవు,
అదృశ్య రూపుడవూ నీవు కాగలిగినా
గుములుగుములుగా జనులు వచ్చి నిన్ను అర్చించినా
నీ ప్రాణప్రియుని నామాన్ని నీవు గ్రహించవద్దు
నీవు సుల్తానువే అయినా
నీ సైనిక పటాలాలు నీ ఆజ్ఞా పాలనంకోసం ఎదురుచూస్తున్నా
అదంతా దురతిశయం

సత్యసందర్శనం నుండి నీ దృష్టి మళ్ళించకు
ఓ శిష్యుడా నీ ప్రాణప్రియుని నామం మరిచిపోవద్దు

x x x x

శ్రీరాగ్ పు. 14

వైశాఖమాసం ఆహ్లాదకారి,
చెట్లు పుష్ప వికసనములు
ప్రాంగణ ద్వారంవద్ద పడతి భగవంతుని కోసం
నిరీక్షిస్తున్నది
'రా నాపై కరుణ ప్రసరించు
నా ప్రాణ ప్రియా గృహానికి విచ్చేయవలసింది
ఈ కష్ట సాగరాన్ని నన్ను తరింప చేయి
నీవు లేకుండా, నేను వ్యర్థురాలిని
నీ విలువను ఎవరు నిర్ధరించి చెప్పగలరు, మనోహరా
నీకు సంతోషం కలిగించే పక్షంలో, నేను నిన్ను కాంచి
ఇతరులచే దర్శింప చేస్తాను
నాకు తెలుసు నువు దూరంగా లేవు
నీవు నా హృదయంలోనే ఉన్న విషయం గుర్తిస్తున్నాను
నీ మందిరం నేను గుర్తించగలను
నానక్, వైశాఖంలో భగవంతుణ్ణి ధ్యానమగ్నుడై దర్శిస్తాడు
వాక్కు (మంత్రం) మీద మనసు నిలిపి ఆనందమనస్కుడైనవాడు.

x x x x

షరీలందరూ వేపల్లె పడతులను కో
పహార్‌లంతా గోపాలురు, కృష్ణులు అనుకో
గాలీ నీరూ అగ్నీ నీ ఆభరణాలు కానీ
సూర్యచంద్రులు నీ అవతారాలు
సమస్త ధరాతలం నీ రంగస్థలం
వస్తు వాహనాదులన్నీ సంకెళ్ళు
నానక్, ఆధ్యాత్మిక జ్ఞాన శూన్యులైన వారంతా అపహృతులు
మృత్యు సచివుడాతణ్ణి ఒడిసి పట్టుకుంటాడు.

x x x x

కలియుగం కృపాణం
రాజులు సూనరులు
ధర్మం రెక్కలు తొడుక్కొని ఎగిరిపోయింది

ఈ గాఢాంధకార కాపట్యపు రాత్రిలో
సత్య శీతాంశుడుదయించనే ఉదయించదెపుడూ
నా అన్వేషణలో నేను విసిగి వేసారాను
అంధకారంలో నాకు త్రోవకనపడనే లేదు
అహంకారానికి దాసుణ్ణైనాను

దుఃఖిస్తున్నాను చింతతో
నానక్ అంటాడు ఏ విధంగా విముక్తి లభిస్తుంది.

x x x x

భగవంతుడు తప్ప అన్నీ నశించేవే
రాజులు, పాలితులు, పాలకులు ఎవ్వరూ మిగలరు
అంగళ్ళు, నగరాలు, అంగడి వీధులు భగవంతుని ఆజ్ఞకు లోబడి నశించిపోతాయి
బలమైన సుందర భవనాలు తన వనుకుంటాడు అవివేకి
మహదైశ్వర్యంతో నిండిన ధనాగారాలు క్షణంలో ఒట్టివై పోతాయి
తురగాలు, రథాలు, ఒంటెలు, ఏనుగులు, వాటి శాలలు
వనాలు, సంపదలు, భవనాలు, ఆవాసాలు,
గుడారాలు, సుఖశయ్యలు, నగిషీలు దిద్ది తీర్చిన మండపాలు
ఇవన్నీ ఎక్కడ గుర్తింపు పొందుతాయి.

x x x x

నదులన్నీ పాడి పశువులవుతాయనుకొందాము

నీటి ఊటలన్నీ పాలూ వెన్నా అవుతాయి గాక
సమస్తమైన భూమీ (మన్నూ) చక్కెర అవుతుంది గాక

హృదయానికి ఎల్లప్పుడూ సంతోషం కలిగే విధంగా
వజ్రాలు, రత్నాలు స్థగితమైన

పర్వతాలన్నీ వెండి, బంగారుమయం అవుతవి గాక
అప్పుడుకూడా నేను నిన్నే మహిమ పరుస్తాను

నేను మాటాడినప్పుడల్లా ఆ కోరిక నానుంచి వీడిపోదు
భూమిమీది సమస్తమైన పైరు పచ్చలన్నీ పండిన పండ్లు అవుతవి గాక

గరిక (ఘాసమంతా) అంతా బియ్యమవుతాయి గాక
సూర్యచంద్రుల గతులను నేను నిరోధించగలుగుతాను గాక
నా ఆసనం అచంచలంగా స్థిరంగా ఉంటుంది గాక

అప్పుడు కూడా నేను నీ మహిమనే ఘనంగా పొగుడుతాను
అంతే కాక నేను మాటాడినప్పుడల్లా ఆ కోరిక నానుంచి వీడిపోదు

x x x x

రాహు కేతువులనే పాప జీవులనే నేను బాధించగలిగినా ?
రక్తపిపాసువులైన రాజులపై నా అధికారం నెరపగలిగినా
నా వైభవం ఆ విధంగా ప్రకాశించగలిగినా
అప్పుడు కూడా నేను నీ మహిమనే ఘనంగా వ్యక్తం చేస్తాను
ఆ విధంగా చేయాలన్న కోర్కె నామాటల్లో ఏనాడూ నన్ను వీడిపోదు.

x x x x

నిప్పు, నీహారము నా వస్త్రాలవుతాయి గాక
గాలి నా ఆహారమవుతుంది గాక
అంతరిక్షంలోని అప్సరస
లందరూ నా కాంత లవుతారుగాక-
అన్నీ నశించేవే
అప్పుడుకూడా నేను నీ మహిమనే కొనియాడుతాను
ఆ విధమైన కోరిక నామాటలనుండి వీడిపోదు.

x x x x

*వర్ మజ్ హ పు 142.*

*అక్కలారా ఇది వానల నెల*

I

నెమళ్ళు నాట్యం ప్రారంభించాయి
అక్కలారా ఇది వానలనెల
వర్షం కురుస్తున్నది రిం ఝుం, రిం ఝుం
ఓ పడతీ నీ కనులశక్తి చాలాగొప్పది
అందరినీ జయించిన వాడిని నీవు జయించినప్పుడు
ఓ ప్రాణప్రియా నీవు వస్తే చాలు
నన్ను నేను సమర్పించు కుంటాను
నీ పేరు చెప్పిన సంతోషం పొందినందుకు
నేను పరిత్యక్త నైనాను
వాళ్ళంటారు నేను గర్వితురాలనని
నీవు నావాడవు కనక నేను గర్వితురాలను
నీవు లేకపోతే నేనెవరిని
దుమ్ము, ధూళి, బూడిదను
ఓ అక్కలారా, ఇది వానల నెల

వర్షిస్తున్నది అతడు వస్తాడా, వస్తేసరి
వర్షిస్తున్నది ఝం ఝుం, ఝం ఝుం
ఆనందం, ఆనందం వాళ్ళకు, వాళ్ళు అతడితో ఉన్నారు
నా చెలులు అతడితో ఉన్నారు
వాళ్ళు గానం చేస్తారు, ప్రణయ జీవనం చేస్తారు.

II

నా గృహం శూన్యం, సెజ్జ శూన్యము
అతడు రాలేదు నా కెంపు వన్నె గాజులను
కెంబట్టు పాన్పుపై పగలగొట్టి చిందరవందరగా
శూన్యమైన గదిలో ఆ ముక్కలు విరజిమ్ముతాను
అతడు రానప్పుడు భూషలతో ఉన్న ఈ బాహువులు
నిష్ప్రయోజనం

ఈ కెంపు లేసులు నిరర్థకం
ఇంతకాలం ప్రతీక్షించిన తరవాత
అతడు నా నుంచి పరాఙ్ముఖుడు కాలేదా
ఓ పడతీ, కెంపువన్నె గాజులలో కాదు,
గాజులు చేసే వాళ్ళలో కాదు,
అందమైన భూషలు ధరించిన బాహువులలో కాదు
నీ ప్రేమ వ్యక్తీకరించ వలసింది.

III

ఆ! అయితే నేనిప్పుడెక్కడికి వెళ్ళగలను
దారి లేదు, గుమ్మం లేదు
అయినప్పటికీ తల్లీ నన్ను అందగత్తె అనేవాళ్లు కొందరు లేరా
కాని అతడు నన్ను చూడడు
నా యందు ఇష్టుడు కాడు
అప్పుడిక నా సౌందర్యమంతా బుగ్గికాసీ
నా కురులు చక్కగా అలంకరించుకున్నాను
పాపట అందంగా తీర్చిదిద్దుకున్నాను
నున్నగా తల దువ్వుకున్నాను, జడ అల్లుకున్నాను
ఇరు ప్రక్కలా సాంబ్రాణి ధూపాన్ని పట్టించి
పాపటలో సిందూరం అలదుకున్నాను

ఎంత అందంగా ఉన్నాను నేను,
నున్నగా దువ్వుకున్న నాకురులు, జడలు బహుసొగసుగా ఉన్నాయి
కాని అతడు నావైపు చూడడు,
అంతా నిముషంలో జరిగిపోయింది
నేను పరిత్యక్తను, అతడి ప్రేమకోల్పోయినాను

IV

నాదుఃఖంలో, అట్టడుగునుంచి నా ఆత్మక్షోభిస్తున్నది
నేను విలపిస్తున్నాను, నాతో ప్రపంచమూ
అడవిలోని పక్షులన్నీ నాకోసం విలపిస్తున్నవి
కాని నాకోసం నిష్ఠురమైన నా ఆత్మ విలపించదు
అదినా వినాశనం

V

స్వప్నంలో ఒకసారి అతడు నాదగ్గరకు వచ్చాడు

వచ్చి వెళ్ళిపోయినాడు
నా కనుల అశ్రువులు నిండాయి, అది కేవలం కల
అయ్యో, నాప్రాణప్రియా, నీఉన్నచోటు నేనుచేరే ధైర్యంలేదు
దూతిని పంపించలేను ఒకవేళరాగలనా? రాగలిగినాగూడా
నీనుంచి నాకేమీ వార్తరాదు
నానుంచి నీకేమీ సందేశంచేరదు
ఈనానిరర్థకమైన మెళకువ గొప్పవ్యథకాదా
ఓ నిద్రా, రా, నన్ను నీవశంచేసుకో
నాకు విశ్రాంతి కలిగించు, ఒకవేళ నా సంతోష
స్వప్నాలలో మళ్ళా అతడిని చూడగలనేమో.

VI

నాప్రాణప్రియుని గురించినవార్త తెలియజేయటానికి ఎవరైనా నాదగ్గరకువస్తే
నిజంగా ఎవరైనా ఇప్పుడు నాదగ్గరకు రావడమే జరిగితే
నీకు తెలుసు నేనాతనికి ఏమిఅర్పిస్తానో
అతి దుస్సహమైన అనుభవాలద్వారా నేను దానిని నేర్చుకున్నాను
నాసర్వస్వం నా ప్రభువుకు అర్పిస్తాను
అంతా అర్పించుకుంటాను
నా కొరకు నేనేమీ ఉంచుకోను, ఆయనను సేవించు

కోవటానికి కూడా
నన్ను నేను పూర్తిగా సమర్పించుకోవడం వల్ల
ఆయన నుండి నేను అరువు తీసుకొని
ఆయన వాటితోనే వారిని సేవించుకుంటాను.

VII

నెమళ్ళు నాట్యం ప్రారంభించాయి
రిం ఝుం, రిం ఝుం, రిం ఝుం
అక్కలారా ఇది వానలనెల
వర్షిస్తుంది, రిం ఝుం
ఆహ్లాదం వర్షిస్తుంది, రిం ఝుం
ఆనందం, ఆనందం, ఆదేవార్త
జీవితమంతా ఉజ్జ్వలోజ్జ్వలం

x x x x

## గురుఅర్జునదేవ్

సద్గురు సందర్శనం కోసం నా ఆత్మ
ఎంతకాలంగా నిరీక్షిస్తున్నది
వర్షబిందువుల కోసం చాతకంలా కూస్తున్నది
నా పిపాస తీరదు, పరమగురుపాదుల సందర్శనం లభించనంతవరకు నాకు విశ్రాంతి లేదు
పరమ గురుమౌళి సందర్శనంకోసం
సమర్పితుణ్ణి, సమర్పితుణ్ణి.

*రాగ్ మఝ్ హ్ పు. 96*

x x x x

నీ వదనం సుందరం
నీ మాటల రవం మనసు కుదురుపరుస్తున్నది
నా ప్రభువును చూసి ఎంతో కాలమైంది.
నీ ఆవాసభూమి ధన్యత నొందినది
ఓనా సద్గురూ, చెలికాడా, ప్రభూ
నా నెచ్చెలీ, ప్రభువూ అయిన

నా సద్గురునికి
నేను సమర్పితుణ్ణి, సమర్పితుణ్ణి

*రాగ్ మఙ్ హ్ పు. 96*

x x x x

నీ నుండి క్షణకాలం నాకు వియోగం కలిగితే
అది నాకొక యుగం
మళ్ళీ నేనెప్పుడు నిన్ను కలుసుకో గలను ప్రాణప్రియుడవైన ప్రభూ
ఈ రాత్రి వేగించలేను
సద్గురుని కొలువు దర్శించకుండా నిద్రరాదు
సద్గురుని కొలువుకూటానికి
నేను సమర్పితుణ్ణి, సమర్పితుణ్ణి
పవిత్ర గురువును దర్శించటం నా భాగ్యం
నా మందిరంలోనే శాశ్వతుడైన భగవంతుణ్ణి కనుగొన్నాను
నిన్ను సేవించుకోనీ, నీ నుండి మరిమెప్పుడూ క్షణంకూడా వియోగం కలగకుండనీ
నానక్ నీ సేవకుడు
నేను అర్పితుణ్ణి, నా ఆత్మ నీకు సమర్పితం
నానక్ నీ సేవకుడు

*రాగ్ మఙ్ హ్ పు. 96*

x x x x

నేను ఏకైక వస్తాదు జెట్టిని
ఆయన పోష్యుడిగా ఉన్నాను
ఆయనతో, ఆయనవలె, నేను గొప్పవారందరిలో గొప్పవాణ్ణి
విశదంగా చుట్టూ గిరిగీశారు
వస్తాదు మల్లురు వచ్చాదు. ప్రేక్షకులు చుట్టూ కూచున్నారు
కుస్తీలు ప్రారంభమైనాయి, క్రీడ ఆరంభమైంది.
ఆయన కూచుని చూస్తున్నాడు
మధురాతి మధురం
బాజాలు మ్రోగుతున్నాయి బాకాలు ఊదుతున్నారు
జెట్టి మల్లురు పరిశ్రమిస్తున్నారు,
ఏ విధంగా వెనక్కు తగ్గుతున్నారో
ఏ విధంగా అడుగులు ముందుకు వేస్తున్నారో
అర్ధవృత్తాకార గతులలో ఏ విధంగా పదచాలనం చేస్తున్నారో

వాళ్ళందరినీ చిత్తు చేశాను
అదుగో పడి ఉన్నారక్కడ
పంచకం, నీ జెట్టిమల్లురు
ఆయన దగ్గరకు పరుగుతీశాను
ఆయన నా వీపు తట్టాడు
మధురాతి మధురం
ఆహూతులంతా ఒక్కొక్కరూ చెదరి పోయినారు
ఎవరికివారుగా వారి దారిన వెళ్ళిపోయినారు
ఆయనను చూడని వారికి
చావు బ్రతుకులు రెండూ కూడా మల్లభూమి
కాని ఇతరులున్నారే ఆయన్ను చూసిన వారికి
మధురాతి మధురం
దేహరూపుడు కాడాయన
సమాధి అవస్థ
నేను ఆయన్ను చూడగలను
హృదయ కమలాన్ని మకరందంతో ఆయన మాధుర్యంతో నింపుతాడు
ఆయన ఊర్పుతో నన్ను ఉత్తేజ పరుస్తాడు
మధురాతి మధురం
జన్మజన్మాలు ఈ విధంగా దొర్లిపోతాయి
నా బంధనాలు ఛేదించాడు, నా పాశాలు కోసివేశాడు
స్వేచ్ఛాభానూదయమయింది
గురునానక్ అంటాడు
మధురాతి మధురం

శ్రీరాగ్ పు. 74

## ఎక్‌పిత ఎకస్‌హమ్ బరక్

ఒకే భగవంతుడు అందరికీ తండ్రి
మనమంతా ఆయన బిడ్డలం
ఓగురూ, ఓమిత్రుడా, నాహృదయాన్ని నీకు అంకితంచేసుకొంటున్నాను
నీవు నన్ను వదిలివేస్తే, భగవంతుని కిరణ లేశం నన్ను పొందనీ
నీ పాదాలు స్పృశిస్తాను
వాటిని కడుగుతాను.

నా హృదయమంతా నీకే అర్పిస్తాను
ఆలకించు, మిత్రుడా, నేను నిన్ను శరణు పొందాను
భగవంతునితో ఏకం కావడం ఎట్లానో నాకు బోధించు
గర్వం నుండి తప్పించుకొని బయటపడు
ఆయనను శరణు పొందు
ఆయన ఏం చేస్తాడో దానిని సంతోషంతో అంగీకరించు
ఆలకించు నా మిత్రుడా
నీ కాయాన్ని, నీ మనస్సును, నీ సమస్తాత్మను ఆయనకు అర్పించు
దైవసాక్షాత్కారపు వెలుగును దర్శించు
నా ప్రభువు ఆశీస్సువల్ల
పుణ్య పురుషుల
సాధు పుంగవుల అనుగ్రహంవల్ల
దివ్య నామం నాకు మధురమైనది
తన సేవకుణ్ణి సద్గురువు కటాక్షించాడు.

రాగ్ సొరఠ్ పుటలు *611-612*

x x x x

మూఢ నమ్మకమనే పెంకు పగిలిపోయింది
మనసు దీప్తి పొందింది
కాళ్ళ సంకెళ్ళు తెగగొట్టాడా గురువు, బందీకి స్వేచ్ఛను ప్రసాదించాడు
రూపాంతరత్వం ముగిసింది
కుతకుత ఉడికిపోతున్న పాత్ర చల్లబడింది
గురువు చల్లబరచే నామాన్ని ఇచ్చాడు
పవిత్ర వ్యక్తి నాతో ఉన్నాడు కాబట్టి, నా కోసం పొంచి ఉన్న
మృత్యు కింకరులు, నన్ను విడిచిపోయినారు
నన్ను నిర్బంధించిన ఆతడి నుండి నాకు విడుదల లభించింది
న్యాయాధిపతి ఇప్పుడు నా విషయం ఏమి చేస్తాడు !
నా కర్మ భారం తొలగించబడింది,
నేను దానినుండి విడుదల పొందాను
సముద్రంలోంచి తీరాన్ని చేరుకున్నాను.
గురువు నాకీ అనుగ్రహం ప్రసాదించాడు
నా స్థానం సత్యమైనది, నా పీఠం

సత్యమైనది, సత్యాన్నే నేను ప్రత్యేక లక్ష్యంగా చేసుకున్నాను
సత్యమే నా పెట్టుబడి, సత్యమే వ్యాపారంచేసే
సరుకు, నానక్ తనక్ ఇంటిలో చేర్చి ఉంచాడు.

x x x x

మారు. పు. *1002*

## మానవునితో భగవంతుని బాంధవ్యం

నీవే నా తండ్రివి తల్లివి
నీవు నా బంధుగుడవు భ్రాతవు
అంతటా నిండి ఉన్నావు నీవు నా రక్షకుడవు
నీ అనుగ్రహంవలన నిన్ను నేను గుర్తించాను
నీవు నా ప్రాపు నీవు నా మన్నన
నీవు వినా నాకెవరూలేరు నిఖిల ప్రపంచం నీ క్రీడారంగం
మానవులను అల్పజంతువులను నీవే సృష్టించావు
నీ ఆనందానికై వాళ్ళవాళ్ళ విధులను నియామకం చేశావు
నీవు సృష్టించిన సమస్తమూ నీదే మాదంటూ ఏమీ లేదు
నీ నామాన్ని ధ్యానిస్తూ నేను గొప్ప ఊరట పొందాను
నా హృదయం సేదదీరింది నీగుణగానంవల్ల
సద్గురువు (పరిపూర్ణ గురువు) నన్ను అభినందించాడు, నానక్
తన కష్టాలనుంచి గట్టెక్కాడు
భగవంతుని పాదకమలాలను ప్రేమించే ఆమె
శ్రావణంతో సంతోష స్వాంత
ఆమె మనో దేహాలు అచ్ఛ ప్రేమతో సంలగ్నమైనాయి
నామమే ఆమె ఏకైక ఆధారం
ఐహిక సుఖ వ్యామోహం కల్ల
అవి బూడిద అవుతాయి
భగవదమృత బిందువులు సుమనోహరములు
ఎవరికైతే సాధు సమాగమంచేకూరుతుందో
అతడు వాటిని పానం చేస్తాడు
వనసీమలు తోయలు
నిరుపముడు, సర్వవ్యాపి భగవంతుని తోడి
ఆనందాన్ని అనుభవిస్తాయి

భగవంతుణ్ణి కలుసుకోవాలని నా మనసు వేచి ఉన్నది.
ఆయన అనుగ్రహమే నాకు దానిని సిద్ధింపచేయాలి
భగవత్సాక్షాత్కారాన్ని పొందిన నా సహచరులకు
నేనెప్పుడూ వర్జితుడనే
నానక్ భగవంతుడు దయాపూర్ణుడై
వాక్కుతో మానవులను
పునర్జీవితులను చేస్తాడు
భగవన్నామాన్ని తమ హృదయాలలో బంధించుకున్నవారికి
శ్రావణం సుఖదాయి
భాద్రపదంలో ధన పిశాచాన్ని ఆరాధించే ఆమె
సంశయంలో కూరుకొనిపోతుంది
శత సహస్ర అలంకార భూషితురాలైనా
అవి దేనికీ కొరగావు
మానవుడు తాను అధికంగా ప్రేమించేవి
క్షణంలోనే అతణ్ణి విడిచిపెట్టిపోతాయి
అతడు చేతులు వేలవేస్తాడు
అతడి శరీరం వణుకుతుంది
వర్ణహీనతచెంది పాలిపోతుంది
తనువు శిథిలమైన ఆనాడే మానవులు దాన్ని ప్రేతమంటారు
మృత్యుకింకరులు చుట్టుముట్టి ఆత్మను కొనిపోతారు
వాళ్ళ రహస్యాన్ని ఎవ్వరికీ చెప్పరు
మానవుడు తాను చల్లినదేదో అదే కోతకు వస్తుంది కర్మ క్షేత్రంలో
నానక్ ఆయన రక్షణ కోరిన మానవుడికి
భగవంతుడు తన పాదాలనే తెప్పగా ఇస్తాడు
తమ రక్షకుడైన గురువును ప్రేమించినవాళ్ళు
భాద్రపదంలో నరకం పొంత బోరు.

x x x x

గురూపదేశం నాకు రక్షణ
అన్ని వైపులా అది నన్ను కాచి ఉంటుంది
భగవంతుని నామంతో నా ఆత్మ ముడిపడి ఉంది
ఇప్పటి వరకూ పాపిష్టి మృత్యువు పారిపోయింది
ఓ ప్రభూ నీవు ఆనందాన్ని అనుగ్రహిస్తావు నాకు

సర్వ వ్యాపకుడైన భగవంతుడవు నీవు
నా బంధనాలు తెంచావు
నా హృదయాన్ని పరిశుద్ధం చేశావు
నానక్, భగవంతుడు నాశరహితుడు
ఆయన ఆరాధన నిష్ఫలం కాదు
నీ నామం జపించగా,
నీ భాగవత శ్రేష్ఠులు హర్షిస్తారు, వాళ్ళ కోరికలన్నీ సఫలీకృతమవుతాయి

x x x x

సొరత్ పు. 626

చేతులతో తాళం వేయి, కన్నులను మృదంగాలుగా చేయి
నీ ఫాలమే మూడు తంత్రుల వీణ, శ్రవోయుగళి మధుర వేణువు
నాలుకే ఆలాపన
హస్త చాలనాలతో అందెల ఘలం ఘలలతో అనుగుణం
గా హృదయ నృత్యమొనరించు
భగవంతునికి నృత్యాన్ని సమర్పించు
దయాళువైన అతణ్ణి నీ ప్రేక్షకుడనుకో
చూడు నీ ఆహార్యము, అలంకరణలు
సమస్త పృథివి నీ రంగస్థలం చేసుకో
మీది ఆకాశాన్ని చాందినీగా అనుకో
ప్రాణశక్తి అన్నిటి నిర్వాహకుడు
నీటి నుంచి, తక్కిన మూలకాల నుంచి
భగవంతుడొక తోలు బొమ్మను చేశాడు
దానికి కదలికలు సంక్రమింప చేశాడు
భూతలం నాలుగు మూలలా భగవంతుడు
సూర్యచంద్రులనే దీపాలను వెలిగించి నిలిపాడు
పదిమంది నాట్యగత్తెలు, ఐదుగురు వంత ఆడే వాళ్ళు కలిసి
ఒక మందిరంలో ఉన్నారు
వాళ్ళు ఎవ్వరికి వారు అభినయిస్తున్నారు
అందరూ వేరు వేరుగా మాట్లాడతారు
ప్రతి ఇంట్లోనూ రాత్రీ పగలూ
నృత్యం సాగుతూనే ఉంటుంది
ప్రతి హృదయంలోనూ బాజాలు

ప్రోగుతూనే ఉంటాయి
లౌకిక కార్యకలాపాలలో ఒకరిని
నాట్యం సలిపేట్లు చేస్తాడు భగవంతుడు
మరి ఒకరిని నివృత్తి మార్గానికి మళ్ళిస్తాడు
ఇంకొకరికి జన్మాంతరాలెత్తే దుస్థితిని కలిగిస్తాడు
నానక్ అంటాడు.
సద్గురువును సందర్శించ గలిగిన వాడు
నాట్యం చేయనే చేయడు.

*రామ్‌కలిరాగ్ పు. 884 - 5*

మానవుడు వేదాలు చదవనీ అధ్యయనం చేయనీ
నివాళి, భుజంగ యోగాలను ప్రదర్శించనీ
పంచ మహాపాతకాల సహవాసంనుంచి అతడు తప్పుకోలేడు
అది అసంభవం, అంతేకాదు అహంకారానికి మరింత లోగిపోతాడు
ఓ నా ప్రాణాధికుడా, భగవంతుని దర్శనం ఈ విధమైన సాధనలద్వారా సాధించలేవు
నాకు తెలుసు, ఏమంటేనేనిటువంటి వెన్నో చేసి చూశాను
అలసి సొలసి భగవంతుని ద్వారం దగ్గర సొమ్మ సిలి పడిపోయినాను
నాకు ఆయన జ్ఞానాన్ని, వివేచనను ప్రసాదించగలడని
మౌన వ్రతాన్ని పాటించనీ మానవుడు
పర్ణభక్షణం మాత్రమే చేయనీ
అడవిలో వస్త్రరహితుడై సంచరించనీ
భూమి మీది పవిత్ర యాత్రాక్షేత్రాలన్నీ సందర్శించనీ
కాని ఈ ఐహిక మోహాలనుంచి అతడు తప్పించుకోలేడు
అతడు విమోచనం కోసం ఒక పవిత్ర క్షేత్రంలో
ఆవాస మేర్పరచుకొని తలబద్దలు కొట్టుకొనేంత ప్రయత్నించవచ్చు
కాని అటువంటి లక్ష ప్రయత్నాలు చేసినా మనసు లోని మాలిన్యాలు అతడిని వీడిపోవు
అనేక రకాల గొప్ప గొప్పదానాలు చేయవచ్చు అతడు
కనకం, కాంతలు, గుర్రాలు, ఏనుగులు అనుగ్రహించవచ్చు
ధాన్యం, వస్త్రాలు, భూములు, కోకొల్లలుగా అతడు సమర్పించవచ్చు
అయినా అతడు భగవంతుని ద్వారాన్ని సమీపించ లేడు
పూజలు, ఆరాధనలు సాగించనీ,

విధేయ వ్రతం పూననీ, దండప్రణామాలా చరించనీ
షట్కర్మయుతుడే కానీ,
ఆ పథంలో అతడు భగవంతుణ్ణి కనలేడు
అహంకార జాలకాలలో అతడు చిక్కుకుంటాడు కేవలం
మానవులు యోగం పట్ల విసుగు చెందారు, ఎనభై నాలుగు సిద్ధులపట్లవేసట నొందారు

మానవుడు దీర్ఘజీవనాన్ని సాధించవచ్చు,
కాని భగవంతుని సాంగత్యం పొందకపోతే
అనేక జన్మలెత్తవలసే ఉంటుంది
రాజరికపు క్రీడలను అనుభవించ వచ్చు
రాజ్యానందాన్ని పొందవచ్చు, అప్రతిహత మైన
ఆజ్ఞలను జారీ చేయవచ్చు
పరమ రమణీయమైన శయ్యలాతడికి ఉండవచ్చు,
చందనం, అగరు ఆయన అనుభోక్తములు కావచ్చు
కాని అవన్నీ దారుణమైన నరకద్వారాన్ని సమకూరుస్తాయి
ఆయన భాగవతులతో కూడి భగవంతుని స్తోత్రం చేయడం అన్నిటికన్నా మహత్తర మైనది

నానక్ అంటాడు
పూర్వ జన్మతో అతడు చేసిన పనులే ఈ జన్మలో
అతడికి అదృష్టం కలగటానికి ఆస్కారమవుతాయి
నీ ఆరాధకుడు, ఓ ప్రభూ, నీప్రేమామృతంతో చొక్కి ఉన్నాడు
దిక్కులేని వారల కష్టాలు పోకార్చే దయామయుడు
దయచూపాడతనికి, అతని ఆత్మ భగవంతుని స్తోత్రంలో సంలీనమైంది

*సారంగ్ పు 641*

## శ్రావణం (జూలై)

శ్రావణంలో వధువు సంతోషభరిత
భగవద్ధ్యాన మగ్నునితో
ఆమె మనోదేహాలు
ప్రభువుకోసం తహతహతో సంలగ్నమై ఉన్నాయి.
ఆనందంకోసం ప్రయత్నాలు చేయడం
ఆమెకు ఆకర్షకం కాదు

అది ఎప్పుడూకూడా దుమ్ములోనే కలిసిపోతుంది
కాని దివ్యప్రేమ మధురిమను ఆమె భావిస్తుంది
ఇందులోనే ఆమె తనవిశ్వాసాన్ని నిలుపుతుంది
పచ్చని అరణ్యాలు, అడవి బయళ్లు భగవంతునిలో
నిత్యనూతనంగా ప్రకాశిస్తాయి
జీవచైతన్యమూ, శక్తి ప్రభవస్థానమాయన
ఆమెకూడా ఆయనకోసంనిరీక్షిస్తున్నది
ఆయన కుటిలో విహరించేందుకు
భగవంతుని కనుగొని ఆయనను ప్రేమించే వారందరికీ
నేను సమర్పితుణ్ణి
భగవంతుని నామం రంజకమైన వారండరికీ
నాజీవితాన్ని లగించు
శ్రావణంలో బహుళ వర్షమాసంలో
భగవంతుడే తమ ఏకైక ఆధారంగా
ఆయన ప్రేమే తన ఏకైక ప్రాప్యంగా దర్శిస్తారో
ఆటువంటివాళ్లు మాత్రమే సంతోషిత స్వాంతులైన ధన్యులవుతారు

*బారమహ, మజ్‌హ్ను, 134*

## భాద్రపదము (అగస్టు)

లే బ్రాయపు జవరాలు పురుషాసక్తచిత్తయై పరుగులు తీస్తే
భయము, సందేహము, బాధ, ఆమెకు ఎదురవుతాయి
వెయ్యిఅందాలు తనకున్నా
అవేమీ ఆమెకుపయోగపడవని తెలుసు కుంటుంది
ఆమెశ్వాస ఆగిపోగానే
ఆమె చెలికాండ్రు, సన్నిహితులు ఆమెను విడిచి పెడతారు
మృత్యుకింకరులు చుట్టుముట్టి నప్పుడు
ఆమెను వాళ్లెవరూ రక్షించలేరు
ఆమె విధివ్రాతకు అందరూ ఆమెను వదిలి వేస్తారు
అయ్యోఅటువంటి దృశ్యం ఎదురైనప్పుడు
వణికిపోయే ఆమెహృదయం ఎంతగానో కృంగిపోతుంది
పాలిపోయి ఆమె ముఖం మృతవైవర్ణ్యం పొందుతుంది
కర్మఫలం అనుభోక్తమవుతుంది
శుభాశుభములే కాని ఏవైనా

సద్గురుని పాదాలవొంత రక్షణను కోరుకో
ఆయనేనిన్ను దరిజేర్చేనావ
బాద్రపదంలో కష్టాలు బాధించవు
ప్రభువును వినయంతో సేవించుకొన్న వారికి
భగవంతునిసాయం అర్థించిన వారికి
ఆయన స్వేచ్ఛ ప్రసాదిస్తాడు బహుకృతిగా

*బారమహ, మజ్ హ్ పు. 134*

x x x x

గురుగోవింద సింగు

నీ మహిమాతి శాయిత నుంచి
ఓ భగవంతుడా నాకీ వరాన్ని ప్రసాదించు
సత్కర్మల నుండి నేనెప్పుడూ
వైదొలగకుండునట్లు
జీవితరణరంగంలో నిర్భయంగా నిలిచి
సకల శత్రువులతో పోరాటం సాగించేటట్లు
ఆత్మవిశ్వాస పూర్వక ధైర్యంతో
జయప్రకటనం చేసేటట్లు
నీ స్తుతులను గానంచేయడమే నా పరమాశయమయ్యేటట్లు
నీ మహిమ నా మనస్సులో నాటుకొనేటట్లు
ఈ మర్త్య శరీరం తన పరిమితులను ప్రాపించినప్పుడు
అపరిమిత సాహసంతో పోరాడుతూ మృతినొందు నట్లు

*చండీచరిత మంగళగీతిక*

x x x x

ఆయన మసీదులో ఉన్నట్లుగానే
ఆలయంలో ఉన్నాడు
ముస్లిం ప్రార్థనలో ఉన్నట్లు
హిందువుల ఆరాధనలో ఉన్నాడు
మానవులంతా ఒకటే, వేరు వేరుగా కన్పించినా
ధనపతి వారలు దివ్యలోక గంధర్వులు
దేవతలూ, రాక్షసులూ నిధి నిక్షేపాలను సంరక్షిస్తున్నట్లు
వారివారి పరిసర వాతావరణానుగుణమైన అలవాట్లతో
హిందువులూ ముస్లిములూ అంతా ఒక్కటే

కాని అందరు మనుష్యులకూ అవేకళ్ళు
అదే ఆకృతి- అంతా ఆ నాలుగు భౌతిక పదార్థ సమ్మేళనమే
పృధి వ్యాపస్తేజో వాయువులు
(నిప్పు, నీరు, నేల, గాలి)
ఈ విధంగానే హిందువుల పరమాత్మ ముస్లిముల అల్లా ఒక్కడే
పురాణాలూ, ఖొరానూ కూడా ఆ ప్రభువునే స్తుతిస్తున్నాయి
అవన్నీ ఒకే ఆకృతిని చూపుతున్నాయి
ఒకే ప్రభువు వాటన్నిటికీ కర్త

అకల్ ఉస్తత్ 86, 16·

x x x x

మహాత్ములకు జయము
ఇహ జీవనపథంలో వాళ్ళ పెదవులపై ప్రభువునామం ధరించే వారికి
గాఢంగా తమ హృదయాలలో
ఎల్లప్పుడూ ధ్యానిస్తూ ఉంటారు
ధర్మోత్సాహ శక్తితో
శరీరం నశ్వర వస్త్రమని తెలుసుకొని
జీవిత సంక్షుబ్ధ సాగరాన్ని తరించేందుకు
ప్రభువు నామాన్ని, ప్రభువు సంస్తుతిని
తమను దరిచేర్చే నావలాగా వాళ్ళు చేసుకున్నారు
దృఢమైన సంగరాహిత్యమే వారు ధరించారు వస్త్రంగా
అదే వారికి కవచ దుర్గం
దివ్యజ్ఞానం వాళ్ళ మనసులలో వెలిగే దీప్తి
వాళ్ళ వివేకహస్తాలే వారుపయోగించే సమ్మార్జని
జ్ఞానమనే చీపురుతో అద్వైర్యాన్ని, అసత్యాన్ని
అంతా చిమ్మి వేస్తారు వాళ్ళు

కృష్ణావతార- కృత్యాది

x x x x

ఓ ప్రియా
ఎరుగుదువో, నన్ను ఎరుగవో
అది నీ చిత్తం
(నీ చిత్తం వచ్చినట్లే జరగనీ)
దయచేసి ఒకసారిరా, నా హృదయాన్ని అలంకరించు,

అయిపోయింది, నేను త్యక్తుణ్ణి అయినాను,
అవల దూరంగా ఉంచబడి వందసార్లు నేను
నీకుసమర్పితుణ్ణి అయినాను
నీ పాదాలవద్ద వందసార్లు మృతుణ్ణే అయిపడిపోయినాను
ఓ ప్రాణప్రియా
స్వర్గ మర్త్యాలు నీకోసం వెతికాను
నీ వలెనాకు అన్యులెవరూకారు
నిన్ను వాళ్ళు మర్త్యుడనుకొన్నారు. గోపాలుడవేనని
వాళ్ళు నిన్నురంజకు డన్నారు ప్రాణప్రియా!
కాని వాళ్ళకు తెలియదు, నీవు నా భగవంతుడవు.
    నా స్వర్గం, నాఆత్మవని
నీగూర్చిన పారవశ్యానందంతో నీపాదాలవద్ద
    నూరుసార్లు నేను ప్రాణాలు విడిచాను
ఎరుగుదువో ఎరుగవో నన్ను, ఓ ప్రియా
నీ చిత్తం వచ్చినట్లే కానీ
ఒక్కసారిలా, నాహృదయాన్ని
అలంకరించు ప్రాణప్రియా
నీ ప్రేమ నన్ను పట్టి ఊడ్వగానేను వచ్చాను ప్రాణప్రియా
ఎంతో దూరాన నా తల్లి దండ్రుల పంచనుపీడి
ప్రాణ ప్రియా నీవేనా ఏకైక శరణ్యం
ఆడుదానిని నీకోసం ఆర్తితో పిలుస్తున్నాను
ఓ రాజా ఇనయాత్
    దయతో నన్ను అనుగ్రహించు
ప్రియా,
    నీకు నేను తెలియనీ, తెలియకపోనీ
ని చిత్తం వచ్చినట్లుగానే కానీ
దయచేసి ఒకసారి, నాహృదయాన్ని ఒకసారి
    అలంకరించు ప్రాణ ప్రియా

x x x x

ప్రియాచూడు
నాచాతుర్య మంతా,
నా నేర్పంతా వ్యర్థ మైంది
బంధనాలతో కట్టుపడి నేను విలపిస్తున్నాను

గురువులు, తల్లిదండ్రులు, భ్రాతలు
నన్ను కుదవ బెట్టివేశారు
మన అనుబంధాలు విడదీశారు, తెంచివేశారు
భేదాల నెన్నడూ నేను నావిగా చేసుకోలేదు
వాళ్ళ ఇళ్ళు, హృదయాలు, రంజించను
భగవంతుడికే తెలుసు, మళ్ళీ మనం కలుసుకుంటాము
ఇవాళ సరే మనం విడిపోవలసి ఉన్నది
ఈ వీడ్కోలు నాఆత్మను పొడుస్తున్నది, ఓ వారిస్
నా హృదయంలో బాణంలా గుచ్చుకొంటున్నది

*హీర్ — వారిస్ షా*

x x x x

**భాయివీర్ సింగ్**

*(లూనపుష్పవచనముగా భావితము)*

మమ్మల్ని అపచయం చేయడానికి అనుగ్రహించావు
తొడిమల నుండి చీలికలై పోకుండా విడివడినందుకు సంతోషంమాకు
మా సుగంధ పరిమళాన్ని స్వాయుత్తం చేసుకొంటున్నావు నీవు
మేము నీ వక్షః స్పర్శా మాధుర్యాన్ని పొందుతున్నాము
ఆ పిమ్మట నీవు విసరిపారవేస్తావు
మేము అప్పుడు నీకూ, మాకూ కొరగాకుండా పోతాము
మాగతానికి, ఆగతానికీ
దుమ్ములో కలిసి మేము పడిఉంటాము
దారిపోయేవాళ్ళు మమ్మల్ని కాళ్ళక్రింద త్రొక్కిపారవేస్తారు
క్రూరంగా రేకు రేకుగా చీల్చివేస్తారు
రెక్కలుత్తరించిన చిన్నిచిన్ని పులుగుల వలెమేము చెదరిపడి ఉంటాము
నీ లాలన అనేప్రాణాంతక మైన ఆనందాను
భూతికి నాశరహితస్మృత్యంకము ఇప్పుడు మాఆత్మ
మా వినాశనంలోనుంచి కూడా కృతజ్ఞతా
గీతాలనే మేము ఆలపిస్తూ ఉంటాము
ఓప్రియా, ఓప్రియా

x x x x

*(కవితాధి దేవతతో కవిభాషణము)*

సుదూర లోకాలలో సమున్నత హర్మ్యాలలో

కవితాధి దేవత వసిస్తుంది
ఆత్మ సంగీత వినీల తరంగాలలో తేలియాడుతూ
తనదైన దివ్యవైభవోజ్జ్వలతతోడ
ఒక సంధ్యాసమయాన ఆమె దివినుండి భువికి దిగివచ్చినది
ఉదయోజ్వలకాంతి పుంజవసనయై
జీవ శతశాంతులు వెల్లివిరుస్తూఉండగా
మధురగానామృతాన్ని ఆస్వాదించి మత్తయై
ప్రేమోన్మత్త, పారవశ్య చిత్తయై
పసిడితీగపై మెరిసిన హిమబిందువువలె
సరులుగా పోహళించిన మౌక్తిక జ్యోత్స్నవలె ఆమె వచ్చింది.
అవశమగు ఆనందమువలె మృదువుగా,
సుమంజులముగా, సుతారముగ ఆమెవిచ్చేసినది
తీయనికంఠము నందొదుగులు పోయిననాదము వలె
సితారుతీగలలో జాలువారిన మధుర మంజుల నాదపు గుసగుస వలె
అతిరమణీయత ఒదవించే అచ్చెరువువోలె
నక్షత్రానేకద్యుతులను నాలో పరివ్యాప్తము చేయుచు
అమె విచ్చేసెను
తన్మయ వాదనవేళల సాధకుని కరాంగుళులు
తాకికంపించే స్వరతంత్రులవలె
ఆమె స్పర్శసోకి నామేనెల్లను పులకించెను
తన్మయతా భావన మధువై నా హృదయమ్మున పొంగెను
వేనవేలు సుందర గగనమ్ముల వర్ణములొక్కుమ్మడి
సంగీతమ్ముగ నాలోఘోషించెను
నిరహంకారక పరమానందమ్మున నామది
పూతమ్మైపాదమ్ములు నిలువక తేలిపోయి నట్లయ్యెను
ఎగియబోవు పులుగు రెక్కలు సారించినట్లు
స్వాత్మ పక్షమ్ములు అల్లార్చి నట్లయ్యెను
మది మత్తిల్లెను
నీలాకాశపు సీమలలోనే పరవశతను పొందినాను
నాలో నీవున్నప్పుడు
సమస్తము సుందరతరమై భాసించును,
నీ సౌందర్యము అట్టిది, ఓ కవితాధి దేవతా
అని నేనంటిని

అయినా ఏమిటితల్లీ !
ఇంతలోనే అంతర్హితమవుదువు
ఎందులకీ ఉద్విగ్నత ?
ఎందులకెందులకీ చలశీలత, క్షణికత.
పర్వతములు నిలిచిఉన్నవి- ఆనందావగుంఠనములతో
సాగరములు, సరస్సులు, వనసీమలు,
ప్రవర్తితములు
నీ కటాక్ష వీక్షణమది
ఎందుకింత క్షణప్రభము
మేదురవాత్సల్యాతిరేక దీప్తాంబర కవితాదేవత
పలికెనిట్లు
క్షణ ప్రభాదాంచల్యమ్మును
నియమింపగ శక్తులెవరు ?
భానుకిరణమిట్టె మెరిసి
గీతోత్సవ స్ఫూర్తివోలె
అనంత జీవనవేగముతో పరువిడి
ఆవలి తీరము చేరును
రసగీతీలోల స్వరముల
మట్టి సంకెలల కట్టనేర్తురో ?
గగనసీమలను ఉల్కాకాంతులు
తళుకులీనును, తమమున మునుగును
విరిసిన హరివిల్లున మెరసేఅందము
అందుకొనగ జాలినవాడెవ్వడు ?
ఇందుకిరణమును, ధగద్ధగిత వజ్రద్యుతిని పట్టజాలుదుర ఎవ్వరైనను
తారకలవతరించును, మిణుమిణుకుమను
కొలది కాలము, అటుపై అంతర్హితమైపోవును
ఎలకోయిల ఎదచీల్చుక కదలాడిన కలకూజితమున
జలదబిందుపానోత్సుక చాతక పరిదేవనమున
పొంగిపొరలు ప్రేరణనెవ్వరు బంధించిరి ఇంతవరకు
ఉద్వేగోత్తేజిత సంస్పదనమ్మునవే
ఇటువంటివి మారి ఇతరములైనవి అందముగా అనిపించును
అనంతక్షణికతగా మనమంతా రూపొందినాము

గోళములు పరిభ్రమించును, గ్రహతక్ష్యలు కదిలిపోవు
వలయమ్ములు జ్వలించు
వృత్తములందున వృత్తమ్ములు,
అద్భుతముగ పరిభ్రమించును
మనమో కాంతి కిరణములవలె
అనంత భావవేగమున
రోదసిలో కదలాడే తెరలందును
చీల్చుకొనుచు ఇంతలోన అవతరించి
అంతలోనె అంతర్హితమగుదుము
తళుక్కున మెరసిపోవడమే మనపని
ఎందులకని అడిగిన సమాధానమును చెప్పటకాదు
మన మరుదెంతుము ఆత్మను దీప్తిమంతమును చేయకాంతితో,
పరవశ మొనరింతుము దానిని త్వదీయాద్భుతానందస్పర్శతో
జీవనస్ఫులింగములు ఇట్టెవచ్చి
శిలలనుకూడా ప్రేమతో వెలిగించును, నశియించును
మాకు ఆగడమంటూ లేదు, నిరంతరం పథవర్తనమే
మిణుకుమిణుకుమనుదే పుట్టుక, మిణుగురులే దేహయష్టి
భావనలే, భావనలే అన్నీ, నీ హృదయంలో
మేమువచ్చి ఆడిపోతాము,
మనందరిలలాటములపై భగవంతుడు
లిఖించినాడు భవితవ్యము
సాగర ఘూర్ణితమహత్ భావోద్వేగము
మానవహృదయమ్ముల ప్రేమను సృష్టించెడి దానిని

x x x x

## నిన్ను కలలో చూశాను ప్రాణప్రియా

ప్రాణప్రియా నిన్ను స్వప్నంలో దర్శించాను
నీ బాహువుల్లోకి వాలిపోయినాను
కాని నీ తనువు క్షణప్రభాకలితము
నారిత్త కౌగిలిలో
నా బాహువు మాత్రం వణుకుతూ వుండిపోయినది
నీ పాదాలకు నా ఫాలము సోకగా నేను మ్రొక్కాను

కాని నా ఫాలానికి ఏమీ తాకలేదు
నాకు ఉన్నతోన్నతంగా ఒకదివ్యద్రాక్ష్యానివి నీవు
నేను నిన్ను చేరలేను
నీ పరిధా నాంచలం అందుకొనగ నేను పరుగెత్తాను
కాని మెరుపుమెరిసినట్లు ఎగసినది
సాచని నా చేతులలో దానిని నేను పట్టుకోలేకపోయినాను
ఎగసిపోతూ ఉన్నదానిని, ప్రేమోజ్జ్వలాకృతీ
పైన ఎగసిపోతూ, తావకీనదేదీప్యమానకాంతితో
నను దహించినావు
నా హృదయంలో ఒక జ్వాలను వెలిగించినావు
నా జీవరహితమృత్తిక జీవంతో జ్వలించినది
ప్రతిరోమము ఆత్మభరితంగా ప్రకాశిస్తున్నది.

x x x x

**వీణ, వైణికుడు**

వైణికునితో వీణ ఇట్లా అన్నది
"నీ కృతుల కాకృతి ఇచ్చేదాన్ని నేను"
అప్పుడు వైణికుడా వీణనుతీసి
గుడ్డతొడుగు లోపలఉంచేశాడు
అప్పుడు వీణ గ్రహించింది
"నేను కేవలం దారు శకలాన్ని ఒట్టి తంత్రిని, జీవంలేని ఆకారాన్ని
నా స్వామి అ ప్రతిషేధమైన ఇంద్రజాలమే
నన్ను సంగీతంతో నింపుతుంటే
నా అస్తిత్వ సమస్తాన్నీ నరనరాన్నీ పరవశింపచేస్తుందది
అప్పుడు నేను ప్రేమగానం చేస్తాను
నా స్వామికూడా నాతో కలిసి పాడతాడు
శ్రుతిని విని చొక్కిపోతాడు
అవును ఆయన పాడాడు, ఆనందించాడు
గానమాధుర్యంలో మైమరిచాడు
స్వామీనీ నేర్పు అద్భుతమైనది
నీ పాట అనంతం
గేయానివి, గానానివి, పారవశ్యానివి నీవే
ఆనందానివి, ఆనందదుడవు, ఆనందితుడివి నీవే

x x x x

నేను అల్పప్రమాణంగానే పెరుగుతాను
　　నా వసంతవికాసం ఇతరులదృష్టి పడకుండా
కొండల్లో దాక్కుంటాను మచ్చరపుకన్ను ఏదీ నా మీద పడకుండా
ఆకాశంనుంచి నాతనుకాంతిని నేను తెచ్చుకున్నాను,
　　అదేమీ గొప్ప చాటింపుగా చెప్పడంకాదు
నన్ను సృష్టించిన వానినుంచి వినయమనేఐహూకృతిని యాచిస్తూ
　　నేనీ ప్రపంచంలోకి వచ్చాను
నేను దివ్యహిమాన్నితాగుతూ, సూర్యకిరణాల
　　ను ఆహారంగా స్వీకరిస్తాను.
రాత్రులు చంద్రకిరణాలతో ఆడుకుంటాను
నా పరిమళంలోనే కూరుకొని చొక్కిపోయి సంతోషంగా జీవిస్తాను
పగటిపూట తేనెటీగను కలుసుకోవడం తగని సిగ్గు నాకు
ఉత్సాహంగా గాలులువీస్తూ నన్ను చుట్టుముట్టటానికి వచ్చినప్పుడు
నాతల నలిగిపోయేట్లు చేయవు,
　　ధ్వనిని ఉత్పాదించవు
అజ్ఞాతంగానే ఉండిపోవడం నా కోరిక,
　　నా పేరు ఎవరికీ తెలియకుండా.

x　　　x　　　x　　　x

ఒక శిలపడి ఉన్నది
రూప రేఖలులేవు, ఆకృతిరహితం
ఓ శిల్పి దాన్ని చూడటం తటస్థించింది
దానిలో అతడొక బొమ్మను రూపకల్పన చేశాడు
ఉపయోగపడని భాగాన్ని తొలగించి వేశాడు
ఒకచేతిలో ఉలిని తీసుకున్నాడు
వేరొక చేతిలో సుత్తిని పట్టుకున్నాడు
తొలిచాడు, మలిచాడు
పనికిరాని భాగాలను తీసివేశాడు
ఓహో చూడండి, అది అందమైన రూపు సంతరించుకొన్నది
నిరాకృతికమైన ఆ శిల
తాదృశంగా
నా మనో ఫలకం
రూపరేఖలు లేవు, ఆకారం లేదు,
　　ఒక శిలా ఖండంలో

నా ప్రభూ
దానిమీద నీ బింబాన్ని మలుచుకో,
ఓ నా ప్రభూ, నీవు శిల్పివి
నీ శిల్పం అనురాగ ప్రేరకం
దీనినర్థం చేసుకొనే శక్తిని నాకు ప్రసాదించు
నాకళ్ళనుండి అజ్ఞానం పొరలు పీడునట్లు చేయి.

x x x x

## పురాణసింగ్

దివ్యప్రాసాదాలు, మహా భవనాలు వర్ధిల్లుగాక
అంతకన్నా చిన్నచిన్న కుటీరాలు వర్ధిల్లుగాక
కొడుకులూ కూతుళ్ళూ ఇంటా బయటా సుఖసంతోషాలతో నివసించనీ
ఆరామాలన్నీ నిత్య వసంతంగా కలకలలాడనీ
పంటలు పుష్కలంగా కొల్లలుగా పండనీ
పిప్పల వృక్షాలూ, చూత వృక్షాలూ వర్ధిల్లనీ
ఎల్లప్పుడూ పచ్చగా ఉండే వటవృక్షాలు
అనంతకాలం నిలిచి ఉండనీ
నీ సతత శ్యామల మల్బరీ వృక్షాలు కలకాలం నిలవనీ
బదరీతరులు వర్ధిల్లనీ అనంతకాలం
నీ వృక్షజాలమంతా, నీ కసిందలు, నీఫలగుల్మాలు వర్ధిల్లనీ
నీ బదరీ ఫలాలు మధురములు
వజ్రకాంతులు పర్వేనీ నీటి ఊటల నీరుతియ్యనిదే
నీ పర్వతాలు దేవదారు వనాలతో ఉన్నతో న్నంతగా మనోహరంగా ఉంటాయి
నీ భూమ్యాకాశాల బహుళ వర్ణాలు కలకాలం నిలవనీ
నీ ఇల్లాళ్ళు చల్లగా కలకాలం మననీ
నీపశుసంపద చల్లగా వర్ధిల్లనీ
పాలుపితికే పల్లెపడుచు లందరూ వర్ధిల్లుదురుగాక
నీ శిశువులంతా రోదనలతో కలకాలం వర్ధిల్లనీ
నీ దధిభాండాలన్నీ ఎల్లప్పుడూ నిండి ఉంటాయి గాక
మీగడ కరుళ్ళు తేలియాడుతూ ఉండగా
అరుణోదయాత్పూర్వమే తిరిగే కవ్వాలు
ఆరోగ్యాన్ని, పుష్కలత్వాన్ని సమకూరుస్తూ

స్త్రీలు, పురుషులు, పని పాటలు చేసే వాళ్ళు కలకాలం వర్థిల్లాలి
వాళ్ళ శ్రమ, నేర్పు శాశ్వతంగా వర్థిల్లాలి
నీ మహాభవన నిర్మాతలు కలకాలం వర్థిల్లాలి
నెత్తిపైన ఇటుకలు, సున్నము మోసుకొనిపోయే వాళ్ళు
కలిపిన మట్టిని ఎత్తైన సారువుల పైకి తీసుకొనిపోయేవాళ్ళు
వాళ్ళసురుచిరస్వప్నాలు బహు దీర్ఘంగా విస్తరించును గాక
సుదీర్ఘమైన హేమంత నిశీథాలు ప్రేమపూర్ణములగునుగాక
మా చిరుహస్తాలు మహత్కార్యాలు సాధించని
మహత్తర ఫలితాల నిచ్చే ప్రణాళికలు రూపొందించు
నిఖిల ప్రపంచం కోసమూ
ప్రథమ చంద్రుడు హతుడైనట్లు
అడుగడుగునా నా ప్రియభూమీనీపై
శతసహస్రమహదాశీస్సులు గ్రుమ్మరిస్తాను.
సంతోషించు, సంతోషించు ఓ మిత్రుడా
స్వర్ణ, హరిద్రవర్ణ సారస పుష్పాలతో
వసంత హర్షాతి రేకవికసనములు
క్షీర ధవళములు వేసగి ప్రొద్దులలో ఉల్లసనములు
ఆనందించు ఆకాశంలో దట్టమైన నల్లని మబ్బుగముల ఫెళ పెళార్బ
టలకు, గర్జనలకు
వానల నెల శ్రావణంలో ఆనందించు
ఆకాశ వాసుల సందేశాలు వానరూపంగా నీకు అందించే
జడివాన చినుకుల టపటపలను ఆలించు
మబ్బుశాలువలు హస్తగతం చేసుకోవటానికి పరుగులు తీసిదూకు
శ్రావ్యమైన వాటి గర్జా స్వరాన్ని నీ వశంచేసుకో
బాటసారులను ముద్దముద్దగాతడిపివేసే కుండపోతను
ధారాపాతంగా కురుస్తున్న వర్షంలో
పొట మరించి రసం చిప్పిలుతూఉన్న
వానచినుకులతో మిశ్రితమవుతూఉన్న
మామిడిపళ్ళను ఆస్వాదిస్తూ ఆనందించు
పత్ర, పుష్పవర్ణశోభను సంప్రీతితో ఆనందించు
పండిపోతున్న మల్బరీ ఆకుల విలాసాలను
గురువులయెడ అత్యంతాత్మీయమైన నీ ప్రేమారాధనలను ఆనందించు
ఈ ముడిని గట్టిగా బిగించు

సద్గురుని ఆలనాపాలనలపట్లనే సంపూర్ణంగా ఆధారపడు
వెలిగించు వెలిగించు ఆ జ్యోతిని-సద్గురువులు
నీ యందనుగ్రహించిన ప్రేమను
ఎన్నటికీ దానిని నీనుండి తొలగనీయకు
నీ వాహినుల గుండెల్లో జ్వలించే జ్వాల
దానివై పుచూడు, హిమవత్పర్వతాగ్రంమీద ప్రకాశించే దానిని
సద్గురు కటాక్షంద్వారా ఉజ్జ్వలంగా దీప్తిమంతంగా
జ్వలించే జ్వాలను
పాదకమనుషులకు ప్రియం దకదర్మను
కేంద్రంలో ప్రియునితో నిలబడు
అక్కడ నిలబడు, ఓ వీరుడా నీ భుజంమీద
కృపాణాన్ని ధరించి
రణరంగంలోకి నిర్భీతిగా దూకు
ఓ సాహసి నిర్భయుడవైన నీవు
ఎల్లప్పుడూ జయిస్తావు
సద్గురుడు నీ అండబాయక ఎల్లప్పుడూ
ఉండనే ఉన్నాడుకదా-

---

## ధనిరామ్ ఛత్రక్

### మైత్రి

రా మిత్రుడా ఇక్కడ కూచుందాం ఇద్దరం
జీవితపు రథ్యలో మనంతారసిల్లాము
ఈ రాత్రి ఇక్కడ, మళ్లీ రేపు విడిపోతాము
విడిపోవడానికే గదా కలుసుకుంటున్నాము
ఆస్తరణాన్ని పరుచుకోహాయిగా విశ్రమించు
బడలిన పాదాలను ప్రక్షాళనం చేసుకొని విశ్రాంతి తీసుకో
అప్పుడిక మన తలంపులు
పరస్పరం సంతోషప్రదములవుతవి
అతిథికి అతిథికి మధ్య
ఏమైనాగారడీ చేశావా ఏమిటి ?
చూపుతోనే నన్ను ఆకట్టుకొన్నావు

ఓ నామిత్రుడా నవ్వునేవరించేవాడా
నా హృదయాన్ని విముగ్ధం చేశావు
ఇప్పుడిక మనం కలిసి తిందాము
ఇద్దరికీ కాంక్ష్యమైన గమ్యస్థానం చేరుకున్నాము
జ్ఞానపు విందును అనుభవిద్దాము
ఆత్మానందం వెల్లివిరియగా
నీవు సయ్యదువు, నేను బ్రాహ్మణుడను
దైవదూరమైన ద్వేషంతో దూరస్థులమైనాం మనం
కులం పేరున, మతం పేరున
క్రూరవిధికి గురిఅయి చీలిపోయినాము
కలిసిమెలసి పరిశ్రమిద్దాము
దుఃఖపరితాప భాజనమైన ఈ ప్రపంచంలో
ఓ సోదరా కట్టుబాట్లు ఏందుకు తెంచకూడదు ?
సంప్రదాయాల ముద్రను ఎందుకు చెరిపివేయకూడదు
మిత్రమా ఈ పాంథశాలలోకి
వేలకువేలు వస్తారు పోతారు,
మనోభావాలలో ద్వేషాన్ని ప్రదర్శిస్తారు
ఒకరిపట్ల ఒకరు వైముఖ్యం చూపుతారు
జీవించడమనే గొప్పకళ కొద్దిమందికి మాత్రమే తెలుసు
త్యాగమనే మహోదారమైన కళకరిగించే
సంతోషం కొద్దిమంది మాత్రమే తెలుసుకోగలరు
స్నేహితుడా ఈ పాంథశాలలో మనం
మానవమాత్రులం కలుసుకొంటాము, విడిపోతూ ఉంటాము
ప్రేమతో జీవించటానికి పాటుపడదాము
ఉదారహృదయంతో ఇవ్వడం నేర్చుకుందాము
ద్వేషపతాకాన్ని కిందికి దింపి ముడిచికట్టేద్దాము
దాని స్థానంలో పవిత్రమైన దయాకేతనం ఎగురవేద్దాము
అంతా నశించినా అది మాత్రం శాశ్వతం.

:– o –:

# బెంగాలీ

**మూలం :**
డా॥ ఆర్. కె. దాస్‌గుప్త

**అనువాదం :**
డా॥ కొత్తపల్లి వీరభద్రరావు

## చారిత్రక సమీక్ష

*భాష :* ఇండో-యూరోపియన్ భాషా కుటుంబంయొక్క ప్రాక్తమ శాఖకు చెందిన వంగ భాష అస్సామీ, ఒరియా భాషలకు చాలా సన్నిహితమైనది. సంస్కృతం నుంచి గాని ప్రాచీన భారత-ఆర్య (old Indo-Aryan) భాషనుంచిగాని బయలు దేరిన ప్రాకృత భాషావిశేషం లేదా మధ్యకాలీన భారత-ఆర్యభాష (Middle Indo-Aryan) వంగ భాషకు ప్రత్యక్షమాతృక. ఇది పదో శతాబ్దిలో అపభ్రంశ-అవహట్ఠ నుంచి వికాసము పొందింది. ఇది భారతదేశంలో 33, 888, 939 మందికి మాతృభాష. బాంగ్లాదేశ్‌లో కూడా ఇది ప్రజల మాతృభాష.

*లిపి :* అశోకుని శిలాశాసనాలలోని బ్రాహ్మీ లిపినుంచి వంగలిపివచ్చింది. మనకు లభిస్తున్న దీని అతి ప్రాచీన రూపము ఎనిమిది వందల సంవత్సరాల నాటిది. 1778 లో హుగ్లీలో అచ్చయిన ఎన్. బి. హాల్‌హెడ్ 'వంగభాషా వ్యాకరణం' లో ఉపయోగించడం కోసం అదేసంవత్సరంలో ఛార్లెస్ విల్కిన్స్ వంగాక్షరాలను పోతపోయడంతో దాని ముద్రణ లిపి స్థిరపడి పోయింది.

*ప్రాచీన వంగభాష:* వంగభాషాసాహిత్యాలను మూడు భాగాలుగా విభజించవచ్చును— ప్రాచీన వంగభాష, మధ్యకాలీన వంగభాష, ఆధునిక వంగ భాష. 950-1350 మధ్యకాలము ప్రాచీన వంగ భాషాయుగము; 1350-1800 నడుమ కాలము మధ్యకాలీనవంగభాషాయుగము; 1800 నుంచి నేటివరకు ఆధునిక వంగ భాషాయుగము. మనకు ఉపలభ్యమానములగుచున్న అత్యంత ప్రాచీన వంగ రచనలు; ముఖ్యంగా బౌద్ధధర్మానికి సంబంధించిన సిద్ధాచార్యులు రచించిన నలభై ఎనిమిది చర్యాపదాలు. వీటిరచన 1050-1200 నడుమ సాగింది. "కాల" ప్రధానమైన, పదిపద్య పాదాలుండే, మాత్రాచ్ఛందస్సు చర్యా గీతాల ఛందస్సు. వీటితో ఒకదానిపద్ధతి హిందీ గుజరాతీ భాషలలో కనబడే "చౌపాయ్"ని పోలి ఉంటుంది. మార్మికమైన తాంత్రిక లేదా యోగసాధనా విధానాలను గూర్చి ఇవి చెప్పుతాయి. బ్రహ్మానందం పొందడం వీటి గమ్యము. వక్రోక్తి భూషితమైన సంకేతాలతో, ఒకవిధమైన మార్మిక భాషలో ఉన్నఇవి, సామాన్య సాహిత్య పిపాసువు నుద్దేశించి రచితమైనవి కావనీ ఏతత్సాధనలలో దీక్షితులైన వారి నుద్దేశించినవనీ సువ్యక్త మవుతుంది, కాని; ఛలిల, కాన్హ, సర్వాష

మొదలైన ఈ కవుల రచనలలో పదహారు పదిహేడు శతాబ్దులలో బయలు వేరిన వైష్ణవ పదావళిలో కనబడే కొన్ని లక్షణాలకు బీజప్రాయమైన సూచన లున్నాయి.

*మధ్యకాలీన వంగభాష-పద్నాలుగో శతాబ్ది :* ముసల్మానులు వంగదేశాన్ని ఆక్రమించిన కొత్తలో ఆదేశం తాలూకు వైజ్ఞానిక జీవితంలో కొన్ని అడ్డంకులు వచ్చినాయి. కాని క్రమక్రమంగా ఒకనూతన సమాజం వికసించి నవ్యసంస్కృతీ విలసిత మైన వాతావరణ మేర్పడింది. జనబాహుళ్యంలో ప్రచారంలో ఉన్నకథలు గాథలు సంస్కృత సంప్రదాయంలో ఉన్నవాటితో మేళనం పొంది ప్రజల భాషలో అఖ్యానాత్మకమైన కవిత్వం బయలు దేరడానికి సామగ్రిని ఇచ్చినాయి. హిందూ-బౌద్ధతాంత్రిక సంప్రదాయమొక విలక్షణమైన మార్మికతకు దారితీసింది. దీనిమీద ఇస్లాములోని మార్మికత కూడా కొంత ప్రభావాన్ని చూపించి ఉండవచ్చును. కాని ఈ శతాబ్దిని సామగ్రిని సమకూర్చుకొనే ప్రారంభ యుగంగానే గ్రహించవలెనుగాని కృతకృత్యత సాధించిన కాలంగా తీసుకోవడానికి వీలు లేదు. ఈ యుగంలో బయలుదేరిన సాహిత్యమేదీ నిలవలేదు.

*పదిహేనో శతాబ్ది :* వంగదేశాన్ని పాలించినసుల్తానులు వారిహిందూ మంత్రులు ఇచ్చిన ప్రోత్సాహంవల్ల పదిహేను పదహారు శతాబ్దులలో వంగ సాహిత్య కృషి విజృంభించింది. పదిహేనో శతాబ్దిలో అఖ్యానాత్మక కావ్యరచన ప్రముఖ సాహిత్య ప్రక్రియగా వెలువడింది. సంస్కృత రామాయణ కథనాటి ముఖ్యేతివృత్తము. ఈ సంప్రదాయానికి చెందిన కవులలో ముఖ్యుడు కృత్తి వాసుడు. ఈ శతాబ్దిఉత్తరార్ధంలో ఆయన రామాయణాన్ని వంగభాషలోనికి తెచ్చినాడు. ఇంకా చాలామంది వంగకవులు రామాయణాలు వ్రాసినా, కృత్తి వాస రామాయణమే వంగ భాషలో ప్రసిద్ధ గ్రంథంగా నిలిచి పోయింది. దాని ప్రథమ ముద్రణము 1802లో జరిగింది.

ఇంకొక అఖ్యానాత్మక కావ్యము మాలాధరవసు, పదిహేనో శతాబ్ది నాల్గవ భాగంలో వ్రాసిన శ్రీ కృష్ణ విజయము. కృష్ణగాథకు సంబంధించిన కావ్యాలలో ఇది ప్రాచీనతమము. దీని ఇతివృత్తము విష్ణుపురాణ భాగవత పురాణాల మీద ఆధార పడినదైనా దీనికొక ప్రత్యేకత ఉండడంవల్ల ఇది అత్యంత ప్రచారాన్ని పొందింది. ఇది గమనించిన సుల్తాను, కవికి గుణరాజఖాన్ అనే బిరుదాన్ని ప్రసాదించినాడు.

కాని, కృష్ణ గాథమీద బయలుదేరిన అత్యుత్తమ కావ్యము బడు చండీదాసు వ్రాసిన శ్రీ కృష్ణకీర్తన్ అనేది. బహుశః ఇది ఆశతాబ్దిచివరి నాళ్లలో రచితమై ఉండవచ్చును. రాధాకృష్ణుల ప్రేమనిది మనోహరంగా భావుకతతోను నాటకీయతతోను చిత్రించిన కావ్యము. దివ్యప్రేమను వివరించి చెప్పడంలో ఇది జయదేవుని గీతగోవిందమంత గూఢ రూపకలక్షణము ఉన్నదికాదు. మతప్రాముఖ్యము లేని మానవతా లౌకిక దృష్టితో రచితమైన దీర్ఘ కావ్యంగా పరిగణించడం లోనే దీని విశేషత ఉంది. ఈ కవిపేరే ఉన్నకవులు చాలా మంది దీని తరవాతి శతాబ్దిలో బయలుదేరినారు. వారికావ్యాలలో గుణోత్కర్ష కలవి కొన్నిమాత్రమే కాలానుగుణంగా చాలామార్పులకు లోనవుతూ వచ్చినాయి.

కాని, పదిహేనో శతాబ్ది వంగకవులు తమ అఖ్యానాత్మక కావ్యాల వస్తువు కోసం కేవలం పురాణాల మీదనే ఆధారపడి లేరు. విప్రదాసు వ్రాసిన మనసా విజయ మనే పాంచాలీ (భక్తి ప్రధానమైన ఆఖ్యాన కావ్యము) కావ్యము శైలీ సరళతకు సన్నివేశ ముల అవిచ్ఛిన్న రామణీయకతకు పేరుపొందిన కావ్యము. మనసాదేవి కథలకు సంబంధించినదిది. ఈ కథనే గ్రహించి రచితమైన నాటి కావ్యాలలో విజయగుప్తుడు వ్రాసిన మనసా మంగళ్ కావ్యము విశేష ప్రచారానికి వచ్చింది. ఈ కావ్యంకూడా పైకావ్యం బయలు దేరినప్పుడు వచ్చిందే. ఇందలి ఇతివృత్తము పురాణ భిన్నమైనది.

*చైతన్యుడు, ఆయన యుగము :* 1486లో చైతన్యుడు నవద్వీపంలో పుట్టే నాటికే వైష్ణవ మతము వంగదేశంలో వేరూని ఉంది. సంస్కృత విద్యలకు నవద్వీపము కాణాచి. అక్కడి యువ విద్వాంసులలో చైతన్యుడు ప్రముఖుడు. భగవత్ప్రేమ, ఆయనను తరచుగా సమాధిలోనికి తీసుకొనిపోయేది. అద్వైతా చార్యుడు,హరిదాసు అనే సూఫీ ఆయన ముఖ్యశిష్యులు. ఈ కూటానికి చైతన్యుడు నాయకుడైనాడు. 1509లో చైతన్యుడు గృహజీవితాన్ని విసర్జించి సన్న్యాసాన్ని స్వీకరించినాడు. తరవాత దక్షిణంలోను పశ్చిమంలోను ఉత్తరంలోను ఆయన తీర్థ యాత్రలు చేసినాడు. ఈ యాత్రలలోనే ఆయన రూపసనాతనులనే సోదరులను కలుసుకొని వారికి ఈ నవ్యవైష్ణవ ధర్మంమీద అభినివేశం కల్పించి బృందావనం పంపినాడు. వారు సుల్తాను దగ్గర తమ ఉద్యోగాలను వదలుకొని బృందావన్ పోయినారు. ఇప్పటికీ వంగ దేశంలో బహుళ ప్రచారంలో ఉన్న సంకీర్తన పద్ధతిని ప్రారంభించి చైతన్యుడు ప్రజానీకాన్ని ప్రభావితం చేసినాడు.

తన ధర్మంయొక్క మూల సూత్రాలను ఎనిమిది శ్లోకాలలో చెప్పే సంస్కృత రచన తప్ప చైతన్యుడు వేరే ఏమి వ్రాయకపోయినను, పదహారు పదిహేడు శతాబ్దులలో బహుళంగా వైష్ణవ సాహిత్యాన్ని సృష్టించిన కవుల మీద ఆయన ప్రభావము చాలా ఉంది. ఆయన కీర్తి శేషుడైన తరవాత ఆయన పేరును శాశ్వతం చేయవలెననే దృష్టితో ఆయన సమకాలికులు రచనలు సాగించినారు. వాటిలో బృందావన్‌దాసు వ్రాసిన చైతన్య మంగళ్ లేదా చైతన్య భాగవతము వంగదేశంలో బయలుదేరిన ప్రప్రథమ జీవిత చరిత్ర. కాని, చైతన్యుని జీవితంమీద ప్రవచనాలమీద బయలుదేరిన అత్యుత్తమ రచన, పదహారవ శతాబ్ది నాలుగవభాగంలో కృష్ణదాస కవిరాజు రచించిన చైతన్య చరితామృత కావ్యము. బృందావన దాసు చైతన్యుని విష్ణువు అవతారంగా మాత్రము చిత్రించగా, కృష్ణదాసు ఆయనను రాధాకృష్ణ యుగళ మూర్తిగా చిత్రించినాడు. వైష్ణవ సిద్ధాంతాల వివరణ, దివ్యప్రేమ వివరణ- ఈ కవికాత్మక మైన జీవిత చరిత్రకు ఒక వైశిష్ట్యాన్ని తీసుకొని వచ్చినాయి.

*పదహారవ శతాబ్దిలో ఇతరకావ్యాలు: మంగళ కావ్యము :* జనసామాన్యంలో బహుళ ప్రచారంలో ఉన్నచండి, మనస మొదలైన దేవతల కథలను వర్ణించే సుదీర్ఘాలైన అఖ్యాన కావ్యాల సముదాయము, పదహారవ శతాబ్దివంగ సాహిత్యంలో ఒకవిశిష్ట విభాగము. ఈ కావ్యాలు పురాణ ప్రమాణంలో ఉంటాయి. వీటికి మంగళ కావ్యాలని పేరు. వీటిలో కవికంకణ్ ముకుందరాం చక్రవర్తి పదహారో శతాబ్ది చివరిదశకంలో వ్రాసిన చండీ మంగళ కావ్య మత్యంత శక్తి మంత మైనది. కృష్ణదాస కవిరాజు వ్రాసిన చైతన్య చరితామృత

కావ్యము వైష్ణవ సంప్రదాయానికి చెందిన కావ్యాలలో సర్వప్రథమ స్థానాన్ని పొందినట్లే, వైష్ణవేతర సంప్రదాయాలకు చెందిన కావ్యాలలో చండీ మంగళకావ్యము ప్రథమ గణ్య మైనది. ఇంతేకాకుండా, విస్తృత మైన ప్రమాణంలో ఆఖ్యానాత్మక శైలిలో బయలుదేరిన ప్రథమ సుదీర్ఘ కావ్యమిది. వర్ణనాచమత్కృతిలో, సాంఘికమైన వాస్తవిక దృష్టిలో ఈ కావ్యానికి ఒక విశిష్ట స్థానముంది. ముకుందరామ్ సామాజిక దృష్టి అప్పుడప్పుడు హాస్యమిళితమై వ్యక్తమవుతుంది. సమాజం విషయంలో ఈ కవికున్నతటస్థ దృష్టి, వంగముస్లిముల జీవిత చిత్రణాన్ని సానుభూతితో పరిశీలించే విధంగా చేసింది. కరుణరస ప్రధానమైన భావప్రకటన కూడా ఈ కావ్యంలో లేక పోలేదు. ఈ కావ్యంలోని ప్రాసంగిక సన్నివేశాలలో ఒకచోట,చండీదేవితో సింహమిట్లా అన్నట్లు కవి వ్రాసినాడు; "అమ్మా! నేనే పాపమూ ఎరగను. కాని, నీదయ నామీద లేదు". సంఘంలో అడుగున పడిపోయిన జాతుల నిరాశను ఈ కవి చక్కగా వ్యక్తంచేసినాడు.

*వైష్ణవగేయాత్మక కవిత : పదహారు,పదిహేడుశతాబ్దులు ;* శ్రీ చైతన్యయుగం వైష్ణవ సిద్ధాంతోద్యమాలవల్ల ప్రభావితమై బయలుదేరిన వైష్ణవ పదావళి, మధ్యకాలీన వంగ దేశంలో ప్రభవించిన ప్రముఖ సాహిత్యప్రక్రియగా పేర్కొంటారు. పదిహేనో శతాబ్ది మైథిలీకవి విద్యాపతి వ్రాసిన వైష్ణవ గేయాలు వరవడిగా బయలుదేరిన వంగవైష్ణవగేయాలు స్వల్పకాలంలోనే వంగ దేశంలో బహుళ ప్రచారానికి వచ్చినాయి. వంగభాషతో, మైథిలి శబ్ద జాలాన్ని కలిపి వంగకవులు బ్రిజబులి(వ్రజభాషకంటె భిన్న మైనది),అనేకావ్యభాషను సృష్టించి ఒక కృతక భాషలో రచనలు సాగించినారు. పదహారో శతాబ్ది పదకర్తలలో-లోచనదాసు, బలరామదాసు, జ్ఞానదాసు ప్రముఖులు. రాధాకృష్ణ గాథలను తీసుకొని వీరువ్రాసిన వైష్ణవ గీతాలు, ఈ జాతికి చెందిన వంగ రచనల రూపురేఖలను తీర్చిదిద్దినాయి. జ్ఞానదాసు వంగభాషలోను, బ్రజబులిలోను వ్రాయగా; లోచనదాసు తనవంగరచనలతో ప్రసిద్ధుడైనాడు.

పదహారో శతాబ్ది చివరి నాళ్ళలో వైష్ణవ ధర్మ ప్రచారము నూతనోత్సాహంతో సాగింది. దీని తాత్త్విక సిద్ధాంతాల ప్రచారకులై బృందావన గోస్వాములు, వంగ ప్రజలకు చాలా దగ్గరగా రావడానికి ప్రయత్నం చేసినారు. కీర్తనలలో కొత్త బాణీలను ప్రవేశ పెట్టినారు. సంగీతాన్ని కవిత్వంతో కలిపి భావాత్మకమైన గీతికా రచనను నవ్యమార్గంలో నడిపించినారు. ఈ నవ్య మార్గానికి మార్గదర్శకుడు నరోత్తమదాసు. ఈయన సంగీతజ్ఞుడు; గేయ రచయిత. ఈ సంప్రదాయంలో విశేషంగా ప్రచారానికి వచ్చినకవి గోవిందదాసు. ఈయన మూడువందల కంటె ఎక్కువగా కీర్తనలు వ్రాసినాడు. చండీ దాసు పదాలుగా- (చండీదాసనే పేరున్న కవులు చాలామంది ఉన్నారు)-చెలామణీ అవుతున్న పదాల తరవాత గోవిందదాసు పదాలే వంగ భాషలో బహుళ ప్రచారంలో ఉన్నాయి.

వైష్ణవ ప్రపత్తిని అభివ్యక్తంచేసే గేయాలుగా వీటి ఘనత అట్లాఉండగా ఈ పదాలను ప్రణయకవితలుగా కూడా చదువుకొని ఆనందించవచ్చు. ఇదే వీటి ప్రత్యేకత. వంగ వైష్ణవ కవులు సంప్రదాయ సిద్ధాంతాల శృంఖలలకు కట్టుబడిపోయి తమ భావుకతను సంకుచితం చేసుకోలేదు. తమ భావనాశక్తికి పరిపూర్ణమైన స్వేచ్ఛనిచ్చినారు.

*పదిహేడో శతాబ్ది :* మొత్తంమీద పదిహేడో శతాబ్దిలో సాహిత్య ప్రతిభ సన్న గిల్లిందనే చెప్పవలె. కాశీరామ్‌దాసు వ్రాసిన వంగ మహాభారతమే ప్రత్యేకంగా చెప్పదగిన రచన. కృత్తివాసుని వంగ రామాయణంలాగే ఇదికూడా నేటికీ బహుళ ప్రచారంలో ఉంది. మిగిలిన సాహిత్య కృషి అంతా, పదహారో శతాబ్దిలోని ప్రతిభావంతుల ఆఖ్యానాత్మక రచన లకు గేయాత్మక రచనలకు నీరసమైన అనువాద ప్రాయమైనది. ఈ శతాబ్దిలోని ఇంకో ముఖ్యమైన రచన కేతక్‌దాసు (క్షమానంద) వ్రాసిన మంగళ కావ్యము మనసా మంగళము. జనసామాన్యానికి కూడా అర్థమయ్యే సులభమైన వంగ భాషలో ఈ రచన సాగింది. కల్పనకు దీనిలో అంత అవకాశం లేకపోయినా, ఆఖ్యాన విధానంలో ఈ కవి కొంత వ్యక్తిగత ప్రత్యేక తను ప్రదర్శించినాడు. ఈ రచనలన్నీ పయార్ అనే వంగ ఛ్చందస్సులో నడిచినాయి. ఇది వంగ భాషలో ప్రాథమికమైన ఛందము. దీనిలో శ్రావ్యత లాఘవము కూడా ఉన్నాయి.

కాని, పదిహేడో శతాబ్దికి వంగ సాహిత్యచరిత్రలో ప్రత్యేకతను తెచ్చిపెట్టి నవి మతసంబంధంలేని కాల్పనిక కథా కావ్యాలు. వీటిని వ్రాసిన వారందరూ, ఇంచుమించుగా ముస్లిములే. ఫార్సీలోను హిందీలోను ఉన్న కావ్యాల మాదిరిననుసరించి ఈ కవులు వీటిని వ్రాసినారు. కొందరు ముస్లిము కవులు వైష్ణవ పదాలుకూడా వ్రాసినారు. వీరిలో సయ్యద్ మర్తూస, నజీర్ మొహమ్మద్ ముఖ్యులు.

*ఆరకాన్ ముస్లిము కవులు :* పదిహేడో శతాబ్దిలో ఆరకాన్ దర్బారులో ఉన్న కవులు వంగ సాహిత్యానికి ముస్లిములు చేసిన సేవకు ప్రముఖ నిదర్శనము. ఈ శతాబ్దిలో ఆరకాన్ దర్బారు సాహిత్యాభివృద్ధికి ప్రముఖ కేంద్రము. టిబెటో-చీనా భాషా కుటుంబా నికి సమీపంగా ఉండే ఆరకాని భాష ఆ ప్రజల భాష. బర్మా భాషతో సన్నిహితత్వమున్న భాష అది. కాని శతాబ్దులుగా వంగ మేధావులతో వారి ఉద్యమాలతో ఉన్న సంబంధంవల్ల ఆరకాన్ వంగ సాహిత్య కేంద్రంగా వికసించింది. ఆరకాన్‌లో ప్రథమ వంగకవి దౌలత్ కాజీ. రాజస్థాన్‌కు చెందిన సాధన్ అనే కవి వ్రాసిన కావ్యాన్ని అనుసరించి ఈ కవి వంగ భాషలో సతీమైనా లేదా చంద్రాని ప్రభువు అనే కాల్పనిక కావ్యాన్ని వ్రాసినాడు. ఆరకాన్‌లో ప్రముఖ కవి అయిన అలాఉల్ దీనిని 1659లో పూర్తిచేసినాడు. అలాఉల్ సూఫీ తత్త్వవేత్త. ఇతనికి సంస్కృతము, ఫార్సీ బాగా వచ్చును. హిందీ సాహిత్యంతో పరిచయముంది. జాయసీ వ్రాసిన పద్మావతి ననుసరించి ఈ కవి వంగభాషలో వ్రాసిన కావ్య మితని కృతు లలో అగ్రగణ్యము.

*పద్దెనిమిదో శతాబ్ది :* పద్దెనిమిదో శతాబ్దిలో వంగ కవిత్వము, మతవిరహిత దృష్టితో వికసించి ఆఖ్యాన కవిత్వంలో కొత్త పోకడలు పోయింది. రామేశ్వర భట్టాచార్య వ్రాసిన శివ సంకీర్తన్ (1710) కావ్యంలో శివుడు దరిద్రుడైన కర్షకునిగా, పార్వతి మానవ నాయికగా కనబడతారు. ఈ కావ్యంలో ప్రదర్శితమైన సామాజిక వాస్తవికత ముకుందరామ్ వ్రాసిన చండీ మంగళ్ కావ్యంలోని వాస్తవికతను తలపింపజేస్తుంది. ధర్మఠాకూర్ కథను తీసుకొని ధర్మమంగళ కావ్యాలు వ్రాసి ప్రచారంలోకి వచ్చిన ఘనరామ్ చక్రవర్తి, మణిక్ రామ్ గంగూలీలు తమ కీర్తి ప్రతిష్ఠలను ఈ శతాబ్దిదాటి నిలుపుకోలేక పోయినారు.

భారత్ చంద్రరాయ్ (1712 - 1760) ఈ శతాబ్దిలో మహాకవి. తన అన్న

దామంగళ్ (1758) లో మూడు విశిష్టేతి వృత్తాలున్న మూడు కావ్యాలను సంపుటీకరించినాడు. ఈయనలో ప్రయత్నసిద్ధమైన కోమలశైలి వర్ణనా నైపుణ్యము బాగా కనబడతాయి. ఈ కావ్యాలలో మొదటి కావ్యంలో శివపార్వతుల కథ ఉంది. ఈ కావ్యము పేరే ఈ కావ్య సంపుటికి కవి నిర్ణయించినాడు. రెండో కావ్యము విద్యా సుందరుల ప్రణయ గాథను చిత్రించే విద్యా సుందర్. మూడవది జహంగీర్ ప్రతాపాదిత్యుల సంఘర్షణ నాధారంగా చేసుకొని వ్రాసిన ఐతిహాసిక కాల్పనిక కావ్యము. ఈ మూడు కావ్యాలలో విద్యాసుందర్ మిక్కిలి శక్తిమంతమైనది. అక్కడక్కడ దీనిలోని కొన్ని భాగాలు నీతిమంతులైన పాఠకులకు తిరస్కారయోగ్యాలుగా ఉన్నా మొత్తంమీద ఆఖ్యాన కావ్యాలలో ఇది ప్రముఖమైనదని చెప్పవచ్చు. ముకుందరామ్ విస్తృతపరిధిలో సహజ శక్తితో దేవతలను మనుష్యులను జంతువులను చిత్రించి మన భావోద్రేకాన్ని మేల్కొల్పే రచన చేసినాడు. భారత్ చంద్ర రాయ్ తన ప్రయత్నసిద్ధమైన కళతో సంస్కారయుతమైన అభిరుచి కలవారిని ఆనందపరుస్తాడు. ముకుందరామ్ గంభీరుడు. భారతచంద్ర రాయ్ సుకుమారుడు.

భారత చంద్రుడు ఈ శతాబ్ది ఆఖ్యాన కవులలో అగ్రగణ్యుడైతే, రామ్ ప్రసాద్ సేన్ ఈ కాలంలోని అత్యంత ప్రముఖ గేయకవి. కాళికీర్తన్ అనే పేరుతో కాళీమాత మీద ఈయన ఎన్నో భక్తి కీర్తనలు రచించినాడు. భగవంతుని మాతృమూర్తిగా దర్శించిన ఈ కవి కీర్తనలు భావ తీవ్రతలో విశిష్టస్థానాన్ని ఆక్రమించి ఉన్నాయి. వైష్ణవ కీర్తనలలో ఉన్న శ్రుతి సుభగత్వము మార్దవము వీటిలో లోపించినా, తమ సులభశైలితో అకృత్రిమ రూప కల్పనలతో కీర్తనలు గంభీరమైన ఆధ్యాత్మికానుభూతిని వ్యక్తం చేస్తాయి.

ఈ శతాబ్దిలో లౌకిక ప్రేమను గురించి వ్రాసిన వారిలో అగ్రగణ్యుడు, ప్రథముడు రామ్‌నిధి గుప్త (1742-1839). నిధుబాబు అనీఅంటారు. వంగ సంగీతంలో శాస్త్రీయతను తలపింపజేసే బాణీని ప్రవేశపెట్టిన వాడీయన. రచనలో సంక్షిప్తత ఈయన విశిష్టత. హిందీలో ఉన్న టప్పా అనేదాన్ని వంగ సంగీతంలోకి తెచ్చి దానికి బహుళ ప్రచారాన్ని తెచ్చినాడు.

క్రైస్తవ మిషనరీలు వంగభాషలో వచన రచనకు చేసిన సేవవల్ల, పద్దెనిమిదో శతాబ్దికి వంగ సాహిత్య చరిత్రలో విశిష్ట స్థానముంది. పోర్చుగీసు మిషనరీలు వారివల్ల మతాన్ని స్వీకరించిన దేశీయులు మత సంబంధమైన రచనలు కొన్ని చేసినారు. అంతకుపూర్వమున్న వైష్ణవ రచయితల వల్లనే వచనానికి చాలా సన్నిహితంగా ఉన్న భాషలో ఈ రచనలు సాగినాయి. ఆ రచయితలను ఈ క్రైస్తవ రచయితలు అనుసరించినారనవచ్చును. మనోల్ ద అసంపన్ అనే ఆయన 1734లో ఢాకాలో వ్రాసి 1743లో రోమన్ లిపిలో అచ్చు వేయించిన "కృపార్ శాస్త్రేర్ అర్థభేద్" అనేది అచ్చయిన మొదటి వంగ పుస్తకము. పోర్చుగీసు భాషలో వ్రాసిన మొదటి వంగ వ్యాకరణము, వంగ-పోర్చుగీసు నిఘంటువు కూడా ఈ సంవత్సరంలోనే అచ్చయినాయి. ఈస్ట్ ఇండియా కంపెనీ ఇంగ్లీషు ఉద్యోగులు కూడా పరిపాలన సౌకర్యం కోసం వంగ పుస్తకాలను ముద్రించడంతో ముందంజ వేసినారు. వీరే మొట్టమొదట వంగాక్షరాలను పోతపోసి 1785-1792 మధ్యకాలంలో ప్రభుత్వ యంత్రాంగానికి కావలసిన నియమావళిని ముద్రించినారు.

*పంథొమ్మిదో శతాబ్ది పునరుజ్జీవనము :* పంథొమ్మిదో శతాబ్ది పూర్వార్థంలో సాంస్కృతిక పునరుజ్జీవనాన్ని తెచ్చినవారు కొత్తగా మధ్యతరగతిలో పరిగణనకు వచ్చినావారు, కలకత్తా మేధావులే అని చెప్పవచ్చు. అప్పుడు కలకత్తా భారతదేశపు రాజధాని మైకేల్ మధుసూదన్ దత్తు(1834-1873), బంకించంద్ర చటర్జీ(1838-1898)రచయితలుగా ప్రఖ్యాతి పొందిన ఈ యుగంలో నవ్యవిజ్ఞానము నవ్యసాహిత్యము అభివృద్ధి పొందినాయి. ఈ యుగానికి మార్గదర్శకుడు-బ్రహ్మసమాజ వ్యవస్థాపకుడు, సంఘసంస్కర్త, విద్యావేత్తఅయిన రాజారామ మోహన్‌రాయ్ (1772-1833). ఈయన తాత్త్విక రచనలు, శాస్త్ర చర్చలు వంగ సాహిత్యాన్ని ప్రముఖంగా అలరించినవే. పాశ్చాత్య శాస్త్ర విజ్ఞానాలు భారత దేశానికి నవ్య ప్రోత్సాహాన్ని ఇచ్చి బుద్ధికలాపాలను ఇనుమడింప జేస్తాయి అనే ఆయన ఉత్సాహం కూడా ఈ యుగంలో ముఖ్యమైనదే. తన ధార్మిక సంస్కారోద్యమానికి పునాదిగా ఆయన ఉపనిషత్తులను తీసుకోవడంతో కలకత్తాలోని నవ్యమేధావులకు సంస్కృతం మీద ప్రాచీన భారతీయులు సాధించిన బౌద్ధిక విజయాలమీద గౌరవం కలిగింది. 1784లో సర్ విలియమ్ జోన్స్ స్థాపించిన రాయల్ ఏషియాటిక్ సొసైటీ, పాశ్చాత్య విద్వాంసులు చేసిన కృషి, మన ప్రాచీన సాహిత్య తత్త్వ శాస్త్రాల విషయంలో మనవారికి నవ్యదృక్పథాన్ని కలిగించినాయి. కలకత్తాలో 1800లో స్థాపితమైన ఫోర్ట్ విలియమ్ కాలేజి, అనేక సంవత్సరాలు భాషాసాహిత్యసంబంధాలైన పరిశోధనలకు కేంద్రమయింది. భారతీయ విద్వాంసులు, పాశ్చాత్య విద్వాంసులు కలిసి పనిచేసి పాఠ్య గ్రంథాలను; వంగభాషను సమర్థవంతంగా బోధించడానికి అనువుగా వ్యాకరణ గ్రంథాలను నిఘంటువులను తయారుచేసినారు. కలకత్తాలో 1817లో హిందూ కాలేజి స్థాపన జరిగిన తరవాత ఆంగ్ల భాషా సాహిత్యాలమీద అభిమాన మధికమయింది. ఆక్కడ హెన్రీ విలియన్ డెరోజియో (1809-1831) దగ్గర చదివిన యువకులు నవ్య వంగీయులనే అన్వర్థ నామ ధేయంతో మేధావుల ఉద్యమానికి నాయకులయినారు. వంగ సాహిత్యంలో కొత్త పోకడలను ప్రవేశపెట్టిన మైకేల్ మధుసూదన్ దత్తు ఈ కళాశాలలో విద్యార్థి. బ్రహ్మసమాజ ఉద్యమానికి నాయకుడు, వంగభాషలో చక్కని వచన రచన చేసినవాడు అయిన దేవేంద్రనాథ్ ఠాకుర్. (1817-1905) కూడా ఈ కళాశాలకు చెందినవాడే. 1857లో కలకత్తా విశ్వవిద్యాలయ స్థాపన జరగడంతో నవ్యవిజ్ఞానానికి నవ్యసాహిత్యానికి ఉన్న లంకె ఇంకా బలపడింది. ఈ విశ్వ విద్యాలయంలో మొట్ట మొదటి గ్రాడ్యుయేట్ అయిన ఇద్దరిలోనూ బంకించంద్ర చటర్జీ ఒకడు. ఈ మేధా జాగృతికి శ్రీరామ కృష్ణ పరమహంస మాటలు, చేతలు ఆధ్యాత్మిక బలాన్ని చేకూర్చినాయి. ఆయన శిష్యుడే ఆయన సందేశాన్ని అందించిన "రామకృష్ణ కథామృతం, ద్వారా వంగ భాషకుకూడా సేవచేసినాడు.

*వచన రచనకు మార్గదర్శకులు ;* వంగలిపిలో అచ్చయిన ప్రప్రథమ వంగ గ్రంథాలు, ఈస్ట్ ఇండియా కంపెనీవారి న్యాయశాస్త్ర గ్రంథాలు శ్రీ రామపురంలో 1800లో విలియమ్ కెరే (1761-1843) స్థాపించిన బాప్టిస్ట్ మిషన్ వంగ భాషలో కొత్త నిబంధన గ్రంథాన్ని ముద్రించింది. రామ్ రామ్ వసు వ్రాసిన ప్రతాపాదిత్య చరిత్రకూడా ఈ సంవత్సరంలోనే అచ్చయింది. ఫోర్ట్ విలియమ్ కాలేజీలో విలియమ్ కెరేతో కలిసి కృషిచేసిన ప్రముఖ వచనరచయిత మృత్యుంజయ విద్యాలంకార్(మృతి 1819)సంస్కృతపద భూయిష్ఠ

రచన చేయగా రామ్‌రామ్ వసు ముష్షీశైలి అని పిలవబడే సులభ భాషలో రచన సాగించినాడు.

*వంగరంగస్థలము* : రంగస్థలంమీద మొట్ట మొదటి నాటకం వేయించినవాడు గెరసిమ్ లెబెడఫ్ (1749-1818) అనే రష్యా దేశస్థుడు. ఒక ఇంగ్లీష్ ఫార్సును అనుసరించి వంగ భాషలో వ్రాయబడిన ఈ నాటకము 1795లో ప్రదర్శితమయింది. కాని, నిజమైన నాటకాలు తారా చరణ్ సిక్దర్ వ్రాసిన భద్రార్జున్, జి. సి. గుప్త వ్రాసిన కీర్తివిలాస్ అనేవి, ఇంకో యాభై సంవత్సరాలు-అంటే 1852 వరకు ప్రకటితం కాలేదు. ఇవి పాశ్చాత్య నాటక ఫక్కీలో బయలు దేరిన నాటకాలు, వీటిలో రెండోదానిమీద షేక్స్పియర్ ప్రభావ ముంది. తరవాత పాతికేళ్ళదాకా, వంగ నాటకాలు సంస్కృత నాటకాలకు గాని ఇంగ్లీషు నాటకాలకుగాని అనుసరణ ప్రాయాలే. వీటికి అపవాదంగా-రామనారాయణ తర్కరత్న వ్రాసిన కులీన కుల సర్వస్వము (1854), ఉమేశ చంద్ర మిత్ర వ్రాసిన విధవా వివాహనాటకము (1856) అనే సాంఘిక నాటకాలను; నీలిమందు వ్యాపారం చేసే పాశ్చాత్యుల అకృత్యాలను చిత్రించిన నీల దర్పణ్ (1860) అనే దీన బంధు మిత్ర (1829-'74) వ్రాసిన నాటకాన్ని గ్రహించవచ్చును. నాటకంగా అంతశక్తి మంత మయిందికాకపోయినా, దేశంయొక్క ఆర్థిక రాజకీయ పరిస్థితులతో జోక్యం కలిగించుకొని ఒకరచయిత వ్రాసిన నాటకంగా నీల దర్పణ్‌కు చాలా ప్రాముఖ్యం ఉంది. దీనబంధు నాటకాలలో చాలా శక్తిమంత మయిన. నాటకము సధావార్ ఏకాదశీ (1866) అవహేళన గర్భితమైన హాస్యనాటకము. ఇదే విధంగా సమాజాన్ని అపహాస్యంచేస్తూ మైకేల్ మధుసూదన్ దత్తు వ్రాసిన-ఏ కే ఇకి బలె సభ్యతా (ఇదేనా సభ్యత అంటే?), బుడసాలికేర్ ఘాడే రోమ్ (ముసలి శాలికకు మెడమీద రోమాలు-అంటే "ముసలి మిండగాడు" అని అర్థము) అనేనాటకాలు కూడా నాడు ప్రసిద్ధికి వచ్చినవే,

*నవ్యకవిత్వానికి ప్రేరకులు* : పద్దెనిమిదో శతాబ్ది చివరికాలంలో "కవి" "పాంచాలి" అనే రెండు కవితారీతులు ప్రచారంలోకి వచ్చినాయి. ఒక విధంగా ఇవి వంగ సాహిత్య పతనాన్ని సూచించినాయి. రామ్‌వసు (1787-1829) "కవి" అనే రీతికి ప్రతినిధిగా ప్రచారంలోకి వచ్చినాడు. దాశరథిరాయ్ (1806-1857) మొట్టమొదట ఒక "కవి" సమాజానికి రచయితగా ప్రారంభించి తరవాత "పాంచాలీ" గాయకునిగా బహుళ ప్రచారాన్ని పొందినాడు. పంధొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధంలో ప్రముఖకవిగా పేరు పొందిన వాడు, "సంవాద ప్రభాకర్" పత్రికా సంపాదకుడు అయిన ఈశ్వర చంద్రగుప్త (1812-1859) పద్దెనిమిదవ శతాబ్ది సంప్రదాయాలను 'కవి' సంప్రదాయాలను గురించి వ్రాసినాడు. అయితే నిజంగా నవ్యకవిత్వానికి ప్రేరకులు ఇతని శిష్యులు. వీరిలో విశేషంగా ప్రభావాన్ని చూపిన కవి "పద్మినీ ఉపాఖ్యాన్" వ్రాసిన రంగలాల్ బెనర్జీ (1826-1886). అల్లాఉద్దీన్ చిత్తూరును ముట్టడించడానికి సంబంధించిన గాథను చిత్రించే ఆఖ్యానాత్మక కావ్యమిది. ఆ నాటి ప్రజలను సంచలింపజేసిన స్వాతంత్ర్య గాథాకథనమిది.

పంధొమ్మిదో శతాబ్దిలో ప్రథమ ప్రముఖకవి మైకేల్ మధుసూదన్. ఇంగ్లీషు భాషలోని "బ్లాంక్ వెర్స్" (Blank verse) "సానెట్" (Sonnet) వంటి ఛందోరీతులను వంగభాషలోకి తీసుకొనివచ్చినాడు. తాను వ్రాసిన ప్రతిదానిలో పాశ్చాత్యప్రభావాన్ని, భారతీయ సాహిత్య ప్రతిభతో చక్కగా మేళవించి రచించినాడు. బ్లాంక్ వెర్స్‌లో ఇతను

వ్రాసిన "మేఘనాద్‌వధ" (1861) కావ్యము అత్యంత శక్తివంతమయిన మహారచన. సంప్రదాయ సిద్ధమైనభక్తి భావంచేత ప్రభావితంకాని విధంగా కేవలమానవత్వ దృష్టితో రామాయణకథను ఈ కావ్యంలో ఇతను గ్రహించినాడు. ఈ రచనా విధానంలో హోమర్, వర్జిల్, మిల్టన్ మొదలైన కవుల ప్రభావం కనబడినా తత్త్వతః ఇది భారతీయమైన రచనమే.

హేమచంద్ర బెనర్జీ (1838-1905) వ్రాసిన వృత్రసంహార్ (1875-1877)లోను మహాభారత కథననుసరించి నవీన్ చంద్రసేన్ (1846-1909) వ్రాసిన కృష్ణగాథ రచనలోను పౌరాణిక శైలి పునర్దర్శన మిస్తుంది. కాని శిల్పంలోను భావశక్తిలోను ఇవి చాలా అల్పాలు.

*వంగ నవల :* వంగ భాషలో మొట్టమొదటి వచన నవల భూదేవ్ ముఖర్జీ(1825-1894) వ్రాసిన ఐతిహాసిక్ ఉపన్యాస్ (1862) లోని "అంగుళీయ వినిమమ్" అనేది. ఔరంగజేబు కుమార్తెను శివాజీ ప్రేమించడం దీనిలోని కథ. వంగ భాషలో నిజమైన కాల్పనిక నవలలో మొట్ట మొదటిది, బంకిం చంద్ర దుర్గేశనందిని (1865) లోని కథకిది పూర్వరంగంగా ఉంటుంది. సామాజిక వాస్తవికతను చిత్రించిన మొట్టమొదటి వంగ నవల ప్యార్ చంద్ మిత్ర (1814-1883) వ్రాసిన "అలా లేర్ ఘరేర్ దులాల్" (సంపన్నుల ఇంటి గారాబు కొడుకు) అనేది. ప్రముఖమైన కుటుంబానికి చెంది గారాబము ఎక్కువై చెడిపోయిన వ్యక్తి కథ ఇది. దీని శైలి సహజంగా సజీవంగా ఉంటుంది. సమకాలికమైన వచన రచనలో కనిపించే శబ్దాడంబరము దీనిలో కనిపించదు. ఈ నవల, కాళీ ప్రసన్న సింహ (1840-1870) హాస్యరస పూరితమైన 'హుతోమ్ పేచెర్ నక్షా' (పరీక్షిస్తున్న గుడ్లగూబ నగిషీలు) రచనకు ప్రత్యక్ష ప్రోత్సాహమిచ్చింది. నాటి కలకత్తాలోని సాంఘిక జీవితాన్ని అవహాస్యం చేస్తూ వ్రాసిన వ్యావహారిక భాషలో ఉన్న లఘు రచనల సంపుటి ఇది.

ఈ యుగంలో అగ్రగణ్యుడైన నవల రచయిత బంకిం చంద్ర చటర్జీ. తన పద్య రచనలో మైకేల్ ఎంత జాగరూకుడో తన వచన శైలి విషయంలో బంకిం చంద్రుడంతటి జాగరూకుడు. పనితనంలో ఆతని అన్ని నవలలు లోపరహితాలు కాకపోయినా, శిల్ప విషయంలో బంకించంద్రుడు చాలా జాగరూకత వహించిన రచయిత. ఈయన కాల్పనిక నవల "కపాల కుండల" (1866) లో సౌందర్య మున్నంతగా గాంభీర్యం లేదు. పాత్ర చిత్రణలో ప్రముఖాలైన విషవృక్షం (1878), కృష్ణ కాంతేర్ ఉయిల్ (1878) మొదలైనవి ఆయన చేసిన నైతిక చర్చల మూలంగా బలహీనాలయినాయి. "వందేమాతరం" గీతం మూలంగా ప్రఖ్యాతికి వచ్చిన ఆయన నవల ఆనందమఠ్‌లో ఇతివృత్తంలో బిగువు లేదు. అయితే ఆయన దేశభక్తియొక్క తీవ్రతనిది శక్తిమంతంగా వ్యక్తం చేస్తుంది.

రమేశ చంద్ర దత్తు (1848-1905)ను నవలలు వ్రాయవలసిందిగా బంకించంద్ర చటర్జీ ప్రోత్సహించినాడు. ఈయన వ్రాసిన ఆరు నవలల్లో మహారాష్ట్ర జీవన ప్రభాతం (1878), రాజపుత్ర జీవన సంధ్య (1879) ఐతిహాసిక నవలలుగా కొంత ప్రతిభావంతములైన రచనలు.

*వంగ పత్రికలు :* మొ మొదటి వంగ పత్రికలు "దిగ్దర్శన్" అనే మాసపత్రిక, సమాచార దర్పణ్" అనే వార పత్రిక. వీటిని రెండింటిని 1818 లో శ్రీరాంపురం మిషను

వార ప్రారంభించినారు. ఈ సంవత్సరము జూన్ నెలలో గంగా కిశోర్ భట్టాచార్య "బెంగాలీ గెజెట్" అను వార పత్రికను ప్రారంభించినాడు. వీరందరూ సాహిత్య సంబంధమైన పత్రికా ప్రచురణను సత్సంప్రదాయంగా నెలకొల్పినారు. ఈ సంప్రదాయానికి రాజేంద్రలాల్ మిత్ర "వివిధార్థ సంగ్రహ" (1851); బంకించంద్ర చటర్జీ "వంగదర్శన్" (1872), "భారతి" (1877), "సాధన"(1891) మొదలైన పత్రికలు విశిష్టోదాహరణలు. పత్రికా రచన, ప్రచురణ సుస్థిరంగా నెలకొన్నాయి.

*రూపకము :* 1875లో కలకత్తాలో "ది గ్రేట్ నేషనల్ థియేటర్" స్థాపించబడటంతో రంగస్థలము సమధికోత్సాహంతో వికసించింది. కొన్ని రాజకీయేతివృత్తాలున్న నాటకాలు ప్రదర్శించబడటంతో ప్రభుత్వము మేధా స్వాతంత్ర్యాన్ని శాసించడంకోసం "డ్రమాటిక్ పెర్‌ఫార్‌మెన్స్ సెంట్రల్ ఆక్ట్'' అనే చట్టాన్ని అమలు పరిచి కొన్ని చర్యలు తీసుకొంది. పంథొమ్మిదో శతాబ్దిలో ప్రముఖ నాటక కర్తలు-జ్యోతిరింద్రనాథ్ ఠాకుర్ (1848-1925), రాజకృష్ణరాయ్ (1852-1894), గిరీశచంద్ర ఘోష్ (1844-1911), అమృతలాల్ బోస్ (1853-1929), ద్విజేంద్రలాల్‌రాయ్ (1863-1913) అనేవారు. వీరిలో చాలామంది నాటకాలు రంగస్థలం మీద బాగా రక్తి కట్టినాయి. ఎందరో ప్రతిభావంతులైన నటీనటులుకూడా ఉండేవారు. కాని మొత్తంమీద కవిగా మైకేల్ మధుసూధన దత్తుని గాని నవల రచయితగా బంకించంద్రునిగాని పోలగలిగిన నాటక కర్త ఎవరూలేరనే చెప్పవలెను.

*సాహిత్య విమర్శ :* సాహిత్య గద్య రచనలో ప్రప్రథములు-దేవేంద్రనాథ్ ఠాకుర్, అక్షయకుమార్ దత్త (1820-1886), ఈశ్వరచంద్ర విద్యాసాగర్ అనే ముగ్గురు. వంగభాషలో సాహిత్య విమర్శను ప్రారంభించి తీర్చిదిద్దిన బంకించంద్రుడు వ్రాసిన విమర్శనాత్మక రచనలు, తరవాత వచ్చిన రమేంద్ర సుందర్ త్రివేది (1864-1919), బాలేంద్రనాథ్ ఠాకుర్ (1870-1899) మొదలైనవారికి మార్గదర్శకాలయినాయి. ఐతిహాసిక వచన రచనలలో అక్షయకుమార్ మైత్రేయ (1861-1930) వ్రాసిన "సిరాజుద్దౌలా'' (1877) ప్రసిద్ధికెక్కింది. పురావస్తుశాస్త్ర పరిశోధనలను ప్రారంభించిన ఘనత మైత్రేయకు దక్కింది. స్వామి వివేకానంద (1863-1901) వ్రాసిన వచన రచనలు శక్తిమంతాలై విషయ నైర్మల్యానికి పేరుపొందినాయి. ఈ విధంగా సాహిత్యగద్య ఈ శతాబ్దిలో పరిణామ వికాసాలను పొందింది.

*పంథొమ్మిదో శతాబ్దిలో వంగకవిత్వము :*

*ద్వితీయ ఘట్టము :* బిహారీలాల్ చక్రవర్తి వ్రాసిన (1834-1894) శారదా మంగళ్ (1879) సాధేర్ ఆసన్ (1888-89) అనే కావ్యాలు భావుకతలో కొత్తదనాన్ని సంతరించుకొన్న కాల్పనిక రచనలు. వీటిలో స్నిగ్ధత, భావసౌకుమార్యము మనోహరంగా ఉంటాయి. వీటి ప్రభావము రవీంద్రనాథ్ ఠాకుర్ (1861-1941) మీదకూడా పడింది. ద్విజేంద్రనాథ్ ఠాకుర్ (1840-1926) వ్రాసిన "స్వప్నప్రయాణ్" (1875) శక్తిమంతమైన తాత్త్విక కావ్యము. అక్షయకుమార్ బడాల్ (1865-1918) కవిత్వము సౌకుమార్యానికి పేరుపొందింది.

*రవీంద్రనాథ్ ఠాకుర్* : కవిగా, నవలా రచయితగా, కథానికా రచయితగా, నాటక కర్తగా, వ్యాసరచయితగా, విమర్శకునిగా రవీంద్రనాథ్ ఠాకుర్ వంగసాహిత్యానికి వైపుల్యాన్ని తెచ్చి దానిని సార్థకం చేసినారు. ఇన్ని సాహిత్య ప్రక్రియలలో ఇంత విస్తృతంగా వ్రాసిన ఇంకొక వంగ రచయిత లేడు. 1913లో గీతాంజలికి ఆయనకు "నోబెల్" బహుమానం వచ్చేటప్పటికే వంగదేశంలో ఆయన ప్రభావం సాహిత్యరంగంలో నిర్దిష్టమై ఉంది. తరవాత దేశవ్యాప్తంగా ఆయన కీర్తిప్రతిష్ఠలు ప్రచారంలోకి వచ్చినాయి. కవిగానే ఆయన తన ధర్మాన్ని నిర్వర్తిస్తూ వచ్చినా క్రమేణ ఆయన స్వాతంత్ర్య సంగ్రామంలోనికి ప్రవేశించడానికి కారణమిదే. తన వ్యాసాలలో ఒకదానిలో మహాత్మగాంధి ఈయనను మహనీయ రక్షకుడని వ్యవహరించినాడు. ఠాకుర్ రచనలతో ఆయన కవిత్వము మహోన్నతమైంది. అవసాన కాలంలో ఆయన వ్రాసిన కవిత్వంలో కూడా ఒక ప్రత్యగ్రత, అమ్లానత కనబడతాయి. డెబ్బై సంవత్సరాల వయస్సులో ఆయన తన వచన పద్యాలను తీర్చిదిద్దుకొన్నాడు. అవసాన కాలంలో ఆయన వ్రాసిన కొన్ని పద్యాలలో అత్యంతాధునికత లావణ్య శోభితంగా ప్రత్యక్షమవుతుంది.

*ఠాకుర్ తరవాత* : రవీంద్రనాథ్ కంటె చిన్నవారైన ఆయన సమకాలికులలో ఎందరో మంచి రచయితలు ఉన్నారు. అవనీంద్రనాథ్ ఠాకుర్ (1871-1951) వంగరచనలో నిష్ణాతుడైన ప్రమథ చౌదరీ (1868-1948), ప్రఖ్యాత కథానికా రచయిత ప్రభాత్‌కుమార్ ముఖర్జీ (1878-1932) బహుళ ప్రచారాన్ని పొందిన సామాజిక నవలలు వ్రాసిన శరత్ చంద్ర చటర్జీ (1876-1938) వీరిలో గణనీయులు. ఛందశ్శిల్పంలో నిపుణుడైన సత్యేంద్ర నాథ్ దత్త (1882-1922) మహాత్మగాంధీయొక్క సహాయనిరాకరణోద్యమం వల్ల ప్రభావితుడై చర్ఖార్‌గాన్ అనే అత్యుత్తమ కావ్యం వ్రాసినాడు.

*ఆధునిక యుగము* : నవ్య కవిత్వోద్యమానికి ప్రచార సాధనగా ప్రారంభించబడిన కల్లోల్ (1923) అనే పత్రికలో వ్రాసిన యువకవులతో ఆధునిక యుగము వంగ సాహిత్యంలో ప్రారంభమయిందని చెప్పవచ్చును. వీరిలో చాలామంది ఠాకుర్-వ్యతిరేకోద్యమాన్ని అభిమానిస్తూ వచ్చినా ఆ మహాకవి ప్రభావం పడనివారు లేరనే చెప్పవలె. ఈ వర్గానికి చెందినవారిలో బహుళ ప్రచారాన్ని పొందిన కవి కాజీ నజ్రుల్ ఇస్లాం (జననము 1899) ఈయన కవిత్వంలో భావోద్వేగము, ఆవేశము ఎక్కువగా కనబడతాయి. అయితే ఈ వర్గానికి చెందిన ప్రౌఢవయస్కుడు మోహిత్‌లాల్ మజుందార్ (1888-1952) గొప్పకవి సుస్థిరమైన భావనాశక్తి ప్రదర్శించినకవి ఈయన.

ఆధునిక యుగంలో ఉత్తమ కవిత్వం వ్రాసినవారు కల్లోల్ వర్గానికిగాని ఠాకుర్-వ్యతిరేకోద్యమానికిగాని చెందినవారుకారు. ఠాకుర్ తరవాత అత్యుత్తమ వంగకవి జీవనానంద దాసు (1899-1954). అత్యుత్తమ నవల రచయిత, "పథేర్ పాంచాలి" వ్రాసిన విభూతి భూషణ్ (1899-1950) భట్టాచార్యుడు. హాస్యరచయితలలో అగ్రగణ్యుడు, రాజశేఖర వసు (జననము 1880). సాహిత్య విమర్శలో ఈ స్థాయికి చెందిన రచయిత ప్రమథనాథ్ బిసి (జననము 1901). కవిత్వంలో నిజమైన ఆధునికులు సుధీంద్రనాథ్‌దత్త (1901-1960) విష్ణుదే (జననము 1909) అనేవారు. దే మంచి విమర్శనాత్మకమైన వచనం వ్రాసినవాడు

కూడా. పూర్వతరానికే చెందిన తారాశంకర్ బెనర్జీ (1898-1973) బహుళప్రచారంలో ఉన్న నవల రచయిత కాగా భావాత్మకమైన వచనరచన చేసినవారిలో అన్నదా శంకర్‌రాయ్ (జననము 1904) ప్రముఖుడు. శక్తిమంతులైన మిగిలిన ఆధునిక వంగరచయితలను గురించి భవిష్యత్కాలంలో వారే సాధికారంగా వ్రాయగలరు. ఈ చిన్న వ్యాసంలో పేర్కొనబడని వారుకూడా తమ సోదర రచయితలతోపాటు వంగసాహిత్య సంప్రదాయాన్ని నిర్మించినవారే కాగలరు.

## విషయసూచిక



రవీంద్రనాథ్ ఠాకూర్

## మహాత్మాగాంధీ

పాశ్చాత్య సంపర్క ప్రభావంవల్ల భారతీయ సంస్కృతిలోని మూల భూతమైన ఏకత భిన్నమవుతూవచ్చి దానిలో అస్పృశ్యత అనే దారుణ వ్యాధి బైటపడింది. జాతీయ

సౌభాగ్య సాధన విషయంలో హిందువులు ముస్లిములు నిరాశోపహతులై, లౌకిక దృష్టిలో పాలకులు అప్పుడప్పుడు పంచిపెట్టే ప్రాపకాలకోసం పాకులాడుతూ పరస్పరం దెబ్బలాడు కోవడం మొదలుపెట్టినారు. భారతీయులు ఎంతగా ఛిన్నభిన్నమయిపోయి నైతిక పతనాన్ని పొందినారంటే వారిప్రతిభలో వారు తమ్ముతాము ఉద్ధరించుకోగలరని ఎవ్వరూ నమ్మలేక పోయినారు. ఇట్లాంటి పరిస్థితులలో ప్రాచీన ఋషులకోవకు చెందిన ఒక మహాత్ముడు, ఒక మహాపురుషుడు, నిజమైన నాయకుడు బయలుదేరినాడు. ఆయన మహాత్మాగాంధీ. ఆయన్ని గౌరవించడానికే మనమీనాడు సభతీర్చి ఉన్నాము. ఈ నాడు మనదేశపు భవిష్యత్తును గురించి ఎవ్వరూ నిస్స్పృహ చెందనక్కరలేదు. 'అజేయమైన సృజనాత్మక శక్తి ప్రాదుర్భావం చెందింది. మహాత్మాగాంధి మనకు చూపిన మార్గంలో పయనిస్తే మనము ఆత్మోద్ధరణ చేసుకోవడమే కాకుండా, ప్రపంచంలోని ఇతర ప్రజలను కూడా ఆత్మోన్నతి సాధించుకొనే టట్లు చేయగలము.

ఈ నాడు మనమధ్యకువచ్చిన వ్యక్తి, వ్యక్తిగత దేశీయగత స్వార్థపరత్వానికి అతీతునిగా పేరుప్రఖ్యాతులు పొందినవాడు. స్వార్థపరత్వమనే నీచగుణంయొక్క విస్తృత రూపమే దేశీయ స్వార్థపరత్వమనే గంభీర నామం కింద చెల్లుబడి కావచ్చు. రాజకీయ వేత్తలని పిలవబడేవారి నైతిక వర్తన మంతఆదర్శవంతమనడానికి వీలులేదు. అసత్యాలు చెప్పడ మంటే వారు జంకరు; తమ వ్యాప్తికోసం ఇతరులను మర్మాఘాతాలతో నొప్పించ డానికి వెనుదీయరు. మనమిప్పుడు పాశ్చాత్యులలో ఒక వింతనడవడి చూస్తున్నాము. తమ దేశం కోసం ఒకవైపు ఆత్మార్పణ చేయడమూ ఇంకోవైపు ఆ దేశం చేసే క్రూరకృత్యాలలో చేతులుకలపడమూ కనబడుతున్నది. దీనిని చూస్తూఉంటే ఈ పాశ్చాత్య సభ్యత అనేది ఎంత కాలముంటుంది అనిపిస్తున్నది. దేశభక్తిఅనే భావభారం కింద అది నశిస్తుంది కాబోలు. అయితే ఈ నశింపు రాబోతే, వారు మనదేశవాసుల వలె తటస్థంగా ఉండక భయంకరమైన సంఘర్షణతో కూడిన ఉత్పాతాన్ని తెచ్చిపెడతారు.

రాజకీయవేత్తలు తాము కార్యశూరులమని తమ్ముతాము అభినందించుకొంటారు దుర్మార్గత వల్ల తామాశించిన పని నెరవేరుతుందని నమ్మకం కుదిరితే వీరు దుర్మార్గతతో చేతులు కలపడానికి జంకరు. కాని మన విధిని శాసించే పరాత్పరుని దగ్గర ఈ ఆటలు సాగవు. మనము వీరి నేర్పరితనాన్ని మెచ్చుకొన్నా వీరిని గౌరవించలేము. సత్యంకోసం సర్వస్వము త్యాగం చేయడానికి జంకని మహాత్మును మనము గౌరవిస్తాము. మనదేశము ఆధునిక యుగంలోకి అడుగు పెట్టే శుభసమయంలో మన అదృష్ట వశం చేత; తాత్కాలిక ప్రయోజనాలను ఆశించి విశ్వ జనీనమైన త్రికాలాబాధితమైన నీతి పథాన్ని విసర్జించవలెనని అట్లాంటి నైతిక పతనాన్ని ఉపేక్షించవలెననిగాని చెప్పేవ్యక్తినాయకుడు కాలేదు.

జనక్షయం కాకుండా స్వాతంత్ర్యము సంపాదించడమెట్లాగో ఆయన మనకు మార్గము చూపించినారు. అయితే, మనస్సులను హింసాదూరం చేసి, అహింసవల్లనే కార్య సాధన చేసుకోవచ్చుననే పూర్ణ విశ్వాసమున్నవారి సంఖ్య మనలో చాలాతక్కువ. మహాభారతంలో కూడా-నాగరికమైన పాశ్చాత్య దేశాల నాగరక యుద్ధము సరేసరి-ధర్మయుద్ధంలో చాలా హింసా కౌర్యాలు కనబడతాయి. బహుశః ఇదే మొదటి సారికావచ్చు; మనము

ప్రాణాలు విడువ వలెనుగాని చంపరాదని, ఇందువల్ల విజయము మనదేఅని కంఠోక్తిగా చెప్ప డం జరిగింది: ఇదికేవలం యుక్తిమార్గం కాదు, రాజకీయగమ్యాన్ని సాధించుకొనే పద్ధతికాదు: ఆదర్శసందేశము. అధర్మ యుద్ధంలో మృత్యువంటె నాశము. ధర్మబద్ధమైన అహింసా సమ రంలో-పరాజయం తరవాత విజయమూ మృత్యువు తరవాత అమృతత్వమూ శేషించి ఉం టాయి. తమజీవితంలో వీటినిసాధించిన మహాత్మా ఈ విషయమై మనకు విశ్వాసాన్ని కలి గించగలరు.

ఇదివరకు లాగే భారతీయ ప్రతిభ తనమీదకు దండెత్తి వచ్చినవారి సంస్కృతిలో ఆధ్యాత్మికంగా విశిష్టమైన విషయాన్ని గ్రహించి దానినుండే మానవాళి మనుగడకు ఆశా హేతువైన సందేశాన్ని నిర్మించింది. పరలోకం కోసం నిరీక్షించకుండా ఇహలోకంలోనే పాపపంకిలమైన మానవజాతిని ఉద్ధరించడానికి పురుషోత్తముడు పురుషుడై పుట్టి మానవుల పాపాన్ని తానే భరించడమనే ఉన్నత సిద్ధాంతం క్రైస్తవ మతంలో ఉంది. ఆకొన్న వానికి అన్నమూ జీర్ణాంబరధారికి శుభ్ర వస్త్రమూ సమకూర్చవలెననే ఉదారాశయము క్రైస్తవ మతంలో నొక్కిచెప్పి ఉన్నట్లుగా ఇంకేమతంలోనూ లేదు. దానమూ దయా మొదలైన వాటికి మనదేశంలోని ధార్మికవ్యవస్థలలోను స్థానమున్నా వాటికొక సంకుచితమైన పరిధి ఏర్పడి ఉంది. కేవలమూ అవి మానవుని ప్రేమచేతనే ప్రేరేపించబడి లేవు. మన అదృష్టవశం చేత గాంధీజీ ఈ ఉన్నతమైన క్రైస్తవ సందేశాన్ని సచేతనంగా గ్రహించడం జరిగింది. వృత్తి ధర్మంగా మత ప్రచారం చేసే మిషనరీల నుంచి కాకుండా క్రైస్తవ ధర్మాధర్మాలను గాంధీజీ టాల్‌స్టాయి ద్వారా గ్రహించడంలో విశేషం ఉంది. తనజీవితంలోని సంఘర్షణల ద్వారానే కలిగిన వివిధానుభూతులను బట్టి టాల్‌స్టాయ్ అహింసా సిద్ధాంతం తాలూకు విలువను గ్రహించిన ఉపదేష్ట. యూరప్ మనదేశానికిచ్చిన ఈ బహుకృతి కోసమే దేశం నిరీక్షించి ఉంది.

మధ్యయుగంలో మనకు ముస్లిముల వల్ల కొన్ని కొత్త విషయాలు తెలిసినాయి. దాదు, కబీరు ఇంకా కొందరు సాధుపుంగవులు: పవిత్రత, మోక్షము అనేవి ఎక్కడో దేవా లయంలలో బంధించబడి ఉండేవి కావనీ సర్వమానవాళికి అవి వారసత్వాలైన సంపదలనీ ప్రవచించినారు. ఇస్లాంలో వచ్చిన సంపర్కంవల్ల మనకీ సందేశం లభించిదని అంగీక రించడానికి మనము జంకకూడదు. ఇతరమతాల నుంచిగాని, సంస్కృతులనుంచి గాని, విశిష్ట వ్యక్తుల జీవితాల నుంచిగాని, మంచివిషయాలను స్థలకాలాదులను లెక్కచేయకుండా సత్పురుషులు గ్రహిస్తారు. మధ్యయుగం గడిచిపోయింది. ఆధునిక యుగంలోకి అడుగు పెట్టినాము. ఇప్పుడు పురుషోత్తముడయిన మహాత్మాగాంధి, పాశ్చాత్యలోకం ఇయ్యగలిగిన ఉత్తమ బహూకృతిలో మనదగ్గరకు వచ్చినారు. సాధువులు ఈ భూతలానికి వారసు లని క్రైస్తు చెప్పినా: నేటి క్రైస్తవులు విజయము బలవంతులదే,సాహసులదే అని వచిస్తారు. దీనిలో ఆశ్చర్యంలేదు. పాశ్చాత్యుల వ్యాఖ్య ననుసరించి ఈ సిద్ధాంతము ప్రకృతికి విరు ద్ధము, అర్థ రహితము. ఈ విరోధాభాస తాలూకు సత్యాన్ని రుజువు చేయడానికి ఇంకో పవక్త రావలసి వచ్చినాడు. ఈ సాధుత్వము బలహీనత కాదనీ ఇది సత్యప్రేమల శక్తి అనీ నిరూపించవలసి వచ్చింది. ఇదే సత్యాగ్రహము. ఈ సాధుత్వము తలవంచడం

కాదు; దోషాన్ని అన్యాయాన్ని తల ఒగ్గి భరించే నిష్క్రియాత్మకమైన సహనం కాదు; ఈ విధంగా తలఒగ్గడం పిరికితనం, అనిచ్ఛారీతిలో నిరంకుశత్వానికి సాయపడడం. అహింసా యుతమైన ఈ సాధుత్వానికి గాంధీజీ గొప్ప వీరత్వాన్ని తెచ్చి బలవంతుల అహంకారానికి శాశ్వతమైన ప్రతి ద్వంద్విగా నిలిపినారు.

పరస్పర విరుద్ధాలైన ఈ సూత్రాలలో చివరకు ఏది జయిస్తుందో చెప్పడం కష్టము. మనలో, మనచుట్టూ దుష్ట శక్తులు విజృంభిస్తూ ఉండగా ధర్మమార్గాన్వేషణము చాలా శ్రమతో కూడినది. అహింసయొక్క అత్యున్నత స్థాయిని అందుకొనే శక్తి మన కున్నా లేకపోయినా మనము దానిని ఒప్పుకొని తీరవలె, నమ్మితీరవలె; ఈ నవీన యుగంలో తన జీవితంద్వారా ఉదాహరణ ద్వారా ఈ ఉన్న తాదర్శాన్ని మనముందు ఆయన ఉంచ లేదా? మనము తప్పటడుగులు వేసుకొంటూ దానిని అనుసరిస్తూ పోతే మహాత్ముని సందేశము మనకు క్రమ క్రమంగా సత్యమని రుజువవుతుంది. ఈ దినము మనం స్మరించదగినది, ప్రతి సంవత్సరము ఈ దినము పునరావృత్తమై నప్పుడు, సంవత్సరాలు గడిచిన కొలదీ మన కాయన సందేశము సన్నిహితమై స్పష్టమై మన స్మృతి పథంలో నిలిచిపోతుంది.

---

## రవీంద్రనాథ్ ఠాకూర్

## గీతాంజలి

నన్ను అనంతుణ్ణి చేశావు. ఇది నీ లీల. ఈ చిన్న పాత్రను ఎన్నిసార్లు నవ్యజీవనంతో నింపావో: ఎన్నిసార్లు ఖాళీ చేశావో!

ఈ చిన్న పిల్లన గ్రోవిని ఎన్నికొండలపైకె ఎన్నిలోయల లోకి తీసుకొని పోయి అనంతంగా నిత్య నూతనమైన ఎన్ని మధుర స్వనాలు దీని ద్వారా వినిపించావో!

అమరత్వాన్ని అందించే నీచేతి చలవ వల్ల నా పేదగుండె ఆనందంలో అవధుల్ని దాటి మాటల కందని భావాల్ని వ్యక్తం చేస్తుంది.

అనంతమైన నీ వరాలు పరిమితమైన నా చిన్న చేతుల్ని నింపివేస్తాయి. యుగ యుగాలుగా నువ్వు వరాలు వర్షిస్తున్నావు. నా చేతుల్ని నింపుతూనే ఉన్నావు.

x x x x

ఎక్కడ మనస్సుకు భయంలేదో,
ఎక్కడ శిరస్సు ఉన్నతంగానే ఉంటుందో;
ఎక్కడ జ్ఞానికి స్వేచ్ఛఉందో,
ఎక్కడ అంతులేని అడ్డగోడల అరలమధ్య
లోకం చిక్కిపోలేదో;

ఎక్కడ మాటలు సత్యపు లోతులనుంచి
ఉబికి వస్తాయో;
ఎక్కడ నిర్విరామ కృషి పూర్ణత్వం వైపు
చేతులు జాపుతుందో;
ఎక్కడ నిర్మల వివేక వాహిని అర్థరహితమైన
ఆచార మరుభూముల సైకతాలలో
దారితప్పి మటుమాయంకాదో;
ఎక్కడ మానవ కృషి నువ్వు చూపించే మార్గంలో
విస్తృతాశయాల్ని అన్వేషిస్తూ ఘన
కార్యాల్ని సాధిస్తూ పురోగమిస్తుందో-
అలాంటి స్వేచ్ఛా స్వర్గలోకంలో, ప్రభూ!
నా దేశం మేల్కొనేటట్లు చెయ్యి!

## తొలినాటి సూర్యుడు

తొలినాటి సూర్యుడు
ప్రశ్నించాడు
ఉదయించిన సత్తాను-
ఎవరు నువ్వని
ఉత్తరం రాలేదు.
సంవత్సరాలమీద సంవత్సరాలు గడిచిపోయాయి,
తుదినాటి సూర్యుడు
పశ్చిమ సాగర తటంమీద
నిశ్శబ్ద సాయం సమయంలో
తుది ప్రశ్న అడిగాడు-
ఎవరు నువ్వని
ఉత్తరం రాలేదు

రవీంద్రనాథ్ టాకూర్

## కాబూలీవాలా

ఐదేళ్ల నా కూతురు "మిని" ఏదో ఒకటి వాగుతూ ఉండకుండా ఉండలేదు. తనజీవిత కాలంలో ఒక్క నిమిషమైనా నిశ్శబ్దంగా ఉండి కాలాన్ని వృథా చెయ్యలేదని నా నమ్మకం.

తల్లి చికాకుపడి దాన్ని ఎప్పుడేనా వాగకుండా చెయ్యడం ఉందిగాని నేను మాత్రం ఊరు కొంటాను. మిని నిశ్శబ్దంగా ఉండడం అసహజం; నేను దాన్ని భరించలేను. ఇందువల్ల మా సంభాషణలు ఎప్పుడూ సజీవంగా ఉంటాయి.

ఒకరోజు ఉదయం, నా కొత్తనవలలో పదిహేడో అధ్యాయం మధ్యలోనే ఉండగా, మెల్లిగా పిల్లిలా నాగదిలోకి వచ్చి నా చేతులలో చెయ్యివేసి మిని అంది "నాన్నా! మన దర్వాన్ రామ్‌దయాల్ 'కాకి'ని 'కౌఅ' అంటాడు ఏమి తెలియదు! అంతేనా?"

మన దేశంలోఉన్న భాషా భేదాల్ని గురించి నేను చెప్పేలోపలే, ఈ విషయం విడిచిపెట్టి ఇంకోవిషయం ఎత్తుకొంది. "ఏమంటావు, నాన్నా? భోలా అంటుంది-మేఘాల్లో ఏనుగు ఉందనీ దాని తొండంలోంచి నీళ్ళు చల్లితే వర్షంవస్తుందనీ".

మినీ నా కాళ్ల దగ్గర బల్లకి సమీపంగా కూర్చుని తన మోకాళ్ళమీద చేతుల్తో తాళంవేస్తూ ఏదో మెల్లిగా పాడుకొంటోంది. నేను పదిహేడో అధ్యాయాన్ని వ్రాయడంలో మునిగి ఉన్నాను. కథానాయకుడు ప్రతాప్‌సింగ్ కథానాయిక కాంచనలతను తన చేతుల్లోకి తీసుకొని కోట మూడో అంతస్తు కిటికీలోంచి పారిపోవాలని ప్రయత్నం చేస్తున్నఘట్టం అది. ఉన్నట్టుండి మినీ కిటికీ దగ్గరికి పరుగుతీసి "కాబూలీవాలా కాబూలీవాలా" అని కేక పెట్టింది. నిజమే, వీధిలో ఓకాబూలీవాలా మెల్లిగా నడిచిపోతున్నాడు. తన దేశస్థులు ధరించే వదులుగా ఉండే బట్టల్ని, మలినంగా ఉన్నవాటిని ధరించి ఉన్నాడు. పెద్దతలపాగా, వీపు మీద సంచీ, చేతుల్లో ద్రాక్షపళ్ళడబ్బాలు.

ఈ మనిషిని చూడ్డంతోనే నాకూతురు ఏమనుకొందో చెప్పలేనుగాని గట్టిగా అతన్ని పిలవడం మొదలు పెట్టింది. సరే! అతను వస్తాడు, నా పదిహేడో అధ్యాయం ఎప్పటికీ ముగియదు అనుకొన్నాను. సరిగ్గా, ఇదేసమయానికి కాబూలీవాలా తలఎత్తి మినీవైపు చూశాడు. ఇది చూడ్డంతోనే, మినీ భయంతో పరుగుతీసి తల్లి రక్షణకోసం మాయమయి పోయింది. కాబూలీవాలా సంచిలో తనలాంటి చిన్నపిల్లలు ఇద్దరు ముగ్గురు ఉండి ఉంటారని మినీ నమ్మకం. ఈలోగా, కాబూలీవాలా మా గుమ్మంలోకి వచ్చి చిరునవ్వుతో నన్ను పలక రించాడు.

నాకథానాయికా నాయకుల పరిస్థితి చాలా విషమంగా ఉండడంవల్ల నాకేమిచేయడానికీ తోచక మినీ పిలిచిందిగదా అని ఏవో కొన్నికొన్నాను. మా సంభాషణ – అబ్దుల్ రహమాన్, రష్యన్‌లు, ఇంగ్లీషువారు, సరిహద్దు సమస్యలు మొదలయిన వాటిమీద సాగింది.

బయలుదేరివెళ్ళేముందు "అయ్యా! అమ్మాయి. ఏది?" అన్నాడు.

మినీకి ఈ జడుపు పోవాలి అనే దృష్టితో పిలిపించాను. వచ్చి నాకుర్చీకి ఆను కుని కాబూలీవాలాను అతడి సంచీనీ చూస్తూ నిలుచుంది. అతను కొన్ని ఎండుద్రాక్షపళ్ళని ఇవ్వడానికి చెయ్యి జాపాడు. దీనితో మినీ భయం మరింత ఎక్కువై నాకింకా దగ్గిరగా జరిగింది. ఈ విధంగా వాళ్లు మొదటిసారి కలుసుకొన్నారు.

ఇదయిన తరవాత, కొద్దిరోజులకి, ఓరోజు ఉదయం నేనెక్కడికో వెడుతూ

తలుపు దగ్గిరిగా బల్లమీద మినీ కూర్చుని తనకాళ్ళ ముందు కూచునిఉన్న భారీవిగ్రహుడైన కాబూలీవాలాతో నవ్వుతూ ఏమిటో మాట్లాడుతూ ఉండటంచూసి గతుక్కుమన్నాను. ఇన్నాళ్ళవరకూ కూడా మా చిట్టితల్లి వాళ్ళనాన్న తప్ప అంతఓపిగ్గా తన కబుర్లన్నీ వినే వాళ్ళను ఇంకొకరని ఎరగదను కుంటాను. అప్పటికే ఆవిడగారి చిన్నిచీరె కొంగుకు బాదం పప్పులూ, ఎండుద్రాక్షల చిన్నమూట వేలాడుతూఉంది. ఆమె దర్శనార్థి సమర్పించే నజరానా అది.

'ఎందుకీవిడకివన్నీ నువు ఇవ్వడం' అంటూ, నాజేబులోంచి ఒక అర్థరూపాయిబిళ్ళ తీసి అతడికిచ్చాను. మాటా పలుకూ లేకుండా వెంటనేదాన్ని తీసుకొని, జేబులోవేసుకున్నాడతడు. అయితే ఇంతకూ ఒకగంట తర్వాత తిరిగివచ్చిచూస్తే, నేనిచ్చిన అర్ధరూపాయి దానివిలువకు రెట్టింపు కష్టాన్ని తెచ్చి పెట్టింది. కాబూలీవాలా ఆ అర్ధరూపాయిబిళ్ళను 'మిని'కి ఇచ్చాడు. తళతళలాడుతున్న ఆ బిళ్ళనుచూసి, తల్లిపిల్లపై విరుచుకుపడింది 'ఈ అర్ధరూపాయిబిళ్ళ నీకెక్కడిదే?' అనికేకలేసింది.

సంబరపడుతూ మొహంచాటంతచేసి 'కాబూలీవాలానాకిచ్చాడు' అందిమిని. 'కాబూలీవాడిచ్చాడానీకిది' అని తల్లిగొంతుచించుకొంది-కొయ్యబారిపోతూ. 'ఓసి మినీ' వాడిదగ్గర నుంచి నువ్వెట్లా తీసుకున్నావే' అంది.

సరిగ్గా ఈక్షణంలోప్రవేశించి, విరుచుకొనిపడబోయే ఉత్పాతాన్ని ఆపగలిగాను. ఇక నేను ఆరాలు తియ్యడం మొదలెట్టాను. తరవాత నాకుతెలిసిందేమంటే, వాళ్ళీవిధంగా జట్టు కట్టడం ఇదిమొదటిసారి, రెండోసారీకాదు. పిల్లలో మొదటిభయంకాస్తాక్రమంగా పోగొట్టాడతడు సీమబాదంపప్పులూ అవీ లంచంపెట్టి. ఇక ఇప్పుడిద్దరూ ప్రాణమిత్రులే అయిపోయినారు. ఏవేవో వినోదాలు, హాస్యాలు వాళ్ళమధ్య దొర్లుతుండేవి. మాంచిఉల్లాసంగా కాలక్షేపంజరిగేది. ఆతడి ముందునుంచి దర్జాగా, తన చిరుత తీవిని ప్రదర్శిస్తూ కూచుని ఒడ్డూ పొడుగూ ఉన్న అతడి మహాకాయంపై దృష్టి నిలిపి మిని తనమొహమంతా నవ్వుతుళ్ళిపోతుండగా,ఇక మొదలు పెడుతుంది. ''ఓకాబూలీవాలా, ఇదుగో నీసంచిలో ఏంతెచ్చావ్?''

అప్పుడిక కొండవాడిముక్కు యాసతెచ్చిపెట్టుకొని అతడంటాడు. 'ఏనుగ'. అందులో అంత విరగబడినవ్వాల్సింది ఏముందోమరి, ఇక వాళ్ళిద్దరూ పగలబడి నవ్వుకుంటారు ఆఛలోక్తికి. నామట్టుకునాకు, ఈ పిల్లపెద్దవాళ్ళతో మాట్లాడటం, అదేమిటో ప్రత్యేకించి చాలావిలక్షణంగానూ ఔత్సుక్యం కలిగించేదిగానూ అనిపిస్తూఉండేది.

ఇక అప్పుడు కాబూలీవాలా తానువెనకబడటం ఇష్టంలేక, తన వంతుప్రారంభించే వాడు 'బుజ్జమ్మా మరినువ్వు అత్తారింటికెళ్ళటం ఎప్పుడు?'

వంగదేశంలో చిన్నారిచిట్టి పడుచులందరికీ అత్తారింటిసంగతి ఎన్నడో చాలాచాలా చిన్నప్పుడే తెలిసిపోతుంది. కాని మేంకొంచెంగా నవీనభావాలు ఆచరణలో పెడుతుండడంవల్ల ఈవిషయాలు మా పాపకుదూరంగానే ఉంచాము. ఈ ప్రశ్న మినిని కొంచెం తికమక పెట్టిఉంటుంది.

క్షణంసేపు గాభరాకూడా కలిగింది. అయితే దాన్ని బయటకు పొక్కనివ్వలేదు. తక్షణమే సర్దుకొని అంది ''మరినువ్వు వెళుతున్నావా అత్తారింటికి''?

కాబూలీవాళ్ళలో ముఖ్యంగా మగవాళ్ళ విషయంలో అత్తారింటికి వెళ్ళడానికి ద్వంద్వార్థాలున్నాయి. అది జైలుకుపోవడమనేఅర్థాన్ని నాజూకుగా చెప్పడం అన్నమాట. మనఖర్చు లేకుండా మన గురించి చక్కగా అన్నీ వాళ్లే పట్టించుకొంటారు గనుక. మా పాప వేసిన ప్రశ్నను ఆధ్మండకాయుడు ఈ అర్థంలో తీసుకొని ఉంటాడు. 'హుం, అంటూ పిడికిలి బిగించి ముందుకు ఊపుతూ, కంటిముందు లేని పోలీసువాణ్ణి ఉద్దేశించి 'మామామగారిని చితకగొడతాను' అంటాడు. ఇదివినీ, ఈ అపూర్వ సత్కారాన్ని పొందబోయే మామగారిని ఊహించుకోని, మిని పకపక పగలబడి నవ్వుతుంది. అలవిగాని వాడైన ఆమె నేస్తంకూడా ఆ నవ్వుకి జతగా శ్రుతి గలుపుతాడు.

శరత్కాలపు తొలి పొద్దులవి. పూర్వకాలంలో రాజులు జైత్రయాత్రకు బయలుదేరే కాలమిదే. అయితే నేను మాత్రం కలకత్తా ఒకమూలలో ఉన్న నాడునికినుంచి సమస్తప్రపంచం మనస్సుతో చుట్టబెడుతూ ఉంటాను. ఏదైనా ఒక దేశం పేరు మనసులో మెదిలితే చాలు, నా హృదయం అక్కడికి చక్కా ఎగిరిపోతుంది. వీధుల్లో ఎవరైనా విదేశీయుడు కనిపిస్తే చాలు, ఇక అల్లి బిల్లిగాఅల్లుకుంటూకలలెన్నోకంటాను. సుదూరమైన అతడి మాతృదేశపు పర్వతాలు, లోయలు, అటవీ సీమలు, అందులో ముచ్చటైన వాసకుటీరమూ, స్వేచ్ఛగా, స్వతంత్రంగా, ఎడారులన్నిటికీ దూరంగా, ఆ సంతోష జీవనాన్ని ఊహించుకుంటాను. నిజానికి ఊహల్లోనేను దూరపయనాల సుందర దృశ్యాలను విస్పష్టంగా భావించు కోగలననుకుంటాను. ఏమంటే మొక్కలాగా పాతుకుపోయిన నేను ప్రయాణంతప్పని సరి అయితే పిడుగుపాటుగా భావిస్తాను దానిని. ఈ కాబూలీ వాలా సమక్షంలో, తక్షణమే పర్వత పాద సీమలకు, ఎత్తైన, నగ్న శిఖరాల దారిలోఅల్లి బిల్లిగా అల్లుకు పోయే కనుమలకు, నా మనసు ఊహా విహారం సాగిస్తుంది. ఒంటెల వరసలు, వ్యాపారపు సరుకులు మోసుకొని పోతూనూ, తలపాగాలు చుట్టి, పాతకాలపు విడ్డూరమైన తుపాకులు మోసుకుంటూ, కొందరు బల్లేలు ధరించి, కొందరు నడుస్తూ మైదానాలవైపు ప్రయాణం సాగించటం నాకళ్ళ ముందుకనిపించే దృశ్యం. ఈ విధమైన దృశ్యాలు నా కళ్ళముంటు కదలుతూ ఉంటాయి. కాని ఇంతలో 'మిని' తల్లి వచ్చి కల్పించుకొంటుంది, నా కంటి ముందరి దృశ్యాలు చెదిరిపోయేలాగా. ఆమె హెచ్చరిక స్వరంతో 'ఆ మనిషి విషయమై జాగ్రత్తగా ఉండాలి' అంటుంది.

దురదృష్టవశాత్తు మిని వాళ్ళమ్మ వొట్టి పిరికి. వీధిలో ఏమైనా కలకలం వినపడిందంటే చాలు, లేదా ఎవరైనా కొందరు కలసి ఇంటివైపు వస్తు ఉండటం చూసినాచాలు, వెంటనే మరి తిరుగులేని నిర్ణయానికి వచ్చేస్తుందామె. వాళ్ళు దొంగలైనా కావాలి, తాగుబోతులైనా కావచ్చు ననుకుంటూ పాములు, పులులు, మలేరియా, బొద్దింకలు, గొంగళిపురుగులు, లేదా ఇంగ్లీషు నావికు డెవరో వచ్చి చుట్ట ముట్టినంత భయపడుతుంది.

ఇన్ని సంవత్సరాల అనుభవంగడించినా కూడా, ఆమె తన భయాన్ని అదుపులో

పెట్టుకోలేక పోతున్నది. అందువల్ల కాబూలీవాలాను గూర్చి ఆమెకెన్నో భయ సందేహాలు చుట్టుముట్టుకున్నాయి. వాణ్ణి ఒకకంట కనిపెట్టి ఉండవలసిందిగా నన్ను ప్రాధేయ పడుతూ ఉండేదామె.

నేను మృదువుగా ఆమె భయాలు అర్థంలేనివని నవ్వేసే ప్రయత్నంచేస్తూ వచ్చాను. అయితే ఆమె దానికి మరింత వ్యగ్రంగా, కొన్ని అతి ముఖ్యమైన ప్రశ్నలు వేసి సమాధానం రాబట్టుకొనే ప్రయత్నం చేస్తూ వచ్చింది.

పిల్లల నెవరూ ఎప్పుడూ ఎత్తుకొని పోలేదా ? మరికాబూలులో బానిసవ్యాపారం ఉందన్న మాట నిజమా కాదా? ఇంత భారీ మనిషి చిన్నపిల్లనెత్తుకొని తీసుకొని పోవడం జరగదనే మీరనుకొంటున్నారా?

నేనామెతో చెప్పాను. అది అసాధ్యం కాకపోవచ్చునేమో గాని, చాలామటుకు అసంభవం మాత్రం అవుతుంది. అయితే ఇంతమాత్రంతో ఆమె తన భయం విడిచి పెట్టలేదు. ఆమె అనుమానం నిరాధారమైంది కాబట్టి, అతణ్ణి ఇంటికి రాకుండా నిషేధించడం సబబుకాదు అనిపించింది నాకు. అందువల్ల వాళ్ళిద్దరి మధ్య దోస్తీ అంతకంతకూ ఎక్కువైంది.

మామూలుగా, సంవత్సరంలో ఒక్క సారి, జనవరినెల మధ్యరోజుల్లో రహమాన్ అంటే ఈ కాబూలీవాలా, తన స్వదేశానికి వెళుతుంటాడు. ఆసమయం దగ్గరపడటంతో పాత బాకీలన్నీ వసూలు చేసుకోవడానికి ఇల్లిల్లూ తిరుగుతూ, చాలా తొందర పనుల్లో ఉంటాడు. అయితే ఈ సంవత్సరం మాత్రం ఏదో విధంగా తీరికచేసుకుని వచ్చి మినిని చూసి పోతూనే ఉన్నాడు. బయట వాళ్ళెవరైనా చూస్తే వాళ్ళిద్దరిమధ్య ఏదోగూడుపుఠాణి సాగుతున్న దను కోవడానికి అవకాశముంది. ఎందుకంటే ఒకవేళ ఉదయం వచ్చి చూసి పోవడానికి సందర్భ పడక పోతే సాయంత్రం తప్పకుండా వస్తాడతడు.

వాస్తవానికి నాకుకూడా అప్పుడప్పుడు గతుక్కు మనిపిస్తు ఉంటూంది. అనుకో కుండా వెళ్ళి వెలుగు సరిగా రానిగది మూలలో ఇంత పొడుగ్గా, వదులొదులు బట్టలు ధరించి, సంచులు వేలాడే అతణ్ణి ఆశ్చర్య పరచడం. కాని మిని మాత్రం చిరునవ్వులు చిందిస్తూ ఓ కాబూలీవాలా, కాబూలీవాలా, అనిపిలుస్తూ పరిగెత్తి అతడిదగ్గరకు పోవడం చూసినపుడు వాళ్ళిద్దరిమధ్యా వయస్సు ఎంతో వ్యత్యాసమున్నా, యథాపూర్వంగా నవ్వుల్లోమునిగి పోవడం, అవేళలోక్తులాడుకోవడంతో నామసు కుదుటపడేది.

ఒకరోజు ఉదయం, అతడు స్వదేశానికి తిరిగి వెళ్ళటానికి నిశ్చయించుకొన్న కొద్ది రోజుల ముందు, నేను నా పుస్తకాల పనిలో ప్రూఫులు దిద్దుకుంటున్నాను. శీతగాలి వీస్తున్నది. కిటికీలోంచి వచ్చిపడి సూర్యకిరణాలు నాపాదాలకు వెచ్చగా తాకుతున్నాయి. ఆచిరు వెచ్చదనం చాలా ఆహ్లాదకరంగా ఉంది. ఎనిమిది గంటలయివుండవచ్చు సుమారుగా. తెల తెల వారుతుండగానే తట్ట బుట్ట నెత్తిని పెట్టుకొని అమ్మకాలు సాగించడానికి పోయినవాళ్ళు తలకు ఆచ్ఛాదనలు ధరించి తిరిగి వెళుతున్నారు ఇళ్ళకు. ఇంతలో వీధిలో ఏదో గందరగోళం

వినిపించింది. చూసాను. ఇద్దరు పోలీసువాళ్ళు రహమాన్‌ను బంధించి తమ వెంట తీసుకొని పోతున్నారు. పిల్లలు గుంపులుగా వెంటబడ్డారు. కాబూలీవాలా ధరించిన బట్టలపైన రక్తపుమరకలున్నాయి. పక్కనే నడుస్తున్న పోలీసు చేతిలో కత్తికూడా కనబడుతున్నది. గబగబా వెళ్ళి వాళ్ళను ఆపాను. ఏమిటిదంతా? అని వాళ్ళను అడిగాను. ఒకరినోటివెంటకొంత ఇంకొకరి నోటివెంట ఇంక కొంత నేను తెలుసుకొన్న దేమంటే, ఆవీధిలో పొరుగిళ్ళలో ఉన్న ఒకవ్యక్తి, రాంపురీశాలుపకిమ్మతు ఈ కాబూలీవాలాకు ఇవ్వవలసిఉండి. ఇతడి దగ్గర అతడది కొన్నాడు. కాని అటువంటిశాలువ ఏదీ తాను కొనలేదన్నాడా వ్యక్తి. ఈ వివాదంలో మాటా మాటావచ్చి రహమాన్ అతణ్ణి పొడిచాడు. ఆ ఉద్రేకంలో బంధితుడు తన విరోధిని గూర్చి రకరకాల తిట్లు తిడుతున్నాడు. ఇంతలో అనుకోకుండా మాఇంట్లో ఒక వరండా లోంచి మా మిని కన్పించి ఎప్పటి మాదిరి ఉల్లాసంగానే 'ఓకాబూలీవాలా, కాబూలీవాలా' అని పిలిచింది. ఆమెవేపు తిరుగుతున్న రహమాన్ ముఖం వెలిగిపోయింది. అతడిచంకలో ఇవాళ సంచు లేపిలేవు. అందువల్ల సంచిలోఉన్న ఏనుగును గూర్చి అతడితో చర్చించే అవకాశం లేక పోయిందామెకు. అందువల్ల వెంటనే రెండో ప్రశ్నమీదికి ఆమెధ్యాస మళ్ళింది. వెంటనే ఆమె అడిగింది. 'అత్తారింటికి వెళుతున్నావా నీవు?' రహమాన్ నవ్వాడు. ఆతరువాత అన్నాడు. ''అదిగో మరి అక్కడికి వెళుతున్నాను పాపా'' ఈ సమాధానం మిని ని ఉల్లాసపరచకపోవడం గమనించి బేడీలు పడ్డ తనచేతులను ఎత్తి 'ఊం' 'అంటూ' ముసలి మామగాణ్ణి చావచితక గొట్టి ఉందును, కాని నాచేతులకు బేడీలున్నాయిగా మరి' అన్నాడు

ఖూనీ నేరంకింద రహమాన్‌కు చాలా సంవత్సరాల జైలు శిక్షపడింది.

కాలం గడిచి పోయింది. అతణ్ణి గూర్చి మరచే పోయినాము. స్థలచలనం లేకుండా నిత్యకృత్యాలైన మావనుల్లో మేము మునిగిపోయి కటకటాల మధ్య శిక్షననుభవిస్తున్న ఒక నాటి స్వేచ్ఛా వ్యక్తి ఆ పఠానును గూర్చిన ఆలోచనే మాకురాలేదు. తరవాత అచ్ఛ స్వచ్ఛమైన చలాకీ మనసు గల మా మిని కూడాతన పాతస్నేహితుణ్ణి మరచిపోయిందని చెప్పడానికి నాకే సిగ్గుగా ఉంది. కొత్త కొత్త నేస్తాలు ప్రవేశించారు ఆమె జీవితంలో. పెద్ద దవుతున్నకొద్దీ, ఆమెతన ఈడు ఆడ పిల్లల తోనే గడుపుతూ వచ్చింది. నాన్న గారి గదిలోకి కూడా అడుగు పెట్టడం అరుదే అయిపోయింది. ఎపుడోగాని ఆమెను వలకరించే సందర్భమే కుదిరేదికాదు నాకు.

చాలా ఏళ్ళు గడిచాయి. మళ్ళీశరత్కాలం వచ్చింది. మిని పెళ్ళిపనులు జరుగుతు న్నాయి. దేవీపూజ జరిగే శెలవుల్లో ముహూర్తం నిర్ణయించాము. దుర్గతల్లి కైలాసశిఖరికి తరలి వెళ్ళడంతో పాటే మాఇంటి దీపం కూడా మమ్మల్ని విడిచి వెళ్ళడానికి నిశ్చయమైంది. ఇక మా ఇంట్లో నీడలే పరచుకొంటాయి.

ఉదయం చాలా కాంతి మంతంగా ఉంది. వానలు వెనక బట్టిన తర్వాత, వాతావర ణంలో ఒక నిర్మలత్వం, స్వచ్ఛత వచ్చాయి. సూర్యకిరణాలు మేలిమి బంగారుకాంతులతో మిలమిలలాడుతున్నాయి. అవి ఎంత కాంతిమంతాలుగా ఉన్న వంటే కలకత్తా సందు గొందు ల్లోని మురికి కృడుతున్న ఇటుక గోడలను కూడా తళ తళ లాడిస్తున్నాయి. తెల్లవారుఝాము

నుంచే పెళ్ళి మేళాలు మోగుతున్నాయి. ఆచప్పుళ్ళువినపడ్డప్పుడల్లా నాగుండె వేగంగా కొట్టుకుంటున్నది. కారుణికమైన భైరవి రాగాలాపన, నామనస్సుని నులిమి వేస్తున్నది, రాబోయే ఎడబాటును తలపింప జేస్తూ. మా మినికి ఈ రాత్రికి పెళ్ళి జరగబోతున్నది.

తెలతెల వారుతున్నప్పటినుంచీ ఇల్లంతా కోలాహలంగా పెళ్ళిసందడి నిండి ఉంది. ఆవరణలో వెదురు గడలు పాతి పెళ్ళి పందిరివేయాలి. పందిరిలోనూ, వరండాలోనూ, చిరుగజ్జెలతో కూడిన దీపశాఖిక నెమ్మెలను వేలాడ తీయాలి. ప్రతిచోటా తొందర, ఉద్వేగమూ. నాచదువుకునే గదిలో కూచుని పద్దుపుస్తకాలు చూసుకుంటున్నాను. ఇంతలో నాగదిలోకి ఎవరో అడుగుపెట్టి వినయంగా వందనంచేసి నాముందు నిలుచుండి పోయినాడు.అతడు ఆనాటి కాబూలీవాలా రహమాన్. మొదట నేను అతణి గుర్తుపట్టలేదు. అతడిదగ్గర సంచిలేదు. దట్టంగా నెత్తినిండా పొడుగాటిజుట్టు లేదు. అతడి వెనుకటి కళాకాంతులు, ఉత్సాహమూలేవు. కాని పెదవులపై చిరునవ్వు కనబరచాడు. అప్పుడు నేనతణ్ణి గుర్తుపట్టాను.

'ఎప్పుడొచ్చావు రహమాన్! అని అడిగాను'

'నిన్న సాయంత్రం' అంటూ! నన్ను జైలు నుంచి విడిచి పెట్టారు, అని చెప్పాడు.

నాచెవుల కామాటలు చాలా బాధాకరంగా పరిణమించాయి. తనసాటిప్రాణిని హింసించే ఏవ్యక్తితోనైనా మాటకలపనేలేదు నేను ఇదివరకు. ఇంతేకాకుండా ఈ రోజుఇంతకన్నా శుభశకునంతో ప్రారంభమై ఉంటే ఎంతో బాగుండేదికదా అని నామనస్సు బాధపడింది. ఇతడు రాకుండా ఉన్నట్లయితేనే శుభంగా ఉండేదని అనిపించింది.'మాఇంట్లో శుభకార్యం జరుగుతున్నది' అంటూ, నాకేమాత్రం తీరుబడిలేదు. ఇంకోరోజున వస్తావా తరవాత' అన్నాను.

గిరుక్కున తిరిగి అతడు వెళ్ళబోయాడు. తలుపుదాకా బోయి అతడు సంకోచించాడు, కాని అడిగాడు. ''ఒక్క సారి నేను చిట్టితల్లిని చూడకూడదా అయ్యగారు-ఒక్క క్షణం'' ఇంకా మిని వెనకటి శైశవ దశలోని 'మిని' గానే ఉంటుందని అతడి నమ్మకంలాగుంది. తనదగ్గరకి పరుగుతీస్తూ ఇదివరకటిలాగానే 'ఓకాబూలీవాలా, కాబూలీవాలా' అంటు పిలుస్తూ వస్తుందని ఆశించినట్లుంది. వెనకటిరోజుల్లో మాదిరిగానే కబుర్లూ నవ్వులూ ఆశిస్తున్నట్లున్నది. నిజానికి వెనకటిరోజులను గుర్తుచేసుకుంటున్నట్లుఒకకాగితంలో బాదం,కిస్మిస్,ఎండుద్రాక్షలు జాగ్రత్తగా పొట్లం కట్టి తెచ్చాడు. ఏదోవిధంగా తనదేశస్థుడెవరి దగ్గరనుంచో వీటిని సంపాదించాడు. తనదగ్గరున్న చిన్నముల్లె కాస్తాపోయిందికదా.

మళ్ళీ అన్నానునేను ''మా ఇంట్లో ఇవాళ శుభకార్యం ఉంది. ఇవాళ ఎవరూ నీకు కనపడే అవకాశం లేదు'' !

అతడి ముఖం చిన్న బోయింది. పరకాయించి క్షణంసేపు నావేపు చూశాడు. గుడ్ మార్నింగ్, వెళ్ళొస్తానయ్యా, అని వెళ్ళిపొయినాడు.

నాకు కొంచెం విచారం కలిగింది. మళ్ళీ పిలిపిద్దామా అనుకున్నాను కాని తనంత తానే తిరిగిరావడంచూశాను. నాకు బాగా దగ్గరగావచ్చి, తనచేతిలో ఉన్న పొట్లాన్ని తీసుకోవాల్సిందిగా కోరుతూ, ''పాప కోసం ఈకాసిని తీసుకొని వచ్చానయ్యగారూ, వీటినామెకిస్తారు కదూ'' అన్నాడు. నేను వాటిని తీసుకొని, డబ్బులివ్వబోతున్నాను. కాని అతడు నాచేతిని వెంటనే పట్టుకొని ''బాబుగారు చాలా దయగాలవారు, నన్ను మరచిపోవద్దు, జ్ఞాపకంవుంచుకోండి, ఇందుకుగాను నేను డబ్బుతీసుకోను. మీ ఇంట్లో ఒక చిన్న తల్లిఉంది. ఇటువంటిచిట్టితల్లే నాకూ్కడా మా ఇంట్లోవుంది. మా పిల్లను తలచుకుంటూ మీ అమ్మాయికివి తెచ్చానుగాని. అమ్మిలాభం గడిద్దామనికాదు.''

ఈ విధంగా అంటూ వదులుగా వేలాడుతున్న తన పంట్లాంలోకి చేయి దూర్చి బాగా మాసిపోయిన చిన్న కాగితం ఒకటి బయటకు తీశాడు. ఎంతోభద్రంగా ఆ కాగితంమడతవిప్పి, ముడతలు లేకుండా, తన రెండు చేతులతోనూ పట్టుకుని నాటేబిలుమీద ఉంచాడు. దానిమీద చిట్టిచెయ్యి అద్దిన గుర్తుఉంది. అదిఫుటోకాదు. చేతితో గీసిన చిత్రమూ కాదు, సిరాపులిమి అద్దిన చిన్న చెయ్యిముద్ర జాగ్రత్తగా ఆ కాగితం మీద తీసుకొన్నదది. ఈ చేతి స్పర్శ అతడి గుండెలమీదుఎప్పుడూఉంటూనేవచ్చింది. ప్రతిసంవత్సరమూ,వీధుల్లోతనసరుకులమ్ముకోవడానికి కలకత్తావస్తూఉన్నప్పుడల్లా, ఈ చిన్నచెయ్యి తాలూకు స్పర్శ అతడిహృదయంలో భద్రంగా ఉంటునే వచ్చింది.

నాకళ్ళలో నీళ్ళు తిరిగాయి. అతడు పండ్లమ్ముకునే బీద కాబూలీ వర్తకుడన్న విషయం నాధ్యాసలోంచి తప్పుకున్నది. నేను మాత్రం. నేను అతడికంటే అధికుడినా ? అతడు కూడా ఒక తండ్రి.

తనదైన సుదూర పర్వత నివాసగృహంలోని తన చిన్న పార్వతి చిన్నారి చేతి ముద్రి, నాకునా 'మిని' గూర్చిన ఆలోచన కలిగించింది. లోపలెక్కడో ఉన్న 'మిని'ని వెంటనే నేనక్కడకు పిలిపించాను. ఎన్నో అభ్యంతరాలు ఎదురైనయ్. కాని నేను వేటిని పట్టించుకోలేదు. పెళ్ళికూతురి అలంకారానికి తగిన ఎర్రటి పట్టుచీరతో, నొసట గంధపుపూతతో, నవవధువు అలంకారంతో, మిని వచ్చి సిగ్గుపడుతూ నా ఎదుట నిలిచింది.

ఆమెను చూచి కాబూలీ వాలా చాలా తొట్రుపడ్డాడు తమమధ్య వెనుకటి స్నేహానుబంధాన్ని పునరుద్ధరించుకునే ఆశ ఇకఎంత మాత్రమూలేదు. చివరకెలాగో చిరునవ్వు తెచ్చుకుని ఇట్లా అన్నాడు. 'చిన్నారితల్లీ, అత్తవారింటికి వెళుతున్నావా'' ?

మరి మిని కిప్పుడు అత్తవారింటి విషయం తెలుసుకదా. అందువల్ల వెనకటి మాదిరిగా ఆమె సమాధానం చెప్పలేక పోయింది. ఆమె చెక్కిళ్ళు ఎర్రపడ్డాయి. నవ వధూసహజమైన సిగ్గుతో తలవంచుకొని నిలబడింది.

మొట్ట మొదటి సారిగా కాబూలీవాల, మినీ ఒకరి కొకరు తటస్థ పడ్డ ఆరోజునాకు గుర్తు వచ్చింది. నాకు విచారం కలిగింది, పెళ్ళికూతురు అక్కడినుండి వెళ్ళిపోగానే. రహమాన్

బరువుగా నిట్టూర్చాడు. నేలమీద చతికిల పడ్డాడు. హఠాత్తుగా తనకూతురుకూడా ఇంతటి దీర్ఘ కాలంలో ఈ విధంగా ఎదిగి వుంటుందన్న విషయం అతడి మనసులో మెరిసింది. తననిప్పుడు చనువుగా గుర్తుపట్టలేదు. మళ్ళీతాను కొత్తగా ఆమెనుమాలిమి చేసుకోవాలి. ఆమెనిదివరకటిలా తాను భావించడం కుదరదు. అంతేకాక ఈ ఎనిమిదేళ్ళలో మరింకెన్ని మార్పులు వచ్చాయో! ?

పెళ్ళి మేళాలు. బాజాభజంత్రీలు మోగాయి. శరత్కాలపు మంద సూర్యుడు మా చుట్టూ కిరణాలు ప్రకాశింప చేశాడు. కాని రహమాన్ కలకత్తాలోని ఒక చిన్న సందులో కూచుని, ఆఫ్ఘనిస్థానంలోని ఉషార పర్వతప్రాంతాలు దర్శిస్తున్నాడు.

ఒక బాంక్ నోట్‌ను తీసుకొని అతడి చేతికిచ్చాను నేను.

''రహమాన్, నీ బిడ్డదగ్గరకు వెళ్ళిపో. మీ దేశం వెళ్ళు. ఆ శుభసంతోషతరుణం మా అమ్మాయికి మంచి అదృష్టంతెచ్చి పెడుతుందిగాక'' అన్నాను.

ఈ కానుక నతడికిచ్చిన తరువాత, నేను కొన్ని పెళ్ళి ఖర్చులు తగ్గించుకోవాల్సి వచ్చింది. విద్యుద్దీపాల అలంకరణం జరిగిందికాదు. అంతేకాదు మిలిటరీ బాండు మేళం కూడా పెట్టలేదు. ఇంట్లోని ఆడవాళ్ళకు చింత కలిగింది. అయితే నాకు మాత్రం వివాహమహోత్సవం మరింత శోభాయమానంగా కనపడింది. ఏనాడో దూరమై పోయిన తండ్రి తన ఏకైక సంతానాన్ని సుదూరమైన తన దేశంలోకలుసుకోవడం జరిగిందన్న ఆలోచన ఎంతోఆనందం కలిగించింది.

## రాంప్రసాద్ సేన్

# మానసిక పూజ

మనసా, ఎందుకింత ఆందోళన చెందుతావు ?<br>
కాళీ నామాన్ని జపించు, ధ్యానంచేస్తూకూచో.<br>
ఈ పూజార్భాటాలతో, మనసు అతిశయదర్పంతో<br>
నిండి పోతుంది— ఆమెను అర్చించు రహస్యంగా-ఎవరూ<br>
తెలియకుండా-ఈలోహ, శిలా, మృణ్మయప్రతిమలతో<br>
నీకు చేకూరే లబ్ధి ఏమున్నది ?<br>
మానసికంగానే ఆమెమూర్తిని కల్పించుకో, హృదయ<br>
పద్మసింహాసనం మీద ఆమె ప్రతిమను ప్రతిష్ఠించు.<br>
పక్వాన్నము, అరటిపళ్ళూ ఆరగింపు చేస్తావా ?<br>
ఓహో ఎంతదంభం ఇవి తల్లికి నివేదన చేయడం !<br>
భక్తి మరందంతో ఆమెను ఆరగింపచెయ్యి, నీ మనస్సుని సంతృప్తి పరచుకో.

ఆమెను వెలిగించే ఉద్దేశంతో అమ్మ దగ్గర దివ్వెలూ, జ్యోతులు, దీపాలు ఎందుకు
వాంఛిస్తావు ? మనసులో భూషోజ్జ్వలమైన
దీపం వెలిగించు, అహోరాత్రులు దానికాంతి ప్రకాశించనీ
'కాళీ మాతకుజై, కాళీ మాతకుజై' అంటూ
మేకలను, గొర్రెలను, గేదెలను ఎందుకు బలిగా
ఇవ్వడానికి తీసుకొనివస్తావు ? అరిషడ్వర్గాన్ని బలిగా అర్పించు,
ప్రసాద్ అంటాడు—తప్పెట్లూ తాళాలు భేరీలు ఏమవసరం ? 'కాళీ మాతకుజై' అనటానికి
చప్పట్లు చాలు, తల్లిపాదాలపైన నీ మనసు పదిల పరచు.

### కాజీనజ్రుల్ ఇస్లామ్

## హరిత స్వర్ణ కథలు, గీతాలు.

### దొంగలు, దోపిడి కాండ్రు.

మిత్రుడా ఎవరు నిన్ను 'దొంగ' అనేది ?
దోపిడి గాడవనేది ?
చుట్టూ దోపిడి గాళ్లు డప్పు కొడుతున్నారు
దొంగలు రాజ్యమేలుతున్నారు
పరమ ధార్మికుడెవడయ్యా, దొంగల దోపిడిగాళ్ళ మధ్య
వచ్చితీర్పు చెప్పడానికి ?
ప్రపంచంలో ఎవ్వరైనా సరే దోచుకోని వాడంటూ
ఒకడున్నాడా ?
ఓ పరమ న్యాయాధిపతీ, నీ ధ్వజాన్ని ఎత్తుగా నిలుపు
పేదలను దోచుకోబట్టే నేటి పెద్దలందరూ
గొప్పవారుగా చెలామణి అయినారు.
ఎంత గొప్పగా దోచుకుంటే, ఎంత గొప్పగా
చౌర్యాన్ని అవలంబిస్తే
మోసగించడంనేరిస్తే, దోపిడి చేయ గలిగితే
నవ నాగరక ప్రపంచ జాతులలో స్థాయి అంత కంతకూ
ఎక్కువవుతుంది !
బానిస ప్రజల దేహాలనుంచి స్రవించి గడ్డ కట్టిన రక్తంతో మహాభవనాలు
నిర్మితమై తలెత్తుతాయి

పెట్టుబడిదారులు తమకర్మాగారాలను
లక్షలకొద్దీ పౌయిలను పాడుచేసినడుపుతారు
మానవుడి రక్తమాంసాలు పీల్చి తిని త్రేన్చే ఈ భయంకర
మైన దయ్యపు యంత్రమేమిటి
సజీవంగా పురుషులు స్త్రీలు లోపలికి వెళతారు కాని
పిండిన చెరకు పిప్పిలా బయటకు వస్తారు.
లక్షలాది మానవుల మానవత్వాన్ని పీల్చి పిప్పిచేస్తు
న్నాయి కర్మాగారాలు.
కాని కోటీశ్వరుల ఆసవ పాత్రలు
పసిడిజాడీలు నింపుతున్నాయి.
వడ్డీవ్యాపారి అన్నార్తులైన నిర్భాగ్యుల ఆహారంపైనే
కుండ బొజ్జ పెంచుకుంటున్నాడు
భూస్వామి పేదవాడి కొంపకూలుస్తున్నాడు
తనసవారిబండి సాగేందుకు నాలుగు
చక్రాలపైనా—
జగతినంతా పడుపుటిల్లుగా మార్చింది వ్యాపారబుద్ధి
పాపమూ, సైతాను ఇద్దరూ అక్కడి పరివార భృత్యులు, పాత్రలు
నింపి అందించేవాళ్ళు, దురాశా గీతం పాడివినిపిస్తారు
ఆరోగ్యమూ, జీవితమూ, ఆశా, మాట, అన్నీ పోగొట్టుకున్నాడు మానవుడు
దివాలాతనంతో, నిశ్చయమైన సర్వనాశనంవైపు దూసుకొని పోతున్నాడు
తప్పించుకొనే మార్గం ఇక ఎంతమాత్రమూ లేదు
పసిడిమీద దురాశతో చుట్టూ తవ్విన గోతులున్నాయి కనుక
సమస్త ప్రపంచమూ ఒక బందిఖానా, దీనిసంరక్షక వ్యక్తులు దోపిడి కాండ్రు
దొంగల మధ్య భ్రాతృత్వంఉన్నది, మోసగాళ్ళకు దోస్తీ ఉన్నది.
నిన్నెవరు దోపిడిగా డంటారు, నేస్తం ? నువు దొంగి
లిస్తున్నావని ఎవరన గలరు ?
నాలుగు రాళ్లు సంపాదించుకొన్నావు, నాలుగు
గ్లాసులు నింపుకున్నావు
అంతేకాని నువు ఏమనిషి గుండెల్లోనూ పొడవ లేదు ;
నీవు దొంగవేకావచ్చుగాక, మానవత్వాన్ని పోగొట్టుకోలేదు.
రత్నాకర్‌వలెనే నీవుకూడా వాల్మీకివి అయ్యేఅవకాశం ఇంకాఉంది, నిజమైన
మానవుణ్ణి కలుసుకొనే ఆ సందర్భం రావాలేగాని.

విష్ణుడే

## ఒకసానెట్

గోధూళి వేళ స్వర్ణకాంతి, అయినప్పటికీ
నా నిరర్థక దివాసంచారంలో
మధ్యాహ్నపు నిష్ప్రయోజనమైన స్వప్నాలు మండిపోతున్నాయి.
అయ్యో నా హృదయం చింతాక్రాంతం !
తృష్ణతో, ప్రేమతో, మండిపోతున్న బయళ్ళ,
క్షేత్రాలమీద ఆనందం వెల వెలబోతున్నది
అయినా పనికి మాలిన హృదయం చల్లపడింది.
ఇంద్రజాలం వంటి ప్రణయజలాలలో
నేనుతెరచాపఎత్తి బయలుదేరాను.
అయినాభయపడ్డాను, ఛిన్న భిన్నమైనాను.
మండి పోతున్నదది, అధోలోకపుస్వప్ననది
శుష్కించింది, మృతించింది
ఓ పల్లెలో పశువులకాపరీ, రైల్వేకూలీ,
జీవితాన్ని ప్రవహించనీ, వరదలుగా పారనీ
నన్ను పోలియీనాస్థితిసర్వసామాన్యంగా
ఈ మనోదేహాల జగత్తు, వ్యక్తుల మధ్య
అప్రశుతులు
'హైడ్రా' శీర్షంమీది శిలాస్తరంమీద పచ్చని
చెట్టుగా పాడనీ
దృఢంగా, నిటారుగా స్కందం, గాటంగా మట్టిలోకినాటుకోనీ
కాని రకరకాలైన పైభాగపు చిగురుటాకులగుములతో
తమ సందేహాలు, ఋణాలనుంచి
'తిమోన్' లు పరిత్యక్తులుకానీ
ఇటుచూడు : కర్మాగారాలనేలపైన 'హెగెల్'
వ్యర్థమైన అతిశయం పొరలాడుతున్నది క్షీణదశలో
సాగుభూముల్లో, మేటిస్సే విరచిత మైన
భౌమ చిత్రాలలో, 'మల్లార్మే, శిష్యుల వీధి
ఉరేగింపులలో

# నావికుడు

భయంతో వీక్షించి నావికుడు వైఫల్యశంకితుడైనాడు
కడుజాగ్రత్తతో చుక్కానిని కనిపెట్టుకొని ఉండాల్సిందిపోయి
నడి సముద్రంలో ఉన్న నావ తనదారితాను
చూసుకోగలదని తానుకునికిపాట్లు తీశాడు
అప్పుడిక జాగ్రత్తపడ్డాడు ధైర్యం తెచ్చుకున్నాడు, తనస్థానంలో ఉండి జాగరూకుడై
శ్రమించాడు.
ఇంతలోనే సమీపంలోని రేవుయొక్క
కలకలం, సందడి వరసలు తీర్చినట్లున్న తాటిచెట్లు స్వాగతించి అభినందిచినట్లైంది
అతడి నావ సాగి పోతున్నది.
పసిడికైశిక భయభ్రాంతితో ఆచార్యాణి (పురోహిత పత్ని) కి
సాయం రవి దివో విహంగపు గుడ్డులా కనబడ్డాడు
కర్షకుడికి కోతకువచ్చిన గోధుమ పంట క్షేత్రాలలో ఆటవస్తువులాగా కనపడ్డాడు.
మానవులతలలన్నీ కుప్పగా కూడుకున్నాయిచీకట్లో
ఒంపుగా వచ్చే సూర్యకిరణ పాతాన్ని దర్శించారు
తమ ఆవాస స్థానంలోకి
కత్తిలాగా దూసుకొని వస్తున్నట్లు
వాళ్ళుచూశారు అత్యంత శ్రద్ధా ళువులై, ఆబంగారు కిరణాన్ని,
అందులోని కాంతి కణజాలాన్ని, అవి
శీఘ్ర గతిని సంచలిస్తూ ఎగసిపోతూ, ఎగిసిపోతూ,
సంచలిస్తూ; ఎందుకు? ఎంతదాకా?
ఓ నావికుడా, సన్నద్ధుడివిగా ఉండు సూర్యయానంతో
పొత్తు సాధించు
క్షణకాలం సువు బాబిలోను, నినెవా, ఈజిప్టు 'ఆర్' దర్పణాలలో బంధితుడవైనావు
నిన్ను నీవు వదిలించుకుని, ఇతరతీరాల వైపు
పయనం సాగించావు
వైశాలి, బైజాంటియమ్, అలెగ్జాండ్రి
యాలనుంచి ప్రేరణ
స్మృత సాగర విహార తీరాలమీద దీప్తమవుతున్న
నన్నని, నిశ్చలమైన క్రొవ్వొత్తిదీపాలు నీకు
అవియోగ్యమైనవే, కాని ఏమిటి పరితాపం?

లోతైన ఎరుక కావాలని కోరుతున్నావు, పరిపూర్ణమైన అనుభవాన్ని
తేనెటీగ రెక్కలు తుంపర్ల వలె తళతళలాడుతూ
సూర్యకాంతిలో విహరించేంతవరకూ
జెట్ విమానం కన్నా మించిన సూక్ష్మగ్రాహకతతో
'హేరోను' (దీర్ఘపాదియయి జలవిహంగం) నీలగగ
నాన్నిస్వాయత్తంచేసు కొనే దాకా
మానవుడు తృప్తిపడి విశ్రాంతుడు కాడు
పొరపాట్ల నుంచి, పాపంనుంచి, విషాదకరమైన తప్పులనుంచి
విముక్తుడై
అతడి నావికాత్మ ముందుకు సాగుతుంది
ఈ గ్రహగోళంపై ఇంతకన్న ఉత్తమజీవనాన్వేషణలో
ఉత్కృష్ట ఆనందంకోసం—గాఢతరమైన సహయోగంకోసం

## కదంబవనంలోని కలరవమేమిటి ?

చండీదాసు ప్రేమ గీతికలు

కదంబవనంనుంచి ఈ అనూహ్యాహతాత్ రవమేమిటి ?
నా చెవులు విభ్రమంపొందాయి
జీవితానందసారమేమిటి ?
మాధుర్యమూ కవిత్వమూ
నాహృదయంలో విచారాన్ని, విస్మయాన్ని రేకెత్తించాయి !
ఈ సంచలనాన్ని
నేనీవిధంగావర్ణించగలను ?
మనో మోహకమైనపారవశ్యం కలిగించే వేణువునుంచి
ఎడతెగని రవం
విషమూ, జీవితమూవలె,

## చీకట్లు, మబ్బులు

చండీదాసు ప్రేమగీతికలు

చీకట్లు, మబ్బులు
భయంకరమైన నిశీథాన్ని ఆవరించుకున్నాయి
ఒంటరిగా, కదంబవృక్షం క్రింద
నేను పరితపిస్తున్నాను

కృష్ణుడెక్కడా కానరాడు
చూపులు గుచ్చి గుచ్చి దూరాలు పరికిస్తున్నాను
భూమిని చీల్చి వేసి
నన్ను నేను దాచుకుంటాను
నాతారుణ్యం వేగంగా తరలిపోతూంది
అయినా నాహృదయం ఉక్కిరి బిక్కిరైపోతున్నది
కృష్ణునికోసంనిరీక్షిస్తూ.

## నాతోచెప్పు

(చండీదాసు ప్రేమగీతికలు)

నాకు వినిపించు
నాతోచెప్పు నాఅందమైనప్రియా
నీ అంగాంగాలెందుకట్లా కోయ్యబారిపోతున్నవి,
పెదవులెందుకు వణుకుతున్నవి
నయనాలశ్రుపూర్ణాలవుతున్నవి
సుకుమారమైన తనువు వణికిపోతున్నది
నీజీవితాన్ని తపింపజేస్తూ
శూన్య విలోకనాలు బరపుతూ
మౌనంగా తలపోతలలో మగ్నమై పోయి
ఏమాలోచిస్తునావు
ఏంచూస్తున్నావు ?
చండీదాసమహాశయుడంటాడు
నాకు నిశ్చయంగా తెలుసు
ఆమెచెవుల్లో వేణునాదం సోకింది.

## నామమహిమ

(చండీదాసు ప్రేమగీతికలు)

ఓ సఖా, ఎవరు నాకుశ్యామసుందరుడి నామం వినిపించారు ?
నా చెవులద్వారా, హృదయాన్ని తొలుస్తూ

అది నాజీవితాన్ని కలవరపరిచింది
అంతమధువున్నది శ్యాముని నామంలో
నా నాలుక ఎన్నటికీ విడిచిపెట్టలేదు
మాటిమాటికీ రుచి ననుభవిస్తూ
నా నిగ్రహాన్ని కోల్పోయినాను
నేనేవిధంగా అతణ్ణిచేరుకోగలను ?
ఆతని నామమే అంతమహిమగలదైనప్పుడు
ఆయనదేహాన్ని స్పృశించగలిగినప్పుడేమవుతుంది ?
ఆయనఎక్కడుంటాడోతెలిసినతర్వాత
ఏకన్నెపడుచు దారి తప్పకుండా ఉండగలదు
ఓహ్, ఇటువంటి తలపులకు దూరంగా ఉండాలని
నేనెంతగా కోరుకున్నాను
ఈ గాఢోద్విగ్నమైన తలపుల నుంచినేనుతప్పించుకోలేను
నేనేంచేయాలి ?
ఒక సుశీల తనశీలాన్నే భగ్నంచేసుకుంటుంది.
తనయవ్వనాన్ని దాహశుద్ధికి గురిచేస్తూ
అంటాడు ద్విజ చండీదాసుడు.

## చండీదాసు ప్రేమగీతాలు

ప్రవర్ధితమవుతున్న నాయౌవనమే
నాకొకగొప్ప ప్రమాదం
ఇకతరవాత
భీతిని గొలిపే బృందావనం
కదంబ వన వాటిక
గలగల పారే యమున
నా అందమైన భూషలు
గోవర్ధనగిరి
ఇన్ని ఆ పదలతో
నేను ఏకాంతంగాజీవిస్తున్నాను
నాగాథల నెవ్వరూ వినేవార్లు లేకుండా,

విభూతి భూషణ వందోపాధ్యాయ

# మేఘమల్లార్

దశపారమితదేవాలయంలో ప్రద్యుమ్నుడావ్యక్తిని కలుసుకున్నాడు. జేష్ఠమాసపు ఆఖరిరోజుఅది.మాస సంక్రమణోత్సవంకోసం జనులంతా గుమికూడారు ఆలయంలో. చుట్టుపట్ల ఊళ్ళనుంచి కన్నెపిల్లలు పూజలుచేయడానికి వచ్చారు.

ఆరోజంతా ప్రద్యుమ్నుడు ఆ వ్యక్తికోసం ఎదురుచూస్తూనేఉన్నాడు. మధ్యాహ్నపు ప్రొద్దుబాగావాలినతర్వాత, చాలామంది జనులు పాములాడించేవాడి చుట్టూచేరి వినోదిస్తుండగా, ఆగుంపును ఎంతోకనిపెట్టిచూస్తున్నాడు, తానుకావాలనుకొనేవ్యక్తి అక్కడకనిపిస్తాడనే ఆశతో. ఇదివరిలోఎప్పుడూ అమనిషి నతడు కలుసుకోలేదు. కాని అతడికి నమ్మకమే. గొప్పగాయకుణ్ణి గుర్తించడానికి ఆవసరమైన విలక్షణత ఏదోఅతడివద్ద ఉండనే ఉంటుంది.

ఇంతలోనే హఠాత్తుగా గుంపులోనుంచి ఎవరో తనను కనిపెట్టిచూస్తూ ఉండటం గమనించాడు . ఆచూస్తున్నవ్యక్తి కట్టుకున్న బట్టలు మురికి వోడుతున్నాయి. చీలికలూ పేలికలూ అయినాయి. కాని అతడి వాలకంలో ఏదో విలక్షణత,తానుఎదురుచూస్తున్న వ్యక్తిఇతడే నని ప్రద్యుమ్నుడికి స్ఫురింపచేసింది. ప్రద్యుమ్నుడతడి వైపుకు కదలి అడుగులేస్తుండగా, ఆ గుంపులోంచి బయటకురావలసిందిగా ఆ వ్యక్తి ప్రద్యుమ్నుడికి చెప్పాడు.

''నాపేరు సూరదాసు. నేనుగాయకుణ్ణి, అవంతి మాపట్నం'' అని చెప్పాడావృద్ధుడు.

''నీవు నాకోసం ఎదురు చూస్తున్నావు కదా ?

ప్రద్యుమ్నుడికి చాలా ఆశ్చర్యంకలిగింది, అతడికెట్లాతెలుసో ?

''నువు నాకేమీ అపరిచితుడివికావు'' అన్నాడావృద్ధుడు.

''మీనాన్న నాస్నేహితుడే. నేను ఎప్పుడు వారణాసిని దర్శించినాతప్పకుండవెళ్ళి నామిత్రుణ్ణి చూసేవాణ్ణి. నిన్నుకూడా చూస్తూనేఉండేవాణ్ణిఅప్పుడు. కాని అప్పటికినువ్వింకా చిన్నపిల్లాడివి''.

''మీరిక్కడ ఎక్కడ బసచేశారు ?'' అని అడిగాడు ప్రద్యుమ్నుడు.

''ఆ నది పక్కన ఉన్నదే, ఆపాడుబడ్డగుళ్ళో. నీవెక్కడ ఉంటున్నావు ? ''

''ఇక్కడి విహారంలో విద్యార్థినినేను. ''

''భేష్. అయితే నదివద్దునే ఉన్న గుళ్ళోకి వస్తావా ? నాకోసం. ఒకసారిరా. ''

అప్పటికింకా చీకటిపడలేదు గుడినుంచి బాలికలంతా ఇళ్ళకు తిరిగి వెళ్లతున్నారు. వాళ్ళవైపేచూస్తున్నాడు ప్రద్యుమ్నుడు. అతడి కళ్లసునందను వెతుక్కుంటున్నవి. అయితే సునంద జాడమాత్రం అతడికి కనపడటంలేదు. క్రమంగా పొద్దెక్కిపోతున్నది చీకటిముసురుకోక

ముందే అతడు విహారానికి చేరితీరాలి – ఆచార్యశీలభద్రులవారు చాలా చండశాసనుడు నియమపాలనంలో.

గబగబా అడుగులు వేస్తూకొండదిగుతున్నాడు ప్రద్యుమ్నుడు. కొండదిగి మైదానం లోకి అడుగుపెట్టగానే నదిపక్కనే ఉన్నగుడిగోపురం అతడికంటపడింది. అస్తమిస్తున్న సూర్యకాంతిలో తెల్లని మేఘాలతో చెలిమిపాటిస్తూఅది నిలబడింది.

ఇంతలోనే అతడి కట్టు బట్టనెవరో గుంజినట్లైంది. గిరుక్కున వెనక్కుతిరిగి చూస్తే శలాకలాగా, నీలపుచీరకట్టిన తరుణ బాలిక కనిపించింది. తెల్లని పూలదండ ఆమెనల్లని కురుల చుట్టూగుండ్రంగా అలంకృతమై ఉంది.

"ఎప్పుడొచ్చావు సునందా నువు ? నీకోసం ప్రతిచోటా తెగ గాలించానే నేను, నాకెక్కడాకనపడలేదునువు"

ఆ అమ్మాయిసిగ్గుపడిపోయింది, కాని అవమానం పొందినట్లుగా బాధపడింది. "పోనిలే, నేను నిన్ను గమనించటంలేదనుకుంటున్నావు గదూ,నీకు తీరికేదీ, గారడివాళ్ళతోనూ, పాములవాళ్ళతోనూనీకు సరిపోయే సమయమంతా"

"సునందా నన్ను నమ్మవా ? నీకోసం నేను చూశాను"

కొంతమంది బాలికల జట్టు గుడినుంచి తిరిగి వస్తున్నారు. వాళ్ల దగ్గరయ్యేసరికి, సునంద గబగబ అడుగులేసింది వాళ్ళనుకలవటానికి.అంతాకలసినడిచికొండమలుపు దగ్గరవాళ్ళు దిగిపోయినారు, ప్రద్యుమ్నుడొక్కడే అక్కడ ఒంటరిగా మిగిలిపోయినాడు.అతడికి చాలా ఆశా భంగమైంది. కోపంవచ్చింది. కొన్నిక్షణాల తర్వాత, విహారానికి పోవడానికతడు మళ్ళీ ముందుకు నడిచాడు. పరచుకొంటున్న చీకటి ఇంతలో చిక్కపడింది.

అది పౌర్ణమిరాత్రి. కొండలు, పరిసరక్షేత్రాలూ, అన్నీ, మృదువైనకాంతిలో స్నాతమైనాయి. దూరంగా చెట్లపైనుంచీ మైదానాల మీదనుంచి మందపవనాలు వీస్తున్నాయి.

దేవాలయానికివచ్చిన గుంపంతా క్రమక్రమంగా పలచబడిపోతున్నది. గుళ్లోమ్రోగే సంజగంటలిప్పుడు వినపడటం లేదు. ప్రద్యుమ్నుడు తొందర తొందరగా, వెనక్కు తిరిగి పోతుండగా ఒక చెట్టువెనక హఠత్తుగా అతడికొక మనుష్యాకృతి పొడకట్టింది. ఆ చోటును సమీపిస్తుండగా, ఆ ఆకృతి సునంద అనీ, ఆమె తనకోసం అక్కడ నిరీక్షిస్తున్నదనీ అతడు తెలుసుకున్నాడు. అల్లి బిల్లిగా అల్లుకొన్న కొమ్మలవల్ల, నలువు తెలుపుగా వెలుగునీడలు ఆమె చుట్టూ వింత ఆచ్ఛాదనాన్ని కలిపించాయి ఆమె ముఖము, చేతులూ, నీలంచీరా ఆ వింత కాంతిలో భాగమైపోయినాయి.

"నాకు నిజంగా చాలా కోపంవచ్చింది సునందానీపైన" అన్నాడు ప్రద్యుమ్నుడు. "నిజమేకావచ్చు, కాని తప్పెవరిదంటావు? నువ్వేమో రోజంతా గుంపుతో ఉండిపోయ్యి

నావు, నేనేమో నీకోసం గుళ్లో ఎదురుచూస్తూ గడిపాను''.

''కాని మరి నువ్వు నన్ను చూస్తే ఎందుకు పిలువలేదు?''

''ఎట్లా, నా చుట్టూ అంతమంది అమ్మాయిలుండగా, మధ్యాహ్నం మాత్రం ఎవ్వరూ లేరు. నేను ఒక్కదాన్నే ఉండిపోయాను, కాని నువ్వుమాత్రం వచ్చావు కాదు.''

''సరే, ఒప్పుకుంటాను. ఇదంతా నా తప్పే, కాని నేను చెప్పేది విని అర్థం చేసుకో. నే నేమీ మంత్రగాళ్ళ వెనక పడలేదు. అవంతినుంచి వచ్చిన ఒక మహాగాయకుడి కోసం చూస్తూఉన్నాను నేను. ఆ ధ్యాసలోనే గడిపాను. నీకు తెలుసు సునందా, వీణ వాయించడంనేర్చుకోడానికి నేనెంత తాపత్రయపడుతున్నానో. ఈయనున్నాడే నిజంగా మహానుభావుడనుకో. గొప్ప పాటగాడు. ఏమైతేనేం, చివరకు నేనాయనను కలుసుకోగలిగాను ఇన్నాళ్టికి. దా వెళదాం. ఆ నదివడ్డున కాసేపుకూచుందాము. కొంచెంసేపు వేణువునూదుతాను. నాతోపాటే తెచ్చాను.''

వాళ్ళిద్దరూ నది ఒడ్డుకుపోయి కూర్చున్నారు. కాని ప్రద్యుమ్నుడు అన్యమనస్కంగా మురళి నాలాపించాడు. ఇదివరకెన్నడూ అతణ్ణి ఆ విధమైన ఉద్వేగంతోచూడ లేదు సునంద.

ఆ పాటలో అతడికేమీ ఉత్తేజంకలగలేదు. విలక్షణమైన సూరదాసు ఆకృతి అతణ్ణి ఆవహించు కొంటున్నట్లనిపించింది వెన్నాడుతూ. ఎంత వికారంగా, అసహ్యంగా ఉన్నాడా వ్యక్తి? ! సన్నగా చర్మమంతా వదులొదులుగా వేలాడుతూ, ఇంచుమించుగా వస్త్రవత భిక్షువు చిత్రీకరించిన ముసలితనం గూర్చిన చిత్రంలాగా ఉన్నాడు. ఆఖరుకు అతడు ధరించిన వస్త్రాలుకూడా ఎర్రటి ధూళితో నిండి ఉన్నాయి, ఎండించి సిద్ధంచేసిన, రంగు వెలిసిపోయిన పాతతోళ్ళలా ఉన్నాయవి.

ఆ మర్రోజు ఉదయం ప్రద్యుమ్నుడు నది ప్రక్కనే ఉన్న పాడు పడిన గుడికి వెళ్ళాడు. ఆ గుళ్లోని దేవతా ప్రతిమ అక్కడినుంచి ఏ నాడో మాయమైపోయింది. పగిలి నెర్రెలు వారిన ఆ గోడలనిండా లెక్కలేనన్ని పాములు చోటు చేసుకున్నాయి.

సూరదాసన్నాడు ''ఇక్కడ చీకటిగా ఉంది లోపల.''

''బయటకుపోదాం పద.''

ప్రద్యుమ్నుణ్ణి పరిశీలనగా చూసి సూరదాసు తనలోతాను గొణుక్కున్నాడు.''అవును నువు సాధించగలవు. నాకు తెలుసు.'' వికృతమైన సూరదాసు ముఖంలో కనపడే ప్రజ్ఞ స్ఫుటంగా ముద్రితమై ఉండడం చూసి ప్రద్యుమ్నుడు అబ్బురపడ్డాడు. సూరదాసన్నాడు. ''నీవు వస్తావని నేను ఆశిస్తూనే ఉన్నాను. మీ నాన్నగారు ప్రఖ్యాతగాయకుడు. ఆయన దగ్గర నువ్వేమైనా నేర్చుకున్నావా?''

''ఆ, ఏదో కొంచెం. నేను మురళిమీద కాస్త పాడగలను,'' అన్నాడు ప్రద్యుమ్నుడు.

'మేఘమల్లార్ రాగాన్ని ఆలాపించగలవా?''

ఆ బాణీని నేర్చుకున్నాను కాని. దానిలో పరిపూర్ణప్రజ్ఞమాత్రం ఇంకా పట్టుపడలేదు అని చెప్పాడు ప్రద్యుమ్నుడు.

''నీవేం నేర్చుకున్నావో చూద్దాం కానీ.''

ప్రద్యుమ్నుడు మురళి వాద్యాన్ని తీసుకొని పాడటం సాగించాడు. అతడికి సహజ మైన ప్రతిభ ఉన్నది. దానికితోడు తండ్రిగారినుంచి మంచి శిక్షణకూడా లభించింది. అతడాలా పించిన మేఘ మల్లార్ రాగం, చాలా శక్తిమంతంగానూ, పుష్టిగానూ ఉంది. అంతగా కదిలించి వేయగల ధోరణిని సూరదాసుకూడా ఆశించి ఉండడు బహుశా. లేచి అమాంతం ప్రద్యుమ్నుణ్ణి అతడు కౌగిలించుకున్నాడు. ''మీ నాన్నగారు గర్వించి ఉండేవారు, పొంగిపోయేవారు. సరే, నువ్వుదాన్ని సాధించి తీరగలవు. నా మనసులో కలిగిన ఉద్బోధం నిజంగా సార్థకమే''

సూరదాసు క్షణం సేపు అగి అన్నాడు మళ్ళీ ''నేను నీతో చెప్పాల్సిన విషయం ఒకటుంది. కాని అది పరమ రహస్యం. ఇక ఇప్పుడు నేనుకూడా ఉన్న సంగతి బయటికనేస్తున్నాను. నేనుకూడా నీకోసం ఇన్నాళ్ళనుంచీ నిరీక్షిస్తున్నాను. మనం కలుసుకోవడం చాలా మంచిదైంది. సరే. ఇంతకుమించి నీతో ఏమైనా చెప్పటానికి ముందుగా నీవు నాకో మాట ఇవ్వాలి. ఈ రహస్యం నీవు ఎక్కడా, ఎవరకీ పొక్కనివ్వ కూడదు.''

ప్రద్యుమ్నుడు ఎంతో ఆశ్చర్యానికి గురి అయినాడు. ఈ ముసలివాణ్ణి తాను కలుసుకొన్నది ఇంతకూ నిన్ననే. తనను ఎటువంటి గొప్ప రహస్యాన్ని దాచమంటున్నాడో? అతడికి చాలా కుతూహలం కలిగింది. ఈ రహస్యం ఎవ్వరికీ చెప్పనని వాగ్దానం చేశాడు.

సూరదాసు తన కంఠస్వరం బాగా తగ్గించి ప్రారంభించాడు. ''చూడు, ఆ పొలానికటుగా ఒక గుట్ట కనపడటం లేదా. పూర్వకాలంలో ఆ గుట్టమీద సరస్వతీదేవి ఆలయం ఉండేది. ఈ దేవాలయానికి విశేషమైన ప్రభావం ఉండేది. అప్పటిదాకా ఎందుకు! అప్పుడు ఈ నాటికి కూడా ఆషాఢ పౌర్ణమి నాటి రాత్రి ఆ గుట్టమీద కూచుని ఏ మాత్రం అపస్వరం లేకుండా మేఘమల్లార్ రాగాన్ని పరిపూర్ణంగా ఆలాపించగలిగితే, ఆ చదువులతల్లి తనంత తానుగా అతడికి ప్రత్యక్షమవుతుంది. ఈ విధంగా క్రమం తప్పకుండా అటువంటి మూడు పున్నమిరాత్రులు ఆలాపిస్తే, తన కళలో అతడికి సర్వసంపూర్ణాధిపత్యం సిద్ధిస్తుంది. సరస్వతీదేవి అనుగ్రహంవల్ల, సంగీత శాస్త్రంలోని గుహ్యాతి గుహ్యమైన మెళకువలన్నీ అతడికి అవగతమవుతవి. కాని ఒక్క షరతుమాత్రం ఉంది. ఆ గాయకుడు బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించాలి. తరుణవయస్కుడై ఉండాలి, వచ్చే ఆషాఢ పూర్ణిమకు నువ్వెందుకు ప్రయత్నం చేయ్యకూడదు?''

అత్యంత విస్మయంతో ప్రద్యుమ్నుడు ఈ విషయాలన్నీ వింటున్నాడు. సరస్వతీ దేవిని గూర్చి అతడు ఎన్నెన్నో పురాణగాథలు విన్నాడు. ఆమె విద్యలకు, కళలకు, అధిష్ఠాన దేవత. ఆమె నిజంగా ఉందా? ఆమెను చూడటమనేది సాధ్యమా?

''ఏం? నీకు ప్రయత్నించాలనిలేదా'' అని మళ్ళీ అడిగాడు సూరదాసు.

''అదేం కాదు. అసలామెను చూడగలగటమంటూ సాధ్య పడుతుందా అని ఆశ్చర్యపడుతున్నాను ...''

''నీ కళ్ళతో నీవు ప్రత్యక్షంగా స్పష్టంగా చూడగలవు. నీకేమీ అభ్యంతరం లేకపోతే, వచ్చే పున్నమి నాటి రాత్రికన్నీ నేను సంసిద్ధం చేస్తాను.''

ప్రద్యుమ్నుడికి ఆలోచించుకోవడానికి వ్యవధానమేమీ లేదు. అతడేమీ ఆలోచించు కోలేకనేపోయినాడు. ఏదో మత్తుచల్లినట్లు, ఎవరో మంత్రం వేసినట్లు ఉన్నది అతని పరిస్థితి. కేవలం ఆ ఒక్కమాట అనగలిగాడు.'' సరే మంచిది. నేను వస్తాను.''

ఆ పున్నమినాటి రాత్రి, సూరదాసుని వెంబడించి ప్రద్యుమ్నుడు భద్రావతి నది వొడ్డుకి వచ్చాడు. ఆకాశం ఆచ్ఛాదితంగా ఉంది. చంద్రుడు పాలిపోయిన వెన్నెల కాస్తున్నాడు. రాత్రి పలచబారి ఉంది. సూరదాసు కర్మకాండకుపక్రమించాడు. ఒక పుర్రెను తెచ్చి దాన్ని నూనెతో నింపి ఒక దీపం వెలిగించాడు. అటు తర్వాత హోమాగ్నిని రాజేసి వెలిగించాడు. ఈ విచిత్రమైన ఉపాసనా కర్మకాండనంతా మౌనంగా అత్యంత విస్మితుడై చూస్తూఉండి పోయినాడు ప్రద్యుమ్నుడు.

రాత్రి చాలా గడచిన తర్వాత సూరదాసు అన్నాడు. ''ఇక నేను చేయవలసిన దంతా పూర్తయిపోయింది. నీవంతు మాత్రమే ఇక మిగిలింది.''

సూరదాసు తీక్ష్ణంగానూ, ఆకలిగొన్న చూపులతోనూ చూడటం ప్రద్యుమ్నుడికి స్పష్టంగా కనిపించింది. ఈ విషయం అతడికి చికాకు కలిగించింది కాని ఎప్పుడైతే వేణుగానం ప్రారంభించాడో, ఆ మరుక్షణంనుంచీ సూరదాసును గురించి ఇతర విషయాలన్నీ మరచిపోయినాడు. అంతటా నిశ్శబ్దం అలుముకుంది. గాలికూడా కదలటంలేదు. ఆకాశం నిశ్శబ్దమైపోయింది. ఆ రాత్రి నిశ్శబ్దాన్ని అంతా మేఘమల్లార్ రాగతరంగాలు చిక్కగా నింపివేశాయి. ప్రకృతి శోభ, సంగీతోత్తేజకత, ఒకే లయాత్మకంగా మేళనం పొందాయి.

హఠాత్తుగా ఆ ప్రదేశం చల్లని దివ్యోజ్జ్వల కాంతి ఆవరించుకుంది. సితశుభ్రోజ్జ్వల దివ్యపరివేషంతో అతిలోక సౌందర్యస్వరూపిణి అయిన ఒక తరుణ యువతి ప్రత్యక్షమైంది. ప్రద్యుమ్నుడు తన కళ్లనే తాను నమ్మలేకపోయినాడు. విజ్ఞాన, లలిత కళా అధిష్ఠాత్రి, సత్య సౌందర్యాధిదేవత తన కళ్ళ ముందు ప్రత్యక్షమైంది. మూగవడ జేసిన ఆశ్చర్యంతో ఆ దివ్య లోక సుందరాకృతి నెమ్మదిగా మళ్ళీ గాలిలో కలుస్తూ మాయమైపోవడాన్ని చూస్తూ ఉండిపోయినాడు.

ప్రద్యుమ్నుడు మంత్రించి నిలబెట్టిన వాడిలా ఉండిపోయినాడు. ఇది నిజమా? కలా! ఇది నిజంగా అనుభూతమైత విషయమేనా? లేదా మనస్సు పరిపరి విధాల గాఢాలోచన లతో కల్పించుకున్న తబ్బిబ్బా, భ్రాంతి కాదుకదా? తన కళ్ళముందే ఆ సౌందర్య సాక్షాత్కారం జరిగింది. అయినా అతడు నమ్మలేకపోతున్నాడు.

కలలోంచి ఉలిక్కిపడి లేచినట్లయింది అతడిస్థితి సూరదాసు మాటలు వినగానే. ఇప్పుడు నీకు నమ్మకం కలిగిందనుకుంటాను. ఏమంటావు? నమ్మకం కుదిరిందికదూ. మంచిది. శుభం, ఇక నీవు వెళ్ళవచ్చు. నేనింకా పూర్తిచేయవలసిన తతంగం ఉంది.''

అల్లకల్లోలమైన మనస్సుతో, అంతుపొంతులేని వేయి విధాల ఆలోచనలతో, ప్రద్యుమ్నుడు విహారం వేపు బయలుదేరాడు.

చాలాదూరంనడిచాడు.ఆ పొలాలన్నీదాటి ఒక అడవిలో ప్రవేశించాడు. చీకటి చాలా దట్టంగాఉంది అక్కడ. ఒకకాలిదారిన చిన్నగా ఒక కాంతివెంట నడుస్తున్నాడు. అక్కడ ఏమాత్రమూ వెన్నెలపడటానికి వీలులేదు. చంద్రుడు పాలిపోయిఉన్నాడు. ఆకాశమంతా అచ్ఛాదితంగా ఉంది. ముందుకునడిచి అతడు ఒకచోట మిక్కిలి ఆశ్చర్యపడ్డాడు. ఒకయువతి నుంచి కాంతి తనను నడిపిస్తున్నది. ఆమె శరీరమంతా ఒక విలక్షణమైన కాంతితో వెలిగి పోతున్నది. గాఢమైన చీకట్లో మిణుగురుల కాంతిలా మెరిసిపోతున్నదామె వెలుగు. కొంచెం సేపటిక్రింద ఈమెనే తాను చూసింది. అర్థనిమీలితమైన కన్నులతో ఆమె దారికోసం తడుము లాడుకుంటున్నట్లనిపించింది. ఆమె ముఖమంతా గొప్ప కష్టంలోకూరుకొనిపోయినట్లు ఎంతో విచారంగాఉంది.

ప్రద్యుమ్నుడికి విచిత్రమైన భయంపుట్టింది. ఇదంతా ఏదోమంత్రతంత్రాలమాయగా గాభరాకలిగింది. నడకవేగం హెచ్చించి గబగబా విహారానికిచేరుకున్నాడతడు.

ఎంతసేపటికీ ఆరాత్రి అతడికి నిద్రపట్టలేదు. తెల్లవారు ఝామున అతడికొక విచి త్రమైన, వింతైన,కలవచ్చింది. సాటిలేని సౌందర్యరాశి అయిన ఒకానొకదేవత: భద్రావతి నదిలోని నల్లని నీళ్ళలోనికిలాగబడుతూ ఉండటంచూశాడతడు. ఆమె ఆనీళ్ళలోమునిగిపోకుండా ఉండాలని ఎంతగానో గింజుకుంటున్నది, కాని ఆ క్రూరజలాలు ఆమెనుముంచుతున్నాయి, లేవనివ్వటంలేదు. ఆమెశరీరకాంతి తరిగిపోతున్నది. పలచబడిపోతున్నది. ఆమెను చీకటి మూసివేసింది. ఒక పెద్దచేప ఆమె విల విల లాడుతూ కొట్టుకుంటూ ఉండటాన్ని పళ్ళికిలించి చూస్తూ సంబరపడి పోవటంకూడా అతడు చూశాడు. ఆచేపముఖం వికృతమైన సూరదాసు ముఖాన్నే పోలిఉంది.

ఆమర్రోజు ఉదయాన్నే ప్రద్యుమ్నుడీకలనంతా, మహాకోటి విహారాచార్యులవారైన పూర్ణవర్థనులవారికి వినిపించాడు. అనుభవశాలి; వృద్ధుడు, అయిన అచార్యుడుఆశ్చర్యంతోనూ, ఆందోళనతోనూ ప్రద్యుమ్నుడు చెప్పిందంతా విన్నాడు. చివరకాయన ఇట్లాఅన్నాడు. 'నేనను

కుంటూనేఉన్నాను. ఇట్లాంటిదేదో జరగవచ్చునని. కొందరుంటారు. తమస్వార్థాన్ని సాధించుకోవటానికి ఎంతటి దారుణానికైనా వెనుదియ్యరు. నీకుతెలియకుండా నీవు వాళ్ళదుర్మార్గాలకు ఆసరా అయినావు. వాళ్ళచేతుల్లోసాధనమైనావు, సరస్వతీదేవిని బంధించడంలో. సరే, ఆవ్యక్తి ఆకారం ఎలాఉంటుందో నాకు చెప్పు. ''

సూరదాసు కృశించిన దేహాన్ని, వికృతమైన రూపరేఖలను వివరించాడు ప్రద్యుమ్నుడు.

''ఇప్పుడునాకు తెలిసిపోయింది. ఆవ్యక్తి సూరదాసుకాడు. అవంతినుంచీరాలేదు వీడు. వీడుగుణాఢ్యుడనే కాపాలికుడు''. అనిచెప్పాడు పూర్ణవర్ధనుడు.

'వినుప్రద్యుమ్నా' అంటూఇంకా ఈవిధంగాచెప్పాడాయన.''సుమారు రెండువందల ఏళ్ళ కిందట ఒకయువకుడైన సంగీతవిద్వాంసుడుండేవాడు ఆసరస్వతీదేవి ఆలయంలో.అతడు, అత్యద్భుతంగా మేఘమల్లార్ రాగం పాడేవాడు. అందుకు అనుగ్రహిస్తూ అమ్మవారు అతడికప్పుడప్పుడూ దర్శనమిస్తూఉండేది. ఆనాటినుంచికూడా సరస్వతీదేవి, మేఘమల్లార్ రాగాన్ని ఆ ప్రాంతంలో నిర్దుష్టంగా, పరిపూర్ణప్రజ్ఞతో ఎవరైనా పాడితేప్రత్యక్షమవుతూఉంది. ఒకప్పుడు ఆమె సూరదాసుకు ప్రత్యక్షమైంది. ఆమె దివ్యానుగ్రహంవల్ల దేశమంతటిలోనూ సూరదాసు మహాగాయకుడైనాడు. సూరదాసుకు అమ్మవారు ప్రత్యక్షమైనప్పుడు అక్కడ గుణాఢ్యుడు కూడా ఉండటంతటస్థించింది. అమ్మవారతణ్ణి ఏదైనావరం కోరుకోమనడంతో, మొండివాడు ఆమెనేకోరుకున్నాడు తనవశంకావాలని. అసంభవమైనదాని నాతడుకోరుతున్నాడంటూ,ఆవిధంగా జరగదని చెప్పి తల్లి అదృశ్యమైపోయింది. ఆమెను తనచెప్పుచేతుల్లో ఉంచుకోవాలన్న తీవ్రతతో మతి భ్రష్టుడైన గుణాఢ్యుడు తాంత్రిక ప్రయోగాలన్నీ నేర్చుకోవడానికి పూనుకున్నాడు. ఆమెనేవిధంగానైనా వశం చేసుకోవాలన్నది ఆతడి వాంఛ. ఆతరవాత వాడి సంగతేమైందో మనకు తెలియదు. చాలాకాలంగా వాడి గురించి మనకు తెలియదు.

నువు చెప్పినదానిని బట్టిచూస్తే,చిట్టచివరకు వాడుతన దుష్టప్రయత్నాన్ని సాధించాడేమోననిపిస్తున్నది. సరే, నది ఒడ్డుననే ఉన్నగుడికి పోయి వాడింకా అక్కడే ఉన్నాడేమో చూడు.''

ప్రద్యుమ్నుడు పరిగెత్తిపోయినాడు గుడిదగ్గరకు. అతడు భయపడినంతా అయింది. అక్కడెవరూలేరు. ఖాళీగాఉందిగుడి. సునందను కలసి తానుచాలా ముఖ్యమైనపని మీద వెళుతున్నానని, తొందరలోనే మళ్ళీవస్తానని చెప్పి వచ్చాడు.

ఆరాత్రే, విహారాన్ని విడిచిపెట్టి ప్రద్యుమ్నుడెక్కడికో వెళ్ళిపోయినాడు.

ఒకసంవత్సరంగడిచిపోయింది.దేశమంతా తిరిగిగాడు ప్రద్యుమ్నుడు ఆమనిషికోసం. అతడికోసంవెతికాడు ప్రతీచోటా. తనజీవితాన్నే పూర్తిగా తలకిందులుచేసినవాడా మాయల మారి. వాడిపొడకూడాఎక్కడా కనపడలేదు.అసలు గుణాఢ్యుడి గురించే ఎవరూవిన్నట్లులేదు. అయితే దేశంలో విపరీతాలుమాత్రం ఎన్నోపొడకడుతున్నాయి ముఖ్యంగా విద్యలకు సంబం

ధించీ, కళలకు సంబంధించీ. మిహిరగుప్తుడనే విఖ్యాతశిల్పి చాలాకాలంనుంచి బుద్ధదేవుని విగ్రహం చెక్కుతున్నాడు. చూసినవాళ్ళ గుండె పగిలిపోయేట్లుగా ఆ విగ్రహం ముఖంలో భయంకరమైన రాక్షస లక్షణం కనిపించ సాగింది. గొప్పపేరు ప్రతిష్ఠలార్జించిన తక్షశిలా విద్వాంసులైన యామునాచార్యులవారు సంవత్సరం పైబడి మీమాంసాశాస్త్రానికి కొత్త వ్యాఖ్యానాన్ని సంతరించడంలో పరిశ్రమిస్తున్నారు.సరిగా ఈ పన్నెండు నెలల్లోనూ ఆయనకు మతిభ్రష్ఠమై పోయింది హఠాత్తుగా. ఎప్పటికప్పుడు మళ్ళీ మొదలు పెట్టడమేతప్ప పంక్తికూడా సాగటం లేదు.

ఇటువంటి వార్తలెన్నో వింటున్నాడు ప్రద్యుమ్నుడు. ఇదంతా ఏమిటో అతడికి అర్థమవుతున్నట్లే అనిపిస్తున్నది. గుణాఢ్యుడికోసం,ఎప్పటికప్పుడు ఫలితం లభించకపోతున్నా, గాలింపు మానలేదు ప్రద్యుమ్నుడు.

ఒక రోజున ఊరుబిల్వ గ్రామంలో అప్పుడే అడుగు పెట్టిన ఒక మనిషిని గురించి ప్రద్యుమ్నుడు విన్నాడు. అతడు ఎవరికోసం ఎదురుచూస్తున్నాడో ఆ కాపాలికుడి పోలికలన్నీ ఈ వ్యక్తిలో ఉన్నాయని అతడికెవరో చెప్పారు. వెంటనే హుటాహుటి ప్రద్యుమ్నుడు ఊరుబిల్వం చేరుకున్నాడు. కాని ఆ కొత్తగా వచ్చిన రహస్యవ్యక్తి నతడు కనుక్కోలేకపోయినాడు.

ఆ రోజంతా ఆ వ్యక్తి కోసం తిరిగి తిరిగి వేసారిపోయినాడు ప్రద్యుమ్నుడు. చాలా బడలిక చెందాడు. ఊరి చివరికి వచ్చేశాడు. అక్కడొక పెద్ద మర్రి చెట్టు ఉంటే కాసేపు విశ్రాంతి తీసుకుందామని ఆ చెట్టు కింద కూచున్నాడు. ఇంకా సంజ ముసురుకోలేదు. తన ముందు పరుచుకొన్న పొడుగాటి నీడలను చూస్తూ కూచున్నాడతడు. ఆ సంజవేళ ఎంతో ప్రశాంతంగా, వికలమైన తన మనసుకి ఎంతో ఊరట గొలిపేదిగా ఉంది. అక్కడికి కొద్ది దూరంలో ఒక గుట్ట కనపడుతున్నది. ఆ గుట్ట నిండా దట్టంగా పొదలు అల్లుకుని ఉన్నాయి. అయితే ఏటవాలుగా ఆ బలిసిన పొదల తుప్పల మధ్య నుంచి ఒక కాలిదారి కనపడుతున్నది ఆదారి చాలా ఇరుకుగా కనపడుతున్నది.

ఇంతలో ప్రద్యుమ్నుడికి చాలా ఆశ్చర్యం గొలిపే సంఘటన జరిగింది. ఆ గుట్ట పైన దట్టమైన పొదల వెనక నుంచి మానవాకృతి వెలికి రావడమే ఆ ఆశ్చర్యకరమైన సంఘటన. అక్కడి ఇరుకు దారిలో ఆ ఆకృతి నడిచి వస్తున్నది కిందికి. ఆ ఆకారం తనవైపు నడుస్తూ దగ్గర దగ్గరగా రావడంతో, ఆ ఆకృతి ఒక యౌవ్వనవతి అయిన స్త్రీ దని ఆతడు తెలుసుకున్నాడు. ఒక చిన్న కుంట నించి నీళ్ళ తీసుకొని పోయేందుకుగాను ఆమె ఆ గుట్ట దిగి వస్తున్నది.

ఆమెనెక్కడో చూసి నట్లుగా అతడి కేదో లీలగా స్ఫురించింది? ఆమె నెక్కడ చూశాడుతాను! అతడు కూడా అక్కడి నుంచి లేచి దగ్గరగాబోయి పరీక్షగా చూసేందుకు, ఆ నీళ్ళ కుంట దగ్గరకు పోయినాడు.

ఇది సంభవమేనా? ప్రద్యుమ్నుడు విస్మితుడైనాడు. ఆమె ఎవరో కాదు. మహా కోటి విహారానికి దగ్గరలో ఉన్న అడవిలో ఆనాడు తాను చూసిన స్త్రీ మూర్తి. ఆమె ఆ దురదృష్ట కరమైన రాత్రి తనకు ప్రత్యక్షమైన దేవత. అవే కళ్ళు, అవే పరమ సుకుమార మైన రూపరేఖలు. అయితే ఆమె తనువున ఆ దివ్యకాంతి లేదు ఇదివరకటి వలె. చెప్పడానికి వీలు లేనంతగా పాలిపోయి ఉంది ఆమె. ప్రద్యుమ్నుడికి ఏంచేయడానికీ పాలు పోలేదు. కలత చెందిన మనస్సుతో అతడు విహారాన్ని వదిలి పెట్టి వచ్చాడు. తన ఉద్వేగ పూరితమైన అన్వేషణలో ఇటువంటి సన్నివేశం ఎదురవుతుందని అతడేనాడూ ఊహించలేదు. అతడికి మతి పోయినట్లైంది. గాభరాతో, ఆందోళనతో, అక్కడి నుంచి మెల్లిగా జారుకున్నాడు. ఆమె తనను ఎక్కడ చూస్తుందో అనే భయంతో. కాని మర్రోజు సాయంకాలం మళ్ళీ అదే వేళకు అతడక్కడికి రాకుండా ఉండలేక వచ్చాడు. కిందటి రోజులాగానే ఆరోజుకూడా ఆమె అదే విధంగా, అదేప్రదేశం నుంచి ఆమె నీళ్ళు తీసుకొని పోవడానికి అదే విధంగా దిగి వచ్చింది. ఈ విధంగా విచిత్రంగాకొన్ని రోజులు వెళ్ళి కనిపెట్టి చూశాడు. ఏంచేయడానికీ నిశ్చయించుకో లేకపోయినాడు.

ఒక రోజు సాయంకాలం ఆమె ఆ నీటి కుంటలోకి దిగటం చూశాడు. కొంచెం దూరంగా కనపడుతున్న కలువ పూవును కోసుకోవాలని ఆమెకు ఆసక్తి కలిగింది కాని ఆ లోతుకు వెళ్ళటానికి భయపడి ఆగి పోయింది. అతడామె దగ్గరగా వెళ్ళగా, ఆమె అతడి వైపుకు తిరిగి'' నాకా పువ్వు కోసి ఇస్తావా''? అని అడిగిందతణ్ణి పేలవమైన చిరు నవ్వుతో.

''తప్పకుండా కోసి ఇస్తాను కాని నాకేమైనా తినడానికి పెడతావా? నాకు చాలా ఆకలిగా ఉంది.''

''అలానా పాపం ఆపువ్వు నట్లా వదిలెయ్యి. నా కుటీరానికిరా. ఏమైనా ఉందేమో చూస్తాను నువు తినడానికి''.

ఆమె వెంబడే గుట్ట ఎక్కి ఆమెకుటీరానికి వెళ్ళాడు ప్రద్యుమ్నుడు. తలుపుతెరిచి 'లోపలికిరా' అని దయగా చెప్పిందామె.

ఆ చిన్న గుడిసెవంటి ఇంట్లో ఇక ఎవ్వరూ లేక పోవడం ప్రద్యుమ్నుడు గ్రహించాడు.

''నువ్విక్కడ ఒంటరిగానే ఉంటావా?'' అని అడిగాడతడు. ''లేదు ఒక సన్యాసి నన్నిక్క డకు తీసుకొని వచ్చాడు. అతడేం చేస్తూంటాడో నాకు తెలీదు. అప్పుడప్పుడు నన్నతడు ఇక్కడికి తీసుకొని వచ్చి విడిచి పెట్టి పోతుంటాడు. మళ్ళీ ఐదారు రోజుల వరకూ కాని రాడు.''

ఒక మట్టి పాత్రలో కొంచెం పలచని వండిన పప్పు పోసి ఇచ్చిందతడికి. ''ఇంతకు ముందెక్కడ ఉండే దానివి నువ్వు? మీ ఇలెక్కడున్నది.'' అని అడిగాడతడు.

ఆమె పెద్ద కొయ్య పళ్ళెంలో అన్నం వడ్డించే పనిలో నిమగ్నురాలైంది. తలెత్తి చూసి, చాలా విస్మయం కనపరిచింది. ''మా ఇల్లు! ఏమోనాకు తెలీదు. నాకు చెప్పింది ఏమిటంటే, విదిశకు పోయే మార్గంలో ఉన్న గుడిలో నేను స్పృహతప్పి పడి పోయి ఉన్నానుట. ఈ సన్యాసి నన్నక్కడ ఆస్థితిలో చూశాడు. అంతకు మించి నా పూర్వజీవితాన్ని గూర్చి నాకేమీ తెలియదు!''

ఆమె మనస్సు ఎక్కడెక్కడో విహరిస్తున్నట్లుగాఉంది.పరధ్యానంగా ఆమె సాయం కాలపు ఆకాశాన్ని చూస్తూ కూచుంది, ఏమిటో గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తున్న దానిలా. పూర్తిగా విస్మృతిలోకి వెళ్ళి పోయిన దానిని దేనినో గుర్తుకు తెచ్చుకొంటున్నది. ఇంతలో హఠాత్తుగా ఆమె కన్నీరు పెట్టుకుని ఏడ్చింది. పాలి పోయిన ఆమె చెక్కిళ్ళ నుంచి కన్నీళ్ళు జారిపోతున్నాయి.

ఆమె కళ్ళు తుడుచుకుంది. అన్నం పళ్లెం అందుకుని ప్రద్యుమ్నుడికి అందించింది దాన్ని.

''అయ్యో, ఇంతకన్నా నీకేమీ పెట్టలేకపోతున్నాను. నాకు చాలా విచారంగా ఉంది. కాని ఈ రాత్రికి ఇక్కడే ఉండిపో నువు. ఎండిన తామర గింజలతో నీకు తియ్యటి పదార్థం చేసి పెడతాను పొద్దున దాన్ని నువు తినవచ్చు.''

''ఒంటరిగా రాత్రి ఇక్కడ గడపటానికి నీకు భయంగా ఉందికదూ, లేదూ.''

''అవును. నాకు విపరీతమైన భయంవేస్తుంది. ఆ దట్టంగా బలసిన వెదురు పొదలలో ఏదో కదులుతున్నట్లవుతుంది. నాకు నిద్ర పట్టనే పట్టదు.''

ప్రద్యుమ్నుడు అంగీకరించి ఆ రాత్రికి అక్కడే ఉండిపోయినాడు అయితే ఆ రాత్రంతా చాలా పొద్దుపోయే దాకా ఆమెతో ఏదో మాట్లాడుతూనే ఉండిపోయినాడు. తానెవరో ఆమెకు రేఖామాత్రంగానైనా స్మృతి అంటూ లేదన్న విషయం అతడు గ్రహించ గలిగాడు.

పొద్దున్నే అతడామె దగ్గర శెలవు తీసుకున్నాడు. కాని ప్రతిరాత్రీవచ్చి, ఆ గుట్ట కిందనేపొంచి అతడు జాగ్రత్తగా కనిపెడుతూనే ఉన్నాడు. తక్కిన సంగతులన్నీ ఎట్లా ఉన్నా నిస్సహాయురాలైన ఆ తరుణ యువతి ఆ విధంగా, ఒంటరిగా ఆ కుటీరంలోబాధ పడ టానికి మనసు ఎదురు తిరిగింది. అప్పుడప్పుడు ఆమె ఒంటరిగా ఆ నీరవనిశిలో, నిస్తబ్ధ వాతా వరణంలో పాడుకోవడం విన్నాడు. ఆ పాటలతణ్ణిచకితుణ్ణిచేసేవి.

ఒక ఉదయం ఊరు బిల్వం గ్రామస్థుడొకడువచ్చి. తానెవరికోసం ఇంతకాలం వెతుకుతున్నాడో ఆ మనిషివచ్చి, ఊరి బయట గుట్టకింది కుంటలో స్నానంచేస్తూ ఉండడం తానిప్పుడే చూసివస్తున్నానని ప్రద్యుమ్నుడికి చెప్పాడు. ప్రద్యుమ్నుడు పరిగెత్తివెళ్ళాడు. ఆ వ్యక్తిని చూశాడు. అవును. ఆ వ్యక్తి కాపాలికుడే.

గుణాఢ్యుడు విశ్రాంతిచెందాడు. తాను మళ్ళీ ప్రద్యుమ్నుణ్ణి చూస్తానని అతడెప్పుడూ అనుకోలేదు. ఆశించలేదు.

''ఇక్కడికెట్లావచ్చావు''? అని అడిగాడు.

''నేనెందుకిక్కడకు వచ్చానో నీకు తెలియదా?''

''సరిసరి నా కోసం నువ్వెందుకు తిరుగుతున్నావో నాకు తెలియకపోలేదు. నీ నుంచి ఇప్పుడిక నేను ఏమి దాచిపెట్టదలచుకోలేదు. నీకు తెలీదు ప్రద్యుమ్నా నేనెంతగా పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నానో. నేను చేసిన దుర్మార్గానికిను ఎంతగానో పరితపిస్తున్నాను. ఇప్పుడు నా జీవితమంతా దుర్భరమైన క్షణక్షణ యాతన అనుభవిస్తున్నాననుకో. కాని అసలేం జరిగిందో నన్ను చెప్పనీ, నేను ఒక సన్యాసి దగ్గరకొన్ని మంత్ర తంత్రాలు నేర్చుకున్నాను. వాటి వల్ల నేను ఎవరినైనా బంధించి నా వశంలో ఉంచుకోగలను. కాని ఈ మంత్ర తంత్రాల ద్వారా నేనెవరినీ ఆకర్షించలేను. అందువల్ల నేను నీ సహాయాన్ని కోరవలసి వచ్చింది. నీ వేణుగాన సమ్మోహితురాలై దేవి ప్రత్యక్షమైనప్పుడు నే నామెను బంధించ గలిగాను. నేనేంచేస్తున్నానో నాకే తెలియకుండా పోయిందప్పుడు. ఇంచుమించుగా నాకు పిచ్చిపట్టింది. అంతేకాకుండా ఇంకొకటికూడా ఉంది. ఆ మంత్రతంత్రాల ప్రభావం పరీక్షించి చూడాలన్న ఉబలాటంకూడా నాకుండేది. యథార్థం చెవుతున్నాను నీకు. ఆ మంత్రతంత్రాలు దేవతలమీద కూడా పనిచేస్తాయన్న నమ్మకం నా కుండేదికాదు.''

''అయితే ఇప్పుడేంచేస్తానంటావు'' అని అడిగాడు ప్రద్యుమ్నుడు.

''నేను చేసిన పాప కృత్యానికి విరుగుడుకోసం చూస్తున్నాను. నేనిప్పుడు ఆ సన్యాసి దగ్గరనుంచే వస్తున్నాను. ఆయనింకేవో కొన్ని కొత్త మంత్రాలు నాకు నేర్పాడు, ఇదివరకు నేను ప్రయోగించిన మంత్రతంత్రాలకు ఉపసంహారకంగా అవి పనిచేస్తాయని. ఇప్పుడుపదేశించిన మంత్రాల ద్వారా కొంత నీరు తీసుకొని అభిమంత్రించి దేవతపై చల్లితే, ఆమెను బంధం తొలగిపోతుంది అయితే ఒక విషమ సమస్య ఉన్నది. ఈ విధంగా చేయ గలగడమంటూ సంభవమో, కాదో నాకే మాత్రం అర్థంకావడంలేదు.

''ఎందువల్ల?'' అని చాలా ఉత్కంఠతో అడిగాడు ప్రద్యుమ్నుడు.

''ఎవరైతే ఆమె మీద ఆ నీరు చల్లుతారో వాళ్ళు శిల అయిపోతారు. కోపం తెచ్చుకోవద్దు ప్రద్యుమ్నా. నాస్థితిని అర్థం చేసుకో. నేను రెండందాలా చెడ్డాను. అంచేత నాయీ శేషజీవితాన్ని, ఆమె బంధ విముక్తురాలవుతుందో కాదో నాకెందుకు? ఆ విషయం పట్టించుకోకుండానే కాలక్షేపంచేస్తాను. నేనుకృతకృత్యుణ్ణి అవుతానో లేదో ఎవరుచూసొచ్చారు? చచ్చిపోయి వేరే ఇంకోజన్మకు ఎదురుచూసేకాలమిది నాకు. శిలఅయిపోతాననుకో. ఇకనాకు మిగిలేదేముంది. శాశ్వతంగా అంతా పోగొట్టుకుంటాను.''

ఒంటరిగా ఆకుటీరంలో ఆతరుణయువతి విచారవదనంపాలిపోయి కనిపించింది

ప్రద్యుమ్నుడికితనమనసులో. ఒక్కక్షణకూడా తటపటాయించకుండా, అతడన్నాడు, ''ఆపని నేను చేస్తాను. ''

''బాగా ఆలోచించుకో'' అన్నాడు గుణాఢ్యుడు ఎంతో ఆశ్చర్యపడుతూ. ''ఇదే మీపరిహాసంకాదు".

''ఆ మంత్రజలమిట్లా ఇవ్వు'' అన్నాడు ప్రద్యుమ్నుడు ఎంతో దృఢంగా.

కాపాలికుడి వెన్నంటి ఆగుట్టమీద కుటీరానికి చేరుకున్నాడు ప్రద్యుమ్నుడు.

''నిన్ను వేడుకుంటున్నాను మరీమరీ. మళ్ళీబాగా అలోచించుకో ఇంకోసారి. ఏదో జరిగి ఎవరోదయ తలచి నిన్నురక్షిస్తారని అడియాసలేమీపెట్టుకోవద్దు. నిన్నెవరూరక్షించలేరు. ఇకశాశ్వతంగానువు జీవితానికి దూరమైపోతావు. ఆదేవతకూడా రక్షించాలనుకున్నానిన్నే మాత్రమూ రక్షించలేదు. ఆమంత్రాలు తిరుగులేనివి. జరగితీరాల్సిందే. వాటి ప్రభావం అటువంటిది. దేవతలుకూడా కట్టుబడి ఉండవలసిందే. ఈ విషయంలో వాళ్ళుకూడా ఏమీకల్పించుకోలేరు చేయలేరు. వాటినిదాటలేరు.''

''నీకా చింత ఎంతమాత్రమూ అక్కర్లేదు వెళ్దాంపద. దయచేసిత్వరగాపోదాంపద.''

ఆగుట్టపైన ఆయువతి బయట ఒంటరిగా కూచునిఉండటం వాళ్ళకు కన్పించింది. ప్రద్యుమ్నుడిని చూడటం ఆమెకు సంతోషం కలిగించినట్లైంది.

''నీవు వెళ్ళిన దగ్గరనుంచీ నీగూర్చే నేను ఆలోచిస్తున్నాను. నువ్వు మళ్ళీవస్తానన్నావుకదూ. ''

లోపలికివెళ్ళి అతడికేదో తినటానికి తేవడానికి ఆమె వెళ్ళింది. గుణాఢ్యుడప్పుడు మళ్ళీ అడిగాడు.

''బాగా ఆలోచించే చెపుతున్నావా ? నిశ్చయమేనా ?''

"ఇకనాతో ఊరక చర్చపెంచవద్దు. ఆ జలం ఇట్లాఇవ్వు.'' ప్రద్యుమ్నుడికోసం ఆమెఏవోతీపివస్తువులు తెచ్చింది పళ్ళెంలో. కొంచెంసేపైన తర్వాత ఒక కూజాతీసుకొని నీళ్లుముంచుకొని రావడానికామె కిందికి దిగి వెళ్ళింది.

''ఇదుగో ఈ కమండలంతీసుకో. అందులో ఆ నీరున్నది " అని అందించాడు గుణాఢ్యుడు. "ముందునన్నిక్కడనుంచి వెళ్ళిపోనీ. దేవతతిరిగి వచ్చిన తర్వాత, ఈనీళ్లఆమె మీదచల్లు. ''

తన వస్తువులన్నీ చంకనపెట్టుకొని అతడుగుట్టదిగిపోయినాడు. ప్రద్యుమ్నుడు ఒంటరిగా అక్కడే కూర్చిండి పోయినాడు.

అతడికింతలో హృదయంనిండా మమతతోకూడిన తలపులేవేవోసందడించాయి. సాయంకాలపు ఆకాశంకేసి చూస్తూ, కాశీలో తమ ఇంట్లో అమ్మతనకోసం ఎదురుచూస్తూ ఉండటం గుర్తుచేసుకున్నాడు. ఇంతలో సునంద జ్ఞాపకం వచ్చింది. ఆమెకూడా ఇప్పుడీ సమయంలో తనని గురించే అనుకుంటూ ఉందేమో ? ఇంటిమీద ఇదివరకెప్పుడు తనకింత మరులు పుట్టలేదు. గొంతులో ఏదోఅడ్డుపడినట్లైంది. కళ్లతడిసి పోయినయ్.

ఆదేవత చిన్నగా గుట్టపైకి ఎక్కివస్తున్నది. మనసులోని ఊగిసలాటనంతా బల వంతాన నెట్టిపారేశాడు. ఆమె తనను సమీపిస్తున్న సమయంలో చప్పునలేచి ఆమె దగ్గరగా వెళ్ళాడతడు. వంగి ఆమెపాదాలుతాకాడు. అన్నాడు

''నేను మహాపరాధమేచేశాను. కాని అప్పుడు నేనేంచేస్తున్నానో నాకేమీ తెలిసింది కాదు. ఏమైతేనేం నాపాపానికి నిష్కృతిని పొందుతున్నాను''.

ఆమె ఏమీఅర్థంకానిదానిలా వెర్రిగా చూసిందతడివైపు, ''నిజంగా నీవెక్కడనుంచి వచ్చావో నీకేమీ గుర్తులేదా'' అని అడిగాడు ప్రద్యుమ్నుడు.

''ఎందుకులేదు. విదిశపోయే మార్గంలో......'' గుణాఢ్యుడిచ్చిన కమండలువును ప్రద్యుమ్నుడు తీసుకున్నాడు. ఆమెపైన కొంచెంనీరు చిలకరించాడు.

ఒక్కసారిగా ఆమెకు మెలుకువవచ్చినట్లైంది ఉలికిపాటుతో.ఇంకాస్త నీరుచిలకరిం చాడు ప్రద్యుమ్నుడు. ఒక్కక్షణంసేపు అతిలోకమహా సౌందర్యపు వెలుగు తనకంటిముందు మెరవడం అతడికి అత్యంత విభ్రమానందంకలగజేసింది. అనిర్వచనీయమైన ఆనందంతో తబ్బి బ్బుచెందాడు ఆక్షణం. అంతటితో అతడి కళ్ళుమూసుకొని పోయినవి. చివరసారితళుక్కున మెరిసినట్లుగా తనచైతన్యంలో ప్రేమమూర్తిఅయిన తన తల్లిముఖం,కాశీలోని తమ ఇంట్లో కిటికీ లోంచి తనకోసం ఆత్రుతతో చూస్తూ ఉండటం పొడగట్టింది.

మహాకోటివిహారంలోని ఆచార్యులవారైన ఆచార్య శీలవ్రతులవగ్గర, ఒక తరుణ వయస్కురాలైన బాలిక, బుద్ధదేవుని ఉపదేశాల మేరకు పరివ్రాజక దీక్షను స్వీకరించింది.

ఆ అమ్మాయిపేరు సునంద. హిరణ్యనగరంలోని వర్తకశ్రేష్ఠుడైన శ్యామంతదాసు గారాబు కూతురాపిల్ల. పెళ్ళిచేసుకోవడానికామె నిరాకరించింది అంతచిన్నవయస్సులో ఆమెసర్వసంగ పరిత్యాగంచేసిన దీక్షస్వీకరించడం, విహారంలోని వారందరికీ ఎంతో గౌరవపాత్రమైంది. ఆమె అందరికీ ప్రేమపాత్రురాలైంది. అయితేఏం, ఆమెఎప్పుడూ చాలావిచారంగా, దూర దూరంగా ఉంటూ ఉంటుంది.

వెన్నెల రాత్రులు విహారపుమేడపైన నిలబడి దూరదూరతీరాలకాప్రశాంతని శీథంలో అమెప్రతీక్షిస్తూగడుపుతుంది, అతడు తప్పక తిరిగివస్తాడని ఆమెకెవరో చెప్పారు. చెప్పలేదా?

ప్రతిఉదయమూ, ఆరోజు అతడు తప్పకతిరిగివస్తాడనుకొంటుందిఆమె. పగలంతా గడచిపోతూ ఉండగా, సాయంకాలంచల్లబడగానే అతడు వస్తాడని ఆమెచూస్తుంది. చీకట్లుముసురుకుని రాత్రి అవుతుంది. అయినా ఒంటరిగా ఆమె మేడపైన నిలబడి అతడికోసం నిరీక్షిస్తూనేవుంటుంది. ఆకులుచిరుసవ్వడిచేసినా ఆమెఉలికిపడిపోతుంది. అడుగుల చప్పుడు ఏమైనా వినపడుతుం దేమో నని ప్రాణాలుగ్గబట్టిచూస్తుంది. తానెంతగానో ప్రేమించిన యువకుడు, తిరిగివస్తానని పలికి వెళ్ళినవాడు. అతడికోసం.

రాత్రిబాగా పొద్దుపోయి, ఎప్పుడో ఆమెనిద్రగూరితే ఆమెకువింత అయిన కల వస్తుంది ఎక్కడోఒకప్రదేశంలో, ఒకకొండపైన ఒకశిలావిగ్రహంఉంది. అయితే ఆ ప్రతిమ మొహంమాత్రం ఆమెకు స్పష్టంగా కనిపించదు. గుబురుగా ఎత్తుగారెల్లుగడ్డి,వెదురు మొక్కలు పెరిగి, ఆమొహాన్ని ఆచ్ఛాదిస్తున్నాయి. విసురుగా వీచేగాలి ఆ వెదురు కొమ్మల్లోకి రెల్లుచువ్వ ల్లోకిపోయి, ఏదోసంగీతాన్ని సృష్టిస్తూ ఉంటుంది. ఆ శబ్దం గాఢమైన మేఘమల్లార్ రాగాలా పనను సృష్టిస్తున్నది.

తెల్లవారగానే, ఆ కలకరిగి మాయమై పోతుంది. ఆమెమేల్కొన్న తర్వాత ఆవిష యమంతా ఎంతోమిథ్యగానూ, చాలా గుహ్యంగానూ, ఆమె కనిపస్తుంది. పగటి వెలుగులో, ఆ విషయాన్ని ఆమెతాను వివరించలేననుకుంటుంది. కాని ప్రతీక్షించాలి, తప్పదు, అను కుంటుందామె.

### కాజీనజ్రుల్ ఇస్లాం

#### నిర్విరామ చక్రభ్రమణ పరివర్తనంలో.

అనంతత్వం వణకిపోతున్నది (ఇది ఒకవింతా !)
నిర్విరామంగా పరిభ్రమించే చక్రపరివర్తనలో
గతం మృతం
దాని దేహం ఆంధ్యం
గతం మృతం
దానిపాదాలుక్షతజాలు.
అనంతత్వం సొమ్మసిలిపోయింది (ఇదేమీ వింతకాదు)
నిర్విరామంగా పరివర్తించే చక్రపరిభ్రమణంలో
పాత అంతాతుడిచి పెట్టుకొని పోతుంది
చైత్రం ఒక్కుమ్మడి దూసుకొని ప్రవేశించడంతో
ఓ నవతా ! ధైర్యమూను
ఓ శక్తీ రా
మృతం గతం

నేల కూలింది
రా ఓ అతిధీ
రా ఇప్పుడు
నవజీవనం వైశాఖ పునర్నవాన్ని ముందుగా సూచిస్తోంది
నిర్విరామ పరివర్తనచక్రపరిభ్రమణంలో
నిర్విరామ చక్రపరి భ్రమణం
నిర్విరామ చక్రపు
వక్రపథరేఖ చూడు
దిక్చక్రంపై ఒరిపిడి గీత
రథం పరిభ్రమిస్తున్నది
దాని ఘూర్ణమాన చక్రాలు
దిగ్భ్రాంతి నొందిస్తున్నవి
సమస్త సృష్టిని
శతసహస్ర సంఖ్యాతీతంగా సూర్యులు చంద్రుల విన్యాసం
నిర్విరామ పరివర్తన చక్రపరిభ్రమణంలో
నిర్విరామ పరివర్తన భ్రమణ చక్రాలు
తారకలు, గ్రహాలు ఆకాశంలో పరిభ్రమిస్తున్నాయి
దాని అంకంలో 'రేపు', ఊగుతూ 'నేడు'
తెల్లవారుతున్నది
ఎవరిని స్వాగతిస్తూ?
దూర శిఖరాలు
వీక్షిస్తూన్నాయి.
ఎవరి విజయధ్వజం
కింశుకాలపై మృదువికసన ప్రసరణం.
శకటం వంపులు తిరుగుతున్నది
చక్రాలు పథగములు
సిందూర మార్గాలనేర్పరుస్తున్నవి
ఎవరి విజయోత్సవ
తోరణం, ఎర్రగా వెలుగుతోంది
ఉజ్జ్వలోదయం వర్ధమానమవుతున్నది
నిర్విరామ పరివర్తన చక్రపరిభ్రమణంలో
నిర్విరామ పరివర్తనచక్రాలు

తుపాను, వరద
హోరు, మూలుగు
రా, సుదృఢ వర్తమానం?
యువతా రా !
రా నవతా?
పురిటి నొప్పులు
స్ఫురించడంద్వారా

## రా ! భయమెందుకు ?

రా ! భయమెందుకు ?
తల్లి ఆదుకొనే చేతులెత్తి పిలుస్తోంది
హరివిల్లు వలయాల రేఖలనుంచి
నిర్విరామ పరిభ్రమణ చక్రపరివర్తనంలో
నిర్విరామ పరివర్తన చక్రాలు
భూత వర్ష కళేబరాన్ని
భుజాలమీద మోసుకుంటూ
లయాత్మకమైన పదగమనంతో
కాలం నేడు కదులుతోంది
చక్రధారి ఏడీ అతడు
ఈ శవాన్ని శకల శకలాలుచేసేందుకు!
నిర్వీర్యుడు శివుడిప్పుడు
దాని గాటపు లాలనలలో
ఓ దాని మృత పరిష్వంగాలను భేదించు
నిర్విరామ పరివర్తన చక్రాలలో
నిర్విరామ పరివర్తన చక్రాలు

## జీవనానందదాస్

### వనలతా సేన్

సహస్ర వర్షాలుగా భూతలమంతా భ్రమ్మరుతున్నాను
శ్రీలంక సముద్రంనుంచి మలే తిమిర సముద్రంవరకూ

ఎంతగానో తిరుగులాడాను, బింబిసారుని. అశోకుని ధూసర క్షేత్రాలలో
అక్కడకు నేను వెళ్ళి ఉన్నాను, సుదూరపు అంధ్యపు విదర్భకు
ఈ జీవితంపట్ల విసిగి వేసారాను, ఈ పొంగుతున్న జీవిత సముద్రంపట్ల
క్షణకాలం వనలతా సేన్‌తో నాకు ప్రశాంతి లభించింది
సుదూరపు విదిశానగరపు చీకట్లవలే ఆమె కురులు నల్లనివి
శ్రావస్తి శిల్పశోభాన్విత మామె వదనము
చుక్కానిలేని చోదకుడు ఊగిసలాడి దూర సముద్రంలో మునిగిపోయినట్లు
జాపత్రి మొక్కల దీవులు, దానికింది పచ్చని శాద్వలంచూసి
ఆమెను అంధకారంలో చూశాను, నన్నడిగింది

ఎక్కడికి వెళ్ళావు? అని
ఇంత సుదూరపథంలో? విహగకులాలయాల నేత్ర
పక్ష్మాంచలాలుఎత్తి వనలతాసేన్ నన్ను అడిగింది.
దివసాంత సాయంసమయం తుషారం మృదువుగా పడుతున్నధ్వనితో

'పతంగి' తన రెక్కలు విదిల్చి సూర్యుని ఆఘ్రాణించినప్పుడు
ఇలాతల వర్ణాలు క్షీణప్రభమైనప్పుడు
మిణుగురులు కాంతుల అంతస్తుల రమ్యమైన
చాందినీ కట్టినప్పుడు

పక్షులు తమగూళ్ళకు చేరుకుంటాయి-నదులన్నీ ఇంటి ముఖంపడతాయి
జీవితపు చిత్తా మూసుకొంటుంది

అంధకారం మాత్రమే మిగులుతుంది, అప్పుడిక
వనలతా సేన్ వైపుకు వెళ్ళవలసిన సమయమది.

**బుద్ధదేవబోస్**

## మాండూక్యం

వానలు, వానలు, కురిశాయి,
కప్పలుపొంగిపోయినాయి
బృందగానం చేస్తున్నాయి, ఎలుగెత్తి ఉల్లాసంగా
ప్రాక్తనకాలపు పరమానందంతో
ఇవాళ భీతి చెందవలసినదేమీ లేదు
క్షుత్తుగాని మృత్యువుగాని

విధిచేతిలో నిర్లక్ష్యంగా విసరే రాళ్ళుగాని లేవు
పచ్చికలు దట్టంగా పరచుకున్నాయి మబ్బులవలె
పొలాల్లో నిర్మలమైన జలం నిలచి ఉంది
పని, పాటు లేకుండా పగటి వేళలు
స్వాతిశయ సంగీతంతో గడిచిపోయినాయి
ఇంద్రియ వర్షాసేచనంలో పారవశ్యపు స్పర్శ ఉంది
అడుసు ఎంత మనోహరం, ఎంత తారుణ్యం, ఎంత మృదువు!
వాటికి గొంతుల్లేవు, కంఠాలు పూర్తిగా ఉబ్బరించినా
గీతపు సప్తస్వరావిష్కారములవి
ఎంత నిగనిగలాడే శరీరాలు – మబ్బులవలె హారిద్రాలు, హరితాలు
కళ్ళు పైకెత్తి పారదర్శకద్యుతితో
యోగీశ్వరుని నిశ్చలమైన గంభీర దృష్టిలా
గాఢధ్యానంతో, భగవంతుని సాక్షాత్కారంకోసం
వాన నిలిచిపోయింది, నీడలు కదలాడాయి
ఋక్కుల మాదిరిగా స్వరాన్ని పెంచాయి, గంభీరపు శాంత ఆకాశంలో
రోజుసాగి ముగియగానే, గాఢనిస్వనం భంగమైంది.
అంధకారం అంతటా ఆవరించింది బలవంతాన
మూలుగుతూ కనురెప్పలమీద నిద్రముద్రిస్తూ
అర్థరాత్రి అది, తలుపులన్నీ మూసి సుఖంగా శయనించాము
ఆ నిశ్చల ప్రశాంతతను అవిరామంగా ఒక గొంతు భంగ పరుస్తోంది
 పరమయోగి స రహస్యక ధ్యానజప చరమశ్లోకం
ఒంటరిగా మిగిలిపోయిన చివరి కప్ప గోండ్రు గోండ్రు గోండ్రు

**అమియ చక్రవర్తి**

## కలకత్తా

పెద్ద పెద్ద ఆకుల చెట్లక్రింద
 వెచ్చని చందమామ ఆనందం పరచుకొంటున్నది
 తోట దడికిదూరంగా
 ఇనుపగేటు మీద
 కులాసాగాలికి పూలతీగె తలూపుతున్నది

నా కళ్ళలో ఈ సుందర దృశ్యం కదులుతూనే ఉన్నది
ఆ సందు చివరిదాకా నడిచేదాకా
పియానో స్వరాలు, గాలిజోలి పట్టించుకోకుండా
వసంతాకాశాన్ని బాధతో నింపుతున్నాయి
దక్షిణ కలకత్తాలోని ఒక సందులో
మళ్ళీఎప్పుడైనా భూమిమీదికి తిరిగివస్తే
మళ్ళీ ఈ సందుగుండానే ఇంకోసారి నేను నడుస్తాను
తళతళలాడే సూర్యకాంతిలో ఆ ద్వారాన్ని చూస్తాను.
దానిపక్కనే పాటలకుసుమలతను
గుత్తులు గుత్తులుగా ఉన్న పూలను, పసుపురంగుపూలు,
అచ్చస్వచ్ఛమైన నీలాలు.
దట్టంగా పరచినపచ్చగడ్డి కంబళీ నాకన్నులకు విశ్రాంతినిస్తాయి
ఎవరిల్లో అది, ఎవరుంటారో అక్కడ,
ఇవిమాత్రం నేనెరుగను-
కాని ఒంటరి పాంథుని విహ్వల పరచే మధుమాన వ్యథా హృదయం
పియానో స్వరాలు వణికించే ఆ నిశ్చల ప్రశాంతత
ఒక్క క్షణకాలం నాకళ్ళను ఆనందంతో నింపుతుంది

విష్ణుడె

## ప్రేమ

నా కళ్ళనుంచి నీ దృష్టి మళ్ళించు, మళ్ళించు
జ్వాలలను మేఘాలతో ఆచ్ఛాదించు
నీ కళ్ళలోని అయస్కాంతం
హోరుమనే సంగీతాన్ని మేల్కొల్పుతాయి
నీ తారకా నయనాలు
గ్రహగోళపు కక్ష్యా నృత్యాన్ని
నాలో మేల్కొల్పుతున్నాయి
నీ కనుల పిలుపుతోనే
నా జీవితం గంతులు వేస్తుంది
మళ్ళించు మళ్ళించు నీ దృష్టిని

ఇలా తలపురధ్య ఇంతటితో ఆగిపోయింది,
హఠాత్తుగా, ఒక్క సారిగా
ప్రపంచపు సరిహద్దులు
అతి చిట్టచివరి అంచున,
చీకటి గట్టుమీద
శూన్యాకాశపు జారిపోయే శిఖరతలంపై
ఆగిపోయాను, నా వూన్కి పట్టుసడలింది.
నా మస్తిష్కంలో నిష్ప్రయోజనమైన మృత్యువాసన
నీ వదనాన్ని ఆచ్ఛాదిస్తున్నది
మళ్ళించు మళ్ళించు నీ దృష్టిని
నీ పిలుపు విని
పక్షిలా ఉరుకుతాను
అంతులేని తరంగాలలో నిరంతర అధోముఖంగా
తెలియని చీకట్లో మునిగిపోతూ?
నా అవితథత్వం ఎక్కడ, నా నిలిచే ఆధారం ఎక్కడ?
నీ కళ్ళలోని ఆ తారకను తొలగించు తొలగించు
మంటలను కప్పివేయి
నీలమేఘాల్లో వాటిని మూసిఉంచు.

## సుధీంద్రనాథదత్తా

### నీ నామం

ఇప్పుడిక నీవు వెళ్ళిపోయావు
ఈ నాటికికూడా ఈ ఆర్తి పెరుగుతూఉంది
ఇవాల్టికికూడా నేనంటున్నాను, ఆ మాటలు వినపడుతున్నాయి
వినిపించుకోవడం లేదు,
ఇప్పుడు నీవు వెళ్ళిపోయినావు.
నా వర్తమానం
భరించలేని వ్యథ,
నా భవిష్యత్తు శూన్యం
క్షణ క్షణం నెమ్మదిగా సమీపించే మరణమైనా

నీ ఆకర్షణకన్నా చాలా నయం, దూరగుడవు, అపరిమేయుడవు, లింగరహితుడవు,
ఈ పరిభ్రమణ వలయంలో నన్ను బంధించావు.
మరుగై పోతున్న ప్రతిబింబం
నాకంటి శక్తినిమించి బాధిస్తున్నది.
నిజం, నా వ్యథా స్వాప్నిక క్షేత్రంలో
అన్నీ భయంకరమైనవే, నీ వొక్కడవే, నిలుస్తావు.
అయినప్పటికీ నా మనస్సు
భ్రాంతిని నిరాకరిస్తున్నది
బింబ ప్రతిబింబ భావం నా ఎరిగినదే
కాని వినిమయం కుదుర్చుకోలేకపోతున్నాను
నీవు వంచుకోలేవు
నా ప్రాపంచిక వ్యధా భరిత నిరాశను
ఈ బరువేనాడో నన్ను పిండిచేసి
అనంతశూన్యంలో అది పేలిపోతుంది.
వ్యర్థమే నాకు తెలును, అ సాయంతనం అడవిలో
నన్ను హఠాత్తుగా తేరిపార చూసినప్పుడు
నా కన్నుల్లో అశ్రువులు
నీ కన్నులను వెలగించేందుకు
అహం అహం, అని నన్ను నేను మోసగించుకున్నాను
నా మార్గంలో
ప్రేమ నర్పించి నీ హృదయానికి చేరువ
కాలేకపోయాను కాని నా మనస్సులో
అబద్ధాల కుప్పలు పేర్చుకున్నాను
ఈ ప్రేరణ, నిగ్రహంలేమితోకూడి
ఎందరికో తాపాన్ని కలిగించింది
బంగారు యాపిల్‌ను సులభంగాచేజిక్కించుకొనే
దురాశతో,
ప్రతిషేధాన్ని లక్ష్యించకుండా
చివరికీ చెట్టును చరమగమ్యమైన
నీ పాదాలముందుకు చేర్చాను
అయినాగాలి తాకిడికి పాద ముద్రలు చెరిగిపోతున్నవి
ఈ ధూళి పరిన్యస్త మార్గంలో

ఈ అవసరంకూడా ఇంకాకొన్నాళ్ళకు ఉండనే ఉండదు.
ఇప్పుడు నీవు నాకు అగత్యం.
నా అవసరం అత్యంతమైనదిప్పుడు.
ఈ విషాద పరిభ్రమణ కక్ష్యలో ఇవాళ
నాయీ కోరుతున్న ఆసరా పరిహసిస్తున్నది
అంతులేని ఈ వ్యధఅంతా
నీపేరు స్మరించగానే తుడిచి పెట్టుకొని పోతుంది.
నీనామం-కేవలం నీనామం-ముమ్మాటికీ నీనామం.

—o0o—

# మరాఠీ

*మూలం :*
డా॥ డి. వి. పట్వర్థన్

*అనువాదం :*
శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి

## చారిత్రక సమీక్ష

మరాఠీ సాహిత్య చరిత్ర సుదీర్ఘమైన పది శతాబ్దాల చరిత్ర. మరాఠీ సాహిత్య పరంపర పదవ శతాబ్దినించీ గణించవచ్చును. మరాఠీ భాష అంతకంటే పురాతన మయినది. మరాఠీ సంస్కృతభాషాజన్యం. కాని సంస్కృతంనుంచి నేరుగా పుట్టిన భాషకాదు మరాఠీ. పాళీ, మహారాష్ట్రి, మహారాష్ట్రి–అపభ్రంశ భాషలద్వారా సంస్కృతానికీ, మరాఠీకీ, సంబంధమేర్పడింది. మహారాష్ట్రి - అపభ్రంశభాషలోఉన్న రచనలు, - ఏడు ఎనిమిదో శతాబ్దాల నాటివి - ఎన్నిటినో ఇటీవలి పరిశోధనలు వెలుగులోకి తెచ్చాయి. కనుక, ఒక జీవద్భాషలో, సహజంగా, అనివార్యంగా కలిగే మార్పులవల్ల, పరిణామాల ప్రభావం మూలంగా, మరాఠీభాష జనించిందని చెప్పవచ్చును.

*మరాఠీ సాహిత్యా ఆవిర్భావము – వికాసము*

మరాఠీభాషలో సాహిత్యసృష్టికీ, వికాసానికీ, రెండు ముఖ్య సంఘటనలు దోహదం చేశాయన్న విషయం సుప్రసిద్ధం. మొదటిది, యాదవ వంశం ప్రాముఖ్యంలోకి వచ్చి, దేవగిరి ముఖ్యపట్టణంగా, చాలాకాలం సుస్థిర రాజ్యపాలన చెయ్యడం. యాదవ వంశం, మరాఠీ తమ రాజభాషగా స్వీకరించి, ఆ భాషలో వైదుష్యాన్ని, విద్వాంసుల్నీ, ప్రోత్సహించింది. రెండవది. మహానుభావ పంథా, వార్కరీపంథా అన్న రెండు మతప్రధానమైన తెగలు, ప్రాముఖ్యంలోకి రావడం. ఈ రెండు తెగలూ కూడా, తమభక్తిమార్గ ప్రబోధనలు, తమ ఉద్దేశాలూ, ప్రజలలో వ్యాపింపచెయ్యడానికి, మరాఠీభాషని, తగిన సాధనంగా ఎన్నుకున్నాయి. దీనివల్ల మరాఠీ వాఙ్మయ వికాసానికి చాలా ప్రోత్సాహం కలిగింది. మహానుభావ పంథా రచయితలు, మరాఠీ గద్యంలో చాలా ముఖ్యమైన రచనలు చేశారు. వార్కరీ భక్త కవులు, కవిత్వంలో, తమ రచనలు, సాగించారు. పద్ధెనిమిదో శతాబ్దం చివరిదాకా సాగిన మరాఠీ రచనా వికాసానికి, సాహిత్యాభివృద్ధికి, మూలపురుషులు, మార్గదర్శకులు వార్కరీ పంథారచయితలేనని ప్రసిద్ధిచెందారు.

*రెండుయుగాలుగా మరాఠీసాహిత్య విభజన :* మరాఠీసాహిత్యం, మహారాష్ట్రదేశపు నడిబొడ్డున, క్రీస్తుశకం పదోశతాబ్ద ప్రాంతమున తలయెత్తింది. వాడుక భాషగా, మరాఠీ అంతకిపూర్వమే, ఒకటి రెండు శతాబ్దాల క్రితమే వ్యవహారంలోకి వచ్చి ఉండాలి. పదో శతాబ్దంనాటి పిల్లకాలవ, కాలం గడిచినకొద్దీ విస్తృతమై, ఒక మహానదిగా

పరిణమించింది. మరాఠీభాష మాటలాడే వ్యక్తులగుణాలు, స్వభావాలు, ఊహలు, ఉద్దేశాలు, ఆశలు, ఆశయాలు, ప్రతిబింబింపచేస్తూ, ఈ సాహిత్య ప్రవాహంసాగింది. ఇంగ్లీషు వాఙ్మయానికి లాగే, మరాఠీ సాహిత్యానికి కూడా సుదీర్ఘమైన చరిత్రఉన్న విషయం, నిర్వివాదంగా తెలుస్తూఉంది. కాలంగడిచినకొద్దీ, పరిస్థితుల మార్పువలన, మరాఠీ సాహిత్యపుస్వభావం, ఆంతర్యం, మారింది. పాతరూపాల బదులు కొత్తసారస్వతప్రక్రియలు, తలయెత్తాయి. కాని ఈ దీర్ఘచరిత్రలో ఎక్కడా పరంపరా విచ్ఛిత్తిలేదు. సూత్రం తెగిపోలేదు.

మరాఠీ సాహిత్య చరిత్రని రెండు యుగాలుగా విభజించవచ్చును.

*మొదటి యుగం* : క్రీ.శ. 1000 నుంచి 1800 వరకూ. ఈ యుగ సారస్వతం, ప్రాచీన లేదా పురాతన మరాఠీ సారస్వతం. *రెండవ యుగం.* క్రీ. శ. 1800 సం॥ లో ప్రారంభమై, ఇంకా సాగుతూ ఉంది. దీనికి ఆధునిక మరాఠీసారస్వత లేదా సాహిత్య యుగమని నామకరణం చెయ్యవచ్చును.

ప్రాచీన మరాఠీ సాహిత్యపు విశిష్టరూపరేఖ లేమిటో మనమిప్పుడు పరిశీలిద్దాము.

***ప్రాచీన, ఆధునిక మరాఠీ సాహిత్యాల విశిష్ట స్వరూపాలు:*** ప్రాచీన మరాఠీ సాహిత్యం, మొత్తముమీద అంతా పద్యకవిత్వ విభాగమే. కొన్ని ఛందోరీతులలోనే ఈ కవితా రచనలు సాగడంవల్ల, మాటల, లయల ఎన్నికలలో, రచయితల స్వేచ్ఛ సంకుచిత మయింది. ఈ రచనలు, ప్రధానంగా భక్తి ప్రబోధకాలు. కథాకథనరూపంలో, వివరణ రూపంలో, మాత్రమే ఉండేవి. అధికకుతూహలం రేకెత్తించగల నాటకం; నవల, కథ, వ్యాసం మొదలయిన సాహిత్య రూపాలు, ప్రాచీన రచయితలకి, కొంచెం ఇంచుమించు తెలియదనే చెప్పవచ్చును. పురాతన కవులకి మానవ స్వభావం మీద ఎక్కువ సదభిప్రాయం లేదు. మానవ స్వభావంలో, చెడుగులనేవారు చూసేవారు. మానవజీవితంవల్ల ప్రయోజనం, లాభం లేవన్న దృష్టికోణమే, వారి రచనలలో, ప్రతిబింబించేది. దీనివల్లవారి కవిత్వం ప్రాపంచిక దృష్ట్యా పరిశీలిస్తే, నిరాశావాదభరితమైన రచనలుగా కనిపిస్తాయి. వారికి హాస్య దృష్టిలేనేలేదు. నవ్వును తప్పుగా యెంచేవారు. నిరుత్సాహ పరిచేవారు. వారికవిత్వం ఎప్పుడూ అతి గంభీరంగా, నిరాశాజనకంగా ఉండేది. ఇదికాక, ప్రాచీన కవులు, తమ స్వంత అనుభవాలు — బాహ్య అనుభవాలుగాని, అంతర అనుభవాలుగాని - తమరచనలలో ఏ విధం గానూ ప్రతిబింబింపచేసే వారుకారు. పైగా వారి రచనలలో చర్విత చర్వణ ముండేది. అందరు కవులూ, తమరచనలకి రామాయణ మహాభారతాలనుంచే కథావస్తువులను అభిప్రాయాలను స్వీకరించడమే, దీనికి ప్రధానకారణము. వారికి జీవిత దృక్పథంలో ఆనందంగాని, ప్రాపంచిక దృష్టికాని లేకపోయినందువల్లనే వ్యంగ్య, హాస్య, వికట, పరిహాస కవిత్వాలవంటి ఆకర్ష ణీయమైన సాహిత్య ప్రక్రియలు ఉపయోగించుకోలేకపోయారు.

దీనికిభిన్నముగా, ఆధునిక కవులు పురాతన కవిత్వపురూపాలూ, పోకడలూ, చాలా వదలుకున్నారు. ఆధునిక కవులకి, అపారవైవిధ్యముగల పాశ్చాత్య సారస్వతంతో, ముఖ్యంగా ఇంగ్లీషు సారస్వతంతో పరిచయం కలగడము, పురాతన కవులకి లేని ఒక గొప్ప సౌకర్యం

వీరికి కలిగింది. ఇంగ్లీషు, పాశ్చాత్య సాహిత్యాలు, వివిధ ప్రక్రియలలో, అమిత సంపద కలిగిన సాహిత్యాలవడం, ఆధునిక రచయితలకి చాలా లాభదాయక మయింది. పైగా అపారమైన సంస్కృత సాహిత్యం వారికి లభ్యమౌతూనే వుంది. ఆధునిక రచయితలు, పురాతన సాహిత్యరూపాలనే కాక, ఆధునిక సాహిత్యరూపాలుకూడా, ఎంతో ఆనందంతోనూ, అభినివేశంతోనూ, అలవరించుకున్నారు. తమ తమ స్వంత అనుభవాలు, సాహిత్యంలో ఉపయోగించుకోవడం అలవరించుకున్న ఆధునిక రచయితలు, ముద్రణాసౌకర్యాలు విస్తృతమవడంతో త్వరితంగా రచనలు సాగించడం ప్రారంభించారు. నూతన చైతన్యంలో, నూతన వాతావరణంలో, అమితోత్సాహంతో గద్య పద్య రచనలు సాగించారు.

*పురాతన మరాఠీ సాహిత్యం :* ఇంతకు ముందు చెప్పినట్టు, పురాతన మరాఠీ సాహిత్యం, సుమారు ఎనిమిది శతాబ్దాల కాలం వ్యాప్తిలో ఉంది ముకుంద రాజు, జ్ఞానేశ్వరులు, ఈ సాహిత్యానికి మార్గదర్శకులు, స్థాపకులు. కొత్తగా రూపొందిన మరాఠీ భాష, సాహిత్యభాషగా, త్వరితగతిని పరిణామం చెందడానికి, సాంఘిక అవసరాలు, ప్రేరేపణలు, చాలా దోహదం చేశాయి. ఆధ్యాత్మిక రంగంలో, ప్రజావాణిని, అవసరాలను గుర్తించి, వాటిని తీర్చడానికే కావాలని, బుద్ధిపూర్వకంగా, ముకుందరాజు, జ్ఞానేశ్వరులు, తమ ''వివేక సింధు'' ''జ్ఞానేశ్వరి'' గ్రంథాలను మరాఠీ భాషలో వ్రాశారు. సాంప్రదాయానుసారం, జ్ఞానేశ్వరుడు [క్రీ. శ. 1275–1296] మరాఠీ సాహిత్యానికి ఆదిపురుషుడు. మరాఠీ సాహిత్య సృష్టికర్త. కాని ఆ సంప్రదాయమే, ముకుందరాజు, జ్ఞానేశ్వరుడికి, ఒక వంద సంవత్సరాల పూర్వీకుడనీ నిర్ణయిస్తోంది. జ్ఞానేశ్వరుడు వ్రాసిన పుస్తకాలు, ''జ్ఞానేశ్వరి'' ''అమృతానుభవ'' ము ఎంత గొప్ప రచనలో, మనోహరమైనవో, ఆయన జీవితమూ, జీవితానికి సంబంధించిన గాథలూ కూడా అంత ఆశ్చర్యజనకాలు, ఆనంద దాయకాలుగానూ ఉన్నాయి.

ఇదే సమయంలో జ్ఞానేశ్వరుని కంటె కొంచెం పిన్నవాడు, సమకాలికుడు అయిన నామదేవు (1270–1350) వార్కరీ పంథాతత్వం భారతదేశమంతా వ్యాపింప చెయ్యాలని, సులభమైన, సామాన్య ప్రజాభాషలో, తన భక్తి గీతాలు వ్రాశాడు. రెండు శతాబ్దాల అనంతరం, మహారాష్ట్రలో మహాభక్తుడు, అతనిని మించిన కవీ అయిన ఏకనాథుడు [1533-1599] ఉదయించాడు. జ్ఞానేశ్వరుడు వ్రాసిన 'జ్ఞానేశ్వరి' ఎంత సుప్రసిద్ధమో, మహాభాగవతంలో ప్రఖ్యాతమైన ఏకాదశస్కంధాన్ని పురస్కరించుకుని ఏకనాథుడు వ్రాసిన గ్రంథం, అంతసుప్రసిద్ధం వ్యవహారంలో ఇది ఏకనాథ భాగవతమని ప్రసిద్ధికెక్కింది. ఇది ఏకనాథునిఅమూల్య గ్రంథం. పురాతన మరాఠీసాహిత్యంలో ఇది రెండవ గొప్పగ్రంథం. అతిసులభమూ, అతిఆకర్షణీయమూ అయినశైలి ఈతను, అలవరించుకున్నాడు. కథాకథనంలో అందెవేసినచెయ్యి. మరాఠీ భాషలో, లౌకిక కవిత్వానికి పునాదివేసిన మహనీయుడు. మూడు శతాబ్దాలలో, మరాఠీ భాష మార్పులుచెంది, జ్ఞానేశ్వరి గ్రంథభాష, కొంతవరకు అయోమయమయి అర్థంకాకుండా పోవడం వల్ల, ఈయన జ్ఞానేశ్వరి గ్రంథాన్ని చక్కని భాషలో తిరిగి వ్రాశాడు. ఈనాటికీ, అదే మూల గ్రంథమని అందరూ భావిస్తూ ఉంటారు. ఈయన మహారాష్ట్రంలో గొప్ప సంఘ సంస్కర్త. జ్ఞానేశ్వరుడితో బాటు ఈయనా మహాభక్తుడని, కవి అని, ప్రసిద్ధిచెందాడు. ఏకనాథుడు

ప్రారంభించిన లౌకిక కవిత్వరచనను, ముక్తేశ్వరుడు కొనసాగించి, అభివృద్ధి చేశాడు. ఈతని మహాభారత రచన ఒక పరిణతి చెందిన ప్రతిభాశాలి రచన. పురాతన మరాఠీ సాహిత్యంలో ఉత్తమమైన కథారచన అని దీనిని పరిగణించడం, యుక్తంగానే ఉంది. ఆయన సుస్పష్ట వర్ణనాశక్తి, వివిధ భావాలకి అనుగుణంగా పాఠకుల్ని స్పందింప చేసే శక్తి, చక్కటి తియ్యని ప్రతిభావంతమైన శైలీ, ప్రతిపద్యంలోనూ, కనిపిస్తాయి. మరాఠీ సాహిత్య చరిత్రలో తుకారాంది (1608-1651) ఒక విశిష్ట స్థానం. తుకారాం, నిజమైన ప్రతిభాశాలి. అతని పద్య రచన అంతా మౌలికం. స్వప్రేరేపణజనితం. సంఘంలో, ఆమూలాగ్రం మార్పులు రావాలన్న సంఘ సంస్కర్త ఆయన. తనవ్యంగ్యంతో, అపహాస్యంతో, సూటిపోటి మాటలతో ఉద్బోధనలతో సమకాలీన సమాజాన్ని సంస్కరించడానికి ప్రయత్నించాడు. మాటలపొంకము, స్పష్టత, భావనాశక్తి, ప్రగాఢ విశ్వాస ఉత్సాహాలూ, ఆయన వ్రాసిన ప్రతి పంక్తిలోనూ కనిపిస్తాయి. హృదయాన్ని స్పృశించి, మనిషిని చెడు మార్గాలనించి చల్లగా తప్పించే రచనలు ఆయనవి. ఈయన సమకాలీనుడు, స్నేహితుడు, ఈయనలాగే భక్తుడు రామదాసు (1608-1681). రామదాసు వ్రాసిన గొప్ప గ్రంథం ''దాసబోధ''. పురాతన మరాఠీ సాహిత్యంలో ప్రతిభా వంతమూ, చైతన్యవంతమూ అయిన సద్రచన అని దీనికి ప్రఖ్యాతి రావడము సహేతుకమే. కొంతమంది విద్వాంసుల అభిప్రాయ ప్రకారం, రామదాసు శివాజీ మహారాజుకు గురువు. ఈయన ఇంకా చాలా వైవిధ్యంతో కూడిన పద్యాలు, పాటలు, కథనాత్మక కవిత్వము కూడా వ్రాశారు. ఆయన రచనలన్నీ ఉదాత్తలూ, ఉత్తేజకరాలూను.

పద్దెనిమిదో శతాబ్దపు కవిత్వానికి నాంది పలికిన వాడు వామన పండితుడు. ఈయనకి మరాఠీ సంస్కృతాలు రెండింటిలోనూ ప్రావీణ్యముంది. ఈయన వ్రాసిన ''యథార్థ దీపిక'' (భగవద్గీతకి అచ్చపువ్యాఖ్య) నిజంగా గొప్ప గ్రంథం. ఆయన మరొక గ్రంథం, వేదాంత రచన ''నిగమసారము.''. చక్కని తేట మరాఠీలో వేదాల సారాంశం ఈ గ్రంథంలో సుబోధం చేశారు. వామనపండితుడి ప్రతిభ సామాన్యంగా కలిసివుండని రెండురకాల ప్రతిభ, పాండిత్యమూ, కవితాశక్తీ. ఒక్క వ్యక్తిలో, వీటి కలయిక, సమన్వయమూ, అసాధారణమే.

రఘునాథ పండితుడు కూడా ఇటువంటి ప్రతిభ, సామర్థ్యమే, తన ''నలదమయంతీ స్వయంవర'' కావ్యంలో చూపించాడు. ఇది మరాఠీలో అసలైన మాణిక్యం.

శ్రీధరపండితుడు, శైలిలో ముక్తేశ్వరునీ, లౌకిక కథాకథన కవిత్వంలో ఏకనాథునీ పోలినవాడు. ''పాండవ ప్రతాపం'' ''హరివిజయం'' అన్న కావ్యాలమీద ఆయన పేరు ప్రతిష్ఠలూ, ప్రజారంజకత్వమూ, ఆధారపడి ఉన్నాయి. సౌకుమార్యం, పదాల తియ్యదనం, ప్రసన్నత, నిర్మల కథాగమనమూ, ఆయన ఎన్నుకున్న కవితా వస్తువుల ఉదాత్తత ఇవన్నీ ఆయనకి చాలా పేరు ప్రఖ్యాతలు గడించి పెట్టాయి. జ్ఞానేశ్వర, ఏకనాథ, రామదాసులలాగే, ఈయనకూడా, మరాఠీభాషమీద సంపూర్ణ అధికారం సంపాదించి, ప్రతిభావంతంగా భాషను ప్రయోగించాడు తరువాత మోరోపంతుని గురించి [1729–1794] ప్రస్తావించాలి. ఈయన అనేక విధాలైన సాహిత్య ప్రయోగాలుచేసి, విరివిగా మరాఠీలో గ్రంథాలు వ్రాసినకవి. ఈయన తన ప్రముఖ భక్తి కావ్యంలో, తనను''మయూర్'' (నెమిలి)

అని ప్రస్తావించుకున్నాడు. ఆయన వ్రాసిన మహాభారతము మరాఠీ భాషలో, ప్రథమ పురాణ కావ్యము. ఈ కావ్యంలో, ఆయనప్రతిభ చక్కగా ద్యోతకమవుతుంది. వివిధ విషయాలని గురించిన ఆయన విజ్ఞానమూ, మరాఠీభాషమీద ఆయన ప్రభుత్వమూ, వర్ణనా శక్తీ, పఠితలని తాన కథనాలతో ప్రేరేపింపగల సామర్థ్యమూ, నాటకరీతుల సంభాషణా చాతుర్యాలు, మొదలయిన ఉత్తమ గుణాలన్నీ ఈ మహాకావ్యంలో కనిపిస్తాయి. మోరోపంతు వ్రాసిన ''సంశయరత్నమాల'' ''కేకావళి'' కావ్యాలలో ఆయన ప్రతిభ పరాకాష్ఠ అందుకుంది. మోరో పంతు 1794లో కాలధర్మం చెందారు.

1794నుంచి 1818 వరకూ [1818 సం॥లో మహారాష్ట్రంలో బ్రిటిషు పరిపాలన ప్రారంభమైంది] మధ్యకాలమంతా పురాతన మరాఠీ సాహిత్యానికి భరత వాక్యమనీ, ఆధునిక మరాఠీ సాహిత్యానికి నాంది అనీ పరిగణించవచ్చును. పురాతన మరాఠీసారస్వత అవసాన దశలో కూడా, రామజోషీ, అనంతఫండి వంటి ప్రజారంజకులైన కవులు, తమరచనలలో, కవితాశక్తిని ప్రదర్శింపగలిగారు. రామజోషీ, తన ప్రతిభవల్ల, అప్పటి వరకూ, కేవలం పచ్చి శృంగారానికే ఉపయోగపడుతున్న ''లావణి'' అన్న ఛందస్సును ఉదాత్తంగా ప్రజలను రంజింపచెయ్యడానికి, ప్రజలకి విజ్ఞాన బోధన చెయ్యడానికి కూడా ఉపయోగించవచ్చునని నిరూపించాడు. రెండవ ప్రఖ్యాతకవి, అనంతఫండి, లావణి, పవాడ, కటావ, ఫటాక, మొదలయిన, రకరకాల ఛందస్సులలో పదాలు వ్రాశాడు. వీటిని ఆయన, అతి చాతుర్యంతో వ్రాయడంవల్ల, ఈ గేయ నాటకాల ప్రదర్శన జరుగుతున్నంత కాలమూ, ప్రజలు, అతిశ్రద్ధతో తన్మయులై, వీక్షించేవారు.

పురాతన మరాఠీ సాహిత్యంలో మరో ముఖ్యభాగం చారిత్రక విభాగం. ఇది మరాఠీ సాహిత్యంలో, సాటిలేని విభాగం. ఈ విభాగంలో, గద్యమూ, పద్యమూ, రెండు విడివిడి భాగాలు. గద్య సాహిత్యంలో, బఖర్లు, లేఖలు, రెండు ముఖ్య ప్రక్రియలు లేఖావిభాగంలో, ప్రభుత్వమూ, ప్రత్యేక వ్యక్తులూ, వ్రాసినలేఖలున్నాయి. శివాజీ మహారాజు, మరాఠా రాజ్యం స్థాపించిన తరువాత ఈ ''బఖర్ల'' వ్రాత ప్రారంభమయింది. అప్పుడు క్రమం తప్పినా ఆధునిక సమయందాకా, ఈ బఖర్ల వ్రాత జరుగుతూనే ఉంది. ఆఖరి ''బఖర్'' వ్రాయసకాడు, ''మల్హర రామరావుచిట్నిస్.'' ఈయన సుమారు 1810 సం॥వరకూ జీవించి ఉన్నాడు. పద్యభాగంలో, గేయకారులు వ్రాసిన పవాడ, కటావులు ఉన్నాయి. జరిగిన సంఘటనలు, తేలికైన భాషలో చెప్పడమే, ఈ బఖర్, పవాడల ముఖ్యోద్దేశమవడం వల్ల, ఇవి మరాఠీ సాహిత్యంలో, ఒక స్థానం ఆక్రమించుకోగలిగాయి. ఈ మధ్య వెలుగులోకి వచ్చిన, ప్రభుత్వ, ప్రత్యేక ప్రముఖ వ్యక్తుల ఉత్తర ప్రత్యుత్తరాలు ఆనాటి ప్రజల ఉద్దేశాలు, భావాలు, తెలియజేస్తున్నాయి గేయకారులు, దేశభక్తి ప్రధానమైన గీతాలూ, కవితలూ, వ్రాశారు మరాఠా సామ్రాజ్యం, పుట్టి, పెరిగి, శిధిలమైన శతాబ్దంలో, జరిగిన ప్రధాన సంఘటనలు సంస్తుతిస్తూ చేసిన ఈరచనలు' చెప్పుకోతగ్గ సాహిత్య ప్రాధాన్యతనే సంతరించుకున్నాయి.

*ఆధునిక మరాఠీ సాహిత్యము :* ఆధునిక యుగకాలము సుమారు నూట యాభయి సంవత్సరాలే అయినా, దీనిని నాలుగు విభాగాలుగా విభజించడం సమంజసం.

మొదటిదశ 1800 నుంచి, 1885 వరకూ [ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ ప్రభవించిన సంవత్సరమిది]. రెండవదశ 1885 నుంచి 1920 వరకూ [ప్రథమ ప్రపంచసంగ్రామం ఆఖరయిన సంవత్సరం]. మూడవది, సుమారు పాతిక సంవత్సరాల కాలం, 1921నుంచి 1945 వరకూ. [ద్వితీయ మహా సంగ్రామం అంతమయిన సంవత్సరం]. ఆఖరి, నాలుగోదశ, ఇప్పుడు నడుస్తున్నకాలం. ఆధునికయుగంలో గద్య పద్యవిభాగాలలో అన్నిరకాలయిన ప్రక్రియలూ, అభివృద్ధి చెందాయి. మరాఠీభాషలో వివిధాలయిన శాస్త్రవిజ్ఞానరచనలూ, తయారయాయి. ఈ యుగంలో, ప్రతిసంవత్సరమూ, తయారవుతున్న సాహిత్యగ్రంథ పరిమాణం చాలాపెరిగింది.

1818 వ సం॥లో పీష్వా బాజీరావు II పదవీత్యాగం చెయ్యవలసి వచ్చింది. తరవాత బ్రిటిషు పరిపాలనా కాలపు నూతన వాతావరణంలో మరాఠీభాషనీ సాహిత్యాన్నీ అభివృద్ధి చెయ్యడానికి పైనుంచీ, దేశీయులలో నుంచీ కూడా చాలా ప్రయత్నాలు జరిగాయి.

తంజావూరి మహారాజు, మరాఠీ సాహిత్యం పెంపొందింప చెయ్యాలని నిశ్చయించి, ప్రథమంగా, ఒక ఇంగ్లీషు పుస్తకాన్ని మరాఠీలోకి 1817వ సం॥లో తర్జుమా చేయించాడు. రెండవ యత్నం, ప్రఖ్యాత మిషనరీ, డాక్టరు కారీ కలకత్తాలో చేసినది. 1805లో ఆయన మరాఠీ వ్యాకరణము-నిఘంటువు ప్రచురింపచేశాడు ఫాదరు స్టీఫెన్సు వ్రాసిన "క్రిస్తపురాణం" 1816 సం॥లో ప్రచురితమయింది. బొంబాయి రాష్ట్ర ప్రథమ గవర్నరు, ఎలిఫిన్‌స్టన్, మరాఠీలో మౌలిక గ్రంథాలు, తర్జుమాలు, ప్రచురించడానికి ప్రోత్సాహమిచ్చి, మరాఠీభాషా, సాహిత్యాలు, అభివృద్ధిచెందడానికి శక్తికొద్దీ సహాయం చేశాడు. మేజరు కాండీ స్వంతంగా తయారుచేసిన మరాఠీ-ఇంగ్లీషు, ఇంగ్లీషు మరాఠీ నిఘంటువులూ, మోల్సువర్తు నిఘంటువూ ప్రత్యేకంగా పేర్కొన తగినవి. ఇవి భారతీ యేతరులు చేసిన ప్రయత్నాలు. మహారాష్ట్రంలో, ఛత్రె, బాళశాస్త్రి జాంభేకర్; లోకహితవాది, జ్యోతిబపూలే, మొదలయిన ప్రముఖులు, మరాఠీలో వివిధ విషయాలమీద గ్రంథాలు వ్రాశారు. 1857సం॥లో బాబా పదంజీ వ్రాసిన "యమునా పర్యటన"ము, మరాఠీభాషలో మొదటి నవల. ఈ నవల ఇతివృత్తం, సంఘ సంస్కరణ. మరాఠీభాషలో మొదటి వార్తాపత్రిక 1835వ సం॥లో వెలువడింది. ఈ కాలంలో మౌలిక పద్యరచన మాత్రం విస్తృతంగా జరగలేదు. అప్పుడప్పుడు ఓ మాదిరి పద్య రచనలు ప్రచురితమయినా, మొత్తంమీద, సంస్కృతంనుంచి తర్జుమాలు మాత్రమే ప్రముఖంగా ప్రచురితమయాయి. ఈ విధంగా, మరాఠీసాహిత్యం, మహారాష్ట్రుల కృషిచేతనూ, మహా రాష్ట్రేతరులకృషిఫలితంగానూ, అభివృద్ధి చెందడం ప్రారంభించింది. 1880 నాటికి, పాత నేలలో కొత్తవృక్షం వేళ్లు నాటుకుంది.

1858వ సం॥లో బొంబాయి విశ్వవిద్యాలయ స్థాపన జరిగింది. 1873-74 లో విష్ణుశాస్త్రి చిప్లుంకర్, తమ "నిబంధమాల" ప్రారంభించారు. 1880-81 "కేసరి" పత్రిక ప్రారంభమయింది. ఈ మూడూ ఆధునిక మరాఠీ సాహిత్యాభివృద్ధికి అమితంగా తోడ్పడ్డాయి.

*ఆధునికకవిత్వం :* కేశవసుత (1886—1905) ప్రచురించిన మొదటి కవితలోనే అధునికమరాఠీ కవిత్వం ప్రారంభించిందని, నిజానికి, చెప్పవచ్చును. మిత వాదిత్వము,

ఇంగ్లీషుకవిత్వంలోని కాల్పనికతత్వము, యూరపులో దేశభక్తిభావము, మానవతావాదము, మహారాష్ట్ర పూర్వచరిత్రని ఆధారంగాచేసుకొని దేశాన్ని కీర్తించడమూ, మొదలయినఎన్నో పోకడలు, ఆయన కవిత్వంలోకనిపిస్తాయి. కవిత్వం, భావాలు, ఉద్రేకంరేకెత్తించగలవని ఆయన నమ్మకం. జీవితంలో, ఎన్నో చెడుగులు, దురాచారాలు, ఖండించడానికి సాధనంగా అయన కవిత్వాన్ని ఉపయోగించాడు. ఆయన మరాఠీలో ప్రథమవిప్లవకవి. మరాఠీకవిత్వపు పాత సంప్రదాయాల మీద ఆయన తిరుగుబాటులేవదీశాడు. కాని ఆయన తిరుగుబాటు కేవలం సారస్వతరీతులమీద మాత్రమేకాదు. అది ఇంకనూగహనమైనది. ఈయన కవిత్వం, సమకాలికులైన, రివరెండుతిలక్, కవి వినాయక్, కవిగోవిందరాజు, బాలకవి, మొదలయిన కవులకి ప్రోత్సాహంకలిగించి, వారిని ప్రఖ్యాతకవులుగ రూపొందించింది. ఈ కవులు, అనేకరకాలయిన కవిత్వంవ్రాశారు. ప్రకృతిసౌందర్యం. గృహసౌందర్యం, పూర్వపుఔన్నత్యాన్ని ఉల్బణంచేసే వీరగాథలూ, నాటకీయతా, హాస్యశైలీ భావోద్రేక కవిత్వమూ, వీరికవిత్వంలో ప్రధానగుణాలు. 1920 నాటికి ఈ పద్ధతి కవిత్వం అంతమయింది.

1920నుంచి, 1945వరకూ కవులు, విడవకుండా సాంఘిక సాహిత్య, శిష్టాచారాల మీద దండెత్తుతూనే వున్నారు. అదేసమయంలో భాస్కరరావు తాంబె (1874-1941) తనగేయ కవిత్వంతోటీ, ఇంద్రియాకర్షకమైన శైలితోటీ ప్రజారంజకత్వం సంపాదించుకున్నాడు. కవిచంద్రశేఖర్ కూడా కవిత్వంలోనేర్పరితనంవల్ల, చాతుర్యంవల్ల చాలామంది పఠితలని ఆకర్షించగలిగాడు. కాని ఈ కాలంలో ఎక్కువపలుకుబడి సంపాదించినది ''రవికిరణమండలి''. ఇది ఒక కవి సమాజము. కవిత్వం నిత్యజీవితానికి దూరంకాకుడదు అన్నవాదం, ఈ మండలి సభ్యులు, ఎలుగెత్తి చాటేవారు. జీవితంలో చినచిన్న కోపతాపాలు, వైఫల్యాలు, కవితావస్తువులుగా తీసుకొని, గోలపెడుతూవుండేవాడు కవి 'యశ్వంతు'. కవి 'గిరీశు' ప్రాముఖ్యంలేని మారుమూల విషయంతీసుకుని, దానిమీద సిద్ధాంతాలు ప్రవచించేవాడు. తమాషారుచులతో ప్రేమ గీతాలు వ్రాశాడు మాధవజూలియను. వీరందరూ రవికిరణమండలి సభ్యులు, ఈ మండలి సభ్యుల ప్రత్యేకతలతో, ఈ కాలపు కవిత్వం ప్రసిద్ధిచెందింది.

కాని 1925లో పి. కె. అత్రే తన ''జెండూచిఫూల్'' అన్న పుస్తకం ప్రచురించాడు. ఇది రవికిరణమండలి సభ్యుల పద్ధతులమీదా ఘాటైన వ్యంగ్యరచన. చాలా ప్రజారంజక మయింది.

ఈనాటి కవులకి మార్గదర్శి, వారిరీతులు దిద్దినవాడూ బి ఆర్. తాంబె, (1874-1941). వీరిగేయాలు చాలామందిపాడి వాటిని విస్తృతంగా ప్రజలలో ప్రచారంలోకి తెచ్చారు. తాంబె ముఖ్య శిష్యుడు బి.బి. బోర్కర్. తన కవిత్వంలో సౌందర్యవర్ణనలో, ఒకకొత్త సోయగము. కల్పనాశక్తి వినియోగించి, ప్రత్యేకత సాధించుకున్నాడు.

రవికిరణమండలి, కవి తాంబె. ఉభయులూ కలసి, అనంతకాణేకర్, కవి అనిల్, ఎన్.జి. దేశపాండె, మొదలయిన కవులకి ప్రేరేపణగాపరిణమించారు. ఈ కవులు, చాలా వరకు, రవికిరణమండలి, కవితాంబెల ప్రాబల్యానికి ప్రతిగా, వ్యతిరేకపద్ధతిని కవిత్వం వ్రాశారు. కాణేకర్ వ్రాసిన ''చందారాత్ అణి ఇతర్‌కవిత'' (1933) కవి అనిల్ వ్రాసిన

''పూలవత్'' (1932, భగ్నమూర్తి (1940), పెర్వేష్ట (1947) ఈ కాలంలో ప్రచురితమైన కొన్ని గొప్పకవితాగ్రంథాలు. 1942 ఉద్యమపు ప్రభావంత్వరితంగానే సాహిత్యంలో కనిపించింది. అదే సమయంలో 'కుసుమాగ్రజ' వ్రాసిని 'విశాఖ'లో ఆయన ప్రతిభవెల్లడి అయింది. 1945 నించి ఆధునిక కవిత్వం, మానవజీవితం అన్ని కోణాలనించి పరిశీలించడానికి ప్రయత్నంచేస్తూ ఉంది. కవితనప్రత్యేక అనుభవాలని ఆధారంగా చేసుకుని వ్రాసిన కవిత్వాన్ని పఠిత ఆస్వాదించేటట్టు చేసే ప్రేరేపణ ఆధునిక కవిత్వంలో ఒక ప్రధానసూత్రం. ఆధునిక కవిత్వంతో వస్తువు అధికాంశం, వ్యక్తిగతమైన అనుభవం. వర్ణనలు, కవితాసమయాలు, సూటిగా ఉంటాయి. డొంకతిరుగుడులు, కవిత్వపు పులుముడులు విసర్జించి, వ్యావహారికానికి సన్నిహితమైనభాషనే ఉపయోగించాలని ప్రయత్నిస్తుంది ఆధునిక కవిత్వము. "కాహెకవిత'' అన్న కవితా సంపుటి బి.ఎస్. మర్ఢేకర్ 1947లో ప్రచురించాడు. ఆధునిక కవిత్వపు రూపరేఖలన్నీ ఒక్కమారుగా వెలికితెచ్చింది ఈకవితాసంపుటి. అధునిక కవిత్వపు సంపూర్ణ ప్రభావం, ప్రప్రథమంగా ఈ సంపుటిలో కనిపించింది. మర్ఢేకర్ (1907-56) ఆధునిక మరాఠీ కవిత్వానికి మార్గదర్శి. పి.ఎస్.రేగె; విందా కరండికర్, వసంతబాపట్, మంగేశపడ్గాంకర్, శాంతాశెల్కె మొదలయిన ఆధునిక కవులకి దారి చూపించినది, మర్ఢేకర్ అనడంలో అతిశయోక్తి ఏమీవుండదు. సంజీవని మరాఠే, బహెనాబాయిచౌదరి, ఇంద్రాసంతులు స్త్రీల ఆశలూ, ఉద్దేశాలూ, తమకవిత్వంలో చాలా చక్కగా, సహజంగా వెలిబుచ్చారు.

దీనితో కవితా సమీక్ష పూర్తి అయింది.

*ఆధునిక మరాఠీ గద్యము; నాటకము :* 1843 మరాఠీ నాటకం జన్మించింది. అచిరకాలంలోనే శైశవంగడిచిపోయింది. విష్ణుదాసుభావే, మరాఠీనాటకరచనకి నాంది పలికిన వ్యక్తి. కాని నటుడు, నాటకరచయిత, నాటకప్రయోక్త అయిన బి,పి. కిర్లోస్కర్ చేతుల్లో (1843-1885) నాటకం మొట్ట మొదటిసారిగా రాణించింది. ఆయన వ్రాసిని సౌభద్ర నాటకం (1882) చాలా ప్రజాదరణపొందింది. ఆ నాటకంలో పాటల గానమాధుర్యమే ఈఆదరణకి కారణం. జి బి. దేవళ్ (1854–1916) కిర్లోస్కర్ శిష్యుడేగాని, మరోప్రత్యేక పంథానపరిణమించాడు. "శారద'' నాటకంవ్రాసి ప్రదర్శించాడు. సంభాషణాచాతుర్యంవల్లా, పాత్రలస్వభావ సిద్ధతవలనా, శారద నాటకం, ఈ నాటికీ ప్రజామోదం చూరగొంటూనే ఉంది. మరాఠీ నాటకాన్నిమరో విధంగాతీర్చిదిద్దిన మహనీయుడు కె. పి. ఖాడిల్కర్ (1882-1948). మరాఠీ రంగభూమిమీద శ్రావ్యమైన సంగీతమే ప్రధాన ఆకర్షణగా ఉండేది. కాని ఖాడిల్కర్ రాజకీయ శ్లేషతో "కీచకవధ'' నాటకంవ్రాశాడు. అందులో లోకమాన్యతిలకు భీముడుగానూ, లార్డుకర్జన్ కీచకుడుగానూ రూపొందించిన ధ్వని వుండడము వలన ఆనాటకాన్ని ప్రదర్శించకూడదని ప్రభుత్వం నిషేధించింది. అతనిచారిత్రక నాటకాలు, కొంతవరకు షేక్స్పియర్ నాటకాలని పోలినవి . శృంగార, అద్భుత సంఘటనల ద్వారా, వ్యంగ్య నాటకాలు వ్రాయాలని ఈయన ప్రయత్నించాడు. మరో ప్రముఖ నాటక రచయిత, ఎస్. కె. కొల్హాట్కర్ (1871-1934) హాస్య ప్రధానమైన రూపకాలువ్రాశాడు. కొంతవరకు, ఈ రూపకప్రదర్శనలు, సంఘసంస్కరణకి ప్రేరేపణ కలిగించాయి. శృంగారము, హాస్యము, ఘాటైనగద్యశైలి, సముచిత పాత్ర

పోషణ, వీటన్నిటి సమన్వయంతో కృతకృత్యుడై నాటకరచన సాగించిన మరో ప్రముఖ రచయిత ఆర్. జి గడ్కరీ. ఆయన వ్రాసిన నాటకాలు, ఏకచ్ప్యాలా, పుణ్యప్రభావ నాటకాలు మరాఠీ రంగభూమిలో ప్రకాశవంతమైన నక్షత్రాలు. ఎన్.సి. కేల్కర్ (2872-1947)నాటక రచనలో అంత ప్రజ్ఞావంతుడు కాడు కాని, కొన్ని చక్కని నాటకాలే వ్రాశాడు. వాసుదేవ శాస్త్రిఖరే, మంచి చారిత్రకనాటకాలువ్రాశాడు. వీరందరూ మరాఠీ నాటక ప్రథమయుగంలో ప్రఖ్యాత నాటక రచయితలు.

వీరిపేరు ప్రఖ్యాతులమీద మరాఠీ రంగభూమి మరో ముప్పయి సంవత్సరాలు జయ ప్రదంగా నడిచింది. కొంతమంది ప్రజారంజకులైన 'గాయకనటులు', మరాఠీ రంగభూమికి ప్రాణమై నాటక సాంప్రదాయాన్ని పోషించారన్న కీర్తి గడించుకున్నారు. మరాఠీ రంగభూమి గొప్పతనం, ఆకర్షణ, ఈ సంగీతనటులేనన్న భావం ప్రబలింది. ఈ సమయంలో, సంగీత ప్రాధాన్యతని తప్పిస్తూ, నాటకాలు వ్రాసిన రచయిత మామావరేర్కర్ పైకి వచ్చాడు. నాటక రచయితగా అతనిజీవితము, ఆధునిక మరాఠీనాటక చరిత్ర అని చెప్పవచ్చును. ఆయన నాటక రచనలో కొన్నిప్రయోగాలు చేశాడు. అనేక సాంఘిక సమస్యలు, నాటక రూపేణవివరించడానికి ప్రయత్నించాడు. ఆయన నలభై నాటకాలకి పైనవ్రాశాడు. అపూర్వ బెంగాలు (1953) భూమికన్య సీత (1955) ఆయన ఇటీవలవ్రాసిన నాటకాలు. ఈరెండు నాటకాలలోనూ, స్వాభావికత చాలాప్రధానగుణం. మరాఠీ రంగభూమిమీద స్వాభావికత ప్రవేశపెట్టిన మొదటి రచయిత మామావరేర్కర్ (1883-1965). మరాఠీ రంగభూమి ఈ విషయంలో మా మా వరేర్కర్‌కి ఎంతో ఋణపడివుంది. ''నాట్యమన్వంతర'' అన్న నాటక సంఘం ''అంధళ్యాంచి శ్యాలా'' అన్న నాటకం 1933లో ప్రదర్శించింది. ఈ నాటక రచయిత ఎస్.వి. వర్తక్. మరాఠీ రంగభూమి చైతన్యవంతంచెయ్యాలి అని చేసిన ప్రయత్నాలలో, ఇది చాలా గొప్ప యత్నం. పి. కె. అత్రె. ఆధునిక నాటకాలువ్రాసి ప్రదర్శింపచేశాడు. ఈయన నాటకాలు, ఆర్థికంగా, విజయం సాధించాయి. హాస్యశక్తి. పాత్ర వివరణ, ఘాటైన శైలి, అత్రెప్రత్యేకతలు. తాను వ్రాసిన 'అస్వాభావిక' నాటకాలలో కూడా, వీటన్నిటిని అత్రె ప్రయోగించుకోకలిగాడు. ఎమ్.జి. రంగనేకర్, 'నాట్యనికేతన' మన్న సంస్థ స్థాపించి, తన నాటకప్రదర్శనల మూలంగా ప్రజానీకానికి వినోదంచేకూర్చాలి అన్న ఉద్దేశం సాధించు కున్నాడు. కేవలం వినోదప్రసారంమటుకే పరిమితమైన ఆశయం ఆయనది. సుఖాంత నాటకాలు వ్రాసి ప్రదర్శించి, ఈ ఆశయం సాధించాడు. పి.ఎల్. దేశపాండె వ్రాసిన ''అమల్‌దారు'' అన్న నాటకం ఇటీవల విజయవంతంగా ప్రదర్శితమయిన నాటకాలలో ప్రముఖ నాటకమని చెప్పవచ్చును. వసంతకాణీట్కర్, విద్యాధరగోఖ్లే, ఇద్దరూ, ఈనాటిప్రముఖ మరాఠీ నాటక రచయితలు. ఉభయులూ, మరాఠీ రంగభూమికి శక్త్యానుసారం నాటకరచనలు అందిస్తున్నారు. రచనా విస్తృతిలోనూ, రమణీయతలోనూ, మరాఠీ నాటకాలు, చాలా ప్రఖ్యాతమే.

నవల : 1885లో ''హరినారయణ ఆప్టే'' విరచిత ''మధవీస్థితి'' అన్న నవలా ప్రచురణతో, ఆధునికనవల మరాఠీ పఠితలకి పరిచయమయింది. నిజానికి ఆయన చేతిలో, మరాఠీ నవల అకస్మాత్తుగా పరిపక్వ పరిణతి చెందింది. కొన్ని నవలలువ్రాసిన తరవాత,

ఆయన దృష్టిచారిత్రక కథనాలమీదికిమళ్లింది. రానడె, అగార్కర్ ప్రభృతులనించి నేర్చిన సంఘసంస్కరణ ఆవశ్యకత, ఆప్టె, తానువ్రాసిన 'మధలీస్థితి' ''పణ్ లక్ష్యాత్ కోన్ ఘేతో'' మొదలయిన మొదటి నవలల్లో వివరించాడు. ఈయన అంత గొప్పకళాకారుడు కాదు. వ్రాసినదే వ్రాసి విసుగుపుట్టించేవాడు. కాని నవలారచయితగా ఆయన అఖండ విజయం సాధించాడు. దీనికి ఆయన రచనలలో ప్రకటితమైన వివేచనా ఐక్యత, చక్కటిపాత్రవివరణ ప్రధానకారణాలు. నాథమాధవ్; సి.వి. వైద్య; వి. ఎమ్. పరంజపె, మరాఠీ నవలా సాహిత్యానికి మంచికానుకలు సమర్పించారు. వి.ఎమ్. జోషి, మరో శిఖరానికి తీసుకువెళ్ళాడు మరాఠీ నవలని. రాగిణి (1915) నురో ఆయిదునవలలతో ఆయన మరోకొత్తబాటతెరిచాడు. 'సుశీలాచాదేవ్' (1930) అన్న నవలఆయనవ్రాసిన నవలలన్నిటిలోనూగొప్పది. చదువుకున్నస్త్రీ బుద్ధి ఎలావికసించుతుందో చాలా గాఢంగా పరిశీలించి, వివరించివ్రాసిన నవల ఇది. ''ఇందు కాళి, సరళభోళే, అన్న నవలలో ఇతివృత్తం కళకీ నీతికీ మధ్య సంఘర్షణ. మరాఠీ రంగ స్థలం విచ్ఛిన్నమవడంతో, 1940 సుమారున, నవలే, మధ్యతరగతికుటుంబాలకి వినోదప్రదాయిని అయింది. మరాఠీ నవల రకరకాలయిన విషయాలని స్పృశించింది. ప్రయోజనాన్ని సాధించే పరికరంగా పరిణామంచెందింది. డాక్టరు. ఎస్.వి.కేట్కర్, సంఘసంస్కర్త. సాంఘిక సమస్యలు విమర్శించడానికి ఆయన నవలని వినియోగించుకున్నాడు. ప్రొఫెసరు. వి.ఎమ్. జోషి నించి డాక్టరు కేల్కరువరకు అకస్మాత్తుగా నవల అంతస్తులో చాలాపెరిగింది. మామా వరేర్కర్ నాటకాలకంటె నవలలే ఎక్కువవ్రాశాడు.

పందొమ్మిది వందల ఇరవై అయిదో సంవత్సరం తరవాత ప్రఖ్యాతి చెందిన వ్యక్తులు ఇద్దరు. ప్రొఫెసరు ఎన్.ఎస్. ఫడ్కె, వి. ఎస్. ఖాండేకర్‌లు. ఉభయులూ, మొదట నవలా రచయితలుగానూ, తరవాత వ్యాస, కథానికా రచయితలుగానూ, పేరుపొందారు. ప్రొఫెసరు ఫడ్కె ''కళకళకోసమే'' అన్న సిద్ధాంతాన్ని తీవ్రంగా ప్రచారంచేస్తే, ''కళ జీవితం కోసమే'' అన్న సిద్ధాంతాన్ని ప్రపచించాడు ఖాండేకర్. తేలికగా సాధించగలిగిన ప్రేమని, తెలివైన చిన్నచిన్న మార్పులతో, రకరకాలుగా అల్లి, పై మధ్యతరగతి ప్రజలకి రుచులు చూపించాడు ఫడ్కె. ఆయన, సున్నితమైనశైలికి చాలా ప్రసిద్ధిచెందాడు. ఖాండేకర్ మొదట కథానికా రచయితగా పేరుతెచ్చుకుని తరవాత నవలా రచయితగా ప్రఖ్యాతి పొందాడు. ''కళ కళకోసమే'' అన్న ఫడ్కె సిద్ధాంతాన్ని 'కళ జీవితంకోసమే' అన్న సిద్ధాంతంతో ప్రతిఘటించాడు. ఈ సిద్ధాంతంలో ప్రధానభాగం, ఆశయవాదం. ఉభయులూ, మరాఠీ సాహిత్యంలో గొప్పమణులు. పి.వై. దేశపాండె, విశ్రామ బేడేకర్, విభావరీ శిరూర్కర్, మాలతీబాయి బేడేకర్, మాలతీబాయి దాండేకర్, ముక్తాబాయి దీక్షిత్, కమలాబాయి తిలక్, కుసుమావతి దేశపాండె, ఆర్.వి. దిఘె, సానె గురూజీ ప్రభృతులు మరాఠీ నవలా సాహిత్యానికి చక్కని నవలలుకూర్చిపెట్టిన ఇతర ప్రముఖ రచయితలు. ఈనాడు ఎన్. ఎస్. పెండ్సె, వి.వి. శిర్వాడకర్, జి.ఏన్. దాండేకర్, రంజితదేశాయి, ప్రభృతులు ప్రధాన నవలారచయితలు. మరాఠీ సాహిత్యానికి గర్వించదగిన నవలా సాహిత్యం సమకూర్చారు.

*కథానిక, వ్యాసము* : కథానిక, వ్యాసము, ప్రత్యేక సాహిత్య ప్రక్రియలుగా ఈ సమయంలోనే ప్రాముఖ్యానికొచ్చాయి. హెచ్.ఎన్. ఆప్టె, ఎస్.కె.కొల్హాట్కర్, వి.ఎస్.

గూర్జరు ప్రభృతులు ఈ రెండు సాహిత్య ప్రక్రియలని చాలా త్వరితంగా అభివృద్ధిచేశారు. మానసిక పరిశోధన: కథలో రూప వస్తువుల ఐక్యత ఈ రెండు విషయాలని పురస్కరించుకుని, దివాకరు కృష్ణ అధునిక కథానికా రచయితలలో అగ్రగణ్యుడని నిర్ణయింపవచ్చును. ఖాండేకర్, ఫడ్కే-ల కృషి ఫలితంగా, 1940 సుమారున కనిథాక ప్రత్యేకత సంపాందించుకుని, సాహిత్య ప్రక్రియగా స్థిరపడిపోయింది. వై.జి. జోషి, కథలకి ఒక విధమైన నైజత్వం సిద్ధింప చేశాడు. కుటుంబ వాతావరణం సృష్టించడం వలనా, హృదయాన్ని స్పందింపచేసే దృష్టికోణాలు నించి వ్రాయడం వలనా, ప్రజారంజకుడైన కథారచయిత ఆయాడు. సమకాలీనంగా, వి.వి. బోకిల్, అనంతకాణేకర్, సి.వి. జోషి, ఎస్.ఎమ్. మాటె. వి.కె.అత్రె, కథానికని ఉచ్చస్థాయిలోకి తీసుకునివెళ్లారు. కాని, ఈ ప్రక్రియలో, రకరకాలయిన ప్రయోగాలు చెయ్యడంలో, అందంలోకీ మిన్న, గంగాధర గాడ్గిల్. నిత్య నూతనంగా కనిపించే తన, ఊహా, ఉపమానాలతో, ఆయన, కథానికని మరో అంతస్తుపైకి తీసుకుని వెళ్ళాడు. అరవింద గోఖ్లే, పి.బి. భావే, వెంకటేశ మాడ్గూల్కర్, మహదేవశాస్త్రి జోషి, డి.బి. మొకాషి, డి.ఎమ్. మిరాసదార్, ఎస్.జి. గోరె, వసుంధరా పట్వర్ధన్, ఈనాటి కథానికా రచయితలలో ప్రధానులు. ఎస్ ఏమ్ మాటీ, అనంతకాణేకర్, డాక్టరు ఇరావతికర్వె, ఎన్.ఎస్. ఫడ్కే, దుర్గాభాగవత్, కుసుమావతి భాగవత్, ప్రఖ్యాతి చెందిన వ్యాసరచయితలు. ఆర్.బి.జోషి వ్రాసిన "ప్రవాసవ్యాసాలు", పి.ఎల్. దేశపాండె వ్రాసిన వ్యంగ్యరచనలు, ప్రత్యేకంగా పేర్కొనదగినవి. కుసుమావతి దేశపాండె, డబ్ల్యు.ఎల్. కులకర్ణి, డి కె.బేడేకర్, ఎస్.కె. క్షీరసాగర్ మొదలయిన విమర్శకులు, మరాఠీ రచయితలకి నవ్య మార్గాలు చూపించారు.

*వాదవివాద గద్యరచనలు :* 1873 నుంచి, 1945 వరకు, మరాఠీ గద్యానికి సాంప్రదాయిక రచనాకాలం. గద్యరచనకి దారితీసినవాడు విష్ణుశాస్త్రి చిప్లుంకర్ [1850-1882]. మరాఠీభాషకి ఈయన శివాజీ మహరాజు వంటివాడు ఈయన భావోద్రేక పూరితమూ, చతురమూ, అయిన శైలితో చాలా పేరు ప్రఖ్యాతులు గణించుకున్నాడు. ఆయన తరవాత ప్రఖ్యాతులు తిలకు, ఆగర్కరులు. సాంఘిక సంస్కరణలా, రాజకీయసమస్యలా, నేటి పరిష్కారం ముందుగా జరగాలి అని తిలకు, అగర్కర్ల మధ్య తీవ్రంగా చెలరేగిన వాద ప్రతివాదాలు విస్తృతమవుతున్న మరాఠీ పఠితలని ఉత్తేజితులు చేసినవి.

తిలక్ గద్యరచనలో ఆరితేరినచెయ్యి అపారమైన పాండిత్యంలో ఆయనశైలి విరాజిల్లుతూ ఉండేది. లోక ప్రసిద్ధమైన "గీతా రహస్యం" లో అయనశైలి, పాండిత్యము, ప్రపంచఖ్యాతి ఆర్జించుకున్నాయి. అదే సమయంలో. ఎస్. పరంజపె. [1864-1929] 'కళ' అన్న పత్రికలో తన వ్యాసాలు వ్రాశాడు. వాగ్ధాటి, వ్యంగ్యము, ఆయన ప్రత్యేకతలు. ఈ రెండూ ప్రతిబింబిస్తూ ఆయన వ్యాసాలు సాగినవి. ఎన్.సి. కేల్కర్ ప్రఖ్యాత పత్రికా రచయిత. అనేక రంగాలలో ప్రవేశమున్న రచయిత. అయన జయప్రదంగా చేపట్టని గద్య రచనా ప్రక్రియేలేదు. ఎ.బి కొల్హాట్కర్, రమాబాయి రానడె, ఎన్. ఆర్. పంగర్కర్, ఎస్ ఎమ్. మాటె, కాకాకలేల్కర్, డి.వి. పోద్దార్, వి.డి. సవర్కర్, వినోభాభావే, కె వి. కులకర్ణి, ఎన్.ఆర్. పాటక్, ఎస్.డి. పెండ్సె, ఎస్.జావడేకర్, వి.బి.కోల్టె, పి.జి.సహస్రబుద్ధె,

ఎస్.జి. తుల్పులె, డాక్టరు కరండికర్, ప్రభృతులు వాద వివాదగద్యరచనల విస్తృత ఉపయోగానికి చాలా తోడ్పడ్డారు.

*మరాఠీభాష, సాహిత్యాల భవిష్యత్తు :* మరాఠీభాష భవిష్యత్తేమిటని అప్పుడప్పుడు ప్రశ్న అడుగుతూ వుంటారు. ఒక్కటే సూటి అయిన జవాబుదానికి. మరాఠీ భాష మాట్లాడే ప్రజలు, నాలుగు కోట్లని మించి ఉన్నారు. మరాఠీ సాహిత్యం అన్ని సారస్వత ప్రక్రియలలోనూ, అభివృద్ధిచెందింది. ఇప్పుడు మహారాష్ట్ర ప్రదేశానికి రాజభాషగా నియమిత మయింది. ఉన్నత విద్యకికూడా బోధనాభాషగా నియమిత మవడానికి అది తగినభాష. అచిరకాలంలోనే ఆ పరిణామం జరిగి తీరుతుంది. సందేహంలేదు. కనక నిస్సందేహంగా మరాఠీభాష, మరాఠీ సాహిత్యాల భవిష్యత్తు దేదీప్యమానమే.

## విషయసూచిక

### గద్యవిభాగం

## కవితా విభాగం



## ఆజ్ఞా పత్రం (క్రీ.శ. *1666*)

### శివాజీ మహారాజు వ్యూహం

నౌకాదళం రాజ్యాంగాలలో ఒక ప్రత్యేక విభాగం. అశ్వికదళంఉన్న రాజు ఏ విధంగా భూమి మీద తన స్వామ్యం స్థాపించి ప్రజలని అదుపులో పెట్టుకోగలడో, ఆ విధంగానే నౌకాదళం పోషించేరాజు, సముద్రాలమీద తన సత్తా స్థాపించుకోగలడు. ఈ ఉద్దేశంతో నౌకాదళం నిర్మించుకుతీరాలి. త్వరితగతిప్రయాణంచెయ్యగల నౌకలు మధ్యపరిమాణంలో నిర్మించాలి. అంటే అవి మరీ పెద్దవిగానూ ఉండకూడదు: మరిచిన్నవిగానూ ఉండకూడదు, మధ్యతరగతివిగా ఉండాలి. ఆ విధంగానే ఓడలుకూడా నిర్మించాలి. బలమైన గాలులువీచుతేనేగాని

నడవని బరువైన ఓడలు నిర్మించి ప్రయోజనంలేదు. అయినా శత్రువులగుండెలదరకొట్టడానికి అలాటి పెద్దఓడలు ఒకటి రెండు నిర్మించినా, నిర్మించవచ్చును. కాని నౌకాదళం ఎటువంటి దైనా, కావలసిన ఆయుధ పరికరాలన్నీ ఓడలలో ఉండాలి. పోరాడగలనావికులు, బాకులు తుపాకులు, మందుగుండుసామాను,దిక్సూచులు మొదలయినవన్నీ సమకూర్చిన ఓడలు అవసరం. నౌకాదళం అయిదు భాగాలుగా (సుబాలుగా) విభజించాలి. ఒక్కొక్క భాగంలో వేగంగా పయనించగల అయిదు నౌకలు, మరి పదిహేను నావలు ఉండాలి ఈ సుబాలన్నీ ఒక్కరి అజ్ఞలో ఉంచాలి. దాన్ని సర్‌సుబా అంటారు. అన్ని సుభాలు, ఈ ఆజ్ఞకిలోబడి నడుచుకోవాలి.

## విష్ణుబువ బ్రహ్మచారి *(1825-1871)*

### శ్రేయోరాజ్యం మీద ఒక వ్యాసం

ఆర్యులారా, వినండి.

తన రాజ్యంలో తన ఏలుబడికింద ఉన్న ప్రజలందరూ, ఒకకుటుంబంలో తనకుటుంబంలో భాగస్తులన్న భావం వారికి కలిగేటట్టు, రాజు, వారికి నచ్చచెప్పాలి. 'నేనే ఈ కుటుంబానికి పెద్దని. నా రాజ్యంలో ఉన్నభూమి అంతా ఒకతోట; నాతోట. కనక వారందరికీ ఈ భూమిద్వారానే గ్రాసం లభించేటట్లు ఏర్పాటుచేయ్యాలి, అందరూ హాయిగావుండేటట్టుచూడాలి; రాజు ఈవిధంగా మొదట ఆలోచించడం ప్రారంభించాలి. రాజ్యమంతా ఒక కుటుంబమనీ, ప్రజలందరూ ఒక కుటుంబంలో భాగస్తులనీ అందరికీ భావన కలగాలి.

2. ఈ విధంగా రాజ్యంలో ప్రజలందరూ ఏక కుటుంబంలో సభ్యులన్న భావం కలిగిన తరవాత, వారందిరూ, తన కుటుంబమంతటినీ తృప్తిగా ఉంచడంలో నిమగ్నుడై శ్రమిస్తున్న రాజుతో ''మేమందరమూ, తమ ఆజ్ఞలకిలోబడి ప్రవర్తించడానికి, సంపూర్ణంగా, సిద్ధంగా ఉన్నాము'' అని చెప్పాలి.

3. రాజ్యంలో భూమినంతటినీ సేద్యంచేయించాలి. ఏ భూమిలో ఏపంటబాగా బాగా పండుతుందో, ఆ పంటలువేయించి, పంటలు పండించాలి. సంవత్సరంపొడుగునా సేద్యానికి నీరు అందేటట్టుగా తటాకాలు, ఆనకట్టలు కట్టించాలి. ఫలవృక్షాలు, ధాన్యము, కాయగూరలు, మొదలయినవేకాక, పశువులకి, గుర్రాలకి, గాడిదలకి ఒంటెలకి కావలసిన గడి వగైరాకూడా పండించాలి. ప్రతి పల్లెలోనూ గిడ్డంగులు నిర్మించి, సరుకులతోనింపాలి. గ్రామస్తులు, తమకి కావలసిన వస్తువులు తీసుకోడానికి అవకాశం ఇవ్వాలి. అన్నికాలాలలోను, అన్నిరకాలభూములలోనూ, ఏదో ఒకపంట పండేటట్టుగా వ్యవసాయం సాగించాలి. పండిన పంటలు ప్రజలందరి ఉమ్మడిసొత్తు అనుకోవాలి. ఈ పంట ఎవరోఒకరి అధీనంలో ఉంచాలి. అతని దగ్గరనుంచి ప్రజలు తమకి కావలసిన ఆహార వస్తువులు అన్నీ తీసుకోవాలి. రాజు పరిశ్రమలు స్థాపించాలి. పత్తి, ఉన్ని మిల్లులు, ఫాక్టరీలుస్థాపించి బట్టలు తయారుచేయించాలి. ఈ బట్టలు గ్రామ గ్రామాలలో ప్రభుత్వగిడ్డంగులలోపెట్టి ఉంచాలి. గ్రామ ప్రజలు తమకి కావలసినబట్ట

అక్కడనుంచి తీసుకువెళ్లడానికి అనుమతి ఇవ్వాలి. పన్నెండుసంవత్సరాలు ఏ ప్రదేశంలోనైనా అనావృష్టివల్లబాధ కలిగితే వర్షాలు బాగాపడే మరోప్రదేశంలో ఆనకట్టలు కట్టి ఆ నీటిని అనావృష్టితో బాధపడుతున్న ప్రదేశానికి సరఫరాచెయ్యాలి. రాజు, బంగారం, వెండి, ముత్యాలు, ఇతరమణులతో నగలు చేయించి గ్రామాలలో భండారాలలో భద్రంచేయించాలి. గ్రామస్థులు, పురుషులు (స్త్రీలు కూడా) అవసరమొచ్చినప్పుడు అవి తీసుకొని ఉపయోగించు కొనివ్వాలి. ఏవైనా నగలు పాడైపోతే, లేదా విరిగి పోతే, ప్రజలు వాటిని భండరాలకి తిరిగి ఇచ్చేసి కొత్తనగలు తీసుకోవాలి. గ్రామాలలో స్థాపితమైనఫాక్టరీలలో రకరకాలయిన ఆయుధాలు, పనిముట్లు, తయారు చేయించాలి. నిస్తంత్రీవార్తాపద్ధతి ఏర్పాటు చేయ్యాలి. వివాహ శుభకార్యలు జరిపించడానికి ఒక ప్రత్యేకశాఖ ఏర్పాటు చెయ్యాలి. అయిదేళ్లనిండిన పిల్లలను రాజు తన అధీనంలోకి తీసుకుని రావాలి. ప్రభుత్వం, వారిని అన్ని రకాలయిన విద్యలలోనూ ఆరితేరజేసి, చక్కగా పెంచాలి. వారి ఆభిమతాల ప్రకారం వారి అభిరుచులకు అనుగుణంగా వారికి ఉద్యోగాలు కల్పించాలి.

వృద్ధాప్యంతో స్త్రీలు పురుషులు ప్రత్యేకంగా పనిచెయ్యకుండానే, వారికి వేతనాలు లభించాలి. ఈ విధంగా ఒక కుటుంబం, అంటే ప్రజలందరు సమిష్టిగా నడుచుకునే పద్ధతి ప్రవేశపెట్టాలి. ఈవిధంగా ఏర్పాటు చేస్తే. దొంగతనం, దెబ్బలాటలు, హత్యలు. నామమాత్రంగా కూడా లేకుండా పోతాయి. దీనివల్ల కోర్టుల అవసరం తీరిపోతుంది. కరువు, కాటకం, ఎవరికీ తెలవదు. ఎవరికి కావలసిన వస్తువులు వారికిల భిస్తాయి. రాజు, అతని ప్రజల మధ్య, సంబంధ బాంధవ్యాలు, ఈ విధంగా ఉండాలి.

## విష్ణుశాస్త్రి చిప్లుంకర్ *[1850-1882]*

### వాగ్ధాటి

వాగ్ధటి పూర్తిగా వికసించాలంటే, దేశంలో ఒక విధమైన ప్రభుత్వముండాలి. ఇదే ప్రజా ప్రభుత్వ రాజ్యాంగము. పార్లమెంటరీ పద్ధతి ప్రజాస్వామిక ప్రభుత్వంలో అతి సంఖ్యాక పార్టీ ప్రభుత్వయంత్రాంగాన్ని నడుపుతుంది. కనక, విజ్ఞానులు, బుద్ధి కుశలులు అధికసంఖ్యాకులను తమవైపు ఆకర్షించుకోవలసిన ఆవశ్యకత ఏర్పడుతుంది. ఇలా ఆకర్షించడానికి వాగ్ధాటిని మించిన మరో ఆయుధం కనిపించదు.

వాగ్ధాటి అలవరించుకున్న వ్యక్తి, అదుపులోకి ప్రజలందరూ రాగలరన్న విషయం నిర్వివాదం. నాయకుడు తనఇష్టాను సారం ప్రవర్తించి, తనవాగ్ధాటివల్ల ప్రజలని తనఅధీనంలోకి తెచ్చుకుని దేశమంతటిలోనూ, తనప్రభుత్వంస్థాపించుకుంటాడు. ఈ విధంగా, వివిధరకాలయిన రాజ్యాంగపద్ధతులలో ప్రజాప్రభుత్వపద్ధతే వాగ్ధాటి సంపూర్ణవికాసానికి అనుకూలమైన పద్ధతి. ఇతర రాజ్యాంగ పద్ధతులలో ప్రభుత్వం, అతి సంఖ్యాక పార్టీయే నడపదు. అధిక సంఖ్యాకులని, నాయకుడు, తనవైపు తిప్పుకోగల సాధనం, వాగ్ధాటి, అవసరమే కాదు. అవసరమేలేని వాగ్ధాటి, పురిటిలోనేసంధి కొట్టుకు పోతుంది. అభివృద్ధి చెందాడానికి అవకాశముండదు.

## బాలగంగాధర తిలక్ [1856–1920]

### గీత–ధర్మం.

భగవద్గీతప్రవచించిన మతం, భక్తి, కర్మ, ఆధ్యాత్మిక జ్ఞానాల సమ్మేళనం. ఈ మతంలో భయానికి తావులేదు. విషయాలన్నిటినీ, సంపూర్ణంగా సమన్వయించుకున్న మతం. పైగా, ఈ మతంలో సమానత్వముంది. అంటే ముక్తిసిద్ధింపచెయ్యడంలో కులాలమధ్య, అంతస్తులమధ్య, దేశాలమధ్య ఏవిధమైన భేద భావమూలేక, ఒకే సమయంలో; ఒకే విధంగా,దానిని అందుబాటులోకి తెచ్చింది. అదే విధంగా, అన్యమత సహనం ప్రబోధించింది. ఈ విధంగా గీతప్రవచించిన మతం పురాతన వైదిక మతవృక్షపు తియ్యటి అమృత ఫలమే. వైదికమతంలో మొదట సంపదలు లేదా పశువులు త్యాగం చెయ్యడానికి, యజ్ఞయాగాదులు ఆచరించడానికి ఎక్కువ ప్రాముఖ్యముండేది. అంటే, ఆచారకర్మకాండ ద్వారా, కర్మచేసే పద్ధతికి ఎక్కువ ప్రాధాన్యముండేది. కాని శ్రుతులలో చెప్పిన కర్మకాండ పద్ధతి; జ్ఞానమార్గం కంటే హీనమైనది, అప్రధానమైనది అన్న జ్ఞానం, ఉపనిషత్తులు, ప్రబోధించినతరవాత, సాంఖ్య పద్ధతి వేదాంతం ప్రభవించింది. కాని ఈ జ్ఞానంకూడా సామాన్య ప్రజకి అర్థంకానిది, పైగా కర్మ పరిత్యాగం చెయ్యాలన్న అభిప్రాయం పుట్టించేదిగా కూడా ఉన్నందు వల్ల, కేవలం ఉపనిషత్తులలో చెప్పిన మతం కాని, ఉపనిషత్తుల– సాంఖ్య వేదాంతాల సమన్వయంగాని, సామాన్యులకి సంతృప్తి కరంగా లేకపోయింది. గీతాశాస్త్రము, ఉపనిషత్తులు బోధించే బుద్ధి మాత్రగ్రాహ్యమైన వేదాంతాన్ని, ఇంద్రియ గోచరమై ప్రేమతత్వానికి అందుబాటులో వుండే రాజగుహ్యయోగన్ని–రెండింటినికలిపి సమన్వయం చేసింది. ఇది సనాతన కర్మకాండ ప్రధానమైన మతానికి అనుగుణంగా అందిరికీ ఎలుగెత్తిచాటుతోంది–''అర్జునుడికే చెప్పినట్టు చెప్పినా, నిజానికి ఇది అందరినీ ఉద్దేశించి చెప్పినదే –''మీ మీధర్మాలు, మీ జీవితంలో, మీ మీఅంతస్తులను బట్టి, శక్తిని బట్టి, చివరివరకూ,మీ మీప్రాపంచిక విధులు నిర్వర్తించండి. కోరిక లేకుండా,ఉత్సాహంతో ప్రపంచపు మంచే, మీ మంచి అన్న ఐక్య దృష్టితో మీ విధులు నిర్వర్తించండి. ఈ విధంగా పరమాత్మ రూపంలో, భగవంతుడిని నిరంతరం పూజించండి. పుట్టిన ప్రతి జీవిలోనూ పరమాత్ముడు ఉన్నాడు. కనక ప్రపంచ మంతా వ్యాపించి ఉన్నది పరమాత్మ. ఇది అనాది. ఈ విధంగా పూజించడంలోనే, విధిని నిర్వర్తించడంలోనే ఇహంలోనూ, పరంలోనూ, మీకు ఆనందముంది. ఈ విధంగా కర్మకీ, జ్ఞానానికీ, ప్రేమ భక్తులకీ, వైరుధ్యం పోయి, సమన్వయం కుదిరింది. గీతప్రవచించిన, ఏకైక ఐక్యమతమిదే. మన జీవితమంతా ఒక యజ్ఞం కింద మార్చుకోవాలి. ఇది వేదం ప్రవచించిన మతం యొక్క సారమే.

## ప్రొఫెసరు ఎస్. ఎమ్. పరంజపె. (1864-1929)

### దొరికిన ధరణి

బ్రాహ్మణుడు ఈ విధంగా అన్నాడు. ''ఓహో, ఇదే నిజమైనధరణి. ఈ ధరణి అందం, ఎంతదివ్యంగావుంది. ఈ ధరణి, కిందిగిన్నె, భూమి. ఆకాశం, పైమూత. ఎంత

అద్భుతం, విశాలం, దివ్యమైనబరణి ఇది. ఈ బరణినే వేదాలు, ఉపనిషత్తులు, స్వర్గము, భూమి అని వర్ణించాయి, భగవంతుడు స్వయంగానే తన చేతుల్తో ఈ బరణి తయారు చేసి, మానవుడికి ఇచ్చాడు. కాని నేనింతవరకు దానిని చూడనే లేదు. ఆబరణి ఎక్కడో పోయిందని దుఃఖిస్తుకూర్చున్నాను. ఆబరణిలో నాభగవత్ప్రతిమలున్నాయి. అవీసరిగ్గా ఆబరణి లాటివే. ఆ బరణిపోయినప్పుడు, ఆ ప్రతిమలు పోయాయి. కాని భగవంతుడా, నువ్వు ఎప్పుడైనా లేకుండా పోతావా? సర్వవ్యాపివి, నువ్వు లేకుండా ఎలా వుంటుంది. కాని అజ్ఞానులు ఇది అర్థంచేసుకో లేరు. అయినా, ఇది మాత్రంనిజం! నా అజ్ఞానంవల్ల, నేనుఏదో, నిజంగా పోగొట్టుకున్నాను. ఈ రోజున, నీ కృపవల్ల, భగవాన్, అంతా తిరిగిపొందాను. భగవాన్, పోయిన బరణి తిరిగి దొరికింది. అజ్ఞానంలో, మభ్యపడి, భూమ్యాకాశాలు కలిసి ఏర్పడిన బరణి వుండగా, అందులో ఉదయిస్తున్న సూర్యుడిలాటి నా ఆరాధ్యదైవముండగా నక్షత్రాలలాటి బంగారు పద్మాలుండగా, నేనెందుకు ఏదో పోయిందని, వృథాగా, ఏడవాలి? పరిపూర్ణ ఆత్మకూడా ఈ బరణిలోనే ఉంది. అనంతంకూడా ఇందులోనే ఇమిడి ఉంటుంది. ఆకృతి తాల్చిన ఆ పరిపూర్ణ ఆత్మని పూజించి, ధ్యానించి, సన్మానించి, దానినే మననం చేస్తూఉంటే, మనకి లభించనిదేముంది. ఈ విషయాన్ని గురించేపూర్ణంగాధ్యానంచేసినప్పుడు, మానవుడుదీనిలోలీనమౌతడు. ఎవరు ఈ విధంగా చేస్తారో వారిమీద భగవంతుడు తన కృపను తప్పక వర్షిస్తాడు, అతని కోరికలన్నీ ఫలించేటట్టుచేస్తాడు. చివరికి భగవత్సాక్షాత్కారం అతనికి కలిగేటట్టు వరప్రదానంచేస్తాడు.

## ఎన్. సి. కేల్కార్. *(1872-1947)*

### సిమ్లా దృశ్య వర్ణన

హిమాలయ పర్వతశ్రేణిలో శిఖరాన్ని మించిన శిఖరాలశ్రేణులు, ఒకదాని వెనుక మరొకటి, అంటిపెట్టుకుని ఉన్నాయని వినికిడి. అలాటి ఒక శ్రేణి సిమ్లా చేరుతున్నప్పుడు మాకు కనిపించింది. కాల్కానించి ఎక్కడం ప్రారంభించినప్పుడు, ఈ పెద్దకొండ ఎక్కితే చాలు, సిమ్లా కనిపిస్తుంది, అనుకున్నాము. కాని సిమ్లా చేరడానికి పైకిఎక్కవలసిన ఏడువేల అడుగులలో ఆరువేల అడుగులపైన ప్రయాణంచేసిన తరవాత కాని సిమ్లా కంటపడనే లేదు. ఈ కొండలు ఎక్కడంలోరైలు, ఎన్నోవొంపులు తిరిగిపోడం వల్ల, మేముతిరగని దిశలేదు. ఎన్నోచోట్ల, సిమ్లా వెనకవుండిపోగా, మెము ముందుకి సాగిపోతున్నామేమో ననిపించింది. సిమ్లా రైలుమార్గం పాముమెలికలతో పోల్చడం పరిపాటి. కాని రైలునంపూర్ణవలయాలు తిరగడం వల్ల పాము, మెలికలు, సత్యమైన ఉపమానం కానేకాదని తేలింది. ఒకలోయపూర్తిఅయి, దానినికప్పే పర్వత శ్రేణిఅయిపోయిందని అనిపించగానే, మరోలోయ, దానిని ఆనుకుని మరోపర్వతపంక్తి కనక సముద్రమట్టంనించి, ఎంతో ఎత్తు, కంటికి కనిపించేది కాదు. మనమీద కొత్త ఆపదలు, వొచ్చిపడ్డప్పుడుపాత ఆపదలు మరిచి పోతామన్నట్టు, కొత్త పర్వతశ్రేణి కనిపించినప్పుడు పాతశ్రేణి మటుమాయమయేది. అసంఖ్యాకమైనలోయలు, పర్వతపువొంపులు, వరసగా. పేర్చిచూస్తే. హిమాయాలు, ఒక దీపశ్రేణిలాగో, లేదా, ఎన్నోరేఖలున్న పుష్పాలహారంలాగో కనిపిస్తాయి సిమ్లాకొండ, ఆ హారంలో, వందల పుష్పలలో, ఒక పుష్పం.ఎత్తైన ఒక్కొక్క

ఒక్కొక్క పర్వతం ఒక్కొక్క పుష్పంతో సమానం. బహుశా ఈ శిఖరాలన్నీ శివాభగవానుడి, పేర్లతో పునీతమయాయి. మాకు ఎదురుగా కనిపించిన శిఖరం పేరు ''చదేశ్వర్'', శిఖరం మీద చిందర పందరగా పడివున్న మంచుని చూస్తే, యోగీశ్వరుడైన ఆ శివభగవానుడి అనాసక్తి శోభనిజ్ఞప్తికి తెచ్చే, విభూతి పర్వతమా అనిపించింది, దానినుంచి, కేదారం, కైలాసం, కాంచనగంగ ధవళగిరి మొదలయిన ఇతర ఇష్ట శివనివాస ప్రదేశాలు సహజంగా జ్ఞాపకమొచ్చాయి. ఈరోజు వార్తాపత్రికలో ఎవరెస్టు శిఖరారోహణ ప్రయత్నాన్ని గురించి చదివినప్పుడు, ఇంగ్లీషువాడు కాలుపెట్టని శివభగవానుడి నివాసస్థానం ఒకటైనా ఇంకా వుందిగదా అన్న భావం కలిగి, నాకు కొంతహాయి అనిపించింది.

## ఆర్. జి. గడ్కరి (1885-1914)

### పుణ్యప్రభావము

*వసుంధర :* వద్దు, వద్దు, బృందావనా ! స్త్రీ విలువ అంత హీనంగా కట్టకు ! తల్లిగా నీకు జన్మనిచ్చి, భార్యగా జీవితాంతం సాహచర్యమిచ్చి, కూతురి రూపంలో నీకు తిరిగి జన్మించి, నీ జీవితం మూడు దశలలో నీకు కోమల ప్రేమానుభవం కలిగించి నిన్ను పుత్రుడిగా, భర్తగా, తండ్రిగా రూపొందించిన స్త్రీని, హీనంగా పరిగణించకు. ప్రపంచంలో ప్రేమ, పరిశుద్ధత, మృదుత్వం, మంగళ పవిత్రత, వీటి ఏకరూపమైన విజయ పతాకం స్త్రీ ! ప్రపంచంలో ప్రతి వస్తువూ ఆమె ఘనతని నిరూపిస్తుంది. ఒక స్త్రీ వీక్షణంతో, ఓ మరు భూమిలో, ఫలవంతమైన ప్రదేశం ఏర్పడింది. ఒక స్త్రీ నామం, నదుల రణగొణధ్వనికి, వేదాధ్యయన పవిత్రత ప్రసాదించింది. కాంతికి మృదుత్వం తెచ్చింది స్త్రీ. సత్యానికి సౌంద ర్యమూ, అమర్చిపెట్టింది. స్త్రీ హృదయంలో, పొంగి పెల్లుబికే ప్రేమవెల్లువలతో, మహా కవుల ఉపజ్ఞలు ఊహలై, భావాలై, రెక్కలు ధరించి ఎగురుతున్నాయి. స్త్రీ సౌందర్యపు ఛాయలు చిత్రించడం కోసమే కుశలుడైన చిత్రకారుడి 'కుంచె, నిరంతరం రంగులలో మునిగి తేలుతోంది. అందమైన దేవాలయాల గర్భగుళ్లలో, స్త్రీ దేవతల మూర్తులే ప్రతిష్ఠించి ఉంటాయి. స్త్రీ కనుగొలకులలో కదిలే అశ్రుబిందువులే మహావీరుల ఖడ్గాంచలములను ప్రేరే పించి, శత్రువులపై విహరింపచేస్తున్నాయి. ఆమెకోసమే, సముద్రంమీద కొండలు నాట్య మాడాయి. చివరికి భగవంతుడే స్త్రీ రూపం తాల్చాడు స్వయంగా. బృందావనా ! స్త్రీ అనే ఆలయంలోనే మానవత్వ దివ్యత్వ భావనల అపూర్వ సమ్మేళనం జరిగింది. పురుషుల దివ్య స్వభావానికి పరమావధి సాధుత్వసిద్ధి. నిష్కామంగా భగవంతుడిని కొలిచే భగవద్భక్తులు మానవశ్రేణిలో, ఉత్తమ శిఖరం అలంకరిస్తారు. లక్షమంది నీలాటి పురుషులలో అలాటి సాధుపుంగవుడు ఒక్కడూ కనిపించడు. కాని మాలాటి స్త్రీలలో, పతిదేవత కోరికల ననుస రించి, రకరకాల సేవలుచేస్తూ, ఎంతోమంది సాధుస్త్రీలు, పతివ్రతలూ ఉన్నారు. భర్త సేవలో, తమ కోరికలు, కాంక్షలు, ఆహుతులుగా సమర్పిస్తూ పతికి సేవలుచేసే పుణ్య వనితలు ప్రతి గృహంలోనూ కనిపిస్తారు. భగవంతుడు ఏ విధంగా తన బిడ్డలనందరినీ భేదభావం లేకుండా పోషిస్తాడో, అదేవిధంగా స్త్రీ, తన సంతానాన్ని, ప్రతిఫలం కోరని

మాతృభావంతో పోషించుకు వస్తుంది. ఈ విధంగా స్త్రీ దేహంలో మనిషీ, భగవంతుడూ కూడా తమ అమూల్యమైన గుణాలు వెల్లడి చేసుకుంటారు. భగవత్సృష్టి అంతటిలోకి పరమోత్కృష్టమైన సృష్టి మానవుడు. అలాటి మానవుడిని, విశ్వాసంతో పోషించే భారం వహించడానికే భగవంతుడు స్త్రీని సృష్టించాడు. మనుష్యసృష్టి పారంపర్యం నిలబెట్టడానికి భగవంతుడు ప్రేమమూర్తి అయిన స్త్రీరూపం తాల్చాడు. భగవత్సృష్టికి ప్రఖ్యాతి తెచ్చిన వాడు మనిషి. పురుషుడు పరమేశ్వరుని కీర్తి; కాని స్త్రీ పరమేశ్వరుని మూర్తి. భగవంతుడు మానవలోకాన్ని తలదన్నిన మరో, ఆకర్షణీయమైన ప్రపంచాన్ని సృష్టించాలని దీర్ఘధ్యానంలో వున్నా, ఓ పుణ్యస్త్రీ, ఒక పతివ్రత పిలుపు విన్నప్పుడు స్వయంగా పరిగెత్తు కుంటూ రావాలి. బృందావన్, నా మాటల సత్యం కనిపెట్టు. నా చేతులో హారం చూడు. నమ్రతతో తలవంచుతావా ?

## వినాయక దామోదర సవర్కరు *(1883-1966)*

### మానవుడి భగవంతుడు–ప్రపంచపు భగవంతుడు

జగత్తులో ఆదిశక్తి ఏ శాసనాలమీద, ఏ సూత్రాల ఆధారంగా వ్యాప్తి చెందివుందో గమనించి, ఆ సూత్రాలు, శాసనాలని, మానవ కళ్యాణానికి, ఆనందానికి వినియోగించడమే, మానవులకి అంగీకారయోగ్యమైన నడవడి. మానవ కళ్యాణానికి ఏది అనుకూలమో, ఏది ఉపయుక్తమో, అది మంచిది. ఏది అననుకూలమో, అది చెడ్డది. ఏది నైతికం, ఏది అనైతికం అన్న విషయంలో ఈ విధమైన నిర్వచనం చెయ్యడం మనిషికి చాలా అవసరం. "భగవంతుడికి ప్రియమైనదంతా మంచిదే; మానవ కళ్యాణానికి ఉపయుక్తమైనదంతా భగవంతుడి మన్నన పొందుతుంది." ఈ రెండు సూత్రాలు, అభిప్రాయాలు నిజంకావు. కనక అర్థవిహీనం. మనం ఈ విశ్వజగత్తులో నివసిస్తున్నాం. కాని ఈ జగత్తు మన స్వంతంకాదు. కొన్ని విషయాలలోనే ఈ జగత్తు మనకి అనుకూలం; చాలా విషయాలలో ప్రకృతి శక్తులు మనకి వ్యతిరేకం. ఈ విషయం పూర్తిగా, ధైర్యంగా అవగాహన చేసుకుని జంకు గొంకు లేకుండా పరిస్థితులు ఎదుర్కొని ప్రవర్తించడమే నిజమైన మానవత. అదే ప్రపంచపు భగవంతుడిని అంటే బ్రహ్మాన్ని నిజంగా సత్యంగా సేవించడం.

## ఆచార్య ఎస్. డి. జావడేకర్ *(1894-1955)*

### భారతీయ నాగరికతలో అమర సూత్రం

భావి భారతీయ నాగరికత ఏ విధంగా రూపొందించాలి అని నిర్ణయించి వివరించ వలసి వచ్చినప్పుడు, ప్రస్తుతం, రెండు విధాలైన ఆలోచనలు ఉన్నాయని చెప్పవచ్చును. ఒకటి, భారతీయ సోషలిస్టు నాయకులు, ఆధునిక ప్రపంచంలో ఇతర దేశాల చరిత్రని ఆధారంగా చేసుకుని, ప్రోత్సాహం పొంది, ప్రవచిస్తున్న నాగరికత. రెండవది, ప్రపం

మంతా జోహారులర్పిస్తున్న, మహాత్మాగాంధీవంటి సత్యాగ్రహ నాయకులు నిర్వచిస్తున్న నాగరికత. ఈ నాగరికతకి మూలం, భారతదేశపు ప్రాచీన ఆధ్యాత్మిక నాగరికత. మన పూర్వ సాంప్రదాయాన్ని గౌరవించి, పూర్వపు ఔన్నత్యానికి గర్వించి, దాని పునాదిపైననే నిర్మించ దలచుకున్న నాగరికత ఇది. కాని నిజానికి ఇవి విభిన్నాలైన, విరోధమార్గాల పురోగమించే భిన్న నాగరికతలు కావు. పైకి ద్యోతకమవుతున్న విరోధభావం నిజానికి సమసిపోయి, అదృశ్యమైపోగలదు. స్వాతంత్ర్య భారతదేశంలో నాగరికత అభివృద్ధి చెంది, చెప్పకోతగ్గ విధానంరూపొందినప్పుడు, ఈ రెండు విధానాలలో వైరుధ్యం నిజంగా అదృశ్యమైపోతుంది. స్వాతంత్ర్య భారతదేశంలో రూపొందే నాగరికత, దాని సుగుణాల మూలంగా, ప్రపంచంలో మానవజాతి అంతటి. భౌతిక, ఆధ్యాత్మిక అవసరాలను తీర్చగలిగేదిగా ఉంటుంది అనడానికి సందేహం లేదు. ఈ భారతీయ నాగరికతే, మానవ నాగరికతగా రూపొంది, విశ్వమంతా వ్యాపించగలదని దృఢంగా విశ్వసిస్తున్నాము. ఆశిస్తున్నాము.

## ఆచార్య వినోబాభావే (జననం 1894)

## మహారాష్ట్ర సరస్వతి

ఇంద్రాయణి నది మహారాష్ట్ర ప్రదేశానికి ఎన్నో బాధ్యతలు తెచ్చిపెట్టింది. గుడ్డి భూగోళ శాస్త్రరీత్యా, ఇంద్రాయణి కేవలం ఒక పిల్లనది. దాని పొడువు కొలిస్తే, నిజానికి అది నది అని పిలవడానికి అర్హమైనదా ? బహుశా అది ఒక యేరు, ఊటగడ్డ అంటే తీరి పోతుందేమో ! ఇది ఆధ్యాత్మిక ప్రేరణకి ఊటస్థానం.

కొయ్యముక్క తిన్నా అరిగించి, రుచికి తియ్యగావుండే నీరే శ్రేష్ఠతమమైన నీరు. ఇంద్రాయణి నీటికి ఈ రెండుగుణాలూ ఉన్నట్టు ప్రయోగంవల్ల తెలుతూనేవుంది. జ్ఞానానికి దీటైన జీర్ణశక్తి, భక్తికి సరితూగే కమ్మతనం, మరి ఏ ఇతర వస్తువులోనూ చూపించలేము. ఇంద్రాయణి నీటికి జీర్ణగుణం ప్రసాదించే జ్ఞానశక్తి, కమ్మదనమిచ్చే భక్తిభావన ఉన్నాయని చరిత్ర నిరూపిస్తోంది. వివేకమార్గ గురువు జ్ఞానేశ్వరుడు, భక్తశిఖామణి తుకారాం, ఉభయులూ, ఇంద్రాయణి నీరుతాగి, పోషణ పొందారు. జ్ఞానోబ ; తుకారామ అన్న మంత్రోచ్చారణ ధర్మనిష్ణాతుల నందరినీ ఆకర్షించిన మంత్రోచ్చారణ. ఇది ఇంద్రాయణి జలమే ప్రసాదించింది. దేహు, ఆలండి, ఈ రెండు ప్రదేశాలూ, పంచక్రోసి దూరంలో ఉన్నాయి. (పంచక్రోసి అంటే అయిదు కోసుల దూరంలోవున్న అయిదు గ్రామాల సమూహం). ఇంద్రాయణి ఒడ్డున పదిమైళ్ల దూరంలోవున్న గ్రామాలు — జ్ఞానేశ్వరుడి ఆలండి, తుకారాముడి దేహు. ఆలండి జ్ఞానమార్గానికి ఆధారం. దేహు భక్తి శిఖరం ప్రసాదించింది. పంచక్రోసి అవరణలోనే ఇద్దరు మహావ్యక్తులు ప్రభవించడం బహు అరుదైన విషయం. అది ఈ ఇంద్రాయణి నది ప్రసాదించింది. పక్కనున్న జిల్లా బహుశా సారవంతమైనదే కావచ్చును. కాని ఇంద్రాయణి నది ఒడ్డునున్న భూమి శ్రేష్ఠతమ ఫలితాలనిచ్చింది. జ్ఞానపు సారమంతా వడగట్టి తియ్యడానికి తన జీవితమంతా ధారపోశాడు జ్ఞానేశ్వరుడు. మూర్తీభవించిన భక్తి

రుచి, తుకారామ. ఇంత జ్ఞానసారమూ, ఇంత భక్తి రుచీ, తనలో దాచుకున్న ఈ నదీజలాల మహత్యం అపూర్వమని చెప్పక తప్పదు.

## పి. కె. అత్రె (*1898-1969*)

### మహాత్మా గాంధీ అమరుడు

గాంధీజీ అసువులు విడిచాడు. మహాత్మాజీ మరణించాడు. భారతదేశ స్వాతంత్ర్య పిత మనలో లేడు. ఆయన మరణం వీరమరణం. తను నమ్మినదాని కోసం, ఆహుతి అయిపోయిన మహనీయుని మరణం. పోయి పదమూడు రోజులయింది. 1948 సం॥ జనవరి ముప్ఫయ్యో తారీఖు సాయంకాలం, భారత రాజధానిలో, పవిత్రమైన ప్రార్థనా ప్రదేశంలో, మృత్యుదేవత, ఆయన్ని కౌగిలించింది. దేశంలో విస్తరించిన ద్వేష, కలుష వాతావరణపు అగాధంలో, ఆయన జీవితం చివరికి బలి అయిపోయింది. ప్రపంచంలో, శాంతి, ప్రేమల కాంతి ప్రసారిస్తూ మార్గదర్శి అయిన దిక్సూచీ సౌధం, క్షణంలో కూలిపోయింది, మరుసటి రోజున, యమునానది ఒడ్డున, లక్షల ప్రజలు, కన్నీరు కారుస్తూ, అస్తమిస్తున్న సూర్యుడి సాక్షిగా, గాంధీజీ భౌతికకాయానికి వీడ్కోలు చెప్పారు. అ ప్రదేశంనించి, నాక లోకంలోవున్న కోట్ల దేవతలకి 'మహాత్మాగాంధీ అమరుడు' అని ఆయన అమరత్వం ఎలుగెత్తి చాటిచెప్పారు. ఆయన శరీరంలో ప్రతి అణువూ, సువాసన లీనుతూ, విచ్ఛిన్నమై పృథివి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశాలయిన పంచభూతాలలో కలిసిపోయింది.

రేపు కోటానుకోట్ల ప్రజలు, గాంధీజీ అస్థికలు, ప్రయాగ సంగమంలో నిమజ్జనం చేసే సమయంలో; గాంధీజీ చితాభస్మం ఇతర పుణ్యనదులలోనూ, సముద్ర జలాలలోనూ వెదజల్లే సమయాన, కళ్ళనీళ్ళు తిరుగుతూ ఉండగా, తర్పణలు అర్పిస్తారు. అయ్యో, అయిపోయింది. ఈ యుగపు మహాపురుషుని అవతారం సమాప్తి అయిపోయింది. అయిదు నెలల క్రితం ఈ విశాల భారతదేశం ముక్కలయింది. ఇప్పుడు భారతదేశ భాగ్యవిధాత అసువులు బాశాడు.

# కవితా విభాగం

## జ్ఞానేశ్వర (*1275-1296*)

### భగవత్కృప

జ్ఞానేశ్వరి గ్రంథాంత శ్లోకాలలో, జ్ఞానేశ్వరుడు, భగవత్కటాక్షం కోసం ప్రార్థిస్తాడు. ''సాధుపుంగవులారా ! నిరంతరం ఆలోచించి, వివేచించగా, ఈ గ్రంథం నాచేత వ్రాయించడంలో, మీరు నామీద పెట్టిన బాధ్యత యావత్ప్రపంచంలోనూ, నిరుపమానమైనదని స్పష్టంగా తెలుతూంది. నే నింకేమి వర్ణించగలను ? నేను నిమిత్తమాత్రుడుగా, ఈ మత

మంతా మీరే వివరించారు; మీ హస్తాలతో మీరే పూర్తిచేశారు. కేవలం శ్రమదానం తప్ప ఇందులో నాభాగ మేమీలేదు" అన్నాడు. తరవాత ఈ విధంగా ప్రార్థించాడు. ''లోకేశ్వరుడు, నే చేసిన సారస్వత సేవతో సంతృప్తి చెందుగాత: సంతృప్తిచెంది, నామీద కరుణా కటాక్షం ప్రసరించుగాత: దుష్టులు తమ దుష్టత్వం విసర్జించి, ఇనుమడిస్తున్న ప్రేమతో, మంచిని గ్రహింతురుగాక, సర్వప్రాణి స్నేహం, లోకంలో ప్రజ్వలించుగాక: అధర్మము అనే అంధకారం పటాపంచలై పోవుగాక, లోకంలో సత్యమత సూర్యుడు ఉదయించుగాక: అనవరతమూ దీవనలిచ్చే భగవద్భక్తుల కూటం మానవులను ఆదుకొందురుగాక! వారు నిజానికి జంగమములైన కల్పవృక్షపు తోటలు. కోరికలు తీర్చే చింతామణుల గనులు. వారు మాట్లాడగల అమృత జలధులు. వారు మచ్చలేని చంద్రులు. వారు తపింపచేయని సూర్యభగవానులు. సర్వజనులు ఆనందభాగ్యం అనుభవింతురుగాక: అందరూ, సర్వధా పరమాత్మ సేవలో నిమగ్నులగుదురుగాక! ఈ గ్రంథం మననంచేసే పుణ్యులందరూ, సర్వ విషయాలలోనూ— గోచర, అగోచర విషయాలు, అన్నిటిలోనూ— విజయం పొందుదురు గాక!

దీనికి భగవంతుడు, ''తథాస్తు, ఇది జరుగుతుంది'' అన్నాడు. ఆ మాటలు విని, తృప్తిపొంది, ఆనందించాడు జ్ఞానేశ్వరుడు.

జ్ఞానేశ్వరి,
అధ్యాయం 18,
శ్లోకవాక్యాలు 1791–1801.

## ఏకనాథ *(1533-1599)*

### భాగవతము - ఒక గొప్ప క్షేత్రము

ఏకనాథుడు భాగవత చరిత్ర వివరించడంలో, అదొక క్షేత్రంగా రూపకం కల్పించాడు. ఆయన ఈ విధంగా వ్రాశాడు. ''శ్రీ భాగవతము ఒకగొప్ప క్షేత్రం. బ్రహ్మ మొదట విత్తులు సేకరించి, సమకూర్చాడు. ఈ క్షేత్రానికి ప్రధాన యజమాని నారదుడు. నారదుడే, విత్తులుజల్లే మహత్కార్యం స్వయంగా చేపట్టాడు. వ్యాసుడు, ఈ క్షేత్ర సంరక్షణకి పదికట్టలు నిర్మించాడు. దానివల్ల బ్రహ్మానందమనే పంట అమోఘంగా పండింది. శుకుడు పంట రక్షించే పొలము కాపరిగా పనిచేశాడు. భగవన్నామం అనే ఒడిసెలరాయి విసురుతూ, పాపమనే పిట్టల్ని తోలేశాడు. ఉద్ధవుడు వెన్నులుకొట్టి, ఏకాదశ స్కంధం అనే ధాన్యం కుప్పచేసి, తూర్పారపట్టి, శ్రీకృష్ణ వాక్యముల రూపంలో, నికరపు గింజల్ని జల్లెడ పట్టాడు. వీటినుంచి, మంచి రుచికరమైన అమృత భోజ్యాలు తయారుచేశారు; వేసిన ప్రశ్నలే ఈ భోజ్యాలు. ఉద్ధవుడి తరవాత ఈ బాధ్యత పరీక్షిత్తు వహించాడు. ప్రాపంచిక సంబంధాలు వదులుకుని, కేవలం శుకుడి నోటినించి, భాగవతం వినడంలోనే

నిమగ్నుడయాడు పరీక్షిత్తు. విని అలౌకిక ఆనందం పొందాడు. అదే పద్ధతిని శ్రీధర పండితుడు తన భావార్థ దీపికలో, భాగవతంలో గుప్తమైన అర్థాలు వివరించి, తాను పరమా నందకరమైన శాంతి సాధించుకున్నాడు. జనార్దనుడికి అభిమానపాత్రము, ఏకనాథుడనే మక్షికము, మరాఠీభాషలో రెండు మాండలిక రూపాలనే రెక్కలతో ఎగిరి, ఆమృష్టాన్నం మీద వ్రాలి, తనివితీరా ఆస్వాదించి, ఏ ఆటంకమూ లేకుండా, తిరిగిపోయాడు. లేదా, జనార్దనుడి ప్రియ మార్జాలం, భావార్థదీపిక కాంతిలో, మృష్టాన్నం కనిపెట్టిందని అయినా చెప్పవచ్చును. సువాసనలు వెదజల్లుచూ, మృష్టాన్నం రుచికరంగా వుండడంవల్ల, గిన్నెలు సమీపించి, పిల్లి, మ్యావ్. మ్యావ్ మనగానే, సాధుపుంగవులు, తమతమ పాత్రలలోనించి, మిగిలిన మెతుకులు దానికి పెట్టారనికూడా చెప్పవచ్చును. జనార్దనుడి ప్రియ మార్జాలం, సాధుపుంగవులు వదలిన భుక్తశేషాన్ని నాకడానికే పరమానందం పొందింది. ఆ మిగిలిన మెతుకులే ఆమృత మనుకుని తిని ఆనందించింది.

ఏకనాథ భాగవతము
31/443–454.

## తుకారాం (*1606-1651*)

### తుకారామ జీవితంలో ఆఖరిఘట్టం ; తుకారామ సదేహముక్తి

తుకారామ తన ఆధ్యాత్మిక శక్తిలో ఆఖరిమెట్టు చేరుకున్నాడు. మహా పావన పురుషుడని, ఆయన పేరుప్రఖ్యాతులు అందరికీ పరిచితమయాయి కేవలం చిల్లర సరుకులు అమ్ముకునే ఒక చిన్న వ్యాపారస్తుడి జీవితంనుంచి, ఆయన ప్రపంచపు ఆధ్యాత్మిక శిరో మణిగా పురోగమించాడు. ఇకనిప్పుడు అంతిమఘట్టం కోసం మాత్రమే నిరీక్షిస్తున్నాడు. తను ప్రపంచం వదలి వెళ్ళవలసిన సమయం ఆసన్నమైనప్పుడు. భగవంతుడే ప్రత్యక్షంగా వచ్చినట్టు ఆయన చెప్పాడు. ''చూడండి. భగవంతుడు, చేతుల్లో శంఖచక్రాలు ధరించి వచ్చాడు. ఆయన ప్రియ వార్తాహరుడు గరుత్మంతుడు చెదిరిన రెక్కలతో వచ్చి, నాతో, 'భయపడకు, భయపడకు' అన్నాడు. భగవంతుడి శిరంమీద వున్న కిరీటపు రత్నాల కాంతితో, సూర్యకాంతికూడా వెలవెలపోయింది. భగవంతుడి శరీరకాంతి, ఆకాశపు కాంతిలాగ నీల వర్ణం. వర్ణించలేనంత అందంగా ఉన్నాడు భగవంతుడు. నాలుగు చేతులు, మెడలో వైజయంతిమాల. ఆయన కట్టిన ధోవతితో దిక్కులు ప్రకాశవంతమయాయి. స్వర్గమే దిగి తనయింటికి వచ్చిందా అని తుకారం హృదయం ఆనందంతో వెల్లివిరిసి పోయింది.

భగవంతుడే స్వయంగా తనవద్దకు వచ్చిన తరవాత ఈ లోకంలో తాను ఇంకా బతికివుండడం భావ్యం కాదనిపించింది, తుకారాముకి. అందరికీ తుది నమస్కారాలు చెప్పి "నేను స్వర్గానికి వెళ్ళిపోతున్నాను. మీ అందరి కృపా, నామీద ప్రసరించండి. అందరికీ నా నమస్సులు. విఠల భగవానుడు చాలా సేపటినుంచీ, నన్ను రమ్మని పిలుస్తూ, నిరీక్షిస్తు

న్నాడు. నా అంతిమ గడియలో పాండురంగ ప్రభువు నన్ను తీసుకువెళ్ళడానికి వచ్చాడు, తుకారాము ఈ బొందితోనే అదృశ్యమయి పోతున్నాడు.''

## రామదాసు (1608-1681)

### శివాజీకి రామదాసు సలహా - ఉత్తమ పురుషుడి వర్ణన

ఇది మహమ్మదీయ రాజ్యాలమధ్య తన పరిపాలన సాగించవలసిన శివాజీ మహారాజుకి సంత రామదాసు ఇచ్చిన ఉపదేశము. ''దేహానికి రకరకాలయిన దుస్తులు, ఆభరణాలు తొడగాలి. మనస్సుని రకరకాలయిన రాజకీయ ఆలోచనలతో నింపాలి. శరీరం మాత్రం రకరకాల వస్త్రాలతోటీ, ఆభరణాలతోటీ ప్రకాశవంతమయి, మెదడు శూన్యమయి వుంటే శరీరకాంతి ఏమీ రాణించదు. భగవంతుడు, ముఖ్యంగా తులజాభవాని నిన్ను చూసి గర్వించుతోంది. నువ్వు ఏ కార్యం తలపెట్టినా చాలా జాగరూకతతో నిర్వహించాలి. చాలాకాలంగా దేశంలో మహమ్మదీయులు ప్రజాపీడన చేస్తున్నారు. కనక శివాజీ ఎల్లప్పుడూ జాగరూకుడై ఉండాలి. భగవంతుడు, ఎవరినైనా, 'వీడు నావాడు' అని ఓమారు పేర్కొన్న తరవాత, అతనిచేత ఏ కార్యం చేయించుతాడో చెప్పలేము''. న్యాయదృష్టి, బుద్ధి కుశలత, ఇతరుల హృదయాల లోతులు కనిపెట్టగల సామర్థ్యం, ఇవన్నీ శివాజీకి భగవత్ప్రసాదితాలు. అదేవిధంగా శివాజీ అపారకృషి, అతని జాగరూకత, సమయస్ఫూర్తి, ధైర్య సాహసాలు, అతని శక్తి సామర్థ్యాలుకూడా భగవంతుడు ప్రసాదించినవే. శివాజీ పేరు ప్రఖ్యాతులు, ఆయన సత్యనిష్ఠ, గొప్పతనము, అసామాన్యమైన ఇతర సుగుణాలుకూడా భగవత్ప్రసాదితాలే. భౌతిక, ఆధ్యాత్మిక విషయాలని గురించిన ఆయన వివేక వివేచన, అన్ని విషయాలలోనూ సర్వదా జాగరూకత, ఆయన క్షమాగుణంకూడా భగవంతుడు ప్రసాదించిన గుణాలే. లోకంలో భగవంతుడి రాజ్యం తిరిగి స్థాపించే వ్యక్తులు, నిజానికి, భగవదవతారాలే.

దాసబోధ
2 నుంచి 20 వరకూ

## మోరోపంత (1729-1794)

### కేకావళి — నెమలికేక

యమదేవత సైన్యపు బావుటా కనిపించినట్టు, దేహంలో వృద్ధాప్యం పొడచూపడం ప్రారంభించింది. రుగ్మత మూలంగా దేహం అలసిపోయింది. నువ్వు తప్ప నాకు మరో సమర్థవంతమైన తోడులేదు. నేను తొందరపడకపోతే, ఈ శత్రువు, మరణదేవత, నా గొంతుక కోస్తాడు?

నాకు ఎల్లప్పుడూ మంచితోడే దొరకనీ. నా శ్రవణాలలో ఎప్పుడూ సుగుణవంతుల మాటలే వినపడనీ. నా మెదడులో మచ్చ మాసిపోనీ : సర్వ భౌతిక విషయాల

మీద, నాకు ఏవ కలగనీ. నా బుద్ధి, పుణ్యపురుషుల పాదపద్మాలలో శరణుపొందనీ. ఒక వేళ నాబుద్ధి దానికి ఇష్టపడకపోతే, ఇష్టపడి స్థిరంగా అక్కడే నిలిచేటట్టు చెయ్యి. నీనించి విడిపడ్డప్పుడు, దుఃఖంతో రోదించనీ. నా మనస్సు, నీకథతో మత్తెక్కిపోనీ !

ఓ హరీ, భగవానుడా, నువ్వు దాక్షిణ్యమనే అమృతం వర్షించే మేఘానివి. శిశువు రోదిస్తే, తల్లి, అతిప్రేమతో. ఆ శిశువుని, ఎత్తుకుని, ఆలింగనం చేసుకుంటుంది. సాధువులు, సద్భక్తులు, పొగిడి, కొలిచేసీకు, అకస్మాత్తుగా, నాలాటి అతిథి దొరుకుతాడా ! భగవంతుడా, ఈ భక్తుని, ఈ ప్రపంచ సముద్రంనించి రక్షించడం నీకేమీ కష్టంకాదు!

**అనంతఫండి** *(1744-1819)*

## సలహా — ఫట్కాకవిత

కష్టమైన మార్గం ఎప్పుడూ ఉపయోగించకూడదు. సామాన్యంగా ఉపయోగించే బాటని వదలకు. ఈ ప్రాపంచిక జీవితం, అనుభవించు. కాని, వూరికే, ఏ కారణమూ లేకుండా, డొంకతిరుగుళ్ళు పోకు. అణకువగా ఉండు. తియ్యటి అబద్ధాలు చెప్పకు. నమ్రతతో ఉండు. ఎవరిమీదా కోపం తెచ్చుకోకు. భగవంతుడంటే నమ్మకంలేని నాస్తికుడవయావని, నిందపడకు. లాభసాటి పనులుచెయ్యి. కాని పాపమార్గం తొక్కకు. తల్లితండ్రుల మీద కోపం తెచ్చుకోకు. ఏకాకిగా ఉండకు. నిత్యజీవితంలో మోసపోకు. ఎప్పుడూ సోమరిగా కూర్చోకు. కేవలం తిండి సంపాదనకోసం అసాధారణమైన కష్టకార్యాలు చెయ్యకు. ఇతరులలో తప్పులు పట్టకు. ఇతరులు సిగ్గుపడేలాగ వాళ్ళని గురించి ఉపన్యాసాలివ్వకు. ఎవరినీ ద్వేషించి, వాళ్ళ సంపదలు పోయేలాగ ప్రవర్తించకు. నువ్వే అందరికంటె తెలివయిన వాడినని, ధనవంతుడినని అనుకుని గర్వపడకు. నీకంటె గొప్పవారు చాలామంది ఉంటారు కనక నీ గొప్పతనం నువ్వు చాటించుకోకు. నీ సహాయం కోరిన బీదలని, బలహీనులని చూసి కోపగించుకోవద్దు.

నీ యాజమాన్యం అట్టేకాలం నిలవదు కనక, ఓడిపోవడానికి అవకాశమున్న పనులు నెత్తిమీద పెట్టుకోకు. ఋణపడి నీ పేరుప్రతిష్ఠలు పోగొట్టుకోకు. నీ స్నేహితుడి కోసం, అవసరమైతే, నీ జేబులోనించి డబ్బుతీసి ఖర్చుపెట్టు. కాని అతనికి హామీగా నిలవ వద్దు. పందెం కట్టకు. తప్పుడు త్రాసులో తూచకు. బంటుని నష్టపోకు. నీ దగ్గిర ఉండగా ఎవరినీ అడగకు. నీ దగ్గర లేకపోతే, లేనిది కావాలని అడగడమెందుకు ? గ్రామమంతా నీదే అయినప్పుడు, అందులో, ఎవరినో ఒకరిని మాత్రం గొప్పగా చూడకు. ఎవరినీ అనవసరంగా దూషించకు ; పొగడనూ వద్దు ; తెలివైనవాడిని పొగడడం మంచిదేకాని, బుద్ధిహీనుడితో స్నేహం చెయ్యడం మాత్రం, మంచిదికాదు. కష్టించి సంపాదించిన రొట్టె రుచిగా వుంటుంది. పంచదార, నెయ్యి, దొంగిలించడం కానిపని. అకస్మాత్తుగా వచ్చిన అతిథికి, గుప్పెడు తీసి ఇవ్వడానికి వెనుకాడకు. ఉన్నదానితో తృప్తిపడు. విసిగిపోకు. ఆర్జించిన దానిలో కొంత మిగుల్చుకో. మంచికోసం సందేహించకుండా ఖర్చుపెట్టు.

ఒక్క విషయం చెబుతున్నాను. మంచిపనులు చెయ్యవలసిన సందర్భంలో మాత్రం తటస్థంగా వుండకు. ఈ విధంగా ప్రవర్తించుకుంటే నీ పేరుప్రతిష్టలు తప్పకుండా లోకానికి వెల్లడి అవుతాయి. మంచి ఆలోచనలకి భయపడకు. మంచి స్నేహం విడనాడకు. విభజించడంలో నమ్మకు. భగవంతుడిని పూజించడం మరవకు.

## కేశవసుత (*1866–1905*)

### ముళ్లులేని గులాబి లేదు

ముళ్లులేని గులాబీ లేదు
ఈ సత్యం మనస్సులో మననం చేసుకో
అప్పుడు నిరాశ నిన్నెప్పుడూ వ్యాకులపెట్టదు
సుఖం; దుఃఖం, కలిసేవుంటాయి, ఎప్పుడూ, ఈ లోకంలో
సుఖం కోసం శ్రమించినప్పుడు, దుఃఖమూ మనపాల పడుతుంది
నీడపడని వెలుగు, ఎవరైనా, ఎప్పుడైనా చూశారా?
వెలుగుతో నీడ సమ్మిళితమైనప్పుడే చిత్రం తయారవుతుంది
ఈ లోకం మెచ్చుకోవలసిన దొకటే
అదే ప్రేమ.
కాని హృదయవిదారక మేది:
ఇదీ, అదే ! ప్రేమే !!
ప్రామాణికం ఏమీలేదు. ఈ ప్రాపంచిక జీవితం వక్రమార్గాన్నే నడుస్తుంది.
ఇది అసహ్యమే. ఇది గుర్తించి, తప్పించుకోలేకపోయినా,
దుఃఖించడం, శోకించడం మానెయ్యి !

## కేశవసుత

### కొత్త సిపాయి

నేను ఈ కొత్తయుగంలో, ధైర్యవంతుడినయిన సిపాయిని. నాలో, కొత్త ఉత్సాహము, శక్తి ఉన్నాయి. నన్ను ఎవరు, తలవొంపించగలరో చూస్తాను. నేను బ్రాహ్మడిని కాను. హిందువునే కాను. నేను ఏ కులానికీ చెందినవాడిని కాను. నా పరుధులు పరిపూర్ణంగా నిర్ణయిస్తూ, గిరిగీసిన వాళ్ళు, నిజంగా హీనులు. నా ఆకలి అనంతం. ఒక రొట్టె ముక్క నాకు సంతృప్తి ఇవ్వదు. నేను కూపస్థమండూకాన్ని కాను. నా తోటచుట్టూ ముళ్ళ కంచెలు వెయ్యడం నేను సహించలేను. నే చూస్తాను! నన్నెవరు విధేయుడిగా చెయ్యగలరో! నే ఎక్కడికి వెళితే అక్కడ నాకు అక్కచెల్లెళ్లు; అన్నదమ్ములే కనిపిస్తున్నారు. ఎక్కడా, నాయింటి చిహ్నాలే కనిపిస్తున్నాయి. ఎక్కడికి వెళ్ళినా, కాలికింద భూమి, గడ్డితో

కప్పిన భూమే ! ఎక్కడికి వెళ్ళు ; పైన నీలాకాశమే కనిపిస్తుంది. ఈ అందమైన సున్నిత మైన, పిల్లలు, సూర్యకాంతిలో పుష్పాలలా కనిపిస్తారు. వారిని చూసినప్పుడు నా మనం ఊగుతుంది. వాళ్ళు నావాళ్ళు. నేను వారివాడిని. ఉభయులలోనూ, కొత్తశక్తి ప్రవ హిస్తోంది. నే చూస్తానుగా, ఎవరు నన్ను లొంగదియ్యగలరో !

నే ఎవరిని పూజిస్తున్నాను ? సందేహమెందుకు ? నా ఆత్మనే పూజిస్తున్నాను. విశ్వమంతా నాలో కనిపించుతోంది కనక నన్నే పూజించుకుంటున్నాను. 'నేను' అంటే 'నాకు' 'నా' అన్న అర్థంలేదు. సంకుచిత దృష్టితో ప్రవర్తించేవారందరూ అపదలు ఆహ్వా నించుకుంటున్నారు. నేను చిన్నా, పెద్దా ; కొంచెము, గొప్పా, గుర్తించను. మంచిచెడ్డల ద్వైతభావం సమసిపోతుంది. దగ్గర, దూరం అన్నభావంకూడా అదృశ్యమైపోతుంది. ప్రతి ఒక్క విషయమూ, నాకు పెద్దది, గొప్పది, మంచిది, సన్నిహితమైనది అనే అనిపిస్తుంది. సర్వమూ వ్యాపించి, నే జీవిస్తున్నాను. ఇప్పుడు చెప్పండి, ఎవరు నన్ను అదుపులో పెట్టగలరో !

నువ్వుల హల్వా చేసేటప్పుడు వేగుతున్న నువ్వులమీద ఆరారా పంచదార పానకం పోస్తారుకదా ! అప్పుడు నువ్వుగింజని ఆవరించి పంచదార పేరుకుంటుంది. రుచిలేని గుణ రహితమైన నువ్వుగింజ చుట్టూ తియ్యటి రుచితో ఏ విధంగా పంచదార పాకం ఆవరించి, పేరుకుని ఉంటుందో, ఆదేవిధంగా గుణరహితమైన ఆత్మని, జడమూ, కఠినమూ, మాంద్యమూ అయిన అహంకార ప్రేరేపణగుణం ఆవరించి వుంటుంది. పైగా నువ్వుగింజని చుట్టుకున్న పంచదార తియ్యగాఉన్నా, మొనతేలి, పక్కనున్న నువ్వుగింజని పొడవడానికి సిద్ధంగా ఉన్నట్టు కనిపిస్తుంది. లోకంలో ప్రజల రీతికూడా ఇదేవిధంగా ఉంది. కాని ఈ వైరం, పోరాటం ఏలా సమసిపోగలదు ? ఇది నా మనస్సుని కలవరపెడుతున్న ఆందోళన. మనం ప్రాణంతో ఉన్నంతకాలం శాంతిసామ్రాజ్యం స్థాపిద్దాం. నేను భగవ ద్దూతని. ఒక కొత్త ఉత్సాహంతో, శక్తితో నేను ఓ ధైర్యశాలినయిన సిపాయిని.

బాలకవి (*1890-1918*)

## * ఔదుంబర వృక్షం

ఈవలి, ఆవలి ఒడ్డులనున్న పచ్చని గడ్డిబయళ్ళని స్పృశిస్తూ, ఓ లంకనుంచి మరోలంకని చుట్టుతూ ప్రవహించుతోంది నల్లని, నీలపు నీటిప్రవాహం. దూరాన కొండ సమీపాన ఉన్నది ఓ నాలుగు గడపల కుగ్రామం. కాని గ్రామం ముందర చాలా దట్టమైన పచ్చని తోటలు, పచ్చికబయళ్లు. తోటలు, పచ్చికబయళ్ళ మధ్యనించి మెలికలు తిరుగుతూ నలిగిన కాలిబాట. బాటచివర ఓ నల్లనికొలను. నీటిలో కాళ్ళుపెట్టి కూర్చున్నట్టుగా, వేళ్ళు నీటిలో పాకగా, కొలనుఒడ్డున ఉన్నది ఓ ఔదుంబర వృక్షం. ఆ చెట్టునీడతో లభించింది కొలనుకి, ఓ కమ్మని ఆకర్షణీయమైన నల్లదనం.

* [ ఔదుంబర వృక్షం భగవాన్ దత్తాత్రేయులకి ప్రియమైన వృక్షం. కనక దత్తాత్రేయులని పూజించేవారందరికి ఇది పవిత్రవృక్షం. ఈ వృక్షమెక్కడ ఉంటే, అక్కడ జలధారకూడా ఉంటుందని నమ్మకం.

ఇది మేడిచెట్టుని పోలిన చెట్టు. ]

## బి. ఆర్ తాంబె (1874-1941)

### అయ్యో, అయ్యో, అంటారు ప్రజలు, ఒక్కక్షణం

ఒక్కక్షణం ప్రజలు అయ్యో, అయ్యో అంటారు. నేపోతే పని ఆగిపోతుందా? సూర్యుడు ప్రకాశిస్తాడు. చంద్రుడు తళతళలాడుతాడు. నక్షత్రాలు వాటి గమనం అవి సాగించుతాయి. యథాప్రకారంగానే గాలులు వీచుతాయి. వీటికి ఏ ఆటంకమైన ఉంటుందా? మేఘాలు వర్షిస్తాయి, పంటలు పండుతాయి. నదులు ఉప్పొంగి, విర్రవీగి, ప్రవహిస్తాయి. ఒడ్డున పూర్వపు కాలిబాటలే తిరిగి కనిపించుతాయో లేదో, ఎవరికి కావాలి! స్నేహితులు, చుట్టాలు కన్నీళ్ళుకార్చి, మళ్ళీ తమపనులు సాగించడం ప్రారంభిస్తారు. లేస్తారు. కూచుంటారు. నవ్వుతారు. కేరింతలు కొడతారు. నే చనిపోతే వారికి పోయేదేమిటి?

రాముడు, కృష్ణుడులాటి భగవదవతారమూర్తులే అదృశ్యమయారు. వారు పోయిన తరవాత లోకం అనాథ అయిపోయిందా? అనంతంగా, ఎవరికి మాత్రం మైలపట్టారు. నే లేకపోతే దినక్రమం ఆగిపోతుందా?

ఇలాటి ప్రపంచం కోసం మనం చిరచిరలాడుతూ బాధపడాలా? ఎవరి తృప్తి కోసమో, కోర్కెలు తీర్చడము కోసమో, మనం ఎందుకు పాటుపడాలి! భగవంతుడి సందేశ దూతలకి మనం ఎందుకు ఎడమొహమవాలి? మనం శాంతితో ఎందుకు నిమగ్నమవ కూడదు?

## యశ్వంత్ (జననం 1899)

### లోకం పోకడ

ఓ ప్రపంచమా! నీ నడత అంతా అపసవ్యమే. నీ తోటలోనుంచి, ఎప్పుడైనా, ఒక్కపుష్పం నాకు లభించాలని ఎంతో కోరికగా ఉండేది. కాని ఫలించలేదు. ఇప్పుడు పాడెకట్టె అంతా పువ్వులతో నిండిపోయింది. నే కాలినడకను ప్రయాణం చేసినప్పుడు, అడుగడుగునా, నే తూలి పడిపోయేలా చేశారు. శవం మొయ్యడానికి భుజం ఇవ్వాలని, అందరూ ఆత్రుతపడుతున్నారు. బజారు వీధిద్వారా, ఎంత ఆడంబరంగా, శవాన్ని మోస్తూ, నడుస్తున్నారు! బ్రతికివుండగా, ఒక్కడు, ఒక్క తియ్యటిమాట, శుష్కప్రియంగానైనా పోనీ, అనలేదు. నన్ను నిర్దాక్షిణ్యంగా విమర్శించారు. కాని, ఇప్పుడు నా పొగడ్తలతో

మెప్పులతో స్మశానభూమి అంతా మారుమ్రోగిపోయింది. అలాగే ఒక్క ఆహ్వానంకోసం, మూడులోకాలూ, విఫలుడనై తిరిగాను. కాని, ఇప్పుడు, శవాన్ని కౌగలించుకోడానికి నా బంధువులందరూ గుమిగూడారు. నా జీవితమంతటిలోనూ, నా మంటలు చల్లార్చడానికి ఒక్క చుక్క నీరు ఇచ్చినవారెవరూ లేకపోయారు. కాని ఇప్పుడు, నా శవంమీద ఎన్ని బిందెల నీళ్ళు పోశారు.

స్నేహబాంధవ్యం అనే కుటీరం నిర్మించాలని ప్రయత్నించాను. ఎండిన గడ్డి పరకలే చేతికి దొరికాయి. తలమీద ఇనపముళ్ల చీలతో దెబ్బలు బాదారు. ఇప్పుడు నది ఒడ్డున, ఎముకలమీద దేవాలయాలు లేచాయి.

వెచ్చదనం కోసం ఆవరణలు నిర్మించుకోలేకపోయాను. నిరుపయోగమైంది. కాని ఇప్పుడు రాత్రిపగలు, ధూపదీప నైవేద్యాలే జరుగుతున్నాయి. జీవితమంతా పీడనకి లోనై, చివరికి ప్రాణం విడిచాను. ఇప్పుడు నేనంటే ప్రేమ ఒలకపోస్తున్నారు.

ప్రపంచమా ! శాంతిని ప్రసాదించే నీ మార్గం నిజంగా పావనమార్గం.

**బి. బి. బోర్కర్** (*జననం 1910*)

## జీవితం సాధించారు

ఎవరి అహంకారం పండిన ఫలంలాగ రాలి పడిపోయిందో
ఎవరి మనసు నీటిలాగ నిర్మలమో
ఎవరు, కలుసుకున్న అందరితోటీ ఐక్యమయారో
చేతనా చేతన జీవాలకి ఎవరు ప్రాణమయారో
స్నేహపుబీజం ఎవరు మొలకలెత్తించారో
ఎవరి హృదయాలు, సముద్రమంత విశాలమై, అన్నిభావాలు ఇముడ్చుకుని
అర్థం చేసుకున్నాయో
ఎవరు, ఆర్చుకుపోయిన భూములవైపు మేఘాలు పయనించినట్టు
ఆర్తులవైపు మొగ్గుతారో,
ఎవరి దూరదృష్టి పాపాన్ని కాల్చివేసిందో
ఎవరి పురోభివృద్ధివల్ల యోగ్యత, అర్హత, పుష్పించి, సుగంధిత మవుతాయో
ఎవరు నక్షత్రాల గొప్పతనం, తమ ఆత్మజ్ఞానంతో తులతూచారో
ఎవరు అనాదిబ్రహ్మాన్ని, ఇంట్లోవుండే గ్రహించి, సిద్ధి పొందగలిగారో
వారే జీవితం సాధించుకున్నారు.

(40)

## కుసుమాగ్రజ (జననం 1912)

### ఈ అమర పతాకం

ఈ అమరపతాకం
ఈ నిస్సహాయమైన జెండా
ఆగకుండా ఎగురుతుంది
ఇది వీరుల రక్తంతో తడుస్తుంది.
పుణ్యపురుషుల విశ్వాసంతో మొలకలెత్తుతుంది.
ఈ నిర్భయమైన త్రివర్ణపతాకం
నీలి ఆకాశంద్వారా, నూతన జీవితం ప్రసాదిస్తుంది.
దీనికి ఈ ధవళ హిమగిరి ఆశ్రయమిస్తుంది.
అనంతమైన ఈ సముద్రజలాలు తర్పణలర్పిస్తాయి.
తూర్పుకొండమీద ఉదయభానుడులాగ, ఈ అమరపతాకం ప్రకాశిస్తుంది.
గాయపడిన భూమాత హృదయంలో స్వప్నాలు ఇక్కడ ఫలిస్తాయి.
ఈ అమరపతాకం, జనసంపద సంరక్షించడానికి మెలకువతో, మెలగుతుంది.
ఇతరులూ మెలిగేటట్టు చేస్తుంది.
ఇది దళిత, పీడితవర్గాలకి రక్ష.
ఇది సమత్వపు రాజుగా, ఠీవితో పురోగమిస్తుంది.
అపారమైన అంధ, అమానుష శక్తులు, ఈ జెండాధాటికి చీలి
చెల్లాచెదరయిపోతాయి.
నక్షత్రాల మధ్యనించిగాని, ఇంద్రధనస్సు గేటులో ప్రవేశించికాని,
ఎక్కడికి ఈ నీలిచక్రం వెళ్లినా, అక్కడో కొత్తప్రపంచం
మొలకెత్తుతుంది.
విశ్రాంతిలేకుండా ఎగురుతుంది, ఈ అమరపతాకం!

## ఇందిరాసంత్ (జననం 1913)

### ఓ సూర్యభగవానుడా త్వరగా ఉదయించు

ఓ సూర్యభగవానుడా, త్వరగా ఉదయించు
రావయ్యా, త్వరగా
బంగారు నడకలతో, ఈ గృహాన్ని అలంకరించు
గోమయంతో అలికిన ప్రాంగణం

పసుపు కుంకుమలతో పెట్టిన, పవిత్ర ప్రదేశం సూచించే, స్వస్తికముగ్గు
తెరచిపెట్టిన గృహాలు నీకు స్వాగతమివ్వడానికి ఆతృతపడుతున్నాయి.
సూర్యభగవానుడా, త్వరగా ఉదయించు.
ఆలస్యం చెయ్యకుండా, రా !

సూర్యభగవానుడా, నువ్వు ఆకాశం నడిబొడ్డుకి
చేరుకున్నావు
భూమి, పైనుంచి ప్రసరించిన కాంతితో తళతళలాడుతోంది.
తెరచిన కిటికీలలోనుంచి
ఇంటికప్పు పైనుంచి, పెంకుల సందుల్లోనుంచి, నా యింట్లో
ప్రసరించిన వెండి కిరణాలు
కొంతసేపు తారట్లాడాలి
వీడ్కోలు చెప్పేటప్పుడు
బంగారుద్వారం ద్వారా
ప్రాంగణంలోకి రా
మాతృప్రేమకంటె మృదువైన నీ హస్తాలతో
ప్రాంగణంలో ఆడుకుంటున్న పిల్లల్ని
లాలించి, ప్రోత్సహించు.
కిటికీలని రంగులతో అలంకరించు.
మనస్సు అలిసిపోయింది.
ఈ ప్రాపంచిక జీవితం
ఆశాజనకమైన
అరుణ ఆనందంలో ఓలలాడించు.

# మలయాళం

మూలం :
శ్రీ కె. కె. నాయర్
ఆచార్య పి. కె. నారాయణపిళ్ళై

అనువాదం :
డా॥ ఎన్. శివరామమూర్తి
శ్రీ జొన్నలగడ్డ వెంకటేశ్వరశాస్త్రి

## చారిత్రక సమీక్ష

తూర్పుకనుమల అస్పష్ట నీల వర్ణ రోచులకు, పడమటి వైపున అరేబియా సముద్రపు గాఢ నీల వర్ణోజ్జ్వలతకు మధ్య పరచుకొనివున్న పచ్చపట్టు కేరళం. దీని ఆదిమ చరిత్రఅంతా పురాప్రపంచ వాణిజ్యం, వాణిజ్యరథ్యల చరిత్రలో అంతర్భాగంగా ముడిపడివుంది. ఈ విపణి మార్గాలన్నీకూడా ఒక వైపున ఫొనీసియా, రోమ్‌నగరాలను, ఇంకొక వైపున భారత దేశాన్ని, దూరప్రాచ్యాన్ని అనుసంధానం చేస్తూ ఉండేవి. కేరళదేశ చరిత్రం ప్రాచీన ద్రవిడ దేశపు చరిత్రలో ఒక భాగమే పురాగాథోజ్జ్వల చరిత్రలో ప్రఖ్యాతి వహించిన చోళ, పాండ్య భూవల్లభులతోపాటుగా కేరళను పాలించిన చేరరాజన్యులు కూడా త్రయీసార్వభౌమతలో పాలుపంచుకొన్నారు (మూవరసర్). మూడు మహారాజ వంశాలలో కేరళ పాలకులైన చేర వంశీయులు కూడా చేరివున్నారని దీని అర్థం.

తొలుత బిషప్ కాల్డ్వెల్ మలయాళాన్ని తమిళం మాండలికంగా పరిగణించాడు. కాని తర్వాత తన తప్పును దిద్దుకొన్నాడు. తమిళానికి తోబుట్టువుగా దీన్ని తర్వాత నిర్ధ రించాడు. కేరళ భాష, దాని సంస్కృతి కూడా ద్రావిడ జన్యమే అయినప్పటికీ, ప్రాతిపదిక ద్రవిడ సంబంధి అయినా, సంస్కృతసంప్రదాయాన్ని ఎంతగానో స్వాయత్తం చేసుకొని సుసంపన్నతను సాధించింది- తమిళ మహాకావ్యం శిలప్పదిగారం (మంజీర మహా గాథ) చేర రాజ విరచితమే, పతిట్టు పాట్టు అనే గాథా సంకలనం (పది పదుల గాథలు) చాల వరకు చేర రాజన్యుల కీర్తిని తమిళ కవులు గానంచేసిన గాథలే. ఈ తమిళ కవులంతా చేరరాజుల ఆశ్రితులే. తొమ్మిదో శతాబ్ది వాడైన కుల శేఖర మహారాజు, 'పెరుమాళ్‌తిరుమొళి' కికర్త. ఈయన తమిళ సంప్రదాయపు వైష్ణ వాళ్వారులలో చాలా ప్రసిద్ధిని కూడా పొందిన మహ నీయుడు. ఈ మహారాజు సంస్కృతంలో ముకుందమాలను కూడా రచించాడు.

ఈ భాష ఉద్భవ వికాసాలను చాలా సంక్షేపంగా మాత్రమే ప్రస్తావించగల అవ కాశం ఉంది ఇక్కడ. ఈ భాష ఆదిమాకృతిని పునర్నిర్మించడంలో చాలా సాధక బాధకాలు ఎదుర్కోవలసి వచ్చింది. ఎంతో కాలం వరకూ కూడా తమిళమే అధికార భాషా ప్రాబల్యం వహిస్తూవచ్చినందువల్ల ఈకష్టం ఎదురైంది. ప్రజావ్యవహారస్థమైన మలయాళభాషసంపూర్ణంగా

వికాస స్థాయికి చేరుకొన్నప్పటికీ కూడా పాలనభాషగా తమిళం కొనసాగుతూనే వచ్చింది. అయితే అత్యంత శక్తిమంతంగా రూపొందిన జనజీవన భాష పాలనభాషలోకి చొచ్చుకొని పోగలిగింది. అందువల్లనే ప్రభుత్వ శాసనాలలోను, రాజకీయవ్యవహారపత్రాలలోనూ కూడా తొమ్మిదో శతాబ్దానికే అధికార భాషలోకి చేరిపోయి, దాని కావ్య ప్రౌఢలు భాషాస్థాయిని సంకరం చేయగలిగింది. అధికారభాషను స్థానభ్రంశంచేయడానికి ఇది ఎప్పుడూ మొదటి మెట్టుగా ఉపకరిస్తుంది. కవిత్వంలో కూడా బహువిస్తారితమైన పదబాహుళ్యాన్ని చొప్పించడం మాత్రమే కాక, తనదైన వినూత్న వాక్యనిర్మాణ వైఖరి, వ్యాకరణ మర్యాదలతో ఒక సమ్మిశ్రణ శైలిని కూడా సృష్టించకలిగింది. ఈ సంధికాలంలో కొన్ని వింతరచనలుకూడా ఈ కలగాపులగపు శైలిలో రావడం జరిగింది అయితే ఈ విధమైన స్థానపరివర్తనం పూర్తి అయ్యేలోగా కేరళలో సంస్కృత ప్రభావం పూర్తిగాపాదుకొన్నది. అందువల్ల ఇదివరకటి వ్యవహారం మళ్ళీ ఇంకో సారి పునరావృతమైంది. ఇంకొక విధమైన భాషాసమ్మిశ్రణ శైలిరూపొంది, ఈసారి ఈ సాంకర్యశైలిలో కొన్ని కొత్తకావ్యాలు పుట్టుకొని వచ్చాయి. అయితే ఈసారి ఈ సమ్మిశ్రణం మలయాళ, సంస్కృతాల మధ్య జరిగింది. ఈ సమ్మిశ్రణం చాలా ఉపజ్ఞాసహితంగా జరిగింది. శబ్దాల కూర్పులో ఒక మాధుర్య సమృద్ధి సానురూప్యతలతో ఈ సమ్మిశ్రణ కావ్యశైలి వైడూర్యాలు ప్రవాళాలు కలిపి గుచ్చిన మాలవలె రూపొందింది. అందువల్లనే ఈశైలికి మణి ప్రవాళమన్న పేరు వచ్చింది. భాష ఇంక ఇంకా వికసనదశను చేరుకొనే సమయానికి సంస్కృత వ్యాకరణాన్ని ఉల్లంఘించింది, కాని సంస్కృత పదజాలాన్ని విలీనం చేసుకొంటూ వచ్చింది. దీని ఫలితంగా మలయాళం స్వరసుభగతను ఎంతగానో సాధించుకొని అనంతంగా సుసంపన్నతను సముపార్జించుకొన్నది. అచ్చద్రావిడ పదాల పోహళింపుతో అడవిగాలి వీస్తున్నప్పటి నాద మాధురికీ, విచక్షణతో కూడిన సంస్కృత పదాల కూర్పుతో శ్రావ్యతానమృద్ధికీ మలయాళం సమర్థం కాగలిగింది. సంస్కృతచ్ఛందాలు పఠనగాంభీర్యతను ప్రసాదించగా ద్రావిడ ఛందాలు రెక్కలు విప్పుకొని సునాదమాధుర్య సమృద్ధినిస్తూ విహారాలు సలుపగలవు.

**జానపద కవిత:**

ఇదమిత్థంగా కాలనిర్ణయం చేసి చెప్పటానికి ఎన్నో ఇబ్బందులున్నప్పటికీ సమ్మిశ్రణ భాషాశైలితో వెలువడిన సాహిత్యాల ముందు కాలంనుంచీ ఈ జానపదకవిత ఉంటూనే ఉన్నదని నిర్ధారణగా చెప్పవచ్చు. ఒక విధంగా ఈ సమ్మిశ్రణ భాషాశైలిలోని సాహిత్యం శిష్టసాహిత్య వర్గాలవారి కృతకసృష్టి అనికూడా అనవలసివుంటుంది. ఈ జానపద సాహిత్యం ఒక పారంపరికమైన గొప్ప సంప్రదాయాన్ని సృష్టించింది. ఆర్థికంగా సాంఘికంగా అట్టడుగు స్థాయిలో వున్నవారు సృష్టించిన సాహిత్యం కావడంతో ఈ జానపద కవితలలో దుర్భరమైన సామాజిక దోపిడిని గూర్చి నిరసన భావాలు వ్యక్తమవుతూ వుంటాయి కొంతవరకు. అయితే సర్వసాధారణంగా ఈ కవితలన్నీ ఉల్లాస కరమైన ఆశావాదదృక్పథాన్నే వెలారుస్తుంటాయి. సుకుమారమైన భావ సంపదతోను, లలిత పదవిన్యాసంతోను, సరళాతిసరళంగాను, శతాబ్దుల తరబడిగా జానపదస్రవంతి ప్రవహించింది, నదీతీర జీవిత విస్తృతిని, పనిపాటల, విరామ వినోదాల చక్రీయక్రమాన్ని, ఋతుశోభను, జననమరణాల వైచిత్రిని ఈ జానపదకవితలు ప్రతిబింబింపజేస్తూ ఉంటాయి. కేరళీయులకు లాలిపాటలు, పెళ్ళి పాటలు, మృతిగీతాలూ ఉన్నాయి.

ఈ జానపద సాహిత్య సంప్రదాయంలో నిరంతర వైవిధ్య విస్తృతికి చోటున్నది. ఈ విధంగా వికాసంచెందటంలోనే దాని ప్రాణశక్తి పొడకడుతుంది. శిష్టులు అవలంబించి కొనసాగించిన సంస్కృతసంప్రదాయం జానపద సాహిత్యంలోకి కూడా ప్రవేశించగలిగింది క్రమంగా. అయితే ఈ సంప్రదాయేతివృత్తాలు జానపదుల నోళ్ళలో విడ్డురానికీ, వింతవింతలకూ కూడా ఆలవాలమైనాయి. రామాయణ, మహాభారతాల పాత్రలను, సంఘటనలను తారుమారు చేసిన వైపరీత్యాలకు కూడా జానపద ఊహాశాలిత ఆకరం కాకపోలేదు. భీముడు తన వీరోచిత సాహసకృత్యాలన్నిటిలో కొంత విదూషకప్రవృత్తిని కూడా జతచేస్తూ ఉంటాడు. అతడు కౌరవుల పాపపు ఎత్తులన్నిటినీ భగ్నంచేయడంలో ఒకవిధమైన సంతోషాన్ని పొందుతారు జానపదులు.

తరవాత తరవాత కాలపు జానపదగీతాలు ఒథేనన్, ఆరమాల్ అనే సాహస వీరుల గుణగానంచేసే గాథావళిగా రూపొందుతూవచ్చాయి. ఈ యోథాగ్రేసరులు తమ జీవితాలనే పణంగా ఒడ్డి, మృత్యువును అత్యంత నిబ్బరంగా ఎదుర్కొన్నారు. కనియకులంరణక్షేత్రపు వీర గీతం పదిహేడో శతాబ్దికి చెందినది. ఈ వీర గాథ మిక్కిలి విషాద శబలితంగా వుంటుంది. గంభీరంగా సాగుతుంది.

ఈ వీరగాథా కావ్యంలో ప్రారబ్ధానికీ సాహసానికి మధ్య సంఘర్షణ తటస్థించడమే ఇతివృత్తం. ఆది భవితవ్యంగా పరిణమిస్తుంది. చివరకు మరణంద్వారా కూడా స్వాత్మతృప్తిని సాధించడం జరిగింది. కొన్ని పాటలలో కుల పట్టిపుల ఆంక్షలవల్ల సంభవించిన భగ్నప్రేమలు వర్ణితాలు. ఇంకాకొన్ని గాథలు అయ్యప్పన్ వంటి దివ్యమూర్తుల బోధలకు సంబంధించినట్టివి. భేదభావాలన్నిటిని తొలగదోసే పరిపూర్ణమైన సందేశం ఆయనది.

## శిష్ట కవిత

జానపద కవిత వరిపొలాలనుంచీ కొబ్బరితోటలనుంచీ గుళ్ళనుంచీ, దేవతల గురించీ, యుద్ధభూములలో అసువులను సైతంలెక్క చేయకుండా పోరాడే యోధవరుల గురించి ప్రభవించగా, మణిప్రవాళ రచనలన్నీకూడా రాణివాసవిలాస భోగినీ మందిరాలనుంచి వెలువడ్డవి. సంస్కృత సంస్కృతీకరణం ఉద్యమంగా సాధించిన వలస వచ్చిన వర్గమూ, వారితో సన్నిహిత సంబంధ బాంధవ్యాల నెలకొల్పుకున్న వారివర్గం కూడా సాంఘిక, భూస్వామిక, ఆర్థిక, వ్యవస్థీకృతమైన స్థూపాకృతికి శిఖరస్థానీయులైనారు. లోకంలో ఎప్పుడూ కూడా శ్రీమంతులైన ఉన్నత వర్గాలవారు ఆనందమే జీవనపరమార్థమన్న సంప్రదాయాన్ని సృష్టించుకోగలరు. వాళ్ళు సంస్కృతీపరులు కూడా కావడంతో వాళ్ళఅభిరుచులు అధమస్థాయికి దిగజారడంకానీ, మొరటుగా పరిణమించడంకానీ జరగలేదు. అయితే వీళ్ళ సంస్కృతి నీతిదూర శృంగార విలాసభరితము, అత్యంతనాగరీకమూ అయినది. ఈ సంస్కృతి ఎటువంటిదంటే కాటలస్న్నూ, ఓవిడ్‌లు పరిపాలించిన కాలంలో రోమునగరపు ఉన్నత సాంఘిక వర్గాల విలాసభరిత నీతి బాహ్య సంస్కృతి వంటిదే. మణిప్రవాళ ధోరణికి చెందిన తోట్టతొలుతటి రచనలలోదీ, పదమూడో శతాబ్ధికి చెందినదీ అయిన వైశికతంత్రం, తొమ్మిదో శతాబ్ది వాడైన దామోదరగుప్తుడి రచన కుత్తానినాటను ఆదర్శంగా స్వీకరించినదే. దానిలోమాదిరిగానేదీనిలోకూడా శీలహరణమే చెప్పుకోదగిన గొప్ప ఇతి వృత్తంగా ప్రతిపాదించడంజరిగింది.

ప్రణయానికన్నా కాముక ప్రవృత్తిని, ఆత్మకన్నా శరీర ప్రాధాన్యాన్ని, పారదారిక చిత్తవృత్తినీ మనం నిరసించవచ్చు. కాని ఈ కవితా వస్తువు కావ్యశైలిని రమణీయ తరంగా దిద్దితీర్చింది. విశ్వసించలేనంతగా స్వరసుభగతను కూర్చింది. అంతేకాదు ఈ కావ్యవస్తువు బహువిధాలైన ఆకృతిక విభాగాలను కూడా రూపొందింపజేసింది. పరమరమణీయంగా ప్రియతమ ఆకృతికనేపథ్యాన్ని సుకుమారంగా ఒక్క పద్యంలో వర్ణించడం, పది పద్యాలు మొదలుకొని ముప్పైదాకా ఉండే ఖండకావ్యరచనమూ- ఇందులో సన్నివేశ గాథాకల్పనం కూడా వుంటుంది-ఇంకా సుదీర్ఘ గీతికా రచనమూ, వృత్త గంధిరచనమూ (చంపు)-ఇది పాడ టానికి అనువుగావుంటుంది- ఇవి సందేశకావ్యాల బాణీలోకూడా వుంటవి-అంతేకాకుండా పథిక గాథలుగాకూడా వుండవచ్చు, వీటన్నిటికిన్నీ మూల రచనమైన కాళిదాను మేఘసందేశంలాగా- ఈ మొదలైన అవాంతర విభాగాలెన్నో ఈ కవితా విభాగంలో చేరుతాయి. ఈ విధమైన కాముక విలాస రచనలు రెండుశతాబ్దాలుకొనసాగాయి. ఆ తర్వాత మోహంమొత్తి అవి నశించి పోయినవి. ఈ అంత్యఘడియలు చంద్రోత్సవ కావ్యావిర్భావంతో మరింత శీఘ్రంగా సమీ పించాయి. ఈ చంద్రోత్సవం 1500 ప్రాంతంలో వెలువడింది. ఈ కావ్యం భోగినీ మందిర కైవారకవితలను, ఆ కవితల్లజులను బాగా హేళనచేయడంకూడా జరిగింది. ఆకవులకు ఇంత కన్నా వేరేపనిలేదనీ, ఆ భోగస్త్రీలచుట్టూచేరి వారి అందచందాలు, స్తుతించడంకన్నా వేరే ఉపజ్ఞ వారిలో కనపడదనీ చంద్రోత్సవం దెప్పి పొడిచింది.

## కావ్య సంప్రదాయం

ఇంతలో ప్రౌఢకావ్యధోరణి ఒకటి ప్రారంభమైంది. సాహిత్యం ఆలోచనాత్మకంగా సాగాలన్న ధోరణి ప్రచురమవుతూ వచ్చింది. గానం చేయడానికి అనువైన-పఠించడానికన్నా- ద్రావిడ ఛందాలను స్వీకరించి, తమిళ—మలయాళ సమ్మిశ్రణశైలిలో చీరామన్ అనే (శ్రీరామ) కవి వాల్మీకి రామాయణం ఆధారంగా రామచరితమ్ రచించాడు. పన్నెండో శతాబ్దిఅంతంలోనో లేదా పదమూడో శతాబ్దితొలి పాదంలోనో ఈ రామచరితం రచితమైంది. 1350-1450 సంవ త్సరాల మధ్యకాలంలో నీరణం కవులు—ఈ కవి కుటుంబంలోచాలా ప్రతిభావంతులైన సోదరులిరువురు, వారి భాగినేయుడు ఉన్నారు-రామాయణ, మహాభారత, భాగవతాలను, భగ వద్గీతను, స్వతంత్రకావ్యాలుగా యథేచ్ఛా సంగ్రహరచనలుగా కూర్చి ప్రకటించడం జరిగింది. చివరిదైన గీతానువాదం బహుశా ఆయాభాషలన్నిటిలోనూ ఈ మహాగ్రంథపు తొలిఅనువాదం అయి ఉంటుంది. 15వ శతాబ్దంలో చెరుస్సేరిభాగవతకావ్యాన్ని యథాస్వేచ్ఛానువాదంచేశాడు. శ్రీకృష్ణుని శైశవక్రీడలను ప్రధానేతివృత్తంగా స్వీకరించి ఆయన ఈ రచనచేశాడు. ఈవిధమైన గోకుల బాలుని ప్రేమ పూర్వకారాధనం భారతీయ సంప్రదాయ విశిష్టలక్షణం. ఉత్తర భార తంలో ఇటువంటి రచన చేసినవాడు సూరదాసు. వాత్సల్యప్రణయగీతికా రచనంచేశాడాయన రామచరితమ్ నుంచి చెరుస్సేరివరకు ప్రవహించిన ఈ కావ్యధార, కవితాశైలిలో విలక్షణమైన మార్పును తెచ్చిపెట్టింది. ఒక నవీనస్వరూపాన్ని తెచ్చుకున్నది. తమిళపద బాంధవ్యాన్నుంచి క్రమంగా విడివడుతూ, సంస్కృతపద సాన్నిహిత్యంతో రూపొందసాగింది. అయితే ఈ పరి ణామంలో నిరంతర ప్రయత్నపూర్వకంగా సంస్కృత వ్యాకరణ, వాక్యసంరచన ప్రభావాన్ని పరిహరిస్తూవచ్చింది. అయినా సంస్కృతపదాలను బహుళంగా స్వీకరించి శబ్ద సుసంపన్నతను

సంతరించుకొంది. అయితే ఈ ప్రక్రియలో ఆ పదాలను దేశీయంచేసుకోవడం జరిగింది. ఈ విధమైన భాషాస్థిరీకరణం 16వ శతాబ్దంలో ఎజుత్తచ్చన్ కూడా కొనసాగించడంజరిగింది. ఈ పనిని ఆయన ఎంతో సమర్థవంతంగా నిర్వహించి రామయణ, మహాభారతాల స్వేచ్ఛానువాదాల ద్వారా ఈ భాషా స్థిరీకరణకు స్థిరప్రాతిపదిక కల్పించినందువల్లనే, ఈ సాహిత్యసంప్రదాయానికి ఆయన జనకుడనే గౌరవాదరాలను ప్రజలలో సంపాదించుకొన్నాడు.

సంస్కృత సంప్రదాయ సాహిత్యనిధులైన కావ్యాలను మలయాళంలోకి అత్యంత సమర్థవంతంగా నిరణం కవులు పరివర్తించేబాధ్యతను నిర్వహించగా, ఎజుత్తచ్చన్ గొప్పతనం ఆ కావ్యగాథలను ఎంతో సహజసుందరగా తనలోకజ్ఞతను వెల్లడించుకోగల వాహికలుగా ఉపయోగించుకోవడంలో ఉంది. ఆయనలోకజ్ఞత చాలా విస్తారమైనది, ఆయన ప్రదర్శించిన మానవ సంఘర్షణపరిజ్ఞాన ప్రాగల్భ్యం అస్తిత్వతాత్త్విక సిద్ధాంతానుగుణంగా ఉందని చెప్ప వచ్చు, ఈ సిద్ధాంతం ఆయన రచనారీతికి పూర్తిగా అన్వయిస్తుంది. సమస్త సృష్టిని కబళించ గల, కాలగర్భంలో కలిపివేయగల కాలపరిణామానికి సంబంధించిన విషాదభావుకత ఈ కవిలో విశేషంగా కనబడుతుంది. ఆధునికమైన సమస్త అస్తిత్వ వాదసిద్ధాంత సాహిత్యంలో కూడా జీవిత భయానకపరిస్థితిని, సాఫల్యసాధన అస్థిరత్వాన్ని ఇంతకన్నాసౌమ్యంగా వర్ణించినఘట్టం ఇంకోటి లేదని చెప్పాలి, ఈ ఎజుత్తచ్చన్ చిత్రించిన సన్నివేశాన్ని పోల్చిచూసిన్పుడు. ఎజుత్తచ్చన్ చిత్రించిన చిత్రమిది. కప్ప తన తర్వాతి కబళంకోసం తాపత్రయపడుతూ నాలుక చాస్తున్నది. అయితే దాని పరిస్థితి ఏమిటి? జారిపోతున్నది చిలువ నోటిలో ఆహారనాళమార్గం లోకి. పిపాసలన్నిటినీ మించిన పిపాస ఇది. ముందుగానో వెనుకగానో ఎప్పుడోఒకప్పుడు ఈ పిపాస తీరుతుంది మృత్యుపరిష్వంగంతో. కూడివుండటమనేది వీడిపోవడానికి మాత్రమే అంటా డాయన. అయితే ఎజుత్తచ్చన్ నిరాశావాదికాడు. గ్రీకునాటకకర్తల విషాదశబలితమైన ఆశా వాదం ఎజుత్తచ్చన్‌ది. చంచలమైన కాలసైకతగతిలో కూడా సత్యస్వరూపావిష్కరణం జరగ గలదని ఆయన గట్టివిశ్వాసం. స్వార్థభావాలను అంతరాత్మ బోధించే విలువలముందు స్వచ్ఛం దంగా అర్పణం చేసుకోవడమే వినాశకరమైన క్షయీకరణానికి తగినసమాధానం అని ఆయన అంటాడు. ఈ భావాన్ని ఆయన ఉదార అంతర్ముఖ దృక్పథంతో ఇట్లా వివరిస్తాడు. ''నీ వయసును పరిహరించు, లేదాసకల విశ్వంతో తాదాత్మ్యానుభవాన్నిఅయినా పెంపొందించుకో.'' అధిమానవావిర్భావానికి కేలవరి నిర్దేశించిన మార్గమిదే. దీన్ని నీషిట్‌చే అందుకోలేక పోయినాడు.

ఆ తర్వాత మూడు శతాబ్దాలు సాధించిన ఫలితాలను సుదృఢంచేసుకోవడం జరిగింది. సంస్కృత ఇతిహాసాలు, పురాణాలు, ఆధిభౌతిక, తాత్త్విక గ్రంథాలు మలయాళం లోకి పరివర్తితములైనాయి. అధికసంఖ్యాకంగా కవితాకృతులుగానే ఇవన్నీ వెలువడ్డాయి. ఈ కావ్యరచనా రీతి ప్రధానంగా ఆలంకారికరీతినేపాటిస్తుంది కాని గీతికాంశనుమాత్రం కాదు. అదేవిధంగా పాండిత్యానికే ప్రాధాన్యంకాని మౌలికమైన ఉపజ్ఞకుకాదు. కాలదోషం పట్టిన సుదీర్ఘ కావ్యరచనపై 1902వ సంవత్సరం తర్వాత మళ్ళీ మోజు పెరగడమూ దాన్ని పునరుద్ధ రించాలన్న ఈ మోజు రెండు దశాబ్దాల కాలం భారవి, మాఘకావ్యాల ధోరణిలో కావ్యరచన కొనసాగడమూ జరిగింది. అపమార్గప్రోత్సాహకమైన ఈ ప్రయత్నంవల్ల ఒనగూరిన ఒకేఒక్క

ప్రయోజనం మాత్రముంది. ఆదేమిటంటే క్రైస్తవ ఇతివృత్తాలతో మహాకావ్యరచన సాగటమూ, కావ్యస్థాయికి అది చేరుకోవడమూ, ఇందువల్ల చేకూరిన సత్ఫలితం. గంభీరమైన ఇత్తడి వాద్య బృందంలోంచి ఎప్పుడో గాని వేణువూదిన స్వరాలు వినిపించవీ కావ్యభాషా శైలిలో. జ్ఞానప్పన (కాంతిగీతం) అని పూంతనమ్ విరచితమైన 16వ శతాబ్ది కావ్యంలో, చావు బ్రతుకుల ధ్యానం వైయక్తిక అనుభవ భావతీవ్రతతో ధ్వనిస్తున్నట్లుగా కనబడుతుంది. ఏమిటంటే సున్నిత హృదయుడు, సజ్జనుడు అయిన ఈ కవి తన శిశు విషాదమృతితో ఈ ధ్యానమగ్నుడైనాడు. ఆ తర్వాత నాలుగుశతాబ్దులకు ఆ విధమైన గీతికాధ్యానాన్ని మళ్ళీ వి. సి. బాలకృష్ణ పణిక్కర్ పునః ప్రారంభించాడు. క్షయవ్యాధితో ఈయన అతి పిన్నవయస్సునఅంటే ఇరవైయారేళ్ళ లేతవయస్సున 1915 లో కాలగతిచెందాడు. ఆధునిక కవితోద్యమపుతొలి రోజుల్లో ఈయన మృతిచెందడం విచారకరం. ఆధునికోద్యమం ముగ్గురుమహాకవులతో ఆశన్, ఉల్లూర్ వల్లథోల్‌లతో ఒక స్పష్టాకృతిని ధరించి ప్రారంభమైంది.

**ఆధునిక కవిత:**

ఈ ముగ్గురిలోనూ కూడా ముందుగానే వెళ్ళిపోయిన ఆశన్ మన ఆశయాలకు చేరువైనవాడుగా కనిపిస్తాడు. ఆయన స్వభావసిద్ధంగానే కొంత నైరాశ్య వాదిలాగా కనిపిస్తుంది. దీనికి తోడు భారతీయ ఆధ్యాత్మిక అధిభౌతిక గవేషణా జిజ్ఞాస కూడా ఆయన్ను మరింత గంభీరుణ్ణిచేసి ఉండవచ్చు. ఈ ప్రపంచాన్ని మిథ్య అనీ, అశాశ్వతమనీ భావించడం భారతీయ తత్త్వచింతనలో కనపడుతుంది. అయితే ఆశన్ తన జీవితకాలమంతా తన కులంవారికి సేవచేస్తూ గడిపాడు. ఆయనకులం ఎజవాకులం. ఆయన నాటికి ఈ కులంబాగా సాంఘికంగా వెనకబడి వుండేది. ఆయనలో కనపడే వైరుధ్యాలకి సరిఅయిన సమన్వయం కనపడదు కానిఈ సేవా భావమే ఆయన కవితకు శక్తిని గొప్పగా పురికొల్పింది. క్రియాశీలమైన ఆయన నిత్యజీవిత వ్యాసంగం, ప్రపంచ దృష్టిలో ఒక కృతక సిద్ధాంతిక సమన్వయానికి అందేదికాదు. ఏదో ఒక విశాలపరిధిలో ప్రాపంచిక ఆమోదం కోసం ఆయన యత్నించలేదు. ఆయన చివరకు తేల్చి చెప్పిదేమింటంటే జీవితమూ, ప్రపంచమూ ఏ ప్రయోజనాన్నో నిర్దేశించినవని సహేతుకనిరూణకు లొంగవనీ, పరమార్థం నిరూపితంకాదనీ, దయనీయమైన ఒక ప్రణాళికగానే అవినిలిచి ఉంటాయనీ ఆయన భావం. అయితే వీటిని ఉద్ధరించవచ్చు. నమ్మలేనంతగా పరివర్తింపచేసుకోవచ్చు, అనురాగంతో అనేది ఆయన ప్రతిపాదించినతత్త్వం. ఈ విధంగా తర్వాత ఎప్పుడో అల్బర్ట్‌కేమస్ ప్రతిపాదించబోయే తత్త్వభూమికకు ఆశన్ ముందుగానే ప్రాతిపదికావిష్కరణం చేశాడు. కేమస్ కూడా ఆశన్‌లాగానే దురంత సంఘర్షణకులోనై చివరకు ఆయన విధంగానే ప్రశాంతచిత్తస్వాస్థ్యం సాధించాడు కరుణైక దృష్టినే చరమాలంబనంగా చేసుకొని. ఉల్లూర్ (1877-1949) సంప్రదాయంలోదన్నత సాధించినవాడు,గీతి శ్రావ్యతకన్నా పాండిత్యప్రకర్ష, సాంద్రతకన్నా, రాశిని ఎక్కువగా ప్రదర్శించినవాడు. అయితే ఆయన సందేశం విశ్వప్రేమను చాటేది. ప్రాచీన సంప్రదాయంలో ఆయనదర్శించింది బాధ్యతతో కూడిన, ప్రతిస్పందనగుణం గల క్రియాశీలత, ఆయన బోధలన్నీ సత్యతత్పరత్వంతోనే ధ్వనిస్తాయి. కాని పాండిత్యం పాలు మాత్రంకొట్టవచ్చినట్లు కనపడుతూనే వుంటుంది. వల్లథోల్ (1878-1958) శైలి చాలా సులభమైనది. చొచ్చుకొనిపోగల శ్రావ్యత గలది. ఆయన ప్రవృత్తిని అదిబాగా ఆవిష్కరిస్తూ

ఉంటుంది. ఉదారాశయాలతో ఆయన ప్రవృత్తి ఎప్పుడూ సులభంగా సంచలనం పొందగలదు. గొప్పమార్పును తెచ్చిపెట్టగల రాజకీయ, ఆర్థిక పరిణామాలను గూర్చి ఆయన పూర్తిగా ఆకళింపు చేసుకొని ప్రతిపాదించివుండకపోవచ్చు, అయితే అటువంటి పరిణామాలద్వారా మానవుడికి వెనువెంటనే లభించవలసిన ఫలితాలను గూర్చి ఆయన పూర్తిగా స్పృహచూపకపోలేదు. జాతీయోద్యమ వివిధ ఘట్టాలను గురించి ఆయన గానంచేశారు. గ్రామపునరుద్ధరణావశ్యకతను గురించీ, కులానికి వ్యతిరేకంగా పోరాటాన్ని గూర్చి, విదేశీయ ప్రాబల్యాన్ని గూర్చి ఆయన ఉద్బోధగీతాలెన్నో రచించాడు.

సాంఘికార్థికరాజకీయ రంగాలలో అసంఖ్యాకమైన అన్యాయాలు, సమస్యలు, పోరాటాలు ఆధునిక కవితావస్తువు వ్యక్తంచేస్తుంది. ఇడప్పల్లి(1909–36), చెంగమ్పూష(1914-48) రచనలలో విషాద శబలిత పూర్తిగా ధ్వనిస్తూ ఉంటుంది. అభ్యుదయోద్యమలక్ష్యాలను స్పష్టంగా గుర్తించక పోవడంవల్ల ఈ విధంగా సంభవించిందని చెప్పాలి. రాజకీయసంరంభం కొంతకాలం కవితారంగాన్ని చాలా ప్రభావితంచేసింది. ఈ ఉద్యమం కొన్ని లక్ష్యాలను బలవంతంగా నిర్దేశించే ప్రయత్నంచేసింది. ఇందువల్ల చేకూరిన ఫలితం ఏమంటే అచ్చమైన మానవతావాద దృష్టికలుషితమైపోయి కవిగీతి దిగజారిపోయింది. దుష్పరిణామాలకులోనైంది. అయితే దీన్ని నిరోధించే ప్రయత్నం వెనువెంటనే జరిగింది. కవులు రాజకీయ సిద్ధాంతాలకు పూర్తిగా కట్టుబడివుండాల్సిన పనిఎంతమాత్రమూలేదనీ, వాళ్ళ అస్తిత్వమూ, ప్రాపంచిక పరిణామాలపట్ల వాళ్ళగాఢమైన ప్రతి స్పందనలూ మాత్రమే ప్రతిబింబింపచేయాలని త్వరలోనే గ్రహించారు. మానవజీవిత దుర్భరస్థితిగతులను గూర్చి దయనీయమైన సానుభూతి భావన పెంపొందింపచేసింది ఈ అవగాహన. తానుతాకినదల్లా భస్మమైపోవాలని కోరుకున్న భస్మాసురుడి పురాణగాథ, దేవాసురులు పాలకడలిత్రచ్చి అమృతాన్ని, విషాన్నీ కూడా పొందడం, కొత్తకొత్త అర్థాలలో, కొత్తకొత్త దృక్పథాలతో మళ్ళీ కావ్యవస్తువులైనాయి ధ్వనిగర్భితంగా. మళ్ళీ కురుక్షేత్రయుద్ధంజరిగి మానవుడు తననుతాను ఉద్ధరించుకోవాలన్నతపన, తన ఉనికిని సమర్థించుకోవాలన్న ఆశయం గుర్తించడం జరిగింది. ఈ బృంద స్వరంలోబలమైన కంఠాలుగా గుర్తించవలసిన వాటిలో-ముఖ్యంగా పేర్కొనవలసిన శంకరకురుప్-ఒకగీతంలో మానవజీవితంలోని పవిత్ర యజనశీలలక్షణాన్ని గూర్చి గానంచేస్తాడు.-మానవుడు లక్ష్యిస్తే దీన్ని సాధించగలడని ఆయనభావం. ఇంతకుచాలా పూర్వమే ఎజుత్తచ్చన్‌కూడా అహంనిరాసాన్ని గూర్చి లేదా సర్వోహం అని విశ్వాతాదాత్మ్య దృక్పథాన్ని అలవరచుకోవలసిన ఆవశ్యకతను గూర్చి చెప్పే ఉన్నాడు.

### అభినయరూపకాలు

యూరోపులోని అద్భుత రూపకాల బాణీలోనే, అయితే చాలా ప్రాథమిక స్థితిలో ఉన్నవి. ప్రాచీనకాలంనుంచే ఆలయోత్సవ విధులుగా దేవాలయాలలో కొన్ని రూపకాలు ప్రదర్శించడం జరుగుతూవచ్చింది. తారకాసురుణ్ణి దుర్గాదేవి సంహరించడమనే పాటలోని వేగ సంరంభంవల్ల అది పాడుతున్నప్పుడు ప్రాథమిక స్థాయిలోని రూపక ప్రదర్శనను దేనినో తిలకిస్తున్నట్లుగానే ఉంటుంది. పుట్టినప్పటి ప్రాథమిక స్వరూపానికి, బహుకాలం వికసించి ఈ

నాటి స్థితికిచేరుకున్న స్వరూపస్వభావాలకు అంతరంఎంతవున్నా గ్రీకుమద్యాధిష్ఠానదేవత డైయోనిసియన్ వటాటోప సంరంభంతో పోల్చదగ్గ కథాకళిపతాక సన్నివేశాభినయం-ముఖ్యంగా అసుర సంహారఘట్టంగానే వుంటూ వుంటుంది ఈ సన్నివేశం - ఆధునిక కవితావిశ్వాసాలను గూడ సంచలనాత్మకంగా ప్రభావితం చేయగలదు. కేవలం కల్పించుకున్న ఆధునిక అవిశ్వాసాలను అధిగమించి ఈ ప్రదర్శనలు ఒక వీరావేశాన్ని ఉత్తేజతను కలిగించలేవు, సుప్తమైఉన్న ఉద్వేగప్రవృత్తిని మేల్కొల్పగలవు. ఈ కథాకళిలోని అసాధారణమైన ఈ ఉద్వేగం ఏనాటి ఆదిమప్రవృత్తినో మళ్ళీ ఉద్బుద్ధం చేయగలిగిన వారసత్వం, అయితే ఈ విధమైన ప్రాక్తన ఉద్వేగ భరిత జీవచైతన్యం ఇటువంటి కళాత్మక ప్రతిరూపాన్ని సంతరించుకోవడం క్రమానుగతవికాసం ద్వారా సాధ్యపడింది. పదిహేడవ శతాబ్దికి ఈ కళాకృతికొక పరిపుష్టరూపం సిద్ధించింది.

ఈ కళారూపం ఎన్నో సంప్రదాయాల సమన్వయ సంయోజనా కృతిగా రూపొందింది. కథాప్రదర్శన గీత భాగమంతా నెమ్మదిగా సాగుతుంది, అంటే లాస్యప్రదర్శకం. అయితే విలక్షణమైన భాగమంతా తాండవ విన్యాసమే. అభినయానికి సంపూర్ణమైన స్థానమున్నది కథాకళిలో, ఆహార్యమూ, వేషరచనా పాత్రల అతిమానుష లక్షణాలను బాగా స్ఫురింపచేస్తూ వుంటాయి. ముఖానికి ఒక ఆచ్ఛాదన ఫలకాకృతి ద్వారా పాత్ర చిత్రణచేస్తారు. అందువల్ల ఆ పాత్ర విలక్షణభావాలన్నీ చక్కగా వ్యక్తంచేయడానికి తగిన వీలుంది. అది నిజమైన ముఖాచ్ఛాదన ఫలకమే అయితే, అంటే అటువంటి దానిని తగిలించుకుంటే ఆ పాత్రకు తగిన హావభావప్రదర్శనం సుసంగతంకాదు. ముఖంలోని అభినయంద్వారా హావభావాలు వెల్లడి చేసేందుకు కూడా అప్పుడు వీలుకలగదు. కథాకళిలో ఈ ముఖాకృతిని చిత్రకళ ద్వారా సాధిస్తారు. పాత్రధారి ముఖం నిజానికి ఒక రంగస్థలమే అయిపోతుంది. అ రంగస్థలంమీదనే అంతశ్చైతన్య హావభావ ప్రదర్శనమంతా జరుగుతుంది. ఆంతర్యంలోని కల్లోలంకాని, ఉల్లాసం కాని ముఖకవళికల ద్వారా, కదలికలద్వారా పాత్రధారి అభినయించి చూపుతాడు.

యూరోపియన్ అభినయరూపకాలకంటే కథాకళిభిన్నమైనది. యూరోపియన్ సంగీత రూపకాలలో కూడా అవాంతర భేదమైన 'లిబ్రెట్టో' తో కూడా కొంతవరకు విభేదిస్తుంది. ఈ అభినయ రూపకభేదం సంగీతరూపకంకన్నా ఇతివృత్తపు చిక్కదనంకొంత కలిగివుంటుంది. కథాకళిలోని సుదీర్ఘ గీతాలు చాలా శ్రావ్యంగా, గీతిపౌష్కల్యంతో ఉంటాయి. కథానాయికను గూర్చిన ఒక వర్ణన ఈ విధంగావుంది. ''సృష్టికర్త నిన్ను సృజించేటప్పుడు తన దగ్గరవున్న సౌందర్య సామగ్రినంతా పూర్తిగా వాడేసుకున్నాడు. మిగిలిన అడుగుబొడుగుతో చంద్రుణ్ణి తయారు చేశాడు. అందువల్లనే కాంతిమంతమైన చంద్రుడిమొహంలో కళంకమున్నది. నీ వదనంలో అలాంటిదేమీ లేదు కదా! ఆ తర్వాత సృష్టికర్తగారు కొలనులో చేతులుకడుక్కున్నాడు. ఆయన చేతులకు అంటుకున్నదివ్యప్రసాధన సామగ్రి నీళ్ళలోకలిసి పోవడంతో కలువలు కలకలలాడాయి. రావణుడు అప్సరస అయిన రంభను చూశాడు. ''నీలకాళిందీ జలాల్లోంచి ఇసుక చాలున వెల వెలబోతున్న పసిడి శలాకలాగా'' అంటూ పాట మొదలవుతుంది. ''ఆమె అపరంజి తనూ సౌందర్యకాంతి ఆమెధరించిన చలిత నీల వసనాలలోంచి పుంజీకృతరేఖలాగా వెలువడుతున్నది.''

ఈ పాట రాగం నీలాంబరి. తీయనిఊహల్లో స్వప్నపథ పారవశ్యసంచారాన్ని చేయిస్తుంది.

ఆదికాలంలో ప్రవర్తితమవుతూ వచ్చిన దేవాలయోత్సవ విధుల కార్యకలాపాలు ఆ తర్వాతకాలంలో కథాకళికొక గాంభీర్యాన్ని కూర్చాయి. అట్లాగే ముతక హాస్యాలూ, సాధారణ మైన వేడుకల, వినోదాలను గూర్చిన వ్యాఖ్యానపు విసుర్లు కూడా క్రమంగా విశిష్టమైన వికసన దశకు చేరుకోవడంజరిగింది. పురాణగాథలను ఆలంబనం చేసుకొని వాటిని పునః కల్పితంగా వినిపించే ప్రక్రియ ఆయిన చక్వార్‌లలో, అందులోని తాత్త్విక విషయాలను గాలికి వదిలేసి హాస్యపూరితంచేయడం జరుగుతుంది. ప్రేక్షకుల బలహీనతలను లోపాలను-సంఘంలో ఒక విభాగ పుజీవిత విధానానికి ప్రాతినిధ్యం వహిస్తారు వీళ్ళు—వ్యంగ్యంగా ఎత్తిపొడుస్తూ హాస్య భరితంగా విస్తూ ఉంటారు. 18వశతాబ్దంలో కుంచన్‌నంబియార్ ఒక కొత్త ప్రక్రియను సృష్టించాడు ఈ సంప్రదాయంలోంచి. దానిపేరు తుల్లాల్, ఇందులో కథా కథనాన్ని నిర్వ హించే వ్యక్తి కథాకళిలో మాదిరిగాఆహార్యమూ, ముఖాకృతిరచనమూ అనుసరించి పాడటమూ, అభినయంచేయటమూ రెండూచేస్తాడు. పురాణగాథలనే ఇతివృత్తాలుగా ఇక్కడకూడా గ్రహిం చడం జరుగుతుంది. అయితే అలవిమాలిన సాహసంతో, స్వతంత్రించి పురాణకథాక్షేత్రా లను, పాత్రలను కేరళీయంచేయడం, సాంఘికం గావించడం జరుగుతుంది. డ్రైడన్‌ను మించిన వ్యంగ్యగీతికా రచనా ప్రావీణ్యంగల, తీవ్రసంచలనం, హోరు సృష్టించగల రాబిలియాస్ లాగానే నంబియార్‌కూడా ప్రపంచ స్థాయి అగ్రశ్రేణి హాస్యరచయితలలో ఒకరు. ఈయన యాభైవరకు తుల్లాల్ ప్రహసనాలు రచించాడు. ఆయన వ్యంగ్యం అశని పాతంలాగా మోదుతుంది. అయితే హాస్యంతో ఏ మాత్రమూ గాయం తగల కుండా చేస్తాడు. జన్మతః సంక్రమింపచేసుకొన్న సాంఘికాధిక్యతవల్ల వేదాధ్యయనాధికారాన్ని ఏకైకవర్గంగా స్వాయత్తంచేసుకొన్న పురోహితవర్గమూ, ఈ గుత్తాధిపత్యం స్వప్రయోజనసిద్ధికోసం భ్రష్టుపట్టించిన వారి ప్రవర్తన, పతనమైపోయిన రాచరికపు జమీందారీ వ్యవస్థ, శస్త్రజీవులైన వీరు తమ శస్త్రాలను మరచిపోయి వాటినికుదువబెట్టి మద్యమందిరాలచుట్టూ తిరగడమూ, స్త్రీ వ్యసనంతో దిగజారిపోవడమూ, ఇకవాణిజ్య వర్గంవారు ఎనిమిది ఖరీదుచేసి వాటికి పద్దెనిమిది రూకలు వసూలు చేయడం, అధికారులు తమయజమానునులను ప్రజలను కూడా యథాశక్తి వంచించడం-మొదలైన పరిస్థితులన్నీ తీవ్రమైన ఖండనకు గురిఆయినవి ఈయన రచనల్లో.

## ఆధునిక నాటకం

కవితారూపకాల, సంగీతరూపకాల సంధికాలం గడిచిపోయినతర్వాత ఈ శతాబ్ది మొదటి రెండు దశాబ్దాలలో బయలుదేరిన ప్రహసనం ఆధునిక నాటక ప్రదర్శనలకు నాంది పలికింది. దీని ఈ ఆహ్లాదరూపక లక్షణం ముఖ్యంగా గోల్డ్‌స్మిత్, షెరిడన్‌ల రచనలను దృష్టిలో పెట్టుకొనగా దీనికి సంక్రమించింది. కాని ఈ ప్రహసనాలు సామాజిక విమర్శను కూడా లక్ష్యంగాచేసుకున్నాయి. అకృతులు మారినా ఆశయం మాత్రం స్థిరంగా అంటి పెట్టు కొనే వుంది. పంథోమ్మిదవందల ఇరవైల తర్వాత ప్రతికులం వారి సాముదాయిక మనః స్థితి-నంబూద్రి, నాయర్, క్రిస్టియన్, ముస్లిం-అంతర్ముఖీన మై కాలదోషం పట్టిన మూఢాచారాలను

గూర్చి ఆత్మపరిశీలన చేసుకోసాగింది. త్వరితగతిని మారిపోతున్న కాల పరిస్థితులతో తగిన సర్దుబాట్లుచేసుకోలేక పాతకాలపు జీవనపద్ధతులనే పట్టుకొని పాకులాడడంవల్ల మానవుడు అనేక ఇక్కట్లకు గురికావలసివస్తున్న విషయాన్ని సాంఘికులు గుర్తించగలిగారు.

ఈ శతాబ్ది నలభైల చివరిసంవత్సరాలలో ఇబ్‌సెన్ ప్రభావం చాలా బలీయంగా ప్రసరించింది. అనారోగ్యకరమైన సంప్రదాయాలలో నలిగిపోతున్నకుటుంబాలలో స్త్రీ పురుషుల విధి వైపరీత్యాలను వస్తువుగా చేసుకుంది నాటక సాహిత్యం. ఈ ఇతివృత్తాలు మానసిక విశ్లేషణదృష్ట్యా మరింత చొచ్చుకొని పోయే లక్షణాన్ని, నాటకీయంగా మరింత ప్రభావశీలాన్ని సంతరించుకున్నాయి. కుటుంబ విషాదాంత స్థితిగతులనుంచి, విస్తృత సాంఘికరుగ్మతలవరకూ విస్తరించాయి. రాజకీయార్థికరుజలను వస్తువుగా స్వీకరించాయి. అయితే ఈ దశ తీవ్ర రాజకీయోద్యమసిద్ధాంత ప్రచారం, సంఘటిత కార్యకలాపాలు సాగిన దశకాబట్టి, చాలా నాటకాలు పూర్తి తీవ్రతతో ఒక పక్షం వైపుమొగ్గునే ప్రదర్శించాయి. తర్వాత కొద్దికాలానికి వీళ్ళ తీవ్రవాదధోరణి ప్రతిచర్యాత్మక దృష్టిని కూడా రెచ్చగొట్టడం జరిగింది.

వ్యంగ్యరచయితలు బయలుదేరి తమ ప్రభంజన ప్రహసనాలతో దక్షిణపక్ష స్వీయ సముపాదిత ధార్మికతను, వామపక్ష విలయోత్సాహాన్నీ ఇంకా ఈరెండు పక్షాలలోని నిష్క్రియా లాపాలను బట్టబయలు చేశారు.

కాని ఇంతకన్నా కూడా సార్థకమైన స్థిరమైన విలువలను ప్రతిపాదించిన ప్రతి చర్యాత్మకధోరణి ఏ మంటే విశాలమైన సమన్వయ దృక్పథంతోకొన్ని నాటకాలు వెలువడటం. అయితే ఇవి తమ లక్ష్యాన్ని అందుకోవడం జరగలేదు చాలా వాటి విషయంలో. ఆశయాలు మంచివైనంతమాత్రాన కనే కలలుఅందంగా ఉండాలని ఎక్కడుంది? కాని కనీసం ఓపదిపన్నెండు మంచినాటకాలు గడచినకొద్ది సంవత్సరాలలో వెలువడ్డాయి. విశాల సమైక్యతాదృష్టిని ప్రతిపాదించగల ఇతివృత్త నిర్వహణతో నాటకీయ శిల్పంతో, ఇటువంటి రూపకం, ఒక కుటుంబంలోను, విభిన్న మత సముదాయాలలోను, ఆర్థికవర్గాలలోను, జాతులలోను ఏ విధమైన సత్సంబంధాలను సృష్టించగలదో ఈ రూపకాలు నిరూపించ గలిగాయి.

## వచనం

నిత్యవ్యవహారోపయోగిత, పరస్పర భావవినిమయ సాధనంగా రూపొందించడం వచన వికాసంలో ప్రధానంగా అభిలషించదగినవి. కవిత్వ వికాసానికి సంబంధించిన దశలు వచనవికాసంలో ఏమీ చోటుచేసుకోలేదు. కవిత్వ చారిత్రకదశల్లో కృతకమైన భాషా సమ్మిశ్రణంతో కూడిన శైలులు రూపొందడం జరిగింది. గాని వచనానికి సంబంధించి ఇట్లాజరగలేదు పురాణగాథా పఠనంలో, ఇటువంటి ప్రక్రియను పాడివిన్పించేవారు సంస్కృత పదాలను బహుళంగా వాడేవారు. అయితే ఇది భాషాసమ్మిశ్రణం ఎంత మాత్రమూకాదు. ఎందుకంటే ఆ పదాలన్నీ కూడా మలయాళ భాషానిర్మాణానికి, వాక్యవ్యవస్థకి పూర్తిగా ఒదిగిపోయి దేశీయతా ముద్రనేధరించేవి. అనేక విషయాలపై గ్రంథాలు-గణితం, భూగోళశాస్త్రం, వాస్తుశిల్పం

వైద్యం, తర్కం, సంగీతం, రూపక ప్రదర్శనం-రచించడంతో, ఈ గ్రంథాలు బహుళవ్యవహారోపయోగం కోసం రాయడంతో వైశద్యము, స్పష్టతసంతరించుకొన్న వచనశైలి రూపొందుతూవచ్చింది. చారిత్రక విషమసన్నివేశం ఏదైనా తటస్థించినప్పుడు దాని వల్ల ఉత్పన్నమయ్యే భావోద్వేగానికి వాహికాకృతిని కూర్చినప్పుడు అది కేవలం సమాచారం తెలియజేసేది మాత్రమే కాక ఉత్తేజదంకూడా అవుతుంది.

1909వ సంవత్సరంలో కుందర చట్టాన్ని ప్రకటించినప్పుడు, స్వాతంత్ర్యపోరాటం తొలిరోజుల అమరవీరుడైన వేలుతంబి అవమానకరమైన పరితాపకరమైన బ్రిటిషువారి దమనకాండను ప్రతిఘటించి పోరాడవలసిందిగా పిలుపునిచ్చాడు. ఆయనప్రకటన చారిత్రకప్రాధాన్యం గల గొప్ప సమాచారపత్రం మాత్రమే కాదు, ఉత్తేజకరమైన వచనశైలీ విన్యాసం అని కూడా చెప్పాల్సివుంది. క్రైస్తవమత ప్రచారోద్యమ నిర్వాహకులు కూడా ఈ రంగంలో చెప్పుకోదగిన కృషి చేసి మంచిఫలితాలనే సాధించారు. వాళ్ళు తమ పవిత్ర గ్రంథాలను అనువదించి ఈ మహత్తరకార్యాన్ని కొనసాగించారు. వారు ప్రచారసాహాయ్యక సాహిత్యదృష్టితో అత్యంత సులభంగాను, ప్రభావశీలంగాను వుండేటట్టు తమ రచనలుచేశారు. తిరువాన్కూరులో నెలకొన్న పాఠ్యపుస్తక సంస్థ కూడా ఈ విషయంలో మంచికృషిచేసింది. ఈ సంస్థకార్యకలాపాలలో ఈ సంస్థాన పరిపాలకులెందరో అత్యంత సన్నిహితసంబంధాన్ని కలిగివుండటం, నిర్వహణ కార్యకలాపాలలో పాల్గొనడమూజరిగింది. పంథోమ్మిదో శతాబ్ది ఉత్తరార్థంలోని వార్తా పత్రికల ప్రాచుర్యంకూడా వచనం బహుముఖంగా వికసించడానికి ఎంతగానో తోడ్పడింది.

## నవల

సృజనాత్మక సాహిత్య ప్రక్రియల్లో అత్యంత ప్రధానమైన స్థానం వహించే నవల కిందటి శతాబ్దపు ఎనభైలలో ఆవిర్భవించింది. తొలి నవల (1887) కాల్పనిక ప్రణయగాథ, అయితే రెండో నవల మాత్రం (1889) అటువంటిది కాదు. సామాజిక వాస్తవికతలను ప్రతిబింబించే మహోత్తమ రచన ఇది. అటు తర్వాత మూడు దశాబ్దాల కాలంలో చారిత్రక నవల ప్రధానపాత్రనాక్రమించినా, ఈ చారిత్రక నవలలు బృహత్పరిమాణం, బృహన్నిర్మాణం కలిగి వెలువడినప్పటికీ, సామాజిక వాస్తవికతా దృక్పథమే నవలావికాసాన్ని ప్రధానంగా ప్రభావితం చేస్తూముమ్ముందుకు నడిపించింది.

నాటక సాహిత్యంలోవలెనే ప్రతికులంవారి సాముదాయిక మానసికస్థితి అంతర్మ్లీనమైంది ఈ ప్రక్రియాసంబంధిగా కూడా. వారి వారి స్వభావాలనుబట్టి మానసిక సంచలన స్థితులుగూడా మారుతూ కనిపిస్తాయి. నాయర్ అవిభక్త కుటుంబ విచ్ఛిన్న పరిణామాలను గూర్చి ఎమ్. టి. వాసుదేవన్‌నాయర్ పరిశీలనాత్మకమైన రచనలలో వేదనాభరితమైన నిరాశచ్ఛాయాలు వ్యక్తమవుతూ వుంటాయి. కాథలిక్కుల సాంఘిక జీవనపరిస్థితులను గూర్చి రఫీ తీవ్ర విమర్శలుచేస్తాడు. అయితే ముండస్సేరి తాను కూడా ఈ లోపాలనే వాళ్ళలో గమనించినప్పటికీ పునరుద్ధానపథానికి దైవాజ్ఞాపాలనాన్నిచూపుతూ నడిపిస్తాడు. బషీర్ రచనలలో మానవ సన్నివేశపు హాస్యప్రవృత్తి కనపడుతూ వుంటుంది. దీనినాయన సంప్రదాయాభిని

వేశంకల ముస్లింకుటుంబాలను, ఆధునికాభ్యుదయభావాల ననుసరించే కుటుంబాలను మోహరింపచేసి సృష్టిస్తాడు. ఈ రెండోవర్గం వాళ్ళు మొదటివర్గంవారిని పాత విశ్వాస పంకిలంనుంచి బయటకు లాగుతుంటారు.

స్వాతంత్ర్యంతో దానంతటదే భూలోకస్వర్గంవుట్టిపడటం యథార్థంకాదనే విషయాన్ని అన్ని ప్రాంతాలవారికన్నా ముందుగా కేరళ గ్రహించగలిగింది. పరాయి వారితోపడిన సంఘర్షణ ఇకముందు సోదరుల మధ్యనే సాగవలసి వుంటుందన్న సంగతిని గ్రహించగలిగింది. తగజి 'నిచ్చెనమెట్లు' (1963) జాతీయోన్నత్య ప్రతిపాదనలనుగూర్చిన భ్రాంతులను వివరించి చూపే నవల. స్వాతంత్ర్యానంతర రాజకీయ వ్యవస్థను యథాతథాంగా ఈ నవల మన కనుల ముందునిలుపుతుంది. అధికారంకోసం కుమ్ములాటలతో ప్రజాసంక్షేమం ఏ విధంగా క్రమక్రమంగా విస్మృతమైపోయిందో ఆయన వర్ణించాడు. అయితే ఇదికూడా తుదితీర్పు కాదు. కె. సురేంద్రన్ రచించిన జ్వాల (1965) కూడా పాత భ్రాంతులన్నిటినీ పటాపంచలుచేసింది. అలుతే అంతరాత్మ ప్రబోధించే విలువలు కొన్నిటిని ఈ నవల ప్రతిపాదించింది, తిరుగలేని సంకల్పంతో రచయిత నిబద్ధతను బోధించింది.

తీవ్రవాద సిద్ధాంతాలపట్ల కూడా ఇటువంటివేకొన్ని ప్రతిధోరణులు వెలువడ్డాయి. చాలా సందర్భాలలో సృజనాత్మక ప్రతిభ మానవజీవితపు అంతరాంతరాలలోకి చొచ్చుకొని వెళ్ళటం లేదు. బాహిరమైన పరిశీలనలతోను పాక్షికమైన ప్రకటనలతోనూ మాత్రమే తృప్తి పడుతూ వచ్చింది. అయితే ఉత్తమ గ్రంథాలలో ఈ సంఘర్షణపోటీ మనస్తత్వ సంబంధికాదు, వర్గాల కులాల పాక్షిక వైరుధ్యాల ప్రస్తావనకు సంబంధించింది కాదు, మానవజీవితంలోని మహితాశయాలను, గౌరవ ప్రతిపత్తిని ప్రదర్శించేది. ఈ దృష్టితోనే బడుగు మనుషులైన వ్యవసాయకార్మికుల, రిక్షాలులాగేవాళ్ళ, పాకీపనివాళ్ళ జీవిత భాగధేయాలు నాయకత్వాన్ని పొంది ఇతివృత్తాలవుతూ వచ్చాయి. ఈ గాథలనే తగజి, కేశవ్ దేవులు, తమప్రముఖేతివృత్తాలుగా ఎంచుకొని నవలా రచన సాగించారు.

## ముగింపు

భారతదేశంలోని రాష్ట్రాలన్నిటిలోనూ అక్షరాస్యత విషయంలో అగ్రగామి అయి, అధికసంఖ్యలో వార్తాపత్రికలు, తదితర వార పక్షమాస పత్రికలుప్రచురమవుతూ, సాహిత్యాన్ని వృత్తిగా కూడా చేసుకోవడంలో ప్రపంచదృష్టినే ఆకర్షిస్తూ (రచయితల సహకార సంఘం కేరళలలోకెల్లా పెద్దప్రచురణసంస్థ, రచయితలకు ముప్పైశాతం వరకూ ప్రతిఫలం ముట్ట జెప్పుతుందీసంస్థ) కేరళరాష్ట్ర సాహిత్యరంగం నిరంతరవ్యాసంగభరితంగానే ఉంటున్నది. జనాభాతో పోల్చిచూస్తే సాహిత్యకృషి, వుత్పత్తి చాలా ఎక్కువే అని చెప్పాలి. అయితే అధిక భాగం మఖలోపుట్టి పుబ్బలో పోయేరకమే అని వేరేచెప్పాల్సినపనిలేదు. కాని వెలువడే ఉత్తమ రచనలు మాత్రం ఏ ప్రమాణాల దృష్ట్యా చూసినా, ఇతర ప్రాంతాలలోని ఉత్తమోత్తమ రచనలకు ఏ మాత్రమూ తీసిపోవు.

# విషయసూచిక

చీరామన్

# రామచరిత

## *మండోదరి విలాపం*

[చీరామన్ రచితమైన రామచరిత 13 వ శతాబ్దికి చెందినదని భావించబడుతున్నది. మలయాళ సాహిత్యంలో ఇంత వరకు లభించిన వాటిలో తొట్టతొలతటి కావ్యంగా కూడా దీన్ని కొందరు భావిస్తున్నారు. వాల్మీకి రామాయణంలోని యుద్ధకాండం ఆధారంగా ఇది ప్రాచీన మలయాళంలో రచితమైంది. ప్రాచీన మలయాళంలో ద్రావిడ ధ్వనులు మాత్రమే ఉంటాయి. 164 విభాగాలలో 1814 పద్యాలున్నాయి ఈ కావ్యంలో. ప్రస్తుతం స్వీకరించిన ఈ వృత్తాంతం 104 వ విభాగంలోది. (సం॥) ]

ఇక ఇప్పుడు నిన్ను అడగవచ్చా ఓ సురవిరోధీ. అణచుకోలేని దుఃఖాన్ని నాకు కలగజేసి నీవు ఎక్కడికి వెళ్ళావు రణాభిలాషతో. నీ మహారాజ వైభవం, హోదా ఏమై పోయినాయి. నీ సిరిసంపదలన్నీ ఎట్లా విడిచిపెట్టావు? నీకవి అత్యంత ప్రేమస్పదమైనవే. నీ నగరం నీ కెంత ప్రియమైనది! నీకత్యంత ప్రేమాస్పదులైన వారి నెట్లా విడిచి పెట్టి వెళ్ళగలిగావు? నీకింకా ఎన్నో ప్రియమైనవున్నవి. వాటన్నిటిని నేను పేర్కొన లేనుగదా?

అంతులేని ఈ రణకోలాహలంలో ఈ విధంగా పడివుండటం నీకేమాత్రమూ ఉచితంకాదు. ఈ విధంగా నిద్రగూరటం నీకు తగునా. నీ రణపరాక్రమం శత్రువులకు దుస్సహమైంది. వారిని తపింపజేసింది. ప్రేమ వుట్టిపడే చూడ్కులతో గంభీరంగా లేచి నావైపుచూడు. నీ ఆగ్రహాన్ని విడిచిపెట్టు. ఒక్కసారి నీ చూపు నాపై ప్రసరించనీ. నాయీ హృదయభారమంతా కరిగిపోనీ ప్రభూ. గతంలో ఏ శత్రువూ నిన్ను నిర్జించ లేదు. ఇంత తేలికగా అపయశస్సును నీవు పొందనూ లేదు.

ముద్దరాండ్రైన సాంద్రనీలచికురలు ఒకవేళ ఏదైనా అపరాధం చేసివుంటే మటుకు వాళ్ళను శిక్షించే పద్ధతి ఇదా! మళ్ళీ ఎప్పుడు నీ దయాపూర్ణమైన అనుగ్రహం నాపై ప్రసరిస్తుంది? కాంతిమంతమైన నీ పాదాలకు అభివాదం చేస్తున్న నాతో ఒక్కమాటైనా మాట్లడవా? భూమి మీద ఇలాంటి ప్రవర్తన యోగ్యమైనది కాదుకదా. అల్పులకు మాత్రమే తగివున్నది కదా. ఓ మహాప్రభూ ఈ సుషుప్తి నుంచి మేలుకో!

ఓ మహారాజాధిరాజా! నిజానికి నిన్ను సమయింప చేయాలని నీ శత్రువులు వెయ్యిన్నొక్క విధాలుగా ప్రయత్నాలు చెయ్యలేదు. గతంలో భీషణ ఘోషణ గర్జనల అశనిపాతాలు నోరు తెరచినంతలో కురిపించే తాటక సంహరించ బడినప్పుడే నాకిట్లా జరగ బోతున్నదని తెలుసు. అందుకే ముందుగా హెచ్చరించాను నిన్ను.

నిజానికి దానివల్ల (ఆమె చావుతో) ఆమె కొడుకులలో ఒకరు యుద్ధానికి బయలు వెడలి హతుడైనాడు, ఆ తర్వాత మూర్ఖుడైన మారీచుడికి కూడా అదే గతి పట్టింది. అయితే

మారీచుడు కపట వేషంతో మోసం చేసి ద్రోహం చేశాడు. వీటన్నిటినీ చూస్తూవుండి కూడా నీవెన్నో అపరాధాలొనర్చావు ప్రభూ. కాని ఓ రాక్షస రాజా, భగవంతుని సంకల్పాలు ఎన్నడూ అవితథాలు కావు. ఆయన సర్వశాసకుడు.

ఎవరు మరచి పోయినారు అలవోకగా ఎడమ చేతిలో సంధించిన నారాచం కపిప్రభువు వాలిని నేలగూల్చడం ? సుగ్రీవుడు ఆయన్ను (రాముణ్ణి) ఆశ్రయించడం బట్టే కదా వాలి దురంతమృత్యు వేదనకు గురి అయింది. ఆనాటినుంచి పలుమార్లు నేను ప్రాధేయ పూర్వకంగా హెచ్చరిస్తూనే వచ్చాను. అయితే రోజు రోజుకు నీ పరాభవ వేదన నిన్ను నిలువనీయ లేదు. నిన్నది పూర్తిగా ఆక్రమించుకున్నది.

నీ తోబుట్టువు శూర్పణఖ మాటలు పాటిగా చేసుకొని ఆమె (సీత) కోసం నీవు వెళ్ళావు ఎంతో తమకంతో. ఆ సుమధురభాషిణి సీత కోసం వెళ్ళితే నిన్నెవ్వరూ నిరోధించ రనుకున్నావు. నిన్ను దమించే విరోధులు లేరనుకున్నావు. ఆమె నీ అంతఃపుర శతసహస్ర సుందరాంగులను మించినదిగా నేనెన్నడూ అనుకోలేదు. కాని సర్వనాశనం జరుగుతుందని మాత్రం తెలుసుకోలేక పోయినాను.

ఓ మహారాజా, ఆమె సౌందర్యంలో అంతగా నిన్ను వ్యామోహపరచే పరిపూర్ణ తను ఏం చూశావు నీ చిత్తస్థైర్యాన్ని పోగొట్టుకొనేందుకు ? నీ వివేకమంతా నశించి పోయేంత సౌందర్యం ఏం కనపడింది నీకు ? ఆమె తను కాంతియా, అది ప్రపంచాన్నంతా తలకిందులు చేయజాలింది కాదే. కులీనతా, అందచందాలు, ఏమాత్రమూ చలించని నీపై మక్కువ కల సుందరాంగు లెందరో ఉన్నారే. చక్కని చుక్కలు పరమ శోభాలకలు ఎందరో ఉన్నారే నీ నగరులో. వారందరినీ మించినదా ఆమె. ఆమెలో ఏం చూశావు నీవు ?

ఆశ్రితులందరికీ, దరిచేరిన వారందరికీ కల్ప వృక్షమైన వాడా ! ఈమెను తీసు కొని రావడానికి నిన్ను ప్రేరేపించిన ఆ తలపు లెటువంటివి ? ఆమె అందరినీ మించిన అందగత్తె అనా ! మనోజ్ఞమూర్తి అనా ! లేదా అందరినీ మించిన కులీనురాలనా ? లేక వివేకవతి అనా ! నేను ఎరిగినవారందరి కన్నా ఈ విషయంలో ఆమె ఏ విధంగా అధిక రాలు ? నీ అవివేకం వల్ల, విచక్షణారాహిత్యం వల్ల ఆమెపట్ల నీవు మతిభ్రష్టుడవై పోయినావు. ఓ మహారాజా మర్త్యుల జీవితాలు వర్షాకాలపు కుక్కగొడుగులవలె నశించి పోయేవే.

ఇదివరలో దేవదేవుని పరశువుకూడా నిన్నుదూసుకొని పోయినప్పటికీనిన్ను చంప లేకపోయింది. కాని ఇప్పుడో కేవలం బాణాలుకూడా మహారాజువైన నీ తనువును తూట్లుపొడచి నీ నోటినిరక్తంతో నింపివేశాయి, ఓ మహాప్రభూ నీ ఇల్లాలి శోకదందహ్యమైన అగ్నిప్రవేశాన్ని సూచిస్తున్నట్లుగానా ?

ఓ మహారాజా ఈ యుద్ధభూమిలో మహారాజోచితంగా ఎందుకు నేలమీద వొరిగి వున్నావు. దయతోలే. ఆబలలెందరితోనో నీ ధర్మపత్నినైన నేను, నీతో అమృతోపమానమైన ప్రియభాషణములు చేయించేవాళ్ళం, విలపిస్తున్నాము. ఒకరికొకరు ఓదార్పుమాటలు చెప్పుకొని

ఈ దుఃఖాన్ని భరించడానికి చేస్తున్న ప్రయత్నంలో మనోహరమైన కలువకన్నులనుంచి మలినాశ్రుధారలతో ఈ ప్రపంచమంతా మసక బారిపోతున్నది.

(అను. శ్రీ పి. దామోదరన్ పిళ్ళై).

## భాషాకౌటిలీయం

[కౌటిల్యుడి అర్థశాస్త్రంపై వెలువడ్డ వ్యాఖ్యానాలలో ఆధునిక భారతీయ భాషలన్నిటా తొలుతగా వెలుపడిన వ్యాఖ్యాన మీభాషా కౌటలీయమని చెప్పవచ్చు. కర్తృత్వం తెలియని ఈ వ్యాఖ్యానం ప్రాచీన మలయాళభాషలో రచితమైన పన్నెండో శతాబ్దరచనగా కొందరు విద్వాంసులు భావిస్తున్నారు. మలయాళంలో లభ్యమవుతున్న తొలి వచన రచనల్లో ఇది తొలిది. మూల గ్రంథంలో మూడింట నాలుగువంతులు ఈ భాషా కౌటిలీయం వ్యాఖ్యానిస్తున్నది. అర్థశాస్త్రంపై తాముకూర్చిన సంస్కృత వ్యాఖ్యానంలో డా॥ గణపతిశాస్త్రి గారు ఈ వ్యాఖ్యాన గ్రంథాన్ని ఉపయోగించుకున్నారు. ప్రస్తుతం తీసుకున్న ఈ భాగం 41 వ ప్రకరణంలోని 24 వ అధ్యాయంలో 2 వ అధికరణంలోది. వ్యవసాయశాస్త్రానికి సంబంధించినది. (సం॥). ]

సీతాధ్యక్ష అనేది సూత్రం. సీత అంటే కృషి. అందువల్ల సీతాధ్యక్ష అనే సూత్రం వ్యవసాయ పర్యవేక్షకాధికారిని నిర్దేశించి చెపుతున్నది.

వ్యవసాయ పర్యవేక్షణాధికారికి కృషి తంత్రాన్నిగూర్చి, శుల్బశాస్త్రాన్నిగూర్చి, వృక్షాయుర్వేదాన్ని గూర్చి పరిజ్ఞానం వుండాలి. కృషితంత్రమంటే పరాశరుడున్నూ ఇతరులున్నూ వర్ణించిన వ్యవసాయ శాస్త్రవిజ్ఞానం. శుల్బశాస్త్ర మంటే భూమి సారజ్ఞానం. భూమి సారజ్ఞానం వున్నవారికి అంటే భూమితత్త్వాన్నిగూర్చి శాస్త్రీయ పరిజ్ఞానం కలవాళ్ళు భూమిలో జల సమృద్ధిగల ప్రదేశాలను ఇట్టే గుర్తించగలరు. వృక్షాయుర్వేద మంటే వృక్ష శాస్త్రజ్ఞానం, అందరికీ తెలిసిందే.

నాగలితో భూమిని చాలాసార్లు దున్నాలి. 'స్వభూమౌ' అంటే ఏ భూమికి ఏ విత్తనాలు అనుకూలఫలితాన్ని ఇస్తవి అని. అటువంటి ఆయాభూముల్లో దాసజనమూ, కర్మకారులూ, దండ ప్రతికర్తలూ భూమి దున్నడానికి విత్తానాలు చల్లడానికీ నియోజితులు కావాలి. దాసులంటే సేవకులు. కర్మకారులంటే శ్రామికులు. దండప్రతికర్తలంటే బంధితులు.

వ్యవసాయానికి అనుకూలమైన సంవత్సరాలనుగూర్చి ఇటుపైన వివరిస్తున్నాము, ''వర్ష త్రిభాగం పూర్వపశ్చిమయోః'': అంటే అవణి, వురత్తాటి,అయిపిక,కార్తీకమాసాలు నాలుగున్నూ వర్షర్తువు. అవసరమైన వర్షంలో అరోవంతు గనక ఈ ఋతువు మొదటి నెల అయిన అవణి మాసంలో కురిస్తే, ఇంకో అరోవంతు కనక ఈ ఋతువులో చివరిదైన కార్తీక మాసంలో కురిస్తే, ఇకమిగిలిన రెండింట మూడువంతులు మిధ్య నెలలైనపురత్తాటిలోను, అయపికలోనూ కురిస్తే అటువంటి సంవత్సరాన్ని సుషమ వత్సరమంటారు. వ్యవసాయానికి సుషమ వత్సరం చాలా మేలైనది.

ఇటువంటి వర్షాగమనాన్ని బృహస్పతి స్థానాన్ని బట్టి, చలనాన్ని బట్టి, గర్భాధానాన్ని బట్టి ముందుగానే తెలుసుకోవచ్చు. గర్భాధానమంటే మార్గశి మాసంనుంచి తరవాత అరునెలల్లో కనవడేమంచు, గాలి, ఉరుములూ, అనిఅర్థం. శుక్రుని ఉదయాస్తమయాలు, నవగ్రహాలలో శుక్రుని సంచారమూ, తరవాత సహజ, అసహజ లక్షణాలైన సూర్యపరివేషమూ, ఇటువంటి వర్షాగమనం గూర్చి ముందుగా తెలుసుకొనడానికి ఎంతగానో ఉపయోగపడతాయి.

ఇటు తర్వాత సుషమ సంవత్సరంలో కురిసే మేఘాల రకాలనుగూర్చి తెలుసుకొందాం. మూడురకాలైన మేఘాలు ఈ సంవత్సరములో ఏడురోజుల పాటు అదే పనిగా కురుస్తాయి. ఎనభైరకాలయిన మేఘాలు తుప్పర కురుస్తాయి, అరవైరకాల మేఘాలు కనపడతాయి కాని ఒక్కచినుకు కూడా రాల్చవు. ఈ రకమైన వర్షపాతమంతా కూడా అన్ని రకాల విత్తనాలకు, మొలకలకూ కూడా మంచిది.

గాలీ ఎండా లేకుండా నాలుగు నెలల కాలంలో వానలు మూడుసార్లు కురిస్తే, ఒకసారి కురవడానికి మరోసారి పడటానికి మధ్య ఆవుపేడ ఎండి గట్టిపడగల వ్యవధానంవుంటే ఆ యేడు పంటలు బాగా పండుతాయని నిశ్చయం.

వ్యవసాయ పర్యవేక్షణాధికారి విత్తనాలు ఎదబెట్టాలి. వాటికి కావల్సినంత తడిని ముందుగానే నిర్ణయించాలి దీన్ని ఆ ఋతువును బట్టి, భూమి స్వభావాన్ని బట్టి నిర్ణయించాలి.

విత్తనాలను ఏడురాత్రులు మంచుకు తడవనివ్వాలి. ఆ తర్వాత ఏడురోజులు ఎండకు ఎండనివ్వాలి. కోశిధాన్యపు విత్తనాలు ఇదేవిధంగా మూడురోజులు కాని ఐదురోజులు కాని వుండేట్లు చేయాలి. కాడలునరికి పైరుచేసే పంటవిషయంలో ఆ విధంగానరికిన ముక్కల చివరలను నెయ్యి. తేనె, పందికొవ్వు, ఆవుపేడ కలిపిన విలేపనంతో ముందుగా పూసినాటాలి. దుంపల, గడ్డల పైర్లను కోసినముక్కలకు నెయ్యి, తేనెలు పూయ్యాలి. అస్తిబీజాలు, పత్తి విత్తులు మొదలైన వాటికి ఆవు పేడపూయాలి. మామిడిచెట్లు, జీడిమామిళ్ళు మొదలైనవి నాటేగుంటల్లో ఎముకల భస్మం ఆవుపేడ నింపాలి. మొక్కలు పెరిగి పెద్దవై పుష్పించి ఫలించే సమయానికి వ్యవసాయశాస్త్రంలో చెప్పినట్లు ఆయా ఎరువులు వేయ్యాలి.

మారాకువేసేతరుణంలో రెండు మూడు ఆకులు వేసినస్థితిలో మొక్కలకు చీడ పేడలనుంచి సంరక్షణగా ఒకరకపు ఛిరుమీల ఎండుపొడితో ఒక రసాయన ద్రవ్యం మిశితంచేసి ఆ మందు చల్లాలి.

పాములు రాకుండా వుండేందుకుగాను పత్తివిత్తులు, పాము కుబుసమూ కలిపి కాల్చిన పొగ ఆ ప్రదేశమంతా నిండేట్లు చేయాలి.

(అను॥ శ్రీ చెమ్మనం చాకో).

## రామ పణిక్కర్

# శివరాత్రి మహాత్మ్యం

*పాపాత్ముడు దివ్యపదవినొందడం.*

[14 వ శతాబ్దంలో ఉండిమలయాళ సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన నిరణం రచయితల్లోని మహారచయిత రామపణిక్కర్, ఆయన రామాయణం చాలా విఖ్యాతినందింది. బహుశా మలయాళంలో వెలువడిన సంపూర్ణరామాయణ మహాకావ్యాలలో అదే తొట్టతొలుతటిది కావచ్చు. ఈ రచన ఆయన వ్రాసినదే మరోకకావ్యమైన శివరాత్రి మహాత్మ్యంలోనిది. నూట యాభై పద్యాలలో రచితమైన ఈ కావ్యంలో సుకుమారుడు శివరాత్రి జాగరణ ఫలాన్ని పొందడం ఇతివృత్తం. (సం॥).]

నందీశ్వరుడు ఉమానాథుని వికసిత పద్మపాదాలకు మొక్కి సవినయంగా ఈ విధంగా విన్నవించుకున్నాడు, ఓ జగదీశ్వరా సపరివారంగా యమధర్మరాజు వచ్చి మహా ప్రభువుల దర్శనంకోసం వచ్చివున్నాడు. దేవరవారు ఏమి సెలవిస్తారతడికి, వెళ్ళిపొమ్మంటారా లేక లోపలికి రానివ్వమంటారా: తమఆజ్ఞ శెలవివ్వండి మహాప్రభూ.

చతుర్వేద ప్రభవస్థానమైన పరమేశ్వరుడు తన కరుణాకటాక్ష వీక్షణాన్ని బరపి తక్షణం తనని దర్శించవచ్చిన అతణ్ణి లోనికి ప్రవేశపెట్టమని కోరాడు. అప్పుడతడు (నంది) ఉల్లాసంతో యముడి దగ్గరకువచ్చి ఇట్లా అన్నాడు. 'మేలు మేలు. వచ్చి జగదీశ్వరేశ్వరుణ్ణి దర్శించండి. పార్వతీ ప్రాణనాథుణ్ణి.'

ఇది వినగానే యమధర్మరాజు పరమేశ్వరుడి సన్నిధికి వచ్చాడు. అక్కడ అసంఖ్యాకంగా స్వామివారి ముందున్న భూతగణాలను చూశాడు. వారంతా పరమానంద భరితులై వున్నారు. పరమ పవిత్రమై అత్యంత శోభస్కరంగా, స్ఫాటికమనోజ్ఞ దివ్యతనులై, చంద్ర రేఖాలంకృతులైదర్శనీయులై ఉన్నారు.

వైవస్వతుడికి పరమ పవిత్రులు, అమితఓజస్వంతులూ అయిన గణనాథులను చూడగానే చాలా సంతోషంకలిగింది. గణాధి పతులందరూ చతుర్భాస్తులు. భస్మాలంకృతులు. చర్మాంబరధారులు, కామజేతవలెనే మహాపరాక్రములు. విశ్వగోళాలను కంఠహారాలుగా ధరించిన వారు, మాయాతీతులు.

అక్కడే యముడు దక్షిణపువైపున బ్రహ్మనుచూశాడు. సర్వలోకసృష్టికర్త అయిన విరించినిఅయన సర్వవేదాలను రాశీభూతంగా సృష్టించినవాడు. ఆయనతోకూడి తరంగిత నీల జలరాశిని పోలిన దేహయష్టితోను, కలువకన్నులతోను, కోకిలవాణి భారతీ దేవిని చూశాడు. ఆ తల్లి అష్టాదశ మహామంగళ శోభాకృతులతో ముల్లోకాలన్నిటిని దేదీప్యమానంచేస్తూ ఉంటుంది.

అటుతర్వాత పశ్చిమ పార్శ్వంలో కృతాంతుడు జగదీశ్వరుడి పక్కనే సనకసనం దనాదులను, మహర్షులను, వారిలోకెల్లా మహాత్ముడైన వశిష్ఠులవారిని, మహాభైరవులను, మాతృ గణాలను, కాళరాత్రిని, పాశుపతాస్త్రాన్ని, ఉజ్జ్వలంగా అధివసించి ఉండటం చూశాడు.

ఉత్తరం వైపున నీలమేఘోజ్జ్వలాకారుడైన మహావిష్ణువును అనర్ఘ దివ్య రత్నోజ్జ్వలభూషలు ఆయన వెడద ఉరంలో దివ్యకాంతు లీనుతూవుండగా కౌస్తుభ మణిమయోజ్జ్వల కాంతి మిరుమిట్లు గొలుపుతుండగా తాటంకద్యుతులు ప్రతిఫలించే చెక్కుటద్దాల దివ్యప్రభాకలితమైన వదన మండలం ఒప్పారేవానిని అంతకుడు చూశాడు.

ప్రభుపాదపద్మాలకు మొక్కి కృతాంతుడు సాష్టాంగపడ్డాడు. తన దండాన్ని ప్రభువు పాదపద్మాలముందు అర్పించి, అటుతర్వాత లేచి బహుభంగుల జగదీశ్వరుణ్ణి స్తుతించాడు ముకుళితహస్తుడై. అప్పుడాయన మనస్సెంతో ఆహ్లాదం పొందింది.

ఓ సర్వజగత్ప్రభూ, జయము జయము. నీవుతప్ప మాకింక శరణ్యుడెవ్వరున్నారు.

ఓ పర్వతరాజపుత్రి ప్రాణప్రియా జయము జయము. జగములన్నీ నీవే. సముద్ర సార్వతరంగాకృతి సముద్రజలానిదే అయినట్లు దిక్పాలకులమైన మేము దేవప్రభువులమైన మేమందరమూ ఈ మా పదవులను నిర్భయంగా, నియతంగా నిర్వహించడానికి నీ పాదపద్మ సేవారాధనమే కారణం.

ఓ ప్రాణనాథా, హరా సర్పభూషితుడవైన నీవు భక్తులకు భయదుడవు. జ్ఞానమార్గ పరిజ్ఞాన శూన్యుడనై నిత్యమూ నేను పాపకృత్యాలలో పరిభ్రమిస్తున్నాను. ఓ మహాప్రభూ, సర్వజగచ్చైతన్యమూర్తీ. పరమానంద స్వరూపా, ఎవరైనా కష్టహరణం కోసం ఒక్కసారి నీనామాన్ని ఉచ్చరిస్తే చాలు, భయవిదూరమైన లోకాన్ని ఆతడికి ప్రసాదించగలవు.

ఇక ఇప్పుడు, నేను చేసిన అపరాధాన్ని ప్రభూ నీకు విన్నవించుకుంటాను. మీ అనుగ్రహ పూర్వకమైన ఆజ్ఞాబద్ధుడనై విధినిర్వహణ అప్రమత్తుడనై నా కింకరులను సర్వ మర్త్యకోటి ప్రాణాలను హరించి తీసుకొని రావలసిందిగా పంపుతూ వుంటాను. పుణ్యకర్మల నాచరించిన వారికి సౌఖ్యసంతోషాలను, గడవరాని పాపాలనాచరించిన వారికి తగిన శిక్షలను విధిస్తూవుంటాను.

దండపాణినైన నేను ఓ దేవా నాశక్తిసామర్థ్యాలను మేరమీరకుండా నిర్వహించగలుగుతున్నాను. కాని ఇప్పుడు నేను హతప్రజ్ఞుణ్ణి అయినాను, నీ ఉద్భటాజ్ఞానువర్తుల వల్ల. వాళ్ళు నాకింకరులను హతమార్చారు, పాపాత్ములలో కెల్లా పాపాత్ముడైన సుకుమారుణ్ణి పట్టి తెస్తున్న సమయంలో.

వాడెన్నో గోవులను వధించాడు. బ్రాహ్మణులను పరిమార్చాడు అనేక బాధలకు గురిచేసి. చండాల వనిత సంపర్కంలో మద్యమాంసాలు కడుపార గ్రోలాడు. దార్లు కొల్లగొట్టి ఇతరుల సొత్తు దొంగిలించాడు. ఆ చండాలికి ఎందరో కొడుకులను కన్నాడు, వాళ్ళంతా మహా పాపాలను మించి మిక్కిలి భయంకరా కృతులుగా వున్నారు.

అటు తర్వాత ఆ చండాలి కాలగతి చెందగా దాని పుత్రిక అయిన ఇంకొక చండాలితో, ఇదితన కన్నకూతురే అయిన బహుకాలం శరీరసౌఖ్యాలలో మునిగి తేలి దీనివల్ల

కూడా ఎందరో కొడుకులను కన్నాడు. సుకుమారుడు చేసిన మహాపాపాలను ఆకాశపతిత మైన వర్షబిందువులను లెక్కించడం ఎంత దుస్సాధ్యమో అంత దుస్సాధ్యం. భూమి మీది ఇసుకరేణువులను గణించడం ఏ విధంగా అయ్యేపని కాదో అదేవిధంగా వాడి పాపాలు లెక్కపెట్టడం అసంభవం.

ఓ దేవాదిదేవా ! మహాపాపి అయిన పతిత ద్విజుడు సుకుమారుడు నీ కైలాసధామాన్ని పొంది పరమానందస్థితి వానికి చేకూరగా ఇక ముందు ముందు పాపాత్ములకు పుణ్యాత్ములకు భేదం తెలుసుకోవడమే కష్టమై పోతుంది.

బ్రహ్మాది సకల ప్రాణులుకూడా అనునిత్యం దేవరవారి ఆజ్ఞలు శిరసా వహించి నిర్వహించడంలో పలు ఇడుములకు గురి అవుతూనే ఉంటారు. నాకు చాలా బాధ కలిగించే విషయం ఏమిటంటే ఎవరి ఆజ్ఞలను ఎప్పుడూ తలదాల్చని నిర్వర్తించని వాడు సుకుమారుడు. కాని ఇప్పుడు నీవు సుకుమారుడికి పరమప్రాప్యమైన స్థితిని ప్రసాదించావు. వాడు పాపాలు తప్ప మరేమీ చేయలేదు అందువల్ల స్వామీ నీకీర్తికి కళంకం వచ్చింది.

సరే. ఇదంతా ఇట్లా జరిగింది. జరగనీ. నీకు అత్యంత విధేయుడనై సర్వమూ నివేదించుకుందా మని నేనిప్పుడు వచ్చాను. సరే. దయతో నన్నను గ్రహించి నన్నికముందు ఎలా నడచుకోమంటారో ఆజ్ఞాపించండి. దేవరవారి దివ్యచిత్తానికి విషయం తీసుకొని రావడం వల్ల నాబ్రతుకు సార్థకమైంది. మీ పాద పద్మాలకు మొక్కుతున్నాను''.

ఈ మాటలతో అంతకుడు ప్రభువు కాళ్ళమీద పడ్డాడు. పరమేశ్వరుడు యముడి పట్ల ఎంతగానో ప్రసన్నుడై అతణ్ణి లేవనెత్తాడు. నవ్వుతూ మృదు మధుర వాక్కులతో ఇట్లా చెప్పాడు. 'ఓ, యమధర్మరాజా. అప్రతిహతంగా నీ ఆజ్ఞలు ఎల్లపుడూ కొనసాగడమనేది నాకేనాడూ అగౌరవంకాదు. అవి జరిగి తీరవలసిందే అయితే ఇప్పుడు ఇట్లా జరగడానికి తగిన హేతువు లేకపోలేదు. దాన్నిప్పుడు నీకు చెపుతాను.

నిజమే. నీవు చెప్పినట్లు సుకుమారుడు పరమ పాపాత్ముడే. అయితే ఒకరోజున మోహాంధకారంలో మునిగిపోయి చండాలికోసం పువ్వుల నిమిత్తం అతడు నాదర్శనం చేసుకున్నాడు. ఆ రాత్రంతా శివరాత్రి జాగారం చేశాడు ఇతర భక్తులతో పాటుగా. అతడి మనస్సంతా ఇతర పాపచింత ఏమీ లేకుండా నాపైనేమగ్నం చేశాడు ఆ రోజున.

వాడికి పుణ్య వర్తనమంటూ లేనేలేదు. అయినప్పటికీ అనాటి అతడిధ్యానం అనంతమైన అతడి పాపాలన్నిటినీ పోకార్చింది. జ్వలితాగ్నిని ఎవరైనా ముట్టుకుంటే, అది కాలుస్తుందని తెలియక ముట్టుకున్నప్పటికీ అది అతణ్ణి కాల్చి వేస్తుంది. అదే విధంగా ఆ రోజున ఆతడి పుణ్యవ్రతపాలనం అతడి పాపాలనన్నిటినీ దహించి వేసింది. అందువల్ల నేను అత్యంత ప్రీత చిత్తుణ్ణై అతడికి గణాధి పత్యాన్ని ప్రసాదించాను.

(అను॥ శ్రీ వి. దామోదరన్ పిళ్ళై)

# కృష్ణగాథ

## *గోపికావియోగం*

[ఒకవైపున మలయాళ కవిత్వాన్ని సంస్కృతమూ, మరొకవైపున తమిళమూ ప్రభావితం చేస్తూవుండగా చెరుస్సేరి తన దీర్ఘకావ్యాన్ని మలయాళ భాషకు అత్యంత సహజ సిద్ధమైన శైలిలో రచించాడు. 15వ శతాబ్దంలో విరచితమైన ఈ కావ్యం భాగవత దశమ స్కంధం ఆధారంగా వెలువడినా, ఆయన మౌలికమైన ఉపజ్ఞ ఈ కావ్యంనిండా చోటుచేసుకొంది. 16000 పంక్తులకు తగ్గకుండా వున్న ఈ కృతి వివిధ భాగాలుగా విభక్తమైవుంది. ప్రస్తుతం ఈ ఘట్టం గోపికా దుఃఖం అనే ఘట్టం నుంచి స్వీకృతం, ప్రణయ లీలా విహారుడైన శ్రీహరినుంచి తమ వియోగానికై తపిస్తున్న గోపికల పరితాపమే ఇందలివస్తువు. (సం॥)]

ఓ తుమ్మెదలారా !
అతని పారవశ్యంలోనే జీవించే మా ప్రియుణ్ణి మీరు తిలకించారా ?
పారవశ్యంతో పిల్లనగ్రోవినూదుతున్న అతనిని
ఈ చుట్టుపక్కల ఎక్కడైనా చూసారా ?
మందారా, చెప్పవే, ఆ పంకజాక్షుని, అందాలవాణ్ణి
నువ్వు చూసావా ?
ఓ అలసిపోయిన కాలమా ! రెండు ఝాములో మరెక్కడో
ఆ మోసకాడు మమ్ములను వదిలి వెళ్ళాడే !
ఓ కేశవా ! నువ్వు అతన్ని చూసివుంటే
మాతో నిజం చెప్పు !
నువ్వంటే ఆ నల్లనివాని కిష్టం !
నీ కుసుమాలు అతని వర్ణమే కదూ
పిచ్చెత్తించే అతని మురళీరవాలకు
మేము పూర్తిగా లొంగిపోయాం.
అతనితో ఆడాము పాడాము ఉప్పొంగిపోయాము
ఆ తరువాత ! ఆ మరుక్షణం ! అతను వెళ్ళిపోయాడు.
పూలతో వ్యాపించి వికసించిన ఓ ఇరంజీ !
నిద్రనుండి లేచి చురుగ్గా చెప్పు !
అతనెక్కడ ! పంకజాక్షుడు ! ఈ రోజెక్కడ !

ఓ అశ్వత్థ వృక్షమా ! అచ్యుతునికి నమ్మదగినదానివి.
గోపికలమైన మాకు వేదన కలిగించవద్దని చెప్పు.
ఓ పొన్నవృక్షమా ! మమ్ములను విడిచిన
వెళ్ళిన ప్రియునికోసం గాలిస్తున్నాం.
ఈ వనంలో నిజంచెప్పిన వారిలో మొదటిదానివి కావే !
— ఓ ! అతనెక్కడ.
ఓ అత్తివృక్షమా ! మా హృదయాలను స్పందింపజేసినవాడు
ఆ నాయకుడు మమ్ముల నొదిలాడు. మూర్ఛిల్లాం !
మరి మేమో ! ఓ అత్తివృక్షమా ! వేదనతో దహించిపోయాం
చర్మం, ఎముకలు మాత్రమే ఇక్కడ నిలుచున్నై.
ఓ రావివృక్షమా ! నారాయణుని చూసావా ?
నువ్వు చూస్తే, స్పష్టీకరించు.
నిష్కపటంగా ఉంటే నీకు పోయేదేమీ లేదు.
కాసేపాలోచింపు, మనమంతా శ్రీలంకాదూ
వనమంతా గాలించాము. లాభం లేకపోయింది.
ఏ ఒక్కరూ అతన్ని ఎక్కడా చూడలేదు.
ఏమే కలవభామా ! తలొంచుకున్నావు ?
నీ వికసింపు సొంపుకన్నా ఆతని చిరునవ్వే ఇంపుగాఉందా ?
అందువల్ల అతనిపట్ల ఈర్ష్యను పెంచుకుంటున్నావా ?
ఓ కనకాంబరమా ! ఇవాల్టిరోజు మా ప్రియతమ
నాయకుడు, ఆ యదుశ్రేష్ఠుని ఎక్కడైనా చూసావా ?
ఇక్కడ ప్రతిరోజు ఒక్కక్షణం అతన్ని నిలుపుతాం.
ఆ తరువాత ఆతను మెల్లగా తప్పించుకుంటాడు.
మా హృదయాలను ఇలా మోసం చేస్తాడని మేము
ఎప్పుడూ ఊహించలేదు.
ఓ జింకలారా ! పొదల్లోంచి తలంచుకొని
ఎందుకలా పారిపోతారు ?
ఆగండి ! మేము బాణాలం కాదు ! భయపడి పారిపోవద్దు.
వెర్రిగా ఎందుకలా పారిపోతారు ?
దగ్గరగారండి, మేం మీకు నిజం చెప్తాం !
మా ప్రియుడు, మా జీవితాధారం మమ్మల్ని వదలి వెళ్ళాడు,
మేము మరి మగదిక్కు లేనివాళ్ళం !

మా సంపద దారిలో పోయింది.
అటుఇటు చూస్తూ, సిగ్గువీడి, అజాగ్రత్తగా అరుస్తూ, పిలుస్తున్నాం.
మేము మరణించటానికికూడ సిద్ధంగా ఉన్నాం.
అతని మురళీరవాలు వినిపిస్తే
వేగంగావెళ్ళి అతనికి విడిగా వినిపించండి.
అతనిని మీరు జేరుకున్నప్పుడు.
అప్పుడు మా బాధ ఉపశమిస్తుంది.
ఓ మయూరాలూ ! దైవికంగా ఈరోజు
మా ప్రియుణ్ణి కేశవుని చూసారా ?
తరచుగా అల్లరి ఆటలతో నేస్తగాళ్ళతో
నెమలి ఈకలకై వస్తాడు.
అట్లా ఎక్కడైనా చూసివుంటే
అనుగ్రహించండి ! ఓ అనుగ్రహించండి !
దయుంచి మాట్లాడండి !
దుఃఖంతో సగం వెర్రితనంతో
విశ్రాంతి లేకుండా తిరుగుతున్నాం !
అతనికోసం ప్రతిచోట వెతుకుతూ పిలుస్తున్నాం
అడవికోళ్లు ! మీరు అతన్ని చూశ్లేదు.
చూసారా ?
గోకులాధిపతి తిరుగాడటం ?
అతికష్టంతో నడుస్తూ తిరిగాం ! ఓ ఏమిదుఃఖం !
అడుగుతూ తిరుగుతూనే వున్నాం కాని ఎక్కడా అగుపడలేదు ?
వి·పిస్తూ నిర్జీవంగా బలహీనంగా ఎందుకుండాలి ?
ఎదుర్కొందాం ! మనకతను కనిపించలేదు.
ఓ శాంతమైన హంసా ! ఎందుకీ నిరంతర దుఃఖం !
నందనందనుని నువ్వు చూశ్చేదా ?
ఏమి చెయ్యాలో, చెయ్యకూడదో తెలియదు.
చింతాక్రాంతులమై ఏడుస్తూ మేమూ జీవిస్తున్నాము.
ఓ చామంతీ ! అతి చల్లనైన శీతాకాలంలో
    నిశ్చలంగాఉన్న
కలువభామల్లా, స్త్రీలం అందరం వీక్షిస్తున్నాం !
మేము మీ పక్కకొచ్చి నిలుచున్నాం !

మా ప్రియుడువచ్చి మా గుండెల్ని
సంపూర్ణంగా విహ్వలంచేశాడు.
నవ్వుతూ మావద్ద నిలుచున్నాడు.
ఆ తరువాత మమ్మల నొదిలి కేవలం
దుఃఖంలోముంచి మెల్లగా అడవివదలి వెళ్ళాడు.
ఇకనుంచి మాకు మంచి ఏమాత్రం తెలియదు.
మేము కాలి ఇట్లా దహించుకు పోతున్నాం :
విడలేని ఒకతె మాత్రం
మా ప్రియుడైన కణ్ణని తనవద్ద ఉంచుకుంటుంది.
ఓ వనదేవతా ! అతను ఎటు మాయమయ్యాడో చెప్పు !
మేము అక్కడికి వెడతాం !
ఓ ఉదారంగు ఫలవృక్షమా ! నువ్వు చూశ్లేదా ? చూసావా ?
దేదీప్యమానంగా వెలిగే మా ప్రియుణ్ణి చూసావా ?
అయ్యో ! మమ్మల్ని ఇలా తిరగమని శిక్ష విధించాడు.
తియ్యని కేతకీ ! నిన్ను మెల్లిగా అడుగుతాను.
సూటిగా చెప్పు ! నన్ను మోసగించవద్దు !
నువ్వు చూడలేదు : మా ప్రియుణ్ణి నువ్వు చూసావా ?
నల్లగా కారుమేఘంలా వుంటాడు.
నల్లని మేఘాలు అతని శిరసుపై కొప్పులా అలంకృతమౌతై.
పాదాలకు అందియలు, చేతిలో మురళి,
ఆభరణాలన్నిటితో, సుందరాకృతిని
తేజోవంతమైన వస్త్రాలతో నింపి,
కరగించే మాటలతో
నుదుటిమీద ఉంగరాల జుట్టుతో మెరసిపోతూ
తేజస్సుతో పోల్చటానికి తిరుగులేకుండ
నుదుట ఒక కుంకుమ తిలకంతో
తియ్యగా అప్పుడప్పుడు చిరునవ్వు నవ్వుతూ,
ఒకవిధంగా స్త్రీల మనస్సులనే బద్ధలుచేస్తూండే
అతన్ని చూడకుండా మాట్లాడకు.
పొంగిపొరలే దుఃఖాన్ని నింపుకున్న మా హృదయాలు
ఈ వార్తతో బద్దలౌతై.

(అను. ప్రొ. సి. వి. కె. తారకన్)

తుంచట్టు ఎజుత్తచ్చన్

# మహాభారతం

## ప్రతీకారం

[ తుంచట్టు ఎజుత్తచ్చన్, 16వ శతాబ్దంలో జీవించి, పేరువడసిన మహాకవి. ఆయన తన మరువలేని, ఆధ్యాత్మ రామాయణము, మహాభారతము అనే రచనలద్వారా మలయాళ సాహిత్యాన్ని ఒక స్థాయికి తెచ్చారు. ఉపనిషత్తులకు దగ్గరగా ఆధ్యాత్మిక చింతనతోసహా హరినామ కీర్తనతోసహా చాల ఇతర రచనలు ఆయన చేసినవే అని అంటు న్నారు విద్వాంసులు. ప్రస్తుతభాగం మహాభారతంలోని కర్ణపర్వంనుండి గ్రహించబడింది. ఇందులో భీముడు దుశ్శాసనునిపై తీర్చుకున్న ప్రతీకారం వర్ణింపబడింది. ]

''పొగరుబోతు దుర్మార్గుడా ! ఇటురా !
ద్రుపదరాజ పుత్రికను నువు అవమానం చేసావు.
ఆమె సొగసైన కబరీభరమ్మును పట్టి ఈడ్చుకొచ్చావు
వివస్త్రను చేయాలని, చెప్పలేని అవమానాలు కల్గించావు.
ఆ ఘోరకృత్యాలను నేను మరువలేను.
సురాసురులు మానవులు తిలకించుచుండ
ఆ ప్రతీకారాన్ని తీర్చుకుంటాను
రణరంగంలో ఆ ప్రతీకారంతోనే నిన్ను మట్టుపెడతా
మేఘగర్జనతో, దుశ్శాసను తిలకించిని భీముడిలా పల్కాడు.
రథసారధిని, అశ్వాలను ముందుగా మర్దించాడు.
ఆ తరవాత రథాన్నే పూర్తిగా ధ్వంసం చేసాడు.
దుశ్శాసనుడు ధృడసంకల్పంతో ముందుకురికి,
బల్లెం, బాణం, చక్రాలతో
భీముని దేహానికి గాయం కల్గించాడు.
ఎగురుతూ ముందుకురికి
మేఘగర్జనతో భీముని రథాన్ని నాశనం చేసాడు.
ఇద్దరూ చక్రాలను హస్తాలలో ధరించారు.
అసాధారణమైన మల్లయుద్ధం చేసారు.
రణరంగంలో అల్లకల్లోలం కలిగించారు
దేహాన్నుంచి కారే రుధిరాన్ని
చేత్తో నేలకి తుడుస్తూ

నయనాలలోని రక్తం తుడుచుకుంటూ
క్రోధావేశంతో పళ్లు కొరుక్కుంటూ
ఒకరినొకరు పిడిగుద్దులు గుద్దుకుంటూ
కళ్లు గిరగిరా తిప్పుతూ
కిందపడుతూ మళ్ళీలేస్తూ
ఒడలంతా ధూళిధూసరాలతో నింపుకుంటూ
ఒకరి మెడను ఒకరు ఎగిరి పట్టుకుంటూ
పదునైన నఖాలతో గీరుకుంటూ, పొడుచుకుంటూ
మాంసఖండాల్ని చీలుస్తూ
ఒకరి నొకరు పాదాలతో తొక్కుకుంటూ
వేదనతో ఒకరి హస్తాలను ఒకరు తిప్పుకుంటూ నొక్కుకుంటూ
ఒకరి కేశాలను ఒకరు పెరుక్కుంటూ
రక్తాన్ని అన్నివైపులా జల్లుకుంటూ
చేతుల పటుత్వం ఎంచుకుంటూ
ధృడంగా పాదాలపై నిలబడి
ఒకరినొకరు ఢీకొని దొర్లుకుంటూ
చూచువారలకు భీతి కలిగించేరీతి
వారు యుద్ధాన్ని చేసారు.
దుశ్శాసనుడు గెలుస్తాడని కొందరు
భీముడు జయిస్తాడని మరికొందరు
''భయాన్ని పారదోలి వారి విన్యాసాలను తిలకించండి.
చూట్టానికే భయంకరంగా ఉందిది
మల్లయుద్ధమే నిజానికి భయంకరంగా ఉంది.''
అదిచూసే జనసామాన్యం ఈ విధంగా మాట్లాడుకున్నారు.
అహంకారంతో విజయం సాధించినవానిలా
కొద్దిసేపు శత్రువును అలక్ష్యం చేసి,
భీముడు శత్రువుపాదాలుపట్టి పడదోసి
నరికి పడేశాడు.
మానవులు దేవతలు వారిద్దరినీ తిలకించుచుండగా
భీముడు అతనిపై కూర్చుండి తొక్కివేసాడు.
భీమసేనుడు ఎటువంటి సంశయం లేకుండ
దుశ్శాసనుని వక్షస్థలాన్ని, తన ఖడ్గంతోను, తన
నఖాలతోను చీల్చాడు.

ఒక ప్రవాహంలా వేడి రుధిరధారలు
కట్టలు తెంచుకుని ప్రవహించినవి.
వేగంతో ముందుకు ప్రవహించే రుధిరధారలను
ఆసోశ్వాదిస్తూ, గర్జిస్తూ గంతులు వేశాడు.
మళ్ళీ ముందుకొంగి పుక్కిటబట్టాడు.
గర్వంతో నవ్వుతూ ఇలా అన్నాడు.
''నా నాలుక, నా కడుపు సంతృప్తిచెందాయి.''
మడసిన శత్రువు పేగులను
తన మెడచుట్టూ పూలమాలగా వేసుకున్నాడు
చిందులు తొక్కుతూ, తొడలు చరుస్తూ
భీముడు రణరంగంలో పెద్ద సంక్షోభాన్ని కలిగించాడు.

(అను॥ డా. పి. కె. నారాయణ పిళ్ళై)

కుంచన్ నంబియార్

## మృత్యువే లేకపోతే

[18వ శతాబ్దపు అర్ధభాగంలో, మలయాళ సాహిత్యంలో ప్రసిద్ధులైన మహా కవులలో, కుంచన్ నంబియార్ ముఖ్యుడు. 40కి తక్కువ కాకుండా, తుళ్లల్ పాట్టులను, తుళ్లల్ నాట్యానికి అనుగుణంగా, రచించి, ఈ నాట్యానికి మూలకారకుడయ్యాడు. తుళ్లల్ పాట్టులే కాకుండ, మలయాళంలో చాల రచనలు చేసాడు. అది శ్రీకృష్ణచరితం, మణి ప్రవాళం, భాగవద్దుతు-పధిన్నలు వ్రిట్టం, భాగవతం-ఇరుపట్టినాలు వ్రిట్టం, రుక్మిణీ స్వయం వరం, పాట్టు వ్రిట్టం, శిలావతి-నాలు వ్రిట్టం, చాణక్యసూత్రంకి లిప్పాట్టు, నలచరితంకి లిప్పాట్టు, పంచ తంత్రంకి లిపాట్టు మొదలైనవి. కొంత మంది పండితులు ఇతనిని, కేరళ సంస్కృత పండితుడు రామపాణి వాడతో పోలుస్తారు. ప్రస్తుత భాగం పంచేంద్రోపాఖ్యానం తుళ్లల్ నుంచి గ్రైకొనబడింది. ఇందులో కవి, యమధర్మరాజు, మరణాధిపతి, బలి కార్య క్రమంలో నిమగ్నమై, ప్రపంచాన్ని దాని మార్పుకు దాన్ని వదలివేయటం వర్ణించాడు.]

ముసలి వారంతా భూమిపై మూగటం ప్రారంభించారు.
వారు మరణించరు ఎందుకంటే మరణం అక్కడ లేదు
తాతయొక్క ముత్తాత ఇంకా బతికే వున్నాడు
ఆయన ముత్తాత కూడ జీవించే వున్నాడు
ఆయన అయిదు వందల సంవత్సరాలు
పిల్లలకోసం బతికే వున్నాడు
తాతకు తాత లున్నారు.

గంజికోసం అక్కడ ఏర్పాటు లేదు
పది మచికల బియ్యం పిల్లలకే చాలదు
పెద్దవారికి వంద మచికలు కావాలి
చిన్న చిన్న మొత్తాలలో వారికి పెడితే
పళ్లులేని వాళ్లు పదికోట్ల మంది బలవంతులు
ప్రతి ఇంటా పడి ఉంటారు బొమ్మలలాగా
ఆడవారు మగవారు లెక్క లేనంత మంది
వారికను బొమలు కూడ తెల్ల బారినై
చాల మంది చెవిటి వారు గుడ్డి వారు
ఖర్వాటులు
వారి తలకాయలు కంచు బిందెల కంటె
బాగ మెరుస్తూ వుంటై.
వారికి ఎముకలు తప్ప మరేమీ లేవు
లెక్కలేనంత దుఃఖము వ్యసనమే వారికి
ఒక్కరూ క్షుధతో చావరు
స్థలం లేకపోవటమే ఒక పెద్ద బాధ
ఎత్తైన గోపురాలపై నిదురించే వారు
కింద కొండలపై పడి
తలను అవయవాలను పగలగొట్టు కుంటారు
ముసలి వారు ఒకరు కాదు ఇద్దరు కాదు-లక్షలు
వారు పడ్డాకాని ఏ ఒక్క కారణంతోనూ ఒక్కరూ చావరు.
రాజకుమారులే అవస్థలపాలౌతున్నారు
దొంగ తనకు దొరికింది చేజిక్కించుకుంటాడు గాని చావడు
రాజ ప్రాసాదంలో ఖజానాని దొంగిలించటానికి
పగలు మారువేషాలలో తిరుగుతారు వారు
రాజుల శక్తి అస్తమించింది.
పూజలు మానేశారు దేవాలయాలలో
మంత్రులు రాజులకు భయపడరు
ప్రజలకు మంత్రులకు దడవరు
అమర్యాద మోటతనం ప్రపంచంలో ఎక్కువైనై
యముని బలులే ఇటువంటి దుర్ఘటనలకు కారణం
యజ్ఞాలను కర్మకాండలను, తమ విధులను బ్రాహ్మణులు పరిత్యజించారు

పూజించటానికి దేవాలయం లేదు
మనశ్శాంతి అసలే లేదు
గర్వంతో ఉన్నజనం వారికి తోచినట్లు
ప్రవర్తిస్తున్నారు.
మానవ జీవితాన్ని పాలించేందుకు సూత్రాలు
నియమ నిబంధనలు లేవు,
నియమవంతులైన స్త్రీల పాతివ్రత్యానికి భంగం వాటిల్లింది
మనుషులు చెడునడతగల జీవితాలు గడపటంప్రారంభించారు.
పెద్దవారు, చావంటే భయంలేక
ఇట్లా బతకటానికి సిగ్గుపడేవారు కాదు!
జీవనాధారాన్ని కలిగించే భర్తలను
వేశ్యలై ఇళ్లనుండి వెళ్లగొట్టేవారు
భార్య వద్దకు భర్తలు వస్తే
విటులు వాళ్లను కొట్టేవారు
అరాచకం అవధులు దాటింది
కలి పరిపాలన కంటే ఘోరంగా ఉంది.
మరణం లేకపోవటం అందరికీ దుఃఖంగానే వుంది.
మాంసం తినేవారికి తిండికూడలేదు
యముడు లేకపోవడంతో ఎవరూ చావరు
క్రూరమృగాలు, సింహం, ఎలుగు, చిరుతపులి
పచ్చిమాంసం మీదనే ఆధారపడ్డై.
పెద్దచేప చిన్న చేపను మొత్తం మింగుతుంది.
కాని అవివేరే మార్గంగుండా దెబ్బతగలకుండా వచ్చేసై.
భూమంతా క్రూర ప్రాణులతో నిండింది,
తిండి పెట్టటానికి ఎవ్వరూలేరు.
ద్రవ్యం పట్టణాలలో చాల తగ్గింది.
విపరీతమైన జనాభా పెరుగుదలవల్ల
బ్రాహ్మణులకు ఉచిత వంటశాలల్లో భోజనం దొరకదు
నాట్యగాళ్లు వారి నాట్యాన్ని మరచిపోయి
ముఠాలుగా సోమరులయ్యారు.
పాటగాళ్ల గొంతులలో మాధుర్యం ఇంకి పోయింది.
వాడికి ధనం సంపాదించటానికి నాట్యం లేదు,

క్షుధార్తుతతో సంగీతాన్ని ఎవరు ఆనందించగిలరు ?
భోజనం అన్నమాట వింటే జనం తలలు ఎత్తేవారు.
కాని ఈ మాట ఎక్కడా వినపడదు ?
సభ్యుల సంఖ్య పెరిగినందువల్ల
అన్నదమ్ముల మధ్య ఆప్యాయతలు మాయమైనై.
ఒకనికి అన్నలు ఒకరు ఇద్దరూ కాదు.
యాభై వందా కాదు ఐదువందలు కూడ ఉంటారు.
వారు ఆప్యాయతలతో ఎలా మెలుగుతారు ?
మరణమనేది వారికి సహాయం చేస్తుందా ? (అను॥ శ్రీ వి. ఎస్. శర్మ)

## ఉన్నైవారియర్.

## దమయంతి కట్టెలుకొట్టే వానితో

[కేరళ కథాకళి నాట్యానికి పేరుపొందింది ఈ నాట్యానికి తగినట్లుగా పాడేందుకు వీలుగా కొన్ని రచనలు, పాటలు, పురాణేతిహాసాల మీద అధారపడి రాయబడ్డాయి. అటువంటి వానిలో 18వ శతాబ్దంలో జీవించిన ఉన్నయ్ వారియర్ రచించిన నలచరిత్ర ఉత్తమమైనదని సాహిత్య విమర్శకుల అభిప్రాయం. ఈ ప్రస్తుత భాగం, ఆ రచనలోని రెండవ భాగంనుంచి గైకొనబడింది. దీనిలో దమయంతి కట్టెలవానిని ఎలా ఎదుర్కొన్నది చిత్రీకరించబడింది.]

కట్టెలవాడు:- "అదేమిటి ? ఈ భయంకరమైన అడవిలో ఈ ధ్వనేమిటి ? దూరంలోఉండి నిజాన్ని ఎలా తెలుసుకోగలను? చెంతకువెళ్ళి అదేమిటో చూస్తా. కాని ఈ అడవి దట్టమైంది. నేనా ఒంటరివాణ్ణి. ఆ కారడవిలో ప్రవేశించి, వెతకటానికి నాకూ భయంగానే వుంది. సూర్యభగవానుడు భయంకరమైన చీకట్లను పారద్రోలుతూ ఉదయించ బోతున్నాడు. సోమరిలా కూర్చుని ప్రయోజనం లేదు ? అది పిరికితనం ! నా అయుధాలైన ధనస్సు, బాణాలు, ఖడ్గాన్ని తీసుకుని ఇప్పుడే వెడతా ! దగ్గరగా వెళ్ళి అదేమిటో చూస్తాను. హీన వంశంలో పుట్టినందుకు నాలో ఉన్న హీనత్వాన్ని ఆవలనెట్టి ఉచితంగా ప్రవర్తించాలి.

రాణి:- అయ్యో ! నా రాజా ! దయామయుడివి ! ఆలోచనా పరుడివి ! నన్ను ఇలా ఉపేక్షించి ఎలా వెళ్లగలిగావు ? నేను మూర్ఛపోయి, దాన్లోనే కృశించిపోతున్నాను. నువ్వు నీ సంపదనంతా జూదంలో పోగొట్టుకొని, ఈ దట్టమైన అడవిలో జ్ఞానం కూడ పోగొట్టుకున్నావు. అంత అభిమానంతో ఉండే నువ్వు, ప్రేమాభిమానాలు లేకుండా ఎలా ఉండ గలుగుతున్నావు !

కట్టెలవాడు:- ఆ తీయని కంఠం ఆడ మనిషిదిలా ఉంది. చెంత కెళ్లి ఆ అందగత్తె ఎవరో కనుక్కుంటా! ఈ వృక్షాల నడుమ నుండి అమె అందం చూడగలుగుతున్నా! ఎవరి వియోగానికి ఈమె ఇలా దుఃఖిస్తోంది ? ఆమెనెలా గెలుచుకోగలను ? అబ్బా ! ఏమి

సొగసు ! ఏమి ఉత్కృష్టత ! మరింత చెంతకేగి నా కన్నుల పండుగ చేసుకుంటా ! దేవతాస్త్రీల యొక్క అందాల్నే తన వంపు సొంపులతో మించి పోయింది, ఆమె అధరామృతాన్ని గ్రోలే ఆ అదృష్టవంతుడెవడో ! భూమ్మీద తిరుగుతూ, అంత తియ్యగా ఆకట్టుకునే ఈ దేవత ఎవరు?

*రాణి:-* ఓ భగవాన్ ! కొండచిలువ నాపాదాన్ని పట్టుకుంది ఒక చైతన్యం నన్ను కమ్ముకుంటోంది. ఓ ! పరాక్రమశాలీ! నా మరణానంతరం నీ ప్రేమానురాగం ఆకట్టుకునేట్లు నన్ను గురించి చింతించి ?

*కట్టెలవాడు:-* ఈ కన్నె పడుచుకు నా అన్న వాళ్లు లేకుండ ఈ ఆపదలో చిక్కుకొని తన ఆనందాన్ని కోల్పోయింది కదా!

సిగ్గుపడవలదు ! ఈ వనంలో కాపురం చేస్తున్న వాణ్ణే నేనెవరైతే నీకేమి, దిక్కు లేక పడిరోదిస్తుంటే, ఇంకెవరైనా వచ్చి నిన్ను రక్షించారా?

అ భయంకరమైన కొండచిలువను మట్టుపెట్టేలోగా, నా భుజాలమీద వాలియుండు జవ్వనీ!

''ప్రాణం ఊగిసలాడుతున్న చివరిక్షణంలో కూడ, బ్రాహ్మణోత్తములుసైతం కులాన్ని గురించి ప్రస్తావించరు. ఓ నా సుందరీ చూడు ! భయంకరమైన సర్పాన్ని విడిపించాను.

*రాణి:-* సర్పపు కోరలకు భయపడి మూర్ఛపోయాను. నన్ను కాపాడినందుకు నీకు ధన్యవాదాలు. ఒకరి ప్రాణాన్ని కాపాడినందుకు దైవమే నీకు బహుమతినిస్తుంది ఇక నీ పని నువ్వు చూసుకో!

*కట్టెలవాడు:-* నిన్ను ఎలా వదిలిపెట్టి వెళ్లేది ప్రియా! నా ఆలోచనలను కూడ విను ! ఏమి నిర్ణయించానో విని, నాతో పాటు ఏకీభవించటానికి ప్రయత్నించు. నేను బాధలో ఉన్నా !

'ఓ అందాల భామా ! ఎందుకు నీకీ మూర్ఖత్వం ! నువ్వు స్త్రీజాతికే మకుటానివి ! నీలో ఉత్తమ స్త్రీ లక్షణాలు, అందచందాలు పూర్తిగా నిండిఉన్నై. ఇవన్నిఉన్న నువ్వేనన్ను తిరస్కరించి గుర్తించకుండ ఉంటే ఏమి ఉపయోగం ?

మన్మథుడు నాతో పగబూని తన పూల బాణాలను నాపై వదులుతున్నాడు. నాలో కామోద్రేకాన్ని కలిగించటానికి, ఆశరుడు నాపై శతవిధాలుగా ప్రయత్నిస్తున్నాడు. ఈ కార డవిలో తిరిగి నీ లేత పాదాలను నొప్పించకు. అనుమానం పెనుభూతం అన్న సామెత ఉంది. నీ తనువెక్కడున్నా, నీ మనసెక్కడో ఉంది. ఇటనుండి ఎటు పోదామనుకుంటున్నావు. నువ్వు వయసులో ఉన్నదానివి. నన్ను సహాయం చెయ్యనీ ! నన్ను పాలించు ! నాకో ఇల్లుంది. అ ఇంటి కప్పు నుండి నీళ్లుకారవు ! గోడలు మందమైనవి. అక్కడ మనం కాపురంచేద్దాం ! కొద్ది మంది మాత్రమే వన జీవితాన్ని చవిచూస్తారు.

భగవంతుడు తన భక్తుల్నిదయతో చూస్తాడు. ఆలోచించు ! ఒకరికొకరం చక్కగ సరిపోలేదూ ! అవునవును ! ఇంత కన్నా చెప్పాల్సిందేముంటుంది ?

*రాణి:–* ఓ స్వామి ! నలమహారాజా ! దీని కంటే వింత ఏమైనా ఉంటుందా? ఓ రాజా! నన్ను ఒదిలేసి మాయమయ్యావు. నిన్ను పోగొట్టుకొని నేను వెనకే ఉండిపోయాను. కొండచిలువ కోరలోపడి కూడ బతికి బయటపడ్డాను ! వ్యాకులపాటుతో ఉన్న నాకు, వెకిలి మాటలాడే కట్టెలవాడు తారస పడ్డాడు ! ఈ మూర్ఖునికి సమాధానం నేను ఎలా చెప్పాలి? వీడు నా మాటలు విని నెమ్మదిగా వెనక్కి వెడతాడా? ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది, ఇంద్రుడు నాకిచ్చిన వరాన్ని గురించి, నా వ్రతాన్ని ఎవరు భంగపరచటానికి ప్రయత్నిస్తారో, వారు భస్మీ పటలం అవుతారని. ఆ వరం ఇప్పుడు నన్ను కాపాడుతుంది.

(అను॥ శ్రీ ఎన్. వి. కృష్ణవారియర్)

కేరళవర్మ

## ప్రసంగ సంగ్రహం.

### మలయాళాన్ని సుసంపన్నం చేయడం

[కేరళవర్మ, వలయకోయిల్ తంబురాన్ (1845-1915) తిరువాన్కూరు రాజ కుమారి సహవర్తి. మలయాళ భాషా పునరుద్ధరణకు పాటుపడి, ఆధునిక మలయాళ వచన రచనకు పితామహులుగా పరిగణించబడ్డారు. విశాఖ విజయ, క్షమపాన సహస్ర, యమ ప్రాణమస్తకం మొదలైన గ్రంథాలు సంస్కృతంలో కూడ రచించారు. మలయాళంలో కొన్ని అట్టుకథలు, పద్యాలు, మయూర సందేశంతోసహా రాశారు. కాళిదాసుని 'శకుంతల' కావ్యం వీరు మలయాళంలోకి అనువాదంచేసిన వాటిలో ఒకటి దీని వల్లనే ''కేరళకాళిదాసు''ని పేరు పొందారు. ఆయన నాయకత్వంలోనే మలయాళ సాహిత్యం ఒక ఉన్నత స్థితికి చేరుకుంది. మలయాళ భాషా సాహిత్యంలో ఆయన ఉత్తమత్వాన్ని సాధించాడు. కేరళ వర్మ 1910ముందు భాగంలో, వైక్కంలో జరిగిన ''భాషాపోషిణి'' సభా శుభసమయంలో, దక్షిణదేశపు భాషల మలయాళంతోసహా, ఆవశ్యకతను వక్కాణిస్తూ, ప్రస్తుతం తార్కికమైన, భావగర్భితమైన భాషా సూత్రాన్ని ఒకటి సూచించారు. ప్రస్తుత భాగంపైన చెప్పిన మరుపురాని ఉపన్యాసం నుండి గ్రహించబడింది. దీనిలో ఆయన మలయాళభాషావికాసానికి కొన్ని మార్గాలను సూచించారు.]

ఈ రోజుల్లో జన సామాన్యంలో వేగంగా పుంజుకున్న కోరిక, భారతదేశాని కంతటికీ సామాన్యమైన ఒకే ఒక మాతృభాష వుండాలని, ఈ కోర్కె ఫలించిననాడు, ఇతర భాషల కోసం చేస్తున్న కృషి, ప్రయత్నాలు స్మృతిపథంలో నుండి పూర్తిగా తొలగి పోతై యన్న వారి వాదం అర్థరహితమని వెల్లడించటానికి కష్టమేమీ లేదు. కలకత్తానుండి వెలువడే ''మోడరన్ రెవ్యూ'' మాస పత్రికా సంపాదకుడు, కొంతకాలానికి హిందీ, బెంగాలీ భారత దేశపు ఇతర ప్రాంతాలకి వాడుకలోకి వచ్చినప్పుడు, రెండవ భాషగానే ఉంటాయిగాని, ప్రధాన భాషలుగా కాలేవు. చరిత్రసాంప్రదాయం, ప్రపంచ వ్యవహారాలు కొంతకాలానికి దక్షిణదేశపు ద్రావిడ భాషలు పనికి రాకుండాపోయి, ఉత్తరదేశపు భాషలలో ఒకటి ప్రపంచభాషగా నిలిచి పోతుందన్న వాదాన్ని, చరిత్ర సాంప్రదాయం, ప్రపంచ వ్యవహారాలు మనకనుమతించవు. అంతేకాకుండా భారతదేశానికి సంబంధించినంతవరకు, ప్రాంతీయభాషలలో ఏదోఒక భాషను తీసుకుని, ఆ భాషనే అన్ని ప్రాంతాలకు ఒకే భాషగా ప్రతిపాదించవలసిన అవసరంలేదు. భారత దేశంలో వ్యవహార భాషలుగా జన సామాన్యం వినియోగించేవి, సంస్కృతం, ఆంగ్లం,

హిందీ మాత్రమే. ఈ పరిస్థితులలా వుండగా, కేరళదేశం వున్నంత వరకు, మలయాళ భాష నిలిచి వుంటుందని నేను ధైర్యంగా చెప్పగలను. కొంతకాలానికి ఏదో ఒక ప్రాంతీయ భాష మలయాళాన్ని తొలగిస్తుందని ఏ ఒక్కరూ భయపడనవసరం లేదు.

పైన చెప్పిన విషయాలను బట్టిచూస్తే, మలయాళాన్ని వృద్ధిలోకి తేవలసిన అగత్యం ఎంతైనా ఉంది. ఆ ఉద్దేశాన్ని సాధించటం కోసం మనం కొన్ని మార్గాలను గురించి ఆలోచించాలి. మన భాషలో ఇంత స్వల్పమైన సంఖ్యలో గ్రంథాలుండటానికి గల కారణాన్ని ముందు మనం పరిష్కరించాలి ఇది మనం సాధించాలంటే, ముద్రణలో లేని కొన్ని ప్రాచీన గ్రంథాల్ని ముద్రించాలి. అంతేకాకుండ కొత్త విషయాల మీద నూతన గ్రంథాలను ఉత్పత్తి చెయ్యాలి. ప్రాచీన కాలం నుంచీ మన సాహిత్యాన్ని పూర్వీకులు కొంత ఉపేక్షించారు. ఆధునాతనమైన గ్రంథాలను చెదల బారినుండి సేకరించాలన్న విషయం మళ్లీ చెప్పనవసరం లేదు. గ్రంథాలు, మత్తు కలిగించే ద్రాక్షాసవంలాంటి పానీయాలు కాలం గడిచిన కొద్దీ విలువను పొందుతాయి. ఒక కాలంలోని భాషా చరిత్రను, గ్రంథాలు లేని ఆ సమయంలో, ఆ కాలంలోని ఆచార వ్యవహారాలను బట్టి మనం ఎనలేని గ్రంథాలను ఉత్పత్తిచేసినా, అవి పండితుల మన్నలను అందలేవు. రామచరితం, గుండర్ట ఉపయోగించిన పయ్యన్నూరు ఏత్తోళ కేరళనుంచి ఆతనితోనే మాయమైనై. దక్షిణ తిరువాన్కూరులో, రామ కథ సాట్టు, భారతం పాట్టు లాంటి పాటలు, ముద్రణకు నోచుకోలేక శిధిలావస్థలో ఉన్న సంగతి తెలుసుకున్న మనం నిజంగా సిగ్గుపడాలి. ఇప్పుడు నేను చెప్పిన గ్రంథాలే ముద్రణకు నోచుకోలేక మిగిలైన్న అనుకోనవసరం లేదు. సాహితీ సముద్రంలోని ఒకమునక ఎనలేని సంపదలను తెచ్చిపెడుతుంది. వివిధమైన విషయాల మీద కొత్త గ్రంథాలను ఎన్నో ఉత్పత్తి చెయ్యాల్సి వుంటుంది. వచన సాహిత్యంలాగా పద్య రచన మలయాళంలో అంత అపురూపం కాకపోయినా కాని కాలగమనంలో కొంత అడ్డంకి ఏర్పడవచ్చు. కాని రచనకున్న స్థానం నిజంగా విచారించవలసినదే! ఒక విషయం మీద మలయాళంలో వచన రచనలు చెప్పకోతగ్గ పరిమాణంలో లేవన్న విషయం మాత్రం నిజం! ఏ భాషలోనైనా సరే, జీవితగాథల్ని ప్రాంతీయ చరిత్రల్ని తెలిపే గ్రంథాలు, ఆ భాష మాట్లాడే ప్రజల జీవితాలను సుఖమయం చేస్తాయి. ఈ అభీష్టాన్ని నెరవేర్చటానికి సరైన పద్ధతులు ఆరంభించాలి. మన పండితుల శ్రద్ధాసక్తులు శాస్త్ర పరిజ్ఞానం మీద కూడ ఉండాలి. వృక్షశాస్త్రం, జీవశాస్త్రం, భూగర్భ శాస్త్రం మొదలైన వానిమీద ప్రధానమైన గ్రంథాలు మలయాళ భాషలో కూడ ఉత్పత్తి చెయ్యాలి! నవలా సాహిత్యం కూడ సరైన విధంగా అభివృద్ధి చెందిక పోవటం నిజంగా శోచనీయమే! చారిత్రాత్మక నవలలు, సాంఘిక నవలలు, చిన్నకథలు వివిధమైన మనఃప్రవృత్తులను చిత్రించేవి. మలయాళ సాహిత్యం గ్రంథాలు లేని కొరతని తీర్చలేవు! మంచి ఆంగ్ల మలయాళ నిఘంటువులేని కొరత వలన శాస్త్రీయ గ్రంథానువాదాలకు పెద్ద అగాధం ఏర్పడింది. మలయాళ సాహిత్యాభివృద్ధికి ప్రాచీన అధునాతన గ్రంథాల ముద్రణ ఒకటే చాలదు. జనసామాన్యంలో సాహిత్యాభిలాషని గలిగించటం ఎంతైనా అవసరం. అధిక ప్రజలు మంచి గ్రంథాలను చదవటం, రచయితలను గురించి తెలుసుకోవటం చేసినప్పుడే మన భాషాభివృద్ధికి ఉచ్చస్థితి మొదలవుతుంది.

(అను॥ డా. ఎన్. పరమేశ్వరన్ ఉన్ని)

## ఒ. చందుమీనన్

# ఇందులేఖ

## ఈర్ష్యా ప్రేమికుడు

[ఒ. చందుమీనన్ (1847–1889) మొట్టమొదటి నవలాకారుడు. చిన్నతనంలోనే ఆంగ్లం, సంస్కృతం చదివి మెట్రిక్యులేషన్‌కు చేరాడు. 1867 లో సబ్-కలెక్టరు ఆఫీసులో గుమాస్తాగా చేరి, సబ్-జడ్జి స్థానాన్ని క్రమేణా చేరుకున్నాడు. బ్రిటిష్ ప్రభుత్వం అతనికి రావుబహద్దర్ బిరుదునిచ్చి సత్కరించింది. ఇందులేఖ, శారద అనే రెండు నవలలను రచించాడు. రెండవది మాత్రం అసంపూర్ణంగానే మిగిలిపోయింది మీనన్ కూడ ఒక మంచి సాహిత్య విమర్శకుడే :]

ఓ భగవాన్! ఈ జీవితం ఈ అందంతో నేను ఏమీ చెయ్యలేను. ఏమి సౌందర్యము : ఏమి వర్చస్సు : ఏమి కుంతలాలు : ఎంత సొబగైన కన్నులు! ఓ భగవాన్! నేను అశక్తుణ్ణి! అశక్తుణ్ణి! నేను ధైర్యసాహసాలు లేనివాణ్ణి : మునిభార్యయైన రంభను మోహాముఖీ తిలకించిన ఇంద్ర రావణుల శక్తి ఏమైంది :'' ఇందులేఖను చూసిన మరుక్షణంలో నంబూద్రికి పై విధంగా ఆలోచనలు మూగినై. స్థిరంగా కొద్దిసేపు కుర్చీలో కూర్చొని తనలోతాను ఇలా అనుకున్నాడు :

''ఇందులేఖా! పరాక్రమవంతుడైనవానికి కన్నెలు, గడ్డిపరకలు ఒకటేనన్న సూక్తి నువ్వెప్పుడూ చదవలేదా ?

*ఇందు :* (పకాలున ఆపలేని నవ్వుతో) నేను చదవలేదు : కాని ఇప్పుడే విన్నాను. అది చాల పసందైన సూక్తి!

వణుకుతూ అణచలేని తియ్యని స్వరాలతో నవ్వుతున్న ఇందును చూసిన నంబూద్రి పాదులో అంతకుముందు ప్రయత్నించి కూడ పెట్టుకున్న ఆకర్షణఅంతా ఒక్కసారిగా కరిగిపోయింది. అంతకుముందు గోవిందన్‌తో మాట్లాడి తీసుకున్న నిర్ణయం మర్చిపోయినా, నంబూద్రిపాదు పూర్తిగా ఇందులేఖలో మునిగిపోయాడు. మళ్ళీ అదేస్థితిలో ''ఇందులేఖా! కొద్దిగా పెద్దగా నవ్వు! ఆంగ్లంలో నవ్వటంకూడ నేర్పుతారా ? ఆ నవ్వు చాల అందంగా ఉంటుంది. దయుంచి మళ్ళీ ఒకసారి నవ్వు :

ఇందులేఖ మళ్ళీమళ్ళీ నవ్వుతూ, నవ్వుతూ అలసిపోయిన ముఖాన్ని ఒకసారి తుడుచుకుంది.

*నంబూద్రి :* ఆహా! అప్పుడే ఒడలివెళ్ళావా ? అది మంచికాదు నిన్న మాట్లాడినట్లు మాట్లాడే తీరిక నీకు లేదనుకుంటాను. అటువంటిది ఈరోజు నన్ను ఇక్కడికి ఎందుకు రమ్మన్నావు ?

*ఇందు :* లేదు. నే వస్తున్నా.

(అని అంటూ ఇందులేఖ ముఖం కడుక్కొని తిరిగివచ్చింది.)

''ఇందులేఖా ! నీ వయసెంత ?''

''పద్ధెనిమిది,''

''నేను ఎన్నేళ్లవానిలా కనపడతాను ?''

''నేను ఒక్కసారి చూడగానే వయసు ఊహించలేను కాబట్టి చెప్పలేను.''

''అయినప్పటికి ఊహామాత్రంగా అంచనా వెయ్యలేవా ?''

''అంచనావేసేది నిజం కాదు.''

''అయినా షుమారుగా చెప్పు.''

''ఏదో ఒకటైతే చెప్తాను. యాభై కిమించి ఉంటావనుకుంటాను.''

''ఛీ ! అసందర్భం ! వికసించే యౌవనాన్ని దాటాననుకున్నావా ? అయ్యో ! ఎంత దౌర్భాగ్యం ! నాకు యాభై ఏళ్ళా ? నీముందే ఉన్న నేను, యౌవనంలో ఉన్నానని ఆ మాత్రం నిర్ధారణ చేసుకోలేవా ?''

''ఎందుకూ ! నేను ముందే చెప్పాను. వయసు ఊహించేటంత నిపుణురాలను కాదని.''

''ఓ ! పద్ధెనిమిదేళ్ళ ప్రాయంలో ఉన్ననీకు యౌవనంలోఉన్న మనిషి వయసు భేదం తెలియదా ?''

''లేదు ! నాకు తెలియదు. నిండు యౌవనం అంటే ఏమిటి ? ఇంతవరకు నాకు తెలియదు.''

''ఎందుకంటే నువ్వు ఆంగ్లం చదివావు కాబట్టి వాటిని గురించిన ఊహకూడ లేదు, ఇది నిజం.''

''అవచ్చు. అదే అయుంటుంది.''

''నేను అవివాహితుణ్ణి.''

''మంచిదే !''

''నా తమ్ములు మా కులంనుంచే సంతతికోసం వివాహం చేసుకున్నారు. నేను సుఖంగా జీవితం గడుపుతాను. నంబూద్రిలు వాళ్ల కులంనుంచి ఆచారం ప్రకారం వివాహం చేసుకున్నట్లయితే వారికి సుఖం పోయినట్లే. నాకింతవరకు నా భార్య అంటూ లేదు. ఇందులేఖా ! ఎందుకు మౌనం ?''

''నువ్వు నీ విషయాలగురించి ఆలోచిస్తుంటే నేను ఎందుకు కలగజేసుకోవాలి ?''

''నిన్న నీకు పంపిన కవిత, వింటావా ? నే చదివేదా ?''

''లేదు, బాధపడకు.''

''బాధేమిటి ? కవిత చదవడం ఆనందంకదా !''

''అది నాకు తెలియదు.''

''నువ్వు ఆంగ్లం చదివావు కాబట్టి అట్లా అనుకుంటావు.''

"అవచ్చు."

''ఆంగ్లం చదివితే కొద్దిపాటి ప్రణయ సంబంధమైన జ్ఞానం తప్పకుండ కలగుతుంది.''

''అవును, అది నిజం.''

''ఇందులేఖా! సున్నితమైన ప్రణయం నీలోఉంది.''

''నాలో ఉందని నేననుకోను.''

''నువ్వు నైషధం చదివావా ?''

''లేదు ''

''ఆడది చదువతగింది నైషధం కాదూ ! ఒక పద్యం దాన్నుండి చదివేదా ?''

''ఆ పెద్దపెట్టె ఏమిటి ? సంగీతపెట్టా ?

''అవును.''

''చయుంచి నాకు వినిపిస్తావా ?

(కోరిక ననుసరించి ఇందులేఖ పియానో వాయించటం ప్రారంభించింది. రెండు మూడు నిముషాల తర్వాత నంబూద్రి ఇలా అన్నాడు.)

''ఇంక ఆపు ! నువ్వు అలసిపోగలవు ? ఎంతసేపని నీ అందమైన చేతులు అలా కష్టపడతై ?''

(ఇందులేఖ అతనివంక తృప్తిగా చూసింది. నంబూద్రి వెండి పాన్‌దాన్, బంగారు పన్నీరుబుడ్డి కోసం పిల్చాడు. అవి వచ్చిన తరవాత ఇలా అన్నాడు).

''ఈ పెట్టె చూడు ! అది అందంగాలేదూ ?

(ఇందులేఖ, పెట్టెను, పన్నీరుబుడ్డిని తీసుకుని, కొంతసేపు వాటిని తిలకించి, కింద పెడుతూ)

''అవి చాల సొగసుగా ఉన్నై.''

*నంబూద్రి :* నీకు కావాలంటే తీసుకోవచ్చు.

''లేదు. నా కవసరం లేదు.''

''నువ్వు తీసుకోవచ్చు. ఆక్షేపణ లేదు.''

''నా కవసరంలేదు.''

"ఇందులేఖనితప్ప ఏస్త్రీని ప్రేమించను.''

''నిజంగానా ?''

''అవును. నువ్వు నమ్ముతావా ?''

''అవును.''

(నంబూద్రి తన ఆసనంనుంచి లేచి నవ్వుతూ)

*ఇందు :* ఎంత విచిత్రం ?

"విచిత్రమా? నేను నిజంగా అదృష్టవంతుణ్ణి. నేను నాట్యం చెయ్యొద్దూ? ఇందులేఖ నాకు లభించలేదా? ఏది నాకుకావాలో అది నేను సాధించాను."

"దయుంచి అటువంటి అసందర్భ ప్రలాపాలు పలుకవద్దు. నా జీవితంలో నీ భార్యగా ఉండలేను. నువ్వు నన్ను కోరితే నేనేమీ చెయ్యలేను. సాహసించి ఇక అలా పలికితే ఎప్పటికి నిన్ను ఇక చూడను. చేసుకోవలసిన పనిఉంది."

(ఇలా పలుకుతూ ఇందులేఖ లోపలి గదిలోకి వెళ్ళిపోయింది.)

(అను॥ డా. వి. వి వేలాయుధన్ పిళ్ళై)

సి. వి. రామన్‌పిళ్లై

## మార్తాండ వర్మ

### తల్లి ఒకటి తలిస్తే, తనయ ఒకటి తలిచింది

[సి. వి. రామన్‌పిళ్లై మలయాళ సాహిత్యంలో గొప్ప నవలాకారుడు. పట్టభద్రుడైన తరువాత, ఆయన ప్రభుత్వోద్యోగంలో చేరి, విచారణాధికారిగా ప్రభుత్వపు ముద్రణాలయపు ఉన్నత పదవిని చేరుకున్నాడు. ప్రభుత్వాధికారి అయినప్పటికీ ప్రాంతీయ రాజకీయాలలో జోక్యం కలిగించుకునేవాడు. మార్తాండవర్మ, ధర్మరాజ, రామరాజ బహద్దర్ ఆయన రచించిన చారిత్రాత్మక నవలలు, ప్రేమామృతం అనేది ఆయన రచించిన సాంఘిక నవల. ఈ నవలలేకాక, సి. వి. (ఈ విధంగా ప్రసిద్ధికెక్కిన) ప్రతిష్ఠకు కారణం ఆయన ఎన్నో ప్రహసనాలను రాసి, మలయాళ వచన నాటకాలకు ప్రధాన కారకుడయ్యాడు. ప్రస్తుత గ్రంథభాగం 'మార్తాండవర్మ' నుండి గ్రహించబడింది.]

చంపకశ్శేరి గృహంలో ఉదయరాగం పండుగ వాతావరణాన్ని చూసింది. కాత్యాయనీ అమ్మ, ఇల్లాలు కనిపించని చోటులేదు. వంటగదిలో ఆమె వంటవాళ్ళకు పిండి వంటకోసం బియ్యప్పిండి సరిగా జల్లించమని గద్దిస్తోంది. అరటిముక్కల కోసం పంచదార పాకం మరింత చిక్కగా తియ్యొద్దని చెప్తోంది. అనుకొన్న అతిథులు అందరూ వస్తారని కూరలకోసం కూరగాయలు మరింతగా తరగమని అనుమతిస్తోంది. కాత్యాయని అమ్మే, వాళ్ళు వీళ్ళు కానుకగాపంపిన అరటిపళ్ళ గెలలను స్వయంగా అందుకుని సామాన్ల గదిలోకి పంపింది. దీపాలను అశ్రద్ధతో తుడవటం చూసి, ఆమె దాసీని చివాట్లుపెడుతూ "నీ చేతికి ఏమైనా పుండులేచిందా? ఇట్లాచూడు దీపాలు వెండిలాగ మెరుస్తూఉండాలి!" కాత్యాయనీ అమ్మే స్వయంగా, ద్వారమంటపం దగ్గర ఒకటి, లోపల గదిలో ఒకటి, భోజనాలగదిలో పెట్టటానికి మూడు కంచుదీపాలకి 25 వత్తుల్ని చేసింది. కూతురిమీద ఉన్న ఆపేక్షతో ఆమె చిన్నగిన్నెలలో సున్నం నింపటం, వక్కల్ని శుభ్రంచేసి ముక్కలుగా కోసి వెండి పళ్ళాలలో పెట్టటం, పొగాకు ముక్కలు ముక్కలుగాచేసి, సుగంధ ద్రవ్యాలైన పచ్చ కర్పూరం, పునుగు మొదలైనవానితో చేర్చి వెండిగొట్టాలలో నింపటం, తాంబూల సామాగ్రి, యాలకులు, లవంగాలు, ఎండుకొబ్బరి ముక్కలు, కుంకుమపువ్వు మొదలైనవి కూర్చి, లేత తమలపాకులతో, వెండి పళ్ళాలను పేర్చటంలాంటివెన్నో చేసింది.

సూర్యాస్తమయానికి వంటవాళ్ళు వంటకు సంబంధించిన పనులు పూర్తిచేసుకున్నారు. వానకూడ వెలిసింది. ద్వారమంటపం ఇంద్రుని మరకత మందిరంలా మెరిసిపోయింది. తెల్ల చాందినీకి ఎర్రఅంచు, మొఖమల్ పరుపు, తలగడలు, ద్వారమంటపంలో ఉంచబడిన మంచంచుట్టూ పరచబడిన గడ్డిచాపలున్నై. దివిటీలా వెలుగుతున్న దీపం ఇవన్నీ పశ్చిమద్వారం వద్దనున్న కాత్యాయనీ అమ్మ దృష్టిలోపడి, ఆమె అధికమైన ఆనందంతో లోపలి గదిలోకి వెళ్ళింది. కొంతమంది దాసీలు అలంకరణల ఏర్పాట్లు చూట్టానికి సంకు అసన్‌ని ఆహ్వానించారు. ''ఒరే అబ్బాయిలూ! నాతో ఆడుకుందామని వస్తే, మిమ్మల్ని కొడతాను.'' ఉత్సవాలలో పాల్గొనకూడదని నిశ్చయించుకున్న ఆసన్ మొండిగా కూర్చునిపోయాడు. పరికుట్టి పరిస్థితి పాఠకులు ఊహించుకోవచ్చు. (కాత్యాయని అమ్మ కూతురు) ఇంటికి ఉత్తర ద్వారంవద్ద పెద్దమనుషులతో కిక్కిరిసి ఉండటంవల్ల, పరికుట్టి లోపల గదిలోనే ఉండటానికి నిశ్చయించుకుంది. మామూలు ప్రకారం స్నానం, ముస్తాబులు ముగించింది. తనకు రాబోయే విపత్తును ఎలా ఎదుర్కొందామా అని మార్గాలు ఆలోచిస్తోంది. ఆ సమయంలోనే విలువైన ఆభరణాలు తీసుకొని కాత్యాయనీ అమ్మ ఆమెదగ్గర కొచ్చింది.

''తల్లీ! నువ్వు ఒకపని చేసితీరాలి! ఈ ఉలకెత్తు, కంటకసర, నాలుపంతి వేసుకో! (ఆభరణ విశేషాలు). టక్కకూడ చెవికి పెట్టుకో! ముక్కు ఆభరణాలుకూడ ఎందుకు మార్చుకోవు! నా దగ్గరకు రా! నేనే స్వయంగా నీ పాదాల్ని తంట, పాదసారలతో అలంకరించనీ! ఇటు చూడు! నా ప్రత్యేకమైన వస్త్రాలు నీ కోసం స్వయంగా తెచ్చాను నీకు తెలుసా? ఇది వట్టక్కార రకం మేలైంది.'' వీటన్నిటికీ ఎటువంటి సమాధానం పారుకుట్టి ఇవ్వలేదు.

కాత్యాయని : నా తల్లివికదూ! నీ కురులు ఆరకపోతే ముందుకు కట్టుకో! ఈ పువ్వుతో నీ కురులను అలంకరించుకో! నీ నుదుట తిలకం దిద్దుకోతల్లీ!

పారుకుట్టి : ఇవన్నీ ఎందుకో నాకర్థం కావటంలేదు!

కాత్యాయని : నువ్వేదీ తెలుసుకోకుండ ఉండటానికి నటిస్తున్నావు. కాబట్టి నే చెప్పేది విను.

పారు : అమ్మా! ఇదంతా ఎందుకో నిజం చెప్పవా!

కాత్యాయని : ఇదంతా ఎందుకో నీకు చెప్పితీరాలంటావా? అయితే విను. పూజనీయులైన తంపి బహుళ ఈరోజు వస్తున్నట్లున్నారు.

పారు : వస్తేరాని. ఆయనతో నాకేమి సంబంధం!

కాత్యాయని : ఎందుకు నామీద తిరుగుబాటు చేస్తున్నావు. ముఖ్యంగా ఈ విషయంలో మరోవిధంగా ఉండమని నీకెవరైనా చెప్పారా? నీకు నువ్వే స్వయంగా ఆలోచించి ప్రవర్తించలేవా? అందుకనే నే చెప్పేది చెయ్యమని! ఇంక నువ్వేమీ చెయ్యనక్కర లేదు! ఒకవేళ అతను నిన్ను చూద్దామన్న కోరిక వ్యక్తపరిస్తే?

పారు : ఏమిటీ ? అతను నన్ను చూద్దామనా ? అతనికి నన్ను చూడాలన్న కోరికా ? అతను అంత అనాగరికుడా ?

కాత్యాయని : ఒక ఆడపిల్లను చూద్దామన్న కోరిక అనాగరికమా ? ఈ ధర్మ శాస్త్రాన్ని ఎక్కడ నేర్చుకున్నావు ? ఇవన్నీ మర్యాద లక్షణాలు కావుతల్లీ ! ఒకవేళ అతను నిన్ను వివాహమాడగోరితే !

పారు : అటువంటప్పుడు అతను వివాహ సమయంలోనే నన్ను చూడాలి !

కాత్యాయని : వధువుని చూడకుండ వివాహం చేసుకునే ఆచారం ముందెక్కడన్నా ఉందా ?

పారు : మనసంఘంలో ఎక్కడన్నా వరుడు తనకులం వధువుని చూట్టానికి వెళ్లే అలవాటువుందా ? అది నేను తెలుసుకుందామనుకుంటున్నాను.

కాత్యాయని : అయితే నీ ఉద్దేశంలో ఎవరొచ్చి చూడాలి ?

పారు : ఆయన తండ్రికాని, మేనమామకాని వచ్చిచూడాలి.

కాత్యాయని : రాష్ట్రపాలకుడైన అతని తండ్రి రావాలంటే ఎంతసాధ్యమైన విషయం ! సాధారణంగా అది జరగదు. అదికాకుండ ఆ మహానుభావుడికి ఒంట్లో బాగాలేదు.

పారు : అటువంటప్పుడు ఆయన మేనమామ రావచ్చుకదా !

కాత్యాయని : ఆయనకి మేనమామలేడు. ఈ రాయబారం నడపటానికి ఒక మేనమామని సృష్టించమంటావా ?

పారు : అల్లైతే ! అయన బంధువుల్లో ఒకరు రావచ్చు !

(ఈ మాటలువిన్న కాత్యాయని అమ్మ ఏమిచెయ్యలేని నిస్సహాయస్థితిలో మాట్లాడలేక కూతురికి ఏమీ సరైన సమాధానం ఇవ్వలేకపోయింది. చివరకు ఆమెను మందలిద్దామనుకుని ఇట్లాఅంది.) నీకు ఏదిమంచో తెలియనప్పుడు, ఇతరుల సలహామీద నడుచుకో. నీకు ఈ విషయంలో తెలివిగాని, జ్ఞానంగాని ఉన్నట్టులేదు ఎవరికోసం ఎదురుచూస్తున్నావు ? స్వయంగా నువ్వే ఉత్తరం చదవలేదా ? నీకు నువ్వే అది కల్పితలేఖ అనుకుంటే సరిపోయిందా ? ఎదురుచూస్తూ అలాగాఉండిపో ! చివరకు నువ్వు తప్పకుండా విచారపడతావు !

పారు : ఇంతకంటె ఎక్కువగా బాధ కలిగించేది ఇంకేమైనా ఉంటుందా ?

కాత్యాయని : దేనికంటె ఎక్కువ ?

పారు : గౌరవనీయుడైన తంపి భార్య అవటంకన్నా ఎక్కువ !

కాత్యాయని : అయనకి ఏం తక్కువ ? ఆయనకి హోదా తక్కువా ? సంపద తక్కువా ? అందం తక్కువా ?

పారు : ఇవన్నీ ఉన్నై. ఇంతకంటె మంచి గుణాలే లోపించాయి !

కాత్యాయని : ఆ గొప్పలంటే నీ ఉద్దేశం ఏమిటి ? నన్నుకూడ విననీ ! అతనికి తెలివితేటలు చాల తక్కువ. మరినా కూతురి తెలివితేటలు అమోఘం ! సరే చెప్పు !

పారు : (గొప్పతనం ఉట్టిపడే స్వరంతో) మనిషికి కొన్ని గుణాలు ముఖ్యం ! అటువంటి గుణవిహీనుడైన మనిషిని వివాహం చేసుకోటం నరకప్రాయం !

కాత్యాయని : నీపిచ్చి వాగుడికి అర్థం నాకు తెలియటం లేదు ! పూజనీయులైన తంపికి మంచి గుణాలు లేవని నువ్వొక్కదానివి అనుకుంటే లాభంలేదు !

పారు : అమ్మా ! దయుంచి ఆయిన మంచి గుణాలలో ఒక్కటి వినవా !

కాత్యాయని : (కొద్దిసేపాలోచించి) అయ్యో ! ఆలస్యం అవుతుంది ! అటువంటి ఆక్షేపణలు ఎందుకులే వీదీసావు తంపికంటె పరాక్రమవంతులు ఈ అవనిలో ఎవరు ఉన్నారు ?

పారు : సరే ! తల్లీ మన కరుమాన్ శౌర్యాన్ని గురించి మళ్ల జ్ఞాపకం చెయ్య నవసరం లేదు !

(కాత్యాయనీ అమ్మ, పారుకుట్టిని ఆవాక్యల పూర్తి చెయ్యనివ్వలేదు.) నీ సిగ్గు మాలిన తనానికి అవధులులేవు ? ఇంక ఆపు ! ఏదైనా వింతిమీరితే అపాయానికి దారితీస్తుంది నీ అధిక ప్రసంగంతో, అగౌరవనీయుడైన తంపిని శునకం అంటావా ? (కోపంతో కాత్యాయని అమ్మ అట్లా అంది)

పారు : నేను అట్లా అన్లేదు ! పరాక్రమం అనేది మనుషులకీ, పశువులకీ సామాన్యమైనదే ! కొన్ని ప్రత్యేకమైన గుణాలు మనిషికే ఉంటై ! అటువంటి గుణాల్లో ఒక్కటైనా తంపికి ఉన్నదో లేదో ? నేను చెప్దామనుకుంది అదే ! అమ్మా ! ఉట్టిపుణ్యానికి కోపంతెచ్చుకోకు !

కాత్యాయని : అవును ! నేను చెప్పిన ప్రతిదానికి నువ్వు అడ్డు చెప్పచ్చు ! ఇదేకదూ తలి తండ్రుల మీద చూపించిచే గౌరవం ! ఈ ఆచార వ్యవహారలు ప్రత్యేకంగా నువ్వొక్కదానివే ! గిరిగీసుకున్నట్లుంది ఈ ప్రవర్తన ఎక్కడినుండి చూసి నేరుచుకున్నావో చెప్పు !

పారు : ఎక్కడా ఈ అలవాటు ఉండక పోవచ్చు ! నా ప్రవర్తన విరుద్ధంగా ఉండచ్చు ! కాని అది ఎవరికీ అపాయకారికాదు ! నిజమా కాదా ?

కాత్యాయని : నీకు అసలు అది అపాయం కానేకాదు ?

పారు : నా అదృష్టానికి నేనే అడ్డునిలబడతానా ? అలా ఎప్పుడు జరగదు !

కాత్యాయని : అదినాకు బాగ తెలుసు ! నువ్వు చాల తెలివిగల దానివి. ముద్దుల పెంపకం నిన్ను పనికిరాకుండచేసింది. తండ్రి సంరక్షణలో పెరిగిన పిల్లలగతి అంతే ! నీగర్వంతో నిన్నెవరూ ప్రశ్నించలేరనుకుంటున్నావు ? ఉండు ! నీకో గుణపాఠం చెప్తా !

పారు : అమ్మా ! ఎందుకు ఇట్లా అనవసరంగా నన్ను బాధిస్తావు ? నా ఆనందాన్ని, నా భావాల్ని ఆలోచించకుండ నువ్వు ఇట్లా మాట్లాడుతుంటే నాకు చాలా విచార మేస్తోంది ! నేనన్న దాంట్లో అర్థం ఉందో లేదో ఒక్క క్షణం ఆలోచించి, తరువాత కోపంలో నీకిష్టమైన నన్ను చివాట్లు పెట్టు !

కాత్యాయని : తెలివితేటలకి అన్వయిస్తున్నావా ? ఏ జ్ఞానం నీలో ఉందను కుంటున్నావు ? అపకీర్తి పాలయ్యేపని అచ్చుకున్నా !

అయ్యో ! ఆయన ఇప్పుడొస్తాడు నేనేం చెయ్యాలి : (చేతులాడిస్తూ)

ఓ ! భగవాన్ ! ఈమె నాకొక సమస్యగా తయారైంది.

పారు : నీకునువ్వే తెచ్చుకున్న ఆపదకి ఇంకొకరిమీద కోపం ఎందుకు ?

కాత్యాయని : నేను తెచ్చుకున్నదా ? ఎవరికోసం ? ఇదినా ఆనందంకోసం చేసుకున్నదా ? (తనలో) ఇప్పుడు ఆమెను పట్టుని కొట్టేదా ? ఇప్పుడేమి చెయ్యటం ? ఇటువంటి విషమ పరిస్థితిలో నాకు ఆమె ఎదురు తిరిగింది (లాలనగా) నా బంగారు తల్లివి కదూ ! ఎంత అపకీర్తో ఆలోచించు తల్లీ ! నీవు తెలివిగల పిల్లవన్న నమ్మకం నాకుంది !

పారు : ఈ విషయాలు ఇంప తొందరలో తల క్రిందు లౌతాయని నేనూహించ లేదు. ఇప్పుడు నేనేం చెయ్యాలి ! నాకు తెరియని కారణాలకి తంపిని గౌరవించటం ఊహించలేనిది ! భార్యా భర్తలుగా జీవించటం మాకు సాధ్యం కానిపని ! కాబట్టి ఈ విషయాల్ని మరింత చెడుగా ఎందుకు చేస్తావ్ ?

కాత్యాయని : ఇట్లా మాట్లాడటానికి నువ్వెవరివి ? నీకు తల్లి అంటే ఎంత గౌరవం ? నువ్వు నాకూతురివికాదు ! విధినెవ్వరూ తప్పించలేరు ! నీ ఇష్టంవచ్చినట్లు నువ్వు చేసుకో !

(అను॥ డా॥ వి. కె. నారాయణ పిళ్ళై)

## కుమారన్ ఆశన్

## చింతావిష్టయ సీత

[కుమారన్ ఆసన్ (1873–1924) మలయాళ సాహిత్యంలో ప్రసిద్ధికెక్కిన త్రయంలోని ఒకడు. మిగతాఇద్దరు ఉళ్ళూరు, వళ్ళత్తోళ్. అతని ప్రాథమిక విద్యా నంతరం, శ్రీ నారాయణగురు ప్రాపకంతో, బెంగుళూరు, మద్రాసు, కలకత్తాలలో పెద్ద చదువులు చదవటానికి అవకాశం ఏర్పడింది. ఆయన కొంతకాలం ప్రధాన కార్యదర్శిగా, వెనుకబడిన తరగతుల పునరుద్ధరణకు పాటుపడి, దానికి సంబంధించిన "వివేకోదయ" అనేదానికి సంపాదకుడుగా ఉన్నాడు. కొత్తభావాల్ని ప్రతిబింబింపచేసే ఆయన చిన్నకావ్యాలు, అద్భుతమై, భావ ప్రధానంగా అతిశయిల్లుతూ మలయాళ భాషా సాహిత్యానికి ముఖ్యమై విరాజిల్లుతుంటై, వీణపూవు, నళిని, లీల, దుర్వస్థ, ఛండాల భిక్షుకి, ప్రరోదనం, చింతాశోకంలో సీత, కరుణ మొదలైనవి చెప్పుకోతగ్గ ఆయన రచనలు. ఆయన ప్రబోధ చంద్రోదయం

సౌందర్యలహరి, సంస్కృత నాటకాలను, మలయాళంలోని కనువదించి, ఒకదాని తరువాత ఒకటిగా వచన రచనలను ''వివేకోదయం''లో ప్రచురించాడు. 1921 లో వేల్స్ రాజ కుమారునిచే మద్రాసులో గౌరవించబడి, ఆయననుంచి ఒక పట్టువస్త్రాన్ని, ఒక బంగారు కడియాన్ని బహుమానంగా పొందారు. 1924 లో పుల్లన్ననదిలో, ''త్రిక్కున్నప్పుజ'' వద్ద జరిగిన పడవ ప్రమాదంలో మరణించారు. ఋషులను, వారి ఆశ్రమప్రాంతాలను పొగుడు తున్న ప్రస్తుత గ్రంథభాగం ''చింతాశోకంలో సీత'' నుండి గైకొనబడింది. తన కుమారులు అయోధ్యానగర రాజసభకు వెళ్లినప్పుడు, ఏకాంతంగాఉన్న సీత ఆలోచనలను ప్రతిబింబింప చేస్తుంది.]

ఈ పర్ణశాలా ప్రదేశము ఎంత ఉపశమనాన్ని కలిగించుచున్నది. కలతలేని, సంక్షోభములేని సింధునదీ తీరమా ! లేక దావానలం చెంతనున్న చల్లని తటాక తీరమా ?

ప్రకాశవంతమైన ఋష్యాశ్రమాలలో జాజ్వల్యమానంగా ప్రకాశించే దీపాలవంటి మునిపత్నుల నిష్కళంకమైన మెరుస్తున్న చెక్కిళ్ళతో—

దీనికంతటికీ వారి మహిమయే కారణముకదా ! జీవకోటి అంతటికి ఒకే విధమైన ప్రేమను పెంచే వారి పవిత్ర హృదయాలను నేను ధ్యానిస్తాను.

వారి హృదయాలు వేధాధ్యయనాలలో తిరుగాడుతూ, పంచభూతాలలో సంచరిస్తూ, నియమ నిష్టలను నిరంతరం కాపాడుకునేవారిని నేను ధ్యానిస్తాడు.

జీవితం అనే పుణ్యభూమిని, పురాణాలు వానిలోని కథలనే పవిత్ర జలాలతో, పునీతం గావించి, వానియొక్క జ్ఞానం అనే ఫలాలను ప్రతీఒకరికీ పంచుతారు.

పవిత్రులైన ఆస్త్రీలు, ఆధ్యాత్మికానందాన్ని వారిభర్తల సేవలోనే పొందుతారు. వారికి వారి సహవర్తులే దైవస్వరూపాలు. వారికి ప్రాపంచిక సుఖాలమీద ఆసక్తి ఉండదు.

శ్రుతులన్నీ ఒకసారి ఎప్పుడో మరిచిపోవచ్చు !

స్మృతులన్నీ ఒకనాడు కాలగర్భంలో కలసిపోవచ్చు !

కాని పావనమూర్తులైనవారు ఈ భూమిని వదలిపోరు !

ప్రాపంచిక సుఖాలవల్ల వారి హృదయాలు కఠినంగా మారినా, వారి భార్యలతో సాగించే జీవనంవలన, హృదయాలు మృదువుగా మారుతై.

ఆ కారణంచేతనే ఒక మహాకవి నిరంతర సమాధిలో ఉండి, తుచ్ఛమైన జగత్తును గుర్తించి, ఒక విహంగం తన చెలికత్తెను పోగొట్టుకొని శోకించగాచూసి జాలిచెందాడు.

(అను॥ ప్రొ. జోసెఫ్ ముండస్సేరి)

ఉళ్లూర్

# కి ర ణా వ ళి

## కన్యాకుమారిలో సూర్యోదయం

[ తిరువనంతపురం వద్దనున్న గ్రామమే స్వగ్రామమైన మహాకవి ఉళ్ళూర్ పూర్తి పేరు ఉళ్ళూర్ ఎస్. పరమేశ్వరయ్యర్. ఆ శతాబ్దంలో ప్రసిద్ధికెక్కిన మలయాళ సాహితీ త్రయంలో ఒకడు. 1877 లో పుట్టిన ఉళ్ళూర్, తిరువనంతపురంలో ఎమ్ ఏ., బి. ఎల్. డిగ్రీలను తీసుకుని, ఒకప్పటి ట్రావన్‌కూర్ ప్రభుత్వంలో పెద్ద పదవులలోజేరి, ప్రభుత్వ చీఫ్ సెక్రటరీగాకూడ పనిచేసారు. ఉమాకేరళం అనేఒక ఇతిహాస కావ్యాన్ని, మరికొన్ని చిన్న కావ్యాలైన కర్ణభూషణం, పింగళ, భక్తిదీపిక, చిత్రశాల, హృదయకౌముది, తప్త హృదయం, అమృతధార మొదలైనవి ఉళ్ళూర్‌యొక్క ముఖ్యంగా చెప్పుకోవలసిన కావ్యాలు. ఆతని కావ్య, సంస్కృతికి చెందిన పరిశోధనలు విజ్ఞానదీపిక నాలుగు భాగాలలోను, మరచి పోలేని రచనైన కేరళ సాహిత్యచరిత్రం, లేక మలయాళ, సంస్కృత, తమిళ భాషలను పూర్తిగా మిళితంచేస్తున్న కేరళ భాషాచరిత్రలోను ప్రతిఫలించినై. ఉళ్ళూర్ తన సంపాద కీయంలో ప్రాచీన మలయాళ రచనలెన్నో ప్రచురించాడు. వాటిలో ముఖ్యమైనవి రామ చరితం, గిరిజా కల్యాణం, వ్యవహారమాల. పాటప్పాట్టు, భద్రోత్పత్తి, కేశగ్రహణం, త్రిపురారాధనం, బకవధ, దూతవాక్యం. జంగమ విజ్ఞాన సర్వస్వంగా, శబ్దార్థ సంగ్రహంగా గుర్తించబడిన పండితుడు. కవి 1940 లో స్వర్గస్థుడైనాడు. ]

"ఓ శాశ్వతమైన ప్రభూ ! రక్షకా !
ఆభరణయుక్తమై దేదీప్యమానంగా ప్రకాశిస్తూ
మానవులు నిండిన ఈ గోళాన్ని నువ్వే సృష్టించావు.
దీనిమధ్య సత్యమనే స్తంభాన్ని స్థాపించి
దానికి నీలాకాశాన్నే పందిరిగా మలచి
దానికిచుట్టూ పట్టుపరదాలనే ద్వారాలకు కట్టి
దానికి సూర్యచంద్రులను విద్యుచ్ఛక్తి దీపాలలా
నక్షత్రకాంతితో మెరిసే గోళానికి వేలాడదీసావు.
ఇంద్రనీలమణులను నిపుణతతో సంద్రమనే
భ్రాంతి కలిగేలా బాటలావేసి, పచ్చలను భూమి
అని భ్రాంతికలిగేలా మధ్యలో పొదిగావు.
కాని స్వామీ ! ఉషఃకాంతులను తిలకించినప్పుడు
పొంగిపొరలే పారవశ్యం అసామాన్యమైంది.
"ఓ ప్రభూ ! ప్రకృతి ఇంతకంటె వేరే ఆనందాన్ని

నాకేమీ ఇవ్వగలదు ? లౌకికమైన బంధాలనుండి
విముక్తుడనై, నిన్ను ముఖాముఖీ చూడటంకంటె ఏం కావాలి ?
విశాలమైన నింగియొక్క నీడనే చీకటిదుప్పటిని
తొలగించుకుని తూర్పుకుచూస్తూ తన
కిరణాలను వ్యాపింపచేస్తూ, భూమియొక్క
బంగారు మంటపం పైకి లేచింది.
తన స్నేహితులతో
సాయం సమయంనుండి రాత్రివరకు
నాట్యంచేసి అలసిన చంద్రుడు
నింగినుండి మాయమయ్యాడు.
అక్కడక్కడ ఒకటి రెండు తారలు
స్వర్గ సంబంధమైన బాలలు
తమ తల్లులనుండి తప్పిపోయి మార్గం తెలియని
వానిలా మసకగా మెరుస్తున్నై.
దేవతాస్త్రీ నాసికాభరణంలోని
వజ్రం ఒకటి నేలజారి మెరుస్తున్నట్లుగా ఉంది.
''ఎందుకలా సిగ్గుపడుతూ నించుంటారు ?
వెనుదిరిగి రక్షణగల ప్రదేశాలకు ఎగిరిపొండి !
దేదీప్యమానంగా వెలిగేవాడు తన గమనంతో బయలుదేరాడు.
కాబట్టి ఆయన మార్గంనుండి దూరంగా తొలగండి.
మిత్రులారా ! దేవతాస్త్రీలు గజగమనాలతో
నాట్యం చేస్తుంటే, వారిగాజులు తియ్యని రవాలతో
ఆ బాట ప్రతిధ్వనించే ఘడియ వచ్చింది.
మందవాయువులనే చీపుళ్ళతో శుభ్రంచేసిన
ఆ బాటంతా దివ్యంగా మెరుస్తుంటే
మందాకినీ నదిలోని జలాలు జల్లి
కల్పవృక్షాలనుండి పూసిన పూలతో
ఆ బాటంతా పరిచారు.
కాబట్టి మీరంతా వేరే ప్రదేశాలలో దాక్కోండి.
తూర్పుముఖంగానే చూడండి.
ఉషాకన్య దిఙ్మండలానిక
వ్యాపిస్తూ సముద్రాన్ని అంటుతున్న

నల్లని మేఘాలగుంపుల అంచున
బంగారుపూత వేయటం ప్రారంభించింది.
ఆ అంచు ఎర్రని బంగారువర్ణంతో
చీనాంబరపు అంచులావుంది.
వ్యవసాయం కోసం దేవతలు సముద్రంపై
నిర్మించిన అడ్డకట్టలా వుంది.
లేక అందమైన మైనాకపర్వతం నెమ్మదిగా తలెత్తినట్లుంది.
ఏమిటీ! ఓ ఉషాదేవతా! నీవు పనిలో ఉన్నావా ?
నువ్వు ఇంద్రనీలవు మంటపంమీద పగడాలు పొదుగుతున్నావా ?
లేక నిరంతరం బంగారు నాణాల
నాణ్యతను గీటురాయిపై పరీక్షిస్తున్నావా ?
లేక బంగారు పతకాలను ఏనుగుల వరుసలకు
కుంభస్థలాలపై అలంకరిస్తున్నావా ?
మేఘాలనే గిన్నెలలో నక్షత్రాల ద్రావకాన్ని
మరగ బెడుతున్నావా ?
లేక మేఘాలలోని మెరుపులకు మరలు బిగిస్తున్నావా ?
శుభప్రదమైన గోళంమీద ప్రేమ పారవశ్యంతో
తూర్పు స్త్రీ మీద ఆమె చెలికత్తెలు ఆమెపై
సువాసనాభరితమైన కుంకుమ పువ్వు ద్రవాన్ని
ఆమెపై చల్లుతున్నారు.
''ఓ చిరునవ్వుల తూర్పు దేవతా !
నువ్వు అలంకరించుకున్న పట్టు వస్త్రం
నా మనసనే తుమ్మెదకు
తామర కొలనులా వుంది.
దట్టంగా పూర్తిగా వికసించిన
తామరల ఒకో రేకు
నీ ప్రభువైన ఇంద్రుని నయనంలా వుంది.''
కాని అయ్యో ! వర్ణం మారుతోంది.
కుంకుమ పువ్వు ద్రావకం
ఇప్పుడు బంగారు ద్రవంలా వుంది.
దిఙ్మండలం అంచున తేజస్సు గల ఒక పదార్థం
యొక్క కదలిక తెలుసుకోదగింది,

పసుపు, ఎరుపు, నలుపు, తెలుపు రంగులు
కలసి మెరుస్తున్న ఆ భాగం
ఇప్పుడు పూర్తిగా బంగారు వర్ణంలో కలసి పోయి
ప్రపంచానికి మెరుస్తూ మనోహరంగా వుంది,
అటు చూడు ! ఆకాశం సముద్రం
మనోహరంగాఒకటైన చోట
బంగారు వస్తువేదో పొడచూపింది !
రెండు కళ్లు నులుముకొని చూడు !
అది కూర్మావతారపు నడిమి భాగమా ?
లేక దైవ సంబంధమైన ఎర్రని కలువ కాడా ?
లేక ఎర్రగా అగ్నిలా మెరుస్తున్న ''కిరంజి'' పండు
పై భాగమా ?
లేక దేవతారాధనికై కొనితెచ్చిన పళ్లెమా ?
లేక కల్పక వృక్షాల పూలు పెంచటానికి తెచ్చిన
కొత్త పూల కుండీయా ?
లేక యజ్ఞ సంబంధమైన శిలయొక్క బంగారు రంగు
గల సమతల ప్రదేశమా ?
లేక దేవతలు క్రీడించే పడవ పైభాగమా ?
లేక సముద్ర కన్య ఆటలో ఉపయోగించే వింజామరా ?
లేక ఇంద్రుని ఛత్రానికి అలంకరించిన వస్త్రమా ?.
లేక కొత్త ద్వీపమా ?
లేక అమృతంవుంచే రత్నాలు పొదిగిన పాత్రయా ?

(అను|| ప్రొ. వి. వి. దేవసయ)

**వల్లథోల్**

## సాహిత్యమంజరి

### ఆ చా ర్యా దే వు డు

[కవి గారి పూర్తి పేరు వల్లథోల్ నారాయణ మీనన్. (1879–1958), వల్లథోల్ అనేది వారి కుటుంబనామం, ఈ శతాబ్ది పూర్వార్థంలో మలయాళ కవిత్వాన్ని బాగా ప్రభావితం చేసిన కవిత్రయంలో ఈయన ఒకరు. దక్షిణమలబారులోని ఒక గ్రామమైన మంగలంలో ఈయన జన్మించారు. సంప్రదాయ పద్ధతిన మలయాళమూ,

సంస్కృతమూ, అభ్యసించారు, చిత్రోదయ అనే మహాకావ్యం రచించడమేకాక ఋతువిలాస, బంధనస్థాసయ అనిరుద్ధన్. గణపతి, మగ్దలానమరియమ్, బధిరవిలాపం, శిష్యనుమ్మకనుమ్, నగిల, కొచుసీత, అచనుమ్ మకలుమ్, బాప్పూజి, మొదలైన లఘుకావ్యాల నెన్నిటినో రచించారు. కాని ఆయనకు మహాకవిగా ముఖ్యంగా ఖ్యాతితెచ్చినవి సాహిత్య మంజరి పేరుతో తొమ్మిది సంకలనాలలో చోటుచేసుకున్న 150 గీతాలూ, వీరశృంఖల, దివ్యాస్వప్న అనే మరో రెండు కావ్యాసంపుటాలూ అని చెప్పాలి. ఆయన సంస్కృత రచనలనెన్నిటినో మలయాళం లోకి అనువదించారు. ఇందులో ఋగ్వేదం, వాల్మీకిరామాయణం, వామన, మత్స్య పద్మ, అగ్నిపురాణాలు, శాకుంతలమ్, బోధి సత్వఅవదాన కల్పలత, మొదలైన ఉత్కృష్టగ్రంథాలు న్నాయి. వల్లథోల్ దేశీయ కళారూపాలైన కథాకళి వంటివాటిపై చాలా అభిమానం కనపరచి వాటిని పునరుద్ధరించడానికై చాలా కృషిచేశారు. దీనికోసం కళామండలం అనే సంస్థ నాయన స్థాపించారు. దీనికిప్పుడు అంతర్జాతీయమైన ప్రశంస కూడా వచ్చింది. ఇవన్నీ అలా ఉంచి వల్లథోల్ రవీంద్రనాథటాగోర్, భారతితో సమస్కంధుడైన జాతీయ మహాకవి అని చెప్పాలి. సాహిత్యమంజరి, నాలుగోభాగం నుంచి ఈ కవిత ఎన్నిక చేయబడింది. గాంధీజీ పై రచించిన ఈ కవిత, వల్లథోల్ జాతీయ కవితారచనకొక మచ్చుతునక వంటిది.]

1. నమస్తవిశ్వమూ ఆయన గృహమే
   చెట్టూచేమ, పచ్చికా, బీడూ అన్నీ అయన ఆత్మబంధువులే
   పరిత్యాగిమే ఆయన అర్తి
   అణగిమణగి ఉండటమే ఆయన ఔన్నత్యం
   ఇదీ నాగురుదేవుని స్వరూపం-పరమగుహ్య విజ్ఞానానికాయన ఋషి,

2. నక్షత్రరత్న ఖచితమైనా
   పట్టించుకోదు
   కర్దమ మేఘసంఛన్నమైనా
   పట్టించుకోదు
   ఏదీ దానికి అంటదు, కలుషాన్ని కలిగించ లేదు
   ఆకాశం అత్యంతోన్నతోజ్జ్వలం
   నా గురుదేవుడున్నూ

3. అత్య పూర్వమైన విమలనది,
   భయంకర క్రూరజీవుల కావాసం కానిది
   ధూమంలేని పవిత్ర జ్యోతి
   పన్నగ పరివృతంకాని మహా పెన్నిధి
   నీడ ఏ మాత్రమూ పడని పండు వెన్నెల
   నా గురుదేవుడు,

4. అస్త్రశస్త్రాలు లేకుండా
ఆయన ధర్మయుద్ధం సాగిస్తాడు
గ్రంథాలక్కర లేదు, దైవత్వసంపదను బోధిస్తాడు
ఔషధాలు అవసరం లేదు.
వ్యాధులన్నీ కుదురుస్తాడు
నలుసంత హింస లేకుండానే
ఆయన యజ్ఞాలు నిర్వహిస్తాడు–యజ్ఞాలు
నా గురుదేవుడు.

5. నూటికి నూరుపాళ్ళు అహింస అయన పవిత్రజీవిత వ్రతం
శైశవంనుంచీ శాంతి ఆయన ఆరాధ్య దేవత
తరచు ఆయన అంటుంటాడు
"అహింస అనే నిరుపమానమైన కవచం
అత్యంత శక్తిసామర్థ్యాలున్న అపాయం కలిగించే ఉక్కునైనా
ముక్కవో జేస్తుంది" అని.

6. ఉత్తేజం కలిగించే ఆయన ప్రబోధాలు
ధర్మ దేవత హృదయం నుంచి వెలువడుతున్న వాక్కులు
ఇప్పటికి ధర్ముడు తన స్వరూపాన్ని చూడగలిగాడు
పరమ సత్యపు కొలువుకూటపు శ్రావ్య సంగీతం
ముక్తికాంత రత్నఖచిత కంకణనిస్వనం.

7. ప్రేమతో సమస్త విశ్వాన్నీ పాదాక్రాంతం చేసుకొనే
ఈ యోధ వరుడికి
ప్రణవ బీజాక్షరం ఓం ధనువు,
ఆత్మ ఆశుగం, బ్రహ్మదర్శించ వలసిన లక్ష్యం
ఓంకారంలో కూడా లీనమవుతూ, తల్లీనమవుతూ
ఆయన దాని ప్రభవ స్థానాన్ని చేరగలడు,
సూక్ష్మము, పరమము అయిన స్థితిని చేరుకోగలడు.

8. ఏసు ప్రభువు త్యాగాన్ని నీవు దర్శించ దలిస్తే
ధర్మరక్షకుడు శ్రీ కృష్ణుని రాజ నీతి చూడదలిస్తే
బుద్ధి దేవుని అహింసావ్రతాన్ని, ఆదిశంకరుల
మేధాసంపదను, రంతి దేవుని అంతులేని అక్కటికాన్ని
హరిశ్చంద్రుని సత్యవాక్యతత్పరతను,

మహమ్మదు పట్టుదలను, న్యాయాను శీలాన్నీ,
అన్నీ ఒక్కచోట మూర్తీ భావించిన మహామాననీయ
మానవమూర్తిని సందర్శించ దలుచుకున్నావా
నా గురుదేవుడి వద్దకువెళ్ళు, లేదా అయన గాథ చదువు.

9. ఒక్కసారి అయన పాదాలు దర్శించుకుంటే
ఒట్టి భీరువు మహావీరుడవుతాడు
క్రూరుడు పరమకారుణికుడవుతాడు
పరమలోభి నెరదాత అవుతాడు
పరుషభాషణుడు మధుర వాక్కు అవుతాడు
మురికివాడు అ తిపరిశుభ్రత పొందుతాడు,
అతి సోమరి మిక్కిలి పరిశ్రమించే వ్యక్తిగా మారిపోతాడు

10. అపారమైన శాంతమూర్తి అయిన ఈ దేవర్షిముందు
హంతకుడి కత్తి నీలోత్పల మాలిక అవుతుంది.
కరకు గోళ్ళ సింహం గువ్వ అవుతుంది, పరుగులు తీసేతరంగాల
మహద్భయద సంద్రం, అలవోకగా దాటగల
చిన్న పడియ అవుతుంది,

11. వర్తమాన పరిస్థితుల గూర్చిన చర్చలలో
నట్టడవి కూడా ఆయనకు సమావేశపుమందిరం కాగలదు
అతి సంచలనానికి ఆట పట్టైననగర మధ్యం కూడా
ప్రశాంత పర్వత సుందరకందరం కాగలదు.

12. ఈ ధర్మ కృషీవలుని ఉత్తమకృషి
ప్రతి క్షేత్రంలోనూ బంగారు పంటపండిస్తున్నది
అయితే ఈ మహా ద్రష్ట చూపులకు
పసిడి ఈ భూమిలో పసుపు పచ్చని ఇసుక మాత్రం.

13. ఈ సర్వసంగ పరిత్యాగికి
మహారాజ వైభోగం అతి నిరాదరణపాత్రం
స్వాతంత్ర్య కర్కశపథంలో పట్టుతివాసీలు
పరచే ఈ మహోన్నత ప్రభువు
సుకుమారమైన పాదాలు కసుగందకుండా
రక్షణకల్పిస్తున్నాడు.

ఎప్పుడూ అర్ధదిగంబరంగా దేహాచ్ఛాదనం
ముతక అంగ వస్త్రంమాత్రమే కటికి బిగిస్తాడు.

14. గీత నివ్వగలిగిన పవిత్రభూమిపైనే
ఇటువంటి మహోన్నతుని అవతారం సాధ్యం
ఈ కర్మయోగి ఈ భూమిలో మాత్రమే జన్మిస్తాడు
ఆర్యా వర్తంలో, హిమాలయాలకు వింధ్యకూ
మధ్య పుణ్యభూమిలో మాత్రమే
శాంతి సింహుడైన మహాపురుషుడుద్భవించ గలడు
గంగా జలపూతమైన పుణ్యభూమిలో మాత్రమే
ఇటువంటి కల్పవృక్షం ప్రభవించగలదు.

15. సర్వసంగ పరిత్యాగీ జయము, జితేంద్రియుడా జయం
మహాపురుషా జయం, జయం ఓ జగద్గురూ.

(అను॥ శ్రీ కన్నైక్కార ఎమ్. కుమారపిళ్ళై)

## జి. శంకర కురుప్

## సూర్యకాంతి (అన్వేషణ)

[సమకాలీన మలయాళ కవితాప్రపంచంలో అత్యంత సుప్రసిద్ధుడు మహోన్నతుడు అయిన శ్రీ జి. శంకర కురూప్‌కు ప్రప్రథమంగా జ్ఞానపీఠపురస్కృతి 1965 లో లభించడం ఆయన విశిష్టతను వేనోళ్ళ చాటుతుంది. 1901 లో జన్మించిన ఈ మహనీయుడు పాఠశాలా విద్యాభ్యాసాన్ని తన స్వస్థలమైన నయథోడ్‌లోనే పూర్తిచేసుకున్నారు. స్వయం కృషితో విద్వాన్ పట్టాన్ని సముపార్జించుకొన్నారు. ఒక పాఠశాలలో భాషాబోధకుడిగా జీవికను ప్రారంభించి ఎర్నాకులంలోని మహరాజా వారి కళాశాలలో మలయాళంబోధించే ప్రధానాచార్య పదవి నధిష్టించారు. జి. అని పొడి అక్షరం సంకేతంగా ఆయన ఎన్నో రచనలూ చేశారు. సుమారు నలభై గ్రంథాలవరకూ ఆయన కీర్తికరంగా వెలువడ్డాయి. వీరి కవితారచనలలో ముఖ్యంగా పేర్కొనదగినవి సాహిత్యకౌతుకం (నాలుగు భాగాలు), సూర్యకాంతి, పూజపుష్పం, పధికాంతపట్టు, నిమిషం, ముత్తుకల్, వెల్లిప్పరవకల్, విశ్వదర్శనం, పాథేయం, వనగాయకన్, ఒడకుజల్, జీవనసంగీతం మొదలైనవిఉన్నాయి. వీరి ఇతర రచనలలో కాళిదాసుని మెఘసందేశానికి అనువాదమూ, ఠాగూర్ గీతాంజలి అనువాదమూ ఉన్నవి. భారత ప్రభుత్వం వారిటీవల వీరిని పద్మభూషణ బిరుదంతో సత్కరించారు. (సం॥)]

కవి అన్నాడు: చిన్నారి పవనమా
ఎవరి కోసమీ అన్వేషణ ?
చలించి పోతున్న ఉత్సుకతతో పొంగిపోతున్న అనురాగంతో

నీకు విశ్రాంతి లేదు ఇతరాలోచన లేదు ఉన్మత్తంగా
అహోరాత్రాలు గవేషిస్తూ పరుగులు తీస్తున్నావు
బహుశా నీచాంచల్య పరిభ్రమణోన్మత్తత
చూసి చిన్ని పువ్వు వణికి పోతుంది
కిందికీ పైకి వెర్రిగా ఆలోకిస్తుంది.
ప్రియురాలి పేరేకాదా అది,
నీవు అస్పష్టంగా గుస గుసలుగా ఉచ్చరిస్తున్నది !
మత్తెక్కించే ప్రేమ మధువే కాదూ అది
నీ పాదాలు పరిభ్రమింప చేస్తున్నది
ఇంకేది అటువంటి పారవశ్యోన్మత్తత కలిగించ గలదు
దివ్య ప్రేమోత్తేజితమై
నీ వంటే ఏంత అసూయగా ఉందో నాకు !
మిత్రమా వెదకు, త్వర త్వరగా వెదకు
వేణుకుంజ పరిహాసాన్ని లక్ష్యపెట్టకు
దాని మనసంతా చాలా బోలు
నిట్టూరుస్తూ
గద్గదస్వరంతో
గాలి బదులు చెప్పింది
అయ్యో, మీరూహించినది నిజమే
నా ప్రియ దివ్యవదన సందర్శనంకోసం
నేను పరిభ్రమిస్తున్నాను
చాలా కాలమే అయిపోయింది
మేము విడిపోయి
అయినా ఆమెజ్ఞాపకంనన్ను కలచివేస్తున్నదిప్పటికీ
సృష్ట్యాది ఉదయాన
నేను కనులు తెరచి మేల్కాంచినప్పుడు
భూదివమ్ములు పరస్పరావ లోకనాలతో ఎదురుబొదురుగా నిలిచాయి
మౌనవ్యధతో
శూన్యహృదితో
చూశాను
ఆమె నన్ను విడిచి వెళ్ళింది
అయ్యో, నా ప్రేమను పరీక్షించేందుకేమో

ఒకటి రెండు విరిసిన సిత నక్షత్రాలు
ఆమె కురుల నుంచి జారి పడ్డాయి
ఆమె కాలి అందెల ఘలం ఘలలు విన్నాను
కాని అవి పక్షుల కూజిత ధ్వనులనుకున్నాను
ఆమె లాక్షారంజిత పాదాల గులాబీ అరుణి మంపు ముద్ర చూశాను
కాని అది ఉదయ లజ్జామౌగ్ధ్య శోభ అనుకున్నాను
ఆకాశంలో ఆమె పసిడి అంగుళ్యాభరణాన్ని విడిచిపెట్టి పోయింది
కాని దాన్ని నేను నభోమణిగా మాత్రమే తలచాను
గుర్తు పట్టే అనవాలు కోసం ఆమె
తన చీనాం శుకపురుమాలు విడిచి పెట్టింది
కాని దాన్ని నేను మేఘశకలమనుకున్నాను
ఆమె పాద పూతమైన అంశుకపు
అంచును నేను చుంబించ లేదు
చెంగల్వారుణ సంద్రమనుకున్నాను దాన్ని ఆరోజునుంచి
నన్ను నేను మరచి పోవడానికి
ప్రతి చోటా ద్రిమ్మరుతున్నాను
ఆ ఆనందాకృతిని దర్శించడానికి
ఎవ్వరూ చూడలేదు ఎవ్వరూ
అమెను చూశామని భావించుకుంటున్న వాళ్ళు కూడా చూడలేదు
అమెను చూచేందుకు నేను మాత్రమే యత్నించాలి
ప్రణయ స్వరూపిణి అయి నే వెదుకుతూ ఉన్న
ఆమె ఉనికి ఊహాకల్పితమనే వారి మాట దబ్బర
అది నమ్మదగింది కాదు
ఆమె వదన సౌగంధ్యం నాకింకా గుర్తు వుంది
లజ్జా వివశదరముకుళిత కుంద పుష్పములనే చుంబించి నప్పుడు
ఆమె కపోలముల చల్లని స్పర్శను
నా దాహాధరాలు సెలయేటిని తాకినప్పుడు జ్ఞాపకం చేసుకున్నాను.
జ్ఞాపకాలు మనస్సునెలా పారవశ్యంతో నింపగలవు
ఆమె, నేను వెదుకుతున్న ఆమె, మిథ్య అయినప్పుడు ?
లేత చేతుల పూలతీవ పరిరంభంలో కాని
హిమానీ పర్యంకోజ్జ్వల తలమున కానీ
నాకు మనశ్శాంతి లభియించదు, ఎప్పుడో ఒకనాడు

ఆమె సన్నిధానం చేరగలను, ఈ ఆశమాత్రమే నా ఊరట,
నా బలం
నిశిలో
వనిలో
అలసిసొలసి నే పడి పోదును, మగతకమ్మి
అదృశ్యంగా అప్పుడామె నా దరికి వస్తుంది
ఆమె చల్లని చేయి నన్ను తడుతుంది.
తకబాటుతో ఆనందంతో
నే మేల్కొంటాను
హతవిధీ! మళ్ళీదుఃఖంలో కూరుకుపోయేందుకే
నిద్రపోతున్న సంద్రాన్ని మేల్కొల్పి
అడుగుతా నతణ్ణి "చెప్పు ఆమె ఎక్కడ ఉంది"?
అనుకుంటాడతడు ఈ దౌర్భాగ్యుడు ఉన్మాది
అందువల్ల హోరున ఘోషిస్తాడు గంభీరంగా
వృక్షశీర్షాన్ని ఎన్ని మాట్లు తట్టి అడిగాను కాను
వ్యధాకలిత డోలాందోళన చిత్తంతో
ఆమె గురించి వర్తమానం చెప్పవలసిందని
కాని కంపించే అవయవాలతో
చెట్టు ఇట్లా చెప్పింది నాకు
అయ్యో ! నే నామెనసలు చూడనే లేదు.
విలపిస్తూ నేను దాని ఒడిపై వాలిపడిపోయినప్పుడు
కొండ తన ధ్యానమగ్నత మధ్య
అకాశంకేసి చూసింది
కాని ఆకాశం తన మౌన భాషతో చెప్పింది తా నామెనుచూడలేదు
హా ! దీనికిక అంతం లేదు కాబోలు
ఈ వియోగ చిరవ్యధకు ?

(అను: ప్రొ. బి. హృదయ కుమారి)

# సింధీ

మూలం :
శ్రీ తీరథ్ - వి - బసంత్

అనువాదం :
డా॥ జి. నాగయ్య

## చారిత్రక సమీక్ష

వైదికార్యులు సింధునదికి దిగువన ఉండే లోయలో మొదట స్థిరనివాసం ఏర్పరచు కొని ఉండిన కాలంలో వ్యవహరించిన భాషా మాండలికాలనుండి పరిణమించిన భాష సింధీ భాష. వాయువ్యదేశ ప్రాంతంనుండి వచ్చిన దాడులకు సింధుదేశం తరచు గురిఅవడంచేత దాని జాతి, సాంస్కృతిక చిత్రపటము పెక్కు రంగులతో వన్నెకెక్కి అద్భుతంగా కనబడు తుంది. హిందీ, పారశీకం, అరబ్బీ, తుర్కీ, ఇంగ్లీషు, పోర్చుగీసు భాషల్లోని పదజాలం తమ ప్రత్యేక చిహ్నాలు దాల్చుకొని సింధీ భాషాపద్ధతికి అనుగుణమైన మార్పులుచెంది సింధీ భాషలో పూర్తిగా మిళితమైంది. పరభాషా పదప్రవేశంవల్లనూ, సహజమైన వాటి సమీకరణ విధానంవల్లనూ సింధీభాష చాలా ప్రాచీనత కలదైనప్పటికి నూతనంగానూ సుందరంగానూ వెలసింది.

క్రీ. శ. 712 లో సింధుదేశంలో ఇస్లాం మతం వ్యాపించడం మొదలైంది. అది క్రమంగా కొంతకాలానికి ప్రజాహృదయాలను విశేషంగా ఆకట్టుకొని స్థిరపడింది. ఇస్లాం మతం విగ్రహారాధనను వ్యతిరేకించేది కావడంవల్ల అంతకుపూర్వం వెలసిన వాఙ్మయంకాని కవితలుకాని మిగలలేదు. ముసల్మానులు ఎక్కడ కాలుపెట్టినా ఇస్లాం మతగ్రంథమైన 'ఖురాన్' ప్రవచించిన ప్రకారం సరికొత్త సమాజాన్ని నిర్మించాలని తలపెట్టినారు. ప్రాచీన శిలావిగ్రహాదులను, తమకు ముందున్న వాఙ్మయాన్ని సమూలంగా విధ్వంసం చేసినారు. అందువల్ల ఈనాడు ప్రాచీన సింధీ వాఙ్మయం చాలా స్వల్పంగా మాత్రమే మనకు మిగిలింది. ప్రాచీన సింధీవాఙ్మయంలో 'సుమ్మర', 'సుమ్మ' శకములందు వెలసిన హమద్ (Hamad), రజు (Raju), ఐశాక్ (Isack) వంటి రచయితలవి కొన్నితప్ప తక్కిన రచనలన్నీ మాయ మైనాయి. ఈ ప్రాచీనయుగంలో వీరగాథలకు ప్రాచుర్యం ఎక్కువ కలిగింది. 'బుత్రీ' నివాసియైన షా అబ్దుల్ కరీమ్ (1538-1625) ఈ ప్రాచీన వీరగాథలను పునరుద్ధరించి, సంగీతంతో మేళవించి వాటిని గానయోగ్యంగా చేసినాడు. అబ్దుల్ కరీమ్ రచనలూ, మమొయ్-జ-బెయిట్ (Mamoi-ja-bait), కాజీకజన్ (Kazikazan) అనే కవుల ద్విపదలూ మాత్రమే ప్రాచీన సింధీరచనల అవశేషాలుగా మిగిలినాయి.

క్రీ. శ. 18 శతాబ్ది మధ్యకాలం నాటికిగాని సింధీభాషలో ప్రతిభావంతమైన ఉత్తమ కవితాసృష్టి జరగలేదు. చారిత్రకంగా చూస్తే ఈ యుగం సాంస్కృతిక వికాసానికి ఏమీ దోహదం చేసేదిగా లేదు నాదిర్ (Nadir), అబ్దాలి (Abdali) రాజులున్నూ వారి

ఆఫ్గన్ సుబేదార్లున్నూ ససైన్యంగావచ్చి సింధుదేశాన్ని క్రూరంగా దోచుకున్నారు. సింధీ ప్రజల లౌకిక ఆధ్యాత్మిక నేతలయి, వారి భయాలకూ భక్తికీ పాత్రమైన 'కల్ బొరాలు' (Kalboras) ఆ దోపిడీ మూకలను త్రిప్పికొట్టలేకపోయినారు. నాదిర్, అబ్దాలి, ఆఫ్గన్ సుబేదార్ల సేనాశక్తి అపారమైంది. ఆ సైన్యాలు ఒకప్పుడు మొగలుల, మరాఠుల ప్రాబల్యాన్నికూడ అణచివేసి ఢిల్లీని విధ్వంసం చేసినాయి. ఈ దాడుల్లో సింధుదేశం మరీ అధికంగా దెబ్బతింది. యాతాయాతములొనర్చే సైన్యాల అఘాతాలు ఈ దేశాన్ని చాలా క్రుంగదీశాయి. దేశం పరాయి రాజులకు స్వాధీనమైన తరవాత అపారంగా కప్పాలు కట్టవలసి వచ్చేది. రాజకీయంగా అశాంతి ఏర్పడిన ఆ కాలంలోనే షా-అబ్దుల్-లతీఫ్ అనే ఒక మహాకవి వెలశాడు. అతడు దైవభక్తి కలవాడు. నిరాడంబర జీవి. అతడు సంగీతశీలి అవడంచేత 'బైట్సు' (Baits) అని చెప్పబడే తన గేయాల్ని ఆశువుగా పలికేవాడు. తరవాత అతని అనుచరులు వాటిని వ్రాసిపెట్టారు. 'షా-జో-రసాలో' అనేది ఈ విధంగా కూర్చబడిన గేయసంపుటి. ఇది సింధీసాహిత్యంలో ఉత్తమోత్తమ రచన. షా-లతీఫ్ సామాన్య జనుల నిత్యజీవిత ఘట్టాలనే కవితా వస్తువులుగా స్వీకరించాడు అతని గేయాల్లో నికృష్ట జీవులు, పొలాల్లో పల్లెటూళ్ళలో పనిచేసే కర్షకులు, హోరుగాలి వీస్తూండగా ఒంటెల బిడార్లను పచ్చమొక్కలులేని పర్వతాలవెంట, ఇసుక ఎడార్లవెంట నడిపించుకపోయే జనులు సాక్షాత్కరిస్తారు. తమ సరుకులకు విపణివీధులు వెతుక్కుంటూ ప్రమాదకరమైన సముద్రాల మీద పడవ నడుపుకుంటూపోయే నావికులు ప్రత్యక్షమౌతారు. ఉత్తమత్వం, నిర్దుష్టత మనోరంజకత్వం షా లతీఫ్ గేయాల్లోని ముఖ్యధర్మాలు. ప్రాచీన జానపద వాఙ్మయంలోని దురదృష్టవంతులైన కథానాయికా నాయకులను గ్రహించి వారి దుఃఖానుభవాలను మననంచేస్తూ యుగయుగాల విజ్ఞానంతో సమన్వయించి సరికొత్తరీతిలో అతడు ప్రకాశింపజేసినాడు. సింధుప్రాంతం హిందూ పారశీక సంస్కృతులకు సంగమస్థానం. మానవతా ధర్మము, సర్వజన సమాదరణశీలత వాటిని సాధించే అంతర్దృష్టి అక్కడ నెలకొన్నది. జీవితంలో సూక్ష్మాంశాలనుకూడా ప్రేమిస్తూ వాటిని వేదాంతదృష్టితో మేళవించే విశ్వమానవతావాదానికి షా-లతీఫ్ ప్రముఖ లక్షణం. షా-లతీఫ్ ఎటువంటి అంశాన్నైనా ప్రజ్ఞతో నిర్వహించగల ప్రతిభాశాలి నిర్మానుష్యమైన పర్వతప్రాంతాలు, ఇసుక ఎడార్లు, ఉప్పొంగిపారే ప్రవాహాలూ, భయోత్పాతాన్ని పుట్టించే పెనుగాలులూ— ఇటి నైసర్గిక శోభను కవితలో ఎంతో అభినివేశంతో చిత్రిస్తాడు. నిర్దాక్షిణ్య ప్రకృతియైన పరిసరాల్లో దుర్భర జీవితాన్ని నిలుపుకోవడానికి మానవుడు ధీరత్వంతో నడిపే పోరాటం ఇక్కడ కనబడుతుంది. షా-లతీఫ్ యొక్క పరిశీలనారంగం ఎంత విస్తృతమైనదంటే దానినుంచి ఏదీ జారిపోదు. పేరులేని మొక్క దగ్గరనుంచీ, జంతువు దగ్గరనుంచీ, గర్భదరిద్రుడైన కర్షకుడుకానీ, కుమ్మరి కానీ అతని దృష్టికి దూరంకావడం ఉండదు. అతడు సింధీకవులకెల్ల తలమానికం. ప్రజా వ్యవహారానికీ ఉచ్చారణకూ సన్నిహితంగా ఉండే శక్తిమంతమైన భాషలో అతడు రచన చేసినాడు. అతని కవిత ఉత్తమోత్తమం. అపురూపమైన అంతర్దృష్టి, వివేకంగల మహాఋషిగా, ఉదారచిత్తునిగా, కరుణార్ద్ర హృదయునిగా, సన్మార్గవర్తనునిగా, ముందుచూపుగల మహాకవిగా షా-అబ్దుల్-లతీఫ్‌ను సింధీప్రజలు భక్తితో ఆరాధిస్తారు. అతని రచనలు ఏ దేశంలోనైనా ఎక్కడైనా ఎవరికైనా గర్వకారణమైనవే.

షా-లతీఫ్ అడుగుజాడల ననుసరించి కవితారచన సాగించిన మహాకవుల్లో సచల్ (Sachal) ప్రథముడు. సనాతన మతవిశ్వాసాలను, ముఖ్యంగా ఇస్లాం మతంపేర వ్యాపించి అర్థరహితంగా అనుసరింపబడే వాటిని ఎదిరించిన భౌతికవాది 'సచల్'. సంకుచిత తత్త్వాన్ని స్వపక్షమందలి దురబిమానాన్ని అతడు స్పష్టంగా శక్తిమంతమైన భాషలో అధిక్షేపించాడు. మూఢవిశ్వాసాలపై అతడు చేసిన తిరుగుబాటు అన్నిరకాలైన సంస్కరణలకు ప్రోత్సాహకారణమైంది. సచల్ తిరుగుబాటు సూఫీకవి. అతనికి పూర్తిగా విలక్షణమూ, విభిన్నమూ అయిన రచనలు చేపట్టినవాడు 'సామి' (Saami) అనే కవి. అతని పద్యధార గంభీరంగా ప్రవహించే ప్రవాహంలాగా ప్రసన్నగమనంతో సాగిపోతూంటుంది. అతని కవిత్వం లౌకిక విషయాలతో కలుషితం కాదు; సామాన్యులు అజ్ఞానవలయంలో చిక్కుకొని మంచిచెడ్డల నిర్ణయించుకోలేక అనుభవించే ఈతి బాధలకు అతీతంగా ఉంటుంది. శంకరాచార్యుల సాంప్రదాయాన్ని అనుసరించిన మాయావాది సామి. అచ్చమైన సింధీ భాషలో అతడు వ్రాసిన 21000 శ్లోకాల్లో స్వాతిశయం పనికిరాదనే ఉపదేశాన్నే మనకు వినిపిస్తాడు. మానవజీవితం క్షణభంగురమనీ, అందులో మనదనుకున్నదేదీ మనది కాదనీ, మోక్షసాధనకు గురువును ఆశ్రయించి అనుసరించాలనీ సామి తన రచనల్లో ఉపదేశిస్తాడు. సామిలో కేవలం కవిత్వాంశముకన్న ఋషిత్వమే ఎక్కువగా గోచరిస్తుంది. అతని రచనలో మనల్ని ఎక్కువగా ఆకర్షించేది శబ్దసరళత, రమ్యత. అదే అతని ప్రతిభకు అమోఘమైన తార్కాణం.

పైని పేర్కొన్న కవిత్రయం తరవాత భావార్థ ప్రకాశములైన వారి ప్రసంగ పాఠాలనే విభిన్న ధోరణుల్లో ఉచ్చైస్స్వరంతో గానం చేసిన గేయకవులు ఎందరో వెలశారు. అట్టివారిలో బెడిల్ (Bedil) ఉద్దండ పండితుడు. బెకాస్ (Bekas) మంచి భావుకుడు. దల్పత్ (Dalpat) చిత్ర కవిత్వ నిపుణుడు. గుల్ మొహమద్ (Gul mohamad) తన రచనల్లో సరికొత్త రూపాలకోసం పరితపించాడు. దేశీయమైన 'బైట్స్', 'కఫీష్' (Kafees) లకు మారుగా తనకు నచ్చిన పారశీకచ్ఛందోరీతుల ప్రవేశపెట్టినాడు. వీరివలెనే తరువాత వెలసిన మీర్జాకాలిచ్ బేగ్ (Mirza Kaleech Beg) వంటి కవులెందరో ఈ దారిలో నడచి అధిక రచనలచే సింధీ సారసత్వానికి వన్నెచిన్నెలు చేకూర్చి గణుతికెక్కినారు. స్థూలమూ, రేఖాప్రాయమూ, అతి పరిమితమూ అయిన ఈ సమీక్షా వ్యాసంలో అప్రసిద్ధులైన కవులనూ వారి కావ్యాలనూ విడివిడిగా వివరించడం సాధ్యమయ్యే పనికాదు. అయినా పాత సంప్రదాయాన్ని కొంతవరకు ఉల్లంఘించి తమదైన సరికొత్త మార్గాన్ని నిర్మించుకొని నిలదొక్కుకొన్న కవివర్గాన్ని గూర్చి ప్రసక్తం చేయడం తప్పనిసరి. ఈ కవివర్గ ప్రతినిధి కిషిన్‌చంద్ బివాస్ (Kishin chand Bewas). అతడు తన శిష్యుల్లో యువకులైన కొందరికి తన ఆదర్శాలను బోధించి వారిని చైతన్య మూర్తులుగా తీర్చిదిద్దినాడు. ఈ విభజన మూలంగా కవివర్గంలో విభేధాలు ఏర్పడినాయి. కవివర్గంలోని కవులు సమైక్యంగా కాకుండా విడివిడిగా ఎవరికివారే స్వాతంత్ర్యోత్తర కాలానికి అనుగుణమైన చిత్త వృత్తులను, భాషారీతులను సృష్టించుకొని తమ ప్రత్యేక వ్యక్తిత్వాలను నిరూపించుకొన్నారు.

సింధీభాషలో గద్యరచన బ్రిటీషు పరిపాలన తరవాతనే ప్రారంభమైంది. 19 వ

శతాబ్ది చివరి పాదంలో హిందూ పారశీకదేశాల్లో వ్యాప్తిగాంచిన కొన్నికథలూ, అద్భుత కల్పితేతివృత్తాలూ అప్పుడప్పుడే పరిపాలకులచే ప్రవేశపెట్టబడిన నూతన సింధీ లిపిని చదువ గల్గిన పాఠకుల వినోదం కోసం ఆయాభాషల నుండి సింధీభాషలోనికి అనువదింపబడినాయి. అప్పటినుండి సింధీభాషలో భాషాంతరీకరణాలు విరివిగా ప్రారంభమైనాయి. ఇంగ్లీషు, హిందీ, బెంగాలి, ఉర్దూ, సంస్కృత భాషల్లోని చాలా గ్రంథాల అనువాదాలు సింధీలోకి వచ్చినాయి. అవిచ్ఛిన్నమైన ఈ అనువాదాల ఫలితంగా మహాభారతం, రామాయణం, గీత, సిక్కుమత గ్రంథం, ఉపనిషత్తులు మొదలైన గ్రంథాలేకాక కబీర్, సూరదాస్, మీరాబాయ్, తులసీదాస్ మొదలైన భక్తాగ్రేసరుల మధుర రచనలు కూడా సింధీభాషలోకి వచ్చాయి.

సాధారణంగా మత సారస్వతం పునరుక్తులతో వైవిధ్య రహితంగా ఉంటుంది. నూతన సంఘ వ్యవస్థకి విపరీతంగా తోస్తుంటుంది. అయినా మతసంస్థల మూలంగా మతాధిపతుల నిర్వహణ చాతుర్యం వల్ల మత సారస్వతం సింధీప్రజల ఆదరాభిమానాలకు పాత్రమైంది. ఈ మత సారస్వత, లౌకిక వాఙ్మయ వికాసాన్ని కుంటుపరచలేదు, 20వ శతాబ్ది ప్రారంభంలో ప్రథమంగా కొన్ని ఆంగ్ల నవలలు, నాటకాలు సింధీభాషలోకి అనువదింపబడినాయి. తరవాత 'ప్రేమ్‌చంద్', 'శరత్', 'బంకిమ్', 'తారాశంకర బెనర్జి', 'కె. యం. మున్షీ' మొదలైనవారి రచనలు కూడ సింధీభాషలోకి వచ్చినాయి. గోర్కీ వంటి రష్యా రచయితల రచనలు అనువాదాలు కూడా కొద్దికాలం క్రితమే సింధీ భాషలో వెలశాయి. ప్రపంచ సాహిత్యంలోని ఉత్తమ రచనల అనువాదాలు ఇంకా ఎక్కువగా రావలసి ఉంది. వాటి ఆవశ్యకత ఈనాడు ఎంతైనా ఉంది. ప్రభుత్వంవారి ప్రోత్సాహ సహకారాలు అమితంగా ఉంటేనేకాని జయప్రదంగా ఈ అనువాద కార్యాన్ని నిర్వహించడం సాధ్యంకాదు.

ప్రాచీన గద్య రచయితల్లో ప్రధానంగా పేర్కొనదగినవారు దయారామ్ గిదుమల్, మీర్జా కాలిచ్ బేగ్ (Mirza Kaleech Beig) లు. వీరు గద్యాన్ని సాంఘిక భావ ప్రపంచానికై వినియోగించినారు; దైనందిన జీవితాన్ని ప్రతిఫలింప చేసే చక్కని కథలను వ్రాశారు. దయారామ్ గొప్ప పండితుడు. అతని గద్యరచన నిశిత పరిశీలనంతో నీతిబోధతో కూడి మిక్కిలి రమ్యంగా ఉంటుంది. కాలిచ్‌బేగ్ బహుగ్రంథ రచయిత. అతని గ్రంథాలు సుమారు 200 పైగా మనకు లభిస్తున్నాయి. సింధీ సారస్వతంలోని అన్ని ప్రక్రియల్లోనూ అతడు సరికొత్త ప్రయోగాలు చేసినాడు. అతని రచనల్లో స్వతంత్ర గ్రంథాల కంటె అనువాదాలే ఎక్కువ. అతని వచన రచన ఒడిదుడుకుల్లేకుండా పట్టాల మీదనే నడిచే రైలు లాగా క్షుణ్ణమార్గంలో మృదువుగా సాగిపోతూంటుంది. ఈ శకంలోనే కౌరోమల్ ఖిల్‌నాని (Kauromal Khilnani) అనే మరొక పూజనీయుడు బ్రహ్మసమాజంచే ప్రభావితుడై సంఘ సంస్కరణాని కుపయుక్తములైన చిన్నచిన్న గ్రంథాలను ప్రకటించినాడు. నైఘంటికులకు, వ్యాసకర్తలకు కూడా ఈ యుగం పేరెన్నిక గన్నదే. ఈ కాలంలో పర్మానంద్ మేవారామ్ (Parmanand Mewaram) అనే నైఘంటికుడు వెలసినాడు. అతని భాషాశైలి సరళమూ, మధురమూ, ప్రసన్నమునూ అయి మిక్కిలి శక్తిమంతంగా ఉంటుంది. అతని నీతియుక్తములైన వ్యాసాలు పిన్నలకు పెద్దలకు వినోదంతోపాటు ఉపదేశాన్ని చేకూరుస్తాయి. కౌరోమల్ ఖిల్‌నాని, పర్మానంద్ మేవారామ్ ల అడుగుజాడల ననుసరించి రచన సాగించిన

భేరుమల్ మెహెర్‌ఛంద్ (Bherumal Meherchand) లాల్‌ఛంద్ అమర్దినోమల్ (Lalchand Amardinomal) జేత్‌మల్ పార్స్‌రామ్ (Jethmal Parsram) అనేవారు కవిత్రయంగా ప్రసిద్ధి కెక్కినారు. వారిలో భేరుమల్ మెహెర్‌చంద్ బహుభాషావేది. విశ్లేషించి సాంఘిక శాస్త్రజ్ఞుడు. లాల్‌చంద్ అమర్దినోమల్ గద్య రచనలో పాతవడ్డ మాటలు, ఛాందసపు అభ్యాసాలు ఎక్కువగా కన్పిస్తాయి. అయినా అతని భావాలు తీక్ష్ణములై, మృదు మధురములై ప్రత్యేకత నార్జించుకొని చదివేకొద్ది చవులూరిస్తుంటాయి ఈ కవిత్రయంలో మూడవవాడైన జేత్‌మల్ పార్స్‌రామ్ పత్రికా రచయిత; రాజనీతి నిపుణుడు. మితవాదులు వాదించే అనవసర వివాదాలనూ, తాత్కాలికోపకరణాలైన యుక్తులనూ విశదమైన భాషా సరళితో బలపరుస్తాడు. అతడు 'బిసెంట్'కు ముఖ్య అనుచరుడు. బిసెంట్ దివ్యజ్ఞాన సమాజం వారి చిన్నచిన్న ఆంగ్ల గ్రంథాలను, కొన్ని సుప్రసిద్ధ ఆంగ్ల గ్రంథాల్లోని సంక్షిప్త రూపాలను అతడు అధికసంఖ్యలో సింధీభాషలోకి అనువదించాడు. మరికొన్ని స్వల్ప గ్రంథాలను కూడా స్వయంగా సింధీభాషలో రచించినాడు. జేత్‌మల్ పార్స్‌రామ్ వ్యాసకర్తకూడా. 'ఫేబియన్' సామ్యవాదం, దివ్యజ్ఞాన సమాజ విజ్ఞానం, సూఫీతత్త్వం వీటితో కూడుకొన్న అతని రచన కొత్తపోకడలతో మధురాతి మధురమై పాఠకులను విశేషంగా ఆకట్టుకొని విందు చేసింది. ఈ తరానికి చెందిన ఇతర కవుల్లో ముఖ్యులు—ఆచార్య గిద్వాని, యన్. ఆర్. మల్కాని, లీలారామ్ ప్రేమ్‌చంద్, దయారామ్ మీర్‌చందాని, డాక్టర్ హెచ్. యం. గుర్‌బక్సాని మొదలైనవారు. వీరంతా తమకు కీర్తిని తెచ్చే అమోఘ రచనలుచేసి ప్రసిద్ధి గాంచినవారే.

భరతఖండ విభజన మూలంగా ఏర్పడిన కల్లోలాలూ, అలముకొన్న విషాదచ్ఛాయలూ సింధీ సాహిత్య సృష్టికి సంబంధించిన ఉత్సాహాన్ని పోగొట్టలేదు. పైగా సరిహద్దుకు రెండువైపులా ఒకవిధమైన కొత్తసాహిత్య వికాసం ప్రారంభమైంది. దీని ప్రభావం రాబోయే సాహిత్యంపై కూడా ఉంటుంది. దానిపై ఇది చెరగని ముద్రవేసే అవకాశాలు చాలా ఉన్నాయి. ఉదాహరణకు చిరకాలం నుంచీ వస్తున్న నాటకాలనుండి మన దృష్టి యం. యు. మల్కాని నాటకాలపై పడింది. ప్రాచీన నాటకాలు అద్భుతావహాలు, నీతిబోధకాలు. మల్కాని నాటకాల్లో దృశ్యమానమయ్యేవి – వర్ణాంతర వివాహాలు, బహుభార్యాత్వం, విడాకులు, కొడుక్కూ సారుతల్లికి అక్రమ సంబంధాన్ని అంటగట్టడం. ఇలాంటివే భావనాశాస్త్ర సంబంధం మీద ఆధారపర్చిన గోబింద్‌మల్‌హి (Gobind Malhi) నాటకాలు, మేధకు మేతపెట్టే 'బసంత్' (Basant) గారడీ రచనలు. ఇవి నూతన సాహిత్యోద్యమానికి మరి కొన్ని సంకేతాలు. వీటికి తోడు ఆసక్తికరమైన నాటక సంఘాలు కొన్ని వెలసినాయి. వాటి వల్ల నాటక కళాభిరుచి పెంపొందింది. నాటక ప్రదర్శనం వినోదకరంగా లాభదాయకంగా పరిణమించింది.

పాశ్చాత్య కళావిజ్ఞాన ప్రభావంచే సింధీ సారస్వతంలో గొప్ప పరివర్తనం కలిగింది. క్రమక్రమంగా కథా వస్తువరణంలోనూ మార్పులొచ్చాయి. సాహిత్యానికి సంగీత సౌందర్యాలతోడి సంబంధం పూర్తిగా తొలగిపోయింది. ''సుందరమైన వస్తువు ఎల్లప్పుడు

సంతోషాన్నే కలిగిస్తుంది'' అని 'కీట్స్' (Keats) చెప్పిన లోకోక్తికి ఈ సాహిత్యం వ్యతిరేకంగా గోచరిస్తుంది. దరిద్రం, అసహ్యం, అపరిశుభ్రపలతో శారీరకంగా మానసికంగా దిగజారిపోయిన సామాన్యుల నిత్యజీవితం స్పందించే కవి హృదయాలను ఆకర్షించింది. సౌందర్యమొక్కటే ఆరాధ్యం కాదని అసుందర వస్తువులను కూడా కవితావస్తువులుగా స్వీకరించవచ్చునని నిరూపించారు ఆధునిక కవులు. వారు ప్రకృతి సౌందర్యాన్ని గానం చేయటానికి, పూర్వుల నైతికాదర్శ విలువలను స్తుతించటానికి నిరాకరిస్తారు. పరిసరాల్లో మామూలుగా కన్పించే అతిసామాన్య వస్తువుల్లోని రామణీయకతను సష్టించినప్పుడే కవిత్వం ఆధునికుల దృష్టిలో సార్థకత చెందుతుంది. ఈ రచయితలను తమ వాస్తవికానుభవాలు ఉడుకెత్తించినాయి. వారిహృదయాలను కోపంతోనూ నిస్పృహతోనూ నింపివేసినాయి. సంపన్నుల మోసానికి గురియై జీవితంలో తాము సుఖశాంతులకు నోచుకోలేదని వ్యసనాన్ని పొందుతూ ద్వేషంతో చురచురలాడే సామాన్యజనుల గొంతుకలు వీరి కవిత్వంలో వినిపిస్తాయి. ఎన్నో దృక్పథాలు సాహితీ రీతులు ఆధునిక యుగంలో ఒకేసారి ప్రచారానికి వచ్చినా నిస్పృహను పొందిన ఈ సామాన్యజనుల జీవిత చిత్రతే ప్రాధాన్యం వహించింది.

అంతర్జాతీయ ప్రశస్తి కల్గిన కల్పనా కథలతో సరిపోల్చ దగిన నవలలు హిందూదేశంలోనే నాకు తెలిసినంతవరకు ఇంకా వెలువడలేదు. సింధీ సారస్వతంలో ఈ నవలా ప్రక్రియ ఇంకా శైశవ దశలోనే ఉన్నది. అయినా 'గోబింద్ మల్హి' (Gobind Malhi) మొదలైన వారి నవలలతో ఈ ప్రక్రియకు బీజారోపణం జరిగింది. గోబింద్ మల్హి అతి సామాన్యమైన కొన్ని చిన్న నవలలను రచించినాడు. ఒక రకంగా 'పొప్తిహీరానందమ్ (Popti Hiranandam), సుంద్రీ ఉత్తమ్ ఛందాని (Sundri Uttam Chandani), కలన్ ప్రకాష్ (Kalan Prakash) తారామీర్ ఛందాని (Tara Mir Chandani) మొదలైన రచయిత్రుల తోడ్పాటువల్ల నవలా రచనకు ఒక నిజమైన సమున్నత స్థాయి లభించింది. దైనందిన జీవితంలో నిత్యము స్త్రీలు ఎదుర్కొనే సమస్యలను, వివిధ వ్యవహారాల్లో వారి ఆలోచనా తీరును దృక్పథాన్ని వీరు తమ నవలల్లో ప్రధానంగా చర్చించి మన ముందుంచినారు. సాంఘిక నిర్మాణము నందు వీరు వేలెత్తి చూపే దోషాలివి—ఆధునికా నియమాల ఒత్తిళ్ళకు లోనై శైథిల్య మందడం, సంఘసమస్యలను ఎదుర్కొనటంలో ప్రాచీనులవలె కాక నేటి యువతరం వాళ్ల పట్టుదలనూ, శ్రద్ధనూ కనపర్చకపోవడం.

నిజం చెప్పాలంటే కథ చెప్పడం లోకంలో అనాదిగా ప్రచారంలో ఉన్న కళే. రసస్ఫోరకమైన ఒక సన్నివేశాన్నో, ఒక భావావేశాన్నో, ఒక పాత్ర మనఃప్రవృత్తినో కేంద్రంగా చేసుకొని దానికి అనుగుణమైన వాతావరణాన్ని సృష్టించి తేటతెల్లంగా కథను వివరించడమే ఇంతవరకు పాటిస్తూవస్తున్న కథన పద్ధతి. ఇప్పుడు ఈపద్ధతి రూపులేకుండా పోయింది. తేటతెల్లమైన కథాస్థానంలో కథకాని కథ (No story) కథా వ్యతిరేకమైన కథ (Anti story) అనే అద్భుత ప్రక్రియలు ఎక్కువగా వెలసినాయి. సూక్ష్మంగా పరిశీలిస్తే ఇది ఒకరకమైన కాకుల కథవలె చోద్యంగా కనిపిస్తుంది. ఎందుకని అంటే ఈ కథలో నాయకుడికి అనేకములైన అనుభవాలు కల్గుతాయి, కాని ఈ నాయకులు వాటిని సక్రమంగా వివేచించుకొనే

శక్తి కోల్పోయినమనుష్యులు. ఈధోరణి రచనచేయడంలో నాజూకు తేలిన రచయితలు ఈ ప్రక్రియకు సరిపోయిన కథావస్తువులను అన్నిటిని కూలంకషంగా ఉపయోగించుకొన్నారు. అందుకని ఇప్పుడు ఆయోమయస్థితిలో దిక్కుతోచని దీన స్థితిలో దేవులాడుతున్నారా అని అనిపిస్తుంది. 1950-59 కాలంనాటి నియమబద్ధమైన ప్రగతిమార్గం నుంచి కథారచన దూరంగా వెళ్ళిపోయింది. ఆ తరవాత మానవుని అంతర్దృష్టి లాభకరమైన ఉద్యోగాన్వేషణలో చాలా వాస్తవికత చూసింది. క్రిక్కిరిసి ఉండే ఆఫీసుల్లో అర్థరహితమైన దినచర్య ఆశా దృష్టిని పూర్తిగా నీరస పరిచింది. ఇది నేటి కథారచనలో కనిపిస్తుంది. దీన్ని రూపు మాపేం దుకు కొందరు రచయితలు ఊహాప్రధానమైన ఆనందాన్ని కల్గించే సన్నివేశాలను సృష్టించారు. ఒక రకంగా ఈ విధమైన రచన ఉడిగిపోతున్న శక్తులకు కొంత ఉత్తేజాన్ని కల్గించింది. అంతేకాకుండా సంపన్నుల అభిరుచులనూ, నాగరికమైన జీవితాన్నీ సుపరిచితం చేసింది. ఈ రచనల్లో దిగంబరత్వానికి అశ్లీలమైన కామప్రవృత్తికి దగ్గరగా ఉన్న రచనలు మాత్రమే కొంతవరకు పాఠకుల మనస్సుకు వెగటు కల్గించవచ్చు. ఈనాడు అన్ని ప్రక్రియలు వదలేసి కథలు సృష్టిస్తున్నట్లు నటించడమే గొప్పైపోయింది. అన్ని ప్రక్రియలను వదిలేసి రచన చెయడ్యంకూడ ఒక నూతనప్రకృతి అని ఈ రచయితలు గ్రహించడం లేదు. ధ్యేయాన్ని వదలి వేయడం కూడ ఒక రకమైన ధ్యేయమే కదా ! అయినా కూడ వీరి వాక్యరచన, భాష చాలా వింతగా ఉన్నా, అభ్యాసాలు అహంభావ పూరితములై పరమ ఛాందసంగా ఉన్నా, కళ్ళకు కట్టించే దృశ్యాలను చిత్రించే ప్రజ్ఞ వీరికుంది. అందువల్ల వారికథలు సాహిత్య ప్రతిష్ఠ గడించుకోన్నాయి.

ఏదో ఒకరకమైన కావ్యసమీక్ష, సాహిత్య విమర్శ సింధీభాషలో బొత్తిగా లేకుండా పోయింది. సాహిత్యవిమర్శ ఒక సృజనాత్మకమైన కళ అని కానీ, ప్రత్యేకంగా పరిశీలించదగిన శాఖ అని కానీ గుర్తింపు జరగలేదు. ఈ లోపాన్ని తీర్చేందుకు చాలా విధాల విమర్శనా పద్ధ తులు విరివిగా బయలుదేరినాయి. సాహిత్య విమర్శనా పద్ధతులతో వివిధ సాహిత్య ప్రక్రి యలను అన్వయించటం జరిగింది. అయినా చేయవలసింది చాలా ఉంది. ఇప్పుడు జరుగు తున్న అవిరామకృషివల్ల పాండిత్యమూ దానితోపాటు సాహిత్య విమర్శ పెంపొందే అవకాశాలు బాగా కనిపిస్తున్నాయి.

నాల్గుకాలాల పాటు నిల్చే స్వతంత్రమైన జీవితచరిత్రలు సింధీభాషలో ఎక్కువగా లేవు ఈ దశాబ్దిలో విష్ణుశర్మ వివిధ భాగాలుగా ప్రచురించిన డాక్టర్. చొయిత్రమ్ (Dr. Choitram) చరిత్రలో జీవితచరిత్ర కుండవలసిన హంగుల్లో కొన్ని ఉన్నాయి: స్వీయ కథాత్మకమైన శ్రీ మల్కాని 'కాన్‌వార్' (Kanwar) అనే గ్రంథం జీవితచరిత్రలో ఒక ప్రత్యేక తెగకు చెందింది. ఇందులోని కథావస్తువు ప్రధానంగా భావప్రేరితమైంది. అందు వల్ల ఈ రచన పదికాలాలపాటు నిల్చే అవకాశాలు ఉన్నాయి. ఈ కాలంలో వ్యాసరచనకు కూడా మంచి ప్రోత్సాహ సహకారాలు లభించాయి. అర్ధశతాబ్దానికి పైగా రాజకీయ వృత్తాం తాలతోడి వ్యాసాలు చిన్న పుస్తకాల రూపంలో ప్రకటింపబడినాయి. ఇవి నేటి వివాదా లకు అతీతంగా లేవు కనుక వాటి సాహిత్య విలువ నిలువకపోవచ్చు. అలాగే సాహిత్య

విమర్శలో కూడా కొన్ని ప్రాథమిక ప్రయత్నాలు జరిగాయి. అయినా వాటికి సాహిత్య స్థాయి చాలా తక్కువ. వ్యాసరచనాస్థాయిని, విలువను పెంచటానికి ప్రపంచంలో ఇతర భాషల్లో ఉన్న వ్యాసాల స్థాయికి వాటిని తీసుకరావటానికి ఆధునిక సింధీ రచయితలు కృషి చేస్తున్నారు.

స్థూలమూ, రేఖాప్రాయమూ, అతి పరిమితమూ అయిన ఈ సమీక్షా వ్యాసంలో చాలా వివరాలు సర్వంకషంగా చర్చించటానికి వీలుకాలేదు. అందువల్ల ఉద్దేశపూర్వకంగానే కొన్నిటిని వదలివేయడం జరిగింది.

## వి ష య సూ చి క

### గద్య భాగము



### పద్య భాగము

## దయారామ్ గిద్వాని

# 'స్వామి' ప్రవచనములు

ఈ లోకంలో మానవునికి ప్రబలమైన ప్రతికూలశక్తులు అయిదున్నాయి. అవి అందరికీ తెలిసినవే కాని కొద్దిమందే వాటిని గుర్తించగల్గుతారు. మనం వాటిని పట్టించుకోకుండా బహిర్గతం చేస్తున్నట్లు నటించినా వాటిలో కొన్ని రహస్యంగా మనలను వీడక అంటిపెట్టుకొనే ఉంటాయి. మన బిడ్డలకన్నా అవి ప్రియమైనవి. అయినా ఆ అనురక్తిని లక్ష్యం చేయకుండా మనం వాటిని అధిక్షేపిస్తాం. ఆ విషయంలో మన విజ్ఞానాన్ని దుర్వినియోగపరుస్తాం. ఎప్పుడో కాని మనం తెలివిగా ప్రవర్తించం. ఈ విరోధులకు తుపాకులు కాని సైన్యాలు కాని లేవు. అయినా ప్రభువులకన్న చాలా శక్తిమంతమైనవి. అంతేకాదు ప్రభువులూ వీటికి బానిసలే. వీటిని జయించే నిమిత్తమే ప్రపంచంలోని అన్ని మతగ్రంథాలు వెలసినాయి. వ్యాస వాల్మీకులవంటి కవులంతా, బుద్ధుడు, జొరోస్టర్ (Zoroaster), మోసస్, క్రైస్తు, కన్ఫ్యూసియస్ (Confucius), మొహమద్‌లాంటి ప్రవక్తలంతా వాటిని తిరస్కరించారు. అయినా ఈ శత్రువులు మనపై అధికారాన్ని నిలుపుకొంటూనే ఉన్నాయి. అవి మన హృదయాలను ఆకట్టుకోవడమేకాక దేవతల రూపాలతో మన సమర్పణలన్నిటిని తమకోసం ఆత్మీకరించుకోనునట్లు చేసుకొన్నాయి. వాటి వలయంనుండి తప్పించుకొని బయటపడడానికి ఎన్నో మంత్రాలు పఠింపబడినాయి. అయినా నిజం చెప్పాలంటే వాటిని మననుండి పారదోలడానికి మనం సుతరామూ ఒప్పుకోము. అవి మనలను పూర్తిగా బానిసలుగా చేసుకొన్నాయి. 'ఆరోగ్యంగా ఉన్నంతకాలం జీవితం అభంగురమని అనుకోము. గొప్ప అనర్థం మనలను ఆవరించినప్పుడే మనోవ్యథను అనుభవించి అలమటిస్తాం. అలాంటి సమయాల్లో ఆత్యాశ తేనెలాగా మధురం కాదు. కామం ఆనంద పారవశ్యాన్ని కల్గించదు. అనురక్తి, ఆత్మల నిరర్థకత్వాన్ని గురించి ఆలోచిస్తాం. అప్పుడు కాని ఈ పూర్వస్నేహితుల నిజమైన దుర్నీతిపరత్వం అవగతం కాదు. భగవంతుని ప్రార్థిస్తాం. ఆధ్యాత్మికోపదేశికుడు అవసరమని భావిస్తాం. దైవాన్ని స్మరించకుంటే ఆరోగ్యానికేమీ లోపముండదు. కాని అతనికి దగ్గరగా ఉన్నట్లు భావించుకుంటే అనారోగ్యంకూడా ఆశీర్వచనమే అవుతుంది.

అజ్ఞానాంధకారానికి భగవంతునితో అన్యోన్యానుబంధమే ప్రతిక్రియ అని సామి ప్రవచించినాడు. తమ యోగిత్వాన్ని ప్రకటించుకొనేవారు మిథ్యాచార్యులు. ఎవడు తన సర్వస్వాన్ని దైవాధీనం చేస్తాడో, ఎవడు ఈ ప్రపంచాన్ని 'మాయ' అని తలుస్తాడో, ఎవడు వ్యసనానికీ, అత్యాశకూ చలించడో వాడే యోగి. జయాపజయాలు, సుఖదుఃఖాలు అతన్ని చలింపజేయవు. ద్వంద్వాతీతుడై మిణుగురుపురుగులాగా ప్రకాశవంతంగా అతడు జీవిస్తాడు. నిజం చెప్పాలంటే ఆధ్యాత్మిక పరిజ్ఞానం, అంతర్గతానందం సంపదగా కలవాడే నిజమైన యోగి.

శత్రువుల జయించడం వేరు. మిత్రుల సంపాదించుకోవడం వేరు. మతస్థులతో కలిసి తిరగడం వేరు. తనకుతానే యోగికావడం వేరు. సాధుసాంగత్యం చెడును మాత్రమే

పారదోలుతుంది. సాధుత్వం మాత్రమే దైవత్వాన్ని పొందటానికి ఉపకరిస్తుంది. కాషాయాంబరాన్ని ధరిస్తే సాధువు కావచ్చునని కొందరి భావన. ప్రలోభాలను ఎదుర్కొనలేనివాడూ, చెడును జయించలేనివాడూ ఎప్పటికీ యోగికాలేడు. నీట దిగనివాడు ఈదనేర్చునా? దుష్టశక్తుల్తో పోరాటం సాగించినపుడే నిజమైన యోగ్యత బయటపడుతుంది. బాధ్యత విస్మరించేవాడు స్వర్గధామాన్ని చేరుకోలేడు. ప్రతి మానవుడు ఋణగ్రస్తుడే. ఆ అప్పు తీర్చక తప్పదు. ఈ ఋణం తీర్చుకొని ఋణవిముక్తిపొంది బాధ్యత నెరవేర్చుకొనే అవకాశాలు మనందరికీ వస్తాయి. ధనవంతులు, పండితులు తాముకూడ ఋణగ్రస్తులమని గ్రహించరు. తీర్చవలసిన అప్పుఉందని వారు అనుకోరు. వారు స్వతంత్రులమని భావిస్తారు. ధనహీనుల కన్నా జ్ఞానశూన్యులకన్నా కూడా వారిబాధ్యత గురుతరమైందని గుర్తించాలి. తాము యజమానులం కామని సేవకులం మాత్రమేనని, తమ అధీనమందున్న సంపదంతా పరులసేవకే వినియోగించాలని వారు గుర్తించాలి. స్వేచ్ఛా వర్తనానికీ, స్వప్రయోజనానికీ ఐశ్వర్యం రాచబాట కాదు. నిస్వార్థపరులుగా ఉండాలని సామి మనకు బోధిస్తాడు. తమ స్వంత ప్రాధాన్యము నఃగ్గడించుకొనేవాడు 'అహం'ను ఎలా జయించగల్గుతాడు ? ప్రతి స్వత్వాన్నీ శక్తినీ, సంపదనూ, జ్ఞానాన్నీకూడా మనం ఇల్లడంగా భావించాలి. వాటిని కేవలం స్వప్రయోజనాలకు వినియోగించుకొన్నట్లయితే దైవానికి అపరాధం చేసిన వారమౌతాం. అందరం ఎలా పోతామో ఒక్కసారి ఆలోచించుకోండి. మనం సుందరవస్తువుల్నే కాంక్షిస్తాం. వాటి సృష్టికర్త మాటేమిటి ? ఇది మనకు గుర్తుంటే దైవారాధనే మహాప్రసాదమని గమనిస్తాం. అప్పుడు మనలనూ, తోటివారినీ వేరుపరచే ద్వంద్వభావం తొలగిపోతుంది. మనం షా అబ్దుల్ లతీఫ్ లాగానే ''బాధ, మృత్యువులను వింత అనుభవాలు'' గా ఆహ్వానిస్తాం.

ఈ సంగతులను సామి తన ప్రవచనాల్లో వివరించాడు. అనంగీకృతమూ, అప్రియమూ అయిన వాటినుంచి మనం విముఖులం కాకూడదని సామి చెబుతాడు. అయితే డాంభికత్వం, దురహంకారం, ఆత్మవంచన, లోలత–వీటిని పట్టుదలతో జయించటం నేర్చుకోవాలి. 'అహం'ను అదుపులో పెట్టుకొని భగవదారాధనకు ఉపక్రమించాలి సామి ఎన్నో రీతుల ప్రబోధించే అంశమిదియే. దీన్ని మనం మనసారా అంగీకరించవచ్చు. ఈ ప్రవచనం ప్రకారం బాధ సంతోషకరము, విషము అమృతప్రాయము, అనారోగ్యము ఆరోగ్యప్రదము, దుఃఖమే సుఖము, బీదతనమే ఐశ్వర్యం, మృత్యువే బ్రతుకు—అన్ని బాధల్లోనూ కొంత మంచి ఉంటుంది. శివుని చిత్తంలేనిదే ఏమీ జరగదు. ఇతరుల మంచితనం మనలో మంచిని పెంచుతుంది. ప్రభువుల చిత్తానుసారం మెలగడంకన్న భగవంతుని సేవించటం అనేది మహోన్నతమయినది. సామి ప్రవచనాలనుండి మనం నేర్చుకొనే పాఠాలివియే. వాటిలో ఆధ్యాత్మిక బోధన బోధింపబడినది. ఈ బోధనలను మనం అనుసరిస్తే మన హృదయాలు పునీతము లౌతాయి.

## పర్మానంద్ మేవారమ్.

### శ్రావణం—వర్షఋతువు.

మంగళవారం రాత్రి మాకు మంచి వానజల్లు కురిసింది. మేఘాలు కమ్ముకొని ఉరుము మెరుపులతో కురవక ముందు గాలిలేక కొంత ఉక్కగా ఉండేది. ఈ ఋతువులో వర్షించే మేఘాల సూచనలు ఎక్కడ చూచినా బాగుంటాయి. ఆ మెరుపు మెరిసిందంటే వాన వచ్చినట్లే. ఆ రాత్రంతా కుంభవృష్టి కురిసి దాహంతో నిండు కొన్న తటాకాలన్నిటిని నింపి వేసింది. ఈ ఋతువులో రొట్టె, వెన్న మనకు చౌకగా దొరుకుతాయి. సహజంగా ఇది బీద సాదలకు సంతోషాన్నిస్తుంది, వారు గొంతెత్తి ఇలా పాడతారు. "మెరుపుతో జడివాన కురిసింది హెచ్చుధరలకు గింజలను కొని నిల్వచేసిన వాళ్ళు దిగులుపడుతున్నారు. సుభిక్షమైన పంటతో ఆశలు చిగురించాయి. అధికలాభలకోసం ధాన్యం నిల్వబోసిన వాళ్ళు నాశనమైపోసీ ''పొలాలూ, కమతాలూ ఇపుడు నీటితో నిండినాయి. ప్రజలు ''మాకు దేవుడు ఇంకా జడివాన పంపాలి'' అని పాడతారు. ఎంత కురిసినా వారికి తృప్తిలేదు. అందువల్లనే పశులకాపరి ఇలా ప్రార్థిస్తాడు. ''మేఘాలు కమ్మి చూపుమేర భూప్రదేశాన్ని మొబ్బులతో ముంచాయి. వానదేవుడు బీడును నీటితో ముంచేశాడు.''

పోయిన శుక్రవారం చాలా ఆహ్లాదకరంగా ఉండినది. ఆకాశం నిండా మేఘాలు. పీస్తున్న పిల్లతెమ్మెరలు—వీటివల్ల మాకు సిమ్లాలో ఉన్నామని అనిపించింది. నేను కరఫూర్దా (Kara Phurda)వంతెన కేసి వాహ్యాళి వెళ్ళాను. మరవురాని దినం అది. వరదతో పొంగి ప్రవహించే 'ఫుల్లేలి'(Phulleli)ని చూడాలి. నీటిమయమైన కనుచూపు మేరంతా చిన్న అలల పటలం లాగా ఉంది. నిర్లక్ష్యంగా అది ముందుకు సాగిపోతూంది. ఒకవేళ ఇప్పటికే అలస్యం చేశానేమో, తనకోసం పంటకాపులంతా ఎదురు చూస్తూ ఉంటారనుకొంటూ పోతూ ఉంది. అయితే తప్పు దానిది మాత్రం కాదు. ఇంత విశృంఖలంగా ఉండటానికి కారణం వర్షమున్నూ, వడిగా ప్రవహించే నదియున్నూ. ఒక్కొక్కసారి నది ప్రేమికుడిలా తన్మయత్వం పొంది ఉంటుంది. మరికొన్ని వేళల్లో టలాయిస్తూ వగలు పోతుంది. దానిపొంగు ప్రజలను నాశనం చేయనూవచ్చు లేదా బాగుపరచనూవచ్చు. అది తన సహజనైజంపై పెంపారుతున్నట్లు కనిపిస్తుంది. లేకుంటే సింధీప్రజలతో ఈ విధంగా ప్రవర్తించడానికి కారణం వేరే లేదు, ఎందుకంటే అపరిచితుని కోసం తన పతినే సర్వనాశనం చేసిన విశ్వాసఘాతకురాలైన స్త్రీ లాగా సింధీప్రజలు సర్వాంతర్యామియైన భగవంతుని విస్మరించి సింధూనదీ దేవతయైన దర్హ్యాలాల్ (Darhya lal) ను ఆరాధిస్తున్నారు. నైవేద్యాలను పెడతారు; పుణ్యస్నానాలు చేస్తారు. ఈ నదినే కొలుస్తారు. అయితే ఇదంతా దాని ప్రవర్తననేమీ మార్చలేదు. ఇకముందు దానివైపు కన్నెత్తి చూడవద్దనీ, నైవేద్యాలను దండగ చేయవద్దనీ నేను వారికి సలహా ఇస్తాను. సర్వ సంపదకు ఆధారభూతుడైన సర్వేశ్వరుని ఆరాధించడం ఉత్తమోత్తమం. పాయను కాక మూలాన్ని అరాధిస్తే ఆ నది తన వక్రమార్గాన్ని చక్కచేసుకుంటుంది. తన చిత్తచాంచల్యాన్ని విడిచిపెట్టుతుంది... ఈ ధోరణి దర్హ్యాలాల్ వినకుంటే మంచిది. అది అతన్ని రెచ్చగొట్టు

తుంది. దయచేసి నా అభిన్నతను (Identity) బయలుపరచకు. ఎంతైనా నేను అతని బిడ్డనే. ప్రోదిచేసి పెంచేఆ మహామూలశక్తి అవయవాన్నే. నది లేనిదే కాలువలేదు. అందువల్ల మిత్రులారా ఇంక సెలవు. నేను పంటకాపుల చెంతకు ఫిర్యాదు చేయకముందే వెళతాను.

ఆ విధంగా 'పుల్లేలి' తన విసురు తగ్గించి తోవలో నిదానించింది నేను ఆనందంతో దాన్ని అనుసరించి ఒక తోటను చేరుకొన్నాను. పూలతోనూ ఏపుగా ఉన్న ఆకుజొంపములతోనూ విరజిమ్మబడిన పచ్చని పచ్చిక బయిలును అక్కడ చూచాను. అంతలో గూలాబీల మల్లెల సువాసనల గుబాళింపులు వాతావరణాన్ని నింపినాయి. ఇలాంటి చల్లని సుందరమైన దినంలో సృష్టి అంతా సంతోషనిమగ్నమౌతుంది. సాధారణంగా ఇక్కడ ఏ పక్షులనైనా అరుదుగా చూస్తాం. కాని ఈ దినం అవి కిలకిల స్వనంతో గెంతుతున్నాయి. చిన్న చుక్కలు పెట్టే వడ్రంగిపిట్ట నా తలమీదుగా వేగంగా దూసుకపోయింది. మామిడితోపులో నీలవర్ణంగల పాలపిట్టకూడా ఆకస్మికంగా కనిపించింది. మలేరియాతో మంచం పట్టినవాళ్లకు దీని ఈకలు పడితే రోగం నయమౌతుందని మూఢనమ్మక మున్నవాళ్లు నమ్ముతారు. అనేకములైన చిలుకలు శాఖా చంక్రమణంగా చుట్టూచేరి ఉన్నాయి. అవి పంటలను ఎంత నష్టపరచినా వాటిని మనం గోముగా చూస్తాం. కొమ్మలో మామిడికానీ, 'యాపిల్' కానీ, జామపండుకానీ కనపడుతుందో లేదో వెంటనే చిలుక వాటిని ఎత్తుకపోతుంది. మనం వేసే గులకరాళ్లు వాటిని బెదరగొట్టలేవు.

వేసవిలో మనం 'నైటింగేల్'ను చాలా అరుదుగా చూస్తాం. కాని ఇపుడది రోజంతా పాడుతూనే ఉంటుంది. పువ్వులను కెతుకుతున్న నల్లని తేనె పిచ్చుక (Mater– ఒక పక్షి) ను ఒకరోజు చూచాను. ఈ జాతిలో పచ్చని రకం కూడాఉంది. లేదా రెంటికి దగ్గర పోలిక ఉంది. తరవాత నేలపై కూర్చున్నాను. చల్లని గాలి కొంత ఉపశమనాన్ని కల్గించింది. కోయిల కూకూరావములు ఆకాశాన్ని నింపివేశాయి. వేరొక పక్షి నామీద ఎగిరి పోయింది. దాని నిగనిగలాడే నల్లని రెక్కలను గమనించాను. మందమారుతంలో వాన కోవెలలు నాట్యం చేశాయి, 'బాబుల్'నూ, మానుతొర్రల్లోని కీటకాలను పొడుచుకొని విందుగా కుడిచే మంగలిపిట్ట (dorongo) నూ చూచాను. నా తిరుగుప్రయాణంలో ఒక గుడ్లగూబనూ, కిచకిచలాడే ఇసుక గోరంక (Sand piper) నూ చూచాను.

ఈ పిచ్చిగుంపుకు దూరంగా ఉండే నిర్మల ఏకాంతంలో దివ్యానుభూతులు వస్తాయి. ఆశ్చర్యకరమైన ఈ సుందర ప్రపంచాన్ని సృజించిన దైవాన్ని గురించి ఆలోచిస్తాం. ఈ వాతావరణంలో భగవద్భక్తి పూరితమైన ఆవేశం కల్గుతుంది. ఆ నిర్మల ఏకాంతత్వంలో ఉండే సౌఖ్యాన్ని అనుభవించి భగవత్ సంసర్గాన్ని పొందుతాం. కవి అన్న ఈ మాటలు యథార్థం. "పట్టణ వాసంలో మనకు ఒరిగిందేమిటి? సుందరప్రకృతిలో చెట్లలో భాషలూ, పరుగెత్తే సెలయేళ్లలో కావ్యాలూ, కనిపించే ప్రతిరాతిలో సూక్తులూ, ప్రతి వస్తువులో మంచీ నెలకొన్నాయి."

## భేరుమల్ మెహర్ ఛంద్—

# ప్రేమ

కొంతమంది వ్యక్తులు ఎంత మంచి వాళ్లంటే అంతటా మంచితనాన్నే చూస్తారు. 'ఏం జరిగినా అందులో మంచి ఉందంటారు. వారి హృదయాలకూ కొంత ఉపశాంతిని కల్గించనటువంటి ఏ వివత్కర సంఘటనా లేదు. గగనమంతా మేఘాచ్ఛాదితమైనా, ఎక్కడో ఒక కాంతి కిరణం ఎప్పుడూ ఉంటుంది దైవం దాన్ని మన దృష్టి నుంచీ తాత్కాలికంగా దాచినా అక్కడ కాంతి ఎప్పుడూ ఉందని వారి దృఢ విశ్వాసం. ఏదో కొంత మంచి అంటూ లేకుండా చూడటం వారికి నప్పదు. వారిది అలాంటి దృష్టి. వారి ఆత్మ అలాంటి తేజస్సుతో పునీతమైంది వారికి ఎక్కడ చూసినా కాంతి వినా కన్పట్టదు.

జీవితంలోని తీపిచేదులకు మల్లే వారు దానికి అలవాటు పడినారు. దురదృష్టపు ఆకస్మిక ఆఘాతం వారిని కృంగదీయదు. దానికి వారు ఏడ్వరు. సుదూర భవిష్యత్తువైపు దృష్టి సారించి సాంత్వనం చెందుతారు. దారంట ముళ్లు పరచినా, పూలు తమ కాళ్ళ కింద ఉన్నట్లు ఆనందంగా వారు నడుస్తారు. ఆ విధంగా కష్టకాలాలను అధిగమిస్తారు. బాధంటే వారికి భయం లేదు. ఏ ఉత్పాతమన్నా బెదురులేదు. ఉరికంబాలనూ శిలువ శిక్షలనూ సానందంగా ఆహ్వానిస్తారు. వాటిని సంతోషంగా కలుసుకొనేటంత ఓర్పూ, ప్రశాంతతా కలిగి ఉంటారు. సంతోషంగా ఉల్లాసంగా ఉంటారు. అందరినుంచి మంచినే వారు కోరతారు. మంచిని ఆలోచిస్తారు. మంచి మాట్లాడతారు. మౌనం కూడా మధురమనిపించేటంత దేదీప్యమానం వారి సాన్నిధ్యం. ఈ అద్భుత వక్తులు మామూలు మనుష్యులకంటె ఎంతో ఉన్నతులు. 'భూమ్మీద దేవతలు' అని వారిని పిలవటం అత్యంత సముచితంగా ఉంటుంది.

వీరిని దైవాభీష్టానికి తలవొగ్గేటట్లూ, ఇప్పటి చెడులో కొంత రాబోయే మంచిని చూసేటట్లూ చేసేదేమిటి? అని మీరడుగుతారు. వారు ప్రేమభరితులు అనటమే దీనికి సమాధానం. సుగుణసౌధానికి పునాది అదే. ప్రేమ అయస్కాంత శక్తిని సృజిస్తుంది. వర్ధిత వాత్సల్యానికి అది మూలం. ప్రేమ ప్రేమను సృష్టిస్తుంది. నాపట్ల నీకు సద్భావం ఉంటే నేను నీకు చేరువవుతాను. ఆ విధంగా పరస్పర సౌహార్దం పెరుగుతుంది. పరస్పర సందర్శనానికి సంతోషభరితుల మౌతాం. తన్ను తాను మరవటం ప్రేమ విశిష్టగుణం, స్వార్థపరాయణత్వానికి బదులు ఇవ్వాలనే, సేవించాలనే కోరిక హృదయంలో పెరుగుతుంది. అందుకే బిడ్డను సాకటానికి తల్లి తన్నుతాను మాడ్చుకొంటుంది ఆమెది ఒక అర్పిత జీవితం. అలాగే ప్రణయమగ్న వనిత తాను వలచే పురుషునికోసం తన ఆరోగ్యాన్ని. భాగ్యాన్ని, ఆనందాన్ని త్యాగం చేస్తుంది.

దేశభక్తుడు స్వదేశం కోసం కారాగార వాసాన్నీ, క్లేశాన్నీ కోరి ఆహ్వానిస్తాడు. బాధనుంచీ అతను ఆనందాన్ని పొందుతాడు. ప్రాణత్యాగపు పిలుపును సంతోషంగా అందుకొనే మనుషులు కొందరున్నారు. ఇది కూడా ఒక ప్రేమ గుణమే. నిజానికి సకల సుగుణాలు

ప్రేమోత్పన్నములే. అలాంటి ప్రేమాశీస్సు పొందినవాడు ధర్మావతారుడౌతాడు. ప్రేమేంద్ర జాలం ఎలాంటిదంటే, మీరా విషాన్ని పుచ్చుకొన్నా బాధ తప్పించుకొంది. రాణా ఆమెకొక విష నాగును పంపితే దాన్ని కంఠాభరణంలాగా తన మెడలో వేసుకొంది. ఆమెలోని ఈ ప్రేమ జ్వాలే విషాన్ని దుర్బలీకరించి నాగు స్వభావాన్ని మార్చింది. ప్రేమ శక్తి అలాంటిది. మన లోని నరసరమూ భగవంతుని కోసం ప్రకంపించేందుకు, దైవం మనలను తన సన్నిధికి ఆక ర్షించుగాక ః ప్రేమలేని మనిషి భావనాశక్తి శూన్యుడైన మట్టిముద్దలాంటివాడు.

## జేత్‌మల్ పర్సరామ్

# గురు శిష్యులు

అధ్యాపక విద్యార్థుల మధ్య, గురు శిష్యుల మధ్య బాంధవ్యం అతి ప్రాచీనంగా ఉన్నదే. అయినా అది కాలాన్నిబట్టి మారింది విద్యార్థులు కొన్ని 'పీరియడ్‌లు' నిటారుగా నిలబడి కొయ్యబెంచీల మీద కూచొని, తమ అధ్యాపకుల బోధనానంతరం గృహోన్ముఖు లయ్యే పూర్వపు పాఠశాలల పద్ధతులు లేవు అంతే. ఈ రోజుల్లో ప్రతి కుర్రవాడూ జీతం కట్టాలి. అతని పరీక్ష దాటించే విధి ఉపాధ్యాయునిది. ఈ పద్ధతి బోధనను ఒక రకమైన మండీ వ్యాపారంగా మార్చింది. గతంలో ఇట్లాలేదు పిన్నలూ, పెద్దలూ, విద్య నభ్యసించే ఆశ్రమాలూ, విద్యాలయాలూ ఆ రోజుల్లో ఉండేవని పురాతన ఆర్యగ్రంథాలు తెల్పుతాయి. విద్యార్థిపై అధ్యాపక జీవిత ప్రభావం అమితంగా ఉండేది, కులపతి తన పిల్లలను పెత్తనంచేసే పెద్ద కుటుంబాలతో విద్యాలయాలు పోలి ఉండేవి. సొంత బ్రతుకు తెరువుకోసం అధ్యా పకులకు చింత ఉండేది కాదు. వారు అమ్ముడుపోయే వారూ కారు. విద్యార్థుల తలిదండ్రులకు బానిసలూ కారు. తమ విద్యార్థుల్లోని నిగూఢ శక్తులను జాగృతం చేసి తమ రూపాలకు ప్రతిరూపాలుగా రూపొందించటం తమ విధి అని వారు భావించేవారు.

చుట్టూ చూస్తే చాలామంది మాట్లాడటం ద్వారా తప్పనిసరిగా నేర్చుకోరనే సంగతి గ్రహిస్తాము. పసిబిడ్డ మొదట ఇంట్లో నేర్చుకొంటుంది. వ్యాకరణం చదవకుండానే శుద్ధంగా మాట్లాడుతుంది. ప్రకృతి అగోచరంగా ప్రవర్తిస్తుంది. విత్తనం నుంచీ చెట్టు పెరుగుతుంది. భూమి తన గర్భంలో విత్తనాన్ని రక్షించుకొంటుంది. నీళ్ళు పెంచి పోషిస్తాయి. సూర్యుడు వెచ్చదనాన్ని ఇస్తాడు, గాలి మొలకెత్తింప చేస్తుంది. అ విధంగా ప్రకృతి, విత్తనంనుండీ చెట్టునూ, రవ్వనుండీ నిప్పునూ, నీటిచుక్క నుండీ నదినీ సృష్టిస్తుంది. ఆ విధంగానే కోడి పెట్ట పొదిగిన గ్రుడ్డు నుండి గరుత్మంతము బయటికి వచ్చింది. తల్లులందరూ రక్తం ధార వోసి తమ పిల్లలను పెంచుతారు. మానవజాతిని విశిష్ట మొనర్చేదేమిటంటే దాని ఆలోచనా భావనా శక్తులే. ఇవి మస్తిష్క హృదయ శక్తులు. ఈ ప్రజ్ఞలు మౌఖిక బోధనద్వారా, పుస్తక పఠనం ద్వారా అభివృద్ధి చెందవు, కరుణాంత రంగుడైన గురుని సంస్కార హృద యము విద్యార్థి మనసును ప్రభావితం చేసినపుడే మొగ్గ విచ్చుకొంటుంది.

గురుశిష్యుల బాంధవ్యం సన్నిహిత వాత్సల్యాలతో కూడుకొన్నది. శ్రేష్ఠమైన బోధనా విధానము ఏదని 'గీత'లో అర్జునుడు కృష్ణుని ప్రశ్నిస్తాడు. మూడు ముఖ్య విషయములను మనసులో ఉంచుకోవలసిన అవసరముందని ఆయన సమాధానమిస్తాడు. మొదట అధ్యాపకునకు సాష్టాంగ ప్రమాణం చెయ్యి. ఈ కాలమువారికి ఇది పరిహాస ప్రాయంగా ఉంటుందనటంలో సందేహం లేదు. గురుశిష్యులిరువురి మధ్యా పొరపొచ్చాలు లేని బాంధవ్యమూ, వాత్సల్యమూ ఉండాలని ఈ ప్రాచీనాచారపు అంతర్గత లక్ష్యము. తన వాయిద్యాలనుండీ గాయకుడు సంగీతాన్ని ఎలా వెలువరుస్తాడో గమనించావా? వాయిద్యం ప్రతిధ్వనించేందుకు ముందు దాన్ని అతడు ఆరాధించాలి. తన ఆత్మ రహస్యాన్ని ప్రతిబింబింప చేయాలి. అలాగే అధ్యాపకులూ విద్యార్థులూ పరస్పరం మేళవింపు సాధించినపుడే బోధన మొదలవుతుంది.

తదుపరి దశ తరవాత మొదలవుతుంది. దీంట్లో ప్రశ్నలడగటం ఉంటుంది. నేటి పాఠశాలల్లో కళాశాలల్లో ఈ విధానానికి ప్రోత్సాహంలేదు. తనకాళ్ళమీద తాను నిలబడి ఉపన్యసించే అధ్యాపకుని విద్యార్థులు ఊరక వింటారు. శబ్దం వారిచెవుల్లో దూరుతుందనటంలో సందేహమేమీ లేదు. అయితే వాయుగ్రహణాల్లాగా వారి మనసులు మేల్కొన్నాయా అనేది ఎవరూ నిరూపించలేరు. విద్యార్థి పరీక్షలో ఉత్తీర్ణుడౌతున్నంతవరకూ ఎవడూ దీన్ని గురించి పట్టించుకొన్నట్లు కన్పించడు. అధ్యాపకుడు కాక, విద్యార్థి ఎక్కువగా ప్రసంగించే 'పరాశ్రయ పాఠాలు' (object lessons) ఇవ్వాలని ఛాందోగ్యోపనిషత్తు నొక్కి చెబుతుంది. చెట్ల కింది నీడలో తరగతులు తీసుకొనేటప్పటి విధానము అది. ప్రాచీన గ్రీసులో రచ్చపట్టులు (public squares) ఉన్నత విద్యను ఒసగేవి. సోక్రటీస్ అంతేవాసులు, పల్లెపట్టు పచ్చికపై కలసి మద్యాన్ని సేవిస్తూ 'జల్సా' చేస్తున్నపుడు వెన్వెంటనే ప్రశ్నలు సాగేవి. అధ్యాపక విద్యార్థులు స్నేహితుల మల్లే సహచరుల మల్లే ఉండేవారు. వ్యాఖ్యానించడానికి తగినంతవైదధ్యం అవసరమయ్యే ప్రహేళికా సంభాషణను సోక్రటీస్ తరచూ కావించేవాడు. తనకంటే విద్యార్థి చేతస్సు తేజోవంతం కావటానికి అస్కారముందనే విశ్వాసంతో డా. అరుండేల్ ఈ విధానాన్నే సెంట్రల్ హిందూ కళాశాలలో అనుసరించాడు.

మూడవ దశ సేవ. వేతనాలకోసం పనిచేయటమని దీనికి భావం కాదు. బోధనను అచరణయోగ్యంగా రూపొందించటమే దాని ధ్యేయము కేవలము పుస్తక జ్ఞానాన్ని కాక ఆచరణాత్మకమైన ప్రజ్ఞను సాధించడమే సర్వవిద్యల ధ్యేయము. కాబట్టి బోధనాకళను స్మరించేటప్పుడు దాని సూక్ష్మసారము ఈ కింది మాటల్లో నాకు గోచరిస్తుంది: "వినమ్రతా" జిజ్ఞాసా, సేవల ద్వారా అభ్యసించు".

యన్. ఆర్. మల్కాని

## పశు గ్రహణము

సింధ్‌లో సక్రండ్ తాలూకా దొంగతనాలకు ప్రసిద్ధము. సింధూనది ఈ ప్రాంత పొలిమేరలను తాకుతూ సుందర స్ఫీత సరస్సులతో నిండిన మైదానాన్ని నీటిమయం చేస్తుంది.

ఈ జలాలు కలువా, దాని జాతి రకాలతో నిండి ఉన్నాయి. జలమయమైన మైదానం దండి పంటలనిస్తుంది. పంట కోతల తరవాత ప్రజలు దొంగతనాలకు దిగుతారు. పశువుల దొంగకు పచ్చిక మీద అననాళ్ల ఏవీ దొరకకుండా అడవి సామీప్యము సుకరమైన ఆశ్రయాన్నిస్తుంది.

ఆ మధ్య మా ఒంటెతోలేవాడు గప్పాలు కొడ్తూ అన్నాడు. ''ఇది గొడ్లదొంగల రాజ్యము. ఇక్కడ ప్రతి తెగమనిషీ, కరియ కానీ జల్బానీ, చందియా, రంద్, ఖోసా కానీ ఈ అలవాటుకు మరిగినవాడే.''

నేను: నీ తెగ ఏది ?

ఒంటె తోలేవాడు: 'కరియా' ను. గొడ్లదొంగతనంలో పేరుమోసినవాళ్ళము.

నేను: మీది కాని దాన్ని మీరెందుకు దొంగిలిస్తారు ?

ఒ. తో: అది మా పూర్వీకులవృత్తి. ఇతరులు డబ్బు సంచినిదొంగిలించే లాగా మేము పశువుల దొంగిలిస్తాము. పట్టపగలు అందరి ముందూ ఈ దొంగతనం చేస్తాము.

నేను: అంటే ఈ ప్రాంతంలో రాటుదేలిన దొంగలున్నారన్నమాట.

ఒ. తో: బోలెడు మంది-నమ్మకంగా ! కాశిం, లక్షరి, రహ్‌జాన్, ఉమర్, ధింగన్ కరియో - మచ్చుకి కొంత మంది. అయితే హబుషా వాళ్ళందరిని చిత్తుచేస్తాడు. పోయిన్నెల్లోజైలునుంచీ విడుదలయ్యాడు. ఎవడికి తెలుసు. మళ్ళీవాడు అక్కడికే చేరొచ్చు. వాడి పేరంటేహడలు.

నేను: పశువులను మీరు ఎలా దొంగిలిస్తారో చెప్పు ?

ఒ తో: అదిగో అక్కడ మేస్తున్న జంతువులను చూడండి. అవి పచ్చిక నుంచీ ఇంకాస్తాదూరం పోతే ఎవడో ఒకడు అడవిలోకి తోలకపోతాడు, నేలంతా గడ్డిమయమే. అక్కడ గిట్టల గుర్తులు కనిపించక పోవడంవల్ల చాడీల కోరు (tell-tale) కు ఆస్కారముండదు. ప్రాణానికి ముప్పురేకుండా ఎవడూ అడవిలోకి వెళ్లలేడు. అయితే పశువులక్కడనే ఎప్పుడూ ఉండవనేది కూడా స్పష్టమే. కాబట్టి వాళ్లు వెళ్తూవెళ్తూ బర్రెలను నదిలోకి అదిలిస్తారు. ఉబ్బించిన చర్మం మీద వాటిని వెంబడిస్తారు. అవతలి గట్టున వాళ్ల అనుచరులు వాటికోసం ఎదురు చూస్తారు. వాళ్లలోవాళ్లకు సంబంధాలున్నాయి. సంకేత స్థలాలూ పశువుల దొడ్లూ ఉన్నాయి. ఒక్కో బర్రెను పదిరూపాయలకు, ఒంటెను ఇరవైకి వాళ్ళమ్ముతారు. కొనుగోలు దారు మందను దక్షిణాదిలోని బడిన్, టాండోబగో ప్రాంతాలకు తోలక పోతాడు. రొమ్ముకూ తోకకూ ఉబ్బిన చర్మాలను తగిలించి ఒంటెను కూడా వారు ఈదిస్తారు.

నేను: మీకు ఊరికే తేరకు వచ్చినందువల్ల అ పశువులను మీరు అతి చౌకగా అమ్మేట్లున్నారు:

ఒ. తో: అది మంచిధరే. హబుషా అంతమాత్రము ధర కూడా చెల్లించడు. తాను వెళ్లే ఊళ్ల వనకు బ్రహ్మాండమైన వినోదము ఇవ్వాలంటాడు. లేకపోతే పశువులను ఎత్తుకొని నది ఆవలి గట్టుకు తోలక పోతాడు. అక్కడ గుక్కెడు పాలకోసం గొడ్డును అమ్ముతాడు. ఆ ! గుక్కెడు పాలకోసం. దానితో అతని సంబంధం సరి,

నేను: దానివల్ల అతనికి ఒరిగేదేమిటి ?

ఒ. తో: ఏమీ లేదు. లాభసాటి లేని వాళ్ళ వంశవృత్తి అది మంచిది. అందరూ ఒక్కలా ఉండరు. దానికి తోడు పొలంమీద అన్ని సమయాల్లో నీళ్ళు పారవు కనుక మంచి పంట రాదు. అలాంటప్పుడు లాభసాటి ఉద్యోగం దొరక్క ప్రజలు ఆకలితో అలమటిస్తారు. దాంతో దొంగతనానికి దిగుతారు. వ్యవసాయం పనిఉన్నా నాలుగు నెల్లే. ఆ తరవాత చేసే దేముంది ? అందువల్లే మిగతా ఎనిమిది నెలల్లో సోమరిపోతులు గొడ్లచోరీకి దిగుతారు.

నేను: ఈ నేరాన్ని పోలీసులెందుకు నిరోధించరు ? వాళ్ళకు దొంగల లోగుట్టులు తెలిసే ఉండాలి. వారు తలచుకొంటే పట్టుకోవచ్చు.

ఒ. తో: అది సర్వసాధారణమే పోలీసులుండేది బీదసాదలకోసం కాదు. వాళ్ళు అమాయకులను శిక్షిస్తారు. నేరస్థులను తప్పించుకోనిస్తారు. పశువుల దొంగలతో లాలూచీపడి విడుదల మూల్యాన్ని పెద్దగా పొందుతారు. ఇక్కడ దొంగలు మాత్రమే కాదు రుసుంచెల్లిస్తే పశువులను ఎత్తుకపోనిచ్చే గాటుదేరిన దళాళీలు కూడా దండిగా ఉన్నారు. ఏడిపిస్తారు కాబట్టి, బాధకు గురియైన ఏ పక్షమూ పోలీసులకు ఫిర్యాదు కూడా ఇవ్వదు. అందుకే పశువులను విడిపించుకొనేందుకు పెద్దమొత్తాన్ని చెల్లించటానికి ప్రతివాళ్ళు ఇష్టపడతారు.

నేను: గుర్తుపట్టేదానికి వీలుగా మీ పశువుల మీద గుర్తులుంచకూడదా?

ఒ తో: మన కన్ను కప్పటానికి దొంగ నాలుగు మార్లు గుర్తులు పెడతాడు. పశువు కది పెద్ద బాధ. వాడుదాని పల్లూడగొట్టనూ వచ్చు. కొమ్ములనో తోకనో తెగగొట్టనూ వచ్చు. అప్పుడు పూర్తిగా ఆనవాలు పట్టలేము. అది కూడా ఒక కళేననుకోండి. వేటలాగా పశుగ్రహణము కూడా ఒక సరదా అయిన మంచి ఆట. మీరెందుకు ప్రయత్నించి వాటి నుండి కొంత వినోదం పొందకూడదు ?

**రామ్ పంజువాని.**

## సింధీలో సంగీత నృత్యాలు.

సింధీలు సంగీతమంటే చెవికోసుకొంటారు. శ్రామికుడు కానీ రైతూ, కుమ్మరీ, కమ్మరీ ప్రభుత్వోద్యోగీ, భూస్వామి కానీ దానికి చేరువవుతున్నట్లే భావిస్తాడు. ఒతర (దేశివాళీ క్లబ్)నుసందర్శించిన వాళ్లెవాళ్ళైనా నాతో ఏకీభవిస్తారు–ఎంత హృదయంగమమూ, సమ్మోహన కరమూ–సింధీసంగీతము ! అని. కుమ్మరీ ఘటము మీద లయాత్మక తాళానికి అనుగుణంగా (Kafees)బైట్స్ (Baiors) లాంటి దేశివాళీ పాటలను జానపదులు పాడేటప్పుడు శ్రోత మంత్రముగ్ధుడౌతాడు. గాయకుని మంజుల రాగం మన 'ఏకతార' (yaktara) 'టుంటుం' శృతిలోమేళవించినపుడు సంగీతమగ్నుడైన భక్తుడు అవిదిత గ్రంధిని విప్పుతున్నాడో అన్నట్లు కన్పిస్తాడు. కొన్ని సమయాల్లో స్వరము క్రమేపీ తారాస్థాయికి చేరుకొనే సరికి ప్రతిపృక్తి మైమరచి పోతాడు. హుస్సని (Hussani) లేదా 'కాహ్యరి' (దేశివాళీ బాణీలు) లను వయొలిన్ వాద్యకారుడు (సురందియ) పలికించేప్పుడు మీ రెప్పఉన్నా విన్నారా ?

సంగీతానికి స్పందించనివారు సాధారణంగా ఉదాత్తశీలురు కారు. ప్రకృతిలో నీళ్ళు జలజల ఉప్పొంగుతాయి. ఆకులు గలగల మంటాయి. పక్షులుకిలకిల మంటాయి. అలాంటి వరప్రసాదితుడు మనిషి కాదా! గాత్ర-వాద్య సంగీతాలు రెండిటిలోనూ సింధీలు సిద్ధహస్తులు. ఎన్నో వాయిద్యాలున్నాయి కానీ కొన్ని ఉపయోగంలో ఉన్నాయి. కొన్ని మూలబడ్డాయి. 'నుర్ర్' (Nurr) అనే వేణువాయిద్యాన్ని గురించి మీరెప్పుడైనా విన్నారా? అందులో మగ ఆడాతేడాలతో రెండు మెట్లు (reeds) ఉంటాయి మగది బాధతో అరుస్తుంది. ప్రణయవ్యథిత మైన ఆడుది నిట్టూరుస్తుంది. నదికి ఆవల, ఈవల నిలిచి ఒకదాన్నొకటి పిలుచుకొంటున్న చకోర ద్వయాన్ని ఇది మనకు స్ఫురింపజేస్తుంది. వేణువును ప్రతిధ్వనింప జేయాలంటే కళానైపుణ్యము కావాలి. పిల్లనగ్రోవి, 'తుంబీ' (గుమ్మడి జాతినుంచీ తయారైన పిల్లన గ్రోవి) ల వాయిద్యకారులు చాలా మంది ఉన్నారు. గారడీ వాండ్లు పాములను వశీకరించుకొని లయబద్ధంగా వాని పడగలను ఆడిస్తారు. 'షెహనాయ్' గాయకులు కూడా ఉంటారు. వాళ్ళు లేకుండా ఏ వివాహ మహోత్సవమూ పరిపూర్ణత పొందదు. 'చుంగ్' లేదా 'సురందో' (దేశీవాళివయొలిన్) లను వాయిస్తూ మనలను గాఢంగా స్పదింపచేసే వాళ్ళు మరికొంతమంది కూడా ఉన్నారు. 'చుంగ్' లేదా 'సురందో' రాయ్‌దియాచ్ (Rai Dyach) ను లోంగిపోయేటట్లు ముగ్ధున్ని చేసింది. 'చుంగ్' వాయిద్యమా? 'సురందో' వాయిద్యమా? వాళ్ళు చెబుతూ ఉంటారు కానీ 'బీజల్' (Beejal) వాడిన ప్రత్యేక వాయిద్యమేదో చెప్పలేము. సహృదయలను స్పందింప చేసి ముగ్ధులను చేయగల సంగీత విద్వాంసులు అప్పటివలే నేడూ మనమధ్య ఉన్నారనటం— ఉచితంగా ఉంటుంది.

నా అభిమాన వాయిద్యము మాత్రం (ఘటం) తో పాటు ఏకతార, (Yak-taara) దుహ్‌ల్ (Duhl), పవే (Pauve), కాని (Kaani), మురళి (Murli), బొన్నిండో (Bonnindo), డోలక్ (Dholak), థిక్రుయున్ (Thikruyun), ఖర్తాల్ (Khartaal) మొదలైన ఇతర వాయిద్యాలెన్నో మనకున్నాయి. పెద్దశ్రమ లేకుండా లయాత్మక ప్రతి ధ్వనికి ఘటము ఒదుగుతుంది. కనుకనే చాలామంది ఘటవాయిద్యకారులున్నారు. అయితే ఈ ఘటాన్ని ప్రతిధ్వనింపచేయటానికి నిపుణహస్త అపూర్వస్పర్శ కావాలి.

సింధీలకు సొంత నృత్యరీతులున్నాయి. ఉదా: ఛెజ్ (Chhej), జుమ్మిర్ (Jummir), ధమాల్ (Dhamaal), భగత్ (Bhagat), ఛీంఘో (Cheengho), జమాలొ (Jamaalo). ఈ అవస్పందనల్లో నిసర్గతా, ఆత్మత్యాగమూ వర్ణసౌందర్యమూ ఉన్నాయి వీటిల్లో భావావేశమూ, అర్పణా ఉన్నాయి. హిందూ పురుషులు మాత్రమే 'ఛెజ్' ను ప్రదర్శిస్తారు. ఢంకా తాళానికీ, 'షెహనాయ్' గానానికీ అనుగుణంగా నర్తకులు మండలాకార నృత్యం చేస్తారు. చుట్టూతిరిగే బృందంలో గతి తప్పకుండా ప్రతి ప్రదర్శకుడూ పరిభ్రమిస్తూండగా, అవి చిరుకర్రల చప్పుళ్ళలో మేళవిస్తాయి. స్త్రీలకు ప్రత్యేకమైన వేరే 'జుమ్రీ' (Jummri) రీతి ఉంది. దీంట్లో 'బహ్రానో' (Bahrano) పలయగతి ఉంటుంది. మండలాకారంలో మధ్య ఒక వనిత ఢంకాతాళంలో బృందగానాన్ని అందిస్తుండగా వనితా బృందము పరిభ్రమిస్తూ కొన్ని పెళ్ళిపాటలు పాడతారు. స్వీయ సౌందర్యభరితాలైన నరళ నృత్యరీతులు జానపదాలకున్నాయి. పంజాబ్, రాజస్థాన్‌లకు కూడా 'జుమ్రీ', 'జుమర్' లు

మామూలే. తియ్యదనమూ లయలతో సౌందర్య సంగీతాలు మేళవించే సింధీ జ్యుమ్రీ ఏమైనా అతి సున్నితమైనదే.

వీటన్నిటిలో సింధీ 'భగత్' విశిష్టమైంది. సింధ్ 'భగత్' చాలా ప్రఖ్యాతమైంది. హిందూ మహమ్మదీయులిరువురూ దీన్ని వినటానికి ఇష్టపడతారు. 'భగత్' నృత్యనటనల సమ్మేళనం కాబట్టి కళాకారులు దీనిలో ప్రావీణ్యాన్ని పొందాలంటే కొంతైనా ఆత్మార్పణ అవసరము.

**టి. వి. బసంత్**

## మానవునిలోని సృజనాత్మకశక్తి

నిర్జీవ పదార్థాలకు చెందిన అణువులనుండే బృహత్తర జీవులదాకా ప్రతి ఒక్కదాని ప్రాముఖ్యాన్నీ స్వాభావికవాదము (Naturalism) నొక్కి చెబుతుంది. కానీ మానవ ప్రకృతిని అది గుర్తించదు. ఇది చాలా అసంగతము. ఉన్నదానిపట్ల ప్రగాఢమైన అసంతృప్తీ, దాని స్థానంలో కొంచెము మెరుగైనదాన్ని తేవాలనే నిరంతరారాటమూ, మానవ మస్తిష్కంలో ఎప్పుడూ దాగిఉండటము సహజము. విశ్వాన్నంతటినీ కబళించగలిగినా ఈ తృష్ణ తీరదు. జన్మిస్తూనే శిశువు ఈ విషయాన్ని ప్రకటిస్తుంది. ఎడారిలో 'సైతాన్' (Satan) ఆత్మలాగా పాలకోసం గట్టిగా మొత్తుకొంటుంది. ప్రతిరోజూ ప్రొద్దున్నే ఆకలితో లేస్తాము. తృప్తికొంత తీరకుండానే రాత్రి విశ్రమిస్తాము. మనలో ప్రతి ఒక్కరి చేతిలో ఒక విశాలమైన భిక్షాపాత్ర ఉంది. దాంట్లో మండే సూర్యుడుకూడా బిస్కట్‌కంటె పెద్దగా కన్పించడు. మనల నిరంతరము వాంఛలోకితోసే ఒక చిల్లరనాణెన్ని విధి ఈ పాత్రలోకి పడవేస్తుంది. ఈ దయనీయ వ్యవహారము వల్లనే మాటిమాటికీ కలిగే నిరాశలు ఉద్యమింప ప్రబోధిస్తాయి. వాంఛకు పరిసమాప్తి లేదు. నిజము. వాంఛాపరితృప్తి ఎన్నడూ ఉండదు. కానీ వాంఛజీవితము, వాంఛాక్షయము మృత్యువనేది సరిసమానంగా నిజము. కుప్యాన్ని (తక్కువజాతి లోహం) బంగారంగా మార్చగలిగినా, అరచేతిలో భూగోళాన్ని మోసినా, గురుత్వాకర్షణను దుర్బలీకరించినా, నక్షత్ర క్రమాలనే శాసించినా వాంఛా పరిసమాప్తి లేదు. తమితీరని గుణంవల్లనే గాయపడిన హృదయాలు సర్వసంగపరిత్యాగానికి దిగినాయి. నిరసన ఏదోరకమైన జీవిత విమోచనమని ఉపదేశించాయి. ఆత్మవినాశనా కాంక్ష వాంఛాశక్తికి నిదర్శనమనేది వాళ్లు గుర్తించరు. ఏ పరిపూర్ణతా సంతుష్టికి దారితీయదు. కాబట్టి దేనినీ ఆశించటం నిష్ప్రయోజనమనే భావం సర్వసంగ పరిత్యాగానికి మూలము. ఈ మనుష్యులు నీళ్ళలో దిగకుండానే వణుకుతారు. అంతిమ నిరసనమీద చూపు నిలిపి జీవనశోభలోని మంచిని గుర్తించరు.

ప్రాపంచికగతిలో పాల్గొనడంపట్ల వారి నిరసన, ప్రపంచాన్ని తుడిచివేయదనేది స్పష్టము. ప్రపంచము యథావిధిగా సంతోషదాయకంగా సాగుతుంది.

జీవిత రహస్యాన్ని వివేకి అవగతం చేసుకోవటానికి యత్నిస్తాడు. అనవరత అణు

చలనానికికానీ, అంతిమ ప్రపంచోన్మూలనానికి కానీ అమిత ప్రాముఖ్యమేమీలేదని తెలుసు కొంటాడు. ఈ సంధిదశలో జీవితము వికసిస్తుంది. ఇది ముఖ్యమయింది. కాబట్టి జీవితంలో ప్రయోగించకముందు సర్వసంగపరిత్యాగానికి అతడు దిగడు. కఠోరనియమ తపస్సులతో మానవ ప్రారబ్ధపు చెడబాటుకు కోలాహలము చెయ్యడు. మానవ ప్రకృతి ఆత్మనిరసనకు ప్రతికూలము. ఆలాంటి అపమూర్జనానికి అది ఎదురుతిరుగుతుంది. మనలోఉండే జీవనశక్తి ఆత్మహత్యా ప్రవృత్తిని నిరోధించి జీవించమని బలాత్కరిస్తుంది. జీవించటమంటే దివ్వెలాగా మండటం తప్పదు. వాంఛ ఈ జీవనజ్వాలకు మరొక పేరు.

ఈ తనివితీరని వాంఛాగుణమే, కాపాడుకొమ్మనీ, అనుభవంనుండి నేర్చుకొమ్మనీ మనలను పురికొల్పుతుంది. వాంఛ అందమైన ఆడదానిలాంటిది. ఆమె కవ్వింపు చూపులు మనల మంత్రముగ్ధుల చేస్తాయి. మోహపరవశుల్లాగా మనము ఆమెను వెంబడిస్తాము. ఈ పనిలో అమూల్య పరిజ్ఞానాన్ని కొంత పొందుతాము. బయటికి ఈ విలాసిని నీతి విదూరంగా కన్పిస్తుంది. అయినప్పటికీ అంతిమ ఫలితము, సంతానముద్వారా జాత్య విచ్ఛిన్నత. దీన్ని ఏ నీతీ న్యూనపరచదు. ప్రకృతి ఎంత మాయావి అంటే, నీతిని అవి నీతిగా మారుస్తుంది. లుబ్ధాశద్వారా పరిశ్రమలనూ కర్మాగారాలనూ నిర్మిస్తుంది. మహోజ్వల సామ్రాజ్య వినిర్మాణానికి నియంత నియంతృత్వాన్ని అది ఉపయోగిస్తుంది. అధర్మపరుల చర్యలనుండీ ప్రజాస్వామిక సహకార వ్యవస్థలను వృద్ధి పరుస్తుంది. ఈ విధంగా దయ్యము దేవతా పరికరమై పరిణామాన్ని పొందుతుంది. ఉగ్రమైన తుఫానూ, సంక్షుభిత సముద్రాల వల్ల విచలితుడు కాకుండా ఉధృత ప్రవాహాలు, ఉత్తాన జలాలగుండా నౌకను నడపగలిగిన పరిణత నాయకుడు విశ్వాత్మ. జీవితము అనుభవాన్ని ధ్వనిస్తుంది, కాదు అనుభవమే జీవితము. ప్రయోగ నిరాకరణము చేసి మార్పులకు చలించని వాళ్ళు బుద్ధిలో ఏ కాంతీ లేకుండా, హృదయంలో ఏ ఉత్సాహమూ లేకుండా లోలోపల మొద్దుబారిపోతారు.

అల్ప విషయాల పలచటి పొరకింద దాగిన శక్తులెన్నో ఊహించు. ఆవిరినెట్టే కటాహపు మూతను ఒకరిని గమనించమనండి. అతడు ఒకరోజు రైలుఇంజను కని పెడతాడు. ఇనపకడ్డీ ద్వారా మెరుపు భూమిలోనికి వెళ్ళటం ఒకానొకప్పుడు ఒకడు చూచి వందల మైళ్ళ పర్యంతమూ విద్యుచ్ఛక్తిని ప్రసరించే తంత్రీ వ్యవస్థను రూపొందించాడు- నిప్పు పుట్టించడం అనే విద్య మానవుని సమస్తజీవులకంటె ఉన్నతుని చేస్తుందనేది అధ్వరణ ఋషికి తెలియదు. 'హవన కుండం' (Havan kund) లో మనము వేసే నిప్పు, ప్రకృతి శక్తులను శాసించే మనశ్శక్తిని ఎంతో వృద్ధి చేసింది. చిన్న బీజమునుంచి పెరిగే చెట్టులాగా లఘు విషయాల్లో మహత్తరావకాశాలు గుప్తమైఉన్నాయి. ప్రకృతి శక్తులు అనంతమైనవి. మన ప్రయోగాలకు అంతము ఉంటుందని ఊహించటము శక్యంకాదు. ఉత్తుంగ పర్వతాలూ. ఘోషించే సముద్రాలూ, విశాలమైన ఎడార్లూ, చీకటి అడవులూ మొదలైన ప్రాకృతిక శక్తులతో నిండిన భూగ్రహాన్ని ఆధునిక ప్రపంచంలో పోల్చిచూడండి. పల్లపు ప్రదేశాలూ, మలేరియా పీడిత ప్రాంతాల్లో మహానగరాలనూ, నాగరికతా కేంద్రాలనూ, విశాలమైన పొలాలనూ, ఫ్యాక్టరీలనూ మనము పెంపొందించ లేదా ? మానవుడెట్లా ఆవిర్భవించాడో కాస్త ఆలోచించండి. శుక్రాణువుగా మానవుడు తన ప్రయాణాన్ని ప్రారంభించి చంద్రుడినీ, చుక్కలను క్రమేణా చేరతాడు.

వాయువులను ప్రకృతి సముద్రాలుగా, పర్వతాలుగా, ఎడారులుగా అడవులుగా మార్చింది. సూక్ష్మజీవులను 'మాస్టొడాన్' (Mastodons)ల గా మార్చింది. కడపట తన ప్రచ్ఛన్న శక్తులను బయలు పరచే మానవుని సృజించింది. జీవితము ఒక సృజనాత్మకశక్తి. తెలివినీ వ్యక్తి వికాసానికి సంకల్పాన్నీ అది ఉపయోగించుకొంటుంది. కేవల చాపల్యమూ, క్షణికో ద్రేకాలూ, అవిచారపూర్వక నిర్ణయాలూ మన మానసిక శక్తులను పదను పెడతాయి. ఆ విధంగా నాడీమండల సంస్కారము ద్వారా మనము ఉత్తమ చైతన్యస్థాయికి చేరుకోవచ్చు. ప్రకృతిశక్తి మహానాటకంలో మానవుడొక క్రీడావస్తువుకంటె ఎక్కువకాదు. బృహత్తర జీవులనూ, తిమింగిలాలనూ కని తన్నుతాను మరచినవేళ ప్రకృతి మానవుణ్ణి ప్రసవించింది. మానవుడు దానికి లోబడకుండా తన సంకల్పానికి దాన్ని అధీనం చేసుకొన్నాడు. ఒకదాని కంటె మేల్తరమైన దానికోసము ప్రయత్నించటము— ఒక్కముక్కలో సర్వోత్కృష్టమైన దానికోసం ప్రయత్నించటము— అనేది విరళ వైశిష్ట్యము, ప్రకృతిలోని ఈ లక్షణమే తన రహస్యాశయాన్ని నెరవేర్చే మానవుణ్ణి సృజించింది. ప్రతివ్యక్తికీ జీవితంలో ఒక నిగూఢాశయ ముంటుంది. ఇది అవధుల నధిగమించటాన్నీ, తనకు సాధ్యమైన దాన్ని సాధించటాన్నీ ప్రోత్సహిస్తుంది. తనజాతీ, పరిసరాల అభివృద్ధి కోసము మాన వుడు జీవితామూల్య వరాన్ని ఉపయోగిస్తున్నాడంటే, విశ్వ నిత్య ప్రయోగ స్వభావంతో ప్రతిస్పర్ధించటమే కాకుండా, స్వయం పరిపూర్ణము కావాలనే దాని రహస్యవాంఛా సాఫల్యానికి తోడ్పడుతున్నాడు. ఈ విధంగా ప్రతి మనిషిలోనూ ప్రకృతిశక్తులను జయించి, ప్రపంచాన్ని పరిపాలించాలనే రహస్యవాంఛ ఉంటుంది. ఈ సృజనాత్మక శక్తే మానవుడిని దైవస్థాయికి చేరుస్తుంది, దైవము కంటె ఉన్నతు లెవరూ లేరు.

**అమర్‌లాల్ హింగొరని.**

## సోదరుడు అబ్దుల్ రెహ్మాన్

కొందరతన్ని పిచ్చివాడనుకొన్నారు. మిగతావాళ్లు అతనొక 'దర్వీష్'—దైవ మత్తుడైన మనిషి అని భావించారు. అతను రెండూ కావచ్చు. సన్నగా, బక్కపలచగా, పొడుగ్గా అగపడతాడు. మరీ దిగంబరంగా ఉండడు. ఒక అతుకుల 'గౌను' - గోద్రి - అతని కాళ్ళనూ చేతులనూ కప్పి ఉంటుంది. హిందూ మహమ్మదీయుల గుళ్ళకు తరచూ వెళుతుం టాడు. అంతర్ముఖుడుగా కన్పిస్తాడు ఆ రోజుల్లో సూర్యాస్తమయ సమయాల్లో, సెలయేళ్ళ పక్క 'సుక్కూర్' లోని రైల్వే గూడ్స్ యార్డ్‌కు ఎదురుగా ఉండే రేవు వెంబడే జనం గుమి కూడే వాళ్ళు. మాయావాది శాఖాకవి (a post of Mayavadin School) యైన సామి నుండి కొన్ని గీతాలు వల్లించే వాళ్ళు. ఈ సమావేశాలకు అతను హాజరై ఏదో కొంత ఆనం దాన్ని పొందే వాడేమో. అప్పుడప్పుడూ స్వగతం పలికేవాడు ; సోదరా అబ్దుల్ రెహ్మాన్ ! నీ కర్థమయిందా ? ఎప్పుడుదయిస్తుందో కాంతి నీ మీద ?''

ఒకరోజు నడుస్తూ నడుస్తూ తట్టుకొని రాతిమీద పడినాడు. ఆత్మశిక్షకు అది కారణమైంది. '' సోదరా అబ్దుల్ రెహ్మాన్ ! ఎంత పొగరుబోతువు నువ్వు ? ఈ అదుపులేని

వ్యవహారం వల్లనే నీ చూపులు మిన్నంటాయి. నేలను చూస్తేనా నువ్వు ?" ఈ మాటలంటూ చతికిలబడి తన్నుతాను తిట్టుకొన్నాడు. "సోదరా అబ్దుల్ రహ్మాన్ కాస్త ఆలోచించు, నువ్వెంత స్వార్థపరుడవో ? రాయిని అక్కడే విడిచేసి దారంట పొయ్యేవాళ్ళ సుఖ ప్రయాణానికి ఇబ్బంది కలిగించటం మంచిదంటావా?" గంభీర నిశబ్దానంతరము కొనసాగించాడు : "సోదరా అబ్దుల్ రెహ్మాన్ ? నువ్వు నిజంగా ఒక మర్యాదస్థుడవే అయితే రాయిని దూరంగా తీసిపారవెయ్యాలి" తరవాత వెనక్కు మళ్ళి రాయిని దూరంగా విసిరివేశాడు.

అతని స్వభావం అలాంటిది. "సోదరా అబ్దుల్ రెహ్మాన్" అని తన్నుతాను సంబోధించుకునేవాడు. చాలామటుకు అంతర్ముఖుడై తనతో తాను సాలోచనా పూర్వక సంభాషణా మగ్నుడయ్యే వాడు, "ఆకలిగా ఉందా" అని ఎవరన్నా విచారిస్తే అదే ప్రశ్నను మళ్ళీ తనకు వేసుకొనేవాడు : "సోదరా అబ్దుల్ రెహ్మాన్ ! ఏమన్నా తింటావా " ఈ విధంగా స్మృతీ, ఆత్మ పరిశోధనలూ అతని జవాబులకు ముందుండేవి. 'హఫీజ్' (Hafiz) అతనికి కంఠస్థము, పర్షియన్‌లో పద్యాలు కూర్చగలడు. షా అబ్దుల్ లతీఫ్, సామి కవితలతో అతనికి గాఢ పరిచయముంది సింధ్ సూఫీ విప్లవకవి 'సఛల్' ప్రభావం అతని మీద ఉంది. ఉర్దూ కూడా అతనికి తెలుసు. ఆభాషలో ఇతరుల కెపరికైనా వచ్చే ఉత్తరాలను చదివిపెట్టి విషయాలు వివరించేవాడు. అతను నిశ్చల హృదయుడు. గంభీరుడు. ఇతరులదేదీ కోరేవాడు కాదు. తినటమూ అంతంత మాత్రమే. సర్వఋతువుల్లోనూ వాడేదీ, తెగ ఉక్కబోస్తున్నా కూడా వేసవిరాత్రుల్లో నిద్రించేటప్పుడు చుట్టుకొని పడుకొనేది ఒకే ఒక బట్ట 'గోద్రీ' మాత్రమే. చుట్టూ ఉన్న జనము చూడకుండా తన పరమాత్మ (over soul) ఏం మాట్లాడుతాడో ఎవరికి తెలుసు ?

ఒకరోజు అమాయకుడొకడు ఒక క్రిమినల్ ప్రాసిక్యూషన్‌లో ఇరుక్కున్నాడు. అతను ఒక గడియారాన్ని దొంగిలించినట్లూ అది సాక్షుల సమక్షంలో అతని దగ్గరే దొరికినట్లూ నేరాన్ని మోపి, గడియారపు ఆసామి - ఒక ముస్లిం వ్యాపారి - సుమారు నెలకిందట ఫిర్యాదు చేశాడు. ఆ మనిషి పలుకుబడిగల వ్యక్తి. ముద్దాయి మీద నేరం వెయ్యటానికి తగిన బలమైన అనుమాన ప్రమాణముంది. తన మీద మోపింది తప్పుడు నేరమని ముద్దాయి వాదించాడు. ఒకనాడు 'సేట్! ఇంటిదారంట వెళ్తుండగా, వాళ్ళ ఆడవాళ్ళవైపు తాను చూచినట్లు అనుమానించి అక్కడికక్కడే తనను చావమోదారని వాడు చెప్పుకున్నాడు. ఆ సమయంలో ఆ దారంట యాదృచ్ఛికంగా వెళ్తున్న అబ్దుల్ రెహ్మాన్ జోక్యము కలుగజేసుకోకుండా ఉంటే వాన్ని చంపేవాళ్లే. తన ప్రతిష్ట దెబ్బతిన్నదన్న భావము 'సేట్'ను కలవరపరిచింది. అతను వాన్ని చంపనైనా చంపుతాడు కానీ అప్రతిష్ఠ భరించలేడు.

తన ప్రార్థనలు 'సేట్'ను శాంతపరచక పోవటము చూచి అబ్దుల్ రెహ్మాన్ తన అభ్యాసము ప్రకారము తన్నుతానడిగాడు. "సోదరా అబ్దుల్ రెహ్మాన్ ! అతనికి ముప్పయి అయిదేళ్ళ సోదరిఉంది. తండ్రి ఆస్తిలో ఆమె భాగాన్ని తాను కాజేయాలను కొంటున్నందున-లేకపోతే అమె మగనికి ఆ అస్తి పోతుంది. కాబట్టి ఆమె పెళ్ళి పెటాకులు చెయ్యడు. ఈ సేట్ దయచూపడనేది నిర్ధారణ అయింది కదా ! ఈ నిజాన్ని ఒప్పుకోవటం చాలా మంచిది. అయినా తీవ్ర అసమ్మతి విఫలమయితే, సంగతి సందర్భాలను బట్టి బయలు చేయడం వల

పనికావచ్చు". అబ్దుల్ రెహ్మాన్ తనలో తాను ఎప్పుడూ నెమ్మదిగా మాట్లాడుకోడు కాబట్టి సేట్ అతని చుట్టూ ఉన్న జనమూ సూచన గ్రహించారు. పేదవాన్ని వదిలారు. అయితే ఈ వదంతి వ్యాపించింది. సేట్ ప్రతిష్ఠ దారుణంగా దెబ్బతింది. దాంతో వ్యాజ్యెము తెచ్చుట (Prosecution) నిజానికి కట్టుకథ అయింది. ముద్దాయి తన నిర్దోషిత్వాన్ని తానే వాదించుకొన్నాడు.

సేట్ దీన్నంతా ససేమిరా అన్నాడు. నలువురు డిఫెన్సు సాక్షుల్లోనూ ముగ్గురిని కొనేశాడు. వారు కోర్టులో హాజరు కాలేదంతే. తమకేమీ తెలియదు పొమ్మన్నారు. నాల్గవ వాడేమో అబ్దుల్ రెహ్మానే. అలాంటి మనిషిని సాక్షుల బోనులో నిలబెట్టటం వల్ల ఒరిగేదేమి టని డిఫెన్స్ న్యాయవాది సందేహించాడు. కానీ ఈ మనిషి నిజాయితీ పట్ల ముద్దాయికి నిర్వివాదమైన విశ్వాసం ఉంది, పాపభీతి కలవాడు కావడం వల్ల నిర్మొహమాటంగా నిజం చెబుతాడని. అతనిమీద ఆధారపడటము కొంచెము కష్టమే.

'సమ్మన్'లు అందగానే అతడన్నాడు : "సోదరా అబ్దుల్ రెహ్మాన్ ! న్యాయ స్థానంలో హాజరు కమ్మని 'సమ్మన్' వచ్చింది. అలాంటి స్థలం గౌరవనీయమైంది". సందర్భా నికి చెప్పుల జత నొకదాన్ని సంపాదించుకోగలిగాడు. న్యాయస్థానం పట్ల మర్యాదా సూచ కంగా ఈ పనిచేశాడు. అయితే న్యాయస్థానానికి హాజరై శిష్టాచార పూర్వకంగా చెప్పులను ధరించి 'గోద్రి' (godri) ని మెడచుట్టూ ఉత్తరీయములాగా చుట్టుకొనే వేళకు, లోనికి అడుగుపెట్టేముందు చెప్పులను వదలిపెట్టుమని 'ప్యూను' (Peon) ఆదేశించాడు. సంభ్ర మంతో అబ్దుల్ రెహ్మాన్ తనతో తాను చెప్పుకొన్నాడు : "ఈ పని కోసమే నువ్వీ చెప్పుల జతను సంపాదించావు. ఇప్పుడీ పౌరవేషుడు (live ried man) చెప్పుల్లేకుండా న్యాయ స్థానంలో నిన్ను అడుగు పెట్టమంటున్నాడు." ఈ మాటలంటూ చెప్పులు విడవకుండానే లోనికి ప్రవేశించాడు ఈ విపరీతపు మనిషి ప్రవేశించటం చూసి మెజిస్ట్రేటు నవ్వాడు. గోద్రీని మెడచుట్టూ ధరించావెందుకని ప్రశ్నించాడు. అబ్దుల్ రెహ్మాన్ సాక్షిబోను లోనికి వెళ్ళి మామూలుగానే ప్రశ్నను మళ్ళీ వేశాడు : "సోదరా అబ్దుల్ రెహ్మాన్ : నువ్విప్పుడు న్యాయస్థానంలో ఉన్నావు. నిన్నడిగిన ప్రశ్నలకు ఒళ్లు దగ్గరుంచుకొని సమాధానించు. ఉత్సవ సమయాల్లో ఉత్తరీయాన్ని ధరించటం హిందూ సంప్రదాయమని చెప్పు. మర్యాద చూపటం వారి లక్ష్యము. అందువల్ల నువ్వు అలాగే చేశావు". ఈ జనాంతికము తరవాత ఆ అబ్దుల్ రెహ్మానే ఈ సమాచారాన్ని గౌరవనీయులైన మెజిస్ట్రేటుకు విజ్ఞాపించాడు.

ఆ తరువాత శిరిస్తాదార్ (Serishtadar) నైయమిక శపథం చేయిస్తూ వల్లించ మని అడిగాడు.

"దేవుని ఎదుట నిజమే చెబుతాను, పూర్తి నిజము, నిజము వినా చెప్పనని ప్రతిజ్ఞ చేస్తున్నా".

అబ్దుల్ రెహ్మాన్ ప్రప్రథమంగా దీన్ని స్వగతంగా వల్లించి తరవాత చట్టప్రకా రము నియమపాలన చేశాడు.

శిరిస్తాదార్ ; దయచేసి మీ పేరండీ !

''సోదరా అబ్దుల్ రెహ్మాన్, నీ పేరు ?'' తరవాత మెజిస్ట్రేటు వైపు తిరిగి సమాధానించాడు. ''నాపేరు అబ్దుల్ రెహ్మాన్''. అతని విచిత్రపద్ధతికి కోర్టులో వాళ్ళంతా ఎగతాళిగా నవ్వారు. మెజిస్ట్రేటు తమాషా కొంతసేపు ఆనందించాడు. తొందర్లో విసుగు పుట్టింది. ఏ ప్రశ్నకైనా సమాధానించే ముందు స్వగతం పల్కే అలవాటు సాక్షికుందని వకీలు వివరించాడు.

శిరిస్తాదార్ : దయచేసి మీ మతమండీ ?

అబ్దుల్ రెహ్మాన్ (జనాంతికంగా) '' నీ నమ్మిక తెలుసుకోవాలను కొంటున్నాడు. సోదరా అబ్దుల్ రెహ్మాన్, నిజము చెబుతానని ప్రతిజ్ఞ తీసుకొన్న విషయము జ్ఞాపకముంచుకో. నిజానికిది జుగుప్సాకరమైన ప్రశ్న. హిందువంటే ముస్లిమ్‌లకు కోపము, ముస్లిమ్‌ను అని నువ్వంటే హిందువులు బెదరిపోతారు. నిజమెందుకు చెప్పకూడదూ—నిజము తప్ప, ఓ సోదరా అబ్దుల్ రెహ్మాన్, తికమక పడవద్దు. సింధీకవి సఛల్ మాటల్లో చెప్పు :

''నేను హిందువునూ కాదు
ముస్లిమ్‌నూ కాదు
నేను నేనే''

అలాంటి వివరణాన్ని (statement) తీసుకోవచ్చునో లేదో నని సందేహిస్తూ శిరిస్తాదార్ పైఅధికారి ఆదేశం అడిగాడు. అతన్ని ముస్లింగా వ్రాసుకొమ్మని మెజిస్ట్రేటు ఆదేశించాడు.

శిరిస్తాదార్ : దయచేసి మీ వయస్సండీ ?

అబ్దుల్ రెహ్మాన్ (జనాంతికంగా) ''నీ వయస్సు అతనికి కావాలిట. నేను ముస్లింను కాదని అతనితో అన్నా, ముస్లింగానే సందేహించాడు.'' తరువాత శిరిస్తాదార్ వైపు తిరిగి అదికూడా మేజిస్ట్రేటు నడిగి తెలుసుకొమ్మన్నాడు.

దీంతో మేజిస్ట్రేటుకు మండింది: ''నువ్వొక 'జాట్' (Jat) వి. బుద్ధిగా మాట్లాడు. ఇది న్యాయస్థానమని మరచి పోవద్దు''.

అబ్దుల్ రెహ్మాన్ నవ్వి తనతో అన్నాడు: ''సోదరా అబ్దుల్ రెహ్మాన్ ! మేజిస్ట్రేటు అంటాడు. 'జాట్' నని, బుద్ధిగా మాట్లాడూ అని''. 'జాట్' పదమంటే ఏమనుకొంటున్నాడో అతన్ని అడుగు. ఈ ప్రశ్నను అడక్కముందే 'జాట్' అంటే 'నిరక్షరకుక్షి' అని అర్థమని మేజిస్ట్రేట్ హఠాత్కోపంతో అన్నాడు.

అబ్దుల్ రెహ్మాన్ (జనాంతికంగా) ''సోదరా/అది విన్నారా ? ఈ మాట నీకు నిజంగా సరిపోదు. నువ్వో 'జాట్' వి కానేకాదు. సింధీ, హిందీ, సంస్కృతము, ఉర్దూ, పర్షియన్ చదవగలవు. వ్రాయగలవు, అంటే అయిదు భాషలవుతాయి. గౌరవనీయుడైన మేజిస్ట్రేటును తనకెన్ని భాషలు వచ్చో అడుగు.''

అబ్దుల్ రెహ్మాన్ (మేజిస్ట్రేటుతో)''అయ్యా...'' మేజిస్ట్రేటు అతన్ని ఆపి అన్నాడు: ''జాట్ అంటే ఇంగ్లీషు అర్థం కాని వాడు.''

అబ్దుల్ రెహ్మాన్ (జనాంతికంగా) ''సోదరా అబ్దుల్ రెహ్మాన్ ''జాట్'' అంటే ఇంగ్లీషు తెలినివాడని మేజిస్ట్రేటు నొక్కి చెబుతున్నాడు. ఇంగ్లీషు తెలియని అతని తాతలు ''జాట్'' లు ఏమో అడుగు. ఇక్కడ ఇంగ్లీషు వస్తుందని గర్వించే 'తోపన్‌మల్' (Topan-mal) -పశువుల దొడ్డి కాపలామనిషి-కొడుకులున్నారు. ఇదంతా మేజిస్ట్రేటుకొస్తుంది. ఆయన ......కొడుకు కాబట్టి.''

మేజిస్ట్రేటుకు మతి పోయింది. కోర్టు ధిక్కరణ నేరానికి అతన్ని ఎందుకు 'ప్రాసిక్యూట్' చేయకూడదు అని అబ్దుల్ రెహ్మాన్‌ను అడిగాడు. ఇక మాట్లాడ వద్దనీ, వ్రాతమూలకమైన వివరణము ఇవ్వమని శాసించాడు కూడా.

మేజిస్ట్రేటు ఆజ్ఞకు లోబడి అబ్దుల్ రెహ్మాన్ క్రింది విధంగా వ్రాశాడు.

మాననీయా :

సోదరుడు అబ్దుల్ రెహ్మాన్ కోర్టు ధిక్కరణ నేరం చెయ్యనే చెయ్యలేదు. ఈ వాళ మీరు చాలామంది సాక్షులను నిందించారు. మీ తిట్లు నా చేలాంచలాన్ని కూడా తాకలేవు. మీకు కొంచెము సలహా ఇవ్వనివ్వండి. మీకు పెద్ద పదవి ఉన్నా జనంమీద పెత్తనము చెలాయించలేరని గ్రహించాలి. మీరు వారి సేవకులు. మీ 'సమ్మన్'ల ప్రకారమే సాక్షులము ఇక్కడికి వచ్చాము. మా కొద్దీ మేము రాలేదు. మా పట్ల ప్రవర్తించాల్సిన పద్ధతి అదేనేమో కాస్త ఆలోచించండి. అలాంటి మన్ననకు గురిచేస్తే ఏ మర్యాదస్థుడూ మీ ముందు హాజరు కాడని నా విశ్వాసము. ఉద్యోగంనుంచీ మిమ్ములను ఎందుకు 'బర్తరఫ్' చేయకూడదో కారణాలు తెల్పాలి. మీరు సేవించే ప్రభుత్వాన్ని మీరే కించపరచారు. దయచేసి గుర్తుంచుకోండి. చేయించిన ప్రతిజ్ఞాను సారము సోదరుడు అబ్దుల్ రెహ్మాన్ సత్యాన్ని పలికినాడు. పూర్తి సత్యాన్ని, సత్యాన్ని మాత్రమే పలికినాడు. అందువల్ల దేవా అతనికి సాయపడు.

*సం॥ సోదరుడు అబ్దుల్ రెహ్మాన్.*

*(టి. వి. బసంత్ అనువాదము)*

## నీ ఎదను పెంచు

విశాల హృదయతను పెంచుకో, అందువల్ల నువ్వూ జీవించగలవు, అలాగే
నేనూ మనగలను.
నీ దృక్పథంలో ఒక స్థైర్యాన్ని చేర్చుకో
అందువల్ల నువ్వూ జీవించగలవు; అలాగే నేనూ మనగలను.
కొత్తవాణ్ణి కనుక నీ వ్యక్తిలో నాకు చోటు లేక పోతే
ఏదో కొంత చోటివ్వు, ఎంతకొంచెమైనా సరే-నీ ఎదలో ఏదో ఒక మూల
'నేను' 'నీవు' అనే భావాలను శాంతపరచు

అందువల్ల నువ్వూ జీవించగలవు: అలాగే నేనూ మనగలను.
ఒకేచోట మనం పుట్టక పోతేనేమి
ఒకే దేశానికి చెందిన వాళ్లం
అయినా విశ్వపౌరులుగా జీవిద్దాం
దృక్పథంలో స్పష్టత ఉండనీ
అందువల్ల నువ్వూ జీవించగలవు; అలాగే నేనూ మనగలను.
మతసంకుచిత సీమల్లో కలసి మెలసి ఉండక పోతే
జాతీయతా భావంతో కలసి ఉందాం
కాదు, సౌభ్రాత్ర మానవతాధ్యాత్మికల పేర
నన్ను నీ వాణ్ణి చేసుకో
హేయమైన వేరుపాటుధోరణిని వదల్చుకో
అందువల్ల నువ్వూ జీవించగలవు; అలాగే నేనూ మనగలను.
నీ రాజప్రాసాదంలో ఒకే ఒక్కగది నువ్వు వదిలితే
నా లాంటి గృహబాధితులకు శత కుటీరాలు నిర్మించవచ్చు
దురాశను విసర్జించు
అందువల్ల నువ్వూ జీవించగలవు; అలాగే నేనూ మనగలను.
భోజనపు బల్లమీద నువ్వు వదలిన వాటిని మిగల్చ గలిగితే
నిరర్థకంగా వెదజల్లుతున్నదాంట్లో
కొంత ఆదా చెయ్యగలిగితే—
దీనిపై దృష్టి సారించు
అందువల్ల నువ్వూ జీవించగలవు, అలాగే నేనూ మనగలను.
నీ రాజ భోజనంలో ఒక్క మెతుకును వదలితే:
అది వేయి మెతుకులుగా మొలకెత్తి
ఆ కొన్న పేదలకు అన్నమౌతుంది.
మితవ్యయ పవిత్ర ప్రయోజనా నిమిత్తం
అందువల్ల నువ్వూ జీవించగలవు; అలాగే నేనూ మనగలను.
నీ ఆశల తోటలో
ముళ్ళైనా పొదుపు చెయ్యగలిగినా
అరక్షిత కుటీరాలకు కంచెలవుతాయి.
దైవం నీకు వివేకాన్ని ప్రసాదించు గాక !
అందువల్ల నువ్వూ జీవించగలవు; అలాగే నేనూ మనగలను.
జనం ఆకలితో అలమటిస్తున్నపుడు
దేశాలను జయిస్తానని ఎలా అనుకొంటావు ?

నాగరిక యుగంలో అమాయకుల రక్తాన్ని
ఎలా చిందివ్వాలను కొంటావు ?
వెలుతురులో చీకటి వసింప నీవద్దు
అందువల్ల నువ్వూ జీవించగలవు; అలాగే నేనూ మనగలను.

## కాసారము.

ఈ నిర్మల సుందర కాసారాన్ని చూడు
మనసు నెంత ఆకర్షిస్తుదో !
అయినా అట్టడుగున ఏ చెత్తుందో
ఏ మాత్రము అంతుపట్టదు.
ఒక రాయి విసురు-
చుట్టూ తరంగా స్ఫాలిత ధ్వని
మానవ మానస సరోవరోత్థిత
వీచిక మల్లే—
దైవము మానవుణ్ణి సృష్టించింది
కాలానుగుణమైన దేవతలను మానవుడు కల్పించాడు
మనిషి కల్పించిన దైవాలు
సృష్టికర్త విరించి వోలె తమకు తామే గద్దెనెక్కాయి
స్రష్ట ప్రజాపతి వారిని చూల్లేక
మొఖం చాటు వేశాడు
నేను కావాలనుకొన్న నేను కాదు
కాకూడదనుకున్న నేను; నేను
లోకాన్నీ, నన్నూ భ్రమింప యత్నిస్తున్నా
ఎన్నో జిత్తులు నిరంతరం
పన్నుతూనే ఉంటా.
కాలపు జారుడు ముఖం మీద
తూలుతూ తూలుతూ పడతాను
పడిపడి లేస్తాను
లేచి మళ్ళీ తూలుతాను, తూలుతూన్న దారేదోతెలియక
గమ్యమేదో అర్థంకాక
అలాగే వెళతాను

నేను చేసేది నాకు తెలియదు
ఎందుకు చేయాలో కూడ తెలియదు:

*హరి దర్యాని (దిల్గిర్)*
గాంధీధామ్, కచ్.

## చతుష్పదాలు.

కలడో లేడో ఎవరీ జగత్తత్త్వాన్ని ఛేదించ గలరు ?
విస్మయంలో మనీష మునిగి పోయింది; వివేచనా ప్రయోజనం లేదు.
నీ కళ్లఅతన్ని దర్శిస్తే 'లేదు' అని అనలేవు
నీ మనసుపై అనుమానం ముట్టడిస్తే 'అవును' అని చెప్పలేవు.

వేదనలు నిన్ను చుట్టుముట్టితే, వాటి ముఖం చూడకు
ఆ దారి తొక్కటం ఎందుకు; నీ కేమాత్రం సాయం చేయలేదు
తోట చూడడం మేలు; గులాబీ; ఆవల నిర్ఝరిణి
చూడు శశిని, మెరుస్తున్న చుక్కలను.

మనిషీ ! మరణకళ అభ్యసించు, జీవనకళ దానంతటదే అబ్బుతుంది
'అహం'ను విసర్జించినపుడు నీకు సిద్ధిస్తుంది
చావునూ బ్రతుకునూ ఒక వెంట్రుకవాసి వేరు పరుస్తుంది
ఆ అంతరాన్ని తొలగించు, ద్వంద్వంలో ఏకమవుతావు.

*లేఖ్ రాజ్ కిషిన్ ఛంద్ (అజీజ్)*
బొంబాయి

## జాతీయగీతము

జాతస్య మరణం ధ్రువం ; వీర మరణాన్ని పొందు
భీరువులా చావొద్దు, ధీర యోధునిలా మరణించు
వ్యాధిగ్రస్థుడవై, ఏడుస్తూ, వణకుతూ అనామకంగా చావటమెందుకు ?!
రా ! యోగ్యపుత్రునిలా మాతృభూమికై ప్రాణాలర్పించు
ప్రతాప శివాజీ గురుగోవింద సింగులు జన్మించిన గడ్డలో
నిస్సహాయుడుగ, మందభాగ్యుడుగా - ఎలా ఉండగలవు ?
అతివ రణరంగానికి ఉరుకుతున్నప్పుడు
రాతి గుండెతో ఎలా మన గలవు
ఒకటిన్నర శతాబ్దంగా మనం బలహీనులూ దీనులూ కాగా

దాస్య శప్తులమై శిక్షితులమయ్యాం
పొగ డ్తల్లో తలమునక లయితే
మన కంకాళం భిక్షాపాత్రా కాక తప్పదు
మేలుకో! లే! వివేకుల్లా వర్తించు
ఈ బంగారు అవకాశాన్ని వదిలితే
ప్రళయ దివసం దాకా ఏడ్వక తప్పదు.

*హింద్ రాజ్ లీలారామ్ (దుఖ్యాల్)*
గాంధీధామ్, కచ్.

## నేతకాడు

ఓ, నేతకాడా! నీ పనిలో నువ్వు నిమగ్నమై ఉన్నావు
గడిచే కాలంపై గమనముంచు
ఉషోదయం నుంచీ నీ పనిలో నువ్వు
ప్రతిసారీ ఎందుకా చిరునవ్వు
నీ వస్త్రం ఉపయోగమేమి
అరుణోదయ కిరణాల్లాగా ఎర్రగా ఉన్నా!
''నా బిడ్డ కొరక చక్కటి చొక్కా నేస్తా
గడిచే కాలాన్ని పట్టించుకొనే దెవ్వడు''
నీ పనిలో నువ్వు నిమగ్నమై ఉన్నావు ఓ నేతకాడా!
గడిచే కాలంపై గమనముంచు
నీ పనిలో నువ్వు నిమగ్నమై ఉన్నావు
నీ పదమేదో సన్నగా ఆలపిస్తూ
చూడు! సూర్యుడ స్తమించాడు.
నువ్వింకా పనిలో ఉన్నావు
(కుంగూ) కుంకుమలా ఎర్రగా ఉన్నా
నీ బట్ట ప్రయోజనమేమి?
''వధువుకూ వరునికీ దువ్వలువలు నేస్తారు వారు
గడిచే కాలన్ని పట్టించు కొనేదెవ్వడు''.
నీ పనిలో నువ్వు నిమగ్నమై ఉన్నావు ఓ నేతకాడా!
గడిచే కాలంపై గమనముంచు
చంద్రకాంతిని తిలకించు
రాత్రి శీతలంగా ఉంది

అయినా నీ పనిలో నువ్వు నిమగ్నమై ఉన్నావు
గులాబీలా ఎర్రగా ఉన్నా నీబట్ట ఉపయోగమేమి ?
"ఏదో ఒక శవాన్ని కప్పేందుకు ముసుగుగుడ్డ నేస్తారువారు
గడిచే కాలాన్ని పట్టించుకొనేదెవ్వడు".

నారాయణ్ శ్యామ్
4ఎ. హాతీఖానా ఫ్లాట్స్
ఢిల్లీ - 6.

## షా అబ్దుల్ లతీఫ్

(ఉమర్ మారుయి)

వేరొక మగడొద్దు నాకు
ముతకదుప్పటిలో ముడుచుకొన్న వాడు చాలు
ముతక బట్ట తొడిగినా నా గుండెకు ప్రియమైనవాడు
విధేయ వనితల విశ్వాసం ఉన్నంతవరకూ
ఈ దుర్గ నివాసాన్ని తిరస్కరిస్తాను
నదీ జలపానాన్ని తిరస్కరిస్తూ
శుక్తి సముద్రంలో జీవిస్తుంది
మేఘం కోసం అతడు తపించినట్లు, 'మాలిక్' కోసం నా మనసు వేదన చెందుతుంది
నా 'మరున్' పాలమీద బ్రతుకుతుంది
వారి విశ్వాసం వారిని సురక్షితంగా చేరినప్పుడు.
పెళ్ళికూతుళ్ళను నగా నట్రాకోసం మార్చేది 'మరున్' అలవాటు కాదు
ఉమర్ కోటకు వచ్చి నేనా తప్పుడు పని చెయ్యను
ఈ రాజప్రాసాద నిమిత్తం నా కుటీరప్రేమను మార్చుకోను
నా చర్మమూడదీసి ఉప్పు పెట్టినా లెఖ్ఖలేదు
నావారు అలాంటి పొరపాటును ఇక ముందెన్నడూ చెయ్యలేదు
నా ఊపిరి ఉన్నంత కాలం నా ప్రేయసిపై నాప్రేమ నిలుస్తుంది
'మరున్'తో నా జీవితం బంధింపబడింది—ఒక సన్నటి సూదీదారంతో
స్మృతికి తెచ్చుకొంటున్నా, ఓ సుమ్రః నాదేశపు
పొలాలను, ఫలాలను
అక్కడే నా ఆత్మ నివసిస్తుంది. నా శరీరం మాత్రము ఇక్కడ
నా ఒకే ఒక్క తొడుగిక్కడ. దాని జీవితం
కుటీరాన.

## కిషన్‌ఛంద్ బెవాన్

తెరవెనుక ఎవరిదా చూపు? అర్థం చేసుకో; అప్పుడు చెప్పు:
చైతన్యం ప్రతిధ్వనించిన స్వరం ఎవరిది ? అర్థం చేసుకో; అప్పుడు చెప్పు :
వందలమైళ్ళ దూరంనుండీ శబ్దరూపాలు క్షణంలో వస్తాయి
విద్యుచ్ఛక్తి అద్భుతం వెనుక శక్తి ఎవరిది ? అర్థంచేసుకో; అప్పుడు చెప్పు:
స్థూలపదార్థ గతమైన ఈ ప్రాణం ఎవరిది? అర్థం చేసుకో; అప్పుడు చెప్పు:
ఎరుపదే - నేలా — గాలీ — నీరూ — కాంతీ — అవే
శబల మధుర వాసనా పుష్పాలెట్లా వికసిస్తాయి ? అర్థంచేసుకో, అప్పుడు చెప్పు:
వి త్తనం లోంచి చెట్టు వస్తుంది : ఒక్క గింజ కంకి నిస్తుంది
ఒక్క గింజనుంచీ సమృద్ధి ఎలా విరుస్తుంది ? ఎవరిదీ పనితనం ?
అర్థం చేసుకో, అప్పుడు చెప్పు.
కాంతి సప్తవర్ణ ఇంద్ర ధనువు నుంచీ ప్రతిదీ
ఈ ఇంద్రజాలం ఎలా ప్రదర్శితమైంది ? అర్థం చేసుకో, అప్పుడు చెప్పు.
చూడు, పుట్టిన మరుక్షణం పాపాయి తల్లి రొమ్ముని పాలు కుడుస్తుంది
ఈ పసికందుకు ఈ కళ నేర్పిందెవరు ? అర్థం చేసుకో, అప్పుడు చెప్పు.
వాక్యాన్ని చేసే బిందువులకు నిడివీలేదు; వెడల్పూలేదు
వాక్యానికా నిడివి ఎలా వచ్చింది ? అర్థం చేసుకో, అప్పుడు చెప్పు.
మరొక దానికెదురుగా ఒక అద్దాన్ని ఉంచు
ఈ ప్రతిబింబా లెక్కడ నుంచి? అర్థంచేసుకో, అప్పుడు చెప్పు.
నా 'బన్సీ' ద్వారా లోతుగా తిన్నగా వీచేవాడు
దానికోసం కాకపోతే 'బవాన్' కవిత విలువేముంది ?
అర్థం చేసుకో, అప్పుడు చెప్పు.

## సామి (ఖాయీ చెయిన్‌రాయ్)

నా మనసుకొక సందేహం చుట్టుముట్టింది
సామి సద్గురుని ప్రశ్నిస్తాడు : "ఈ విశ్వం ఎక్కణ్ణుంచి వచ్చినట్లు?"
అంతర్దృష్టి ఋషి నిర్ధారిస్తాడు :
"ఏమీ లేదు ; కాని నీరులేని బుడగ".
ఓ పరిపూర్ణుడా ! ప్రియురాలి వదనం ఏ విధంగా ఉంది ?
"చెప్ప వీల్లేని మర్మం అది

రూప రహితమైంది; అవర్ణమైంది; నిరాకారమైంది
కళ్ళెదుట చూస్తేతప్ప గుర్తించలేంది''

''దైవం ప్రత్యక్ష నిదర్శనం – సూర్యుడిలా
కళ్ళు విప్పలేరు కనుక అంధులు చూడలేరు
సత్య ప్రణయ తత్వాన్ని అభ్యసించి సాయుజ్యాన్ని పొందు.
గడప గడపా నిరర్థకంగా తిరగకు''
''విద్య ఉందని డంబాలు కొట్టకు
మౌనము పాటించకు
ఇక్కడా అక్కడా తిరగకు
ధ్యాన నిష్ఠోపవిష్టుడవూ కాకు
సామి ప్రవచనం జ్ఞాన శూన్యమైతే
ఇదంతా కేవల అహంకారం
మహాత్ముల సాహచర్యంలో
నిర్వాణాన్ని పొందవచ్చు''. .
''ఆహారంలో - ఉపవాసంలో
జాగృతిలో సుషుప్తిలో
ఒప్పుకోలులో మొండి వైఖరిలో
పట్టు విడుపుల్లో అతి వర్జించు
సాధు సాంగత్యంలో
జీవితలక్ష్యాన్ని అవగతం చేసుకో
సామి ఉవాచ :
''ఎవడి శాసనం చెల్లుతుందో వాడే ప్రభువు,''

## సచల్ సర్ – మస్త్

ఎన్నో పేర్ల పిలుస్తారు వాళ్ళు నన్ను
కానీ నేను నేనే
ఒకడు నన్ను 'మోవిలన్' అని పిలుస్తాడు,
మరొకడు 'కాఫిర్' అని పిలుస్తాడు
మూడోవాడు 'జహిర్' అని పిలుస్తాడు
నాలుగోవాడు నన్ను మాంత్రికుడంటాడు
మరొకడు 'కవి' యని పిలుస్తాడు.
కానీ నేను నేనే.

ఎవడో ఒకడు నన్నొక పండితుడని పిలుస్తాడు
మరొకడు తాపసి యంటాడు.
ఏవడో ఒకడు నన్ను వసంతకాలంలో నువ్వే తోటవంటాడు,
ఎవడో ఒకడు నన్ను కవియైన సన్యాసి నంటాడు
కానీ నేను నేనే.
ఎవడో ఒకడు నన్ను 'ముల్లా' అంటాడు ; మరొకడు 'కాజీ' యంటాడు
ఎవడో ఒకడు 'ముఫ్తి' యంటాడు ; మరొకడు 'ఘాజి' యంటాడు
ఎవడో ఒకడు ఉపవాసియైన 'నామాజి' యంటాడు
కానీ నేను నేనే
ఎవడో ఒకడు నన్ను పనికిమాలినవాడు అంటాడు; మరొకడు దుష్టుడు అంటాడు.
ఏవడో ఒకడు నాకు మతంలేదని విముక్తికి దూరుణ్ణని అంటాడు
ఏవడో ఒకడు నన్ను ఆస్తికుడు అంటాడు; మరొకడు విగ్రహారాధకుడు అంటాడు.
కానీ నేను నేనే.
ఎవడో ఒకడంటాడు నన్ను బయటికి మనిషి చేతుల్లో 'సైతాన్' అని.
నన్ను మరొకడంటాడు 'బుజర్గ్' (మర్యాదస్తుడు) అని -
మరొకడు 'మస్త్' (పిచ్చివాడు) అంటాడు
కానీ నేను నేనే
ఒకడంటాడు నన్ను 'రంగుమనిషి' అని, మరొకడంటాడు నాకే రంగు లేదని
ఒకడు పిలుస్తాడు నన్ను పిచ్చి ఫకీర్ అని, ఒకడు నన్ను 'మర్యాదస్థుడు' అని పిలుస్తాడు;
మరొకడు సిగ్గుమాలిన మనిషి అంటాడు
కానీ నేను నేనే
ఒకడు నన్ను విశిష్టుడంటాడు. ఇతరులు మామూలు వాడు అంటారు
ఒకడు నన్ను పరిణతుడు అంటాడు. మరికొందరు అపరిణతుడు అంటారు
కానీ ఒకరు 'నచూ' అని పిలుస్తారు. అదే నేను.
కానీ నేను నేనే

## షా అబ్దుల్ లతీఫ్ (రాయ్ దియాచ్ బిజిల్)

భగవానుని ఆశీస్సుల ఆవాహన చేస్తూ గాయకుడు తన పని సాగించాడు.
మెరిసే గంటలు, వస్త్ర కౌశేయసూత్ర గుచ్ఛాలు తన 'చంగ్' కు కట్టాడు.
అల్లంత దూరం నుండి 'రాయ్‌దియాచ్' 'దోలీ' ని అతడు చూచాడు
ఆ క్షణంలోనే భగవంతుని ప్రార్థించాడు.
"ఓ కరుణామయ భగవాన్, రాజు నా పాటకు ముగ్ధుడుకావాలి."

భిక్షకుడు, ప్రతిభావంతుడు 'జునగడ్' చేరారు
మధుర గీతాల నాలపిస్తూ కిన్నెర వాయించాడు
అతని సంగీతానికి నగరమంతా ఆతురత చూపింది
రాణులు దుఃఖించ దాసీజనం రోదించారు
రాజ శిరోభిక్షకుణ్ణని గాయకుడు అభ్యర్థించాడు
తన కూర్మిక వాయిద్యంతో ఫకీరు రాజ ప్రాసాదాన్ని ప్రవేశించాడు
మీటే తంత్రీనాదానికి కోట కంపించింది
''బిజల్'' అభియోగం, ఎక్కడా ప్రజల ఏడ్పు
గాయక శిరోమణి రాయ్ తలను భిక్షగా ప్రార్థించాడు
జునఘడ్ వణకుతుంది, రాజ ప్రాసాద గవాక్షల నుండి రోదన విన్పిస్తుంది.
ఓ రాజా ఈ స్థితిలో నీ చెంతకొచ్చాను
ఓ కరుణాంతరంగా, నీ ప్రాసాద సభా భవనంలో అడుగిడిన
దీనుని ప్రార్థన మన్నించు
ఈ సమయాన నీ ఔదార్యం చూపించు, మిగతా ఆతని ఆత్మ కర్పించు.
''నేల మీది నూకల కోసం నేన్నెప్పుడూ భిక్ష ఎత్తలేదు
నీ అశ్వశాలలో వేగంగా పరుగెత్తే గుర్రాలకు కొదవలేదు
ఒక వేదండం కోసమూ తంత్రులను మీటటం లేదు
నీ శరీరా భరణం ఆ తల దాని అన్వేషిని నేను.
''ప్రణామాలు'' ఓ భిక్షుకా : పది పర్యాయాలు
ప్రమాణాలు నీకు
నాకు విలువైనది అయినా అల్పమైనదాని అన్వేషివి నువ్వు
ఏమైనా, నా తల ఏ మాత్రం ఉపయోగ పడినా, దాన్ని
ఇరవై తుండాలు చేసి నీ కొసగుతాను.

# హిందీ

మూలం :
డా॥ నగేంద్ర

అనువాదం :
డా॥ బి. భీమ్‌సేన్
నిర్మల్.

## చారిత్రక సమీక్ష

7 లేదా 8 వ శతాబ్దానికి చెందిన పుష్యుడనే కవి రచనలలో హిందీ కవిత్వపు ప్రారంభ ఛాయలు ఉన్నాయని అనుకోవచ్చు. కాని సాధికారంగా చెప్పాలంటే హిందీ కవిత్వం 10వ శతాబ్దంలోనే ఆరంభమైంది. రాజకీయ, సాంఘిక పరిస్థితులలో కలుగుతున్న మార్పులు కారణంగా ఆనాటినుండి నేటివరకూ హిందీ కవిత్వంలో ఇతివృత్తమూ, శైలీ విధానం దృష్ట్యా చాలామార్పులు వచ్చినయి. హిందీ వాఙ్మయచరిత్ర వ్రాసిన చాలమంది హిందీ వాఙ్మయ వికాసకాలాన్ని ఆదికాలము, భక్తికాలము, రీతికాలము, ఆధునిక కాలము అని నాలుగు యుగాలుగా విభజించారు. 7వ శతాబ్దపు మధ్యభాగంలో భక్తిభావ భరితాలయిన కొన్ని హిందీ కవితలు వ్రాయబడినా, 10 వ శతాబ్దపు మధ్యభాగం నుండి 14 వ శతాబ్దం ప్రారంభం వరకు ఆదికాలమని చెప్పవచ్చును. ఈ యుగంలో బయలుదేరిన హిందీ వాఙ్మయం, దానికిగల నామ ధేయం దృష్ట్యానూ, కర్తృత్వాన్ని బట్టీ, కాల నిర్ణయాన్నిబట్టీ, చాలా వివాదాస్పదం. ఈ యుగపు కాలపరిమితి కూడ వాదోపవాదాలకు తావయింది. విద్వాంసులు ఈ యుగాన్ని ఆది కాలమని, వీరగాథాకాలమని, చారణకాలమని, అంధకార యుగమని, అపభ్రంశ కాలమని, సంధి యుగమని, సిద్ధసామంత యుగమని పెక్కు పేళ్ళతో వ్యవహరించారు. కాని ఆదికాలం అనే పేరుకే ఎక్కువ ప్రచారం లభించింది. పరిశీలనా సౌకర్యానికై ఈ యుగపు కవిత్వాన్ని మూడు వర్గాలుగా విభజింపవచ్చు. 1. అపభ్రంశభాషా కవిత్వం. 2. ప్రాంతీయ దేశ భాషలో వ్రాయబడిన వీరకావ్యాలు. 3. ప్రకీర్ణాలు.

*1. అపభ్రంశ భాషా కవిత్వం :* సిద్ధ సాహిత్యం, నాధ సాహిత్యం, జైన సాహిత్యం ఈ విభాగంలోకి వస్తాయి. ప్రముఖులైన 84 గురుసిద్ధులు క్రీ. శ. 750–1200 మధ్యకాలంలో జీవించి ఉండడంచేత, సిద్ధసాహిత్యం ఆ కాలంలోనే వ్రాయబడిందని చెప్ప వచ్చు. సిద్ధులు తమ భావాభివ్యక్తికి జనసామాన్యం వాడేభాషను వాడారు. వారి రచనలు, వారి సాధనవలెనే, భక్తితత్వంతో పాటు శృంగారభావంతో నిండిఉన్నాయి. 7 వ శతాబ్దం నుండి 14 వ శతాబ్దం మధ్యకాలంలో గోరఖ్‌నాథుడు, అతని శిష్యులు నాథ సంప్రదాయ పరమైన సాహిత్యం రచించారు. నాథులు సిద్ధులలోని శృంగారభావాన్ని పరిహరించారు. జాతిగత, వర్ణగత విభేదాన్ని గర్హించారు, నైతిక విలువలకు ప్రాముఖ్యం ఇచ్చారు. వారు ముఖ్యంగా దోహా, చౌపాయి, ఛందస్సులను, పాటలకు చర్యా పదాలను వాడారు. శాంతిరస ప్రధానాలయిన ఈ రచనలు, తరువాతి యుగంలో వచ్చిన సంత్ సాహిత్యాన్ని చాలా

ఎక్కువగా ప్రభావితం చేశాయి. 7 నుండి 14వ శతాబ్దం వరకుగల ఈ యుగంలోనే స్వయంభువు, సోమదత్తసూరి, సారంగధర్, నల్లాసింగ్ అనే జైనకవులు చరిత కావ్యాలను రచించారు. నైతిక ఆదర్శాల్ను ప్రచారం చేయడమేకాక ఈ రచనలు విస్తృతమైన ప్రకృతి వర్ణనలతో నిండిఉన్నాయి. వీరి రచనలలో శాంతరసం ప్రధాన తత్త్వంగా గోచరిస్తుంది. పౌమచరిఉ (పద్మచరిత), ఆదిపురాణము, మహాపురాణము మొదలయినవి జైన వాఙ్మయం పేర్కొనదగిన రచనలు.

*2. ప్రాంతీయ దేశభాషలో వ్రాయబడ్డ వీరకావ్యాలు:* ప్రాంతీయ దేశభాషలో వ్రాసిన వీరకావ్యాలు ఆదికాలంలో చెప్పుకోదగ్గ వాఙ్మయప్రక్రియ. చరిత్రదృష్ట్యా నిరంతరం కొనసాగిన మహమ్మదీయ ఆక్రమణలు, రాజపుత్రులలో అంతఃకలహాలు వీటితో ఈ యుగం సంక్షుభితమైంది. అందుచేత అనాటి కవులు ఆనాటి పోరాటాలకు కావ్యత్వం కల్పించడానికి మూలకారణం. ఆ యుగంలోని కవిత్వం ఆశ్రయదాతలను, ప్రసన్నులను కావించుకోవడానికి చేసిన ప్రయత్న పరిణామం కావడంతో, ఆ కావ్యాలలో చారిత్రక సత్యాలకంటే కల్పనా చాతుర్యానికే ఎక్కువ స్థానం లభించింది. చంద్‌బర్దాయి రచించిన పృథ్వీరాజ్‌రాసో, దలపత్ విజయ్ కృతమైన ఖుమాన్‌రాసో, నరపతి నాలవా రచించిన బీసల్‌దేవ్‌రాసో, జగనిక్ రచించిన పరమాల్‌రాసో ఈ యుగానికి చెందిన ప్రముఖ కావ్యాలు. ఈ రచనలు ఆనాటి యుద్ధాల సజీవ వర్ణనలతో నిండిఉన్నాయి. ఈ కావ్యాలలో ఉపయోగించిన భాష రాజస్థానుకు చెందిన సాహిత్యభాష.

*3. ఇతర కవులు :* అపభ్రంశ భాషా కవిత్వమూ, దేశభాషా గతమైన వీరకావ్యాలూ కాక కొంతమంది కవులు స్వతంత్రంగా కొన్ని కావ్యాలు వ్రాశారు. వారి కవిత్వంలో చెప్పుకోదగ్గ విషయవైవిధ్యం ఉంది. అమీర్‌ఖుస్రో రచించిన పొడుపు పద్యాలు, ముక్రీలు, విద్యాపతి రచించిన పదావళి, అబ్దుల్ రహమాన్ రచించిన సందేశరాసక్ అనే విరహకావ్యం ముఖ్యంగా పేర్కొనదగినవి.

ఆదికాలంలో బయలుదేరిన పై మూడు పోకడలతో కావ్యరచనా సౌందర్యందృష్ట్యా వీరకావ్యాలు చాలా ప్రధానస్థానం వహిస్తాయి. సిద్ధులు, నాథులు, జైనప్రముఖులు రచించిన కావ్యాలు మతప్రచార భావంతో నిండిఉన్నాయి. స్వేచ్ఛావృత్తితో రచించిన వారి రచనలు రాశినిబట్టి చూస్తే చాలా తక్కువగా ఉన్నాయి. అందుచేత అవి ఏ విధమైన పోకడలకు మార్గదర్శకం కాలేకపోయినాయి.

*4. భక్తికాలం :* 14 నుండి 17వ శతాబ్దం మధ్యకాలంలో ఆవిర్భవించిన సాహిత్యం భక్తికావ్యవర్గానికి చెందినది. ముస్లిం శాసకుల పూర్ణాధికారం ఏర్పడిన తరవాత హిందువులలో నిరాశా నిస్పృహలు అలముకొన్నాయి. అటువంటి సమయంలో కవులు ధార్మికావేశంతో నిరాశాపూరితాలయిన హృదయాలలో భక్తి, ప్రశాంత భావాలు నింపి తమ నైతిక బాధ్యతలను నిర్వర్తించారు. పరమాత్ముని పట్లగల భక్తిభావాన్ని పురస్కరించుకొని వీరిని నిర్గుణ కవులనీ, సగుణ కవులనీ రెండువర్గాలుగా విభజింపవచ్చును. సాధనామార్గంలో గల విభిన్నత కారణంగా నిర్గుణ కవులను మళ్ళీ రెండు ఉపవర్గాలుగా విభజింపవచ్చును.

పరమాత్ముణ్ణి పొందడానికై చేసే ప్రయత్నంలో జ్ఞానానికి ప్రాధాన్యం ఇచ్చేవారిని సంత్ కవులని అన్నారు. ఈ వర్గానికి చెందిన కవులలో కబీర్‌దాస్, గురునానక్, ధర్మదాస్, మలూక్‌దాస్, దాదూదయాల్, సుందర్‌దాస్ మొదలైనవారు ప్రముఖులు. తమ సాఖీలలోను, పదాల (పాటల) లోను వారు ఏకేశ్వరవాదాన్ని ప్రతిపాదించారు. సంప్రదాయ వాదాన్ని సమూలంగా ఖండించారు. కర్మకాండను, బాహ్య చిహ్నాలను నిరసించారు. ప్రపంచం అశాశ్వతమైంది అనే విషయం నొక్కి చెప్పారు. జ్ఞానమార్గానికి బదులుగా ప్రేమమార్గం ద్వారా పరమాత్ముణ్ణి పొందవచ్చుననే సిద్ధాంతాన్ని స్థాపించిన కవులను సూఫీ కవులన్నారు. జాయసీ, మంఝన్, కుతుబన్, ఉస్మాన్ మొదలైనవారు ఈ వర్గానికి చెందిన ప్రసిద్ధకవులు, భారతీయ ప్రేమాఖ్యానాలు ఆధారంగా ప్రబంధకావ్య ఫక్కీలో వీరు కావ్యాలు వ్రాశారు. వీటిల్లో జీవాత్మను ప్రేమికుడిగాను, పరమాత్మను ప్రియురాలిగాను చిత్రిస్తూ (పద్మావతి, మృగావతి, మధుమాలతి, చిత్రావతి) మొదలైన కావ్యాలు వ్రాశారు.

సగుణశాఖకు చెందిన కవులనుకూడా రామభక్తులని, కృష్ణభక్తులనీ విభజించారు. రామభక్త కవులలో తులసీదాసు అత్యంత ప్రసిద్ధుడు ఆయన రామచరితమానస్ అనే మహాకావ్యంలోను, గీతావలి, కవితావలి, వినయ పత్రిక మొదలయిన ఖండకావ్యాలలోను రాముణ్ణి ఒక ఆదర్శమానవుడిగాను, ధర్మమార్గాన స్థిరంగా నడిచేవానిగాను, సత్యం, సౌందర్యము. శక్తి ఈ త్రిగుణాల అపూర్వ సమ్మేళన మూర్తిగాను చిత్రించారు. అగ్రదాస్, నాభాదాస్, ప్రాణచంద్ చౌహాన్ మొదలయినవారుకూడ తమ రచనలతో ఈ శాఖను సంపన్నం చేశారు. కృష్ణభక్త కవులలో మహాకవి సూరదాస్, నందదాస్, పరమానంద దాస్, రసఖాన్, మీరా మొదలయినవారు, ప్రేమ, సౌందర్యాల అవతారాలమూర్తి అయిన శ్రీకృష్ణుని లీలలు మృదుమధురమయిన భాషలో వర్ణించారు. వారి కవిత్వతత్త్వం క్రమ క్రమంగా సంగీతాత్మక గేయాలలో ప్రకటితమయింది.

తులనాత్మక దృష్టితో చూస్తే ఈ కవులలో చిత్రమైన బేధం కనిపిస్తుంది. రామ భక్తిశాఖకు చెందిన కవులు శ్రీరాముణ్ణి ఆదర్శ శీలవంతునిగా చిత్రించి, భక్తిక్షేత్రంలో దాస భక్తిని అవలంబించారు. కృష్ణభక్తిశాఖకు చెందిన కవులు జానపద హృదయాల్లో నెలకొని ఉన్న లీలామయుడైన శ్రీకృష్ణుడిపట్ల ఆసక్తికలిగి మధురభక్తితో అతణ్ణి ఆరాధించారు.

కృష్ణ నాయక కావ్యాలు ప్రధానంగా సంగీత ముక్తకాలుగా వ్రజభాషలో వెలిశాయి. రామకావ్యాలు కథాకావ్యాలుగా అవధీభాషలోను వ్రాయబడ్డవి. ఇతివృత్తంలోగల ఆకర్షణ, సంగీతప్రాధాన్యత కారణంగా కృష్ణకావ్యం ఎక్కువ ప్రచారం, లోకాదరణ పొందింది.

కావ్యకళా సౌందర్యం దృష్టితో పరిశీలిస్తే భక్తికాలం హిందీ సాహిత్యంలో స్వర్ణ యుగం అని చెప్పవచ్చు. ఈ యుగానికి చెందిన చాలామంది కవులు పాండితీమండితులు కాక పోయినా, జీవితపు గంభీర అనుభవాలు ఆధారంగా తీవ్రమయి అప్రయత్న సిద్ధమైన అభి వ్యక్తికి పరిణామ స్వరూపమయిన అజరామర సాహిత్యం సృజించారు, సంత్‌కవుల సాఖీలు, పదాలు, జాయసీ రచించిన పద్మావతి, తులసీదాస కృతమయిన రామచరిత మానస్, సూర దాసు గీతాల సంకలనమయిన సూర్‌సాగర్— ఈ యుగంలోని మహత్తర కావ్యోత్కర్షకు

ప్రాతినిధ్యం వహిస్తాయి. వీనిలోగల జ్ఞాన, భక్తితత్త్వాల ఉదాత్త సందేశం, ఆనాటి సాంఘిక శీలానికి రూపుదిద్దడంలో గొప్పగా సహకరించింది.

*4. రీతికాలము :* భక్తికాలంలో కవులు సహజమైనటువంటి భావావేశం అనే సద్గుణం మూలంగా రాధాకృష్ణులను ఆలంబనగా గ్రహించి, పదాలు—పాటలు వ్రాశారు. ఆ తరువాత రీతికాలంలో రాధాకృష్ణుల ప్రేమగాథలన్న వర్ణనను నెపంగా తీసుకొని, తమలో ఉన్న శృంగారభావాన్ని ప్రకటించే కవులు బయలుదేరారు. తమ శృంగార ప్రకృతి వికాసోత్కర్షలకు అనుకూలమయిన సాంఘిక—రాజకీయ వాతావరణం వారికి లభించింది. ఈ కావ్యధార రెండు శతాబ్దాలపాటు అవిచ్ఛిన్నంగా సాగింది.

వర్ణ్యవిషయాన్ని బట్టి రీతికాలంలోని కవులను రీతిబద్ధ కవులు (లక్షణశాస్త్ర సంప్రదాయాలను అంటిపెట్టుకొని ఉన్నవారు), రీతిముక్త కవులు (లక్షణశాస్త్ర సంప్రదాయాలను పాటించనివారు) అని రెండువర్గాలుగా విభజింపవచ్చు. రీతిబద్ధ కవులు సంస్కృత లక్షణ గ్రంథాలు ఆధారంగా కవిశిక్షణకై లక్షణలక్ష్య ప్రధానాలయిన రచనలు చేశారు. రసం, అలంకారం, నాయికాభేదం, మొదలయిన విషయాల ప్రధాన తత్త్వాలను దోహాలలో నిర్వచించి, శృంగార సంబంధమైన భావాలతోనిండిన సవైయ్యా, కవిత్త అనే ఛందాలు ఉదాహరణలుగా రచించి, ఆచార్యులుగా పరిగణింపబడ్డారు. ఈ సంప్రదాయానికి చెందిన వారిలో కేశవ్, చింతామణి, మతిరామ్, దేవ్, కులపతి మిశ్ర, బిఖారీదాసులు అగ్రగణ్యులు, ఈ సంప్రదాయానికి చిందినవారిలో బీహారీదాసు కూడా ప్రముఖుడే కాని అతను లక్షణ నిర్వచనం చేయక, కేవలం విభిన్నరస, అలంకారాదులకు ఉదాహరణాలుగా స్వతంత్ర విధానంలో, దోహాలను రచించాడు.

రెండవ వర్గానికి చెందినవారు అనిబద్ధ కవులు. ఆలం, ఘనానంద్, బోధా, ఠాకూర్ మొదలయినవారు ఈ వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తారు. లక్షణశాస్త్ర సంప్రదాయాను సారంగా వ్రాయకుండా, ఈ కవులు అలంకారశాస్త్ర నిర్దిష్టమైన కవిత్వంపట్లకాక అయత్నజమైన, శృంగార భావాభివ్యక్తిపట్లనూ, దాని విభిన్న రూపాలమీదనూ తమదృష్టిని కేంద్రీకరించారు. ఆ కారణంగానే వారి రచనలు ఇతరుల రచనలకంటె ప్రభావోత్పాదకాలుగాను, చమత్కార జనకంగాను ఉన్నాయి.

పైన చెప్పిన రెండువర్గాలు కాక ఈ యుగంలో మరోరెండు కవితా సంప్రదాయాలు కూడా ఆవిర్భవించాయి. వృంద్, వైతాల్, గిరిధర్ మొదలయిన కవులు నీతిబోధ కాలమయిన ముక్తకాలు వ్రాశారు, ఒక రకమైన 'జాతీయభావం'తో ప్రేరితులై, భూషణ్, సూదన్, లాల్ మొదలయినవారు వీరకావ్యాలు రచించారు. కాని ఆ జాతీయభావం నేటి కాలపు అర్థంలో సమస్తజాతికి చెందినదికాక ఏదో ఒక రాజులేక ఏదో ఒక వర్గానికి విధేయతగా కనబడుతుంది. ఆ రకమయిన జాతీతాభావం వారి రచనలలో ఎక్కువగా కనిపిస్తుంది.

ఈ యుగంలో కవులు వ్రజభాషలో కవిత్వం వ్రాశారు. కవులకు ఎక్కువ అభిమాన పాత్రాలయిన ఛందస్సులు దోహా, కవిత్త, సవైయ్యా మొదలయినవి. కావ్యం

యొక్క బాహ్యస్వరూప నిర్మాణంలో అభివృద్ధి, భావాభివ్యక్తిలో నైపుణ్యం ఈ యుగం యొక్క ముఖ్య ధర్మాలు,

## ఆధునిక యుగము

భారతదేశ చరిత్రలో ఆధునిక యుగం క్రీ. శ. 1857 తో ప్రారంభమవుతుంది. ఇదే సమయంలో ఆధునిక భారతీయ సాహిత్యోదయం కూడా జరిగిందని గుర్తించవచ్చు. ఆధునిక హిందీ సాహిత్యాన్ని వాఙ్మయ చరిత్రకారులు నాలుగు దశలుగా విభజించారు. మొదటి 11 సంవత్సరాలు సంధియుగంగా రాబోతున్న యుగానికి నాందిగా చెప్పుకోవచ్చు. 1. భారతేందు యుగం లేక పునరుజ్జీవన యుగం (క్రీ. శ. 1868—1893) 2. ద్వివేదీయుగం (క్రీ. శ. 1893-1918) 3. ఛాయావాద యుగం (1918-1937) 4. సమకాలీనయుగం (1937 నుండి ...... ....)

ఉత్తర మధ్య (రీతి) కాలంలో హిందీ కవిత్వం నిత్య జీవనరంగంతో సంబంధం లేకుండా పోయి, విలాసవస్తువుగా మారిపోయింది. సమస్త హిందీభాషా ప్రాంతంలో పునరుజ్జీవనోద్యమానికి వైతాళికుడైన భారతేందు హరిశ్చంద్ర (1849-1882) ఈ విషయాన్ని గుర్తించాడు. 'కామదేవుని అంతఃపుర ప్రాకారాల నుంచి ఆధునికహిందీ కవిత్వానికి విముక్తి' కల్పించాడు, సాంఘిక రాజకీయ జీవితపు వెలుగులోకి తీసుకొనివచ్చాడు. ఆయన హిందీ సాహిత్యానికి ఆధునిక దృక్పథం కల్పించాడు. అందుచేత ఆయనను హిందీ సాహిత్యానికి 'జనకుడని' అంటారు. ఈ పద్ధతిని తరవాత మహావీర్ ప్రసాద్ ద్వివేదీ కొనసాగించాడు. ద్వివేదీప్రకృతి సిద్ధంగాను, ఆచరణలోను సంస్కర్త. అతను చాలా జాగ్రత్తగా వర్ణ్య విషయంలోను, కవిత్వపు భాషలోను సంస్కరణలు తేవడానికి ప్రయత్నించాడు. దాని పరిణామ స్వరూపంగా హిందీ కవిత్వం అవసరానికంటె ఎక్కువైన నైతిక విలువలను అపాదించుకున్నది. భాష స్వచ్ఛమై, శుద్ధమైన ప్రామాణిక రూపాన్ని పొందింది. ద్వివేది వ్రజభాషకు ఖడీబోలికి చిరకాలంగా ఉంటూ వస్తున్న వైరుధ్యాన్ని, ఆనాడు పద్య రచనకు వాడిన భాషకుమధ్యగల అస్వాభావిక భేదాన్ని కూకటివేళ్ళతో అంతమొందించాడు. భావాభివ్యక్తిలో ఇలాంటి భేదం చిరకాలంగా ఉండడం నిజంగా అసహజం. ద్వివేది నిర్ణయం ఆధునిక సాహిత్య వికాసానికి మంచి అవకాశాన్ని కల్పించింది. కవిత్వానికి సంబంధించిన ఆనాటి ఆదర్శాలు ప్రముఖులైన ఇద్దరు కవుల-హరిఔధ్ (అయోధ్యసింగ్. ఉపాధ్యాయ), మైథిలీ శరణగుప్త - రచనలలో సంపూర్ణంగా అభివ్యక్తమైనవి. శ్రీధర్, పాఠక్, రామనరేశ్ త్రిపాఠి ఆ యుగానికి చెందినవారిలో పేర్కొన దగినవారు. నిజానికి అది పునరుద్ధరణ యుగం. ఆధునిక జీవితాన్ని సుసంపన్నం చేసే ఉద్దేశ్యంతో ప్రాచీన భారతీయ సంస్కృతి అద్వితీయ మహిమా వైభవాలు చిత్రించబడ్డాయి. సాంఘిక, రాజకీయ, ఆర్థిక సమస్యలు కవిత్వంలో ప్రత్యక్షంగా ప్రతిబింబించాయి. ప్రతి గళము నుండి సాంఘిక జాగరణతో నిండిన పాటలు మార్మోగాయి.

పైన చెప్పిన తత్త్వాల సమాహార ప్రభావం వలన జాతీయ సాంస్కృతిక కవిత్వమనే ప్రబలమయిన పోకడ ఆవిర్భవించింది. ఇది స్వతంత్ర భారతంలో ఇతోధికమైన

వేగాన్ని పుంజుకొంది. ఈ పోకడకు ప్రాతినిధ్యం వహించే కవులలో మాఖన్‌లాల్ చతుర్వేది, బాలకృష్ణ శర్మ, నవీన్, సియారామ్ శరణ్‌గుప్త, దినకర్ ప్రముఖులు. కాని ఇది ఆ కవితావిధానంలో ఒక అంశం మాత్రమే. ఈ కవితాధార జీవితంలో నైతిక దృక్పథానికి మితిమీరిన ప్రాధాన్యం ఇవ్వడంతో ప్రేమోత్కంఠ, గాఢ ఆత్మాభివ్యక్తి, సౌందర్యానుభూతికి చెందిన అభివ్యక్తికి స్థానం లేకుండా పోయింది. దీనికి ప్రతిక్రియ జరగడం స్వాభావికమే. ఈ సూక్ష్మానుభూతులు చిట్టచివరకు ఛాయావాదంలో ప్రతిబింబించాయి. దీనికి మూలం ప్రసాద్ ప్రారంభిక రచనలు. ఆ తరవాత ఛాయావాదం నిరాలా (సూర్యకాంత్ త్రిపాఠి), పంత్ (సుమిత్రానందన్), శ్రీమతి మహాదేవి వర్మ రచనలలో చక్కని అభివ్యక్తి పొందింది. వీరందరు కూడా ప్రముఖులయిన కవులు. వారి మహోత్కృష్టమయిన రచనలలో అభివ్యక్తికి యోగ్యమయిన అనుభూతులు, కావ్యగత సౌందర్యం చాలా గొప్పగా అభివృద్ధి చెందాయి. ఛాయా వాదానికి సంబంధించిన మహత్తర కావ్యం కామాయని. మానవుని మానసిక వికాసాన్ని చిత్రించే ఈ మహాకావ్యం లేక మానవ సభ్యతా పురోగమనాన్ని సూచించే ఈ మహత్తర రూపకం ఆధునిక భారతీయ కావ్య సాహిత్యంలో ఒక మైలు రాయి వంటిది.

కామాయని ప్రచురింపబడిన కొద్దికాలానికే ప్రసాదు మరణించాడు (1937-38). దాంతో ఛాయావాద ఉద్యమ క్షీణదశ ప్రారంభమయింది. రమణీయమయిన ఆత్మాభిస్పందన నిర్జీవమయిన వేదాంతభారంతో కృంగిపోయింది. కనుక ఈ పోకడకు తీవ్రమయిన ప్రతిక్రియ ఏర్పడింది. ఆ సమయంలో గాంధేయ సిద్ధాంతాలకు వ్యతిరేకంగా భారతీయ రాజకీయ క్షేత్రంలో వామపక్ష శక్తులు సన్నద్ధమయినయి. వామపక్ష సిద్ధాంతాలు, ఆదర్శాలు హిందీ కవిత్వంలో రెండు విభిన్నమయిన పోకడలలో అభివ్యక్తి పొందినయి. ఒకదాన్ని ప్రగతి వాదం (అభ్యుదయ వాదం) అని అన్నారు. ఇది సామాన్యవర్గానికి చెందిన ప్రజాకవిత్వం మార్క్సు సిద్ధాంతాల వలన ప్రేరణ పొందిన ఈ కవిత్వం సాంఘిక యథార్థవాద సిద్ధాంతాలకు కళాత్మక రూపం ఇవ్వడానికి తీవ్రమయిన ప్రయత్నం చేసింది. రెండవది ఈ మొరటు సాంఘిక చైతన్యపు వెల్లువనుండి కళాకారుని స్వాతంత్ర్యాన్ని పరిరక్షించడానికి కంకణం కట్టి, అత్యాధునిక భావానుభూతులను ప్రతిబింబింప చేయడానికై కావ్యవస్తువులోను, శైలిలోను వినూత్నమైన ప్రయోగాలు చేసింది. ప్రారంభంలో ప్రయోగ వాదమని పేరుకలిగి, ప్రస్తుతం ''నయీ కవిత'' అని చెప్పబడే ఈ కావ్యధార నేడు ఉచ్ఛదశలో ఉంది. ప్రగతివాద కావ్యోద్యమానికి అగ్రగామి సుమిత్రానందన్ పంత్. ఆ తరవాత నిరాలా కూడా ప్రగతివాద కావ్యంలో మేటి అయినాడు. కొంతమంది యువకవులు నరేంద్రశర్మ, అంచల్, సుమన్ మున్నగువారు కూడా ప్రగతివాద రచనలు చేశారు. రెండవ పోకడకు ప్రాతినిధ్యం వహించే వారిలో అజ్ఞేయ, గిరిజాకుమార్, మాథుర్, ధర్మవీర్ భారతి ప్రముఖులు. ఈ రెండు కావ్య ధారలకు సమాంతరంగా వ్యక్తిగత గీతాలకు సంబంధించిన మూడవ కావ్యధార కూడా ఉద్భవించింది. సాంఘిక లేక సాహిత్య సిద్ధాంతాలను ఏ మాత్రం లక్ష్యం చేయక, వ్యక్తిగత జీవాత్మకు సంబంధించిన సుఖదుఃఖాలు, ఆశలు-నిరాశలు మొదలయిన భావాల స్వచ్ఛందమైన, అయత్నజమైన అభివ్యక్తిని ఈ కావ్యధార తన లక్ష్యంగా చేసుకొంది. ఈ వర్గానికి చెందిన వారిలో బచ్చన్ ప్రముఖుడు. పరస్పరం విరుద్ధాలయిన ఆధునిక ఆదర్శాల - సిద్ధాంతాల

గడబిడలో, ఇతోధికమైన ప్రబలత్వంలో, జీవన, చింతన క్షేత్రాలకు సంబంధించిన గాంధేయ మార్గాలు మళ్ళీ ఉజ్వలంగా ప్రకాశించాయి. సియారామ్‌శరణ్ గుప్త కావ్యరచనలలో ఈ సిద్ధాంతాలకు చెప్పుకోదగ్గ భావాభివ్యక్తి కనిపిస్తుంది. మరోవైపు అరవిందుని లోకాతీత అంతరంగికానుభూతి అనే తత్త్వం, ఆధారంగా పంత్ యొక్క అర్వాచీన రచనలలో, స్వర్ణ కిరణ్, అతిమా మొదలయినవి—ఛాయావాదం క్రొంగొత్త పుంతలు త్రొక్కింది, ఆనాటి అద్భుతశక్తి లేకపోయినా, పైన చెప్పిన కావ్యప్రక్రియలు అన్ని కూడా నేటికి ఏదో ఒక రూపంలో సజీవంగా ఉన్నాయి. నయీకవితాక్షేత్రంలో, ఇతర కావ్యధారలతో పోల్చిచూస్తే, చురుకుదనం పాలు ఎక్కువగా కనపడ్డా, మొత్తంమీద చూస్తే అంతకు ముందు ఉన్న కావ్యోద్యమాలు తక్కువ ప్రాధాన్యం వహించి ఉండలేదు.

ఈ విధంగా హిందీ కావ్య సాహిత్య చరిత్ర దాదాపు వేయి సంవత్సరాల కాల పరిమితి కలిగిఉంది. పరిమాణం. గుణం. రెంటి దృష్ట్యా కేవలం భారతదేశంలోనే కాక ప్రపంచంలో ఏ వికసిత భాషతోనైనా అది సరితూగి గలుగుతుంది.

## హిందీ గద్య వికాసము

ఆధునిక యుగంలో ఖడీబోలి ద్వారా హిందీ గద్య రచన నేటిస్థాయికి చేరుకున్నది. అయితే స్థిరమైన రూపం లేకపోయినప్పటికి ఇంతకు పూర్వమే రాజస్థాని, వ్రజభాష. ఖడీబోలీలో గద్యరచనా సంప్రదాయం ఉండేది. 12-15 శతాబ్దులమధ్యకాలంలో దాన పత్రాలు, శిలాశాసనాలు, రాజ శాసనాలు మొదలయిన వాటిలో రాజస్థానీభాష విరివిగా వాడబడటం కన్పిస్తుంది. ఆ యుగపు గద్యరచనా శైలిపై మొదట్లో సంస్కృతం, ఆతరువాత అపభ్రంశం, వ్రజభాషల ప్రభావం సులభంగా కనపడుతుంది. ప్రారంభ దశలో హిందీ గద్య వికాసంలో వ్రజభాష ప్రధానపాత్ర వహించింది, 15-16 శతాబ్దాలలో గోస్వామి విఠల్‌నాథ్ కృతమైన కొన్ని సంక్షిప్త గద్యరచనలు, అంతకుముందు కాలానికి చెందిన గురుగోరఖ్‌నాథ్ గద్య రచనలు లభిస్తున్నాయి. కాని వారి గద్యశైలి చాల అస్తవ్యస్తంగా ఉంది. 17 వ శతాబ్దంలో గోస్వామి గోకులనాథ్, గోస్వామి హరిరాయ్ అనువారలు వార్తాసాహిత్యరచన చేసి వ్రజభాషా గద్య వికాసానికి తోడ్పడ్డారు. కాని అడపాదడపా కనిపించే ఈ రచనా సంప్రదాయం అవిచ్ఛిన్నంగా కొనసాగిందనికాని, ఆయా గద్యశైలులు స్థిరత్వం, నాణ్యత, శుద్ధత కలిగి ఉన్నవని చెప్పడానికి అధారాలు అని కాని చెప్పడానికి వీలులేదు

ఈ చారిత్రిక సత్యం ఆధారంగా నిజానికి హిందీ గద్య వికాసం ఖడీబోలి ఉద్భవ వికాసాలను అనుసరించి ఉన్నదని చెప్పవచ్చు. భారతేందు యుగానికి పూర్వమే గద్యరచనలు చేసినవారిలో రామ్‌ప్రసాద్ నిరంజని, సదాసుఖలాల్, ఇన్షాఅల్లాఖాన్, లల్లూలాల్, సదల్ మిశ్రలు ప్రముఖులు. వీరు పౌరాణిక కథలపై ఆధారపడిన రచనలూ, కృష్ణుని రమణీయ క్రీడా కలాపాలు కాల్పనిక ప్రేమగాథలు రచించారు. ఈ రచనలలో గద్యశైలి ప్రాదుర్భావాన్ని గుర్తించవచ్చు. ఇన్షాఅల్లాఖాన్ ఆదర్శప్రాయమైన ఖడీబోలీ ప్రయోగాన్ని సమర్థిస్తే. మిగతావారు రచనాశైలిలో సంస్కృత-, వ్రజభాషల వలన ప్రభావితులయ్యారు శైలి దృష్టితో పరిశీలిస్తే వీరి రచనలలో విస్తృతంగా వర్ణనలు; వివరాలు ఇచ్చే సంప్రదాయం

అక్కడక్కడా తీవ్రభావోద్వేగం గమనించవచ్చు. రాజా లక్ష్మణసింగు భాషవచన కవిత్వపు స్వాభావిక మాధుర్యాన్ని ఇమిడించుకొని ఉంది.

హిందీ గద్య రచనలోని శైలీభేధాలు 1868లో భారతేందు యుగంలో ప్రారంభమైనవని చెప్పవచ్చు. ఆ తరవాత గద్యవికాసాన్ని అధ్యయన సౌకర్యం కోసం మూడు దశలుగా విభజింపవచ్చు. 1. ప్రథమ దశ (1868 1918) 2. వికాసదశ (1918-1937) 3. నేటి ఉత్తమ దశ (1937 తరవాత).

*ప్రథమ దశ* : భారతేందు యుగంలోను, ద్వివదీ యుగంలోను వ్రాసిన గద్యసాహిత్యం ప్రథమదశకు చెందినది. ఈ దశలో రచయితలు నాటకం, నవల, కథానిక వ్యాసరచన, సాహిత్య విమర్శ మొదలయిన సాహిత్యాంగాల వికాసానికి తోడ్పడ్డారు. నాటకరచనకు తోడ్పడ్డవారిలో ప్రముఖులు భారతేందు హరిశ్చంద్ర, బాలకృష్ణభట్, రాధాకృష్ణదాస్. నైతికదృష్టితో సాంఘిక నాటకాలు, చరిత్ర ఆధారంగా దేశభక్తి పూరిత నాటకాలు. చరిత్ర ఆధారంగా దేశభక్తి పూరిత నాటకాలు వ్రాసినా, వారి నాటకాల్లో సాధారణంగా సమకాలీ సాంఘిక పరిస్థితుల పట్ల వ్యంగ్యం వ్యంజితమవుతుంది సంస్కృతం, బెంగాలీ, ఆంగ్ల భాషల నుండి అనువాదాలు కూడా చేశారు. కాని భారతేందు తరవాత యుగానికి చెందిన రచనంలో ప్రౌఢ నాటక రచనాశైలికి ఎటువంటి ఆస్కారం కనిపించలేదు. నవలారచనలో కూడా దాదాపు ఇదే పరిస్థితి కనిపిస్తుంది. ఈ రంగంలో చెప్పుకోదగ్గవారు శ్రీనివాసదాస్, కిశోరీలాల్ గోస్వామి, దేవకీనందన్ ఖత్రీ మొదలయినవారు. వారు యథార్థజీవిత చిత్రణకంటె ఎక్కువగా సంప్రదాయ బద్ధ ఆదర్శాల ప్రత్యక్ష చిత్రీకరణ పట్లనే మొగ్గుచూపారు. వ్యక్తిశీల చిత్రణకంటె సంశ్లిష్ట సన్నివేశాలు సృష్టించడం పట్ల ఎక్కువ అభిరుచి చూపారు. సంభాషణలకంటె వర్ణన, వివరణలు ప్రాధాన్యం వహించాయి. వారు కవిత్వమయ భాషకూడా ధారాళంగా వాడారు. ఈ సమయంలోనే జయశంకర్ ప్రసాద్ తన మొదటి కథ రచించినప్పటికీ, ఈ దశకు ప్రాతినిధ్యం వహించే కథారచయిత చంద్రధర్‌శర్మ గులేరీ. పౌరాణిక, చారిత్రిక, అపరాధ పరిశోధక ఇతివృత్తాలు గల కథలు ధారాళంగా వ్రాయబడినప్పటికీ, ఈ దశలో సాంఘిక ఇతివృత్తాలే ప్రాధాన్యం వహించాయి. ఈ సమయంలోనే నిర్దుష్టమయిన గద్యరచనా శైలిగా వ్యాసం కూడా ఆవిర్భవించింది. ప్రారంభదశలో వ్యాసరచనా రంగంలో బాలకృష్ణభట్, ప్రతాప్ నారాయణ్ మిశ్ర, మహవీర్ ప్రసాద్ ద్వివేది, అధ్యాపక్ పూర్ణ సింహ చెప్పుకోదగ్గ కృషి చేశారు. వారి వ్యాసాలు ఎక్కువగా సాంఘిక విషయాలమీద ఆధారపడినవే. మనోజ్ఞమైన రచనలనుండి వ్యంగ్య ప్రధానమైన భావాలననుసరించి శైలీ, విషయ వైవిధ్యాన్ననుసరించి వర్ణనా విధానమూ మారుతుండేవి. ఈ యుగానికి చెందిన చాలామంది వ్యాస రచయితలు విమర్శాత్మక వ్యాసాలు కూడా వ్రాశారు. వీనిలో సంప్రదాయ బద్ధమైన విలువలు ఆధారంగా వస్తుప్రధానమైన పరిశీలనకు ప్రాముఖ్యం ఇవ్వబడింది ప్రథమ దశకు చెందిన విమర్శకులలో పద్మసింహశర్మ, మిశ్రబంధు, శ్యామసుందర్‌దాసులు ప్రముఖులు. ఈ యుగానికి చెందిన విమర్శకులు సైద్ధాంతికమైన, ప్రయోగాత్మకమైన పద్ధతులు వాడినా, సాహిత్యాత్మను సమీపించలేకపోయారు.

పరిమాణం, వైవిధ్యం, రెండింటి దృష్ట్యా వాస్తవికంగా గద్య వికాసానికి తగిన భూమిక ఏర్పడిందని ఈ యుగపు గద్యరచనలలోను మొత్తంమీద పరిశీలిస్తే తెలుస్తుంది. ప్రారంభ దశలోని రచనలలో నాజూకుదనం లేదుకాని కాలక్రమేణా విషయవైవిధ్యం పెరగడంతో గద్యశైలి సుసంస్కృతమైంది, లయబద్ధమైన వాక్య నిర్మాణం, వ్రజభాషా ప్రభావం, వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు, గ్రామ్య ప్రయోగాలు మొదలైన అవరోధాలను భాష కాలక్రమేణ అతిక్రమించింది.

*వికాస దశ :* ఈ దశకు ప్రాతినిధ్యం వహించిన రచయితలలో జయశంకర్ ప్రసాద్, రాయ కృష్ణదాస్, మాఖన్‌లాల్ చతుర్వేది, శ్రీమతి మహాదేవివర్మ మొదలైనవారు. ఈ మధ్యకాలంలో జనాదరణ పొందిన హిందీగద్యం కూడా శీఘ్రగతిని వికాసం పొందింది, ఈ దశలో గణనీయమైన కృషి చేసినవారు ప్రేంచంద్, సుదర్శన్, బృందావన్ లాల్‌వర్మ మొదలయినవారు ఆయనకు చక్కగా తోడ్పడ్డారు.

ఈ వికాసకాలంలో నాటక సాహిత్యం సముచితమైన గౌరవాన్ని పొందింది. కాని దినదిన ప్రవర్ధమానమవుతున్న అవసరాలకు తగినట్లుగా రంగస్థలం అభివృద్ధి చెందలేదు. ఈ యుగంలో జయశంకర్ ప్రసాద్ ప్రముఖ నాటక రచయిత. భారతీయ సంస్కృతి పునరాఖ్యానం చేసేదృష్టితో ప్రేరితుడై జయశంకర్ ప్రసాద్ విజయవంతాలయిన చారిత్ర నాటకాలు రచించాడు. సేఠ్‌గోవిందదాస్, ఉదయ శంకర్ భట్ మొదలైనవారు ఈ ప్రక్రియకు ప్రాతినిధ్యం వహించిన వారు. ఈ దశలోనే సమస్యానాటకాలు ఆవిర్భవించాయి. లక్ష్మీనారాయణ మిశ్ర నాటకాలలో ఈ ప్రక్రియ ప్రౌఢవికాసం పొందింది. ఈ మధ్యకాలంలోనే రామకుమార్ వర్మ, భువనేశ్వర్, అష్క్ మొదలైనవారు ఏకాంకికను అభివృద్ధి చేశారు. ఈ యుగంలో కథాసాహిత్యం క్రొంగొత్త పరిమాణాలను పొందింది, నవల, కథానిక జీవిత గంభీర యథార్థ విషయాలకు సమీపంగా వచ్చాయి. కథాశిల్పంలో మనోవిశ్లేషణకు తగినస్థానం లభించింది, ఈ రంగంలో ప్రేంచంద్ అతి ప్రముఖుడైన రచయిత అయినా జయశంకర్ ప్రసాద్, చతురసేన్ శాస్త్రి, జైనేంద్ర కుమార్, యశపాల్ కూడా సమకాలీన కథాసాహిత్యాన్ని సుసంపన్నం చేయడానికి చెప్పుకొదగ్గ రచనలు చేశారు. ప్రథమదశలోని ఉత్తరభాగంలో కళాత్మకమైన, వైయక్తికమైన వ్యాసాలు అంతగా కనపడవు కాని ఈ యుగంలో మళ్ళీ అవి ఆవిర్భవించాయి. హిందీ విమర్శాసాహిత్యంలో గంభీరతా, సూక్ష్మ అంతర్‌దృష్టి ప్రవేశించాయి. ఈయుగంలో ఉత్తమ వ్యాసరచయిత, ప్రముఖ విమర్శకుడు అయిన ఆచార్య రామచంద్రశుక్ల నిజంగా యుగ నిర్మాత అయిన సాహిత్య పురుషుడు. ఉత్తమదశ: 1947 లో లభించిన స్వాతంత్ర్యం కేవలం రాజకీయమైందే కాదు. తద్వారా ఏర్పడిన పరిస్థితులు సాహిత్యపురోగమనానికి కూడా చాలా ప్రభావపూర్ణంగా సహకరించాయి. ఆధునిక నాటక రచన రంగస్థలానికి చాలా సమీపంగా వచ్చింది. సమకాలీన జీవిత యదార్థ చిత్రణకు ఎక్కువప్రాధాన్యం లభించింది. గేయనాటికలు రేడియోనాటికలు, మొదలైన క్రొత్త రచనారూపాలు ప్రచారంలోకి వచ్చాయి. రచనకు, అభినయానికి మధ్యగల భేదంమెల్ల మెల్లగా అంతరించిపోతున్నది. నాటకసృష్టికి, వాటి విలువలు నిర్ణయించడానికై జరిగే అన్వేషణలో ఉత్తమమైన ఫలితాలు లభిస్తున్నాయి. అష్క్,

జగదీశ్‌చంద్ర మాథుర్, మోహన్‌రాకేశ్, లక్ష్మీనారాయణలాల్ ఆధునిక నాటకరచయితలలో ప్రముఖులు.

ఈ యుగంలో కథాసాహిత్యం ఇంకా ఎక్కువ పురోభివృద్ధిని సాధించింది. కథా నిర్మాణంలో యథార్థవాదం ముఖ్యపాత్ర వహించింది. సూక్ష్మాతి సూక్ష్మమయిన సమకాలీన విషయాల చిత్రణం జరిగింది, సృజనాత్మకతకు తగినటువంటి వాతావరణానికై మాండలిక తత్వాల ప్రయోగం కూడా జరిగింది. పాత్రల శీల నిరూపణకై అత్యాధునిక మనో విశ్లేష ణాత్మక శిల్పప్రయోగం జరిగింది. గద్యశైలిలో ఒక విధమైన నూతనత్వం సంపాదించడం కోసం ప్రయత్నం చేయబడ్డది. జైనేంద్రకుమార్, యశపాల్, అజ్ఞేయ, అమృతలాల్‌నాగర్, రేణు (ఫణీశ్వర్‌నాథ్) మొదలైనవారికి ఆధునిక కథాసాహిత్య వికాసంఎంతో ఋణపడివున్నది.

ఇతర గద్య ప్రక్రియలవలెనే వ్యాసమూ, విమర్శ కూడా శీఘ్రగతిని అనేక దిశలలో వికసించినాయి. వ్యాస రచయితలు ఉత్తమలేఖలు, సంస్మృతులు, స్కెచ్‌లు, రిపోర్టులు, ఇంటర్‌వ్యూలు మొదలైన వానిలో అభివ్యక్తికి క్రొత్తమార్గాలు కనుగొన్నారు. హిందీ గద్య శైలిలో గల సూక్ష్మ విభేదాలు హజరీ ప్రసాద్ ద్వివేది, జైనేంద్ర కుమార్, మహాదేవివర్మ, సియారామ్‌శరణ్‌గుప్త మొదలయిన వారి రచనలలో కనిపిస్తాయి. నేటి అవసరాల దృష్ట్యా వివిధ విజ్ఞాన సంబంధమైన సాహిత్యం కూడా బాగా అభివృద్ధిచెందింది. అనేక శాఖలకు చెంది నటువంటి పరామర్శ గ్రంథాలు ప్రతి సంవత్సరమూ వెలువడుతున్నాయి. ఈ రంగంలో కాశీ నాగరీ ప్రచారిణీ సభ ప్రశంసనీయమైన కృషిచేసింది.

హిందీ గద్యచరిత్ర అంత విస్తృతమైనది కాక పోవచ్చు కాని దాని పురోగతి మాత్రం శీఘ్రతరం. అది చాలా ఆలస్యంగా యాత్ర ప్రారంభించినా, లక్ష్యాన్ని చేరుకోవ డంలో మాత్రం ఎక్కువ కాలహరణం చేయలేదు.

**భారతేందు హరిశ్చంద్ర**

## భారత దుర్దశ (నాటకం నుండి)

అయ్యో ! భారతదేశం ఎటువంటి మహామోహ నిద్రలో మునిగిపోయిందో కదా ! ఈ మోహనిద్ర నుండి మేల్కొనే ఆశ కూడా కనిపించడం లేదే ! నిజమే, నిద్ర లేవదలచు కొనని వారిని ఎవరు లేపగలుగుతారు ? అయ్యో దైవమా ! నీ లీలలు ఎంత విచిత్రాలయ్యా ! నిన్నటి దాకా రాజ్యం చేసిన వారికి, ఈనాడు చెప్పులు కుట్టించు కోవడానికి చేత రాగి డబ్బు లేదు. నిన్నటిదాకా అంబారీల మీద విహరించిన వారు, నేడు కాళ్ళకు చెప్పులు కూడా కరవై అడవుల పాలైనారు. నిన్నటిదాకా పిల్లల కోలాహలంతో నిండిన ఇండ్లు కలవారిని ఈనాడు స్మరించే వారు లేరు. వారికి గ్లాసెడు మంచి నీళ్ల ఇచ్చేవారైనా లేరు. నిన్నటిదాకా ధన ధాన్యాలతో కలకల లాడిన ఇండ్లలో ఈనాడు దీపం పెట్టేవారు కూడా లేకుండా చేశావు కదయ్యా !

అయ్యో ! వ్యాసుడు, వాల్మీకి, కాళిదాసు, పాణిని, శాక్యసింహుడు, బాణభట్టు మొదలగు వారిని బట్టి ఈ నాటికీ గౌరవింపబడుతున్న భారతదేశానికా ఈ దుర్దశ! చంద్రగుప్త అశోకాది రాజన్యుల పరిపాలన చేత సువిఖ్యాతమైన భారతదేశానికా ఈ దుర్గతి ! రాముడు, యుధిష్ఠిరుడు, నలుడు, హరిశ్చంద్రుడు, రంతిదేవుడు, శిబి మొదలగు పుణ్యాత్ములు నివసించిన దేశానికా ఈదశ ! అయ్యో ! భారతీయ సోదరుడా ! లేవవయ్యా. చూడూ, విద్యా మార్తాండుడు పశ్చిమాద్రిన ఉదయించాడు. నిద్రపోతూ ఉండడానికి ఇది సమయం కాదు. ఇంగ్లీషు వారి ప్రభుత్వం ఏర్పడ్డాక కూడా మేలుకోక పోతే ఇంకెప్పుడు మేలుకుంటావయ్యా ? మూర్ఖులు విచ్చల విడిగా రాజ్యం చేసిన రోజులు గతించిపోయినాయి. ప్రస్తుతం రాజు ప్రజల అధికారాన్ని గుర్తించాడు. విద్యావ్యాసంగం వ్యాపిస్తున్నది. ప్రతి వారికి అన్ని విషయాలను గురించి మాటాడడానికి, వినడానికి అధికారం లభించింది. దేశదేశాలనుండి కొత్తకొత్త విద్యలు, కళలు మనదేశంలో ప్రవేశించినాయి. ఇంత జరిగినా ఇప్పటికీ నీవు ఆ పాతవిషయాలు, ఆ భంగుమంత్రాలు, పల్లెపదాలు, బాల్యవివాహాలు, భూతప్రేత పూజావిధానం, జాతకఫలాల మీద గుడ్డినమ్మకము, దొరికినంతలో తృప్తి, గప్పాలు కొట్టడంలో అభిరుచి .....దరిద్రగొట్టు పాత అలవాట్లు విడిచి పెట్టలేకుండా ఉన్నావు. అయ్యో ! ఈ నాటికీ భారతదేశం ఈ దుర్గతి లోనే పడి ఉండాలా ? చితిమీద కెక్కించిన తరవాత గాని మేలుకువరాదా ? భారత సోదరా ? లే, చూడు. ఈ యాతనలు భరించడానికి వీలులేకుండా ఉందయ్యా. ఎన్నాళ్ళు ఈ మోహంలో పడి వుంటావయ్యా ? నీ సంతానం నశించి పోతున్నది. ఐకమత్యం లేక అందరూ నరక యాతనలు అనుభవిస్తున్నారు ఇంత దుర్గతిలో ఉన్నా ఇంకా లేవరా ? అయ్యో ! ఇహ ఈ దుర్గతిని నేను చూడలేనయ్యా . ఇంకనైనాలేవండయ్యా.

## మహావీర్ ప్రసాద్ ద్వివేది

## ఊర్మిళపై కవుల ఔదాసీన్యం

అయ్యో ! వాల్మీకి ! ఊర్మిళ పట్ల ఇంత ఔదాసీన్యం ఎందుకు చూపించినావయ్యా ? ఒక్కసారి జనకపురిలో వైవాహిక వస్త్రాలతో ఊర్మిళను చూపించినావు. ఆ తరవాత ఆమెను గురించి పూర్తిగా మర్చిపోయినావు. అయోధ్యకు వచ్చిన తరువాత అత్తవారింట్లో ఉండగా ఆమెను గురించి వర్ణించక పోతే మానే. భర్త లక్ష్మణుడు అమెను విడిచిపెట్టి అడవులకు వెళ్ళి పోతుండగా అమె దుఃఖాశ్రువులు తుడవడం నీకు సముచిత మనిపించలేదా ? రామచంద్రుని పట్టాభిషిక్తుని చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నప్పుడు నవలామణి అయిన ఊర్మిళ ఎంతగా ఉప్పొంగి పోయిందో నీవు గమనించలేదా ? తన భర్త పరమ ఆరాధ్యుడైన రాముడు రాజ సింహాసనా సీనుడు కాబోతున్నప్పుడు ఊర్మిళకు ఎంత అనందం కలిగి ఉంటుంది ? అమె మనో దశను గురించి నీవు ఆలోచించక పోవడం ఆశ్చర్యకరం కదా ! అయ్యో ! ఒక్క మకియ తరవాత సీతారాములతో తనభర్త 14 సంవత్సరాలు పాటు అడవులకు పోతుంటే ఆ ఊర్మిళ ఛిన్న మూలమయిన లత వలె రాజసదనంలో ఒక మూల గదిలో భూమి మీద పడి పొర్లాడుతూ ఉండడం నీవు గమనించనే లేదే ! ఆ ఊర్మిళపట్ల వచన దరిద్రతనే వహించావే !

ఊర్మిళ వైదేహికి అనుంగు సోదరి. ఆమెకు పతివియోగం కాక సోదరీ వియోగం కూడా సహించవలసి వచ్చింది. పాపం ఇంతగా దుఃఖాక్రాంతురాలయిన ఆమెపట్ల నీవు అణుమాత్రం కూడా దయచూపించలేదు. అడవులకు వెడుతుండగా ఒక్కసారి కండ్లారా లక్ష్మణుణ్ణి చూడను కూడా చూడనివ్వలేదు. రామలక్ష్మణులు సీతాదేవితో పాటు అడవులకు వెడుతూ, తమ పురత్యాగం వలన అయోధ్యా నగరాన్ని అంధకారంతోనూ, నగర ప్రజలను దుఃఖసాగరంలోనూ, తండ్రిని మృత్యు ముఖంలోనూ ముంచి తేల్చిన ఆరోజున కూడా నీకు ఊర్మిళ జ్ఞాపకానికి రాలేదు, ఆమెకు ఎట్టి దుర్గతి పట్టిందో, ఆమె ఏ మూలపడిందో అని నీవు ఏమాత్రం ఆలోచించ లేదు, ఇంత ఔదాసీన్యమా ?

తులసీదాసా ! నీవు కూడా ఊర్మిళ పట్ల అన్యాయమే చేశావయ్యా ! ఈ సందర్భంలో నీవు ఆదికవినే అనుసరించావు. నానాపురాణ నిగమ సమ్మతంగాను, ఇతర గాథా సమ్మతంగాను రామచరిత మానసాన్ని రచిస్తానని ఘంటా పథంగా చెప్పినపుడు, ఈ సందర్భంలో కేవలం ఆదికావ్యాన్నే నీరచనకు ఆధారంగా గ్రహించాల్సిన అవసరం లేదే ! నీవు కూడా వనగమన సమయంలో ఊర్మిళా, లక్ష్మణుల సమాగమానికి అవకాశం కల్పించలేదు. తన తల్లి సుమిత్రను కలుసుకున్న తరువాత వెంటనే 'గయే లఖన్ జహాఁ జానకీనాథ్' (జానకీనాథుడున్న చోటికి లక్ష్మణుడు వెళ్ళాడు) అన్నావు. నీ ఇష్టదైవమైన రామచంద్రుని అనన్య సేవకుడయిన లక్ష్మణుని పట్ల ఇంత కాఠిన్యమెందుకు ? నీ కమండలంలోని కరుణా వారధి అంతా సీతకే సమర్పించేశావు కాని ఊర్మిళకు బిందుమాత్రం కూడా ఉంచలేదు. ఒక్క చౌపాయిలో నైనా ఊర్మిళ మనోదశను వర్ణించలేకపోయావా ? లేకపోతే ఆమె నోటి వెంట ఒక్క మాటైనా అనిపించలేకపోయావా ?

అయితే భవభూతి మాత్రం ఈ విషయంలో కొద్దిగా దయాదృష్టి కనపరిచాడు. జానకితోపాటు రామలక్ష్మణులు అరణ్యాల నుండి తిరిగివచ్చిం తరవాత పాపం ఒక్కసారి మాత్రం భవభూతికి ఊర్మిళ జ్ఞాపకం వచ్చింది. చిత్రశాలలో ఊర్మిళ చిత్రం చూచి సీత లక్ష్మణుణ్ణి ''ఇయమ ప్యపరాకా'' (ఈమె ఎవరు ?) అని అడుగుతుంది. ఈ విధంగా మరిదిని అడగడం చిరుహాస్యంతో కూడినటువంటిది. సరసత్వం గలిగిఉంది. లక్ష్మణుడు దీనిని గ్రహిస్తాడు. కొద్దిగా సిగ్గుపడినవాడై అతను తనలోనాను ''సీతాదేవి ఊర్మిళను గురించి అడుగుతున్నది'' అని అనుకుంటాడు. ఆయన సీత ప్రశ్నకు జవాబు ఇవ్వకుండానే ఊర్మిళ చిత్రం మీద చెయ్యి అడ్డం పెట్టేశాడు. అయన చేతివలన అమె ఆచ్ఛాదితమయి పోయింది. ఊర్మిళ ఉజ్వల శీలం కూడా నేటి వరకు కవుల వలన ఆచ్ఛాదిత మయిపోయి ఉండడం ఎంత విచారకరం !

రామచంద్ర శుక్ల

## కవిత్వం అంటే ఏమిటి ?

సౌందర్యం బాహ్య వస్తువు కాదు అది మనస్సులోనిదే అన్న విషయం ఐరోపియా కళాసమీక్షలో ఒక గొప్ప సిద్ధాంతమని, పరిణామమని తలంచ బడుతున్నది. కాని నిజానికి

ఇది మాటల గారడీ తప్ప మరొకటికాదు. వీరకృత్యాన్ని మించి వీరత్వమనే మరొక పదార్థం లేనట్లు, సుందర వస్తువును మించి సౌందర్యమనే వేరే పదార్థం లేదు. రూపమూ, వర్ణమూ కల కొన్ని పదార్థాలు మన మనస్సులలో ప్రవేశించిన కొద్దిసేపటికే మన వ్యక్తిత్వాన్ని స్వాధీన పరచుకొంటాయి. అప్పుడు మనకు వాటి పృథక్ జ్ఞానమే లేకుండా పోయి, మనం ఆ వస్తువుల భావరూపంలో మారిపోతాం. మన అంతస్సత్త యొక్క ఈ తదాకార పరిణతియే సౌందర్యానుభూతి. దీనికి విరుద్ధంగా రూపం-వర్ణం కల కొన్ని పదార్థాల ప్రతీతి లేక కల్పన మన మనస్సులలో కొద్దిసేపు కూడా ఉండదు కదా, పైపెచ్చు అది మనకు మానసిక అవరోధాన్ని కలిగిస్తుంది. ఒక వస్తువు యొక్క ప్రత్యక్షజ్ఞానం లేక కల్పన వలన తదాకార పరిణతి ఎంత ఎక్కువగా ఉంటే అంతగా ఆ వస్తువు మనకు సుందరంగా కనిపిస్తుంది. కనుక బాహ్యాభ్యంతరాల ఈ వ్యత్యాసం వ్యర్థమని స్పష్టం అవుతుంది. మనస్సులో నున్నదే బయటా ఉన్నది.

బయట నవ్వుతూ - త్రుళ్ళుతూ, ఏడుస్తూ - పాడుతూ, వికసిస్తూ — వాడిపోతూ ఉన్న జగత్తే లోపలా, మనస్సులో కూడా ఉన్నది. ఈ జగత్తు రూప చేష్టాత్మక మయినట్లు గానే మనస్సుకూడా రూపచేష్టాత్మకమే. మనస్సు రూప - చలనాల సంఘాతమే. రూపం, మనస్సు - ఇంద్రియాలద్వారా సంఘటిత మయిందా లేక మనస్సు, ఇంద్రియాలు- రూపం ద్వారా సంఘటితమయిందా అనే మీమాంస వలన ఇక్కడ ప్రయోజనం లేదు. మనస్సూ, మనస్సులో కలిగే జ్ఞానమూ, మన ఉనికీ ఇవి రూపకాత్మలని మాత్రమే మేము చెప్ప దలచుకున్నాము.

ఏదైనా ఒక వస్తువు ప్రత్యక్షజ్ఞానం లేక కల్పన వలన మన ఉనికి యొక్క జ్ఞానం ఎంతగా తిరోగమించి పోతుందో, ఆవస్తువు యొక్క రూపంలో మన మనస్సు ఎంతగా పరిణతి పొందుతుందో, అంతగా మన సౌందర్యానుభూతి ప్రగాఢం కాగలదు. ఏ విధమైన రూపరేఖలతో లేక వర్ణ విన్యాసంతో ఒకనికి తదాకార పరిణతి ఏర్పడుతుందో, ఆ విధమైన రూపరేఖలు లేక వర్ణవిన్యాసం అతనికి సుందరంగా కనిపించగలదు. మానవత్వపు సామాన్య పరిధికి చేరుకున్న అన్ని నాగరిక జాతులలోను సౌందర్యానుభూతిని గురించిన సామాన్య ఆదర్శాలు ప్రతిష్ఠించబడినాయి. సాధారణంగా వ్యత్యాసం అనుభూతి పరిమాణంలో మాత్రం కనబడుతుంది, సుందరమైన వస్తువును ఎవ్వరూ ఏక మొత్తంగా అసుందరమని అనరు. అలాగే బొత్తిగా అసుందరవస్తువును సుందరమనీ అనరు. పైన చెప్పబడినట్లు మానవుడు మానవునిలో మాత్రమే సౌందర్యాన్ని దర్శించడు, పల్లవ – గుంఫిత పుష్పహాసంలోను; పక్షుల పక్షజాలంలోను సిందూరాభ సాంధ్యదిగంచలపు హిరణ్మయ మేఖలా మండిత మేఘ శకలంలోను, తుషారావృత ఉత్తుంగ గిరిశిఖరంలోను, చంద్ర కిరణాలతో మెరుస్తున్న నిర్ఝరిణిలోను. ఇంకా ఎన్నెన్ని వస్తువులలోనో, అతడు సౌందర్య చ్ఛాయలను అవలోకిస్తాడు.

ఏ సౌందర్యభావనలో నిమగ్నుడై మానవుడు తన పృథక్సత్తా ప్రతీతిని విసర్జిస్తాడో, అది నిజంగా దివ్యమైన విభూతి. భక్తులు తమ ఉపాసనలోను లేక ధ్యానయోగంలోను ఈ విభూతినే ఆశ్రయిస్తారు తులసీ, సూర్ వంటి సగుణోపాసకులయిన భక్తులు రామ

కృష్ణాదుల సౌందర్యభావనలో నిమగ్నులయి కైవల్యం లేక ముక్తి కామనకు అవకాశం కూడా లేనటువంటి మంగళమయ దశను అనుభవించారు.

కవిత్వం కేవలం వస్తువు యొక్క రూపం- వర్ణంలో గల సౌందర్య శోభనేకాదు క్రియాకలాపాలు, మనోవృత్తులలో గల సుందర మార్మిక దృశ్యాలను కూడా చూపెడుతుంది. వికసించిన కమలమూ, రమణీ ముఖమండలమూ మొదలగువాటి సౌందర్యాన్నే కాదు. మనస్సుకు హత్తుకుకొని పోయేటట్లు చేసేది, కవిత్వం, ఉదారత్వం, వీరత్వం, త్యాగం, దయ, ప్రేమోత్కర్ష మొదలగు కార్యాలు, మనోదశల సౌందర్యాన్ని కూడా మనస్సుపై ముద్రిస్తుంది. శవాన్ని పీక్కుతినే కుక్కల, నక్కల భీభత్సవ్యాపారాన్నేకాదు, క్రూరుల హింసా ప్రవృత్తి, దుష్టుల ఈర్ష్యావృత్తి మొదలగు వాటి కురూపతతో మనస్సును క్షుబ్ధం చేస్తుంది. అసుందరం యొక్క ఈ ఉనికి పూర్ణమూ, స్పష్టమూ అయిన సౌందర్యాభివ్యక్తి కొరకనే తలంచాలి. సాధారణంగా ప్రపంచంలో ఏ మనోవృత్తుల చెడురూపాన్ని మనం చూస్తూ ఉంటామో, కవిత్వం వాటిలోని సుందరరూపాన్ని వెతికి వెతికి చూపిస్తుంది. దశవదన నిధన కారుడైన రాముని క్రోధ సౌందర్యాన్ని చూసి ఎవడు మోహితుడు కాడు ?

సుందరమూ, అసుందరమూ, అనేవి రెండే కావ్యానికి గల రెండు పక్షాలు. మంచీ-చెడు, శుభం_అశుభం, పాపం-పుణ్యం, మంగళం-అమంగళం, ఉపయోగకరం - అనుపయోగకరం అనే పదాలు కావ్యక్షేత్రానికి చెందినవి కావు. ఈ పదాలు నీతి, ధర్మం, వ్యవహారం, అర్థశాస్త్రం మొదలగువానికి చెందినవి. విశుద్ధ కావ్యక్షేత్రంలో ఏ విషయమూ మంచిదీ కాదు. చెడ్డదీకాదు, శుభమూ కాదు, అశుభమూ కాదు, ఉపయోగకరమూ కాదు, అనుపయోగకరమూ కాదు. అన్ని విషయాలు సుందరమూ, అసుందరమూ అనే రెండే రెండు రూపాలలో వర్ణించబడతాయి. ధార్మికులయినవారు శుభమూ, మంగళము అనుకునే విషయాల సౌందర్య పక్షంపై కవి తాను స్వయంగా ముగ్ధుడవుతాడు, ఇతరులను కూడా ముగ్ధులను చేస్తాడు. ధర్మజ్ఞుడు తన దృష్టితో దేనినైతే శుభమూ. మంగళమూ అనుకుంటాడో దానినే కవి తన దృష్ట్యనుసారం సుందరము అంటాడు అయితే వీనిలో దృష్టిభేదం తప్పకుండా ఉంది. ధార్మికుని దృష్టి సమస్తజీవుల సంక్షేమం, పరలోక సుఖం, భవబంధాలనుండి మోక్షం మొదలయిన వాటిపై ఉంటుంది. కాని కవి దృష్టిఈ విషయాల మీద ఉండదు. అతని దృష్టి సౌందర్యం మీదనే ఉంటుంది.

## శ్యాం సుందర్ దాసు

## సమాజము : సాహిత్యము

ఒక దేశప్రజలు సాముహికంగా మానవసమాజ పరిపుష్టికి, మనుగడకు ఉపయోగకరంగా ఉండేందుకు గాను తమ తరవాతి తరంవారికి అందచేసిన భావసంపద యొక్క భాండాగారమే సాహిత్యం. కనుక సాహిత్యాన్ని ఆయాప్రజల సాంఘిక జీవనానికి లేదా నాగరికతకు సూచికగా ఎంచుకోవచ్చు. ఇది ఆ సూచికకు ప్రాతిస్విక రూపమని గాని, ప్రతి రూపమని గాని, ప్రతిబింబమనిగాని చెప్పవచ్చు, ప్రజల సాంఘిక స్థితి గతులను అనుసరించి

వారి సాహిత్యం ఉంటుంది. సాహిత్యోపలబ్ధిని మదింపు చేయడం వలన ఆయా ప్రజల సాంఘిక ఔన్నత్యాన్నీ, వారి నాగరికతగల ఔన్నత్యాన్నీ చక్కగా నిర్ణయించవచ్చు. భావాలను భద్రపరచడం, గత సంఘటనలస్మృతులను పదిలపరచడం, వాఙ్మయ ప్రధానలక్ష్యాలు. ఏదైనా ఒక పదార్థాన్ని కాని, ఒకానొక విశిష్ట సంఘటనను కాని చూచినపుడు మనస్సులో ఉత్పన్నమయే భావాలను భాషద్వారా అభివ్యక్తీకరించడానికి మానవుడు ప్రేరించబడతాడు క్రమక్రమంగా భాషాయుద్ధాలపర్ణనకు ఒక విశిష్టమైన సాధనంగాను, అసాధారణ సంఘటనలను వివరించ డానికి లేదా కర్మకాండకు సంబంధించిన నియమాలను నిర్వచించ డానికి ఉపయోగించబడ్డది, ఈ విధంగాసాహిత్యం సాంఘిక మనుగడకు ఒక ప్రబలమైన తత్వంగా రూపొందింది.

ఒకభావం మరోభావాన్ని కలుగచేస్తుంది. ఈ పద్ధతి ఒక క్రమంగా మారినపుడు వాఙ్మయంలో ప్రత్యేక ప్రక్రియలు సృష్టించబడతాయి మనస్సును క్రియాశీలంగా ఉంచ డానికీ, దాని పరిపుష్టికి, వికాసానికీ వాఙ్మయ రూపంలో మానసికాహారం కావాలి మానసిక స్థితి దానికిచ్చిన ఆహారాన్ని బట్టి ఉంటుంది. శారీరకమయిన మనుగడకు, పెరుగుదలకు మంచి ఆహారం సేకరించినట్లే, మనో వికాసానికి వాఙ్మయం సహకరిస్తుంది. మానవుని ఆలోచనా విధానాన్ని రూపొందించడంలో ప్రాకృతిక వాతావరణం ప్రధానపాత్ర వహిస్తుంది. చలిదేశాల్లో నివసించేవారు తమ మనుగడకై నిరంతరం ఎక్కువగా శ్రమించవలసి ఉంటుంది. దాదాపు తమ సమయాన్నంతా తమ జీవన నిర్వహణకు కావలసిన విధానాలు, సాధనాలు కల్పించుకోవడంలోనూ, వాటిని అమలు పరచడంలోనూ గడపవలసిఉంటుంది. ఆవిధంగా వారు భౌతిక సాఫల్యాల పట్ల ఎక్కువ ఆసక్తిని పెంపొందించుకుంటారు. ప్రాపంచిక ఐశ్వర్య ప్రాప్తియే వారి జీవితలక్ష్యం అయిపోతుంది.

తద్భిన్నమైన వాతావరణం గల ప్రదేశాలలో సోమరితనం ప్రధానంగా కనిపిస్తుంది. జీవిత ప్రధానావసరాలైన ఆహారాన్ని, వస్త్రాన్ని ప్రకృతి ఏర్పాటు చేస్తుందనే నిశ్చయంతో ఉన్నప్పుడు, వాటిని గురించి ఎవ్వరూ పట్టించుకోరు. మన భారతదేశం ప్రకృతిదేవతకు అను కూలమైన, విస్తృతమైన క్రీడాస్థలి. ఇక్కడ అన్ని ఋతువులు క్రమానుసారంగా తమ ప్రభావాన్ని చూపిస్తయ్, జల సంపద పుష్కలంగా ఉంది. అన్ని రకాల పంటలు పండించ డానికి అనుకూలంగా భూమి సారవంతంగా ఉంది, అటువంటప్పుడు ఇక్కడి ప్రజలకు భౌతికావసరాలను తీర్చగలిగే పదార్థాలను గురించి చింతించ వలసిన అవసరమేముంది ? ఈ పరిస్థితులలో మనస్సు భౌతిక వాంఛలన్నింటినీ వదిలివేసినదై, జీవాత్మ లేదా పరమాత్మను గురించిన సమస్యలతో మునిగి తేలుతుంటుంది. లేదా శృంగారసంబంధమైన భావాలకు లేదా ఇంద్రియ సుఖాలకు లొంగిపోతుంది. కనుకనే మన సాహిత్యం ఆధ్యాత్మిక భావాలతోనో లేదా శృంగారరస సంబంధమైన రచనలతోనో నిండి ఉంది. ఈ విధంగా నేను పైన చెప్పినదంతా మానవుని సాంఘిక ప్రతిపత్తి వికాసంలో సాహిత్యం ప్రధాన పాత్ర వహిస్తుందని నిరూ పిస్తుంది.

ప్రేంచంద్

# గోదాన్

ఆరోజు పదిగంటలనుండే వడగాడ్పు వీచడం మొదలెట్టింది. మధ్యాహ్నం అయ్యే టప్పటికి నిప్పులు కురియసాగినయ్. పల్లం (క్వారి) నుండి కంకరతట్టలు మోసుకొనివచ్చి హోరి బండిమీద వేస్తున్నాడు. మధ్యాహ్నం పనిమీదనుండి దిగేటప్పటికి హోరి పూర్తిగా అశక్తుడయిపోయినాడు. ఏనాడు ఇంత అలసట కలగలేదు. అడుగు పడటంలేదు. శరీరం లోపలనుండి కుతకుతలాడిపోతున్నది. అతను స్నానమూ చేయలేదు, శెనగలూ తినలేదు. ఆ అలసటలోనే ఒక చెట్టుక్రింద అంగవస్త్రం పరచుకొని పడుకొన్నాడు. కాని దాహంతో గొంతు ఎండుకొపోతున్నది. ఒట్టికడుపున నీళ్ళు త్రాగడం మంచిదికాదు అతను దాహాన్ని అణుచుకోడానికి ప్రయత్నం చేశాడు కాని క్షణక్షణానికి లోనున్న దాహం పెరిగిపోసాగింది. ఉండబట్టలేకపోయాడు. ఒక కూలి బాల్చీ నింపిపెట్టుకొని శెనగలు తింటున్నాడు హోరి లేచివెళ్ళి గబగబా ఒక చెంబెడునీళ్ళు త్రాగేశాడు. మళ్ళీవచ్చి పడుకున్నాడు. కాని ఒక అరగంటలో వాంతి చేసుకున్నాడు. ముఖంమీద ప్రేతకళ పడ్డది

ఆ కూలి 'వంట్లో ఎలాఉంది హోరి అన్నా' అని అడిగాడు.

హోరి తల తిరుగుతున్నది. 'ఏంలేదు. బాగానేఉంది' అని అన్నాడు. అంటూనే మళ్ళీ వాంతిచేసుకున్నాడు. కాళ్ళు చేతులు చల్లపడసాగాయి. ఇది ఏమిటి? తల ఎందుకు తిరుగుతున్నది? కండ్లముందు చీకట్లు కమ్ముకొస్తున్నట్లుంది. అతని కండ్లు మూతపడి పోయాయి. జీవితంలోని గతస్మృతులన్నీ సజీవంగా హృదయపటలంపై కనబడసాగినయ్; కాని క్రమరహితంగా, వెనకవి ముందూ, ముందువి తరవాతగా, స్వప్న చిత్రాలవలె, వికృతంగా, అసంబద్ధంగా, సుఖదమైన బాల్యం — బిల్లంగోడు ఆడుకొనేవాడు, తల్లి ఒడిలోపడి నిద్రపోయేవాడు. ఆ తరవాత గోబర్ (పెద్దకొడుకు) వచ్చినట్లు కాళ్ళమీద పడుతున్నట్లు అనిపించింది. మళ్ళీ దృశ్యం మారింది. ధనియా కొత్తపెండ్లి కూతురై, ఎర్రటి కలంకారీ చీర కట్టుకొని తనకు అన్నం పెడుతున్నది. ఆ తరవాత అచ్చం కామ ధేనువులాంటి ఆవు చిత్రం కళ్ళముందుకు వచ్చింది. దాని పాలు పిండాడు, మంగళ్ (చిన్న కొడుకు) కు తాగిస్తున్నాడు. అంతట్లో ఆ ఆవు ఒక దేవతగా మారిపోయింది......

ఆ కూలివాడే మళ్ళీ పిలిచాడు: 'మధ్యాహ్నం వేళ అయిపోయింది. పద అన్నా! తట్టలు ............'

హోరి మాట్లాడలేదు. అతని ప్రాణాలు ఏఏ లోకాల్లో విహరిస్తున్నాయో చెప్ప లేము. అతని శరీరం కాలిపోతున్నది. కాళ్ళు చేతులు చల్లబడిపోతున్నయ్. వడదెబ్బ కొట్టింది.

అతని ఇంటికి మనుషులు పరిగెత్తారు. ఒక గంటసేపట్లో ధనియా పరిగెత్తుకుంటూ వచ్చింది. శోభ, హీర వెనకాల చిన్న మంచాన్ని డోలీలా కట్టుకొని వస్తున్నారు. ధనియా

హోరి వళ్ళు ముట్టుకొని చూసింది. ఆమె గుండె ఆగిపోయింది. ముఖంలో కాంతి తొలిగి పోయింది.

గద్గదస్వరంతో అడిగింది : 'ఎలా ఉందయ్యా ఒంట్లో ?'

హోరి చూపులలో నిలకడలేదు. 'వచ్చావా గోబర్ ? నేను మంగళ్‌కోసం ఆవు తీసుకొచ్చాను. అదిగో అక్కడ ఉంది చూడు' అని అన్నాడు.

ధనియా మృత్యువును కండ్లారా చూసింది. మృత్యువును గుర్తించగలదు. మృత్యువును అడుగులో అడుగు వేసుకుంటూ రావడమూ చూసింది. పెనుగాలివలె రావడమూ చూసింది. ఆమె కండ్లముందు అత్త మరణించింది, మామ చనిపోయాడు, ఇద్దరు పిల్లలు గతించారు. గ్రామంలో అనేకమంది చనిపోయారు. మనస్సుకు ఒక దెబ్బలాగా తగిలింది. తన జీవనాధారం చేజారిపోతున్నట్లు అనిపించింది. అహాఁ కాదు. ఓర్పు వహించాల్సిన సమయం, తన సందేహాలు ఆధారరహితాలు. ఏదో వడదెబ్బ తగిలింది. అందుచేత తెలివి తప్పిపోయింది. అంతే.

ఉబికివస్తున్న కన్నీరు ఆపుకుంటూ 'నావైపు చూడు. నేను ......... నన్ను గుర్తించలేదా ?' అని అన్నది.

హోరికి మళ్ళీ తెలివివచ్చింది. మృత్యువు దగ్గరపడ్డది. నిప్పులు కురిపించబోతున్నది. పొగ శాంతించింది. దీనదృక్కులతో ధనియాను చూశాడు. కనుకొలకుల నుండి రెండు కన్నీటి బిందువులు జారిపడ్డాయి. క్షీణస్వరంతో అన్నాడు : 'నా తిట్లు—చీవాట్లు మన్నించు ధనియా ! ఇహ వెళ్ళిపోతున్నాను. గోమాతపట్లగల కోరిక తీరకుండాపోయింది. ఇప్పుడు ఉన్న కాస్తడబ్బు కర్మకాండలకు అయిపోతుంది. ఏడవబోకు ధనియా ! ఎన్నాళ్ళని బ్రతికిస్తావు ? చూడవలసిన దుర్గతి అంతా చూశాను. ఇహ చావనీ' ?

మళ్ళీ అతనికండ్లు మూసుకుపోయినయ్. అదే సమయానికి హీర, శోభా డోలీ తీసుకువచ్చారు. హోరిని డోలీలో పడుకోబెట్టి ఊరివైపు తీసుకువెళ్ళారు.

గ్రామంలో ఈ వార్త గాలిలా వ్యాపించింది. గ్రామమంతా హోరీ ఇంటిముందు గుమిగూడింది. మంచంమీద పడుకొని హోరీ ఇదంతా చూస్తూఉన్నాడేమో, అంతా అర్థం చేసుకుంటున్నాడేమో కాని నోటమాట పడిపోయింది. ఆఁ. అతని కండ్లనుండి ప్రవహిస్తున్న కన్నీరువలన మోహబంధాలు తెంచుకోవడం ఎంతకష్టమో తెలుస్తున్నది. తన చేతకాని దాని వలన కలిగే దుఃఖాన్నే మోహం అంటారు. నిర్వర్తించిన కర్తవ్యాలపట్ల, పూర్తిచేసిన పనుల పట్ల మోహం ఏముంటుంది ? ఏ అనాథలపట్ల మనం మన కర్తవ్యాలను నిర్వర్తించలేక పోయామో, వారిని వదిలిపెట్టి వెళ్ళాలంటేనే మోహం, మనం పూర్తి చెయ్యలేనటువంటి కోర్కెలపట్లనే వ్యామోహం.

అంతా తెలిసిఉండకూడా ధనియా చెరిగిపోతున్న ఆశల నీడలను పట్టుకు వ్రేలాడుతున్నది. కండ్లనుండి కన్నీరు ప్రవహిస్తూనే ఉందికాని యంత్రంవలె అటూ—ఇటూ పరిగెత్తుతూ ఉంది. ఒకమారు మామిడికాయ కాల్చి పానకం చేస్తున్నది. ఇంకోసారి గోధుమ

పొట్టుతో హోరి శరీరాన్ని మాలీషు చేస్తున్నది. అంతకంటే ఏం చేస్తుంది ? చేతిలో దమ్మిడి లేదాయె, డాక్టరును పిలవాలంటే.

ఏడుస్తూనే హీరా అన్నాడు : 'మనస్సు దిటవు పరచుకో వదినా ! గోదానం చేయి, అన్నయ్య వెళ్ళిపోతున్నాడు.'

ధనియా అతనివైపు తిరస్కారభావంతో చూసింది. మనస్సును ఇంకా దిటవు పరచుకోవాలి ? తన భర్తపట్ల తన కర్తవ్యాన్ని ఎవరైనా చెప్పాలా ? తన జీవన సహచరుడి పట్ల ఏడుస్తూ కూర్చోవడమే తన ధర్మమా ?

ఇంకా చాలామంది 'అవునవును. గోదానం చేసెయి. ఇదే తగిన తరుణం.' అని అన్నారు.

ధనియా యంత్రంవలె లేచింది. ఆరోజు నూలుఅమ్మి తెచ్చిన 20 అణాలు, చల్లబడిపోయిన తనభర్త చేతిలో పెట్టి, ఎదురుగాఉన్న దాతాదీన్‌తో అన్నది : 'అయ్యా ! ఇంట్లో ఆవూలేదు, దూడాలేదు, డబ్బూలేదు. ఉన్నదంతా ఇదే. ఇదే ఆయన చేసే గోదానం.'

అంతే, విరుచుకు పడిపోయింది ధనియా.

**జయశంకర్ ప్రసాద్**

## కవిత్వ స్వభావము

*చాణుక్యుడు :* చంద్రగుప్తా ! నేను బ్రాహ్మణ్ణి, కరుణే నా సామ్రాజ్యంగానూ, ప్రేమే నా ధర్మంగానూ ఉండేది. ఆనంద సముద్రంలో శాంతి ద్వీపంలో నివసించే బ్రాహ్మణ్ణి నేను. చంద్రుడు, సూర్యుడు, నక్షత్రాలు నాకు దీపాలు, అనంత ఆకాశం నా పందిరి. సస్యశ్యామలమూ, కోమలమూ ఆయిన విశ్వంభర నా శయ్య. బౌద్ధిక వినోదం నా కార్య కలాపం, తృప్తియే నా సంపదగా ఉండేది. బ్రాహ్మణ్ణయిన నేను నా జన్మభూమిని వదలి ఎక్కడికి వచ్చేశాను ? సౌహార్ద్రం ఉండాల్సినచోట కుట్రలు, పూలకు ప్రతినిధులుగా ముండ్లు, ప్రేమకు బదులు భయం, జ్ఞానామృతానికి బదులుగా దురాలోచనలు ...... ఇంకా ఎంతమటుకు పతనం ? ...... మౌర్య చంద్రగుప్తా ! తీసుకో, నీవు ఇచ్చిన అధికారాన్ని మళ్ళీ తీసివేసుకో. నేను మళ్ళీ పునర్జన్మ ఎత్తుతాను. నా జీవితం రాజకీయ కుట్రలవలన కుత్సితమూ, కళంకితమూ అయిపోయింది. ఏదో నీడవెంట, కాల్పనికమైన వైభవం వెంట, భ్రమలోపడి పరుగులిడుతున్నాను. నేను ఎక్కడ ఉన్నానో, ఎంతగా దిగజారిపోయానో నాకు తెలిసివచ్చింది. నా శాంతిఅంతా పోగొట్టుకున్నాను. నా నిజస్వరూపాన్ని మర్చి పోయినాను.

* * * *

*సువాసిని :* జీవిత కాననంలో ఆకస్మాత్తుగా, ఒక రాకారజని ఛాయలో దాగు కొని మధుర వసంతం ప్రవేశిస్తుంది. శరీరంలోని ప్రతి (పూల) మడి పచ్చగా తయారవు

తుంది. సౌందర్యమనే కోకిల 'ఎవరూ ?' అంటూ కూస్తూ అందరిని పిలవసాగుతుంది. అప్పుడు రాజకుమారీ! ప్రేమకలికలు వికసించసాగుతయ్. వాటిలో అశ్రుభరితాలయిన స్మృతులు మకరందంవలె దాగిఉంటయ్

కార్నేలియా : (కౌగలించుకొని) ఆహా : ప్రియసఖీ! నిజంగా నీవు కవివి. నీకు ప్రేమించడమూ తెలుసు, దాని రహస్యమూ తెలుసు ఆయితే మనిద్దరికి పొత్తు బాగా కుదురుతుంది. ఎలిస్! వెళ్ళు, నాన్నగారితో ఈమెను నా సఖిగా ఎంచుకున్నానని చెప్పు.

(ఎలీస్ వెళతాడు)

సువా : రాజకుమారీ! ప్రేమలో స్మృతియే సుఖం. ఒక అంతర్వేదనయే ప్రేమకు ప్రాణం. ఆ ప్రేమ ప్రతియువతి హృదయంలో గూడుకట్టుకొని ఉండడం ఆశ్చర్య కర విషయం. కాని దానిని ప్రతివారూ అభివ్యక్తీకరించలేరు. ప్రతి ఒక్కరికి దాని మర్మానుభూతి కలగదు.

కార్నే : ఏమిటీ నీవంటున్నది ......... ?

సువా : అదే (ఆ ప్రేమయే) స్త్రీ జీవనసత్యం. దాని సంగతి నాకు తెలియదనే స్త్రీ ఇతరులను మోసగించడమేకాక తన్నుతానే వంచించుకుంటుంది. కామదేవుడు కంపిస్తున్న స్త్రీ వక్షోదేశంమీద చేయిఉంచి, ఆ స్వరకంపనానికి అనుగుణంగా పాడతాడు. అదేకాదు రాజకుమారీ! ఆ కామసంగీతపు స్వరాలు సౌందర్యపు చిత్రవిచిత్ర వర్ణాల అలలై, యువతీ ముఖాలపై లజ్జను, స్వాస్థ్యాన్ని సూచించే అరుణిమను కలిగిస్తాయి.

కార్నే : చాలుచాలు సఖీ! మదిరా చషకంలోని స్వప్న తరంగాలను కదల్చి వేయకు. స్మృతి చాలా నిష్ఠురమైంది. ప్రేమయే జీవనసత్యమైతే ఈ ప్రపంచమే ఒక అగ్ని పర్వతం కాగలదు.

## చతురసేన్ శాస్త్రీ

## వైశాలీ నగర వేశ్య

ఆ సురక్షిత లతాకుంజంలో కండ్లు తెరవగానే ఆమె ప్రభావ పూర్ణ వ్యక్తిత్వం కలిగి తన ముందు నిలబడ్డ ఒక వ్యక్తిని చూసింది అతని వయస్సు తారుణ్యాన్ని వదిలి వేసింది. గౌరవర్ణం కలిగి, శక్తితో వెలిగిపోతున్న అతని ముఖం సూర్యునివలె దేదీప్యమానంగా ఉంది. దట్టంగా ఉన్న నల్లని కురులు కౌక పక్షివలె వెనుకవైపుకి దువ్వబడి ఉన్నయ్ ప్రశస్త మైన వక్షమూ, పొడుగ్గాను, బలంగాను ఉన్న బాహువులు అమూల్యమైన దుకూలంతో కప్ప బడి ఉన్నయ్. నడుం క్రింది భాగం నాజూకైన, పచ్చని పట్టు వస్త్రంతో శోభిస్తున్నది. దట్ట మయిన నల్లని మీసాలుదర్శనీయమైన అతని ముఖంలోని అద్భుతశోభను పెంపొందిస్తున్నాయ్. చెవులకు వజ్రకుండలాలు, మెడలో గులాబీ రంగు గల అసాధారణాలు, దుర్లభాలయిన ముత్యాలు శోభిస్తున్నయ్. విశాలంగాను, నల్లగాను, ఉండి ప్రకాశవంతాలైన నేత్రాల నుండి

ఉత్ఫుల్ల సరస అధరాల నుండి విలాసం, ప్రేమ అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తున్నయ్. అతను ఒక చేతిలో మహార్ఘమైన వీణ ధరించిఉన్నాడు. అతన్ని చూచి అంబపాలి గాబరాపడి లేచి నిలబడ్డది. ఆమె చకితురాలై అ పురుష పుంగవుని చూస్తూ ఉండిపోయింది. అనుకోకుండా ఆమె అతని వలన ప్రభావితురాలైంది. అనాటి దాకా ఏ పురుషుని వలన ప్రభావితురాలు కాని అంబపాలి ఆ పురుషుణ్ణి చూసి స్తంభితురాలై పోయింది. ఆ పురుషుడే మొదట మాట్లాడాడు.

'జనపద కళ్యాణి, దేవి అంబపాలి ప్రసన్నురాలు కావాలి. నీ ఏకాంత విశ్రాంతికి వ్యాఘాతం కల్పించి నీకు బాధ కలిగించానా ?'

'లేదు. లేదు కాని భంతే, ఈ సురక్షిత ప్రదేశంలోకి అనుమతి లేకుండా ఎలా రాగలిగారు ? కాపలాదారులు నిద్రిస్తున్నారా ? లేక మీరు వారిని మాయా విమోహితుల్ని చేశారా ? '

ఆ పురుషుడు నవ్వుతూ అన్నాడు ! 'లేదు. కళ్యాణి ! నేను అదృశ్యుణ్ణై, ఆకాశ మార్గాన వచ్చాను. పాపం, కాపలా దార్లు నన్ను గమనించలేక పోయారు.'

ఆశ్చర్యంచే విమూఢురాలైన అంబపాలి 'ఇంతకీ మీరు ఎవరు భంతే : గంధర్వులా?' అని అడిగింది.

'లేదు భద్రే : నేను మానవుణ్ణి'.

'కాని మీరు వచ్చిన తీరు.........

'నాకు కొన్ని సిద్ధులు లభించినయ్. నాకు లోపాంజన విద్య, ఖేచర విద్య వచ్చు'

అంబపాలి లేచి నిలబడ్డది. 'మీరు సాధారణ మానవులు కారు మహానుభావా ! నన్ను మోసగించడానికి వచ్చిన దేవతలా ? దానవులా లేక యక్షులా ?'

'కాదు జనపద కళ్యాణీ ! నేను నీ అప్రతిమ రూప లావణ్యాన్ని, మిరుమిట్లు గొలిపే తేజన్ను, దర్పం, లోకోత్తర ప్రతిభను, గురించి మాదేశంలో విన్నాను. అందుచేత కేవలం నిన్ను చూడడానికే చాలాదూరం నుండి ఛద్మ వేషంలో వచ్చాను. ఇప్పుడు వినికిడి మాటల కంటే ప్రత్యక్షం మహత్తరమని గ్రహించాను. నీలాంటి రూపవతి అయిన బాలామణి బహుశ ఈ ప్రపంచంలో మరొకతె లేదు.'

అంబపాలి కౌతుహలం కొద్దిగా తగ్గి, అంబపాలికి ధైర్యం కలిగింది. తన రూప లావణ్య ప్రశంస విని అమె ఇలా అన్నది: 'భంతే ! అదృశ్య రూపంలో ఒక స్త్రీ ఏ కాంత వాసంలో, ఆకాశ మార్గాన ప్రవేశించడంలో ఎంత నేర్పు చూపించారో, ఇతరులను ప్రశంసించడంలోను, మీ గుప్త ప్రేమను ప్రదర్శించడంలోనూ, అంతేనేర్పు చూపించారు కాని .. ..'

ఆ పురుషుడు వీణమూత తీశాడు. అ వీణపై ఆశ్చర్యకరమైన దంతపు నగిషీ పని చేయబడి ఉంది సాధారణపు వీణలకు ఆ దివ్యవీణకు ఏ విధమైన పోలికలు లేవు ఆశ్చర చకితురాలై 'ఎంత అందమైన వీణ ! కాని భంతే, ఈ వీణతో నా విలువ కట్టడానికి ప్రయత్నం చేయబోకండి'.

ఆ నిర్ణయం ఇప్పుడే జరుగుతుంది. ఈ వీణాస్వరంలో వివశురాలై అంబపాలి నృత్యం చేసినపుడు.........'

'వివశురాలై నృత్యమా ?'

'తప్పదు.'

'అసంభవం.'

'తప్పదు.'

ఆ రహస్యమయ పురుషుడు తెల్లని చలవరాతి పీఠంమీద కూర్చున్నాడు. ఆయన వీణాంత్రులను మీటాడు. అంబపాలి చకితురాలై, విమూఢురాలై కూర్చునిఉంది. ఆ ఆశ్చర్య పురుషుని వేళ్ళమొదట ఒక గ్రామము (స్వర సమూహం), తరవాత మరొక గ్రామము (స్వర సమూహం) గా వీణాతంత్రులమీద నృత్యం చేయసాగినయ్. వాతావరణం ఆ వీణాస్వరంతో నిండిపోయింది. అంబపాలి మత్తిల్లసాగింది. నాలుగువైపులా మూర్తీభవించిన సంగీతం. ప్రియసుఖ స్పర్శ కలిగించే స్వరాలు, సుషుమామయమైన వాతావరణం, తనను ఆవరించి ఉన్నట్టు ఆమెకు అనిపించింది.

వీణ మ్రోగుతూనేఉంది. దాని స్వరగతి తీవ్రమూ తీవ్రతరమూ కాసాగింది. ఆ తంతువాద్య కంపనలవల్ల పుట్టిన స్వరలహరులు ఆమె చర్మకూపాలను ఛేదించుకొని, రక్తంలో ప్రవేశించి, రక్తాన్ని ఉత్తప్తం కావిస్తున్నట్లు అనిపించింది. ఆమె ముఖం అరుణిమ వహించింది, కండ్లు మత్తెక్కుస్తున్నయ్. శరీరం కంపించిపోసాగింది. ఆమె విస్ఫారిత నేత్రాలతో ఆ పురుషపుంగవుని అసాధారణ వీణావాదనను చూస్తూ ఉండిపోయింది.

అకస్మాత్తుగా వీణావాదకుడు తన అంగుళీగతిని మార్చివేశాడు. చకితురాలైన అంబపాలి వీణ ఒకేకాలంలో మూడు గ్రామాల (స్వరసమూహం) తో మ్రోగుతున్నట్లు గమనించింది. ఈ విధంగా జరగడం కనీవినీ ఎరుగనిది. కొద్దిక్షణాలలోనే అంబపాలి వివశురాలై పోయింది తన శరీరంలో రక్తం బదులు మద్యం ప్రవహిస్తున్నట్లు, ఇహ తను స్థిరంగా ఉండలేనట్లు ఆమెకు అనిపించింది. వీణాతంత్రులపై విద్యుత్‌వేగంతో నడయాడుతున్న ఆ వ్రేళ్ళను కన్నార్పకుండా చూస్తూ ఆమె అవశురాలైపోయింది. తన మృదులగాత్రమే వీణారూపంలో ఝుంకృత మవుతున్నట్లనిపించింది. ఆ అచేతనావస్థలోనే ఆమె నృత్యం చేయసాగింది. మొదట మెల్లగా, తరువాత వేగంగా, వేగతరంగా — ఆ వ్రేళ్ళకు, ఆ చరణాలకు పోటీపడింది. నృత్యం, వాదనం ఏకీభవించిపోయినయ్. నృత్యం చేస్తున్నది ఎవరో, వీణను వాయిస్తున్నది ఎవరో, ఆ అలౌకిక దృశ్యాన్ని చూస్తున్నది ఎవరో చెప్పలేము. క్రమక్రమంగా అంబపాలి పూర్తిగా అలసిపోయింది వాదకుని వ్రేళ్ళుకూడా మంద్రస్థాయికి చేరుకోసాగినయ్. అంబపాలి మెల్లగా ఒక లతాగుల్మంపై వాలిపోయింది. ఆ మహాపురుషుడు తన మహార్ఘ వీణను క్రిందపెట్టి, ఆమెను చేతులతో లేవనెత్తి, తెల్ల చలువరాతి పీఠంమీద పడుకొబెట్టాడు.

నందదులారే వాజపేయి.

## ఛా యా వా ద ము

నేడు ఛాయావాద కావ్యోద్యమం హిందీలో ఒక సునిశ్చిత స్థానాన్ని ఏర్పరచు కున్నది. అది ఇప్పుడు కేవలం వ్యతిరేకించబడే విషయం కాని కేవలం పొగడ బడవలసిన విషయం కాని కాదు. ఇప్పుడు దానిని సమీక్షించవచ్చు, పరీక్షించవచ్చు. మొదటి నుండి ఛాయాత్మక నిగూఢ అభివ్యక్తి కారణంగా ఛాయావాదం ఆధ్యాత్మిక కావ్యం అని పిలవ బడేది. లోగడ భక్తికావ్యంలోని సాకార వర్ణనలకు విరుద్ధంగా, ఛాయావాదంలో నిరాకార పద్ధతి అవలంబించ బడ్డది. కాని దాని యథార్థ స్వరూపం ఇంకా స్పష్టంగా నిర్వచింప బడలేదు. ఛాయావాద పద్ధతి కబీరు మొదలగు వారి నిర్గుణ నిరాకార వ్యంజనలకు భిన్నమైందే కాక, సూఫీ కవుల పద్ధతికి కూడా భిన్నమైందే. సూఫీకవులు లౌకిక సంస్కృతీ నిర్మాణంలో కూడా చాలావరకు సహకరించారు అయినా కూడా ఈ రెండు సంప్రదాయాలను ప్రధానంగా ఆధ్యాత్మికాలనవచ్చు. ఆధిభౌతిక పక్షం దృష్టితో చూస్తే ఒకవైపు ఉమర్ ఖయ్యాం దృష్టిలోను, మరొకవైపు షేక్‌సాదీ దృష్టిలోను, భారతీయుడైన జాయసీ మొదలైన కవుల దృష్టిలోను భేదం ఎక్కువగా కనిపిస్తుంది. వీరందరు సమకాలీన సంస్కృతిని, దేశ కాలాలకు సంబంధించిన ఆలోచనా ధోరణులను భిన్నభిన్న స్వరూపాలలో వ్యక్తం చేసారు. ఉదాహరణకు ఉమర్ ఖయ్యాం కావ్యధార అదృష్టం భాగ్యం, నియతి యొక్క కఠోరగతి వలన భయపడి, దాని నుండి తటస్థంగా ఉండాలనే భావాన్ని సూచిస్తుంది. ఆయన కావ్యం ఈరాను, పర్షియా దేశాలలోని ఏకాంత వాటికలలో, ఉద్యానవనాలలో ఇద్దరు జీవుల ప్రేమ కలాపం అనే సరళ ఆదర్శాన్ని ప్రస్తుతీకరించింది. సాదీ మొదలగు వారి రచనలు దానికి భిన్నమైన వాతావరణాన్ని, ఆలోచనా ధోరణిని ద్యోతితం చేస్తున్నయ్ జాయసీ ప్రభృతులగు భారతీయ సూఫీ కవుల రచనలు ఉమర్‌ఖయ్యాం వలె అదృష్టవాదాన్ని ప్రవర్తిల్ల చేయవు, ఇద్దరు జీవుల ఏకాంత జీవనాన్ని, ఉద్యానవన పరిస్థితులను ప్రదర్శించవు. అది అరబ్బీ సూఫీకవులవలె ఇస్లాం నీడలో వికసించ లేదు. ఈ కావ్య ప్రవృత్తి వ్యాపకమైన భారతీయ జీవితం, సౌందర్యానికి సంబంధించిన వివిధ దృశ్యాల మధ్యనుండి ప్రవాహితమైంది. ఈ విధంగా దేశకాలాలు, ఆలోచనా ధోరణులలో భేదం ఉన్నప్పటికీ, సూఫీ కావ్యాన్ని ఆధ్యాత్మిక మనే అంటారు. ఎందుకంటే వారందరిలో నిరాకార ప్రేమానుభూతి అనే లక్ష్యం సర్వ సామాన్యంగా కనిపిస్తుంది. వారి కావ్యాలలో లౌకికము, దేశకాల సాపేక్షమైన సాంస్కృతిక పక్షానికి ప్రాముఖ్యం లభించ లేదు. వారి కావ్యాలలో ప్రేమ – అలౌకిక ప్రేమకే ప్రాధాన్యం లభించింది.

జ్ఞాన మార్గానికి చెందిన కబీరు ప్రభృతులగు వారి ఆధ్యాత్మిక భావం స్పష్టమే కదా ! రహస్యమయ శక్తి పట్ల అభివ్యక్తి, మిథ్యాప్రపంచం పట్ల సుదృఢమైన నిశ్చయం వారి ఆధ్యాత్మిక భావానికి మూల కందాలు. ఆధ్యాత్మిక కావ్యానికి ఒక అఖండ శక్తి పట్ల స్వీకృతి — అది ప్రేమమయం, జ్ఞానమయం లేక ఆనందమయం కానివ్వండి — ఎంత అవసరమో, ప్రాపంచిక శక్తి లేక వ్యావహారిక జీవనం పట్ల అస్వీకృతి కూడా అంతే

అనివార్యమై పోయింది. ఆధ్యాత్మిక లేక ఆధ్యాత్మిక వాదానికి చెందిన కావ్యాల ప్రధాన లక్షణం ఇదే. సాకారోపాసకులయిన భక్తకవులు కూడా రామకృష్ణాదుల చరిత్రలను అఖండం, అవ్యయం, దివ్యం, అలౌకికం అని ఆ గీటు రాయినే స్వీకరించారు. ప్రాపంచికమైన ఏ ప్రాకృతికశక్తిని పూర్తిగా, సిద్ధాంతానుసారంగా వారు అంగీకరించ లేదు. సాకారోపాసకులైన కవులు సాంస్కృతికమైన జీవన వ్యావహారిక పక్షాలను విస్తృతంగా చూపించారని తప్పకుండా ఒప్పుకోవలసిందే, కాని వారి దృష్టి అలౌకిక 'ఆదర్శం' మీద ఉండి పోయింది. ప్రపంచంలో దృశ్యమానమవుతున్న వాస్తవికత, తజ్జన్యాలయిన ప్రగతుల నుండి వారు దాదాపు దూరంగానే ఉన్నారు. అయినప్పటికి ఈ కవులు జీవితంలోని బహువిధ పక్షాల సౌందర్యాన్ని చూపించారు. ఆనాటి సంస్కృతీ నిర్మాణంలో సహకరించారు. ఆదర్శం, అలౌకికం అనే భూమిక మీద వ్యవహారం, ప్రత్యక్షం గురించి ఈ మాత్రం చర్చ చేసారంటే, అదేం తక్కువ కాదు. కబీరు మొదలగు నిర్గుణవాదులు కూడా అణువణువులో ఆత్మ యొక్క వ్యాపకమైన ఉనికిని నిరూపించారు. దానిని గుర్తించమని పట్టుబట్టారు. సాధనరూపంలో వారు సరళమైన, త్యాగమయమైన జీవితాన్ని గురించి ఉపదేశించారు, జాతి వర్ణ భేధాలను నిషేధించారు, కాని వారి లౌకిక క్షేత్రం సాకారోపాసకుల లౌకికక్షేత్రం కంటే పరిమితమయింది. ఎందుకంటే వారి ఆధ్యాత్మికత ఈ లోకానికి అతీతమయినటు వంటిది. దాని సాధన తటస్థంగాను, ఏకాంతంగాను ఉంటేనే సాధ్యపడుతుంది.

## శ్రీమతి మహాదేవి వర్మ

### కళా సౌందర్యం

జీవితంలోని సునిశ్చిత బిందువులను కలిపివేసే పని మన మస్తిష్కం చేస్తుంది కాని ఈ క్రమం వలన తయారయిన పరిధిలో సజీవత అనే వర్ణాన్ని నింపే సామర్థ్యం హృదయానికి మాత్రమే ఉన్నది. కావ్యం లేక కళ ఈ రెండింటి సంధి చిత్రం లాంటిది. తదనుకూలంగా బుద్ధి అనే మనోవృత్తి పలచటి వాయుమండలం వలె, భారం మోపకుండానే జీవితం మీద వ్యాపించి ఉంటుంది. రాగాత్మకమైన ఆ ప్రవృత్తి, ఆధారతలం మీద సత్యం యొక్క అనంత వర్ణాలకు, రూపాలకు చిరనవీనత్వం కల్పిస్తూ ఉంటుంది. అందుచేత కావ్యకళ యొక్క సత్యం జీవిత పరిధిలో సౌందర్యం అనే మాధ్యమం ద్వారా అభివ్యక్తమైన అఖండ సత్యం.

సౌందర్య సంబంధమైన సమస్య కూడ జటిలమైనదే. బాహ్య జగత్తు అనేక రూపాత్మకమైనటువంటిది. సుందర – వికృతరూపాలలో వ్యావహారికమైన ఒక వర్గీకరణ జరిగింది. అయితే ఈ వర్గీకరణ పరిధిలోనికి వచ్చే సౌందర్యాన్నే సత్యం యొక్క మాధ్యమంగా ఎన్నుకొని, మిగతావాటిని వదిలివేయాలా ? కేవలం బాహ్యరేఖల, వర్ణాల సమన్వయాన్నే సౌందర్యం అని అంటే ప్రతి భూఖండంలో గల మానవ సంఘపు అభిరుచే కాదు, ప్రతివ్యక్తి అభిరుచీ ఇతరుల అభిరుచికి భిన్నంగా వుండవచ్చు. కనుక ఎవరి

ప్రత్యేకమైన అభిరుచిని బట్టి సామంజస్యానికి నిర్వచనం ఏర్పరచాలనే ప్రశ్న సత్యానికంటే ఎక్కువ జటిలమయింది కాగలదు.

కావ్యం, కళలు, సత్యప్రాప్తికై ఆధారంగా గ్రహించే సౌందర్యం యొక్క పూర్ణతను అభివ్యక్తి మీద ఆధారపడి ఉంది కాని కేవలం బాహ్యరూపు రేఖల మీద కాదు. ప్రకృతి యొక్క అనంత వైభవం ప్రాణికోటి యొక్క అనేకాత్మకమైన గతిశీలత, అంతర్జగత్తు యొక్క రహస్యమైన వైవిధ్యం - ఇదంతా కావ్యం, కళల సౌందర్యకోశంలో అంతర్భూతం. వీనిలో క్షుద్రతమ వస్తువు కూడా పర్వతంతో సమకక్షగా నిలబడే సాఫల్యం పొందే గొప్పముహూర్తమూ వస్తుంది, గురుతమ మయిన వస్తువుకూడా గడ్డిపోచతో సమమయి కృతార్థమయ్యే లఘుక్షణాలూ వస్తాయి.

## హజారీ ప్రసాద్ ద్వివేది

## మానవ జీవన ప్రవాహం

మానవజాతి యొక్క దుర్దమనీయమూ, నిర్మయమూ అయిన వేలాది సంవత్సరాల ప్రవాహ స్వరూపం నాకు స్పష్టంగా కనబడుతున్నది. అది సభ్యతా సంస్కృతులవృథావ్యామోహాలను, కాలరాస్తూ సాగివస్తున్నది. ఈ జీవనధార ఎన్ని ధర్మచారాలను, మూఢ నమ్మకాలను, ఉత్సవాలను, వ్రతాలను నిర్మూలిస్తూ ముందడుగు వేసిందో చెప్పలేము. సంఘర్షణ వలన మానవుడు క్రొంగొత్త శక్తులను పొందాడు- ఎన్నో విషయాలను గ్రహిస్తూ, ఎన్నో విషయాలను త్యజిస్తూ ఆ గ్రహణ - త్యాగాల పరిణామ స్వరూపంగా మనకండ్ల ముందున్న సమాజం ఈ విధంగా రూపొందింది. దేశం,లేక జాతుల సంస్కృతి యొక్క విశుద్ధత కేవలం ఉత్తిమాట, అన్నింటిలో మిశ్రమం ఉంది, అంతా అవిశుద్ధమే, మానవునిలో ఉన్న దుర్దమనీయమైన 'జిజీవిష' (బ్రతికి ఉండాలన్న కోర్కె) మాత్రమే శుద్ధమయింది. అది గంగానది యొక్క అబాధిత — అనాహత ప్రవాహం వలె అన్నింటిని అరిగించుకొని కూడా, పవిత్రమయినటువంటిది. సభ్యత - సంస్కృతుల వ్యామోహం క్షణంపాటు అడ్డంకి కలిగిస్తోంది, ధర్మాచార సంస్కారం కొద్దిసేపు ఈ ప్రవాహాన్ని ఎదుర్కొంటుంది. కాని దుర్దమనీయమైన ఈ ప్రవాహంలో పడి అన్నీ కొట్టుకొనిపోతాయి. ఈ జీవన శక్తిని సమర్థవంతం చేసే ప్రతిశక్తి దానిలో భాగమయిపోతుంది, మిగతాది పారవేయబడుతుంది. మహాకాయా ! నీవు ధన్యుడవు. నీవుఎన్ని సార్లు మదనదేవుని గర్వఖండనం చేశావో, ధర్మరాజు కారాగారంలో విప్లవం రేకెత్తించావో, యమధర్మరాజు తారళ్యాన్ని మ్రింగివేశావో విధాత సర్వకర్తృత్వపు గర్వాన్ని చూర్ణం చేశావో గదా ! ఈనాడు మనలో ఉన్న మోహం సంస్కృతి — కళల పట్ల ఉన్న ఆసక్తి, ధర్మచారాలు — సత్యనిష్ఠ పేరిట ఉన్న జడభావం - వీటన్నింటిలో ఎంతభాగం నీ అకుంఠిత నృత్యంలో ధ్వసం అయిపోతుందో ఎవ రెరుగుదురు ? అయినా మానవుని జీవనప్రవాహం తన మత్తెక్కిన నడకతో ముందుకు సాగి పోతూనే ఉంటుంది. ఈనాడు అశోక పుష్పగుచ్ఛాన్ని చూచి నామనస్సు ఉదాసీనమయి పోయింది. రేపు ఏ వస్తువును చూచి, ఏ సహృదయుని హృదయంలో ఉదాసీనత్వం

ఉదయిస్తుందో చెప్పలేం. నేను ఏ విషయాలు అత్యంతం విలవగలవని అనుకుంటున్నానో, ఏ విషయాలప్రచారానికై గొంతు చించుకొని అరుస్తున్నానో, వాటిలో ఎన్ని బ్రతికి ఉంటాయో ఎన్నికొట్టుకు పోతాయో, ఎవరు చెప్పగలరు ?

నేడు బహు మూల్యవంత మనుకుంటున్న సంస్కృతి ఇలాగే స్థిరంగా ఉండి పోతుందా ? సమ్రాట్టులు, సామంతులు ఎంతో ఆకర్షణీయంగ, మాదకంగా తయారు చేసిన ఆచారాలు - సంప్రదాయాలు నశించిపోయినయ్. ధర్మాచార్యులు మహార్ఘం అనుకున్న జ్ఞానమూ, వైరాగ్యం లుప్తమయిపోయినయ్, మధ్యయుగంలోని ముసల్మాను ధనాఢ్యుల అనుకరణలో ఉప్పొంగిన రసరాశి ఆవిరిలాగా ఎగిరిపోయింది. అయితే మధ్యయుగపు కంకాళం మీద వికసించిన పారిశ్రామికయుగం అనే కమలం ఈ ప్రకారంగానే ఉండి పోతుందా ? మహాకాలం యొక్క ప్రతి పదాఘాతంతో ధరిత్రి అదిరిపోతుంది. ఆ అకుంఠిత నృత్యపు ప్రతిచరణం ఏవో కొద్దిగా చుట్టబెట్టుకొనే పోతుంది. అంతా మారిపోతుంది, అంతా వికృతమై పోతుంది - అంతా నవీనమై పోతుంది.

## రామ్‌ధారీ సింహ దినకర్

## భారత నవ జాగరణ

ప్రాచీన చరిత్రను గురించిన గంభీర అన్వేషణం భారతీయ నవజాగరణకు గల ప్రధాన లక్షణం. ఐరోపాకు గల భావసంపదలో విజ్ఞానశాస్త్రమే భారతదేశానికి క్రొత్తగా అనిపించింది. దాంతో విజ్ఞాన శాస్త్రాన్ని సంతోష పూర్వకంగా స్వీకరించడం జరిగింది. మిగతా అన్ని రంగాలలో భారతదేశం తన ప్రాచీన సంపదను పునరాలోచన చేసుకొని, తన ప్రాచీన జ్ఞానాన్ని నవీనం చేసుకొని, నూతన మార్గం మీద పురోగమించింది. ఆంగ్లభాషలో 'రివైవాలిజం' అన్న పదానికి అంత మంచి అర్థం లేదు. నేటి సత్యాలను అనాదరించి (తిరస్కరించి), భూతకాలానికి చెంది, నిర్జీవమై పోయిన విషయాలనే మళ్ళీమళ్ళీ చెప్పేవారిని పునర్జాగరణ వాదులు లేదా రివైవలిస్టులు అని అంటాము. రివైవలిస్టు కావడం అంతమంచిది కాదు. కాని నవజాగరణలో భూత కాలపు విషయాలు మళ్ళీమళ్ళీ చేయబడతాయి. పునర్జాగృతి కాలంలో కొన్ని ప్రాచీన సత్యాలు పునర్జన్మిస్తాయి. ఇది పునర్జాగరణ కాదు, సత్యాల పునర్జన్మ. జాతిజీవనంలో గల కొన్ని సత్యాలు ఏనాటికి చావవు. కొంతకాలంపాటు ప్రచ్ఛన్నాలయి పోతాయి కాని మళ్ళీ తగు సమయంలో అవి బలాన్ని పుంజుకుంటాయి ; తమశక్తి సామర్థ్యాలను నిరూపించుకొంటాయి. భారతదేశంలో వేదాంతంలో ప్రతిష్ఠించబడ్డ సత్యాలు ఈ కోవకు చెందినవి. భారతదేశంలో నవజాగరణ కలిగినప్పుడల్లా వేదాంతం యొక్క పాత్ర మానవ జాతి ముందు జాజ్జ్వల్యమానంగా ప్రకాశించింది. వేదాంతం బుద్ధుడికి సహకరించింది, వేదాంతం శంకరుడి వ్యక్తిత్వాన్ని ప్రతిభాయమానం చేసింది. ఆ వేదాంతమే కబీరు, నానకు ఉపదేశాలను సత్యంగా నిరూపించింది. ఆ వేదాంతాన్నే క్రొత్తగా వ్యాఖ్యానించి రామానుజుడు భక్తిమార్గాన్ని ప్రశస్తం చేశాడు. క్రైస్తవమతం, విజ్ఞాన శాస్త్రం భారతదేశానికి చేరుకున్నప్పుడు భారతదేశం వాటికి స్వాగత సత్కారాలు నిర్వర్తింప వలసి

వచ్చింది. అప్పుడు భారతదేశం మళ్ళీ వేదాంతాన్ని ఆధారంగా గ్రహించింది. రామమోహన్ రాయ్, దయానందుడు, వివేకానందుడు ప్రారంభించిన నవజాగరణోద్యమ ప్రభావం నేటికి మనలను పురోగాములనుగా చేస్తున్నది. ఆ ఉద్యమానికి వేదాంతమే వెన్నముకలాంటిది.

నివృత్తిమార్గ త్యాగం నవజాగరణకుగల రెండవ ప్రధాన లక్షణం. వివాదం, సంఘర్షణ కేవలం మతానికి సంబంధించినవి మాత్రమే అయిఉంటే, ఈ పర్యాయంకూడా భారతదేశం నివృత్తిమార్గాన్ని త్యజించి ఉండేదికాదు. ఎందుకంటే ఉపనిషత్తుల కాలంనుండి, బుద్ధుడి కాలంనుండి, ఈ విషయం భారతదేశపు నరనరాలలో జీర్ణించుకొనిపోయింది. భారతీయ స్వభావంలో నివృత్తి ఒక అవిభాజ్య భాగంగా మారిపోయింది. కాని ఈసారి ఐరోపాలోని విప్లవాత్మక భావాలకు భాగస్వామ్యం ఏహించడంతో, బానిసత్వపు క్లేశంతో భారతదేశం వ్యాకులత చెందింది. మంచిమంచి మారణాయుధాలుకాక, జీవితంపట్లగల ప్రవృత్తిమయ దృష్టికోణమే ఐరోపా శ్రేష్ఠత్వానికి కారణమని భారతదేశం గ్రహించింది. ఆ దృక్పథం జీవన సంఘర్షణనుండి పారిపోయి సుఖాన్ని వెతుక్కోక, ఆ సంఘర్షణలో తలమునకలుగా ప్రవేశించి, దాన్ని ఉపయోగించుకుంటుంది. హిందూత్వంతో పోల్చిచూస్తే ఇస్లాము ప్రవృత్తి ప్రధానమేకాని హిందువులు ఇస్లామునుండి ప్రవృత్తి మార్గాన్ని స్వీకరించలేము. ఇస్లాములోని సూఫీ సిద్ధాంతాలు హిందువులకు బాగా నచ్చాయి. ఈ సూఫీ మార్గంకూడా హిందువుల వేదాంతంవలె నివృత్తి ప్రధానమయింది. భారతదేశంలో ఉండగా ఉండగా ఈ విషం (నివృత్తి) ఇస్లాంలోకూడా ప్రవేశించింది. కాని హిందూత్వమూ, ఇస్లాము ఐరోపాలో ముఖాముఖి సంఘర్షణలకు దిగేటప్పటికి జీవితంలో నివృత్తిమార్గం సరియైన మార్గంకాదని ఆలోచించవలసి వచ్చింది. ఈ సందర్భంలోకూడా ప్రవృత్తిని క్రొత్త జీవితదర్శనంగా ఎంచి, భారతీయులు దానిని స్వీకరించారని చెప్పడానికి ఎటువంటి నిదర్శనాలు లేవు. స్వామి వివేకానందుడు, లోకమాన్య తిలకు వేదాంతానికి, గీతకు వ్యాఖ్యానాలు వ్రాసి, భారతీయ వైదిక ధర్మోపదేశం ప్రధానంగా ప్రవృత్తిమయమనీ, నివృత్తిమయం కాదని ప్రతిపాదించారు. ఇది హిందూత్వంలో సహజంగా ఉన్నదే. జీవితం సత్యం, ప్రపంచం స్వప్నమయం కాదు, జీవన పరాజయాన్ని వైరాగ్యం అనరు. మానవుని ఇహలౌకిక సుఖాలను పూర్తిగా నాశనం చేసే విధానంలో కర్మాకర్మలను గురించి విచారణ చేయకూడదు, అనేటటువంటివి లేదా తత్సమానమైన ఉపదేశాలు ఈ యుగానికిచెందిన తత్త్వచింతకుల నోటినుండి తరచుగా వినబడేవి. నిజానికి 19 వ శతాబ్దపు నవజాగరణ భారతదేశంలో ప్రవృత్తివాదపు అద్వితీయ ఉత్థానమే.

రామమోహనుడు, దయానందుడు, రామకృష్ణుడు, వివేకానందుడు మొదలగువారు ప్రవృత్తిమార్గానికి ఎంతటి ప్రాధాన్యం ఇచ్చారంటే హిందువుల తాత్త్వికదృష్టి పూర్తిగా ప్రవృత్తి మార్గానికి మాత్రమే మూలాధారమని అనిపించింది. దాంతో సన్యాసంకంటే గార్హస్థ్యాన్ని శ్రేష్ఠమనుకోవడంతో గల అవరోధం తనంతట తానే క్షీణించిపోసాగింది.

నగేంద్ర

## రసము : కళానుభూతికి కల సర్వసాధారణ సిద్ధాంతము

శాస్త్రీయ నియమ బంధాలను తొలగించుకొని, వ్యాపకమూ, వికాసశీలము అయిన స్వరూపంలో కావ్యానుభూతికి సంబంధించిన విశ్వజనీన సిద్ధాంతం రససిద్ధాంతం. ఈ సిద్ధాంతం ఆధారంగా ప్రతి దేశంలోనూ, ప్రతి కాలంలోను వ్రాయబడ్డ, సృజనాత్మక సాహిత్యాన్ని, అందులోగల ప్రతి ప్రక్రియకి సముచితంగా వెలకట్టవచ్చు. మానవ చైతన్యంలో సహజసిద్ధంగా ఉండే భావాన్ని ఆధారంగా స్వీకరించి, మిగతా అన్ని ప్రధాన మనః ప్రవృత్తులను కూడా సముచితరూపంలో స్వీకరించేటంత సర్వవ్యాప్త స్వరూపం కలిగినటువంటిది రససిద్ధాంతం. అందుచేత జీవితంలోగల సమస్త రూపాలలోనూ, రకరకాల విలువలతోనూ రససిద్ధాంతానికి పరిపూర్ణ సామరస్యం ఉంది. ఈ సామరస్యంలో భిన్నభిన్న వాదాల అంతర్విరోధం సమాహితమై పోతుంది. ఈ రససిద్ధాంతం మానవవాదమనే సుదృఢమైన ఆధారశిలమీద సుప్రతిష్ఠితమై ఉండడమే దీనికి అసలైన కారణం. దేహము—ఆత్మ, సామర్థ్యము—అసామర్థ్యము, రాగము—ద్వేషము మొదలగువానితో కూడిన మానవునితోనే ఈ రసానికి సంబంధం. కనుక మానవుని భూత, భవిష్యత్, వర్తమానాలతో దీనికి అవిచ్ఛిన్న సంబంధం ఉంది. మానవవాదం మానవుణ్ణి అత్యుత్తమ సత్యంగా ఎంచుకొని జీవన వికాసంతోపాటు నిరంతర క్రియాశీలంగా ఉన్నట్లుగానే మానవ సంవేదనను చరమ సత్యంగా ఎంచుకొని, రస సిద్ధాంతంకూడా నిరంతరం వికాసశీలతను కలిగిఉంది. జీవితపు పోకడలలో మార్పు వచ్చినవుడెల్లా, మానవవాదపు ప్రకల్పనలో మార్పులు జరుగుతున్నట్లే, సాహిత్యపు పోకడలలో మార్పులు వచ్చినపుడెల్లా రసస్వభావం కూడా వ్యాపకం అవుతూ ఉంటుంది. జీవితం నిరంతరం వికాసశీలమైన విధానాలను, అవసరాలను మానవవాదం తనలో ఆకళించుకొన్నట్లు, ఒక రససిద్ధాంతం మాత్రమే రోజురోజుకూ మారుతున్న సాహిత్యానికికల అవసరాలను తీర్చగలుగుతుంది. జీవితపు భూమికతో మానసత్వంకంటె మహత్తర సత్యం అవిర్భవించనంతవరకూ, సాహిత్యపు భూమికలో మానవ సంవేదనను మించిన రమణీయ సత్యం కల్పించబడనంతవరకూ, రససిద్ధాంతాన్ని మించిన ప్రామాణికమైన సాహిత్య సిద్ధాంతం ఊహించడానికి అవకాశం ఉండదు.

వినోబాభావే

## ప్రార్థన

ఓం అసతోమా సద్గమయా
తమ సోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

(ఓ భగవంతుడా! అసత్యమునుండి సత్యము వంకకు నన్ను తీసుకుపో.
చీకటి నుండి నన్ను వెలుతురులోకి నడిపించు.
మృత్యువు నుండి అమృతత్వమునకు నన్ను కొని పొమ్ము)

పై ఉపనిషన్మంత్రం మనం ప్రస్తుతం ఏ దశలో ఉన్నామో, మనం ఏ దశకు పురోగమింపవలసి ఉన్నదో, తెలియచేస్తుంది. మన ప్రస్తుత దశను జీవుని దశతో పోల్చవచ్చు. చరమ దశను శాశ్వత సద్రూపమైన శివుని స్థితితో పోల్చవచ్చు. ప్రస్తుతం మనం అసత్యం, అంధకారం, మృత్యువు అనే దశలలో ఉన్నాం. ఇది జీవునిదశ. ఇక్కడ నుండి మనం సత్యం ప్రకాశం, శాశ్వత జీవనం అనే దశను చేరుకోవడానికి పురోగమించాలి. అది శివత్వ దశ.

'అసత్యం నుండి సత్యంవైపు నన్ను నడిపించు' అని మనం ప్రార్థిస్తున్నప్పుడు 'అసత్యం నుండి సత్యంవైపు పురోగమించాడానికి నేను ఎల్లప్పుడు ప్రయత్నిస్తానని' ప్రతిజ్ఞ చేస్తున్నా మన మాట. ప్రయత్నం చేయడానికి గల అభిలాష ఆధారంగా లేనంతవరకు ప్రార్థన అర్థరహితం. నేను అప్పుడప్పుడూ 'అసత్యం నుండి సత్యంవైపు నన్ను నడిపించమ'ని ప్రార్థిస్తుంటాననుకోండి. కాని ఆ ఆదర్శాన్ని కార్యాన్వితం చేయడానికి ప్రయత్నించను, ప్రయత్నరహితుడనై ఉంటాను. లేదా దానికి విరుద్ధంగా ఆచరిస్తుంటాను అనుకోండి. అప్పుడు నేను ఏ దిశలోను పురోగమించను. అది నాగపూరు నుండి కలకత్తాకు పోయే రైలులో కూర్చొని, కలకత్తాకు కాకుండా బొంబాయివెళ్ళాలని కోరుతూ, ప్రార్థిస్తున్నట్లుగా ఉండగలదు. అసత్యం నుండి సత్యంవైపు నడిపించమని ప్రార్థిస్తున్నప్పుడు అలా ఆదిశలో పురోగమించడానికి ప్రయత్నం చేయాలి. ప్రయత్నరహితమైన ప్రార్థన కానేకాదు. కనుక ప్రార్థనలో అసత్యం నుండి సత్యంవైపు తన మార్గాన్ని మార్చుకోవాలని, దానిని సాధించడానికి వీలైన ప్రయత్నాలన్నీ చేద్దామనే నిజాయితిగల ప్రతిజ్ఞ ప్రార్థనలో ఇమిడి ఉంది.

ప్రయత్నం చేయాల్సి ఉన్నట్లయితే మరి ప్రార్థన చేయడమెందుకని ఎవరన్నా అడగవచ్చు. కాని మనం ప్రయత్నం చేయగోరుతున్నాము. కనుకనే ప్రార్థన అవసరం అవుతుంది. అది ఎలాగ అంటే-నేను ప్రయత్నం చేయవలసిన వాడినే కాని ప్రయత్నం ఫలితం నావశంలో లేనటువంటిది. అది భగవదిచ్ఛమీద ఆధారపడి ఉంటుంది. అదీగాక నేను ఎంతమాత్రం ప్రయత్నం చేయగలుగుతాను? ప్రయత్నం చేయడానికి కావలసిన నాశక్తి పరి మితం. నేను వంటరి వాణ్ణి, భగవత్సహాయం లేకుండా నేను ఎంతని సాధించగలను? సత్య మార్గంలో పురోగమించడానికి నేను ప్రయత్నిస్తూ ఉన్నప్పటికీ, భగవత్కృప లేకుండా నేను నాలక్ష్యాన్ని చేరుకోలేను. నేను ఆమార్గాన్ని అధిగమించడానికి ప్రయత్నించవచ్చు కానిసాఫల్యం పొందుతానని ఎవరు చెప్పగలరు? కనుక తనంతట తానే లక్ష్యాన్ని సాధించ గల ననుకోవడం అర్థ రహితం, విత్తునాటడం మన చేతుల్లోఉంది కాని దాన్ని ఫలింప చేయడమనేది భగవంతుడి చేతుల్లోఉంది. కనుక ప్రయత్నాన్ని ప్రోత్సహించడానికి, దానికిబలం ఇవ్వడానికి ప్రార్థన అవసరమవుతుంది. ప్రయత్నంతో కూడిన ప్రార్థన బలాన్నిస్తుంది. ప్రతివాడు తనశక్తిసామర్థ్యా లన్నింటిని కూడగట్టుకొని ప్రయత్నం చేయాలి. ఇంకా ఎక్కువ శక్తిసామర్థ్యాలు ఇమ్మని భగవంతుణ్ణి ప్రార్థించాలి. ఇదీ ప్రార్థనకు గల నిజమైన అర్థం.

ప్రార్థన అదృష్టవాదం. కర్మవాదం రెండింటి సమ్మేళనం, అదృష్ట వాదంలో ప్రయత్నానికి స్థానం లేదు కనుక అది అర్థ రహితం. కర్మవాదం అహంభావ ప్రధానం కనుక అహంకారానికి హేతువవుతుంది. కనుక ఈ రెండింటిని వేరు వేరుగా ఒప్పుకోవడానికి

వీలు లేదు కాని వాటిని విడిచి పెట్టడానికి కూడా వీలు లేదు. అదృష్టవాదంలో సహజ సిద్ధంగా ఉన్న వినయం మంచిదే. అదే విధంగా కర్మవాదంలో గల ప్రయత్న భాగం కూడ మంచిదే, అవసరమయిందే. ప్రార్థన ఈ రెంటిని ఒక చోటికి తెస్తుంది. భగవద్గీత ఈ క్రింది విధంగా ప్రార్థనలో గల తాత్పర్యాన్ని వివరిస్తుంది.

'ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః'

ప్రార్థన అనగా అహంకారం లేనటువంటి ప్రయత్నం అని అర్థం. కనుక 'అసతోమా సద్గమయ' అన్న ప్రార్థనకు సమగ్రమైన అర్థం 'నేను అసత్యం నుండి సత్యంవైపు నడవ డానికి, ఎడతెగని పట్టుదలతో, అహంకార లేశం లేకుండా ప్రయత్నిస్తాను,' ప్రార్థనకు గల ఈ అర్థన్ని మనస్సులో పెట్టుకొని మనం రోజూ

ఓ భగవంతుడా!
అసత్తు నుండి నన్ను సత్యానికి చేర్చు,
తమస్సు నుండి జ్యోతిస్సుకు చేర్చు,
మృత్యువు నుండి అమృతత్వానికి చేర్చు.

అని ప్రార్థించాలి.

చంద్ బర్దాయి

## పద్మావతి వివాహము

పద్మసేన భూపతికి సౌజన్యవతి యగు ఇల్లాలు ఉండేను.
ఆమె చంద్ర సూర్య ప్రభలు కల కూతురును కనెను.
ఆ బిడ్డ చంద్ర సూర్యప్రభలు కలసి ఒక చోట ఉన్నట్లూ
లేదా పదార్వన్నెల సువర్ణం వలెనూ ఉంది
యౌవనం పొటమరిస్తుండగా ఆమె అమృత పానం చేసినట్లుంది.
ఆమె ముఖం వికసితకమలం.
నేత్రాలు, కనుబొమలు
భ్రమరాన్ని, లేడిని, ఖంజన పక్షిని మించిపోయాయి.
దంత పంక్తి వజ్రాలను, నాసిక రాచిలుకను
పెదవులు బింబ ఫలాన్ని, కేశపాశం కృష్ణ సర్పాన్ని జయించినాయి.
పట్టపుటేనుగ, సింహం, హంస, ఈ మూడింటినడకల
సౌందర్యాన్ని కలిపి బ్రహ్మ ఆమె నడల సోయగాన్ని
సృష్టించాడా అని అనిపిస్తుంది.
పద్మిని పలెనున్న పద్మావతి రూపం
కాముడు కామినీ రూపాన్ని నిర్మించినట్లుంది.

పశు పక్షులు, సురనర మునివరులను కూడా మోహింప చేసేట్లుగా,
కాముడు రూపరాశి అయిన కామినీ రూపాన్ని నిర్మించినట్లుంది.
శుభ సాముద్రిక లక్షణాలు కలిగి
ఆమె చతుష్షష్టి కళలలో ఆరితేరింది,
చతుర్దశ శాస్త్రాలు, షడ్విధ సాహిత్యాలు నేర్చింది.
ఆమె ప్రేమ వసంతంతో సమానమైంది.
సకియలతో ఆడుకుంటూ రాజ భవనంలో తిరిగేది,
ఉద్యాన వనాలలో నివసించేది, ఒకనాడు
ఒక రామచిలుక కంటికి కనిపించేటప్పటికి ఆమె హృద
యం ఉల్లాసంతో నిండి పోయింది.
రవికిరణాలకు చక్రవాక పక్షి గగుర్పొడిచినట్లు ఆమె హృదయం ఉల్లాసంతో నిండి పోయింది.

అరుణాధరాలను బింబఫలమని భ్రమించి
ఆకీర్తం బింబఫలాన్ని రుచి చూద్దామని గంతు పెట్టి వచ్చింది.
బింబఫలాన్ని ముక్కుతో పొడుద్దామన్న లోభంతో వచ్చిన ఆ చిలక ఆమె చేతిలో పట్టు పడి పోయింది.

హర్షోల్లాసంతో నిండిన ఆమె కీరాన్ని రాజ భవనంలోకి తీసుకుపోయింది.
అనుపమ రత్నమణి ఘటితమైన పంజరంలోకీరాన్ని సురక్షితం చేసింది.
కీరాన్ని సురక్షితం చేసింది ఆటపాటలు మరచి పోయింది.
కీరానికి రామనామం నేర్పడంలో ఆమె మనసు లీనమయి పోయింది, పొంగి పోయింది.
కీరం ఆరాకుమారి శరీరాన్నినఖశిఖ పర్యంతంగల సౌందర్యాన్ని గమనించి, చూచింది.

విధాతకోరి కోరి ఈ పద్మిని స్వరూపాన్ని నిర్మించాడు.
కేశాలు కుటిలాలు, ముఖం పుష్ప సదృశం, స్వరం కోకిల స్వర సమానం.
గంధం పద్మగంధం, వయస్సంధిలో ఉన్న ఆమె మందగతి నడకలు రాయంచ నడకలు

శరీరం శ్వేతవస్త్రాలలో ప్రకాశిస్తున్నది.
నఖాలు స్వాతి బిందువుల్లాగ శోభిస్తున్నయ్.
ఆమె దేహ సౌగంధ్యం చేత తుమ్మెదలు దారులు తప్పాయి.
ఆమెను కండ్లతో చూచి ఆ శుకం సుఖాన్ని పొందింది.
ఈ విగ్రహం రచింపబడ్డ రోజే శుభదినం.
ఉమా శంకరుల కృపవలన ఈ అందాల రాణి
పృథ్వీరాజుతో హృదయ సాంగత్యం పొందుగాక!

# విద్యాపతి గీతాలు

1. వర్షాకాలపు రాత్రి
కటిక చీకటిగా ఉంది.
అతి సుకుమారంగా ఉంది యువతి.
మార్గంలో వేలాది మిణుగుపురుగులు
కుండపోతగా వర్షం కురుస్తున్నది.
ఓ మాధవా! ప్రథమ ప్రణయం మూలాన ఆమె భీతురాలై ఉంది.
స్వయంగా ఆమె వద్దకు వెళ్ళి ఆమెను గమనించు.
(ఆ తరవాత) నీకు తోచినట్లు వ్యవహరించు.
మార్గ మధ్యంలో యమునా నది భయంకర ప్రవాహం.
ఎలా దాటగలుగుతోందో పాపం?
ఓ బుద్ధి మంతుడా! ప్రియుడా! సంయోగ సుఖమనే
భావం ఆమెకు అప్రధానం, పనికి రానిది.
అంతా తెలిసీ నీవు ఆ సుందర వదనంపట్ల ఇంత ఉదాసీనంగా ఎందుకు ఉన్నావు?
ఎందుకు సిగ్గిల కుండా ఉన్నావు?
మధువు తనకు తానై భ్రమరం వద్దకు ప్రవహించడం
ఇంతకు ముందు ఎవరైనా చూశారా?

2. సఖీ, మొదట కురులు అలంకరించుకొని, మంచిగంధం అలదుకో
ఆ తరవాత చంచలమైన కండ్లకు కాటుక దిద్దుకో.
ప్రియుడి దగ్గరకు వెళ్ళేటప్పుడు శరీరాన్ని మేలిముసుగుతో ఆచ్ఛాదించుకో.
అక్కడికి వెళ్ళిన తరవాతకూడా ప్రియుడికి దూరంగా ఉండు—
అతనే నిన్ను స్వయంగా కోరుకోవాలి.
ఆవలి ముఖంపెట్టి మాట్లాడి, సిగ్గును అభినయించు.
అపాంగ వీక్షణాలతో అతని హృదయంలో కామాన్ని రేకెత్తించు.
కుచప్రదేశాన్ని అరచాటుగా ఉంచు, మాటిమాటికి
నీవీ బంధాన్ని బిగించుకుంటూఉండు.
అలిగినట్లుగా నటించు. కామకేళిలోని రసాన్ని (ఆనందాన్ని)
కొద్దిగా మిగిల్చిఉంచుకో. దానివలన అతడు మాటి,
మాటికీ నీ వద్దకు రాగలడు.
కామకేళీ విలాసాలను గురించి ఇంకా ఎంతనిచెప్పేది సఖీ!
కామదేవుడే గురువై అన్ని రహస్యాలు నేర్పుతాడు.
(చతురురాలైన సఖి రాధకు సంభోగవిషయాన్ని గురించి

ఇలా చెబుతున్నదని విద్యాపతి అంటున్నాడు.)

3. (నాయిక సఖితో ఇలా అంటున్నది.)

మనోరథపూర్తికై నేడు నేను హరి సమాగమానికై వెళ్ళాలి.

నాకెంతో విరాళిగా ఉంది.

కాని ఇంటిలోని పెద్దవారు నిద్రించేటప్పటికి చంద్రుడు ఉదయించాడు,

(అందుచేత ఆమె చంద్రుణ్ణి సంబోధిస్తూ ఇలా అంటున్నది.)

చంద్రుడా! నీ వ్యవహారం బాగుండలేదు. నీవు క్రూరుడవు.

ఇటువంటి నీచబుద్ధి కలవాడవు కనుకనే నీకు కళంకం అంటింది.

అయినా నీకు భయంలేదు. (బుద్ధిని పోనిచ్చుకున్నావు కావు)

ప్రపంచంలోని ఆడవారు నీ ముఖాన్ని జయించారు. దాంతో

నీవు ఆకాశవీధుల్లోకి పారిపోయావు.

అక్కడకూడా నీవు రాహువు పాలబడ్డావు పాపం ఆటువంటి

నిన్ను ఏమని తిట్టేది?

విధాత తన శక్తినంతా వ్యయంచేసి, నెలరోజులు కష్టపడి

నీకు సమస్తకళలు పూర్ణబలం కలిగిస్తాడు.

కాని ఈ పాపకృత్యాల మూలాన్నే, మరునాటినుండే నీవు క్షీణించిపోతావు.

విద్యాపతి అంటున్నాడు.

ఓ యువతీ! చంద్రుణ్ణి నిందించబోకు.

అతను పదునారు రోజులే వెన్నెల కురిపిస్తాడు.

ఆ తరవాత నీకిష్టమైన చీకటి రాత్రులు రానేవస్తాయి.

4. ఓ రాధాసుందరీ! నీ వదనశ్రీ స్వయంగా చాలా

ఉత్తమంగా ఉంది.

అందుచేత చంద్రుడి సౌందర్యం దొంగిలించావన్న నేరం

నీమీద పడుతుంది.

గ్రహణ సమయమని గ్రహించి వెళ్ళిపో.

ఎవరివైపు కన్నార్పకుండా చూడబోకు.

లేకపోతే చంద్రుడనే భ్రమతో రాహువు నిన్నే

మింగివేయగలడు.

కాటుకతో నీ కళ్ళు నిగ్గుతేలాయి.

చూపులు వేటగాడి ఎక్కుపెట్టిన బాణాల్లా ఉన్నాయి.

ఎవడైనా నీవైపు కన్నార్పకుండా చూశాడో, ఖంజనపక్షి అనే

భ్రమతో నీ కండ్లను దొంగిలించుకోపోగలడు.

చంద్రుడు అమృతాన్ని సముద్రంనించి దొంగిలించాడు.
అందుచేత రాహువు అతన్ని వెంటాడుతున్నాడు.
నీవు చంద్రుణ్ణి దొంగిలించావు కదా!
మరి రాహువు నిన్ను కూడా వెంటాడగలడు.
విద్యాపతి అంటున్నాడు.
సుందరీ నీవు నిర్భయంగా ఉండు.
ఎందుకంటే నీ ముఖానికి చంద్రునికి పోలికేలేదు.
చంద్రుడు సకలంకుడు, నీ ముఖం నిష్కలంకం.

## కబీరుదాసు

### దోహాలు

1. రెండు శరీరాల్లో ఒక చైతన్యంవలె ఈ తత్త్వము (జీవాత్మ)
ఆ తత్వము (పరమాత్మ) ఒకటే.
నా మనసులోని మాటను నీ మనసుతోనే గ్రహించు.

2. నేను ఉన్నప్పుడు భగవంతుడున్నాడు, ఇప్పుడు
భగవంతుడున్నాడు, నేను లేను.
ప్రేమమార్గం ఇరుకైనది, అక్కడ ఇద్దరికి చోటులేదు.

3. ఆకాశం గర్జిస్తున్నది, అమృతం వర్షిస్తున్నది.
మేఘాలు శ్యామలంగాను, గంభీరంగాను ఉన్నాయి.
నలువైపులా విద్యుల్లతలు మెరుస్తున్నాయి.
కబీరుదాసు నిలువెల్లా తడిసిపోతున్నాడు.

4. శూన్యమే నా నివాసమనే వాక్యం మధురంగా వినిపిస్తున్నది
నా (శరీరం) లోని ప్రతి నరమూ ఒకదీపం. ఓహ్ కరుణామయుడు
దర్శనమిస్తున్నాడు.

5. నా నేత్రాలే గదులు, కనుపాపలే శయ్యగా అమర్చాను
కనురెప్పలనే పరదాలను వేసి నా ప్రియుణ్ణి మురిపించాను,

6. నయనాలలోకి రావయ్యా, నిన్నిక్కడ బందీగా చేస్తాను
నేను ఇతరులను చూడను, నిన్ను చూడనివ్వను.

7. నా ప్రియుడు విదేశాల్లోఉంటే, ఉత్తరాలు వ్రాసిఉండేదాన్ని
నా శరీరంలో, నా హృదయంలో, నయనాల్లో నిండిఉండేవానికి
ఏమి వ్రాసేది?

8. నీ ప్రభువు నీలోనే ఇమిడి ఉన్నాడు, పుష్పంలో సుగంధంవలె
కస్తూరిమృగం గడ్డిలో వెదకినట్లు, నీవు బయటి ప్రపంచంలో
వెదుకుతుంటావు.

9. లోపలా బయటా వెదకి—వెదకి కబీరు ఆశ్చర్యంలో మునిగిపోయాడు.
బిందువు సముద్రంలో కలసిపోయిన తరవాత దాన్ని ఎవడు
వెదకి వెలికి తీయగలడు ?

10. ఎదురు చూసి-చూసి, నా కండ్లు కాయలుకాశాయి.
నామస్మరణ చేసీచేసీ, నా నాలుక పూసిపోయింది.

11. నా నయనాలు వియోగమనే భిక్షాపాత్ర ధరించి బైరాగులవలె ఉన్నాయి
దర్శనమనే మాధుకరాన్ని అడుక్కుంటూ, రాత్రింబవళ్ళు తృప్తిపహించి ఉన్నాయి.

12. ఆత్మానుభవ జ్ఞానాన్నిగురించి అడిగితే ఏమని చెప్పేది ?
మూగవాడు బెల్లంతిని దాని రుచిగురించి ఏమని చెప్పగలడు ?

13. వ్రాయసకాడో, వ్యాపారస్తుడో దస్త్రం వ్రాస్తాడు.
ఏమి వ్రాయాలని అంతర్ముఖుడైనప్పుడు వ్రాయదలచుకున్నది
హృదయంలో ఉన్నపుడు, సాధకుడు ఎల్లెడలా ప్రియుణ్ణే చూస్తాడు.

14. లోగడ ఈ హృదయం ఇతరజీవులను తినే కాకివంటిది.
ఇప్పుడది ముత్యాలుతినే హంసగా మారిపోయింది.

15. హృదయం గెలుపు నీ గెలుపు, హృదయపు ఓటమియే నీ ఓటమి
హృదయంమీద నమ్మకముంచితే ప్రియుణ్ణి పొందగలుగుతారని
కబీరు చెబుతున్నాడు.

16. నన్నెందుకు తొక్కుతున్నావని మట్టి కుమ్మరివాడితో అంటుంది
నేను నిన్ను తొక్కేరోజు కూడా అట్లాగే వస్తుందిలే.

17. తోటమాలి రావడంచూచి మొగ్గలు ఎలుగెత్తి ఆక్రందనం
చేస్తున్నాయి
వికసించిన పువ్వులు ఇవ్వాళ కోతపడుతున్నాయి
రేపు మీ వంతు.

18 సమస్త ధరిత్రి కాగితంగా, సమస్త కాననం కలంగా చేసి
సప్త సముద్రాల జలాన్ని సిరాగా చేసి వ్రాసినా
నాప్రభువు గుణగణాలను పూర్తిగా వ్రాయలేను

19. మాయాదీపం చుట్టీ నరుడు పురుగువోలె తిరిగి తిరిగి
భ్రమించి దానిలో పడి నశిస్తాడు.
గురుప్రబోధం వలన తప్పించుకు తిరిగే సాధువు అరుదు.

20. శూరుడికి శిరస్సూ లేదు, దాతకు ధన సంపదా లేదు.
పతివ్రతకు శరీరములేదు, ఆమె భక్తి మనస్సులో ఉంటుంది

21, వసంత ఋతువు యాచకుడై రాగా,
వృక్షాలు సంతోషంతో ఆకులు ఇచ్చివేసాయి.
(వెంటనే) వాటికి నవపల్లవాలు లభించాయి.
దాత ఎన్నటికీ నష్టపోడు

22. సత్యానికి శాపభయం లేదు. సత్యాన్ని కాలం భక్షించ లేదు.
సత్యానికి సత్యమే లభిస్తుంది సత్యం సత్యంలో కలసి పోతుంది.

23. వాదవివాదం ఘోరవిషం, మాట్లాడటం ఒక వ్యసనం
నిశ్శబ్దంగా ఉండి అందరి మాటలు సహించు, మనస్సులో శాశ్వత నామాన్ని జపించు.

24. వృక్షాలు ఎన్నటికీ పండ్లు తినవు, నదులు నీటినికూడ బెట్టవు.
పరమార్థం కోసరమే సాధువులు శరీరాన్ని ధరిస్తారు.

## కబీరుదాసు – గీతాలు

1. నాకోసం ఎక్కడ వెదకుతున్నావు? నేను నీలోనే ఉన్నాను కదా!
నేను దేవాలయంలో లేను, మసీదులోనూ లేను.
నేను 'కాబా'లో లేను, కైలాసంలోనూ లేను.
నేను కర్మకాండలో లేను, యోగవైరాగ్యంలోనూ లేను.
నిజంగా నన్ను వెదకేవాడివైతే, క్షణం సేపు వెదకితే
నన్ను వెంటనే చూడగలవు. నన్ను కలుసుకో గలవు
ఓ సాధూ! కబీరు మాటవిను. ఆ ప్రభువు ప్రతిశ్వాసలో
శ్వాసవలె ఉన్నాడు

2. నా శరీరంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు.
కాని నా గ్రుడ్డి కళ్ళు చూడ లేవు.
నా శరీరంలో చంద్రుడూ ఉన్నాడు. సూర్యుడూ ఉన్నాడు.
శాశ్వత తత్వపు అనాహత నాదం నాలో మ్రోగుతున్నది.
కాని నా చెవిటి చెవులు దాన్ని వినలేవు.
స్వపర భేదంతో అలమటించినన్ని రోజులు
అతని చేతులు అభావంతో కూడి ఉన్నాయి.
స్వపరబుద్ధి పట్లగల ప్రేమ నశించినపుడే
ప్రభువు పని సంపూర్ణత చెంది నట్లు.

ప్రతి పనికి గల లక్ష్యం జ్ఞానప్రాప్తి.
జ్ఞానం సంప్రాప్తించి నపుడు పని ముగిసినట్లే.

3. నది, నదీ తరంగాలు ఒకటే, నదికి తరంగాలకు భేదమెక్కడిది?
తరంగాలుపైకి లేచినాసరే, తరంగాలు విరిగి క్రింద పడినాసరే
ఆ రెంటికి భేదమేమిటి?
ఏదో పేరు మార్చి తరంగం అనగానే
దానిలోని జలతత్వం మారిపోతుందా?
పరమ బ్రహ్మ తత్వంలో శబ్దాలు పూసలవలె ఉంటాయి.
ఆ తావళంవైపు జ్ఞాన దృక్కులు సారించి చూడు.

4. మిత్రమా! లే, నిద్ర చాలించు
రాత్రి గతించి పోయింది, పగటి సమయాన్ని కూడా పోగొట్టు కొంటావా?
మేల్కొన్న ఇతరులు రత్నాలు, వజ్రాలు సంపాదించు కున్నారు.
ఓ బుద్ధి తక్కువదానా! నీవు నిద్రలో అంతా పోగొట్టుకున్నావుకదా!
నీ ప్రియుడు బుద్ధిమంతుడు, నీవు బుద్ధిహీనురాలివి.
నీ ప్రియునికై నీవు శయ్య యేర్పాటు చెయ్యలేదు.
పిచ్చిదానా! పిచ్చిపిచ్చి పనులతో కాలహరణం చేశావుగదా!
నీ యౌవనం వ్యర్థంగా గడిచి పోయింది.
నీవు నీ ప్రియుణ్ణి తెలుసుకోలేక పోయావు.
మేలుకో, మేలుకో, నీశయ్య ఖాళీగా ఉంది.
అతను రాత్రే వెళ్ళిపోయాడు.
అతని (భవ్య) సంగీతంతో వికలమైన హృదయంగల
పడతియే (జీవాత్మ, మేల్కొంటుందని కబీరు అంటున్నాడు.

**తులసీ దాసు**

## సీతా స్వయంవరము

రఘువీరుని రూపాన్ని చూచి, దేవతలకు మొరలిడి,
ధైర్యం కూడగట్టుకొని,
కన్నుల ప్రేమాశ్రువులు నిండ, శరీరం పులకరించ,
కండ్లార రాముని శోభగాంచి, తండ్రి ప్రతిన భావించి
సీత మనస్సులో క్షోభించింది.
'అయ్యో! తండ్రి దారుణ ప్రతిజ్ఞ పూనాడే
లాభ నష్టాలను గురించి ఆలోచించడే.

భయా క్రాంతులైన మంత్రులు (మంచి) సలహాలు ఇవ్వక పోయారే.
బుధ సమాజంలో చాలా అనుచితమైన కార్యం జరిగి పోయిందే.
కులిశ సమానమైన కఠోరధనువు ఎక్కడ ?
శ్యామల మృదు గాత్రుడయిన కిశోరు డెక్కడ ?
మనస్సును ఎలా చిక్కబట్టుకొనేదయ్యా భగవంతుడా !
శిరీష పుష్పకణం వజ్రాన్ని ఎలా చేధించ గలుగుతుందయ్యా ?
సమస్త సభాసదులకు మతులు పోయినయ్.
ఓ శంభు చాపమా ! ఇప్పుడు నీవేగతి నాకు
నీ భారమంతా ప్రజలపై వేసి,
రఘపతిని చూచి తేలిక అయిపో ! (అని పరితపించింది సీత)
అతిగా పరితపిస్తున్న సీతకు క్షణాలు యుగాలుగా
కనిపించాయి. కాలం ఆగి పోయిందా అని అనిపించింది.
ప్రభువును చూచి, మళ్ళీ కిందికి చూస్తుంది.
ధరిత్రి మీద లోల లోచనాలు విరాజిల్లు తున్నాయి.
విధు మండలంలో మనసి జమీన యుగ్మం నడయాడుతున్నది.
భ్రమరాలను పోలిన మాటలను ఆమె తన ముఖ పంకజంలో బంధించింది.
లజ్జా రూపమైన నిశిని చూసి, ఆభ్రమరాలు బయటికి రావటం లేదు.
లోచన జలం కనుకొలుకుల్లో పరమ లోభి
చేతిలో బంగారంవలె, ఆగి పోయింది.
వ్యాకులత్వం వల్ల సంకోచం పొంది.
ధైర్యం వహించి, హృదయంలో విశ్వాసం పూని,
'మనో వాక్కాయ కర్మల నా ప్రతినలు నెరవేర్చి ఉంటే,
రఘపతి చరణ కమలాలపై నాకు అచంచల అనురాగం ఉన్నట్లయితే.
సర్వంతర్యామి అయిన ఓ సర్వేశ్వరుడా !
నన్ను రఘవీరుని దాసిగా చెయ్యి, అని అనుకుంది.
ఎవరిపట్ల ఎవరికైతే నిజమైన అనురాగం ఉంటుందో
వారివారికి తప్పకుండా లభిస్తారు, ఇందులో ఏమీ సందేహం లేదు
ప్రభువును చూచినపుడు ఆమె ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించింది.
కృపానిధానుడైన రాముడు సర్వం గ్రహించాడు.
సీతను చూసి రాముడు ధనస్సును
గరుడుడు లఘుసర్పాన్ని చూసినట్లు చూశాడు.
రఘువంశ మణి అయిన రాముడు హర కోదండాన్ని
చూడడం లక్ష్మణుడు గమనించాడు.

పులకితగాత్రుడై. కాలితో నేలను త్నతూ అన్నాడు
'ఓ దిక్కుంజరాల్లారా! కమఠమా! శేషుడా! ఆది వరాహమా!
ఓర్పువహించి ధరణిని ధరించండి, కంపించబోకండి.
రాముడు శివ చాపాన్ని విరచ బోతున్నాడు.
జాగరూకులై ఉండండి, నా ఆజ్ఞను మన్నించండి.
రాముడు చాపాన్ని సమీపించినపుడు
స్త్రీ పురుషులు తమ తమ అదృష్టాన్ని ఎంచుకొన్నారు.
అందరి సందేహాలను, అజ్ఞానాన్ని,
మంద బుద్ధులగు రాజుల గర్వాన్ని
భృగుపతి పరశురాముని గొప్ప అహంకారాన్ని,
సురమునివరుల పిరికి తనాన్ని,
సీత యొక్క ఖేదాన్ని, జనకుడి పశ్చాత్తాపాన్ని,
రాణుల మనస్సులలోగల దారుణ దుఃఖాగ్నిని.
వీటినన్నింటిని మూటగట్టి,
శివ చాపమనే నౌకమీద పడవేసి
రామ బాహు బలమనే అపార సింధువు
దాటుదామంటే నావికుడే లేడు.
రాముడు ప్రజా సమూహాన్ని విలోకించాడు.
అందరు చిత్రంలోని బొమ్మలవలె స్థాణువులై ఉన్నారు.
ఎక్కువగా వ్యాకులం చెందిందని రాముడు సీతను
ప్రత్యేకంగా చూశాడు.
నిమిషాలను కల్పాలుగా గడుపుతున్న సీతను
ప్రత్యేకంగా చూశాడు
తృషితుడై, జలందొరక్క శరీరం విడిచివేసిం తర్వాత
అమృత సాగరం లభిస్తే లాభం ఏమిటి?
పొలాలు ఎండి పోయింతర్వాత వానలు కురిస్తే లాభం ఏమిటి?
అవకాశం చేజారి పోయిన తర్వాత పశ్చాత్తాప పడితే లాభం ఏమిటి?
అలా తలంచి ప్రభువు జానకిని చూశాడు.
అత్యధికమైన ప్రీతిని గమనించి పులకించాడు.
గురువుకు మనస్సులో నమస్కరించాడు.
అతి లాఘవంగా వింటిని చేత బట్టాడు.
పైకి లేవనెత్తినప్పుడు అది మెరపులా మెరసింది.
ఆకాశం ధనుష్ మండలంలా ప్రతిభాసించింది.

ధనస్సు చేతబట్టి ఎక్కు పెట్టి ఎప్పుడు వంచాడో, ఎవరూచూ
డలేదు, ఆశ్చర్యచకితులై నిలబడి పోయారే కాని,
క్షణంలో రాముడు ధనస్సును మధ్యకు విరిచేశాడు.
భువన భాండాలలో కఠోరరవం వ్యాపించింది.
సూర్యాశ్వాలు మార్గం తప్పి సంచరించాయి.
దిగ్గజాలు తల్లడిల్లాయి.
అహి, కోల, కూర్మాలు కలవరపడ్డాయి
భూమి, దానిని మోసేవారూ వణికిపోయారు
సురలు, అసురులు, మునులు చెవులు మూసుకొని
ఏమిటా ఈ బ్రహ్మాండరవం ? అని వికలులై ఆలోచించారు
తులసీదాసు అంటున్నాడు 'రాముడు కోదండాన్ని ఖండించాడు'
(అప్పుడు) వాళ్ళంతా జయజయారావాలు చేశారు.
రఘువరుని బాహుబలం సాగరం.
శంకర చాపం నౌక.
దాని ఆధారంగా గ్రహించినవారి
భ్రమలు అన్నీ మునిగి నశించిపోయాయి.

## కవితావలి

1. అయోధ్యాపురంనుండి వెలువడి
రఘువీరుని ప్రియురాలు (సీత) చాలా ధైర్యంతో
నాలుగు అడుగులు వేసింది.
(ఆమె) లలాట ఫలకంపై స్వేదబిందువులు మిలమిలా మెరిసాయి
మధురాధరాలు ఎండిపోయాయి.
'ఇంకా ఎంతదూరం పోవాలి ?'
పర్ణకుటీరం ఎక్కడ నిర్మించుకుందాం ? అని అడగసాగింది.
ప్రియురాలి ఆతురత చూసి
ప్రియతముని మనోహర నయనాల నుండి
కన్నీటి బొట్లు జల జలా రాలాయి.

2. ప్రియా ! లక్ష్మణుడు బాలకుడు.
నీళ్ళు తేవడానికి వెళ్ళాడు.
ఒక ఘడియసేపు ఎక్కడైనా నీడలో నిలబడి ఎదురు చూద్దాం
చెమట తుడిచి గాలి విసురుతాను.

ఇసుకలో కాలిన చరణాలను కడుగుతాను.
ప్రియురాలి అలసటను గ్రహించి శ్రీ రామచంద్రుడు
చెట్టు నీడన కూర్చొని చాలా సేపు ఆమె కాళ్ళలోని ముండ్లు
తీసాడు అని తులసీదాసు అంటున్నాడు.
నాథుని ప్రేమను చూచి జానకి శరీరం రోమాంచితమైంది.
(ఆమె) కండ్లలో నీళ్ళు నిండాయి.

3. శ్యామ వర్ణంగల వానికి, గౌరవర్ణం గల వానికి మధ్యన ఒక నారి ఉంది.
సకియా ! నావలె చూడవే ఆమె అందం.
అరణ్యమార్గానికి పనికి రానిది, అతి సుకుమారి ఆమె.
ఎలా నడిచి పోగలుగుతుందో కదా !
ఆమె చరణ స్పర్శకు మహీతలం సంకుచితమై పోతున్నది.
తులసీ అంటున్నాడు.
ఆ సకియ మాటలు విని గ్రామ స్త్రీలందరు విస్మితులయ్యారు.
వారి శరీరాలు పులకరించాయి, నేత్రాల నుండి అశ్రువులు
ప్రవహించ సాగాయ్, అప్పుడు అందరూ
'ఈ రాజ కుమారులిద్దరూ అన్ని విధాలా మనోహర,
మోహన మూర్తులు, అనుపమ సౌందర్యవంతులు' అని అన్నారు.

4. శ్యామల వర్ణం కలవాడు, గౌరవర్ణం కలవాడు
(ఇద్దరూ) సహజ సుందరులు.
మనోహరతలో కాముని క్రింద చేసిన వారు.
చేత విల్లంబులు (ధరించి), తూణీరం బిగించి కట్టుకొన్నారు.
శిరస్సు మీద సుందర జటాజూటం, మునివేషం ధరించి ఉన్నారు.
(వారి) వెంట చంద్ర వదన యగు స్త్రీ ఉంది,
ఆమె తన సౌందర్యంలో ఒక్క అణువు రతికి ప్రదానం చేసింది
వారి కాళ్ళకు పాదరక్షలు లేవే ?
కాలి నడకన అడవి ఎలా దాటగలరా ? అని మనస్సు సందేహిస్తున్నది.

5 ఆ రాణి (కైకయి) మహామూర్ఖురాలు అని నేను గ్రహించాను.
ఆమె హృదయం వజ్రంకంటె, శిలకంటె కఠోరమైనటువంటిది
ఆ రాజుకు కూడా కర్తవ్యా కర్తవ్యాల జ్ఞానం లేకుండా పోయింది.
ఇటువంటి మనోహర రూపం గల వీరిని వదలి ప్రియజనులు ఎలా జీవిస్తున్నారోగదా !
వీరు కనుపాపలవలె ఉంచుకోదగ్గ వారు కదా !
వీరిని అడవులకు పంపటానికి మనస్సు ఎట్లా వచ్చిందో కదా !

6. శిరస్సున జటలు
విశాలమయిన వక్షఃస్థలం, ఆజాను బాహువులు
అరుణ నయనాలు, ధనురాకారాలైన కనుబొమలు
తూణీరం, ధనస్సూ, బాణాలు ధరించి
తులసీ ! వనమార్గంలో శోభాయమానంగా విరాజిల్లుతున్నారు.
సహజంగానే ఆదర పూర్వకంగా మాటిమాటికి నీ వైపుచూచి
మా మనస్సులను ముగ్ధులను కావించే
ఆ శ్యామలాంగుడైన రాజ కుమారుడెవరో మాకు చెప్పవమ్మా
(అని గ్రామ స్త్రీలు సీతను అడుగుతున్నారు)

7. అమృతంతో కూడిన ఆ మధుర వచనాలు విని
జానకి ఆ గ్రామ స్త్రీలు జాణలని గ్రహించింది.
వంకర చూపులు చూచి, కండ్లతోనే సైగలు చేసి,
తెలియ చెప్పి, ముసి ముసి నవ్వులు నవ్వుతూ జానకి వెళ్ళి పోయింది.
తులసీ అంటున్నాడు
ఆ సమయంలో నయనాలను సార్థకం చేసే శ్రీ రామచంద్రుని చూస్తూ
ఆ స్త్రీలు సూర్యోదయ సమయంలో, ప్రేమరూపకమైన తటాకంలో
వికసించిన మనోహర ముకుళాలవలే శోభించారు.

## సూరదాసు (గీతాలు)

1. ఓ మనసా ! హరివిముఖుల సాంగత్యం వదలివేయి.
ఎవరి సాంగత్యం వలన దుష్టబుద్ధులు కలుగుతాయో,
హరి భజనకు భంగం వాటిల్లుతుందో,
అట్టి హరి విముఖుల సాంగత్యం వదలి వేయి.
సర్పానికి పయఃపానం చేయించినందు వలన
అది తన విషాన్ని విడిచి వేస్తుందా ?
కాకికి కర్పూరం తినిపించినా, శునకానికి గంగా స్నానంచేయించినా
గార్ధభానికి సుగంధ ద్రవలేపనం చేసినా, కోతికి ఆభూషణాలు
అలంకరించినా, ఏమిటి లాభం ?
గజరాజుకు నదీ స్నానం చేయించినా, అది మళ్ళీ దుమ్మెత్తిపోసుకుంటుంది కదా !
తూణీరాన్ని ఖాళీచేసినా, బాణాలవల్ల ప్రస్తర ఖండాన్ని ఛేదించలేం కదా !
సూరదాసా ! ఖలుడు నల్లటి కంబళి వంటి వాడు,
తన రంగు తప్ప ఇంకో రంగు గ్రహించడు.

2. 'నేను వెన్న పూస తిన లేదమ్మా'
మిత్రులంతా కుట్ర పన్ని, నా ముఖాన పులిమారు, నీవె చూడు.
ఉట్టి మీద, ఎత్తున వేలాడ కట్టివున్నాయి కదా వెన్న కుండలు.
నేను నా చిన్ని చేతులతో వాటిని ఎట్లా అందుకోగలను ?
పెదవులకు అంటిన పెరుగును తుడుచుకుంటూ, నంద మోహనుడు
వెన్నదొన్నె వీపు వెనక దాచుకుంటూ, ఇలా అన్నాడు.
ఆ (మాటలు విని ) చేతిలోని కర్ర పడవేసి, నవ్వుతూ, యశోద
శ్యామ కృష్ణుణ్ణి హృదయానికి హత్తుకొంది.
బాల వినోద మోదంతో ఆమె మనస్సు ముగ్ధంచేసి,
భక్తి ప్రతాపం చూపాడు భగవంతుడు
యశోదకు లభించిన సుఖం,
శివునికి, విరించికి కూడా లభించలేదని సూరదాసు అంటున్నాడు.

3. నేను చాలా సేపు ఈ ఆట ఆడానయ్యా గోపాలా !
చాలా సేపు ఆడానయ్య.
కామ క్రోధాలనే వస్త్రాలు ధరించి, మెడలో విషయ వాసనలనే
పూల మాలలు ధరించాను
కాళ్ళకు కట్టుకొన్న మహామోహమనే నూపురాలు మ్రోగుతున్నాయి
పర నిందావాక్యాలు చాలా మధురంగా తోస్తున్నాయి.
భ్రమ జాలంతో నిండిన మనస్సు, అసంబద్ధమైన లయతో
తబలావలె మ్రోగుతున్నది.
నానా రకాలుగా తాళం వేస్తూ ఈ శరీరంలో తృష్ణ ప్రతిధ్వనిస్తున్నది.
మాయ అనే కాసె కోక నడుముకు బిగించాను.
లలాటాన లోభమనే తిలకం దిద్దాను.
ఈ జీవితాన్ని ఈ విధంగా ఎన్నో సార్లు నటించానయ్యా
కోటి కళలతో, దేశ కాలజ్ఞానం లేకుండా చాలాసేపు ఆడానయ్యా
సూరదాసు (ఇలా) ప్రార్థిస్తున్నాడు
ఓ నందలాల ! సమస్త అజ్ఞానాన్ని తొలగించి ముక్తి ప్రసాదించవయ్యా.

4. అమ్మా ! నన్ను అన్నయ్య తెగ డిపిపిస్తున్నాడే,
నీవు నన్ను కనలేదనీ, ఎక్కడో నన్ను కొనుక్కొచ్చావనీ అంటున్నాడే.
ఏం చేసేది నేను ? ఈ రోషంతో నేను ఆడుకోడానికి పోవడం లేదు.
మాటిమాటికీ నీ తండ్రి ఎవరు ? తల్లి ఎవరు ? అని అడుగుతున్నాడే.
నందుడు తెల్లనివాడు, యశోద రంగు తెలుపు.

మరి నీవు నల్లనీ వాడివి కదా !
చిటికెలు వేసి వేసి గోపాల బాలకులకు నేర్పుతున్నాడే అన్నయ్య-
వాళ్ళంతా నవ్వుతూ నన్ను వెక్కిరిస్తున్నారే
నీవు నన్నే కొడతావు కాని, వాణ్ణి మాట మాత్రానికైనా తిట్టవు.
సూరదాసు అంటున్నాడు.
మోహనుని నోట రోషపూర్ణాలైన ఈ మాటలు విని
యశోద ముగ్ధురాలైంది.
కన్నా ! విను, బలభద్రుడు చిన్ననాటి నుండి దుష్టుడు.
నా గోధనం మీద ఒట్టు.
నీవు నా పుత్రుడివే, నేను నీకు తల్లినే.

## కేశవదాసు

### రామచంద్రిక

అశోక వృక్షాన్ని చూచి రాజ పుత్రిక (సీతా) ఇలా అన్నది
'అగ్నిలా ఉన్న నీవు నాకు అగ్ని ప్రదానం చేయి'
ఆ సమయంలో పవన పుత్రుడు ముద్రిక పడవేశాడు.
అటు ఇటు చూచి ఆమె ముద్రిక చేకొన్నది.
అది చల్లగా అనిపించేటప్పటికి,
'ఇది ఎటువంటి అగ్ని ప్రభూ' అని అనుకొన్నది.
రత్న జటితమయిన ఆ ముద్రికనుచూచీ,
దానిపై చెక్కబడిన పేరును చదివీ,
సీత సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయింది.
'బాల్యకాలంనుండి రఘునాథుడు ధరించిన ముద్రికే ఇది.
ఇది ఆయన చేతినుండి ఇక్కడికి ఎలావచ్చింది ? ఎవరు తెచ్చారు ?
భయభ్రాంతురాలై నలువైపులాచూచి, ఆకాశంవైపు చూచింది.
కొమ్మమీద కూర్చొనిఉన్న శాఖామృగాన్ని చూచింది.
'ఎవరు నీవు ? దేవతవా ? దానవుడివా ?
పక్షరహితుడివైన[1] యక్షుడివా ? వానరవేషం ధరించిన దశకంఠుడివా ?
నీ రహస్యాన్ని త్వరగా వెల్లడించు.
నా మనస్సు వ్యాకులపడుతున్నది.
నీ మోసాన్ని త్వరగా వెల్లడించు.
లేకపోతే శాపమియ్యగలను !

భయకంపితుడై కొమ్మను ఊపుతూ
ఆ వానరం భూమిమీదకు దూకాడు.
కరములు ముకుళించి ఇలా అన్నాడు.
'నేను హనుమంతుణ్ణి, అమ్మా రామదూతనని గుర్తించవమ్మా !

1. స్వపక్షానికి చెందినవాడివా ? లేక శత్రుపక్షానికి చెందినవాడివా ?
'ఎవరా రాముడు ? 'దశరథ సుతుడు.'
'ఎవరా దశరథుడు ?' 'అజ సుతుడు.'
'ఇక్కడికి ఎందుకు పంపబడ్డావు ?'
'సందేశం ఇవ్వడానికి, సందేశం తీసుకుపోవడానికి'
'రఘుపతి లక్షణాలు, గుణ, రూప, శీల, శోభా, స్వభావాలు తెలుపవయ్యా.
'సుమిత్రా సుతుడు భక్తియుక్తుడై
అతిశూరుడై, శక్తివంతుడై సేవలుచేస్తూ ఉన్నా,
ముగ్గురు అనుజులు సమానులయినా
భరతుని పట్ల ఆయనకు ప్రత్యేకప్రేమ
నారాయణుని ఉరస్థలంపై శ్రీ వసించినట్లు
రఘుపతి వక్షఃస్థలంపై ద్యుతి ప్రకాశిస్తున్నది.
భూస్థలిపైగల భూమీశులుగాని
దేవతలుగాని, రాక్షసులుగాని
రూపసంపదలలో రామునితో సరితూగలేరు'.
'నాకు ఈ మాటలతో విశ్వాసం కలుగలేదు
వానరులతో స్నేహం ఎలా కలిగిందో తెలియచెప్పు'
విషయమంతా వివరించి, విశ్వాసం కలిగించిన తరవాత
సీతాదేవి ఆ ముద్రికను కన్నీటితో తడిపి
హృదయానికి హత్తుకున్నది.
కరుణాపూర్ణమైన స్వభావముకల సీతాదేవి
కన్నీరు కురిపిస్తూ, హృదయంలో హర్షిస్తూ,
ప్రియముద్రికను చూస్తూ,
అనేక విధాలుగా వర్ణించసాగింది.
'దుఃఖ తమస్సును హరించే సూర్యకిరణమా ?
హృదయ శీతలకారి అయిన శశికళయా ?
కలకీర్తిశ్రీ శుభసహితమైన నామమా ?
రాముడు త్యజించిన రాజ్యశ్రీకి చిహ్నమా ?
నారాయణుని హృదయానికి ప్రతిమూర్తియా ?

మరి నీవు నల్లనీ వాడివి కదా !
చిటికెలు వేసి వేసి గోపాల బాలకులకు నేర్పుతున్నాడే అన్నయ్య-
వాళ్ళంతా నవ్వుతూ నన్ను వెక్కిరిస్తున్నారే
నీవు నన్నే కొడతావు కాని, వాణ్ణి మాట మాత్రానికైనా తిట్టవు.
సూరదాసు అంటున్నాడు.
మోహనుని నోట రోషపూర్ణాలైన ఈ మాటలు విని
యశోద ముగ్ధురాలైంది.
కన్నా ! విను, బలభద్రుడు చిన్ననాటి నుండి దుష్టుడు.
నా గోధనం మీద ఒట్టు.
నీవు నా పుత్రుడివే, నేను నీకు తల్లినే.

## కేశవదాసు

### రామచంద్రిక

అశోక వృక్షాన్ని చూచి రాజ పుత్రిక (సీతా) ఇలా అన్నది
'అగ్నిలా ఉన్న నీవు నాకు అగ్ని ప్రదానం చేయి'
ఆ సమయంలో పవన పుత్రుడు ముద్రిక పడవేశాడు.
అటు ఇటు చూచి ఆమె ముద్రిక చేకొన్నది.
అది చల్లగా అనిపించేటప్పటికి,
'ఇది ఎటువంటి అగ్ని ప్రభూ' అని అనుకొన్నది.
రత్న జటితమయిన ఆ ముద్రికనుచూచీ,
దానిపై చెక్కబడిన పేరును చదివీ,
సీత సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయింది.
'బాల్యకాలంనుండి రఘునాథుడు ధరించిన ముద్రికే ఇది.
ఇది ఆయన చేతినుండి ఇక్కడికి ఎలావచ్చింది? ఎవరు తెచ్చారు?
భయభ్రాంతురాలై నలువైపులాచూచి, ఆకాశంవైపు చూచింది.
కొమ్మమీద కూర్చొనిఉన్న శాఖామృగాన్ని చూచింది.
'ఎవరు నీవు? దేవతవా? దానవుడివా?
పక్షరహితుడివైన[1] యక్షుడివా? వానరవేషం ధరించిన దశకంఠుడివా?
నీ రహస్యాన్ని త్వరగా వెల్లడించు.
నా మనస్సు వ్యాకులపడుతున్నది.
నీ మోసాన్ని త్వరగా వెల్లడించు.
లేకపోతే శాపమియ్యగలను !

భయకంపితుడై కొమ్మను ఊపుతూ
ఆ వానరం భూమిమీదకు దూకాడు.
కరములు ముకుళించి ఇలా అన్నాడు.
'నేను హనుమంతుణ్ణి, అమ్మా రామదూతనని గుర్తించవమ్మా !

1. స్వపక్షానికి చెందినవాడివా ? లేక శత్రుపక్షానికి చెందినవాడివా ?
'ఎవరా రాముడు ?' 'దశరథ సుతుడు.'
'ఎవరా దశరథుడు ?' 'అజ సుతుడు.'
'ఇక్కడికి ఎందుకు పంపబడ్డావు ?'
'సందేశం ఇవ్వడానికి, సందేశం తీసుకుపోవడానికి'
'రఘుపతి లక్షణాలు, గుణ, రూప, శీల, శోభా, స్వభావాలు తెలుపవయ్యా.
'సుమిత్రా సుతుడు భక్తియుక్తుడై
అతిశూరుడై, శక్తివంతుడై సేవలుచేస్తూ ఉన్నా,
ముగ్గురు అనుజులు సమానులయినా
భరతుని పట్ల ఆయనకు ప్రత్యేకప్రేమ
నారాయణుని ఉరస్థలంపై శ్రీ వసించినట్లు
రఘుపతి వక్షఃస్థలంపై ద్యుతి ప్రకాశిస్తున్నది.
భూస్థలిపైగల భూమీశులుగాని
దేవతలుగాని, రాక్షసులుగాని
రూపసంపదలలో రామునితో సరితూగలేరు'.
'నాకు ఈ మాటలతో విశ్వాసం కలుగలేదు
వానరులతో స్నేహం ఎలా కలిగిందో తెలియచెప్పు'
విషయమంతా వివరించి, విశ్వాసం కలిగించిన తరవాత
సీతాదేవి ఆ ముద్రికను కన్నీటితో తడిపి
హృదయానికి హత్తుకున్నది.
కరుణాపూర్ణమైన స్వభావముకల సీతాదేవి
కన్నీరు కురిపిస్తూ, హృదయంలో హర్షిస్తూ,
ప్రియముద్రికను చూస్తూ,
అనేక విధాలుగా వర్ణించసాగింది.
'దుఃఖ తమస్సును హరించే సూర్యకిరణమా ?
హృదయ శీతలకారి అయిన శశికళయా ?
కలకీర్తిశ్రీ శుభసహితమైన నామమా ?
రాముడు త్యజించిన రాజ్యశ్రీకి చిహ్నమా ?
నారాయణుని హృదయానికి ప్రతిమూర్తియా ?

అన్ని అక్షరాలపై శ్రీవలె ప్రకాశిస్తున్నదా ?
పర విద్యవలె ఆనందప్రదాయినా ?
అష్టావద వాహిని ఆయిన పార్వతి అని అనుకొనేదా ?
మాయా సహితమైన బ్రహ్మ పదార్థంవలెకనిపిస్తున్నది
ముద్రా సహితమైన లేఖవలె కన్పిస్తున్నది
శ్రీ రామ జయమని ఉచ్చరించే రాజసేవకునివలె కన్పిస్తున్నది
నా ప్రియుడు పంపిన ప్రియసఖి ఇది
జగభూషణుడైన రాముని ఆ భూషణం ఇది
ఈ ఆపదలో నాకు ధైర్యం కరపడానికి వచ్చిందా
నా రహస్యాన్ని తలపులను తెలుసుకొ పోదామని వచ్చిందా ?
సుఖదాయిని, శిక్షాప్రదాయిని, అర్థదాయిని, యశదాయిని,
రస (ఆనంద) ప్రదాయిని అయిన పరమ గురు స్త్రీ వలె
ఉన్నది ఈ శ్రీ రామ చంద్రిక
ఇది నిశ్చయంగా తమోగుణాన్ని హరించేది
జగత్ మార్గదర్శకం.
బహువర్ణ విభాజితమైన ఈ ముద్రిక సూర్యకిరణం వలె ఉన్నది.
నగరంలో రాజ్యలక్ష్మి, వన ప్రాంతాలలో నేను, ఆయన్ను వదిలేశాం.
అయితే ఇప్పుడు నీవు ఆయన్ను వదలి వేశావు.
ఇహ మన స్త్రీ జాతిని ఎవరు నమ్ముతారు ?
రాముడు కుశలమేనా ఓ ముద్రికా !
స్వాభిమానపూర్ణుడైన లక్ష్మణుడు కుశలమేనా ?
ఈ ముద్రిక పలకడం లేదు.
బుద్ధిమంతా ఓ హనుమంతా నీవైనా చెప్పవయ్యా.
నీ వియోగం వలన ఈ ముద్రికకు కంకణ పదవి లభించింది కదా !
అందుచేత ముద్రికా ! అని పిలిచినందువలన ఈ ముద్రిక
పలకడం లేదు, అని హనుమంతుడు అన్నాడు.

## ఘనా నంద్

# ప్రేమ మార్గం

1. ప్రేమ మార్గం అతి సరళమైనటువంటిది
కుటిల భావాలకు అణుమాత్రం అవకాశం లేనిది.
నిజమైన ప్రేమభావం కలవారు

అహంభావాన్ని వదలి వేస్తారు.
కపట బుద్ధిగలవారు నిస్సంకోచంగా ప్రవర్తించలేరు.
ఘనానంద్ ప్రియురాలైన ఓ సుజాన్ ! ఈ మాట విను.
ప్రేమ మార్గంలో తా బట్టిన కుందేటికి మూడే కాళ్ళు,
కాని నీవు ఎటువంటి చదువు నేర్చుకొన్నావో కాని
మన్ 1. తీసుకుంటావు కాని
చటాకు 2. మాత్రమైనా తిరిగి ఇవ్వవు.
1. మన్ = మనస్సు, మణుగు బరువు
1. చటాకు=రవ్వంత శోభ. మణుగులో 16 వ వంతు.

## వాయుదేవునికి నివేదన.

2. సోదరుడా ! పవనుడా !
నీవు అన్ని చోట్లకు పోగలుగు తావు.
నీ లాంటి వారు ఇంకెవరున్నారు ?
మనస్సును కరగించి వేసే వాక్కును కలిగించు.
నీవు జగత్తుకు ప్రాణానివి.
పెద్ద, చిన్న అందరికీ సమానుడివి.
ఘన ఆనందానికి నిధానానివి
దుఃఖితులకు సుఖం కలిగించు.
నా సుజాన్ శోభయుక్తమైనటువంటిది గుణవంతురాలు.
నాకు అత్యంత ప్రియమైనటువంటిది.
ఇప్పుడే నేనంటే గిట్టనిదైంది.
పెడముఖం పెట్టుకొని కూర్చున్నది.
విరహవ్యథను నివారించే మూలిక ఆమె చరణాల ధూళి
(అది నాకు) కొద్దిగా తెచ్చి పెట్టు. కండ్ల నిండా ధరిస్తాను.

**భారతేందు హరిశ్చంద్ర**

## యమునా వర్ణన

యమునా జలాలను స్పృశించడానికో,
(లేదా) తమ శోభను జలముకురంలో తొంగిచూచుకోడానికో,
(లేదా) పరమ పావన ఫలాన్నాశించి పవిత్ర యమునా జలాలకు ప్రణమిల్లుతున్నవో,
లేదా (యమునా నదికి) ఆ తపనివారణం కలిగించటంకోసం తీరంపై

దట్టంగా వ్యాపించి ఉన్నవో,
(లేదా) హరి సేవలకై ప్రణమిల్లుతున్నవో, అన్నట్లు
తరణి తనూజా తటంపై తమాల తరువరాలెన్నో వంగి ఉన్నాయి.
వాటిని చూచి నయన సుఖం లభిస్తున్నది.
జల మధ్యంలో ప్రతిబింబించే చంద్రుడు
చంచల నదీతరంగాలతో ఆడుకుంటున్నాడు.
మనస్సుకు ఆనందం కలిగిస్తున్నాడు
హరి దర్శనానికై చంద్రుడు జల మధ్యంలో నివసిస్తున్నాడో,
(లేదా) తరంగముకురాలు చేత ధరించి శోభిస్తున్నాడో
(లెదా) నదీ హృదయంలో ఉన్న హరి మూర్తి ప్రతిబింబిస్తుందో
అన్నట్లున్నది చంద్రబింబం.
శీత కరుడు ఒకప్పుడు శతచంద్రులై ప్రకాశిస్తాడు.
ఒకప్పుడు దాక్కుంటాడు.
మరొకప్పుడు బయటపడతాడు.
పవన గమనవశమై ఆ చంద్రబింబం
బహురూపాలుగా భాసిస్తున్నది.
అనురాగ భరితుడై శశి యమునా జలంతో విహరిస్తున్నాడో
తరంగాలమీద ఉయ్యాలలూగుతున్నాడో
ఆకాశంలో చిన్ని గాలిపటంవలె అటుఇటు అల్లలాడుతున్నాడో
అన్నట్లు ఉంది.
(లేదా) వ్రజవనిత జలక్రీడలాడుతున్నదో అన్నట్లు ఉన్నది.
విమల కోమలాలైన ఇసుక తిన్నెలు వ్యాపించిఉన్నాయి
ఉజ్వలంగా మెరుస్తున్న ఆ ఇసుక వెండి మెట్టవలె
మనస్సును అలరిస్తున్నది.
(ఆ ఇసుక) ప్రియాగమనానికై పరచబడిన తివాచివలె ఉన్నది.
రత్నరాసులను పొడిచేసి తీరాలలో వెదజల్లినట్లున్నది
శ్యామల జల చికురాల పాపిడిలో ముత్యాలు నింపినట్లున్నది.
వ్రజనివాసం వలన కలిగిన హృదయోల్లాసం వలన
ఆ తీరాలలో సత్వగుణం వ్యాపించినట్లున్నది.

శ్రీధర్ పాఠక్

## కాశ్మీర ప్రకృతి సౌందర్యం

ప్రకృతి ఇక్కడ ఏకాంతంగా కూర్చొని
తన అందానికి మెఱుగులు దిద్దుకొంటున్నది.
క్షణక్షణానికి వేషం మార్చుకొంటున్నది.
క్షణికమయిన శోభను ధరిస్తున్నది.
విమలాంబుపూర్ణాలైన సరోవరాల్లో
తన ముఖబింబాన్ని చూచుకుంటూ ఉంటుంది.
తన సౌందర్యాన్ని చూచుకొని తానే మురిసిపోతుంది.
తుషారావృతాలైన గిరిశిఖరాలు కిరీటమాలికలవలె ఉన్నాయి.
ధవళ నిర్ఝరిణులు వెన్నెల సోనలై ప్రవహిస్తున్నాయి.
ధరిత్రీ గర్భంనుండి, రత్ననిధి ఉద్భవించినట్లు
వనాలు, కాననాలు, ఫలపుష్పాదుల శోభతో నిండిఉన్నాయి.
మనోజ్ఞంగా ఉన్నాయి.
నదులతో, సరస్సులతో, కాననాలతో,
తుషారావృతాలైన శిఖరాలు
భారతదేశం శిరస్సుపై భగవంతుడు
అనుపమ కిరీటం అలంకరించినట్లుంది.
అప్పుడప్పుడు శిఖరపంక్తి, ద్వితీయ చంద్రునివలె కనపడుతుంది.
(లేదా) మహేశ్వరుడు తన లలాటంపై చందనం అలదికొన్నట్లుంది.
ప్రకృతి సౌందర్యం అలంకృతమయిన దృశ్యాలు
ఎంత జాగ్రత్తగా దాచబడి ఉన్నాయంటే
ప్రకృతి సంపద సంరక్షణ కోసం
భగవంతుడు కోట కట్టాడా అని అనిపిస్తుంది.
(లేదా) సమస్త ప్రపంచంలో ఉన్న సౌందర్యాన్ని
ప్రోగుచేసి ఈ భోషాణంలో దాచిపెట్టినట్లున్నది.
భ్రమ అనే పుష్పలావిక చేత
భారతదేశ శిరస్సుపై భగవంతుడు పూలు జల్లించినట్లుంది.
ఇది కామధేనువా ?
లేక సూర్యాశ్వపు కాలిగిట్టయొక్క చిహ్నమా ?
లేక బ్రహ్మ పాత్రనుండి ప్రవహిస్తున్న అమృతమా ? అన్నట్లుంది.
ఉహుఁ. ఈ సౌందర్యాన్ని దీంతోనే పోల్చాలి.

ప్రపంచంలో దీంతో తులతూగగలది మరొకటి లేదు.
ఇది సురలుండే స్థానం, స్వర్గం.
ఇది దేవతల నందనవనం.
ఇక్కడే దేవతలు నివసిస్తారు.
ఇది ఆభరణాలకు ఆభరణం.
ఇక్కడే ఎక్కడో దేవతలరాజు ఇంద్రుడు ఉండిఉంటాడు.
అక్కడ అక్కడా పరుగులిడుతున్న జలప్రవాహాలు
మధుర కలస్వనంతో ప్రవహిస్తున్నయ్
ధవళ తుషారజలం తృషితులైన ప్రాణులకు అమృతం లాంటిది.
రకరకాల ఉష్ణతను తొలగించే శీతల మంద పవనం
మనోహరంగా ఉంది.
ఇక్కడ మేఘాలు కండ్లకు కనపడుతాయి.
నేలను తాకుతాయి.
తమ ఇచ్ఛానుసారం వర్షిస్తాయి.

## అయోధ్యాసింహ ఉపాధ్యాయ 'హరిఔధ్'

## మహత్ నృత్యం

1. భూతలంపై శారద సౌందర్యం వ్యాపించిఉంది.
నీల అనంతాకాశం నిర్మలంగా ఉంది
దిక్కులలో అమితమైన తెల్లనికాంతి వ్యాపించిఉంది.
ప్రకృతి ఉత్ఫుల్లమై భాసిస్తున్నది.

2. మేఘశూన్యమైన నభం ఉజ్వలకాంతితో నిండిపోయింది.
నవదిగ్వధువు మాలిన్య రహితమై ప్రసన్నంగా ఉంది.
భవ్య భూప్రదేశం కర్దమరహితంగాను, స్వచ్ఛంగాను
రమణీయంగాను ఉంది.
అన్నివైపులా స్వచ్ఛజలంలాంటి నిర్మలత్వం విలసిల్లుతూఉంది.

3. కాంతారంలోను నదీతీరంలోను, గహ్వరాలలోను
స్వచ్ఛమైన జలంతోకూడిన సెలయేళ్ళు మందగతితో ప్రవహిస్తున్నాయి.
వాటిలోనుండి నిరంతరం విచిత్రమైన ధ్వని ప్రసరిస్తున్నది.
అవి (ఆ సెలయేళ్లు) పుణ్యాత్ములైన శరత్తుయొక్క
కీర్తిని కలగానం చేస్తున్నట్లున్నయ్.

4. అది కార్తీకమాసపు నిశీథం
అతి రమ్యమైనరాకా నిశీథి
సమస్త కళలతోకూడి చంద్రుడు
దిశలన్నింటిని విమలమూ, జ్యోతిర్మయమూ చేస్తూ ప్రకాశిస్తున్నాడు.
క్షితిమీద తెల్లదనం, సౌందర్యంతో విలసిల్లుతున్నది.

5. సకల పాదపాలు చంద్రికలో సుస్నాతాలయి ఉన్నట్లున్నయ్.
ప్రతి పల్లవము ప్రభామయంగా కనపడుతున్నది.
వికచలతా సమూహం, ప్రఫుల్లిత శాఖాచయం.
విచిత్రతరమైన జ్యోతిస్సులో మునిగి తేలుతున్నట్లున్నయ్.

6. సితయామిని పరిపూర్ణంగా సముజ్వలమై ఉంది.
రజనీపతియైన చంద్రుడు భానునివలె వెలుగొందుతున్నాడు.
చతుర చకోరి ఒకప్పుడు పరమమోహకరమైన సుధను గ్రోలుతుంది.
మరొకప్పుడు చకితురాలై (ప్రకృతి రమణీయతను) విలోకిస్తుంది.

7. పుష్పసౌరభాన్ని, తుషారబిందువులను గ్రహించి
మనోహరములు, వికాసకారులు అయిన
సుందర సుధాకరుని వీచికలలో మునిగి
మనోహరమైన పవనం మెల్లమెల్లగా వీస్తున్నది

8. ఇటువంటి అలౌకిక అపూర్వ వసుంధరా ప్రదేశంలో
మనోరమమూ, అలంకృతం అయిన సమయంలో అకస్మాత్తుగా
ఆనందకందమూ, గోపగణాగ్రణి అయిన మోహనుని
అతిమధుర మురళీనాదం వినబడ్డది.

9. భావాశ్రయము, సర్వముగ్ధకారి అయిన మురళీరావం
మొదట మారుతంతోపాటు దిగంతాలలో వ్యాపించింది.
ఆ తరవాత
ప్రమోదవర్ధకాలయిన పీయూష బిందువులవలె
బహురసజ్ఞుల శ్రవణాలలో ప్రవేశించింది.

10. వంశీనాదాన్ని విని, అపార జనసమూహం
ఉత్సాహంతో కూడుకొన్నదై
ఇండ్లూ వాకిళ్లు వదలి పరిగెత్తుకుంటూ వచ్చింది.
గోపికా సమేతులయిన గోపాలకులు
విహారాభిలాషతో వనప్రాంతానికి వచ్చారు.

11. అందరూ గుంపులు గుంపులుగా చేరి
వాద్యాలు వాయించి, మనోహర కంఠస్వరంతో పాడి
ప్రమత్తమైన మనస్సులతో, ఉన్మత్తప్రాయులై
ఆ విపినంలో కమనీయ క్రీడలు మొదలెట్టారు.

12. మధుర మనోహర స్వరాంకితాలైన నానా వేణువులు
మోగుతూ వినోదం కలిగిస్తున్నయ్.
అన్నింటిలోను ఎక్కువ మంజులమూ మోహకారి అయిన వేణువు
కుశలుడైన కేశవునిది.
(అది) మహామధురమైనటువంటిది.

13. ముకుందుని సుందరాంగుళులచే స్పృశింపబడినదై
కాంతారంలో ఆ మురళి ప్రతిధ్వనించినపుడల్లా
అనురాగంతో కూడిన, చపలాంగిని అయిన
విధుముఖి (రాత్రి) ఆకుఆకున నృత్యం చేయసాగింది.

14. ఆ కంఠస్వరాలు, ఆ విశిష్ట వేణూనాదాలు,
ప్రియ మృదంగధ్వని, మంజుల వీణాస్వనాలు.
గ్రహించి వాయువు అనేక మార్గాలలో సామోదంగా
ఖగ మృగాలను, నరకిన్నరులను
ఉన్మత్త ప్రాయులను చేస్తూ ప్రసరిస్తున్నది.

15. మురళీరవంచే రసార్ద్రులై
గోపి సమేతులయిన గోపాలకులు స్వశరీరాలను మరచినారు.
పాట ఆగిపోయింది.
వీణతోసహా అన్ని వాద్యాలు ఆగిపోయినయ్.
కేవలం విచిత్రమైన వంశీరవం మాత్రమే వినబడుతున్నది.

16. ఆక్షణంలో వేణువు ఏదో మంత్రంచేత
అభిమంత్రితమైనట్లు అనిపించింది.
ఆ వేణువులో సప్త రంధ్రాలు. ఉన్మాద, మోహన.
వశీకరణాదుల మంజుధామంగా కనిపించాయి.

17 అనేక రాగాలు ఆలాపించి
వాటి స్వరూపాలు నేత్రాలముందు సాక్షాత్కరింపచేసి,
హృదయమోహ కారులయిన అనేకఆలాపనలు చేసి,
శ్యాముడు పరమ మోహకరాలయిన క్రియలు చేసాడు.

18. ఆ తరవాత వరవేణు స్వరాలు
అకస్మాత్తుగా ఆగిపోయాయి.
అందరి చైతన్యం తిరిగివచ్చింది.
ఆనంద నాదంతో కూడిన కంఠ స్వరసమూహంతో
దిశలు మాటి మాటికి ప్రతి ధ్వనించాయి.

## మైథిలీ శరణ్ గుప్త

## పృథ్వి-పృథ్వీపుత్రుడు.

పృథ్వీ–చాలు ఇంకచాలు
నా సంతానంలో అతి చతురుడవని నిశ్చయంగా నిరూపించుకున్నావు.
కాని నాశనం చేసానని, మచ్చిక చేసుకున్నానని, సేవకులుగా చేసుకున్నానని
నీవు బడాయిలు కొడుతున్న ప్రాణులు
నేల మీద ప్రాకేవి లేక ఆడవులలో సంచరించేవి.
వివేక జ్ఞానం లేనివి.
కాని వివేక జ్ఞానం గల నీవు
సోదర మానవులను సంహరించాలని ఎలా సంకల్పిస్తున్నావు ?

పుత్రుడు: నీవు వారిని,
మృగప్రాయులైన ఆ అడవి మనష్యులను మానవులని అనగలవా ?

పృథ్వి: నీవు కూడా ఒకప్పుడు వన్య ప్రాణివే.
వీరందరి కంటే కూడా కిరాతకుడివే.
ప్రియ పుత్రా ! నీవింకా కిరాతకుడివే.
మారిందాల్లా బాహిరమైన రూపమే.
నీ అంతరంగంలో మార్పు లేదు.

పుత్రుడు: నాకు ఆ అడవి మనషులతో పోలిక ఏమిటి ?
నేను శక్తి మంతుణ్ణి.
అందుచేత సర్వశ్రేష్ఠత్వానికి హక్కు దారుణ్ణి

పృథ్వి: అవును నీవు శక్తిమంతుడవే, అది నిజం,
కాని ఇతరులలో కూడా శక్తి మంతులుండవచ్చు.
నీవు బహు మూల్యవంతా లనుకుంటున్న నూతన కల్పనలను
నుగ్గు నుగ్గు చేసే వారూ ఉండవచ్చు.
నాకు సంస్కృతి సభ్యతా ఉన్నదనుకుంటూ
అడవి మనష్యులని నీవు నీ జ్ఞాతులను అసహ్యించుకుంటున్నావు

కాని వారి ప్రాచీన చరిత్రను ఎరుగుదువా ?
నేను నా ప్రారంభ దశలో చూచినట్లు చూడకలిగితే
నీ అహంకారం తొలగిపోతుంది.
వారు తమకోసం కాక ఇతరుల కోసం జీవించారు.
వారు అందరినీ తమ సోదరులుగా భావించారు.
వారు అధికారం కోసం కాని, సంపద కోసం కాని ప్రాకులాడ లేదు.
వారికి పుచ్చుకొనడంలో కంటె,
త్యాగం చెయ్యడంలోనే ఆనందం కలిగింది.
తలంపులలో కాని కార్యకలాపంలో కాని నీకు వారికి తారతమ్యం ఉంది.
నేడు సర్వ వ్యాప్తాలైన మానవ భావాలు.
కేవలం శరీర వాంఛలకు, అహంకారానికి సంబంధించినవి.
పూర్వ సిద్ధాంతాలైన ఉన్నత తరమైన భావాలు
నేడు నిరసన భావపూర్ణమైన ఎగతాళికి లక్ష్యాలయినవి.
ఇక్కడ ధర్మ నిష్ఠ, అతర్వాత బ్రహ్మానందం.

* * * * *

పుత్రుడు: నీవు ఏమన్నా సరే, ఈ ప్రపంచానికి నేనే ప్రభువుని,
యజమానిని కావడం నీవు త్వరలోనే చూస్తావు.
పృధ్వి: ఆ విజయంతో నేను ఉప్పొంగ గలనా ?
(అదినీ) ప్రతాపం కాదు, భయదం, విపత్కరం, ఆ విజయం,
పేలి పోయి, అకాశవీథుల్లో వ్యాప్తిచెందే నక్షత్రం
కీడును సూచిస్తుంది. అది ఉల్కకు గల తీవ్ర ప్రకాశం వంటిది.
పుత్రుడు: నేను చేయబోయే యుద్ధం యుద్ధాలనే అంతమొందించ గలదు.
పృధ్వి: నేను పూర్వ కాలంలో ఎన్నో సార్లు చూసాను
నూతన యుద్ధం గతయుద్ధపు చిహ్నాలను తుడిచి వేస్తుంది,
కొత్తగా యుద్ధం చేయబోయే వారు
ఏదో నీతి న్యాయం కల లక్ష్యాలకోసమే యుద్ధం చేస్తున్నామని
ఆ లక్ష్యం స్థానంలో కొత్త లక్ష్యం ఏర్పడే వరకు, వాదిస్తారు.
నీవు చేజిక్కించు కోన్న రాజ దండం
ప్రజా పీడనకు చిహ్నమైన లోహ దండం కాగలదు.
ప్రజలను భయభీతులను చేసే ఏ రాజూ
తన ప్రజలను బుజుగాములను చేయజాలడు.
ఒక వేళ వారు రాజును అనుసరించినా

ఆ రాజును ఏమరుపాటున సంహరించడమే వారి లక్ష్యం కాగలదు.
నీ కంటే ముందున్న విజేతలను ఎంత మందినో నేను చూశాను.
కాని ఏ ఒక్కరూ మానవజాతి చేత గౌరవింపబడలేదు

పుత్రుడు: అయితే తల్లీ ! నీ అభీష్టమేమిటో చెప్పు ?

పృథ్వి: నిన్నింకా సమున్నతునిగా చూద్దామనేదే నా అభీష్టం
కాని పెరిగి పోతున్న నా కుటుంబానికి
నీవు ప్రధానుడివి, ఉన్నత స్థానం వహించే వాడివి.
అయినా నీవు వినయ భావంతో ఔన్నత్యాన్ని సాధించాలి.
మిథ్యాహంకారం, డంబాలు
వదలివేయగల సామర్థ్యం నీకు ఉండాలి.
నీ స్వంత అభిప్రాయాలను
సమస్త ప్రజల అభిప్రాయాలలో కలిపివేయాలి.
వర్గ, వర్ణ, దేశ, జాతి భేధాలన్నింటిని రూపుమాపచేయాలి.
ప్రపంచ నాగరికుడిగా నీవు
మానవతా సేవకుడిగా రూపొందాలి.
నీ తలంపులను, కార్యకలాపాలను నీతిగా,
భయంకాక ప్రేమ, బలంకాక ధర్మం ఆధారంగా నడిపించాలి.
ఈ విధంగా సంపూర్ణ ఔన్నత్యాన్ని సాధించు.
ఊహాతీతమైన ఔన్నత్యానికి
సమస్త సృష్టి సహాయాన్ని ఊతగా తీసుకొని పురోగమించు;
ఒకడు అందరి కోసం
అందరూ ఒకరి కోసం పాటుపడాలి.
వినాశమే తమ హానికరమైన లక్ష్యంగా పెట్టుకొన్న
మానసిక శక్తులన్నీ
నీకు సుయోగ్యమైన విజయాన్ని ప్రసాదించాలి
అటువంటి సుయోగ్యుడైన పుత్రుడికి
తల్లిని కాగలిగానన్న గర్వం నాకు కలగాలి.

జయశంకర్ ప్రసాద్

## మా దేశం

అరుణ మధుమయం ఈ మాదేశం:
ఇక్కడ అజ్ఞాత క్షితిజానికి ఆధారం లభిస్తుంది.

సరస తామరస గర్భుని వైభవం మనోహర తరు శిఖలపై విరాజిల్లుతుంది.
వ్యాపించిన పచ్చని జీవితంపై
మంగళ ప్రదమైన కుంకుమ వెదజల్లబడి ఉంది.
చిన్న హరివిల్లులా రెక్కలు విప్పి,
శీతలమలయ పవనుడు ఆధారంగా
తమ ప్రియమైన నివాసం అనుకొని
ఇటు వైపే పక్షి సమూహం పరుగులిడుతుంది.
వర్షిస్తున్న నేత్ర మేఘాలు
కరుణాజాలంతో నిండి వర్షిస్తాయి.
అనంతుని అలలు ఈ గట్టుకే కొట్టుకొంటాయి.
రాత్రంతా మేల్కొని ఉన్న తారలు
మత్తుతో కునికిపాట్లు పడుతున్న
ప్రాతఃకాల సమయంలో
ఉషస్సు హేమ కుంభంధరించి
సుఖాలు వర్షిస్తుంది.

## ప్రభాత వర్ణన

రాత్రి గడిచి పోయింది.
మేల్కొనవే ఓ ప్రియురాలా
ఉషస్సు అనే చతుర స్త్రీ
తారకలనే ఘటాలను
అంబరమనే నీలాటిరేవులో ముంచుతున్నది
పక్షుల కలరవం
కుండలను నీటిలో ముంచుతున్నప్పుడు వచ్చే శబ్దం
నూతన పల్లవాలు
ఆ చతురస్త్రీ ఏమిట కొంగులా అల్లలాడుతున్నాయి
ఆమెకు తోడుగా లతలు
తమ ముకుళ పాత్రను మధువుతో నింపాయి.
మేల్కొనవే ఓ ప్రియురాలా
మూసిన నీ పెదవులు
అమంద అనురాగాన్ని నింపుకొని ఉన్నాయి.
మలయపవనం

నీ అలక జాలంలో బందీయై ఉంది
నీ కండ్లలో
ప్రభాతరాగం నిండి ఉంది
రాత్రి గడిచిపోయింది
మేల్కొనవే ఓ ప్రియురాలా!

## సూర్యకాంత్ త్రిపాఠి 'నిరాలా'

### మేఘరాగం-1

ఓ ఘోరమేఘమా!
మృదులంగా ఊగి ఊగి
గర్జించి గర్జించి
నీ అమరరాగంతో ఆకాశాన్ని నింపివేయి.
జల జల జల
సెలయేళ్ళలో, గిరులలో, సరోవరాలలో
గృహాలలో, మరు భూముల్లో
తరులలో, మర్మరసాగరంలో
చకితుడైన పవనుడితో
విద్యుత్ గతితో
పోటీ పడుతూ
మనస్సులో
విజయగహన కాననంలో
ప్రతి ముఖం మీద ప్రతిఫలించు
నీ అమర రాగంతో ఆకాశం నింపివేయి.
వత్స రహర్ష ప్రదాతా!
కురియుము కురియుము రసధారలు
నన్ను దాటించు.
నీభైరవ గర్జన జగత్తును చూపించు
హృదయాన్ని తలడిల్ల చేసి
అలజడిని సృష్టించి
పదరా పద
నా ఉన్మత్త మేఘమా!

జంబాల పటలం దిగబడుతున్నది.
నదీ నదాలు కలకలారవం చేస్తున్నాయి.
కల కలారవం చేస్తూ ప్రవహిస్తుంది.
నర్తిస్తున్న హృదయం
ప్రవహించడానికి మహా వికలమవుతున్నది.
ఈ తిరుగుడు నుండి, ఈ గందరగోళం నుండి
సఘనమూ, ఘోరమూ, గురుగహనమూ అయిన ధ్వనితో
నాకు గగనాంచలాన్ని చూపించు
అమర రాగంతో ఆకాశాన్ని నింపివేయి.

## మేఘరాగం - 2

అనంత గభీర
అంధ నిశీధిని పోలిన ఓ నిరంకుశుడా!
కేవలం ఉల్లాసానికై పవనరథం ఎక్కి
విహరించే ఓ సర్వస్వతంత్రుడా!
ఓ తీవ్ర ఆకాంక్షామూర్తీ!
నిత్యమూ తీరిన కోరికల సంక్షిప్తరూపమా!
ఏనాటికీ తీరని కోరికల సంక్షిప్తరూపమా!
నీ విప్లవ ఉద్వేగాన్ని ఆపే అడ్డంకులేమిటి?
ఓ నీలి యోధుడా!
గ్రీష్మకాళంలో విహరించే ఓ మహత్తర పూజారీ!
నీ కోపావేశపు వెల్లువ
గండ్ర శిలల శకలాలను వమ్ము చేస్తుంది
ఆకాశసౌధాల శౌర్యప్రగల్భాలను తుత్తునియలు చేస్తుంది
ఒకసారి
పూరేకులను భూమ్యాకాశాల చివరలకు వెదజల్లుతుంది
మరోసారి
ఆగ్రహించి సుకుమారకలికలను మూలమట్టం చేస్తుంది.
వన - ఉపవనాలలోగల వృక్షాలను నగ్నం చేస్తుంది.
నీ ఉరవడితో
శీత బాధనుండి తప్పించుకోడానికి

గూటిని ఆశ్రయించిన అడవి పక్షి
కంపిత హృదయంలో వేదన కల్పిస్తావు.
భయప్రాంగణంలో నులివెచ్చని వర్షాన్ని కురిపిస్తావు
క్రూరపాలకుల సభాంగణాలు
నీ విప్లవ భావపు ఆపదల గర్జనలు వింటాయ్.
ఓ నిరాకార శ్యామల మేఘమా!
వేగంగా, చంచలంగా ఎగిరెగిరి పడుతున్న
తుఫాను అలలతో
నీవు కిందికి మీదికి విసరి వేయబడటం చూచీ — చూచీ
అలిసి - సొలసి, కుమిలి పోతున్న నేత్రాలకు
నీవు శాంతిని ఊరటను కలిగిస్తావు.
ఒకప్పుడు సృష్టికార్యంలో పాల్గొనాలన్న అభినివేశంతోనూ
మరొకప్పుడు సృష్టించినవాని పట్ల తీవ్రాసక్తితోనూ
ఒకప్పుడు సముద్రపు అపార శక్తులవల్ల ఏర్పడే అస్థిరత్వంతోనూ
మరొకప్పుడు సుకుమార గభీర పవనాలపై విహరిస్తుంటావు.
మిత్రునిగాను, యోధునిగానూ నీవు మా కండ్లకు మిరుమిట్లు గొలిపావు.
కాని ఇప్పుడు బాలునివలె, సూర్యుని నెత్తిన ఎక్కుతావు.
అతని ప్రభాపూర్ణ కిరణాలు
నీ ప్రేమ పూరిత దృగంచలాలముందు అవనతం అయిపోతాయి.
కార్యమే కారణంగా మారి పోతుంది.
త్రిలోకాలు నీలో తమ తమ నియమాలు మిళితం చేస్తాయి.
పృథ్వి, స్వర్గం, మధ్యనున్న ఆకాశం
అన్నీ నీ నేత్రాలకు మహత్తర శాంతిని కలిగిస్తాయి
ఓ శ్యామల ప్రేమికుడా!
శిలా సదృశ కఠినత్వం, పూవువలె మృదువుగా మారినపుడు
కవిహృదయం నూతనోత్సాహంతో ఉప్పొంగి పోతున్నది
ఈ క్షణాన లక్షలాది నక్షత్రాలు నిన్ను పొగడుతున్నాయి
చంద్రుడు, సూర్యుడు, విస్తృత గగనం
ఇవన్నీ
కృతజ్ఞత, ఉల్లాసంతో నిండిన మా నేత్రాలు.

## మ్రోడు

నేడిది ఒక మ్రోడు
కళా విహీనం
సమస్త శృంగార రహితం అయిన మ్రోడు.
నేడిది వసంతాగమనంతో పులకరించదు, పల్లవించదు.
ధనస్సులా వంగి వెల్లి విరియదు.
కాముని బాణాలవలె పూలు కురియదు
ఇచ్చట నీడలో నడుం వంచి
పధికులు ఉస్సురనరు.
ప్రేమికులు కూర్చొని కన్నీరు కార్చరు
ఇట కేవలం ఒక వృద్ధ విహగం కూర్చొని ఉంది
ఏదో గతాన్ని స్మరిస్తూ

### సుమిత్రానందన్ పంత్

## పరివర్తనము

ఓ నిష్ఠుర పరివర్తనమా !
నీ తాండవ నృత్యమే
విశ్వకరుణా వివర్తనం కదా !
సమస్త ఉత్థాన పతనాలు
నీ నయనోన్మీలనాలే కదా !
ఓ సహస్రఫణ వాసుకీ !
కనిపించీ కనిపించని నీ చరణాలు
జగత్ విక్షత వక్షస్థలంపై
నిరంతర చిహ్నాలుగా కనిపిస్తున్నయ్.
బృహదాకార జగదంబరాన్ని
నీఫేనోచ్ఛ్వా సిత సీత భయంకర ఫూత్కారాలు
గిరగిర తిప్పి వేస్తున్నాయ్
మృత్యువు నీగరళదంతం
కల్పాంతరం నీకుబుసం
అఖిల విశ్వమేనీ వుండే బిలం

దిఙ్మండలమే నీ వక్రకుండలి.

## 2

ఓ దుర్జేయా ! ఓవిశ్వజిత్ !
నీ ఇంద్రాసనం ముందు
వందలాది సురవరులు, నరనాథులు
తలలు వంచుతారు కదా !
నీరథ చక్రాలతో పాటు
వందలాది అనాథుల భాగ్య చక్రాలు
తిరిగి పోతుంటాయి.
నీవు నృశంస ప్రభువువలె, నిరంకుశంగా
జగత్తు నెత్తిన ఎక్కి
సమస్త సృష్టిని పీడిస్తూంటావు, కాలరాస్తుంటావు.
నగరాలను నగ్నం చేసి,
భవనాలను భగ్నంచేసి,
ప్రతిమలను ముక్కలు చేసి,
చిరసంచితమైన కళలు, వైభవం, కళలు హరిస్తుంటావు
ఆది వ్యాధులు,
అతివృష్టి,
వాయువు, ఉత్పాతాలు,
అపశకునాలు, అగ్నిప్రమాదాలు,
వరదలు, భూకంపాలు,
ఇవన్నీ నీ విపులసైన్యంలోని దళాలేకదా !
ఓ నిరంకుశుడా !
నీ సైనికుల పదాఘాతంచేత
ధరాతలం దళితమై
గజ గజవణికి పోతుంది.

## 3

జగత్తు యొక్క అవిరళ హృత్కంపం,
నీ పట్లగల భయాన్నే సూచిస్తుంది.
కను రెప్పలు మూతబడి పోవటం
నీ ఆహ్వానాన్నే సూచిస్తుంది.
విపుల విషయవాంఛలే, వికసిత విశ్వమానస శతదళం.
కుటిల కాల కీటకంవలె అందులో ప్రవేశించి, మూలమూలలా తొలిచి వేస్తున్నావు.

స్వేదసించితమైన సృష్టి స్వర్ణ సస్యాన్ని, అభీష్ట కృషిఫలాన్ని
వడగండ్లరూపంలో నాశనం చేస్తున్నావు
సతతధ్వని స్పందితమైన దిఙ్మండలం సమస్తం
నిశా గగనంవలె
నీ సమాధి స్థలం

**4**

మహాకాలుని కరుణారహితమైన భృకుటి విలాసం
నీ పరిహాసమే
విశ్వం యొక్క అశ్రుపూర్ణ చరిత్ర అంతా
నీ చరిత్రే.
ప్రళయంకరమయిన నీ ఒక్క కఠోర కటాక్షం మూలాన
సమస్త సృష్టిలో భీకర యుద్ధం ప్రారంభమవుతుంది
అభ్రధ్వజాలైన సౌధాలు, శ్రేష్ఠ శిఖరాలూ
సామ్రాజ్య వైభవ మేఘాడంబరాలు
నేలనంటి పోతాయి.
నీ ఒక్క రోమాంచం మూలాన
భూమ్యాకాశాలు కంపించి పోతాయి.
పక్షి పిల్లలవలె నక్షత్రాలు రాలిపడతాయి.
నీవు సైగ చేస్తే
ఆలోడితమై అంబుధిశతశత తరంగ ఫణాలతో
ముగ్ధ భుజంగంవలె నర్తిస్తుంది
దిక్ పంజరంలో ఆబద్ధమైన గజరాజు వలె
వినతాననమై, వాతహతమై
ఆకాశం ఆర్తితో
ఎలుగెత్తి గర్జిస్తుంది.

**5**

జగత్తుయొక్క శత శత కాతర చీత్కారాలు
ఓ బధిరా! నీ చెవుల పడుతున్నాయి.
అశ్రుప్రవాహపు అగణితధారలు
హృదయ పాషాణాన్ని చీరివేస్తున్నాయి
క్షణ క్షణం వందలాది నిశ్వాసాలు
ఆకాశం ఆవరిస్తున్నాయి.
నలువైపుల నుండి చుట్టుముట్టి

సుఖశాంతులను ఆ క్రాంతగ్రస్తం చేస్తున్నాయి.
ఓ దుర్బల భ్రాంతి
నశ్వర జగత్తులో శాంతి ఎక్కడ?
సృష్టి తాత్పర్యమే అశాంతి కదా!
జగత్తు అనవరత జీవన సంగ్రామం.
స్వప్నమే విరామం.
ఒక వందఏండ్లు నగరాలు, ఉద్యానవనాలు,
మరోవందఏండ్లు నిర్జన వన ప్రాంతాలు
ఇదే కదా అసార ప్రపంచ గతి?
సృష్టి, స్థితి, లయాలు
నేడు గర్వోన్నతాలు
అపార రత్నదీప మాలికా సంయుతాలు,
మంత్రోచ్చార పరిపూర్ణాలు అయిన హర్మ్యాలు
రేపు గుడ్ల గూబలకు నిలయాలు
కీచు రాళ్ళ సంగీతానికి ఆలవాలాలు,
భగ్నమందిరాలు
దివారాత్రాలతో కూడిన ఈ విశ్వం
మేఘమరుత్తుల మాయాజాలం.

## మర్మ వేదన

ప్రాణాలలో చిరవేదనను బంధించావు
చిరదగ్ధ హృదయానికి
వ్యర్థంగా అమర ప్రణయాభిలాష కలిగించావు.
పర్వతానికి జలం, దారువుకు అనలం
వారి దానికి చంచల విద్యుత్తు
పుష్పానికి సౌరభం,
ఆ సౌరభానికి వికలమయి ఎగిరిపోవాలన్న
ఎడతెగని కోర్కె కలిగించావు
హృదయం దహించుకొ పోతున్నది
దహించుకొ పోతున్నది
ప్రాణాలలో వ్యాకులము, గహనము అయిన వెత

ఇది ప్రజ్వరిల్లుతున్నది, సహించడానికి వీలు లేకుండా పోతున్నది
అయినా
దానికి తోడుగా చిరస్మృతి అనే శ్వాస సమీరాన్ని ఇచ్చావు.
ప్రాణాలు కరిగి పోతాయి.
దేహం జ్వలించి పోతుంది.
మర్మవేదన యొక్క కథ గడిచి పోతుంది.
ప్రేయసి ప్రతిమ శుద్ధ బంగారం వలె
వెలువడుతుంది.
ప్రాణాలలో చిరవేదనతో పాటు అగాధమైన మమత ఇచ్చావు.

## మహా దేవి వర్మ

### దేవాలయ దీపము

ఈ దేవాలయ దీపాన్ని వెలుగు తుండనీ !
నీ రవంగా, ఏకాంతంగా వెలుగుతుండనీ !
రజత శంఖం, సమతాళంలో మ్రోగిన గంటలు,
స్వర్ణ—వంశీ—వీణాస్వరాలు
హారతి వేళను శతకోటి సంగీతాలతో నింపివేసాయి.
ఆ కల స్వరాల కలయికలో
శిలలు నవ్వాయి, తిమిరం ఆడుకుంది
ఇప్పుడు దేవాలయంలో ప్రభువు ఒంటరిగా ఉన్నాడు.
అజిరంలోని శూన్యాన్ని కరగించి వేయడానికి
స్వయంగా ఈ దీపంకరగిపోనీ
భక్తబృందాల చరణ చిహ్నాలతో సమలం కృతమైనపసిడి ముంగిలి,
ప్రణత శిరస్సుల చిహ్నాలతో కూడిన చందన పుగడప,
వెదజల్లబడ్డ పుష్పాలు, అక్షింతలు,
అపరిమితమైన అర్ఘ్యం, నైవేద్యాలు,
ఇవన్నీ అంధంకారంలో అంతర్హితాలై పోతాయి.
ఈ దీప శిఖలో వాటన్నింటి కథనంతా కలిసిపోనీ !
కాలరూప జపమాలను తిప్పి
పూజారి విశ్వం నిద్రా దేవి ఒడిలోమునిగి పోయింది.
ప్రతి ధ్వనుల చరిత్ర ప్రస్తరాల మధ్య అణగి పోయింది,

శ్వాస-నిశ్వాసాల సమాధిలా జీవితం,
మసి సాగరంలా జీవిత మార్గం,
ముఖరితమైన కణ కణంలోని స్పందన ఆగిపోయింది.
ఈ జ్వాలలో ప్రాణరూపాన్ని మళ్ళీ రూపొందనీ!
దిక్ భ్రాంతిచెందిన తుఫాను రేగి ఉంది,
రాత్రి గంభీరమైన మూర్ఛలో మునిగి ఉంది.
ఈ సమయంలో
జ్యోతిస్సు యొక్క ఈ లఘు ప్రహరిని
పూజారిగా మెలగనివ్వండి
పగటికల్లోలం మళ్ళీ తిరిగి వచ్చేదాక
ప్రతిక్షణం జాగరూకమయి ఉండగలదు
తిమిర రేఖలలో కాంతి జాలంనింపుతూ
ఈ సంధ్యాదూతను ప్రభాతకాలం దాకా వెలుగుతుండనీ!

## పియారామ్ శరణ్ గుప్తా

### బాపూ

ఓ విశ్వమహావంశ పాలకుడా!
ధరిత్రీ సుపుత్రుడా:
ధన్యుడవు నీవు, ధన్యుడవు.
కల్లాకపటం తెలియని వాడవు,
రాగ క్రోధాలకు అతీతుడవు,
నీలో ప్రాచీనంలో అర్వాచీనం
సనాతనత్వంలో ఆధునికత్వం ఉంది.
లఘుక్షితిజం లాంటి వాడవు.
వసుధకు ఆత్మీయుడవు.
నీడనికి చేత వసుంధరకు స్వర్గంలో సమున్నత స్థానం కలిగింది.
స్వర్గం వసుధలో సమాహితమై ఉంది.
నీ నూతన సాంగత్యంతో
మహత్తమంలో లఘుత్వం అవతరించి ఉంది.
దూరాలు సమీపాలు, ఒక చోట కలసి మెలసి విలసిల్లాయి.
బాహ్యం, ఆంతరికం

హాస్య రోదనాలు
ఒకే స్వరంలో ప్రతిధ్వనించాయి.
కాని ఏ భాషలో ?
ఏ ఆశతో ? ఎవరికి తెలుసు ?
నీ నవ్వులో విశ్వమంతా హసిస్తుంది.
నీరోదనంలో నివసిస్తుంది.
విశ్వవేదన అనే మహాపారావారం
ఘోరంగా హాహాకారంచేస్తుంది.
నీ చిన్ని వర్తమానంలో
విపుల భవిష్యత్తుగా ప్రవర్ధ మాన మవుతుంది.
నేటి యుగానికి పుత్రుడివి
రేపటియుగానికి జన్మ దాతవు
ఒకణ్ణి అనేకులుగా లెక్కించే వాడివి
అందరికి సహజ సాధ్యుడివి
అందరు నిరభ్యం తరంగా నీ వద్దకు రావచ్చు.
ఆత్మలీనుడివి, సార్వకాలం సర్వాత్మీయుడివి.
నీకు పరాయి వారెవ్వరు ?
నీవు సమస్త ప్రపంచానికి ఆత్మీయుడివి.
నిత్యము పుణ్య అతిథివి నీవు
ఓ విదేహుడా!
గృహస్థువై కూడా బైరాగివి
వజ్రాలు, బంగారం, మణులు, ముక్తాహారాలను
మట్టితో సమానంగా, నిర్వికారంగా
త్యజించ గల వాడివి.
అనవరతము అద్వితీయుడైన వాడివి
జన్మతోనే ఉన్నత దివ్య పురుషుడివి
మర్త్యులలో సానందంగా మెలిగావు.
భూతలనునే ఆలిచిప్పలో
పవిత్ర స్వాతి జలపు పెద్ద బిందువు పడి
దుర్లభమైన సుయోగం వలన
నీ లాంటి మహత్తర వ్యక్తిత్వాన్ని రూపుదిద్దు కొన్నది.
బాలుడివా నీవు ?

బాలుడివి కాదు, యువకుడివి కాదు, వృద్ధుడివి కాదు.
పూర్ణ విశ్వమానవుడివి నీవు.
ప్రేమా, శ్రద్ధ–భక్తియుక్తంగా
నీకు అహరహం ప్రణమిల్లుతాం.

## రామధారిసింహ దినకర్

### చంద్రుడు

గగనంలోని చంద్రుడు నాతో ఇలా అన్నాడు.
ఈ మానవుడు ఎంత విచిత్రమైన ప్రాణి !
చిక్కు సమస్యలు నిర్మించుకొని అందులోనే చిక్కుకొపోతాడు.
దాంతో అశాంతి పొంది.
మేల్కొని ఉండలేడు, నిద్రించనూ లేడు
నేనెంత పాతకాలపువాణ్ణో నీకు తెలుసా ?
మనువు చావు పుటకలను చూపినవాణ్ణి
నీలాంటి ఉన్మత్తులు వెన్నెల్లో కూర్చొని
దినా స్వప్నాలు కనడం లక్షలమాట్లు చూశాను
మానవ్వుని స్వప్నమా ?
అది ఒక నీటి బుడగ –
నేడు కనిపిస్తుంది, రేపు బ్రద్దలై పోతుంది.
అయినా ధన్యుడు మానవుడు.
నీటి బుడగలతో ఆడుకుంటాడు.
కవి తలల్లుకుంటాడు.
నేను మాట్లాడలేదు కాని నారాగిణి (మనస్సు) పలికింది
ఇటు చూడు ఒకసారి చంద్రా !
నన్నెరుగుదువా నీవు ?
నాకలలు నీటి బుడగలా ?
ఇదేనా నీ సామర్థ్యం ?
నిప్పునే గుర్తించలేవా నీవు ?
కలలు గాంచి, బుజాలెగుర వేసేవాణ్ణి కాదు నేను.
వాటిని కరిగించి, ఇనుముగా మార్చే వాణ్ణి నేను ?
కొంగ్రొత్త భవనాలకు పునాదులు వేసే వాణ్ణి నేను.

ఇలా ఉక్కు గోడలు నిర్మించే వాణ్ణి నేను
మనువు కాదు నీ ముందున్నది. మనుపుత్రుడు
అతని కలల నాలుకలకూ పదునున్నది
తలపులే కాదు బాణాల వలె దూసుకుపోయేవి
కలల చేతుల్లో కూడా కరవాలాలున్నాయి.
స్వర్గంలోని సామ్రాట్టుకు కబురందచేయి,
'క్షణ క్షణం పురోగమిస్తున్నారు వారు ఆకాశం వైపు
పగటి కలలు కనే వీరి పురోగతిని ఎలాగైనా ఆపుచేయి
స్వర్గానే ఆక్రమించుకోడానికి వస్తున్నారు వీరు

(చారిత్రక సమీక్ష అనువాదం: శ్రీ మహేంద్రచతుర్వేది)

# ఇంగ్లీషు

మూలం :
డా॥ కే.ఆర్. శ్రీనివాస అయ్యంగార్

అనువాదం :
డా॥ అడపా రామకృష్ణరావు

## చారిత్రక సమీక్ష

భారతీయులు ఇంగ్లీషుభాషలో సాహిత్య రచన ప్రారంభించి ఇంకా రెండు వందల ఏండ్లైనా కాలేదు. ఈ సాహిత్య వికాసానికి ప్రేరణ మొట్టమొదట రాజా రామమోహన్ రాయ్ ద్వారా కలిగిందని చెప్పవచ్చును. భారతదేశానికి ఆధునిక నాగరక ప్రపంచంలో స్థానం లభిం చాలంటే భారతీయులు ఇంగ్లీషు భాషాజ్ఞానాన్ని అలవరచుకోవడం అవసరమని ఆయన స్పష్టంగా గుర్తించాడు. స్వయంగా తానీ నూతనభాషలో సంపూర్ణమైన ఆత్మవిశ్వాసంతో రచన సాగించాడు. ఇంగ్లీషులో ఆయన చేసిన రచనలు చారిత్రకంగా చాలా ముఖ్యమైనవి. ఐతే ఇంగ్లీషుభాషకు అఖిలభారతస్థాయిలో ప్రాముఖ్యాన్ని కలిగించింది మాత్రం భారత స్వాతంత్ర్య సముపార్జన కోసం సాగిన జాతీయోద్యమమే. ఆ భాషయే భిన్న ప్రాంతాలకు చెందిన దేశభక్తులను సన్నిహితం చేసి, పరస్పరం వారు తమ అభిప్రాయాలను తెలుపుకోవడానికి వీలు కలిగించింది. 20 వ శతాబ్దం ఆరంభమయ్యేనాటికి ఇంగ్లీషులో ధారా ళంగా, సాధికారంగా తమ భావాలను వ్యక్తం చేయగలిగిన బాలగంగాధర తిలక్, దాదాభాయ్ నౌరోజీ, సురేంద్రనాథ బెనర్జీ, రమేశచంద్ర దత్త, రవీంద్రనాథ ఠాకూర్, శ్రీ అరవిందుల వంటి మహనీయులు రాజకీయక్షేత్రంలో కృషి చేశారు. ''హిందూ'', ''మరాఠా'', ''వందే మాతరమ్'', కర్మయోగిన్'' వంటి రాజకీయ పత్రికలు సాహిత్య సౌందర్యంతోనూ, పాండిత్య పటిమతోనూ కూడిన రచనలతో భాసించాయి.

ఇంగ్లీషులో భారతీయులు చేసిన రచనలలో సాహిత్య ప్రక్రియ లన్నిటికీ స్థానం లభించింది. ఈ భాషలో కవితావ్యాసంగాని కుద్యమించిన వారిలో హెన్రీ డిరోజియో, కాశీ ప్రసాద ఘోష్, మైకేల్ మధుసూదన దత్త అనే ముగ్గురూ ప్రథములు. డిరోజియో, మధు సూదన దత్త కథాకావ్యరచనలో సిద్ధహస్తులు. వారి తరువాత సాహిత్యక్షేత్రంలో అడుగు పెట్టిన తరుదత్త చక్కని భావ కవిత్వం వ్రాసింది. ప్రాయంలో చిన్నదైనా ఆమెకు సహ జంగా అలవడినప్రతిభను తండ్రి గోవిందచంద్ర దత్త శ్రద్ధగా పెంపొందింపజేశాడు. అతడు కూడా కొంత ఎన్నదగిన కవిత్వం వ్రాసినవాడే. తరు దత్త మన ఐతిహాసిక గాథలను ఇంగ్లీషు కవితలో చక్కగా వర్ణించింది. ఆమె రచించిన **Ancient Ballads and**

**Legends of Hindusthan** అనే కావ్యసంపుటి 1882 లో వెలువడింది. ఆ పుస్తకానికి సుప్రసిద్ధ విమర్శకుడు ఎడ్మండ్ గాస్ ప్రశంసాత్మకమైన ఉపోద్ఘాతం వ్రాశాడు. వర్జిల్ కవి పలుకులలో వర్ణించాలంటే ''నశ్వర పదార్థాలను గూర్చిన అశ్రుధార'' ఆమెకవితలో సర్వత్ర గోచరిస్తుంది. చిన్నవయస్సు లోనే ఆమె చనిపోయింది, కాని ఆమె సోదరుడూ, సోదరి ఆమె కంటె ముందుగానే మరణించారు. **''Sita'', ''Our Casuarina Tree''** అనే ప్రసిద్ధ గీతాలలో ఈ ఆపదల ప్రసక్తి కవితాస్ఫూర్తితో మనకు కనిపిస్తుంది

తరు దత్త తరువాత ఇంగ్లీషులో రచన సాగించిన భారతీయ కవయిత్రులలో ముఖ్యురాలు సరోజినీ నాయుడు. స్వాతంత్ర్యోద్యమంలో గాంధీజీకి సన్నిహితంగా మెలగిన ఆమెకు చిన్ననాటనే ఈడుకు మించిన ప్రజ్ఞాపాటవా లలవడినవి. చిన్నవయస్సులోనే ఎడ్మండ్ గాస్‌తో తన కవితను గురించి చర్చించి, ఆయన సూచన ననుసరించి ఆమె భారతీయాత్మను అభివ్యక్తం చెయ్యడానికీ, భారతీయ భావావేశాన్ని సూక్ష్మతరంగానూ ఆత్మీయతతోను విశ్లేషణ కావించడానికి పూనుకొన్నది. పురాతన మత తత్వాన్ని గురించీ, పాశ్చాత్యులు ఆత్మ పదార్థమనే దొకటి ఉన్నదని కలలు కనని ప్రాచీనకాలమందే ప్రాగ్దేశ వాసులను ఆత్మ జిజ్ఞాసాభిముఖంగా మేల్కొల్పిన అపూర్వ సందేశాన్ని గురించీ ఆవిడ గానంచేసింది. ఆ ప్రయత్నానికి ఫలితం **The Golden Threshold, The Bird of Time, The Broken wing** అనే మూడు గణనియమైన కావ్యసంపుటాలు. కాని ఏ కారణం చేతనో ఆమె తన జీవితంలోని చివరి మూడు దశాబ్దాలలో కవితా రచన మానుకొన్నది. ఆమె సోదరుడు హరీంద్రనాథ చట్టోపాధ్యాయ కూడా ఇంగ్లీషులో కవిగా కొంత కీర్తి గడించాడు.

నోబెల్ బహుమతి లభించడం వల్ల భారతీయులలో రవీంద్రనాథ ఠాకూర్ ప్రథమంగా ప్రపంచదృష్టిని సమకాలీన భారతీయ సాహిత్యం వైపు ఆకర్షించడం జరిగింది. ఆయన ప్రధానంగా వంగ కవియే, కాని తన గీతాల నెన్నింటినో ఆయన వంగభాష నుంచి ఇంగ్లీషులోని కనువదించాడు. ఆయన కృతులలో **Gitanjali, The Gardener** సుప్రసిద్ధమైనవి. ఐతే సునిశిత బుద్ధీ, భాషాంతరీకరణ దక్షత ఉన్న అనువాదకుల కృషివల్ల ఆయన వంగభాషలో రచించిన కవితలు దాదాపు పూర్తిగా ఇప్పుడు ఇంగ్లీషులో లభ్యమవుతున్నవి. నవలలను, నాటకాలను రచించడంలో కూడా ఆయన అగ్రగామియే. ఆయన నాటికలు, నవలలు, కథలు, కూడా అనేకం ఇంగ్లీషులో ఇప్పుడు లభిస్తున్నవి.

ఆయన ఇంగ్లీషు భాషలో మొదట వ్రాసిన కవిత **''The Child''** ఒక్కటే కావచ్చును. రవీంద్రుడు 1930లో ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో హిబ్బర్ట్ ఉపన్యాసాల నిచ్చాడు. తరువాత జర్మనీ దేశంలో పర్యటించాడు. అక్కడ ఆయన ఓబరమ్మర్‌గావ్ గ్రామంలో ఆ ఊరి ప్రజలు ప్రదర్శించిన ఏసుక్రీస్తు జీవిత నాటకాన్ని తిలకించాడు. ఆ నాటకపు ఇతివృత్తమూ, గాంధీ మహాత్ముని దండి పదయాత్రా వృత్తాంతమూ రవీంద్రుని సుప్త చైతన్యంలో ఏకం కావడంతో ఆయన సృజనశక్తి, ఆవేశంతో విజృంభించి ఒక్క రాత్రిలోనే ఆయన **The Child** అనే కవితను రచించడం జరిగింది.. అంధకారంలో చిక్కుకొని తమ నిరాశను, యత్నవైఫల్యాన్ని జయించడానికి మానవాళి చేస్తున్న కఠోరమైన

కృషిని ఆయన ఆ రచనలో అతి గంభీరంగా చిత్రించాడు. ప్రయత్నం విఫల మవుతున్నా, వారు హతాశులు కాలేదు. అన్వేషణను విడనాడలేదు. ఓర్పుతో తమ విముక్తికై కృషి చేస్తూనే ఉన్నారు. మానవుడు తన ముక్తికి కీలకం తన లోనే ఉన్నదని కనుగొన్నాడు. ఒకనాటికి తమ నడుమ జన్మించే దివ్యశిశువువల్ల తరతరాల నాటి తమ దుస్సహ భారము దిగి పోతుందని, అప్పుడు వాంఛకూ సాఫల్యానికీ, ఉద్దేశానికీ క్రియకూ, ప్రగతికీ గమ్యానికీ మధ్య ఉన్న ద్వైధీభావం తొలగిపోతుందనే ఆశ వారిలో చిగుళ్ళెత్తు తూనే ఉన్నది.

శ్రీ అరవిందుని వంటి తాత్త్విక కవివరేణ్యుని జీవితవృత్తాన్ని సంగ్రహంగా సమీక్షించడం సులభంకాదు. ఆయన నన్నయైన మన్‌మోహన్ ఘోష్ కూడా కవియే, వారిద్దరూ ఇంగ్లండులో విద్య నభ్యసించారు. శ్రీ అరవిందుడు స్వదేశానికి తిరిగివచ్చిన తరువాత బరోడాలో ఇంగ్లీషు సాహిత్యాచార్య పదవిలో కొంతకాలం ఉన్నాడు. అప్పుడే ఆయన దృష్టి జాతీయ రాజకీయకార్యకలాపాల మీదకి మరలింది. భారత జాతీయ కాంగ్రెస్ సంస్థలో అతివాద వర్గ నాయకుడై అఖిల భారత స్థాయిలో ప్రసిద్ధుడైనాడు. అలీపూర్ బాంబ కుట్రతో ఆయనకు సంబంధమున్నదని ప్రభుత్వం ఆయనను ఒక ఏడాదిపాటు జెయిలులో నిర్బంధించింది. దేశ బంధు చిత్తరంజన్ దాస్ ఆయన పక్షాన కోర్టులో వాదించాడు. ప్రభుత్వం చివరకు శ్రీ అరవిందుని కారాగారాన్నుంచి విడుదల చేసింది. ఆయన దృష్టి అప్పటికే యోగసాధన మీదికి మరలడం వల్ల ఆయన తన జీవితంలోని చివరి నాలుగు దశాబ్దాలు పుదుచ్చేరిలో ఏకాంత వాసంలో గడిపాడు. ఆయన ధారాళంగా రచనా వ్యాసంగం సాగించాడు. వేదాలు, భగవద్గీత వంటి ప్రాచీన భారతీయ గ్రంథాలను ఆయన వ్యాఖ్యానించాడు. తత్త్వ శాస్త్ర సంబంధమైన తన భావమథనాన్ని The Life Divine అనే ఉద్గ్రంథంలో వ్యక్తం చేశాడు. సాంఘిక శాస్త్రాన్ని గురించి, యోగశాస్త్రాన్ని గురించి, విద్యాబోధనను గురించి పుస్తకాలు వ్రాశాడు. ఇవిగాక ఐదు సర్వాంగీణ పద్య నాటకాలను కూడా ఇంగ్లీషులో రచించాడు. **Vasavadutta, Rodogune, The viziers of Bassora, Erie, Perseus the Deliverer** అనే ఆ నాటకాలు ఆకృతిలోనూ, భాషలోనూ, షేక్స్‌పియర్ నాటకాలను పోలినవి. అన్నింటిని మించి ఇంగ్లీషులో ఆయన సువిస్తృతమైన కవిత్వరచన కూడాసాగించాడు. లఘుకావ్యాలలో ప్రాచీన ఛందోరీతులను చొరవతో అనుకరించడంతో సత్యాన్వేషణకు తాత్త్విక యౌగిక పథాలలో పయనించాడు "Urvasie", "Love and Death"వంటి ఐతిహాసిక కావ్యాలను, "Raji Prabhou" వంటి కథాకావ్యాలను, "The Medita-tions of Mandavya, "Ahana" వంటి ప్రతీక కావ్యాలను రచించాడు. "Ilion" అనేఐతిహాసిక కావ్యాన్నికూడా శ్రీ అరవిందుడు గ్రీక్ భాషలోని ఇతిహాస కావ్యాల ఛందస్సులోరచించాడు కాని దురదృష్టవశాత్తు అది అ సమగ్రంగానే నిలిచి పోయింది. ఐతే ఆయన పద్యకావ్యాలలో సర్వోత్కృష్ట మైనది. "Savitri" అనే ఇతిహాస కావ్యం. దానిని ఆయన అంత్యప్రాసలేని ఛందస్సులో ఇంగ్లీషులో 24 వేల పంక్తులలో రచించాడు. సావిత్రీ సత్యవంతుల పురాణగాథను ఇతివృత్తంగా గ్రహించి, దానిని మానవుని భూత, వర్తమాన, భవిష్యత్తులకు ప్రతీకగా రూపొందించాడు. రాజకుమారిగా జన్మించిన సావిత్రి ఈ జగత్తును దుఃఖనిశీథినుంచి శాశ్వతానంద ప్రభాతంలోనికి కొనిపోవడానికి అవతరించిన దివ్యశక్తి స్వరూపిణి. ఈ మహాకావ్యపు విలువను

ఇప్పుడిప్పుడే వివిధదేశాల విద్వాంసులు గుర్తిస్తున్నారు. "Savitri" సమగ్ర సుందరమైన విశ్వజనీన తాత్త్విక కావ్యమనీ, విశ్వసాహిత్యంలో మానవుని బుద్ధిని విస్తరింపజేసి ఆత్మ సాక్షాత్కారం వంకకు మరల్చే సృజనాత్మ కరచనలన్నిటిలోనూ అతిశక్తిమంతమైనది ఇదియే కావచ్చుననీ అమెరికాదేశపు విశ్వవిద్యాలయాచార్యుడు ఫ్రాంక్ రేమండ్ పైపర్ ప్రశంసించాడు.

శ్రీ అరవిందుని ఒరవడి ననుసరిస్తూ నేడు ఆయనవలెనే ఆధ్యాత్మిక కవితాసృష్టి చేస్తున్నవారనేకులున్నారు. వారిలో దిలీప్ కుమార్ రాయ్, నీరదవరణ్, కె.డి. సేత్నా, పృథ్వీంద్ర ముఖర్జీ ప్రసిద్ధులు. టి. యస్. ఇలియట్ వల్లనూ, ఎజ్రాపౌండ్ వల్లనూ అమితంగా ప్రభావితులైన యువకవుల వర్గంకూడా ఇంకొకటి ఉన్నది. వీరిది ఆత్మాశ్రయ కవితామార్గం. వీరిలో పి. లాల్, రాఘవేంద్రరావు, ఏ. కే. రామానుజన్, డామ్ మోరేస్, కమలాదాస్ కావ్యశిల్ప నిపుణతకు ఎన్నదగినవారు. ఈ వర్గంలో హాథర్న్‌డన్ బహుమతి పొందిన డామ్ మోరేస్ కవితకు అత్యధిక ప్రచారం లభించింది తీర్చిదిద్దిన శిల్పసౌందర్యంతో నిండిన ఈ కవి ఆత్మాశ్రయగీతికలు నేటి ఇంగ్లీషు, అమెరికన్ కవితల వాతావరణంలో అతిసహజంగా ఇమిడిపోతాయి.

రాజా రామమోహన్‌రాయ్ నాటినుంచి భారతీయులు ఇంగ్లీషుభాషను తమ వాదాన్ని ప్రతిపాదించడానికీ, విషయ వివరణానికీ, ప్రబోధానికి చక్కని సాధనంగా గుర్తించారు. ఐతే వారి వచనరచన ఇంగ్లండులో వక్తలూ, రచయితలూ వాడే శైలికి కేవలానుకరణం మాత్రం కాదు. భారతీయ వ్యక్తిత్వాన్ని ప్రకటించడానికొక ఉపకరణంగా వారు ఇంగ్లీషు వచనాన్ని ఉపయోగిస్తారు. అందువల్ల వారి శైలికొక ప్రత్యేకత అలవడింది. వివేకానంద స్వామి ఇప్పటికి 70 ఏండ్లనాడు ప్రాచ్యమతాన్నిగూర్చి ఇంగ్లీషులో తన గంభీరోపన్యాసాలతో చికాగో నగర శ్రోతలను ముగ్ధులను కావించాడు. ఆయన రామకృష్ణ పరమహంసకు ప్రధాన శిష్యుడు. తన గురువు పరమపదించిన తరువాత ఆయన రామకృష్ణ మిషన్ అనే సంస్థను నెలకొల్పాడు. వివేకానందుని రచనలూ, ప్రసంగాలూ ఎన్నో సంపుటాల కెక్కినవి. పరిణత జ్ఞానంతో, దృఢవిశ్వాసంతో, లోకాన్ని ఉద్ధరించాలనే ఆవేదనతో ఆయన ప్రసంగించేవాడు. ఎంతో చొరవతో, ధీరతతో, హితబోధచేస్తూ శ్రోతలను రంజింపజేస్తూ అనర్గళంగా ఉపన్యసించేవాడు. యథార్థ భారతీయ సంస్కృతిని అభివ్యక్తం చేస్తూ ప్రసంగాలూ, రచనలూ చేసినవారిలో రవీంద్రనాథ ఠాకూరు, శ్రీ అరవిందుడు కూడా ఎన్నదగినవారు. విదేశీయమైన ఇంగ్లీషుభాషలో వారు తమ పాండిత్యబలంతో, సునిశిత మేధతో, ఎంతో సమర్థతతో తాత్త్విక చింతనకే ప్రాధాన్యమిచ్చే భారతీయ భావనను యావత్ప్రపంచానికీ బోధించగలిగారు. డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ తత్త్వశాస్త్రాన్ని గూర్చి రచించిన ఉద్గ్రంథాలూ, భారతీయ జీవన విధానాన్నిగూర్చి వ్రాసిన లఘురచనలూ ప్రపంచమంతట ఆదరణపొంది, వర్తమాన భారతీయ చింతనాసరణికి ఉన్నతస్థాయిని సాధించినవి.

జాతీయ నాయకులు దేశప్రజలందరికీ తమ సందేశాన్ని వినిపించడానికి ఇంగ్లీషు భాష ఒక్కటే అనువైనది కావడంవల్ల జాతీయోద్యమం ఇంగ్లీషు వచన రచన విస్తరించడానికి అత్యధికంగా తోడ్పడింది. గొప్ప విద్వాంసుడైన బాలగంగాధర తిలక్ "మరాఠా" అనే

ఇంగ్లీషు పత్రికను అతి దక్షతతో నిర్వహించాడు. ఇంగ్లీషు భాషద్వారా జర్నలిజమ్ వ్యాసంగాన్ని సాగించిన ప్రముఖులలో బెహరమ్‌జీ మలబారీ, శ్రీ అరవిందుడు, లాలా లజ్‌పత్ రాయ్, కస్తూరి రంగ అయ్యంగార్, టంగుటూరి ప్రకాశం ప్రత్యేకించి పేర్కొనదగ్గవారు. గాంధీ మహాత్ముడుకూడా ఇంగ్లీషు పాత్రికేయుడే. స్వయంగా ఆయన మొదట "Young India" పత్రికను, తరువాత "Harijan" పత్రికను నడిపాడు. విక్టోరియన్ యుగంనాటి ఆలంకారికమైన ఇంగ్లీషు వచనశైలిని విడనాడి, ఆయన రచనలో స్పష్టతను, సరళతను సాధించగలిగాడు. కఠోరసత్యాన్ని సూటిగా ప్రకటించడానికి ఆయన ఎన్నడూవెనుదీయలేదు. కేవలదూషణకు తనరచనలో తావీయలేదు. ఉక్కుతునుకలవంటి ఆయన వాక్యాలలో గాంభీర్యమూ, స్పష్టతా ప్రధాన లక్షణాలుగా కనిపిస్తాయి. "Hind Swaraj" వంటి ఆయన రాజకీయ ప్రబోధాత్మక రచనలు సుప్రసిద్ధమైనవి "My Experiments with Truth" అనే పేరుగల ఆయన ఆత్మకథ మహోత్కృష్ట రచనగా గణనకెక్కింది.

జవాహర్‌లాల్ నెహ్రూ తన గురువు అడుగుజాడలలో నడిచాడు. ఆయన కూడా బహుళ ప్రచారం పొందిన స్వీయచరిత్రను, 'The Discovery of India, 'Glimpses of World History' వంటి జనరంజకమైన దేశచరిత్ర పుస్తకాలను రచించాడు. ఆయన తరచుగా ఉపన్యసిస్తూ ఉండేవాడు. అందువల్ల ఆ ఉపన్యాసాలలో శాఖాచంక్రమణం కనిపించేది. ఐనా ఆయన వ్యక్తిత్వం, నిజాయితీ, కార్యదీక్ష ప్రతిబింబించే వచనశైలిలో మరువలేని ఆకర్షణ మనకు కనిపిస్తుంది. ప్రాచీనాధునాతన గ్రంథాలను విస్తారంగా, విచక్షణతో చదివినవాడు గనుకను, గొప్ప వ్యక్తులమధ్య, మహోన్నత భావాలమధ్య సంచరించిన అదృష్టశాలి గనుకను, జవాహర్‌లాల్ నెహ్రూ రచనలూ, ప్రసంగాలూ జీవితాన్ని సార్థకంచేసే సాంస్కృతిక భావాలతోనిండి నిర్వాత దీపకళికలవలె ప్రకాశిస్తున్నవి.

దేశానికి స్వాతంత్ర్యం లభించడంతో విద్వాంసులైన రాజకీయవేత్తలు, అరుదయ్యారు. అదృష్టవశాత్తు చక్రవర్తి రాజగోపాలాచారి ఇంకా మిగిలిఉన్నారు. వాడిగల మాటలతో కూడిన వచనశైలిలో ఆయన ఇంగ్లీషులో అటు వేదాంతాన్నీ గురించీ, ఇటు రాజకీయాలను గురించీ సమప్రజ్ఞతో వ్రాయగలరు. ఆయన ఇంగ్లీషులో రామాయణ భారతాలను ఎంతో నిపుణంగా రచించారు. నైశిత్యమూ, భావ వ్యక్తీకరణంలో సంయమనమూ ఆయన వచనశైలికి ముఖ్యలక్షణాలు. కాని చిన్నకథలను, నీతికథలను వ్రాసేటప్పుడు మాత్రం ఆ శైలీ నిర్ఘృణతలో మార్దవం కొంత చోటుచేసుకున్నది.

ఇంగ్లీషుభాషలో భారతీయులు పత్రికల కోసం చేసిన రచనలు వాఙ్మయాన్ని సంపన్నంచేసి ప్రశస్తికెక్కినవి. గతంలో కే. నటరాజన్, సి. వై. చింతామణి, ఖాసా సుబ్బారావు వంటి సమర్థులైన పాత్రికేయులు లుండేవారు. ఈ ప్రక్రియలో నేడు పరిణతి నందిన వారిలో పోథన్‌జోసెఫ్, యం. చలపతిరావు, కే. ఈశ్వరదత్తు, జి. వి. కృపానిధి, ఫ్రాంక్ మోరేస్, యస్. ముల్గాంకర్ ముఖ్యంగా ఎన్నదగినవారు. కే. యం.మున్షీ ఇంగ్లీషులో

శక్త్యుత్సాహాలతో నవలలను, వ్యాసాలను ధారావాహికంగా రచిస్తున్నాడు.

వీరితోపాటు నీరద్ సి. చౌధురినికూడా గణించవలసి ఉన్నది. Autobiography of an Unknown Indian, A Passage to England, The Contin ent of Circe అనే మూడు పుస్తకాలవల్ల ఆయనకు చక్కని సామర్థ్యంగల వచన రచయితగా పేరుప్రఖ్యాతులు కలిగాయి.

ఇక నవలా సాహిత్యం సంగతి. రమేశచంద్ర దత్త 1902 లోనే The Lake of Palms అనే నవలను ప్రచురించాడు. తరువాత ఏడేండ్లకు The Slave-Girl of Agra అనే నవలను ప్రకటించాడు. రమేశచంద్ర దత్త తరువాత ఇంగ్లీషులో అప్పుడప్పుడు కొన్ని నవలలు ప్రకటితమవుతూ వచ్చాయి, కాని ఈ సాహిత్య ప్రక్రియకు అధిక ప్రచారం వచ్చింది మాత్రం ముల్క్‌రాజ్ ఆనంద్ రచించడం ప్రారంభించిన తరువాతనే. మనుష్యులు సృష్టించిన వర్గభేదాల పట్ల, కులవ్యవస్థ పట్ల అతనిలో ప్రజ్వరిల్లిన ఆగ్రహమూ, దళితజీవుల పట్ల అతనికిగల అమితమైన సానుభూతీ ఎన్నో నవలలు వ్రాయడానికి అతనికి ప్రేరణ నిచ్చాయి. అతని నవలలలో Coolie (1933), Untouchable (1935), Two Leaves and a Bud (1937), The Big Heart (1954) అనేవి అధికంగా ప్రచారం పొందాయి. అతని పాత్రల వ్యక్తిత్వంలో కానవచ్చే ఉత్తేజమూ, వైవిధ్యంతో కూడి, సమగ్రమైన అతని సామాజిక సమస్యల ఆకళింపు, ఉదాత్త లక్ష్యసాధనకై రచించడంవల్ల రచనకు కలిగే బలమూ అతని నవలల విశేష ప్రచారానికి కారణాలు. ముల్క్‌రాజ్ ఆనంద్ వ్రాసినంత ఎక్కువగా ఆర్. కే. నారాయణ్ నవలలు వ్రాయకపోయినా, అతడు రచనాశిల్పం పట్ల ఆనంద్‌కంటె ఎక్కువ నిష్ఠగల రచయిత. నిలకడగా రచనా వ్యాసంగం సాగిస్తున్నాడు. నారాయణ్ ఇప్పటికి తొమ్మిది నవలలను ప్రకటించాడు. The Vendor of Sweets అనేది చివరి నవల. అతడు ముల్క్‌రాజ్ ఆనంద్‌వలె విప్లవవాది కాడుగాని, మృదువైన మాటలతోనే పాఠకులను ఒప్పించేశక్తి అతని రచనలో కనిపిస్తుంది. అతడు సృష్టించిన మాల్గుడి అనే చిన్నపట్నపు పరిధిలోనే పాత్రల ప్రవృత్తులను చిత్రిస్తూ, దక్షిణ భారతదేశ వాసుల జీవిత విధానాన్ని కండ్లకు కట్టేట్టు వర్ణిస్తాడు. అతని తొలి నవలలలో ఒకటియైన The English Teacher కొంతవరకు స్వీయకథాత్మకమైనది. అతని రచనలలో అదే సర్వోత్కృష్టమైనది కావచ్చును. తరువాత వ్రాసిన నవలలలో కొన్నిటిలో అతడు జీవితాన్ని వైద్యుడు రోగిని పరీక్షించినట్లు నిశితంగా గమనించడం కనిపిస్తుంది. మిస్టర్ సంపత్, మార్గయ్య అనే పాత్రలు ధనాపేక్షతో వేసే ఎత్తులను, రాజు అనేపాత్ర ఎదుర్కొన్న నైతిక సంఘర్షణను, రాజకీయోద్యమంతో ముడిపడి భారతి, శ్రీరామ్ అనేపాత్రలు వివాహం చేసుకో వలెననే నిశ్చయాన్నీ అతడు చక్కగా అర్థం చేసుకొని, సానుభూతితో చిత్రించాడు. నారాయణ్ నవలలలో The Man-Eater of Malgudi ప్రత్యేకించి పేర్కొనదగినది, ఆ నవల వ్రాస్తున్న రోజులలో నారాయణ్ దృష్టిని భారతీయ పురాణేతిహాస గాథలు ఎక్కువగా ఆకర్షించినట్లు కనిపిస్తుంది. ఎందుచేతనంటే ఆ నవల వ్రాసిన తరువాత అతడు Gods, Demons and Others అనే పుస్తకాన్ని ప్రకటించాడు. The Man-Eater of

Malgudi అనే నవలలో అతడు భస్మాసురుని గాథను ఆధునిక వాతావరణంలో ఎంతో నేర్పుతో తిరిగి చిత్రించాడు. ఆ నవలలో తోళ్ల పదును చేసే వాసు అనేపాత్ర ఆధునిక భస్మాసురుడు. పెద్దపులి చురుకుదనమూ, క్రౌర్యమూ అతనిలో కనిపిస్తవి. తన అభివృద్ధికి నిత్యమూ క్రొత్తదారులను అన్వేషిస్తూ ఉంటాడు. భస్మాసురుని కథను నారాయణ్ పూర్తిగా అనుసరించాడు. అందుకే వాసు మరణించిన తీరు భస్మాసురునికి పట్టిన దుర్గతినే తలపింపజేస్తుంది. ఒక మహత్తర శక్తి తీవ్రవాంఛల సుడిగుండంలో చిక్కుకొని విచ్ఛిన్నమై పోవడం మనకు స్ఫురిస్తుంది. దీనితో పోల్చితే నారాయణ్ రచించిన The Vendor of Sweets అనే ఇటీవలి నవల కొంత నీరసమైనదిగా కనిపిస్తుంది. ఐనా పసిపిల్లలవలె అమాయకుడై లక్ష్యాలు మారిన నవప్రపంచంలో దారి తెలియక తడబడే జగన్ పాత్ర మన స్మృతిపథంలో నిలిచిపోతుంది. ఈ కథలో మృదుహాస్యమూ, ఆక్షేప నాటకధర్మమూ ఉన్నవి. వాటితోపాటు ఇంతకంటె మేలుగా జీవించాలనే ఆపేక్ష, ఈ ప్రపంచంలోనే వర్తమానంలోనే నవసౌందర్యం ఉదయించాలనే ఆకాంక్ష, ఆశకూడా కనిపిస్తవి.

ఇంగ్లీషులో నవలలు వ్రాస్తున్న భారతీయ రచయితలలో పాఠకులను విశేషంగా ఆకర్షిస్తున్న వారు మరికొందరు కూడా ఉన్నారు. భవానీ భట్టాచార్య వర్తమాన సామాజిక జీవితపు పొరలను నిశితంగా, ప్రయోజనాత్మకంగా పరీక్షించి, వాటిలోని కృత్రిమత్వాన్ని నిర్దాక్షిణ్యంగా వెల్లడిస్తున్నాడు. ఇందుకు అతడిటీవల వ్రాసిన Shadow from Ladakh చక్కని ఉదాహరణం. గాంధీ మహాత్ముడు ప్రబోధించిన నిరాడంబరమైన సర్వోదయాదర్శానికీ, మనదేశంలో క్రొత్తగా తల ఎత్తిన బ్రహ్మాండమైన ఉక్కు కట్టడాలలో మానవతాదృష్టి లోపించిన స్థితికీ, ఉన్న అంతరం దీనిలో కనిపిస్తుంది. చివరకు గాంధీతత్త్వానికే జయం చేకూరుతుంది. నవలలను వ్రాస్తున్న ఇతర రచయితలలో శాంతా రామారావు, మనోహర్ మల్గాంకర్, కమలా మార్కండేయ, ఖుష్వంత్ సింగ్, నయనతారా సైగల్, అనితాదేశాయ్ పేర్కొన దగ్గవారు. ఇతే మన దేశంలో నవలలు వ్రాస్తున్న వారిలో ఇంగ్లీషు భాషను తన సృజనశక్తి కనుగుణంగా రూపొందించిన రచయిత నిశ్చయంగా రాజారావని చెప్పవచ్చును. అతడు వ్రాసింది స్వల్పంగానే. దీనిలో కొంత, అతని ఇటీవలి నవల The Cat and Shakespeare వలె, చిరాకు కలిగిస్తుంది. ఐతే Kanthapura, The Cow of the Barricades, The Serpent and the Rope అనే మూడు గ్రంథాలలో ఇంగ్లీషు భాషను నూతన దిగంతాలకు కొనిపోగల సూచనలు కనిపిస్తవి. అంతేకాదు. కథా వాఙ్మయంలో గాంధీయుగాన్ని కండ్లకు కట్టినట్లు చిత్రించిన కళాకారుడు అతడొక్కడే. The Cow of the Barricades అనేది అతని కథల సంపుటి. ఆ పుస్తకపు శీర్షికగా ఉన్న కథలో సంఘటనల నేపథ్యంలో గాంధీ మహాత్ముడుంటాడు. ప్రధాన పాత్ర గౌరి అనే గోవు. ఆ గోవు సమృద్ధికీ, మాతృప్రేమకూ, నిరవధిక కరుణకూ సంకేతం. అది నిజంగా తల్లియే, భారతమాతయే. గాంధీజీ అనుచరులారంభించిన శాంతియుతమైన చర్య క్రమంగా దౌర్జన్య పూరితమైన ఘర్షణగా మారుతుంది. మహాత్మునికి ప్రతినిధియైన నాయకుడు నిస్సహాయు

డవుతాడు. అదే సమయంలో ఆ ఊరి వారందరి ఆదరాభిమానాలకూ, గౌరవానికీ పాత్ర మైన ఆ ఆవు అక్కడికి వస్తుంది. దాని రాక చూసి ప్రభుత్వాన్ని ధిక్కరిస్తున్న గ్రామస్థులు ఆనందంతో "వందేమాతరం" అని కేకలు వేస్తారు. తన కర్తవ్యం స్పష్టంగా తనకు తెలిసి నట్లు ఆ ఆవు సైనికులు తాత్కాలికంగా కట్టిన అడ్డు కట్టమీదికి వెడుతుంది, సైనికులకేమీ బోధపడదు తెల్లగా కనిపిస్తున్నది సంధి సూచకమైన ధ్వజమా అని ఆలోచిస్తారు.

"ఐతే వారా ఆవును, దాని కండ్లను, ఆ కండ్లలో తొణుకుతున్న నిర్మల గంగాజల కణంవంటి అశ్రువును చూడగానే "మహాత్మాగాంధీకీ జై" అంటూ ప్రజలలో కలిసిపోతారు. కాని వారి అధికారి, పాశ్చాత్యుడు, అదిచూసి తుపాకి ప్రేల్చుతాడు. అది గౌరి తలను దూసుకొని పోతుంది. సామాన్య ప్రజలమధ్య ఈశ్వరసంకల్ప సాధనమైన ఆ ఆవు నేల కూలుతుంది." భారత స్వాతంత్ర్యం కోసం గాంధీజీ నాయకత్వంలో సాగిన ఉద్యమాన్ని ఇంతకంటె రసవంతంగా చిత్రించడం మరి ఎక్కడనైనా కనిపిస్తుందా? మతోన్మత్తుల ఘర్షణమధ్య గాంధీజీ తన జీవితాన్నే బలిదానం చేయడం విధినిర్ణీతమని రాజారావు ముందు గానే గ్రహించినట్లు తోస్తుంది. The Serpent and the Rope అనే నవల Kanthapura కంటె పెద్దది, ఎక్కువ ప్రసిద్ధికూడా పొందినది. ఐనా ఇంతవరకు వచ్చిన నవలలలో గాంధేయ రాజకీయోద్యమం Kanthapura లోనే సర్వోత్కృష్టంగా వర్ణితమయింది. గాంధీజీ ఉద్యమంవల్ల దక్షిణాదిలోని ఒక పల్లెలో కలిగిన సంచలనాన్ని మాటకారియైన ఒక వృద్ధ వితంతువు పలుకులద్వారా ఈ నవలలో మనం తెలుసుకుంటాము. కథ పూర్తిగా ఆమె గ్రహణశక్తికీ, మనస్తత్వానికీ అనుగుణంగా, ఆమె స్మృతిపథంలో కదిలిన క్రమంలో వ్యక్త మవుతుంది. కల్పనా కథలు, గాథలు, భారతదేశంలోని పల్లెపట్టుల సాంఘిక జీవితం, జాతీయ స్థాయిలోనూ, పల్లెల స్థాయిలోనూ గాంధీజీజాతీయోద్యమానికి సంబంధించిన రాజకీయ ఘటనలు, అన్నీ కలిసి చక్కని వివేచనతో కూడిన శక్తిమంతమైన నవలగా రూపొందాయి. భాషపై అధికారమున్న ప్రభువువలె రాజారావు ఇంగ్లీషు భాషను ప్రయో గిస్తాడు. ఒక నూతనభాషను సృష్టిస్తున్నాడనిపిస్తుంది. అతని వ్రాతలో భారతీయ భాషా సహజమైన లయ కథలోని భావపరిణామాని కనుగుణంగా లీనమవుతుంది. ఇంగ్లీషు మూసలో పోసినా అది భారతీయ భావననే వ్యక్తంచేస్తూ, భారతీయులు ఇంగ్లీషులో సృష్టించిన సాహిత్యంలో అత్యంత రసవంతమైన రచనగా రూపొందింది.

## విషయ సూచిక

### కవిత

## తరుదత్త

### సీ త

గదిలో వత్తి తగ్గించిన దీపపు వెలుగులో
  సంతోషం తొణికే ముగ్గురు పిల్లలు !
విచ్చిన కళ్ళతో తదేకదృష్టితో వారేమి చూస్తున్నారు ?
రవికిరణం చొరని దట్టమైన అడవి,
దాని నడుమ చదును చేసిన భూమి.
అక్కడ సుదీర్ఘ వృక్షాలను పెనవేసుకొన్న లతలకు
  బ్రహ్మాండమైన విరులు పూస్తున్నవి ;
  నిర్మలాంబుపూర్ణ సీరవకాసారంలో
  రాయంచలు విహరిస్తున్నవి ;
కొంకనుంచి ఎగిరి నెమలి నేలపై వ్రాలుతుంది ;

వన్యహరిణాలు పరుగులెత్తుతూ ఉంటవి ;
పొలాలు బంగరువన్నె ధాన్యకణాలతో ప్రకాశిస్తుంటవి ;
హోమకుండాలనుంచి సన్నగా నీలిపొగలు
నింగివైపు పయనిస్తుంటవి ;
అది తపస్వియైన కవిమహర్షి ప్రశాంతాశ్రమం.
కాని ఈ సుందరాంగి ఎవరు ?
ఆమె దుఃఖం వ్యర్థం కాలేదు.
ఎందుకంటే, ఆమె నయనాలనుంచి జారే ప్రతి బాష్పకణం
మూడు జతల పసినేత్రాలనుంచి అశ్రుధారలు కురియింపజేస్తున్నది;
ఆ ముగ్గురు పిల్లల లేత తలలు విషాదంతో వంగిపోయినవి.
అతి ప్రాచీనమైన కథ అది.
అలనాటి సీతాదేవి దీనగాథను తిరిగి స్మరణకు తెచ్చిన
ఆ పాటను ఒకతల్లి పాడింది.
ఆ కంఠధ్వని ఆగిపోయింది.
ఆ దృశ్యం వారిదృష్టికి దూరమయింది.
ఐనా ఆ పిల్లలు తెల్లవారేవరకు ఆ సన్నివేశాన్నిగూర్చి
కలలు కంటూనే ఉంటారు !
మునపటివలెనే ఆ పిల్లలు సాయంవేళ
తిరిగి తమ తల్లిచెంత చేరడ మెన్నడు ?

—Ancient Ballads and Legends of Hindustan నుంచి.

తరు దత్త

## మా సరుకు చెట్టు

శిఖరం నక్షత్రాలను తాకే పెద్ద చెట్టు. కోతల వల్ల గంట్లుపడి గరుకు బారిన దాని మ్రాకును పెద్ద కొండచిలువ వలె చుట్టలుగా చుట్టుకొని ఎగబ్రాకుతున్న తీగ. ఆ తీగ కౌగిలిలో చిక్కుకొంటే మరొక చెట్టేదైనా బ్రతుక గలిగేది కాదు. కాని మహా కాయం గల ఈ వృక్షం ఆ దేహాపకుంఠనాన్ని స్థైర్యంతో భరిస్తున్నది. పగలంతా పక్షులూ, తేనెటీగలూ చేరే ఆ చెట్టుకొమ్మల నుంచి ఆ తీగెకు పూచిన పువ్వులు రక్తారుణ కాంతులతో గుత్తులుగా వ్రేలాడుతున్నవి. రాత్రివేళల మనుష్యులు విశ్రమిస్తున్న తరుణంలో తరచుగా మా పెరటిలోని ఆ చెట్టుమీది నుంచి చీకటి తెరల నడుమ వినవచ్చే ఒక మధురగీతపు ధ్వనులతో తోట నిండి పోతుంది.ఆ పాటకు అంతమే లేదని విస్తుంది.

ప్రభాతవేళ నా గది కిటికీ తెరుచుకోగానే నా చూపు ఆనందంతో ఆ చెట్టుమీద నిలుస్తుంది. అప్పుడప్పుడు—ముఖ్యంగా శీతకాలంలో – ఆ చెట్టు చివరికొమ్మ మీద ఒక కొండముచ్చు ఒంటరిగా కూర్చొని సూర్యోదయాన్ని తిలకిస్తూ ఉంటుంది క్రింది కొమ్మలమీద దాని పిల్లలు గంతులు వేస్తూ ఆడుకొంటూఉంటాయి. దవ్వునుంచీ, దాపునుంచీ కోకిలలు నవోదయానికి స్వాగత మిస్తూఉంటాయి. నిద్రమత్తులో మా ఆవులు పచ్చిక బయళ్ళకు తరలి వెడతాయి. ఆ పెనువృక్షపు నీడ అందంగా ప్రతిఫలించే విశాలమైన చెరువునీటిలో కుప్పలుగా పేరిన మంచువలే కలువపువ్వులు వికసిస్తాయి. కాని ఆ సరుకు చెట్టు నా కింతటి ప్రేమాస్పదమైనది కావడానికి కారణం దాని ఔన్నత్యంకాదు. ఆ చెట్టు నీడలో మేము ఆడుకొన్నాము. ఏండ్లు గడచిపోతున్నా, నా ప్రియ సఖులారా! మిమ్ములను నేను గాఢమైన ప్రేమతో స్మరిస్తాను. మీకోసమే ఈ చెట్టుమీద నాకెప్పుడు అభిమానం నిలచి ఉంటుంది. మీ మధుర స్మృతులతో అవనతమైన నా మనస్సులో ఆ చెట్టు స్ఫురించి దుఃఖాశ్రువులతో కళ్ళు నిండగా అదృశ్యమవుతూంటుంది. గులకరాళ్ళు పేరుకొన్న తీరాన సముద్రతరంగాల ధ్వనివలె అస్పష్టంగా విషాదగీతంవరె వినిపించే ఆ శబ్దమేమిటి? అది ఆచెట్టు రోదనధ్వని. బహుశః ఈ భీతిజనకగీతం అజ్ఞాత లోకాల్లోకి చేరుతుందేమో.

అజ్ఞాతమైనా విశ్వాసంతో నిండిన దృష్టికి అది సుపరిచితమే· జలదేవత తన గుహలో గాఢంగా నిదురించే వేళ, సాగరతరంగాలు ఇటలీ, ఫ్రాన్స్‌దేశాల ప్రాచీన తీరాలను మృదువుగా చుంబిస్తున్నప్పుడు, పండువెన్నెలలో ఈ పృథ్వి కలలులేని సుషుప్తిలో మునిగి ఉండగా, సుదూర తీరాలలో, సురక్షితంగా ఉన్న అఖాతాల చెంత ఆ శోకగీతాన్ని నేను విన్నాను. ఆ గీతం ఎప్పుడు వినిపించినా ఒక గంభీరరూపం నా మనస్సులో కదిలేది. ఓ వృక్షమా! ప్రియమైన నా మాతృదేశంలో ఉల్లాసంతో నిండిన వడుచుదనంలో సుపరిచితమైన నీ రూపమే అది.

చిరనిద్రలో కన్నుమూసిన నా సహచరులకు ప్రియమైన వృక్షమా! అందుకే నీ గౌరవార్థం నేనీ గీతాన్ని రచిస్తున్నాను. వారు ప్రాణం కంటె అధికులు నాకు. నేను గతించిన తరువాత నీవు కలకాలం జీవించే వృక్షాలలో ఒకటిగా గణింపబడుదువు గాక! బారోడేల్ లో తమ భయానక శాఖల క్రింద వెలవెలపోయే భయమూ, వణికే ఆశా, మృత్యువు, కంకాళములు, నీడగా ఆవరించిన కాలమూ నిలిచిన ఆ అమర వృక్షాలవలె నీకుకూడా చిరకాలం జీవించాలి. నీ అందాన్ని వర్ణింప యత్నించే ఈ గీతం నీరసంగా ఉన్నా, విస్మృతి శాపం నుంచి నిన్ను నా ప్రేమ రక్షించుగాక!

—Ancient Ballads and Legends of Hindustan నుంచి.

## రవీంద్రనాథ ఠాకూరు

### గీతాంజలి

I

నన్ను అంతము లేనివాణ్ణిగా చేశావు, అది నీకొక ఆట. ఈ దుర్బల పాత్రను తిరిగి తిరిగి వంచివేస్తూ, నవజీవనంతో నింపుతూ ఉంటావు.

ఈ వంశీ నాళాన్ని కొండలమీదికీ, లోయల లోనికీ వెంట కొనిపోయి దానిపై నిత్య నూతనగీతాలను పలికించావు.

నీ అమృత కరస్పర్శ వల్ల నా క్షుద్ర హృదయం ఆనందంతో తన అవధులను కోల్పోయి, అనిర్వచనీయాలాపాన్ని పలుకుతుంది.

నీ అనంతోపాయనాలు నాకు నా చిన్నచేతులమీదుగానే లభిస్తాయి. యుగాలు గడిచిపోతాయి, నీవు కానుకలను వర్షిస్తూనే ఉంటావు, వాటిని నింపుకోవడానికి అంతులేనిచోటు ఇంకా ఉంటూనే ఉంది.

II

పాట పాడుమని నీ వాజ్ఞాపించినప్పుడు, గర్వంతో నా హృదయం ఛేదిల్లుతుందని అనిపిస్తుంది. కన్నెత్తి నీ ముఖం వంక చూస్తాను, నా నేత్రాలు అశ్రువులతో నిండిపోతాయి.

నా బ్రతుకులోని కాఠిన్యమూ, అపశ్రుతీ కరిగిపోయి మధురస్వర మేళనంగా రూపొందుతాయి. ఆనందంతో సాగరాన్ని లంఘించే పక్షివలె నా భక్తి రెక్కలు విచ్చుకుంటుంది.

నా గానం నీకు ఆహ్లాదం కలిగిస్తుందని నే నెరుగుదును. గాయకునిగానే నేను నీ సన్నిధికి చేరగలనని కూడా నే నెరుగుదును.

నీ చరణాలు నాకు అందరానివి. కాని సువ్యాప్తమైన నా గేయపు రెక్కల కొనలతో నేను వానిని స్పృశిస్తాను.

గాన పారవశ్యంలో మైమరచి ప్రభువవైన నిన్ను సఖుడా అని నేను సంబోధిస్తాను.

—Geetanjali నుంచి.

## రవీంద్రనాథ ఠాకూర్

### భక్తుడు

I

నిటారు కొండలపైన, మండే ఇసుకమీద, కఠినశిలలతో నిండిన కర్కశపథాల వెంబడి భక్తశిఖామణి సాగిపోతూ ఉంటాడు.

బలవంతులూ, దుర్బలులూ, వృద్ధులూ, యువకులూ, దేశాధిపతులూ, శ్రమ జీవులైన హాలికులూ, రకరకాల జనులు ఆయనను అనుసరిస్తారు.

కొందరికి విసుగు కలుగుతుంది. మరికొందరు అలసిపోతారు. కొందరికి కోపం వస్తుంది. మరికొందరిలో సంశయం రేకెత్తుతుంది.

బరువుగా ఒక్కొక్క అడుగువేస్తూ, ''గమ్యం ఇంకా ఎంతదూరమున్న'' దని వాళ్లు అడుగుతారు.

సమాధానంగా భక్తుడు పాట పాడడం ప్రారంభిస్తాడు.

వారు ముఖాలు చిట్లిస్తారు, కోపంతో చేతులూపుతారు, ఐనా ఆయనను ఎదిరించ లేరు. జనసందోహపు ఒత్తిడీ, అనిశ్చితమైన ఆశా వారిని ముందుకు నడిపిస్తాయి.

నిద్రను, విశ్రాంతిని తగ్గించుకున్నారు. ఒకరితో ఒకరు చకచక నడవడంతో పోటీ పడుతున్నారు. ముందుపడే అవకాశం ఎక్కడ తమకు చేజారిపోతుందో, ఎక్కడ అదృష్టం ఇతరులను వరిస్తుందో అని ఎప్పుడూ వారు భయపడుతూ ఉంటారు.

కాలం గడుస్తూ ఉంటుంది. ఎప్పటికప్పుడు వెనుకకు జరిగే దిగంతరేఖ ఏదో అపరిచిత వస్తువు లభిస్తుందనే ఆకర్షణతో వారిని ముందుకు నడుపుతూ ఉంటుంది. కాని చివరకు వారు నీరసించి పోతారు. వారి ముఖాలలో కాఠిన్యం గోచరిస్తుంది. వారి తిట్లు క్రమంగా శ్రుతి మించుతాయి.

## II

అది రాత్రి వేళ.

మర్రిచెట్టు నీడలో యాత్రికులు తమ చాపలు పరుచుకున్నారు.

వాయువీచిక దీపాన్ని ఆర్పివేయడంతో, నిదుర మూర్ఛగా మారినట్లు అంధకారం గాఢతరమయింది.

జనసమూహంలో ఒక వ్యక్తి లేచి నిలబడి నాయకుని వంక నిర్దాక్షిణ్యంగా చూపుతూ, ''గమ్యం తెలిసినట్లు నటించిన వంచకుడా! మమ్ములను నీవు మోసగించా'' వని బిగ్గరగా కేకలు వేస్తాడు

ఒక్కరొక్కరుగా ఇతరులు కూడా దూషణ మొదలు పెడతారు. స్త్రీలు ద్వేషం వెళ్లగక్కుతారు. పురుషులు మండి పడతారు.

చివరకు అందరిలో అధిక సాహసం గల వాడు దారి చూపే భక్తుణ్ణి కొడతాడు. ఆయన ముఖం వారికి కనిపించదు, కాని ఆగ్రహావేశంలో ఆయన ప్రాణాలు పోయే వరకు అందరూ కలిసి కొడతారు.

నీరవ నిశీథంలో దూరం నుంచి జలపాతపు ధ్వని అస్పష్టంగా వినవస్తుంది. మల్లె పువ్వుల సుగంధం ఉండీ లేనట్లు గాలిలో తేలిపోతుంది.

III

యాత్రికులను భయ మావరిస్తుంది.

స్త్రీలు ఏడ్పు ప్రారంభిస్తారు. తమ దీనస్థితికి బాధతో పురుషులు వారిని ఏడ్పు మానవలసినదని కేకలు వేస్తారు.

కుక్కలు మొరగడం మొదలు పెడతాయి. నిర్దాక్షిణ్యంగా కొట్టి ఆ రొద నివారిస్తారు.

ఆ రాత్రికి అంతమే లేనట్లనిపిస్తుంది, తప్పెవరిదని ఆ జన సమూహంలో వాగ్వివాదం మొదలవుతుంది.

అరుపులూ, బొబ్బలూ సాగుతాయి. ఒరలనుంచి వారుకత్తులు తీయడానికి సిద్ధమవుతూ ఉండగా, చీకటి సన్నగిలుతుంది. పర్వత శిఖరాలమీద ప్రభాత కాంతులు ప్రసరిస్తాయి.

ఎదుట మృతుడై పడి ఉన్న వ్యక్తి కనిపించగానే వారు అరుపులు మాని బరువుగా ఊపిరి తీస్తారు.

స్త్రీలు వెక్కివెక్కి ఏడుస్తారు, పురుషులు తమ ముఖాలను చేతులతో కప్పుకుంటారు.

కొందరు ఇతరులకు కనిపించకుండా పారిపోబోతారు, కాని వారి నేరం వారిని హతుని దగ్గర నుంచి పోకుండా బంధిస్తుంది.

''మనకు దారి చూపే వారెవరు?'' అని విహ్వలతతో పరస్పరం ప్రశ్నించుకుంటారు.

''మనం బలి గొన్న ఇతడే'' అని తూర్పునుంచి వచ్చిన వృద్ధుడు తలవంచుకొని అంటాడు.

పలుకులేకుండా వారు నిశ్చలంగా కూర్చుంటారు.

వృద్ధుడు తిరిగి పలుకుతాడు : ''సంశయంతో ఇతని మాటను మనం తిరస్కరించాము, ఆగ్రహంతో చంపివేశాము. ఇప్పుడు ఆదరంతో ఇతనిని అనుసరిద్దాము. ఎందుకంటే మన ఆగ్రహానికి బలియైన ఈ మహనీయుడు మరణించినా మన జీవితాలలో బ్రతికే ఉన్నాడు.''

అందరూ లేచి నిలబడి ముక్తకంఠంతో పలుకుతారు : ''విగతజీవుడైన భక్తునకు విజయము—అని, జయ'' మని.

సరోజినీ నాయుడు

## పద్మాసనస్థుడైన బుద్ధునకు

బుద్ధదేవా! నిమీలిత నేత్రాలతో, ముక్తహస్తాలతో
పద్మాసనస్థుడవై నీవు పరిణామమే లేని ఏచిరంతన
దివ్యానుభూతిని పొందుతున్నావు?
మానవ జగత్తున కతీతమై, మా జాతికి అచుంబితమైన
ఏ శాంతిని చవిచూస్తున్నావు?
కల్లోలితమైన మా మార్గంపై సదా పరిణామ
వాయువీచికలు వీస్తూఉంటాయి
రేపు ఉత్పన్నం కాబోయే క్లేశాలు నిన్నటి బాధలను మరపింప జేస్తాయి.
కలల వెనుక కలలు, ఘర్షణ వెనుక ఘర్షణ రేకెత్తుతాయి.
చివరకు జీవితపు అల్లికను మృత్యువు విప్పివేస్తుంది.
సంకటమూ, ఆరాటమూ, చెదరిపోయిన మా
ఆత్మాభిమాన రహస్యాలూ, పరాజయం నేర్పే కఠిన
పాఠాలూ, అలస్యంగా చేతికి అందే పువ్వూ,
అందని ఫలమూ — ఇవే మా వంతు, కాని
బుద్ధదేవా! పద్మాసనంపై విశిష్టతతో గడించిన
నీ శాంతి మాత్రం మాకు లభించదు.
అసమర్థ హస్తాలతో అందరాని మా వాంఛలు
సాధించడానికి ప్రయత్నిస్తాము.
తరిగే విశ్వాసంతో, తడబడే అడుగులతో
దివ్యశిఖరాల నధిరోహించ యత్నిస్తాము.
దివ్యజీవనసాధనకై మా ఆత్మ పడే తపనను
ఏ శక్తీ జయించలేదు, ఆణచలేదు.
అందరాని సుదూరంలో ఉన్న గమ్యం ఇంకా దూరంగా జరుగుతూనే
చేర రమ్మని సైగ చేస్తూ ఆకర్షిస్తూనే ఉన్నది.
మా ఐహిక క్షణాలన్నీ అనంతంలో ఒక శకలమే.
నీ పద్మాసనపు చేరువలో
మహత్తరమూ, అజ్ఞాతమూ ఐన నిర్వాణాన్ని
మేము పొందే మార్గమేది?

—The Sceptred Flute నుండి

సరోజినీ నాయుడు

## జయం

జీవితం నాకు ఆనందాన్ని, కవిత్వాన్ని
స్వచ్ఛహాసాన్ని సౌకుమార్యాన్ని, ఉజ్జ్వలకీర్తిని,
విరబూచిన వనవృక్షం వంటి ఆశను,
జ్వాలలతో ప్రతిధ్వనించే రెక్కలు నిండిన స్వప్నాలను
స్త్రీ ధనంగా ప్రసాదించింది.
తన ఉన్నత లోకంలో ఈశ్వరుడు కలత చెంది,
ఓ ప్రేమాధిదేవతా! తన తారాపథం నుంచి
నాకు కన్నీటి పాఠం నేర్పడానికి నిన్ను శీఘ్రంగా
గాఢమైన బాధతో కూడిన కానుకలతో పంపాడు.
నీవు నా కలశంలోని ఆనందాన్ని కైవసం చేసుకొని
అందలి మధువును ఊషర క్షేత్రంపై ఒలకబోశావు.
నా గీతంలోని మధుర స్వనాన్ని అపహరించావు.
గేయ పూర్ణ దరహాసాన్ని పెదవుల మీద నిలిపివేశావు.
తన కాంతిరేఖలను జగమంతట వెదజల్లే
నాకీర్తి కరదీపికను లాగుకొన్నావు.
నా ఆశా శాఖల ఫలాలను కొల్లగొట్టావు.
రెక్కలు విచ్చిన నా స్వప్నాలను సంహరించావు.
శిథిలమైన జీవన సౌందర్యం నడుమ
దుఃఖంలో పరాజితనై నేను ఒక్కతెనే
ఓదార్పు లేకుండా నిలబడ్డాను. నా దైన్యం చూసి
కాంతులీనే తన సింహాసనం నుంచి దేవుడు నవ్వాడు.
నా గర్వాన్ని భగ్నం చేస్తూ నీవు
నిర్దయతో, ప్రశాంతంగా, ఘనంగా నాతో అన్నావు:
''నీ గర్వభంగం చేయడానికి
ఆయన ఉద్దేశించిన ఆయుధాన్ని నేను.
ధీర భావనతో దూరతీరాలకు
మధుర ముగ్ధ గీతాలను ఆలపిస్తూ
వేగుచుక్కతో చుట్టరికం కలుపుకొంటూ,
అర్ధరాత్రి సూర్యునితో స్నేహం చేయగోరుతూ
వర్తిస్తున్నావు నీవు

నీ హృదయాన్ని బంధించడానికి తగిన శక్తి నిచ్చి
దైవం పంపాడు నన్ను.
ఇలలోని దేశాలు తలవంచి మ్రొక్కగా
గర్వ పడిన హృదయమా!
నాకు మోకరిల్లు! నాకు మోకరిల్లు!"

The Feather of the Dawn (1961) నుంచి.

**శ్రీ అరవిందుడు**

## అధి వాస్తవిక శాస్త్ర స్వప్నం

ఒక మాంసగ్రంథి హామ్లెట్ నాటకం వ్రాసినట్లు,
మెర్మెయిడ్ పానశాలలో మధువు త్రాగినట్లు,
అమరత్వాన్ని కైవసం చేసుకొన్నట్లు కలవచ్చింది.
ఈజియన్ సాగరతీరంలో హార్మోనుల సంఘం ఒకటి
ఇలియడ్ ఒడెస్సీ ఇతిహాసకావ్యాలను రచించింది.
ఒక థైరాయిడ్ గ్రంథి దాదాపు నగ్నంగా
బోధి వృక్షపు నీడను ధ్యానం చేసి, చిరంతన కాంతిని దర్శించి,
లేచి, తన గంభీర మౌనాన్ని విడనాడి
ధర్మ చక్రాన్ని గూర్చి, అష్టాంగ మార్గాన్ని గూర్చి
నిశ్చయంగా ప్రవచించింది.
అస్వస్థమైన ఉదరపు ప్రేరణతో ఒక మస్తిష్కం
యూరప్ ఖండమంతటా గర్జించి, నిర్జించి, పాలించి, పతనం చెందింది.
సెయింట్ హెలెనా దీవి నుంచి బహుశః స్వర్గానికి వెళ్ళింది.
అధివాస్తవిక ప్రపంచం ఈ విధంగా ఊగులాడింది, అంతలో
ఒక శాస్త్రజ్ఞుడు అణువులతో ఆటలాడి,
దేవుడు కేకవేయబోతూ ఉండగానే ఈ విశ్వాన్ని భగ్నంచేశాడు.

Last Poems (1952) నుంచి

**శ్రీ అరవిందుడు**

## ఈశ్వరుని గులాబీ

ఈశ్వరుని గులాబీ: విహాయసవీధిలోని ఇంద్రనీలాలపై నిలిపిన
సిందూర చిహ్నమా!

సప్తపారవశ్యావస్థలతో సప్తవర్ణ శోభితవై అగ్నికీలల మధురిమతో
ఆనందదాత్రివైన గులాబీ !

ఓ ఈశ్వర విలాసమా ! అగ్నిశిఖా !
నామరహితుని సంకేతపుష్పమా ! ప్రణవముకుళమా !
మానవతతో కూడిన మా హృదయంలో విజృంభించు.
ఈశ్వరుని గులాబీ ! అస్తిత్వశిఖరాలపై వికసించే మహత్తర జ్ఞానప్రసూనమా !
కాంతిని ప్రసాదించే గులాబీ ! చరమ దర్శనపు స్వచ్ఛ సారమా !
ఓ సువర్ణ రహస్యమా! కుసుమమా !
కాలాతీతుని శిరమున నిలిచిన రవిబింబమా ! విస్మయకర
వేళ వచ్చిన అతిథీ !

పృథ్వీ తత్త్వ మయమైన మా మనస్సులో వసించు
ఈశ్వరుని గులాబీ ! అనంతపు లోహితశక్తి, బలసూచకరక్తవర్ణ విగ్రహమా !
వజ్రకాంతితో నిశీథాన్ని చీల్చే శక్తి పూర్ణమైన గులాబీ !
అమరత్వపు రూపమా ! మానవునిలోని ఈశ్వర ప్రాదుర్భావమా !
మానవుని సంకల్పంలో వెలుగుతూ, నీ ప్రణాళికా వైచిత్రిని రచించు.
అవతరించే ఈశ్వరుని వాంఛతో ఎరుపెక్కిన ఈశ్వరుని గులాబీ !
వర్ణవల్లకీ! బహుదళ శోభితవై జీవనదాత్రివైన గులాబీ !
మర్త్యదేహాన్ని మధుర మంత్రశక్తిగా మహిత గీతంగా మార్చు,
మాలోని భౌతికాధ్యాత్మిక శక్తులను సంధించు, కాలావధి బద్ధులైన
పుత్రులకు అమరత్వం ప్రసాదించు
అనంతత్వపు వదనంపై విరిసిన తన్మయానందరేఖా ! ఈశ్వరుని గులాబీ !
అస్తిత్వపు ఆంతరాళంలోని అరుణిమా ! కారుణ్యపుప్రగాఢాగ్ని కీలా !
ప్రేమ ప్రదాత్రీ
ప్రకృతి అగాధంలో రోదిస్తున్న ప్రగాఢ వాంఛా హృదయం నుంచి ఉదయించు,
ఈ పృథ్విని విస్మయకర శక్తి నికేతనంగా మార్చు. జీవితాన్ని
ఆనంద పారణ్యముద్రగా మార్చు.

Collected Poems and Plays (1942) నుంచి

శ్రీ అరవిందుడు

## దేవుని కుమారుడు

మానవ కుమారుడై జన్మించిన దేవుని కుమారుడు
హాలాహల పానం చేశాడు, పతితజీవులపట్ల దైవపు ఋణాన్ని

తీర్చేభారం తనపై వేసుకొన్నాడు.
ఆయన సంకల్పం జీవులను అనంత శాంతికోసం, విశ్రాంతి కోసం
మథనపడే జీవన మరణాలకు బద్ధం చేసింది.
ఇప్పుడా ఋణం తీరింది, మొదటి ఋణ పత్రం రద్దయింది.
నిత్యుడు మానవాకృతి ధరించి కడగండ్లు పడ్డాడు.
నిజరక్తంతో మోక్షపు వీలునామాపై చేవ్రాలు చేశాడు.
తన అమరశాంతి కవాటాలను తెరిచాడు.
మానవుని దౌర్బల్యానికి దైవం నష్టపరిహారం చేశాడు.
సృష్టికర్తయే బాధామరణాల శిక్షను భరించాడు.
మానవుడై అవతరించిన దేవుడు దండనపాలయ్యాడు.
ఆయన ప్రేమ మర్త్యునికి స్వర్గమార్గం నిర్మించింది.
ఇక్కడ వ్యాపించిన మానవుని అజ్ఞానాంధకారానికి ప్రతిగా
ఆయన తన బ్రతుకును, వెలుగును అర్పించాడు.
ఈ భయానక రహస్య బలిదానం ముగిసింది
ప్రపంచం కోసం దైవపు శరీరమే బలిగా ఆహుతి అయింది.
గెత్‌సెమని*, క్యాల్వరీ** ఆయన వంతుకు వచ్చాయి.
మనుష్యుని ఆత్మను మేకులతో బిగించిన సిలువను ఆయన మోస్తున్నాడు.
ప్రజల దూషణలే ఆయనకు రక్షక సహచరులు.
ఆయన ఋజుశీలానికి గుర్తింపు అవమానమూ, అపహాస్యమూ,
ఆయనతోపాటు మరణదండన పొందిన ఇద్దరు దొంగలు
ఆయన చేసిన మహత్తర ప్రాణత్యాగాన్ని గేలి చేస్తున్నారు.
రక్త సిక్తఫాలంతో ఆయన పతితోద్ధారకుని పథం వెంట పయనించాడు.
దేవునితో తాదాత్మ్యం పొందిన ఆయన
తన దేహత్యాగంతో తన ఆత్మ అవిరళ కాంతిని చెల్లించాడు.
ఆయన మరణంతో ఆయన అమరజ్ఞానం జయం పొందింది.

Savitri (1954) నుంచి

* జెరూసలెం నగరానికి తూర్పున ఉన్న ఒక తోట. ఏసుక్రీస్తు తన అవసాన దశలో అమితవేదన అనుభవించిన చోటు. అక్కడనే ఆయన అనుచరులు ద్రోహబుద్ధితో ఆయనను అధికారుల వశం చేశారు.

** క్రీస్తును సిలువ వేసిన చోటు.

## హరీంద్రనాథ చట్టోపాధ్యాయ

### అలౌకిక దేశికుడు శ్రీరమణుడు

నిత్యత మానవాకృతి ధరించింది,
మనుష్యదేహ పరిమాణానికి కుంచించుకొన్నది ;
అమరుడు నరుడైనాడు.
కోరి కాలదేశావధులకు బద్ధుడైనాడు.
ఆర్ద్రతతో, దయతో, ప్రశాంతతతో భాసిస్తూ
చిన్న మంచం మీద కూర్చొని ఆయన కనిపిస్తాడు:
పరిమితమైన తన అరచేతి మేరలో
అనంత రహస్యాలను ఆయన పట్టుకొన్నాడు.
మన ఒంటరి తనం మాటున అరుదైన జ్ఞానాన్ని
ప్రసాదించే వాక్కు ఆయన; మన మాటల మాటున
మన ఊహాకతీతమై, మనకు దుర్లభమై
దృశ్యాదృశ్యంగా గోచరించే ఏకాంతం ఆయన.
మహోన్నత పీఠంపైనున్న అలౌకిక పావన దేశికా !
నీ రూపాన్ని మా హృదయకుహరంలో నిలుపుకోవడానికి యత్నిస్తూ
మేము ఎవరికి వారమే మూగ వాంఛతో నిన్ను చేరబోతున్నాము,
నీ తీక్ష్ణకాంతితో మా చీకటిని ఛేదించు.
మా కపటోపాయాలను, మమ్ము చుట్టుముట్టే
గాఢతిమిరాన్ని, మేము నడిచే విషాదమయ పథాలను
గుర్తించే కాంతి అది, ఓ మౌన దేశికా :
మా అడుగులను విశ్రాంతిమయ శిఖారాల మీదికి నడిపించు.
నీ అవిచ్ఛిన్న ప్రశాంతతకు అనుకూలంగా ఉండ నందున
మేము అలసి పోయాము;
దూరము మాగమ్యం, మా పాదాలు రక్తసిక్తమైనవి;
కరుణించు ప్రభూ ! ఒక్కొక్కటిగా మా గాయాలను మాన్పు.

## డామ్ మోరేస్

### పొలిమేర

లోయపైన దేగలు సూర్యుని ఎదిరిస్తున్నవి;
నూనె రంగు విషసర్పం రాళ్ళనడుమ చుట్టుకొన్నది.

ఐనా లోపలి ఎముకల పరవంజాతో నేను
డేగల కంటె ఎత్తుగా ఎక్కుతున్నాను, చివరకు
డేగలు అదృశ్యమైన ఒకానొక కల్పనా కథ కొసకు
ప్రవేశించగలిగాను.
ఐనా ఆ విష సర్పం జారుతూనే ఉన్నది.
ఏటి లోనికి దిగి, నీటిలో మృత్యువునకు సిద్ధంగా
సగం మునిగి ఉన్న గోదురుకప్పను తననాలుకతోదూషిస్తున్నది.
శ్వాస పీల్చితే అవికూడా అంతర్హిత మవుతాయి.
నేను కనులు మూసుకొంటే సూర్యుడూ, పర్వతాలూ మాయమవుతాయి,
రాళ్ళ గనులలో ప్రకాశించే ఆ ముఖానికి
వాక్కులేని కాలమే ఏకైక సాక్షి.
ఆ ముఖాన్ని నేను ఈ చీకటి పొలిమేరలో సైతం
కవితలో ప్రచ్ఛన్న రూపంలో దాచలేను.
నే నెక్కడికి ప్రయాణం చేసినా ఆమె అక్కడ ఉంటుంది.

Poems (1960) నుంచి.

పి. లాల్

## గులాబుల ప్రపంచం

ఇది గులాబుల ప్రపంచం.
ఇక్కడ అర్థం పరిమళాలలో విరియడం,
సుకుమారమైన ఆకు కాన్పు జీవితం.
నా మిత్రుని గులాబితోట ఇది:
స్వాగతాలు లేవిక్కడ, వీడుకోళ్ళు లేవు—
ప్రేమ గణనతోనే నిన్ను స్మరిస్తారిక్కడ.
అజ్ఞాత వ్యక్తీ, నిన్ను సుగంధపూర్ణ
వాతావరణంలో ఒక భంగిమగా నిర్ణయిస్తే,
గులాబులకు సువాసన ఎందుకున్నదని
నేను యోచించవలసివస్తుంది.
కాని ఇది నా మిత్రుని గులాబితోట.
నీ విక్కడికి పక్షిగానో పత్రంగానోరావలసినదే.
ఇక్కడి మాధ్యాహ్నిక వినోదా లివిగో:
సూర్యాస్తమయానికి ముందు తేనీరూ, సల్లాపమూ,

ఉడుతలూ, గూటికి చేరే పిచ్చుకలూ.

ఈ గులాబుల ప్రపంచపు అర్థం

జీవితం కంటె రమణీయమైన ధ్వనులలో వ్యక్తమవుతుంది.

The Parrot's Death and other Poems నుంచి.

## వివేకానందస్వామి

## అమృత పుత్రులు

మానవుని ఆత్మ నిత్యము, అమరము, పూర్ణము, అనంతము. మృత్యువంటే కేవలం ఒక దేహంనుంచి మరొక దేహంలోనికి మార్పు మాత్రమే. మన పూర్వకర్మవల్ల వర్తమానం నిర్ధారిత మవుతుంది. వర్తమానం వల్ల భవిష్యత్తు నిర్ధారితమవుతుంది. జన్మ నుంచి జన్మవరకు మరణం నుంచి మరణం వరకు ఆత్మ ఉత్తమస్థితినో, అధోగతినో పొందుతూ ఉంటుంది, ఐతే మరొక ప్రశ్న ఉత్పన్న మవుతుంది. తుపానులో చిక్కుకొని నురుగులు తేలే కెరటాలపై ఒక్క క్షణం పైకెగురుతూ, మరుక్షణం సాగర గహ్వరంలోనికి పోయే చిన్ననావ వంటివాడా మనుష్యుడు? సదా విజృంభిస్తూ, సదా ముందుకు సాగుతూ ఏమాత్రం స్వేచ్ఛ కెడమీయని కార్యకారణ రూపక ప్రవాహ వేగంలో నిస్సహాయతతో కొట్టుకొనిపోయే శక్తిహీనుడా? అనాథ స్త్రీ అశ్రువులను గాని, పితృహీనశిశువు ఆక్రందనాన్నిగాని గణించక అన్నిటినీ చితుక గొట్టుతూ సాగిపోయే కారణత్వ చక్రం క్రింద చిక్కుకొన్న శలభం వంటివాడా? తలచుకుంటే భయం వేస్తుంది గాని, ప్రకృతి శాసనం మాత్రం ఇదే. నిరాశ నిండిన హృదయకుహరం నుండి వెలువడే ఆర్తనాదం ఇదే: ఏమాత్రం ఆశకు అవకాశం లేదా? తప్పించుకోవడానికేమీ మార్గం లేదా? ఆ ఆర్తనాదం కరుణామయుని సింహాసనం చెంతకు చేరింది ఆశతో, అనునయంతో కూడిన హక్కులక్కడి నుంచి ధరాధామానికి దిగివచ్చి ఒక వేదకాలపు ఋషిని ఉత్తేజితం చేశాయి. ఆయన గంభీర కంఠంతో ఈ శుభ సందేశాన్ని లోకానికి చాటి చెప్పాడు: "అమృత పుత్రులారా! ఊర్ధ్వలోక వాసులారా! వినండి. మాయకు, తమస్సుకు ఆవల నుండే సనాతన పురుషుణ్ణి నేను కనుగొన్నాను. ఆయనను తెలుసుకోవడం వల్లనే మీరు తిరిగి తిరిగి ఆసన్నమయ్యే మృత్యువు బారీ నుండి రక్షణ పొందగలరు." అమృత పుత్రులు!— ఎంతటి మధురమైన, ఆశాపూర్ణమైన పేరది? సోదరులారా! ఆ మధురనామంతో మిమ్ములను సంబోధింపనివ్వండి. శాశ్వతానందానికి వారసులు మీరు. మిమ్ములను పాపులని సంబోధించడానికి హిందువు సంకోచిస్తాడు. మీరు ఈశ్వర పుత్రులు, చిరానందంలో భాగస్వాములు, పవిత్ర, పరిపూర్ణ జీవులు. భూమి మీది దేవతలు మీరు. పాపాత్ములా? మనుష్యుని పాపిగా ఎంచడమే పాపం. మానవ ప్రకృతికే అది తీరని అవమానం. రండి. మీరు సింహాలు. గొర్రెలమనే భ్రాంతిని విడనాడండి. మీరు అమృతాత్ములు, ముక్తులు, నిత్యులు, అనుగ్రహపాత్రులు నైన జీవులు. మీరు జడ పదార్థం కాదు. పాంచభౌతిక దేహాలు కాదు. జడ పదార్థం మీ బానిస. మీరు జడపదార్థపు బానిసలు కారు.

ఈ విధంగా వేదాలు ఘోషిస్తున్నవి. క్షమకు తావులేని భయంకర శాసనాల సంపుటిని కాదు. అనంతమైన కార్యకారణ రూపక కారాగృహాన్ని కాదు: సర్వ శాసనాలకు మూలంగా, భౌతిక పదార్థంలోని అణువులోనూ వ్యాప్తుడై ఒక జగన్నియంత ఉన్నాడని, ఆయన ఆజ్ఞానుసారమే వాయువు వీస్తుందని, అగ్ని దహిస్తుందని, మేఘాలు వర్షిస్తాయని, లోకంలో మృత్యు దేవత సంచరిస్తుందని వేదాలు చాటుతున్నవి.

ఆయన స్వభావం ఎట్టిది ?

ఆయన సర్వ వ్యాప్తుడు. నిర్మలుడు. రూపరహితుడు. సర్వ శక్తిమయుడు. కేవల కరుణామూర్తి. ''నీవు మా తండ్రివి. మా తల్లివి. మా ప్రియసఖుడవు. సర్వశక్తికి ఆధార భూతుడవు. మాకు శక్తిని ప్రసాదించు. విశ్వభారమంతటినీ భరించేది నీవు. ఈ జీవితానికి సంబంధించిన కొద్దిపాటి బరువును మోయడంలో నాకు తోడ్పడు.'' వేదఋషులీవిధంగా కీర్తించారు. ఆయనను ఆరాధించడమెట్లా ? ప్రేమ ద్వారా. ''ఈ జన్మలోనూ, మరు జన్మ లోనూ అన్నిటికన్న ప్రీతి పాత్రుడైన ప్రియునిగా ఆయనను ఆరాధించాలి.''

వేదాలు చాటే ప్రేమ సిద్ధాంత మిది. హిందువులు అవతారమని విశ్వసించే కృష్ణుడు ఈ సిద్ధాంతాన్ని ఏ విధంగా విస్తరించి బోధించాడో చూద్దాం.

ఈ లోకంలోనో, పరలోకంలోనో లభించే ఫలాన్ని ఆసించి దైవాన్ని ప్రేమించడం మంచిదే, కాని ప్రేమకోసమే దైవాన్ని ప్రేమించడం అంతకంటె మంచిది. ''ప్రభూ ? నేను ఐశ్వర్యాన్ని, సంతతిని, పాండిత్యాన్ని కోరను. అదే నీ ఇచ్ఛ అయితే నూరు సంకటాలనైనా నేను భరిస్తాను. కాని నిన్ను ప్రతి ఫలాపేక్ష లేకుండా, స్వార్థరహితంగా ప్రేమ కోసమే ప్రేమించేటట్లు నాకు వరాన్ని ప్రసాదించు'' అని ప్రార్థించాలి. కృష్ణుని శిష్యుడైన భారతదేశ చక్రవర్తిని శత్రువులు పదచ్యుతుని చేయగా అతడు తన పట్టపురాణితో హిమాలయాల దగ్గర అడవిలో తల దాచుకోవలసి వచ్చింది. అంతటి ధర్మాత్ముడైన వ్యక్తి ఆ విధంగా ఎందుకు బాధల పాలు కావలసి వచ్చిందని ఒకనాడతనిని భార్య అడిగింది. యుధిష్ఠిరుడామె కీవిధంగా సమాధాన మిచ్చాడు: ఈ హిమాలయాలను చూడు. ఎంత ఉన్నతంగా, సుందరంగా ఉన్నాయో! వీటి పట్ల నాకెంతో అనురక్తి ఉన్నది. అవి నాకేమి ఇవ్వడం లేదు. కాని ఉన్నతమైన, సుందరమైన వస్తువులపట్ల అనురక్తి నా స్వభావం. అందుకే వీటిని నేనింతగా అభిమానిస్తున్నాను. ప్రభువును కూడా ఆ విధంగానే నేను ప్రేమిస్తున్నాను. సౌందర్యానికీ, ఔన్నత్యానికీ ఏకైకాధారం ఆయన. ప్రేమాస్పదుడైన వ్యక్తి ఆయనయే. ఆయనను ప్రేమించడం నా స్వభావం: అందుకే ఆయనను ప్రేస్తుమిన్నాను. దేని కోసమూ నేను ప్రార్థించను;ఏదీ నేను అర్థించను. తన ఇచ్ఛ ప్రకారం ఆయన నన్నెక్కడనైనా ఉంచనీ. ప్రేమకోసమే నే నాయానను ప్రేమించాలి. ప్రేమతో నేను వ్యాపారం సాగించలేను.''

ఆత్మ దివ్యమని, కాని భౌతిక పదార్థం చేత బద్ధమై ఉన్నదని. ఆ బంధాలు విడి పోగానే పరిపూర్ణత్వం సిద్ధిస్తుందని వేదాలు బోధిస్తున్నవి. దానిని వర్ణించడానికి అవి ఉపయోగించే శబ్దం ముక్తి-అసంపూర్ణతా బంధాలనుంచి, మృత్యువు నుంచి, దీనత నుంచి ముక్తి.

ఈశ్వరానుగ్రహం వల్లనే ఈ బంధాలు విడిపోతాయి. పవిత్ర జీవులకే ఈ అనుగ్రహం లభిస్తుంది. కాగా ఆయన అనుగ్రహం లభించాలంటే పవిత్రత ప్రధానం. ఆయన అనుగ్రహం ఏ విధంగా ప్రసరిస్తుంది? నిర్మలాత్ముడైన వ్యక్తికి ఆయన దర్శన మిస్తాడు. నిష్కళంక చరిత్రుడైన మానవుడు దైవాన్ని చూడగలడు. నిశ్చయంగా ఈ జన్మలోనే చూడగలడు. ఆ అనుభూతి కలిగినప్పుడేహృదయంలోని వక్రత తొలగి సరళమవుతుంది. అప్పుడు సంశయాలన్నీ తొలగిపోతాయి. అప్పుడిక మానవుడు దారుణమైన కారణత్వ ముఖ్యమైన సిద్ధాంతానికి వశుడై వర్తించడు. హిందు మతానికి ముఖ్యమైన మూలాధారమైన సూత్రం ఇదే. హిందువు కేవలం మాటలతోనూ, సిద్ధాంతాలతోనూ తృప్తిపడడు. కేవల పంచేంద్రియాల పరిధికతీతమైన మనుగడలేవైనా ఉంటే, అతడు వానిని ఎదుర్కొనగోరతాడు. తనలో భౌతికం కాని ఆత్మ ఉంటే దయామయుడైన పరమాత్మ ఉంటే; అతడు సరాసరి ఆయన చెంతకు వెడతాడు. అతడాయనను దర్శించాలి, అప్పుడే అన్ని సంశయాలు విచ్ఛిన్న మవుతాయి. అందుకే హిందూమతస్థుడైన ఒక ఋషి ఆత్మను గురించి, పరమాత్మను గురించి ఇచ్చే ప్రమాణం ఇది: ''నే నాత్మను చూశాను, దైవాన్ని దర్శించాను,'' పరిపూర్ణతకు ఏకైక నియమం అదే. ఏదో ఒక సిద్ధాంతాన్నో, మత సూత్రాన్నో విశ్వాసించడానికి చేసే ప్రయత్నాలలోనూ, పడే పాట్లలోనూ లేదు హిందూ మతం. వాటిని ప్రత్యక్షంగా అనుభ వించడంలో ఉన్నది. విశ్వసించడంలో కాదు, ఉండడంలో, కావడంలో ఉన్నది.

పరిపూర్ణం కావడానికి , దివ్యత్వం పొందడానికి, దైవాన్ని చేరడానికి, దైవాన్ని చూడడానికి నిరంతరాయంగా శ్రమించడమే వారి మతానికి ప్రధానాశయం. ఈ విధంగా దైవాన్ని చేరడం, దైవాన్ని చూడడం, ఈశ్వరుని వలెనే తాము కూడా పరిపూర్ణులు కావడం-హిందుమతమంటే ఇదే.

—Chicago Addresses నుంచి.

## రవీంద్రనాథ ఠాకూరు

## ఏది మంచితనం?

మంచితన మంటే ఏమిటి? మన నైతికప్రకృతికి అర్థమేమిటి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. దీనికి నా సమాధానమేమిటంటే, ఎప్పుడైతే ఒక వ్యక్తి తన నిజస్వరూపాన్ని మార్చి విస్తృతమైన అవగాహన పొందడం ప్రారంభిస్తాడో, ఇప్పుడు తన కర్థమైనదాని కంటె తానింకా అధికుడనని గుర్తిస్తాడో, అప్పుడతడు తన నైతిక ప్రకృతిని గురించి గ్రహించ నారంభిస్తాడు. ఇంకా తాను అందుకోవలసియున్న స్థితి అతనికి బోధపడుతుంది. తన ప్రత్యక్షానుభూతి కంటె ఇంకా తాను అనుభవించవలసియున్న స్థితి అతనికి ఎక్కువ స్పష్టంగా గోచరిస్తుంది. విధిగా జీవితంపట్ల అతని దృక్పథంలో మార్పు వస్తుంది. అపేక్షల

స్థానాన్ని స్థిరబుద్ధి ఆక్రమిస్తుంది. ఇప్పటి కింకా మనకు చాలా భాగం అందుబాటులో లేక, మన దృష్టికి పూర్తిగా గోచరించని - ఆ ఉత్కృష్ట జీవితంలో సంకల్పమే ప్రధానమైన అపేక్ష. మనలోని పాశవికశక్తికీ, ఆధ్యాత్మిక శక్తికీ అప్పుడు సంఘర్షణ ప్రారంభ మవుతుంది. మనకోర్కెలకూ, సంకల్పానికీ మధ్య, ఇంద్రియాలను వివశం చేసే వస్తువులపై కాంక్షకూ, హృదయాంతర్గత లక్ష్యానికీ మధ్య సంఘర్షణ తలయెత్తుతుంది. మనం వెంటనే కావాలని కోరుకునే దానికీ, మంచికీ మధ్య ఉన్న వ్యత్యాసం గుర్తించ నారంభిస్తాము. మన ఆత్మోన్నత్యానికి వాంఛనీయమైనదే మంచి.

జీవితక్షేత్రాన్ని గూర్చి సమగ్రదృష్టి నలవరచుకొని, మనకు దృగ్గోచరమయ్యే వానిని గురించి మాత్రమేగాక, వాటి కతీతమై బహుశః ఎన్నటికీ మనకు గోచరం కాని అంశాలను కూడా గణనకు తీసుకొని, ఆ విధంగా జీవితాన్ని గురించి యథార్థమైన అవగాహన పొందినప్పుడే మంచిని గురించి మనకు స్పష్టంగా బోధపడుతుంది. పరిణామదర్శియైన మానవుడు ఇంకా అనుభూతికిరాని జీవితాన్ని గురించి ఆశపడతాడు; తనకు ఉన్న జీవితం కంటె ఆ జీవితాన్ని గురించి ఎక్కువగా భావిస్తాడు; అందుకే అతడు అలబ్ధమైన భవిష్యత్తు కోసం వర్తమాన ప్రవణతను త్యాగం చెయ్యడానికి సంసిద్ధుడవుతాడు. ఈ విధంగా చెయ్యడంవల్ల అతడు ఉన్నతి పొందుతాడు, ఎందుకంటే అతని కప్పుడు సత్యస్వరూపం గోచరిస్తుంది. కేవలం స్వార్థంకోసమే దక్షతతో వ్యవహరించాలనుకొంటే కూడా అతనికి సత్యం స్ఫురిస్తుంది. స్వార్థలాభంకోసం కూడా అతడు తన ప్రకృతేచ్ఛలను అణచుకోవలసివస్తుంది. అంటె అతడు నీతిగా వ్యవహరించవలసి వస్తుందన్నమాట. ఎందుచేతనంటే, జీవితం, అతుకులబొంత కాదనీ ప్రయోజనహీనమైనదీ, నడుమ నడుమ విచ్ఛిన్నమైనదీ కాదని గ్రహించే శక్తియే మన నైతికజ్ఞానం. ఆత్మ నిజానికి నిత్యమైనదని గ్రహించే శక్తిని ఈ నైతికజ్ఞానం ప్రసాదిస్తుంది నిజానికి తన వ్యక్తిత్వంలో చేరనివ్యక్తుల కతడు చెందుతాడు. వారిని అతడెన్నడూ తెలుసుకోవడం కూడా జరుగకపోవచ్చును. తన ప్రస్తుత అనుభూతికి అతీతంగా ఉన్న భవిష్యద్వ్యక్తిత్వాన్ని గురించి అతడు గాఢంగా భావించినట్లే, తన వ్యక్తిత్వపు పరిధుల కతీతమైన తన ఉన్నతస్వరూపాన్ని గురించి కూడా అతడు గాఢంగా ఊహిస్తాడు. ఈ విధమైన భావన లవలేశమైనా లేని వ్యక్తి, ఇంకొకనికోసం స్వార్థవాంఛను ఎన్నడూ త్యజించని వ్యక్తి, ఇతరుల సంతోషంకోసం కష్టనష్టాలకు గురికావడంలో ఎన్నడూ తృప్తిని అనుభవించని వ్యక్తి ఎక్కడా ఉండడు. మానవుడు ఇతరులనుండి విడివడ్డవాడు కాదు, అతనికి విశ్వజనీనాకృతి ఉన్నది. ఈ సంగతి గ్రహించిన నాడతడు ఉన్నతుడవుతాడు. అపకారబుద్ధితో కూడిన స్వార్థపరుడైన వ్యక్తి కూడా దుర్మార్గవర్తనకు, శక్తిని కోరినప్పుడీ సంగతి గ్రహించవలసివస్తుంది. ఎందుకంటే సత్యాన్ని అలక్ష్యంచేసి శక్తిమంతుడు కావడం అసంభవం. సత్యపు తోడ్పాటు నర్థించినప్పుడు స్వార్థపరత్వం కూడా కొంతవరకు స్వార్థం విడనాడక తప్పదు. బందిపోటుదొంగల ముఠా ఒక ముఠాగా నిలవాలంటే వారు నైతికంగా ఉండకతప్పదు. వారు ప్రపంచమంతటినీ దోచుకోవచ్చును, కాని పరస్పరం దోచుకోవడానికి వీలు లేదు. నీతిహీనమైన ఆశయాన్ని సాధించడానికి ప్రయోగించే ఆయుధాలలో కొన్ని అయినా నీతిమంతమైనవి కావాలి. నిజానికి తరచుగా మన నైతికబలమే సమర్థవంతంగా

ఏదైనా చెడ్డపని చేయడానికీ, మన లాభంకోసం ఇతరులను ఉపయోగించుకోవడానికీ, ఇతరుల న్యాయసమ్మతమైన హక్కులను దోచుకోవడానికి తగిన శక్తిని మన కిస్తుంది. జంతువుకు సమీపవర్తమానం ఒక్కటే తెలుస్తుంది. అందువేత దాని జీవితంలో నీతి ప్రసక్తి లేదు. ఒక మానవుని జీవితం నీతిహీనమైనది కావడానికి వీలుంది, కాని దానిని బట్టి తేలేది జీవితానికి నీతి ప్రాతిపదికగా ఉండాలని. కొంతవరకైనా సత్యంలేనిదే అసత్యానికి ఉనికి లేదు. ఆ విధంగానే నీతిహీనమైనది అసంపూర్ణంగా నీతిమంతమైనది. చూడలేక పోవడం అంధత్వం, కాని తప్పుగా చూడడమంటేఅసమగ్రంగా చూడడమన్నమాట. స్వార్థపరత్వం జీవితంలో ఏదో ఒకప్రయోజనాన్ని ఒక లంకెను గుర్తించడానికి ప్రయత్నించడమే. దాని ఆదేశాను సారం నడచుకోవడానికి ఆత్మనిగ్రహమూ, క్రమబద్ధ ప్రవర్తనా అవసరం. తాత్కాలికంగా అనుభవించవలసివచ్చే నొప్పి, బాధా విస్తృతదృక్పథంనుంచి చూస్తే, నిజానికి అందుకు పూర్తిగా భిన్నమైనవని తెలియడంవల్లనే స్వార్థపరుడు స్వప్రయోజనంకోసం కోరి కష్టాల ననుభవిస్తాడు, ఎన్ని ఇబ్బందులనైనా నోరుమెదపకుండా సహిస్తాడు. మానవునిలోని అల్ప జీవికి ఏది లాభకరమో అది అతనిలోని ఉన్నతవ్యక్తికి నష్టం. ఉత్తమప్రకృతికి లాభకరమైనది అల్పప్రకృతికి నష్టం.

ఒక ఆశయము కోసమో, స్వదేశం కోసమో, మానవజాతిమేలు కోసమో జీవించే వ్యక్తి జీవితానికి ప్రయోజనం విస్తృత మవుతుంది. ఆ మేరకు బాధ అతనికి పట్టించుకో దగినదిగా ఉండదు. మంచితనంతో జీవించడమంటే అందరి జీవితాలను తాను జీవించడం అవుతుంది. సుఖం తన ఒక్కని కోసమే, కాని మంచితనం సర్వకాలాలలో మానవాళి అంతటి ఆనందానికి సంబంధించినది. మంచితనపు దృక్కోణంనుంచి చూస్తే సుఖదుఃఖాల అర్థం భిన్నంగా స్ఫురిస్తుంది. అందువల్ల సుఖాన్ని త్యజించడమూ, కోరి బాధను వరించడమూ, జీవితానికి ఉన్నతిని సంక్రమింప జేస్తాయి. చివరకు ఉదాత్తజీవితాపేక్షచేత మృత్యువును కూడా ఆహ్వానించడము సాధ్యం ఈ ఉన్నతస్థాయి నుంచి చూసినప్పుడు, మంచి, సుఖం, దుఃఖం అనే వాటికి అనియంత్రితమైన విలువ ఉండదు. చరిత్రలో ఒక లక్ష్యం కోసం బలియైన వీరులు దీనిని నిరూపిస్తున్నారు. ఒక లక్ష్యం కోసం ఏ కొంచమైనా కడగండ్ల పాలైనప్పుడు మనం కూడా ఈ అంశమే నిరూపిస్తున్నాము. సముద్రంనుంచి మనం ఒక కుండెడు నీళ్ళు మోసుకువస్తేదాని బరువు మనకు తెలుస్తుంది, కాని మనం సముద్రంలో స్నానానికి దిగినప్పుడు మన నెత్తిమీదుగా వేలకొలది కుండల నీళ్ళు ప్రవహిస్తూఉన్నా మనకు బరువే తెలియదు. స్వార్థకలశాన్ని మనం స్వశక్తితో మోయవలసి ఉంటుంది. కనుక స్వార్థపు స్థాయిలో సుఖదుఃఖాల భారం పూర్తిగా అనుభూతికి వస్తుంది నైతికస్థాయిలో వాటి బరువు చాలవరకు తగ్గిపోవడం వల్ల ఆ స్థాయినందుకొన్న వ్యక్తి క్రుంగదీసే కష్టాలలో చూపే ఓర్పూ, దుర్బుద్ధితో ఇతరులు పెట్టే హింసలనెదుర్కొనడంలో చూపే తాలిమీ దాదాపు అలౌకికమైనవనిపిస్తుంది.

పూర్తి మంచితనంతో జీవించడమంటే అనంతంలో తన జీవితాన్ని గ్రహించడమన్నమాట. జీవిత సమగ్రతను గూర్చి నైతికదర్శనం పొందగల మన అంతరంగికశక్తి తోడ్పాటుతో జీవితాన్ని గూర్చి, ఈ విస్తృతదృష్టి మనకు కలుగుతుంది. ఈ నైతికశక్తిని

పూర్తిగా అలవరచుకోవాలని మన కర్మక్షేత్రం స్వార్థానికే పరిమితం కారాదని బుద్ధుడు బోధించాడు. క్రీస్తు వర్ణించిన స్వర్గరాజ్యచిత్రం ఇదే. నైతిక జీవితం అనే ఆ విశ్వజనీన జీవితాన్ని మనం పొందినప్పుడు, సుఖదుఃఖశృంఖలలనుంచి మనం విముక్తుల మవుతాము. స్వార్థం ఖాళీచేసిన స్థానంలో నిరవధిక ప్రేమనుంచి జనించే వర్ణనాతీతమైన ఆనందం నెల కొంటుంది. అప్పుడు ఆత్మకృషి మరింత చురుకుగా సాగుతుంది. కాని దానికి కలిగే ప్రేరణమాత్రం వాంఛలనుంచి కాక స్వకీయమైన ఆనందంనుంచి లభిస్తుంది. ఫలాపేక్ష లేకుండా మంచికోసం చేసే నిష్కామ కర్మ ద్వారా విశ్వాత్మకమైన కర్మలో ఏకం కావడానికి చేసే ప్రయత్నమే కర్మయోగం. భగవద్గీత ఈ నిష్కామ కర్మనే ప్రతిపాదిస్తుంది.

—Sadhana నుంచి

## మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ

## సత్యాగ్రహం

తాను బాధకు లోనై హక్కులను గడించడాని కొక మార్గం సత్యాగ్రహం. ఆయుధాలతో ప్రతిఘటించడానికిది పూర్తిగా వ్యతిరేకం. నా అంతఃకరణానికి సమ్మతంకాని పనిని చేయడానికి నేను నిరాకరించినప్పుడు నేను నా ఆత్మశక్తిని ఉపయోగిస్తున్నాను. ఒక ఉదాహరణం. వర్తమాన ప్రభుత్వం నాకు వర్తించే ఒక శాసనాన్ని చేసింది. అది నాకు ఆమోదయోగ్యమైనది కాదు. బలప్రయోగంతో నేను ప్రభుత్వం ఆ శాసనాన్ని ఉపసంహరించు కొనేటట్లు ఒత్తిడి చేస్తే, నేను భౌతికశక్తిని ఉపయోగిస్తున్నాను. నేనా శాసనాన్ని అను సరించక, దానిని ధిక్కరించినందుకు ప్రభుత్వంవిధించే శిక్ష ననుభవిస్తే, ఆత్మశక్తి నుప యోగించడం అవుతుంది. ఇందులో ఆత్మార్పణం ఇమిడి ఉంది.

ఇతరులను బలిచేయడం కంటె ఆత్మార్పణం అధికప్రశస్తమైనదని అందరూ అంగీకరిస్తారు. పైగా అక్రమమైన సందర్భంలో ఇట్టిశక్తిని ఉపయోగించడం జరిగితే, ఆవిధంగా ఆత్మశక్తిని దుర్వినియోగం చేసిన వ్యక్తి ఒక్కడే బాధకు లోనవుతాడు. తన తప్పు వల్ల అతడు ఇతరులను బాధపెట్టడు. తరువాత తప్పని తేలిన ఎన్నో పనులను మనష్యు లింతకు ముందు చేశారు. పూర్తిగా తన వాదమే సరియైనదని ఏవ్యక్తి అనలేడు. తనకావిధంగా తోస్తున్నది గనుక ఒక సంగతి తప్పని అనడానికీ వీలులేదు. కాని పరిశీలించిన తరువాత అది తప్పని అతనికినిర్ధారణ అయితే అతనికి సంబంధించినంతవరకు అది తప్పే. తాను తప్పని భావించే పనిని అతడు చేయకపోవడం ధర్మం. అందువల్ల బాధపడవలసివస్తే అందుకతడు సిద్ధంకావాలి. ఆత్మ శక్తిని ప్రయోగించే కీలకం ఇదే

శరీరానికి శిక్షణ ఇస్తేకాని సత్యాగ్రహి కావడం కష్టం. విలాసమయ జీవితంవల్ల దుర్బలమైన శరీరంలో వసించే మనస్సు కూడా దుర్బలంగానే ఉంటుంది. మనస్సు దుర్బల మైనప్పుడు ఆత్మకు బలం ఉండడం అసంభవం. బాల్య వివాహాలను, భోగమయ జీవిత విధానాన్ని నివారించడం ద్వారా మనం శారీరక బలం గడించాలి. జీర్ణకాయుడైన వ్యక్తిని

మరఫిరంగి కెదురుగా నిలువుమని కోరడం నగుబాటుగా ఉంటుంది. సత్యాగ్రహి కావడం సులభమే. కాని అంతే కష్టమైనదికూడా. సత్యాగ్రహియైన పదునాలుగేండ్ల బాలుని నే నెరుగుదును; రోగగ్రస్తులైన వారు సత్యాగ్రహం చేయడం కూడా నే నెరుగుదును; దృఢకాయులై ఇతరత్ర సుఖంగా ఉన్నవ్యక్తులు సత్యాగ్రహం చేయలేక పోవడం కూడా నేనెరుగుదును. దేశసేవ కోసం సత్యాగ్రహులు కాగోరే వారు పూర్తిగా బ్రహ్మచర్యాన్ని పాటించాలని, పేదలై జీవించాలని, సత్యాన్ని అనుసరించాలని, నిర్భీకతను అలవరచుకోవాలని ఎంతో అనుభవంమీద నేను భావిస్తున్నాను.

బ్రహ్మచర్యం అతి ముఖ్యమైన నియమాలలో ఒకటి. ఈ నియమాన్ని పాటిస్తే తప్ప మనస్సు అవసరమైనంత దార్ఢ్యాన్ని పొందలేదు. శీలం లేని వ్యక్తికి ఓపిక నశించి, అతడు నిర్వీర్యుడై పిరికివాడవుతాడు. పాశవిక వాంఛలకు మనస్సును అర్పితం చేసినవాడు ఏ గొప్ప ప్రయత్నం చెయ్యడానికి సమర్థుడు కాడు. దీనిని నిరూపించడాని కెన్ని ఉదాహరణాలనైనా చూపవచ్చును. ఐతే వివాహితుడైన వ్యక్తిమాట ఏమిటనే ప్రశ్న సహజంగా ఉత్పన్నమవుతుంది, కాని ఆ ప్రశ్న తలయెత్త వలసిన అవసరం లేదు. శారీరక వాంఛను తీర్చుకొంటున్నవారు భార్యా భర్తలైనంత మాత్రాన అది పాశవిక వాంఛ కాకపోదు. వంశాభివృద్ధికోసం తప్ప అట్టి భోగ లాలస పూర్తిగా నిషిద్ధమే. సత్యాగ్రహి అయిన వ్యక్తి ఆ కారణం కోసం కూడా శారీరక వాంఛకు లోను కాకూడదు, ఎందుకంటే తనకు సంతతి కావాలనే అపేక్ష అతనికి ఉండదు. కనుక వివాహిత వ్యక్తికూడా పూర్తిగా బ్రహ్మచర్యం పాటించవచ్చును. ఈ అంశంపై అతి విస్తృతంగా వ్రాయడాని కవకాశంలేదు. ఎన్నో ప్రశ్నలుదయిస్తాయి. ఇందుకు భార్యను ఒప్పించడం ఎట్లా? ఆమె హక్కులేమిటి? మొదలైన ప్రశ్నలు. ఒక మహత్తర లక్ష్య సాధనకోసం కృషి చేసేవారు ఏదో ఒక విధంగా ఈ సమస్యలను నిశ్చయంగా పరిష్కరించుకో గలుగుతారు.

బ్రహ్మచర్యం వలెనే పేదరికం కూడా అవసరమే. ధనార్జనాపేక్షకూ, సత్యాగ్రహానికీ పొత్తు కుదరదు. ధనవంతులు తమ ధనాన్ని విడనాడ నక్కరలేదు గాని, దానిపట్ల వారు విముఖంగా ఉండడం అవసరం. సత్యాగ్రహాన్ని వదలిపెట్టడం కన్న తమ ధనం సొంతం పోగొట్టుకోవడానికివారు సంసిద్ధులు కావాలి.

మన చర్చలో సత్యాగ్రహాన్ని సత్యశక్తిగా వర్ణించడం జరిగింది. కాగా ఎట్టి పరిస్థితిలోనైనా సత్యవ్రతాన్ని పాటించి తీరాలి. ఈ సందర్భంలో ఒక వ్యక్తి ప్రాణాన్ని కాపాడడం కోసం అబద్ధమాడ వచ్చునా? వంటి తాత్త్విక ప్రశ్నలుదయిస్తాయి. కాని ఇటువంటి ప్రశ్నలు తట్టేది ఏదో ఒక విధంగా అబద్ధమాడడాన్ని సమర్థించగోరే వారికే. ఎల్లవేళల సత్యాన్నే అనుసరించేవారికీ సందిగ్ధావస్థ రాదు. వచ్చినా అక్రమ మార్గం నుంచి తప్పక వారికి రక్షణ లభిస్తుంది.

నిర్భీకత లేనిదే సత్యాగ్రహం ఒక్క అడుగైనా ముందుకు సాగదు. తమ ఆస్తిని గురించి కాని, నలుగురిలో గౌరవాన్ని గురించి కాని, బంధువులను గురించి కాని, ప్రభు

త్వాన్ని గురించికాని, శరీరానికి దెబ్బలు తగలడాన్ని గురించి కాని, చావును గురించికాని పూర్తిగా భయరహితులైనవారే సత్యాగ్రహ పథాన్ని అనుసరించ గలరు.

ఆచరించడం కష్టసాధ్యమని ఈ నియమాలను విడనాడకూడదు. తానేమీ చేయక పోయినా తనకు తటస్థపడే ఎట్టి చిక్కును, బాధనైనా ఎదుర్కొనగల శక్తిని మానవ హృదయంలో ప్రకృతి నిక్షేపించింది. ఈ లక్షణాలు దేశసేవ చెయ్యాలని అనుకోని వారు కూడా కోరదగినవే. అందుకు సందేహం లేదు. ఆయుధాలను ఉపయోగించే విధం నేర్చుకోగోరే వారు కూడా ఈ లక్షణాలను అలవరచుకోవలసి వస్తుంది. కోరినంతలోనే ప్రతివ్యక్తీ యోధుడు కాలేడు. యోధుడు కాగోరేవాడు బ్రహ్మచర్యం పాటించాలి, పేదరికంతో తృప్తి పడాలి భయరహితుడు కాని యోధుడిని మనం ఊహించలేము. అతడు పూర్తిగా సత్యవంతుడై ఉండనక్కరలేదని కొందరనుకో వచ్చును, కాని సత్యం నిజమైన నిర్భీకతను వెన్నంటి ఉండే లక్షణం. ఒక వ్యక్తి సత్యాన్ని త్యజించినట్లైతే, అందుకు ఏదో ఒక రూపంలో భయమే కారణం. కనుక ఈ నాలుగు లక్షణాలను గురించి ఎవరూ భయపడ నక్కరలేదు. భౌతికశక్తినే అనుసరించే వ్యక్తి సత్యాగ్రహికి అక్కరలేని ఎన్నో నిరర్థక లక్షణాలను కలిగి ఉండవలసివస్తుందని ఈ సందర్భంలో చెప్పుకోవడం మంచిది. నిర్భీకత లేనందువల్లనే కత్తిసాము చేసే వ్యక్తి మరింత ప్రయత్నం చేయవలసి వస్తుంది. అతడు నిజంగా భయరహితుడైతే, ఆక్షణంలో కత్తి అతని చేతినుంచి జారిపోతుంది. అతనికి దాని తోడ్పాటు అక్కరలేదు. ద్వేషరహితుడైన వ్యక్తికి ఖడ్గంతో పనిలేదు. ఒక కట్టను చేత బట్టిన వ్యక్తికి హఠాత్తుగా ఒక సింహం ఎదురయింది. ఆత్మరక్షణ కోస మత డప్రయత్నంగానే కట్టనుపైకెత్తాడు. తనలో భయం నశించనిదే ఇన్నాళ్లు తాను నిర్భీకతను గురించి ప్రలాపాలాడినట్లతడు గ్రహించాడు. వెంటనే అతడు కట్టను వదిలివేశాడు. వెంటనే భయం నుంచి విముక్తి కలిగిందని తెలుసుకొన్నాడు.

—**Indian Home Rule** నుంచి.

శ్రీ అరవిందుడు

## మానవుడు – అవాంతర దశాగతుడు

మానవుడు మధ్యేమార్గంలో ఉన్న జీవి; అతడే సృష్టికి చరమదశ కాదు. ఎందుచేతనంటే మానవునిలోనూ, అతని కతీతంగానూ దివ్యమైన పురుషోత్తమత్వాని కెగసే, దేదీప్యమానమైన శ్రేణులున్నవి. మన గమ్యం అది. ఔన్నత్యం పొందాలనే ఔత్సుక్యం

ఉన్నా క్లిష్టమూ, పరిమితమూ ఐన మన భౌతికమైన మనుగడ నుంచి విమోచనం కలిగించే కీలకం అది.

మానవుడంటే మన అభిప్రాయం సజీవదేహంలో బద్ధమైన మనస్సని. కాని మనస్సే చైతన్య శక్తియొక్క అత్యున్నత దశకాదు. ఎందుచేతనంటే సత్యము, మనస్సు స్వాధీనంలో లేదు. పొందడానికి కృషి చేస్తున్నది. సత్యాన్ని నిత్యమూ పొందిఉండే అధిమానసిక శక్తి ఒకటి మనస్సుకు అతీతంగా ఉన్నది. ఈ అధిమానసిక మూలంలో గతి శీలకమైన చైతన్యం, సర్వజ్ఞుడైన సృష్టికర్త అనంత సంకల్పమూ, అనంతజ్ఞానమూ సదా అధిమానసము యొక్క ప్రకృతి. అధిమానసమే అధిమానవుడు. ఇట్టి జ్ఞానమయ అధిమానవ స్థితికి చేరుకోవడమే భౌతిక ప్రకృతి క్రమ వికాస పథంలో వేయవలసిన ముఖ్యమైన, జయావహమైన అడుగు.

ఈ ప్రపంచపు క్రమ వికాసంలో మానవుడు అధిమానవుడు కావడమే ఇక రాబోయే ముఖ్యమైన సాధన. ఇది అనివార్యం. ఎందుకంటే అంతర్యామి సంకల్పం ఇదే. ప్రకృతి వికాసంలో సహజ పరిణామమూ ఇదే.

భౌతిక జంతు ప్రపంచంలో మానవుని ఆవిర్భావం సాధ్యం కావడమే రాబోయే దివ్యదీప్తికి తొలిరేఖ. భౌతిక పదార్థంనుంచి దివ్యత్వం ఉదయిస్తుందని తెలిపే సుదూరపు, ప్రథమ వాగ్దానమది. మానవ ప్రపంచంలో అధిమానవుడావిర్భవించిననాడు దివ్యవాగ్దానం పూర్తి అవుతుంది. శృంఖలా బద్ధమై, క్రీత దాసునివలె మన మనస్సు పనిచేస్తున్న భౌతిక చైతన్యంనుంచి జ్ఞానానంద శక్తిమయ సూర్యబింబం ఉదయిస్తున్నది. ఆ దేదీప్యమాన తేజానికి ఆకృతియే అధిమానసం కాగలదు.

అధిమానవ స్థితి అంటే మానవుడు తన అత్యున్నత స్థితిని అందుకున్నట్లు కాదు. మానవుని ఘనత, జ్ఞానం, శక్తి, మేధ, సంకల్పం, శీలం, ప్రతిభ, బలం, సాధుత్వం, ప్రేమ, నైర్మల్యం, సమగ్రత ఉత్తమ శ్రేణిలో వ్యక్తం కావడమూ కాదు. అధిమానసం మానవుని పరిమిత మనస్సు కతీతమైనది. మానవ ప్రకృతికి ఉచితమైన చైతన్యపు అత్యుత్కృష్టస్థితి కంటె అతీతమైన చైతన్యమది.

మానవుడు మానసిక జీవి. అతని మనోవృత్తి భౌతిక మేధస్సులో చిక్కుకొని, అస్పష్టమై, పతితమై పనిచేస్తునది. ఈ పరాధీనతవల్ల అది అత్యుత్తమ మానవులలో కూడా విశిష్ట శక్తి స్వాతంత్ర్యాల తేజోమయావకాశాలనుంచి వంచిత మవుతున్నది. తనలో ఉన్న దివ్యశక్తులనుంచి వేరు చేయబడి, జీవితాన్ని అతి పరిమితంగా తప్ప మార్చడానికి అసమర్థంగా ఉన్నది. అది బద్ధమైన నిరుద్ధమైన, శక్తి. తరచుగా శరీరానికీ, జీవితానికీ అవసరాలు తీర్చుతూ వినోదాన్ని కలిగిస్తూ ఉండే సేవకునితో పోల్చదగినదిగా ఉన్నది. కాని దివ్యుడైన పురుషోత్తముడు మాత్రం జ్ఞానమయ జీవిగా ఉంటాడు. అతనిలో ఉండే

అధిమానసం మానసిక, భౌతిక సాధనాలను కైనసం చేసుకొని. పైనుంచి మనలో అభివ్యక్త మైన అధోభాగాలలోనికి చొచ్చుకొని, అది మనస్సును, శరీరాన్ని, జీవితాన్ని మార్చివేస్తుంది.

మానవునిలోని అత్యున్నతశక్తి మనస్సే. కాని మానవుని మనస్సు అజ్ఞాతాబద్ధము, ఛాయాగ్రస్తము, దేనినోపొందుటకు శ్రమించే శక్తి. అత్యంత కాంతి మయమైనప్పుడు కూడా అది విరళమై, వివర్ణమై ప్రతిఫలించే వెలుగు మాత్రమే కలిగి ఉంటుంది. స్వతంత్రమై, సాధికారమై, దివ్యవిభూతుల నభివ్యక్తం చేసే అధిమానసం అధిమానవుని ప్రధానోపకరణంగా ఉంటుంది. స్వయంవ్యక్త జ్ఞానపు అవ్యాహత సంచారంతో, స్వతస్సిద్ధమైన శక్తితో, నిష్కళంకాహ్లాదంతో అ అధిమానసం భౌతిక జీవితానికి దివ్యజీవన సామరస్యాన్ని ఆపాదిస్తుంది.

మానవుడు ఔన్నత్యాన్ని అభిలషించే ఆశాజీవి మాత్రమే. తన కతీతమైన విస్తృతిని, బృహత్వాన్ని చేరే అల్పత్వమతడు; ఉన్నత శిఖరాలపై ఆసక్తి గల వామనుడు. విశ్వ మానసదీధితులలో ఒక అంధకారకిరణం అతని మనస్సు. కృషి, ఉత్సాహం, బాధ మిళిత మైనది అతని జీవితం. విశ్వజీవితంలో వాంఛాప్రేరితమో శోకాకులమో, అజ్ఞాతాశయ పూర్ణమో ఐన ఒక క్షణకాల మది. భౌతిక విశ్వంలో అతని దేహం శ్రమించి, నశించే నలుసు మాత్రమే. నిగూఢంగా ఔన్నత్యంవైపు ఉబికే ప్రకృతికి ఈ మానవదేహమే చరమావధి కావడం అసంభవం. ఇందు కతీతమై మానవజాతి పొంద గలిగినదేదో ఉన్నది. దాని ఉనికికి అడ్డువచ్చే పరిమితుల గోడలోని పగుళ్ళద్వారా ఇప్పుడది దృశ్యాదృశ్యంగా కనిపిస్తున్నది. అతనిలో ఎక్కడో దాగిఉన్న అమరమైన ఆత్మ తన ఉనికిని గూర్చి ఏవో కొన్ని నిప్పురవ్వ లను అప్పుడప్పుడు వెదజల్లుతూ ఉంటుంది. పైన నిత్యమైన దివ్యాత్మ ఆవరించి అతని ప్రకృతిలోని ఆత్మనిరవచ్ఛిన్నతను ప్రకటిస్తుంది. కాని అతని వ్యక్తిత్వపు కఠినావరణము ఈ దివ్యాత్మ పైనుండి దిగిరావడాన్ని నిరోధిస్తుంది. అతనిలో ఉన్న ఉజ్జ్వలాత్మ వెలుగు చొరనీయని ఆచ్ఛాదనాల వల్ల అణగి మణగి ఉంటుంది. ఏ కొద్ది మందిలోనో తప్ప ఆత్మ జడంగా ఉంటుంది. అనేకులలో అసలు ఆత్మ ఉన్నదా అనే సంశయాన్ని కలిగిస్తుంది. మానవుని ఆత్మ, చైతన్యం అతని ప్రకృతికి అతీతంగా ఉన్నట్లు, దృశ్యమానమైన అతని అస్తిత్వంలో ఒక భాగం కానట్లు తోస్తుంది. భౌతిక తత్త్వంలో అవి పుట్టినట్లు కాక పరిణామ దశలో ఉన్నట్లు తోస్తుంది. మానవచైతన్యానికి అవి లభ్యమై ఉన్న వస్తువులుగా కాక, లభించడం సాధ్యమైనవిగా గోచరిస్తాయి.

మానవుని ఘనత అతని వర్తమాన స్థితిలో లేదు, అతడు సాధ్యం చేయగలిగిన దానిలో ఉన్నది. దివ్యశిల్పి రూపొందింపదలచిన అధి మానవశక్తి ఆవిర్భావమునకై జరుగుతున్న పరిశ్రమకు సంబంధించిన రహస్య కర్మాగారం, నిషిద్ధప్రవేశమైన చోటు మానవుడు. అతని వైభవానికి అదే ఆధారం. కాని అంతకంటె ఉన్నతస్థితిచేరుకోవడానికి ఆతనికి అవకాశం ఉన్నది. పశుపక్ష్యాదులవలెగాక ఈ విధంగా దివ్యపరిణామంలో ఆతడు కూడా కొంతవరకు కార్మికుడవుతాడు, అతని స్థానంలో వచ్చే తేజం ఆతని శరీరంలోనికి అవతరించడానికి అతని బుద్ధి పూర్వకమైన అనుమతీ, ఈశ్వరార్పితమైన సంకల్పమూ, అంశగ్రహణమూ అవసరం

అతని ఔన్నత్యాభిలాషయే అధిమానసస్రష్టకు పృథ్వి నుంచి చేరేఆహ్వానం. ప్రతివ్యక్తి ఆహ్వానించి, దైవం ఆపిలుపును మన్నిస్తే, ఈ క్షణంతోనే ఆ మహత్తరమైన తేజోమయమైన పరిణామం సంభవింపవచ్చును.

**Hour of God** నుంచి,

## సర్వేపల్లి రాధాకృష్ణన్

## నాగరికత భవిష్యత్తు

నాగరిక ప్రపంచం ఈనాడు అప్పుడప్పుడు విధిగా సంభవించే సంక్షోభానికి గురియైనట్లు కనిపిస్తున్నది. ప్రపంచం తన జీర్ణవస్త్రాలను త్యజిస్తున్నది. ఒక తరం క్రిందట కూడా అందరికీ సమ్మతమైన ప్రమాణాలు, ఆశయాలు, సంస్థలు నేడు ప్రతిఘటనకు గురియై మార్పు చెందుతున్నవి. పూర్వపు ఉద్దేశాలు ఇప్పుడు సడలిపోతున్నవి, నవశక్తులు తల యెత్తుతున్నవి. వర్తమాన యుగపు భావనను చక్కగా అర్థం చేసుకున్నవారికి, నేటి అశాంతి, సందిగ్ధత, ఇప్పుడున్న ఆర్థిక, సామాజిక స్థితిగతులపట్ల అసంతుష్టి, ఇంకా స్పష్టంగా రూపొందని నవవిధానం పట్ల అభిలాష స్పష్టంగా స్ఫురిస్తున్నవి. ఈ స్పష్ట యోచన, అనిర్దిష్టా దర్శాలపై అస్థిరమైన మోజు మానవజాతి మరొక ముందడుగు వేయబోతున్నదని సూచిస్తున్నవి.

ఈ అస్థిరతకు ప్రధానకారణాలలో ఒకటి విజ్ఞానశాస్త్రం. విజ్ఞానశాస్త్రం ఆధునిక నాగరికతకు మాత్రమే చెందినది కాదు గాని, దాని వికాసం ఇటీవల అతిత్వరితంగా సాగడం వల్ల, ధాని పరిమాణం అతి విస్తృతమూ, గంభీరమూ కావడంవల్ల సులభంగా స్వీకారయోగ్యం కాలేక పోతున్నది. ఒక జంతువును మనం వాని సహజపరిసరాల నుంచి అపరిచితపరిసరాలకు మార్చితే, అది నూతన పరిస్థితులకు అలవాటు పడేవరకు చికాకుతో, అశాంతితో ఉండి తీరుతుంది. రిపన్ బిషన్‌కొద్దికాలం పాటు విజ్ఞానశాస్త్ర, పరిశోధనలను నిలిపివేయాలని కోరడంలో అంతర్యమిదే. విజ్ఞానశాస్త్రం వడిగా ముందుకు సాగుతూ అనేక నూతన కల్పనలను ప్రసాదిస్తున్నది గాని, వాటిని ఉపయోగించవలసిన మానవుడు మాత్రం అంత వడిగా తనను తాను సంస్కరించుకోలేక పోతున్నాడని ఆయన మనకు హెచ్చరించాడు.

చూడడానికి ప్రపంచం ఏకరూపంగా మారుతున్నది. యూరప్, అమెరికా ఖండాలతో పాటు ఆసియా, ఆఫ్రికా ఖండాలు కూడా ఒక దిక్కుననే పయనిస్తున్నవి. భేదం కేవలం వేగంలోనే. ఆసియా, ఆఫ్రికా ఖండాల కంటె యూరప్, అమెరికా ఖండాలు ఎక్కువ వేగంగా సాగుతున్నవి. ఆధునికతకు శక్తిమంతమైన చిహ్నాలైన మోటరు కారు, విమానం, సినిమాలు చాలా వెనుకబడ్డ దేశాలలో కూడా కనిపిస్తున్నవి. చైనా నుంచి మెక్సికో వరకు అంతట మానవుడు ప్రకృతిశక్తులను వశం చేసుకోవడంవల్లను, వనరులను ఉపయోగించుకొవడం దిన దినం విస్తృతి కావడం వల్లను కలిగే ప్రగతిపట్ల విశ్వాసం నానాటికీ వృద్ధిచెందుతున్నది.

భారతదేశమూ, చైనా కూడా ఈ సుడిగుండంలో చిక్కుకొంటున్నవి. ప్రాచ్య

దేశాలు కృశించి నశించకుండా ఉండాలంటే అవి ఉద్యమ శీలతవల్లను, సంఘటనశక్తి వల్లను ప్రపంచంలోని నలుమూలల తమ ఆధిపత్యాన్ని వ్యాపింపజేసిన ఇతర దేశాల సరసను సమాన స్థాయిలో నిలువడానికి కృషిచేయవలసి వుంటుందని క్రొత్తగా కలిగిన అవగాహనయే తూర్పుదేశాలలో కనిపిస్తున్న అశాంతికి కారణం. ప్రాచ్యపాశ్చాత్య దేశాల మధ్య ఉన్న భేదం భీతిని వ్యాపింపజేసేవారు చెప్పేటంత తీవ్రమైనది కాదు. తాత్త్విక, మానసిక కృషి ఫలాలు, నిశ్చిత శాస్త్రాలు, ఇంజనీరింగ్ సాంకేతిక పద్ధతులు, ప్రభుత్వ రూపాలు, శాసన సంబధమైన నియమాలు, పరిపాలనావ్యవస్తకు సంబధించిన ఏర్పాట్లు, ఆర్థిక సంస్థలు విభిన్న సంస్కృతు లకు చెందిన ప్రజలను దగ్గరకు చేర్చి, వారిలో అన్యోన్యం సన్నిహిత సంబంధాలకు దారి తీస్తున్నవి. ప్రపంచం ఈనాడు అంగక్రమం గల ఏకైకనిర్మాణంగా పనిచేసే సూచన కనిపిస్తున్నది.

చూడడానికి ఏకరూపంగా ఉన్నా, మానసికంగా, ఆధ్యాత్మికంగా అంతరంగికమైన ఏకత మాత్రం ఏర్పడలేదు. వివిధ దేశాల ప్రజలు ఇటీవల సన్నిహితులైనా, మానసికంగానూ, ఆధ్యాత్మికంగానూ వారి కలయికకు సంసిద్ధంకానందున సౌఖ్యంలో పెంపుగాని, ఘర్షణలో తగ్గుదలగాని రాలేదు. మాక్సింగోర్కీ ఒకసారి పల్లెటూరి రైతుల సభలో విజ్ఞానశాస్త్రాన్ని గురించి, నూతన సాంకేతిక పరిజ్ఞానంవల్ల సాధించిన అద్భుతవిజయాలను గురించి ఉపన్య సించాడు. అప్పుడొక రైతులేచి అతనిని ఈ విధంగా విమర్శించాడట: "నిజమే, మనకు ఆకాశంలో పక్షివలె ఎగరడం నేర్పుతున్నారు, చేపలవలె నీటిలో ఈదడం నేర్పుతున్నారు, కాని భూమి మీద ఎట్లా జీవించాలో మాత్రం మనకు తెలియదు" ఈ చిన్న భూగోళంపై ఇరుగుపొరుగున నివసించే జాతులు, మతాలు, దేశాల మధ్య ఆదర్శ జీవితానికవసరమైన సహవాస భావం కనిపించదు. వారిలో పరస్పర ప్రతికూల శక్తులమనే భావనయే ఉన్నది, మానవజాతి బయటికి ఏకరూప శరీరం ధరించినా, ఆంతరంగికమైన ఏకతను మాత్రం ఇంకా సాధించలేదు. ప్రపంచంలో ఏకబుద్ధి లేదు.

**The Decline of West** అనే ప్రఖ్యాతగ్రంథంలో స్పెంగ్లర్ వివిధ దేశాలకు తమ ప్రత్యేకాదర్శాలను వ్యక్తంచేసే విభిన్న సంస్కృతులున్నవనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. మానవజాతి కంతటికీ ఒకే సంస్కృతి, సభ్యత ఏర్పడాలనే ఆకాంక్షకిది ప్రతికూలంగా ఉంది, జాతులూ, సంస్కృతులూ ప్రత్యేక ప్రమాపకాంశాలని, వాటి ఉత్పత్తి వృద్ధి క్షయాలు సునిర్ణీత క్రమంలో జరుగుతాయని ఆయన వ్యక్తం చేసిన ఆకర్షణీయమైన అనుమానం చారిత్ర కంగా అంగీకారయోగ్యంగా లేదు. గతంలో ప్రాంతీయ నాగరికతలు ఒకదాని వెనుక ఒకటిగా తలయెత్తి ఉండవచ్చును. లేదా అవి శైశవ, కౌమార, యౌవన, వార్థక్యావస్థలననుభవించి నశించేటప్పుడు వాటి తరువాత ఉదయించిన నూతన నాగరికతలకు తమ స్థానాన్ని వార సత్వంగా ప్రసాదించియుండవచ్చును. కాని ఈ విధంగా జరిగే అవకాశాలు పూర్తిగా హరించి పోయాయి. పరిమిత క్షేత్రంలోనే ఉండిన ప్రాంతీయ నాగరికతల కాలం సమాప్తం కానున్నది. పైగా మానవజాతి చరిత్ర ఒకప్పుడు ఏకైక విచ్ఛిన్న గతిలో సాగి, తరువాత వాతావరణం లోనూ, నైసర్గిక గుణాలలోనూ ఉండే భేదాలవల్ల వేరు వేరు వాగులుగా చీలిపోయిందని నిశ్చయంగా చెప్పలేము. నిర్ధారణ అయినంతవరకు వివిధ సంస్కృతులు చాలా కాలం తమ

ప్రత్యేకమార్గాలలోనే వర్ధిల్లినవని, తరువాత పరస్పరం సమీపించాయని, ఇప్పుడవి అన్నీ కలిసి ఒక మహోత్కృష్ట సంస్కృతిగా రూపొందే అవకాశాలున్నాయని తెలుస్తున్నది. పాశ్చాత్య సంస్కృతి ప్రస్తుతం వార్ధక్యదశలో ఉన్నదని, ఇది మార్చడానికి వీలులేని నియమానుసారం జరుగుతున్నదని, ఇందుకు వ్యతిరేకంగా తిరుగబడడం వ్యర్థమని స్పెంగ్లర్ చెప్పే మాటలలో ఆయన ఉద్దేశించిన దానికంటె ఎక్కువ సత్యం ఉన్నది. అది ఏమిటంటే ప్రాంతీయ నాగరికతలన్నీ నశించనున్నవి. ప్రపంచపరిధిలో నవజీవన విధానం కోసం ప్రయోగం జరుగుతున్నది. చరిత్రలో ఏ ప్రత్యేక సంస్కృతి కాని, నాగరికత కాని పూర్తిగా విశ్వజనీనమని చెప్పకోవడానికాధారం లేదు. ఎందుకంటే, ప్రతి సంస్కృతి కొందరు వ్యక్తుల వ్యక్తీకరణం మాత్రమే. ఈ విషయాలలో చరిత్రను మించిన తర్కం లేదు. చరిత్రలో ఎక్కడా వస్తునిరపేక్షమైన విశ్వజనీన మానవుడు లేడు, కనుక విశ్వజనీన నాగరికతకు అవకాశం లేదు. ఇక ముందు రాబోయే నాగరికత మానవుని గూర్చి, మానవజీవితాన్ని గూర్చి విశ్వజనీనదర్శనాన్ని పొందవలసిఉంటుంది గతంలోనూ, వర్తమానంలోనూఉన్న ప్రాంతీయ సంస్కృతులు మానవజాతి యథార్థప్రయోజనాలను గురించి ఎల్లప్పుడూ పట్టించుకోలేదు. అ సంస్కృతులలో జాతి, మత, రాజకీయపరమైన ఏకాధిపత్యం, స్త్రీలపై పురుషుల ఆధిక్యం, పేదవారిపై ధనికుల ఆధిక్యం కనిపిస్తుంది. మానవజాతి అంతటికీ తగిన స్థిరమైన నాగరికతను మనం రూపొందించే ముందు ప్రతి చారిత్రక నాగరికత తనలోని లోపాలను, ప్రపంచంలో ఆదర్శ నాగరికతగా పరిణమించడానికి తన అనర్హతను గుర్తించవలసి ఉంటుంది.

యాంత్రిక పరిశోధనలలో సాధిస్తున్న విజయం రాబోయే నాగరికతకు సామాన్య ప్రాతిపదిక కాగలదు. సాంప్రదాయికమైన యోచనాసరళి, విశ్వాసాలు, ఆచరణ పద్ధతి విచ్ఛిన్నం కావడమే ఆధ్యాత్మికైక్యాన్ని సాధించడానికి అవసరమైన సన్నాహం. అందరినీ, ముఖ్యంగా యువకులను, కలిపే యత్నం ప్రారంభమయింది. వయస్సులో గాని, జ్ఞానంలో గాని తమ కంటె ఎంత పెద్దవారైనా వారు ఆడించినట్లు ఆడడానికి యువకులీనాడు సిద్ధంగా లేరు మన అవగాహన ఇప్పుడు ప్రఫుల్లమయింది. ఇంత కాలం మనం ఆదరించిన అభిప్రాయలు సరిపోవనే అసంతృప్తి ప్రబలింది. నూతన లక్ష్యాల కోసం అన్వేషణ ఆరంభమయింది, నలువైపుల విచ్ఛేద సూచనలు కనిపిస్తున్నవి. సాంప్రదాయిక విశ్వాసాలు చెదరి పోతున్నవి, ప్రతి దేశంలోనూ, మతంలోనూ యోచనాపరులలోఏదో ఒక ఆశ, నిరీక్షణ ఆరంభమయింది.

తర్కంతో నచ్చ జెప్పడం సాధ్యం కాని తీవ్రవాదులను వదిలివేస్తే, మానవ జాతి తన విస్తృతిలోనూ, చరిత్రలోనూ, అంగక్రమం గల ఏకైక నిర్మాణమని, అది భక్తిభావంతో క్రమోన్నత్యం పొందుతున్నదని, ఎవరూ అవధులేర్పరచడానికి సాహసించనంతగా అభ్యుదయం పొందగల శక్తి దానికి ఉన్నదని చారిత్రక నాగరికతలకు చెందిన నాయకులందరూ ఈనాడు దృఢంగా విశ్వసిస్తున్నారు. ''ఈ నాగరికతకొక లక్ష్యం, అ నాగరికతకు మరొక లక్ష్య మంటూ లేదు, మానవజాతి నాగరికత కంతటికీ లక్ష్యం ఒకటే'' అని డాంటే ఉద్ఘాటించాడు. నాగరికత కంతటికీ ఒకటే లక్ష్యం ఉన్నదంటే, దాని అర్థం అందరూ ఒకే భాషను మాట్లాడతారనీ, ఒకే మత సిద్ధాంతాన్ని ఆశ్రయిస్తారని అందరూ ఒకే ప్రభుత్వపాలనాలో జీవిస్తారనీ, ఆచారవ్యవహారాలలో మార్పులేని ఒకే పద్ధతి ననుసరిస్తారనీ, కాదు, నాగరికతల

ఏకతను కోరవలసినది ఏకరూపతలో కాదు, సామరస్యంలో. ఏ ఉత్తమ సంస్కృతియైనా విభిన్న మనస్తత్వాలూ, ఆదర్శాలు గల ప్రజల మేళనం వల్లనే ఏర్పడుతుంది. ఈజిప్ట్, బాబిలన్, భారతదేశం, చైనా, గ్రీస్, రోమ్, ఈ సత్యాన్ని నిరూపిస్తాయి. ఈనాడు సాంస్కృతిక సంశ్లేషణంలో పాల్గొంటున్న వారి పరిధి విస్తృతమై ప్రపంచమంతటికీ వ్యాప్తమవుతున్నది. భవిష్యద్విశ్వానం అనన్యత్వంలో కాక సహకారంలోనూ, తోడి మానవులను అనుకరించడంలో కాక వారి ప్రత్యేకతను అంగీకరించడం లోనూ, నిరంకుశాధికారంలో కాక సహిష్ణుతలోనూ ఇమిడి ఉన్నది.

—Kalki నుంచి

జవాహర్‌లాల్ నెహ్రూ

## ఒక తేజం నిష్క్రమించింది

(ఢిల్లీలో రాజ్యాంగ సభలో 1948 ఫిబ్రవరి 2వ తేదిన చేసిన ప్రకటన)

అయ్యా ఇప్పుడు మీరు వ్యక్తం చేసిన భావాలతో నేనుకూడా ఏకీభవించడానికి అనుమతించండి. కాలధర్మం చెందిన మహనీయులకు అంజలి ఘటించడం, వారి విశిష్టతను వర్ణించి, వారి నిష్క్రమణానికి సంతాపం ప్రకటించడం ఈ సభ సంప్రదాయం. నేను కాని, ఈ సభకు చెందిన ఇతరులు కాని ఈ సందర్భంలో ఎక్కువగా మాట్లాడడం సముచితమో, కాదో నేను నిర్ణయించుకోలేక పోతున్నాను. ఎందుకంటే మనకు చెందిన ఈ ప్రశస్త నిధిని మనం రక్షించుకోలేక పోయినందుకు వ్యక్తిగతంగానూ, భారత ప్రభుత్వ ప్రధానిగానూ నేను పూర్తిగా సిగ్గుతో తలవంచు కొంటున్నాను. ఇటీవల కొన్ని మాసాలుగా అమాయిక ప్రజల కనేకులకు మనం రక్షణ నివ్వడంలో విఫలమైనట్లే, ఈ మహనీయుని రక్షించుకోవడంలో కూడా విఫలమయ్యాము. పైబడ్డ భారం మాకు గాని, ఏ ప్రభుత్వానికి గాని మోయరానిదే కావచ్చును. ఐనా ఇది వైఫల్యమే. మనం అత్యధికంగా గౌరవించి, ప్రేమించిన ఈ మహా పురుషుడు మనం తగిన రక్షణ కల్పించలేక పోవడం వల్ల మన నడుమ నుంచి నిష్క్రమించడం మనకందరికీ లజ్జాకరమైన సంగతి. ఒక భారతీయుడు ఆయనపై అత్యాచారం చేయడం భారతీయునిగా నాకు తలవంపుగా ఉంది. ఒక హిందూ మతస్థుడీ అకృత్యానికి తల పడడం, ఈ యుగంలోని భారతీయులలోనూ, హిందువులలోనూ అత్యుత్తముడైన వ్యక్తిపై ఈ అత్యాచారం చేయడం, హిందువుగా నాకు తలవంపుగా ఉంది.

సముచితశబ్దాలతో మనం వ్యక్తులను ప్రశంసిస్తాము, గొప్పతనాన్ని నిర్ణయించడాని కేదో మానదండం కూడా మనదగ్గర ఉన్నది. మనం రూపొందించిన సామాన్యమృత్తికతో ఏర్పడినవాడు కాడాయన, ఐనప్పుడు ఆయనను ప్రశంసించడ మెట్లా? ఆయన ఘనతను కొలవడమెట్లా? ఆయన ఏ తెంచాడు, దీర్ఘకాలమే జీవించి, ఇప్పుడు పరమపదించాడు. ఈ సభలో మనం ప్రకటించే ప్రశంసా వాక్యాలతో పనిలేదు. ఎందుకంటే చరిత్రలో నిలిచే ఏ వ్యక్తీ పొందని ప్రశంసను ఆయన తన జీవితకాలంలో పొందాడు, ఆయన మరణానంతరం

గడిచిన రెండు, మూడు రోజులలో యావత్ప్రపంచం ఆయనకు నివాళు లర్పించింది. ఆ ప్రశంసకు మనం అధికంగా చేర్చ గలిగినదేమున్నది? ఆయన బిడ్డలమైన మనం, ఆయనకు పుట్టిన సంతతి కంటె ఆయనకు అత్యంత సన్నిహితులమైన మనం ఆయనను ఏ విధంగా ప్రస్తుతించ గలం? అనర్హులమైనా కొద్దిగానో, గొప్పగానో అందరమూ ఆధ్యాత్మికంగా ఆయనకు బిడ్డలమే అయ్యాము. ఆయనను మనం ఎట్లా ప్రశంసించగలం?

ఒక తేజం నిష్క్రమించింది, మన జీవితాలకు వెచ్చదనాన్ని, వెలుగును ప్రసాదించిన సూర్యుడస్తమించాడు. మనం చలిలో, చీకటిలో వణుకుతున్నాము. ఐనా మన మీ విధంగా భావించడం ఆయనకు సమ్మతం కాదు. ఇన్ని సంవత్సరాలుగా మనం చూసిన ఆ తేజం, దివ్యదీధితితో నిండిన ఆ వ్యక్తి మనలను కూడా మార్చాడు. మనం ఎటువంటి వారమైనా ఇంతకాలం ఆయన మనలను మలిచాడు. ఆ దివ్యాగ్ని నుంచి మనలో అనేకులం చిన్న రవ్వను గ్రహించాము. అది మనకు బలాన్ని చేకూర్చి ఆయన అడుగుజాడల ననుసరిస్తూ కొంతవరకు కృషి చేయడానికి తోడ్పడింది. కనుక మనం ఆయనను ప్రశంసిస్తే మనమాటలు చాలా తేలికగా ఉన్నట్లు తోస్తుంది. ఆయనను మనం ప్రశంసిస్తే కొంతవరకు మనలను మనం ప్రశంసించుకోవడ మవుతుంది. మహాపురుషుల జ్ఞాపకార్థం కంచు విగ్రహాలను, పాలరాతిలో స్మారక మందిరాలను నెలకొల్పుతారు, కాని దివ్యాగ్నితో నిండిన ఈ వ్యక్తి తన జీవితకాలం లోనే అనేక లక్షల జనుల హృదయ మందిరాలలో ప్రతిష్ఠితుడయ్యాడు. కాగా అత్యల్ప పరిమాణంలోనే ఆయినా మన మందరం ఆయన అంశాన్ని పొందాము. ఆయన తన ధోరణి లోనే భారతదేశ మంతట వ్యాప్తి చెందాడు. కేవలం రాజభవనాలలోనో, ఎన్నిక చేసిన పరిమిత స్థలాలలోనో, సమావేశాలలోనో కాదు, ప్రతి పల్లెలోనూ, దీనులు, దుఃఖితులు నివసించే గుడిసెలలోనూ ఆయన వ్యాపించాడు. లక్షలకొలది ప్రజల హృదయాలలో ఆయన జీవిస్తున్నాడు. అసంఖ్యాకయుగాల వరకు జీవిస్తాడు.

ఐనప్పుడు విన్రములం కావడం కంటె ఈ సందర్భాన మనం ఆయనను గురించి ఏమి చెప్పగలం? ఆయనను తగినంతగా, సముచితంగా అనుసరించలేక పోయిన మనకు ఆయనను ప్రశంసించే అర్హత లేదు. ఆయన మననుండి కృషిని, శ్రమను, త్యాగాన్ని కోరాడు. కాగా మాటలతో సరిపెట్టితే అది ఆయన పట్ల అన్యాయం చేయడ మవుతుంది. గతించిన ముప్పది సంవత్సరాలకు పైబడి ఆయన ఈదేశం చాలవరకు త్యాగంలో ఉన్నత శిఖరాల నందుకొనేటట్లు చేశాడు. ఆ ప్రత్యేక రంగంలో అంతటి త్యాగం మరెక్కడా కనిపించదు. ఈ కృషిలో ఆయన సఫలుడయ్యాడు. కాని చివరకు ఆయనను అత్యధికంగా బాధపెట్టిన సంఘటనలు జరిగాయి. ఐనా మార్దవంతో నిండిన ఆయన ముఖంలో చిరునవ్వు ఎన్నడూ చెదిరిపోలేదు. ఎవ్వరితోనూ ఆయన ఒక్క పరుషవాక్యైనా వలుకలేదు. ఐనా ఆయన నిశ్చయంగా బాధపడి ఉంటాడు. తాను శిక్షణ నిచ్చిన ఈ తరం కృషిలో విఫలమైనందుకు, తాను చూపిన మార్గం నుంచి మనం దారి తప్పినందుకు ఆయన బాధపడి ఉంటాడు. చివరకు ఆయన బిడ్డయే - ఎందుకంటే ఆ వ్యక్తి కూడా ఇతర భారతీయులందరి వలెనే ఆయన బిడ్డయే కదా - ఆయనను అంతమొందించాడు.

సుదీర్ఘ యుగాల తరువాత మనం గడిపిన ఈ కాలాన్ని గురించి చరిత్ర పరీక్షించి తీర్పు నిస్తుంది. ఈ కాలం సాధించిన విజయాలను, పొందిన పరాజయాలను అది నిర్ణయి స్తుంది. ఆ కాలానికి మనం చాలా దగ్గరగా ఉన్నందున ఏమి జరిగిందో, ఏమి జరుగలేదో గ్రహించి గుణదోషాలను నిర్ణయించలేము, మనకు తెలిసిన దల్లా ఒక తేజం ఉండేదని, అది ఇప్పుడు లేదని, ప్రస్తుతం అంధకారం ఆవరించిందని. ఐతే పూర్తిగా అంధకార బంధురంగా లేదు. ఎందుకంటే మనం మన హృదయాల వంక చూస్తే అక్కడ ఆయన వెలిగించిన జ్వాల ఇంకా ప్రకాశిస్తూనే ఉన్నది. ఆ జ్వాలలు వెలుగుతూ ఉంటే ఈ దేశంలో చీకటి ఉండదు. అప్పుడు మనం ఎంతటి అల్పులమైనా మన కృషితో, ఆయనను స్మరిస్తూ, ఆయన అడుగు జాడ ననుసరిస్తూ, ఆయన మనలో నెలకొల్పిన జ్వాలతో ఈ దేశాన్ని తిరిగి కాంతిమంతం చేయగలుగుతాము.

ఆయన బహుశః భారతదేశపు గతానికీ, భవిష్యత్తుకూ మనం పొందగలిగిన మహోన్నత ప్రతీక కావచ్చును. గతానికీ, భవిష్యత్తుకూ నడుమనున్న వర్తమానకాలపు ప్రమాదకరమైన అంచుపై మనం నిలబడి ఉన్నాము. అనేక విపత్తుల నెదుర్కొంటున్నాము. అన్నిటి కంటె పెద్ద విపత్తు అప్పుడప్పుడు మనలో విశ్వాసం లేకపోవడం; మనలను ఆవరిస్తున్న నిస్పృహ; ఆదర్శాలు పరిత్యక్తం కావడం వల్ల, ఘన కార్యాలను గురించి మనం చేసిన ప్రసంగాలు అర్థంలేని మాటలై జీవితం మరొక దారి పట్టడంవల్ల మన ఉత్సాహం చల్లారి పోవడం. ఐనా ఈ దశ త్వరలోనే గడిచిపోతుందేమోనని నేను నమ్ముతున్నాను.

ఈ దేవుని బిడ్డ గొప్పగా జీవించినట్లే, గొప్పతనంతో మరణించాడు. యావ జ్జీవితం ఏ మహత్తర లక్ష్యం కోసం ఆయన కృషి చేశాడో, మరణంతో కూడా ఆ లక్ష్యం కోసమే కృషి చేశాడని భావించడంలో నాకెంత మాత్రం సందేహం లేదు. ఆయన కోసం మనం దుఃఖిస్తున్నాము ; మన ప్రియతమ నాయకుని మరువలేము గనుక సదా మనం ఆయన కోసం దుఃఖిస్తూనే ఉంటాము. ఐతే తన కోసం మనం దుఃఖించడం ఆయనకు సమ్మతం కాదని నేనెరుగుదును. తన ఆత్మీయులు మరణించి నప్పుడు తా నెంచుకొన్న మహత్తర లక్ష్య సాధనకోసం కృషి చెయ్యాలనే దృఢ సంకల్పమే తప్ప ఆయన కంట తడి పెట్టలేదు. కనుక మనం దుఃఖిస్తూ ఉంటే ఆయన మనలను మందలిస్తాడు. ఆయనకు నివాళు లర్పించ డానికి అది సరియైన మార్గం కాదు, దృఢ సంకల్పాన్ని ప్రకటించడం, తిరిగి మన లక్ష్య సాధనకు శపథం చెయ్యడం, సముచిత రీతిని నడచుకోవడం, ఆయన చేపట్టి చాలవరకు సాధించిన మహత్తర కృషికి మనలను అంకితం చేసుకోవడం - ఆయనకు నివాళు లర్పించ డానికి ఏకైక మార్గం అదే. కాగా మనం కృషి చెయ్యాలి, శ్రమించాలి, త్యాగం చేయ్యాలి. ఆ విధంగా కొంత వరకైనా ఆయనకు తగిన అనుచరులమని నిరూపించాలి.

అయ్యా, మీరు సెలవిచ్చినట్లు విషాదకరమైన ఈ దుర్ఘటన కేవలం మరిదేనితోనూ ప్రమేయం లేని ఒక ఉన్మత్తుని చర్య కాదు. ఈ దేశంలో కొన్ని ఏండ్లపాటు, ముఖ్యంగా ఇటీవల కొన్ని మాసాలపాటు వ్యాపించిన హింసా ద్వేష పూరిత వాతావరణం వల్లనే ఇది

సంభవించింది. ఆ వాతావరణం మనలను ఆవరించి ఉన్నది. మనలను చుట్టుముట్టుతున్నది. ఆయన మనకు ప్రసాదించిన లక్ష్యం కోసం మనం కృషి చేయ్యాలంటే, ఈ వాతావరణాన్ని మనం ఎదుర్కొనాలి, దానితో పోరాడాలి, హింసాద్వేష రూపక దుష్ట శక్తిని నిర్మూలించాలి.

ప్రభుత్వానికి సంబంధించినంతవరకు దానిని ఎదుర్కొనడానికి అదిఎట్టి ప్రయత్న లోపం లేకుండా పూర్తిగా కృషి చేస్తుందని నేను విశ్వసిస్తున్నాను. ఎందుకంటే, మనం ఆ విధంగా చేయకపోతే, దౌర్బల్యం వల్లగాని, యుక్తమని తోచిన మరే కారణం వల్లగాని ఈ హింసను నిరోధించడానికి మనం చురుకుగా పాటుపడక పోతే, మాటలవల్లనో వ్రాతలవల్లనో, చేతలవల్లనో వ్యాపిస్తున్న ద్వేషాన్ని అరికట్టకపోతే, మేమీ ప్రభుత్వంలో ఉండడానికి అర్హు లం కాము; ఆయన అనుచరులుగా ఉండడానికి ఎంతమాత్రం అర్హులం కాము; కనీసం దివంగతుడైన ఈ మహాత్ముని ప్రశంస చెయ్యడానికి కూడా అర్హులం కాము.

కనుక ఈ సందర్భంలోనూ, మనలను విడిచిపోయిన మహాపురుషుని స్మరించే ఏ ఇతర సందర్భంలోనైనా సరే, కృషి, శ్రమ, త్యాగం అనే ఆదర్శాలతో ఆయనను మనం స్మరిద్దాము. ఎక్కడ ఎదురైనా దుర్మార్గాన్ని ప్రతిఘటించడంతో ఆయనను స్మరిద్దాము. ఆయన మనకు చూపిన సత్యాన్ని స్థిరబుద్ధితో అనుసరించడంతో స్మరిద్దాము. ఆ విధంగా మనం చేస్తే, మన మెంతటి అల్పజీవులమైనా, కనీసం మన విధిని మనం నిర్వర్తించిన వార మవుతాము, ఆయన ఆత్మకు తగిన శ్రద్ధాంజలి ఘటించినవార మవుతాము.

ఆయన వెళ్ళిపోయాడు కాగా భారతదేశమంతట ప్రజలలో నిరాశ్రితుల మయ్యా మన్న భావం వ్యాపించి ఉన్నది. మనకందరికీ ఆ విధంగానే అనిపిస్తున్నది. ఈ నిస్పృహ నుంచి ఎప్పుడు విముక్తుల మవుతామో తెలియదు. ఐతే ఈ భావంతో పాటు ఈ మహాపురుషునితో కలిసి పనిచేసే అవకాశం లభించిన తరానికి చెందిన వారమనే తృప్తితో కూడిన కృతజ్ఞతా భావం కూడా వ్యాప్తమై ఉన్నది. మునుముందు శతాబ్దాల తరువాత, బహుశః వేల సంవత్సరాల తరువాత ప్రజలు దేవుని బిడ్డయైన ఈ మహాత్ముడు భూమిపై చరించిన ఈ తరాన్ని గురించి తలచుకొంటారు. ఎంతటి అల్పులమైనా ఆయన చూపిన దారి ననుసరిస్తూ, ఆయన పదస్పర్శతో పునీతమైన భూమిపై నడువ గలిగిన మనలను గురించి కూడా తలచుకొంటాము, అయనకు అన్ని విధాల తగిన అనుచరులుగా జీవిద్దాము.

చక్రవర్తి రాజగోపాలాచారి

## మంత్రి సీతారామ అయ్యర్

"కృష్ణదాసు రేపు మన ఊరు వస్తున్నాడు!"

పలికొండన్ గ్రామపు స్త్రీలూ, పిల్లలూ ఆయనకు స్వాగతం ఇవ్వడానికి ఉత్సాహంతో ఏర్పాట్లు చేస్తున్నారు.

వారి ఏర్పాట్లు పెద్ద ఎత్తున జరుగుతున్నాయని కాదు. రాగానే ఆయన కూర్చోవ

గాని కొక బల్లను సిద్ధం చేశారు. కుమ్మరి దగ్గరనుంచి కొన్ని క్రొత్తకుండలను తెచ్చారు. ఒక చిన్న పళ్ళెరంలో అన్నమూ, ఒక పిడతలో తాజా పెరుగూ ఆయనకు ఇవ్వడం ఆచారం. అదే ఆయన భోజనం, రోజుకు ఒక్కమాటే ఆయన భోజనం చేస్తాడు.

కృష్ణదాసు ఉదయం తొమ్మిది గంటలకు పలికొండన్ చేరుకున్నాడు. దారిలో ఒక చెరువులో స్నానం చేసి, జపం ముగించుకొని, "గోపాలా!" అని బిగ్గరగా కేకలువేస్తూ ఆ ఊరు చేరాడు. ఊళ్ళో వాళ్ళు ఆయన చుట్టూ మూగారు. పిల్లలను ఆయన కౌగిలించుకుని దీవించాడు. "గోపాలునికి నమస్కరించండి" అని వారికి చెప్పాడు.

ఆ దుమ్ములోనే వారు "గోపాల" నామస్మరణ చేస్తూ సాష్టాంగ నమస్కారం చేసి, ముక్త హస్తాలతో కృష్ణదాసు ఎదుట నిలబడ్డారు. ఆయన తన పళ్ళెరంలో అన్నమూ, పెరుగూ కలిపి, మౌనంగా ప్రార్థన చేస్తూ గోపాలదేవునికి నివేదన చేసి, పిడికిళ్ళతో పిల్లలకు పంచిపెట్టాడు "చాలు! చాలు! తినడానికి మీకు కూడా కొంచెం ఉండాలి గదా!" అని వాళ్ళన్నారు. మిగిలిన అన్నం తాను తిని, కొంతసేపు చెట్టునీడను విశ్రమించాడు. తరువాత తన కమండలువు చేతబట్టుకొని తిరిగి ప్రయాణమయ్యాడు. పెద్దలూ, పిన్నలూ, స్త్రీలూ, పురుషులూ, అందరూ గౌరవ సూచకంగా ఆయన ముందు మోకరిల్లి, ఆశీస్సుల నందుకొని, వెంట నడుస్తూ ఆయనను సాగనంపారు.

పూర్వాశ్రమంలో కృష్ణదాసు పేరు సీతారామ అయ్యర్. రంగపురంలో సంపన్న న్యాయవాది. ముప్పై ఏళ్ళ వయస్సులో అతడు తన వృత్తి వదులుకొని, స్వరాజ్యోద్యమంలో చేరి జైలుకు వెళ్ళాడు. అతని తండ్రి అప్పటికి వృద్ధుడు, అనారోగ్యంతో ఉన్నాడు. అతని భార్య ఆరోగ్యంకూడా తిన్నగా లేదు. అతని తమ్ముడు నారాయణ కొద్ది జీతం మీద ఏదో ప్రభుత్వ కార్యాలయంలో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. "అన్నయ్య న్యాయవాది వృత్తి వదులుకొని స్వరాజ్యోద్యమంలో చేరాలను కొంటున్నా"డని నారాయణ తండ్రికి చెప్పాడు.

"అసంభవం! ఇటువంటి అబద్ధాలతో నన్ను బాధించకు" అన్నాడు తండ్రి.

"ఇది అబద్ధం కాదు. అసలుసంగతి ఇదే" అని నారాయణ నిశ్చయంగా చెప్పాడు.

సీతారామ అయ్యర్ తన నిశ్చయాన్ని భార్యకు తెలియజేశాడు. ఆమె దుఃఖించింది.

"ఈ సంగతులన్నీ నీకు అర్థం కావు" అని అతడు ఆమెను ఓదార్చాడు. "మన దేశ గౌరవాన్ని కాపాడవలసి ఉన్నది" అని చెప్పాడు. "మీకేమీ భయంలేదు. శంకరలింగం చెట్టియార్ మన కుటుంబానికి అన్నివిధాల అండగా ఉంటా"డని కూడా అన్నాడు.

ఉత్తర దిశగా ప్రయాణమై వెళ్ళాడు.

న్యాయాధికారి అతనికి నాలుగేండ్ల కఠిన కారాగార శిక్ష విధించాడు. అతని నేరం రాజద్రోహం. ఉత్తరాన నాగపూరులో అతడు జైలు శిక్ష అనుభవించాడు. మూడవ ఏట అతని తండ్రికి తీవ్రంగా జబ్బు చేసింది. ఆరు నెలలపాటు మంచం మీద తీసుకొన్న తరువాత తండ్రి పరమపదించాడని తమ్ముడి దగ్గరనుంచి అతనికి టెలిగ్రామ్ వచ్చింది. అది చేరిన

మూడు రోజుల తరువాత జైలు సూపరింటెండెంట్ దానిని సీతారామ అయ్యరుకు చూపించాడు. అంత్య క్రియలను సక్రమంగా జరుపవలసినదని తన తమ్ముడు నారాయణకు అతడు ఉత్తరం వ్రాసి, అధికారుల ద్వారా పంపాడు.

ఒక సంవత్సరం తరువాత అతడికి ఇంకొక ఉత్తరం వచ్చింది. అతని భార్యకు పెద్దగా జబ్బుచేసింది. బ్రతుకుతుందని ఆశలేదు. ఈ ఉత్తరం కూడా చేరిన ఎనిమిది రోజుల తరువాత సీతారామ అయ్యరుకు అందజేశారు. ''ఈశ్వరేచ్ఛ?' అన్నాడు సూపరింటెండెంట్‌తో. ఈ ఉద్యోగి మంచివాడు. ఈ పదవి ఇటీవలనే లభించింది. సీతారామ అయ్యర్ అంటే అతనికి ఇష్టం. సీతారామ అయ్యరును పెరోల్ మీద విడుదల చేయవలసినదిగా పై అధికారులకు వ్రాస్తానన్నాడు. అందు కతడు ఇష్టపడలేదు. ''ఇప్పుడు నేను వెళ్ళి చేయగలిగినదేమీ లేదు. పోయినవారు తిరిగిరారు'' అన్నాడతడు. ఆకాలంలో దేశభక్తులంత కఠోర స్వాతంత్ర్యం కలిగి ఉండేవారు. ఏ సదుపాయం కావాలని గాని ప్రభుత్వాన్ని అర్థించే వారు కారు.

నాలుగేండ్లు గడిచాక అతనిని జైలు నుంచి విడుదల చేశారు. కాని అతడు తిరిగి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని చాలా సారులు జైలుకు వెళ్ళాడు.

మదరాసు రాష్ట్రంలో 1937 లో స్వతంత్ర ప్రభుత్వం పాలన ప్రారంభమయ్యే సరికి సీతారామ అయ్యర్ వయస్సు యాభై ఏండ్లు, అతడు విద్యాశాఖ మంత్రి అయ్యాడు. ఇతర మంత్రుల వలెనే గొప్ప ఖ్యాతిని పొందాడు.

''ఇప్పుడు మీ నాయన బ్రతికి ఉంటే ఎంత సంతోషపడేవాడో!'' అన్నాడు శంకరలింగం చెట్టియార్ సీతారామ అయ్యర్ కండ్లు చెమ్మగిల్లినవి. తన భార్యను కుడా తలచుకొన్నాడు. శంకర లింగం అన్నమాట యథార్థమని గ్రహించాడు. శంకర లింగం అతని భార్య ప్రస్తావన తేలేదు. కాని తేవలసిన అవసర మేమున్నది?

రాత్రులు అతనికి తరచుగా కలలు వచ్చి కలత పెట్టేవి. తన తండ్రి ఇంకా బ్రతికి ఉన్నాడని ఊహించేవాడు. కల కరిగిపోగానే మేలుకొని దుఃఖాన్ని ఆపుకోలేక ఏడ్చేవాడు.

''నాయనా! సీతారామా! నన్నొంటరిగా వదలివెళ్ళావు. నన్నెవరు పోషిస్తారు? ఇదినీకు న్యాయమేనా? వెంటనే తిరిగిరా, నాయనా!'' అని ఆ వృద్ధుడు అంటున్నట్లనిపించేది.

''నేనెంత బాధ పడ్డానో మీకు తెలుసా?'' అని తన భార్య ప్రశ్నిస్తున్నట్లనిపించేది.

''నీవు పోయావనుకున్నాను. ప్రేయసీ! నీవు బ్రతికే ఉన్నావా? ఐతే నా ఆర్తి తొలగినట్లే'' అన్నాడు సీతారామ్.

''వాళ్ళు నన్ను కోసి నా కడుపులోనుంచి కుండెడు విష ద్రవాన్ని బయటకు

తీశారు. అప్పుడు నీవు జైలులో హాయిగా ఉన్నావు'' అని భార్య నిందిస్తున్న ట్లనిపించింది.
''నేను దిక్కులేని చావు చచ్చాను.''

అతడు వెక్కి వెక్కి ఏడ్చి భార్యను కౌగిలించుకున్నాడు.

''సీతారామా! ఇది పట్టి బెదరింపని అనుకోవద్దు. నీవు తండ్రికి ద్రోహంచేసి వదిలిపెట్టావు. నీకు నరకం తప్పదు'' అని తండ్రి హెచ్చరించాడు.

సీతారామ అయ్యర్ పూర్తిగా చలించిపోయాడు. ''అప్పుడు నే నంతకంటె చేయ గలిగిన దేమి'' టని మూలిగాడు. ''ఓ రామచంద్ర ప్రభూ! నీవు మాత్రం అయోధ్యను వదలి అరణ్యానికి పోలేదూ? వృద్ధుడైన తండ్రిని వదలిపోలేదూ?'' అని అన్నాడు. దగ్గరనే నిలిచిఉన్న హనుమంతుడు బిగ్గరగా నవ్వాడు. సీతారామ అయ్యర్ ఆయనవంక తిరిగాడు.

''నీ కర్తవ్యమేదో నీకు తెలియలేదు. ఒక క్షత్రియుడు, యోధుడు నడచినట్లు నీవుకూడా నడువగలననుకొన్నావా? నీ తండ్రిని, భార్యను శంకరలింగం చెట్టియార్ దయా దాక్షిణ్యాల కప్పగించి పోవడం నీకు ధర్మమేనా? నీచుడా!'' హనుమంతుడు కఠినంగా మందలించాడు.

''నేను మహాపాపాత్ముడను ప్రభూ! ఇక భరించలేను. నీవే నాకు దిక్కు'' అని రోదించాడు. ''నా ధర్మం, కర్తవ్యం నేను గ్రహించలేకపోయాను. నా విధిని నేను విస్మ రించాను. నేను మోసపోయాను. గోవిందా! నన్ను రక్షించు.''

''నీ కోసం, నిన్ను చదివించడం కోసం నేను పైసపైస కూడబెట్టాను. బస్తీలో నీవు ఉండడానికి, చదువుకోవడానికీ తగినంత డబ్బు తప్పక పంపడంకోసం నేను ఎన్నో తప్పుపనులు చేశాను. నీ కోసం నేను పాపకార్యాలు చేశాను. కాని నేను నిస్సహాయుడనై మంచం పట్టినప్పుడు, చీముతో కాలువాచి యమయాతన అనుభవించినప్పుడు నీవు నీ దేశభక్తి పొగరులో కొందరి వెఱ్ఱివేషాలలో చేరి నీ కాలం వ్యర్థం చేసుకొన్నావు. నీ తండ్రికి చేసిన ఈ ద్రోహఫలం ఎట్లా తొలగించుకోగలవు?'' అన్నాడు వృద్ధుడు.

''నాయనగారూ! మీ అబ్బాయి నిట్లా శపించకండి. ఐనా అప్పు డనేకులు నడిచిన దారిలోనే ఆయనకూడా వెళ్ళాడు'' అని సీతారామ అయ్యర్ భార్య అన్నది. కలలో తన భార్య జగజ్జననిగా మారిపోయింది. ఆమె ''గోవింద'' అనగానే స్వయంగా కృష్ణ పరమాత్ముడే సీతారామ అయ్యర్ ఎదుట సాక్షాత్కరించాడు.

నిన్ను సర్వపాపాలనుంచి నే నుద్ధరిస్తాను విచారించకు. రా! నా రథంలో కూర్చో'' అన్నాడు భగవంతుడు.

మరునాడు సీతారామ అయ్యర్ తన మంత్రిపదవికి రాజీనామా చేసి పట్నంనుంచి వెళ్ళిపోయాడు. మంత్రి సీతారామ అయ్యర్ కృష్ణదాసు అయ్యాడు. కాలినడకను ఊరూరు తిరుగుతూ ఉంటాడు. రోజుకొక ఊరుచేరి, భిక్షాటనం చేసి, ఏకభుక్తంతో సన్న్యాసిగా

జీవిస్తున్నాడు. రెండేండ్ల తరువాత, గోకులాష్టమినాడు ఆయన దైవసాన్నిధ్యానికి చేరుకొన్నాడు.

—The Plough and the Star నుంచి.

**రాజారావు**

## కాంతాపురంలో వైశాఖ వర్షాలు

వైశాఖమాసంలో కాంతాపురంలోని ప్రజలు పొలాలు దున్నుతారు తొలకరి వానలు వచ్చాయి. కంచురంగు కొండలమీద దూకుతూ, నిమ్నోన్నత ప్రదేశాలమీద మెల్లగా, జాగ్రత్తగా కదులుతూ, లోయలలోనికి దుముకుతూ, నేలమీద నీరు చిందిస్తూ, గాలికి ఊగుతూ, చెరుగుతున్నట్లు వానలు కురుస్తున్నవి. కొబ్బరిచెట్లూ, పోకచెట్లూ, ఏలకులచెట్లూ ఊపిరిఆడక తిరిగి బుసలు కొడుతున్నవి. అదిగో, వాన బెబ్బూరు కొండమీదినుంచి, కాంతూరు కొండమీదినుంచి వస్తున్నది ఇంటిమీది పెంకులతో ఆడుతున్నది. చెవులను వెనుకకు చాచుకొని పశువులు పరుగులమీద ఇళ్ళు చేరుకొంటున్నవి. పశువుల కాపరి ఏ మారేడుచెట్టు వెనుకనో, రావిచెట్టు వెనుకనో నక్కి ఉంటాడు. ప్రజలు చేతితో నడిపే తమ పిండిమరలను వదిలిపెట్టి దొడ్డిలోనికి పరుగెత్తుతారు. కెంచమ్మ దేవాలయంవంక తిరిగి ''అదిగో, కెంచమ్మతల్లీ ! వానలు వచ్చాయి, మా ఇళ్ళన్నీ వెండివలె మెరువనీ'' అని ప్రార్థించారు. మెరుపు మెరుస్తుంది. ఉరుము పెంకులను కదుపుతుంది. కాగితపు పడవలను కాశీకి పంపడానికి పిల్లలు మురుగు కాలువలమీది పలకల దగ్గరకు పరుగెత్తారు. ఏజంటు నంజుండయ్య భార్య చెన్నమ్మ, సుబ్బసెట్టిగారి పుట్టి అప్పుడే వీధిలో నిలబడి బంగారు పొడి కోసం నీళ్ళను వడబోస్తున్నారు. పురోహితుడు రంగప్ప తన పుస్తకాలకట్ట విప్పి, పంచాంగం చూసి, ''రేపే రోహిణీ నక్షత్రం. రైతులు ఎద్దులను నాగలికి కడతారు'' అని అన్నాడు. ఆదిగో, రంగగౌడ గొడుగు చేతబట్టి, కొబ్బరికాయ, తాంబూలం తీసుకొనివచ్చి పురోహితుడు రంగప్ప దగ్గరకువెళ్ళి ''ఎప్పుడండీ, పంతులుగారూ'' అని అడుగుతాడు. రంగప్ప ఇటూ అటూ పరికిస్తాడు. ఊరి నౌకర్లమీద రంగగౌడ అధికారం పోయింది: ఊరిమీద రంగగౌడ పెత్తనం పోయింది. కాని అధికారంతో నిండిన ఆ కంఠస్వరం మాత్రం రంగగౌడకు పోలేదు. కాగా రంగప్ప నేలవైపు చూస్తూ ''అదేమిటి, రంగగౌడా, రేపే'' అని చెప్పుతాడు. రంగగౌడ ఇంటికి తిరిగివెళ్ళి ఊరినౌకర్లను తిడతాడు. నౌకరు చెన్న అడుగుతాడు ''ఎన్నడయ్యా, పటేలూ ?'' అని. ''రేపే గదరా, నీయమ్మ సిగతరగ.'' నౌకరు చెన్న ఇంటికివెళ్ళి నిద్రపోతాడు. కప్పలు బెకబెకలాడడం ఆగిన తరువాత తన డప్పు చేతబట్టుకుని చాటుతాడు : ''వినరండోయ్ ! అరకకు పూజ చెయ్యాల్సింది ఈరోజే'' అని. ''ఈ పూటేనా!'' అంటారు జనం. సత్తన్న లేచి, ''చూడు, నా కుడికన్ను అదురుతున్నది. ఈసారి పంట పుష్కలంగా పండుతుం'' దంటాడు. సాలె చెన్నయ్య పరుగునవెళ్ళి, స్నానంచేసి తలకు నూనె రాచుకుంటాడు. అతని భార్య పెరటి తోటలో పువ్వులు కొయ్యడానికి వెడుతుంది. సిద్ధమీద వ్యాజ్యం గెలిచినప్పుడు బస్తీలో కుట్టించుకున్న ముఖమల్ కోటు వేసుకుంటాడు

చంద్రయ్య. రామయ్య కళ్ళు పెద్దవిగా తెరిచి శిక్షికలనడుమ చూస్తూ అంటాడు "ఈ ఏడు దండిగా పంట పండించవయ్యా, సూర్యభగవానుడా! ఖట్టకు బాకీఉన్న 375 రూపాయలు తిరిగియిస్తాను. మా చిన్నమ్మాయి పెళ్ళి చేస్తాను. మా ఆవిడ జబ్బు నయమైతే ఇస్తానని మొక్కుకున్న మేకను కెంచమ్మ తల్లికి సమర్పిస్తాను". మాదిగ తిమ్మయ్య అంటాడు, "నేను నిద్రలేవడ మెందుకు? నా అరకకు ఎద్దులు లేవు, నా పొలంలో ధాన్యమూ లేదు" కాని ధైర్యవంతురాలైన అతని ఇల్లాలంటుంది, 'లేచి వెళ్ళవయ్యా, దేవతలు అంత దయ మాలినవాళ్ళు కారు" తిమ్మయ్య గొణుగుతూ, మూలుగుతూ, చేత పువ్వూ, నుదుట బొట్టూ లేకుండా వీధిలోనికి వెడతాడు. పెద్దలూ, పిన్నలూ భుజాన నాగళ్ళు వేసుకొని, చేత కొరడాలు పట్టుకొని ఎద్దులను తోలుకొంటూ వెడతారు. ఏటిదగ్గరకు వచ్చాక వాళ్ళు ఎద్దులను రుద్ది కడిగి, వాటి కొమ్ములకు పువ్వులు కట్టి "హే, హే" అనుకొంటూ గుడి ఆవరణకు తోలుకొని వెడతారు.

"హే! హే" వాననీరు భూమిలోనికి ఇంకిపోయింది. బోసినోటి సిద్దయ్య నేలలోనికి కఱ్ఱను దింపి, ఏమిటీ, నాలుగు వేళ్ళలోతు దిగింది "అని అంటాడు. అందరూ అంటారు" నిజమే. అమ్మవారు అడిగితే పడినట్లు కురిసింది వాన" పూర్తిగా తెల్లవారగానే అందరూ ఎద్దులను తోలుకొని పచ్చాక పురోహితుడు నెత్తిమీద తీర్థపుకలశం పెట్టుకొని, చేత తడిబట్టలు పట్టుకొని వస్తాడు. వచ్చి "మీరంతా వచ్చారా? ఆః? అని అడుగుతాడు. "వచ్చాం, పంతులుగారూ!" అంటారు వారు. అతడు గుడి తలుపులు తెరిచి అమ్మవారి విగ్రహం ముందు తెర పూర్తిగా లాగి, అమ్మవారికి అభిషేకం చేసి. అలంకారం పూర్తి చేస్తాడు. డోలు లింగయ్యా, సన్నాయి రామయ్యా సంపంగిచెట్టు దగ్గర నిలబడికొమ్ముబూరాను తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం, నలువైపుల బిగ్గరగా ఊదుతారు వాన వెలిసిన వాతావరణంలో కొమ్ముబూరా చప్పుడు ప్రతిధ్వనిస్తుంది. జనం తమ నాగళ్ళతో, ఎద్దులతో పరుగులమీద వస్తారు. కాడికి కట్టిన గంటల చప్పుడు కోవెలతోటలో వినిపిస్తుంది. అందరూ వస్తున్నారు — రాచన్న, మాదన్న, చివరకు కుమ్మరి రంగ, మాదిగ సిద్ద, తిమ్మయ్య కొడుకు భీమ, పొలమూ, ఎద్దులూ లేని మోట, తిప్ప, వాళ్ళుకూడా చెవులలో పువ్వులు పెట్టుకొని వస్తున్నారు: పురోహితుడు రంగప్ప పరుషస్వరంతో అంటాడు: "మీరంతా సిద్ధంగా ఉన్నారురా? నా కొడుకులారా?" "చిత్తం, చిత్తం." "అతగాడేడీ?" వాళ్ళంటారు. "అదిగో, వస్తున్నాడు పటేలు." అప్పుడే జరీశాలువ భుజంమీద వేసుకొని, నెత్తిమీద దర్బారు తలపాగాతో, చేతులలో ఇంగ్లిషు పగ్గాలతో, వెనుక మాద పరుగెత్తుకుంటూ రాగా పటేలు గుఱ్ఱంమీద స్వారిచేస్తూ కనిపిస్తాడు. ఆ ఠీవి చూస్తే కలెక్టరూ, గవర్నరూ కూడా అతడిముందు ఎందుకూ కొరగా రనిపిస్తుంది. ఏమైనా సరే కాంతాపురంలో రంగగౌడ పటేలుగా తనపెత్తనం సాగించకమానడు. నల్లత్రాచు పుట్టదగ్గరకు చేరాక అతడు గుఱ్ఱం దిగి, పగ్గాలను మాదకు అందించి, నిదానంగా గుడి ఆవరణలోనికి వస్తాడు. అప్పుడే ఆలయంలో పురోహితుడు రంగయ్య గంట వాయిస్తున్న ధ్వని వినిపిస్తుంది. అందరి కళ్ళు అర్ధనిమీలితాలవుతాయి. "అదిగో, ఇప్పుడు అమ్మవారి దర్శన మవుతుం" దని అందరూ అంటారు. తత్తరపాటుతో ఒకరినొకరు రాచుకుంటూ నిలబడతారు. కాళ్ళు దురదపెట్టినా

గోకుకోరు. పైనుంచి వాననీరు మీద పడినా కదలరు. అప్పుడు హఠాత్తుగా తెరతీయగా, ఎదురుగా ప్రసన్న దృక్కులతో, ధగధగ ప్రకాశిస్తూ కెంచమ్మతల్లి దర్శన మవుతుంది. దీపాలకాంతులు అమ్మవారి చుట్టూ ప్రసరిస్తాయి. అందరూ అంటారు: ''రాత్రి ప్రశాంతంగా గడిపి ఉంటుం'' దని. అప్పుడు పురోహితుడు రంగప్ప కర్పూరం వెలిగించి, ఆభరణాలతో మెరుస్తున్న అమ్మవారి ముఖం ఎదుట నిలిపి, ఆమె ముఖంచుట్టూ హారతి తిప్పుతాడు. అందరూ అంటారు: అదిగో మనకు ఆశీస్సు లిస్తున్నది అమ్మా! కెంచమ్మా! పుష్కలంగా పంట పండించమ్మా! ఏరోగాలూ రాకుండా కాపాడు కెంచ మ్మ తల్లీ! చివరకు ఎద్దులు కూడా తోక లాడించకుండా నిలబడతాయి. అప్పుడు రంగప్ప ఒకకుండతో మంత్రించిన నీళ్ళు తెచ్చి ఒక్కొక్క ఎద్దుమీద చల్లుతాడు. వాటికి వణుకు పుట్టి, తలలు వ్రేలవేసి, అమ్మవారికి తమ మెడలో గంటలు మ్రోగిస్తాయి. అప్పుడు హారతీ, చందనమూ తెస్తారు. అందరూ హారతి కళ్ళ కద్దుకుని, చందనం తీసుకుంటారు. సూర్యోదయం అవుతున్నదా అని పరీక్షగా చూస్తారు. కోవెల తోట వెనుక గుఱ్ఱపుముఖం కొండమీద చీరె అంచంత ఎఱ్ఱపుముఖం చార కనిపిస్తుంది. అందిరూ వణుకుతూ, చేతులు జోడించి గుసగుసలాడుతారు. ''ఏమి రంగ గౌడా! నీ ఎద్దులే అన్నిటికంటె లేతవి, బలమైనవీ. వాటిని కాడికి కట్టు.'' గర్వంగా నంతూరు పశువుల సంతలో తాను కొన్న మూడేళ్ళ అమృతమహల్ ఎద్దులను సమీపిస్తా డతడు. నాగలికూడా శుభ్రంగా, పదునుగా ఉంది. అందరూ అమ్మవార వాహనం గరుడ పక్షి రాకకై తలపైకెత్తి చూస్తూ ఉంటారు. పురోహితుడు రంగప్ప మంత్రాలు వల్లిస్తూ, గంట వాయిస్తూ ఉండగా ఆలయశిఖరం మీదుగా గరుడపక్షి రానే వస్తుంది. వచ్చి గుడి చుట్టూ ముమ్మారు ఎగురుతుంది అక్కడి జనమూ, పశువులూ, కొమ్ము బూరాలూ చేసే ధ్వని తోట దాటి, లోయ దాటి,కొండమీదికి వినిపిస్తుంది. పురోహితుడు రంగప్ప రాతిబండమీద కొబ్బరికాయ కొడతాడు. సుబ్బగౌడ ''హెహె, హెహె, హో'' అని కేకలు వేస్తూఉండగా అందరూ పువ్వులూ, అక్షతలూ చల్లుతారు. నాగలి మట్టిపెళ్ళలను ఇటూ, అటూ విసురుతూ నేలను చీల్చుకుంటూ ముందుకు సాగుతుంది సాగినకొద్దీ చాల తేలికగా పడుతుంది. పొలము చేనూ. బంజరుభూమీ, చెరువు తోటా దున్నడం పూర్తి అయ్యాక సుబ్బ నాగలిని నిలబెడ తాడు. ఎద్దులు చాలా వేగంగా పరుగెత్తుతాయి. అందరూ ''హేయ్‌లా, హేయోలా'' అని అరుస్తారు. పువ్వులూ, అక్షతలూ చల్లుకుంటూ స్కెఫింగ్టన్ ఎస్టేట్, భట్టగారి దయ్యాల చేలు, ఏటి ఒడ్డుదాటి కోనేరు చేరగానే, సుబ్బ తూలుతూ, గిరగిరతిరుగుతూ, గుట్టదిగి ఆలయం ఆవరణలోనికి ప్రవేశించి ఆగిపోతాడు. అందరూ ఆగిపోతారు, దగ్గుతూ చెమట తుడుచుకుంటారు. గుడి రంగప్ప తిరిగి కొబ్బరికాయ కొట్టి ఎద్దులముందు పెడతాడు. అందరూ ఒకరిమీద ఒకరు మురమరాలు చల్లుకుంటారు. రంగప్పకు అందరూ దక్షిణగా పైసలిస్తారు. అప్పుడు రంగప్ప ఆలయంలోనికి వెళ్ళి ఒక వెండి బిందెతో మంత్రజలం తెచ్చి అష్టదిక్కులవైపు చేతితో చల్లుతాడు. ''ఇక మనం భూమి దున్న వచ్చు'' నని అంటారు. ప్రసాదంగా ఇచ్చిన పువ్వును సిగలో తురుముకొని, భక్తిపూర్ణ హృదయాలతో ఆడవాళ్ళు ఇళ్ళకుతిరిగిపోతారు. మగవాళ్ళు పొలాలు చేరతారు